# విషయసూచిక

## చతుర్థ ప్రకరణము



## పంచమ ప్రకరణము



## షష్ఠ ప్రకరణము



## సప్తమ ప్రకరణము



## నవమ ప్రకరణము



## దశమ ప్రకరణము



## ఏకాదశ ప్రకరణము



## ద్వాదశ ప్రకరణము



తే॥ నిస్తుల తపస్వి రాములు - క్రీస్తుశకము
పదియుఁ దొమ్మిదివందల - పైన యొకటఁ
బుట్టి యేఁబదిరెండులో - గిట్టెఁ దన య
శస్సు దిగ్దంతి దంత వి - శ్రాంతి నొంద.

శ్రీరస్తు

ప్రథమ భాగము

# పండితాభిప్రాయములు

అవధాని శిరోమణి, విద్యావారిధి, మహామహోపాధ్యాయ,
కాశీ కృష్ణాచార్యులు, డి.లిట్.,
ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థానకవి

అగ్రహారము.
గుంటూరు-1
(ఆంధ్రరాష్ట్రము)

Avadhani-Siromani, Vidyavaridhi,
Mahamahopadhyaya, ETC., ETC.,
**KASI KRISHNA CHARYA**, D. Litt.,
*Poet-Laureate, Andhra Pradesh.*

Agraharam,
GUNTUR-1
*(Andhra Pradesh)*

ఓమ్

శ్రీరామ

# ఆంధ్ర మహోభ్యుదయము

చిరంజీవి విద్వాన్ బండ్ల సుబ్రహ్మణ్యకవి 'ఆంధ్ర మహోభ్యుదయ' మనుపేర విరచించిన యాంధ్రపద్యకావ్యమును నా శారీరాస్వాస్థ్యమువలన నందందుఁ జదివించుకొని విని మహానందపడితిని. ఈ గ్రంథకర్త యాకృతిని బట్టి తరుణుఁడుగఁ జూపట్టుచున్నను ఈ కృతినిబట్టి వృద్ధుఁడే యని నా నిశ్చయము. ఈ సూరి కవితాకుమారి బహుసుకుమారి. సకల శుభలక్షణోపలక్షిత, సహజాలంకారశోభిత, మృదుమధుర చతురభాషిణి యగుటకుఁదోడు ప్రాచీన శిష్ట సంప్రదాయానుసారిణియై ముద్దులు మూటగట్టుచుండుటనే శ్రీ వేంకటేశ్వర పాణిగృహీతి కాఁ గల్గినది. ఇకావ్యరత్నమునకే దానశూరుఁడగు శ్రీ చుండూరు రంగనాయకులు గుప్తగారికి సంభావ్యమైనది.

ఆంధ్ర సోదర జనతాభ్యుదయైక లక్ష్యముతో నేఁబదియేఁ డహోరాత్రములు నిరాహార దీక్షవహించి ప్రయోపవిష్టుఁడై,

'సమరజీవి' నొనర్పఁ గృతనిశ్చయుఁడగుట కడుంగడు శ్లాఘ్యము. ఈ దేశభక్తుని జననము మొదలు తత్కల్యాణోత్సవము వఱకుఁ గల యితివృత్తము నిట్లు ప్రథమభాగముగ రూపొందించిన యీ సుకవి, యచిరమ ద్వితీయ భాగమునుగూడఁ బ్రకటించి, యాంధ్రమహాభ్యుదయము సమగ్రముగఁ బ్రతిష్ఠించుటకు భగవానుఁ డీయనకుఁ జిరాయురారోగ్య ప్రతిభాబలోత్సాహాదుల ననుగ్రహించుఁ గాక !

—కాశీ కృష్ణాచార్య

కవిసమ్రాట్

# విశ్వనాథ సత్యనారాయణ M. A.,

మారుతినగర్

విజయవాడ

శ్రీ బండ్ల సుబ్రహ్మణ్యకవిగారు రచించిన 'ఆంధ్రమహాభ్యుదయము' అన్న మహాకావ్యములోని ప్రథమభాగము నందందుఁ జూచితిని.

ఇది కీ॥ శే॥ పొట్టి శ్రీరాములుగారి జీవిత చరిత్ర. ఈ భాగమునందు వారి వివాహాంతమువఱకు కలదు. ప్రబంధములకు, ప్రబంధలకు కీర్తి ప్రతిష్ఠలను గూర్చునది. యుత్తమ నాయక కథ. అది యిందు సహజసిద్ధమై యున్నది.

ఇంకఁ గవిగారి రచనా వైదుష్యమునుగూర్చి, వీరి పద్యరచన ఆపాత మధురము, గొంపులేకుండ ధారాశుద్ధికి లక్ష్యభూతముగనుండి శైలీ మాధుర్యమునకు మచ్చుముక్కగా నున్నది.

పాండిత్యము దైవభక్తి సంప్రదాయాభిజ్ఞత భావనాపటిమయు నీ గ్రంథమునందు సమృద్ధిగాగలవు. వీరి కొన్ని సీసపద్యములు మాధుర్యమున కిక్కలు,

వీరి కావ్యము చంపువు.

ఒక యాశ్వాసము వచనము తోడనే యారంభింపఁబడుట వీరి గద్య పద్య వస్తువిభేద జ్ఞానమునకు సాక్ష్యమిచ్చుచున్నది.

వీ రిదివరకే కొన్ని కావ్యములు వ్రాసిరి. ఈ మహాకావ్యముతో వీరి కీర్తి యాంధ్రదేశము నలుదిక్కులనిండి వీరి కాంధ్ర సాహిత్యమున చిర స్థానము కలుగునని యాశించుచున్నాను.

—విశ్వనాథ సత్యనారాయణ

మహామహోపాధ్యాయ

# శ్రీ శివశంకరస్వామివారు

శివ శ్రీ బండ్ల సుబ్రహ్మణ్యకవికి ఆంధ్రాభిమానము మెండు. ఇట్లుండుట సహజమే. ఇదివరలో కావ్యములు నాటకములు రమణీయ సిద్ధాంతములు రచించి ఇప్పుడు ఈకవి ఆంధ్రాభ్యుదయ రచన నారంభించినారు.

నా చిన్నతనములో గుంటూరు నగరములోని ప్రముఖులు కొందరు సాయం సమయములందు గోష్ఠిలో సమావిష్టులై తెలుఁగుసీమ, తెలుఁగునాడు, మొదలగు శబ్దములతో రాష్ట్రము సంపాదింపవలెనని చర్చలు చేయుచుండెడివారు. ఆంధ్రరాష్ట్రము అను నామము సముచితమనియు, మనము ఆంధ్రుల మనియు, తెనుఁగు - తెలుఁగు ఆంధ్రములో అంతర్భూతమయిన అలఁతిభాష యనియు నేను వక్కాణించుచుండెడివాఁడను, తుదకు పెద్దలు నా వాక్కులే స్వీకరించి ఆంధ్రరాష్ట్రమని నిర్ధారణము చేసినారు.

సామాన్యముగ మన కవులు ఆంధ్రేతర కథలను వస్తువుగాఁ గైకొని కావ్యము లల్లుదురు. సుబ్రహ్మణ్యకవి వీరగాథ కాని, రాజగ్రి చరిత్రము కాని, పురాణపురుష వృత్తాంతము కాని, అవలంబించి రచన చేయక పూర్ణముగ ఆంధ్రుఁడగు పొట్టి శ్రీరాముల చరిత్రను ఇతి వృత్తముగా మహాకావ్య నిర్మాణమునకు పూనుకొన్నాడు. పొట్టి శ్రీరామ మహాశయుఁడు పుణ్యశ్లోకుఁడు. అన్యులను సంహరించి అఖండఖ్యాతి సంపాదించు క్షత్రియ వీరుఁడు కాఁడు. ఆత్మార్పణము కావించి ఆంధ్రరాష్ట్ర సంపాదనకు నాంది ప్రస్థానములు కావించిన ధీరశాంతుడు. ఇట్టి ఉత్తమ నాయకుని ఆధారముగాఁ గైకొని సుదీర్ఘ రచన చేయుట ముదావహము.

సుబ్రహ్మణ్యకవి అలంకార, వ్యాకరణ, సాహిత్య చరిత్రలు సమీచీన పూర్వకముగా గ్రహించిన ఉత్తమ కవి. ఉన్నత పాఠశాలలో ఆంధ్రాధ్యాపక పదవి యందుండుటచే కావ్యరచనకు కావలసినవన్నియు వాచోవిధేయములయినవి. ఏతత్కవికి ప్రమాణబుద్ధి కలదు. నిర్దుష్టమగు భాషయు శబ్దార్థాలంకారములు, ఉచితరీతి ఎడనెడ అంత్యనియమములు, ధారయు పద్యములకు వన్నెకూర్చుచున్నవి. ఉత్తమ మనోహర భావములందందు గోచరించుచున్నవి. వర్ణనములందును కథనము లందును ఈ కవి గట్టివాడు.

సుప్రసిద్ధములయిన వృత్తములను సరసముగా నడపి రచనకు రమణీయత కూర్చినాడు.

నాయకుని విషయములను తదాప్తులగు వారివలన తరచుగా గ్రహించి ఐతిహ్యరీతిని పొందుపరచుట ఇందలి విశేషము. సజీవులగు వారి సందర్భములలోనే పొరపాటులు దొరలుచుండును. స్మరణీయులయిన వారి విషయమున సాధారణముగా ఎన్నియో వార్తా వ్యత్యాసములు రచనలలో నెలవుకొనుచుండును. ఈ కవి శ్రద్ధాళువు, జాగరూకుడు నగుటచే అట్టి లోపములు రానీయక రచన సాగించినాడు.

ఇది ప్రథమభాగము, తక్కిన భాగములుకూడ అచిరకాలములోనే రచితములై, ప్రచురితములై ఆంధ్రావళికి మోదము కూర్చుగాక! ఇతి శివమ్!

తీర్థాశ్రమము
క్రోధి సంవత్సరాది

శ్రీ శివశంకర స్వామి

# నిడుదవోలు వేంకటరావు M. A.

ఆంధ్రశాఖాధ్యక్షులు, మదరాసు విశ్వవిద్యాలయము, మద్రాసు.

"శ్రీ మహితాంధ్రసంగత స్వచిహ్నితముద్రను నాంధ్ర భారతీ
ధామములందె కాక, సురధామమునంగాను నిల్పఁ జేసి గ
వ్యాములకీర్తినించిన మహామహితాత్మకుఁడైన పొట్టి శ్రీ
రాములు ప్రోచుఁగావుత నిరంతర మాంధ్ర మహాజనావళిన్."

అమరజీవియైన యట్టి శ్రీ పొట్టి శ్రీరాముల యనవద్య చరిత్రమును "ఆంధ్ర మహాభ్యుదయము" అను పేర మహాకావ్యముగాఁ గూర్పఁ బూనిరి యందలి ప్రథమభాగమును ప్రశస్త కవిపండితులగు తెల్కపృతికర్తలు శ్రీ బండ్ల సుబ్రహ్మణ్యముగా రాంధ్ర విద్వల్లోకమున కర్పించియున్నారు.

నేఁ డాంధ్ర సాహిత్యమున వెలయుచున్న మహాకావ్యములలో నొక టిగఁ బరిగణింపఁదగిన యీ భాగమున నాలుగు ప్రకరణములును 521 గద్య పద్యము లున్నవి. కాని, యిది కేవల మొక్క నవీన కాల రచనాదీపని సమీక్షింపఁ దగినది కాదు. అంతకన్న మిన్నగా బాగ సూక్ష్మతతోఁ బరిశీలింపఁ దగినది. ఏలననగా: ప్రస్తుత రచన ప్రాచీన నవీన కావ్యలక్ష్యలక్షణ సమన్వితము.

ప్రాచీనతా లక్షణములు:

౧. కృత్యాది శ్రీకారముతోఁ బ్రారంభము. ఇందు శ్రీమహార్యాది గజానన స్తుతులేగాక *కుమారస్వామి స్తుతియుండుట విశేషము. తెలుఁగు కవిస్తుతిని ప్రత్యేకముగ నొక సీసపద్యమున నా యా కవుల రచనావిశేష ముల వ్యంగ్యముగాఁ దెలుపుట హృద్యమైయున్నది.

౨. ఇందు చంపూపద్ధతి సంతరింపఁబడినది. ఇందలి వచనము లన్నియుఁ గేవల పదాడంబర సమాసభూయిష్ఠములుగాక, సమవిభక్తములై యర్థబోధకములై యున్నవి.

---

* కుమారస్వామిస్తుతి తెలుగు కావ్యములలో వ్రేళ్ళపై లెక్కింపదగిన వానియందే కలదు. దీనినిగూర్చి చూడుడు - నా వ్యాసము నన్నయభట్టు - సూర్యషణ్ముఖ స్తుతులు. (భారతి 1958.).

3. పూర్వవర్ణన సంప్రదాయము ననుసరించి ఇందు సంధ్యాదివర్ణన (217), సూర్యోదయాది వర్ణన (220-235), వసంతర్తు వర్ణన (326-343), వివాహవేదికా కల్యాణోత్సవాది వర్ణనలు (470-498) గలవు.

4. ప్రాచీన ప్రబంధములందువలె నిం దచ్చటచ్చట అచ్చ తెలుఁగు పద్యములు (తత్సమ పదరహితములు) గలవు చూడుఁడు 137.

5. రెండర్థముల పద్యములు నిందున్నవి. చూ. 22, 47, 56, 219, 490, 491.

నవీన కవితా లక్షణములు :

౧. జీవిత చరిత్రమునే ప్రధానేతి వృత్తముగాఁ గొనుట.

౨. పద్యములు నామచిహ్నితములు గావింపకుండుట.

3. నవీన సంప్రదాయానుసారముగ పురవర్ణనలు చూడుఁడు. మద్రాసు, బొంబాయి వర్ణనలు.

4. శైలియందు నవీన పారిభాషిక పదజాల ముపయోగించుట.

5. కల్పనలు — నవీనములను ప్రాచీనములుగా భావించుట. (చూడుఁడు - పుట 207 త్రిపురాసురులు) 1. ఆస్ట్రేలియా 2. హంగేరీ జర్మనీ.

క్రొత్తప్రాఁతల మేలుకలయిక క్రొమ్మెఱుంగులు చిమ్ముచున్న యీ కృతి యిట్లు కేవలము కవితావిషయికముగనేగాక వైజ్ఞానిక విషయమున నొక ప్రత్యేక విశిష్టత కలిగియున్నది. కావ్యకర్తలు పాఠశాలయందుఁ బండితులగుటచే పాఠశాలలయందు నేడున్న విద్యాప్రణాళిక పొట్టి శ్రీరాముని బాల్యమున విద్య నేర్చినప్పుడు నర్ణితమైనది. (చూడుఁడు 246 వచనము) ఇంతేకాక విద్యా మహాభూరుహశాస్త్ర శాఖోత్పత్తి, 262 కూడ నీ సందర్భమునఁ జదువఁదగినది.

ఇందలి వస్తువివేచన మింతటితో నాగలేదు. ఈ నాఁడును మన మప్పుడే మఱచిన ప్రథమ ప్రపంచయుద్ధము మదరాసు ఎమ్డెన్ నౌక - మహారాష్ట్ర విజృంభణము మున్నగు చారిత్రక విషయములిం దెన్నో నిక్షేపింపఁ బడియున్నవి. వీని నన్నింటికి నొక వ్యాఖ్యానము చాల నావశ్యము. మచ్చున కొకటి చూడుఁడు;

"కదలకుండ లేద కాసబియాంకుండు
జనకు మాటకొఱకు జచ్చువఱకు." 414

ఇట్టి పట్టుల కేసబియాంక, ఎట్టి యావద్భ్రాయమైన కాలమందో ఆ కథ మన చదువరులకుఁ దెలియవలెను.

పదునైదేండ్లనుండి కవితావ్యాసంగము ప్రారంభించిన శాస్త్రిగారి కావ్యరచనయందు బ్రహ్మణ్యులే కాక సుబ్రహ్మణ్యులైనారని నుడువుటలో నేమి దోషమావంతయు లేదు.

కవిగారు గద్యపద్య రచనల రెండిటియందును సైతము వాసిగాంచు టెఱింగినజాణలు. ఒక్కయెడ సరససమాసభూయిష్ఠరచన - ఒక్కయెడ సులభ సుందరాంధ్ర పదములకూర్పు - ఒక్కొకచో లోకోక్తులు, ఒక్కొక్కచో నర్థాంతరన్యాసములు గలిగి గ్రంథము ముట్టినదాదిగా సమాప్తముగాఁ బఠియింప నిచ్చగొల్పునది. ప్రాచీనరీతి ననుసరించినను పద్యము హాయిగ నడచిపోవును.

"హాయిగ నేఁగెనాతఁడు మహాముదమందుచు నందమైన బొం
బాయికి, బోధితార్యగుణపాయికి, యంత్రవినూత్నవస్తు సం
ధాయికి, భక్తబృంద ధనదాయికి, విశ్వకళాయశ స్థిర
స్థాయికి, నవ్యజీవన విధాయికి, పూజిత శేషశాయికిన్"
కల్పనకు—

"ఆకసంబను గడియారమందుఁ జిన్న
ముల్లు చంద్రుఁడనఁగ పెద్దముల్లు సూర్యుఁ
డనఁగఁ దక్కిన రాసులే యంకెలనఁగఁ
జేసి మఱఁద్రిప్పివిడిచిన - సిద్ధుఁ డెవఁడొ."

పద్యములనే యుదాహరింపవలెనన్న యీ గ్రంథమునఁ జాలభాగ ముదాహరింప వచ్చును. ఇందలి భాషాశుద్ధి గాంగనిర్మలము సద్వృత్తధారాళ వాగ్ధాటిగలది. కల్పనలనల్పములు - శైలి యుదాత్తము గంభీరము నైనది. విశేషమేమనగా, గ్రంథమంతట పొట్టి శ్రీరామ జీవితము ప్రత్యభివ్యక్తమగుచు ఆంధ్రతాముద్ర గలిగియున్నది. అద్యతనాంధ్రకావ్యములలో నున్నతస్థాన మలంకరింపఁదగిన యుజ్జ్వలకృతి.

కృతికర్తలు షణ్ముఖులు గావున నీ పొట్టి శ్రీరామరామాయణమును షట్కాండ పరిమితిగఁ గావించి, ఆంధ్ర మహాజనుల కందింతురు గాక.

ఇట్లు,

నిడుదవోలు వేంకటరావు

ద్వాదశ భాషావిశారద

# శ్రీ కోట సుందరరామ శర్మగారు, M. A.,

Professor of Linguistics and Languages,
National Academy of Administration, Mussori.

*Camp* : మైసూరు

విద్వాన్ శ్రీ బండ్ల సుబ్రహ్మణ్యకవిగారీవఱకే ఆంధ్రలోకమునఁ గొంత ప్రతిష్ఠ పడసినవారు. ఆయన 'కుమారవిజయ' 'ప్రహ్లాద' 'బుద్ధావతార' గ్రంథములు తెనుఁగు రంగమున 'గజ్జెపల్లాలు కట్టి' ప్రతిధ్వనించినవికూడ. అట్టి కవిశేఖరునకు 'ఆంధ్రమహాభ్యుదయ' కావ్య రచనా తత్పరునకు ఉదాత్త వస్తువు లభించినది, అమరజీవి పొట్టి శ్రీరాముల జీవిత చరిత్రలో. అది యే యాంధ్రుని హృదయ తంత్రులను కదలింప లేదు!

"ముదురు తమస్సులో తనువు పూరికి పుచ్చిన పుణ్యమూర్తి దేహదహన రోచులే జగతి నల్లిన చీఁకటిఁ జించివైవ నభ్యుదయము గల్గె నీ తెలుఁగు భూమికి" అని ఆయన ప్రథమ సాంవత్సరిక శ్రాద్ధముగా మదీయాంతరాత్మయు విలపించినది. పైగా "వర్షము నిండె నేటికిఁ ఎదఁగల చీఁకటుల్ చిదుమ రే వెలుఁగుల్ గనరే తెలుంగులూ" అని యానాటి అనైక్యమునకు తపించినదికూడ. ఇప్పట్టున ఈ కావ్యము ఆంధ్రులందఱకు కనువిప్పు కాఁగలదని నా దృఢవిశ్వాసము.

ఈ కావ్యము శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల కంకిత మగుటలో నొకానొక విశిష్టత గలదు. ఇంకను గ్రంథ వైశిష్ట్యమును అనేకరీతులఁ దెలుప మనసగుచున్నను పర్యాప్త స్థలాభావముచే ముఖ్యమైన వానిని ఈ దిగువఁ దెల్పుదును.

ఈ కావ్యము

(1) అష్టాదశ వర్ణనలను ఇమిడించి ప్రాచీన ప్రబంధ ఫక్కీని తలపింపఁ జేయును.

(2) అర్థాంతర న్యాసలహామహామికతో పద్యములయందు పడినవి.

(3) పాండిత్య స్ఫోరకములుగా ద్వ్యర్థిపద్యములు పెద్దలకు హృద్యమగును.

(4) ప్రాచీనకవి వచనములలోని ఛందోమయత నీ కవి చక్కఁగా నూహించినాఁడు.

ఉ॥ "ప్రావృషేణ్య పయోధరధ్వాన గంభీర" మను శ్రీనాథోక్తి సీసమున పోతపోయుట - పుట - 119 పోతనలోని అంత్యానుప్రాసము నీ కవి హాయిగా అలవరించు కొన్నాఁడు. ఉ॥ 83 వ పుటలోని బొంబాయి వర్ణనము.

(5) ఎడనెడ అధునాతన కావ్యముల గ్రొత్తదనమును నెలకొలుపుచున్నది.

ఉ॥ ప్రథమ ప్రపంచ సంగ్రామ వర్ణనము, బొంబాయి, మద్రాసు నగరముల వర్ణనము పట్టునను; 72 పుటలోని విద్యా విషయ వర్ణనమునందును.

(6) అర్థానుకూలమగు శబ్దరచనపై ఈ కవికి గల దృష్టి అగ్గింపఁదగినది.

ఉ॥ పుట 49 లో 'దుర్గాంతరత' ఇత్యాది పద్యములు.

ఆంధ్రావని ఈ కావ్యమును యథోచిత రీతిని నాదరించి 'పొట్టి శ్రీరామ నిర్యాణ పుణ్యతిథిని పట్టిపోయిన కన్నీటి బొట్టుతోడఁగాక కరుణ రసాంగకమగు ఈ వీర రసకావ్యమును ఆర్ద్ర హృదయముతో స్మరింతురు గాక!

"శ్రీరామరక్షగా సిద్ధించిన ఆంధ్రీపురంధ్రీమతల్లికి" రసాక్షరాశ్రు వృష్టిగా వెలసిన ఈ కావ్య హృదయ తంత్రులును, సకలాంధ్ర జనతా హృత్తంత్రులును, మేళవించి ఆంధ్రరాష్ట్ర స్థాపనాతిథి పర్వమును రసమయ మొనరించుకొందురుగాక.

భగవానుఁడీ కవికి చిరాయురారోగ్యములు ప్రసాదించి ఇతోధిక రచనా దక్షత నొసంగి, కావ్య జగత్తున స్థాయియగు స్థానము లభించు నట్లనుగ్రహించుఁగాక!

కోట సుందరరామశర్మ

Professor of Linguistic and Languages,
National Academy of Administration
Ministry of Home Affairs,
Government of India, Mussori.

లేఖాముఖం

వాఙ్మయ మహాధ్యక్ష

## శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు

ఎడిటర్:- ఆంధ్రప్రదేశ్ (తెలుగు)

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.

ఓహోహో!

ఆంధ్రమహాభ్యుదయ కృతిఘంటారవా!
ఆంధ్రమహాభ్యుదయ కవి కంఠీరవా!
శుభాకాంక్షలు! - మహాప్రతిభా ప్రభాకాంక్షలు!

తొట్టతొలి మహాకవి కవిరాజ శిరోమణి మొదలు ఆధునిక కవి పుంగవులదాకా సుష్టుగా సమిష్టిగా వ్యష్టిగా ప్రయుక్తమై అర్థాంతరంగా అధ్వాహ్నమై అర్థం తల్లక్రిందులై పదార్థానికి పనికిరాక స్వార్థాన్నిసైతం కోల్పోయిన అభ్యుదయపదం అర్థాన్నిచూచి తత్పదంలోని అంతరాంతరాల్లోకి వెళ్ళి అంతంచూచే ఆధ్యాత్మిక వేత్తలు కరువైపోతున్న యీ రోజుల్లో చెట్టుపేరుతో కాయలమ్ముకున్నట్లు మేడిపండు కమ్మదనానికి వ్యామోహితులైనట్లు చెల్లాచెదురుగా చిల్లరమల్లరగా చలామణి అయిపోతున్న నేటి సాహిత్యసంఘ వ్యవస్థలో నీ "ఆంధ్రమహాభ్యుదయ" కావ్యం చిలకపలుకుల తళుకు బెళుకుల జిలుగు తెలుగు కైతల వెలుగుతల్లికి ఒకానొక రంగారు బంగారు తురాయి. మన వాస్తవిక మహాభ్యుదయ కవితా పథంలో నిక్కమైన చెక్కుచెదరని మైలురాయి,

మతికి పనికల్పించే "మద్రపురీ" వర్ణనంతో ప్రారంభమైన నీ కవితా క్షేత్రయాత్రలో తొలిఘట్టం - లక్ష్మీగురువుల గార్హస్థ్యం. స్వప్నమయమై కూడా స్వప్నమాత్రం కాకుండా శ్రీరాములు జన్మగా చిగిర్చి గురవయ్య నిర్యాణం వడగాడ్పులతో లక్ష్మి విచారంగా వడిలినా స్వధర్మ నిర్వహణగా కర్తవ్య దీక్షగా అశాంతి రేగడం - అంతాఅయాక......వినిర్మల ప్రశాంత దినాంత సంధ్యావర్ణనం - అనంతరం నిశాంత సూర్యోదయ రూపప్రతిబింబం - విద్యాసముపార్జన - మతిని పెంపొందించే హితబోధ - పుట్టిగుట్టును గుర్తుచేసే నారాయణుని శాశ్వతమైన గాఢనిద్ర - తర్వాతి

యాత్రలో బొంబాయి పయనం - మహావిజ్ఞానయాత్ర పిపాస కలిగిన నవ వసంత ప్రకృతి చైతన్య వైభవం శుభమూ అంటూ జరిగిన కళ్యాణ ప్రయత్నంలో రేగిన వాదోపవాదాల నాదాలు హేలలై పూలమాలలై మహా వైభవంగా కనులపండువై కళ్యాణ మహోత్సవ వర్ణనంలో అనువదించిన యీ తొలి ఖండంలోని నిగూఢ భావాలను గ్రహించేవారెంత మందున్నారంటావ్ కవిరవీ!

ఎన్నడో వెలసిన నన్నెచోడుని కుమార సంభవంలో కనిపించే సువ్యవస్థితమైన సంతాన వ్యవస్థత మళ్ళీ నీ కృతిలో కళ్ళకు లీలగా గోచరించింది. సార్వజనీనమై స్వచ్ఛందమై స్వచ్ఛమైన కృతి సతీత్వం స్వాభావికంగా సమస్త సృష్టినాథుడైన భగవంతునిపరం కావడం ప్రశంసనీయం.

అక్షరరూపమై శశికళారూపమైన నీ సుకృతికి అక్షరలక్షలిచ్చే దేవ్వరీ రోజుల్లో —

ఇదిగో యిది రెండర్థాలున్న పద్యం — యిక్కడ దీనికిట్లా అర్థం చెప్పుకోవాలి - యీ అర్థం చెప్పుకోవాలి అని అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లు అన్నీ అందించి ఆరగింప చెయ్యవలసిన దుస్థితిలో ఉన్న నేటి సాహిత్య సమాజం - కాదు కాదు - సామజం - నీ "సుమశర" (౧౮ పుటః) పరంపరను చూడగలదా? లలితాహ్లాదాన్ని (33 పుటః) అనుభవించ గలదా? పూజతరాజమాళిని (౬౨ పుటః) పూజించగలదా?

దుర్గాంతర్గత వాహినీతతి హాశాద్దుర్దాంత (శబ్ద) క్రియామార్గోద్గీర్ణ విదీర్ణ కర్ణ రవ శుంభద్ఘోర (వాక్యాస్త్ర) సంసర్గోగ్రాగ్ని విదగ్ధదృశ్య పటలాంచ ద్భ్రాంతినానా తనూభర్గుంభోలిన (౪౯ పుటః) నీ సంస్కృత సమాస ఘటనా ఘనసామర్థ్యాన్ని చూచి అచ్చమైన తెలుగువారు నల్దెస (౫౦ పుటః) గుంపులుకూడిరి. గుసగుసలాడిరి. ఒండొరు వేడిరి. బెండువడిరి. నల్దెస చూచిరి. నడవ గాల్చాచిరి. వెనుదిర్గి చూచిరి. వేడుకొనిరి, తలపులు (ఇక్కడ తలపులు కాదు) మూసిరి తాళముల్ వేసిరి ...

అంటే తప్పేముంది?

అన్నట్లు నీవుద్వ్యర్థిగా చూపించిన "సరసత్వంబున" (౧౫ పుటః) ఇత్యాది పద్యంలో ఒకటీ రెండూ కావు - అర్థాలు - అంతరార్థాలు అన్నీ కలిపి రెండు కళ్ళున్నాయి - అవును మహాకవితా తపోధ్యానంలో కవి

తన్నుతాను మరచి పోయినా అబ్బురపడటం అతని అమృతవాక్కులనుంచి అనంతభావాలు ఆవిష్కృతమైన ఆశ్చర్యపడడం - ''అవృత్తబంధురత'' - ''అరతి'' - విభావాలతో ''స'' దన్యార్థంతో - ''కవిచంద్రులు'' అంటే ''కాకచంద్రులు'' అబద్ధంగా పూజ్యులవ్వడం - అబ్రమేకాదు నిజంగా పూజ్యులవ్వడం బ్రమే! (భ్రమే)—

అన్నట్లు బ్రమతో పూర్వ టకారం లఘువుగా తేలిపోతే గురుత్వానికి భంగంవచ్చి మత్తేభవిక్రీడితవృత్త విక్రీడిత గురుత్వం, తగ్గుతుందంటారేమో ఛాందసులు. అయినా తప్పుకాదు. ఆ పద్ధతిలో అసలది మత్తేభపాదమే కాదంటాను. స, భ, ర, స, మ, జ, వ గణాలున్న మగోవృత్తపాదమనే అంటాను. యీ వృత్తమే ఒకానొక స్వస్థాన విషమవృత్తమనీ సశాస్త్రీయమే ననీ అంటాను. అజయ్యుడుగా నిలుస్తాను. అద్భుతకవి తల్లజుడుగా నిన్ను వెలయిస్తాను.

అన్నా! యెవరో కొందరు ఔనన్నా కాదన్నా నీవు కవిరవివి. రవి కవివి. అధునాతన ఆంధ్రకవితా వాఙ్మయ ప్రపంచంలో అసలైన సిసలైన ఆంధ్రమహాభ్యుదయ కవివి. నీ అక్షరమైన సమగ్రసత్కృతి రసాస్వాదనం చేసే సుకృతం అతిత్వరలో కలుగజెయ్యి - నీవు మహాకవిగా అమల యోగంతో జీవించాలని మనసారా ఆశిస్తున్నాను. నీ సుమధుర ప్రవాహ కవితా లహరీ రూపమైన ''మహాభ్యుదయ కావ్యాన్ని'' మహామహంగా అతి త్వరలో అందించుతావని ఆశిస్తున్నాను.

ప్రేమతో

క్రోధి ఉగాది

వడ్లమూడి గోపాలకృష్ణయ్య
ఎడిటర్:— ఆంధ్రప్రదేశ్ (తెలుగు)
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.

ఆంధ్రమహోభ్యుదయము

# డాక్టరు దివాకర్ల వేంకటావధాని

ఎం. ఏ. (ఆనర్సు) పి. హెచ్. డి.

ఉస్మానియా యూనివర్సిటీ, హైద్రాబాదు.

విద్వాన్ శ్రీ సుబ్రహ్మణ్య కవిగారి సన్నిధికి అనేక నమస్కారములు చేసి వ్రాయు విన్నపములు. తమరు దయతో బంపిన ఆంధ్రమహాభ్యుదయ కావ్యమును జదివి యానందించితిని. కీ॥ శే॥ పొట్టి శ్రీరాములుగారు ఆంధ్ర జాతి కొనరించిన సేవయు, నాంధ్రజాత్యభ్యుదయమునకై కావించిన త్యాగమును అనన్య సామాన్యములైనవి. వర్తమాన కాలముననేకాక తరతరములు దాక నాంధ్రదేశము వారికి ఋణపడి యుండును. అట్టి త్యాగమూర్తి జీవిత చరిత్రను దాము పద్యకావ్యముగా సంతరించుట యెవ్వరి కానందము సంధింపదు? అవతారికలో తాము రచించిన పద్యరత్నములు చదివి మిక్కిలి యానందించితిని. తాము త్యాగవీరుని యుదాత్తతతోపాటు తమ దేశనాయక భక్తినిగూడ నందు జక్కగ వెల్లడించినారు. మదరాసు, బొంబాయి నగర వర్ణనలు, తత్కాల రాజకీయాది పరిస్థితుల వర్ణనలు, శ్రీరాములు గారి సహజ సద్గుణ సంపద్వర్ణనలు, వసంత సంధ్యా సూర్యోదయాది వర్ణనములు భావపూరితములై తమ భావనాశక్తిని ప్రకృతి పరిశీలనను చక్కగా వ్యక్తము చేయుచున్నవి. తమ పద్యములందలి ధార సహజమై, నిసర్గశ్లిష్టమై చదివిన కొలంది చదువవలెనను నాసక్తి కలిగించుచున్నది. తమరి శైలియు నాతి కఠినమయ్యు బేలవముగాక లక్షణానుగుణమై, చక్కని సూక్తులతో గూడి యింపునింపుచున్నది. తమ వచనము లందందు విరోధాభాసాద్యలంకారములతో గూడి పూర్వకవుల రచనలను దలపించుచున్నవి. ఏనాటికో వెలువడవలసిన యీ మహనీయుని జీవితము నిప్పటికైన తాము రసవంతముగా వెల్వరించి సర్వాంధ్రజనుల కృతజ్ఞతా ప్రశంసలకు బాత్రత గడించుకొన్నారు. తమవలె "సమకాలిక జీవిత చిత్రణాదృతిని" కావ్యములలో బ్రదర్శించిన వారి సంఖ్య చాల తక్కువ. వివాహమువఱకు మాత్రమే కల యీ యుత్తమ జీవిత చరిత్ర యుత్తరార్ధమునుగూడ తాము త్వరలో రచించి యాంధ్రుల కనవరత పఠనీయ మొనర్తురుగాక అని ప్రార్థించుచున్నాను.

డాక్టరు దివాకర్ల వేంకటావధాని

## డాక్టరు సి. నారాయణరెడ్డి. M. A, P. H. D.

ఉస్మానియా యూనివర్శిటీ

హైద్రాబాదు


ఆంధ్రజాతి అస్తిత్వానికి పొట్టి శ్రీరాములుగారి ఆత్మార్పణం ప్రబల కారణం. శ్రీరాములుగారి జననం మొదలుకొని నిర్యాణం వరకు ఆంధ్ర మహాభ్యుదయం వివిధ దశలను దాటింది. ఆ పుణ్యపురుషుని ఆత్మబలితో ఆంధ్రరాష్ట్రావతరణం జరిగింది. ఆతని అకుంఠిత దీక్ష, అపూర్వ త్యాగం అంధకార నిరాసం జరిపి ఆంధ్రావనికి అభ్యుదయాన్ని, మహాభ్యుదయాన్ని సమకూర్చినవి. ఆ త్యాగ పురుషుడు నాయకుడుగా, ఆంధ్రరాష్ట్ర మహోద్యమ వివిధదశలు అంగాలుగా ఈ కావ్య నిర్మాణం జరిగింది. ఈ రకంగా సుబ్రహ్మణ్యకవిగారి కావ్యానికి వస్తు గౌరవం లభించింది.

సుబ్రహ్మణ్యకవిగారు మహాకావ్య నిర్మాణానికి కావలసిన లక్షణాలు పుష్కలంగా ఉన్నవారు. చక్కని భావనాశక్తి ఉంది, చిక్కని పదప్రయోగ చాతుర్యం ఉంది. తైలధారాసదృశమైన రచనారీతి అలవడింది. మహా కావ్యానికి వలసినంత గురువైన బరువైన వస్తువూ దొరికింది. ఇంకేమి? వాణీ హిరణ్యగర్భులు కవిగారి వాఙ్మనములందు రాణించక తప్పలేదు. రసోద్రిక్తమైన రచన వెల్వడక తప్పలేదు.

సుబ్రహ్మణ్య కవిగారికి ప్రాచీనాంధ్ర కావ్యములందు గాఢ ప్రత్యయముంది. అంతేకాదు. కవిత్రయం, శ్రీనాథుడు, పోతనవంటి పురాణ కావ్య కవుల కవితాసారం వీరికి రక్తదఘ్నంగా భాసించింది. వీటికి తోడు రసావేశం ఉంది. ఈ రసావేశం ఆ ప్రాచీన కావ్యవైదుష్యం, ఏకీకృతమై మహాకావ్య రచనకు మార్గం తీసినవి. ఆ మార్గములో మైమరచిపోయి వీరు పుంఖాను పుంఖంగా పద్యాలు వెలువరించారు. రకరకాల వృత్తాలలో రమణీయమైన భావాలు చిలకరించారు. సంధ్యావర్ణనంలో,

"పశ్చిమ దిగ్ధాత్రి పసరు కెంజాయ సాంబ్రాణి వత్తులు వెల్గ వరుస గుచ్చె" అనడం నవనవోన్మేషమైన కవితా ప్రతిభ ఉన్న వారికే చెల్లుతుంది. పరంపరాగతమైన సంధ్యావర్ణనల పట్టికలోంచి ఎత్తివేసుకుంది కాదిది. అచ్ఛమైన, అభినూత్నమైన భావనాశక్తి కిది ప్రతీక. ఇలాంటి భావనాస్నాతమైన ఉదాహరణలు ఈ కావ్యంలో ప్రాయకంగా ఉన్నాయి.

సమాస చాలనంలో, తెలుగుబళ్ళ పోహణింపులో పద్యగ్రంథనంలో సుబ్రహ్మణ్య కవిగారు ఎంత చేయి తిరిగినవారో ఈ కావ్యంలో సగానికి పైగా ఉన్న పద్యాలు నిలువుటద్దాల్లా నిరూపిస్తున్నాయి.

సుబ్రహ్మణ్య కవిగారు మలిపాలుగూడ ఇంతటి ప్రౌఢపాకంలో రచించి ఆంధ్రావళి చపులు తీరుస్తారని ఆశిస్తున్నాను.

ఇట్లు,

సి. నారాయణరెడ్డి

# ఆవుల గోపాలకృష్ణమూర్తి M. A., LL B.

తెనాలి

మిత్రుడు బండ్ల సుబ్రహ్మణ్యం, ప్రపంచయుద్ధానికి లోకం సన్నద్ధమౌతున్న రోజుల్లో 15-7-1912 న బాపట్లతాలూకా వేటపాలెంలో సన్నకారు కుటుంబములో జన్మించిరి. వేటపాలెపు ప్రాంతం ఇసుక ప్రాంతమయ్యా, సారవంతమైనది. దేశ దేశములను చక్కని, చిక్కని చేనేతగుడ్డను సంతరింపచేస్తూవున్న చేతివృత్తుల సాంద్ర కేంద్రం.

బండ్ల వేంకటసుబ్బయ్య, ఆదెమ్మలు ఆ కేంద్రంలో కృషీవలులు. వారు పెద్దచదువులు లేనివారైననూ, బిడ్డను లాంఛనప్రకారం 'సుబ్రహ్మణ్యాన్ని'గా చేసినారు. తెలుంగుబిడ్డనికి తెలుగు విద్యాబుద్ధులు కరపినారు. చదువుల వాతావరణంలేని చోటునగూడా, కృషితో కవితల కాలవాలమైన వాతావరణాన్ని కల్పించగలిగారు. నిర్మాణ కృషిలో నున్నవారి నిగ్రహత యట్టిది. దానితో సుబ్రహ్మణ్యం 1938 లో మద్రాసు విశ్వవిద్యాలయములో 'విద్వాన్' పరీక్షలో నుత్తీర్ణులైరి.

సుబ్రహ్మణ్యం ప్రాంతీయకుటుంబ వాతావరణ ప్రభావ విభావముల నరసినవాడై కుటుంబపు వృత్తివిద్యలను వదలక, అందులోగల సృష్టి వైవిధ్యాన్ని అరసి, ఆ కళలోని సునిశితత్వాన్ని లోగొని, తాను కళాతపస్వి కావాలన్న ఆసక్తినిపూని, కవితల నల్ల ప్రారంభించినాడు. వెలిచంద్రుడు వలువల నల్లుచుండ తాను కవితలనల్ల దొడగినాడు.

తల్లిదండ్రులు బిడ్డకు పేరిడటంలోనే బిడ్డని మనః ప్రవృత్తి తెలిసికొన్నట్లైనది. సుబ్రహ్మణ్యం విశ్వేశ్వర శతకాన్ని మొదటి ఉపాయనంగా యిచ్చారు. వేమనవారిచ్చిన ద్వితీయ కవితాకుసుమము తులసీదాసు, కుమార విజయం, బుద్ధావతారం, ప్రహ్లాద, కళాశ్రీలు వెల్లువలుగా జాలువారినై. ప్రస్తుత కావ్యం వాటికి మేలుకలపు వారసత్వం. ఇవి ముద్రితాలు. అముద్రిత కావ్యాలాపనల్లో కన్యకాపరమేశ్వరీ చరిత్ర, శాస్త్ర తత్త్వజ్ఞులు గెలీలియో, న్యూటన్, మైకేల్ ఫారడేల జీవితగాథలు కలవు. సుబ్రహ్మణ్యం పదునెక్కిన స్థాయిచేరి, పద, బంధకవిత్వాల్లో గారడీకూడా చేయసాగాడు. యీ గండు కోయిల, మార్దవాన్ని, సౌకుమార్యాన్ని పొంది, సంపిపులాభ జొచ్చినది.

కవి శాబ్దికుడు, శాబ్దికుడేగాక అనన్య అన్యవ్యుత్పత్తి, రీతి, వైదర్భి గ్రంథాలను నేర్చినవాడుగా వుండాలి. కవి మనస్సొక దర్పణము. దర్పణమే కాదు, అన్వయరంగం. ఆ రంగంలో, కవి లోతుపాతులనుబట్టి, నిర్మాణ సంపత్తినిబట్టి, తన అంతస్తును నిర్మించుకొంటాడు; లోకానికి ప్రకటన చేస్తాడు. ఋషి కాక కవి కాలేడన్నారు పూర్వులు. ఋషి అనగా సన్యాసి అనికాదు. సమరస భావంగలిగి మానవత్వాన్ని ఆకళింపు చేసుకొన్నవాడని వారి భావం. సర్వజ్ఞులు కొందరున్నా, కవి కేవలం సర్వజ్ఞుడుకాడు. అతను శాస్త్రవేత్తకాడు. తార్కికుడూ కాడు. తత్త్వవేత్తా కాడు. అయినవాళ్లూ వున్నారు. కవి 'కలానిధి' కావాలనిలేదు. కవి గూడా మనిషే. అయితే, ప్రతి వృత్తీర్ణుడైన మనిషిలోనూ కొన్ని విశిష్ట గుణాలున్నట్లు కవిలోగూడా కొన్ని విశిష్ట గుణాలుంటవి; వుండితీరాలి. దానిమీదనే అతని వ్యాపారం సాగుతుంది. కాని, కవిత కళ గనుక, అది విక్రయ సామగ్రికాదు. మారక పు పదార్థమూకాదు. సమంగా పంచగల సమతాసరుకూకాదు. ప్రతివ్యక్తీ ఆచరించగల విద్య; రాణకువచ్చువారు అన్ని విద్యల్లో మాదిగే కొద్దిమంది. అందువల్ల కవి మొనగాడు కాడు, కాకనూ పోలేడు, అంతే!

మన కవీ అట్టివాడే! వారి మొదటి మంచికావ్యం వేమన. వేమన మీదికి దృష్టిపోవటంలోనే సాంఘిక విప్లవ తత్త్వవేత్తలను గురించి కవికి గల్గిన ప్రగాఢ భక్తి తత్పరతలు వ్యక్తం కాగలవు. ప్రతి కవీ వేమన జోలికి పోలేడు; పోలేరు. వేమన తెలుగు దేశంలో ఆదికవి. తెలుగుల వైతాళికుడు. కవిత్వాన్ని సంఘచైతన్యం కోసం వాడిన మహాపురుషుడు. అట్టి కవిత్వాన్ని ప్రసవించిన వేమనను "విశ్వవినుతచర్య! వేమనార్య!" అని మకుటీకరించి మనకవి తన దృఢ సాంఘిక తత్పరతను వెలార్చాడు.

వేమన కావ్యానికి మరో విశిష్టత వుంది. కవిబ్రహ్మ వేటుకూరి వేంకట నరసయ్యగారి పర్యవేక్షణాభాగ్యాన్ని గూడా పొందింది. వేటుకూరి శానోక వృద్యోగాన్ని గలిగి ఆ ఆవేదనను యితరులకు సమపాళంలో అందించగల రసిక భాషాకోవిదుడు. వారి సారథ్యం సుబ్రహ్మణ్యకవికి దొరకటంలో, మొదట్లోనే "సానలు దీరిన" సందర్భ శుద్ధి పొందగలిగాడు. అయితే, నాటి వేమన నేటి వేమనకాదు. నాడది 869 పద్యాలు గలది. నేడందు 1008 పద్యాలున్నవి. మూడింతలైన కావ్యమది. సారంపెరిగి, కవిలో దండితనం హెచ్చగా, ముదిరిన కాపుగా నేడది రూపొందినది. వేమన కావ్య కవితలో వేమన పద జాలం, నుడికారము, తెలుగు తనంలోని యింపు గుమగుమలు కనబడతవి.

వేమనను గురించి సరియైన పరిశోధన లేదు. వీలున్నవారు, వీలు చిక్కినపుడు, వారికితోచిన దల్లా వ్రాశారేగాని, వేమన నిజతత్వాన్ని

గ్రహించలేదు. వేమన సాంఘిక వుద్దీపన భావుకతకు న్యాయం జరగలేదు.

తులసీదాసు, కుమారవిజయము, బుద్ధావతారము, ప్రహ్లాద నాటకము — ఇవన్నీ నాటకాలు. చరిత్ర పురుషులు, పురాణ పురుషుల్ని తవిడి చూచారు. బుద్ధావతారంలో కవి యీ దేశంలో పుట్టి వుదాత్త మానవుని ప్రదీప్తి వెలిగించారు. తులసీదాసు కుమార విజయాలు మామూలు బాణీ మాత్రాలు. కాని ప్రహ్లాదలో ఒక వినోదాన్ని వెలార్చారు. శివవైష్ణవ ప్రాదుర్భావాలు పాదుకొల్ప బడినవి. నాటకరచనలో పాత్రపోషణలు ప్రధానం. దృక్పథ విశిష్టత ద్వితీయం. మన కవి నాటకాల్లోగూడా చక్కని శ్రావ్యకవిత్వాన్ని నిర్మించారు. కారణం · ప్రాయికంగా వీరు కవులు. వీరిపాత్రలకు జీవం జవం కలవు. అవి వారిలోవారు మాట్లాడుకో వడమెగాక, మనతోగూడా మాట్లాడుతవి. అదొక విశిష్టత.

కవితలో ప్రారంభించి, నాటకరచనలో మునిగి, తిరిగి 'కళాశ్రీ' ని వ్యక్తిచిత్రణ కావ్యంగా వచ్చింది. అదిగాక అముద్రితాల్లోగూడా వ్యక్తి చిత్రణ కావ్యత్వమే ప్రధానగుణంగా వచ్చింది. పూర్వకవుల చిత్రణ ప్రధానంగా వుంది. కవి జీవితగాథలు విశేషంగా కలవు.

కవులతో సంతృప్తిపడక, శాస్త్రీయదృక్పథంలో శాస్త్రవేత్తల జీవిత గాథలు చిత్రించారు. అదొక క్రొత్తపంథా. యిట్టి రచనలు యెన్నైనా అవసరం. సమాజాన్ని వుత్తేజపరచగలవు.

గెలీలియోనుగూర్చి వారేమన్నారో చూడండి

గీ॥ కష్టబడ బాగ్నులెన్నియో గడచినిలిచి
ప్రకృతి గర్భగృహద్వార పటలిఁదెఱచి
మర్మకర్మంబులకు రూపుమలఁచఁదలఁచి
యతఁడు గనిపెట్టె దుర్భిణీయంత్రమపుడు.

ఉ॥ కేవల నేత్రదృష్టిఁ దిలకింపఁగఁజాలని దూరనాకలో
కేపురు దుర్భిణింగనుట వెన్నిసుపట్టణమెల్లఁ బ్రాకఁగా
రేవున నేల యీానినటు ప్రేక్షకలోకము వచ్చిగోపురం
జేవిధినైన నెక్కి యమితేచ్ఛగ నెన్ నవదూరదర్శినిన్.

న్యూటన్ మీాద వారి చక్రసారణ చూడండి.

మ. పొలుపారన్ ఫలభారభూజయుతమౌఁ బూఁదోఁటఁ బన్నుండనా
పిలువండొక్కటి నేలరాలుటను దావీక్షించిపైకేగ కీ

యిలకాకర్షణశక్తియుంటఁగద పండిట్లపడెక్ నీని నే
దెలియంజాలు గతిస్వభావమిఁక జ్యోతిర్గోళ చక్రంబునన్.

మైకేల్‌ఫారడేమీాద వారి యితివృత్తం భారవహం.

క॥ పొట్టకు బట్టకుఁ జాలక
యెట్టెట్టో బాధపడెడి యే కమ్మరికో
పట్టిగఁ బుట్టిన వానికిఁ
బుట్టువునకుఁ బందు వొకటి పొసఁగునె వసుధన్.

ఉ॥ ఆ పురి నేమిలేమి తన యక్కఱ గుడ్డపుసాల పై గదిం
గాపురమున్న జేమ్సు నిజకార్మికవృత్తి గడించుకాసులం
దోపినయంత బిడ్డ సుఖమొంద వ్యయించు విరించి చెట్టులోఁ
జూపినబంధమేమొ యెటు చూచినఁదీఁగకు కాయభారమా?

యిక చిన్న వ్యక్తిచిత్రణలు వదలి, కవిధైర్యాన్ని, స్థైర్యాన్ని చేకూర్చుకొని, బాణసంచాసిద్ధం చేసుకొని, ఆత్మీయతల్ని పెంచుకొని, రుచిరార్థస్థాయిని చూచుకొని కథా కవితయుక్తుల్ని అరసి, ప్రబంధ రచనాభారం ధర్యాన్ని పూనారు.

అది యెవరిదో కాదు. మన పొట్టి శ్రీరాముని ఆత్మార్పణగాథా వృత్తాన్ని తీసుకొన్నారు. పొట్టి రాములు, పొడవైన రాములైనాడు. ఆంధ్రుల జాతుల పితయైనాడు. గాంధేయ ప్రబంధాలు గలవు. నెహ్రూ ప్రబంధాలూ కలవు. పొట్టిరామునిమీాద పొట్టి రచనలూ కలవు.

కాని, అసలు ఆంధ్రాభ్యుదయ మహాప్రబంధాలు లేవు. ఏటుకూరి ఆంధ్రుల భారతం వ్రాస్తే వారి కోవలో జిక్కిన సుబ్రహ్మణ్యకవి ఆంధ్రాభ్యుదయాన్ని వ్రాశారు. అది ప్రబంధం. యితివృత్తం ధీరోదాత్తం, రచన ప్రబంధపాకం. పొట్టిరాముని చిత్రణ ఆమూలాగ్రం జరుగఁగలదు. ఆంధ్రులు పొట్టివారికి ఋణపడితే, పొట్టివారు బండ్లవారికి ఋణపడ్డారు.

గ్రంథంలోని కవిత ప్రబంధ సూక్తుల్ని అనుసరించేవుంది. ఆ రచనా పరమేశ్వరులను దాట్టి నేటివఱకు ఆ కోవలోవచ్చిన రచనల సారవాహిని, అంతర్వాహినిగా ప్రవహిస్తుంది. శైలి సరళము, ప్రౌఢము, కఠినము కాదు. అన్వయ తృష్ణ లేదు. తెలుగు వీరునిగాథ పుదాత్త తెలుగు శైలిలో వెలార్చబడుట ప్రశస్తము.

బండ్లసుకవిని యీా నిర్మాణంపట్ల అభినుతించాలి. వారు పొట్టివారి యాస్థానకవులు. తెలుగుల ఆస్థానకవులు కాఁగలరు.

అవుల గోపాలకృష్ణమూర్తి

# పరిశీలనము

## కొత్త సత్యనారాయణ చౌదరి

పురా అనితి జీవతీతి - పురాణమ్

పురాపి - నవం - పురాణమ్

ఇతి - హ - ఆస - ఇతిహాసః - తొల్లిటికథ.

పురాణములు గాని ఇతిహాసములు గాని ఒకనాటి సాంఘిక ప్రవృత్తినిరూపకములైన చరిత్రలలోనే చేరును. కాలము గడచినకొలఁది ఉదాత్తమైన వస్తువు ఇతిహాసముగా పురాణముగా మాఱునని సారాంశము. సీతారాముల చరిత్రగానీ నలదమయంతుల కథలుగానీ శకుంతలా దుష్యంతుల యదంతములుగానీ మృచ్ఛకటికాది నాటకముల గాథలుగానీ ఇట్టివే యనుటలో ఆశ్చర్యము లేదు.

మన మెఱిఁగిన 'బాపుజీ' కథలు కొన్నేండ్లు గడచినవెనుక వన్నెచిన్నెలు కల్పించి కావ్యములుగా పురాణములుగా రచనలు చేయువారు రావచ్చును. ఆ రచనలనుబట్టి ఆమహామహుని మహిమనుబట్టి ఆ మహావ్యక్తికి గుళ్లు గోపురములు కట్టించి పూజలు పురస్కారములు సేయుటయు మనకొక రివాజు. ఈ కోటిలో రాఁదగిన ఇంకొక మహావ్యక్తి శ్రీ పొట్టి శ్రీరాములు శ్రేష్ఠి.

ఆయన ఇతివృత్తమును వర్ణించిన గ్రంథమే ఈ 'ఆంధ్ర మహాభ్యుదయము'.

ఒకనాఁడు, భాషావిషయములుగా దేశవిషయముగా ఆంధ్రులు వేఱు; తెలుఁగువారు వేఱు కావచ్చుఁగాక. కాలక్రమమున తెలుఁగునకు ఆంధ్రమనియు దేశమునకు ఆంధ్రదేశ మనియు జాతికి ఆంధ్రజాతియనియు వ్యవహారము వచ్చినది. తన ప్రవృత్తిచే దీనదయాళువైన 'బాపుజీ' ప్రపంచమునకే ఆదర్శ పూరుషుఁడై భారతీయులకు దాస్యవిమోచనము చేయించినట్లు, గట్టి నడవడికచే ఎట్టి యవాంతరములు పుట్టుకొని వచ్చినను వెనుకంజవేయక పట్టుపట్టి తెలుఁగువారికి స్వాతంత్ర్య మిప్పించిన ప్రధాన యోధుఁడు 'పొట్టి శ్రీరాము' లనుటలో ఎట్టి సందేహము లేదు.

కావ్యమునకుఁగాని కావ్యకర్తకుఁగాని కీర్తి ప్రతిష్ఠలు సమకూర్పవలెనన్న - ఇతివృత్త ప్రాథవమే మూలకారణమని ప్రాచీనుల సిద్ధాంతము.

అనఁగా ఉత్తమ నాయకుని వర్ణించిన కావ్యము సర్వజన శ్రేయోదాయక మని భావము. సుగుణగణాభిరాముఁడగు శ్రీరాముని చిత్రించుటఁ జేసియే ఆదికవి వాల్మీకి మహర్షికి అంతటి ప్రతిష్ఠ దక్కినదని లాక్షణికులు నిర్ణయించిరి. అట్లే, పొట్టి శ్రీరాముల కథను గైకొని ఆంధ్రుల మహాభ్యుదయమును అభివర్ణించిన సుబ్రహ్మణ్య కవియు ఒక విధముగా అదృష్టవంతుఁడని చెప్ప వచ్చును. నాకు జూడఁగా - ఇంతవఱకు ఈరీతిని కావ్యధోరణిలో ఆంధ్రుల పురావృత్తమును వర్ణించినవారు ఇర్వురు మాత్రమే కన్పించిరి. ఆ శ్రేణిలో వీరు మూఁడవవారు.

త్యాగప్రవృత్తిలో పౌరాణికముగ శిబిచక్రవర్తి దధీచివంటి వారు చూపిన త్రోవలోనే శ్రీరాములు శ్రేష్ఠియు నడచెను. తన కమ్మని సువాసనలు మొగాల పంచియిచ్చి తానుమాత్రము హరించిపోయెడి ఆరతి కర్పూరమువోలె పంచప్రాణములు లోకులకు పంచిపెట్టి రాష్ట్రమిప్పించి పంచత్వ మొందిన శ్రీరాములు భౌతికముగా కీర్తిశేషుఁడు కావచ్చును. కాని కీర్తిలో అతఁడు ఆదిశేషుఁ డనవలెను; ఆ శేషుఁడు ఈ భూభారము వహించినట్లు శ్రీరాములు ఆంధ్రరాష్ట్రభారమును దానుగా ఒక్కఁడే నిర్వహించి అమర జీవి యయ్యెను.

ఆంధ్రాభ్యుదయముతోపాటు ఈ గ్రంథములో గ్రంథకర్త స్వీకరించిన ఘట్టములు కొన్ని ముచ్చట గూర్చుచున్నవి. అంకిత మిచ్చినది తెలుఁగుల ఇలువేలుపగు ఏడుకొండలసామికి. ఆవల - పితృపాదుల పాదాభివందనము. ఆ వెనుక - కావ్యావిష్కరణమునకు కారకులైన ద్రవ్యదాత కథ. ప్రధానేతివృత్తమునకు మూలబంధమైన భరతమాతృస్తవము. ఇఁక - సుకవినిందను విడనాడిన సుకవిస్తుతి; ఈ యన్నింటి కనుబంధమైన కర్తృవంశాదికము.

ఇన్ని యంశము లెన్నుకొని శ్రీరాముల కథనే ఆలంబముగాఁ జేసికొని మురిపముగా ఈ కావ్యమును నిర్మించిన సుబ్రహ్మణ్య కవిని మిక్కిలిగా అభినందింతును. తెలుఁగువారి కింపు సొంపులు నింపు - ఇట్టి కావ్యము లనేకములు ఈ కావ్యకర్త చేతిలో వెలువడుఁగాక!

పొన్నూరు
17-4-64

కొత్త సత్యనారాయణ చౌదరి
లెక్చరర్, పి. బి. యస్. కాలేజి.

దర్శనాచార్య, సాహిత్యాచార్య, శాస్త్రవిశారద,
సాహిత్యసమ్రాట్, లాక్షణిక శిరోమణి, విద్యాప్రవీణ

# జమ్ములమడక మాధవరామశర్మ

అభినవభారతి : గుంటూరు

ఏ. సి. కాలేజి

నవకాలముగా జనులచే ననిపించుకొనిన కాలమున కవితలు వచ్చినవి కాని అన్నియు కవితలు కాజాలకపోయినవి. అయిన ననవకాల సంభావిత సారస్వతమున నొక యనాదర మాపాదించినది. ఆ యనాదర ప్రతిక్రియా సంధానోద్యమమున కీయభ్యుదయము వెలువడినదని భావింతురు. కేవల మాంగ్లీవాసితులు నవకాలమున నధికార మాపాదించుకొని తేలిక బాసపేరుతో కవిత పనికి పనికిరాని భాషను భాషగా నందించిరి. ఇందు కవితా కార్యమున కగుభాష నందింపవలెనని బండ్లకొలది యయిన యత్నమున్నది. ఇట్టి పట్టు భాషకు ప్రాక్తనుల యత్నమునందును వ్యంజకతా ధర్మము తగినంతగా లేదని భావించు నాకు సుబ్రహ్మణ్యసూక్తి భావనములో నవోద్యమ సంధాన కృతముగా సమాదరమున్నది.

నయనీతి ప్రసర మధికము కాగా నట్టి వస్తువ వస్తువయిన నీకాలమున వస్తువై వారి వారిచే నది వాస్తవమనిపించునంతటి బలము కలదయినది. దీనిలో పొట్టి శ్రీ వీరత సమకాల సంభావితము కాలేదని యనుకొను నేను అనంతరకాల సంభావనమును ఆత్మీయ ప్రయోజనా యోజనమున కయిన దేమో ? యని యనుకొను నేను ఈ మహాభ్యుదయ కవిని భావించి స్వసంవాది వీరశ్రీ విలసితమని సంభావించితిని.

ఇట్టి కృతుల కాకృతి భాషాముఖముగ గలుగునో భావముఖముగ గలుగునో నే నిప్పుడే నిశ్చయించుటకు వేగిర పడుట లేదు. శ్రీ రంగనాయక గుప్త ద్రవ్యదాతృత శ్రీసుబ్రహ్మణ్యసూక్తి సవితృత ఆంధ్రమహాభ్యుదయ భావయితృతను నవప్రతిక్రియాఘాతల కుద్బోధింప జేయుటకై నేనును వేగిర పడుట నభిమానించుచున్నాను.

సచేతః పాఠక పీఠమునుండి శతానంద సహస్రానందసంవిదానందము లంద జేయుటకు శ్రీ సుబ్రహ్మణ్యకవి స్వకార్య ధూర్వహుడని యభిమానింతును.

అస్తు
జమ్ములమడక మాధవరామశర్మ

## ఆంధ్ర మహాభ్యుదయము

## పీఠిక

# ఆచార్య జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

M. A. B. L., B. T. P.

ఉదాత్తమైన కవితకు కన్నతల్లి ఉపాసన. దీనివలన అద్భుతమైన భావనాశక్తి అలవడును. ఈ కవిత భాస్వదాశయ సందీపితమై [illegible], వ్యంగ్యభూయిష్ఠమై, ఔచిత్య సమన్వితమై, [illegible] [illegible] యుండును. ప్రాచీన భారతకవులు, ముఖ్యముగ సంస్కృతకవులు స్వాధ్యాయోపాసనలో, ఆనందవ్రతములో, సత్యారాధనలో అభినివేశము [illegible], యోగులై, సమాధిస్థులై వెలిలిరి. ఇంద్రియమును, మనస్సును, బుద్ధిని మించిన శక్తి యందు కదా అమృతత్వ బంధుర భావలహరి ఉద్భవించును. ఉపాస్య దేవతపై ఏకాగ్రదృష్టి నిలిచినపుడు అంతరంగిక దైవీశక్తి అద్భుత తేజస్సుతో విజృంభించును. ఇది తన్మయత్వ సహిత సూక్తులందు, భావ బ్రహ్మాండ బంధుర సూత్రములందు వ్యక్తమగును.

దుర్గను సేవించి కాళిదాసు మహాకవి యైనాడు. శ్రీ హర్షుడు శివుని, సూర్యుని, బుద్ధుని ఆరాధించినాఁడు. ఆయన నెలకొలిపిన ఆస్థానమున [illegible] మున వెలసిన మహాకవులు. బాణమయూరకవులు. [illegible] [illegible] వులు. బాణుఁడు మయూరకవికి మామగారనియు, మయూరకవియే బాణునకు మామగారనియు వివిధరీతుల పరిశోధన తెలుపుచున్నది. ఇరువురు జ్యోతిర్మయమైన వాఙ్మయము నారాధించిరి. మయూరకవి శివుని, సూర్యుని ఆరాధించినాఁడు. సూర్యాష్టకము, సూర్యశతకము, శివస్తుతి ఆయన గీతాంజలులైనవి. కావుననే మనపాల్కురికి కవికి ఆమహనీయుఁ డారాధ్యుఁడై నాఁడు. శ్లేషపై మిక్కుటమైన మక్కువఁ జూపుటచేఁ గాఁబోలు ద్వితీయ శ్రేణి కవులలోనే ఆయన గణింపఁబడినాఁడు. ఆయన కవిత శబ్దాలంకార అర్థాలంకార శోభితమై యున్నది.

ఈ కవియును అగ్రశ్రేణి సంస్కృత కవులును "ఆంధ్రమహాభ్యుదయ" ప్రణేత సుబ్రహ్మణ్య కవికి చాలకాలమునుండి మిగులగూర్చు కళోపాసకులని తోఁచుచున్నది. ఆధునిక కవులు విశేషించి ఆంగ్లసాంప్రదాయమునకే అంజలి ఘటించుచు కృతులు రచించుచుందురు. ప్రస్తుతకవికి ప్రాచీన

సంప్రదాయము ప్రీతిగలిగించినది. పవిత్రసాధకులకే ఇది యలవడును. పూజా గృహమున నధివసించియే ఈయన ఈ కైసేతను ఆంధ్రశారదకు సమర్పించిరని ఊహించుచున్నాను.

మేలితలఁపు మేలిశైలిని వలచును. అపరంజిద్యుతితో కాంతిలు శిశిర బిందువువలె అది పరిఢవిల్లును. తాను ముద్దిడిన పదమునే కవి కావ్యకన్య చెక్కిలిపై నద్దును అపుడా కన్య మురిసిపోవును. ఈ సాహితీరసము నెఱిగియే ప్రస్తుతకవి తనకృతిని మధురూస నిలయ మొనరించిరి. ఈ పద్యముల నవలోకింపుఁడు.

"లలితాహ్లాదకర ప్రభాకలిత కల్యాణుండు పాదద్యుతిన్
నలిన శ్రీహరుఁ డుల్లసత్కువలయానందైక సంధానుఁడు
జ్వల దాత్మీయ వసుప్రధాన సుమనస్సంతోష భావ్యర్థుఁడా
నెలఱాలుండు క్రమాభివృద్ధి గనుచుండెన్ ముద్దులం గుల్కుచున్.

"జిలిబిలిపల్కులొల్కు రసశీకరముల్ సెవిసోఁక మేనిపై
జలజల పూలురాలినటు, చల్లనిజాబిలి మెల్ల మెల్లఁగాఁ
గళలు పసాఱుచల్లినటు కమ్మని తెమ్మెర క్రమ్మినట్లుగా
నలరుచుఁ బ్రేమతోఁ గనుడు రాతని సోదర సోదరీమణుల్ ॥

"హిమాచల శిఖరమ్ములఁ
దుహినతతుల్ వహ్నితతియ దొరలెడి వెన్నెల
యహిమాంశుని శిర మెక్కిన
మహిళామణి సొత్తుగలిగి మహిమన్ వెలిగెన్."

మాతృదేవీ పూజయును భారతజనయిత్రీ పూజయును ఈ కవికి స్వతస్సిద్ధమైన దైనందిన క్రియలు. దేశమాత నారాధించుచు, స్వీయ జీవనమును నైవేద్యముగా సమర్పించిన అమరజీవిపై వీరికి భక్తిమెండు. ఈ భక్తిలో నుద్భవించినదే "ఆంధ్రమహాభ్యుదయము". త్యాగాగ్నికీలలనుండి మహోజ్జ్వలములైన కావ్యము లెన్నెన్నియో వెడలెనని ప్రపంచ వాఙ్మయ మండపమున ప్రవేశించినపుడు గుర్తింతుము. వీనిలో ప్రస్తుత కృతి యొకటి యని నా తలంపు.

ఎంతకాలము అమరజీవి భాసుర దృష్టాంతము స్మృతిమథన సముద్భవ చింతామణియై వెలయునో, ఎంతకాలము ఆంధ్రధరిత్రీ జనయిత్రి మహత్తరాదర్శ ప్రదీప్త కనకవసన సుందరియై తేజరిల్లునో అంతకాల మీ కృతిభూషణము వాగ్దేవీ కంఠాభరణమై భాసిల్లుగాక!

ఆచార్య
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, M.A., B.L., B.T.P.

# *Dr. T. Rama Rao* M.A. Ph.D.

Principal.

V.S.R. & Y.R.N. COLLEGE

CHIRALA, (*Andhra Pradesh*)

Vetapalem is a charming little place in Andhra with a big heart, and has over many years earned great fame as a seat of cultural activity and a nursery of budding genius.

It was at this place that I first met Sri Bandla Subrahmanyam at a special congratulatory function organized by his friends and admirers, on the occasion of the publication of his "Vemana Sukti." As I listened to him giving readings from his work, I was struck at once by the profound scholarship and the unmistakable stamp of genuine inspiration that marked his work.

I learned also with great pleasure that he had had to his credit already a considerable volume of work in Poetry and in Drama, which had not only established him as a poet of high order in Andhra but also held out promise of yet greater achievement in the future.

This promise now finds fulfilment in his "Andhra-Mahabhyudayam", of which the inspiring life of Amarajeevi Sri Potti Sreeramulu forms the epic theme. In this work, the poet has found a theme worthy of his pen, and the lofty theme a poet who could commemorate it in a worthy manner. And to my mind, the most striking feature of this work is the very unique fashion in which he blends his classical scholarship which a typically modern tone in treatment. Verily he has served us a new wine in the old bottles, and I feel confident the Andhra Public will greatly relish it.

**T. RAMA RAO**

## ప్ర శం స

# బూసం మల్లయ్య కవి

కం. కదియించితె ఆంధ్రమహా
భ్యుదయము పౌరపాచ్చ్యములకుఁ బూనికయిడకన్
మృదుమధుర భావగర్భిత
పదసంపద లుల్లసిల్లఁ బ్రతిభామహిమన్.

కం. చక్కని లోకోక్తులతోఁ
గ్రిక్కిరిసిన పద్య సమితి, గీల్కొల్పిన నీ
యక్కరముల చిక్కన మది
నెక్కడి కక్కడనె కదల నీయదు సుకవీ!

కం. అచ్చముగ సంస్కృతాంధ్రము
లచ్చున గుదియించినట్టి హావళికి నూహాల్
హెచ్చుచుఁ దగ్గుచు దేహము
ముచ్చెమటలనొఱయుఁ జిత్తము న్వివశంబౌ.

కం. ఆహా! నీ కవితారస
వాహిని మలకలను జిక్కువడక మొఱక లా
రోహింపక ప్రవహించెన్
సోహం సోహమ్మటంచు సురుచిరగతులన్.

కం. నీ కవితా సుందరి నే
ర్చుకొనెన్ బారుగింటి మొగము సూడక మడిఁ గ
ట్టుకొని పచరించు రసపా
క కళానైపుణ్యమరరె! క్రమరుచులతోన్.

బూసం మల్లయ్య

౩- ప్రియ సుహృత్

# నందుల శేషగిరి శర్మ

విద్వాన్, సాహిత్య విద్యా ప్రవీణః

వేటపాలెమ్

శ్రీ శేషాచల సంస్థిత స్తను భృతాం తాపాపనోదక్షమః
శ్రీ మత్సుందరమూర్తి వైభవ రుచా సమ్మోహయన్ అన్వహమ్ ।
శ్రీ మద్వేంకట నాయకో వితరతా దారోగ్యమాయుశ్శ్రియమ్
సుబ్రహ్మణ్యకవేః సదా సుకవితా వ్యాసంగ ధన్యాత్మనః ॥

శ్రీ మతా విద్వత్కవినా సుహృదా బంద్ల సుబ్రహ్మణ్యేన విరచితమ్ ఆంధ్రమహాభ్యుదయ నామకమ్ మహాకావ్యమ్ సావధానేన మయా సమవ లోకయమ్ । ఆంధ్రరాష్ట్ర నిర్మాణే ఆత్మానం సమర్పితవతః అమరజీవినః పొట్టి శ్రీరాములు మహోదయస్య హృద్యామ్ అనవద్యామ్ చ కథాం యథావత్ వర్ణయత్ ఆంధ్రభాషాయామ్ విరచితమ్ ఇదమ్ కావ్యమ్ ఆంధ్రాణామ్ అస్మాకమ్ ప్రతిష్ఠా కారణమ్ గర్వకారణమ్ చ భవతీతి నాత్ర సందేహ లేశోపి । ఆబాల్యాత్ రచితానేక కృతేః నిసర్గ మధుర కవితా రచనా దక్షస్య సుబ్రహ్మణ్యకవేః ప్రయత్నస్య పరిణత సత్ఫలమేవ ఇదమ్ కావ్యమితి మే ప్రతిభాతి । యద్యపి అస్య గ్రంథస్య కథావస్తు పురాణాదిభిః స్వీకృతమ్ నవరామాయణ భారతాది ప్రసిద్ధ గ్రంథేభ్యః నచ కల్పితమ్ తథాపి అస్మాకమ్ సమక్షమేవ సంభూతస్య కస్యచిత్ కృతార్థ జన్మనః ఆదర్శ మహాపురుషస్య జీవితగాథైవ అత్ర వర్ణితా ఇతి సర్వథా అయమ్ స్వీకార్యఏవ । "పురాణమిత్యేవ న సాధు సర్వం న చాపి కావ్యమ్ నవ మిత్యవద్యమ్" ఇతివదతా మహాకవినా కాళిదాసే నాపి ఏష ఏవ విషయః స్పష్టీకృతః । అనేక కవినాపురాతనానామ్ చిరస్మరణీయానామ్ పెద్దనాది కవీంద్రాణామ్ ఫణితిమన్వ స్మృత్యైవ అస్మిన్ కావ్యే ప్రకరణాది విభాగః కృతః । ఏవమేవ అస్మాకమ్ ప్రాచీన సాహిత్యా చార్యైః మహా కావ్యేషుయాని లక్షణాని ఆవశ్యకాని కథితాని తేషామ్ మధ్యే నగర, సాగర, యుద్ధ, ఋతు, చంద్రోదయాదీనామ్ వర్ణనమ్ అస్మిన్ కావ్యే అతి రమణీయతయా దర్శితమ్ । మద్రపురీ వర్ణనావసరే లిఖితమ్ ఏకైక మపి పద్యమ్ పునరుక్తి రహితమ్ నవవవభావ సంశోభితమ్ హృద్యంచ వర్తతే ।

నపి నేతిహాసాత్మకే అస్మిన్ కావ్యే కల్పితో అపి శ్రీరామస్య మాతుః లక్ష్మీ దేవ్యాః స్వప్న వృత్తాంతః సందర్భ శుద్ధ్యామ్ నితరామ్ సంశోభతే ।

ప్రథమ ప్రపంచ మహాసంగ్రామ సంబంధినామ్ వివిధవిషయాణామ్ సంగ్రహణే యథాక్రమమ్ తేషామ్ సంగ్రథనేచ కవినా అనల్పః ప్రయాసః కృతః ఇతి ప్రతిభాతి । ఇతోపి అధికతయా యుద్ధ సంబంధి విషయ వర్ణనావసరే శత్రునిర్ముక్త నానావిధ నవీనాయుధానామ్ నామకరణే తత్తత్కార్య వర్ణనే చకృతః పరిశ్రమః నాత్యంత సులభ ఇతి తద్వేదిన ఏవ జానంతి । కావ్యే సర్వత్ర తత్తద్రసోచిత శబ్దప్రయోగ వైదగ్ధ్యేన పూర్ణతయా వ్యాకరణ నియమపాలనేన భావావేశ సమృద్ధయా, ధారాశుద్ధి శోభితయా, మధుర శైల్యాచ అస్యకవేః రచనా సర్వథా ప్రాచీనానామ్ సుగ్రహీత నామధేయానామ్ మహాకవీనామ్ పంథానమ్ అను నృత్యైచలితా ఇతిమన్యే । ప్రసంగ వశేన కావ్యేత్రత్ర తత్ర సంఘటితాః పుత్ర ముద్దిశ్య నీతి బోధః శ్రీరామస్య బాల్యోచితా వినీతా రీతిః దైవగురు మాతృభక్తి ప్రబోధకాః సన్నివేశాశ్చ బాలానామ్ యూనామ్చ అత్యంత ఉపయుక్తాః మార్గదర్శకాశ్చ భవేయుః ఇతి మేమతః । సర్వవిదితస్యైకస్య చిత్ దాన వీరస్య పురుషస్య చరిత ముదాహృత్య సత్యదూరామ్ కల్పనామ్ కృతవతః కవేః వారం వారమ్ అనేకాః క్లిష్ట సమస్యాః సమ్ముఖీ భవన్తి । తథాపి అస్మిన్ కావ్యేయథాశక్తి నైసర్గికతాయాః పరిరక్షణే పదేపదే కవినా అత్యంత సావధానేనపదమ్ ప్రక్షిప్తమితి వక్తుం శక్యతే । సీతారామయోః కళ్యాణావసగే హైందవానామ్, తత్రాపి విశేషతః ఆంధ్రాణామ్ శ్రుతి స్మృత్యాచార చోదితయోః నైదిక పరిపాఠయోః క్రమబద్ధతయా పరిపాలనేతత్తత్సామయికాచారాణామ్ సమ్యక్ వర్ణనేచ కవినా భారతీయ సభ్యతాయాః పరమ వైశిష్ట్యమ్ సునిరూపితమ్ । కావ్యే తత్ర తత్ర ద్రాక్షఫలరసే మధ్వివ సమ్మిళితాః గద్యభాగా అపి తత్త ద్విషయోచిత పదబంధ సంఘటితాః సువర్ణే సుగంధ ఇవ కావ్యశోభామ్ ద్విగుణీ కుర్వన్తి । వైజ్ఞానిక భౌగోళిక ఐతిహాసకాది వివిధ విషయ వర్ణనే కవినా కల్పితాన్యపి కతిచిత్ పదాని అకృత్రిమానీవ రత్నాని సహజ సుందరాణి శ్రవణ సుఖదాని చ దృశ్యంతే । ప్రాయశః సర్వే శబ్దాలంకారాః కతిచిత్ ప్రధానాః ఉపమా రూపకోత్ప్రేక్షార్థాంతర న్యాసాదయః అర్థాలంకారాశ్చ పరిమిత మాత్రయా తత్తస్థలోచిత్యేన ప్రయుక్తాః శోభామావహన్తః కావ్యలక్ష్మ్యాః నిసర్గ రామణీయకమ్ పోషయన్తి । మధ్యే మధ్యే ద్వాధి పద్యరచనా నైపుణ్యమ్

అస్య కవేః శ్లేషాలంకార ప్రియతామ్ సంస్కృత వాఙ్మయే కృతి భూరి పరిశ్రమతామ్ చ విశదయతి ।

ఏతాదృశ గుణగణ విశిష్ట కావ్యరచనా నిర్మాణ చణస్య అస్య సు కవేః కృతేః ప్రశంసామాత్రమపి యది వయమ్ న కుర్మః తర్హి అస్మాభిః ఆంధ్రభాషాయా ఏవ మహాన్ అపచారః కృతో భవతి । ఏతాదృశానామ్ అత్యంతోప యుక్తానామ్ కావ్యానామ్ ప్రచయితౄణామ్ ప్రోత్సాహనే ప్రభుత్వస్య సహృదయ పతితృజనానామ్ చ గుణజ్ఞ దేశస్య మహాన్ కర్తవ్యభారః విద్యతే ఇతి గృహ్ణంతు । గచ్ఛతా కాలేన భూయిష్ఠా తాదృశైః అపేక్షితః ఆదర్శ అవశ్యమ్ లభ్యేత ఇతి అభిలషామి ।

శుభమ్ భూయాత్

నంపల శేషగిరిశర్మా

విద్వాన్

# అబ్బరాజు సూర్యనారాయణ

ఈ గ్రంథకర్త ఆంధ్రలోకమునకుఁ జిరపరిచితులు. తన బాల్యము నుండి ఆంధ్రభాషావధూటి కేదియో యొక సొగసైన నగ క్రొత్తందనము చూపుచు జేసి పెట్టుచునే వచ్చుచున్నాఁడు. వయసు ప్రౌఢత కెక్కినది. పాండితి పరిణతి నందినది. స్థిరత్వముపై నాస జనించినది. వర్తమాన భవిష్యత్తుల కసిగందక సదా నూతనత్వము చెడక పసదనముగల నగ యేదియో యని యూహించి యూహించి చిక్కించుకొని నాఁ డాంధ్ర మహాభ్యుదయ మనుపేర నొక దివ్యాభరణము. ఆంధ్రమహాభ్యుదయమని పేరు పెట్టుటలోనే వీరి ఆంధ్రత్వము మహాభ్యుదయకాంక్ష వెల్లివిరిసినది. వన్నెలూరు రచన, చెన్నుమీఱు కథ, అన్నుకొన్న వెంకన్నపై భక్తి, ఎన్నికగొన్న పితరునిపై రక్తి యన్నన్న! యిఁక నీ యల్లికలో చెల్లని దేమి? కవి ఎంత గాదన్నను తన రచనలో నేదో యొక మూలన సందు చేసికొని యైన ప్రతిబింబింపక మానఁడు. కాని కవి యెక్కడ నెట్లు ద్యోతమగుచుండునో కనుంగొనుట యసాధ్యముగనే కన్పించును.

సీ॥ బహువిధ వర్ణన వ్యామోహితులు ప్రబం
ధమని రసికులు కావ్యమె యటంచు
లలిత కథా చతురులు పురాణం బని
యైతి హాసికు లితి హాసమనియు
చారిత్రశోధకుల్ చారిత్రమౌనని
నవలా వినోదులు నవల యనియు
నటనా విశారదుల్ నాటకం బౌనని
ద్వ్యర్థ్యభి మానులు ద్వ్యర్థి యనియు

లాక్షణిక శిఖామణు లిది లక్షణంపు
గ్రంథమనియును గొనియాడ రచనచేసి
నాడ వాంధ్రమహాభ్యుదయంబు ధన్యుఁ
డవిల బండ్ల సుబ్రహ్మణ్యకవివతంస.

సామాన్యముగా ఇప్పటి కవిత్వమును పూర్వకవిత్వమనియు, ఆధునిక కవిత్వ మనియు జెప్పుకొను నాచారము గలదు. సహజముగా 18 వ శతాబ్దమునకు పూర్వము వారిని సనాతనులనియు, తరువాతి వారిని అధునాతనులనియు ననుటగలదు. పూర్వులు వ్రాసిన కవిత్వము ననుకరించినఁ బూర్వ కవిత్వమనియు, నాధునిక కవిత్వము ననుకరించిన నాధునిక కవిత్వమనియు నేదో చెప్పుచుందురు. కవిత్వమునకు పురాతనత్వమును ఆధునికత్వమును ఎట్లు ముడిపెట్టవలయునో నాకు అర్థమగుట లేదు. పూర్వ రచిత గ్రంథములఁ జదువుకొని కవిత వ్రాయువారికి పూర్వచ్ఛాయలు లేక యుండవో నేటికాలమున జన్మించిన వారికి నాధునికచ్ఛాయ లేకయుండునో విచార్యము. నిజమునకు గవిత్వమునకు బురాతనత్వమనునది యొకటి గలదా? పురాతన కవులను వారి యంతట కవిత్వమొక తీరున నుండునా? నన్నయ కవిత్వమునకు తిక్కన కవిత్వమునకు భేదము లేదందురా? వారిర్వురి కవిత్వమునకు ఎఱ్ఱన కవిత్వమునకు మార్పు గన్పింపదా? కవిత్రయము వారికిని పెద్దనాదులకును గవిత్వమున సామ్యము గల్పింతురా? పింగళి సూరన రచన ఆ నాటికి నవ్యమా? ప్రాచీనమా? కవిత్వమునకు పురాతనత్వము ఆధునికత్వము అనునది లేదు. ఎప్పటికప్పుడు నవనవోన్మేషముగనే యుండును. అయినను ఆ శతాబ్దమునాటి ప్రజల యభిరుచినిబట్టి ఆనాటి కవుల కవిత్వము ప్రత్యేకత వహించి యుండవచ్చును. ఆ ప్రత్యేకత యీనాటి ప్రజలలోనే కొందఱికైనను సమ్మతమగునేని ఆ ఛాయ గొంత కాన్పింపవచ్చును. అంత మాత్రముననే అది యీనాటికిఁ బనికిరాని పూర్వకవిత్వమనుట అసమంజసమగును. ఈ రచన ఈనాటి ప్రజల యభిరుచినిబట్టి యభ్యుదయ కారకమైయున్నదా? లేదా? యనునది గ్రహింపదగిన విషయము. వ్యాకరణ సమ్మతమైనదియు, వృత్త జాతి లక్షణములతోఁ గూడియున్నదియుఁ బూర్వకవిత్వమనియు ఈనాటికి నుపయోగమైనదనియు నందుమా? అట్లైన గడియారమువారు, తుమ్మల వారు, విశ్వనాథవారు అనుపయోగులై పోవుదురు. ఈ రచన ఈనాటి ప్రజానీకమున కెంతవఱకు నుపయోగించును? భావి ప్రజల యభ్యుదయ పరంపరాభివృద్ధి కెంతవఱకుఁ దోడ్పడును? అను నదియే చూడవలసినది. అందు ఈ ఆంధ్ర మహాభ్యుదయ మేమాత్రము దీసిపోదు. కవి ఇందు శిల్పకారుఁడు. తన ప్రతిభా విశేషమునంతయు నిందుఁ బ్రదర్శించెను. పూర్వ కవులపై నితనికిఁ గల భక్తి శ్రద్ధలు మెండు. వారి నందఱను సమానదృష్టితో నారాధించి వారిలోఁగల రచనా వైవిధ్యమును జక్కగా నవగాహనము

చేసికొనినాడు. వారి వారి గొప్పదనమును దన కవితయందుఁ జూపవలయు నని వీరికిఁ గోరిక. వీరి సుకవిస్తుతి యన్యాప దేశముగా వీరి కవిత్వమును గూర్చియే తెల్పెను. సూరనకువలె నిది శపథ మనుకొని యెంతవఱకు సాధించునో యీ క్రింది పద్యములు తెల్పఁగలవు.

నన్నయోత్పలమాల : 42, 44, 80, 82 ప.
తిక్కనకందము : 55, 259, 269, 340, 408, 527 ప.
ఎఱ్ఱనగీతము : 131, 312,
శ్రీనాథునిసీసము : 155 ప.
సోమనాథుద్విపద : 8.
పెద్దన మత్తేభము : 93, 94, 222 ప.
రాయలపల్కు : 176, 262.
మూర్తి శార్దూలము : 448, 558.
రఘునాథునడక : 98, 100, 290, 381.
నన్నెచోడుపదాలతెన్ను : 520.
వేమన యాటవెలఁది ; 286, 422, 425.
పోతన యన్నింటిపోత : 74, 352, 390.
చెమకూరన్నపాకము : 83.
సూరన కల్పనాశుద్ధి : 16.

విలాసముగ నివి చూపించె నేగాని యిందును నూతనత్వము కాన్పింపక పోదు. ప్రపంచమున ఇందఱు మానవు లుండి రే! ఒకరి నడకకు మఱి యొకరి నడకకు భేదముండి తీఱును. ఒకరి స్వరమునకు మరియొకరి స్వరము నకు వ్యత్యాసముండియే తీఱును. అట్లే ఒకరి కవిత్వము పోకడకు మఱి యొకరి కవిత్వము పోకడకు భిన్నత కాన్పింపక పోదు. ఇది యది యనుట పొసగని మాట. పూర్వపుఁ బోకడ లట్లుంచుదము. నేటి పోకడలు లేవందుమా ?

143, 278, 296, 298, 469, 476—ఇట్టి వెన్నియో చూపనగును.

ఈ కవికి అర్థాంతరన్యాసాలంకారమందు మమకార మెక్కువ. ఎక్కడఁ జూచినన వి కుప్పతిప్పలుగాఁ గన్పించుచున్నవి. అంతియేగాదు. నేటి వ్యవహారములోనున్న లోకోక్తులను తనకు మనోగోచరమైన వాని నన్నిటిని సరియగు తావునఁ బొదిగి వదలినాడు. ఇన్ని వ్యవహార లోకోక్తు లకుఁ బ్రయోగ సాఫల్యము గల్గించిన ఈ కవియం దాధునిక రచనకుఁ

గాఁ అంత యేమిగలదు? అన్యదేశముల వాడుకలో నీ కవి [illegible] చూపినాడు. వర్ణనలయందును నీ కవిది సర్వోత్కృష్ట ఫక్కి —64, 65, 173, 174, 183, 184, 196, 199, 200, 211, 216, 220, 237, 239, 246, 261, 269, 276, 278, 284, 288, 296, 298, 300, 306, 316, 338, 344, 355, 357, 364, 371, 386, 392, 393, 405, 407, 416, 417, 420, 421, 422, 424, 425, 426, 429, 444, 469, 474, 482, 486, 493, 494, 496, 498, 500, 516, 519, 520, 561.

నేటి కాలమునఁ బ్రజానీకాభిరుచులెట్లున్నవి? ఆచార వ్యవహారము లెట్లున్నవి? యున్న దున్నట్లు గ్రంథస్థము చేయుటయే యీ కవి ముఖ్యాశయము. అట్లే కథనంతయు నడిపినాఁడు. భావి కవులీ గ్రంథము పఠింతురేని ఈ కాలమునాటి సర్వవిషయములు సుబోధకము లగును. మద్రాసు పురీవర్ణనము, శ్రీరాములుగారి జననము, విద్యాభ్యాసము, ఉద్యోగ విచారము, హితబోధ, బొంబాయి వర్ణనము, (నేటి బొంబాయి కన్నులకుఁ గట్టును.) సీతారాముల కళ్యాణము, ధర్మబోధ (నేటి భాగవతానుసారి యనుసరింపవలసిన విధానమంతయు నిందుఁగలదు) మొదలగునవి యిందులకు నిదర్శనములు.

పూర్వగ్రంథముల నెక్కుంట యుద్ధవర్ణనముగలదు. అవి యానాటి యుద్ధములు. కత్తులు, కటారులు, బాణములు వర్ణితములు. నేటి బాంబుల యుద్ధమింత యున్న దున్నట్లు వర్ణించి యే గ్రంథమునను లేదు. విజ్ఞాన శాస్త్రము క్షణక్షణమునకు వృద్ధియగుచు నూత్నవినూత్న మారణ యంత్రములు పుట్టుకొనుచు వచ్చుచున్న కాలప్రవాహ మిప్పటికెట్లు ప్రవహించునో తెలియదు. ఎప్పటి కప్పుడు వెల్వడు గ్రంథముల నిట్టి వర్ణనము లుండునేని భావిపౌరులకు అదెంతయో విషయ విజ్ఞాన బోధకము గాఁగలదు. యుద్ధ వర్ణనలో ఈ కవిశేఖరుని ప్రతిభ వర్ణనాతీతము. విషయమునకు దగిన పదములు పదములకు దగిన భావములు భావములకుఁ దగిన రసము రసము ననుసరించి శయ్యారీతులు అతిమనోహరములు. ఎద్దిను రచన ఎద్దిను రచనయే.

ఈ కవి వేయునుపమానము—లుబుసుపోకకు వేసినవిగావు. అత్యంత భావగర్భితములు. దిఙ్మాత్రముగ నొకటి రెండుదాహరణము లిత్తును.

తే॥ ఈశాన దేశమునకు వాయువ్యమూలన
[illegible]వేలమైళ్ళ దూరమందు

గలవు తెల్లదొరల నిలయముల్ దీవులు
పుడమిపడతి జడను పూలువోలె.

ఉత్తమ నగరమును భూదేవి హారనాయకమణిగా వర్ణించుట పూర్వాచారము. దీవులుగాన బహువచనము బాధించి నాయకమణి యన లేదందుమా? హారములోని మేల్మి రతనము లనవచ్చునుగదా!

జడను పూలు అనుచున్నాఁడు. జడశిరస్సుపై నుండునదికాదు. మెడయందుండు నదియుగాదు. మెడనుండి పిఱుదలవరకు వ్యాపించు కేశపాశము. మణులు గౌరవాంగమైన వక్షస్స్థలమునందుండును. జడపృష్ఠభాగమున నుండును. దీనినిబట్టి యా దేశములు భారతదేశమునకు సంస్కృతిన వెనుకబడియున్నవని చెప్పవచ్చును. "భూషితకేశపాశములు భూషలుగావు" అన్నట్లు నిమిత్తమాత్రోపమానమే యగును. హారనాయకమణియన మిగిలినవి మణులు. ఆ మణులలో నిది పెద్దమణి యగును. ఇక్కడ నది కుదురదు. ఈ కుసుమములు కేశపాశమునకు సర్వవ్యాప్తములా? ఏకదేశవ్యాప్తములా? ఎట్లైనను ఈ యుపమానము విదేశములకు చక్కగా అతికిపోవుచున్నవి. తెల్లదొరలుగాన తెల్లపూలతోఁ బోలికరంగునకు సరిపోవును. నేటి కాలమున స్త్రీలు యొక్క అందమునకు పూలు ధరించుచున్నారు గాని వాసన కొఱకుగాదు. అందువలన తెల్లదొరలు పై యాడంబరపరులని స్పష్టమగుచున్నది. పూలు చేయి దగిలిన కందిపోవును. తగులకున్నను కొద్దిగంటలు మాత్రమే దాని వైభవము. అట్లే విదేశముల సంస్కృతి నిలుచునదిగాదు. మారణయంత్ర నిర్మాణ మూలమున స్వవినాశమే తెచ్చుకొనును. కొన్ని పూలక్రిఁద ముండ్లుండును. పాశ్చాత్యుల వాక్కులు అతికోమలములు, హృదయము లంత కోమలములు గావు. భారతీయులందిది విపరీతము. ఎంత భావస్ఫూర్తితో ఈ యుపమానమును కవి గ్రహించినాఁడో ఆశ్చర్యము కలిగించును. నరసింహులుసెట్టి సతీమణి సుబ్బమ్మతో

"మాదృశులమాట మాటగా మదిఁ దలంచి
చెవి యొసంగు ముదమ్మునఁ జేరి కోరి
జన్మసిద్ధము వాని ప్రశాంత గుణము
రావణుఁడు గాడు పొట్టి శ్రీరాముఁ డెపుడు."

అని కూతు వివాహసందర్భమున పల్కును. 'అనును' అని పోల్చుట సహజము 'కాదు' అని పోల్చుట నూతనము. ఒకని సౌందర్యమును

వర్ణించునపుడు "అతడు నలకూబరునివలె అందగాఁడు" అందముగాని కుబేరునివలె కుష్ఠురోగికాడు అనముకదా! అట్టిచో కవి యిట్లు వ్రాయుటలో సొగసేమి? ఈ కాలమున భార్యా విషయమున భర్తలు రావణునివలె మెలగువారు బహుళముగా నుండిరని కవి యుద్దేశమై యుండవచ్చు. "అత్యాదరాత్ హానిశంకా" అన్నట్లు మంచికన్నఁ చెడు నూహించుట ప్రేమలక్షణము. రావణ శబ్దమునకు స్వభావమునుబట్టి పరదారాపేక్ష వ్యుత్పత్తినిబట్టి కేకలు బొబ్బలు పెట్టుట అని అర్థములు చెప్పవగును. దీనిం బట్టి శ్రీరాముఁడు ఏకపత్నీవ్రతుఁడు, కోపికాడు అని తెలియుచున్నది. ఈ రెండు గుణములే ముఖ్యముగా పురుషునకు గావలెనని స్త్రీకోరును. ఈ భావమునే కవి పై మూడుచరణములం దిమిడ్చినాడు. 'మూర్ఖుల మాట మాటగా' అనుటచేత నరసింహులుపెట్టి యుద్దేశమున మాట మాట యెప్పుడగును? కూఁతుఁ ప్రేమార గారవించునపుడుగదా! ఏకపత్నీవ్రతత్వ భావమందిమిడియేయున్నది. "ప్రశాంత గుణము" అనుటచే రజోగుణము త్రోసివేయఁబడినది పైగా శ్రీరాములు అనక 'శ్రీరాముఁడు' 'అనుటచేత దశరథరాముని గుణము శ్రీరాములయందారోపింపఁబడినది. 'రామోవా రావణోవా' అని కదా ప్రతీతి. ఇంత కట్టుబాటుకైత నల్లుటలో ఈ కవి ప్రజ్ఞాధురీణత అనంతము. సంధ్యాది వర్ణనములోని "అపరాబ్ధి శయ్య" (ప. 273) అను పద్యము నిజముగా రాగనవసుధారసమును చిందుచునే యున్నది, కవిత కంతకు సాంప్రాణివత్తుల వాసన గుబాళింపఁ జేయుచున్నది.

దిఙ్మాత్రముగ రెండు మూడు చూపించితిగాని యిట్లు వ్రాయఁ దలఁచిన వదలఁదగిన పద్యమొక్కటియైన నుండదు. ప్రతిపద్యమున శిల్పమో భావశబలతయో శైలీమాధుర్యమో కనబడుచునే వచ్చెను. కవి తన కవితా వైచిత్రిని ప్రాసునందుఁ దూఁచెనా? మనసునందుఁ దూఁచెనా? చదువరులఁ దూఁచుకొనుమనెనా?

కవి యుపాధ్యాయుఁడు పాలికుఁడు, వస్త్రకారకుఁడు పాఠశాలా విద్యాబోధ విజ్ఞానయాత్రాదులు 286, 392, 405 పద్యములు గమనింప నగును. కవి 425 పద్యమున సాక్షాత్తుగా ప్రతిబింబించుచున్నాఁడు. అచ్చ తెనుఁగు పదములయందును సామెతల యందును ఈ కవికి అత్యంతప్రీతి కొన్ని పద్యములే అచ్చ తెనుఁగున నడిపినాడు.

నుడి, ఉసులు, బీతు, గబ్బు, ఈడ్చికొట్టు, పొడి గప్పిన చేదుమాత్ర, మేకులు, మెంకులు, పిర్యాదులు, తెక్కలాడు, సేపు, హాయి, పెరుగుకూటి

మూాట, జీడిమామిడి (కవి గ్రామమునం దివి ప్రసిద్ధములు) కుడుము, కంచు గంట, చేతికి నోటికి నెగ్గులేదు. మనువు, మల్లెలు, కనకాంబరములు (ఇవియు కవిగ్రామమున బ్రసిద్ధములు) ఆకె, గొండ్లిసల్పు, మగపెండిలి, మప్పితము, బూచి మొదలగునవి.

కవి విశ్వసించునో లేదో గాని ఆయన యుపాధ్యాయ వృత్తియే యిందలి విషయ విశదీకరణమునకుఁ బూర్తిగాఁ దోడ్పడినదని నేను విశ్వసింతును.

ఈ విద్వత్కవి వ్యాకరణమును గడితొలఁగు వాఁడుకాఁడు కాని జీవద్భాషాకావ్య తత్త్వము నెవరు దాటిపోఁగలరు. ''తెక్కలు గట్టుక'' (ప్రబోధగీతము) ఆధునిక ప్రయోగ ప్రాచుర్యమందిన సాధువు. ''వ్రాతెట్టులు'' (494 ప॥) ప్రయోగ మూర్గ్గమెఱిగి శ్రుతి సుఖమును కాశించుచు నాయీ చోటులను ద్విత్వసంధికి బ్రకృత్య ప్రవృత్తి వైకల్పికత్వముల ననుమానింపవలెనను నంశము బహుళ గ్రహణముచే సూచితము.

''సమరభీష్మునట్లు'' (181) ఎంతయో భావవైశద్యము గల్గియున్నది. చూలాలివర్ణన మెంతసుకుమారముగఁ దెల్పెనో చూడుఁడు.

కం॥ పుల్లని ఫలముల నుల్లం
బుల్లాసముఁ జూసెనాపె కోపికసడలెన్
మెల్లని నడ చల్లని నుడి
యల్లల్లన నొడలు వెల్లనగుటయుఁ దోఁచెన్.

నిజము నిజము ఈ కవి శిఖామణి కవితయందలి మెల్లనినడ, చల్లని నుడి, యల్లల్లన మనసు వెల్లనగునట్లు చేయును.

వ్యవధిచాలమి నింతటితో ముగింతును. రానున్న భాగములందును కవి నా కనకాశము కల్పించునేని పరిశిష్యముల వెలిపఱుప యత్నింతును.

మిగిలిన భాగములను త్వరలో వెల్లడింపఁగల యవకాశమును శక్తిని ఆయురారోగ్యములను సర్వేశ్వరుడీ కవి పుంగవునకుఁ బ్రసాదించు గాక.

అబ్బరాజు సూర్యనారాయణ

అభిప్రాయము

## శ్రీ వాత్సవ

మహాకావ్యములకు వస్తువులు మహావీరుల చరిత్రలు. ఆంధ్ర రాష్ట్ర సంపాదనకొఱకు ప్రాయోపవేశముచేసి తన యసువు లర్పించిన మహావీరునిఁ బొట్టి శ్రీరాముల త్యాగము ఒక మహాకవిని ఉత్తేజకునిచేసి వారిచేత చంపూకావ్యము రచింపచేసినది. ఆధునికాంధ్ర సాహిత్యములో ఇట్టి ప్రయత్న మపూర్వము. వస్తువన్ననో సమకాలీన సంఘటనము; శైలియన్ననో ప్రాచీన పురాణేతిహాస రచనా బంధురమైన చంపూపద్ధతి. ఈ రీతిగా ఆంధ్ర మహావీరుఁడైన శ్రీరాముల జీవితగాథను విద్వాన్ బండ్ల సుబ్రహ్మణ్యకవి వీరరస ప్రధానమైన మహాకావ్యముగా మలచుకొన్నారు. నాయకుఁడు ధీరోదాత్తుఁడు; వీరుడు, ధీరుఁడు అవికత్థనుఁడు. అట్టి యమరజీవి మహాత్ముని త్యాగమహిమ కీర్తించుటకు కలమందుకొని యీ కవి రచించుటకు పూను కొన్నాఁడు. ఈయన తెలిపినట్లు ఆ యమరజీవి ప్రాయోపవేశ సమయమున ప్రత్యక్షముగా కనుగొన్న అస్మదాదులకు ఈ వర్ణనము కన్నులకు కట్టి నట్లుగా నున్నది. నిజముగా అట్లే తోచినది.

ఉ॥ ఒక్కొక రెప్పపాటునకు ఒక్కొక నెత్తురుబొట్టు తగ్గఁగా
చిక్కెను నీదు దేహము కృశించెను జీవకళావిభూతి యు
క్కెక్కెను గాని దీక్షసడలింపవు నీ క్రమశిక్ష యెట్టిదో
దక్కెనదోయి రాష్ట్రఫలదానము నీ రతనాల చేతికే.

ఈ కథావస్తువును నవరసాత్మకముగా చేయుటకని ప్రబంధశైలిలో విస్తరింపఁజేసి-సీతారాముల కళ్యాణము దనుక ఈ పుస్తకమును గుస్తరింపఁ జేసినారు. ఈ ఘట్టములో ద్వ్యర్థి కావ్యధ్వని పొడగట్టుచున్నది.

ఈ కవి దేశభక్తితో వీర పూజాసక్తితో రచియించిన యీ వీర కావ్యము కవితాభిమానులచే మఱల మఱల చదివించగల విన్నాణము సంతరించుకొన్నది. ఆధునికాంధ్ర సాహిత్యసరస్వతి కిది యొక అపూర్వ కావ్యాలంకారము.

—శ్రీవాత్సవ

# ఆంధ్ర మహాభ్యుదయము

## అడుసుమల్లి శ్రీనివాసరావు పంతులుగారు

సారస్వత నికేతన గౌరవ కార్యదర్శి, వేటపాలెము

చేనేత పరిశ్రమకు ప్రసిద్ధివడసిన వేటపాలెము పట్టణమున పేరెన్నిక గన్న బండ్లవారి వంశమున సదాచార సంస్కృతితో, వినయగుణసంపదతో, సౌజన్య సచ్ఛీలములతో, దైవచింతనగలిగి సామాన్యజీవితము గడపుచున్న యొక పారిశ్రామిక కుటుంబమున జన్మించి స్వయంకృషిచే సాహిత్య లోకమున నత్యుత్తమస్థాయి నందుకొన్న విద్వాన్ శ్రీ బండ్ల సుబ్రహ్మణ్య కవిగారిని నలుబది సంవత్సరముల నుండి నే నెఱుంగుదును.

చిన్నప్పటినుండియే సాహిత్యోపాసకుఁడై సరస పద్య గద్య రచనలచే నందఱ నానందాబ్ధి నోలలాడించెడివాడు. విద్యార్థి దశయందే సారస్వత నికేతనమువారి పోటీలయందు పాల్గొనుచు ప్రథమస్థానమలంకరించుచు సువర్ణపతకములు పొందుచుండెడివాడు.

సుమారు ముప్పదిసంవత్సరములనాడు మద్రాసులోగల యొకానొక సంస్థ కందపద్యము చివరిచరణ మిచ్చి పైమూడు చరణములు రామాయణ భారతార్థములు రెండు సమానముగ వచ్చునట్లు పూరించినవారికి బహు మతు లొసంగఁబడునని ప్రకటింపఁగా దానిం బూరించి ప్రథమ పారి తోషికము వడసె.

ఈ కవి బాల్యదశనుండియు కళారాధకుడుగూడ. నాటకకళయం దభిరుచిమెండు. శ్రావ్యమగు కంఠధ్వని. చతురవాఙ్నిపుణుఁడు. వీరి యుపన్యాసము బహుముఖ ప్రజ్ఞాశోభితము. అనేక నాటకములందు ప్రధాన భూమికల ధరించి రంగస్థలమున పాత్రోచితముగ రసవత్తరముగ నటించి ప్రేక్షకుల మన్నన లందుకొన్నదిట్ట. ద్రౌపదీవస్త్రాపహరణమున దుర్యోధన పాత్రయు, ఖిల్జీరాజ్యపతనమున అల్లాయుద్దీన్ పాత్రయు ధరించి యత్యద్భుత ముగ నటించిన నటరత్నము.

తా రచించిన ప్రహ్లాద కుమారవిజయ బుద్ధావతారాది నాటకములు వారి గృహప్రాంగణమునందే పెక్కు సంవత్సరముల నుండి రిహార్సల్సు జరుగుచుంట వారి నిలయము లలిత కళానిలయమనందగు. మా ప్రాంతమున

తొలుదొల్త విద్వాన్ పరీక్షయందుత్తీర్ణుడైన మనీషి యీయనయే. నటరాజ నాట్యమండలీత్యాదినాటక సమాజములు స్థాపించి యువకా[illegible]ములు కల్పించి యనేక ప్రదర్శనములు జరిపించుచున్న కళాభిమాని.

చేనేత వస్త్రముల వ్యాపారము జరుపుచున్న యీ కవిని ప్రోత్సహించి యుపాధ్యాయవృత్తికి మరల్చితిమి. నాటి నుండియు వారి కావ్యకుసుమములు నలుదెసల వ్యాపించుట. వీరి తొలిముద్రితరచన [illegible]. ఈ గ్రంథము ది 6-2-1949 వేటపాలెమునందు జరిగిన [illegible] వయోజన విద్యామహాసభయందు సుప్రసిద్ధాంధ్రనాయకులు విద్యావేత్తలు నైన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు పంతులుగారిచే ఆవిష్కరింపబడినది. ఆ సమావేశమున పాల్గొన్న విద్యావేత్తలందరును ఈ రచనలోని అందచందములను జూచి కవి ననేకవిధముల ప్రస్తుతించిరి.

ఈ కవి కడుంగడు దేశాభిమాని. జాతీయాభిమానము మెండు. ఆంధ్రరాష్ట్రసిద్ధికై ఆత్మార్పణ మొనర్చిన పొట్టి శ్రీరాముల నిర్యాణవార్త వినినంతనే ''రాలిన దొక్కచుక్క'' అను పద్య మప్రయత్నముగా నిక్కవి నోట వెలువడుటకు దేశభక్తియే ముఖ్యకారణము. సద్గుణమును గౌరవింపవలయునని యీతని సంకల్పము. కవి స్థిర సంకల్పుడు. కార్యదీక్ష మెండు. ఆదాయమల్పము. ఆశయము గొప్పది. ఆంధ్రలోక మెట్లాదరించునో వేచిచూతుముగాక!

అడుసుమల్లి శ్రీనివాసరావు

సారస్వతనికేతన గౌరవ కార్యదర్శి.

కర్త రాజశేష గిరిరావ్, యమ్.ఎ. (హిందీ) యమ్.ఎ. (సంస్కృత్) సాహిత్యరత్న
అధ్యక్ష, హిందీ విభాగ్
ఆంధ్ర లయోలా కాలేజీ, విజయవాడా-8.

# ప్రస్తుతి

ఆధునిక్ ఆంధ్ర కవియోం మేం శ్రీ బండ్ల సుబ్రహ్మణ్యమ్ కా విశిష్ట స్థాన్ హై। ఆప్ బండ్ల బాపయ్యా హిందూ ఉచ్చ మాధ్యమిక విద్యాలయ్ మేం తెలుగు పండిత్ హైం। మద్రాసి విశ్వ-విద్యాలయ్ కే ఆప్ 'విద్వాన్' ఉపాధిధారీ భీ హైం। శ్రీ సుబ్రహ్మణ్యమ్ కవి, పండిత ఎవం నాటక్ కార్ హైం। ఉత్తమ కవి హోనే కే సాథ్ సాథ్ ఆప్ సుప్రసిద్ధ నాటక్ కార్ భీ హైం। ఆప్ కా సర్వప్రథమ ప్రకాశిత నాటక్ 'ప్రహ్లాద్' హై। బుద్ధావతార్(ము), తులసీదాస్, కుమార విజయ(ము) ఆప్ కే అన్య ప్రసిద్ధ నాటక్ హైం। జో ప్రాచీన నాట్య-శాస్త్ర కే నియమోం కే అనుకూల్ లిఖే గయే హైం। విశ్వేశ్వర శతక(ము) కవి కీ ప్రథమ కృతి హై। 'వేమనా' లోక నాయక్ ఎవం నిర్గుణ సంత్ వేమనా కీ కావ్య-ప్రతిభా ఎవం జీవనీ కే ఆధార్ పర్ విరచిత ఖండ-కావ్య హై। శ్రీ సుబ్రహ్మణ్యమ్ కా నవనీతమ్ కావ్య ఆంధ్రాభ్యుదయ(ము), ఆంధ్ర-కావ్య సంసార్ కే లియే అభిమాన్ కీ వస్తు హై। ఆప్ నే యోం ముక్తక్ ఎవం ప్రబంధ దోనోం ప్రకార్ కీ శైలియోం మేం రచనాయేం కీ హైం। 'కళాశ్రీ' మేం అనేక కావ్య-కృతియోం కా సంకలన్-మాత్ర హై। ప్రబంధ-శైలీ కే అంతర్గత్ ఆంధ్రాభ్యుదయ(ము) ఆది ఆతే హైం। ఆప్ కే ఆత్మ కావ్య-సంగ్రహ ముక్తక్-శైలీ మేం ఆతే హైం।

'ఆంధ్రమహాభ్యుదయ(ము)' మేం స్వర్గీయ పొట్టి శ్రీరాములు కీ సంపూర్ణ జీవనీ కా సంకలన్ కియా గయా హై। ప్రకాశిత పుస్తక్ ఉస్ కా ప్రథమ ఖండ మాత్ర హై। ఇస్ మేం శ్రీరాములు నాయక్ ముఖ్య హై ఔర్ ఇన్హీం కా ఆఖ్యాన్ ముఖ్య హై। యద్యపి భారత్ కే ప్రముఖ ప్రసంగోం కా సమావేశ్ హోగయా హై। యోం ఇస్ కా కథా-వికాస సుస్పష్ట ఎవం సుసంబద్ధ హై। ఇస్ మేం భారత్ కీ విభిన్న సమస్యాఓం కా సారాంశ లేకర్ శ్రీరాములు కీ కథా కే సాథ్ సుందర రూప్ సమాహిత కియా గయా హై। ఔర్ సాథ్ హీ శ్రీరాములు కా మహాన్

వ్యక్తిత్వ భీ కావ్య మేం ప్రతిష్ఠిత్ కియా గయా హై। ఇస మేం ఆధునిక యుగ్ కే సంపూర్ణ వాతావరణ్ కే బీచ్ శ్రీరాములు కే చరిత్ర కా వికాస గ్రంథ కో మహాకావ్య కే అనురూప్ సౌష్ఠవ ప్రదాన్ కరతా హై।

ఇస్ కావ్య కే నిర్మాణ్ మేం శ్రీరాములు కీ జీవనీ కే అతిరిక్త అన్య విషయోం సే భీ సామగ్రీ గ్రహణ్ కీ గయీ హై। ఐసా ప్రతీత్ హోతా హై కి భారతీయ జీవన్ ఔర్ ఉస్ కీ సర్వశ్రేష్ఠ సాంస్కృతిక్ పరంపరా కో విశుద్ధ భారతీయ స్వరూప్ మేం ఉపస్థిత్ కరనే కే లియే ఇస కావ్య కా నిర్మాణ్ కియా గయా హై। రామాయణ్ భారతీయ జీవన్ ఎవం సంస్కృతి కా ఆకర-గ్రంథ్ హై। 'ఆంధ్రాభ్యుదయ(ము)' మేం కవి శ్రీరాములు కీ జీవనీకీ-ఉస సంపూర్ణ-జీవన్ పరంపరా కా అపనే కావ్య మేం ప్రత్యక్ష కరనా చాహ్‌తే హైం। జాన్ పడ్‌తా హై కి భాషావార్ ప్రాంత నిర్మాణ్ ఆందోళన్ కో శ్రీ సుబ్రహ్మణ్యమ్ నే కేవల్ రాజనీతిక పరతంత్రతా సే ముక్త హోనే కే లక్ష్య సే హీ నహీం అపనాయా, వరన్ శతాబ్దియోం కే మానసిక ఎవం సాంస్కృతిక దాసత్వ కా నిర్మూలన్ కరనే కీ దృష్టి సే ఉన్హోంనే భారతీయ జీవన్ కే సర్వతోముఖీ వికాస్ కో భీ దిఖానా చాహా హై జో భారతీయ ఇతిహాస్ కే పృష్ఠోం మేం అంకిత బిఖరా పడా హై। సంభవతః ఇసీ కారణ్ కవి నే ఇస్ కావ్య కీ రచనా మేం ప్రాచీన పరంపరా కే శాస్త్రానుమోదిత పద్ధతి కో హీ అపనాయా హై।

శ్రీరాములు కే జీవన్-చరిత్ర కే వర్ణన్ మేం కవి నే భారతీయ పారివారిక జీవన్ కే సుఖ్, సౌందర్య ఎవం పరిపూర్ణతా కో ప్రదర్శిత కియా హైం। శ్రీరాములు-జన్మ, శిక్షా-దీక్షా, లక్ష్మమ్మా కీ చింతా, హిత-బోధ్, సీతా-రామ-కళ్యాణ్ (వివాహ్), ధర్మ బోధ్ ఇస కావ్య కే ప్రధాన విషయ్ హైం। యోం మనోరమ వస్తు-విన్యాస్ ఎవం సామగ్రీ ఉపలబ్ధ హై। కవి నే సారే కావ్య కో చంపూ కే రూప్ మేం లిపి బద్ధ కియా హై। జిస నే కావ్య కీ ప్రబంధ-ధారా అక్షుణ్ణ రహీ హై। కవి నే అనేక ఛందోం కో అపనాయా హై అతఎవ కావ్య-ప్రవాహ్ మేం అధిక మనోరమతా ఆయీ హై। కహీం భీ కావ్య మే ఏకరూపతా ప్రకటిత నహీం హోతీ హై।

యోం ఆంధ్రాభ్యుదయ'ము' మేం ప్రథమ భాగ్ శ్రీరాములు కీ సంపూర్ణ జీవన-కథా కో సంకలిత కావ్య కా స్వరూప్ దియా గయా హై। ప్రథమ విశ్వ మహాయుద్ధ, విజ్ఞాన-వేత్తాఓం కే జీవనియోం కీ విశేషతా,

బంబఈ, మద్రాస్ పుర-వర్ణన్. ఇన్ సబ్ కా ఏక్ హీ జీవన్ ప్రసంగ మేం సమాహార్ కర్ నా ఔర్ జీవన్ కే ముఖ్య కథానక్ కో శ్రీరాములు కీ జీవన-కథా కే అంతర్గత మిలాకర్ దోనోం కే సంగ్రంథిత స్వరూప్ కా నిర్మాణ్ కర్ నా కవి కే అనుశీలన్, అనుసంధాన్ ఎవం కళాత్మక్ సామర్థ్య కా పరిచయ కర్ తా హై। ఇస్ కావ్య కే సంపూర్ణ నిర్మాణ్ మేం ఆంధ్ర జీవన స్వరూప్ ఎవం జీవన-దర్శన్ కో ప్రస్తుత కర్ నేకా ప్రయత్న ముఖ్యహై; పరంతు ఉస మేం ఏక్ నవీన సందేశ్ భీ హై। సంక్షేప్ మేం యహ్ నవీన్ సందేశ్ హై - ఏక్ భారతవ్యాపీ రాష్ట్రీయతా కా నిర్మాణ్। శ్రీరాములు రాష్ట్రీయతా కే ప్రతీక్ హైం, కవినే ఇస్ రాష్ట్రీయ ప్రణాలీ కా భీ నిర్దేశ్ కియా హై। కవినే మాతృ-దేవీ పూజా కే సాథ్ సాథ్ భారత్-మాతా కీ పూజా ఎవం గరిమా-మహిమా కా గుణ్ గాన్ భీ కియా హై। యోం ఇస్ కావ్య కా కావ్య-పక్ష భీ కమ్ పరి పుష్ట నహీం హై। పుస్తక్ మేం ఐతిహాసిక సంబంధీ అనేక నిర్దేశ్ హైం। భౌగోళిక స్థానోం కా మద్రాస్ బంబఈ ఆదికా వ్యాపక్ ఉల్లేఖ్ హై। నగరోం ఎవం సాంస్కృతిక కేంద్రోం కే నామోం కీ భర్ మార్ హై। కవి కో సన్ 1914 కాల్ కీ ఘటనాఓం ఎవం పరిస్థితియోం కే సంపూర్ణ వివరణోం సే పరిస్థితి అవగత్ హై। జిస్ కీ యహ్ బహుజ్ఞతా కావ్య కే లియే ఉపాదేయ హుయీ హై। కవినే యుద్ధ-నీతి ఔర్ యుద్ధ-కుశలతా కా విస్తార్-పూర్వ్ కే వర్ణన్ కియా హై। జిస్ సే హమేం ఆధునిక యుద్ధ విద్యా కా పరిచయ్ మిల్ తా హై। ఇస్ యుద్ధవర్ణన్ మే అస్త్ర-శస్త్ర కే అనేక నామోం ఔర్ ప్రయోగ్-విధియోం కా ఉల్లేఖ్ హై। కవి కీ ఏక్ అన్య విశేషతా యహ్ హై కి వహ్ యుద్ధ కే అవసర్ పర్ సంఘర్ష్ కో మనోవైజ్ఞానిక ఉత్తేజనా ప్రదాన్ కర్ తా హై జో కవికీ అపనీ సృష్టి హై। కహీం సే అనుకృత నహీం హై।

రచనా-శైలీ మేం పాండిత్య ఔర్ ప్రవాహ్ కా సుందర్ యోగ్ హై। ప్రయోగ్ కీ గయీ భాషాపర్ కవి కా అలగ్ అధికార్ హై। శబ్దోం కీ సార్థకతా కే సాథ్ కవినే వివేక్ కా ప్రయోగ్ కియా హై। సబ్ సే అధిక సౌందర్య కవి ద్వారా ప్రయుక్త ఛోటీ ఛోటీ ఉపమాఓం ఎవం ఉత్ప్రేక్షాఓం మేం దిఖాయీ దేతీ హై। అర్థాంతరన్యాస్ కవి కా ప్రియ అలంకార్ హై। లోకోక్తియోం కీ భర్ మార్ అధిక్ హై। సంక్షిప్తతా కే స్థాన్ పర్ విస్తార్ ఆప్ కీ శైలి కీ విశేషతా హై।

అస్తు, మైం ప్రస్తుత కావ్యకా సహర్ష స్వాగత్ కర్ తా హుం।

# కృతజ్ఞత

వ్యుత్పత్తి ప్రతిభా సంజనిత రసోచిత విస్ఫూర్జిత వ్యాకృతి సమన్విత శబ్ద స్వరూపయుత వ్యవస్థా స్థాపిత లోకోత్తర కావ్య సృష్టి యొక్క మహోత్కృష్ట కార్యమనుట యతిశయోక్తి కాదని తజ్జ్ఞమతము. తత్కర్తలు గీర్వాణ ప్రపంచమునఁ బ్రథమ కక్ష్యాగతులు. పురాపుణ్య పరిపాకంబునఁ వారి కది లభ్యమని కొందఱు సదవకాశ మాత్రోపలబ్ధమని మఱికొందఱు. నిర్ణయము ప్రజ్ఞా ప్రత్యయైక వేద్యము. సత్యార్థము. గమనింపక యలవోకగా మాటాడుట కొందఱ కలవాటు. యాథార్థ్యజ్ఞాన సముపార్జనమునకై గభీర భావాన్వేషణము కొందఱ కిష్టము. చివఱకు నిలుచునది ప్రశస్య విశ్వజనీన నిత్య సత్యస్వరూపము.

దిక్చక్రపుటంచులవఱకు గాలించినను, జలజహితుని జన్మప్రభృతి నేటిదనుక చరిత్ర గమనించినను విజయసాధనముగా నహింసా సిద్ధాంతము ప్రప్రథమమున నవలంబించినది భారతదేశమే. ఇది నగ్నసత్యము.

పౌరాణిక కథా విధానముంబట్టి పరమభాగవతోత్తముఁడుగాఁ బరిగణింపఁబడినవాఁడు ప్రహ్లాదుఁడు. అతని చరిత్రవలన మన కవగతమగునదేమన: హింసా సిద్ధాంతము నహింసా సిద్ధాంతముతోఁ గొన్ని యెడల జయింపవచ్చునను సూత్రము. పశుబలము, హింసావిధానము ప్రయోగించి పరుల నిజపాదాక్రాంతులుగాఁ జేసికొన సర్వశక్తులు వినియోగించినవాఁడు హిరణ్యకశిపుఁడు. జనకుఁడెంత హింసించినను దా మాత్రము శాంతశమదమాది సద్గుణరాశివీడక హింసకు అహింస, అసహనమునకు సహనము, క్రోధమునకు శాంతము, కామకర్మ యోగమునకు నిష్కామకర్మయోగము కనఁబఱచి తా నవలంబించిన, తా విశ్వసించిన నిర్వాణమార్గమున గమించుచు ఘోరరాక్షస గుణమగు హింసాసిద్ధాంతమునకు విచిత్ర పరాజయము గలిగించి యెట్టకేలకు భగవత్సాక్షాత్కారము నందఁగలిగిన నిత్యాహ్లాదుఁడు ప్రహ్లాదుఁడే.

అనంతర మా యహింసా సిద్ధాంత దివ్యజ్యోతినే పరమాధారముగాఁ దీసికొని తత్త్వపరిశోధనా పరుండై బుద్ధభగవానుఁడు సాక్షాద్విష్ణ్వవతార పూరుషుండని విశ్వవిఖ్యాతి వడసె. తదహింసాతత్త్వ విజ్ఞాన స్వాదుఫలరాశి నందుకొని యందిచ్చి యేసుక్రీస్తు మతస్థాపనాచార్యుడై యన్ని దెసల వన్నె

కెక్కెను. పదంపడి యహింసామాహాత్మ్య ముగ్గడించి మహాత్ముఁడు ప్రవక్త యయ్యె. అహింసా తత్త్వామృతము కుత్తుకబంటిగాఁ గ్రోలి తచ్ఛక్తిచే గాంధీజీ మాతృదాస్య శృంఖలా విచ్ఛేద మొనర్పఁ దచ్ఛిష్య శిరోరత్నమగు శ్రీరాములు స్వరాష్ట్రము సంపాదించి నిష్కళంక చరితార్థుఁడయ్యె.

పరోపకారార్థ మొకఁడు చర్మమిచ్చెను. ఒకఁడు రక్తమిచ్చెను. ఒకఁడు మాంస మిచ్చెను. ఒకఁడు శల్యమిచ్చెను. ప్రాణము లర్పించిన వారరుదు. కోటి రూప్యములు దానము చేసినను సదవకాశము లభించినఁ తిరిగి పదికోట్లు కా దిరువదికోట్లు సంపాదింపవచ్చును. కాని ప్రాణము పోయిన మరల వచ్చునది కాదు.

భగవత్సృష్టిలో నే పరమాణువైనను నిరర్థకమైనది లేదు. తదంశమైన దివ్యధీసముద్భూత కళాఖండము వ్యర్థము కాదు. కాఁజాలదు. విశ్వహితైషాగ్రగణ్యులగు విద్వత్కవివరేణ్యులు దుష్టశిష్టజనస్వభావానుభావములను రసాత్మకముగ సృష్టించి పఠితృలోకమునకు వైజ్ఞానికానందముఁ గూర్చుట పరిపాటి.

పూర్వకవీశ్వర వాక్ప్రయోగదక్షత కవి కుండవలసిన ముఖ్య లక్షణము. ఉక్తివైచిత్ర్య సమాశ్లిష్టోహాశాలిత సమగ్రముగా నుండి బహుముఖములుగా విరాజిల్లినప్పుడు కవితాలత యనంతపుష్ప సౌరభముల విరజిమ్మును. అది సహృదయ హృదయాహ్లాదకరమగుట యాశ్చర్యము కాదు.

నరుఁడు సృష్టి కలంకార ప్రాయుఁడు. అందు మహాత్ముఁడు శిరోరత్న తుల్యుఁడని గమనించి ''ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకమ్'' అను సూక్తిరత్నమవగతము చేసికొని ''విశ్వశ్రేయః కావ్యమ్'' అను వాక్యార్థము దానికి సమన్వయపఱచుకొని ''సత్యమ్, శివమ్, సుందరమ్'' అను పదార్థముల గుర్తించి దయాత్యాగ సహిత వీరము దివ్యతేజోమయమది మహాత్ములయందధికము; సాత్వికానంద సుషమా విరాజితమని యెఱింగి నైతిక శాంతియుత సత్యధర్మము లంతర్వాహినిగాఁ బ్రవహింపఁ జేయవలయునను దీక్షతో నేతకావ్యరచనకుఁ దడంకితి.

రామాయణ భారత భాగవతాది మహాగ్రంథము లుండనింకను గ్రంథోత్పత్తి కవసర మేమి?

యదాయదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్యతదాత్మానం సృజామ్యహమ్.

భగవద్గీత

అనుట ధర్మగ్లాని కలిగినపుడు భగవంతుఁడు మానవరూపమున నవతరించి లోకము నుద్ధరించును. భువనమున నప్పుడప్పు డనేకానూహ్య మార్గములలో ధర్మహాని కలుగుచుండును. దాని నెడనెడ నూత్న పథములలో జగముద్ధరించుటకు మహాపురుషులు జన్మింతురు. కావున, వినూతన గ్రంథోత్పత్తి కత్యవసరము గలుగుచున్నది. ఆ నూత్న గ్రంథపరిశీలనము సుధీవరుల ధర్మము. అగాధ కావ్య కలశాబ్ధ్యంతర్గత సతతద్యుతి కవితాభాన నవరత్నతతుల వెలికిదీసి మధ్యమ లోకమునకందిచ్చుట మల్లినాథసూరి వంటి మహావ్యాఖ్యాతలకు సులభసాధ్యము. అది పరిపక్వ పరిశీలనా ఫలితము.

సిద్ధాంత ముగ్గడించుట సులభతరమే కాని యాచరించుట యమిత కష్టము. దానం జేసియే మహాత్ములు ప్రతిశతాబ్దమున లభింపరు కావున, నొక నూతన విశిష్టలక్షణోపేతమగు మహాకావ్యము ప్రతి శతాబ్దమున జన్మింపదు.

"A good book is the best of friends
The same to day and for ever"

అని నొడివిన మార్టిన్ టుప్పరు మహాశయోక్తింబట్టియు త్తమోత్తముఁడైన సుహృత్తుకంటె సద్గ్రంథము మహోన్నతమైనదని, శాశ్వతమైనదని స్పష్టపడుచున్నది. మరియు

"A good book is like a flower in the garden of God'-
"A good book is like a walking shadow"

—*Shakespeare.*

"A good book is the precious life blood of a master spirit emblomed and treasured upon a purpose to a life beyond life."

—*Milton.*

"నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ||"

'జ్ఞానతుల్యపవిత్రవస్తువీ భువనమునం దేదియుఁ గనఁబడదు. అర్జునా! జ్ఞానానౌకారూఢుఁడవైనచో సంసారసాగరముఁ దరింపఁగలవని శ్రీకృష్ణ భగవానుఁడు నరున కుపదేశించెను. అట్టి జ్ఞానరత్నపేటికమైన సద్గ్రంథమీ లోకమునకుఁ గావలసిన ముఖ్యవస్తువులలో నొకటియనుట నిర్వివాదాంశము.

"Ignorance is the curse of God,
Knowledge the wings with which we fly to heaven"
—*Shakespeare.*

అర్జునునకు శ్రీకృష్ణుఁడు లభించినట్లు శ్రీరాములు గారికి మహాత్ముఁడు లభించినాఁడు. గురువునకుఁ దగిన శిష్యుఁడు-శిష్యునకుఁ దగిన గురువు.

సత్సంగత్వే నిస్సంగత్వమ్
నిస్సంగత్వే నిర్మోహత్వమ్
నిర్మోహత్వే నిశ్చలతత్త్వమ్
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః

అను శంకరాచార్యులవారి సూక్తి

"Keep good company and you shall be of the member" అను జార్జి హెర్బెర్టు అభిప్రాయము లిట సార్థకములైనవి.

"నాస్తి మేఘసమం తోయం నాస్తిచాత్మ సమంబలమ్" అని నుడివిన చాణక్య నీతిని లోతుగా గ్రహించినవాఁడు మహాత్ముఁడు. మహాత్ముఁ డాత్మబలముగలవాఁడు. శుశ్రూషచే నది సంపూర్ణముగ నలవరచుకొన్నవాఁడు శ్రీరాములు.

"కరత కరత అభ్యాసవశ జడమతి హోత సుజాన్"
"రసరీ ఆవత్ జాత తే శిలపర్ హోత్ నిశాన్"

"Practice makes man perfect"

"సాధనమునఁ బనులు సమకూడు ధరలోన"—వేమన ఇత్యాది సూక్తు లమరజీవి జీవితమున ఫలవంతములైనవి.

"ఓమ్ సుసారథిరశ్వానివ యన్మనుష్యా
న్నేనీయతేఽ భీషుభిర్వాజిన ఇవ
హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠత
న్మేమనః శివ సంకల్పమస్తు"

(యజుర్వేదము)

యను వేదోక్తి యంతరాత్మలోఁ బ్రతిధ్వనింప
"శరీర నిరపేక్షస్య దక్షస్య వ్యవసాయినః
బుద్ధి ప్రారబ్ధ కార్యస్య నాస్తి కించన దుష్కరమ్."

దేహబాధల నేమాత్రము లక్ష్యము చేయక యాత్మ విశ్వాస పూర్వకముగఁ గృషిగావించు వాని కసాధ్య కార్యము లేదని నిరూపించిన

మహానుభావుఁడు శ్రీరాములు. కావున నతని చరిత్ర పద్యరూపము దాల్చినది.

ఇది మహారాజాధిరాజుల కథాగ్రథనము కాదత్యద్భుత నవరసో చితాష్టాదశ వర్ణనాత్మక చిత్రవిచిత్ర ఫణితుల కవకాశము సుఖముగా నిచ్చి కావ్య సృష్టి కార్యక్రమమున దత్కర్తకుఁ గొంత హాయిగూర్చుటకు. ఇది యొక సామాన్య మానవుని జీవితగాథ. అయిన నసామాన్య త్యాగదీక్షా సమరాంగణమున నంతమొందిన వీరగాథ. రచన యనువాదము కాదు. అనుసరణము కాదు. సరిక్రొత్త సరకు. ఉపలభ్యాంశములు గూడ నొక్కఁ గ్రమము దక్కక దొరికినవి కావు. తెలిసినవారైనను నల్వురొక్క తెఱఁగున వక్కాణించు టరుదు. ఇట్టి విషయముల నెన్నింటినో సమన్వయము పఱచుకొని సత్యము దెసకు మొగసూపునట్లు రచన సాగించుట మత్సంకల్పము.

ఎవరిబిడ్డ వారికి ముద్దు. కావున, "కాకిబిడ్డ కాకికి ముద్దు - నెమలిబిడ్డ నెమలికి ముద్దు" అను సామెత గలిగె. సహజసౌందర్యముగల బిడ్డ యెవరి కైనను ముద్దు. అట్టి బిడ్డను ముద్దుగాఁ జూడఁజేని వాని సహజ దుష్ట స్వభావమున కదియొక ప్రబల దృష్టాంతము.

ఏతద్గ్రంథ రచనా సమయమున నాకుఁ గలిగిన దృఢ విశ్వాసము ప్రత్యయమను శీర్షికతో నిందుఁ బొందుపఱచితిని.

షడ్గుణైశ్వర్య సంపన్నుఁడును, బరమాత్మ స్వరూపుఁడునైన పర మేశ్వరునకుఁ దక్క సృష్టిలోఁ బరిపూర్ణత నిష్కళంకత మఱియెవనికిని లేదు. "Man is the meeting place of hell and heaven." "ఉర్విజనుల కెల్ల నుండు తప్పు" అనుటలోని భావము తెలిసికొని "అనంతరత్న ప్రభవస్య యస్య హిమం న సౌభాగ్య విలోపిజాతమ్ ఏకోహిదోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" అను కాళిదాసోక్తిలోని గంభీర భావము సమన్వయ పఱచుకొని యుత్తమ మధ్య మాధమ నిర్ణయము చేసికొన వచ్చును.

**A poet can be a good critic, but a critic may not become a good poet. A poet can become a good pandit, but a pandit cannot be a good poet. A genius can become a good critic, but a critic may not be a genius.** ఇది ప్రకృతి ధర్మము. ఇదియుఁ బరిపూర్ణత మృగ్యమనుటకే దోహద మొసఁగుచున్నది. ప్రలాపరహిత సుప్రలాపము శిరోధార్యము.

"నరత్నమన్విష్యతి మృగ్యతేహితత్" ఇది యొకనాటి మాట. దేశకాల పరిస్థితులు సాయంతనపు టింద్రచాపంబుంబలె క్షణక్షణము వివిధ దశాంతరములకు లోనగుచున్నవి. కాలమాహాత్మ్య మెట్టిదో బహుధా సుధీవరు లెఱింగినదే. సుమారు ముప్పదియైదు వర్షములనుండి నిరంతరము భాషాసేవ చేయుచున్నను సరియగు మార్గమున మానవ సహకారము నూటికిం దొంబదితొమ్మిది పాళ్ళు లభింపమి మౌనముగా లోకముపోకడఁ జూచుచు జగద్రక్షకుడైన భగవంతుఁ డొక్కఁడే శరణ్యుఁడని నమ్మి యస్మత్కృషి నిరుత్సాహము సూపక యున్నవాఁడ.. దానికిఁ గారకాణముగ నిష్పాడభి ప్రాయములు పంపిన విద్వత్కవీంద్ర బృందమునఁ బలువురు నన్నెఱుంగని వారే. నా గ్రంథము లామూలాగ్రముగఁ జదివినవారు కొలఁది మంది మాత్రము కలరు.

అట్లనుటలో సాహిత్యోపాసనాబలమున లక్షలు కోట్లు సంపాదించి రాజభోగము లనుభవింప వలయునని నా యాశయము కాదు. విశ్వ శ్రేయము కొఱకు- అనఁగా మానవజీవిత వికాసమునకై సుహృద్భావము, నీతి, చైతన్యము, ఆనందము వృద్ధిచేయుటకే యే విద్వత్కవియైనను సద్గ్రంథము వ్రాయుట. ఆ గ్రంథము లోకవ్యాప్తమై తత్ఫలితము ప్రజా నీకము పొందుచున్నప్పుడు కవి తన కృషి సార్థకమైనదని సంతోషించుట సహజము. అట్లు వ్యాప్తమగుట కనేక మార్గములు గలవు. అవి యందఱ కందుబాటులో లేవు. అది కాలమహిమయో! దైవనిర్ణయమో!

"Survival of the fittest"—Darvin

ఇంకొక చిన్న విషయము. వ్యాకరణము పూర్తిగఁ బాటింపవలసినదే కాని కవితా ప్రవాహమున నెప్పుడో యొకప్పుడు రసస్ఫూర్తి కొఱకో జీవద్భాషాలక్షణముగనో వ్యావహారిక రూఢ్యర్థ ద్యోతకముగనో యప్పటికి లభించిన వ్యాకరణశాస్త్రము నుల్లఘించిన పదము మహాకవుల గ్రంథములఁ గనఁబడుట సత్యదూరము కాదు.

"చెంబునకు వంక లోతేమి చెడునటీపు
భూషణ వికాస శ్రీధర్మపుర నివాస!
దుష్ట సంహార! నరసింహ! దురితదూర"

ఇత్యాది వాక్యములు జ్ఞప్తికిఁ దెచ్చుకొనందగు. ఉచితజ్ఞుఁడు, ప్రకృతి పరిశీలనా నిపుణుఁడు, శాబ్దికుఁడు, ధ్వన్యాలోకనా తత్పరుఁడు రస ప్రవాహ లోలుఁడగు కవికి గమ్యస్థానము ఆనందము.

వ్యాకరణము తండ్రివంటిదనిరి కొందఱు అగుఁగాక! తండ్రి శాసన మనుల్లంఘనీయము. అయిన నొకానొకప్పుడు తండ్రిమాటకు బాటకు నడ్డు తగిలి యీ పల్లెటూరికిఁ జుట్టుత్రోవయైన యీ 'గోష్ఠు' దారికంటె నీ శర దృతువున నీ చేనిలోని కాలిబాటను బోవుట కనుమోయి యని సమయము సాగినంత మాత్రమున నది తండ్రి గౌరవమును దిస్కనపఱచుట కాదు. గమ్యము సులువుగఁ జేరుట కే. అయ్యాయి కాలముల సామాజిక ధర్మములు మాఱుచున్నను సత్యనిష్ఠాది ధర్మములు మాఱనట్లేనను సూత్రములకు భంగము కలుగరాదనుట మఱువరాని విషయము.

నాఁడు సాధువులు గావని నిర్ణయింపఁబడిన పదములను నేఁడు సాధువు లని నిర్ణయించిన మహనీయులెందఱో యున్నారు. లోకమునఁ బరివర్తనము సహజ లక్షణము. మహా మేధావులు, బహు శాస్త్రపారంగతులు, ప్రకృతి రహస్యవేత్తలు సోపపత్తికముగాఁ జిత్రించిన విషయ మిది. కానిచో నిన్ని వ్యాకరణముల పుట్టువునకు నిన్ని వ్యాఖ్యానములకుఁ నింకెన్నియో యభిప్రాయభేదములకుఁ దావెట్లుండును? శ్రుతిహితము పరమలక్ష్యము.

సమభిహారము కాని సమయోచిత సింహావలోకనము సమంజసము. భవతు: ప్రకృతాంశముల నా ప్రధాన విధ్యుక్త ధర్మ మొక్కటియె మిగిలి యున్నది. నేను పుస్తకములు పంపిన తత్క్షణ మమితాదరాభిమానములతో నందుకొని కాలవిలంబన మొనర్పక శాంతముగ సాంతముగఁ జదివి చదివించుకొని "సమకాలికు లెన్నఁడు మెచ్చ"రను మాటను మెచ్చక శ్రమ యనక యమూల్యాభిప్రాయము లందఁజేసిన.

అవధాని శిరోమణి, విద్యావారిధి, మహామహోపాధ్యాయేత్యాది బిరుదాంకితులును, పాశ్చాత్యదేశ ప్రతిధ్వనిత స్వీయగైర్వాణ వాణీవినోదులును, మృదులహృదయులును, శతవృద్ధులు, ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థాన కవీశ్వరులునగు మధ్వశ్రీ కాశీకృష్ణాచార్యులుగారికిని - అద్భుత నవలా రచయితలును, రామాయణ కల్పవృక్షాది మహాకావ్య కర్తలును, సంస్కృతాంధ్రాంగ్లాంది బహుభాషాపారంగతులును, కవి సమ్రాడ్బిరుదాంకితులునగు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారికిని- సంస్కృతాంధ్రాంగ్ల వంగపాళ్యాది భాషావిశేషజ్ఞులను, సాహితీ సమితి ప్రధాన కార్యనిర్వాహక సభ్యులును, పద్మావతీచరణ చారణ చక్రవర్తిత్యాది గ్రంథకర్తలును, ఆంధ్రసాహిత్య అకాదమీ ఉపాధ్యక్షులును, మహామహోపాధ్యాయ బిరుదాంకితులునగు తల్లావఝ్ఝల శివశంకర స్వాములవారికిని - పురాతన గ్రంథ పరిశోధకాగ్రేసరులును, మించుపల్లె యిత్యాది గ్రంథకర్తలును, మదరాసు

విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షులును, సహృదయావతంసులును, విద్యారత్న బిరుద విరాజితులు నగు శ్రీ నిడదవోలు వేంకటరావుగారికిని— సంస్కృతాంధ్రాంగ్ల హిందీత్యాది ద్వాదశ భాషాకోవిదులును, విద్వత్కవీశ్వరులును, లబ్ధ ప్రతిష్ఠులును, సుహృద్వతంసులును, పురాగ్రంథ పరిశోధనా నిపుణులును, శ్రీ హర్ష రాజ్యశ్రీ ఇత్యాది గ్రంథకర్తలునగు శ్రీ కోట సుందర రామశర్మ గారికిని—వ్యావహారిక భాషా విశేషజ్ఞులు, విశ్వమానవ కల్యాణ వాంఛా పరతంత్రులు, మహా వక్తలు, రసజ్ఞులు, గుణగ్రహణ పారీణులు, వ్యావహారిక...ఇత్యాది గ్రంథకర్తలు, ఆంధ్రప్రదేశ ప్రభుత్వ పత్రికా సంపాదకులు, వాఙ్మయ మహాధ్యక్ష బిరుద విభ్రాజితులునగు శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారికిని — విమర్శకాగ్రణులును, కవీశ్వరులును, సంస్కృతాంధ్రాంగ్ల భాషా పండిత ప్రకాండులును, నయ వినయాది సద్గుణగణ రత్నరాజితులును, సుహృన్మణులును, ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్ర భాషోపన్యాసకులు నగు డాక్టర్ శ్రీ దివాకర్ల వేంకటావధానిగారికిని— గుణగ్రహణ పారీణులును, కవితాకళాధురీణులును, మృదుమధుర శ్రావ్య వాఙ్ముఖ పరితోషిత సభాసదులును, చలన చిత్ర గేయాది రచయితలు నగు డాక్టర్: సి. నారాయణరెడ్డి గారికిని — నవ్య మానవతావాదులును, విద్వత్కవీంద్ర సన్మాన సమ్మోదులును, సాహితీ సంస్కృతి రసైక వేదులును, కళాభిలాషులును, సుహృద్విశేషులును, పరోపకారశీలురును, ప్రజ్ఞాశాలురును, న్యాయశాస్త్ర పట్టభద్రులునగు శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి గారికిని— పరమేశ్వర్యోపాసనాబల సంపన్నులును, సంస్కృతాంధ్ర భాషా నిధులును, దర్శనాచార్య—సాహిత్యాచార్య— శాస్త్రవిశారద—సాహిత్య సమ్రాట్, లాక్షణికశిరోమణి, విద్యాప్రవీణేత్యాది బిరుదాంకితులునగు శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారికిని; గంభీరవాఙ్ముఖ కళాకలాపులును, పరదేశాటనానుభవ జ్ఞానోపేత సరస హృదయులును, బహుశాస్త్రాచార్య వర్యులునగు, శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారికిని— ఆంగ్లభాషా మహావిద్వాంసులును, కులపతులును, విమర్శక శిఖామణులునగు డాక్టర్: శ్రీ ఓరుమళ్ళ రామారావుగారికిని- దైవజ్ఞ శిరోమణులును, సరస కవీశ్వరులును, చతుర వాఙ్నిపుణులును, మోటుపల్లె యిత్యాది గ్రంథకర్తలును, గురుతుల్యులు నగు శ్రీ బూసము మల్లయ్యకవిగారికిని; సంస్కృత భాషా పండితులును, సుహృద్వర్యులును, విద్వాన్. సాహిత్య విద్యాప్రవీణేత్యాది బిరుదాంకితులునగు శ్రీ నందుల శేషగిరి శర్మగారికిని – సంస్కృతాంధ్ర భాషా పండితులును, విద్వత్కవీశ్వరులును, బహు గ్రంథకర్తలును,

సహృదయాగ్రేసరులు నగు ఉభయ భాషాప్రవీణ, శ్రీ అబ్బరాజు సూర్య నారాయణ పంతులుగారికిని- గ్రంథాలయోద్యమ ప్రచారకులును, వాఙ్మయ పోషకులును, విద్వత్కవీంద్రాభిమానులును, సారస్వతనికేతన గ్రంథాలయ గౌరవకార్యదర్శులు నగు శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావు పంతులుగారికిని- విమర్శకావతంసులును, గేయకవితావిశారదులును, సరసహృదయులునగు శ్రీ వాత్సవగారికిని- సంస్కృతాంధ్ర హిందీభాషా మనీషులును, లయోలా కాలేజీ హిందీ శాఖాధ్యక్షులును, సహృదయులును, సాహిత్యరత్నేత్యాది బిరుదాంకితులునగు శ్రీ కర్ణ రాజశేషగిరిరావు M.A., గారికిని కృతజ్ఞతా పూర్వక నమోవాకములు.

మద్రపురిలో బ్లాకులు తయారుచేయించి పంపించిన శ్రీ గొల్లపూడి రాధాకృష్ణయ్య శ్రేష్ఠిగారికిని, శ్రీ పింజల వేంకటేశ్వర్లుగారికిని కృతజ్ఞతా పూర్వకాభినందనములు.

ఇట్లు,

—గ్రంథకర్త.

# ఆంధ్ర మహాభ్యుదయ ప్రథమభాగావిష్కరణ మహోత్సవము

## కార్యదర్శి నివేదిక

"ఆంధ్ర మహాభ్యుదయ ప్రథమ భాగము" ముద్రింపబడగనే వేట పాలెంలోనున్న "శ్రీ మోడరన్ ఆర్ట్సు అసోసియేషన్ వారు, గ్రంథ రచయిత శ్రీ బండ్ల సుబ్రహ్మణ్యముగారికి సన్మానముచేయ సంకల్పించినారు. ఈ అసోసియేషన్ కార్యదర్శి శ్రీ కవిగారితో ఈ విషయమున సన్మానము చేయదలచితిమని సంప్రదించగా కవిగారు అంగీకరించినారు అని చెప్పుట జరిగినది.

## కవిగారిని గూర్చి ఒకమాట

వీరి పూర్వ రచనలను పరిశీలించిన శ్రీ వేటుకూరి వెంకట నరసయ్య గారు వీరిని ఒక సభలో 'అభినవ తిక్కన' అను బిరుదుతో గౌరవించగా, అంత గొప్ప బిరుదు నాకు వద్దని కవిగారు తమ ఉదారశయనమును వెలి బుచ్చిరి. పిమ్మట వీరు రచించిన "ఆంధ్ర మహాభ్యుదయ ప్రథమభాగ" ఆవిష్కరణ సమయమున వారిని సన్మానించుటకు మా అసోసియేషన్ వారు పూనుకొనిరి, దానిపై కవిగారి శిష్యులు, మిత్రులు, అభిమానులు, ఊరి పెద్దలును ఒక సంఘముగా ఏర్పడి "వేటపాలెం పంచాయతీ సమితికి" అధ్యక్షులుగావున్న శ్రీ రొండా రామస్వామి రెడ్డిగారిని మా ఆహ్వాన సంఘమునకు అధ్యక్షులుగా వుండుటకు కోరగా వారు దయతో అంగీకరించి ఈ విషయమునకు చాలా సంతోషించి మన ప్రాంతములో పెక్కు గ్రంథములు వ్రాసి ప్రజోపయోగకరమైన మంచి పనులుచేసి ప్రసిద్ధిగాంచిన శ్రీ కవిగారికి సన్మానముచేయుట యెంతయో సంతసమని తెలిపి వారు అందుకు అంగీక రించినారు.

## ఆహ్వాన సన్మాన సంఘము

**అధ్యక్షులు :—** శ్రీ రొండా రామస్వామి రెడ్డిగారు (వేటపాలెం పంచాయతీ సమితి ప్రెసిడెంట్.)

**ఉపాధ్యక్షులు :—** శ్రీ బొక్కసం ఆదిశేషయ్యగారు.

కార్యదర్శి :— శ్రీ పలాగాని వెంకటేశ్వర రెడ్డి.

సభ్యులు :— శ్రీ అచ్యుతుని వెంకటరావు M.A.,B.Ed., శ్రీ [illegible] బుల్లయ్య M.A., శ్రీ జాగాబత్తుని చెంచయ్య, శ్రీ [illegible], శ్రీ శీపాలశెట్టి రేణుకయ్య, శ్రీ నాయుడు చంద్రా[illegible], శ్రీ [illegible] వెంకయ్య, శ్రీ M. శేషయ్య చౌదరి, శ్రీ బండ్ల [illegible], శ్రీ జి. వీరభద్రశర్మ అనువారలు సన్మాన సంఘముగా ఏర్పడి ఒక [illegible] పత్రమిట్లు ప్రకటించితిమి.

"ఆర్య మహాశయులారా!

ఒక మహాకవియే ఒక దివ్యసంస్థ. ఆ వ్యక్తి తన సర్వశక్తులను కవితా కల్పలతా మూలమున వర్తమాన భవిష్యత్కాల జనానీకాభ్యుదయమునకు ధారవోయును. ఆ మహనీయుఁడు మన కందిచ్చు విజ్ఞానామృతము నిత్యనూతనము.

ఇప్పటికి సుమారు నలుబది వత్సరములనుండి బహువిధ సాహితీ ప్రక్రియల శాస్త్రబద్ధముగా అనవద్యముగా మనోజ్ఞముగా సృష్టించిన విద్వత్కవీంద్రులు శ్రీ బండ్ల సుబ్రహ్మణ్య కవిగారు మన కెల్లరకు సుపరిచితులు.

నిరంతర నిస్స్వార్థ, నిర్మల దీక్షతో సాహితీసేవకే జీవితమును అంకితము చేయుచున్న కళావిలాసులు. వీరి గ్రంథము లజ్ఞానాంధకారమునకు విజ్ఞాన జ్యోతులు.

వీరి రచనలు : విశ్వేశ్వర శతకము (శతకము) వేమన (వేయి పద్యములు), ఆంధ్రమహాభ్యుదయము, కన్యకాపరమేశ్వరీ చరిత్ర, గెలీలియో, న్యూటన్, మైకేల్ ఫేరడే (పద్యకావ్యములు), కుమారవిజయము, ప్రహ్లాద, తులసీదాసు, బుద్ధావతారము, రుక్మిణీకళ్యాణము (నాటకములు), బుద్ధచరిత్ర, దురాక్రమణ (బుఱ్ఱకథలు), మయసభ, పరితప్త దుర్యోధనుఁడు (ఏకపాత్రాభినయములు), కళాశ్రీ (మూడుభాగములు- విమర్శనాత్మక పద్యకావ్యములు), ఆంధ్రదీప్తులు, జన్మభూమి, వీరభారతము (ఖండకావ్యములు), వేదవతి (బంధప్రబంధము- నూతనసృష్టి), ఛందోదీపిక (లక్షణ గ్రంథము) మొదలగునవి. ఇట్టి గ్రంథములను రచించి నిత్యము వైజ్ఞానిక విషయములలో ప్రజలకు మిక్కిలి తోడ్పడుచున్న ప్రజాకవి వీరు. సుమారు ముప్పది సంవత్సరములనుండి ఆంధ్రదేశమున పలుతావుల వీరి దృశ్యకావ్య

ప్రదర్శనములను చూచి ప్రజలు ఆనందించుచున్నారనుట సత్యదూరము కాదు. ఈ పరిసర గ్రామముల అనేక నాటక సమాజములవారు వీరి నాటకముల నిప్పటికిని "రిహార్సల్సు" చేయుచునేయున్నారు.

వీరి ఆంధ్రమహాభ్యుదయము క్రొంగొత్తగా వెలువడిన మహాకావ్యము. అదియొక తెలుగు వెలుఁగు. అధునాతనాంధ్రజన నిత్యజీవిత ప్రతిబింబ దర్పణము. ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు ఆహుతులైన అమరజీవి పొట్టి శ్రీరాములుగారి జీవిత చరిత ప్రధానేతివృత్తముగా గొని బంధుర ప్రబంధ మార్గమున రచించి పలువుర పండిత ప్రకాండుల ప్రశంసల నందుకొనిరి. ఇట్టి ప్రబంధ నిర్మాణము మహాకవికే సాధ్యపడును. వీరికి ప్రతిభా, వ్యుత్పత్తులు రెండును కలవు. వీరి శిక్షణ పొందుచున్న శిష్యపరంపరలు వేనవేలు.

అనేక నాటక సమాజముల స్థాపించి, పెక్కు సమాజములకు పలు విధములఁ దోడ్పడుచు మహానందలో శంకరుడు, ఖల్జీరాజ్యపతనములో అల్లాయుద్దీను, భారతములో దుర్యోధనుడు మొదలగు ప్రధానపాత్రల నతి సమర్థతతో నిర్వహించి యుత్తమ నటరత్నముగాఁ గీర్తి గడించినవారు. ధర్మమే దైవమని నమ్మి వర్తించు మనీషి. ఇట్టి వీరి బహువిధ భాషాసేవలను గుర్తించి ఉచితరీతిని సన్మానింపఁ దలంచితిమి. మాకుఁ దగినరీతిని తోడ్పడ కోరుచున్నారమని తెలిపితిమి."

1. గ్రంథావిష్కరణము.
2. సన్మాన కార్యక్రమము.
3. బిరుద ప్రదానము.

ఆంధ్రమహాభ్యుదయ ప్రథమభాగ ఆవిష్కరణ మహోత్సవము 7-11-1965 తేదీన సాయంకాలము శ్రీ కవిగారిని పూలపల్లకీలో కూర్చుండబెట్టి నగర వీధులలో బ్రహ్మాండమైన ఊరేగింపు జరిగినది. పురజనులు కవిగారిని నూతన వస్త్రములతో, పూలమాలలతో సత్కరించిరి. కిక్కిరిసిన జన సమ్మర్దంలో శిష్యులు, పురప్రముఖులు, అభిమానులు జయజయ ధ్వానులతో ఊరేగింపు ఉత్సవము సాగి శ్రీ గొల్లపూడి వెంకటరంగయ్య శ్రేష్ఠిగారి ఆరు బయలు రంగస్థలమును చేరుకొనగా ఉత్సవము మహావైభవముగా జరిగినది. అంతట ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ రామస్వామిరెడ్డి, డాక్టర్ శ్రీ దివాకర్ల వెంకటావధానిగారిని సభాధ్యక్షులుగా వేదికపైకి ఆహ్వానించుటతో కార్యక్రమము ప్రారంభమైనది.

## గ్రంథావిష్కరణ మహోత్సవము

శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి M.A., L.L.B., అమెరికా రిటర్న్ గారు గ్రంథావిష్కరణము గావించిరి. వారు కవిగారి రచనలను వారి నైపుణ్యాన్ని ఎన్నో విధముల కొనియాడిరి. తరువాత శ్రీ వేంకటావధానిగారు గ్రంథము నందలి పద్యములను పదింటిని చదివి మృదుమధుర పదజాలముతో వివరించి సభ్యులను సంతోషపెట్టినారు.

## బిరుదు ప్రధానము

శ్రీ డా॥ దివాకర్ల వేంకటావధానిగారు కవిగారిని నూతన వస్త్రములతో సన్మానించి, విద్వత్కవీంద్రులు, నటవతంసులు, నాటక సమాజ స్థాపకులు, బహుముఖ ప్రజ్ఞా ధురీణులు, నిరంతర సాహితీ సేవానిమగ్నులు, లలితకళా కలాపులు, చతుర్విధ కవితా విలాసులు అగు శ్రీ బండ్ల సుబ్రహ్మణ్య కవిగారికి ''సువర్ణ ఘంటా కంకణము''ను తొడిగి పురప్రజల కరతాళ ధ్వనులమధ్య ''మహాకవి'' బిరుద ప్రధానముచేసి సన్మానించిరి.

సభానంతరము ఆహ్వానించిన కవులకు, సభాధ్యక్షులకు సభకు విచ్చేసిన పెద్దలకు, పురప్రముఖులకు, ద్రవ్యసహాయము చేసినవారికి నాతో సహకరించి సన్మానోత్సవమును దిగ్విజయము గావించిన పెద్దలకు మా అసోసియేషన్ వారికి నా ధన్యవాదములు తెలుపుచు ఇంతటితో నా శెక్రటరీ రిపోర్టును చదివి కృతజ్ఞతలు తెలియపరచుచు విరమించుకొనుచున్నాను.

పలగాని వేంకటేశ్వరరెడ్డి
కార్యదర్శి,
ఆహ్వానసంఘము, వేటపాలెము
జైహింద్

విద్వాన్ శ్రీ బండ్ల సుబ్రహ్మణ్య కవిగారు రచించిన ఆంధ్ర మహాభ్యుదయ ప్రథమభాగ ఆవిష్కరణ మహోత్సవ సందర్భమున సన్మానసంఘ అధ్యక్షులు శ్రీ రొండా రామస్వామి రెడ్డిగారు సభావేదికపైకి కవిగారిని ఆహ్వానించి సన్మానించిన సందర్భమున వారు పలికిన పలుకులు.

విద్వాన్ శ్రీ బండ్ల సుబ్రహ్మణ్య కవిగారు రచించిన ఆంధ్ర మహాభ్యుదయ ప్రథమభాగ ఆవిష్కరణ సందర్భముగా ఇచ్చట ఏర్పాటు చేసిన సభకు ఆహ్వానింపబడి విచ్చేసిన డా॥ దివాకర్ల వేంకటావధానిగారు

సభకు అధ్యక్షత వహించవలసినదిగాను, శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి M.A.,L.L.B. గారు ఆంధ్రమహాభ్యుదయ మహాకావ్య ఆవిష్కరణ చేయవలసినదిగాను మరియు డా॥ దివాకర్ల వేంకటావధానిగారు కవిగారికి "మహాకవి" బిరుదు నొసగి సువర్ణఘంటా కంకణము తొడిగి నూతన వస్త్రములతో సన్మానించవలసినదిగను కోరితిని. పిదప అత్తోట రత్నకవి కవిరాజ కొండవీటి వేంకటకవి, అడుసుమల్లి శ్రీనివాసరావు పంతులుగారు, గొల్లపూడి రాధాకృష్ణయ్య శ్రేష్ఠిగారు, నాసిక మల్లికార్జునరావుగారు బి. ఏ., బి.యిడి., (హెడ్మాష్టరు), యాచరాజు సీతారామయ్య బి. ఏ., బి.యిడి. గారు, ఎం. సీతారామిరెడ్డి బ్లాక్ డెవలప్మెంటు ఆఫీసరుగారు ఉపన్యసించెద రంటిని. ఈ కార్యక్రమము అంతా జరుగుటకు మొట్టమొదట శ్రీ మోడరన్ ఆర్ట్సు అసోసియేషన్ కార్యదర్శిగారు శ్రీ పలగాని వెంకటేశ్వర రెడ్డిగారు వగైరాలు నావద్దకు వచ్చి కవిగారికి జరుప నిర్ణయించుకొన్న సన్మానమును గురించి నాతో చెప్పి ఆ సన్మాన సంఘమునకు అధ్యక్షులుగా నన్ను కోరిన మీదట చాలా సంతోషించి మా పంచాయతి సమితి కార్యక్రమములు కవిగారి తోడ్పాటుతో జరుపుకొనుచున్న మేము వారికి జరుగబోవు సన్మాన సభకు మా తోడ్పాటు సంపూర్తిగా ఉండగలదని చెప్పి అధ్యక్షులుగా నుండుటకు అంగీకరించితిని. ఈనాడు వారికి జరిగిన పూలపల్లకిలో పురవీధులలో ఊరేగింపు చూడ వారిమీద నున్న గౌరవముకొద్ది శిష్యవర్గము స్నేహితులు పురప్రముఖులు బ్రహ్మాండముగా జరిపిన విధము చూడ చాల సంతసము గలిగినది. పరిమిలా ఇప్పుడు జరుగబోవు సన్మానసభనుకూడా దిగ్విజయముచేసి సభానంతరము కవిగారిచే రచింపబడి మోడరన్ ఆర్ట్సు అసోసియేషన్ వారిచే ప్రదర్శింపబడు "భక్త ప్రహ్లాద" నాటకము చూచి ఆనందించవలసినదిగా ప్రార్థించుచున్నాను. సభను సభాధ్యక్షులు శ్రీ దివాకర్ల వేంకటావధానిగారిని ప్రారంభించవలసినదిగా కోరుచు అందరివద్ద సెలవు తీసుకొనుచున్నాను.

రొండా రామస్వామిరెడ్డి,
ఆహ్వానసంఘ అధ్యక్షులు.
మోడరన్ ఆర్ట్స్ అసోసియేషన్ అధ్యక్షులు,
పంచాయతి సమితి అధ్యక్షులు,
వేటపాలెము.

# కృతజ్ఞతం దెలుపుచు కవిగారు సభలో చదివిన పద్యములు

సీ. ఇప్పించితి పరీక్ష - మెప్పించి యిప్పూరి
బంగరు పతకమ్ము - బాల్యమంద
ద్వ్యర్థిరచన జయ - మర్థింప నొసఁగిని
ప్రథమ బహూకృతి - పట్టణమున
నాంధ్ర మహాభ్యుద - యావిష్కరణవేళ
ఘనబుధాగ్రణి దివా - కర్ల చేతఁ
గాంచన మణిమయ - ఘంటికా కంకణ
మును దొడిగించితి - జనము మెచ్చ

తే. నింక మజ్జీవితమున నే - మేమి కూర్తొ
తెలియఁగా జాల నీలీల - దివ్యశీల
వాణి వీణావినోదిని - పద్మపాణి
నవరసానందరూపిణి - నలువరాణి.

శా. అక్షీణ ప్రతిభా విభాసి యవధా - న్యాఖ్యాప్తుఁడై తన్సభా
ధ్యక్షస్థాన మలంకరించి తగమ - త్కావ్యార్థ ఎన్నచ్చుటల్
దక్షుండై విరజిమ్మఁజేయ బహుమో - దంబొప్ప దిన్యత్కళా
ధ్యక్షుం డీతఁడె యంచుఁ బ్రేక్షకులు హృ - ద్యశ్రీనుతుల్చాటఁగా.

ఉ. పండిత వంశసంభవుఁ డ - పారకృపానిధి యాంధ్రపండితా
ఖండలుఁ డద్వితీయ ఘన - కావ్యకళానిధి వేనవేల్జనుల్
నిండిన యిమ్మహాసభకు - నిండుదనం బొనగూర్చె మన్మనః
పాండు నవోత్పలమ్ము రస - భావ మధూజ్జ్వలమై రహింపఁగా.

కం. అత్తోట రత్నకవి జన
చిత్తాహ్లాదమ్ముఁ గూర్పఁ - జెవికింపుగ నా
పొత్తముఁ జదివె నుదాత్తతఁ
బుత్తడికిం దావిఁ గూర్చు - పోలిక బళిరా.

తే. అమల సమ్మాని సత్కవీం - ద్రాభిమాని
తరళలలితోక్తి వాణి వి - ద్యా ప్రదాని
రమణ సంధాన లేఖినీ - రమ్యపాణి
యమిత సుజ్ఞాని మన వేంక - టావధాని.

శా. నవ్యానందముతో 'సమస్తజనులున్ - నావంటివా' రంచుఁ దా
దివ్యాచ్ఛాశయుఁడై కవీంద్రులకు నెం - తేఁ గూర్చి హర్షించుచుం
గువ్యాఖ్యాంధసరోజ బాంధవుఁడునౌ - గోపాలకృష్ణుండు మ
త్కావ్యావిష్కరణం బొనర్చుటిది మ - ద్భాగ్యంబు గాకుండునే.

ఉ. కొండలు పిండిసేయఁగల - కోవిదుఁ డుత్తమ 'కావ్యగర్త'మా
కండగ నుండి సంతసము - నందుహితుండు సభాంతరంబునన్
బండలు గుండ్లు దొర్లినటు - వాఙ్ముఖచిత్రముఁ జూపుచున్ రసాల్
పిండిన కొండవీటికవి - విద్వదమోఘవచస్సులెం చెదన్.

మ. అనురాగమ్మునఁ బెద్దలున్ హితులు శి - ష్యవ్రాతముల్చేరి యీ
ఘనకార్యం బొనరించి రీక్రియఁ గళా - కళ్యాణ కాంతామతిన్
వినయం బొప్పఁ గృతజ్ఞతం దెలిపి శ్రీ - విశ్వేశు కారుణ్య పా
వన భాగ్యాతిశయంబునుందలఁచి సం - భావింతు సభ్యావళిన్.

శా. రమ్మా కొమ్మని స్థాయిఁ గూర్పఁగల రా - రాజొక్కఁడున్ లేని లో
టిమ్మాడ్కిన్ సరిదిద్ద మద్ధితులవో - ఘేచ్ఛాచ్ఛదీప్త్యాక్రియా
ర్థమ్మిట్లీ పరిషద్రమాసరస నృ - త్య ప్రౌఢిమల్చాట మ
త్సమ్మానమ్మిది నూక కాదు కవితా - సామ్రాజ్యమా దేవికా.

కం. లలితకళా రాధనపరుఁ
డలరామస్వామిరెడ్డి - యాదృతిఁ జూపం
బలగాని వేంకటేశ్వరుఁ
డెలమిం గృషిసల్ప నిద్ధి - యివ్విధి జరిగెన్.

తే. వజ్రసంకల్పమునఁ గార్య - భారమూని
గమ్యమును జేరఁ గలిగిన - ఘనులుగాన
నవకళా సంఘసభ్యుల - నమ్రకృషికి
మత్కృతజ్ఞతఁ దెల్పుదు - మమత మెఱయ.

ఉ. చిన్నతనంబునుండి ననుఁ - జెంతకుఁ బిల్చి బహూకృతుల్ యశో
భ్యున్నతిఁ గోరి యిచ్చి సభ - నుత్సవ మొప్ప ననేక సూక్తులన్
మన్ననఁ బల్కినట్టి జన - మాన్యుని గణ్యుని శ్రీనివాసు వి
ద్వన్నుతు పుస్తకాలయవి - వర్ధను మద్ధితు నెంతు నిత్తఱిన్.

కం. ఇదిగో ద్వితీయ భాగము
వదలక యిద్దానితోడ - వ్రాయుమిది జయ

ప్రదమని 'పైలెట్' కలమును
బందిలంబుగ నిచ్చె శ్రీని - వాసుం డెలమిన్.

మ. మతిమంతుండు వదాన్యశేఖరుఁడు ధ - ర్మజ్ఞుండు సర్వోదయం
బతిశాంత స్థితిఁగోరు సద్గుణి జనాబ్ - యాఖూబుసాహేబు స
స్తుతి కర్హుండని మాకృతజ్ఞత నిరం - దుం జెల్పుకోఁ జెల్లుఁ ద
న్నుతి మాత్రంబగు ప్రేమఁ బ్రోచు నిరతం - బల్లామహోల్లాసిన్నై.

కం. సరసమహోజ్జ్వల కవితా
పరుఁడై మన శ్రేష్ఠిగారు - పట్టువసనములీ
పురపాలక సంఘము వా
రెఱుకం గాశ్మీరశాటి - నిచ్చిరి సభలో.

తే. ఉగ్రకుటిలారికంటక - వ్యూహభేది
సవ్యఘూనవతావాది - నయవినోది
ధ్యేయసంవేది సార్థక - న్యాయవాది
యాత్మమిత్రుండు మాకావు - లాన్వయుండు.

తే. ఈ సభాధ్యక్షు నాత్మలో - నీశ్వరుండు
సాచ్చియస్మత్కళా తప - స్సునకు మెచ్చి
కరుణ నిప్పించె నిటుమహా - కవి బిరుదము
కాన మత్కీర్తికాంత ది - గ్గజము లెక్కె.

ఉ. పంకజగర్భురాణి పద - పంకజముల్భజియించి యింక మీ
లోపంక మెలర్పఁ దజ్జనని - పూజ విపంచిలగించి మీటి స
ట్లంకిలి లేక సర్వరస - హాసవిలాసత వ్రాయుదున్మణీ
కంకణకింకిణీరవము - ఘల్లన వైరులగుండె ఝల్లనన్.



శివభక్తావతంసులు

కీ॥ శే॥ బండ్ల వేంకట సుబ్బయ్యగారు

తే॥ అతిథి సత్కారతోషి విద్యాభిలాషి
పరమతృప్తిపరుఁడు శివభక్తవరుఁడు
స్వచ్ఛవాగ్భూషణుఁడు సదాచారచణుఁడు
నాదు పితృపాదులకు వందనమ్మొనర్తు.



గ్రంథకర్త



ఆంధ్రమహోభ్యుదయ ప్రథమభాగావిష్కరణ మహోత్సవ సమయమున
డాక్టర్ : దివాకర్ల వేంకటావధానిగారు కవిగారికి సువర్ణ ఘంటా
కంకణము తొడుగుచున్న దృశ్యము.



నేఁటి కవి కుటుంబము

(ఎడమనుండి కుడికి) కూర్చున్నవారు : కవి, వారి ధర్మపత్ని సావిత్రి. నిలుచున్నవారు : కవిగారి దౌహిత్రుఁడు పొన్నూ నాగవరప్రసాదరావు, M. Sc., కవిగారి పుత్రిక - సుభద్రమ్మ

# విజ్ఞాపనము

అది యానాఁటి భారతము. ఇది యీనాఁటి భారతము. ఇందర్ధశతాబ్దమునందు పైగా నేయే రసము లెంతెంత స్థాయిలో భారతదేశమునఁ బ్రాకటించెనో వాని నిజస్వరూపముల సక్రమముగఁ బ్రదర్శించుటయే మదాశయము. ఈ గ్రంథమున నాంగ్ల సామ్రాజ్యముతో సకల భారతజాతీయ మహాసభవారు చేసిన నేఁబదియేండ్ల శాంతి సంగ్రామము — ఆంధ్రరాష్ట్రమునకై యాంధ్రవీరు లొనరించిన ప్రశాంతాంతర్యుద్ధము — స్వరాజ్యకాంక్షయై మన్యపు బాధలం దొలఁగింప నల్లూరి సీతారామరాజు ప్రాణ ప్రభుత్వముతో నొనర్చిన సాహసోపేత సాయుధ సమర మిందు వర్ణితములు. అనఁగాఁ గాంగ్రెసు చరిత్ర యఖిల భారతదేశ చరిత్ర యాంధ్ర ప్రదేశ చరిత్ర యను మూఁడు తీవలు పెనవేసికొని పుష్పించి యిందు విరాజిల్లెవి. అంతియకాదు. ఆఖ్యానపద్ధతి నాటకీయ పద్ధతి వర్ణనాత్మక పద్ధతి యను త్రివిధ లతలు మైత్రిమై కథావస్తు కుజరాజమును గౌఁగిలించుకొని కులుకుచున్నవి. ద్వితీయభాగమున మహాత్ముని ప్రధాన జీవితాంశములు చాలభాగము తెలుపఁబడినవి. ఇఁక మానవు నవతారపురుషుఁ డన్న నమ్మరు; పురుషోత్తముఁ డంద్రుగాని పురుషోత్తముఁ డనరవి గ్రహించి ప్రధాన నాయకుల కెవరికెంత విలువ నీయవలయునో యంత విలువ యిం దిచ్చితి. తీఁగ లాగిన పొదకదలినది. దైవానుగ్రహమునఁ గళాతపస్వియైన కవి కలమునఁ గథ కమ్మచ్చులోని తీవవలె సాగిపోవుననుట జగమెఱుంగుంగదా!

సర్వశక్తుల వికసింపంజేయు భాష సజీవ సాధనము. దాని యుపయోగమునకుం బరిమిత మనూహ్యము. అది జాతి జీవనమునకుం బ్రతిబింబము. విశిష్టశబ్ద ద్వయ సమ్మేళనమున హృదయాకాశముం బ్రకాశింపజేయు విద్యుత్సన్నిభామోఘార్థస్ఫూర్తి గలుగు. దానన నానందజ్యోతి వెలుఁగు. దాని శాబ్దికశక్తి గణనీయము. ఇంత మెఱుంగి వాఙ్మయ మహామంజుల మాలలో సానలు దీరిన యొక నూతన జాతి రత్నమును బొదుగం దలంచి — సరస్వతీ పూజా మందిరమున నొక మహోజ్జ్వల మనోహర దివ్య మాణిక్య దీపము వెలిగింపం దలంచి — వివిధ కోణములనుండి ప్రామాణిక చారిత్రికాధారములు సేకరించి యీ బృహత్కావ్య రచనకుం బూనుకొంటి. కవితా భోగ ంతుర పరబ్రహ్మ యోగమని విశ్వసించితి. కవితా కళా వైచిత్ర్యము [illegible] ప్రదర్శించితి. నా కృత సత్యదర్శినిగ సమదర్శినిగ నుండునట్లను

గ్రహింపుమని సర్వేశ్వరుని వేడుకొంటి. ఏతన్మహాకావ్య నిర్మాణ [illegible] సంఘటనాదుల మున్నె వివరించితి. జీవితము నంతయు సాహితీసేవ [illegible] సేయవలయునని బాల్యమునంద సంకల్పించితి.

ఎన్ని చదువులు చదివిన నెన్ని నీతులు చెప్పిన మానవుని [illegible] నిర్ణయమునందుంగూడఁ బాత్త్విక దృష్టి ప్రబలముగనుంట లోకమునందు [illegible] కన్నుల గోచరించుచున్న నిత్యసత్యము. అదృష్టి కలవారఁ [illegible] జ్ఞానులంద్రు.

తే. మనసు పరిశుద్ధమైనఁ ద - న్మనుజు సమతి
శుద్ధమగు దానఁ బ్రాప్తించు - శోభ సకలము
శోభనంబున భౌతిక - సుఖముగలుగఁ
నాత్మసుజ్ఞానమున మోక్ష - మందఁగలుగు.

ఆ. ఆత్మలో నుండి పరమాత్మ - యనవరతము
సత్యమును ధర్మమును బోధ - సలుపుచుండు
నద్దివిని యట్లు చరియించు - ననఘుఁడిహముఁ
బరమును జయించుఁగీర్తిసం - పదలుపొందు.

అని యనుకొంటి ——

శ్లో. శ్లాఘ్యః సఏవగుణవాన్ రాగద్వేషబహిష్కృతా
భూతార్థకథనేయస్య స్థేయస్యేవ సరస్వతీ.

అని కాశ్మీర దేశస్థుఁడగు కల్హణ మహాకవి రాజతరంగిణి ప్రారంభమున వ్రాసిన శ్లోకభావము నా మనస్సు నందున్నది. స్వీయ మానసిక దౌర్బల్యమునకు సాక్షియగు సాత్త్వికదృష్టిం బరిత్యజించి యభిమాన దురభిమాన నిరసనభావములం జారిత్రిక సత్యమును ప్రదర్శించుటయే సత్కవి లక్షణమని ధర్మజ్ఞులు పలువురుగ్గడించిరి గాననది విశ్వసించితి. అలౌకికాద్భుతముల కంతగాఁ దావీక హేతుకల్పనల కల్పముగఁ జోటొసంగితి. అంతరంగంబునం బొంగిన యభంగుర భావతరంగంబులఁ గావ్యకన్యక నోలలాడించితి. ఈ గ్రంథమున నందందు నవగాహన క్లేశముంట యెఱుంగుదు. అట్టి పట్టులు కేవల పండితాఖండల · జనైకవేద్యములు. సాహితీసంపద సర్వసామాన్యములం బ్రకాశింపఁ జేయవలయుననియునా తాత్పర్యము.

నిధిగ మృదుమధుర పదజాల సహితముగ లోకమున కందిచ్చు. అవ్వాక్యము సానలఁదీరిన జాతిరత్నమై హృదయాహ్లాదకరమగు. అయ్యది సాహితీ గగనమున ధ్రువతారయై నిల్చు. దానినేరి కోరి యందలి రసాస్వాదనము చేయఁగలవాఁడ సత్యరసజ్ఞ శిఖామణిన్నాఁజెల్లు.

కళాక్షేత్రము నంశత్యంత కృషిసల్పమింగ్రాంత దర్శిగాని సామాన్య రచయిత యీ పద్యశోలుబ్ధుండై పండించిన సాహితీ సస్యములంగంకు లంతగా నుండవు. ఉన్నను దాలుకంకులధికము. కావున కిక్కిలిగ మిగులు నది యుత్త గడ్డియేయని యనేకజన్మసముపార్జితా మోఘదివ్యజ్ఞాన సంపన్ను లంద్రు –

// వ్యాకరణాది శాస్త్రనియమముల నుల్లంఘించి వాడుకభాషలో వ్రాసిన నెల్లరకుందెల్లమఁగునని కొందఱు నాకు సలహానిచ్చిరి. అయ్యది నా కించుకేని రుచింపదయ్యె –

చిన్నతనము నెఱుంగనివాఁడు పెద్దతనము నెట్లరయఁగలఁడు. అఱ సున్నం దెలిసికొనఁ జాలనివాఁడు నెఱసున్న నెట్లెఱుంగంగలఁడు. బండిరాఁ గమనింపం జాలనివాఁడు తెలుఁగు పీటరాచబాటనీటుగఁ బాటిగ మేటిగ నెటు చరింపఁగలఁడు. సూక్ష్మాంశముల గుర్తింపమి విభిన్నార్థస్ఫురణము గలుగమి నగాధ జ్ఞానదృష్టి యలవడుటయసంభవము. జ్ఞాననేత్రము వికసింపని యశిక్షితబుద్ధుల కందరానిదది. అందని ద్రాక్షాని పండ్లు పుల్లన. ప్రతిభాయుక్త కళాహృదయులగు విమర్శకభావుక శిరోమణుల కియ్యం శంబవగతంబ. ఇంత కెవరికెంత ప్రాప్తించినం దానికి మూలము దైవాను గ్రహంబని తలంతు.//

ఇఁక నొక ముఖ్యాంశమును వివరింతు.

1. చుండూరి రంగనాయకులుగుప్తగారు, 2. రొండా సామస్వామి రెడ్డిగారు, 3. జాగాబత్తుని చెంచయ్యగారు, 4. డా॥ భట్ట వీరప్రసాదరావు గారు, 5. డా॥ భట్ట కోటాచారిగారు, 6. బుద్ధి దక్షిణామూర్తిగారు, 7. అడుసుమల్లి శ్రీనివాసరావుగారు, 8. ఆళ్ళ రంగారెడ్డిగారు, 9. బూసము సుబ్బారావుగారు, 10. సత్రము వేంకటేశ్వర్లుగారు, 11. జనాబ్ సయ్యద్ యాఖూబ్ సాహెబ్ గారు, 12. గీతా హ్యాండులూం ఎక్స్పోర్టర్సు అండ్ కో వారు, 13. వి. ఫకీరయ్య అండ్ బ్రదర్సు వారు, 14. శ్రీ విజయా అండ్ కో వారు, 15. జూపీటర్ హ్యాండులూం ఎక్స్పోర్టర్సు అండ్ కో వారు, 16. మద్రాసు టెక్స్టైయిల్సు అండ్ కో, దేవర్ టెక్స్టైయిల్సు, సీతాపతి

ప్రేడర్సు వారలు, 17. యం. పి. గురునప్పచెట్టి అండ్ కో వారు, 18. పముజులాస్ హ్యాండ్ లూం ఎక్సుపోర్టర్సు వారు, 19. గుంటూరి బాల రాఘవలుగారు, 20. శ్రీ గురుదేవ్ హ్యాండులూం ఎక్సుపోర్టర్సు వారు, 21. మద్రాస్ ఎక్సుపోర్టర్సు కార్పొరేషన్ వారు, 22. అంబికా ఆర్టు సిల్కు వారు, 23 నాపా రామలింగముగారు, 24. గుత్తి భావనారాయణగారు మద్ధితులు దాతలు గాన వారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్సు మనస్సులు.

ముద్రణార్థులమై మద్రపురింజేరినంత నత్యంతోత్సాహమ్ముగ ప్రధానముగ మాకుం దోడ్పడిన సుహృద్రత్నములగు శ్రీ పింజల వేంకటేశ్వర్లు గారికి, శ్రీ పున్నమ్మటి పకీరయ్యగారికి, శ్రీ మైలారంగం రామదాసుసెట్టిగారికి ప్రత్యేక కృతజ్ఞతాపూర్వకాంజలులు –

నా బాల్యమున నన్నెంతో ప్రేమతోఁ జూచిన మా జనకాయన గారగు కీ॥ శే॥ బండ్ల కోటినాగయ్యగారికి నా భక్తిపూర్వక నమస్కృతులు.

ఉచితజ్ఞుడు, కళారాధకుడునగు శ్రీ కర్ణ వీరారామయ్యగారీ పుస్తక ముద్రణమున కత్యంత కృషిసల్పిరి కాన వారికి నా కేలుమొగ్గలు.

సారస్వత నికేతనమునం బనిసేయుచు వలయు పొత్తములు నాకం దిచ్చిన చి॥ కొలిసెట్టి సుబ్రహ్మణ్యమునకు, కుడిసెట్టి రామయ్యగారికి నెపు డక్కఱ గలిగినపుడ వలయు పత్రములు మైపుగొట్టి నా పనులకు గొంత సులువు గలిగించిన చి॥ జాగాబత్తుని వేంకటేశ్వర్లునకు, కవితాప్రియుడగు చి॥ దేవన కాశీవిశ్వనాథరావునకు నా శుభాకాంక్షలు.

నాపై నత్యంతానురాగమున నింత ముచ్చటగ నచ్చొత్తించి యిచ్చిన శ్రీ గుత్తి భావనారాయణగారికి, ఆంగ్ల గ్రంథ పరిశోధనమున నాకు దోడ్పడిన శ్రీ పిట్టి మునిస్వామిసెట్టిగారికి, చి॥ మీరా ప్రభువునకు నా కృతజ్ఞతా పూర్వకాభినందనములు.

గ్రంథకర్త

—

ది 6-2-1980 న, రాపూరిపేట శ్రీ కాశీ విశ్వనాథస్వామి వారికి
ఆంధ్ర మహాభ్యుదయ ద్వితీయభాగ కృతి సమర్పణ
మహోత్సవ సమయమున తీసిన
ఛాయాచిత్రము.



శ్రీ బండ్ల సుబ్రహ్మణ్యంగారు వారి సతీమణి శ్రీమతి సావిత్రి



కృతి సమర్పణ మహోత్సవము — 6-2-80



కృతి సమర్పణ మహోత్సవము — 6-2-80



కృతి సమర్పణ మహోత్సవము — 6-2-80



కృతి సమర్పణ మహోత్సవము — 6-2-80

## 'ఆంధ్ర మహాభ్యుదయ' గ్రంథ ముద్రణకు సహకరించిన దాతలు



శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావు పంతులుగారు



శ్రీ రొండా రామస్వామి రెడ్డిగారు



శ్రీ జాగాబత్తుని చెంచయ్యగారు వారి సతీమణి శ్రీమతి శ్రీలక్ష్మిగారు



శ్రీ పిట్టి కుమారస్వామి గారు



శ్రీ పిట్టి త్యాగరాయశెట్టి గారు



శ్రీ పిట్టి సుబ్రహ్మణ్యం గారు



శ్రీ గోసు సుబ్రహ్మణ్యం గారు



శ్రీ పిట్టి చెంగలిశెట్టి గారు



శ్రీ పిట్టి గురువప్ప గారు



శ్రీ మైలాంగం రామదాసు గారు



శ్రీ కోనంకి చంద్ర[illegible]శ్వరరావు గారు



శ్రీ మైలాంగం వెంకటకృష్ణయ్య గారు



శ్రీ వుమ్మిడి వీరభద్రం గారు



శ్రీ వుమ్మిడి వెంకటేశ్వరరావు గారు



శ్రీ వుమ్మిడి పకీరయ్యా గారు వారి సతీమణి లీలావతి గారు



శ్రీ పి. యస్. రామ్‌మోహన్‌గారు



శ్రీ గుంటూరు బాలరామిశెట్టిగారు



శ్రీ పింజల ఎల్లమందేశ్వరరావుగారు



శ్రీ గుత్తి భావనారాయణగారు



మెసర్స్ గీతా హ్యాండ్లూం ఎక్స్‌పోర్టర్స్ & కో — బ్రాంచి : వేటపాలెం



మెసర్స్ శ్రీ సుదర్శన్ హ్యాండ్లూం ఎక్స్‌పోర్ట్స్, మద్రాసు-21



శ్రీ చుండూరి రంగనాయకులుగారు వారి సతీమణి ఆదిశేషమ్మగారు



శ్రీ జనాబ్ మహ్మద్ యూసుఫ్
సాహెబ్ గారు



శ్రీ ఉద్ది దక్షిణామూర్తి గారు



డా॥ భట్టి వీరప్రసాదరావు గారు, డా॥ భట్టి కోటాచారి గారు



శ్రీ పిచ్చిక వెంకయ్యగారు



శ్రీ పముజుల రామశేషయ్యగారు



శ్రీ పిచ్చిక సుబ్రహ్మణ్యంగారు



శ్రీ పముజుల సుబ్బయ్యగారు



శ్రీ సత్రము వేంకటేశ్వర్లుగారు



శ్రీ బాసం సుబ్బారావుగారు

# ప్ర త్య య ము

ఉ॥ కన్నది విన్నదొక్క ఘన కావ్యజగత్తునఁ జూప నెంచితిన్
విస్తులు వెట్టి లిట్టి యెదఁ బ్రేముడిఁ జూతురొ – త్రోసిపుత్తురో –
క్రన్నన మెచ్చరంత్రపు సమకాలికు లెట్టిది యైన – దీనిలో
సున్నయొ లేదొ మంచి – జగమున్నది రేపు నిజమ్ము చాటఁగా.

చ॥ తరతమ భేద భావముల తత్త్వ మెఱుంగక క్షీరనీరముల్
సరిసమ మెంచివాదములు సల్పుచు స్వార్థముపట్ల సుంతయున్
గుఱి తొలఁగంగ నీక తమ కొంచెపు బుద్ధి నమాయికుల్ మహ
త్తరమని మెచ్చ – సత్కవుల దాపునఁ జేరరు వంచకాధముల్.

శా॥ ఈ లోకాద్భుత కార్యసంఘటన లెంతేఁ గ్లిష్ట భూయిష్ఠమౌ
టాలోచించి పఠింపఁ దన్నిశిత ధర్మాధర్మముల్ దీరుఁడే
బాలం బక్షులు బ్రహ్మసృష్టిఁ గల వెంచన్నెంచ రాయంచకే
పాలున్నీరును వేఱుసేయఁగల సౌభాగ్యంబు దీపించెడిన్.

తే॥ శబ్ద విన్యాస నవసృష్టి శాస్త్రదృష్టి
ధ్వన్యలంకార రసపుష్టిఁ దత్త్వతుష్టి
సత్కథావ్యష్టి సత్యప్రశాంతహృష్టి
సుకృతి సృజన జనామోద సుకృతి యనరె ?

తే॥ సర్వభాషల గాలించి సత్త్వమెఱుఁగ
నాంధ్రమునఁ దక్కద్వ్యర్థిలేదఖిల జగతి
నొక్క పద్యాల వరుసలోఁ బెక్కుచరిత
లనఁటి పొరలట్లు లక్ష్యమౌ నచ్చెరువుగ.

కం॥ బ్రహ్మాండ మొక్క శిల్పము
బ్రహ్మ మహాశిల్పి, సుకవి భాస్వద్ద్విబ్రహ్మ
బ్రహ్మోపాసకుఁ డౌటన్
బ్రహ్మానందామృతమ్ము ప్రాప్తింపఁ గృతిన్.

# జన్మదేశము

సీ॥ చేనేత వృత్తికిఁ జెన్నారు కేంద్రమ్ము
జీడిపప్పునకుఁ బ్రసిద్ధసీమ
బాపయయున్నత పాఠశాలకు తావు
సుబ్రాయ మహాలున్నచోటు పూర్వ
సాగరతీరాచ్ఛ సైకతసుభగంబు
సాంబ్రాణివత్తుల జనని గృహము
నానాఁటి నుతిగన్న నవ్యమనోహర
నాట్యనాటక సుమనందనంబు

తే॥ పేదవిద్యార్థులకు లసద్వీధి "బి. యార్. కె."
యుచిత భోజన సౌఖ్యమహోన్నతంబు
కళలఁ గులికించు చక్కని లలిత కళల
కాలవాలము మా వేఁటపాలె మరయ.

సీ॥ వాణిజ్యకోశమ్ము పంచాయతీ సమి
త్యారోగ్య కేంద్రమ్ము నసలపేటి
కర్మోదవసితమ్ము కమనీయ నాటక
శాల చలనచిత్రశాల మనుజ
జంతు వైద్యాలయ సహకార సంస్థలు
బంధుర బాలికా పాఠశాల
భసిత పరిశ్రమ భవహారి గేహముల్
ఘన బహిరంగ రంగస్థలమ్ము

తే॥ ధూమశకటాళి విశ్రాంతి ధామమొనర
మేలికృతులకుఁ దగు ముద్రణాలయమ్ము
కలవిఁ కెన్నెని సంస్థలు లలిత కళల
కాలవాలము మా వేఁటపాలె మరయ.

ఉ॥ తియ్యని తేట నీ రిసుకతిన్నెలు గోగణ మాకుఁదోటలుఁగా
నెయ్యపు నేర్పరుల్ ఘనమనీషులు నీ రథికమ్మతెమ్మెరల్
చయ్యనఁ బంటకుందిరుగు శాద్వల భూములు క్షేత్రలక్ష్మలే
యయ్యలు చొచ్చి పోరు మృగయాపురి సౌఖ్యమునెన్న శక్యమే?

తే॥ ఆంధ్ర రాజొక్కరుఁడు వేఁటకరుగుదెంచి
లింగమును గొట్టి తత్పాప భంగమునకు
గ్రామ నిర్మాణ మొనరింపఁ గలుగు టరయ
వేఁటపాలెము నా జగద్వినుతి వెలసె.

—గ్రంథకర్త

# భరతమాత

సీ॥ మహిమ మించు హిమాద్రి మణికిరీటముగాఁగ
జాహ్నవి ముత్యాల సరముగాఁగ
ఘనమైన వింధ్యాద్రి కనకమేఖల గాఁగ
వెలయు లంకయ పాదపీఠి గాఁగ
పచ్చని పైరులే పట్టువస్త్రము గాఁగ
దేవాలయాల్ దీపదీప్తిగాఁగ
వ్యాస వాల్మీకులు వందిమాగధులుగా
సతులు హారతు లిచ్చు సుతలుగాఁగ

తే॥ ప్రాక్ప్రతీచ్యబ్ధులే చామరములు గాఁగ
రామకృష్ణాదు లాత్మజ రత్నములుగ
వరలెడి సుజాత విఖ్యాత భరతమాత
చిఱునగవుతోడ మమ్ము రక్షించుఁ గాత.



# ప్రబోధ గీతము

ప్రజాసేవ చేయుటకై – బయలుదేరు సోదరా
ప్రజాప్రభుత్వమున రామ – రాజ్యము సృజియింపరా ॥
తిలక్ తీర్చినట్టిబాట – దేశదాస్య మృగమువేట
గాంధీ జవహరులమాట – ఘనరక్షణ కంచుకోట. 1

ఝాన్సి ప్రతాప్ పృథ్వి రుద్రమ – ఛత్రపతుల క్షాత్రశక్తి
దీవనతో ప్రపంచమున – దివ్యకీర్తి నింపుమురా
మువ్వన్నె పతాక దివికి – ముద్దులొలుక నెగురవేసి
కవ్వడి చెలివలె స్వరాజ్య – కనకరథము నడుపుమురా. 2

బడిచదువుల సారమెల్ల – నడవడిలో చూపింపుము
అడుగడుగున నాత్మశక్తి – నందుచు ముందడుగు లిడుము
మహాకవుల కలములలో – మహాశిల్పిపోగరలో
మానవకల్యాణ దీక్ష – మాఱుమ్రోఁగు చుండునురా. 3

అమరజీవి శ్రీరాములు – అవతరించె నాంధ్రావని
అతని త్యాగదీక్ష మనకు – ఆదర్శప్రాయమురా
దేశమంటె మట్టికాదు – దేశమంటె ప్రజలనె మన
గురజాడప్పారావది – గుఱుతెఱుఁగుచు వఱలుమురా. 4

దినదినమును పెరుగుచున్న – జనసంఖ్యకు నధికపోవఁగ
జపాన్‌రీతి సాగుచేసి – అపారముగ పండింపర
సహకారపు సంస్థలయెడ – సానుభూతి చూపుమురా
సహజీవన పద్ధతియే – సాధువులకు సమ్మతిరా. 5

పండ్లచెట్ల పశుపక్షుల – పరిశోధనచేసి పెంచ
రహదారుల రవాణాల – రహిసౌకర్యముల నించ

నిరుద్యోగ సమస్యలను – నిర్మూలము చేయనెంచ
పాలకులును ప్రజలుకలసి – పనిసేయుట శ్రేష్టరా. 6

అందఱు నారోగ్యభాగ్య – మందగ కృషినల్పుమురా
కొందఱకే యవకాశము – కూడదంచుఁ దెల్పుమురా
వెనుకబడిన తెగలవారి – వెన్నుచఱచి పిలువుమురా
వారు మనకు దేశదృష్టి – వారసులని తెలియుమురా. 7

పరిశ్రమల మహాభ్యుదయ – పద్ధతి విద్యుచ్ఛక్తిని
వినియోగించిన నూతన – విభవము కనువిప్పురా
నిర్మల హృదయముతోడను – నీవొందిన ధనరాశికి
ధర్మకర్తవనుకొని తగ – త్యాగమహిమ చూపుమురా. 8

ప్రజారాజ్య మగుట పనికి – ప్రజలే ముందడుగులిడుచు
ప్రభుత్వమ్ము సాయమడిగి – పని సాధించుట తగురా
ప్రతిగృహమున పరిశ్రమల – పలుశాఖలు గనవలెరా
ప్రతిమనుజుం డాకాశవు – వాణివీణ వినవలెరా. 9

సముద్రంపు టొడ్డునఁబడి – చదువు సంధ్య లేకయున్న
పల్లెకాఱు పిల్లలకును – పాఠశాల లొనగూర్పుము
మాఱుమూల గ్రామములకు – మనలక పయనించి నీవు
గ్రంథాలయ స్థాపనచే – జ్ఞానధనము కూర్పుమురా. 10

పొదుపుటుద్యమంబు ప్రజకు – బోధింపుము సాధింపుము
మఱునటి దినబత్తెమునకు – మాటాకును హత్తింపుము
గ్రామ పారిశుద్ధ్యమునకు – గ్రామీణుల సాయమంది
వ్యాధిబాధ లేమిలేని – ఆనందము గలిగింపుము. 11

శాస్త్రజ్ఞులు యత్నించెడి – చంద్రమండలాది యాత్ర
లేనాడో చేసి పూర్వు – లెఱిఁగిన మన కథ లున్నవి
తెక్కలుగట్టుక వ్రాలెద – నిక్కువమను వాక్కొక్కటె
మనపూర్వ విమానయాన – ఘనతకు దృష్టాంతమురా. 12

వయోజనుల విద్యకొఱకు – వాడవాడ తిరుగుమురా
అంధకార బంధమునకు – అరుణోదయ స్వేచ్ఛరా
అఖిల భారతాధ్యక్షుఁడ – వగుటకు హక్కున్నదిపుడు
కోటిస్వర్గముల సౌఖ్యము – కూర్పుము నేర్పున నోర్పున. 13

పంచవర్ష ప్రణాళికల – పాటింపుము చాటింపుము
జాతీయ వికాస కేంద్ర – చర్యల దోడ్పడుమురా
శీతశిఖరి ధర్మద్యుతి – సేతువునకు చనవలెరా
నీతిలేని జాతిఖ్యాతి – నిర్జీవ ప్రతిమరా. 14

మత్తుపదార్థముల మీఁద – మమకారము త్యజియింపుము
నిత్తెము మనవీరుల పద – నీరజముల భజియింపుము
వందేమాతర మనియెడి – వాక్యమ్మును స్మరియింపుము
అందఱ నొక త్రాటిమీఁద – నాదరమున నడిపింపుము. 15

వేషభాషలొకటి గామి – వేఱుఁగాడు జగత్కర్త
భేదవాదనాదముడిగి – విశ్వశాంతి గోరుమురా
జే జే భరతాంబాయని – జే సస్యశ్యామలయని
జయమంగళ గీతములను – సంతసమున పాడుమురా. 16

శ్రీరస్తు

❋

శ్రీ శేషశైలసంవాస శ్రీనివాస పరాత్పర
పద్మావతీమనోనాథ వేఙ్కటేశ్వర పాహిమామ్

శుక్లాపాంగ ! శుభాంగ ! శోభితదయాశుంభద్యశస్సంగ ! స
ద్వైక్లబ్యామితభంగ ! సాధుజనసేవారంగ ! లోకాఘరా
శిక్లాంతిప్రవిభంగ ! భూరిగుణలక్ష్మీ పద్మినీహృత్పతం
గా ! క్లిష్టాంశవిభంగ ! రాజితరథాంగా ! వేంకటేశ ప్రభూ !

నరసుర వందిత చరణా
సరసీరుహనేత్ర విబుధసన్నుతపాత్రా
దురితతమోభర భాస్కర
కరుణామృత భరితహృదయ – కళ్యాణమయా !



CHINKALA SINGALAM CHETTY,
PICTURE MERCHANTS,
TIRUMALA HILLS.

SRI LORD VENKATESWARA

THE CORONATION LITHO WORKS, S

# అంకితము

సీ. ఏడేడు లోకాల నేలెడు దైవమై
యేడు కొండలపైకి నెక్కి నిల్చి
నిత్యకళ్యాణమ్ము నిరతమ్ము పచ్చని
తోరణమ్ములతోడఁ దూర్యరవము
లెసఁగ "నాపద మ్రొక్కు ఏవందుకోసామి
వడ్డికాసులవాఁడ వరద!" యనుచు
దాసు లత్యాసక్తి దర్శించి హర్షించి
పూజింప వారికి భుక్తిముక్తి

తే. నిచ్చి రక్షించు శ్రీవేంకటేశ్వరునకు
నంకితంబిత్తు "నాంధ్రమహాభ్యుదయము"
దీననే శ్రీనివాసుని దివ్యకరుణ
నిఖిల శుభములఁ బడయుట నిశ్చయమ్ము. 4

ఆ. వె. నిత్య కళ్యాణ గుణవర్తి! సత్యమూర్తి!
విమల హృత్పద్మమిచ్చి నిన్వేడుచుంటి
వేంకటేశ్వర! మమ్ము దీవింప వచ్చి
యమృత హృదయమ్ముతోఁ గృతినందుకొనుము. 5



# అవతారిక

ఒకనాఁడు వెలుఁగుఱేఁడు తొలిమల మిలమిల మెఱయుచుండ బృహత్కావ్య రచనా వాంఛా దివ్యజ్యోతి నా హృదయాంతరాళమునఁ దళతళ వెలుఁగుచున్నది. మిత్ర రత్నములగు విద్వత్కవివరేణ్య నట గాయకవతంసుల గోష్ఠిలోఁ గవితా లతాంగి ప్రదర్శిత లలిత నృత్యగీత కళావిలాసములతో నుదయకాలము గడచిపోయినది. లౌకిక మర్మ కర్మాభిజ్ఞులగు రాజకీయ వేత్తలు మత్సుహృత్తులు వివిధపక్ష సిద్ధాంత రాద్ధాంతములఁ జర్చించుచుండ నపరాహ్ణము దాటినది. యక్షగాన ఖండ కావ్య నాటకాదులెన్ని రచించినను మనంబునకుఁ దృప్తి జనింపలేదు. లోక బాంధవుఁడు తన మనోరథానుకూలమ్ముగ దివ్యపథమ్మున నాపక రథమ్ము నడిపించుచున్నాఁడు. మహాకావ్య కథావస్త్వన్వేషణము మన్మనో రథ మనవరతము పయనించుచునే యున్నది.

అది యానాఁటి సాయం సంధ్యాసమయము. హృదయాహ్లాద మొదవఁ బ్రాతరారంభమునఁ బ్రుతిహిత శ్రుతినినదమ్ముల సహస్కరుఁ బ్రార్థించు ద్విజబృందంబుం బలె మంజులనికుంజ పుంజాంతర్గత బహిర్గ తాండజంబులు జగద్రక్షాదక్షుండును, విరూపాక్షుండునగు నటరాజమూర్తి నటనాకౌశలంబుఁ గీర్తించుచున్నవో నాఁ గిలకిలారావంబులతోఁ గలకల లాడుచున్న తరుణమది. హంస, పరమహంస సర్వవర్గ సదానమాశ్రయ నిజపాద పవిత్ర స్పర్శంబునఁ బ్రాక్ప్రదేశాధ్యాత్మిక కళాకాంతులు ప్రజ్వరిల్ల దివ్యదీధితులతో దివి భువి వెలిఁగించి పాశ్చాత్యైహికభోగ వాంఛాహంకార తమఃప్రభలఁ బటాపంచలొనర్పఁ బరుగిడిపోయిన తఱి యయ్యది.

చంచరీక చికుర, శతపత్రనేత్ర, కంబుకంఠి, చక్రవాకస్తని, నవ మౌక్తిక మాలాలంకృత, మృణాలహస్త, సంశోభితసైకత శ్రోణియగు తరంగిణీ తరుణి యత్యాసక్తి నతిమోదుప్రకందోయితో జలపక్షికూజిత కటకమంజీర ఝుళంఝుళ ద్ర్వ్యావ్య నినదంబుతోఁ గలహంసగమనయై తరళ కల్లోలోల్లాస విలాసయై యిందిందిర ఝుంకారవ్యాజంబునఁ బింపిళ్లు కూఁగుచుఁ బ్రియుఁడగు రత్నాకరుం జేరుచున్నట్టియదనది,

కాఁపుబిడ్డ దుడ్డుకఱ్ఱ మూఁపునమోపుకొని కోకిల స్వరమువంటి గొంతెత్తి జానపదగీతములఁ బాడుకొనుచు దాఁపున మేపుకొన్న యాల మందలతోఁ గ్రేపుల యంభారవములతో నూరు చేరుచున్నాఁడు. కొంగలు బాఱులుతీరి పశ్చిమదిశనుండి తూర్పుదెసకుఁ బయనించుచున్నవి. పారావత శుక శారికానికరంబులు మేఁత చాలించి యున్నత సౌధ విటంకంబులకు దేవాలయ గోపురకుహరంబులకుఁ జేరుచున్నవి.

అపుడపుడే సంజకెంజాయ లలముకొని యింద్రధనుస్సువలె క్షణములో మాయమగుచున్నవి. మందేహదైత్యుల పరాజయార్థము వైదిక ప్రార్థనానిమగ్నులై నిమీలితాక్షులై యున్న విశ్వంభరామరవరేణ్యుల ననుకరించుచున్నది వెల్గుపిల్ల. సమయమెఱిఁగి తమోదనుజుఁడు తన కబంధ హస్తములఁజాచి తెల్గునేల నాల్గుచెఱఁగుల నాక్రమింప ధరాధర కంధరములనుండి తొంగి తొంగి చూచుచున్నాఁడు.

అస్మదభిజనమగు మృగయాపురినుండి మద్రపురివఱ కరుగు ప్రభుత్వ నిర్మిత సుదీర్ఘమార్గ మొకండు గలదు. తత్పార్శ్వద్వయంబునఁ జూత భల్లాతకీవనవిలసిత సితసైకత ప్రదేశంబులు చక్కెర యారఁబోసి నట్లుండు. వాతాతప వర్షంబుల కోర్చుకొనుచు వల్కలపత్ర జటాశోభితంబై యాశ్రితప్రాణికోటి కానందంబు గూర్చుచుఁ బరోపకార పరాయణత్వంబునఁ గులపతులఁ దలపించు వనస్పతుల పంక్తులాపథమ్మున కిరువలంకుల వెలయు. ఆ మునిమాపున నేనమ్మార్గమ్మున గ్రామాంతికసీమదాటి కొంతదవ్వేకతంబ స్వైరవిహారమరుగుచుఁ బరమేశ్వర నిర్మితప్రకృతిఁ బరికించుచుఁ బరధ్యానంబున మందమందంబున నడుగులిడుచుండ ననేక సహస్ర విద్యుద్దీపకాంతులు కేంద్రీకరింపఁబడినట్లు నిండుచందురుఁడు నింగినుండి నేలకు దిగుచున్నట్లు కనులకు మిఱుమిట్లు గొలుపుచు నొక్కచుక్క మిక్కిలి వెలుఁగులఁ గ్రక్కుచు దక్షిణదిశాభాగంబునంబడియె. అంత కొంతసేపటికే నిలుసేరితి. ఆబాలగోపాల మారిక్క తేజఃపుంజమున కెక్కడకక్కజం పడుచు నెక్కడివారక్కడ గుంపులుగుంపులుగా విచిత్రరీతులఁ జెప్పుకొనం దొడంగిరి.

ప్రత్యేకాంధ్ర రాష్ట్రమునకై సత్యాగ్రహంబు పూనిన నిత్యసత్యవ్రతుఁడు, నిష్కల్మష హృదయుఁడు, నిస్స్వార్థపరుఁడు, గాంధేయమార్గ

గామి యగు పొట్టి శ్రీరాములు జీవింపుట దుర్లభంబని మహాకాశవాణి పది దిశల ఘోషించినది. అప్పటి కా మహనీయుఁడు ప్రాయోపవేశోపవిష్టుఁడయి యేఁబదియేడు దినంబులు గడపెను. మహనీయుఁడు త్యాగధను శ్రీరాము లమరజీవి యయ్యెనను వార్త యావద్భారత మలముకొనెను. ఆంధ్రప్రజానీకము బలముకొలఁది కలకలము కలిగించ కేంద్రప్రభుత్వము నుగ్రాత్మలూపఁ బ్రజాభిప్రాయమును బాటించి ప్రత్యేకాంధ్రరాష్ట్ర ప్రకటనము జరిగినది. వీరమాతయగు తెలుఁగుతల్లి మంగళవాద్యములతో నవరత్న ఖచిత కనత్కనక సింహాసనాసనయై దిగ్దిగంతములనుండి జేజేల నందుకొనుచుఁ దన బిడ్డల నాశీర్వదించు సమయ మాసన్నమైనది.

అయ్యమరజీవి మహాద్భుత త్యాగమహిమ నాలోని కవితా మహోజ్జ్వల విద్యుద్దీపదీప్తి కొఱకు బెట్టునొక్కినట్టుకాగా సత్తుఁ జిత్తము కొత్త కాయత్తమగుట వెంటనే కలమందుకొని ౬

శా. శ్రీలాలిత్య కలావిలాసముల వాసింగన్న యాంధ్రావనిన్
జాలన్ మేలొనగూర్పఁ జెన్నపురమున్-స్థాపించెఁ జెన్నాఖ్యుఁడా
ప్రోలాపుణ్యుని పేరనే పరగెఁ దన్మఖ్యాంకధర్మాంశమున్
గ్రాలన్ రాములు రాష్ట్రసిద్ధికొఱకై-ప్రాయోపవేశుండుగాన్. 7

ఉ. రాలిన దొక్కచుక్క ఖళిరా నలుదిక్కుల వెల్గుఁగ్రక్కుచున్
రాలిన దొక్కచుక్క జివరాలగు నాంధ్రికిఁ గన్గొలంకులన్
రాలెను తెన్గునేల మన రాముల కాయము; స్వర్గసీమలో
రాలవె? రంభహారమున రత్నపురవ్వలు రమ్యకాంతితో. 8

ఉ. ఇచ్చితి ప్రాణముల్ పరులకెందరికో యొకమార్గదర్శివై
తెచ్చితి వాంధ్రరాష్ట్రము సుధీవర! యొక్కన ప్రేలువై చిరో
మెచ్చెను దేశదేశములు మేలు సెబాస్సని; యేనుఁగుండియున్
జచ్చియు వేయిసేయునను సామెత నీయెడ సార్థకంబురా! 9

మ. ఎవఁడో చంపిన చచ్చెఁగాని తనుతానే చంపుకోలేదు మా
నవ సేవానిధి గాంధి-నీవొ వ్రతచింతన్ దానవీరుండవై
యొవరే రీతిని బోధచేసిననుగాని ప్రాణమర్పించుటే
సేవసాంతంబని పట్టుపట్టితివి నీసత్యాగ్రహం బెట్టిదో! 10

ఉ. ఒక్కొక తెప్పపాటునకు ఒక్కొక నెత్తురుబొట్టు తగ్గగాఁ
జిక్కెను నీదుదేహము కృశించెను జీవకళావిభూతి యు
క్కెక్కెనుగాని దీక్షనడలింపవు నీక్రమశిక్ష యెట్టిదో
దక్కినదోయి రాష్ట్రఫలదానము నీ రతనాలచేతికే. 11

ఉ. మెండగు పూన్కిసైమను కమీషనురా నట జాతిగుండెతో
గుండియలొడ్డి నిల్చె నొక క్రూరునిచేతి తుపాకి గుండుకు
ద్దండత నాంధ్రకేసరి సదాస్తవనీయుఁ డతండె నీకడన్
గుండెలు బాదుకొంచు నినుఁగూరిచి బోరున నేడ్చుచుండెరా. 12

కం. పట్టాభి యడలె రంగా,
నిట్టూర్చెను నాగిరెడ్డి నివ్వెఱ పడియెన్
గట్టా! యనె స్వామి, విడని
పట్టనె సంజీవరెడ్డి - వగచెం గళయున్. 13

సీ. నిలువున నీరౌచు వెలవెలఁ బోవుచుఁ
జలికొండ గుండెలు కలఁతపడఁగ
తలయెత్తి కనలేక కలగుండువడి క్రుంగి
వింధ్యాద్రి నిట్టూర్పు విడుచుచుండ
రామరామా వాలిపో మేలొకోయని
మూకత్వమున ఋష్యమూకముండ
తడఁబడి విడుతూర్పు పడమటికనుమల
కన్నీరుమున్నీటఁ గలియుచుండ

తే. ఆంధ్రరాష్ట్రమహోభ్యుదయమ్ము కొఱకు
ఆత్మబలిదానమిచ్చి యియ్యఖిలజగతి
నమరజీవిగఁ బ్రఖ్యాతినందితీవ
అమలగుణధామ! పొట్టివంశాబ్ధిసోమ! 14

మ. కలదా న్యాయము చెన్నరాష్ట్రమున నిక్కంబెంత యోచించినం
గలదా ధర్మము రాజకీయమున చక్కందెల్పుమో కేసరీ!
తెలుఁగుంగడ్డకు పెద్దబిడ్డ వన "నేదీలేదులే" దంచు తాఁ
దల వాల్చెన్ మనపంతులయ్య బహుచింతన్ నిన్ను నోదార్చుచున్. 15

చ. బ్రతికిన నాల్గునాళ్ళు బహుభంగుల దేశపురోభివృద్ధికై
వెతపడిపోతివా? తెలుఁగువీర! దిగంగనలెల్ల రెన్న హా
రతులను బట్టి నీప్రతిభ రాజిల నప్రతిమానమాన్యతం
బ్రతిగృహమందు నీప్రతిమ పావనలీల వెలుంగకుండునే? 16

శా. ఆ వార్ధాఋషి పాదపద్మముల మాహాత్మ్యంబు ? యాంధ్రావనీ
సేవానంద మరందతుందిల తపశ్శ్రీభాస విశ్వాసమా?
దేవాధీశ్వరుఁడైన యీశ్వరుని సందేశంబు నీ యేమునున్నదో
నీవే తెల్పుము నీమహత్తు పరమౌనీ! యార్యవైశ్యాగ్రణీ! 17

చ. బలియు దధీచియుఁన్ శిబియు ప్రాణములిచ్చిన దాతలట్టి వా
రలుగలరా? యనన్ కలఁడు రమ్మని మీసముద్రిప్పి చెప్పగాఁ
గలఁడొక యాంధ్రుఁడే! యుగయుగాల జగాలనిగారవుం జిగిన్
జిలికెడి నీదు నామము ప్రసిద్ధకళాకమనీయ ధామమున్. 18

ఉ. పూలవిమానయానమున పొందెను స్వర్గము గాంధితాత యా
పూలవిమానమందె కొనిపోయిరి నిన్నును దేవకన్యకల్
మేలటు బోసినోటిదొర మెచ్చి యొసంగెడి పూలమాలలం
దాలిచినాఁడవా తెలుఁగు తల్లికి ముద్దులబిడ్డ నీవెరా! 19

ఉ. శాశ్వత దానధర్మముల సద్యశమందిన విశ్వదాత నా
గేశ్వరరావు స్వర్గపురికేగఁగ నిన్నని కౌఁగిలించుచున్
నశ్వరదేహమున్ విడిచి నాకముఁజేరితివంచు మెచ్చఁడే
విశ్వహృదంతరాళము ద్రవింపదె? నీచరితంబు విన్నచో. 20

ఉ. కోర బలారికిం గవచకుండలముల్ తెగఁగోసి రక్తపున్
ధారలు ఘోరదాన జలధారలు నేరయిపోవ మింట హా!
హా!! రవముల్ సెలంగగ మహారథి కర్ణుఁడు దానమిచ్చె నా
వీరుఁడు నీకు స్వర్గపురవీధుల రత్నరథంబు తోలురా. 21

ఉ. నమ్మిన ధర్మమూర్తులకె నాయుసురిచ్చెద రాజ్యలక్ష్మియుం
దమ్ము వరించునంచు బెడిదమ్ముగ నమ్ములు బొమ్మకుమ్మగా
నమ్ములపాన్పుపై నొరిగి - యమ్ముల నీకులఁగ్రోలి పుణ్యలో
కమ్ముననున్న భీష్ముఁడు - నెగాదిగఁజూచి - శిరమ్మునూఁచురా. 22

ఉ. అమ్మ ! సరోజినీ ! కదలవమ్మ - దివమ్మును జేరనేఁడు నీ
తమ్ముఁడు - పూలు చల్లవలదా ? మనమేడలనెక్కి చల్లఁగా
రమ్మన సోదరుల్ - సరగరండని - యా కవయిత్రి మల్లెపూ
లెమ్మెయి చల్లెనో - సుమములే జయగీతిక పాడుచుండెనో. 23

ఉ. ఎన్నొ శరత్తులేలి పరులేగిరి తెల్గిఁకఁ దొంటివెల్గు పొం
దన్నిజశక్తిఁ జాటితని - నన్నయ తిక్కన యెఱ్ఱనాదు ల
త్యున్నత భావబంధుర మహోజ్జ్వల పద్యములన్ రచించి నీ
సన్నిధిఁ జక్కగాఁ జదివి స్వాగతపత్రము లిచ్చుటబ్బమే. 24

ఉ. పోయినకీర్తి తెచ్చితని - బొబ్బిలివీరులు కాకతీయులున్
రాయలు బ్రహ్మనాయఁ డలరా జనపోతన బాలచంద్రుఁడున్
నాయకురాలు రెడ్డి నరనాథులు బారులుతీరి నీకు జే
జే యని పల్కరే తెలుఁగు సింగపుటెల్గులు మాఱుమ్రోఁగఁగా. 25

శా. "కుస్తీ సర్కసు" లందు భీమ బలశక్తుల్ జూప నింగ్లండులో
నిస్తుల్యుండని బ్యాండు మేళములతో నివ్వాళులర్పించి రా
వస్తాదౌ ఘన రామమూర్తి మెఱుఁగుం బంగారు లంగోటితో
ముస్తాబై నినునెత్తికెత్తుకొని చూపుం గండలుప్పొంగఁగా. 26

మ. ప్రధనంబున్ సమకూర్చ రాజ్యరమ సంప్రాప్తించునంచున్-మహా
వ్యథతో దేశమువీడి - సర్వబల సైన్యస్ఫూర్తి సాధించి - దు
ర్విధిచేఁ బ్రాణముఁబాసె బోసతఁడ దేశ్వేతాశ్వరాజంబుపై -
నధిరోహించి బరాబరుల్ సలుపు బాహాదండమున్ జూపుచున్. 27

ఉ. ఖద్దరు దుస్తులందొడిగి - కాళ్ళకు బూటును కంటిజోడుతో
ముద్దులుగుల్కుచుండి - నడుమున్ బిగియించిన కాసెకోకలో
పెద్దకటారిగ్రుచ్చి - రణవీరుని పోలిక గుఱ్ఱమెక్కి రా -
యద్దిరయంచు బోసుఁగని - యచ్చెరలచ్చెరువంది మెచ్చరే. 28

ఉ. సేవలుచేసి భూమి దివి చేయఁగ చేతులుగల్గినట్టి నీ
దేవి వియన్నదీజలముఁదెచ్చి - విమానము డిగ్గినంత నీ
పావన పాదముల్గడిగి - పైఁటచెఱుంగుననద్ది - మాలయుం
దావులఁజిమ్మ వేయఁ - గరతాళములెల్లడ మ్రోఁగు ఘల్లునన్. 29

ఉ. తొలిమిఁ దూలకే తెలుఁగుదల్లికిఁ గూర్చఁగఁ గంకణంబుతోఁ
గ్రాలిన సద్విమర్శక శిఖామణి రెడ్డికులాబ్ధిరా జస
జ్జాలుఁడు 'కట్టమంచి' సరసజ్ఞుఁడు ధీనిధి - యాంధ్రవిశ్వ వి
ద్యాలయ పోషకుండు విజయధ్వజమెత్తి నమస్కరించరా. 30

ఉ. ఏల విదేశపాలన సహింతుము లెండను గాంధిపిల్పుతో
మేలొనఁగూర్ప దీక్షఁగొని - మేజా పులకింప వచించువక్త - త
త్కాలపు టాంధ్రరత్నమని - ఖ్యాతిగడించిన దుగ్గిరాల గో
పాలుఁడు నీ విశిష్టగుణ - భవ్యతకుం జెలువప్పు నప్పురా. 31

ఉ. ఆంధ్రుఁడు కాఁడుకాని మన - యాంధ్రకపీశులపాలి కల్పమై
ఆంధ్రికివేలు లక్షలిడి - యాంధ్రకపీశుల సగ్రగణ్యుఁడై
ఆంధ్రమునందు సత్కృతులు - నందిన విక్రమదేవవర్మ నీ
బంధుర సాహసక్రియ క - పారముదమ్మునఁ బొంగి పోవఁడే. 32

మ. తొలినే నాటిన మొక్క యిప్పటికి ముద్దుల్గుల్కు గ్రమాన్నై మహా
ఫలమీయం బహుదోహదంబొనఁగితో - బ్రాణమ్ములర్పించి కొం
డలు బెండ్లైనవి నీదుగుండెకని - కొండా వేంకటప్పయ్య నీ
తలపై దివ్యకిరీటముంచి విజయధ్వానంబు గావించరా. 33

మ. తనశక్తిన్ వెదజల్ల కాంగ్రెసు చరిత్రన్ వ్రాసె గాంధేయ ని
ష్ఠను గష్టించి స్వరాజ్యపూజ్యరథమున్ సాగించినాఁ డీతఁడే
ఘనుడం చెన్నఁగ దేశసౌఖ్యమెదలోఁ గాంక్షించె పట్టాభి యా
జనవంద్యుండు త్వదీయదీక్షకు మహాశ్చర్యంబుతో మ్రొక్కురా. 34

శా. రాధాకృష్ణుడు గీతతోఁ దనివినొందం బోక నేఁడిక్రియన్
రాధాకృష్ణుఁడుగా జనించి - ఋషివర్యప్రోక్త వేదాంతమున్
బోధించెన్ జగమెల్ల నట్టి ఘనుడీ - పూర్ణాహుతిం జూచి నీ
గాధంబాశలఁ బంపురా విజయశంఖారావముల్ నింపురా. 35

ఉ. ఏలితి ముప్పదేండ్లు పురి నేను కిరీటములేని రాజనం
జాలితి మాటమూటగుట - జస్టిసుపార్టికి నేతనైతిఁ దా
త్కాలిక రాజభోగినని - తట్టినదివౌ స్వదేశదాస్య ఖం
ధాలను ద్రెంచు త్యాగివిలసద్గంధము నీకనుఁ ద్యాగ[illegible]; 36

మ. తలకున్ మించిన భారధూర్వహుఁ డుపాధ్యాయుండు ధీరుండు ని
శ్చల దీక్షామతి గ్రంథకర్త విలసత్సంస్కర్త సద్వక్త నీ
విలువన్ మెచ్చుచుఁ గందుకూరి కులుఁడౌ వీరేశలింగాఖ్యుఁ డిం
పలరన్ నిన్నలపారిజాత సుమమాలాలంకృతులం జేయురా! 37

తే. రాష్ట్ర సచివాగ్రణిగనుండి - రాణమీఱ
శాస్త్ర విజ్ఞానవృద్ధికై - సరగనాంధ్ర
విశ్వవిద్యాలయమ్ము స్థా - పించె నెవ్వఁ
డట్టి పాన్గంటిరాజు ని - న్నభినుతించు. 38

ఉ. ఎల్లజగంబుమెచ్చ నిటు - లీవు మహాబలిదానశీలివౌ
టల్లన విన్నఁగన్న నిను - నాదృతిఁగాంచఁగవచ్చి శ్రద్ధమై
బొల్లిని నాయకోత్తముఁడు - బొబ్బిలి భూపతి కూర్మవంశ్యుఁడు
త్ఫుల్లహృదబ్జులై పరమ - పూజ్యుఁడవంచు నుతింతు రద్దివిన్. 39

కం. ఘనుఁడగు గాంధీ యడుగుల
ననయంబడుగిడుచు నడచి - యాంధ్రికిరాష్ట్రం
బునుదే ననువులనిడుటం
గని బ్రహ్మానందరెడ్డి - కడుఁజింతించెన్. 40

కం. విశ్వకవీంద్రుని సంస్థన్
విశ్వజనీనైకదృష్టి - విద్యగఱచి నీ
విశ్వవిసర్గము విని కని
విశ్వము గోపాలరెడ్డి - విస్మితుఁడయ్యెన్. 41

కం. పలికినది యెంత సత్యమొ
సలిపినయది యెంత త్యాగ - సమరంభాహా
మలినములేని మనస్సని
యిలఁగల కవికోటి యాత్మ - నెఱిఁగి నుతించెన్. 42

ఉ. మానవ నక్కజిత్తులను - మానవ మా నవరాష్ట్రసిద్ధికై
పూనితి దీక్ష ప్రాణములు - పోయినఁబో నిఁకఁబోవుఁగాక నా
మానసశక్తి నీకు నవ - మానముకూర్పద చక్రధారి యీ
దీనుని కోర్కెదీఱుటకు - దివ్యులు దీవనలిత్తురంటివే. 43

ఉ. క్రౌర్యములేని శౌర్యమునఁ - గాఁగల కార్యముదీర్పఁ నేర్పునై
స్థైర్యముసూపి యేలికల - శక్తికలంచి జయించితెంతయో
శౌర్యముతోఁ బ్రతిజ్ఞలను - జల్పరె నీవలె నిల్చిపోరిరే
ధైర్యముతోడ నాత్మ బలి - దానమొనర్చఁగ నీకెచెల్లెరా! 44

శా. నీ రాష్ట్రోద్యమ దేహదాన రవిహృన్నీ రేజముల్ విప్పఁగా
నూరేగించుచు నీపటమ్ములను గమ్యానిష్టులూరూర నిం
డారన్ భక్తినిజూపఁజూపఁ బెక ఖండజ్యోతి వెల్గించి నీ
వీరత్యాగము గూర్చి వారిసభలన్ వేనోళ్ళఁ గీర్తింపరే? 45

ఉ. ఎండెడి మోడుమ్రాకు చిగిరించినదోయి త్వదీయశక్తిచేఁ
బండినదోయి మాతపము బాగుగ బచ్చనితోరణాలతో
నిండినదోయి యాంధ్రధరణీ స్థలి నిస్తులరామనామమే
కొండలు పిండిసేయునని కోరిభజింపరె తెల్గునేలలన్. 46

శా. ఆ రాయంచలలో శుకావళులలో నా శారికాపంక్తిలో
నా రామస్థమయూర బృందములలో - నాకాశ గంగానదీ
తీరం బందల శ్వేతసైకతముపై - దివ్యాంగనల్ వీణియల్
గోరన్ మీటుచు నీ చరిత్రములు పెక్కుల్ పాడరే? యాడరే? 47

చ. కవుల కలాలు గాయకుల గానము శిల్పుల చేతికుంచియల్
నవనవజీవ భావముల నాట్యముసేయును మాతృసేవలో
ప్రవిమలభక్తి సోదరులు పాల్గొని ధన్యులుగండు తూర్పునన్
రవి యుదయించె నీ తెలుఁగు రాష్ట్రము రాజిలు రామరాజ్యమై. 48

శా. పారావార గభీరధీర హృదయా! ప్రారబ్ధసర్వోదయా!
సారాచార విచార పూరిత దయా! సంఖ్యావ్యశుంభజ్జయా!
శ్రీరమ్యాంధ్ర యశోనభోద్యుమణి! లక్ష్మీశభక్తి ముక్తామణీ!
ఏరీ నీసరి వీర కేసరులు నేఁడీ యాంధ్రదేశమ్మునన్. 49

చ. జయసుమధామమై సరసశాంతి పదోరచనాంకమైన నీ
నయవినయాది సద్గుణగణమ్ము మనోహర మాధురీ ఝురీ
చయములముంచి యెత్తుచు ననత్యమలీమసమెల్ల మాన్ప మా
నయనము లుల్లసిల్లెనవి నాయకరత్నము! ధీరసత్తమా! 50

కం. కత్తియుఁ గలమును బట్టక
చిత్తం బుత్తమజనాళి సేవాధర్మా
యత్తమొనరించి రాష్ట్రముఁ
దెత్తువనుచు నెవ్వరైనఁ దెలియరు రామా! 51

తే. అమరఁ గనకాననంబెక్కె నాంధ్రనేత
అమరసింహాసనంబెక్కె నాంధ్రమాత
దివి భువిని జల్లుపూజల్లు దిశలఁబ్రాఁకి
యాకసంబున నియ్యాల నందుకొనియె. 52

వ. అత్తఱి నాంధ్రరాష్ట్ర మహోత్సవము లత్యద్భుతముగ సఖండ జ్యోతి వితతులతో, శ్రీరామార్చిత సర్వపక్షనమస్కృతులతో, అమితోల్లాసముతోఁ తెలుఁగునేల నెల్లెడల జరుగుచుండ మిత్రుల కోరిక గౌరవించుచుఁ దత్సంబంధ సభావేదికలపై నీ పద్యములు చదివితి. శ్రోతలు చూపిన అత్యంతానురాగము నాలో నేదో నూతనోత్సాహము రేకెత్తించినది. అంతియకాక హరికథకులు, గాయకులు, రాజకీయ ప్రచారకులు నీపద్యముల సమయోచితముగ నుపయోగించుకొంట లోక విదితము. ముక్కోటి యాంధ్రులు నల్వదేండ్లు శ్రమింపఁ జివర కమరజీవి జీవిత దానముతో నందుకొన్న యాంధ్రరాష్ట్ర చరిత్ర పద్యకావ్యముగ వ్రాయసంకల్పించితి. కాన నియ్యదియ కావ్యరచనాచోదక ఘట్టము.

ఒక్కొక్కజాతి కొక్కొక్క విశిష్ట సంప్రదాయముంట ననూచాన పదోత్పత్తికి హేతువైనది. అది యాజాతికి జీవగఱ్ఱ. సర్వవిధముల దాని సంరక్షించుకొన జూచుట వారి పరమధర్మము. అది లేనినాఁడు ప్రపంచమున వారికిఁ బ్రత్యేకవ్యక్తిత్వము శూన్యము. ఈ సిద్ధాంతము నాధారముగఁ జేసికొని దీక్షాదక్షులమై యెట్టకేల కాంధ్రరాష్ట్రమహోదయమును గనులారఁ గాంచఁగలిగితిమి.

ముక్కోటి యాంధ్రుల కిదియొక ముక్కోటి. సర్వాంధ్రశుభోదయసూచక ఘట్టము కావున దీని కాంధ్రమహాభ్యుదయ మ్మని పేరు పెట్టితి. ఇది పొట్టి శ్రీరాముల జీవితచరిత్ర ప్రధానముగాఁగల కావ్యము. అతని రాజకీయ జీవితచరిత పత్రికలలో దిఙ్మాత్రముగ లిఖింపఁబడినదే

కాని సమగ్ర జీవిత కథ యెందును లభింపలేదు. చారిత్రాత్మక సత్యములు సాహితీ రసపోషణాలంకారములతోఁ జిత్రింపవలసిన గ్రంథములను గాలిని మూటగట్టి వ్రాయుట సహృదయులకు సమ్మతి కానిపని. మన వాఙ్మయమున సహజస్వరూప చిత్రణములకంటె నలౌకికాసంబద్ధ ప్రవచనములు కొన్ని యెడల మెండని అది నేలవిడిచి సాముచేయుట వంటిదని వివిధ భాషావిద్వద్విమర్శకులు కొందఱందురు. కవితారసస్య కలంకారా ప్రాయములగు నలంకార కవి సమయాది సాధన సంపత్తితో రస వాహినిం బ్రవహింపఁజేయుట వాఙ్మయజ్యోతులు వెలుఁగించుటేయైనను అసంబద్ధ స్వేచ్ఛ యనుచితమనుట సమంజసము. ఏది యెట్లైనను యథార్థము నూఁతగాఁ గొని వ్రాసిన వ్రాఁతయే లోతెఱిఁగిన విజ్ఞుల హృదయములకుఁ దనివి నొందించుననుట యస్మద్విశ్వాసము. కావ్యరచనకు శ్రీకారము చుట్టితినేకాని వారి జీవిత ప్రథమభాగ కథాన్వేషణము ప్రథమకర్తవ్యమని గుర్తించి తత్సోదరుఁడగు డాక్టరు పొట్టి రంగయ్య గుప్త, యం. బి. బి. యస్. గారికి లేఖలువ్రాసి వాని మూలమున అమరజీవి చరితలోని ముఖ్య సత్యాంశములు గ్రహించి వాని సూత్రప్రాయముగాఁ గొని యీ రచన సాగించితి.

డాక్టరు రంగయ్య గుప్తగారికిని నాకును దొలుదొల్త లేఖల మూలముగ మైత్రి గలిగించిన శ్రీ గొల్లపూడి రాధాకృష్ణయ్య శ్రేష్ఠి గారికెంతయుఁ గృతజ్ఞుఁడ.

ఆంధ్రదేశమునఁ బేరెన్నికఁగన్న గ్రంథాలయమగు సారస్వత నికేతన వార్షికోత్సవ సభలో నీ కావ్యగానము జరిగినది. విద్యాభిమానులగు శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావు పంతులుగారు, ఉదార స్వభావులగు శ్రీ గంజాం సత్యనారాయణ పంతులుగారు శ్రీ నాసిక మల్లికార్జునరావు బి. ఏ. బి. ఇడి. గారు మిత్రుల ప్రసాదనమను పేర రు 116 లతో సత్కరించిరి. వారికి నా ధన్యవాదములు.

నీతిచంద్రికావికసిత హృత్కైరవుండై బహుమిత్ర భాగ్యమందుచు లలితకళారాధన తత్పరుఁడై గురుజన సేవాధురీణుడై నా రచించిన గ్రంథములకు ముత్యాలవంటి యక్షరములతోఁ జక్కని శుద్ధప్రతులు వ్రాసి నన్ను

సంతోషపెట్టుచున్న అస్మచ్ఛాత్రరత్నమగు చిరంజీవి పింజల బుల్లయ్య, యం. ఏ. ను భగవంతుఁ డాయురారోగ్యము లిచ్చి రక్షింపవలయునని యాశించుచున్నాఁడ.

సీతారాముల వివాహమహోత్సవము వఱకిప్పటికి బూర్తియైనది. ఇది ప్రథమభాగము. నా కళారాధనలోఁ దెలుఁగుతల్లి కిదియొక పూజా పుష్పాంజలి. 53

—

# కృత్యాది

శా. శ్రీ వాణీ ధరజామనోజ్ఞరవియై కృష్ణాజ శర్వస్వరూ
పావిర్భావ విలాస భాసుఁడయి సృష్ట్యాద్యంశ సత్కర్తయై
భావాతీత పరాత్పరుండగు పరబ్రహ్మాహ్వయున్ సర్వదా
సేవింతుం బరమార్థసిద్ధికిఁ గళాశ్రీదృక్సుధాలబ్ధికిన్. 1

శా. శ్రీ గౌరీసతి పెండ్లివేళఁ బురజిచ్ఛీర్షంబుపై సేసఁబ్రాల్
వేగంబోయుచు కుద్య మించి జడలన్ వేఱొక్కతెంగాంచి తా
రాగంబొప్పఁగ నల్ల దేహమున నార్యం దాల్చి రంజించు త
ద్భోగీంద్రాభరణుండు మాకు నిడు సంపూర్ణాయురారోగ్యముల్. 2

శా. శ్రీ వైకుంఠము శేషశయ్యఁ బదముల్ శ్రీదేవియొత్తన్, సురల్
సేవింపన్, ఋషిరాజి నారదునితో శ్రీశార్ఙ్గికళ్యాణ రా
గా వృత్తామృతగేయముల్ జదువ హాసాంచద్దయాదిష్టుఁడౌ
శ్రీ విష్ణుండు సమస్త పోషకుఁడు రక్షించున్ మముం బ్రీతితో. 3

కం. వాణీ హిరణ్య గర్భులు
వీణాపుస్తక వినోద విచలత్పాణుల్
రాణించుత వాఙ్మనముల
రాణ రసోద్రిక్తరచన రాజిల్లంగన్. 4

మ॥ అమరశ్రీ భవదీయ దృగ్జనిత హర్షాశీః కళావర్తి గా
నమరన్ నీ దయ కందరానిదెది యష్టైశ్వర్య సంధాయినీ!
హిమవత్పుత్త్రి! భజింతు నిన్నెపుడు మద్ధృత్పీఠిఁ ద్వత్పాద ప
ద్మములన్ నిల్పి జయమ్ముఁ గూర్పు మిఁక మాతా రాజరాజేశ్వరీ! 5

ఉ. ఎవ్వఁడు చుట్టివచ్చుమున యీ యిలనంచు గుహుండు నెమ్మిపై
నెవ్విధిఁ దిర్గిరా నెలుకనెక్కియ ముందుగ గుజ్జురూపుతో
నవ్వనుజుట్టి నిల్చి జయమందితి నేనని తమ్ముఁ గుజ్జుతో
నవ్వుచుఁ బల్కుచున్న గణనాథుఁడొసంగు సమస్త విద్యలన్. 6

మ. ఘనపద్మాసుర తారకాద్యసుర సంఘంబున్ జయింపం భవ
జ్జననం బాసురలెల్లఁ గోర స్మరదీక్షన్ శూలి తేజః ప్రభం
దనువుందాల్చి బుధేచ్ఛమెచ్చి రిపుదత్తశ్రీల దేవాళిక
ర్పణ గావించు మయూరవాహన! కుమారస్వామి! మమ్మేలుమా! 7

మ. శ్రుతిసీమంతిని యే మహామహు దయాజ్యోత్స్నం ప్రశంసించు స
మ్మతిమౌనుల్ తిలకింతు రెవ్వని నిజాత్మన్, ధర్మసంస్థాప నా
ద్భుత రూపోజ్జ్వలుఁ డెవ్వఁ డట్టి రఘురాముండార్య సంరక్షకుం
డతి వాత్సల్యముమై సతమ్ము మదభీష్టార్థమ్ములం గూర్చుతన్. 8

ఉ. రామ గురూపదేశమున రత్నపుముద్రికఁబూని లోక మా
యామతి వారిధిం గడచి యైహిక కిల్బిషలంకఁ గాల్చి సీ
తా మహిజాత మోక్షరమఁ - దాఁగని దాగని సంతసాన శ్రీ
రామ పదమ్ములో నిలిపి - రాజిలు శ్రీ హనుమంతుఁ గొల్చెదన్. 9

శా. వ్రేలన్ హంసలు పిండుగట్టియమునం బూదెప్పపై రుక్మిణీ
లీలాగాన కళావిలోలుఁడయి యోలిన్ వేణునాదశ్రుతిన్
జాలంజక్కఁగ మేళవింప విని మెచ్చం బార్శ్యగో గోపికల్
కేళిందేలుచు ముద్దులొల్కు మురళీకృష్ణుండు మమ్మోముతన్. 10

ఉ. ఒక్కొకవ్యక్తి నొక్కొక మహోత్తమ శక్తినిమిడ్చి సృష్టికిం
జక్కదనంబుఁ గూర్పఁగల సాధన సంపదగా నమర్చి తా
నెక్కడొ డాగియుండి యెపుడేనియుఁ గంటికిఁ గానరాక యే
దిక్కయి లోకచక్రమును - ద్రిప్పెడి యా జగదీశుఁ గొల్చెదన్. 11

చ. ఎఱిఁగి యెఱుంగకే యఘములే నొనరించితినో పరాత్పరా
కరుణనుగాచు దైవమని కాళ్ళకు మ్రొక్కుచు వేడుచుంటి నా
దురితములంగలంచి యిహ దుఃఖములెల్లనడంచి ప్రోవరా
తిరుపతికొండపై వెలయు - దివ్యకళానిధి! వేంకటేశ్వరా! 12

ఉ. సుందర మందహాస పరిశోభితమూర్తివి నీ కటాక్ష ని
ష్యంద దయారసామృతము చల్లఁగ నాపయిఁ జిల్లి లోక సం
బంధ కళంక బంధములఁ బాపి యమోఘపథమ్ముఁ గూర్పరా
వందన మింద్ర ముఖ్య సురవందిత! తిర్పతి వేంకటేశ్వరా! 13

చ. తనుజకళత్ర మిత్రతతి - తల్లియుఁ దండ్రియుఁ జుట్టపక్కముల్
మనసు మఱింతగాఁ బ్రకృతి - మగ్నమొనర్తు రదేమిలాభ మీ
మనుజ భవంబునం గడకు - మామక 'జన్మకు' మోక్షమీయరా
సనకసనందనాది మునిసన్నుత ! తిర్పతి వేంకటేశ్వరా ! 14

ఆ. వె. పరమభక్తిఁ గొలుతుఁ - బ్రాచేతసుని వ్యాసు
భాసు దండిఁ గాళిదాసు భోజు
బాణు హర్షు మాఘు - భవభూతి భారవి
దేవవాణి రసనఁ - దేజరిలఁగ. 15

తే. ఆశలఁ ద్యజించి యడవుల నాశ్రయించి
పర్ణశాలల వసియించి బహుతపించి
సంస్కృతి సృజించి శాస్త్రముల్ సంతరించి
నట్టి భారతఋషుల కే నంజలింతు. 16

వ. ఇందనుక నా జీవితమ్మునం దెట్టి స్థితియందును 17

చ. అడుగుటయెట్టిదో యెఱుఁగనట్టి కరమ్ము కరమ్ము భక్తితో
నడుగు నుమాపతీ! నుతి దయామతి సద్గతి నిత్తువంచు నీ
యడుగులముద్ర నాదు హృదయాబ్జమునం దగ హత్తుకొన్నచో
నడుగఁగ నేల హాయినిడవా యిహమందుఁ బరమ్మునం దొగిన్. 18

వ. అయినను "దైవం మానుషరూపేణ" యను సూక్తి ప్రేర
ణమ్మున సహాయ మపేక్షించిన 19

కం. ఘనకృతి కుపకృతి సుకృతియ
యొనగూర్చు నటంచు నెవ్వఁడూఁత యొసంగున్
మునువెనుక లరసి రసికత
తన మనభేదంబు మదిని దలఁగక యున్నన్. 20

ఉ. రాజులుపోయినారు కవిరాజుల పూజలొనర్చి యెవ్వఁడే
రాజగు నెన్నికం బ్రజల రాజ్యము నా నటుగాన భూప్రజల్
రాజులు నేఁడు వారు కవిరాజుల సత్కృతు లాదరింపరే
రాజిలనేర్చునే కళలు రంజిలఁజేయునె సాహితీగతుల్. 21

మ. సరసత్వంబున వృత్తబంధురత నిష్కామైక దీవ్యత్కలా
వరద శ్రీ సుమనోరతిన్ బుధ గురుత్వం బందుటన్ లోక భా
స్వర సర్వజ్ఞ శిరోవిభూషయగుటన్ సన్మార్గ సంచారతన్
దురితాంధ ప్రతిబంధశక్తిఁ గవిచంద్రుల్ పూజ్యులౌ టబ్రమే? 22

(ద్వ్యర్థి)

ఉ. తాలిమిమై మహాకవియు ధార్మికు నొక్కని నాశ్రయింపఁగా
నేలని పృచ్ఛసేయఁబనియేమి? జగత్కళ పెంపుసేఁతకే
చాలఁగ వెల్గుఁ జూపఁగల చక్కనిరత్న మమూల్యమయ్యుఁ దా
మేలిమి యండనుంట కడుమేలని దానిని జేరుచుండదే? 23

మ. మణిచేఁ గంకణమట్లు కంకణముచే మాన్యప్రభాయుక్తమౌ
మణిపోలెం గృతికర్తచేఁ బతియు సంభావింపఁ దద్భర్తచే
జనమాన్యుండగు గ్రంథకర్తయును బూజ్యస్థానశశ్వద్రమన్
ఘనకీర్తిం గయికొంద్రు జ్ఞానధన భృత్కళ్యాణముం గూర్చుటన్.24

వ. సప్తవ్యసనమ్ములకంటె సప్త సంతానమ్ములు సర్వదా సర్వో త్తమములనుట సత్యదూరము కాదు. కావున నింతయోచించి కులమత రాజకీయ సాంఘికాద్యనేక లౌకిక విషయ తంత్రజ్ఞుల మంత్రాలోచనకుఁ దావీయని తత్త్వవేత్తలగు సహృజ్జన వరేణ్యు లెవ్వరీ నా కవితాకల్ప లతామతల్లిక జగద్వ్యాప్తికై సుమనోనురాగ సుధాప్రదానంబున సర్వ విధమ్ములఁ బోషించు రట్టివారలపైఁ గరుణాకటాక్ష వీక్షణములఁ బ్రస రింప జగద్రక్షకు వేఁడి 25

ఉ. తా నుత భారతాన జనతామత సాంఘిక రాజకీయ వై
జ్ఞానిక వృత్తముల్ సరససాహితి వృత్తములన్ లిఖించె సు
జ్ఞాని కళాతపస్వి యతి సాత్యవతేయుఁడు మ్రొక్కి వానికిన్
నేనును నేఁటిదృశ్యముల నేర్పునఁ గైత పటానఁ జూపెదన్. 26

ఉ. పండిన కల్పకంబులన భారత భాగవతాదులెన్ని యే
నుండెఁ బురాణరూపమున నొప్పుగఁ దద్రసశక్తి రక్తమం
దండగనుండ దైవకృప నంది రచించెద ధర్మకర్మ మొ
క్కండు ప్రబంధపక్కి సమకాలిక జీవిత చిత్రణాదృతిన్. 27

ఉ. ఎంచఁ బరోపకారమునకే సృజియించె విరించియంచు భా
వించి మహాత్ములార్య పదవీ నదవీయసులౌచు సర్వ మ
ర్పించిరి విశ్వశాంతి సుఖవీక్షణులై యపుడప్డు వారు వ
ర్తించినరీతి నీతిగల దేశము లెల్లెడఁ జాటఁ జెల్లదే? 28

తే. మన పురాణాదులెన్ని చూచినను వినిన
నౌత్తరాహుల కథలెగా యలముకొనియె
అరుదె కవులు ధీరోదాత్తు లాంధ్రులందు
లేదె కలయిక యిర్వంక లేశమైన. 29

కం. తనవాని దాను గుర్తిం
చిన దోసము గల్గునేమొ చిన్నతనమొ యే
మని యెంత త్యాగినైనను
మన యాంధ్రులు మెచ్చరెట్టిమతియో గతియో. 30

కం. ఆ లోకవు టాలోకం
బాలోకములేని బుద్ధి కలవడు నౌకొత్రై
కాలిక విశ్వానంద
శ్రీ లీలానిత్య సత్య జీవద్రచనల్. 31

కం. రాజ్యమునకంటెఁ గవితా
రాజ్యంబే యెక్కుడనుచు వ్రాసిరి సుకవుల్
భోజ్యంబది యేమున్నదొ
పూజ్యతముల్ దాని యెఱుకపొంది తెలుపుఁడీ 32

ఆ. వె. తెన్గుసేఁతగాదు తెలిసిన కతయుఁ గా
దందునందు విషయమందు కొనుచు
నీశ్వరాజ్ఞ సత్యమే నిత్యమని నమ్మి
కావ్యసుధను గూర్పఁ గడఁగువాఁడ. 33

వ. ముఖ్యముగ శ్రీరాముల సోదరుఁడు లేఖల మూలమునఁ దదగ్రజుని చరిత్రలోని యత్యవసర ప్రసిద్ధాంశములు నా ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరముగఁ దెలుప నవి యస్మదుత్సాహ లతిక కమృతధారలయ్యె. 34

కం. పుక్కిటి పురాణముం బలె
వెక్కసముగఁ జూతురేమొ వేయేండ్లకు నే
నొక్కఁడు జనింపఁడింతటి
ముక్కాకలు దీరు త్యాగి ముజ్జగములలో. 35

కం. మనవలెఁ గష్టము లందక
మనవలె జనులనుచుఁ ద్యాగమహిమను జాటెన్
జనపదములఁ దనకీర్తియు
జనపదములఁ దనదుమూర్తి జయగతి వెలుఁగన్. 36

కం. తన గేహము తన దేహము
మన దేశము పాలుచేసి మన రాష్ట్రంబున్
మన కిడిన ఘనుని మఱచినఁ
దినఁ గూడుం గట్టబట్ట తిరిసినఁ గలదే? 37

తే. రాజ్య సంరక్షణమునకో రాజుకొఱకో
వైరిరక్తము పిండిన వారుకలరు
పరుల కే కీడు సలుపక ప్రజలకొఱకె
ఆత్మ బలిదానమిడిన మహాత్ముఁ డితఁడు. 38

తే. ఎన్న వంగీయుఁడైన జితేంద్ర దాసా
కండు "మాక్స్వినీ" యనెడి యైర్లండు వాసి
యొకఁడు మన పొట్టి శ్రీరాములొకఁడు పరస్ *
నింకొకఁడులేఁడు త్యాగమం దీడుజోడు. 39

వ. ఆ 'యమరజీవి' జీవితంబునఁ జూపిన స్వాతంత్ర్య సమర సన్నాహయుక్తి, గురుభక్తి, ప్రజానురక్తి, స్వార్థవిరక్తి, యాత్మశక్తి యనన్య సామాన్యంబను చారిత్రిక ముఖ్యాంశంబులు పత్రికాముఖంబున గుర్తించి 40

కం. ఏవం విధ సద్గుణ గణ
పావన భవ్య ప్రభావ భాస్వత్త్యాగ
శ్రీవంద్య రామచరిత
శ్రీ విలసితరీతిఁ గైతచెలఁగుత వసుధన్. 41

* చూడు - ఆంధ్రపత్రిక 17-12-1957

# సుకవిస్తుతి

నన్నయోత్పలమాల - చెన్నుమీఱుచు నుండు
తిక్కన కందంబు - తీపిమెండు
ఎఱ్ఱనార్యుని గీత - మెంతొ రమ్యతనొల్కు
శ్రీనాథు సీసంబు - చెలువుఁగుల్కు
సోమనాథు ద్విపద - సొగసుగా నడయాడు
పెద్దన మత్తేభ మొద్దికఁ దగు
రాయలపల్కులో - రాళ్ళురా పాడును
మూర్తి శార్దూలంబు - బొబ్బరించు
రఘునాథు నడకలో - రాచఠీవి వెలుంగు
నన్నెచోడు పదాల - తెన్ను వేఱు
వేమనతో నాటవెలఁది నృత్యముసేయుఁ
బోతన యన్నింటిఁ - బోఁతపోయు 42

చేమకూరన్న పాకానఁ జిందురసము
సూరనార్యుని కల్పనా శుద్ధి ఘనము
గజ్జెగట్టిన జెట్టులు, - గానవీర
లందఱకు నొక్కవందన - మాచరింతు. 43



# కర్తృ వంశాదికము

సీ. ఆర్షధర్మమ్ముల నాసక్తి నాలించి
పొసఁగ సద్గురువుల పూజచేసి
సంతృప్తి జీవితసౌఖ్యమ్మని తలంచి
శివభక్తియుక్తులై చెలఁగి నన్నుఁ

గని పెంచి జ్ఞానమ్ము గఱపిన యాదమ్మ
వేంకట సుబ్బయాభిఖ్యులైన
యస్మత్పితల చరణాంబు జాతములకు
నత్యంత నమ్రత నంజలించి

తే. ఆత్మ కామోదమొదవెడి యట్లు వారి
జ్ఞాపకార్థంబు సర్వేశు కరుణకలిమి
వ్రాయఁ బూనితి గ్రంథమ్ము భక్తవరులఁ
బ్రోచు జగదీశ్వరుఁడు నన్నుఁ బ్రోచుఁగాత ! 44

కం. అరయమి దొఱఁగఁ బ్రియమ్మునఁ
జిఱుత తనంబాది యెంతొ చెప్పిన పుణ్యుల్
గురులకు గురుతుల్యులకున్
శరణందును నాదు దురితజాలము తొలఁగన్. 45

సీ. విశ్వేశశతకంబు వేడ్కరచించితిఁ
బదునైదు వర్షాల ప్రాయమందు
మొలక మీసమ్ముతో మురియు దినమ్ములఁ
గోరి కూర్చితిని గుమారవిజయ
మవలఁ బ్రహ్లాద బుద్ధావతార తులసీ
దాస కళాశ్రీల వ్రాసినాఁడ
నొనర గెలిలియో న్యూటను ఫేరడే
జీవితమ్ములఁ గైతఁ జెప్పినాఁడ

తే. కన్యకాపరమేశ్వరీ కథ, మయసభ,
వేదవతి, ఖండకావ్య మిత్యాది కృతులఁ
గూర్మి లిఖియించి నేఁడు ముక్కోటిజనుల
కందఁ జేసెద నాంధ్రమహాభ్యుదయము. 46

వ. ఇట్లు భగవదంకితమ్ముగా సనాతనాథునాతన భవిష్యన్మహాకవి నమస్కార గౌరవాశీః పూర్వకమ్ముగా దక్షిణభారత పల్లీపత్తన నదీనద గిరిదరీ పుణ్యక్షేత్ర సందర్శన భాగ్య భాస్కర వికసిత హృదయారవిందుండనై నవ్యభవ్య పథమ్మున కావ్యరసపయోధి మథించి సహృదయబృంద బృందారకులకుఁ బంచి కృతార్థుండ నగుదునని యెంచి ప్రజానుమత హితసహిత చారిత్రాత్మక మహాకావ్యమగు నాంధ్ర మహాభ్యుదయ కథారచన కుపక్రమించువాఁడ. 47



# మద్రపురీ వర్ణనము

ఉ. శ్రీరమణీమణీ చరణసేవక సౌమ్య వణిగ్వరేణ్య సం
భారవినూత్నరత్నభర భాసుర నిర్మల భర్మహర్మ్య దు
ర్వార విలాసమార్గరమ రాజిలుఁ జెన్నపురంబు రమ్యమై
తూరుపుతీరహారమునఁ దోఁచెడి తోరపుమేరవో యనన్. 48

ఉ. ఆ నగరీ లలామమున నద్భుతదీప గృహాగ్రసీమ సం
ధాన నిధానకాంతి తనుదాన చరించును వర్తులంబుగా
మానక మాన్యసప్తఋషి మండల మాధ్రువు చుట్టు నిత్యముం
బూని నటించునట్లమరపుంగవులున్ వెఱగంది చూడఁగా. 49

సీ. ఖండఖండాంతరాగత మహానౌకాళి
నీత సుస్వాగతగీతమగుచు
వ్యాప్తి విద్యుత్ప్రాప్తి నౌన్నత్యసంతృప్తి
నగ్రతాంబూలంబు లందుకొనుచు
గవ్వచుట్టుగనెక్కి కలయదవ్వులు చూచి
నుతియించు మనుజుల నుడులువినుచు
ముక్కంటి తలనెక్కి నిక్కుచుక్కలతోని
తుల యౌదుననుకొని త్రుళ్ళిపడుచు

తే. తిరుగు నక్కాంతి - పుజకాని కరము బంతి
కర్ణధారుల ధీశాంతి - కళలదొంతి
తెప్పవాల్పక నిజవిధి రేలసలిపి
దినమణికి మ్రొక్కి విశ్రాంతి ననుభవించు. 50

కం. జనమా దీపస్తంభం
బున నెక్కి నిశం గనంగఁ బురవీధులలో
మిణుఁగుఱుఁ బురువుల సంగర
ఘన మెఱయును బండ్లదివ్వెలటునిటు పోకన్, 51

తే. అర్ధచంద్రాకృతిగ గోడ నబ్ధిఁ గట్టి
నావ రా దారియుంచిరి రేవునందు
గట్టునకు గోడకును మధ్యకదలకుండ
నీరు యోగీంద్రుమతివోలె నిలిచియుండు. 52

చ. జగతి గభీరభావమణి సంపద సొంపులు నింపఁజూచి యీ
యుగమున మర్త్యసంఖ్య గృహయోచన వృద్ధికివచ్చినట్లుగా
సుగతిలభించు తత్త్వరతి సుంతయుఁబెంపు వహింపదంచుఁ బె
ద్దగఁ జెవి నిల్లు గట్టుకొని తా రొద సేయు సముద్రుఁడెప్పుడున్. 53

మ. ఉడుమాలం బలెఁ దళ్కుబెళ్కుగల విద్యుద్దీపముల్ వీధులం
దడరం-గోటయొకండుగ్రాల-ఘనకోశాగార మొప్పార-నే
ర్పడ ఛాయాహరణమ్ములౌ మఱలు ధర్మస్థానమొండుండ-నె
ల్లెడ గ్రంథాలయముల్ సెలంగఁ బురి యొం-తేనొప్పు నందంబుగా. 54

కం. పొగబండ్లును పొగయోడలు
పొగమఱలుం దీఁగబండ్లు పొరయఁగబలిరే
పగలనక సర్వమతజన
మొగి తగఁ దమపనుల నిండియుందురు దానిన్. 55

కం. నానారాష్ట్ర ప్రజలును
నానాఖండముల నరులు నానావిధులన్
నానాభాషల నాడఁగ
నా నగరము విశ్వకేంద్రమా యనిపించున్. 56

చ. ఇరువదియేఁడు మండలము లేలెడి శాఖల ముఖ్యులుంటచే
నఱువదినాల్గు విద్యల మహామహులౌ గురుశిష్యవాసముల్
పరగుటచే స్వదేశపు నభస్థ్సలవాణికిఁ గేంద్రమౌటచేఁ
గరము విమానయానములు గల్గుటచేఁ బురమొప్పునొప్పుగా. 57

చ. దినమణి కాంతియున్ మెఱపు దివ్వెల వెల్గును నేత్రదృష్టి - స
జ్జనములు ప్రాణవాయువులు - సౌధము లస్థులు - నీటి గొట్టముల్
ఘనమగు రక్తనాళములు - క్రమకరమ్ములు కాళ్ళు యంత్రముల్
ధనమది గుండె - చర్మమగు ధర్మము తన్నగరీ శుభాంగికిన్. 58

మ. జలయంత్రమ్ములతో సుఖాసన కళా సౌందర్య సంపత్తితో
ఫల భూజాత్త లతావితానతతితో భాసిల్లు గుల్మాళితో
కలగానమ్మిడు 'రేడియో' ధ్వనులతోఁ గాసార పుష్పాళితో
నలరుం 'బార్కులు' కోర్కులం దగిలి భార్యాభర్తలున్ వర్తిలన్. 59

చ. విరులఱమూసి తన్న - వెలవెట్టినఁ జూపుటకంచు - వాడినం
దొఱఁగదు తావి సంపెఁగనఁ - దోఁచదె పై మెఱుఁగంచు-మల్లియల్
పరువమురానివన్న - నిశివచ్చునటంచటఁ గోడెగాండ్రతో
సరసపుఁ బల్కుఁ బల్కుదురు జాణతనమ్మునఁ బుష్పలావికల్. 60

మ. పగలెల్లం బనిపాటలన్ బడలి తద్వ్యారవ్యథాదూరులై
నగరిన్వీడి సముద్రతీర సికతానంద క్రియాలోలురై
తగురీతిన్ విహరింత్రు పౌరులు నితాంతస్థాయితో హాయితో
వగజాలిన్ జిగిమీఱఁ దెమ్మెరలు వీవన్ సంజకెంజాయలన్. 61

మ. ప్రతి శృంగాటకసీమ నేమరక పోరా బండ్లకున్ మార్గముల్
ధృతిమైఁ జేతులఁ జూపు రక్షకభట శ్రేష్ఠుండు రేయుంబవల్
పతియైనం దనయాజ్ఞ కచ్చటనె నిల్వంబోలు; ధర్మంబు భూ
పతియే తప్పినఁ దప్పకుండునె ప్రజాబాహుళ్య మిచ్ఛాగతిన్ ? 62

మ. అల "రిప్పన్" ప్రభు మందిరాలు - చెలువౌ 'హైకోర్టు' సౌధాలు - వీ
థులలో వీరుల విగ్రహాలు - భట సందోహాస్త్రశస్త్రాది మం
డల భూగర్భ గృహాలు - కోట తలపై డాల్గ్రాలు జెండాలు - ని
స్తుల దేవాలయ గోపురాలు నగరిన్ శోభిల్లు భవ్యాకృతిన్. 63

చ. అటమట మింతలేని యడయారది శాంతి సభాసభాసమై
చటుల సుపత్రమై బహుళశాబ్దిక యంత్రనిబద్ధ శాఖమై
వటమట సీటుదీటుకొన వర్ధిలుఁ దత్పురలక్ష్మి కద్దిశా
భటుఁడొక భక్తిఁ బట్టుకొను పచ్చలకెంపుల ఛత్రమో యనన్. 64

చ. అపనయమొట్టుతోఁ బ్రకృతి యందలి దీపపునీడ కావురిన్
విపుల విలాస మేర్పడియు వెల్వడు మానవ దేహజన్యమై
యపచిత కశ్మలం బదియు నంత సదాప్రవహించు భూమిలోఁ
గపటి హృదంతరాళగత గాఢ నిగూఢ దురూహరీతిగా. 65

శా. వ్యాధిగ్రస్తుల నిస్తులాదరణ మొప్పారన్ దివారాత్రముల్
బాధల్ మాన్పఁ జికిత్సలన్ సలిపి సేవాధర్మనిర్మగ్నులై
బోధల్ సేయు భిషగ్వరేణ్యతతితోఁ బొల్పారు సామగ్రితో
నేదో క్రొత్త జగత్తు నాఁదనరునందే వైద్యశాలావళుల్. 66

కం. కళ నాటకశాలా శశి
తళుకొత్తు నిశం దదీయ ధామమకుటమై
వెలుఁగును రూపకనామం
బలచపలాదీప కళిక లక్షరరేఖన్. 67

మ. శ్రమమై విశ్వవిశేషముల్ గఱపుచున్ సంపాదకుల్ పెంచఁగాఁ
గ్రమశిక్షం బలుబాసలన్ మెఱసి విజ్ఞానార్థులాసక్తితోఁ
దముఁ బిల్వం బ్రతిరాష్ట్రమేగి వఱువాతన్ నూత్నముఖ్యాంశముల్
రమణీయంబుగఁ దెల్పుఁ దన్నగరి వార్తాపత్రికా పుత్రికల్. 68

సీ. సుమశర బలవర్ధకములైన తావులు
పుష్పాడి పఱపులఁ బొదలు పొదలు
జలజేక్షణామోద సముదిత సరసులు
రసమయస్థితి నలరారు కవులు
భ్రమగొల్పు నవమధు హిమజల ధారలు
సుమనోనురాగ దృశ్యముల గములు
అతులిత ద్విజ హరిశ్రుతిహిత గంభీర
రావఘూర్ణిత తను ప్రాణి తతులు

తే. కువలయాహ్లాదకర ధన్యగుణ గణములు
కలుగఁ గలుముల చెలి వన్యకళలఁ జెలఁగి
లలిత ఫలదానములఁ దాను నలరు ననఁగ
రాణ రాణించు నవ్వీటు రాణితోట. 69

(ద్యుశక్తి)

మ. కరుణం బోషణసేయు భారము భుజస్కంధంబుపై నుంచు శ్రీ
హరి లోకస్థితిఁ జూడ నప్పుడపుడాహ్లాదంబుతో నెక్కిరా
నరవిన్ విష్ణుపదాన విష్ణురథసంచారంబు లొప్పారెనాఁ
దిరుగున్ నవ్యవిమానముల్ పురముపై దిక్చక్రముల్ గాంచుచున్.

ఉ. క్రొన్నెల ఱాల నేలగల క్రొన్నన తిన్నని చంద్రశాలలన్
వెన్నెలరేలఁ గన్నెలొగి విన్ననువొందుచు నాట్యమాడఁ బై
నున్న విమానయాను లమితోత్సుకులై గని నన్నుతింపఁగాఁ
జెన్నలరారుఁ జెన్నపురి చిన్నెలవన్నెల నెన్న శక్యమే? 71

తే. ఆంధ్ర కేరళ తమిళ కర్ణాటలక్ష్మి
ముద్దులొలుకుచు బంగారు గద్దెనెక్కి
యేలు పూర్వాపరాబ్ధులే యెసకమెసఁగు
వేడ్క వింజామరంబులు వీచుచుండ. 72

# లక్ష్మి గురువయ్యల గార్హస్థ్యము

మ. చెలువౌ నప్పురి వైశ్యవంశ మొకవాసిన్ భాసిలంజేయు ని
ర్మలుఁడుండెన్ గురువయ్య లక్ష్మి తన భార్యారత్నమై కొల్వఁగాఁ
గలకాలం బొకలీల సౌఖ్యములఁ దూఁగంజాలు భావాలకున్
నెలవై మాధవితో రసాలమువలెన్ నిస్తంద్రధీసాంద్రుఁడై. 73

ఉ. వాడదు నష్టకష్టములఁ బాడదు వ్యర్థ వి మోహ గేయముల్
వీడదు దేశభక్తిఁ దనువేఁడిన పేదలకింత పెట్టఁగా
నోడదు ధర్మకర్మమతి నూడదు పెల్లుగ ముజ్జగంబు ల
ల్లాడిన భర్తమాట కెదురాడదు తత్సతిఁ బోలనేర్తురే? 74

మ. ఖగరావమ్ముల హాయి నూల్కొను నుషఃకాలమ్మునన్ నిత్యమున్
భగవంతుండగు మాపతిన్ నతమతిం బ్రార్థించుచున్ లేచి ము
న్నుగఁ బ్రాణేశ్వరు పాదపద్మములు కన్నుల్ సోఁకగా మ్రొక్కి యా
సుగుణాలంకృత నిత్యకృత్యములఁ జూచున్ సద్మపద్మాకృతిన్. 75

కం. ఆయవ్యయముల యోచన
చేయుటలోఁ బతికి సతము చేయూఁతయగున్
వేయేల? మగని సుకమే
యాయమ సుఖమంచుఁ బనుల నానందించున్. 76

సీ. స్కాంద పురాణముఁ గార్తీకమున, మాఘ
మున గారుడంబును ముదమునవిని
ప్రతి శుక్రవార మభ్యంజనమ్మొనరించి
పొలుపుగాఁ గుంకుమబొట్టు దిద్ది
పసుపు కాళ్ళకుఁ బూసి కుసుమముల్ తలఁదాల్చి
తగిన పుట్టముఁగట్టి నగలువెట్టి
తాంబూలఫలపుష్ప దక్షిణాదులుగల
పళ్ళెరమ్మును బట్టి బంధభావ

తే. మెడఁదఁదెగఁగొట్టి వగనెట్టి యడుగడుగున
దైవనామమ్ములతిభక్తిఁ దలఁచుకొనుచు
భారతీయాత్మ సంస్కృతి భాగ్యలక్ష్మి
యనఁగ విష్ణ్వాలయమ్మున కరుగునామె. 77

సీ. పరివేష్టిత ద్వారబంధ దీపావళిఁ
జమురుంచి వెల్గింప సరగఁ జనును
దైవభావనఁ జేసి దేవతా ప్రతిమలో
దివ్యదీధితిఁ దృష్టి దీఱఁగనును
మధుర మంగళ వేదమంత్ర నాదము విను
నమల తీర్థప్రసాదములఁ గొనును
"పదునాల్గు భువనముల్ పాలించు పరమేశ !
పాపముల్ బాపి కాపాడు"మనును

తే. జానువులనిల్పి తలవాల్చి మేనువంచి
కన్నులఱమోడ్చి ధ్యానసంపన్నయగుచు
నందనందన పాదారవిందములకు
వందనంబాచరించి యానందమొందు. 78

ఉ. ఆయమ నోము పంటన గురమ్మయు సుబ్బమ పుట్టిరంత నా
రాయణుఁడుఁ జనించె సుఖులై మనుచుండిరి బాలబాలికల్
శ్రీయుతులై సతీపతులు శ్రీహరిసేవలు సేయుచుండ భ
ద్రాయితమూర్తి విష్ణువు నిరంతర మెంతయుఁ బ్రోఁచుటబ్రమే? 79

## స్వప్న వృత్తాంతము

ఉ. శారద చంద్ర చంద్రికల సాంద్రసుధారసధారలూర వి
స్తార కళావిలాస యుత సౌఖ్యములం గులికించు నొక్క రే
యా రమణీ శిరోమణి గృహమ్మునఁ గమ్మని నిద్రవోవుచుఁ
గారణలీలఁ గ్రాలుఁ గలఁగాంచె ముదమ్మున నీ విధమ్మునఁ. 80

చ. తిరుమలనెక్కి దంపతులు తీర్థములాడి సుచేలధారులై
విరులు సుగంధ మక్షతలువేడ్క సమర్పణచేసి కొల్చి రా
హరిహరరూపధారియయి యాపదమొక్కులనందు సామి శ్రీ
కిరవగు నేడుకొండల కధీశ్వరు భాసుర వేంకటేశ్వరుఁ. 81

ఉ. హార కిరీట కుండల మహామణి మంజుల కాంతిపుంజముల్
చారుతరమ్ములై వెలుఁగు సామికి నంజలిపట్టి కోర్కెలుం
దీర నిమీలితాక్షులయి నిల్వ రసాల ఫలమ్మమోఘమై
సార సువాసనాసహిత సత్ఫలమై పడె నామె దోసిటఁ. 82

కం. ముక్కోటి యాంధ్రులందని
చక్కని ఫలమంది తీవ సాధ్వీ! యనుచుఁ
దిక్కులు మక్కువ పడి విన
నక్కజముగ దివ్యవాణి యాడినయంతఁ. 83

ఉ. కొక్కొరొకో! యటంచుఁ దొలికోడి చటుక్కునఁ గూసి దిక్కులం
జిక్కలిగింతపెట్టెఁ గడు సంతసమందుచులేచి యామె పెం
పెక్కిన ప్రేమతోడఁ బతి కిక్కలఁ దెల్ప ననల్పతోషియై
చెక్కిలి నొక్కి మంచిదనిచెప్పె నతం డమితాదరమ్ముతో.. 84

ఉ ఇట్టి మనోజగద్గమన మీశ్వర సృష్టి విలాస లాస్యమం
దెట్టుల పుట్టునో తెలియదేరికి; స్వానుభవమ్ము శాస్త్రముఁ
బట్టి సమన్వయించుకొని భావిశుభాశుభ సూచకమ్ములై
నట్టు గ్రహించి తెల్పుదురు వ్యాఖ్యలు జోస్యులు స్వాప్నికమ్ములఁ.

మ. అని దైవజ్ఞ శిఖామణిం బిలిచి స్వప్నాయత్త వృత్తాంతముఁ
వినిపింపఁ విని సంతసంపడుచు హృద్వీధిఁ విమర్శించి స
జ్జనవర్యా! యొక పుత్ర రత్నమిఁక యుష్మద్దార గర్భంబునఁ
జనియించుఁ నిజమంచు జోస్యుఁడన విశ్వాసమ్ముతో మ్రొక్కుచుఁ.

ఉ. కానుకలిచ్చిపంపి, నిజకాంత తదంతికమింత నానమై
నానత శీర్షయై నిలిచి యాకల షోకడ జోకవాకొనఁ
మానసవార్ధి పొంగి మధుమంగళరంగ తరంగ భంగిమల్
బూన స్మితాననాబ్జుఁడయి వొల్చెను వైశ్యకులావతంసుఁడుఁ. 87

# శ్రీరాముల జన్మాదికము

శా. అంతం గొన్నిదినాల కా మహిళ - దైవానుగ్రహ ప్రాప్తిచే
నంతర్వత్నిగ నున్నవార్తవిని యాహ్లాదమ్ము సంధిల్ల నా
కాంతారత్నము కోరు కోరికలఁ జక్కందీర్చుచుం దన్మనో
భ్రాంతిం బుంసవనమ్ము సల్పెను సుపుత్రశ్రీలు సిద్ధింపఁగఁ. 88

ఉ. ఒక్కొకసారి రామకథ యొక్కొకవేళను భారతమ్ము వే
ఱొక్కొకతూరి శైవము మఱొక్కతఱిఁ మనదేశ భక్తులం
జక్కఁగఁదెల్పు గాథలు ప్రశాంతమతిఁ విని వాని సారముఁ
మిక్కిలి గ్రోలుచుం బడతి మేలుగఁ గాలముఁ బుచ్చుచుండఁగఁ. 89

కం: పుల్లని ఫలముల నుల్లం
బుల్లాసముఁ జూపె నాపె కోపిక నడలెఁ
మెల్లని నడ చల్లని నుడి
యల్లల్లన నొడలు వెల్లనగుటయుఁ దోఁచెఁ. ౯0

మ. నవమానంబులు నిండ నొక్క శుభలగ్నంబందుఁ దత్సాధ్వి సం
స్తవ నీయుండగు పుత్రునింగనియె నాంధ్రశ్రీ నవోన్మేషయై
జవసత్వమ్ములువొంది సర్వదిశలన్ సత్కీర్తి సాధించుకో
నవకాశమ్ము లభించె నంచు మది బ్రహ్మానందముం బొందఁగా. 91

ఉ. చల్లనిపిల్ల తెమ్మెరలుసాఁగె విశాలజగాలకేలొకో
యుల్లము లుల్లసిల్లె ముదమొంది వణిజ్మణి దూరదర్శియై
బెల్లము పండ్లు చక్కెఱయు వీదల పిల్లలకెల్లఁ గొల్లగా
నల్లనఁ బంచిపెట్టెఁ దన యాత్మజు జన్మదినోత్సవమ్మునన్. 92

మ. జలజాతేక్షణ లాక్షణంబున మహాసంతోష సంరంభయై
యలకల్ దువ్వుచు బిడ్డ నెత్తుకొని సాధారామ సీమాంతరం
బులఁ దావుల్ వెదఁజల్లు పుష్పలత దాపుంజేరి ముద్దాడుచున్
జలకమ్మార్చి తలంచి రుజ్జ్వల భవిష్యత్తున్నదం చాత్మలో. 93

మ. తనవోలెన్ నిలువెల్ల నీ రయి స్థిరార్థస్థాయి సాధించు స
జ్జన సంసేవ్య కలాకలాపుఁ డిలపై జన్మించి నాఁడంచుఁ దా
విని మిన్నంది మెఱుంగుఁ జూపలరఁ బ్రావృట్ఛ్రీఘనస్వామి యుం
గనె హర్షాశ్రువు లొండు రెండురల నిష్కామైక దాక్షిణ్యుఁడై. 94
(ధ్వనిశ్రీ)

ఉ. ఎన్ని భవంబులం దెటు తపించిన పుణ్య మనన్య గణ్యమై
చిన్నికుమారు రూపమునఁ జెన్నలరారెనొ చూతమంచు సం
పన్న గృహమ్ములన్ వఱలు వైశ్యవధూమణులెల్ల వచ్చిరా
యన్నులమిన్న యంకమున నందము చిందు తనూజుఁ గాంచఁగా. 95

ఉ. ఆకరుణాలవాలుని ముఖాబ్జమునం జిఱునవ్వు వెన్నెలల్
శ్రీకరమై మహాజన వశీకరమై భరతాంబ కీర్తి శో
భాకరమై నిజార్థ హరణాశయ భీకరమై సుధీ మన
శ్శీకరమై వెలుంగుఁ బరజిత్వరతాంధ్ర చకోర తృప్తిగా. 96

ఉ. అనయశీలి కోమల హృదబ్జమునం జనియించు దివ్య వి
జ్ఞాన రమాకిరీటమణికాంతి నిరంతరశాంతి దూతయై
మానవ మానసాంధసుషమా మహిమమ్మున దిగ్దిగంత క
ల్యాణ గుణాకరమ్మయి యిలా తలమెల్ల వెలుంగఁ జేయదే? 97

మ. అలసర్వజ్ఞు దయాప్రబోధమున లోకానీకహృత్పద్మ సం
కలితంబైన యహింస గాంధిగతమై జ్ఞానక్రియాశీలమై
చెలువౌ బాల విలోకనమ్ములఁ బ్రకాశింపన్ ముదంబందుచున్
దిలకించుం బులకించుఁ దల్లితనయున్ దీవించు లాలించుచున్. 98

ఉ. అంతఁ బ్రశాంతకాంతి గల యా సుకుమార కుమార చంద్రుఁ డిం
కెంతటి కీర్తి తేఁగలఁడొ యింతకు నా మహిళామతల్లి గో
రంత యెఱుంగదాయెఁ గద! యాత్మజులంగని పెంచుటంతెగా
వంతగుఁ దల్లి దండ్రులకు - వారలప్రాఁతల లోఁతుఁ జూతురే? 99

శా. ఆత్మీయుల్ దనమోము గోముఁ గని యాహ్లాదమ్ము నందిల్లఁ బు
ణ్యాత్ముండౌ నన నేదియో కనుచు స్వీయామోదమున్ వీడఁడౌ
నాత్మానాత్మ వివేకవేదియగు బ్రహ్మజ్ఞాని చందంబుగా
నాత్మానందము నందు బాలునకు లోకాలోకముల్ పట్టునే? 100

తే. పెద్ద ముత్తైదువలు పనుల్ దిద్ది తీర్పఁ
బదునొకండవ దినమున బారసాలఁ
బరమవైదిక శుభలీల జరుపుచుండి
పేర్మి శ్రీరాములని పేరుపెట్టి రపుడు. 101

తే. పొట్టి వంగడపుంగీర్తి పొడవు సేయఁ
బుట్టె శ్రీరామ నాముఁడై పుణ్యుఁడతఁడు
దిట్టయై రాజకీయాల గుట్టెఱింగి
పట్టుపీడక పనిసల్పు జెట్టియనఁగ. 102

మ. లలితాహ్లాద కరప్రభాకలిత కల్యాణుండు పాదద్యుతిన్
నలిన శ్రీహరుఁడుల్ల సత్కువలయానందైక సంధానుఁ డు
జ్జ్వల దాత్మీయ వసుప్రదాన సుమనస్సంతోష భావ్యర్థుఁడౌ
నెలబాలుండు క్రమాభివృద్ధి గనుచుండెన్ ముద్దులం గుల్కుచున్.
(ధ్వనికథ)

ఆ.వె. పొత్తులందునుండి బోర్లఁబడుచునుండి
పక్క నాల్గుదెసలఁ బ్రాకి ప్రాకి
హస్తచరణ యుగము లాడించి జోడించి
ఏడిలని సొలసి నిదురయందు మునుఁగు. 104

ఆ.వె. మెల్లమెల్లఁదల్లి వ్రేళ్ళందుకొని చిన్ని
నవ్వు పువ్వులొలుక నవ్వఁజూచి
ఘల్లుఘల్లు మనుచుఁ గాళ్ళగజ్జెలుమ్రోగఁ
దప్పటడుగు లిడును దశయకతఁడు. 105

చ. జిలిబిలి పల్కులొల్కు రసశీకరముల్ సెవిసోఁక మేనిపై
జలజల పూలు రాలినటు చల్లని జాబిలి మెల్లమెల్లఁగాఁ
గళలు పదాఱు చల్లినటు కమ్మని తెమ్మెర గ్రమ్మినట్టుగా
నలరుచుఁ బ్రేమతోఁ గనుచురాతని సోదరసోదరీమణుల్. 106

శా. గారామొప్పియు శిక్షణాత్మక కళా గారాంక నిశ్శంకకే
ళీరాగమ్మునఁ బల్కు బిడ్డనుడి తల్లీ దండ్రులుల్లాసముల్
మీఱన్ విందురు వచ్చిరాని పలుకుల్ మిత్రుల్ ప్రశంసింతురో
'నూరీ యూరని' యూరుగాయఁగన నోరూరుం గదా యేరికిన్. 107

తే. రాముఁడని సీతయని పేర్లు తామె పెట్టి
పిల్లలందఱు బొమ్మల పెండ్లి సేయ
ముద్దు ముద్దుగ వారలయొద్దఁ జేరి
గోరు ముద్దల గుజ్జనగూళ్ళు మెక్కు. 108

# శ్రీరాముల ప్రాథమిక విద్యాభ్యాసము

శా. పంచాబ్దంబుల ప్రాయమేర్పడఁగ శుంభల్లగ్న మీక్షించి పూ
జించెన్ సద్గురుఁదాత బాలకు సమర్పించెన్, యథాశక్తి చె
ల్లించెన్ గాన్కలు, వాణీవందనము వల్లించెన్ సుతుంగూడి, ని
ర్మించెన్ సద్గతి; తండ్రి బిడ్డల శుభశ్రీగోరుటల్ చిత్రమే ? 109

సీ. అల్లారుముద్దుగా నాడుకొంటయె గాని
కొంటెపనులు నేర్చుకొనఁడు వినఁడు
తల్లి తాయమ్మియ నుల్లాసహాసియై
వీధపిల్లలకెల్లఁ బిలిచి పెట్టు

తండ్రిసేయుపనులు తాఁజేయవలెనని
        చనవునఁ జేతులు సాఁపుచుండు
అక్కఱలేనిదే ప్రక్కయింటి కడప
        నొక్కసారేనియుఁ ద్రొక్కఁబోఁడు
తే. పెద్దలెవరైన నిలుసేర నొద్దఁజేరి
చిన్నినగవునఁ జిన్నారి చేతులెత్తి
వందనముచేసి పెక్కుదీవనలు పొందు
బాలుఁ డనుకూల సుగుణాల వాలుఁడగుచు. 110

శా. ఆడుంబాడును దోడివారలర నిత్యం బాటలం బాటలం
గూడున్ వీడును మిత్రశత్రు జనమున్ గుర్వాజ్ఞ సన్మార్గపుం
జాడన్ వేడుకవీడకేఁగుఁ బ్రకృతిన్ సంప్రాప్త వైచిత్ర్యముల్
చూడంజూడ నెదో విచారమున నిల్చుం గొల్చు సర్వాత్మకున్. 111

ఉ. తప్పఁడువేళ - తద్గురువు తప్పక పాఠముఁ జెప్పుచోఁ దలం
ద్రిప్పఁడు తప్పు లొప్పు లొక దీక్ష విచక్షణతో వినున్ దిన
మ్మెప్పటి పద్య మప్పుడె పఠించుచుఁ జెప్పక యప్పగింప వీఁ
డొప్పులకుప్ప తప్పదనుచుందురు బాలకుఁ జూచి యెల్లరున్. 112

సీ. ఆటవిడుపు పద్యమనువుగా రాఁదీసి
        చిట్టికథల నీతి పట్టు దెలిసి
పెద్ద బాలశిక్ష సుద్దు లొద్దిక నేర్చి
        పొడుపుకతలచిక్కు విడుటెఱింగి
లెక్కకు మూలమౌ నెక్కముల్ మానముల్
        తప్పుచెప్పక వేగ నొప్పగించి
సుమతి వేమనసూక్తి సుమము లాఘ్రాణించి
        ఆంధ్రా మరరసమ్ము - లాని పూని

తే. బాల రామాయణ శ్లోక పఠనసేసి
భాగవత భాగములఁ గొన్ని భారతమునఁ
గొన్ని ఘట్టాలఁ జవిసూచి కుతుక మెసఁగఁ
ధెనుఁగు విజ్ఞాన వీధులఁ దిరుగఁ దొడఁగె. 113

# గురువయ్య నిర్యాణము

వ. ఇట్లు రాముల డష్టవర్షప్రాయుండై తమ్ముండగు రంగయ్యతో నెడ నెడ నుల్లాసంబుగఁ గాలంబు గడుపుచుండ విధివశంబున గురువయ్య జ్వర బాధా పీడితుఁడగుటఁగని సాధ్వీమణియగు నాయనసతి యాయుర్వేద వైద్యవరేణ్యులం బిలిపించి యథోచిత చికిత్సలు సేయించుచుండ నయ్యవి మూర్ఖునియెడ నుపయోగించు హితవాక్యంబులంబలె నిష్ప్రయోజనంబు లగుడు నాంగ్లేయ భిషక్శిఖామణుల రప్పించి రొక్కంబు లెక్కింపక నవీన మార్గంబున-మహౌషధంబు లిప్పించినను నిరర్థకంబగుట గ్రహించి చింతా సాగరమగ్న మానసయగుచుండఁ దదాత్మజానీకము దుఃఖించుచుండ హిత సుహృద్బంధుకోటి మాటిమాటి కరుదెంచి కర్మసిద్ధాంత ముగ్గ డించుచు సముచిత లోకోక్తులతో నోదార్చుచుండ నాతఁడు నానాఁటికి క్షీణించి మరణావస్థను సమీపింప నామె పతిపాదము లొత్తుచుఁ గన్నీరు పైఁట చెఱఁగున నద్దికొనుచు— 114

శా. ఏదీ దారిఁక నాకు బిడ్డలకు మేమిచ్చోట నీ రీతి నీ
యాధారమ్మునఁగాదె జీవితమహాయాత్రఁజ గృహస్థాశ్రమ
ప్రాధాన్యాధ్వగతిం జరించుట కటా! భావ్యర్థ మర్థాంగికిఁజ
బోధింపందగదే? నిజానుభవమో పుణ్యాత్ముఁడా! తెల్పవే. 115

ఆ. వె. అనిన మనసునందు నల్లంత యోచించి
చింత భార్యపైని చేయివైచి
కొంత తడవుచూచి గురువయ్య యాకెతో
నేల యేడ్తువనుచు జాలిఁ గనుచు. 116

ఆ. వె. నీకుఁ దెలియకుండ నే దాఁచుకొన్న సా
ధనము లేదొకింత ధనములేదు
సమత నడుపుకొనమె సంసారనౌకను
నన్ని యెఱిఁగి యిట్టు లడిగెదేల? 117

తే. మనమదికి మంచివనుకొన్న మనువు లొదవ
సరగఁ గళ్యాణ కార్యముల్ జరిపిపంప
నత్తవారింటఁ బతివెంట పోయినుంటి
నాఁడు బిడ్డల భారమింతైన లేదు. 118

చ. స్వయముగఁ బోషణాదికము సక్రమపద్ధతిఁ జూడు మాత్మజుల్
జయగుణ శీలురై పరమసాధువులై సుఖియింత్రు వీరిలో
నయభయభక్తులం గలిగి నందనుఁడున్ నుడి సార్థకంబు చే
సి యశము గూర్చు రాములని చెప్పిరి జోస్యులు జ్ఞప్తియున్నదా ?

ఆ. వె. మోసగించి యొరుల పాసెముఁ దినుకంటె
కష్టఫలితమైన గంజిలెస్స
సహన మహరహమ్ము సహకార ఫలమిచ్చు
సత్యధర్మములకుఁ జావులేదు. 120

కం. కష్టము వచ్చినదని నీ
యిష్టముగా మెలఁగెదే? సహింపదు లోకం
బష్టైశ్వర్యమ్ముల బహు
నష్టమ్ముల నొక్కమనసు నడపరె విబుధుల్. 121

కం. స్త్రీలకు శీలమె కవచము
బాలురకున్ బాలికలకు భాగ్యమె కవచం
బేలీలనైన రెంటిం
దాలిమితో రెండుకనుల దర్శింపఁదగున్. 122

సీ. గృహకృత్యములెకాక - సహనమ్ముమై మన
వాణిజ్య భార నిర్వహణమూని
అత్మజ సౌఖ్య స - త్యాన్వేషణాసక్తిఁ
గృషిదీక్ష హృత్ప్రీతిఁ - గీలుకొలిపి
సంసార బాధ్యత - సరిగనేఁ బట్టించు
కొనకున్న నెన్నఁడుం - గినుకఁ గనక
పల్లెత్తు పలుకునేఁ - బలుకక పరిచర్య
సంతృప్తి పఱచిన - దానవీవ

తే. ఇహపరమ్ముల నెఱిఁగిన - యింతి! నీకుఁ
జెప్పవలసినదింకఁ గిం - చిత్తులేదు
అడిగితివిగాన, నింత నే నాడవలసె
అన్నిటికి దైవమొక్కఁడె - యధిపతిగద ? 123

కం. అని యిఁకఁ బలుకం జాలక
కనుఁగవ పలుమాఱు మూసి కష్టము తెలుపన్
గనుచున్న జనము మనమునఁ
బెనఁగొను శోకమున నీరువెట్టిరి కంటన్. 124

ఉ. ఆ యమబాధఁ గాంచి మది నా యమ బాధఁ గృశించి సన్నిధిం
బాయక సేవసేయుచు సబాష్ప నిమీలితనేత్రయా చయో !
పోయని మందులేదనుచు బోరున నేడ్చె నొకింత సేపహో !
ఆయువులేని వారలకు నాయువు నీయఁగ వెజ్జు కర్తయే. 125

తే. ఆఱిపోనున్న తిల్లికయందు వెల్గు
కొట్టుకొనునట్లు శ్వాసలు - కొట్టి పైకి
చూచుచుండఁగ జీవుఁడు లేచిపోయె
గొల్లుమని రంద ఱెడఁదలు జల్లుమనఁగ. 126

చ. అది కడసారి చూపని తదాత్మకుఁ దోఁపఁగ లక్ష్మిదుఃఖ వా
రిధి యెనలేక పొంగఁ గనెఁ బ్రేతశరీర వికార మారయన్
హృదయము భీతిపొందె నవుఁ బ్రేయసియై సుఖియించి నట్టిదే
విధి యెడబాపఁ జేరదొక వింతగ దగ్గఱికొంటి దైవమా ! 127

కం. ప్రారబ్ధ కర్మ వశమున
ధీరుఁడు యజమాని యట్లు దివి కేఁగుటచే
మేరువు తెగి పడిపోయిన
హారమువలెఁ గాంతిహీనమై గృహముండెన్. 128

కం. నర్మోక్తి యుక్తి దుర్మద
మర్మవిదూరుండు తండ్రి మరణించుటఁ ద
త్కర్మగతిఁగన్న రాముల
నిర్మల హృదయంబు కరఁగి నీరై పోయెన్. 129

వ. అంత నిల్లాలగు మహాలక్ష్మి యింతలంతలగు సంతానంబునకు గోరం
తేని కొఱంత ప్రాప్తింప కుండునట్లు జరుగుబెట్లాయని నిర్భర చింతా
క్రాంతచిత్తయై బహువిధాలోచనలతోఁ బరితపించుచుండ యాతాయాత
జనంబుల—— 130

సీ. ఇంత సంసారమ్ము నీమె యెట్లీదునో
యని కంట నీర్వెట్టు నబల యొకతె
తన చేతితో నొక్క తనయు పెండిలియైన
జేయ నోమందను చేడె యొకతె
సతుల కీ స్థితికంటె నతి దుఃఖమేదని
సానుభూతిని జూపు చాన యొకతె
పసుపు కుంకుమలన్నఁ బడిచచ్చు నీ తల్లి
కఱవయ్యె నవియును కాంత యొకతె

తే. పరులమేల్జూచు ఘనుఁడను పడతి యొకతె
మంచి ఫలమేరు హరుఁడను - మగువ యొకతె
యిట్లు పొరుగిండ్ల యింతులు చుట్టుఁజేరి
చెప్పుకొనుచుండి రాత్మలఁ జింత లెసఁగ. 131

వ. మఱియు నిస్తులగుణస్థితి స్తుతి పాత్రయగు నాగేస్తురాలింగనుచు. 132

ఉ. తెచ్చినఁ దేకయున్న నిది తెమ్మన దెమ్మొయి నున్నదానితోఁ
బుచ్చు దినమ్ము లొక్కపటి మూర్ఖతఁ బిల్లలుసేయు నల్లరుల్
నచ్చిన నచ్చకున్న నొకనాఁటిది గాదని యోర్పునేర్పులన్
హెచ్చుగఁ జూపి భర్తమది కెక్కను జక్కనిమాట దక్కఁగా. 133

కం. శనియశని శిఖిశిఖాశా
ఘనశాఖి వినాశకరముగాఁగల ఫలముల్
వినిమయ ఫలితమయమ్మయి
చనఁదజ్జను లెట్లదృష్ట - జాతకులగుదుర్. 134

కం. పూఁచిన తంగెడు వోలెన్
దోఁచిన గృహమతఁడు లేమి - దుర్విధిమహిమన్
గాచెడి చెట్టొరఁగినగతి
శ్రీచిహ్నము లడఁగనెంత - చింతిల్లుదురో. 135

# లక్ష్మమ్మ విచారము: ఆత్మజరక్షణము

వ. అని యిట్లెవరికిఁ దోఁచినట్లు వారు మాటలాడుకొనుచుండఁ బురోహితాదేశానుసారంబుగ, బంధుజ్ఞాతియుతంబుగఁ గర్మకాండ యథాశక్తి నిర్వర్తింపఁబడె. భర్తృవియోగ దుఃఖాగ్నిం బొరలుచు నా యజమానురాలు పరులమోము జూడఁ జాలక యింటఁ గుములుచుండఁ గొన్ని మాసంబులు గడచె. గ్రీష్మాతపంబున కల్పజలాశయమునందలి నీరువలెఁ దత్సంసారపు సిరి కొలఁది కాలంబునకే యదృశ్యంబయ్యె. లక్ష్మమ్మ గుండె నిబ్బరము జేసికొని కాయకష్టార్జితమ్ముచే బిడ్డలం బోషించుకొనుచు నప్పుదెచ్చి 'ఆచారప్పేట' వీథిఁ బప్పుల వ్యాపారమించుక సాఁగింప నక్కాలమ్మున వ్యాపారమ్మున ధరలు తాఱుమాఱగుటచేతనో బాకీలు రావలసినవి మట్టి యీయవలసినవి గట్టి యగుటచేతనో పలువురావాణిజ్యమ్మున నష్టపడుచుండుట గనులారఁగాంచి దాననే తన భర్త కా వ్యాపారమునం దిష్టములేక పోయెననుమాట జ్ఞప్తికిఁ దెచ్చుకొనె. కమ్మని పలుకులఁ గడుపులో నన్నము తీసికొని తినఁజాలు నాయమ్మ పప్పుల వర్తకులుప్పతిప్పలుగ దివాలా తీయుట గమనించి మూటకంటె మాటయెక్కుడని వాట మెఱిఁగి బాట తప్పక పాటుపడుచు— 136

ఉ. "తెక్కల కష్టముల్ సలిపి రేఁబవ లొక్కొక రూకఁ గూర్పఁగాఁ
దక్కును వేలు లక్షలది తప్పి వ్యయించిన కోట్లు శూన్యమౌ
ఒక్కొక పూవుగ్రుచ్చిన మహోరగ భూషణుకంఠహారమౌ
ఒక్కొక ఱాయి తీసిన మహోన్నత పర్వతమైన మట్టమౌ." 137

ఉ. మూలధనమ్ములేక నలుమూలల నప్పులుదెచ్చి యెట్లొ నా
వీలుకొలంది నీ కొలఁది బేరము పెట్టితి దైవదృష్టియే
లీలనటించునో తెలియ - లేను గుమారుల మోము జూడ నా
తాలిమి దూలుచున్నది సదావ్యథ తోడిద లోకమౌనుగా. 138

ఉ. పుట్టెడు నూనె పూసికొని బూడిదలో నొకపూట పొర్లినం
బట్టునదెంతొ యంతె తనపాలి యదృష్టము వక్రరీతులం
బట్టినఁ బట్టుఁబట్టి పనిపాటలఁ గొండలుపిండి సేయఁ జేఁ
బట్టినదెల్లఁ బట్టుమని బంగరుగాఁ బరిణామమొందునే? 139

శా. ఏ జన్మంబునఁ దండ్రిబిడ్డలను వీరేరీతి వేర్చేసిరో
యీ జన్మంబునఁ బ్రాప్తమయ్యె నది యట్టే కర్మ మర్మాకృతుల్
సాజంబై మనతోడ నీడవలె నిచ్చల్ వచ్చు నెచ్చోటికేఁ
రాజైనఁ నిఱుపేదయైన నవి మీఱంజాలు వీలున్నదే ? 140

మ. తన సంకల్పము మంచిదై తగిన శ్రద్ధాభక్తులంగల్గి చే
సిన కృత్యమ్ములు సత్ఫలాన్వితములై చెన్నారునంచాడరే ?
మును మౌనీంద్రులు - వారి వాక్కులు కృపాపూర్ణ ప్రభాభాక్కులౌ
నను విశ్వాస విశిష్టదృష్టి యొకడే యాలంబనంబౌఁ గదా. 141

వ. అని కర్మసిద్ధాంతమ్ము మఱవ కేమరక శ్రమించుచుఁ బిల్లలఁ బళ్లె
కూటమునకుఁ బంపుచు గుణగణములఁబట్టి రాములపైఁ బ్రత్యేక దృష్టి
నిలిపి—— 142

ఉ. "స్వచ్ఛమనస్కుఁడై పరమ శాంత శమాదులఁ జూపువానినే
నిచ్చలు శిక్షణాన్విత వినీతవునీతుని జేయుటొప్పదే
యచ్ఛపు మేలిమైన నగయౌటకు నగ్గినిబెట్టి కొట్టి క
మ్మచ్చున లాగి చెక్కి మణులందొక నేర్పునఁ గూర్పకుందురే?" 143

వ. అని, పలుతెఱంగుల పూర్వాపరంబుల విమర్శించుకొనుచు. 144

సీ. ఒకవేళఁ దండ్రిగా నుత్తమస్థాయికై
యున్నతాశయ చయ ముగ్గడించు
ఒక తూరిఁ దల్లిగా నొద్దఁ జేరిన బిడ్డ
కాయురారోగ్య భాగ్యములుగోరు
ఒకసారి దాదిగా నొప్పు దుస్తులు తొడి
ముద్దు ముచ్చటలతో మురిసికొనును
ఒకతేప హితుఁడుగా నున్న లౌకిక ధర్మ
సూక్తిశక్తులఁ జవులూరఁ దెలుపు

తే. ఒక్కపరి దేవతంబలె నుచ్చదశకు
వాగ్వరములిచ్చి యుత్సాహవంతుఁజేయు
మాతృమానస మంజుల మహిమ లెఱుఁగఁ
ధరమె ధాతకైనను వాని తాతకైన. 145

వ. ఇట్లు బహుముఖమ్మైన బాధ్యత నెఱింగిన యా తల్లి యాత్మజుల యుజ్జ్వల భవిష్యత్తునకుఁ గారణభూతలైన మాతలఁ గూర్చి యాత్మ గతమ్మున— 146

తే. గొంతి గొంతెమ్మకోర్కుల పొంతఁబోక
సుతులు పతితులు గాకుండఁ జూచుకొనదె
ధర్మ విద్యా విచారులై తగినపేరు
వారు నిల్పరె యాచంద్రతారకముగ. 147

మ. తన ప్రాణేశుఁడు పాదుషా కొలువుచేతం జింతలేకున్న స
జ్జన సాహాయ్యము కల్మిహైందవులు స్వేచ్ఛావాయువుల్ పీల్వ మా
రణహోమమ్ము రణమ్ము నా నెఱిఁగియుక్ రాట్సింహముంజేయదే
జననీరత్నము వీరమాత జిజియా శౌర్యోజ్జ్వలుం బుత్రకుక్. 148

వ. ఐనను వారు మావంటి నిఱుపేదలుగారు— 149

శా. శ్రీమంతుల్ సకలార్థసాధక జయశ్రీలోలురై! విద్యలం
దామెంతేని వ్యయింత్రు భావి నిజసంతానంబు సంతాన మ
ట్లామోదమ్మునుగూర్ప నా సుతులకే నా రీతిఁ జేయూఁత నీ
కేమో కోరిన నెట్లు పొందనగు లేదే పేదకేదారియుక్? 150

తే. తనదు దురదృష్ట గిరికొక తాఁకుఁ దాఁకి
మేలి యూహాప్రవాహమ్ము చీలి తూలి
చింది చిందరవందరై చివుకుచుండ
నెవరి హృదయమ్ము హాయిగా నెట్టులుండు? 151

చ. అని తన మానసాబ్ధి బడబాగ్నిబలెక్ వ్యథలో నడంగఁ బు
త్రుని గనులారఁ గాంచుచుఁ బురోగతి కేగతి దారిఁ జూపతే
నని తనుదాన తిట్టుకొని యశ్రుకణమ్ము మఱల్చు నౌనుగా
ననువుగ విత్తి నీరిడక హస్తముచాఁప ఫలమ్ము దక్కునే? 152

తే. తోడి విద్యార్థులెంతొ సంతోషపడుచు
నాంగ్ల విద్యాలయమ్ముల కరుగుచుండ
"అమ్మ! మమ్మంపు" మన్న నా కొమ్మ "యట్టి
ఫలభరితమౌట యెపు" డంచుఁ బరితపించు. 153

వ. ఇట్లుండ మద్రపుటభేద విజ్ఞాత విపణిమణి యగు కొత్త్వాలచావడి కన్యకాపరమేశ్వర్యాలయ స్థిరాస్తి. ఆ గుడి తన్నగరస్థభూమిన్ప్రశవతంస నిర్మితము. రొక్కంబున ముక్కంటిచెలి ధిక్కరింపఁగల యుదంత పుంగవులావైశ్యవరులు. ప్రతివర్షంబాలయాదాయమ్ము లక్షలకొలంది యుండు. ఆర్యవంశసంజాత విద్యార్థులకు మాధ్యమిక పాఠశాలయు నుచిత భోజన సౌఖ్యమటనుంట శ్రీరాములు కొన్ని వత్సరమ్ములు తత్సహాయములు పొందుచు విద్యనభ్యసించుచుండె. అయ్యాలయమ్మున నెడనెడ నృత్యగీత గీతావాఙ్ముఖ హరికథాపురాణాదుల కాలక్షేపముజరుగు. అందొక్క పర్వ దినమ్మున తమ యారాధ్యదేవతయును, నిలువేల్పును నగు తద్దేవి పురాణము చెప్పఁబోవుచున్న యుదంతము విని కథా శ్రవణ కుతూహ లుండై రాము లటకరిగె. అందు 154

సీ. నీల నిర్మలశిఖా స్నిగ్ధోత్తమాంగమ్ము
స్ఫటిక లింగాకృతి సరసమాడ
భస్మరేఖాంతర భాసచిత్రకకళల్
ఫాలాంబకచ్ఛవిఁ బరిఢవిల్ల
మణిగణాన్విత దివ్య మకరకుండలరుచుల్
గురుశుక్రదీధితిఁ బరిభవింప
స్వర్ణశాటీవ్యక్త భర్మతంత్రీ బద్ధ
రుద్రాక్షమాలల రోచులెసఁగ

తే. ధవళ యజ్ఞోపవీతమ్ముఁ దాల్చి ప్రోల
గ్రంథ పీఠమ్ముపైఁ గన్యకాపురాణ
మలరఁ బరశివధ్యాన కల్యాణుఁడగుచుఁ
బరగెఁ బద్మాసనమున సద్బ్రాహ్మణుండు. 155

వ. అట్టి యనంతామరశేఖరు నజ్ఞానతమః ప్రభాభంజన ప్రభాకరుశుభా కరు నల్లంతఁగని వానివేషభాషల కవ్యక్త మధురానురాగ రంజితభక్తి నిజాంత రంగమ్మునఁ గడలుకొనంగ 156

తే. బ్రహ్మతేజస్వియైన పౌరాణికునకు
వినయ వినమితగాత్రుఁడై వేడ్క మ్రొక్కి

చెంతఁ గూర్చుండె రాములు చిన్నినగవు
కెంపుపైనున్న ముత్యంపు సొంపు నింప. 157

వ. అప్పుడా విద్వచ్ఛిరోమణియగు భూసురగ్రామణి భక్తాగ్రగణ్యులగు శ్రోతృబృందమ్ము సాదరమ్ముగ నాలోకించి ద్రాక్షా ఖర్జూర కదలీ నారి కేలాది రసవత్ఫలభరిత భూరి భాజనమ్ము పార్శ్వభాగమ్మునం బ్రాజిల, వెలుగుచున్న యగరువత్తులు ఘ్రాణతర్పణమ్ము సేయ నౌత్సుక్యముట్టిపడ మందస్మిత సుందర వదనారవిందుండై యైతిహాసిక పౌరాణిక ప్రాబంధిక నాటకీయాద్యనేక వాఙ్మయశాఖా సమీక్షణానుభవ విశిష్ట దృష్టాంతోపేత కథాకథన చాతురీద్యోతకరసోచితవాగ్రచనా చమత్కృతుల శ్రావ్యగంభీర స్వరమ్మునఁ గన్యకాపరమేశ్వరీచరిత్ర శ్రవఃపేయముగ నుభయతారక దృష్టితోఁ జెప్పఁ బత్వరీశోభితుండగు రాములత్యంత శ్రద్ధాళువై యాలించి యానంద పయఃపారవారమ్మున నోలలాడి ప్రసాదమ్ము స్వీకరించి సంతృప్తిపడి యిలుసేరె.

ఇట్లు కొంతకాలమ్ము జరుగఁ బ్రథమ ద్వితీయ తనూజాలకుఁ బంచ దశ ద్వాదశవర్షమ్ములు నిండుచుండ లక్ష్మమ్మ కింకర్తవ్యతా విమూఢయై కొన్నిదినమ్ములు గడపి యొక్కదివసమ్మున దీర్ఘాలోచనచేసి సంసారము నందన్నవస్త్రములకు లోటు లేకుంటత్యవసరముగాన దానికై తాఁజేయు చున్నచిన్న వ్యాపారమునకు మున్ముందు చేదోడు వాదోడుగానుండఁ గలఁడను విశ్వాసమ్ముతో బేహారియగు నొక్క సంపాసారికడ మాసము నకుఁ బంచ వింశతి రూప్యముల వేతన నిర్ణయమ్మున నారాయణు నుంచి శ్రీరాము నాంగ్లేయ భాషాభ్యసనావసరమ్మున సమీపమ్మునంగల హిందూ దివ్యజ్ఞానోన్నతపాఠశాలకుఁ బంపె. అహా! చతురాస్యుని చాతుర్యము! ఏకస్కంధ జనితమ్ములగు శాఖాద్వయ మ్మిరుదెసఁబ్రాఁకి నట్లు ఆ సోదరుల జీవితపథమ్ములు నదీనదమ్ములట్లు ద్వివిధమ్ములయ్యె. శ్రీరాములు నిత్యము సాయంసధ్యా సమయమ్మునఁ గన్యకాపరమేశ్వర్యాలయమ్మున కరిగి మౌనముద్రాలంకారుఁడై పరమేశ్వరీ ధ్యానమ్ము సల్పి యింటికి వచ్చి తమ కోరిక మితముగఁ గష్టించుచున్న తల్లికి గృహకృత్యములఁ దోడ్పడుచుఁ గృతజ్ఞుండై వర్తించుచుండె. 158

ఉ. అట్టి కుమారుఁగాంచి హృదయమ్మున భర్తృవియోగదుఃఖమున్
నెట్టి గృహమ్ము నెట్టయిన నేర్పున వృద్ధికిఁ దే సమర్థుఁడౌ
నట్టిఁడు వీఁడటంచు నొక యాశయ యూతగఁ జిక్కఁజిక్కనా
పట్టినిఁజూచి మాతమది పట్టఁగరాని ముదమ్ము నొందెడిన్. 159

కం. తృష్ణారహితులు విద్యా
నిష్ణాతులు సత్యధర్మ నిరతులు కృతి భా
రోష్టిషులు నుతపూజిత
కృష్ణపదుల్ సుతులు గల్గు టెంత ఫలమ్మో! 160

ప్రథమ ప్రకరణము



ద్వితీయ ప్రకరణము

# ఎమ్డెన్ శతఘ్నులం బ్రేల్చుట

# మద్రపురీ బీభత్సము

(జర్మనులు మద్రపురిపై శతఘ్నులు ప్రేల్చుట)

వ. ఇత్తెఱంగున రెండు శరత్తులు దాఁట నొక్కనాఁటి యామినీ ప్రథమ
యామాంతమ్మున 161

మ. ప్రళయాభీల మహామహోజ్జ్వల కరవ్యావృత్త యావత్పురీ
జలధి ప్రాంత విచిత్రభానునిభ భాస్వత్త్వాకార యంత్రప్రభా
కలితానీతతటిత్ప్రదీప కళికా కాంతిచ్ఛటాటోపమై
వెలిఁగెన్ వెల్గొకఁ డెల్లరుం గలఁగి హృద్వీథిన్ విమర్శింపఁగన్. 162

తే. ఉదధిఁ బ్రాగ్దిశఁ గన నొక్క యోజనమ్ము
దూరమున ధూమకేతు నాఁ దోఁచినట్టి
వెలుఁగు వెల్గువ మున్కలు వేయుచుండెఁ
బురము కనుచూపులో యమపురముగనుచు. 163

తే. అరయ నా గడపలతోడి—యాకసంబు
నలల నంబుధిఁ బ్రతిబింబ మందు దేని
కెదియొ తెలియమి భీకర—మృత్యుముఖము
తెఱచినట్లుండె చంచలా—దీపకాంతి. 164

మ. తళుకుం బెళ్కులఁ గుల్కుజర్మను జలాంతర్గామి "యెమ్‌డెన్"నమి
ద్భల శక్త్యద్భుత మారణాయుధ మిళద్ధాటిన్ నిరాఘాటమై
వెలుఁగుల్ గ్రక్కుచు నిల్చి నీటిపయి వేప్రేల్చెన్ శతఘ్నిన్ మహా
నలభూభృత్తిల బద్ధలైనదనఁ గర్ణద్వార దీర్ణక్రియన్. 165

క. ఢామ్మను ఫిరంగి మ్రోఁతల
కోమ్మనె ఘంటారవమ్ము లురలెం బిడుగుల్

దిమ్మరులై ప్రాణమ్ములు
వమ్మని యుమ్మలిక దిగులుపడిరి జనమ్ముల్. 166

క. పిట్టలు బిట్టులుకున వెస
గుట్టలు గుట్టలుగ లేచి – కూయుచుఁ జెట్టుం
బట్టులు పట్టక మరలం
బుట్టెడి యులిపులకు వలన పోవఁ బొడంగెన్. 167

వ. ఇట్లా యెడ్డెను భయానక బీభత్సరౌద్ర శోకాది రసమ్ముల విచ్చల
విడి రెచ్చఁగొట్టుచు. 168

క. ఇరువదియైదు ఫిరంగులఁ
బోరిపోరిఁ బదునైదు నిముసములలోఁ గాల్చెన్
మరణించిరి యెనమండ్రట
మరి మరి గాయములు పెక్కుమందికిఁ దగిలెన్. 169

తే. కట ! జగాపాడిపట్టుపై, గబ్బునూనె
చెఱువుపై, నొండు నొకటియు సెంటుజార్జి
కోటపైనొండు, నిటనుండి నూటిచెదరి
పరశువాకమ్ముపై నొండు, పడెను గుండ్లు. 170

క. అగ్గుండ్లు మండుటగ్గుల
బగ్గుమనెం జెఱువు మంటపైకొని పట్టిం
బగ్గములులేమిఁ దగ్గక
వెగ్గలముగ రేఁగసాఁగె విచ్చలవిడిగా. 171

తే. బాణ తూణ తనుత్రాణ పరిఘ భిండి
వాల కరవాల జాల కరాళుఁడగుచు
సురపురముఁ గాల్చ నిల్చిన సోమకుఁడన
నడరె ఎమ్డెను తూరుపు కడలిపైన 172

తే. అరసి దుర్భిణిలోఁ బ్రభుత్వాలయముల,
మఱిఫిరంగుల రుచిచూపి, మెఱుపుదివ్వె
లార్పి, వైరినిశాచరుఁ డంబు తొట్ల
నింపుకొనుచుండ, బయలాలకింపుచుండ. 173

చ. పిడుగులు పడ్డ రీతిఁ గడు – భీకరశబ్దము రా బలాధిపుం
డడరుచు నీలవేయఁగ మహారణ సూచిగ భేరిమ్రోఁగగా
దొడిగి, బిగించి, పెట్టి, కొని – దోర్బలలీల తుపాకులూనిన
వ్వడివిడి యెక్కె సేన వడి – వారక పెన్బురుజుల్ రణోద్ధతిన్.

ఆ. దచ్చి కడలుసూచి – తన వైరిదేసఁగాంచి
ముచ్చువోలె రేయి వచ్చె వీఁడు
కుచ్చితుఁడు తుపాకి – గుండ్లకు గుఱిగాక
తరలఁ గలఁడె యనుచుఁ దలఁచుచుండ. 175

శా. దుర్గాంతర్గత వాహినీతతి హఠాద్దుర్దాంత శత్రుక్రియా
మార్గోద్దీర్ణ విదీర్ణ కర్ణరవ శుంభద్ఘోర శస్త్రాస్త్రసం
సర్గోగ్రాగ్ని విదగ్ధ దృశ్యపటలాంచద్భ్రాంతి నానాతనూ
ఖర్గుంబోలె శతఘ్ని వర్గము రిపుధ్వంసమ్ముగాఁ బ్రేల్చినన్ 176

క. విని యాసవ్వడి వడివడి
నినునివలెన్ వెలిఁగినట్టి ఎమ్డెన్ మునిఁగెన్
ధ్వని యింత చెవిం బడఁగనె
తనదేహము దాఁచుకొనెడి తాఁబేటి క్రియన్. 177

క. జడధి గుభిల్లు గుభిల్మన
వడిమునిఁగెన్ గుండ్లు తోనపై కొనె బుడగల్
జడగత బలచరజాలము
కడుబెడఁదకు నడలి యెడద గగ్గోలువడన్. 178

చ. తనువు రసాత్మకమ్మవుటఁ దావిడు నేరికి నైన దానపా
వన నిధి తూర్పు దిగ్వనధి వచ్చెను నెత్తికి రాళ్ల గుండ్లు స
జ్జనుల కుదారధర్మరతి సాజమ కాన గణింపరింత రా
వణ హృత సీతకై నరులు వానరు లప్పుడ పట్టికట్టరే. 179

శా. సర్వజ్ఞుండగు ధర్మరాజెడఁద నిశ్శ్రుతుం డహింసా కళా
నిర్వాణాత్మక దృష్టి జాత కరుణా నీరంధ్రుఁ డుద్యద్యశో
గీర్వాణుండు జనించినట్టి ధరకే – కీడ్పాటుఁ గల్గించుఁ ద
ద్గర్వాంధుం గలియన్ సముద్రునకు నీ – కష్టంబు రాఁ జెల్లదే? 180

క. అలలలకలవలెఁ జెదరఁగ
ములుకులు నా గుండ్లు చొఱఁగ బుడగలెడనెడ౯
బులకలువోలెం జెలఁగఁగ
జలధి సమరభీష్మునట్లు సడలదు నియతిన్. 181

తే. ఆత్మసంరక్షణార్థ మి – య్యరి హరింప
నాగక శతఘ్నులనుగాల్చె – నాంగ్లసేన
జలధరముఁ జించి శ్రుతిమించి – విలయకాల
ఖరకిరణుఁ డుగ్రకరములఁ – బరపినట్లు. 182

వ. అట్లు పడుచున్న మందుగుండ్ల కుద్రిక్తుండుగాక గంభీరహృదయుం డగు రత్నాకరుండు నిలువున నీరగుచు నిలిచియుండె. ఐన నమృత శరీరుండగుటచేతనో సుధాకర దేవవైద్యాదు లాత్మీయు లగుటచేతనో స్వయంకృతాపరాధము కామింజేసియో పడిన గాయము పడినట్లు పూడు చుండె. అత్తఱిఁ దత్తరమునఁ జిత్తవృత్తులు చెడిన పత్తన వాసులు. 183

సీ. గుంపులు గూడిరి గుసగుస లాడిరి
ఒండొరువేఁడిరి బెండువడిరి
నల్దెసఁ జూచిరి నడవఁ గాల్జాఁచిరి
వెనుదిర్గి చూచిరి వేఁడుకొనిరి
తలుపులు మూసిరి తాళముల్ వేసిరి
బండ్లకల్లాడిరి బడుగులైరి
పేరెముల్వారిరి దారులు దప్పిరి
పలుచోట్ల నిలిచిరి పల్లటిలిరి

తే. తల్లికిని బిడ్డ బిడ్డకుఁ దల్లిలేక
తల్లడిలి కొల్లఁబోయెడి తఱి యిది యని
గొల్లుగొల్లున నేడ్చిరి తల్లులకట!
ఉసురుబీతును మించిన దొకటి కలదె? 184

(సంస్కృత పదరహితము)

ఉ. చింతల వంతలం జెదరి – దిక్కుల దిక్కుల కెక్కఁజూచి వి
భ్రాంత మనస్కులై బెదరి – పర్వెడి నిల్చినచోట నిల్వకే

వింతగ వీధులం దిరుగు– వేయి తెఱంగులఁబౌరు లావదన్
వంతెనమీఁదఁబౌరు పొగబండివలెన్ రొదహెచ్చుచేసెడిన్. 185

వ. సర్వ సుపర్వ వందిత పాద నీరజా! రజస్తమో గుణరహితా! హితాహితరక్షా శిక్షా దక్షా! దక్షాహంకారవృక్షకఠోరకుఠారా! హరా! పాహిపాహియని వల్కు భక్తబృందముల యార్తనినదమ్ములు ప్రతి ధ్వనించె– 186

తే. అప్పుడా ఘోరకలికి లక్ష్మమ్మ యులికి
సింహగర్జనమున జంకు జింకపిల్ల
లట్టు తన చుట్టుఁ జేరిన యాత్మజులకుఁ
గొంత ధైర్యమ్ము గఱపుచుఁ జింతపడుచు. 187

శా. ఆ వీధిన్ ధనవంతు లెంతయినఁ బ్రాణాపాయముం దాఁటుమ
ట్రోవల్ యానములం గమింపఁగని యేదో వాహనమ్మెక్కిపోఁ
దా వేమాఱు ప్రయత్నముల్ సలిపి తత్ప్రాప్తంబు లేకున్కి మా
దేవీవల్లభ పాహిమామనుచుఁ బ్రార్థించెన్ సుతోపేతయై. 188

వ. అగిఁ రేగిఁ సాగి మూఁగెడి కోలాహల ధ్వని విని డోలాందోళిత హృద
యయై ప్రాంగణమునకుం జని జనముఁగని. 189

సీ. అయ్యలారా! మీర – లడిగితిరా బండి
యందులో మాకింత - సందుగలద?
అమ్మలారా! మీర - లరుగుట యెట కటఁ
దలదాచుకొన మాకుఁ - దావుగలద?
అన్నలారా! మీర – లాశించు సత్క్రియా
దేశంబునకు మాకుఁ–దెఱువు గలద?
అక్కలారా! మీర – లైననాఁడుం గోడు
నాలించి మేలెంచు – టాత్మఁగలద?

తే. ఇరుగు పొరుగుననున్న సు – ధీంద్రులార!
దీనదశనుంటిమిటు మగ–దిక్కు లేమి
తోడునీడగ మీరైనఁ – దోకొనుండు
ఆర్తరక్షణపరులార! – ఆంధ్రులారా! 190

మ. అకటా! యొక్కరు దిక్కులేరె యని బె – ల్లల్లాడు తల్లింగనన్
సకలాశల్విడనాడి రాములు సమా – శ్వాసింపనమ్మా! జగం
బొకరీతిం జనదంచు నీ వెఱుఁగవా? – యుద్వేల శోకస్థితిం
బ్రకటింపన్ మరణంబు దప్పనొకొ దై – వంబెంతకుం జాలదే! 191

కం. ఆయువు గలిగిన బ్రతుకుద
మాయువు లేకున్న దారి – నరిగెడివేళం
గాయముపడ నేమగు మన
సాయంబై దేవుఁడున్న – జరుగును శుభముల్. 192

కం. కావునఁ జింతిల బోకుము
పావన హృదయారవింద – బంధుర పీఠిన్
గోవిందు నిలిపి కొలుచుటె
కేవల సన్మార్గమనుచు – కేల్మోగుచు తటిన్. 193

కం. తనయుని తియ్యని పల్కులఁ
దనియుచు నా యమ్మకొంత – ధైర్యముఁ బూనెన్
క్షణములు జరిగిన నడలెను
మనమవు డొకరీతి నిలువు - మనుజులు కలరే? 194

కం. స్థల జల నభోంతరాళం
బులు సమర విహారరంగములుగా నౌటన్
విలయం బెయ్యెడ నెచ్చటఁ
గలుగునొయను దిగులు – ప్రాణకంటకమయ్యెన్. 195

తే. గుప్పుగుప్పునఁ బెనుమంట లుప్పరమునఁ
గొన్ని తాళ్ళ ప్రమాణంబ యన్ని దిశల
బర్వువెనఁ దగ్గ దిగ్గనఁ బైకిలేచు
మృత్తికాతైల కూపము మృత్యుముఖమ. 196

కం. సతనాల్కల జేజే కతి
కుతుకమ్మును గూర్చు దినమొకో కాదది ఖా
రతమున ఘృతాన్నమును దిను
కతగల బుధవర్యుఁడతని గతి యట్లయ్యెన్. 197

తే. కృష్ణధూమానువర్తి కాఁ గృష్ణవర్త్మ
సర్వభక్షక నామముల్ సార్థకముల
మండె రెన్నాళ్ళవఱకట మట్టినూనె
చెఱువు తన కంపుపెంపు లచ్చెరువుగాఁగ. 198

తే. దేవ ! నీ సేవకులఁగావ రావయనుచు
వాడవాడల వేఁడని వాఁడు లేఁడు
హాలహలమును ౖమింగిన హరుఁడు నేఁడు
కలియుగమ్మని కాఁబోలు కదలిరాఁడు. 199

ఆ.వె. అపుడు విసమునందు – నగ్నికీలలెగాని
కదిసి యోర్వరాని కంపులేదు
దీనిగబ్బుఁ దలఁచి – దేవదేవుఁడుగూడ
వెఱచెనేమొవచ్చి – వెన్ను చఱవ. 200

కం. నిస్తంౖతీ ద్వారమ్మున
నిస్తుల వేగమున వార్తనిండెౙ లండౙ
విస్తృతగతి వృత్తాంతము
నేస్తముగల దేశములకు నిగిడె క్షణములో. 201

శా. అంతంౖదాఁచును దోఁకఁ ౖదొక్కినటులయ్యాస్ట్రేలియా "ౖకూయిజర్"
పంతం బొప్పఁగలేచి వారిధి సమిద్వ్యాపార పారీణ వి
ౖకాంతాయత్త సమస్త వస్తుయుతమై రాజద్బలోపేతమై
గంతవ్యాధ్వగమై గభీరవనధిం గార్కశ్యముం గాంచుచుౙ. 202

కం. కాలకరాళాౖగ బృహ
న్నాళిక లతిజవనవలఘు నాళిక లత్యా
ఖీలముగఁ గలిగి సిడ్నీ
గాలించుచు నుదధినెల్లఁ గలయఁ దిరుగుచుౙ. 203

మ. సరిగా నిర్వదిమూఁడు నావలను ముంచంజాలి ౖపాగ్ద్వీపముల్
జెఱుపంబూని చరించువైరి నటఁ జూచెౙ సిడ్నీ కన్నొౙ్ఞఁగా
శరవేగాన్విత శౖతుయంౖతముఖ నిర్యద్ఘోర మృత్యుౖకియా
వరశక్తిం బరికించి యెమ్డెనరి కౖన్నావమం ౖబయత్నించినౙ. 204

కం. చిచ్చుఱ పిడుగులు చిమ్ముచు
వచ్చెను మత్స్యావతారువలె సిడ్ని కసిన్
జెచ్చెఱఁగాల్చె ఫిరంగులఁ
బిచ్చిగ నెమ్మెనటు వైరి వెసవెన్నాడన్. 205

తే. తిరిగెనది సుడివలె నేత్రృధీవిధాన
చక్రడోలాకృతి భ్రమించె జలధి యచట
చిఱుత వెనుకొని తరిమెడి సింహమట్లు
వేగఁ గ్రూయిజరద్దాని వెంటఁబడుచు. 206

కం. ఒడ్డునకుఁ దరిమి దానిం
దొడ్డ శతఘ్న్యాళి సిడ్ని దొమ్మిగఁ గాల్చన్
గడ్డు సమస్యం దమకథ
యడ్డముగాఁ దిరుగ నౌక కధిపతి ముల్లర్. 207

ఆ.వె. ఉన్న చిన్నపడవ యువరాజు జోసెఫు
దింపి తానుగూడ దిగినయంత
చుట్టుముట్టి సిడ్నిఁ జొఱఁబడఁ జేసిరి
సాహసించి యరులు వ్యూహగతిని. 208

ఆ.వె. ఇంగితమ్ము లెఱిఁగి యిర్వురు నాయకుల్
నెలయుఁ బ్రొద్దు నొకటఁ గలియు కరణిఁ
జేరిరందు నింతఁ జెడకుండ సహజ స్వ
భావములును నాత్మభావములును. 209

ఆ.వె. అతని హితునివోలె నాదరించె నితండు
కరము శిరమువంచి గారవించె
నతఁడితనిని; నిర్వురన్యథా భావింప
కాత్మగౌరవముల నరసికొనిరి. 210

తే. చెవులు ముక్కులు కన్నులు చెదరకుండఁ
జిన్నదెబ్బకు దేహము చెడకయుండఁ
దగిన యంత్రముల్ కవచముల్ దాల్చియుంట
బూచులట్టుల వారలు తోఁచిరపుడు. 211

ఆ.వె. యుద్ధనౌక కాల యోధులిద్దఱు తప్ప
చచ్చెవారి సమర సైనికాళి
ముందె సిడ్నియందు మువ్వురు మడసిరి
గాయపడిరి కొందఱాయువుంట. 212

తే. చివ్వబందాల నీరీతిఁ జిక్కఁబట్టి
యినుని యానను శిరసావహించి మించి
విజయ మంగళ గీతము వినుచుసిడ్ని
మాతృదేశోన్ముఖమ్మయి మరలి తరలె. 213

వ. ఇంకిటు,—

తే. దూరదర్శిని నిల్పి త – ద్దుర్గశిఖరి
నరయుచుండిరి యరుల నీరైదుకడల
సమరముల నాఱితేఱిన – శాత్రవుండు
బలము గలఁడేని పక్కలో బల్లెముగద ? 215

మ. అదిగో బెబ్బులి యన్నఁ దోఁక యిదిగో యంచెంచుచుం గాంచుచున్
మదమాతంగ చలత్సరోవరమునా మద్రాసు సత్రాసమై
యదరుంజీమ చిటుక్కుమన్న నది ప్రత్యర్థ్యాగతమ్మంచొగిం
బదినాళ్లేగ నొకింతశాంతి గుదిరెన్వైరి క్రియా శూన్యతన్ 216

తే. "ఆంగ్లశార్మణ్య రణశక్తు లాగ్రహింపఁ
జెట్టువాటిల్లె భారతసీమ కింత
అవులావులు డీకొను తావులందు
నడుమగల లేఁగలకుఁ గాళ్లు నలిగినట్లు." 217

కం. అని జనని యనిన యంతన
విని రాములు దాస్యబంధ విధమిదియ గదా
యనుకొని పాలక పాలిత
జనదృష్టి విభేద చర్చసాఁగించు తఱిన్. 218

తే. తోడి విద్యార్థులెంతో సంతోషమెసఁగఁ
బాఠశాలను దెలిసిన వార్తఁ జెప్ప

నటకుఁజనెఁ గాని యంతగా నచటలేరు
బాలురైనను బోధకుల్ వచ్చి యుంట. 219

కం. తన గురువర్యుండగ్గఱి
వినయమ్మున మ్రొక్కి యుద్ధవిషయములు వినన్
మనమునఁ గుతూహలంపడి
యనఘుండతఁ డిట్టులడిగె నమితాసక్తిన్. 220

చ. స్థిరమతి బోధసేయు గురుదేవులు మీరలు నేఁటి ఘోర సం
గర కథఁ గూడ సంగ్రహముగా విన వేడెదమన్న నొజ్జ సా
దర దరహాసభాసురసుధా మధుసూక్తుల యుక్తియుక్తమౌ
కరణి వచింపఁ బూని తమకమ్మున శిష్యులతోడ నిట్లనెన్. 221

మ. తమిమై మీరిటుగోరఁ గాదన జలాంతర్గామి నీర్వామి దు
ర్దమమై యింతలు చేసినందునగదా తద్భృతి నీరీతిఁ బ్ర
శ్నములన్ గుప్పుట నా యెఱింగినది యుత్సాహంబుతో మీ మనో
భ్రమ దీఱన్ వచియింతునింక వినుఁడీ బాలుర్ ప్రశాంతంబుగన్.

వ. జలాంతర్గామ్యాదుల నిర్మాణచాతుర్యం బించుక తెల్పి యవ్వలఁ
జివ్వందూర్చి వచించెద. 223

సీ. "అలజలాంతర్గామి యందు నల్వదిమంది
యుందురు టార్పెడోలుండు నాఱు
ప్రాణవాయువునెల్ల మానొమీటరుచూపు
పరికింత్రు యోజనద్వయముమేర
కోనింగ్ టవర్ పెరిస్కోపు యంత్రంబున
బాహ్యదృశ్యములు గన్పడుచునుండు
తేలిన మున్గిన వేళల మృక్కిల
విద్యుత్ప్రభావాప్తి వెడలుచుండు

తే. వైరి యోజన షట్కంబు దూరమున్న
మైక్రొఫోన్ శబ్దమెఱిఁగించు మఱిఫిరంగు
లుండుఁ బదిరెండు గంటకు యోజనత్ర
యంబు పరుగెత్తుచుండు నవ్యాహతముగ. 224

సీ. ఇఁక విమానోత్ప_త్తి నెఱిఁగింతు రైటు సో
దరులు గన్పెట్టి రద్దాని నదియ
ఓకు కొయ్యలును నల్యూమినియము నభ్ర
కముఁగూర్చి చేసిరి – ఘనత మెఱయ
మును గాలిమఱ దాని వెనుక శిలాతైల
యంత్రంబు గ్రేవలయందు ఱెక్క
"లెయి లొరా"నులతోడ నింపగు "ఫ్యూజిలే
జి" "యెలివేటరు" తగ జిగి వెలుంగు

తే. నవల చుక్కాని రడ్డరు నమరియుండు
మనుజులుందురు నల్వది – మందివఱకు
వెళ్లుగంటకు మున్నూరు – మైళ్ళ వేగ
ముదజని సహాయ మెంతయు – నుంటఁజేసి. 225

తే. గాలి గుమ్మట మటుమీఁద – గాలియోడ
పుట్టిపుట్టి విమానంబు – మూఁడవదిగ
వరుస డార్విను బరిణామ – వాదమరయ
నవనియందు వాసరము నరుఁడైనయట్లు. 226

మ. శతవర్షమ్ముల కించుకంతమును పే – స్కాట్లండు దేశస్థుఁడ
ద్భుతమేధానిధి జేమ్సువాట్టు పచనం - బుం జేయుచో సూక్ష్మపుం
గతిచేఁ బాత్రశరావచంచలతఁ జ - క్కంజూచి యోచించి యా
స్థితి కయ్యావిరి కారణంబని గ్రహిం - చెం దెల్పెఁ దచ్ఛ_క్తియున్

కం. ఆవిరియంత్రము సేసెన్
స్టీవెన్సన్ దానిఁ దెలిసి - చెచ్చెరలండం
ద్రోవలయో మార్గముల్తై
సావి ననుసరించి ధూమ - శకటము దిరుగన్. 228

ఉ. ఆ పొగబండి తీర్థతరమై జనులెందఱొ యెక్కి త్రొక్కినం
బాపము కయ్యెకుయ్యనక – మానవసేవకు మార్గదర్శియై
తోఁపఁగనిప్పునీరముల - తోఁ గడుఁ దృప్తివహించి క్రొఁత్తవిం
కీపగిదిన్ స్పృశించుకొనుఁ - డీయనుచాడ్పునఁ గూఁతవెట్టఁగన్. 229

ఉ. అరవమందుకొన్ని విషయంబుల శాస్త్రసుధీవరేణ్యులా
హారవిహారనిద్రల సు - ఖాదులెఱుంగక సూర్యచంద్రసం
చారవిచారముంగనక సత్కృషి సల్పుచుఁ దత్ప్రయోగవి
ద్యారతి భారతీసతిప - దాబ్జములం భజియించుచుండఁగా. 230

తే. నాఁటినుండియుఁ బరిశోధ - నములు హెచ్చ
నొక్కటొక్కటి క్రొత్తవి - యుద్భవించె
భరణ మరణాత్మకములై ప్ర - భావమందు
ముఖ్యములుగానఁ గొన్నింటి - ముచ్చటింతు. 231

సీ. అచ్చు జంతరమొక్క - టమరిచె నొకరీతిఁ
గొయ్యతో మున్ముందు - గుటెనుబర్గు
తన సూక్ష్మదృష్టియ - ద్దానిపైఁ బ్రసరింప
మాక్సను మఱికొంత - మార్పుదెచ్చె
నినుముతోవర్ణము - లొనరించి పూర్తిగాఁ
జార్లెసుమాహన - చక్కఁజేసె
ముఖ్యభాషలనయో - ముద్రణయంత్రముల్
దేశదేశములకు - దిగుచునుండె

తే. దాన నూతన విశ్వవిజ్ఞానతేజ
మమితవేగమ్ముగా లోక - మలముకొనియెఁ
బిన్నపెద్దల సుద్దిముందున్నతీరు
మాటె మూఢత్వ మొకకొంత - మాసిపోయె 232

ఆ.వె. చలనచిత్ర యంత్ర - సాధనసంపత్తి
నెడిస ననెడిధీరుఁ - డెఱిఁగె మొదట
వరుసకెప్లరెంతొ - వ్యాప్తిలోనికిఁ దెచ్చె
జ్ఞాననేత్రదృష్టి - గలుగఁ బ్రజకు. 233

సీ. విజ్ఞానిమైకేలు - ఫేరడే చుంబక
ము వలన విద్యుత్తు - పుట్టుటఁగనెఁ
దరువాతఁ దచ్ఛక్తి - థామను నెడిసను
దెలిసి దీపాదుల - కలిమిఁగూర్చె

కల్నలుగ్రేకను – ఘనుఁడు శిలాతైల
మిలనుండి కనుఁగొని – తెలియపరచె
విద్యుదయస్కాంత – విధి సహాయము కల్మి
నిస్తంత్రి మార్కొని – నెగడఁజేసె

తే. ఇట్లు ఫలితమ్ము లంతంత – హెచ్చుకొలఁది
దూరకాలజలస్థల - మారుతాభ్ర
విజయగుణ యంత్రనిర్మాణ - విపులశక్తి
శాస్త్రవేత్తల కేర్పడె – జగము వొగడ. 234

# ప్రథమ ప్రపంచ మహాసంగ్రామము

వ. ఇఁకఁ బ్రథమ ప్రపంచ మహాసంగ్రామ కథావిధాన మెట్టిదన –235

కం. ఒక తఱి సప్తద్వీపము
లోకయెడ నవఖండములుగ నొప్పియు భూగో
ళ కళాభిజ్ఞులచే నిలఁ
బ్రకటితమగు నిపుడు ఖండపంచకమనుచున్. 236

ఆ.వె. భరత దేశమునకు వాయువ్యమూలన
యాఱువేల మైళ్ళ దూరమందుఁ
గలవు తెల్లదొరల నిలయముల్ దీవులు
పుడమి పడఁతి జడను పూలువోలె. 237

వ. ఇంగ్లండునకు రాజధానియగు లండను నగరగరిమం బెంతని వర్ణింతు. 238

శా. ప్రామిన్కుల్ నుతియించు విష్ణుపదమున్ ఫాలమ్ము సంధించుచున్
శ్రీమత్సౌథ శిరోగ్ర రత్నరుచిఁ బూ–జించుం బురశ్రీ సదా
వేమాఱుల్ జనుదెంచి కర్కటగతిన్ - వీక్షించి హర్మ్యద్యుతుల్
ద్యోమార్గ ప్రతి బంధకంబనుచు సూ - ర్యుండద్ది దాటండొగిన్. 239

కం. వలగొని దీవుల నావల
బలమలరుంగాంస్య దుర్గ పంక్తులు నాఁగన్

జలయుద్ధ నిపుణు లెవరుడుం
జలమొప్పఁగఁ గాంచుసముద్రపు సాధన తతితో. 240

వ. ఆ దీవులకు మన మాతృభూమికి సూటిగావచ్చు బాటలో ఫ్రాన్సు, ఇటలీ, గ్రీసు, టర్కీ, ఇరాక్, పర్షియా, అఫ్‌గన్ స్థానములు గలవు. పార్శ్వముల బెల్జియము, జర్మనీ, ఆస్ట్రియా, హంగేరీ, సర్వియా, యుగోస్లావియా, రుమేనియా, బల్గేరియాది దేశమ్ములు గలవు. అందు ముఖ్యాధిపతు లెవరన— 241

సీ. రవి యస్తమింపని రాజ్యమేలెడి సార్వ
భౌముఁ డైదవజార్జి, వానిగన్న
జననికి మనుమఁడు జర్మను జనపతి
రెండవ విలియము చండగుణుఁడు
రష్యను సామ్రాజ్య రమఁ జెట్టవట్టిన
నిక్లసు విక్రమాన్వితబలుండు
ఫ్రెంచిదేశరథంబుఁ బ్రేమతో నడిపెడి
మంత్రి క్లమెన్షు సన్మంత్ర పరుఁడు

తే. ఒక్క చెంపను గొట్ట వేఱొక్క చెంప
నిమ్మనిన క్రీస్తు మతజులె సుమ్మువీరు
వలన దేశాక్రమణముల స్పర్ధవీరి
కంటుగామాఱి చివ్వకు గెంటుచుండ. 242

తే. నరిగ సరిహద్దు ప్రాంతాన సంచరించు
ఆస్ట్రియా రాకుమారుని హత్యజేసె
సర్వియాదేశ విప్లవ జనుఁడొకండు
తన్మహాఘోర మరణంబుఁ దలఁచి తలఁచి. 243

వ. ఆ హత్య తత్ప్రభుత్వ కుహనా కృత్యమని యెంచి— 244

చ. సరగున హంతకాధము నొసంగి ప్రసంగముమాని సర్వియా
యిరువదినాల్గు గంటలకు నిప్పని తప్పని యొప్పుకొన్నచో
జరుగును సంధి లేనియెడ సాఁగును యుద్ధము బద్ధవైరమై
స్థిరమని యాష్ట్రియాప్రభువు చెచ్చెరవార్తనుబంపెవైరికిన్. 245

తే. లేదు ప్రత్యుత్తరము లవలేశమైన
యుద్ధమే సిద్ధమనుచు సన్నద్ధులైరి
ఇట్టు పుట్టిన రణవాయు వీడ్చికొట్ట
నుదరి జగమెల్ల నుఱ్ఱూఁత లూఁగుచుండె. 246

తే. వీరవరుఁడైన ఫ్రాన్సిసు ఫెర్డినాండు
హత్యయది సెరాజీవో పురాంతరమున
జరుగుటొకవంక గాని నిజంబుఁ దలఁపఁ
గారణాంతరములు పెక్కు గలవు వెనుక. 247

చ. బలపరిమాణ సంపదల పద్ధతి వేఱయినట్టి రాజ్యముల్
గలవిలనెల్ల నేఁబది యొకండొకదానికి దీటుమాటకున్
జెలఁగును స్వేచ్ఛ; తంత్రరససిద్ధులు పాలకులైన భేదముల్
గలిగినఁదీర్పు సెప్ప నధికారము లేదొక సంస్థకేనియున్. 248

తే. దేశజనులకు సుంతైనఁ దెలియకుండ,
నెగడుచుండు విదేశాంగనీతి రాజ్య
ముల నమాత్యులు రాయబారులును గలసి
చేయు సంధులు లోలోనఁ జెడుచునుండె. 249

శా. జాతీయోద్యమమెల్ల దేశజనవిశ్వాసార్హమై సాఁగె ద
ద్రీతుల్ నీతులు గ్రంథకర్తలు కళాప్రీతుల్ కవుల్ బత్రికల్
ఖ్యాతిన్మీఱఁ బ్రచారమున్ సలిపె స్వేచ్ఛానందముం బొందు వాం
ఛా తౌల్యమ్మున మత్సరమ్ము దవె దాన్యక్షిన్న రాష్ట్రాళికిన్. 250

మ. పలుభోగాదులఁ దృప్తిలేక వరుసం బాశ్చాత్య సామ్రాజ్య వా
దులు యంత్రోద్భవ వస్తువిక్రయకళా దోహాయమానుల్ జల
స్థలభాగమ్ములలోన నాగరక రాష్ట్రశ్రీలు వొందన్ దురా
శల గాలించి జయించి రాజ్యరమ సంస్థాపించి రందందొగిన్. 251

శా. అండల్ నిండని ఆసియా యమెరికా యాస్ట్రేలియా యాఫ్రికా
ఖండాలం గల భాగముల్ బ్రిటను గైంకర్యంబుగా జర్మనుల్
చండాంశుంబలె మండి తెల్లదొరలన్ సాధింప రేయుంబవల్
నిండారంబని సల్పి యాయుధతతిన్ నింపెన్ మహాదుర్గముల్. 252

తే. ఆయుధోత్పత్తి యనికి మహాజి మూర
నాయుధోత్పత్తికిని దారితీయుచుండఁ
గ్రన్న బెర్లినునుండి బాగ్దాదువఱకు
జర్మనుల రైలుమార్గము సాఁగుచుండె. 253

తే. పర్షియా భారతమ్ముల భాగ్యభోగ్య
కళల గమనించి కబళింపఁదలఁచి చేయు
జర్మనుల జగాజతనమ్ము మర్మమెఱిఁగి
యాంగ్లదేశమ్ము సంసిద్ధమగుచునుండె 254

కం. ఈ కారణముల లోలో
రేకెత్తుచు రేఁచు సమర రేఖలు హత్యా
నీకమ్మొ యొక దివసమ
ప్రాకెఁ లోకమ్ము యుద్ధరంగముగాఁగన్. 255

తే. ఆస్ట్రియావైపు జర్మను లనికి దిగఁగ
సర్వియావైపు ఫ్రాన్సు రష్యనులు జేరి
రపుడు జర్మనుల్ ఫ్రాన్సుపై కరుగుచుండ
బెల్జియము దారినీయక బిట్టెదిర్చె. 256

తే. బెల్జియమ్మున కభయంబు బ్రిటనొసంగె
హంగెరీ జర్మనీకి సహాయమయ్యె
ననుకొనని దేశమిదియ మా కడ్డమనుచు
జర్మనులసేన కోరమీసమ్ము దువ్వె. 257

శా. మచ్చుల్ క్రమ్మాయవె యేన్గులైన నిఁకఁ దోమంగూర్చియా ముచ్చటల్
నిచ్చల్ క్ష్మామారణ మారణాస్త్రతతితో నిర్మించు పెన్మంత్రపుం
జిచ్చుం జిమ్మిన ఫ్రాన్సు గీన్నెగిరి భస్మీభూతమై పోవదే
తుచ్ఛంబ్లెబియ్యది యెంతకొంతవఱకేదో నిల్చి నీల్గున్వెసన్. 258

కం. పెళపెళ నాంగ్ల బలావళి
యలబలమున వచ్చి ఫ్రాన్సు నలమకమున్నే
తలపడి మారణహోమము
నలుమఁ దలఁప నిద్ది నిలుపఁ జాలునె యనుచున్. 259

వ. శిరస్క దలప నాగోద మంఖుణ బాహుల గోధాది శరీరసంరక్షణ సాధనంబులు సవరించుకొని— 260

క. ఎపుడెపుడని రణమంత్రము
జపియించి తపించి మించు శార్మణ్యదళం
బపుడద్భుత సాహసమునఁ
ద్రిపురాసుర సేనలట్లు దివిభువి నిండెన్. 261

(త్రిపురాసురులు — 1. ఆస్ట్రియా, 2. జర్మనీ, 3. హంగేరీ)

శా. చక్రవ్యూహ వికీర్ణ యంత్రయుత భాస్వత్సైన్యమై పోర ని
ర్వక్ర స్థైర్యముతోడ బెల్జియము నిల్వంజూచి సక్రోధులై
సాక్రాంతిం జనుదెంచి రొక్కమొగి నర్థా బ్జాకృతిన్ జర్మనుల్
విక్రాంత్యుగ్ర సమగ్ర విగ్రహ కళావిర్భూతి మిన్ముట్టగన్. 262

వ. ఇట్లుత్పన్నంబైన సంకుల సమర సంహార వీరవిహారంబున నధిపతుల నాజ్ఞా సంజ్ఞల నాలించుచు, మహా మహోగ్ర దృగంచల చలత్రోట్కధారుణ కిరణమ్ములఁ బ్రసరించుచు, వైమానికులు వైమానికులతో, యాంత్రికులు యాంత్రికులతో, లోహరథికులు లోహరథికులతో, నాశ్వికులాశ్వికులతోఁ దలపడి శూలములఁ గరవారములఁ దుపాకుల మఱతుపాకులఁ బిరంగుల మఱపిరంగుల శతఘ్నుల మహాశతఘ్నుల బాంబుల టార్పిడోల విషవాయువులఁ బ్రయోగించునపుడు ప్రళయకాల సముజ్జృంభిత పర్జన్య గర్జా నిర్ఘోషనిభంబులగు ఢాం ఢాంమ్మను శబ్దతరంగ పరంపరలు బ్రహ్మాండ భాండమ్ముల బ్రద్దలుసేయ విద్యుచ్ఛటాకుటిల వాహినీ పటలమ్మటు నిటు ప్రవహించుచున్నట్లు, పశుపతి ఫాలనేత్రానల జ్వాలలు చెలరేఁగిన ట్లగ్నిపర్వతముపగిలి నట్లుల్కలురలినట్లు, మహీమధ్యరేఖాప్రాంత గ్రీష్మాతపంబు ముక్కన్ను తెఱచినట్లు రిక్కలుపెక్కు రాలినట్లు మెఱపులు మెఱయుచు మంటలు మండుచుఁ బొగలెగయుచుఁ గావిర్గ్రమ్ముచు నావిరిచిమ్ముచు భూనభోంతరాళంబు లెల్ల దద్దరిల్ల దారుణ ప్రవిదారుణ ప్రదేశమెల్ల నల్లలాడ నల్లకల్లోలంబుగఁ బైనుండి క్రిందికిఁ గ్రిందినుండి పైకి మనోవేగంబునఁ బాఱుచున్న మందుగుండ్ల నతివిచిత్రాయుధ వర్షంబు లెదురు కోల లందుకొనుచున్న సమయంబునఁ బ్రేలెడిగుండ్లతోఁ బ్రీలెడి బండ్లతోఁ గ్రుంగెడి స్థలములతోఁ బొంగెడి

జలములతో గాలెడి వనములతోఁ గూలెడి భవనములతో నొఱిగి విఱిగిన రథములతోఁగారి పేరిన రుధిరములతో మెండుగఁ గండలూడిన మొండెములతో గుండె జారి కలగుండువడు దండులతో బెట్లుచెడిన యంత్రములతో బట్లు విడిన యాంత్రములతో మాడి బూడిదయగు శవములతో దుర్భర మరణవేదనామగ్న మానసులపై దొరలు మరలతో,భిన్న శతవిధ శతఘ్నా కీర్ణ కాచ సూచికాయఃఖండ షండ దుర్గ మార్గములతో బాష్పవాతఘాత సంఘాతాహత భస్మీభూతాల్పప్రాణిశ్రేణితో గుండ్లుదగిలి గండివడి మండు చోదకులతోఁ దలక్రిందుగాఁ బడు విమానములతో హఠాత్త్రుటిత లుఠచ్ఛీర్ష నటత్కాయ నికాయములతో మ్రోఁగెడి భూరి భేరీ గంభీర భాంకృతులతో సాఁగెడి సాహంకార హుంకృతులతోఁ దలాతలంబున బలాజలంబులు చలాచలంబునఁ గలకలంబు సేయుచుండ ఖేచర భూచర చటుల భటపటలము పరస్పర రక్షణ ప్రతిభట శిక్షణ దక్షతంజూప స్వపక్ష విపక్షంబులం గని సర్వసైన్యాధిపతులు తలలూఁప నన్యోన్య ఖండితారుణ రేఖాంక సంఘసేవాదృష్టి కసాధ్యంబై దగ్ధ వివిధ ధాతుపదార్థజన్యాసహ్య దుర్గంధ భూయిష్ఠంబై విచ్చెడి పౌరజనములతోఁ జచ్చెడి పశుగణములతో, బీభత్సంబై కాలభైరవయుత భూతప్రేత పిశాచ శాకినీ ఢాకినీత్యాది పైశాచిక గణ పరివృత వితృత గళిత రక్త జిహ్వాకలిత కరాళదీర్ఘదంష్ట్రావదన గహ్వరయగు మృత్యుదేవత వికటాట్టహాస మండితాఖండ చండతర తాండవ పాత్రంబైన యా యుద్ధక్షేత్రంబందు హతావశిష్టులగు బెల్జియము సైనికులు వారివాహోపరిస్థితులయ్యు వారివాహోపరిస్థితులుగాక, సత్పథ సంచారులయ్యు సత్పథ సంచారులుగాక భానమానధామాశ్రయులయ్యు భానమాన ధామాశ్రయులుగాక తనుత్యాగకళాసహిత సుధర్మార్థులయ్యు తనుత్యాగ కళాసహిత సుధర్మార్థులుగాక యేకాంతాసక్తులయ్యు నేకాంతాసక్తులగాక కాలూనలేక వెనుకంజవేయుచుఁ గందకములలోజేరుచు గంపరములలో దూరుచుం బాఱుచుండఁ దత్ర్పభుండు త్యక్తకటకుండై ఫ్రాన్సుంజేర నిరర్గళధాటి జర్మనులు క్రమక్రమంబుగ నాంట్వెర్పు నాక్రమించుకొనుచు సర్వనాశన కృత్యమ్ముల శ్మశానమ్ముగావించుచుందనియక కంకాళమృతకళేబరా మిషాదుల దర్శనమ్మున గములుగట్టి భ్రమియించెడి కంకగృధ్ర కాక ఘూకమ్ములట్లు వియత్తలమ్మున వ్యోమయానదళమ్ము జలరుహ వ్యూహాకృతిం బరిభ్రమించుచుం దూరదర్శినీ సూక్ష్మదర్శిన్యాది

సాధనమ్ముల వైరుల రహస్యమ్ము లెఱుఁగుచుఁ గపోతగళమ్ముల ఛాయా గ్రహణయంత్రమ్ములం గట్టి విడిచి తద్ద్వారమ్మున శత్రువులయునికిం దెలిసికొనుచు హితులకు వార్తలం బుచ్చుచున్నంత విజయ విచికిత్సావిదూరులై యాంగ్లవాహిని వియద్వాహినిం బలె గగనమార్గమ్మున గాలిగుమ్మటమ్ములలో వచ్చి పరాసుదేశమ్మున దిగి తద్దేశసేనానివహమ్ముతోఁ గలసి రణప్రాణ వితరణ చణులైన వింశతి సహస్రఘూర్ణయోధవతంసులఁ బ్రథమ పంక్తి యందుంచుకొని జర్మనులతో సంగ్రామంబు సాఁగించుచుండఁ బ్రాగ్దిశ జర్మనుల మర్మమెఱుఁగుచు రష్యను ధీరాగ్రేసరులు కయ్యమునకుఁ గాలు ద్రవ్వుచుండిరి. అట నట్లుండ నిట జర్మనుల స్వాధీనమునందున్న చీనాదేశపు కై యోఛారేవునుండి బయలుదేరి యెమ్డెనను జలాంతర్గామి మన వుట భేదము భేదింపఁ దలంచి యింతవంతఁ గలిగించె. 263

తే. ఏది యెఱుఁగని మననేల కేల గల్గె
నీ రణమ్మని ప్రశ్నింతురేమొ; దాస్య
బంధమది యూడ్వఁగదలెను భరతభూమి
నావతోఁ గట్టఁబడినట్టి నావవోలె. 264

వ. సమ్యగ్దృష్టి లేమింజేసి కురుక్షేత్రమహాహవ మట్టిమోహారము సంబంధ బాంధవ్యముగల చక్రవర్తులు ముఖ్యులుగాఁబుట్టి యెట్టకేలకు మట్టుమీఱి భూగోళముఁ జుట్టుచున్నది. 265

చ. అని మొననిర్ణయస్థలమునందు పెనంగుఁ దొలంగునంతెకా
జనులకులేదు తద్భయము – సంగరధర్మువు పూర్వమద్దియోఁ
గన నిపు డట్టి కట్టడులఁ – గానము లోకమె యుద్ధరంగమో
ననుకొనఁ డింతవింతయగు – నాయుధసృష్టి యొకం డొకప్పుడుఁ

కం. అని యనికత వినిపింపఁగ
గణగణమని పాఠశాల గంటయు మ్రోఁగెన్
జని జననికి శ్రీరాములు
వినయమ్మున దాని వినిచె వేడుకపడఁగన్. 267

కం. ఇవ్విధి విధిహిత కృతులం
దవ్వకుఁ దమ్మునకు వ్రాక్రియాదుల మోదం

బెవ్విధిఁ గూర్పందగునో
యవ్విధిఁ దాఁ గూర్చుచుండె నంతట జగతిన్. 268

కం. ముడిసరకుల ధర పెఱిగెం
గడిమి నుదంతులకు బ్రాణకంటకలాభం
బడరెన్ నివ్వెఱ చక్కెఱ
పొడి గప్పిన చేదుమాత్ర పొలుపుగఁ దోఁచెన్. 269

మ. అగచాట్లెన్నక మిన్నకుండక మహాశాక్రాంత చిత్తంబుతో
నొగి వాగ్దానములెన్నొ తెల్లదొరలా యుద్ధప్రచారంబులం
దగఁ జేయన్ విని కొందఱేగి రొకటే ధైర్యమ్ముతో సీమకున్
మృగతృష్ణంగని దప్పిఁ దీర్చుకొను కోర్కింబోవు మూర్ఖుంబలెన్. 270

కం. నగరాధికారులందఱు
జగమెఱిఁగి సురక్షితంబు సలుపుట నగరం
బగణిత విలాస భాసుర
మగుచుండెను రాకపోకలన్నియు సాఁగన్ 271

# సంధ్యాది వర్ణనము

వ. అంత— 272

సీ. అపరాబ్ధి శయ్య సూర్యాధిపు సుఖమెంచి
వినుచూలిచెలి చల్ల విసరుచుండె
పశ్చిమదిగ్ధాత్రి పసరు కెంజాయ సాం
బ్రాణివత్తులు వెల్ల వరుస గ్రుచ్చె
గగనసీమంతిని పొగమంచనెడి దోమ
తెఱలను గ్రిందికి దిగఁగ విడిచె
ఖగరుత ఘంటమ్రోఁగఁగ దిగ్భటాళియ
వెల్గు తల్పులు మూసివేయుచుండె

తే. భువనయంత్రమ్ము నడిపించు – పుణ్యాత్ముఁడు
తెలియఁబడకుండ యే మఱఁ ద్రిప్పినాఁడొ

మెఱయుచుండెను జుక్కలజా – మెఱపుబుఙ్లు
రజని, ధవురాగనవనుధా రసముఁ దేలె. 273

ఉ. పూజితరాజమౌళి బుధపోషణనైజవసూత్తముండు వి
భ్రాజదఖండసత్కరుఁడు పాండుయశస్వి విలోకనక్రియా
శేజితమన్మథాస్త్రుఁడు సుధీవరసన్నుతదివ్యమూర్తియౌ
రాజు కళాప్రపూర్ణుఁడయి రాజిల మానసవార్ధి పొంగదే!

(ద్వ్యర్థి) 274

## ద్వితీయ ప్రకరణము



తృతీయ ప్రకరణము

# సూర్యోదయాది వర్ణనము

ఆ. వె. జగము కన్ను దెఱువ సంసిద్ధమైయుండ
ఘోరమృగములెల్ల గుహల దూఱెఁ
జల్లగాలివీచె నల్లనల్లన నిక్కి
తోఁచె వేఁగుఁజుక్క తూర్పుదిక్కు. 275

ఉ. కొక్కొరొకోయటంచుఁ దొలికోడియుఁ గూసెను, రిక్కలన్నియున్
చిక్కమొగాలువేసె, దివి వెన్నెలపల్లు సికారు చేసెడిన్,
జక్కవ పెంటి పోతుఁగనఁజాలని చింత యొకింత బాసెఁ, జెం
పెక్కిన పేర్మిఁ బక్కిగమి యిక్కల ఱెక్కలనార్చి పేర్చెడిన్. 276

కం. కిలకిల కూసెం బులుగులు
జలజల ప్రవహించె నదులు చల్లనియలలన్
మిలమిల మెఱసెం దొలిదెస
నిలఁ గసవుం గొసలవెలిగె హిమమౌక్తికముల్. 277

ఆ. వె. తారమేలుకొని 'రలారవ' రవళికిఁ
జట్టములను జదువు చట్టులెల్ల
యంత్రచయము మొదటి యాహ్వానముగఁ దన
కూలివాండ్ర కొఱకు కూఁతవెట్టె. 278

తే. ఇనునకుదయించు తటి నర్ఘ్యమీయఁ దలఁచి
చిగురుఁ గెంగేల హిమవారిఁ జిక్కఁబట్టి
ప్రకృతి సుందరి శాంతస్వభావయగుచుఁ
గన్నులఱమూసి ధ్యానసంపన్నమయ్యె. 279

తే. ఏడు గుఱ్ఱాలతేరిపై నెక్కివచ్చి
మేల్మికరములలోకాల మేలుకొలిపి
బ్రహ్మవిష్ణ్వీశరూపుఁడై ప్రస్తుతిఁగొను
బాలభానుఁడు తొలిమలపై వెలింగె. 280

కం. సూర్యాను వర్తినింగనఁ
గార్యాంతరమేగి చాలకాలము రామిన్
శౌర్యాత్ము భర్తఁగాంచఁగ
భార్యామణి తొంగి చూచు భంగి చెలంగెన్. 281

తే. పద్మదళముల బంధింపఁ బడిన యళులు
సొమ్మసిలి లేచుచుండె ఝుం ఝుమ్మటంచుఁ
బ్రియుని కరలాలనంబునఁ బ్రీతినంది
హాయిగాఁ గల్వ నిద్రఁ గన్మూయుచుండె. 282

తే. చలిది చిక్కముఁ గఱ్ఱకుఁ జక్కఁగూర్చి
మూపుపైఁదాల్చి ప్రకృతికి — ముగ్ధుఁడగుచు
నీలపాటలఁబసువులఁ దోలుకొనుచుఁ
బోవుచున్నాఁడు కర్షక పుత్రకుండు. 283

మ. పురువుంబుట్టల రేవవళ్ళనక పోవుంజేలలో నీటులన్
సరిదిద్దంబశుబాధఁబాప సుతుతో శ్రద్ధాళువై కర్షకుం
డరెరే యెవ్వరు రక్షకుండితని కాయావేళలందొక్కయా
పరమాత్ముండు దయాళుతక్కఁగని కాపాడన్ సదా ప్రేమతో. 284

చ. శ్రమపడి యెండ వానలకు జంకక మానవ జీవరక్షణ
క్రమముగ సర్వధాన్యముల రాసులువోసి సుఖింపఁజేయఁగా
నమల మనస్కుఁడై హలము నర్చనచేసి విశాల క్షేత్రమన్
కమల నిజస్వరూపమును గాంచెడి కర్షకు హర్షమెట్టిదో. 285

ఆ. వె. కలము కంటె ముందు - హలమె జన్మించిన
హలము కంటెఁగీర్తి — కలమెకన్న
హలము వలదు కలమె — యవసర మనరాదు
కలము లేక హలము — ఘనతఁగనదు. 286

కం. ఇలయోధుల కరతలముల
గల శస్త్రాస్త్రములు హింస – గలవై మెలఁగన్
బలు ప్రాణుల పోషణకగు
బలరాముని యాయుధమ్ము ఫలమెట్టిదియో. 287

తే. ఆకసంబను గడియారమందుఁ జిన్న
ముల్లు చంద్రుఁడనఁగఁ బెద్దముల్లు సూర్యుఁ
డనఁ గఁ దక్కినరాసులే యంకెలనఁగఁ
జేసి మఱఁ ద్రిప్పి విడిచిన సిద్ధుఁడెవఁడొ! 288
[పూర్వార్ధగోళము–పశ్చిమార్ధగోళమును గలిపి యర్థము గమనింప దగు)

## శ్రీరాముల యున్నతపాఠశాలా విద్యాభ్యాసము

ఉ. తొల్లిటివోలె భోగములతోఁ దులఁదూఁగు పురేందిరాకళో
త్ఫుల్ల సమస్తకార్య సుమపూరితులై ప్రజలొప్ప నొప్పుగా
నుల్లము పల్లవింపఁ జనుచుండును రాములు పాఠశాలకం
దల్లరి పిల్లలందఱియ కందును మైత్రి సుహృద్వరేణ్యుతో. 289

ఉ. ధ్యేయము విద్యయంచు సువిధేయతఁ జూపుచు నాతఁడాయుపా
ధ్యాయుల బోధనామృతమనంతముదమ్మునఁ గ్రోలుచున్ లస
ద్ధీయుతుఁడై పరీక్షఁ గడిదేఱుచు సద్గురుభక్తి నాత్మలోఁ
బాయఁడు నైజబుద్ధి—ఫలవంతము వృక్షము మీఁదుఁజూచునే? 290

తే. ఆటపాటలఁ బాటవ మబ్బకున్కి
వాని కవ్వానిపై వాంఛ వదలిపోయెఁ
బూనితాఁ గోర లోఁగని దానికొఱకుఁ
బెనఁగులాడుట యొక పెద్ద వెఱ్ఱిగాదె? 291

కం. దినదినమిట్టులు బడికిం
జనువేళన్ దారినడుమ సద్గురువర్యుల్
గనఁ బడిన మ్రొక్కియాశీ
స్సును బొంది ముదమ్మునంది సుఖముగ సరుగున్. 292

కం. యాతా యాతద్రుతగతి
ఖ్యాతిద శకటార్భటులకు వేఁ దొలఁగుచు ని
ర్భీతిం జనుహితుఁ దిగుచుచుఁ
బూతాత్ముండతఁడు త్రోవఁ బోవుం బెలుచన్. 293

కం. సంధిత జరాభరంబున
సంధులు మార్గగతి సంశయాళువు లగుడున్
బంధువు నాఁ జేయూఁతయి
సందేహములేక దారిఁ జక్కంజూపున్. 294

కం. ఉపకారమ్మొనరించిన
నెప్పుడైనను మఱచిపోక హితుఁడనివానిన్
విపులముగఁ జెప్పఁజెప్పుట
ప్రపయంచుం దలఁపఁడే కృ - తఘ్నత లేమిన్. 295

కం. నూకలకుం గోకలకున్
వాకొనఁగాలేని కఱవు వాతంబడి చీ
కాకయి కుందెడు పేదల
శోకడలంజూచి జాలి శొందును మదిలో. 296

కం. తన దోషము గమనింపక
గుణహీనుఁడు శిక్షనొంది – కోపవశంబై
ఘన గురువరులను దూలుట
తన చెవినిం బడిన నద్ది తప్పని చెప్పున్. 297

కం. మేకులు సీసా పెంకులు
రేకులు నాడాలు ముండ్ల రెక్కలు కాలిం
దాఁకునవి బాటఁ గనఁబడఁ
జేకొని యవ్వీధి తొట్టిఁ జేర్చుచునుండున్. 298

వ. ఇట్లు పౌరధర్మప్రకారంబునఁ బయనించి తద్దయు శ్రద్ధాళువై బడిం ప్రవేశించి విద్యకేవల ముద్యోగంబున కని కాక వివేక విహితాచరణంబున కని కాఁబోల్చు— 299

సీ. కడుబీదవిద్యార్థిఁ గని కనికరమున
నర్థించియైన సాయంబుసేయు
నేమర నెవ్వానికే ప్రమాదము గల్గఁ
బ్రథమచికిత్సకుఁ బరుగులిడును
మిత్రబృందమునందు శత్రుత్వమొదవిన
తగవాడి చెల్మిసంధాతయగును
దైవకార్యమ్ములఁ దత్కర్తలం జేరి
పనిపాటలందుఁ దోడ్పడును మున్ను

తే. బాలభట శిక్షణమునంది బాధ్యతలను
దెలిసి వర్తించు గుర్తించు దేశకాల
పాత్రముల నార్యసన్నుతి పాత్రుఁడగుచు
రామగుణుఁ డెన్న బొట్టి శ్రీరాములన్న. 300

వ. వర్షజలములకు వనలతలవలె నా జన్మ సిద్ధములగు శమదమాదు లంతంతకు వృద్ధియగుచుండ శ్రద్ధాభక్తులతో గురుజన శుశ్రూషాపరుండై యుత్తమ విద్యార్థి యగు నాతఁడు సర్వభాషాతీత హృద్యానవద్య పద్యగంభీర గమన గాన రసానుకూల శర్కరాసంపర్కరసాల సన్నిభ మృదుమధుర వాగ్జాలరంజితాశేషజనతాపాదిత యశశ్చంద్రికా నీరంధ్రమ్మగు నాంధ్రమ్మును, తత్త్వజిజ్ఞాసాహార్యశిఖాధిరోహార్యమహర్షి హర్ష సంఘర్ష సంజాత ధర్మసూత్రాత్మక భారతీయ సంస్కృతీ భారధూర్వహమ్మగు సంస్కృతమ్మును పరిసరభాషాపద సమ్మిశ్రిత విస్తృత పాశ్చాత్య శీతోష్ణస్థితిగత సనాతనాధునాతన నాగరికతాచారాన్విత నానావిధమానవ మానస సృష్టి ప్రకృష్టభౌతికశాస్త్ర శాఖా చంక్రమణ మార్గ మనోగ్లాని హీనమ్మగు నాంగ్లమ్మును, నసామాన్య సామాస్య రేఖాబీజ వ్యావహారిక భిన్న క్షేత్రానేక భావబంధుర నరజీవితావసర ధన గుణగణ పీణానిక్వాణ గణిత గణితశాస్త్రమ్మును, పరమాణ్వాది పరబ్రహ్మ స్వరూపపర్యంత ప్రపంచపదార్థ ప్రకృతి పరిజ్ఞానార్థప్రవర్తిత ప్రయోగ ప్రాబల్య ప్రాప్తోపకారాపకార ఫలప్రసిద్ధ ప్రజ్ఞామనోజ్ఞమ్మగు విజ్ఞానశాస్త్రమ్మును, సకలరాజ్య నిర్మాణ వృద్ధిక్షీణాన్యోన్య రాయబార మంత్రి తంత్ర యంత్ర చతుర్విధ సైన్య దుర్గయుద్ధాంతర్యుద్ధ విప్లవ శాంతి సమర విజయ పరిపాలనా విధాన కళాపోషణ రాజన్య మాన్య గాత్ర గోత్ర క్షేత్రాగణ్యపుణ్యక్షేత్ర

మతసుత పవిత్రాపవిత్ర ప్రజాపరిణామ కథా కథన విశ్వాసపాత్రమ్మగు దేశచరిత్రమ్మును, దక్షిణోత్తరధ్రువమధ్యస్థాక్షాంశ రేఖాంశమకర కర్కట భూమధ్యరేఖాసూచిత మండలోష్ణపరిమాణ జలభూభాగ నిమ్నోన్నత సమతల పర్వత నదీనద సస్యాటవీ పల్లీ పట్టణ సరిదృతుపవన వర్షపాత జలపాత ఖనిజమనుజవృత్తి వ్యాపారభూమశకట నౌకా విమానమార్గ జంతు సంతాన సరీసృప సరోవర శాద్వలోషరక్షేత్ర యోగభోగ ప్రస్తుతమ్మగు భూగోళశాస్త్రమ్మును, రేఖాచిత్ర వర్ణచిత్ర తైలచిత్రాదిభాగశోభితమ్మగు విచిత్ర చిత్ర లేఖనమ్మును నభ్యసించుచు 301

సీ. ఇంటికేగెడి పెద్ద గంటఁగొట్టిన తోన
యరుగు వేవేగ గ్రంథాలయమున
కచ్చోటఁదనయిచ్చ వచ్చిన పొత్తముల్
చదవి సారాంశంబుఁ జక్క నొక్క
చిన్న పుస్తకమునఁ జెన్నుగా లిఖియించు
కొని యాల యాధికారిని గని విన
యాన గ్రంథము లిచ్చి వాని సెలవునంది
యిబ్బడి యొలమిమ్మై నిరవుసేరి

తే. యేమి పని సెప్పనోయని యించుకంత
మసల కమ్మకుఁ గనఁబడి విసుగుకొనక
తల్లి పనుపుల నొదలఁదాల్చి మెలఁగు
వాని దినచర్య కలరని వార లుంద్రె ? 302

సీ. వినుటకంటెఁ గనుట విషయవివేకమ్ము
హత్తుకొనుజా లెస్స యాత్మకంచు
విద్వద్వతంసులు విజ్ఞానయాత్రల
ఛాత్రులకొఱక నిశ్చయముచేసి
రగుట నావిద్యాలయమ్మున బాలురు
వెలలు నవుడు తాను వెడలి యందు
నోడరేవులు గుడు – లుద్యానవనములు
జీవనదు ల్గిరుల్ చిత్ర శిల్ప

తే. మాన శక్తులు వంతెనల్ యంత్రచయము
ధర్మసంస్థలు వస్తు ప్రదర్శన సద
నములు కర్మోదవసితము లమరఁజూచి
హృదయ పుస్తకమున లిఖియించుకొనును. 303

తే. ఎక్కములు రాని బుఱ్ఱకే నెక్కననుచు
గణితశాస్త్రాధిదేవత – యనునటంచుఁ
దెలిసికాఁబోలుఁ బైకిఁ గ్రిందికిని గ్రింది
కినిఁ బయికిఁద్వర నవియొప్ప గించునతఁడు. 304

సీ. అయ్యాయి పండువు లందుఁ బౌరాణికుల్
దేవాలయాదుల దివ్యవాక్కు
చెలఁగఁ బురాణమ్ము చెప్పుచో నటఁజని
యతిభక్తిమై దాని నాలకించు
నప్పురిఁ దోల్బొమ్మ లాటలాడుచునున్నఁ
గని పురాతన మార్గ మని నుతించు
హరికథ ల్బుఱ్ఱకథ లన్నఁ గ్రన్నన నేఁగి
విని తమ్ముఁ గుఱ్ఱకు వినుచు నతఁడు

తే. దేశసేవాధురీణతఁ దేజరిల్లు
ముఖ్యనాయక వాఙ్ముఖములనినఁజెవిఁ
గోసికొను నవలఁజెలుల డాసితెలుపు
నతని మెత్తురు తోడి విద్యార్థులెపుడు. 305

సీ. పాలక వర్గముపాధ్యాయబృంద మ
న్యోన్య సుహృద్భావ మతిశయిల్లఁ
దత్పాఠశాల విద్యావైషయిక కళి
తోత్సాహముగ వార్షికోత్సవంబుఁ
జరిపింత్రు తత్పరిషత్తుల విద్యార్థు
లయ్యాయి కళలయం దాటితేటి
నాటకోపన్యాస నాటికలు విచిత్ర
వేషధారణములు వేడ్కఁజూపి

తే. యేకపాత్రాభినయము రహిఁ గనఁబఱచి
యాటపాటల నైపుణ్య మట వెలార్చి
యాసదస్యుల యాత్మల నలరఁజేసి
బహుమతులు గొందురాశీ శ్శుభంబుతోడ 306

కం. ఏతాదృశ దృశ్యంబులఁ
బ్రీతిం బాల్గొనుచు వినుచుఁ బెద్దల సుద్దుల్
ఖ్యాతికి బీజములనఁదగు
నీతుల శ్రీరాములాత్మ నెలకొల్పుకొనున్. 307

వ. గంగాతరంగసంగత హిమాచలోత్తుంగ శృంగరాజములకంటెమహో న్నతములైన దివ్యాశయచయములతో గభీరభారధూర్వహమగు పసిఫిక్ మహాపారావారమునకంటె నత్యంత గంభీరములగు భావపరంపరలతో నింపెసలారు వ్యాసభాసకాళిదాసదండిభవభూతిభారవిమాఘ మయూర మల్హణ బిల్హణాది మహాకవుల కావ్యము లాంధ్రీకరింపఁబడి యుంటఁ దద్రస మాస్వాదించి యానందాబ్ధి నోలలాడు. ఆంధ్ర కవిసార్వభౌములు రాజలాంఛనములతో కనకాభిషేక గజారోహణ గండపెండేరాది సత్కార మహోత్సాహములతో నుత్సవముల రంగారు బంగారు పల్లకిలో నూరేగుచుఁ దెలుఁగు మాగాణమున బహువిధసహజసౌందర్య సాహితీ సస్యములు పండించిన స్వర్ణయుగముఁ దలఁచికొని తన్మయత్వము నొందు. 308

సీ. తనపేర శకమొండు – మనదేశమున వెల్గు
శాలివాహను మహా శౌర్యలీల
తనఱేని బందిబాపిన యుగంధరమంత్రి
శక్తి నర్థినఁజాటు యుక్తి గరిమ
తన రాజె యప్పాజి యని పిల్వ ధీశాలి
యని కీర్తిఁగొన్న తిమ్మరుసుమహిమ
తన యేలుబడి తెన్గు తల్లికి స్వర్ణ యు
గమ్మను కృష్ణరాట్క్రమ చరిత

తే. తెలుఁగు బెబ్బులుల్ బొబ్బిలి–వెలమదొరలు
రంగరాయ పాపయ చిన రంగరాయ

వేంగళాఖ్యుల ఘోరాజిరంగ పటిమఁ
దలఁచికొని యాతఁడా నంద జలధిఁదేలు. 309

తే. వాసిగల యానవద్వీప వాసియైన
యంబికాదత్తుచే బిరుదందినట్టి
కావ్య కంఠ గణపతి నిక్కముగఁ దెనుఁగుఁ
దల్లి కౌరసుఁడనివిని తనివినొందు. 310

ఉ. కన్నడబాసఁ దొల్దొలుత కావ్యము వ్రాసిన నాగవర్మ వి
ద్వన్నుతుఁడైన యాంధ్రుఁడెగదా? యల సంస్కృతసత్కవిత్వ సం
పన్నుఁడు లోకవందితుఁడు పండితరాయలు నాంధ్రుఁడే కదా?
యన్నచరిత్ర విన్న మనమంద యమందముదమ్ము నొందెడిన్. 311

తే. కోటిధాతుల నలధనుష్కోటిదాఁటి
యుత్తరంబున వింధ్యాద్రి నుత్తరించి
మాగధులు కీర్తి లక్ష్మికి మాగధులయి
కొలువఁ బాలించి రాంధ్రులన్ పలుకుఁ దలఁచు. 312

సీ. అమరావతిం బోని యమరావతిన్ విశ్వ
విద్యాలయమ్మొండు వెలసెననియు
విద్యార్థు లఱువదివే లుపాధ్యాయులు
రెండువేలద్దాన నుండిరనియు
చైనా టిబెట్టు జపాను బర్మా సింహ
ళములవారు కఱవ నమరిరనియు
నప్పురి జనసంఖ్య ముప్పది లక్షలై
గురుకులాదాయమే గూర్చుననియు

తే. ఆంధ్రవిజ్ఞాని సిద్ధనాగార్జునుండ
దాని తలపెద్దమై బౌద్ధ ధర్మనిష్ఠ
శిల్పకళఁ బెంచెననియును జెవినిబడఁగ
నాతఁ డా తెల్గు వెల్గుల కంజలించు. 313

ఉ. ఎయ్యె దమూల్యమంచు జగమెల్ల నుతింప రుచుల్వెలార్చునో
యెయ్యది యాంగ్లరాణ్మకుట మెక్కి నిజోన్నతిఁ జాటుచుండెనో

యయ్యది యాంధ్రదేశమున యందుదయించిన కోహినూరటం
చయ్యలుదెల్పఁ దద్యశము నందుట కాంధ్రిని మెచ్చునిచ్చలుఁజా. 314

తే. రమ్య ఘనకీర్తి మనకోడె రామమూర్తి
సాటిలేనట్టి బలశక్తి చాటి చాటి
దేశ దేశ బహూకృతుల్ దెచ్చుటరసి
తెలుఁగు నేలకు వెలలేని వెలుఁగనుకొను. 315

తే. చదువు సాముల గడిదేఱఁ జాలినారు
తెలివి తేటలు గలవారు తెలుఁగువారు
అంగడిని నున్న వన్నియు నైన నేమి
యల్లునకు నోటశనియని యాత్మఁదలఁచు. 316

వ. ఒకనాఁడు *విద్యా మహాభూరుహశాస్త్ర శాఖోత్పత్తిక్రమమ్మెఱింగింపు మని యొక్క పండిత ప్రకాండుని బ్రశ్నింప నాతఁడు నిర్వ్యుత్పత్త్యతిశయ వికసితముఖకమలుండై యాతని జ్ఞాన జిజ్ఞాస కాశ్చర్యపడి శ్రావ్య స్వరమ్మున "విద్యాకాండమునుండి కళలు, విజ్ఞాన శాస్త్రములను రెండు దండి శాఖలు వొడమె. అందుఁ గళలు సంగీత సాహిత్య చిత్రలేఖ నాది రూపంబు లొంద, విజ్ఞాన శాస్త్రములు మానసిక పరీక్షాయుక్త విధానాత్మక శాస్త్రములుగ త్రివిధంబులయ్యె. వానిలో మానసిక శాస్త్రమునుండి మానస వేదాంత శాస్త్రము లుద్భవింపఁ బరీక్షాయుక్త శాస్త్రమునుండి సాంఘిక భౌతిక ప్రకృతి శాస్త్రములు రూపొంద విధానాత్మకములనుండి తర్కగణిత శాస్త్రము లుద్భవించె. రాజకీయార్థిక వాణిజ్య శాస్త్రములు సాంఘిక శాస్త్ర జనితములగుడుఁ దద్భౌతిక శాస్త్రములనుండి జీవభూగోళ భూగర్భ ఖగోళ వాతావరణ శాస్త్రము లుదితమ్ములయ్యె. అందు జీవశాస్త్రమునుండి వృక్ష జంతు పక్షి నరశరీరశాస్త్రములు సృష్టింపఁబడ ఖగోళశాస్త్రమునుండి నక్షత్ర జ్యోతిశ్శాస్త్రములు సృజింపబడె. పిదప భూగర్భశాస్త్రమునుండి ఖనిజ లుప్తజీవ శిలాశాస్త్రము లుత్పన్నములయ్యె. ఇది సంగ్రహ స్వరూపం బిఁక నల్పశాఖాభేదం బెఱింగింప విస్తృతంబగు" నన నంత

* విద్యా మహాభూరుహశాస్త్ర శాఖోత్పత్తి - చూడు వృక్షకము చిత్రము

సించి నమస్కరించి యింత విజ్ఞాన సముపార్జనమున కెంతయోయారోగ్య
మవసరముగదా కావుననే యారోగ్యమే మహాభాగ్యమనిరని తలంచి తద్ధ
ర్మంబుఁ బాటించుచుఁ బెద్దలొద్ద నొద్దికమెయి విద్దె నేర్చుచుండె. 317

# హితబోధ

కం. అత్తటి నెత్తిన మొత్తెడి
సత్తిగల గృహస్థులేమి నలిపెం జెలిమిన్
విత్తముగల యువతతితో
మత్తిలి నారాయణుండు మతిగతిమాలన్. 318

కం. తిప్పలువడు తల్లింగని
త్రిప్పఁడు తన మనమునేమి తెలివది? తనకే
ముప్పాతిక మువ్వీసము
తప్పక వ్యయమగుచు నుండెఁ దనరాబడిలో. 319

చ. అది పదునేడు వర్షముల కావలి కాలముగాన వానిలో
నొదవిన స్వేచ్ఛ సంస్కరణమొందమి వ్యర్థవిలాసభాక్క్రియా
ముదితుఁడు గాఁగఁ దల్లివగఁ బొంది వివాహముసేసె దానిచే
హృదయము మాఱి బాధ్యతలనెంచి చరించు నిఁకన్నయూహతో. 320

ఉ. ఐనను వాని యాత్మ యిసుమంతయు మాఱమి నోర్మి పెంపునన్
వానిని జేరఁదీసి సుతవత్సలతం బ్రకటించు దృష్టిమై
మాన విదేమి నీదు పెడమార్గము; పిన్నవె? పెండ్లిగాదె? రూ
కైనను దేకయున్న గృహయాత్ర యెటుల్ నడిపింపఁగల్గుదున్? 321

సీ. వెలెగుడు దిగుడుల విలిచిన సరకుల
యుక్తిమై నమ్మలేకుండు కతన
అపుడప్డు వచ్చెడి యధిక నష్టమ్ములఁ
జిక్కఁగా బేరము సాగకున్కి
నిచ్చిన యయ్యకు నీరైరి సరిగనీ
పప్పులబేహారు లిప్పరినని
యెన్నిసార్లేవేడ నివ్వని కొప్పఁడు
మీ తండ్రి గతముమ మీఁదఁ దలఁచి

ఆ.వె. తెచ్చినట్టిచోటఁ దెమ్మన్నదాకది
నిలుపుకొనక పరువు నిలుపుకొనుచుఁ
గొలఁది పెట్టుఁబడికి సులువైనదని దీని
నెట్టు త్రిప్పుచున్నదీవెఱుఁగవె? 322

కం. దుడుకుం బోఁకలఁ బోవుచుఁ
జెడుస్నేహము చేసెదేని చెడెదవు మన గు
ప్పిడి విడిన బ్రదుకఁ జాల
మ్మొదలెఱిఁగి చరించుటెంత యుక్తము విద్యా! 323

కం. జనకుఁడు లేఁడను లోటుం
గననీక యెటుట్టో నేన కావడి మోయఁ
మన శక్తిని గమనింపక
ధనవంతుల చెల్మిచేసి తప్పిచరింతే? 324

కం. అవకాశవాది పనివడి
నవుమోమునఁ బల్కరించి నతులిడి కర్జం
బవలీలఁ దీర మరుదిన
మవలిదెసఁ ముఖముఁ ద్రిప్పి–యపకారియగుఁ. 325

తే. అట్టివారలు లోకమందదు గడుగునఁ
దోఁచుచుందురు వారల తోడి పొత్తు
కత్తిపై సాముగాఁజూచి కాలమెఱిఁగి
జీవయాత్రను సుఖముగాఁ జేసికొనుము. 326

క. కిటుకుల కీలక మరయక
చటుకునఁ జెలులంచు నమ్మి చనెదవు నీవ
క్కట! మెఱిసిన మేలిమియే
నటనల్ గమనించి తొలఁగి నడచుట మేలౌ. 327

కం. నే యన్నముఁ దిను పెద్దలు
వేయిగతుల నెత్తు లన్ని విని కని తరణో
పాయముగ సూక్తి రత్నము
లీయఁగ నీ హృదయ మీయ వేటికి వత్సా! 328

తే. పాపపుణ్యాల కలయిక ప్రకృతి యగుటఁ
పుణ్యముల పాలు పెటిగినఁ బుణ్యాకృతిగఁ
బాప భాగమ్ము హెచ్చైనఁ బాప కృతిగ
ధర్మసూక్ష్మమ్ము లెటిగింత్రు — ధర్మవిదులు. 329

ఉ. స్థానము శూన్య మిజ్జగతి సజ్జన మానస పీఠమొండె స్వ
స్థానము సత్యలక్ష్మికిఁ బ్రశాంతికి దాంతికి మూలమద్దియే
కాన నరుండు సౌఖ్యసుమ క్రమపరీమళలోలుఁడై సదా
ధీనిధులైన సాధువుల దీవన లందుట మేలు పుత్రకా! 330

కం. సుజ్ఞాన రత్నచయముఁ
జిజ్ఞాసువుకోరి యేరి చేపట్టు వెసన్
ప్రజ్ఞాశాలికి సహజం
బజ్ఞానికి నట్టియూహ — యలవడఁగలదే ? 331

క. దురిత వశమ్మునఁ దండ్రియ
పరలోకమ్మునకు నేగ బ్రతుకఁగవచ్చున్
బరపతి తోఁటఁగిన బ్రదుకుట
భరమను నార్యోక్తి చెవిని బడదే నీకున్ ? 332

కం. అరయ వణిక్తతి కెందుం
బరపతియే జీవగఱ్ఱ పరమరహస్యం
బురరీకృత సత్యంబిది
యెఱుక బలిమి చాలకెట్లొ యెగురం దగునే ? 333

కం. తమ్ములు నీవయి గౌరవ
మిమ్ముగఁ జూపించుచుండి రింతకు నీచే
సొమ్మెల్ల వమ్ము సేఁతకు
నెమ్మెయి నెమ్మనములందు నీసువహింత్రో. 334

ఉ. ఎందను కేను దాఁపఁ గల నింతకుఁ బెద్దల బీతుతేమి నీ
దుందుమదిట్లు వెగ్గెడిని దుర్వ్యయమేరికి లగ్గు ? లోకు లే
మందురు ? నేఁడో రేపొ నను నడ్గినఁ బిన్నలకేమి చెప్పుదున్
గండెన లేని బండి నడకన్ దలకింపదె జీవితంబు పుత్రకా. 335

ఉ. ఏమిర యింత సేపు మొగమెత్తవు పల్కులు ముల్కులైనవా ?
నీమము ధామముం దలఁచు నేర్పు నశించెన ? కూడుగుడ్డకుం
బామరుఁడైనఁ దెచ్చునను భావము తట్టద ? తొంటిబాములం
బాములనోము నోఁచితి నభాగ్యను నీమన సెప్డు మాఱునో. 336

కం. నినుఁ జూచి నేర్చుకోఁ దగు
ననుకొంటిని వెన్కవారలది తికమకలై
నినుఁ గాంచి యోర్చుకొంటకె
మనసొప్పదు పెక్కులేల మాటలు తనయా ! 337

చ. మొకమున వ్రేళ్ళుపెట్టుకొని ముద్దుగఁ జీకెడి చంటిబిడ్డవా ?
యొకరికి నిద్దురైరి యిఁక నోపిక నాకెపుడిట్టు లుండునా ?
సకలము దిద్దు నీడుఁ దగు శక్తియు బాధ్యతలేద ? నాఁడు నాఁ
టికి ధనమెచ్చు గోరరె ? గడింపఁగ బిడ్డెలు నీ సహోదరుల్. 338

ఆ.వె. సంద్రమీఁద వచ్చు సంసార మీఁదరా
దనెడి సూక్తి నలరు నర్థమెల్లఁ
గష్టసుఖములనక కావడి మోసెడి
వ్యక్తి యెఱుఁగుఁ బరుల కవగతంబె ? 339

కం. జననీజనక ప్రీణన
ఘనకృత్యమునందు నెగ్గఁ గలవారల పో
తనయులు గారే నవినయు
లనఁ జెల్లదె యెంతవారినైనఁ దనూజా ? 340

క. కిటుకులు తెలియని వారికిఁ
గట ! యిట స్థానంబు లేదు గద ! గదలొదవన్
గటుకటుపడి పలుపాట్లం
దిటవుసెడిన నెవరు మనకు దిక్కగుఁ దండ్రీ ! 341

మ. "అతి సర్వత్ర వివర్జయే" 'త్తనెడి వాక్యార్థంబు గుర్తింప కీ
గతి వర్తించినఁ దమ్ముఁ గుఱ్ఱలకు మార్గంబెట్లు చూపింతు, వీ
స్థితి యిట్లౌనని స్వప్నమందయినఁ జింతింపన్ బలా ! జ్యేష్ఠుఁడే
వితచేతల్ బడఁ దల్లి దండ్రులకుఁ బిర్వీకుల్ పదా తప్పునే ? 342

తే. తెక్కులాడినవేగదా డొక్కయాడు
ననెడు సామెత గమనించి మనెడు మనకుఁ
దలకు మించిన పనులు నీ తల ధరింపఁ
జెడెద వంచును హితబోధ చేసె జనని. 343

తే. బోధ విన్నంత సేపాక పోల్కినుండి
వెలికిఁజని తొంటిగానముతె వెడలఁగకు
తల్లి తన శక్తినంతయు ధారవోయ
బూదివోసిన పన్నీరు వోలెఁ గ్రాలె. 344

## నారాయణుని మరణము

తే. పిదప రెండేడ్లు గడవఁగా విధివశమున
నతఁడు మరణించె జనని దుఃఖాబ్ధిమునుఁగఁ
జేతికిని వాతికందివచ్చిన ఫలమ్ము
జాఱిపోయిన శోకభాజనము గాదె? 345

తే. తమ్ముఁ బోషింప వలసిన తండ్రి చావె
హృదయ శల్యముగా సుతులేడ్చి; రన్న
మారణావస్థవారికి గోరుచుట్టు
పైని రోకటి పోటుగాఁ బరిణమించె. 346

వ. మించిన పని కెంత చింతించిన నించుకైన ఫలమ్ము లేదని గ్రహించి దినదినమ్మునకు దిగులు దిగఁద్రావి యెదలు పదిలపఱచుకొని రామరంగయ్యలు వయోవిహిత విధి నిర్వహణ నిష్ణాతులై రయ్యెడ జ్యేష్ఠుండగు రాములు — 347

## బొంబాయికి బయనము

చ. జనితవిచారముఁ జనని శాంతము స్వాంతమునందు నెంతయుఁ
మననము సేసి విద్యఘనమాన్య నిధమ్మని స్వీయకార్య సా
ధనము ధనమ్ముగాఁ దలఁచి తాఁ గృషిసల్పెను; మంచియూహతోఁ
దనరిన బిడ్డలున్నఁ దలిదండ్రుల కష్టసుఖాలెఱుంగరే? 348

ఉ. బొమ్మన నమ్మెఁగట్టుకొని రోఁజుచు పేరవుఁ ద్రాటఁ జూపఱుల్
బమ్మెరవోవ రే వగలు భారము నాక కుటుంబముఁ గా రథం
బిమ్ముల లాగుఁ దల్లిఁ గని యాత్మఁ గృశించుచుఁ దమ్ము గుట్టితో
నమ్మను బోలు వారెవరటంచు వచించును రాము లెప్పుడుఁ గా. 349

చ. గురువర ధీర ధిక్కృతుల గొప్పగ నెంచి చరించు నీచునిం
దఱియఁడు జూదరిం గని వ్యథంపడు సంతతదంభ వాక్పరుఁ గా
మురియఁడు కొండెముల్ వినఁడుమూర్ఖుని జేరఁడు కానిదానికిం
దరలఁడు పూవుపుట్టఁగనె తావులఁ దావలమౌట యబ్రమే? 350

ఉ. ఉన్నత పాఠశాల విజయోన్నతి దక్కుట నంతకంటె న
త్యున్నత విద్యకై తగిన యోచనసేయుచు నుండ వృత్తి న
భ్యున్నతి నొందెఁ దల్లి; సిరియుఁ గా నమకూడెఁ దలంపునింపఁ; గా
నున్నది కాకమానునె మహోజ్జ్వల సృష్టివిలాసభాసమై. 351

ఉ. హాయిగ నేగె నాతఁడు మహాముదమందుచు నందమైన బొం
బాయికి బోధితార్య గుణపాయికి యంత్రవినూత్నవస్తు సం
ధాయికి భక్తబృంద ధనదాయికి విశ్వకళాయశస్స్థిర
స్థాయికి నవ్యజీవన విధాయికిఁ బూజిత శేషశాయికిఁ గా. 352

వ. అట్లేగి ముంబాదేవ్యాహ్వాయాధార పరికల్పితాన్వర్థ కాభిధానాహూయ
మాన బొంబాయీనగర ప్రముఖ దృశ్య సందర్శనాభిలాషాయత్త
చిత్తుండై ధౌతపరిధానధారియై బయల్వెడలి స్థానిక సతీర్థ్యులంగూడిశిల్ప
శ్రీఁజెల్వొందు దిట్టమగు నౌక కట్టుకముం గనుంగొని ప్రహృష్టాన్నుండై 353

మ. అరయఁ గా భారతదేశరమ్య గృహసింహద్వార మం చాడి రా
దౌరలేనాఁడొ; పురీ ప్రకీర్ణ జన సందోహంబు నౌకాశ్రయ
స్థిర భాగ్యాకర సౌధసౌష్ఠవము రాశీభూతశిల్ప ప్రభా
భరవైచిత్ర్యము సర్వసద్గతులు సంభావించి సానందులై. 354

వ. అవి తలంచి యంచెలంచెలుగఁ బయనించి న్యూయార్కు లండను
పారిసు ప్రభృతి ప్రపంచ ప్రసిద్ధ నగరరాజ దివ్యసంస్మృతికరమ్ము,
భరతఖండ ప్రథమ స్థానాధిష్ఠిత దైవదత్త స్వాభావిక నౌకాశ్రయవిరా
జితమ్ము, జగత్ప్రఖ్యాతసర్వదేశసంబంధ సత్యాన్వృత కేంద్రమ్ము, ప్రశస్త

సామాన్యశాస్త్ర ప్రయోగశాలాన్వితపరశ్శత విద్యాసంస్థాసంశోభితమ్ము, మహారాష్ట్ర ఘూర్జరాద్యశేష భాషావిభూషితమ్ము, నగర నారీమణీ మణీహార రమణీయ నాయకమణీ సన్నిభ తత్పుర మధ్యస్థ విశ్వ విఖ్యాత విశ్వ విద్యాలయాంతర్గత గ్రంథాగారోపరితల వినిర్మితా త్యున్నత రాజాబాయి శిఖర రాజితమ్ము, తన్నికటస్థ పరివార పరివృత ప్రాడ్వివాక న్యాయవాద్యశేషోన్నతోద్యోగి జన సంకీర్ణ ప్రధాన న్యాయస్థాన పరిశోభితమ్ము, విశిష్టానుకూల సంస్థాపిత విశాల నాటక శాలాలంకృతమ్ము, ప్రిన్సు ఆఫ్ వేల్సాఖ్య కీర్తనీయ వస్తు ప్రదర్శన శాలాన్వితమ్ము, నందనవన ప్రతీకాశ బాలవినోద విహారోద్యాన విక్టోరియా టెర్మినెస్‌నామ ధూమశకట విరామ నగరపాలక కార్యాలయ మహారాష్ట్రసచివాలయాక్షీణగోసంరక్షణక్షేత్ర లక్ష్మీలక్షితమ్ము, సింధూపరిభాగ నిర్మిత వుటభేదన శంకాస్పద నిశా సమ యాకూపారైక స్థాన స్థితానేకనౌకాస్థగిత వికాసకర వివిధవర్ణ విద్యుద్దీపికా విలసితమ్ము, మృదులతర విపుల శాద్వల స్థల స్వదేశ విదేశ యాతాయాత జనలక్ష్యమాణ ప్రడీనోడ్డీన సండీన వ్యోమయాన సంకలిత కమనీయ శాంతాక్రజు విమానాశ్రయాశ్రితమ్ము, సూత్రవస్త్రయంత్రశాలాద్యాధునిక విజ్ఞాన శాస్త్రజ్ఞ విధి వినిర్మిత బహ్వాగార భాసురమ్ము, క్షీరసాగర కన్యకానృత్య సంజనిత నిత్య నృత్న మంజుల మంజీర శింజారంజిత, వ్యాపార ప్రకాశితమ్ము, ఎలిఫెంట స్వీప సంకాశ త్రిమూర్తిస్వరూప విగ్రహ గుహా కలిత లలిత కలా ప్రతీతమ్ము. కులమతాచార విభిన్న వింశతి ముఖ్యాతి ముఖ్య ప్రకార ప్రకటిత కుటుంబతత్త్వ ప్రస్ఫష్టమ్ము, నాత్యత్యున్నత శిలోచ్చయోపరిస్థలోద్దీపిత వాలకేశ్వర బాబూల్ నాథాది దేవాలయ దీప్తిమంతమ్ము, మహాలక్ష్మీ మాధవ భాగాద్యాలయ సంకలితమ్ము. జైన పారశీక మహమ్మదీయ క్రైస్తవ ప్రార్థనామందిరాభాసితమ్ము, * ఛత్రపతి శివాజీ, జంషడ్జీ జెజీబాయి బరోనెట్, డేవిడ్ ససూన్, జగన్నాథ శంకరసేట్, కౌవాసుజీ జహంగీర్ రెడిమొనీ, దాదాబాయినౌరోజీ, సొరాబ్‌జీ షాపూర్‌జీ బెంగాలీ, విశ్వనాథ నారాయణ మాండలిక్, జంషడ్జీ నసర్వాన్‌జీ టాటా,

* (1) 1627 - 1630 (2) 17 3 - 1859 (3) 1792 - 1864
(4) 18 3 - 1865 (5) 1821 - 1874 (6) 1825 - 1917 (7) 1831 - 1893
(8) 1833 - 1889 (9) 1839 - 1904 (10) 1842 - 1 01 (11) 1844 1986
(12) 1845 - 1915 (13) 1352 - 1922 (14) 1856 - 1920 (15) 1855 - 1933
(16) 1862 1942 (17) 1866 - 1915 (18) 1866 - 1947 (19) 1878 - 1933

మహాదేవ గోవింద రెనడీ, డిజాషా ఎడల్జీవాక్‌హా, బొంబాయిసింహ ఫిరోజిషా మెహతా, బాలచంద్రకృష్ణ భటవడేకర్. లోకమాన్య బాలగంగాధర తిలక్, ఎక్కాషియో గాబ్రిల్ వియేగస్, ఇబ్రహిం రహింతుల్లా, గోపాల కృష్ణ గోఖలే, చిమణ్‌లాల్ సెటల్‌వాడ్, విటల్‌బాయిజీ పటేల్ ప్రభృతి మహాపురుష శిలావిగ్రహ కలాకలాపావృత మనోజ్ఞమ్మగు బొంబై నగరమ్ము, నలువలంకలఁ గలయం గనుంగొని కెరంకికురించి విడగడించి విభుత సెజిపఁ జెంగలించు పరాంబరాయల గుండియ రాయిగా గ్రహించి విజయ ధ్వజమెత్తిన వీరసింహుల నృసింహావతారముస్తుతించి విక్టోరియా టెక్నికల్ ఇన్‌స్టిట్యూటను శాస్త్రపాఠశాలం బ్రవేశించి యారోగ్య సంబంధ వాస్తుశాస్త్రము (Sanitary Engineering Course) చదువుచుండ. 355

ఆ.వె. శాంత వేషధమాడి సద్గుణ గణ రాశి
యగుట రాము హృదయ మరసి దరిసి
వృత్తి విద్య నేర్చు విద్యార్థు లెందఱో
యతని చెల్మి కొఱకు నాసపడిరి. 356

ఆ.వె. దేశ కాల మహిమఁ దెలిసి వర్తించెడి
సుమతి కెంచు మిత్రు లమర కుంద్రె?
నోరు మంచిదైన నూరు మంచిదనెడి
మాట గట్టి పెరుగు కూటి మూట. 357

కం. ఆహార విహారమ్ముల
నూహాపోహాల విభేదముస్న తెలుంగుల్
బాహాటమ్ముగఁ జర్చల
స్నేహమ్ముగ నడిగి సత్య శీలము తెలియుచ్. 358

ఉ. చిన్నదయనూరి సత్కథలు చిన్న తనమ్మున నేర్చి యుంట వీ
లన్న సహాయ మందుకొను నోపిన సాయముచేసి నల్వురం
దెన్నిక కెక్కు ఠిక్కముగ నెన్నఁడు విద్దెల మిన్నయైన్న నూ
రున్న విధమ్ము గోతలవి యొప్పుగఁ జెప్పవె యెట్టి చోటులన్. 359

సీ. "అమిత ధీశక్తి వినమ్రమత సనవధతమ్ము
సి ద్ధోన్నర్చిన కృషికి నమేయకరుణ

దివ్య తేజస్వియైన యా దేవదేవుఁ
డనువగు ఫలమ్ము నిడుత విద్యార్థి రత్న!" 330

వ. అని యాచార్యులచే నాశీస్సులందుచు— 361

ఆ.వె. నేస్తగాండ్రఁ దాన నేర్పరియనఁ దగి
సర్వమత సమత్వ సరస మెఱఁగి
మెప్పు గొప్పఁజెప్పి తప్పుముప్పఁ దొలంగి
ఘనతఁ గాంచెనతఁడు గర్వ ముడిగి. 362

## విజ్ఞాన యాత్ర

శా. ధీరోదాత్తుల హైందవాగ్రణుల సద్ధీశక్తి కద్దంబులౌ
చారిత్రాత్మక దృశ్యముల్ గన లసత్సంకల్పియై తద్జ్ఞులం
గోరన్ వారలనేక చిత్రములు వాకొంటన్ నవోల్లాసియై
వారిం దోడ్కొని దర్శనీయఘనభవ్య స్థానముల్ చూచుచున్. 363

తే. స్థానిక సతీర్థ్యులం గూడి చనుట నచటఁ
గ్రొంజెలుల వీక్షణాసక్తి కూడుకొనుట
వేడ్కఁబూనాపులంజూడ వెడలఁ దలఁచి
చక్కఁ జనె నొక్కచంచలా శకటము పయి. 364

చ. అటఁగనెఁ బ్రత్ననూత్న భవనాకర మున్నతదుర్గవర్గసం
కటపథవైరిభీకరము ఘాతుకసత్త్వనివాసహేతుదు
ర్ఘటఘనకాననావృత మఖాతపరీతము రాజ్యరక్షణో
త్కటగుణశౌర్య ధైర్యజనధామ మహో పునహో పురాఖ్యమున్ 365

వ. కని దక్కన్ జింఖానాభిధాన నగరకేంద్రమ్మున సహపాఠి బృందమ్ముతో విద్యుచ్ఛకట మవరోహించి గమించుచుఁ బీష్వాపార్కు, శంభాజీ పార్కు, నాగాఖాన్ దివ్య భవనము, బండ్ గార్డెన్సు ప్రాంతదర్శనములు మూసీ కూటంకష, దక్షిణభారత సైనిక శిబిర ప్రధానస్థానము, రాజగడముఁ దిలకించి పీష్వాల రాజధానియు, దేశభక్తికిఁ గాణయాచియునని గమనించి మత భేదాళి ప్రాయజనిత ఘోరకృత్యలయకాలరుద్రుఁడునై దికధర్మత్రుడు మహారాష్ట్ర రాజ్యస్థాపనానిర్నిద్రుఁడగు శివాజీని జ్ఞప్తికిఁ దెచ్చుకొని 366

సీ. బీజపూర్ సుల్తాను బెదరింప సుజ్జీ్యాత
లూపి షాజీనిదే నోపునాఁడు
కోరమీనముసవ్వి కొండయెల్కానివచ్చు
నాఫ్జలుఖాను బిట్టుపఁచునాఁడు
ఔరంగజేబుచే నాహుతుఁడై చెఱఁ
జిక్కిన్యకృతి బయలెక్కునాఁడు
తానాజినెత్తుటఁ దడిసి గర్జించిన
సింహ గడంబుపైఁ జేరునాఁడు

తే. తల్లి యాశీస్సుతో, రామదాసు దీక్ష
తో, భవానీ మహాపూజతో. నవీన
ఖడ్గ కాంతులతో సేన కదలునాఁడు
మేటులు మరాటు లెంత యారాట పడిరొ. 367

ఉ. తొంబదియేడు దుర్గములతో గడిదేరిన ఖిల్లజాతి సై
న్యంబులతో సమిచ్ఛణనిజాశ్వసహాయముతోఁ జలత్ప్రదా
త్యంబుదముక్తశాతశరహారముతోఁ గరఖడ్గకాంతితో
నింబడరంగ నేలిన మహీపతి ఛత్రపతిం దలంచెదన్. 368

ఉ. శంబరవైరి ఖడ్గమనఁ జాలినవాలు విపక్షశిక్షమై
సంబరమంద హైందవుల స్వాంతము శాంతలతాంతవృంతమై
పంబినచేడ్కఁగూర్కఁ, నవభారతరాష్ట్రరమావినోదకీ
ర్తింబరిపూర్తిఁ గన్న ఘను దేశము వీసము విస్మరించునే ? 369

తే. అనపరాధుల దండించు నట్టివేళ
శీలవతులైన స్త్రీలను జెఱచువేళ
బాల బాలికలకుఁ బ్రాణభంగవేళ
వైరి జిచ్చొ విరాజి శివాజి యాజి. 370

ఆ.వె. పోర నీల్గెనేని పోవు వీరస్వర్గ
మురక చచ్చెనేని నరకమబ్బు
దేశమాతకొఱకు దేహమిచ్చుటకంటెఁ
బుణ్య మేది యన్న పురుషుఁ డతఁడు. 371

వ. అని వాకొని— 372

కం. పురగిరి వనదుర్గములన్
హరిహరుల కభేద్య మట్లె యమరిచి యరులన్
జొరనీక పీఁక యమపురిఁ
జొరఁజేసిన వానికోటఁ జొచ్చెఁ గడంకన్. 373

వ. చొచ్చి యందలి పురాతన నిర్మాణ చాతురి కచ్చెరువడి వెలికి వచ్చి పారాధీన్యాసహిష్ణులయి విషకలుషిత వాతావరణమునఁ బీయూష వర్ష ధారలు కురిపించినభూనేత్రుల చరిత్రలుఁ గుష్టికి దెచ్చుకొని నాఁడేపేడు వీర్యమున దీనికి విజ్ఞోడనియెంచి యొక్కచో ఝాన్సీ శిలావిగ్రహ మవ లోకించి సంతసింప సతీర్థ్యులందొక్కరుంథు వెక్కసంబగు మక్కువతో శ్రీరాములం గని — 374

సీ. భాగీరథీభాయి భర్త మోరోప్పంతు
ప్రఖ్యాతకవి మహారాష్ట్ర భాష
వాని యాత్మజ మనూభాయి గంగాధర
రావును బెండ్లాడి రాణియయ్యె
న త్తింటి వారామె కళివలక్ష్మియటంచుఁ
బిలిచిరి వెస సంతు గలుగదయ్యె
నౌరసులుండని యట్టి రాజ్యములకు
నాంగ్లేయు లధికారులనిరి దొరలు

ఆ.వె. దత్తు చెల్లదంచు డల్హౌసి శాసించెఁ
బుట్టి కొడుకు గిట్టఁ బొగిలి పొగిలి
ధవుఁడు చావ ఝాన్సి దామోదరాఖ్యుని
దత్తు సేసికొనియె ధైర్యమెసఁగ. 375

తే. అవలఁ గానింగు డల్హౌసి యడుగుజాడ
నేగ, మగసిరితో సిపాయీలఁగలసి
లక్ష్మి పోరాడి స్వాతంత్ర్య లక్ష్మి కొఱకు
గ్వాలియర్ కోట నసురులు వాసెఁ గడకు. 376

వ. అని నుడువ నా భారత వీరనారీమణికి జోహారు లర్పించి తిరిగి తమ తీరుపునకుం జేరె. అప్పు డతండు ధ్యానింశతి వర్ష ప్రాయుఁడై యుండె.

కావుటంజేసి లోకజ్ఞాన సముపార్జన సమయమని గుర్తించె. విమర్శనా దృష్టి యించుకించుక యేర్పడుచుండె. 377

కం. ఆ విజ్ఞాన విహార
క్ష్మీమవిధి శిల్పకళఁ జూడ మృతజీవులకుఁ
జీవన్మృతులకు భేదము
భావమ్మున స్పష్టపడియె— బహుభంగులుగా. 378

కం. అసక్తి శక్తి యుక్తుం
డాసద్గుణి శాస్త్రవిద్య లందుచు నెపుడే
వీ సమ్మవకాశముఁ గన
వీసరలేకుండ విశ్వవిషయము లెఱుఁగుఁ. 379

తే. ఇట్టు విద్యార్థిదశయందె యెంతొ కట్టు
బాటుగల శీల మతనికిఁ బ్రాప్తమయ్యె
నపుడు నిండు పరీక్ష లాసన్న మగుడు
నాపుని మనోహరమ్ముగ నవతరించె. 380

## వసంతర్తు వర్ణన

ఉ. అంత వసంతశోభలు దిగంతజనాంతలతాంతవాంతని
ర్యంత్రితసౌరభమ్ములయి రమ్యసుమానవపానగానవి
శ్రాంతివిహీనబంభర పరంపరలై పరభృద్వినోదవి
భ్రాంతిమహా కుహూనినదభవ్యములై యలరారె నెల్లెడన్. 381

ఉ. రాలెడి పండుటాకు నల—రారుప్రవాళము నూది నవ్వన
స్థైళనసేయ కీ విటు మ—హీస్థలి రాలుట నిక్కమింతకుం
గాలము కొంతవట్టు నినుఁ—గాంచుచు తేఁజిగురప్పుడెంతయే
మేల మొనర్చు నిట్టనె స—మిత్రత నయ్యెదివానితో వెసన్. 382

తే. వందిమాగధు లట్టుల — బంభరములు
శ్రుతిహితాలాపముల జను — శుభము వలుక
మాధవాధిపునకు సర్వ — మంగళముగఁ
బంచమస్థాయిఁ గోకిల — లాపుచుండె. 383

తే. పూలదుస్తులు తొడితావి – పొలుపగులుకఁ
గుబురు చిగురుల తలగుడ్డ – గూర్చుకొంట
భూజయువతతి యందాలఁ – బొవలె నరసి
కన్నెతీవలు ముదమునఁ – గౌఁగిలింప 384

తే. పుష్పవతి యయ్యె మల్లికా – పుణ్యకన్య
యమలకాదంబిని కలబ – ద్యుంపులొదవెఁ
బండెఁ గడుపురసాల భ – వ్యప్రమదకు
మదను శరముల కొకక్రొత్త – పదనుహెచ్చె. 385

ఉ. మామిడి జీడిమామిడులు మల్లెలు మొ... ...జాజు ల
యామినిఁ గాచి పూచి ప్రజ కద్భుత... ...ఘంటి నా
రామ రమావిలాస మభిరామముగా ... ...ఖ్యకం
గోమలమౌ వసంతమె తగుం గ... ...చి రెల్లరున్. 386

ఆ.వె. శ్రేష్ఠతమశరాళి సృష్టించి మధు...
నాయుధాలయమ్ము లన్ని నింప
మరుఁడు వింటి నారి మాఱుమ్రోఁగఁగఁజేసె
వీరవిజయయాత్ర వెడల దలఁచి. 387

ఉ. పచ్చని తేజితో మనకుఁ బానక మిచ్చెడి కమ్మవింటితో
నచ్చపుఁ దాపులం గులుకు నమ్ములతో రొదసేయు నారితో
నచ్చిన సేనతోఁ దనదు నాథుని రచ్చకుఁ దేని రాణితో
లచ్చి కుమారుఁడొప్పెఁ గళలంగని స్వైరవిహారహారియై. 388

శా. పంకేజాక్షుని పెద్దబిడ్డ ప్రభువై పద్మాసనాసీనుఁడై
సంకల్పించును సృష్టి; సర్వరణముల్ సాధించు తమ్ముండు మీ
నాంకుండీతనిదే జయాంకమని ఘంటారావముల్ మ్రోఁగె నాఁ
బొంకమ్మై కడుశ్రావ్యమై వినఁబడెన్ బుంస్కోకిల స్వానముల్. 389

ఉ. కోయన గొంతిసేయఁగల కోయిలపాటకుఁ — బూలతోఁటకున్
హాయిగ వచ్చు మందమలయానిలు బాటకు — నెమ్మియాటకున్
దీయని యూటకున్ విరుల తేనియ తేటకు — పూవు వేఁటకున్
బ్రేయసి మాటకున్ మరగి వేడ్క సుఖింపని ప్రాణియుండునే? 390

తే. ఇనుఁడు హిమధామ డాసె గన్నొఱ్ఱఁజేసెఁ
బాంధులకు స్వాగతమ్మిచ్చెఁ బ్రపకృపాత్మ
వాయుయంత్రమ్ము పని హెచ్చె వరద చచ్చెఁ
జెఱకు గానుగ కడ గుంపు చేరఁ జొచ్చె. 391

ఆ.వె. పవనురీతి, సూత్రబలము, గంజి తెఱంగు,
నెఱిఁగి సేయఁదగిన కృత్యమగుట
వస్త్రకారకుండు వఱువాత మేల్కని
పడుగుసేఁత కొఱకుఁ బరుగులెత్తె. 392

ఆ.వె. రైలు నడపు వాని రాకాసి బొగ్గుల
నిప్పు వోలె ద్యుమణి నిగనిగయనె
పశ్యతో హరుండు బడలె హసంతికిఁ
బడియ పేదవాని కడుపనఁదగె. 393

తే. అధిక ధనవంతు బొఱ్ఱయు — ట్లామని వనిఁ
దేనె తుట్టులు లావెక్కఁ — దెలిసి నరులు
కొట్టుకొని పోవుచుండిరి — కొందఱౌర
కూడఁబెట్టిన సొమ్మైనఁ — గుడువఁ దరమ ? 394

వ. వసనుమనోహ్లాదుహాసము వినూత్న వధూవరవిలాస పరిహాస భాసము రతీప్రద్యుమ్న మనోల్లాసము ప్రకృతికాంతా నవచైతన్య వికాసమగు మధుమాసము మానవ మానసమున కానందదాయక మయ్యె. 395

తే. మంజుల నికుంజ మంజరీ — పుంజతతుల
గానలోలత మనసారఁ — గలయఁ దిరిగి
బడలి నిశ్శబ్దముగఁ బద్మ — పాత్రబంధ
రమ్ము మధుపానె తనప్రియు — రాలితోడ. 396

తే. కుసుమ శరుఁడాత్మ నెంతయుఁ — గోరునట్టి
క్రమ నిర్మల మల్లికా — కాయమాన
ముకుర బింబిత నక్షత్ర — ములవిధాన
విచ్చె మల్లెలు కన్నుల — విందుగాఁగ. 397

తే. ఎఱ్ఱదామర పారాణి — యింపునింపు
మావి చిగురను మోవి బం — ధురతిలకము
ప్రిదులు పుష్పాడి గంధము — ఏకరవమను
లలిత గానంబుతో వన — లక్ష్మియొప్పె. 398

తే. గుబురులఁ జిటారి కొమ్మలఁ — గూరుచుండి
కుహూ కుహూయని కోయిల — కూయ దాని
పల్కునకుఁ బాంధబాలకు — ల్బదులు పలుకఁ
గ్రోధమున బిట్టుగట్టిగాఁ — గూసెనదియు. 399

ఆ.వె. జడికిఁ జలికి మిగుల — సౌఖ్యముగానున్న
పుట్టనుండిరాల — గుట్టనుండి
యెండకుడికి లోన — యుండఁ జాలక చీమ
లెల్ల మెల్ల మెట్టు — కెక్కుచుండె. 400

చ. హాలముల బూజుదుల్పికనె — హాలికుఁ డోర్పువహించి యేతముం
బలుమఱు ద్రొక్కుటన్సరగఁ — బాదులు మిక్కిలి నీరుద్రాగుటం
దొలినులి వెచ్చగాలి చలిఁ — దోలుటఁ దోడన తోఁటవానికిం
జలజల స్వేదబిందువులు — జాఱె లలాటము డిగ్గి చెక్కులన్. 401

తే. మంచుతఱిఁజీడ తనకు వ్యాపించి మించి
నీరసము చేసినను గడు నిర్మల జల
శీతల స్నాన మెప్పుడు చేయుకతన
పద్మినీ చర్మరోగముల్ వదలిపోయె. 402

కం. జలదము లుత్తర దిక్కున
దలనూపి యొకింతసేపు తారాడంగన్
దొలకరి మెఱుపులు మెఱసెం
దెలివిని లోకమ్ము కన్నుఁదెఱచుసునాఁగన్. 403

తే. చదలఁ గ్రొక్కాఱు మెఱుపులకెదలు చెదఱ
వచ్చి పొన్నంగి పిట్టలు వనుల వ్రాల
వేడ్క విల్లెక్కు వెట్టిరి వేఁటకాండ్రు
లేదు సుకమెన్న నూకలు లేకయున్న. 404

ఆ.వె. చిన్నపెద్దలకును పెండ్లిండ్ల పేరయ్యె
యానులలోని పుల్ల యయ్యె నపుడు
పృథ్వి నాల్కయెండెఁ బెరిగెడి యెండచే
నెరువుఁ బోలుచుండె నెల్ల బండ్లు. 405

తే. ముతకదుస్తులపైఁ బ్రజ మోజుతగ్గె
జిలుఁదితెలి జిల్గుపల్వల వలనుమొగ్గెఁ
గనవు గఱవొటఁదారాడి పసులువిసివి
నీడనెలవులు నీళులు నెమకి నెగ్గె. 406

ఆ.వె. నటకులకు గిరాకి నానాటఁ బొదలెను
బుష్పలావికలకుఁ బొదుపు పొంగె
విహిత ధర్మ కృతులు విద్యాలయాదులు
చదువులందు డస్సి నిదురఁ గూరె. 407

కం. మిహిరాచల శిఖరమ్ములఁ
దుహిన తతుల్ వహ్నితతియఁ దొరలెడి వెన్నె
యహిమమండను శిరమెక్కిన
మహిళామణి పొత్తుగలిగి మహిమఁ వెలిగెఁ. 408

వ. అట్టి మధు మాసమ్ము సర్వజనాహ్లాదకరమ్మై యలరారుచుండె. ప్రకృతిధర్మముగ శాస్త్రసమ్మతముగ నక్కాలము శుభకార్యముల కను వగునదియని హైందవుల విశ్వాసము. కాన, యుక్తవయస్కులగు స్వీయ తనూజాతుల కల్యాణకార్య నిర్వహణాసక్తి జననీ జనకులకుంట సాజము.

తే. ఏడు లక్షల గ్రామాలఁబాడివంట
భారతాంబకు నందిచ్చి భక్తి మెచ్చి
కుడు మొసంగినఁ బండువై కులుకు పల్లె
ప్రజకుఁ దొల్లింటి యాచార పథమెహితము. 410

## సీతారామ కల్యాణ యత్నము

వ. భరతవర్షప్రాక్పరస్యంతతీరప్రాంతము నదీమాతృకము. శాల్యాది సస్యశ్యామలము. ఫలమహీరుహవనాన్వితము. నాగవల్లీత్యాది నానావిధ

లతానికుంజపుంజమంజులము. పల్లెలరాలవాలము. పుత్త్ర పశుసంపదాభివృద్ధి, క్షీరసమృద్ధి, ఐకమత్యబుద్ధి, చిత్తశుద్ధి, అన్యోన్యసహకారబుద్ధి, న్యాయసిద్ధి, జ్ఞానవృద్ధాజ్ఞావినమ్రత, నమ్రత, ఆనాటి పల్లె ప్రజల జీవితముకుర ప్రతిబింబితములు. సనాతనమహానవనాగరకతాద్యోతకములు. ఆముష్మిక చింతనాధిక్యతచే నరిషడ్వర్గముల బలమంతగాలేమి నున్నవారి యెడ గౌరవము లేనివారియెడ దయ చూపించుచున్నదినము లవి. 'దుర్బలస్య బలం రాజా' యన్న సూక్తికిఁ బెక్కు నిదర్శనములున్న రోజు లవి.

శ్రీరాముల పితరుల స్వస్థానము విక్రమ సింహపురమండలములోని జువ్వలదిన్నె గ్రామము. తజ్జననీ జనకులు వ్యాపారార్థము చెన్నపురికివచ్చి యట స్థిర నివాస మేర్పరచుకొని యణ్ణాపిళ్ళె వీధిలో నూటయిరువది మూఁడు కవాటసంఖ్యగల నికేతనమునందుండఁ గ్రీస్తుశకము పందొమ్మిది వందల యొకటిలో శ్రీరాములు జన్మించె. లండను నగరమున సప్తమ ఎడ్వర్డా సంవత్సరముననే సింహాసనమెక్కె.

రాముల మేనమామయగు గునుపూడి నరసింహులుసెట్టి మారెళ్ల గ్రామవాసి. అది నెల్లూరు జిల్లాలోనిది. శ్రీరాముల ముఖ్యబంధువు లందఱీ మండలమునందే యుండిరి. బొంబాయివంటి మహానగరమున నత్యున్నత విద్య నభ్యసించుచున్న మేనల్లునకుఁ బిల్లనీయ నెవని యుల్లమున నుల్లాసము జనింపదు! 'అలస్యా దమృతం విషమ్. శుభస్య శీఘ్రమ్మ'ను సూక్తులు వినియుంటచే నమ్మధుమాసమ్మున నొక్కనాఁడు నరసింహులు సెట్టి సతీమణియగు సుబ్బమ్మను జేరంజీరి — 411

ఉ॥ పట్టికిఁ బెండ్లిసేయఁదగు పట్టిదెయంచెదఁ దట్టి నాకు నీ
విట్టుల యూరకొన్న పని యెట్టిగుఁ గూఁతులఁ గూర్చి మాతయే
గట్టిగఁ బట్టుఁబట్టి శుభకార్యము నెగ్గెడిదాక నిద్ర పో
నట్టు నటింపఁగాఁ దగదె ? యావల నీవలఁజూచి నేర్వవే ? 412

ఆ.వె. ఈడు వచ్చినట్టి యూఁడు బిడ్డ నెవండు
నింట నుంచుకొంట కిష్టపడఁడు
దాచి పెట్టినట్టి ధనమును స్వామికి
నిచ్చు నట్టు వరున కీయవలయు. 413

కం. ఇమ్మహిమానము శఖల
గ్నిష్ముల కిరపంచుఁ బల్కఁగా విని హితలో
కమ్ముల సమ్మతి మెయిఁ గ
ర్షమ్మిఁక సాధించుటెంత సంతస మబలా! 414

కం. వారల వీరల వలె మన
మూరక పరుకొఱకు బాధ నొందఁబనేదీ ?
శ్రీరాము ననుగ్రహమున
శ్రీరాములకిచ్చి పెండ్లిసేయుట లెస్సా ! 415

ఆ.వె. పినికంటెఁ బెద్ద విద్యలునేర్చిన
వారలాంధ్రినుంట వాస్తవమ్మ
ఐన తావు విడిచి కాని తావున కేగు
మందబుద్ధులెవరు? మందయాన ! 416

కం. ఏరిన కొలంది సరకుల
బేరముగా లాభమెంతో వినబడుచుండుఁ
దూరపుఁ గొండలు నునుపను
సారసహితవాక్కు వినమె సౌజన్యవతీ ! 417

ఆ. వె. లక్ష్మి యస్మదీయ లపితమ్ము ఋతమని
యెదురు రాదు సత్య సదయ హృదయ
యట్టి దాని చేతఁ బెట్టఁబట్టికిఁ గూడఁ
గొంత సుఖమటంచుఁ గోరుచుంటి. 418

ఉ. కోరినవెల్ల నొక్కదెసఁ గూడుట దుర్లభ మద్ది సృష్టికిఁ
దూరము పూర్ణచంద్రునకె తోఁచును మచ్చ లభించినంతలో
వారక తృప్తి నొందఁదగు వానికిఁ దండ్రి కొలంతెగాని లో
టేరు వచింతు రొండొకటి యుంతిరో రాముఁడు వంశసోముఁడే. 419

తే. మాదృశుల మాట మూటగా మదిఁదలంచి
చెవియొసంగు మదమ్మునఁ జేరికోరి
జన్మసిద్ధము వాని ప్రశాంత గుణము
రావణుఁడు గాఁడు పొట్టి శ్రీరాముఁడెవుడు. 420

కం. పెట్టిన వారికి నెట్టనఁ
బుట్టుటయే సాక్ష్యమనుచు బోధించిరి ముజ్ఞ
గుట్టెఱిఁగిన మునిముఖ్యులు
నట్టాడందగదె నచ్చి నవనీతమతీ! 421

ఆ.వె. మంచికూటి కింత మంచి కూరలభించు
టరిది, జరుగుదనుక నా దటున్నఁ
జేసినంత కొంత స్నేహమ్ము చెడుచుండు
విప్పి చెప్పలేము విశ్వమహిమ. 422

వ. ఐన నది మాకు వర్తింపదు. మా బావ సజీవుఁడై యున్నప్పు డెట్టి
క్లిష్టసమస్యలు సంప్రాప్తించినను భేదాభిప్రాయము గగనకుసుమము. 423

ఆ.వె. కొండెకాఁడు కాఁడు గురవయ్యబావ మా
కండ దండ యనఁగ నమరినాఁడు
బావమఱఁది యెపుడుఁ బ్రదుకఁగోరనుసూక్తి
యక్షరాల సత్యమయ్యె మాకు. 424

ఆ.వె. ఎదురఁ బొగడి వెనుక హేళనజేసెడి
గొనము వానిలోనఁ గనము మనము
వుల్లవిఱుపుమాట పొక్కదతని నోట
మంచివాఁడు బావ మాకు నావ. 425

ఆ.వె. ఇప్పు డాతఁ డున్న నీ పెండ్లికొలఁకని
యెన్ని సార్లు వచ్చి యేగువాఁడొ
కంచు గంటవోలె గంభీర రవళితో
వరుసలాడి నవ్వ నరసుఁ డతఁడు. 426

ఆ.వె. ప్రాణనాథుతోడఁ బరివృత సంతాన
లక్ష్మివచ్చుఁ జైత్ర లక్ష్మి వోలెఁ
దనదు బిడ్డ లట్లు మన పిల్లలను ప్రేమ
నరయుచుండు నాత్మ మురియుచుండు. 427

ఆ.వె. ఎట్టివారి యింటి కట్టివాఁడే మెట్టఁ
జిక్కులేదు మాట పొక్కఁ బోదు

మనకుఁ దగ్గవాఁడె మనయల్లుఁడౌఁగదా
మసలు చేబ యింక మగువ మిన్న. 428

ఆ.వె. భర్త యభ్యసింపఁ బాశ్చాత్యవిద్యను
భారతీయ విద్య – భార్య నేర్వ
సంధి యుగమునందు సత్యైక్యసంస్కృతిఁ
బుట్టు క్రొత్త లెన్ని పుట్టఁ గలవొ. 429

సీ. పరివర్తనమ్మొప్పు ప్రకృతి ధర్మమటంచు
నవనాగరకుల మన్నించిరేని
పాశ్చాత్య విద్యా ప్రభావమ్ము కల్మిమై
వైవాహికార్థముల్ బ్రాహ్మ్యము విడి
గాంధర్వరూపంబుఁ గైకొన గంతులు
పెట్టువేళల దాని బిగువుతెలిసి
మన కది వర్తింపదని యుపేక్షింపక
జాగృతి మేలని సత్వరముగ

తే. వలయు రీతిని వర్తింప వలయుఁగాన
నిమ్ముగా లక్ష్మి కిప్పుడే కమ్మ వ్రాసి
యరసి జతనమ్ము కొఱఁతలు పొరయకుండ
సుత వివాహమ్ము జరుగుటఁ జూడఁదగును. 430

కం. మనకున్నయంత మేరకు
ఘనతరముగఁ దనియఁ బెండ్లి గావించి యిటన్
జనువుట సముచిత మగుటన్
బని మన భుజభారమంచు భావింపఁగదే! 431

ఆ.వె. చిట్టి తల్లి కెన్నొ చిన్నారి పొన్నారి
పసిఁడి నగల భద్ర పఱచియుంట
లాంఛనముల కొఱకు లలితవస్తుచయమ్ము
లిపుడు కూర్పవలయు నిచ్చకొలఁది. 432

చ. అని పతివల్క నాకె ముదమంది త్వదీయ పథమ్మునం దొగిం
జనుట మదీయ ధర్మమగుఁ జాల దినమ్ములనుండి యిద్దియే

మననము సేయుచుంటి నొక మాటొకమాట భవత్సహోదరీ
మణి చెవి వేసితే వినుటమంచిది యాయమ యేమి సెప్పునో. 433

ఆ.వె. వావి నరసి మురిసి వాకొంద్రు వదినెతో
వచ్చి నప్పు డెల్ల వారు వీరు
సీత నిచ్చి పెండ్లి శ్రీరాములకుఁ జేయు
టెంత పుణ్యమనుచు సంతసమున. 434

చ. ముసి ముసి నవ్వు నవ్వుకొని ముద్దుగ సీతను బిల్చి ముంగురుల్
వెసఁగొని గోటదువ్వు చరవిందము విచ్చినరీతిఁ దన్ముఖం
బన దృశ శోభనొందుటది యాయమ యిచ్చరుసుగుర్తు నాఁదగఁ
బసగల పల్కుపల్కితని భావము నందొక తృప్తి నొందెదఁ. 435

ఉ. అదటవోవ నట్లు సతి యాడిన పల్కులకిచ్చ మెచ్చి పె
ల్లాదర మేదురంబయిన యాశయముల్ వెలిబుచ్చి మిత్రులఁ
మోదముతోడఁ బిల్చి తన బోకడ లెల్ల వెలార్చి కమ్మ మ
ర్యాదగ సోదరీమణికి వ్రాసెఁ గుమారి వివాహ సంగతుల్. 436

కం. వ్రాసినది వినిచి సతికు
ల్లాసముఁ గలిగించి మంచి లగ్నం బొండీ
మానమున నెప్పుడుండునొ
యే సరిగా నెఱిఁగి వత్తు నీ దినముననే. 437

కం. కన్యాదానము ఘనతర
పుణ్యమ్మని రార్యు లద్ది బొసఁగుట మనకుఁ
ధన్యత మేనల్లున కిడు
మాన్యతయుం గలిగె నెంత మంచిది సుదతీ! 438

ఆ.వె. మనము కూడఁ బెట్టు ధనమెల్ల బిడ్డల
మంచి కొఱకుఁగాక మఱి యొకటికె
దేవుఁ డిచ్చినట్టి జీవితలతికకుఁ
బ్రథమ సౌఖ్య సుమము పరిణయమ్ము. 439

వ. అని ప్రసిద్ధ సిద్ధాంతి శిఖామణింజేరి వధూవరుల పేర్లు నివేదించి సుముహూర్తంబు యోచించి తద్వృత్తాంతంబు హృదయేశ్వరికిం దెలిపి సంతోషాంతరంగుండై యుండె అంత. 440

కం. ప్రత్యుత్తరమ్ము రాక కుఁ
బ్రత్యహము ప్రతీక్షణమ్ము పనియాటరదే
ప్రత్యగ్రకార్య ధుర్యున
కత్యర్థో ద్యోగబుద్ధి – యమరెడు కతనన్. 441

# శ్రీ సీతారాముల కల్యాణ ప్రయత్నము

## జననీ తనయుల సంవాదము

కం. వేసవి సెలవుల జనని ని
వాసంబున కతఁడు రా వివాహవిలాసో
ల్లాస విశేష విధాన
శ్రీ సౌగంధ్యాంక లేఖ చెచ్చెర వచ్చెన్. 442

ఉ. వచ్చిన నిచ్చమెచ్చి గుణవంతుని రాములఁ గూర్చి యెంతయో
ముచ్చట ముచ్చటాడుకొని యా శుభవార్త నతండువిన్న నే
మిచ్చని స్వీయభావమని యెంచి కుమారుని బిల్చి నాయనా!
యిచ్చటఁ గూరుచుండుమని యేర్పడఁ బల్కెను మాత యిాక్రియన్.

ఉ. "నీ సుగుణంబులన్ విని వినీతిపునీతుఁడు మాతులుండు తా
నే సుత నిత్తునంచు మన కెంతో శుభమ్ముగ లేఖనంపె బి
డ్డా! సరిదైన ధర్మమని రాంధ్రులు మేనరికంబు సేయుటే
చేసిన లాభమేమియనఁ జేతికి నోటికి నెగ్గలేదురా. 444

ఆ.వె. ఈడు జోడు కుదిరి యిల్లాలుగాఁ గాఁదగు
కన్నె మేనమామ కున్న నదియుఁ
బున్నెమంద్రు జగము పోకడ నెఱిఁగిన
విమలమతులు వేదవిదులు బుధులు. 445

చ. మది నదివోలెఁ బొంగినది మామ తనూజ నొసంగువార్త నీ
కది ముదమీదె యేది తలయట్టుల వంచెదవేల? సత్కళా
ప్రదమగు పెండ్లి కెందుఁ జనవా? వినవా? మనవారిఁగానవా?
యదనిది సత్యశాంతహృదయా తనయా వినయా నయాన్వయా. 446

ఉ. కన్య యనన్యమాన్యగుణ గౌరవధన్య వదాన్యజన్యసా
జన్య సుధీవరేణ్య జనసన్నుతపుణ్య కళావిభూత్య సా
మాన్య హిరణ్యరత్నమయ మంగళకంకణహారయుక్తలా
వణ్య నిజంబు నీకతగు భార్య సుమా మఱుమాట వీడుమా. 447

శా. బార్హస్పత్యవచోవిచార సరణింబాటించి చాటించినన్
గార్హస్థ్యప్రతిమాన ధర్మగుణ సంకాశంబు శూన్యంబు నిం
దార్హంబౌ వ్యతిరేకమార్గతతి భార్యాభర్తృభాగ్యార్థమే
స్వర్హర్షంబు పితౄణమోక్షము సుతప్రాప్తింగదా లభ్యమౌ. 448

శా. విద్యాశాల సమజ్యలందెడనెడన్ విద్వచ్ఛిరోరత్నముల్
హృద్యోక్త్యంబుధిఁ దోఁగఁజేయఁగ హృదిన్ హృష్టుండవై వచ్చినా
కాద్యంతంబుకథావిధానముల సత్యాంశంబు విన్పింపఁదం
డ్రీ! ద్యోవీథిదినేశువోలె శ్రుతపాండిత్యంబునన్జేరెడిన్. 449

శా. వేలున్ లక్షలు పక్షిజాతులయినన్ విశ్వంబునన్ హంసకే
పాలున్నీరును వేఱుసేయఁగల సౌభాగ్యంబు సిద్ధించుటన్
జాలం గీర్తిఘటిల్లె నట్లె జగతిన్ సత్యంబసత్యంబు న
మ్మేళంబై మన వేఱుసేయునతఁడే మేధావిరా పుత్రకా!” 450

చ. అనవిని నమ్రకమ్రశిరమల్లన నెత్తి వియద్విలోకనా
జనిత విచారధీరుఁడయి చల్లఁగఁదల్లినిజూచి “యమ్మ! నా
మనము వివాహసౌఖ్యమను మాట తలంపదు; విద్యపూర్తియౌ
దనుక-క్షమించి నన్నుఁ దగుదారిన దీవనలిచ్చి కావుమా! 451

మ. శ్రుతిరీతిన్ మనజాతి నీతి నిలుపన్ శుద్ధాత్మకుల్ స్నాతక
వ్రతచర్యాగతి పూర్తిచేసిన గదా వైవాహికంబందు రా
స్థితి యిక్ష్వాకుల నాఁటిదన్న నిపుడేదీ భిన్నమార్గంబు నా
మతి యోచించినఁ బట్టభద్రులకె సమ్మానంబు గన్పట్టెడిన్. 452

శా. విద్యాభ్యాసమువేళఁ బెండ్లిసలుపన్ విద్యార్థిరాగాంధుఁడై
విద్యామోదము ఖేదవాదవశమై విశ్వాసరాహిత్యమై
యాద్యాధ్యానవిహీనమై కడకు విద్యాభంగమౌటెన్నఁగా
నాద్యంతాన్వయ శూన్యకష్టతతితో నల్లాడఁడే తల్లిరో! 453

వ. అది యట్లుండఁ బ్రహ్మచర్యాశ్రమ మహిమ నా మనము నాకర్షించు చున్నది. గురుబోధామృతమ్మున సద్గ్రంథ పఠనమ్మున స్వర్భూలోకమ్ముల బ్రహ్మచర్యాశ్రమ ధర్మనిర్వహణులై లోకోద్ధారకులై మహామహులై తరించిరను నుదంత మవగతము చేసికొని మూదలించెద. కావున, సోదాహరణముగ నా చేయు విజ్ఞప్తి సావధానమ్ముగ నాలింపుము. 454

తే. అఖిలలోక విహారి కళ్యాణకారి
తత్త్వశాస్త్ర విచారి సత్యప్రచారి
బ్రహ్మమానసపుత్రుండు బ్రహ్మచర్య
వ్రతమునంగాదె యంతటి ప్రతిభఁగాంచె. 455

శా. రాజ్యంబుంచఁ బెకల్చి చిట్టియను సర్థస్ఫూర్తిమై లోకర
క్షాజ్యోనేతలు వెంకణంబు లిడఁగా సాలోక్య సారూప్య సా
యుజ్యాద్భుతశక్తియుక్తియుత విద్యోతాచ్ఛదేహుండు న
త్పూజ్యుండయ్యె మహర్షి నారదుఁడు తత్పుణ్యంబునఁ జా మాతరో!

చ. రహి మహతీ సుగాత్రముల రాల్గరఁగఁ జా ఘనగాన లోలుఁడై
యహరహమూహరిందలఁచు చాదరహాసవిలాస భాసవా
గ్వహనవిహారియౌట మదిఁ బాసినలంపటగాదె తల్లి! త్వ
త్సహనము తన్మహామహిమ చక్కి మరల్చి కృతార్థుఁజేయవే. 457

తే. సతి గలిగి బ్రహ్మచర్య సద్వ్రతముఁ బూని
రామకృష్ణుఁడు వేదాంత రాజ్యమేలె
నతని శిష్యుఁడు తద్దీక్ష నంటియుండి
విశ్వవిఖ్యాత విజ్ఞాన వేదినెక్కె. 458

శా. ఫుల్లాంభోజసకాశనేత్రములతోఁ బూర్ణేందు వక్త్రంబుతోఁ
గొల్లల్వోయెడిదాచతీవిజిగితోఁ గూలంకషప్రజ్ఞతోఁ
జెల్లాదేఁజా జయశంఖమాయమెరికా విద్వత్సభావేదియం
దల్లంబేరొగి వాఙ్ముఖంబున వివేకానందుఁడన్వర్థుఁడై. 459

ఉ. అల శుకయోగి భీష్ముఁడు మహామహులైరన బ్రహ్మచర్య స
త్ఫలమని రార్యవర్యు లది ధర్మములందు విశిష్టభాగమై
వెలఁగి ఫలింపఁగావునని జీవితమంతయు బ్రహ్మచారిగా
నిలిచెద వ్రాజ్ఞనిమ్ము జననీ! జని సార్థకమౌను పావనీ! 460

శా. ఆయుర్వృద్ధికి దోహదంబొనఁగు వ్యాయామంబు న్యాయంబు ప్రా
ణాయామం బవి బ్రహ్మచర్యవిధి ధన్యత్వంబుతో నొప్పఁ ప
్రచ్ఛేయోపాత్త విచిత్రశక్తియుతుఁడై శ్రీయాంజనేయుండు యో
గాయోగంబున మున్ను దాశరథి కార్యంబెల్ల సాధింపఁడే. 461

తే. సహజ ధీశక్తికల బ్రహ్మ – చర్య మహిమ
సహకరింపంగ వేదాంత – శాస్త్రమెల్ల
సర్వ దిక్తతి వెదజల్లి – శంకరుండు
ముప్పదేండ్లకె దైవాజ్ఞ – ముక్తినందె. 462

తే. త్రిజగములఁ గన్ను సన్నచేఁ ద్రిప్పుచున్న
బలిని బలిగొన్న దొక దివ్యబ్రహ్మచర్య
మహిమ–మనుజు మహాత్ముగా మార్చుశక్తి
దాని కంటెను వేఱొకదాని కున్నె ? 463

శా. అంగంబుల్ దెగి యుద్ధరంగములలో నల్లాడు సైన్యాలి క
త్యంగీకార చికిత్స సేయుచుఁ దదాహ్లాదమ్ముతోఁ బెండ్లియుణ్
శృంగారంబుఁ ద్యజించి విశ్వమునఁ గీర్తింగొన్న ఫ్లారెన్సు నై
టింగేలుం గమనించి దేశరమ పాటింపందగుణ్ ధీమణుల్. 464

కం. కొందఱు చెఱపణ్, సుకృతులు
గొందఱు మేల్సేయ గుంటకుణ్ మెట్టులకుం
గొందలమందుచు సొజవు
సౌందర్యమువిడక జగము సాగుచునుండుణ్. 465

వ. అదియునుం గాక. 466

మ. అదిగో ! భారతమాత దాస్యకఠినాయశ్శృంఖలా బద్ధయై
పదముల్ దుర్గతి నొందఁగుందు చకటా ! పాపాత్మనై తింగదా
హృదయంబున్న కుమారుఁగన్న నిఁక నాకీ బన్నముల్ సున్నయో
నది నేనెన్నఁడు నోఁచుకొందునని యమ్మా ! కంటనీర్వొ త్తెడిణ్. 467

మ. ఒకవంకం బరతంత్రయంత్రబల దీర్ఘోగ్రార్భటీధాటి వే
ఱొకవంకణ్ ధనధాన్య హీనజనరక్షోద్యుక్తసత్కోటి యిం

కోకపంకజ రణరంగసంగతుల లో కోద్రిక్తపుంబోటి యీ
సకలంబుం బరికింప నే సుఖము నే సాధింతునో తెల్పవే? 468

ఉ. మాటలువేయిచెప్పఁగల మానవులెచ్చటనైన నుందురా
మాటలలోనిభావము క్రమంబుగఁ జర్యలలోనఁ జూపఁగాఁ
గోటికినొక్కఁడుండఁ డిదికోవిదులుం గమనించి మించి యా
మాటలకంటెఁ జేఁతలకె మన్ననలిత్తురు ధర్మవేత్తలై. 469

ఉ. భారతనాయకాగ్రణు లపారజిగీషలు మాతృదాస్యపుం
భారముఁబాపఁ గాంగ్రెసను బాధ్యతగల్గిన సంస్థఁగూర్చి ప
త్తీరుల రాజకీయవిధిలీలల మర్మముఁ దెల్పుచున్న న
ప్పీరుల వాఙ్మభాళివినఁ బేడియుఁ గ్రీడగమాఱిపోవఁడే. 470

వ. అవ్వావాదు సారాంశమేమన— 471

తే. భరతరాజేంద్రులకు మధ్యఁ బాదుకొన్న
యీసురోసాలు హెచ్చించి యెఱిఁగి సమయ
మొకరిపక్షముచేరి యింకొకరి నణఁచి
మెల్లమెల్లఁగ దొరలైరి తెల్లవారు. 472

ఉ. ఎక్కడిహైందవావని మఱెక్కడి లండను బెక్కుయోజనా
లొక్కొక్కవార్థిదాటి దొరలొక్కమొగిం గబళించి గద్దెపై
నెక్కుటఁ మాతృభూమియను నేనుఁ గొకానొక దోమగొంతులోఁ
జిక్కుటగాదె? యౌర! విధి సేఁతకులొంగని రంగముండునే? 473

ఆ.వె. జగము పొగడ నెగడు సాహసవీరుఁడే
కొండొకప్పు డడఁగియుండు, లేడి
కాళ్ళులేక కాదు కాలము వచ్చియే
చిక్కు ననెడి మాట నిక్కమెగద? 474

కం. ఎవఁడు తన సర్వశక్తుల
నవధానముతోడఁ బ్రజకు నంకిత మిడుఁ ద
త్పవినయు జీవితచరితము
నవభారతనందనమున నవ్యసుమంబౌ. 475

ఉ. మానవసేవ పూజ్యుఁడగు మాధవుసేవ మహార్తినున్న యా
దీనులసేవ నాకపురి దివ్యులసేవ భవత్స్వహాయ సం
ధానధనమ్ము వమ్మగునె ధార్మికులారా! యనర్ఘశంకలం
బూనక దీక్షమై భరతభూమికి స్వేచ్ఛ లభింపఁ జూడుఁడీ! 476

వ. అని ప్రాక్పశ్చిమ విజ్ఞానఖనులు ప్రబోధించు చుండిరి. 477
కావున,

శా. కాసింతైనను వాసిఖాసిలు లసత్కార్యంబు సాధింపఁ బె
న్గాసిన్వేసరుటొప్పు నాత్మజులతో గారాబుటిల్లాలితో
నాశాపాశ నిబద్ధబుద్ధినయి మోహాంధ వ్యథారాధసం
కీసంసార విచారసాగరము తల్లీ! యీదఁగాఁ జాలనే. 478

సీ. ఒక్కరత్నంబున్న దిక్కుల వెల్గించు
నెన్నిఱాలుండిన నేమి ఫలము
వరసస్యధరణికి మరుభూమి యెనయానె
రిక్కతేనికి దీటెచుక్కలెల్ల
ఖద్యోతుసాటియే ఖద్యోతములుపెక్కు
సింహతుల్యమె గ్రామసింహచయము
శాస్త్రజ్ఞునకుసాటె చవటలువేవురు
పండితునకు నీడె పామరతతి

తే. లోకకల్యాణ దీక్షావిలోలుఁడైన
త్యాగి పంచాననుసమమె భోగివితతి
యింతయోచించి దీవించి హితమునెంచి
తల్లి! మత్పథమున కడ్డు తగులకమ్మ. 479

మ. అనినందల్లి హృదంతరాళమున నాహ్లాదంబునందిల్లఁ ద
త్తనయుణ్ణ సితనయుం గనుగొనుచుఁ "బుత్రా! రాజయోగంబుతో
నెనవోలంగల యోగరాజమొకడేదీ లేదు కాదన్న నా
మనముం దృప్తియొనర్ప నియ్యకొనుమా మర్యాదలంబొంధుమా.

ఆ.వె. తల్లిదండ్రుల నుడిఁ దలఁదాల్చిమెలఁగఁడే
రాముఁడొకఁడు పరశురాముఁడొకఁడు

కదలకుండలేద కానబియ్యాంకుండు
జనకు మాట కొఱకుఁ జచ్చువఱకు. 481

కం. నీవు పఠించు కథానిక
లేవిని వినిచెద సునీతు లిట్టివ చదువుల్
జీవితమున కంటింపక
పోవిడుచుట పుటలుతిన్న పురుపు తెఱంగే. 482

ఉ. ఎన్నొహితోపదేశముల నేఁ జెవిఁ జేరివచించుచున్న మీ
యన్నమదీయవాగ్గత యథార్థమహార్థ విచారదూరుఁడై
కన్నఫలంబు నీ కనులఁగన్నదిగా తరువాతివాఁడ వి
ట్లున్నఁ ద్వదీయ మాతృహృదయాబ్జదళమ్ములు వాడిపోవవే. 483

ఉ. నన్నుఁ బ్రసన్నఁగాఁదలఁచి నా కనుసన్నమెలంగుచుంటనే
నన్నది సాఁగుచున్నది గృహమ్మున నిమ్మెయి నీకతమ్మునం
దిన్నఁదనమ్మువమ్మయినఁ దీరనిలోటుఘటిల్లు వారలుం
గన్నెకు భర్తరాక మనకాళ్ళపయింబడవేయ రింతకున్. 484

తే. నరుల జీవితయాత్రలో నాల్గుదశలఁ
బెండ్లికంటెను వైభవోపేతమెద్ది ?
సంతసంబున దానికి సాటిగలదె ?
అట్టిభాగ్యమునకు దూరమగుట యేల ? 485

కం. నరసీరుహాలోచన విధి
కరుణమెయిం బత్ని యగుటఁ గాదనుట యిటన్
సిరిరా మోకా లడ్డుట
సరియగునే వెన్కముందు జాడలు గనవే. 486

ఆ.వె. తీఁగె పంది రెక్కె దివ్యతరమ్ముగా
నెన్నఁడైన మాట యెఱుఁగ మింత
మామ మనకుఁ దగిన మరియాదగలవాఁడు
ముందు వెన్క లరసి పొందుపడుము. 487

కం. పల్లెత్తు మాట పలుకము
తల్లికి నెదురాడి పుడమి తలక్రిందైనం

గల్లోలము మృగ్యము మా
చెల్లెలికక్కలకు లోటుజేయు టెఱుగడే! 488

క. మాయురె! నేఁ డిట్లాడితి
వేయెడ నేనాటికెట్టులే మనియెదవో
పోయిన యవకాశము వెన
వేయిచ్చిన రాదు వట్టి బేలవు బిడ్డా! 489

ఆ.వె. పిలిచి బిడ్డనీయఁ బ్రేమమైఁజనుదేరఁ
ద్రోసిపుచ్చుటెంత లేసిపనులు
లేనివార లిద్ది లేదనుకొన దేన
దైవ దత్తమునకుఁ దలఁగు దీవు. 490

క. ఏనాఁడు సీత పుట్టెనొ
యానాఁడే రామ నీకు నాలియనిరి యెం
తో నెనరున నయ్యానల
కీనాఁడిటు స్వస్తిచెప్పు టెంత యుచితమో. 491

క. ఈ పుడమి శాశ్వతమె యే
నే ప్రొద్దెటు జరుగఁగలదొ యెఱుఁగఁగలారే
యావయి నీ ప్రాపెయ్యది
చూపోవని వారు నిన్నుఁజూతురె సుతుఁడా! 492

ఆ.వె. దైవకరుణ పెద్ద ధనరాశి లేకున్న
నన్నవస్త్రచింత సున్న మనకుఁ
గలిమిలేములన్నఁ గావడి కుండలు
వానినెంచి బెదరవలదు తండ్రి! 493

తే. బొత్తిగాఁ బేదయైనను ముత్తుసామి
వీధిలాంతరు వెలుఁగులోవిద్యనేర్చి
పాడిపట్టుకు న్యాయాధిపతిగనయ్యె
నెవనిప్రాఁతెట్టులున్నదో యెవ్వఁడెఱుఁగు. 494

కం. పురుషార్థపరులు తరమిడి
స్థిరధర్మ చయమ్ములందుఁ – జేర్చిరిపెండ్లిం

బరమార్థము బోధించెడి
గురుజన ధిక్కారమెంత కూడనిదన్నా. 495

కం. పెంచిన గుంచిన నీచే
మించిన దేదియును లేదు మేలెంచి గృహో
దంచిత పిత్రాచారము
మంచిది యుల్లంఘనమ్ము మనకుం దగునే ? 496

కం. ఆరోగ్యశాస్త్ర ద్వారా
వారంబున నీదుచున్నవాడవు గానన్
శారీర కర్మమర్మం
బారసి నసివాసి రోసి యాడెద వితులన్. 497

ఆ.వె. తనదు కాళ్ళమీఁదఁ దానిల్వఁ జాలని
లేకి యుద్ధరింపలేఁడు; పరులఁ
గష్టసుఖములన్ని గమనింపవలెనన్న
నాలుబిడ్డ లుంట యవసరంబు. 498

వ. అది దైవసిద్ధసంబు దానిందాఁట మనమెంతవార. మందఱు బ్రహ్మ
చర్య మవలంబింప మానవసృష్టి యేమగునన నాతండు సమాలోచన
చేసి తద్ధితోక్తికలది జీవన్మాతృకుఁ డగుట యదృష్టమని యెంచి నిజము
జననీ దైవము బలవత్తరము. భగవల్లీల లెఱుంగ నెవరితరము. 499

సీ. బిడ్డపాలంజాలఁ బిండుకోనిచ్చెడు
గోవునెత్తిన కొమ్ము గ్రుచ్చినాఁడు
కాడగానేలంటి కాయగాచెడి చెట్టు
కాకాకు దరి ముల్లు నతికినాఁడు
మోకుతిర్గనిలావు మొదలున్న నేరేడు
చెట్టుకు నులిపండు చేర్చినాఁడు
కొనవ్రేలిలావంత గుమ్మడి తీవకు
బుట్టంత పండును బెట్టినాఁడు

తే. దొడ్డకోటీశునాలికి గొడ్డటికము
కటికిపేదకు నిండార కడుపువంట

కూర్చినాఁడెన్నిచిత్రముల్ పేర్చినాఁడో
తెలివితక్కువవాఁడౌనె దేవుఁడరయ. 500

చ. నను గనిపెంచి విద్యల కనారత మెంతొ శ్రమించి మంచి యీ
తనయుఁడు పొందుటం దలఁచి తల్లిగఁ దండ్రిగ భార మూనుచుం
గనులకు ఱెప్ప లట్లెప్పుడుఁ గాచితి నీ ఋణ మీఁగఁ జాల నీ
పనుపు మదాత్మకుం దనుపు పావని! యేమని మీరనేర్తునే? 501

శా. ఏనింతాడి భవన్మనోజ్ఞ హితసువర్ణైకక్రియాపాదినై
యా సీతాఘుఁడనైతి బాధపడకమ్మా! నన్ను మన్నింపుమా!
నా నిర్వేద మెఱుంగుమా సుతుని హృన్నైర్మల్య మీ వెంచుమా
నీ నైశ్చల్యవచోవికాసమున కెంతే సంతసం బయ్యెడిన్. 502

కం. అని పలికి యామెమాటను
వినననుటకు నోరురాక వినుకలి కలిమిన్
తనమంచి నెంచి పంచిన
పని వినుటయె యొప్పి యిట్లు పలికెం బెలుచన్. 503

(సంస్కృత పదరహితము)

కం. మను వీమనువును గాదనె
మన యాచారమునుబట్టి మనఁదగుఁ గానన్
జనవాక్యమె కర్తవ్య
మ్మనుమాటను నమ్మి పెండ్లియాడెద నమ్మా! 504

కం. జగమెఱిఁగిన సుగుబోధన్
జిగిగలభావంబు మనవిచేసితి ననినన్
నగి సుతుచిబుకముఁ బుడుకుచుఁ
దగు నిది సంతోషమనుచుఁ దల్లియుఁ బల్కెన్. 505

కం. అంతం గన్యావాతయు
సంతసమున సపుడ రాఁ బ్రశాంతముతో సి
ద్ధాంతిం జేరి ముహూర్తం
బెంతయుఁ దగినట్లు నిశ్చయించిరి సరగన్. 506

ఇది తృతీయ ప్రకరణము.

# శ్రీ సీతారాముల కల్యాణ మహోత్సవము

## చతుర్థ ప్రకరణము

వ. జ్యోతిష్కుఁడు పసుపుపూసి శుభమస్తని యొసంగిన లగ్ననిర్ణయ పత్రమ్మును సవినయమ్ముగఁ గైకొని యప్పత్తనమంద పాణౌకరణోత్సవాహ్వానలేఖ లచ్చొత్తించి బంధుమిత్రాదుల కంపిరి. వెంటనే మాతులుండగు గుసుపూటి నరసింహులు సెట్టి స్వగ్రామంబగు మారెళ్ళ కేఁగి నిర్వర్తిత గృహాలంకరణుఁడై తాళపత్రాచ్ఛాదితమ్మును, వలయిత నారికేళ దళోపరి భాగసఫల రంభా స్తంభ పరిరంభ సంశోభిత స్తంభచయాన్వితమ్మును, పార్శ్వ స్తంభమధ్య ప్రదేశపరికల్పిత ధనురాకార కలితమ్మును, శ్వేతవితానాంసల కాంచన కాంతిచ్ఛటాచంచద్వక్రపత్త్ర విస్తృత భాసితమ్మును, కృత్రిమ పత్రపుష్ప లతాంతర్గత చంచరీక కేకి శుకపిక శారికాచంచు గత చూత భల్లాతక ద్రాక్షాదాడిమీ శలాటుకోటి భూషితమ్మును, పవమాన ప్లవమాన నానావర్ణ పత్రచిత్రితలఘ్వలఘు గోళజాలాకీర్ణమ్మును, బాల చంద్రరేఖాయమానకల్పనా విచ్ఛిన్న విశృంఖల విచలత్పత్రశృంఖలాలంకృతమ్మును, కోణప్రాంగణ డోలాయమాన ద్రాక్షాగుళుచ్ఛాతి మనోహరమ్మును, కపోతకుక్కుటాండాది వివిధ పరిమాణ విద్యోతమాన శుక్లకృష్ణ పీతహరిత రాగస్నిగ్ధ ద్యుతియుతాభ్రక నిర్మిత వర్తులాకార పూర్వపూర్వాధికాధికోత్తరోత్తరాల్పాల్ప గుచ్ఛ కలితమ్మును, పుష్పమాలా సహిత సహకార పలాశ తోరణసమేతమ్మును, మురాళ రాజ విగ్రహవిరాజితమ్మును, నిశానమయశరజ్జ్యోత్స్నా సన్నిభ తతసితద్యుతియుత యంత్రదీపికా దీప్తిమంతమ్మును, భారతీయకళామయ జీవప్రదర్శనాదర్శ నిదర్శనాత్మకానల్ప శిల్పకల్పనా చాతురీ గరీయసమ్మగు నొక్కచక్కని పచ్చని పందిలి వేయించి తన్మధ్య భాగమ్మునఁ గళ్యాణవేదికను జక్కఁజేయించి గోమయముతో నలికించి పన్నీరు చల్లించి రంగుగా రంగవల్లులదిద్ది తీర్పించి తదూర్ధ్వభాగ పటమ్మున సహస్రదళ పద్మమ్మును వ్రాయించె.

కం. ఇఁగ నట లక్ష్మమ యింటికి
సొగసుగ సున్నంపుఁబూత శోభిల్లంగా

జిగిమీఱ నోరు వెట్టఁగ
దగఁబసుపుం గుంకుమములు—దాఁ దీర్పించెన్. 508

తే. ముచ్చెబంగారుకాగితముల నమర్చి
పూల నలరారు నును దెలి మేలికట్టు
నారికేళ దళాల సందమ్ము చిందఁ
బరగవేయించెఁ బచ్చని పందిరందు. 509

తే. ఆత్మబంధుల మున్ముంద యామతింప
వచ్చిరందఱు సంతోషవార్ధి మున్గి
మంచి తఱినెంచి పెండ్లికుమారుఁజేయఁ
బెద్దముత్తైదువలు రాముఁ బిల్చిరపుడు. 510

తే. పెండ్లిపాటలఁ దలయంటి పెట్టినలుగు,
దానమాడించి, నూత్నవస్త్రముల నిచ్చి,
తమ్మిలమ్మును మంచిగంధమ్ము నొసఁగి,
కాళ్ళఁబారాణి, బుగ్గచుక్కయునమర్చి. 511

తే. వదినెమఱఁదలు, బావయు బావమఱఁది,
యాత్మకింపైన పరిహాస మాడికొంచుఁ
బుష్పఫలయుత తాంబూలములు గ్రహించి
పెండ్లికొడుకును జేసిరి ప్రేమరాము. 512

తే. సంప్రదాయమ్ముగావచ్చు సత్క్రతువుల
నక్రమమ్ముగ నెరవేర్చి సంబరమున
ధూమశకటాన బంధుమిత్రులనుగూడి
వరుఁడు వధువు గృహమునకు వచ్చుచుండె. 513

చ. కడు వడగాడ్పు తాకున జగ మ్మొగి వెట్టకుఁ బుట్టినిల్లుగా
ముడివడు పాంథవర్గముల ముమ్మరపుఁ దనుఘర్షణాదులన్
బెడద యొకింత లేనియటు పెట్టెలఁ బెట్టెలఁ జేర్చి తాల్పఁగా
లిడి యటుఁగూరుచుంట సుఖమింతొనగూడెను పెండ్లివారికిన్. 514

ఉ. జనను రానురాను జనమాయయి [illegible]
బూని యొకెట్టొనెట్టుకొని [illegible]

శ్రేనియు నిల్వ కెందఱో యథేచ్ఛగ ధూమము వింతహాయిగా
నాసుచునుండ ధూమశకటాఖ్య కదుంగదు సార్థకంబగుఙా. 515

తే. ధూమ శకట విరామ స త్రీమలందుఁ
జుట్టు బీడి కిళ్ళీ సిగరెట్టు కాఫి
టీ యరఁటి ద్రాక్ష నిమ్మ జీడీలు సోడ
విస్కి టని తెర్గుచుం గేకవేయువారి. 516

కం. కని పిల్లలు 'గీగా'యన
కొనిపెట్టుచునుంద్రు వారి కోర్కులు తనియఙా
ధనవంతులు; వాంఛించియు
ధనహీనులు కొంతవఱకుఁ దగ్గుచునుండఙా. 517

కం. జలయంత్రమ్ముల చుట్టుం
గలత్రొక్కిడి యేమిచెప్పఁ! గలశంబులకే
కలహము జరుగుట డార్విన్
బలశాలికె స్థానమన్న పలుకు స్ఫురించుఙా. 518

కం. మల్లెలు గులాబి సంపఁగిఁ
మొల్లలు కనకాంబరములు మొగలియు జాజుల్
కొల్లలుకొల్లలు చనుదే
సుల్తాన మెసంగ విలుచుచుండిరి తరుణుల్. 519

కం. వికిరమె వృత్తిగ నుంటం
గొకిబికి వేసములఁ గుంటి గ్రుడ్డి రుజార్తుల్
రకరకముల నన్నానులు
ప్రకటించుచు వేఁడికోలు వత్తు రెడనెడన్. 520

కం. అగణిత జనసమర్దపు
టగచాట్లం జూచి రాము లబ్బురపడుచుఙా
భోగబండకి నిరుగడలం
దగపడు దృశ్యములనడిగి యరసెడి వేళఙా. 521

తే. మంతు కెక్కిన నెల్లూరు మజిలమునఁ
జెన్నుమీఱిన జువ్వలదిన్నె నీదు

పితరులకు జన్మభూమినా వింటి ననుచు
రాముసకు వించె నొక్కండు ప్రేమమెనఁగ. 522

తే. సింహపురి యను పల్కాది చెవిని బడఁగఁ
దనదుపితరుల నాంధ్రరాణ్మనుమసిద్ధిఁ
దిక్కనకవీంద్రు జ్ఞప్తికిఁ దెచ్చుకొంచుఁ
దెలుఁగువిజయధ్వజమ్ములఁ దలఁచియాత్మ. 523

సీ. వైరివీరుల రక్త పాన పిపాసచే
నుక్కు కత్తులు ఋటా లెక్కునాఁడు
నిష్కలంకయశస్సు నేల నల్దెసఁ బ్రాక
తెల్లుపతాకముల్ వెల్గునాఁడు
మనుమసిద్ధి నిజసామ్రాజ్యమాదేవితోఁ
బసిడిగుమ్మము దాఁట వచ్చునాఁడు
కవితాలతాంగికిఁ గల్యాణమొనరింపఁ
పచ్చని పందిళ్లు పరఁగునాఁడు

తే. ప్రమదలందఱు నపరసరస్వతులుగ
మీఱి సత్కళలందారితేరునాఁడు
ఆంధ్రవిజయధ్వజమ్మున కారతులిడి
యెంత సంతస మొందిరో యిచటి జనులు. 524

సీ. ఉత్తరరామాయణోత్పలాక్షిని మన్మ
సిద్ధి కొసఁగి పెండ్లిచేయునాఁడు
అవభృథస్నానాంతమందుఁ గుండలియాచు
యజ్వీయన్ బిరుదుచే నలరునాఁడు
పసిఁడిగంటమ్మున భారత సత్కథ
పదునైదు పర్వముల్ వ్రాయునాఁడు
పరహస్తగతుఁడైన బ్రభుశృంఖలము ద్రెవ్వఁ
గవిపల్కు ములుకులై కవియునాఁడు

తే. పండితమ్మన్యులైన వైతండికులకు
గుండెగాలముగాఁ దిర్గుచుండునాఁడు

వైదికాచారపరు కవిబ్రహ్మఁగాంచి
యెంత యానంద మందిరో యిచటి ప్రజలు. 525

ఉ. కాటమరాజుఁ బోలెసఁగఁ గాలునిఁబోలికి మీటకుండ నీ
వేటికి తూలివచ్చి తని యింతి జలంబులు తోడి మంచముల్
జాటుగ నుంచఁ నల్లిపులిచల్ల నితన్ గని తిర్గి యేగు నా
పోటరి ఖడ్గతిక్కన యపూర్వపరాక్రమలీల లెంచెదన్. 526

కం. అని మనుకొనుచో నెల్లా
రసురాఁజెన్నంగనంగ మ్రొక్కెనెడందన్
వినయమున నతఁడు బత్తిను
ననలెత్తఁగ నచటిరంగనాయకుఁ దలఁచెన్. 527

కం. పదపడి దిగపలసినచో
టదిరా నటుడిగ్గి రంద ఱాదృతిమీఱన్
ముదమునఁ గొంపోఁబడి రిం
పొదవు విడిది గదికి సౌఖ్య మొప్పఁగ నచటన్. 528

శా. అన్యోన్యానుమతైకదృష్టి బహుళోద్యద్వాద్యరావార్భటిం
గన్యాదాత సబంధుఁడై విడిది వేగంజొచ్చి హృత్ప్రీమ సా
జన్యశ్రీవగ శాస్త్రుడుక్తవరపూజంజేసి పల్యంకిఁ ద
న్మాన్యున్ రాము గృహమ్ముఁజేర్చె మిథిలానాథుండు రామంబలెన్.

కం. వచ్చిన పెండ్లికుమారుం
జెచ్చెఱఁ గనువేడ్క లొంప స్త్రీజన మెంతో
ముచ్చటపడి దపుదవ్వుగ
వచ్చి యతనిజూచి మంచి వాఁడని మెచ్చెన్. 530

కం. ఆలోకోత్సవకరముగ
నా లో సీతమ్మ నిచట నలికులవేణుల్
లీలంబెండ్లి కొమార్తగ
నోలిం గావించి ముదము-నొందెడి వేళన్. 531

సీ. కుటిల కుంతలములు కొమరొప్ప నవరించి
ప్రేలాడు జడ మల్లెపూలు దుఱిమి

నెలబాలు జిగి నేలగల జాలు చెక్కిన
పుత్తడి పాపట బొట్టుఁ బెట్టి
యలరుఁదీవలఁ జిల్కజలతారు పేటుతోఁ
గమనీయమౌ కంచుకంబుఁ దొడిగి
జిలుగుటద్దకము పసిండి వన్నెలు చిందు
శ్వేతకౌశేయమ్ముఁ జెలఁగఁ జుట్టి

తే. జాళువా నేవళంబులు చక్కఁగూర్చి
పూజిరాబోదుఁ జేపట్టిఁ బోవుచున్న
చందురునికూఁతు చందాన నంద మొంది
యూకె యలరారె రత్నశలాక మించి. 532

తే. చెందిరపుబొట్టు, క్రొంగొత్త చెవులజితయుఁ
గాళ్ళపారాణి, కంటికిఁ గజ్జలంబు,
చెక్కిలింజుక్క మిక్కిలి – చెలువొసంగ
బెండ్లికళ గొండ్లిసల్పె నాపెకు ముఖాన. 533

వ. అంతం గన్యాదాత రచితకుసుమవిరాజిత సూత్నపీఠికాద్వయమ్మును వితర్దికపైఁ బెట్టించి పీతాంబరమ్ముచుట్టించి సిరిచాపలు పఱపించి, కదళీ ఖర్జూరనాగవల్లీ నారికేళ గంధసుగంధద్రవ్యాక్షతాది బహువిధ పదార్థ పరిపూర్ణభాజన రాజిందెప్పించి, కాయమానబహిర్గత భాగమ్ముల సముచితోన్నతాసనంబులఁ దరతమభేదంబుల వరుసల గూర్పించి నిర్ణీతసమయమ్మున నాహూతులుపవిష్టులైయుండ వివిధవాద్యధ్వనులు మిన్నుముట్ట సంగోద్వర్తన మంగళస్నానానంతరము నూతనవసనమణిభూషణ భూషితులైన వధూవరుల రప్పించె. 534

కం. పనిచెఱువులదొర మ్రొక్కమిఁ
బనిహానిం బొరయుననెడి భయభక్తులతో
గణపతికిఁ బూజ జరిగెం
జనులలరఁగ షోడశోపచారక్రియలఁగా. 535

ఉ. మొట్టెడివానికే జగము మ్రొక్కు నిదర్శనమిద్ది కాదుకా
దట్టుల గట్టుపట్టి తనయాత్మజు లందితఁ డగ్రజన్ముఁడై

పుట్టుట నెట్టిదైనఁ దొలిపూజయిడక హరుఁగోర నాతఁడ
ప్పట్టున మాటయీఁదగు శుభంబని యెంచిరి కొంద ఱాత్మలో. 536

తే. స్థలనికేతన భాండాది సర్వవస్తు
నిస్తులపవిత్రత సమస్త నిర్జరాశి
షతతిరతి భూసురాగ్రణి శాస్త్రరీతిఁ
బరఁగఁ జరిపించెఁ బుణ్యాహవచన మపుడు. 537

మ. అజలేఖర్షభముఖ్యు లేజసని భవ్యాశీశ్శుభాకాంక్షులై
నిజహస్తాబ్జము లెత్తిమ్రొక్కుదురొ హ్రాన్నీ రేజమీశానుఁడే
విజయశ్రీకిఁడెనో మునుల్ తపమున స్వీక్షింతురేతల్లి నా
త్రిజగత్పూజ్యను గౌరిఁగొల్చె వధు వెంతేభక్తి సంయుక్తయై. 538

మ. తనువుల్ రెండుగఁ దోఁచినస్ సతతమాత్మల్ రెండుగాకుండ నా
ర్యనయాభిజ్ఞవచఃప్రబోధదలదీహద్బుద్ధి గార్హస్థ్యభా
ఘ్నునదీక్షాగ్రహణాత్తచిహ్నములు నాగం గంకణాల్గట్టి రం
తనమంత్రోక్తులతోఁ బురోధసులు సీతారామహస్తంబులఁ. 539

వ. తత్క్షణంబ వికీర్యమాణ పిశంగచ్ఛవి సంయుత నూత్న సూత్ర సంగ్ర
థిత ముక్తాద్యుతియుతతండులశ్రేణి కలితలలితకనకలలామకంబు లా జంప
తుల విశాల లలాటకంబులఁ జక్కఁగ శృంగారించిరి. అంత. 540

తే. పంచయజ్ఞార్హుఁ డితఁ డిఁక నంచితగతి
నాయురారోగ్య భోగభాగ్యద మనంగ
నుత్తమాంగము దీవించి యావరునకు
వేడ్క వైచిరి యజ్ఞోపవీత మపుడు. 541

తే. శ్వేతకౌశేయ మొగిఁ బ్రతిసీరగాఁగఁ
బట్టి రైదువ లటునిటుఁ వడ్లుపోసి
క్రొత్తపుట్టిక పెండిలి కూఁతు నునిచి
తాన వేదికకుందెచ్చె మేనమామ. 542

వ. మహాసంకల్ప మంగళాష్టకాద్యనంతరంబ. 543

మ. అలరత్నాకరుఁ డద్వితీయమతి దివ్యద్వీపినీయుక్తుఁడై
చెలువౌ మందరసానువేదిక జయశ్రీశౌరిఁ బూజించి ని

ర్మలుఁడై లక్ష్మినొసంగినట్లు సతి పార్శ్వంబుండఁ దచ్ఛ్రేష్ఠి రా
ములకుఁ సీతమ ధారవోసె హిత సమ్మోదమ్ము సంధిల్లఁగన్. 544

మ. స్తవనీయస్వరతూర్యముల్ మొరయఁ బ్రాంచద్వేదఘుర్ఘానముల్
శ్రవణానంద మొనర్ప బంధుబుధహ స్తన్య స్తసూత్రద్యుతుల్
హపణిల్లఁ వధుకంఠసీమ పరుఁడాహ్లాదాన మాంగల్య ను
త్యవలీలన్నవలీలఁ గట్టె నిఁక నయ్యర్ధాంగిస్వార్థమ్మునా. 545

ఉ. ప్రాంచదఖండశిల్పకళరాజితరాజత భాజనంబులం
దుంచిన సేసఁబ్రాలు గొని యొండొరుగెల్వఁగఁ బ్రోత్సహింప న
భ్యంచితరీతి దంపతు లనంతముదమ్మున నొక్కరొక్కరిన్
మించఁగఁ బోసికోఁ దలఁ మేలని మెచ్చిరి మిత్రబృందముల్. 546

తే. దివ్యదీపాళి దీప్తులఁ దేజరిల్లు
పళ్ళెరమ్ములు ధరియించి బంధులలర
నిరువలంకుల నిర్ణీత లేగుదెంచి
యారతిచ్చిరి యైదువరాండ్రు గవకు. 547

వ. కన్యాదాతయగు నరసింహులుసెట్టి యత్తవారి యనూచానక్రియా నిర్వహణమునకై వృద్ధదంపతులు వేదికానికటోపవిష్టులై కళ్యాణ కార్య కలాపంబులు నయనానందముగఁ దిలకించుచు నెడనెడఁ జమత్కార పరిహాసరసావేశభాషణంబులఁ బులకించుచు జన్మమున కదియొక విశేషాంశమని తలంచుచు లేచి యథాశక్తి వధూ జననీజనకులకు మనోహ రాంబరోపహారము లర్పించిరి. 548

తే. బ్రహ్మపర్పసమానన పద్మమందు
నృత్యమొనరింప వేదికానికటసీమఁ
బండితాఖండలుండయి ప్రతిభ వెలుఁగు
కులగురుండంత లేసవ్వ మొలకలెత్త 549

సీ. ప్రావృషేణ్యపయోధరధ్వాన గంభీర
రవమున నిట్లనె శివకరముగ
అనుకూలవతియగు గృహిణాళితో సంసార
మనుభవించుటె స్వర్గమనిరి బుధులు

బహుజన్మసంస్కార భాగ్యవశమ్మునఁ
ప్రాప్తించె నీకిద్ది పరమసాధ్వి
యర్ధాంగి యనుమాట సార్థకమ్మొనరించి
యిరువైపులకుఁ గీర్తి నెనఁగఁజేసి

తే. అతిథి పూజలు దానధర్మాదు లెల్ల
శక్తివంచన లేకుండ జరుపుచుండి
దైవమును నిచ్చ లాత్మలోఁ దలఁచికొనుచు
జీవయాత్ర సుఖమ్ముగఁ జేసికొనుము. 550

చ. వినయము వృద్ధగౌరవము విశ్వకళాకమనీయదృష్టి స
జ్జనసుత సంఘసేవ ఘనశాంత వచోరచనా చమత్కృతుల్
మనము ధనమ్ముఁగాఁ దలఁచు మాన్యుఁడు పుణ్యుఁడు నీదు భర్త నీ
గుణము వినూత్నరత్నముగఁ గూర్చి వరుణ సుఖియింపఁజేయుమా.

తే. బ్రాహ్మ్య వైవాహికంబు గార్హస్థ్యధర్మ
మగ్రగణ్యంబులివి మీరలందుకొనుట
సుమనన సుమంబు కాంచనసూత్ర బద్ధ
మైనటుల మెలంగి శుభముల నందుకొనుడు. 552

వ. అని వలుతెఱంగుల నాశీర్వదించుచు నక్షతలు నల్ల నందఱు హర్షించిరి.
అంతదుముండ లగ్నసమయమంచ. 553

తే. అంగుళీయకము ఘటికా యంత్రము పెను
రౌప్యపాత్ర ల్జరీవిల్లు రమ్యవస్తు
లల్లునుల్లమునుల్లాస మంద నిచ్చె
మహితమతి మాతులుండు సమ్మాన మెసఁగ. 554

తే. అలఁతి నునులజ్జఁ గ్రొంగొత్త యాలుమగలు
బమ్మముడి తమ జీవితైక్యమ్ముఁ దెలుప
నత్తమామల పాదము లంటి మ్రొక్కి
వారల శుభాశిషమ్ములు వడసి రపుడు. 555

సీ. సతనాల్కలల్లార్చు హుతహవ్యవాహను
నుతి వలగొని మ్రొక్కి రతుల భక్తి

పరికించి రజ్ఞాక్షు పదగతి స్థిరమోది
నౌత్తానపాది సత్త్వైకవేది
సప్తర్షిమండల స్థాయి వెల్గు సరుంధ
తీసతి కెరఁగిరి దివ్యబుద్ధిఁ
బ్రణుతిసల్పిరి శుభప్రద మంచు నెంచి భూ
దేవతలకు నిష్ట దేవతలకు

తే. ధన్యతములనఁ దగు వృద్ధ దంపతులకు
పాదవందన మొనరించి వారివలనఁ
బుత్రపౌత్రాభివృద్ధిని బొందుఁడనుచు
నాశిషమ్ములఁ బొంది రయ్యాలుమగలు. 556

మ. దినదీనారసమృద్ధిచే మహితధాత్రీజాత సౌఖ్యమ్ముచే
జనకాశీఃపరమార్థసంగతలసత్ జ్ఞానప్రభావమ్ముచే
ఘనశైవాగతధర్మశర్మ కలనాకల్యాణకార్యమ్ముచే
జినదీనావనదివ్యగానరతిచే సీతమ్మ సీతమ్మయా (ద్వ్యర్థి) 557

శా. పిత్రాజ్ఞాపరిపాలనాంచిత గురుప్రేమైకశిక్షాధృతిన్
సత్రాలంబవివేకకర్మనిరతిన్ స్వాధీనధర్మద్యుతిన్
జిత్రాహ్లాద వివాహవైభవరతిన్ సీతాసతీత్వస్థితిన్
ధాత్రిన్నాయుఁడు రాముఁడే యనిసదాతజ్జ్ఞుల్ ప్రశంసింపఁగా (ద్వ్యర్థి)

వ. అనూత్నసతీపతులలరారిరి. అంత నారాత్రి పరశ్శత స్త్రీజన పరివేష్టితంబుగ— 559

ఉ. పానుపువేసి చుట్టు నిరువైపుల యైదువరాండ్రు సేరి క
ల్యాణవినోదగేయముల నానవదంపతుఁబాడు చెండు వి
న్నాణము సూపువారల ఘనస్తుతిపాత్రులఁ జేసి గౌరిక
ల్యాణపుఁబాట నిచ్చిరొగి హారతి భారతి రీతిఁ బాడుచున్. 560

కం. ఈగతి నవమిథునమునకు
రాగోదయ మొప్ప నుదయరాగము గ్రప్పన్
డేగాట పూర్తియగుడున్
వేగవెడలు కోరికఁ మగపెండ్లివారల్. 561

తే. అంపకము పూ_ర్తిసేసిన యంత నరిగి
మద్రపురి మరుదినమ నిర్నిద్రభ_క్తి
సత్యనారాయణునినోము చక్క నోచి
దైవదయనందినట్టులఁ దలఁచి రాత్మ. 562

కం. ముదమిడు నొరు హాస్యపునుడిఁ
బొదలెడి నునుసిగ్గు పొరలుపో నవమిథునం
బెదనెదఁ గలుపుచు నుండం
బదియారవనాఁటి పెండ్లి పండువు జరిగెన్. 563

కం. సర్వేశు దయాదృష్టిన్
సర్వసుహృద్బంధువితతి సంతోషింపన్
నిర్వ_ర్తిత లాంఛనుఁడై
గర్వవిహీనుండు శ్రేష్ఠి కడుఁ దృ_ప్తిపడెన్. 564

వ. *దేహళీదీపన్యాయముగ నిహపరసౌఖ్యసాధనమునకు వంతెనవంటి యేతద్ఘట్టమును బాలబాలికలు వినోదదృష్టితో యువతీయువలు విలాస దృష్టితో వయోవృద్ధులు బాధ్యతాంకురాలోచనాదృష్టితో మతాంతరులు తత్క్రతు రహస్యవిమర్శనాదృష్టితో నైష్ఠికులు హైందవాచార వైశిష్ట్య దృష్టితో భ_క్తులా_స్తికతాప్రమాణస్వీకరణదృష్టితో కవులుకళాదృష్టితో నా_స్తికులుప్రత్యక్షసాక్ష్యదృష్టితోఁ బరికించుచుండ విప్రో_త్తముల వేదాశీర్వాదములు మహిళామణుల మంగళహారతుల గీతములు శ్రవణానందము గలిగించె. ఏతన్మోదయరాగరసరంజితావసరమ్మున సువర్ణకరప్రసర మిత్రమండలశ్రుతిసమ్మతగద్యపద్యగానగంభీరశుభాకాంక్షలు సహృదయ హృదయాహ్లాదకరమయ్యె. వేదవేత్తృ కవిపండితకార్తాంతికపురోహితాదుల భూరిసంభావనల సత్కరించి, రసాలతాలవృంతచందనతాంబూలంబు లందఱ కందజేసిరి. అంతకుముందు లగ్నసమయమంద ఆహూతులు స్నాతానులిప్తులై త్రిపుండ్రతిలకభస్మధారులై బంగరుజరీపేటంచు పట్టు బట్టలు దాల్చి వివిధరజితపానపాత్రలతో గృహాంతర్భాగమ్మున బారులు తీరి కూర్చుండి షడ్రసోపేతభోజనములఁ దృ_ప్తులైరి. కాఱుమబ్బుల గార వించుకాయములతో మసిగుడ్డలవంటి గుడ్డలతో రంగు మాఱి యుంగర ములు తిరిగిన జుటతో సింగార మెఱుంగక నిర్యచ్ఛింఘాణనాసికాయు_క్త

శిశువుల వీపునఁగట్టుకొని యెంగిలి విస్తరాకులకుఁ జినిఁగిన చెంగులు చాఁపుచుఁ బైపైఁబడు నొకానొక యనాగరకజాతి హీనస్థితి కోమలమగు రాముల హృదయము నీరుసేసి జ్ఞానదర్పణమున నజ్ఞానయుగమానవా కృతిని గనఁబఱచి, సదూహా విహాయసమ్మున విహరింపజేయ నాతఁడా పేదలకుఁ దిన్నంత యన్నమ్ము వెట్టించె.

ఇట్లు పాణిగ్రహణకార్యకలాపంబు పూర్తి యగుడుఁ దల్లి వలన సెలవు గైకొని కళాశాలకేగి యతిశ్రద్ధతోఁ జదివి నగరారోగ్యసూత్రబద్ధ వాస్తుశాస్త్ర పట్టపరీక్షయం దుత్తీర్ణుఁడయ్యె. వెంటనే యుద్యోగము లభింప నింపారు నళిననయన, నయనప్రమాభిరామ, రామాశిరోమణి, మణిసదృశ గుణాలంకృత, కృతసత్పూజాఫలిత లలితయగుసీతతో నరుగ నిశ్చయించు కొని మారెళ్లలో మాతృనికేతనమున నున్నయామెందోడితేర ముత్తైపువుం బుచ్చిన. 565

# ధర్మబోధ

వ. క్రొత్తకోడలి నత్తవారింటి కంపుచుం దజ్జననీజనకులు— 566

తే. గ్రామజీవిత మింతకుఁ గడపి తీవు
పురవరనివాస భాగ్యమ్ముఁ బొందఁబోవు
చుంటి వయ్యాయి తావుల నుండు వసతు
లనువుగాఁజేసికొని సౌఖ్య మందు టొప్పు. 567

కం. తెలివిగలవారి కెంతయుఁ
దెలిపి ప్రయోజనముఁ బడయఁ దేలికయౌగా
చిలుకకుఁ బలుకులు గఱపుట
సులువగు బకమునకు నేర్ప సులభంబగునే. 568

ఉ. పట్టణవాస శిష్టజనపద్ధతి బావ గ్రహించి సెప్ప నె
వ్వట్టున గుట్టు మట్టుల స్వభావ విమర్శనతో గ్రహించి నీ
వెట్టుల సంచరించెదొ సుమీ మనవంశయశస్సు నిల్ప నో
పట్టి గృహస్థధర్మముల భామలదే పయిచే యెఱుంగుమా. 569

మ. నుతరీతి స్వఋవాత మేలుకొని యన్యుల్లేమి నుద్యోగియా
టతిశీఘ్రమ్ముగ మంచి రుచ్యముగ నల్పాహారపానీయముల్
పతికి న్నచ్చిన శాకపాకములు సంభావించి కావించి త
న్మతికిం దృప్తి యొసంగు మయ్యదియ ధన్యత్త్వమ్ము సూ పత్నికిన్.

కం. అయవ్యయములఁ దలఁపక
యాయాకృతి వంటలక్క లని పనికత్తెల్
చేయందగునని సత మొరు
సాయమ్మున కెదురుచూడఁ జాలరు సాధ్వుల్. 571

కం. ఎప్పటి కప్పుడు పాత్రల
త్రుప్పుదులుపకుండ నెల్లి రోజెట్టిదియో
చెప్పఁగలేమని యెప్పుడు
మప్పితముగ జరుపుకొంట మంచిది బిడ్డా! 572

ఆ.వె. అక్క ఋన్నయప్పు డతికించుకొనుచుంద్రు
తీరినంత మోముతీరుఁ గనరు
లోకజాల మెట్టిపోకడగలదియో
తెలిసికొనుటె గొప్ప తెలివినమ్మ. 573

శా. ఉల్లం బద్దపు డెన్నొ చిక్కుక్రియలం దుద్యోగ ధర్మమ్ములై
నుల్లాసంబు తొఱంగి యుంట మది నీవూహించి యిల్సేరఁగా
నల్లాపార్కక ఖావిలాసమునఁ దత్స్వాంతాబ్జపత్రద్యుతుల్
సెల్లుంబెల్లుగఁగూర్చ నిట్టివిగదా స్త్రీకీర్తికి న్మూలముల్. 574

కం. పతికిఁ బతి యేడుఁగడ యని
మతిమంతులు పల్కి రట్టి మాట నరయుచోఁ
బతి మెప్పులేక దైవత
పతులైనను మెచ్చుకొనరు పడతుల దుహితా. 575

కం. తలలో నాలుకవోలెన్
మెలఁగిన నెందైన మేలు మెలఁతకుఁ గలుగున్
గలిమియు నధికారమ్మును
గలదంచును మిడిసిపడఁగ గారవ ముడుగున్. 576

ఆ.వె. ఇంటిగుట్టు పరుల - కింతైనఁ జెప్పకు
మద్దికూర్చు పెద్ద - హానియంద్రు
వాదులాడఁబోకు - వలదన్న పనిఁగూర్చి
వినయధనమె ధనము - వేయునేల. 577

సీ. అత్తమామలఁజూడు - మాదిదంపతులట్లు
పరమదైవంబుగాఁ - బతిఁదలఁపుము
తోఁబుట్టువట్టులఁ - దోడికోడలఁజూడు
మఱఁదుల బిడ్డల - మాడ్కిఁగనుము
ఆఁడుబిడ్డలఁజూడు - మతిహితమతులట్లు
తిలకింపు దయతోడ - దీనజనుల
నీర్ష్యమై నెవ్వార - లేదెట్టులాడినఁ
గయ్యంపుఁ బల్కుల - కియ్యకొనకు

తే. మతఁడెకానసర్వశక్తుల - కధిపతియని
నమ్మికొల్వుము దేవుని - నెమ్మనమున
నిద్దినకలార్థసాధక - మింతికనుచుఁ
దెలిసివర్తింప నిచ్చలు - గలుగు శుభము. 578

ఆ.వె. పురుషుఁ డింతవఱకు - పొలతుకనబలగాఁ
దనకుదాసి యనుచుఁ - దలఁచెఁగాని
యబల యబలగాదు - సబలయయనిదృష్టి
మార్చుకొంట నీతి - నేర్చుకొంట. 579

కం. అనిదేశవిదేశస్థితిఁ
గనుగొన్నసుధీంద్రులాడఁ - గా విననౌనే
మైనను నీ ధర్మమ్ములు
మనుజులకిట మాఱఁబోవు - మదినమ్ముసుతా. 580

తే. సతిపతులు న్యూనతాధిక్య - గతులఁబెనఁగ
కెప్పుడన్యోన్యరాగైక - హృదయులగుచు
సమతవర్తించుటిహపర - సౌఖ్య మనుట
కర్ధనారీశ్వరుని రూప - మధియసాక్షి. 581

కం. సతతం బన్యోన్య శుభ
వ్రతనిష్ఠన్మెలఁగి ముదము – వడయుటలెస్సా
సతిపతుల మతులు గలయక
శతకోటి ధనాదులున్న – సౌఖ్యము గలదే 582

ఆ.వె. క్రాగుచున్న యెసరు – కడురొద సేయును
బ్రాలుపడఁగనడఁగు – ద్రోలయట్లు
భారమెద్దియైనఁ – బైఁబడ సరులకుఁ
బక్వమగునులోని – భావమెల్ల. 583

కం. పావన జీవన భావన
ధీవరులకె గాక కలుష – ధిషణులకగునా
దేవా ధీశుండైనను
సేవా ధర్మంబె మెచ్చి – శ్రీలనొసంగున్. 584

ఉ. సత్యదయానశాంతసయసంభృతసత్కృతి భారతీయదాం
పత్యము సర్వధర్మముల పావనకేంద్రము కానఁ దన్మహా
న్నత్య మెఱింగి వర్తిలుమనారత మాపరిశుద్ధధర్మమే
నిత్య మమోఘనిర్మలపునీతకళల్ సమకూర్చు నీకిఁకన్. 585

మ. పతిమాటన్ జవదాటకమ్మ గురుసేవల్మానబోకమ్మ స
ద్వ్రతదీక్షారతి పీడకమ్మ సఖులన్ బంధుప్రజానీకమున్
సతతం బాత్మసదృక్షదృష్టిఁ గనుచున్ సాధుల్ శ్రితుల్ వేడఁగా
సతిమాత్రమ్మ యొసంగుమమ్మ కలదమ్మా మేలు నీ కెంతయున్.

కం. సరసుఁడు చదువరి వరుడుం
గరుణారసచిత్త యత్త కావున వారే
కరణీవధిం త్రటునడుపుము
పొరుగిండ్లకు నుబుసుపోక పోకుము పుత్రీ! 587

తే. కోరి పెద్దల దీవన – కోలలంద
ఖ్యాతిమీఱఁగజీవన – జ్యోతి వెలుఁగు
నాయురారోగ్య భోగభా–గ్యములు గలుగ
లీలమిమ్మేలుగాత త్రి–లింగ జనని 588

తే. చేతధనమున్న లేకున్న - జేతలందు
నేకరీతిగఁ జూడుని - న్నేలువాని
నపుడె సద్గుణవతివని - యంద్రుబుధులు
దాన నీ జీవితముకడు - ధన్యమగును 589

తే. పుట్టినిలుమెట్టినిలునీదు - పూతచరితఁ
బుణ్యమును గీర్తియును బడసి - బొందవలయుఁ
గన్నవారలమగుటచేమా - చిన్నతల్లి
చెప్పుచుంటిమి మామాటఁ - జెవినిబెట్టు. 590

కం. పెద్దల దీవనలం దఁగ
నొద్దికమై మెలఁగితద్ద - యోర్పునఁ బతికిన్
ముద్దుగ సేవ లొనర్పుము
హద్దులు దాఁటకు శుభంబు - లమరుసుబిడ్డా. 591

కం. సేవాధర్మము గొప్పది
పావనమొనరించునద్ది - పరహితమతినిం
దేవతలాదృతిఁ జూతురు
కావున నద్దాని మఱవఁ - గాఁదగదమ్మా. 592

కం. సత్యము నారాధింపుము
సత్యమ్మె సర్వధర్మ - సమ్మేళనమౌ
సత్యము నిత్యము శ్రేయ
స్సత్యంతముగూర్చి కీర్తి - సౌభాగ్యమిడున్. 593

కం. కొండెము లెప్పుడు సెప్పకు
నిండుమనసుతోడ నుండు - నీమగఁడెప్డే
దండించిన మాటాడకు
ఖండేందు ధరుండు నిన్నుఁ - గాచుతసతమున్. 594

శా. ధీచాతుర్యకళావిలాసముల మా - దేవిన్ క్షమాదేవిబు
క్ప్రాచీనాద్భుతయుక్తియుక్తవచన - వ్యాపారపారీణ దృ
గ్రోచిన్మూర్తి ముదబ్ధిముంచు హరికా - రుణ్యాంతరంగుండుని
న్గాచున్ శ్రీలనొసంగుచున్నతముచ - క్కన్నిక్క మోపుత్రికా 595

తే. ఎప్పుడేవస్తువుల నీకు నిచ్చవోడము
నప్పుడయ్యవి గబురుతో నంపఁగలము
దూరభారమ్మునాక సంతోషపడుచుఁ
బోయిరావమ్మ శుభములఁ బొందుమమ్మ. 596

మ. అని యాశీఃప్రసవాళిఁ జల్ల శకటంబాయ త్తమై నిల్చుటల్
గని సీతమ్మయు వెళ్ళివత్తుననఁ జిక్కంబట్టఁగాఁ జూచినం
గనులస్నీరు స్రవింప నూపిరితలల్ గంభీరులై నిల్చిరౌఁ
గనియుంబెంచిన తల్లిదండ్రులొగి దుఃఖంబాపుకోనేర్తురే ? 597

కం. సుమహిత హితసూ క్తి సుమ
భ్రమరమ్ముగ సీతమనసు రాజిలు కతనన్
సుమనః ప్రమోద వ ర్తన
మమరఁగ నిహపర సుఖంబు లందుట యరుదే. 598

వ. ఇట్లు సీతమ్మ పుట్టినిల్వీడి యత్తవారింట కరిగె. కొలఁదిదినమ్ము
లకు సీతాద్వితీయుండై రాములు బొంబాయికేగ శుభసమయము నిశ్చ
యించుకొనియె అనాఁడు. 599

కం. నెత్తావుల లతకరణి ను
దాత్తాంబర కనక భూషణాలంకృతయై
యత్తన్వి యత్త చిత్తం
బత్తఱి సరయుచు విరాస నాయత్తపడెన్. 600

వ. అత్తఱి లక్ష్మీసుతుండు హరిహరప్రార్థనాయత్త చిత్తుండై గృహిణీ
సమేతుండై. 601

శా. దైవారాధన దివ్యశ క్తివిదికి - త్సాశూన్యహృత్పద్మఁడై
నీవే సర్వజగన్నియంతవని హృ - న్నిరేజ పీఠస్థలిం
దేవాధీశుఁ బరాత్పరున్ రుచిర మూ - ర్తిన్నిల్పి ధ్యానింప స
ద్భావశ్రీఁజనెఁదద్గృహంబునకనం - తఖ్యాతి సంధిల్లఁగన్. 602

వ. చని ముకుళితకరకమలుండై. 603

సీ. మీనమైసోమకు - మిత్తివాతంబెట్టి
యెలమిశ్రుతుల్వేధ - కిచ్చితీవ
కూర్మమై మందర - కుధరమ్ము మోసియ
మృతమును సురలకం - దిచ్చితీవ
కిరవై హిరణ్యాక్షు - గీటడంచి భువన
బాధల బహుభంగిఁ - బాపితీవ
నరహరివై హిర - ణ్యకశిపు నఖహతిఁ
జీల్చి ప్రహ్లాద ర - క్షించితీవ
వటురూపధారివై - బలినియాచించి దే
వేంద్రునకే స్వర్గ - మిచ్చితీవ
పరశురాముండవై - పగగొని నృపతుల
ముయ్యేడు సారులఁ - మొత్తితీవ

తే.గీ. రామకృష్ణావతార వి - ఖ్యాతివగుచు
రావణుని గంసువధియించి - రాణమీఱి
బౌద్ధకలికి వేషముల భూ - భారమణఁచి
భక్తవర్యులఁ బ్రోచితి - పద్మనాభ 604

ఉ. చారుశరీరధారివయి - సజ్జన రక్షణ దుష్టశిక్షణా
చారవిహారహారివయి - క్ష్మాస్థలిఁబుట్టుచు వౌరయీరసా
భారముఁదీర్పి నేర్పరివి - భక్తజనావన నిత్యపావనా
కారుణికాయు పేంద్రమముఁ - గావరతిర్పతి వేంకటేశ్వరా 605

కం. నందనవనమునఁ బద్మను
గందోయికి విందుగాగఁ - గనికడుఁ బ్రేమన్
మందస్మితమున ధృతినా
యిందువదనఁగోరు వేంక - టేశా జోతల్ 606

చ. అలమటలేక యా వకుళ - కంతయుఁ దెల్పిచనంగఁజేసియున్
సిరమతి నిల్వలేక కడు - శ్రీఘమ పద్మను బెండ్లియాడఁగా
నెఱుకలసాని వేసమున - నేగిన జిత్తులమారి శ్రీహరీ
పరమదయాంతరంగమునఁ-బాలన సేయుము వేంకటేశ్వరా 607

కం. పంకేరుహవాసిని సిత
పంకేరుహజాతజనని – పంకజపాణీ
పంకాంధతమసహారిణి
పంకేరుహనేత్రురాణి – పంకజపాణీ 608

కం. అకాశరాట్టనూజా
లోకావన వేంకటేశ – లోలా త్రిదశా
నీకముసోఁకినయటుమము
సోఁకుము పద్మావతీయ – జస్రము కరుణన్.609

కం. జలజాక్షుని ప్రియురాలా
కలకాలము మమ్మునేలు – కారుణ్యనిధీ
యలమేలిచ్చెడి తల్లీ
యలమేల్మంగమ్మ నిన్ను – నాత్మం గొలుతున్. 610

శా. నాలోపంబులడంచి సత్యపదనం–ధానార్హుఁగాఁజేసినా
కాలుష్యంబులఁబాపి ప్రోవుమభవా – కైవల్యదాతా యుమా
కేళీలోల కృపాలవాల శివ ని – క్షే ద్రైకతే జోనిధీ
కైలాసాచలవాస దాసజన ర –క్షాభాస విశ్వేశ్వరా 611

శ్లో. గౌరీ హృత్కమలస్థితం జననుతం గంగాధరం శంకరం
సర్వేశం సకలార్థదం భవహరం సత్యస్వరూపం శివం
భక్తానందకరం ప్రసిద్ధ చరితం పాపౌఘ విధ్వంసకం
వందేహం సురమౌనిసేవితపదం శ్రీ కాశివిశ్వేశ్వరమ్. 612

శ్లో. వందేహం సకలార్థసాధనకరీం కైలాస భూభృచ్చరీం
గౌరీం హైమవతీం శివాంగిరిసుతాం చిద్రూపిణీం శాంకరీం
త్రైలోక్యాధిపపూజితాంఘ్రియుగళాం శంభుప్రియాం పార్వతీం
శ్రీమద్భక్తజనావనైకవరదాం శ్రీ రాజరాజేశ్వరీమ్. 613

వ. అని ప్రార్థింప 614

చ. సరసిజనాభ నీచరణ – సారసముల్భజియింతు భక్తిమై
దురితములెల్లఁబాసి శుభ – దోహద దృష్టి సతంబు కావరా. . .

పరమదయానిధీ సుజన — పాలన భక్తవత్సలా
సురవరవంద్య చక్రధర — సూరిజనావన వేంకటేశ్వరా. 615

వ. అని స్తుతము చేసుకొని తల్లి దగ్గఱి యిట్లనె. గర్భధారణ పోషాభ్యాం పితుర్మాతా గరీయసీ యని ఋషులంద్రు కని పెంచిన తల్లియే మానవునకుఁ దొలి దైవము. మన యభివృద్ధికొఱకు కాయమువడిన యిడుమలు మన మెఱింగినవియు. వారి లేఖాముఖంబున నెడనెడ జనయిత్రి క్షేమము లరయుచుండు—తప్పనట్లాచరింపుట లగ్గు. మన కమ్మంగన్న నాయమ్మకు మనలం గన్న యట్లు సంతసం బొదవు. జనని యాశీస్సు మనకు దిగ్విజయ మహస్సు. సమస్త దోషాంధకారాహస్సు. ఎంత సేవ చేసిన మాతృఋణము తీర్చికొనఁజాలము. మాతృప్రేమకు సాటిజగంబున మఱియొకటి లేదు. మాతృస్థానము సర్వోత్కృష్టమగుటఁ బ్రథమ పూజార్హము ప్రత్యక్ష దైవస్వరూపిణి దయారసవాహిని జనని. ఇది హృదిం బదిలపఱచుకొని వర్తించిన మనము భగవంతుని దీవన లందఁగలము. సుఖంబుండుమని మాతృదేవతకు వినయవినమితగాత్రుండై జోతలర్పించి సెలవుంగైకొనె. సీత యత్త కాళ్ళ కత్యంత భక్తి మ్రొక్కె. 616

క. క్రొక్కాఱు మెఱుఁగుఁ దెఱఁగున
నక్కాంతారత్న మంత నత్యాసక్తిం
జక్కదనమ్ముల కిక్కయి
చక్కందన భవ్యుని వెస్క సాగనంపెన్. 617

వ. పావదూకంఠసు లక్ష్మీమతసూనంతు సుహృద్బంధు బృందంబు నుండి వీడ్కోలు వడయుచు. 618

తే. ఇంగితజ్ఞాన సందీప్తి నిరుగు పొరుగు
పిన్న పెద్దల డగ్గఱి ప్రియము పలికి
చిలుకలుం గోరువంకల చెలిమి కలిమి
నవమిథున మేగె బొంబాయి నగరమునకు. 619

ప్రథమ భాగాంత ప్రార్థన

వ. సజ్జనరంజన దుర్జన భంజన కిల్బిషఝూఝ ప్రభంజన యపవర్గధన నిధి దర్శన భాగ్యద పాద రజోంజన నిరంజన. 620

శా. నీ నామాక్షరపంక్తి దివ్యమహిమా - స్వీతక్రియాయుక్తమై
నానాగానవగానసాబ్జిరవియై - నాకేశ దిక్పాలకా
నూనోచ్చారణ యోగ్యమై భవహరో - ద్యోగైక శక్త్యంకమై
జ్ఞానానంద పయప్రభాపటలమో - గా వేంకటేశప్రభూ 621

ఉ. కోపముదేల తండ్రి నినుఁ - గోరి భజించెడి భక్తిభావనో
ద్దీపకమైన బుద్ధినిడి - దీపము చీఁకటిఁ బాపినట్లు నా
పాపము లెల్లఁ బాపి భవ - బంధచయంబుల గల్చి కావరా
నీ పద పద్మము ల్గొలుతు - నీరజలోచన వేంకటేశ్వరా! 622

శా. కళ్యాణాత్మకమైన నీ కరుణ నా - కాంక్షించి పూజింతుని
స్తుల్యానంద మొసంగరా శుభకరా - శోభాకరా శ్రీకరా
కాల్యోజ్జ్వల్య కళా ప్రదంబయినత్వ - త్కారుణ్య సత్త్వక్రియా
లౌల్యాభాసిగఁజేయరా విజయలో - లావేంకటేశప్రభూ! 623

ఉ. నారదతుంబురాది సుర - నందిత గాయన గాయనీ మణీ
సారమనోజ్ఞగానరస - సాగర వీచిక నోలలాడుచుం
గోరిన భక్తవర్యులకుఁ - గోర్కు లొసంగు మహానుభావ మా
ఘోర దురంత పాపతతిఁ-గూలిచి ప్రోవుము వేంకటేశ్వరా. 624

చ. అభినవ దివ్య తేజమున - నార్తులఁ బ్రోచెడి పద్మనాభ నీ
విభవము నెన్నఁగాదరమ - వేధకుఁ దత్పతికేని శ్రీహరీ
త్రిభువనరాజ్యచక్ర మతి - ధీరతఁ ద్రిప్పెడి నీదుహస్తమే
యభయ మొసంగునంచెపుడు - నాత్మఁదలంచెద వేంకటేశ్వరా.

కం. కమనీయ రూప కాంచన
రమణీయ మణీ కలాప - రాజితచాపా
సుమనో హృద్గృహదీపా
సుమహిత భాస్వత్ప్రతాప - సురగణభూపా. 626

శా. మాయాబ్ధి ప్లవమాన సర్వజన క - ర్మవ్రాతజాతక్రియా
స్థాయింభావన నిర్ణయింపఁ గల వి - శ్వప్రౌఢి నీకుంటమ
ధ్యేయంబౌ భవదీయ పాదములఁగీ - ర్తింతు న్సదాభక్తిచే
నా యీ బంధము లెల్లఁ బాపి పరమా - నందంబుఁ జేకూర్పరా.

# గద్యము

ఇది శ్రీమద్గౌరీ శంకర పరప్రసాద లబ్ధ సహజ చతుర్విధ కవితా
కళా విలాస సాహితీ రస వికాస సంస్కృతాంధ్రాది
బహుభాషాగభీరమనోహరభావ బంధుర మహోల్లాస
భాస బండ్ల పిచ్చమ్మా పిచ్చయాహ్వాయ పౌత్ర
యాదమ్మా వేంకటసుబ్బయార్య జ్యేష్ఠ పుత్ర
యన్నపూర్ణా సావిత్రీ కళత్ర సుబ్రహ్మజ్ఞన
విధేయ సుబ్రహ్మణ్య నామధేయ ప్రణీ
తంబైన యాంధ్రమహాభ్యుదయ
ప్రథమ భాగము.



678 KAILASHPATHI

J B. KHANNA &
165/166 DEVARAJA

ప్రార్థన

శ్రీ నీనీవవలంతివాకృతిఁగనం — జిస్మృద్రనాత్మాను సం
ధానశ్రీ నపవర్గదుండ విది స — త్యంబింత సర్వజ్ఞ నీ
జ్ఞాన జ్యోతి మనోంబకంబున వెలుం — గంగోర నీవానతిన్
రాణం గై కొనినట్టి దేవ దయనన్ — రక్షింపు విశ్వేశ్వరా. 1

శా. శ్రీలన్వెల్గు సితాద్రి కొల్వున సురల్ — వ్రీడందనున్వేఁడఁద
త్ఫాలాక్ష ప్రభవుంగు మారుఁగని తె — ల్పం దేవల బ్రహ్మయున్
జాలం జిల్గులొసంగ మెచ్చు శివుఁడా — చౌడేశ్వరీవల్ల భుం
డేలు న్మమ్ము దయార్ద్రదృష్టిమెయి నెం — తే సర్వకాలంబులన్. 2

శా. కన్నప్పం గజరాజముస్ హరిని పూ — ర్కండేయులూతందయం
గన్నారం గని కాచనాఁడపు గదా — కైలాసవాసా హరా
నన్నుం జూడు కటాక్ష వీక్షణములం — గాశీశ విశ్వేశ నీ
కన్నం దిక్కెవరయ్య నాకు ధరణిం — గారుణ్యావారాన్నిధీ. 3

శా. గంగాతీర్థములాడి భక్తి పరతం — గాశీశనిన్గాంచి వా
మాంగాశంగల యన్నపూర్ణఁ గని జో — హారుల్సమర్పించి సా
ష్టాంగంబొప్ప గణేశు మ్రొక్కి ఘనసే — వానంద నిర్మగ్నులై
భంగం బందనఘంబు భక్తులు మహా — భాగ్యంబుమై నుంద్రుగా. 4

మ. కవితా కల్పలతా వితానవిలస — త్కళ్యాణ కావ్యక్రియా
నవ చైతన్య కళా విభూతి నతి ధ — న్యత్వంబుఁ జేకూర్పవే
భవదీయోజ్జ్వల పాద పద్మముల నం — భావింతునో శాంభవీ
శివరాజ్ఞీ భువనైక రక్షణ మహా — శ్రీ రాజరాజేశ్వరీ! 5

శా. గౌరీశాంకరి శాంభవీ గిరిసుతా — కాత్యాయనీ యీశ్వరీ
సారాధార దయార్ద్ర పావనమతీ — శర్వాణి రుద్రాణి నే
నారాధింతును ద్వత్పదాబ్జముల నం — బా ప్రీతిమై సర్వవి
ద్యారాజ్యద్రమఁ గూర్పుమా భువన మా — తా రాజరాజేశ్వరీ. 6

శ్లో. నానారత్నరుచి స్ఫురన్మకుట భాస్వ ద్దివ్యతేజోనిధిః
శిక్షార్థాసురమర్దనీ శుభకరీ మాహేశ్వరీ శాంకరీ
మోక్షాసంపకరీ సదా జయకరీ జోతిర్మయీ శాంభవీ
భక్తౌఘార్చిత పాదపద్మయుగళా — మాంపాతు చౌడేశ్వరీ. 7

శా. భోగీశా భరణాత్మ తృప్తికర సం - పూర్ణ ప్రభాశోభితా
రాగద్వేష విదూర ధీరనుత స - ర్వా యార్యసంపూజితా
యోగీంద్రామల హృత్సరోజ నిలయ శ్రీ - తోద్యత్కళారూపిణీ
వాగీశాద్యఖిలా మరార్చిత పదా - బ్జా రాజరాజేశ్వరీ. 8

శా. బాలార్కద్యుతిమత్కిరీటము శిరో - భాగంబున న్వెల్గ ది
క్పాలాఖిల మహా మహోజ్జ్వల జయాం - క శ్రీయుతా స్త్రాయుధముల్
గ్రాలంజేతుల దివ్యకౌస్తుభకళ - ల్గ న్విందుగాఁ దద్రమా
కేళీలోలుఁడు వేంకటేశ్వరుఁడు ర - రక్షించు న్మము న్నిత్యమున్.

మ. తెలుఁగుం గడ్డన నిల్చి యాత్మరుచులం - దేదీప్యమానంబుగా
వెలుఁగం జేయుచు నెల్ల లోకముల హృ - ద్వీధిన్విలోకించుచుం
దెలుఁగుం బిడ్డల దొడ్డ ప్రేమఁ గనుచుం - దివ్యద్దయా దృష్టి స
త్ఫల మవ్వారలకిచ్చి ప్రోతువు గదా - పద్మావతీ వల్లభా. 10

ఉ. ఎంత మహాత్తో యే నెఱుఁగ - నెందఱొ భక్తులు వేలు లక్షలున్
సంతసమొప్ప నీదు పద - సన్నిధి నర్చన సేయుచుందురా
శాంతనివాసులైన భవ - దాకృతిఁ జూచి తరింపఁగోరి ను
స్స్వాంతముతోడ వత్తురు శు - భంబుల నిత్తువు వేంకటేశ్వరా! 11

తే. అల సహస్రారమున వెల్గు - వెలుఁగు వోలె
నేడు కొండల మేడ పై - నెక్కి వెలుఁగు
వేంకటేశ్వర నీ పాద - పంకజముల
భక్తి భజియింతు నన్నుఁ గా - పాడవయ్య. 12

శా. ఈవా పర్వత సీమపై వెలుఁగ మే - మీ నేలపై నుండి యో
దేవా కావుమన న్వినంగలవె నం - దేహింపకే ప్రోతువే
నీవే సర్వ జగన్నియంతవని హృ - న్నీరేజపీఠంబునన్
సేవింతున్నిరతంబు నీదు పదముల్ - శ్రీ వేంకటేశ ప్రభూ. 13

శా. కృత్యాకృత్య విచారిణీ సురమణీ - క్షీరాబ్ధి పీయూష భా
క్త్సత్యాభా ఘటధారిణీ జయ రమా - శోభా ప్రభా కామినీ
ప్రత్యాసన్న సురాసురేక్షణలసద్వాణీ జగన్మోహినీ
నృత్య శ్రీ వెలయంగ వచ్చి సుధనా - యా కైతలో నింపవే. 14



విష్ణు ప్రార్థన — నాగబంధము

చ. నగధర భూప నాగశయ – నా యమిసన్నుత కేశవా ధగ
ద్ధగితతనూ విరాగపర – ధారణచిత్తపయోధివాస యో
నిగమశయా సుభోగినుత – నీత సధర్మవిచార రౌచికా
జగదధినేత రాగభర – సార సుధన్వ సుచాత మాధవా. 15

తే. తను సవమాత పరాభవాం - బుధిని ముంచ
నీవ దిక్కని ప్రభుపుఁడగు వ - నంద పింపఁ
దత్తపోదీక్ష కెంతయుఁ - జిత్తమలర
శాశ్వత స్థాన మిచ్చిన - చక్రిఁ గొల్తు. 16

తే. మామరత్నాకరుండు నీ - మగువ సర్వ
భాగ్యముల కాటపట్టగు - పరమ సాధ్వి
సకల జగములు నీ కను - సన్న మెలఁగు
నిట్టి నీ దయగల్గ మా - కేమి కొఱఁత. 17

తే. మకర దంష్ట్రాక్రకచ న - మ్మర్దనమునఁ
బ్రాణభీతిని బ్రార్థింపఁ - బరమ కరుణఁ
జక్రమున నక్రము వధించి - సామజమును
సాఁకిన పరాత్పరా నిన్ను - సన్నుతింతు. 18

తే. పరమ భక్తుడు నాక దు - ర్వాసుఁ డమిత
కోపమున శక్తినంపఁ ద - త్క్రోధ మరసి
కరుణఁగావంగ భయద చ - క్రమును బంపి
యంబరీషుని బ్రోచిన - హరిఁ దలంతు. 19

కం. రక్షించిన శంకరునే
భక్షింపఁగఁ జూచినట్టి పరమద్రోహిన్
రాక్షసు భస్మాసురునిన్
శిక్షించిన యుక్తిపరుని - శ్రీహరిఁ గొలుతున్. 20

తే. బాల్యసహపాఠి యని మైత్రిఁ - బాయకుండఁ
బేద యటుకులె యడిగి సం - ప్రీతి మెక్కి
యిలఁ గుచేలున కైశ్వర్య - మిడిన విష్ణు
చరణ కంజాతములకు నం - జలి ఘటింతు. 21

వ. పరమ పావన చరణ దుష్టశిక్షణాచరణ కరుణాభరణ దీనజన రక్షణ భక్తాఘహరణ యనాథ భరణ దాసబాధా నివారణ సుజన నందిత నామస్మరణ విశ్వకారణ పరమ తపోధన వరవితరణ నిర్జర ధృష్ణి లోత్పలతోరణ రమారమణ యనవరతము మాకు శుభాశీస్సు లిమ్మా.

తే. అమల నిది కంజమునఁ గన - శాఖిశేఖర
మము బొనర్చునా నిరుదెస - నిధములలరఁ
సమ్మె గద్దియఁ గొల్వుండి - ఘనుని ప్రేమఁ
బాలఁగొను లక్ష్మి ననుదయఁ - జూడఁగొల్తు. 23

కం. అత్తకుఁ గోడలి కందగఁ
బొత్తెపుడుం గూడదంచు - బుధులంద్రు రమా
యత్తెలఁగునకుంగతమేదొ
చిత్తము రంజిల్ల నిజము - చెప్పుము తల్లీ. 24

తే. సృష్టికర్తగఁ బ్రఖ్యాతిఁ బెంపు సకల
వేద వేదాంత వేద్యుఁడై - వినుత విభుల
పుండరీకాసనంబునఁ బొలుచు బ్రహ్మ
యాయురారోగ్య భోగభా - గ్యముల నిడుత. 25

తే. శ్రుతుల సారాంశమెల్ల నా - శ్రుతుల సంప
స్రష్టవగుటను సన్నొప - స్రష్టఁజేయ
సత్య సౌజన్య సుజ్ఞాన - శాంతిఁ గూర్చు
వేలుపుం బెద్ద నిను వేడ్క - వేఁడువాఁడ. 26

కం. వాణికి హిరణ్యగర్భుని
రాణికి జ్ఞానప్రకాశ - రంజిత విబుధ
శ్రేణికి మణిగణవీణా
పాణికి వందనము దివ్య - వాక్కు నొసంగన్. 27

కం. వాదమున లలిత వీణా
వాదనమున నిన్ను గెల్చు - వారలు గలరే
నాద బ్రహ్మోపాసన
కాదిమ దేవత వటంచు - నారాధింతున్. 28

తే. నీదు వాహనమే క్షీర - నీరములను
వేఱుసేసెడి శక్తితో - వెలయ నింక
జ్ఞానరూపిణివైన నీ - సత్య మహిమ
మైహికాముష్మికజ్ఞాన - మాత్మ కిడదె. 29



## పుష్పమాలికా బంధము — లక్ష్మీదేవి ప్రార్థన

ఉ. అల జలజాలయా యహార - హమ్మిహా పాలన మానవానచం
చల బలశీల లక్ష్మి జయ - జప్య జనార్ధన గానమానసా
ఫలముల చాల నిచ్చి భవ - భ క్తిభరంబుగ భోగయోగ ని
శ్చల కల తూలనీకు సర - సత్వసమేత రసారతీరమా.



## సరస్వతీ ప్రార్థన-వీణాబంధము-(మంకెయునాతనస్సృష్టి)

ఉ. పావన బాసమాన గుణీ - పాలన సజ్జన లక్ష్యలక్షణ
శ్రీవిధి వేదమోదపద - ఉపహ్నా సుధారసరమ్యరాజ్యపా
పావృతజిత్ స్వభావ విజ - యా ఘనధీజనవంద్య సత్కళా
దేవి కృతీ యమోఘధృతి - ధీనిధి నీతిమతీ లసత్కృపా 31

(ఇందు సరస్వతీ నమోనమో - అని యున్నది)




చ. సకలకళాకలాప సర - సత్యసమేత సుధీసుఖాసురా
ప్రకటకథా కఠోర భవ - భక్తిభరా వరధీరతారతా
సుకమిఁక నీక మర్త్యశుచి - శుభ్రశుభంబది యేదిలేదిలం
గ్రకరకళంక మూడ్చి రమ - రక్షరహింగను పూను దీనులన్.



## పుష్పమాలికా బంధము—కుమారస్వామి ప్రార్థన

చ. పరశరజా రమాధవ భ – వ స్తవనీయ కళాకథాకరా
సురనరవారవంద్య శుచి – శుభ్రశుభంకరధీరశూర సా
దర వరదా రసజ్ఞ తను – తత్త్వతమోభర ఘోరతారకా
సురహర వీర గౌరిసుత – సుత్వసుధీధనదానమానసా.

శా. శ్రేష్ఠంబుస వాణి వాక్కు సను గా - రిందేహమందాత్మ స
ద్భావైక్యోన్నతిఁ దెల్పు నిల్పుకొను శ్రీ - వాక్పార్వతీ వల్లభుల్
ప్రాదిణ్యంబుస్ఁ గైతలల్లు కొఱకై - శ్వర్యాయురారోగ్యముల్
దేవాధీశులు మాకుఁ గూర్తురను ర - క్తిన్ నిత్యభిచ్ఛక్తితో.

ఉ. ముద్దుల పెద్దబిడ్డ యని - మోదముమైఁ దొలిపూజ కర్హతం
దద్దయునీఁ గృతజ్ఞతను - దాఁ దెలుపం గనకాబ్జపూజలం
బెద్దగఁ దల్లిదండ్రులకుఁ - బ్రీతి నొనర్చి తదీయతోషమున్
హద్దులు దాఁటఁజేసిన గ - జానను డిచ్చు నభీష్ట విద్యలన్. 32

కం. శిఖిలాస్యహృద్వినోదుని
సుఖదుని గౌరీ కుమారు - సుబ్రహ్మణ్యున్
సుఖభుజ్నాథ శరణ్యున్
నిఖిల శుభోదయ జయేచ్ఛ - నిచ్చలు గొల్తున్. 33

ఉ. నిప్పును గడ్డి తెచ్చుకొను - నిష్ఠమె యిం బ్రదికెన్ శివార్చనం
దప్పక నాదు తండ్రి కడు - ధన్యుఁడు వేంకటసుబ్బయార్యుఁడా
చొప్పు నెఱింగివర్తిలెవి - శుద్ధ చరిత్ర మదీయ మాత నే
నెప్పుడు తత్పదాబ్జముల - హృత్కమలంబున నిల్పి కొల్చెదన్. 34

శా. ఇమ్మాడ్కిందలి దండ్రు లీ తనువు నా - కీయంగదా వాణి రూ
పమ్మొ సత్కృతులాంధ్రభాష సృజియింపం దన్మహాభూతిని
త్యమ్మిశాను భజింపఁగల్గితి నిఁ కా - త్మంజోత లర్పింతు నా
దమ్మా వేంకటసుబ్బయార్యుల కమం - దానందముం బొందుచున్.

ఉ. పూతమనోవికాస పరి - పూర్ణ కటాక్ష విలోకనక్రియం
జాతికి ఖ్యాతిఁగూర్చు ఘన - సజ్జనవర్యహితైక భావయు
జ్జ్యోతిమణీ ఘృణీగణ పునీత కథా కథనైకభాక్కళా
జ్యోతి వెలుంగఁ జేసిన మహోజ్జ్వల మూర్తులకేను మ్రొక్కెదన్. 36

ఉ. వేయి వచింప నేమి పని - వేయి కరంబులు వేయి నేత్రముల్
వేయి తలల్గలారలకు - వేయి తెఱంగుల నల్లఁజెల్లు నం

దేయది గాంచినం జగము - నే మఱపించు నరుండవైన (నా
కాయ సమానశక్తి పరమాత్మ! యొసంగు దయార్ద్రదృష్టులన్. 37

వ. మాటలా ముత్యాల మూట, అలంకారములా రత్నాలపేటికల్, నీతులా నచ్చీలమునకుఁ గంచుకోటలు, భావములా యాత్మజ్ఞానమునకు రాచ బాటలు, రసములా యమృతపు టూటలు, ధ్వనులా గంధర్వ గజరాజ గమనల పాటలు, వ్యంగ్యములా దేవకన్యల యాటలు, వ్యుత్పత్తులా వాణీ హిరణ్యగర్భుల పీఁటలు, కథాకథన విధానములా సత్య సుసంపాదము లైన తేనెవాఁకల తేట లనంగనత్కమనీయ కవితా కళాచణుండవగుచు నన్నుగ్రహింపు మని జోటింగునకు జోహిళ్ళోనర్తు. 38

# బాపూజీ

ఆ.వె. కాళ్ళ చెప్పులల్ల - కుళ్ళాయ కొల్లాయ
కనుల జోడు చేతి - కఱ్ఱదనరు
బోసినోటి తాత - వాసికెక్కిననేత
నిఖిలగుణ విజేత - నీకు జోత. 39

చ. గతి భగవంతుఁ డంచుమది - గట్టిగ నమ్మితి వేయి చిక్కులే
వెతగలిగించినం బరుల - పీనము వేఁడన వేలు సాహితీ
హితు లెవరీర కీడొరుల - కెన్నడు సేయన యాత్మనొత్తు బా
ధితులను గన్నఁ గొల్తు నిను - దేవుని దూతగ గాంధితాతయా. 40

మ. ఒక పక్షస్థితిఁ గ్రీడి కొక్కనికె విశ్వసోదగ్రగీతా గీత వా
రక బోధించెను కృష్ణుఁడీ ప్రతిటి సారథ్యా న రథ్యాస సే
వక మార్గాన నహింస నూఁది జయ సౌభాగ్యచ్ఛటల్లాప్పితీ
విఁక లోకైక గురుండవైతి నవసాహిత్యాబ్జ భానుండవై. 41

ఉ. పుట్టువుతోఁ బశుత్వమునఁ బొల్చును మానవుఁ డద్ది యెట్టులో
నెట్టఁ దలంచి విద్దెలను నేర్చును బొట్టకు దైవతత్త్వపుం
గుట్టు నెఱింగి జ్ఞానియగుఁ గోవిద బృందము సన్నుతింప నీ
మెట్టులనన్ని దాఁటితివి మేరు శిఖాగ్రము నెక్కి నిల్చితే. 42

ఉ. భారము నాకయీ భరత పర్యటనమ్మున వచ్చితయ్య మా
యూరికి రెండుసార్లది మహోత్సవ మేఁ బసివాఁడ నిన్నుఁ గ
న్నారఁగఁ గాంచి మ్రొక్కి వినయాన వచోమృతమాని దేవుఁ డీ
తీరున వచ్చెనంచెదసుతించితిధన్యుఁడ నంచు నెంచితిన్. 43

చ. సకల మెఱింగినట్టు లొక చక్కఁదదన్య మదొక్క చోట వే
ఱొకదిశ సేవకుండసని యోరిమి కూరిమి గ్రుమ్మరించి యిం
కొకదెస కౌరవేంద్రువలె నుద్ధతి నూపను జేఁతవ్రాఁత లం
గొకి టికి కోఁత లెన్నడును గోయనమాయికు లెల్ల మెచ్చగన్. 44

ఆ.వె. వెండి కొండనెక్కి నిండు చందురు దాఁటి
యమర వరుని నెట్టి యమృతమాని
వెల్లటేన్గు నెక్కి ముల్లోకముల నేలు
నీదు కీర్తి కాంత నిర్మలముగ 45

కం. దిక్కుం గానని దీనుల
దిక్కై జగ ముద్ధరించు ధీరుఁడ వగుటం
దక్కిన నాయకు లనియెడి
చుక్కలలోఁ జంద్రునట్లు శోభిలుదువయా. 46

కం. నాకంటె వృద్ధు లెందఱొ
నీ కతలన్ వ్రాసియుంట నే వినియుంటన్
నీ క్రియఁ ద్యాగి యొకండీఁక
నా కెటు లభియించు నని మనంబునఁ దలఁపన్. 47

కం. పాసెను ప్రాణము దీక్షం
గాసిలిరాముండు గమ్య గమనము నందున్
వ్యాసుని మించిన శుకుఁ డని
వాసింగనినట్టి తెనుఁగు వాఁడని మెచ్చన్. 48

కం. గీసిన గీటును దాటక
నీ నరసన్ మెలఁగి నలఁగి నిశ్చలమతి నీ
వేసిన యడుగున నడుగును
వేసిన త్వచ్ఛాత్రు కథను వేకై కొంటిన్. 49

కం. రాజ్యము రాష్ట్రము దెచ్చిన
పూజ్యుల చరితంబు లిందుఁ బొలుపుగనుంటన్
బ్రాజ్యమ్ముగ ప్రేమమ్మునఁ
బూజ్యమ్ముగఁ జూతురంచుఁ బొందుదుఁ దృప్తిన్. 50

కం. నరనారాయణ చరితము
కరణిందగు సమరజీవి గాంధీ గాథా
కరమగు గ్రంథము వ్రాయఁగ
సరసులు ననుఁ బ్రేచి రెంతొ సంతోషముమై. 51

తే. పాడినదె పాడరా యింకఁ బాచిపండ్ల
దాసరీ యన్న పోలికఁ దనరు నెన్నొ
వాని నన్నింటి నటుగని వలయు రీతిఁ
బ్రాఁత క్రొత్తల కలయిక వలతుఁ దలఁతు. 52

అ.వె. ఒక్క కతనె చక్కఁ బెక్కురు రచియింప
వాని మ్రోల నిలిపి వలచి మలఁచి
తనదు నుడుల దానిఁ దగ సృజింపగవచ్చుఁ
గాని క్రొత్త సృష్టి కేను దవిలి. 53

ప. పెఱ చేతుల నలఁగని పూవుం దావి గల దానిం గోరితి. పండియు నెండియుఁ గూలియుఁ గాలియు గమ్మనఁ బరీమళమ్ములఁ జిమ్ము శ్రీ ఖండము కావ్య వస్తువుగ నుంట ముదమ్ము గూర్చు ననుకొంటి. ఎట్టకేలకు లభించుట మిన్నందితి. సార్వకాలిక సార్వజనీన సముజ్జ్వల సత్య సమరస జీవకళా విలాస యుక్తముగ దాని సృజింప సంకల్పించితి. సృజనాత్మక శక్తి నన్ను నేఁ బరీక్షించుకొనఁ దలంచితి. సమస్త భారము సర్వేశ్వరునిపై నిడి సమగ్ర సామగ్రి సమకూర్చుకొని యేతత్కృతికిం గంకణము గట్టుకొంటి. ఇందు గురు శిష్యుల గుణగణముల ననువుగ వర్ణించుట కవకాశము సిక్కుట నా యదృష్ట మనుకొంటి. ఈ యుగమున భారత స్వాతంత్ర్య సమర ప్రపంచమున నిను వీడి నీ చట్టుం గొని యాట దిన కరు వదలి సుధాకరు వర్ణించుట. మీ యుర్వరయాత్మ లాశీః కల్ప కుసుమంబులు వర్షించుచుండ భగవంతుఁడు నాకు

బొసటుప్పై నా కలము నడిపించుఁ గాత. నాత్మైతం దన మహిమ్మ
నింపుఁ గావుత. 54

ఆ.వె. హృదయమందు నేది యెంచెదో యది వల్కి
పలికినట్టి యన్ని పనులు సల్పి
ముక్తిపొంద మంచి మూల మంత్రము దెల్పి
యిట్టిగాని కీవ యొజ్జ వైతి. 55

ఆ.వె. ముఱికిలేని యద్దమున బింబ మట్టుల
యచల జలము నందు నర్కు నట్లు
నిర్మముండవౌట నీలోన కాన్పించు
నీశు కళఁ దలంతు నే భజింతు. 56

తే. ఎన్ని యుగములకైన నీ కెనయనఁ దగు
వాఁడు పుట్టఁడు పుట్టుఁ బో - వాఁడు నిన్ను
మించఁజాలఁడు పైమెట్టు గాంచఁ జాలఁ
డఖిల మానవశక్తి కీవవధి వగుట. 57

కం. కల్లరయుఁ గపట మెఱుంగని
తల్లియుఁ దండ్రియును స్వార్థతంత్ర విముఖులై
మెల్ల వయనమునఁ దనియుటఁ
గొల్లలుగా ధనము నాఁడుఁ గూడద మాకున్. 58

ఉ. పుట్టితిఁ బేదగా సతము పొట్టకు బట్టకుఁ జెమ్మటోడ్చి తిం
బట్టము లందితిం బరమ పావన వర్తనమే వరించితిన్
నెట్టితిహైన్య దైన్యముల నీ నుతికై కలమిడ్డ వట్టితిం
బుట్టువుతోఁడఁ బుట్టినదిపో సుకవిత్వము నాకు బాపుజీ. 59

శా. గౌరీ శంకర పాదపద్మ భజనాక్రాంతాత్మ తేజోభవ
త్సారోదారకళా కలాప కవితా సామ్రాజ్య సమ్రాట్టు నై
రారాజన్నవదివ్య కావ్య రచనా రంగ జ్జగన్మోహినీ
కారుణ్యామృతపాన తృప్త సుమనః కాండుండనై యొప్పెదన్. 60

ఉ. గుండెలనొడ్డి దాస్యఫణిఁ గూల్చుట మానవ పుణ్య సస్యముల్
పండిన పంటవౌట నపభారత భాగ్య విధాత వౌటచే

ఢోండ కటాహ కర్పర మహమ్మ గలించి క్రమించి మించ భూ
ఖండము లన్నియుం భవదఖండ యశఃప్రభ మున్నియుండెరా. 61

ఉ. లోకవుఁ బోకడల్దెలిసి - లోలతలన్ సడలించి సత్కళా
నీకతపస్సు సందితి వి - నీతుఁడనై తను వేఁడు దైవమే
సాఁక నిరంత రాయముగ సాహితి కల్పక శాఖ లన్నియుం
బ్రాకి ఫలాళిఁదుల్చితి స్ఫురద్గుణు లెల్లరు కోరి మెక్కఁగన్. 62

చ. కలిమికి లేమికి న్నడుమ గట్టితి వంతెన దాని దాఁటి నేఁ
గులుకుచుఁ జేరితిం గుసుమగుచ్ఛ సుధా కలశేద్ధసౌధమం
దలి యమృతమ్ముఁ ద్రావితిని ధన్యుఁడనైతిఁ దరించె జన్మ మీ
యిలఁ జెమడోడ్చువారు పరమేశ్వరు దీవన లందకుందురే. 63

ఆ.వె. ప్రకృతి పుస్తకమ్ము - పరమాత్మ గురువరుఁ
డను భవైకవేద్య మదియ విద్య
దాని మహిమ దెలిసి దైవతత్త్వ మరసి
జీవయాత్ర సుఖము సేసికొందు. 64

శా. నీ రక్తంబును బిండి తెచ్చితివి తండ్రీ! యీ స్వరాజ్యంబిఁకం
ధీరోదాత్తులరై స్వధర్మరతులై దేశంబుఁ బాలించుఁ డం
చేరీ నూటికి నొక్కఁడైనఁ గలఁడే యీ వన్న యట్లుండువాఁ
డేఁ రూపంబున మాఱునో చరిత యే దెట్లౌనొ దైవేచ్ఛమై. 65

శా. సాధుల్ ఛాత్రులు నిన్నుఁ బోలిన ఘనుల్ స్వర్గస్థులై రెందఱో
నీ ధర్మంబులు మంటఁ గల్పిన జనుల్ నీ సంఘపుం బేరితో
ఖాదీ కట్టి స్వలాభకల్ప ఫలముల్ కాంక్షించి కాలూఁదిరిం
కేదీదారి విశుద్ధ వర్తనుల కిప్డీదేశమం దెచ్చటన్. 66

తే. బెండ్లు మున్గుచు నక్కటా గుండ్లు తేలు
చున్నవిఁక నీతి గలఁడెందునున్కియరుద
చెప్పనేటికి నీ ప్రియశిష్యుఁడైన
పొట్టి శ్రీరాము మరణమే ముఖ్య సాక్షి. 67

ఉ. ఎందఱు బుద్ధులైరి మఱి యెందఱు లింకనులైరి యింక వే
ఱెందఱు క్రీస్తులైరి జగమెన్న మహమ్మదు లెందఱైరి యే

రెందుకుఁ బుట్టిరో యదియ యిచ్చట ముచ్చటగా నొసర్చి తా
రందు యశమ్ము నొంది జయమంది పరాత్మరుఁ జేరకుందురే. 68

తే. నీవు సెప్పిన నీతులు నీక కాని
మంచి గమనించి తగ నాచరించువాఁడు
కోటి కొక్కఁడు దొఱకఁడ న్మాట నిజము
నీదు మరణంబ దానికి నిత్యసాక్షి. 69

వ. మీ మాట మాటే. లోకపు బాట బాటే. 70

తే. నాఁడు నేఁడన నేల యేనాఁడు గాని
యెల్లరకుఁ బట్టు నను మాట కల్లమాట
చెప్పువారలు లేకయ చెడెనె చెప్ప
వినక చెడిపోవుచున్న దీ విశ్వ జనము. 71

తే. నీవు జీవించి యున్నచో నిన్నుఁ గూడ
నిక్కముగ మూల కెన్నడో నెట్టి యుందు
అట్టి స్థితి పట్టకయ మున్న మరపురికి
నరిగి ప్రజపాట్లు దివి నుండి యరయు దయ్య. 72

తే. ధర్మనిష్ఠా గరిష్ఠుఁడై తనరు నెవఁడు
వాఁడు సముచితస్థానమ్ము వడయుఁ డనెడి
శంకవొడమెడి లోకము వంకఁ జూడఁ
గట్టకడ కిదియే యొడ్డు పట్టఁగలదొ. 73

కం. ఖద్దరు గట్టిన మాత్రన
గద్దెకు నర్హుండ యైనఁ గట్టక యుండ్రే
యొద్దిక నెల్లరు నందఱు
నిద్దేశాధిపులఁజేయు - దే నీవున్నన్. 74

తే. పారమార్థిక దృష్టిలో - పంబు వలన
నరుఁడు స్వార్థైకలోలుఁడై - పరగుకతన
నర్హతా నర్హతల నెవ్వఁ - డాత్మఁ దలఁచు
నందినంగోసికొంటకే - యభిలషించు. 75

తే. పాటిలో వెంద్రుకను దీసికొనఁగ లేని
యతఁడ కోటికిఁ బడగెత్తినట్లు చూడఁ
బెక్కు తెలుఁగుల వలఁతి తానిక్కు దక్కి
శాంత గంభీర ముద్రతో జరుపు బ్రదుకు. 76

చ. వినయము ముచ్చుకైనఁ గనిపింపద లోకుల సొమ్ము సర్వదా
వినయము దోఁప దోచుకొను వేడ్కల కంతొక యింతలేద మె
త్తని నరుఁద్రొక్కఁజూతుర కుతంత్రమె పాలనసేయునా కటా!
యనుకొనఁ గడ్పు చెర్వగు మహామతి రాజ్యము తుచ్ఛ భోజ్యమా.

తే. నీవు జీవించి యుండంగ నీదు సూక్తి
కెదురు నడచిన జెట్టు లీయద నెఱింగి
ఖద్దరు ధరించి పెద్దలై హద్దులేక
సర్వమున్ మ్రింగఁ జేతులఁ సాతు రకట! 78

కం. ఇత్తఱి బత్తిని నీపే
రెత్తిన నిది యేదొ మంచి యెత్తును కొంద్రీ
సత్తెము నెఱిఁగియ యస్మ
చ్చిత్తంబి త్తెఱఁగు మనవి సేసెదఁ దండ్రీ. 79

మ. పదిరెండేడుల యీడు నా కపుడు మద్భాగ్యాతిరేకంబుసం
గుదిరెన్ని పయిభక్తి స్వార్థమునకై ఘోరాతి ఘోరమ్ముగా
నదిఁనే నెన్నడు నమ్మ నమ్ము మిది సత్యంబైన సత్సేవకున్
బదికోట్లేఁడుల యాటకల్లయని సంభావింతు సాధూత్తమా. 80

తే. నాఁడు సత్యాగ్రహమ్మున — నలిగి నలిగి
తనదు సర్వస్వ మర్పించి — ఘనతగన్న
త్యాగు లెంద ఱొదివిఁ జేర — భోగు లిపుడు
పెత్తనమ్మను సుధ గోరి పెనఁగు చుండ్రు. 81

కం. ఢిల్లీ సింహాసన మిఁక
నెల్లరకున్ హక్కు దక్కె నెక్కఁగననగా
నొల్లమిసేయున పేడియుఁ
బెల్లు బుకుచుఁ జంక లెగుర వేయును గానీ. 82

కం. ధన మధికారము జనబల
మనునవిగల వేమిసేఁత – కడ్డు కలుగునే
యని తారతమ్య మరయక
వినయము వోనాడి విఱ్ఱవీఁగందగునే. 83

తే. దోచుకొని దాచుకొను చుంట – దురిత మనుచు
ధర్మపాలన కాంక్షించు – ధన్యుఁడేడి
యీ స్వరాజ్యంపుఁ బోకడ నింతగనిన
నాక మొనరింపఁ బోవంగ నరక మగున. 84

తే. కనక కాంతాధికార నిగ్రహము దొఱగి
యీ మిషమునకు ఱివ్వన నరుగు నట్టి
డేగ గుంపుగ వానికై డీకొను మన
ప్రజల మతి నీతి యేరీతిఁ బ్రబలఁ గలదు. 85

ఉ. మంచి జయించు వాంఛమెయి – మ్రగ్గితి దేవునిమీఁద భారమే
యుంచి శ్రమించి సత్ఫలము – నొందక కుందితి నూటికొక్కపా
ల్గాంచఁగనైతి ధర్మమది – గాథల బాధల డాగియున్నదో
యెంచఁగ జాల జాలిగల – యెద్దకు సత్యము గోచరింపదే. 86

వ. పెక్కు కారణంబులఁ గొన్ని యెడల చరిత్ర యెందఱికో మహా మహులకే పాయని యన్యాయ మొనర్చె. దాని దుష్ప్రభావము నాపై బ్రసరింపఁబడకుండుఁ గాత. మజ్జీవిత కథా సత్యాంశములు మాత్రమ దివ్య జ్యోతులై వెలుంగుం గాత. 87

కం. దూరవుఁ గొండలు నునుపను
తీరునఁ బరుఁ బొగడి యాంధ్రు ధీరుం దెల్లుల్
నేరర కీర్తింపఁగ నని
వారక యక్కొఱత దీర్పవలచి నిలిచితిన్. 88

వ. ఈనాఁడీ నాటం గల పరిస్థితులు కడుంగడు నసంతృప్తికరము లగుట దేవలోకంబునందున్న నీవు యుష్మద్దివ్యశక్తి నిప్పిషయంబునం బ్రసరింపజేసి చక్కఁజేయుచు నీవు నాటిన నూతన బీజము లెల్ల మహా వృక్షములై నిత్యఫలవంతములై యనుభవైక యోగ్యములై దేశ

ముజ్జ్వల భవిష్యత్తుతో నలరార శుభాశీస్సు లొసంగుదు వను నాశ
నిట్లు మిమ్ము స్మరించుచున్నాఁడ. 89

# ఆత్మ ప్రత్యయము

తే. అర్థ నీ యార్థ కలితవాక్య ప్రభూత
నిత్య నిర్మల విశ్వ జనీన సత్య
దివ్య రసపూరితంబయి – తేజరిల్లు
కావ్య రత్నంబుఁగాదనఁ గలఁడె నరుఁడు. 90

కం. పలుకుల రసఝురు లొలుకఁగ
లలితగతిం గాన మొదుగ లయబద్ధముగా
నలరిన శైలియె శైలిగఁ
దలఁతుందక్కినవి కప్పదాట్లుగ నెంతున్. 91

తే. రాజహంసల గతుల పై – మోజె గాని
కొంగనడ లొల్లఁ బద్దెము – సంగతిఁ గన
భవ్య మోతారు రోడ్డుపైఁ బడవ దిగిన
యమెరికా కారు బోయి న – ట్లమర వలయు. 92

తే. పంచ కళ్యాణి నెక్కి సమంచితగతి
సంజ కెం జాయరంజిలు – సమయమందు
స్వారి చేసిన యటులుంట – వలతుఁగాని
కుంటి గుఱ్ఱంబు నెక్కిన – ట్లుంటవలవ 93

తే. ధ్వని రసాదులుకై తకుఁ బ్రాణములని
యెఱిఁగియుం దీనికై యింత – యేల యన్నఁ
బ్రాణికుంటిగ నడచిన భవ్య మగునె
యన్ని సరిపోయినప్పుడె యంద మెసఁగు. 94

తే. శ్రవ్య కావ్యంబు లెట్లున్న జరుగుఁ గాని
దృశ్య కావ్యంబు పై నది – దెబ్బతీయు
స్వానుభవమున నే నింత – యాడినాఁడ
మంచి జగ మెన్నఁడేని గు – ర్తించుఁ గాక. 95

కం. పద బంధ పారిజాతం
బదియన సామెతల కద్ధి – యామె తలన న
య్యది రస రత్నాకరమన
హృదయము గరఁగించు నట్టి – దే కవిత యగున్. 96

ఉ. హారము లగ్రహార ముపహారముగానిడి గారవించి రా
హార విహార సౌఖ్యముల కన్నిఁటికిం దగనిచ్చి నిచ్చ వి
ద్యారతిఁ గైతలం గవుల నారసి యారసి కావతంసు లౌ
ఘారమణుల్గతించియును – బొందరె శాశ్వత కీర్తి కాంతులన్. 97

తే. చెట్టు ఫలములఁ గని రాలఁగొట్టుకొనుటె
కాని, దోసెఁడు జలమిడు ఘనులు లేని
యెడలఁ దద్వృక్ష మె ట్లభివృద్ధినొందు
నెందనుక లోకులకు ఫలమీయఁగలదు. 98

ఆ.వె. పండొ తుండొ యీయఁ బరమ సంతోషియౌఁ
బండి తుండటంచుఁ బాగుగఁ గని
భట్టుక్రింద నిన్నుఁ గట్టుట యెఱుఁగవే
నాత్మగౌరవమ్మె యడఁగు బుధుఁడ. 99

సీ. సౌందర్య గాంభీర్య – చైతన్య దార్ఢ్యని
కాద్యనేక నిశితాంశాళికలిత
కవిత విశ్వజనీన – ఘనత గాంచు టెఱింగి
కవిసార్వభౌములు కలము పట్టి
రసము రంభగ వచ్చి వెననాట్య మాడుచో
సరసులు సంతోషసాగరమున
మునిఁగి తేలుచుఁ గావ్యమును సుధాకలశమ
ట్లుత్తమాంగము మీఁదనుంచి కొంద్రు

తే. కానఁగృతి చేతఁ గర్తకుఁ గర్త చేతఁ
గృతికి నమరత్వ మొదవుట కెపుడు లోటు
కలుగదయ్యదె చివఱకుఁ గవికి మిగులు
ఫలమని కవీంద్రు లెదఁదృప్తిపడుట లెస్స. 100

వ. మోక్షప్రాప్తికంటె లోకకళ్యాణమే ముఖ్యాతిముఖ్యమని యక్షర పరబ్రహ్మము నాశ్రయించి ధర్మాసనస్థుఁడగు న్యాయమూర్తి రీతి నిష్పాక్షిక దృష్టిం బ్రవర్తించుచుఁ గవి నిజజీవితముం గడపు. దివి భువులతని కలముం గౌఁగిలించుకొను. కవిత్వము భౌతికాధ్యాత్మిక సౌఖ్యములకు వంతెన. కవి మాయాభువనమునఁ దెప్పవలెం దేలుచుఁ దన్నాశ్రయించినవారిం దేలం జేయుంగల ధీశాలి. ప్రజా హృదయమునకుఁ బ్రతినిధి. కాని యసంతశ్రీ కతనిపై దయగలుగు టరుదు. కవి కవన జీవనుఁడుగ నుంట ప్రకృతి కిష్టమేమో. కలమును గులముతో గొలుచుట ప్రహారాతి క్రూరమని బుధులంద్రుగాని యాచరణమ్మృగ్యంబు. 101

తే. మానవుని సృష్టిచేసెడి మహిమ యెవుడొ
ప్రకృతి శాస్త్రంబు వడసినఁ బడయునేమొ
యెంత తపమాచరించిన – నెప్పటికిని
కావ్యసృష్టి యొనర్ప శక్యంబు గాదు. 102

ఆ.వె. రసముఁ జిందఁజేసి – రమణీ మృదూక్తి నా
మదికి ముదముఁ గూర్చి – మఱపురాని
కైత కైతగాని – కానిది కైత యా
చెఱకుగాదు వంట – చెఱకు గాని 103

ఆ వె. ఎవని బిడ్డ వాని – కెంతొ ముద్దుగ నుండుఁ
బెఱని సుంగుఁజూచి – పెదవి విఱుచుఁ
జక్కఁదనము గాని సద్గుణమ్ములు గాని
తెలియ లోకమునకుఁ దెలివి లేదె? 104

చ. వెలగల జాతిరత్న మెదొ – వీధుల వెల్గెడి గాజు పెంకెదో
తెలియు షరాబటుల్దెలియు – ధీనిధి సత్య విమర్శ సత్కృతిం
బలుకులలోని భావరస – బంధురతంగమనించి ముగ్ధుఁడౌ
జలికినఁగాదె వెన్న మన – చేతికిఁ జిక్కును దక్క నోటికిన్. 105

చ. సరిగ గణింప లఘ్వలఘు – సారస నీరస కావ్య వైఖరుల్
స్థిర తరసాహితీ – జలధిఁ దేలు వివేకికిఁ జెల్లు నన్యుఁడె
క్కరణిని ధర్మ సూక్ష్మములు – గన్గొను ముగ్ధవిదగ్ధ భేదముల్
సరసుఁ డెఱుంగు నంతయున – షంఢుఁ డెఱుంగునె జీవితంబునన్,

తే. అఖిల రసముల తీరు తీయంబు లెఱిఁగి
పాత్రభావోచితాద్భుత పదయుతముగఁ
గడఁక వెన్న కన్నను గడుంగడు మృదువుగ
వజ్రమును మించెడు దృఢముగ వ్రాయఁగఁ దను. 107

తే. వైపరీత్య ప్రబోధక – ధర్మములుప్పు
మూఢవిశ్వాసములను బెం – పొందఁ జేయు
గల యభూత కల్పన తగ – దనుచు వాని
తారతమ్యము గుర్తించి - తగ వచింతు. 108

కం. గానానుకూల శైలీ
మానితమై నాదు రచన – మంగళకరమై
వాణీ ముఖ ముకురంబై
రాణించును రమ్యరస వి – రాజతమగుచున్. 109

మ. స్థిరసంకల్ప బలంబుమై నవరస – శ్రీ నాట్యమాడన్సదా
సరసామోద కథా విధానముల వి – శ్వశ్రేయ మర్థించు చుం
పరమానందముతో లిఖింతుఁగన నే – పద్యంబు నే పథ్యమం
డఱగాఁ దోఁచెడి ముద్దుగుమ్మవలె ను – ద్యద్భావంతి రేకెత్తగన్.

ఉ. పంకజ జాతురాజ్ఞి పద – పంకజము ల్భజియించి యింక మే
ల్పొంక మెలర్ప వాణి నిజ – పూజ విపంచి లగించి మీటి స
ట్లంకిలిలేక సర్వరస – హాస విలాసత వ్రాసెద న్మణీ
కంకణ ఘంటికారవము – ఘల్లనఁ గింకవి గుండె ఝల్లనన్. 111

ఆ.వె. సకల కళలఁ గుల్కు – జావిలి బిగిఁ జిల్కుఁ
దేటతేనె లొల్కుఁ – దెనుఁగుఁ బల్కు
కాన దాన నేన – కావ్యమ్ము సృజియించి
బాసు పదములందు – నిడి తరింతు. 112

## ఆభిజాత్యము

సీ. పరమేశు పాలాక్షి – పద్మనిర్గతలస
జ్జ్యోతిరావృత్తి జన్మ – మొందె నెవఁడు

పంచాక్షరీమంత్ర - పఠనార్క వికసిత
పావన హృత్కంజ - భాసి యెవఁడు
హరినాభి కమలస్థ - వరతంతు నిధితోడ
నచ్యుతువాత్సల్య - మందె నెవఁడు
చౌడేశ్వరీదత్త - సారాసి శక్తిమైఁ
గ్రూరాసుర బలంబుఁ - గూల్చె నెవఁడు
తనధాటిఁ దలవంచి - జనని సింహము చాటుఁ
జేరిన పగఱ ర - క్షించె నెవఁడు
ఆమోద పుట భేద - నాధిపుఁడై ప్రాజ్య
సామ్రాజ్య మేలిన - జాఁ యెవఁడు
సకల లోకములకు - సన్నేత్రదాతయై
భువన సంస్తుతితతిఁ - బొందె నెవఁడు
సప్తావతార ప్రశ - స్త రూపంబుల
సద్గ్రంథ సంతాన - జనకుఁ డెవఁడు.

తే. *దేవదత్తాది సుదతు లే - దివ్యసతులు
వస్త్ర సృష్టికి స్రష్టయై - వరలె నెవఁడు
అట్టి శ్రీదేవల మహర్షి - యన్వయమునఁ
బుట్టితి నుమామహేశుల - పూర్ణ కరుణ. 113

సీ. పాల బుగ్గల సౌరు - పాసి పోయక ముందె
కవితా లతాంగితోఁ - గలసినాఁడ
పసమీఱ మీసంబు - వచ్చిరాకయమున్నె
ప్రౌఢకావ్య యశస్సు - వడసినాఁడ
కోడెప్రాయమునంద - క్రొత్త సృష్టి యొనర్చ
బంధ ప్రబంధంబు - వ్రాసినాఁడ
నడిమి వయస్సులోఁ - గడు మహాసభ మహా
కవి బిరుదంబుతోఁ - గ్రాలినాఁడ

తే. సర్వసాహితీ ప్రక్రియల్ - నిర్వహించి
యింకవలయునదేమియన్ - తృప్తితోఁడ

(*1. దేవదత్తా 2. చంద్రరేఖ 3. పద్మిని.)

శ్రుతుల కతిభూమియై సదా - శ్రితుల నుతుల
వినెడి ముక్తి ప్రదాతను - వేఁడువాఁడ. 114

కం. మండాడను గొండాడను
పండి యెడద మండి తునకు - చండం బిడుదుం
జండాంశుని శీతాంశుని
గుండెలలో నున్న గొప్పగుణమది యనుచున్. 115

కం. చేసితి వ్యవసాయమ్మును
నేసితి వస్త్రముల నేర్చి - నేర్చితి విద్యల్
వ్రాసితిఁ గైతం బొమ్మలు
వేసితి వేసమ్ము లెన్నొ - వేసితి నిరతిన్. 116

కం. నేతల దాతల త్యాగుల
చేఁ తలచే నలరి కలము - చేకొని నాఁడన్
నీతి సుధా నిధి యనఁగా
నీతటిఁ గల సత్య చరిత - యే రచియింతున్. 117

కం. నా కవనము నానా సుమ
నా కవనము - సకల లోకనాథాశ్రితధీ
నాకవనము నవరసరుచి
నాకనదీ సదృశపావ - నశ్రీ వెల్గున్. 118

కం. మా కందము చవియెటిఁగిన
మా కందము మధుర రసము - మానక చిందున్
మీ కందిచ్చెదఁ గవితా
మాకందము మహిత గతుల - మాన్యంబెందున్. 119

కం. ఈ రస మీరసలేకయ
యారసి రసికావతంసు - లానందింపం
గోరి రచించెదఁ గబ్బం
బారాధించుచుఁ బరేశు - ననవరతంబున్. 120

ఉ. ప్రాంశుమనః ప్రభాకలిత - భారతదేశ విదేశవర్త కా
ద్యంశ విశిష్టమార్గ గమ - నార్థిక సౌష్టవశక్తిమై నవ

ప్రొంత మొకింతలేక ధన - రాసులు బిడ్డకు నెత్తియుంటి మ
ద్వంశము సార్థకాఖ్యఁగడు - వర్ధిలె దానకథాప్రసిద్ధమై. 121

తే. ఐనదానికి సుంతయుఁ - గానిదాని
కేను నేనని యెగబడు - టెఱుఁగ రెపుడు
కంకణముగట్టుకొన్న యే - కార్యమందు
మడమద్రిప్పరుమత్కుల - మాన్యతములు. 122

వ. అది యట్లుండె. చంచలవలె లచ్చి చంచల యగు టెల్లరకుందెల్లము. ఐన మున్నస్మదన్వయ పూర్వపుణ్య విశేషమ్మున మా కొక్క వరంబు ప్రాప్తించెనని కథా కథన కుశల గుణ గణ్యాజ్ఞాన వృద్ధ ప్రబోధిత ప్రసిద్ధేతిహాసంబొండు శ్రవణ గోచరంబగు. అదెట్లన - దేవలాన్వయ నికేతనంబులు సంతరాపూరసయుత సంఖ్య నలరువేళ. 123

తే. బండ్ల బాపమ్మ రాపూరఁ - బతిగతింపఁ
జిచ్చుఱకువేళ మాకేమి - సెప్పుదన్న
నింగ శ్రీరూపమున మన - వంగడమున
నిల్కడగ నుందునని యామె - వల్కెనంట. 124

తే. అద్దియాదిగ లక్ష్మి మా - యన్వయమున
నెవరి యింటనో యొక్కరి - యింటఁ గొలువు
దీరియుంట జగము గను - లారఁ గాంచుఁ
గల్లయగునొక్కొ సాధ్వీమ - తల్లిమాట. 125

## విద్వద్గోష్ఠి

వ. గుణగ్రహణ పారీణులు విద్వచ్ఛిరోమణులు సరసవాచా నిపుణులు సదయ హృదయులు మామక సుహృద్రత్నములు నగు నందుల శేషగిరి శర్మ ప్రభృతులతో నేనొక్కనాఁ డొక శుభసమయంబున మద్గృహంబునఁ గవితా కల్పలతా గోష్ఠి రమణీయ రసరసాల ఫల రసా స్వాదనంబున నానంద మనుభవించుచున్నతఱి వారలు. 126

కం. క్రమబద్ధవచశ్శీలా
విమలమనఃకమల వేద - వేదాంత కళా

సుమగంధ బంధురోజ్జ్వల
కమనీయ గుణాలవాల - కవితాలోలా. 127

కం. బంధప్రబంధ కవితా
బంధుర తేజోవిలాస - భాసుర యరివా
గ్బంధన చతుర వచశ్శ్రీ
చందననిభకీర్తిసాంద్ర - సరసకవీంద్రా 128

మ. విమలాచార విచారసారభర స - ద్విద్యా వివేకాత్త ధీ
రమణీయోజ్జ్వలవాగ్విలాసయుత ధై - ర్యస్థైర్యహేమాద్రి కీ
ర్తిమణీ భాజ్నటపత్న మారసమమూ - ర్తీ సామరీ సాహితీ
సమరోర్వీతల సవ్యసాచి యనినిన్ - శ్లాఘింతు రార్యోత్తముల్.

మ. శరదబ్జద్యుతితుల్య నిర్మల మన - స్సంశోభితా సద్గుణా
భరణా నిత్య శివార్చనా కలితశుం - భద్వర్తనా చిచ్ఛవీ
భరితానంద మరంద తుందిలహృద - బ్జా నత్యసాధ్వాళిమి
త్రరసజ్ఞవ్రజవాగ్వినోదయుత భా - రద్వాజగోత్రోద్భవా. 130

తే. పుట్టితివి సింహలగ్నానఁ - బుణ్యపురుష
పోవు చిట్టెల్క జోలికిఁ - బురుషసింహ
యెవఁడొ నిను గిట్టకెట్టాడ - నేమి కొంద
ఱాడుకొన లోటె పూర్ణసు - ధాకరునకు. 131

కం. కలిమిని లేమిని నొకటిగఁ
దిలకింతువు సత్యధర్మ - దీధితి నెపుడుం
దలఁతువు వలతువు దానం
దలవంచని వీరుఁడనఁగఁ - దనరితి సుకవీ. 132

ఆ.వె. ధర్మమన్న నీవు - తలవంచి మ్రొక్కెద
ధర్మమెడఁద నుంత - తలఁపఁబోవు
సత్ప్రవర్తనంబె - చదువున కంటెను
గొప్పదనుచు సతము - చెప్పుదీవు. 133

తే. ఆంధ్రగైర్వాణ వాఙ్మయో - ద్యానసీమ
ననవరత మిట్లు స్వైర వి - హార లీలఁ

గాలముం బుచ్చునిన్గ ని - కరము కరుణ
శివుఁడు చిన్మయుఁ డెపుడు ర - క్షించుఁగాత. 134

ఉ. అందెఁ బ్రబంధ రత్నమగు - నాంధ్రమహాభ్యుదయాది భాగమం
దందె సుధారసంబు బుధు - లందఱు మాకు ద్వితీయభాగమిం
కందుట యెన్నఁడంద్రదియ - యాత్మల మేసుసు గోరి చేరి యా
నందము చిందఁ గావ్యరచ - నాస్థితిఁ బ్రేచ్చయెనర్తు మింతకున్.

చ. అనవిని చక్కఁ ద్రొక్కి యది - యంతయు నీతు కటాక్ష పక్షణం
బని నుతికంతవాఁడనని - యాత్మఁదలంపనుగాని మీ సుహ్రా
ర్ధన మొక నూత్నతేజము ము - దంబును గూర్చుచు నున్నదన్నవా
రనఘ యథార్థమాడితిమి - యంతియకాని పొగడ్త కాదనన్. 136

చ. శుచినయి నిత్యనిష్ఠ నల - శూలి భజించెదనేని సత్యవా
గ్రుచిరకథార్థ సద్రసని - రూఢిగ రూఢిగ సజ్జనౌఘ హృ
త్ప్రచురముదప్రదంబుగ సు - ధామధురోక్తి కళావిలాసిగా
నచిరమ పూర్తిచేయఁగల - యద్భుతశక్తి మహేశుఁడిచ్చుతన్. 137

ఆ.వె. వడ్లమూడి వంశ - వార్నిధి చంద్రుండు
పండితోత్తముండు - భవ్యయశుఁడు
గుణి శిరోమణి యల - గోపాలకృష్ణుండు
ప్రోత్సహించె నరగఁ - బూర్తిసేయ. 138

వ. అని యన మన్మిత్రపరేణ్యులు— 139

కం. చదివిన కొలంది సారము
పొదమొదవఁగ నొదవుచుంట - ముదితమతిపరేణ్
మృదువుగనుంటం గోరిన
సుధ దక్కిన రీతి నానఁ - జూపుట యరుదే. 140

కం. నీ విక ద్వితీయ భాగము
వేవేగం బూర్తిసేయ - వే యన మిత్రుల్
దేవీ శంకరుల దయా
దీవన వ్రాయుదు నుదాత్త - ధీనిధు లలరన్ 141




# రథ బంధము—ఈశ్వర ప్రార్థన

శా. విశ్వజ్ఞా సదయా నిరంతరరసా - విఖ్యాతతేజోనిధీ
విశ్వేహాప్రద సాధురక్షణభృశా - విగ్నైకచిత్తా శివా
విశ్వాసావగతస్వరూప కరుణా - పీరత్వభూషా భవా
శశ్వద్దర్శనమీయరా సుఖదభా - శాంతాధినేతా హరా. 142

(తెలుఁగుననిది నూతన బంధము - మధ్యగదిలో నిలువుగఁ జూచిన
విశ్వేశా వరద - అనియున్నది)




ద్వినాగ బంధము - ఈశ్వర ప్రార్థన
(మదీయ నూతన సృష్టి)

తే. దేవ సత్యరమాసాద్య - దీన రక్షి
సజ్జనానంద సందీప్త - సార శూర
నిత్య భక్త గణావన - నీతి గణ్య
భవ్య నామ దయానీత - వర్య శూలి.

## పుష్పమాలికా బంధము—ఈశ్వర ప్రార్థన

చ. సరపరధీరమా వనజ – నర్తన ధీర ధరాధరాధరా
స్థిరతరసారవీర శివ – శిష్ట శిఖాబ్జికళాంక శంకరా
హరహర ఘోరభారహర – హర్షహతాన్నట, ఝూటజూటని
ర్ఝరకరధార భక్తజన – జన్మ జయప్రదమోద సాదరా. 144

## గర్భకంద చంపక మాలానాగా భరణము

## (నాగబంధము) ఈశ్వర ప్రార్థన

చ. జయ శివనామధేయ శుభ – సంభవ నిశ్చల భావధీయుభాక్
జయ జగదావనా యఖిల – జాల హరస్తుమతీ దయానిధీ
జయ భవపూతకాయ నుత – శాంతపర స్తవ భావనారతా
జయ సదనాలయా యచల – శాల వసుస్థిత నాగధారణా.

క. శివనామధేయ శుభసం
భవ నిశ్చలభావధీసు – భాక్ జయ భగదా
భవపూతకాయ నుతశాం
తవర స్తవభావనార – తా జయసదనా. 146

# శ్రీ కాశీ విశ్వనాథస్వామి కంకితము

శా. దాతా మత్కృత సత్కృతిం ధృతిమెయిం - ద్వద్దివ్యపాదంబులం
జేతః పద్మముతోడ నిల్పితి శుభాశీః పుష్పముల్పల్లినం
ప్రీతింజూడుము, సత్యదృష్టిఁ గన స్వా - మీ యిద్ది మీ కిచ్చుటల్
శీతాంశోరమృతార్పణమ్మనుట కా - శీ విశ్వనాథప్రభూ. 147

తే. శ్రీ విశాలాక్షి దుగ్రుచి - శ్రీ విభాస
నవరస వికాస యన్నపూ - ర్ణా విలాస
వేదవాగ్భాస రాపూరి - పేటవాస
విధుమణీ సనాథ యోకాశి - విశ్వనాథ 148

సీ. దీపిత మణిఫణి - నూపుర చరణముల్
వ్యాఘ్రపురాట్చర్మాంబ -రాంచితకటి
పడగ విప్పిన సర్ప - పత్యక్షమాలా ప్ర
భా భాస సువిశాల - వక్షతలము
నాగ కంకణ మణి - నాగకేయూరాంక
ఘనశూల వరదాన - కరయుగంబు
మాణిక్య కుండల - మండిత శ్రవణముల్
తపనోషధీశ నే - త్రద్వయంబు.

తే. లఘుతరాగ్న్యంబకోగ్రల- లాటఫలక
మతివినీల జటాపటు - లాబ్జశీర్ష
మమలగంగా సమేతమై - యలరునట్టి
నీ స్వరూపంబు సర్చింతు - నేఁ దరింతు. 149

కం. పురహర మార్కండేయుం
గరుణమెయిం గావ - యముని గాల్చితివి గదా
శరణని నీ చరణంబుల
స్మరియించిన నరుఁడు దివ్య - శక్తి వడయుఁడే. 150

తే. అమృతమును దేవతల కిచ్చి - హాలహాలము
నమృత మట్టుల భక్షించి - తాదిదేవ

కష్టముల నెల్లఁ దా నోర్చి – ఘన సుఖంబు
రైతుల కొసంగు రాజాధి – రాజునట్లు. 151

శా శ్రీనాథుండన నీశుఁడన్న విధినా – క్రీస్తన్న నల్లాయనం
జైనస్వామియనం దథాగతుఁడనన్ – సర్వప్రపంచోల్ల స
న్నానా రూపసురాఖ్య లెన్నియయినన్ - న్యాయైక సృష్టింగనన్
నీ నామంబుల దక్క యొండుగలవే – నిక్కంబు విశ్వేశ్వరా! 152

శా. వాగీశాద్యఖిలా మరస్తుతియుత – వ్యాపార పారీణ స
ద్భోగీంద్రా భరణా సుహృజ్జన మనో – మ్బ్వితాత్త తేజశ్చయా
యోగానందగుణా యుమారమణ ని – త్యోల్లాస దీప్యచ్ఛుణా
రాగద్వేష నివారణైక చరణా – రాజత్సుధీ రక్షణా! 153

శా. ఖ్యాతింగాంచిన మత్పురంబున భవ – త్కళ్యాణ లీలాళి మా
తా తల్లల్లియుఁదండ్రి చెప్ప విని యుద్యద్భక్తియుక్తుండనై
చేతః ప్రీతి భజింతు నిన్ను విజయ – శ్రీఁ గూర్చు మోదేవ మా
స్తోత్రంబుల్విని భవ్యదివ్యపథముం – జూపించి కాపాడుచున్. 154

శా. కల్యాణప్రదము ల్త్వదీయపదముల్ – కాంక్షించి సద్భక్తి మ
ద్బాల్యంబాది భజింతుఁ ద్వన్మహిమమైఁ – బ్రాప్తించె నీకైత నై
ర్మల్యానందముతోఁ గృతీశునిగ నా – రాధింతు రాణింతు సౌ
శీల్య శ్రీకవచ ప్రదాతవయి ర – క్షింపందగుం భక్తునిన్. 155

మ. భవదాజ్ఞాపరమార్థబద్ధుఁడయి యీ – భక్తుండు శక్తుండుగా
హావణించె న్మనసార మ్రొక్కెదను దే – వా నిచ్చ రక్షింపుమా
కవనంబన్నవసం పుదీక్షమెయి నా – కాంక్షింతుఁ ద్వద్రూపమో
శివ కన్గోయికిఁ జూపి ధన్యునిగ న – న్నేయంగదే యీశ్వరా. 156

శా. కైలాసంబుననుండెదో విబుధహృ – త్కంజంబునందుండెదో
శైలాధీశ తనూజ మానసగుహా – స్వర్ణైకపీఠస్థలిన్
లీలానందముతోడ నుండెదవొ యే – లీలం గనంజాల కి
లీలం బ్రార్థనసేయుచుంటి నను జా – లిం జూడవే యీశ్వరా. 157

శా. అంకిలిలేక బింకముల – యంకమడంచి తరింప వేడెదం
బంకము ద్రొక్కనీక కల – పంకములెల్లఁ గలంచి యింక నా

యంకెకురాని మోక్షరమ – నందఁగఁ జేసెడి దైవమంచు ని
శ్శంకముగా భజింతు శివ – శంకర నీ పద పంకజంబులన్. 158

కం. ఎడ పయిడి గుడిగ నిడెదం
దడయక యందుండి పాద – దాసునిగా న
న్నడిపించి సేవలందుచుఁ
గుడిపింపవె ముక్తిఫలము – కోవిద వినుతా. 159

చ. తెలియక క్రూరకర్మతుల – ధీరులు పిరుఁలు చంద్రమ లింద్రులన్
పలుకులు వల్కి పాపము న – పారముగా నొడిగట్టికొంటి న
క్కలుషము లెట్టువాపి ననుఁ – గాతువొ కంటికి ఱెప్పవోలె ని
శ్చలమతి నిన్నుతింతు శివ – శంకర భక్తవశంకరా హరా. 160

శా. కైలాసాచలమందిరా పురహరా – కైవల్యసంపత్కరా
ప్రాలేయాద్రి తనూజమానసహరా – భక్తౌఘ రక్షాపరా
లీలానిర్జిత శాత్రవప్రకర ని – ర్లిప్తక్రియాభాస్వరా
శూలాద్యాయుధదీప్తి శోభితకరా – సోమేశ విశ్వేశ్వరా. 161

శా. అజ్ఞుండై న ననుం దయన్సకల వి – ద్యాకేంద్రమౌ సాహితీ
విజ్ఞానాస్పదవీథికిం దిగిచి యు – ర్వి న్సత్కవిత్వక్రియా
ప్రజ్ఞాశాలి నొనర్చి పాపతతులం – భంజించి రక్షించు న
ర్వజ్ఞా! నీ పదపంకజాతముల మ – ద్గ్రంథంబుంచి కీర్తించెదన్.

కం. కృతి నిస్స్వార్థ త్యాగుల
కతలట యది నిత్యసత్య – కామినియట త
త్కృతిపతి పరమేశుండట
యతులానందైకదాయి – యగుటది యరుదే. 163

కం. శూలికి సంధ్యాతాండవ
కేళికి నఘజీర్ణభూజ – కీలికిఁ గరుణా
శాలికి సుమామనోంబుజ
హేళికిఁ బ్రమథాదిపాల – నేచ్ఛాగుణికిన్. 164

మ. గిరిజా జానికిఁ జంద్రమౌళికి సదా – గీర్వాణ రక్షాక్రియా
కరుణావాణికిఁ దాపసప్రకర ని – ష్కామైకహృత్పద్మ భా

స్కర సంకాశున కాదిదేవునకు శ – శ్వద్భోగసంధాయికిం
బరమానంద కృపాలవాలునకు భా – స్వద్దివ్య బ్రసాదకున్. 165

కం. ఓంకార రూపునకు జయ
శంకారహితునకు సర్వ – శక్తియుతునకున్
పంక కళంకోపేత భ
యంకరునకు భక్తరక్ష – ణారంభునకున్. 166

వ. అంకితంబుగా నా యొనర్పం బూనిన యాంధ్రమహాభ్యుదయ ద్వితీయ భాగమునకుం గథాక్రమంబెట్టి దనిన. 167

తే. అట్లు భార్యాద్వితీయుఁడై – యాదృతిమతి
ధూమశకటప్రయాణ సం – తోష సమయ
మున సతికి నూత్నదృశ్యముల్ – బోధపఱచి
చేరె రాములు బొంబాయి – చిఱునగవున. 168

## శ్రీరాముల గార్హస్థ్యము

వ. శ్రీరాములమ్మహానగరాధి రాజమ్మున నానారాష్ట్ర చతుష్కోణ సమాగత ధూమశకటపటలవిరామధామ నికటసీమ సముచితోప బృంహితారామ విద్యుజ్జల యంత్రాది సకలసౌఖ్య విభ్రాజిత సౌలభ్యోపేత ప్రభుతా నిర్ణీత నికేతనాంతరమునఁ బరిత్యక్త బాల్యదశావకుంఠన నిర్గత యౌవన జ్యోత్స్నా నవనవోన్మేష సలజ్జాస్పృగ్విభ్రమ సహిత లలితాలాప కలిత కందళిత హృదయారవిందయై యర్హస్థాన నిక్షిప్తకరోటకచ్ఛత్రా దర్శ కంకతి కాంతికాద్యుపకరణయై విచిత్ర చిత్ర పటాది తత్తద్వస్తుని స్తుల గేహాలంకార కరణ నిపుణయై వెలయు ధర్మగేహినితో నివసించుచు నీరుపాయంబున నున్నను జని ప్రభృతి శాంతశమదమాది సకల సద్గుణ సంపన్నుండు గానఁ దనకుం దగిన యర్ధాంగిం గూర్చినందుల కానందించి విరించి నభినందించుచు నాత్మప్రత్యయజ్ఞుండు కావుటం జేసి మల్లికా లతా పరివేష్టిత పున్నాగమ్ముంబోలె మగఱా కలిమి మేలిమింబలెం దన జీవిత మింకం గ్రొంగ్రొత్త శోభలతో నలరారఁగలదని విశ్వసించుచు దేశ రూపంబు సోపానక్రమంబున గ్రహించుచు విశ్రాంతి సమయంబుల నిజ

తే. సూటు బూటు హ్యాటుల వంత - నొయిగమునుపు
సల్లదొరయైన నాపుత్ర - ఫుల్లపపస
మరసి క్రొత్తొక వింతనా - నలరి యతఁడు
సొగుచుండఁగఁ దన దృష్టి - సొగనంపు. 176

కం. దేహారోగ్య స్థితిగతు
లూహ సమీక్షించి కవకు - నొప్పున చెప్పున్
స్నేహార్ద్రతఁ దర్కించుట
నాహ్లాకపాణి వంట - యట్లు యొనర్చున్. 177

తే. అప్పు డప్పుడు పనిపిరి - కైనఁ దాను
నెంత విశ్రాంతి కొఱకు ప్ర - క్కింటి స్త్రీలు
వాకిట మెలంగుచో మూఁగ - వారివోలెఁ
జోద్యమున వస్తైగా దిగఁ - జూచుకొంద్రు. 178

కం. ఎలదోఁటఁగుటీ వాటిక
మెలఁగెడి యొక లేడిపిల్ల - మేడలు మిద్దెల్
గల యంతిపురిని విడిచిన
లలిఁ దనస్థితి తనకుఁ దోఁచె - లలనకెడందన్. 179

కం. తనబాస వేఱు పరిసర
వనితామణు లాడుకొనెడి - భాషలు వేఱా
టను గని వినియుం దెలియమిఁ
గను గలిగియుఁ గానలేని - గతిఁ దలపోసెన్. 180

కం. వీటుం బాటుం గల్గుట
వాట మెఱిఁగి యంటకుండ - వర్తింపనిచోఁ
జేటులవలనం జేటులు
వాటిల్లుట నిక్క మెంత - వారలకైనన్. 181

వ. అనిన, వృద్ధ సూక్తులు గమనించిన దగుట నిత్యకృత్యములఁ బని
కత్తెలకై మననూనక తాన చక్కఁజేసికొను. అంతియ కాదు. 182

చ. శ్రమ యనుకోక పర్వముల - సద్మకృతుల్ నెరవేర్ప నేరినో
నైమకక తాన సేయు తిన - నేర్చిన రోగము రాదు, మాటలం

గ్రమమున నాడుచోఁ దగవు - రాదను సూక్తి నెఱింగి యున్కిమై
సుమతి ఋతుక్రిమల్ దెలిసి - శుద్ధిగఁ జేయును శాకపాకముల్. 183

కం. ఘన ఘర్మోజ్జ్వల యయ్యును
పని విని వెసఁ దీర్చి కూర్చు - భార్యంగని నె
మ్మనమున మురియును రాములు
పనిముద్దా యెవరికైన - భాగ్యము ముద్దా? 184

ఉ. ఆ దరహాసభాసముఖ-మాదరమేదురమై రహింపఁ దా
నాదటఁ జూచి యూఁచి తల-యంకిలి లేమి గ్రహించి భర్తకా
మోదముఁ గూర్పఁ గొన్ని పద-ముల్ దదభీష్ట మెఱుంగఁ బల్కి త
త్పాదములం దలంచు పని-భారము దెల్పదు సీత యెప్పుడున్. 185

సీ. కాళింగి కర్కోట - కర్కారు కాష్ఠీల
గోజిహ్వా దుర్వర్ణ - ఘోషకములు
వార్తాక రోమసి - వార్తాకి తింత్రిణీ
మహిత శలాట్వాత్త - మారిషములు
గండీర మత్స్యాక్షి - కండూర చిర్భట
జ్యోత్స్నికైలాబ్వాలుక - సరస బృహతి
కర్ణికా రాలర్క - ఘనతర పాటీర
కారవేల్ల కపిత్థ - కర్కటులల

తే. సోమకర్కటి పిండాలు - చుక్రశాక
శక్రవల్లిక శాకిని - శక్రపుష్ప
లల్ప బాహ్లీక యుక్తమై - యలరనామె
కడఁగి వండు నిజారోగ్య - కరముగాగ. 186

వ. అయ్యాయి కాలోపలబ్ధ వివిధోప దంశంబు లమర్చు. ధాన్యాక బృహన్మరీచ చూర్ణ చణకచూర్ణ షాడబాదు లెడనెడఁ జేయు. తెలుఁగు దల్లి కోకొల్లలుగఁ బల్లెఁ బల్లెఁ బిల్లలకిడు మెంతి, తూటు, బొద్ది, పొన్న గంటి, దొగ్గలి, యటుకుమామిడి, యూల, గంజేరు, గురుజ, చిట్టి, గురుగు, పాయల, యిసుకదాతర, బలుసు, మునగ, యవిసి, నల్లకామంచి, బుడ్డ కామంచి, చుక్క, పుల్లబచ్చలి, పొదిని, రేల, పాల, చెంచలి, లేదంటి యును మొదలగు నాకుగూరలన్నియు నటు దొఱికమిం దలపోసి

యందుం గొన్ని తనశైశవంబున మూడిసగ్గులు ప్రమాణతప్పణములుగ నఖి ఘూర సార పరిమళ ప్రసారంబుల నిగ్గుదేఱ వంశీ వర్తించిన తీరు తీయ ముల నపుడప్పుడు గుష్టికిం దెచ్చుకొను సొంపారం బుడ్డి. ప్రాచీయాశ్రమ ధర్మంబు గానఁ బంగ్వాంధాపాలఁ గను పెట్టినయుండు. వానికిం గారణంబు పుట్టింటి బాల్యంబున సయ్యాటకాండ్లయుట. 187

సీ. ఫాలపక్షాకేంద్ర - భాసుర కాశ్మీర
తిలకంబు నేత్రసం - దీప్తి వెలుఁగ
నటితి రజ్జ్వగ్రభా - గాత్త ఘంటా శంఖ
రవ మీళగేయహా - ర్దము వహింప
స్వర్ణపుత్ర్యంతర - సంధాన దివ్యాక్ష
మాల 'లింకాయ' స - న్మహిమఁ దెలుపఁ
బ్రతిగేహవర్ధిత - వామకక్షోపాత్త
భవ్యతండుల కక్ష - పాల దనర

తే. నాగభుజకీర్తు లుపరికుం - తల నికాస
మెనయఁ దత్ఫణాగణమణీ - ఘృణి యనఁ దగ
శైవముద్రాంగుళీయక - సహితుఁ డగుచు
వచ్చు జంగమదేసర - కిచ్చె భిక్ష. 188

సీ. కస్తూర మాలికా - కలితోర్ధ్వ పుండ్రాంక
తామ్రపాత్రిక శిర - స్థలి ధరించి
ద్వాదశ పుండ్ర సం - ధానాలికాద్యవ
యవశోభఁ దులసి మా - లాళిఁ బెంచి
సుమకంకణ మణిభా - సుర కుండలము లొప్ప
దండి చేమంతి పూ - దండఁ దాల్చి
కమనీయ కౌశేయ - కౌసుంభధారియై
ప్రమదానఁ బ్రాతరా - రంభమంద

తే. మీటి తంబురఁ దాళవు - వాట మెనయఁ
గాళ్ళ గజ్జెలు ఘలు ఘల్లు - ఘల్లుమనఁగ
భవ్యనృత్యలసద్గాన - పాటవమున
వచ్చు హరిదాసునకు నిచ్చ - నిచ్చె భిక్ష. 189

వ. ఇచ్చి తదాశీస్సులందెె. కాన దానధర్మాదులకు బీజావాపం బపుడ జరిగె. జ్ఞానంబుతోఁబాటు సహజ సిద్ధౌదార్యంబును వృద్ధిపొందుచుండె. వేయునేల. భార్యకుం దగిన భర్త భర్తకుం దగిన భార్య యగుట వారి దాంపత్యంబు మాధవీ సహకార సమ్మేళనంబు. ఇంక నా సీతామనో వల్లభుండు. 190

సీ. ఆచార్య బాల్య స - హాధ్యాయ పరిచిత
బంధు సుహృద్ధిత - పండితాదు
లేరేని నేతేర - నెంతే ముదానఁ బ్ర
త్యుత్థాన పూర్వకా - త్యుత్సవమున
నతి కరచాలనా - ద్భుత నుతియుత వచ
శ్శ్రీతోఁవ నాసన - స్థితి చెలంగఁ
దేనీటఁ దన్పి మో - దింపఁ దజ్జనవార్త
లరసి తన్వేద న - త్యంబ సెప్పి

తే. తఱి యెఱిఁగి గాహనముఁ గూర్చి - తగిన రీతి
షడ్రసోపేతముగ భుక్తి - నంఘటించి
పూర్ణ పరిమళ ద్రవ్య తాం - బూల మిచ్చి
పసుపు గృహమేధి యతిథి క - ల్పంబ యతఁడు. 191

వ. ఇట్లు నిరత నిర్మల ధర్మ కర్మ పరతంత్రు లగుట సీతా శ్రీరాముల 192

కం. కాఁపురము ధర్మ వృషభపు
మూపురము పవిత్ర భావ - పుర సౌధలస
ద్గోపురము దయాశ్రీకల
కాపుర మౌదార్య విజిత - కాంచీపురమౌ. 193

సీ. గుట్టు వెలార్పక - తిట్టుకుఁ దావీక
మట్టు మీఱక మఱు - మాటలేక
పొరుగింటఁ జేరక - పోరుల రానీక
మొండిగానుండక - ముచ్చుగాక
గొణగక విసువక - కోపింప కఱవక
పతికెగ్గులాడక - పాపికాక

వదరక పదురక - పరహానిఁగోరక
కల్లలాడక వంశ - ఘనత విడక

తే. నీతిదప్పక కడుఁ దిండి - పోతుగాక
తనదు గృహకృత్యముల - నొడల్ దాచుకొనక
పరమసాధ్విగ వర్తించు - భార్యతోడఁ
గాఁపురముకంటె వేఱె స్వ - ర్గమ్ముగలదె? 194

సీ. అర్థార్థదృష్టి నా - యవ్యయై కాత్మ శ
క్త్యనుకూల జీవితా - భ్యాసుఁ డగుచు
నర్థాంగి శబ్దము - న్వర్థంబుఁ జేయుచు
నేకపత్నీవ్రత - మేదికొనుచు
బంధుమిత్రాది సం - బంధ బంధురుఁడౌచు
దుర్జన సాంగత్య - దూరుఁడగుచు
గృహపాలనాదుల - గృహిణీసూక్తి వినుచు
ధర్మార్జనమునకుఁ - దగులువడుచు

తే. సాధు సజ్జన సేవాప్ర - శస్తిఁ గనుచు
ముజ్జగంబుల కాదర్శ - మూర్తి యగుచు
వరలు నిరుపమ చరితుఁడౌ - భర్తతోడఁ
గాఁపురముకంటె వేఱె స్వ - ర్గంబు గలదె? 195

వ. అది వారి జీవితాను భవంబన నొప్పు కొండొకవేళ నుపాంశూత్సృష్ట లజ్జయై పుష్పలతావృత శాఖామధ్యంబునఁ బ్రియుంగలసి కూర్చున్న శుకింబోలె నేకాసనంబునఁ గరంగి దరింజేరిన ప్రియురాలి ముంగురులు కరంబనురాగంబునఁ గొనగోళ్ళ నిమురుచు చిబుకంబు పుణుకుచు బాహువల్లరీ బంధంబునఁ గండళిత హృదయారవిందం గావించుచు నిగ్గులొలుకు తే బుగ్గల నల్లనల్ల ముద్దిడుకొను నొద్దిక నమ్ముద్దియ దృష్టిం దనదృష్టి మేళవించి మిథోనాసాగ్రలలాటంబు లొరయ చందమామ గ్రుక్కిళ్ళానుచు నవ్యక్తానంద మనుభవించు. అహో! యయస్కాంతాంతికతల లోహసూక్ష్మ శలాకంబోలెం దరుణీతరుణు లేకాంత సమావేశమునఁ బ్రకృతిదత్త నైసర్గిక ధర్మదూరు లెట్లు కాఁగలరు. అత్తఱి వారల చిత్తంబులు రసోత్తరంగితములు కాఁగా, 196

సీ. నిర్మల శర్మద - నర్మవాక్ప్రస్తుతి
హృద్రసోద్రిక్తత - లేచ్ఛ విసరఁ
గ్లిష్ట సంశ్లిష్ట వా - గ్గేయ సారాస్వాద
మోహైక దృక్కళా - వ్యూహ మమర
సాధర్మ్య వైధర్మ్య - సదసద్వివేకైహి
కాముష్మికాంతర్య - హాస మొనర
వ్యంగ్య ధ్వనిచ్ఛటా - వైవిధ్య గర్భార్థ
భావనా ప్రజ్ఞాప్ర - భావ మలర

తే. వరుస చౌసీతి బంధ సం - భాషణములఁ
బ్రమద పరిరంభ చుంబన - భాగ్యసహిత
విహిత విద్యావినోద సం - విద్విలాస
ఫక్కిఁ గాలము వుత్తు రొ - క్కొక్కవేళ. 197

వ. అప్పట్టున నతండు రాగవిరాగ స్వరూపమ్ముల జ్ఞప్తికిం దెచ్చుకొని సతీమణితో 198

సీ. చనవుమైఁ జనవు మై - సంతరించి వరించి
యించువిర్మించుల - మంచినెంచి
మాపైన మాపైన - నేపారు నీచూపు
మరుతూపు మధురిమ - మహిమఁ జూపు
నేరైన నేరైన - శృంగార రసమీఁద
మీఁదఁ గందురు విధి - మోద మేద
వేవిన వేవిన - విహగరాగ వియోగ
యోగ రహస్యార్థ - మీగి సాగ

తే ఐహికాముష్మికములకు - నంటఁగట్టి
యొంట రెంటిని సాధించి - మంటిలోన
మణులు పెకలించి యానంద - మనుభవించు
మంచి దంపతులిహకీర్తి - మనుచునుంద్రు. 199

కం. ఆలిం జాలిగ నేలుటఁ
గ్రాలుం భర్త్రాఖ్య సార్థ - కంబయి పతికిన్

శీలమునఁబతికిఁ దులయగు
నాలికి నర్ధాంగినామ - మది సఫలమగున్. 200

తే. మాటలోమాట మనసులో - మనసుఁ గలిపి
వైనమెఱుఁగుచుఁ దమకను - వైనఁ బిదప
చేకొనిఁ జరించువారల - జీవయాత్ర
పాలుచక్కెర కలయిక - రీతి నలరు. 201

తే. వలపుఁ దేనియ లొలుకు నీ - పలుకు పలుకు
చెవినిబడ విచ్చు హృత్సర - సీరుహంబు
మలయమారుత మొలయ నా - మని నెవండు
తలిరుఁబోడిని విడనాడి - సుఖవఁగలఁడు. 202

తే. కలరసమ్ములఁ గవులు శృం - గారమునకె
యేల నీరాజనమ్ముల - నెత్తిరనఁగ
మధురసానందభరిత దాం - పత్యసుఖమె
సృష్టి కాధారమని కళా - దృష్టిఁ గనుట. 203

కం. కల్లంగాటుగ నైనను
వల్లభు నెదిరింప కతఁడె - ప్రాణంబనుచున్
గల్ల కపట మెఱుఁగని సతి
కెల్లయెడల మేలుగాక - యేలన్యమగున్ 204

తే. వలపుఁదలఁపులఁ బొలతుక - కులికికులికి
యధరమధుర రసంబాన - నలముకొన్న
దాని యనుభూతి యను సుధా - పానమత్త
చిత్తునకు వేఱ స్వర్గమ్ము - చెప్పనేల ? 205

కం. తనగృహమని తనమగఁడని
తనకుం దానెఱిఁగి బాధ్య - తల నెఱవేర్పన్
మనసిడి కాఁపురముండెడి
వనితామణి గల్ల వేఱె - స్వర్గంబేలా ? 206

వ. గృహసౌభాగ్య వివర్ధనమున విష్ణునకు లక్ష్మివలె యశఃకర కరుణాకరకృత్యమున విశ్వనాథున కన్నపూర్ణవలె క్లిష్టసమయంబునఁ

గృష్ణునకు సత్యభామవలె సమాలోచనా సమయంబున బ్రహ్మకు సర స్వతివలెఁ బెట్టుపోతలఁ గుమారస్వామికిఁ బార్వతివలెఁ గేళీగృహంబున మన్మథునకు రతివలె వర్తించు సతి యెట్టి పుణ్యాత్ములకోగాని లభింపదు.

తే. ముగ్ధమోహన రసవార్ధి - మంచితేల్చ
నిహపరంబుల నరయఁగ – నిర్వురె కద!
నరునకుం జెట్టువట్టిన – నాతి యొకతె
ఘనమనీషాత్తనుతముక్తి – కాంత యొకతె. 208

వ. అని యివ్విధంబున వైహికాముష్మికానందంబులఁ దిఙ్మాత్రముగ సూచించిన మనోహరవచోంతర్గతేహపర శబ్దంబులం దిహమాదియగుట ధర్మసమ్మతైహిక సుఖానుభవంబు ప్రథమ కర్తవ్యమని తత్ప్రమాణం బుగఁ దన సంతోషమె స్వర్గమన్న వేమనసూక్తి జ్ఞప్తికిం దెచ్చుకొని సీత యపాంగావలోకన దయావాస్యందుండగు హృదయేశ్వరుం గనుంగొని, "ప్రాణవల్లభా! యిప్పటిభేదనమ్మున మీ విద్యాభ్యాస సమయమ్మున మీకుం బరిచితంబులై వేద్యంబులై చూడ్కికి వేడ్కసేయు ప్రదేశము లెయ్యవి. సయోధ్యవిద్యార్థి బృందముతో స్వైరవిహారము సల్పిన తావు లేవి? అందు నేఁ జూడఁ దగిన ప్రసిద్ధ విశిష్ట దృశ్యము లేయవి" యని ప్రశ్నించిన ప్రియురాలి యాంతర్య మవగతముచేసికొని, "ప్రేయసీ! యెల్లి భట్టారక వారమగుట నాకుం గొంత తీరికగలదు. గాన నీకుం గొన్ని దేవాలయ విద్యాలయ వైద్యాలయ నగరోద్యానాదులఁ జూపగల" నన నామె సంతోషసాగరనిమగ్న మానస మయ్యె. అంత నమ్మఱునాఁ డప్పట్టణ సుందర దృశ్యాది దృక్ప్రాంకురితాహ్లాదయై. 209

సీ. నల్లబిండియు నబ్బు – వెల్లు రా మై రుద్ది
గోర్వెచ్చ నీరాడి – కొసరి యద్ది
పర్ణనీలేశ నం – ప్రాప్తాంగ రుగ్ధార
చాంపేయ పత్ర భా – స్పర్ధమించ
జిల్గ కట్టి యొకింత – నల్లని వాల్గడ
డంబుమీఱిన కదం – బంబుఁ దుఱిమి
మచ్చ జాబిలి లొచ్చు – హెచ్చు మోమని దృష్టి
చుక్కనా నునుసాదు – చుక్కపెట్టి

తే. ప్పృపుల సుమనామ కుంచికా – హ్మ్రాత లలితసి
తాత్రి పరిమళముఖచూర్ణ – మలఁదికొనుచు
సమత కుదిరినదా యని – సారెసారె
కద్దముసఁ జూచి యద్దాని – సద్దుకొనును. 210

ఉ. తుమ్మెదబ్రాలియున్న సిత – తోయజమున్ సరిపోల్పవచ్చుఁ గా
కెమ్మెయిఁ బుండరీక మొక – టీడగుఁ దళ్కుపిసాళికంటికిం
పమ్మెదపిండె యెట్లు సరి – తూఁగును వాల్గడ కూర్ధ్వభాగమం
దమ్మెయిఁ దెల్లదామరలు – నందముగాఁ గయిసేసి యుండఁగా.

తే. పవలు రే కాంతి హీనతఁ – బడయు కతనఁ
జంద్ర పద్మము లెటు ముఖ – సదృశములగు
నింబ పత్రము బొమదంబు – నెగడునన్న
వర్ణభేదముచే నది – వైదొలంగు. 212

తే. ఆమె పతినేయ నిందీవ – రాఖ్య శరము
మరుఁడు గుఱిచూచుచో నట్లు – తిరిగినదనఁ
గజ్జలముఁ దీర్చుతఱిఁ గడ – గంటు దళిత
లలితనేత్ర కనీనికా - చలన మలరె. 213

తే కామ కార్ముక వక్రరే – ఖాప్రకార
క్రమకాంతుల భ్రూరమ – కానిపింప
నతని కరవాలకోశ మా – కృతిఁ గనంగ
రీతి యిట్లనఁ గాటుక – రేక దనరె. 214

చ. పతిత శుభార్థ కృద్ఘనకృ – పాగుణ పావనదేశభక్తి యీ
సతిపతిఁ జూచి నేర్వఁ బగ – జార్చి సుశీల సమాశ్రయించి స
త్కృతి సహితైక్యతం బరహి – తైక మతిం బరమార్థదృష్టిమై
శ్రుతిగతులైరి నాగ గురు – శుక్రులు రవ్వలజోడుఁ దాల్చెఁ బో.

తే. సహజ సౌందర్యరమఁ బెంచె – స్రష్టశిల్పి
జవ్వనము పేర నిపు డంటు – బిత బిగింప
జెక్కుటద్దాల తళ్కులు – పిక్కటిల్లె
నున్నవారిక పెట్టరే – యున్నవారు. 216

తే. నగల జిగి ముందెకాన వె – న్కయు గడింప
వాలుజడ కీలుకొల్పెను – వాలపార్శ్వ
సుదతి దీన స్వస్త్రీల వ – క్షోవిశిష్ఠ
రమ కురము సాటి నాగ హా – రము ధరించె. 217

ఉ. దండి యెడంద దందడిలు – దాలిమి మేలిమి యబ్బ యుబ్బుచున్
రెండుగఁ బుట్టి యుం గలసి – రెక్కొను నైక్యత సూచకంబుగా
నుండఁ దదాశ్రయంబున య – థోచితరీతి గుణంబు గల్గఁగా
రెండు నొకండుగాఁ గదిసి – వ్రేలె నురోజములందుఁ బేటలున్. 218

తే. మెడ పడమటి మలఁ బొడమి – వడిగ రెండు
పాయలై కుచప్రాగ్గిరి – ద్వయము కలసి
నాభివారిధిఁ జేరెడి – నది యనంగ
దళుకుఁ బస సంకుపూసల – దండదనరె. 219

శా. లేఁగౌఁదీఁగె యురమ్ము వ్రేకమున నే – లీలం గుఱుల్దప్పఁ దా
సోగంజేయునొ మారుపోరులని పె – ల్చ న్మధ్యమ ప్రౌఢికై
నూఁగార న్మరు బాఁకు దాఁచుకొని త – న్ను న్నాథుఁడోడించునా
నాగాఁ దాల్చెను గాసెకోకటు వెసం – దత్కాంత యొడ్డాణమున్.

వ. అంతకుం గొంత ముంద సుహృద్రత్నతతి సహితుండై యరిగిన హృదయేశు రాకకు రాకాశశిరాకకుం గుమిదినింబలె నిరీక్షించుచు నగర ప్రధాన దృశ్య సందర్శన కుతూహలాయత్త చిత్తయై. 221

తే. చీమ చిటుకనఁ బతివచ్చె – నేమొ యనుచుఁ
జెల్వ యొడలెల్లఁ గన్నులు – చేసికొనుచు
బ్రేమఁ గనె గుమ్మ మాస్థాన – సీమ నున్న
రాజురాక కెదురుసూచు – రాణివోలె. 222

ఉ. పొడగని పొంగి పేదనిధిఁ – బొందినకైవడి నూటు బూటులన్
విడిచెడివేళ నందుకొని – వేగమ తాన తగిల్చి కొంకులం
గడువడి వేడినీళ్లనిచి – గందపు సబ్బునఁ దోమి జిల్గులౌ
మడువులొసంగి బోనమిడి – మన్నన గప్రపు వీఁడె మిచ్చుచున్.

కం. మృదుమధుర వాగ్విలాసము
లదను పదను లొదవఁ జూపు – చాతసి ప్రేమా
స్పద మార్ద్వీక ధురీణిత
పదముల నానంద రసము – పానము సేసెన్. 224

కం. తన తోడిద లోకమ్మని
ఘన సాధ్వీమణుల యట్లు – గడపెడి నవలా
కనుగొస నునుఁజిగిఁ గనుఁగొన
మనమలరదె యలరు విచ్చు – మాడ్కి నతనికిన్. 225

## బంబయి వర్ణన

వ. కన్ను సన్నల మెలంగు నన్నులమిన్న తిన్నని కోర్కులం దీర్ప నెవండు తిరస్కరించు. శీలసామ్రాజ్యలక్ష్మికి వినయము మకుటాయమానముగదా! ఆకె ముఖదర్పణంబున నూతన సంతోషచ్ఛాయ లలము కొంటఁ గంటికింపుగాఁ గనుంగొని పరేంగితావగాహియగు సతండు పురా దత్త వాగ్దానంబు స్పృహాకురా నుచిత వస్త్రాలంకృతుండై నగర సందర్శనాయత్తచిత్తయైన నిజమత్తకాశినితో నిర్గమించి కించిద్దూరమరిగి రాజమార్గముల గమించుచు విపణివీథ్యంతర శృంగార శృంగాటకంబున నిలిచి ప్రేయసీ! నైకవర్ణపరిమళమిళిత కుసుమ విసర పరిశోభిత బహు విధలతాపాదపవిలసిత కేళివనాళింబలె వివిధ మతమనోభావ వేషభాషా భూషాకలిత దేశవిదేశ ఖండఖండాంతర నరసమ్మర్దమ్ములగు విశాల విని ర్మల రాజమార్గమ్ముల నవరుద్ధార్కపథజనితోత్సేకాతిశయాన్వితేద్ధమహో త్సేధ సౌధరాజమ్ముల నింపు నింపు నీ నగర రాజరామణీయక మెంతని వర్ణింపఁ గలను. ఇతఃపూర్వము పోర్చిగీసువా రాఁడుబిడ్డ కరణముగా నీ నాంగ్లేయుఁడైన ప్రథమ చార్లెసున కిమ్మహాపుట భేదమ్ము సంక్రమింప నతండు పది పౌనులకుఁ బ్రాగ్భారత వాణిజ్య సంఘమున (East India Company) కిది విక్రయించె. నాఁడె యీపురవరమునకు శుభ గ్రహంబు లేకాదశస్థానంబునంజేర రాజయోగంబు సిద్ధించె. అర్థవృత్త విద్యా పరిత్యాగ పరిశోధన ఫలితమానవ ప్రతిభా పరిష్కృత నూయజా హ్వాయకుల్యాపథనికటమునసుంట స్వల్పదీప వినిర్మిత ప్రకృతి సిద్ధాద్వితీయ

భారతీయ నౌకాశ్రయ మేర్పడుట నాస్ట్రేలియా, యిండోనీషియా, బర్మా, యాఫ్రికా, పర్షియా, యరేబియా, యిటలీ, స్పెయిన్, ఫ్రాన్సు, హాలెండు, జర్మనింగ్లండు ప్రభృత్యనేక దేశయాతాయాత నౌకాయాన మార్గమధ్య స్థంబగుట నానాఁట నానావిధ సూత్ర వస్త్ర యంత్ర సంకలిత వర్తక వ్యాపారైభాశక్తి వణిగ్వ్రతంసంబు లోలింబైఁడి తేఁడులగుట, నవనవో న్మేషప్రాపంచిక నాగరికత కసల్ప దర్పణమై విశేష విశ్వ విఖ్యాతి నంది యిమ్మహానగరంబు పాశ్చాత్యవిద్వచ్ఛిరోమణి గణముచే భారత దేశ ముఖద్వార (The Gate Way of India) మని పిలువఁబడుచున్న దనఁ దత్సతీమణి 'పింగళ కనీనికాద్యుతి సహిత చంచరీక నీలక చోపేత శ్వేత శరీరు లగు వీరలెవ్వ'రన 'గ్రీకు భారతీయ సంప్రదాయ సమ్మేళనమ్మున గాంధారశిల్ప మేర్పడి న ట్లాంగ్లేయ భారతీయ సంప ర్కమున నాంగ్లోయిండియనులను నొక తెగ యేర్పడె. వారు వీర. హృద యేశ్వరీ! ఇట్లు సృష్ట్యాదినుండి మానవజాతు లనేక పరివర్తనములఁ బ్రవర్తించె. జాతుల రీతులు నీతులు పలుదెఱంగుల నుంటయుఁ దాత్కాలిక ముగ నొక యందముగనే దోఁచు. ఒక్క మనోహర మహాపద్మాకర మ్మున ననేక విధ ప్రాణిగణంబులు జన్మించి జీవించుచున్న ట్లన్యోన్య విరుద్ధ ధర్మ ప్రతిపాదక సూక్ష్మజీవు లేకాశ్రయములయ్యు నాధార ధ్వంసకములు గానట్లు కాశ్మీర, సౌరాష్ట్ర, మహారాష్ట్ర, వంగ, కళిం గోత్కలాంధ్ర తమిళ, కర్ణాటక, కేరళ, మళయాళ, హిమాలయ మధ్యోత్తర ప్రదేశాదుల ప్రజ లిటఁ దత్తదుచిత వేష భాషలతో మెలంగు చుండ భారతదేశ మొక ఖండమనందగు ననుపల్కు స్మృతిపథంబున గోచరింప 'భరతవర్షే భరతఖండే' యను వైదిక వాక్యనంగల యంత రార్థము తళుక్కున మెఱయును. 226

కం. భిన్నత్త్వైకత్త్వము శ్రుతి
నున్నటు వాఙ్మత విభేద – మున్న స్వదేశం
బెన్నొవితంబుల నైక్యత
చెన్నారుం ఖండమనుచుఁ – జెప్పననువుగా. 227

కం. మన విశ్వాస విభేదము
ఘన మనసుల మార్పు సెందు – మతముల పేరన్

ఫణిధర మణిధర భేదముఁ
గన మార్తావన విశిష్ట – కార్య భరమునన్. 228

కం. త్రో త్రోపులాడుదురు ప్రజ
లీ త్రోవల మార్గనియమ – మేర్పడినను బె
ల్లాత్రంబున రథ్యలఁ జన
నేత్రసహస్రంబువలయు – నేర్పును వలయున్. 229

వ. ఇట్టి దృశ్యంబులంగనఁ బ్రకృతి శాస్త్రరహస్యంబు స్ఫ్రుహకు వచ్చు.

ఉ. ఎండయు నీరమున్న దెస – కేఁగును గొమ్మలు వేరు లట్లుగా
బొండనకుండఁ బోవుదురు – పొట్టకు బట్టకుఁ జిక్క చోటికే
యండయు దండయుం బొసఁగ – నట్టి ప్రదేశమునందు మానవుం
డుండియు లేనివానివలె – నుండి క్షయించును నీడమొక్కనా. 231

వ. ప్రేయసీ! స్వదేశంబున మహానగర ఖ్యాతిగాంచిన నగరత్రయం బున నిది ద్వితీయంబు. కాని వివిధవర్తక కేంద్రంబుల నిది యద్వితీయంబు. పల్లెలకు నిమ్మహానగరరాజమునకు గలభేదము గమనింపుము. 232

సీ. యంత్రాళి మంత్రణ – తంత్రగాత్రమెగాని
కాలజ్ఞ పత్రి మే – ల్కనుపులేదు
చారు లోహరథ సం – చారశబ్దమెగాని
నాతిమంథాన గా – నమ్ములేదు
సమయ నిర్ణయవేది – 'సైరను' ధ్వని గాని
ఝిల్లికారఘూట సం – సిద్ధిలేదు
వ్యోమయానాగత – భూరి ఝుంకృతిగాని
ఘనగవారావపా – వనతలేదు

తే. దివ్యసౌధాళులేగాని – తిన్నెఁ బర్ణ
శాల చాలున కిచ్చోట – సక్తిలేదు
భవ్య నవ్యతయేగాని – ప్రాఁతలేదు
గ్రామనగర విభేదంబు – ఘనతరంబు. 233

తే. బహుముఖీనవణి జ్మణీ – భాగ్యరేఖ
రసికనాగరికాత్మైక – రసపిపాస

నాన్యతో దర్శనీయ – విన్యాస భాస
రూప సౌందర్య సంపద – రూఢి యిచట. 234

తే. ఉదయగిరి బాలభానుండు - వొదలుచుండ
నస్తగిరి శశి వెల్గొంది – నట్ల పురిని
జలనచిత్రప్రదర్శన – మలరుచుండ
వీధి బాగవతమ్మును – వెలయు నొకట. 235

తే. రీతు లలవాట్లు దృశ్యము - ల్జాతులు గుణ
గణముˈలెవి పుట్టు నవిగిట్టు – కణఁగి పెనఁగి
బీజమాత్రంబయైనఁ గ - న్పించుచుండు
సృష్టినిర్మాణ గూఢ వై - చిత్ర్యమిదియ. 236

కం. పల్లెల పిల్లలు తల్లులు
నిల్లిల్లుందిరిగి విక్ర - యింతురు పురిలో
మల్లెలు మొల్లలు కొల్లగ
సల్లాపములాడికొనుచు - సఖులుందారున్. 237

వ. అన్నులమిన్నా! యిది యొక యెన్నికగన్న తేనీటి శాల. సువిశాల
సౌఖ్యాలవాల ధనలోల జనసమ్మర్దశీల గానలోల. 238

శా. ఆలోఁ జంచల దివ్వె లాంధసిక శ – క్త్యాకృష్ట పణ్యారముల్
లీలావేశ్మ విదేశదేశపటము – ల్లేహానసోత్సేకముల్
వ్యాలోలానిలయంత్రము ల్నవనభో - వాణీస్వనంబు ల్సదా
యాలోకోత్సవమై వెలుంగు నిట న - ల్పాహారశాలావళుల్. 239

వ. నవనాగరిక శిఖామణులు గొందఱు వేళపాళయనక సుహృదాదులు
నుడినపుడెల్ల నీ సద్మంబునఁ బ్రవేశించుచుంద్రు. అది యారోగ్యంబున
కనుచితంబను తెలియంగరు. ఎఱింగిరిపో చిత్తంబు మెత్తఁబడ జిహ్వా
చాపల్యమునకు లోనగుదురు. 240

తే. తఱియు నాఁకలి తను నిజ - తత్త్వ మరసి
తిండిపైఁ దిండి కాకుండఁ - దినుట లెస్స
పచనమగు వేళ నోరెపుం – బాత్రనిండఁ
దిరిగి తండులములు వేయఁ - దిప్పలెగద! 241

వ. ప్రియురాలా ! యేతత్పురీసమర్చిక చరిత్రమున ముందుగా ముచ్చటింపఁ దగిన విషయములు మఱచితి. విను. వీరశైవులు దేశభక్తాగ్రగణ్యులు నగు మహారాష్ట్రుల కులదేవతయై విరాజిలు ముంబాదేవి దేవళము శిల్పవిద్యావైదగ్ధ్యమునుబట్టి యతి పురాతనమగుటయుఁగాక యత్యంత చరిత్ర ప్రసిద్ధము; ప్రశస్తము. హరిద్వారమునందు మాయాదేవి కోవెలంబట్టి మాయయను నామాంతర మేర్పడి నట్లా దేవ్యాఖ్యయాధారముగ నేర్పడిన వికృతరూపమె యేతన్నగ రాభిధాన మగు బొంబాయి. రవికవివార ద్వయమ్మున దైవనిష్ఠాపరులు చందనతాంబూల కదళీ ఖర్జూరనాళికేరనారంగ కర్పూర పుష్పాది పూజాద్రవ్యములతో దండోపతండములుగ నగ్గుడి కరుదెంచి జగజ్జనని భక్తి ప్రపత్తులతో నారాధింత్రు. పదంపడి పేర్కొనం దగినది మహాలక్ష్మ్యాలయము. అయ్యది రేవియాఖ్యపారావారతీరమున వెలయుచున్నది. ప్రకృతి సిద్ధ రామణీయక విశ్వదృశ్యముల పరికించుచు యాతాయాత నౌకాధిరాజములఁ దిలకించుచు మానవమనోవాంఛానిభ నిరంతరోద్భవోద్వృత్పతనోత్తుంగ తరంగ శోభితాకూపార గంభీరారావంబు వినుచుఁ దద్వనధి పవనస్పర్శ సౌఖ్య మనుభవించుచు దేవి నర్చించు భాగ్యమబ్బునని సాయంసంధ్యా సమయమునఁ బౌరు లటకు విరివిగ నరుదెంత్రు. అర్చనానంతరము తిరిగివచ్చువారల నాశీర్వదింప సముద్రుడు సారె కున్నమిత హస్తుఁడగుచున్నాఁడో యన వీచీపరంపరోత్పతత్పాతము లలరు. ఏకదండి త్రిదండి ప్రభృతులు యాత్రార్థ మేతెంచి పద్మాసనాసీనులై నిమీలితనేత్రులై నిష్ఠాగరిష్ఠులై నిలిచియుంద్రు. అగ్గుడిఁ బ్రతి భట్టారక వారమ్మున విధివిహితముగ జపహోమాదులు జరుగు. అయ్యాలయంబున దసరా యుత్సవంబులు నేత్రోత్సవంబుగా నడుపంబడు. ఇప్పత్తనంబున బ్రాచీన కాలంబునఁ బ్రతిష్ఠింపఁబడి పూజింపఁబడుచున్న యాంజనేయస్వామి గుళ్లు పెక్కు వర్ధిల్లు. స్వామి నర్కపత్రమాలాలంకృతుం జేయుదురు. మందవాసరంబున నమందానందముతో నర్చలు జరుగుచుండు. శివకేశవ సుందరమందిరముల ఘంటారవంబుతోఁ బ్రణవనాదము సుతిగల్పి ప్రార్థించు సద్భక్తుల వేడికోలాలించుటంజేసి లోకము సుభిక్షమొనర్ప దైవాజ్ఞ భావి సకాలవర్ష వారివాహములకుం బ్రాతిపదికగా నేగుచున్నవో!

యన నాఁటి హోమధూమమునకు మాఱుగా నేఁటి యఁగురు సాంబ్రాణి ధూపము లాకసమున కెగురుచుండు. 242

తే. సాధ్వి! మార్వాడి గుజరాతి - జైన బౌద్ధ
పారశీకాలయంబులు - పరగు నిచటఁ
తీరువేఱైనఁ బ్రార్థనో - ద్దేశ మొకటె
భాషలాకృతి వేఱైన - భూరి యొకటె. 243

తే. ఒక్క దేశాన నొక జాతి - నొక్క యింట
జననమందిన మాత్రాన - సమత గలదె?
నిర్విషయు వత్సనాభియు - నుర్విఁ దోడఁ
బుట్టువులు కాని గుణవైర - ముట్టిపడదె? 244

కం. మని మన నిచ్చెడి ధర్మము
మనకున్నది మొదటినుండి - మానవసేవా
ధనులగు మహాత్ము లెందఱొ
జనియించిన పుణ్యభూమి - సారసనేత్రా! 245

వ. ఐనను బరమేశ్వరుని సృష్టిలో సద్గుణ గణంబు లన్నియు నొక్క చోట కేంద్రీకరింపఁబడి లభించుట దుర్లభంబు. ఆలోపమును సరిదిద్ద నెంత సాహసించినను మానవునకు శక్యము గాదు. 246

ఆ.వె. విత్తమొక్కచోట - విజ్ఞాన మొకచోట
వెలుఁగుచుండు రెండుఁ - గలియకుండు
కలిసెనేని తావి - కనకంబు బొందుటే
స్వర్గసుఖము పుడమిఁ - బడయఁ గనుటె. 247

వ. ఇట నిరక్షరాస్యయగు భార్యను విదుషీమణింజేసిన భర్తయుం గలఁడు. జీవితరహస్య మెఱింగిన వారి చర్యలట్లుండు. కాదేని వారి బ్రదుకు పూర్ణవికాస భాసురము గాదుకదా! అది యెట్లనిన. 248

ఉ. అష్టమినాఁటి చంద్రువలె - నర్ధము వెల్గు సగంబు నిష్కళా
శ్లిష్టము విద్యకల్మియొక - చెంతను విద్యకొఱంత యొక్కెడన్
దృష్టము ద్వంద్వజీవిత మ - దెట్టులు పూర్ణవికాసయుక్తమౌ
నష్టవిదుల్వధూవరు ల - నంతరహిన్ భజియింత్రు భారతిన్. 249

కం. శ్రమయనక పరిశ్రమ స
క్రమముగ నొనరింప దైవ - కరుణామృత మా
శ్రమజీవికి దక్కుటలోఁ
గ్రమ భిన్నము గానరాదు — కమలదలాక్షీ! 250

శా. విద్యాజ్ఞాన వివేకనేత్రయుతుఁడే - ప్రవృత్తిం బ్రవేశించినన్
హృద్యశ్రీలఁ జరించు నంచు బుధులెం — తేఁ బల్కరే తత్ఫలం
బాద్యంబౌఁ బరమార్థ దృక్పథ యశో — హర్మ్యాగ్రముంజేర సం
పద్వ్యక్తి న్ధనదాన సద్గుణ సధ — ర్మ శ్రీలతావృద్ధికిన్. 251

వ. గ్రామటికలకంటె నిటఁ బెక్కురు స్త్రీపురుషులు విద్యావికాసయుక్తులై దేశకాలపాత్ర పరిసరానుకూల వాతావరణ నాగరికతా విలసితులై జానపదదృష్టి కొకవింతశోభలఁ గన్పింతురు. విశ్రాంతి సమయములఁ బల్లెప్రజ లాబాలగోపాల మన్యోన్య సహకారమున విద్య నభ్యసించినచో వారు విజ్ఞానాభివృద్ధి బొంది జీవితము సులభ సుఖ సురభిళ సమన్వితము జేసికొనఁ గలరు. ప్రకృతిం బరికింప. 252

ఆ.వె. ఇల్లు పాఠశాల - తల్లియే తొలియొజ్జ
పరిసరమ్ము ప్రథమ — బంధు జనము
తోడఁ బుట్టులెల్లఁ — తోడి విద్యార్థులు
తండ్రి మార్గదర్శి — తత్త్వమునకు. 253

వ. ఇంతటి మహానగర రాజంబునంగూడ సమాపనీపూర్ణిమల తెఱంగు గష్టసుఖములు కలిమిలేములు గలవు. కాని యెంత చెట్టున కంతగాలి.

ఆ.వె. పాలఁ బంచదారఁ — బడయుట కొక్కండు
పుల్లనీళ్ళ కుప్పు - పుట్టకొకఁడు
నెమకుచుండు బాధ — సమముగ మదికుండు
లేమి కష్టభూమి - కామికెపుడు. 255

ఉ. ఇంతటి దివ్య భోగకళ — కిల్లని యెంచకు మెల్ల మంచిగాఁ
గాంతరొ! సూర్యకాంతిఁ గడుఁగాంతము లౌనవి కాంచనంబులే?
యెంతటి దైవశక్తి యిట — నేర్పడియున్నదొ యంత మోసమొ
క్కింతయుఁ దగ్గకున్నది స — తీ కల తిల్లికఁ బుట్టినీడగా! 256

వ. ధర్మమార్గవర్తనమునకు దోహదమొసంగునదే దైవదత్తజ్ఞానము. అది మానవున కనన్య సామాన్యవరము. నారీమణీ! మనుజుని వేష భాషలంబట్టి నమ్మదగినకాలము గతించినది. 257

చ. నరుఁడిటు కావిరంగు వస - నంబుల మాటునఁ జేయుదుష్క్రియా
దురితపు వింజమాకిడఁగఁ - దోఁపఁడగస్త్యుఁడొకండు దోఁచినన్
సరిగఁ బ్రధానసత్యమొగి - సాగఁగనీయదులోక మెల్లఙుం
బరులకు బోధసేయుతఱి - భామరొ వ్యాసపరాశరుల్ కదా. 258

వ. ఈ సువిశాల పురవరమున మనము గనందగిన వెన్నేనియుం గలవు. న్యాయస్థాన విశ్వవిద్యాలయ గ్రంథ భాండా గారాదుల మఱి యొకపరి పరికింతము. కాని మానవుని దివ్యజ్ఞాన తృష్ణ కవి యమృత కలశములు. 259

సీ. సముచిత విజ్ఞాన - సస్యసమృద్ధికి
మేలిహలములు గ్రం - థాలయములు
బహువిధ భాషా వి - భాస పుస్తకసుమో
ద్యానవనములు గ్రం - థాలయములు
సర్వమానవ నవ - సఖ్యద విశ్వవి
ద్యాలయ సఖులు గ్రం - థాలయములు
ప్రగతి మార్గాన్వేష - పర బుధవరకల్ప
సాలఫలములు గ్రం - థాలయములు

గీ. కనకమణి గణ ఘంటికా - కలిత కటక
మేఖలా కంకణ నినాద - మిళిత వినుత
లలిత భారతీ నృత్య క - ళా విలాస
జాలములు నిర్మలములు గ్రం - థాలయములు. 260

వ. విజ్ఞాన సముపార్జనాబ్ధింబయనించు విద్యార్థి కర్ణధారునకుఁ బుస్త కాలయములు దీపస్తంభములు. ఇఁగ విశ్వవిద్యాలయము లెట్టివన. 261

తే. ప్రభుతపోషింప వన - పాలవర్గ మట్లి
విబుధగురులుండఁ గలలతో - వెలయునట్టి

భృశలసచ్ఛాస్త్ర విజ్ఞాన – వృక్ష దివ్య
దమృతఫలములు విశ్వవి – ద్యాలయములు. 262

వ. ఇఁకం బద్మాకరనికరమ్మున విహారసరోవరము (విహారలేక్) పవాయి పద్మాకరము (పవాయి లేక్) ప్రధానములు. భారతదేశముఖ ద్వారమునుండి కరిదరుల (Elephantae Caves) కరుగనగు. ప్రపంచ ప్రసిద్ధివడసిన 'తాజమహల్హోటులు' తత్ప్రకటకమున నలరారు. మలబారీ గిరులపై వేల్లదారామవార (Hanging gardens) మొండు నిండుఁదనం బున కన్నులపండువుగనుండు. ఇమ్మహాపుటభేదనమ్మున హిందువుల పండువుల వినాయకచవితి పెన్పండువు. దీనిం గణపతి నవరాత్రు లందురు. చవితినాఁడు మృణ్మయ నిర్మిత ద్వైమాతురుం బ్రతినికేతనంబునం బ్రతిష్ఠించుకొని శాస్త్రోక్తంబుగ నవదివసంబు లత్యంత భక్తిసర్చించి కడపటి దినంబున మంగళవాద్యములతో నూరేగించి చౌపాటి వీచి కరిగి జలధిఁ గలుపుదురు. దీపావళి హోలీపండువులు మహాలక్ష్మీపూజా హల్లీసకాదులతోఁ గన్దోయికి విందుసల్పు ఇట కల్లంతదూరమున 'ఫ్లారోఫౌంటె'నను ప్రదేశ మధ్యస్థలమున వివిధదేశ నిర్మిత సమాగత నూత్నకళాకలితలోహరథంబు లసంఖ్యాకములుగ దివారాత్రముల నిలిచియుండు. ఇప్పురి పారావార తటస్థమగుటఁ దీరవిహారసీమ లత్యా ధికములయ్యె 'మెరీనైన్సు వీచి, నార్మన్‌పాయింటు వీచి, చౌపాటీ వీచి, జ్యూ వీచి' యనునవి ముఖ్యములు. ఇంకిటఁ గోరకిత ఫలితలలితలతా వితానయుత జనసాధారణోపవనములు పెక్కున్నను శివాజీ మహో ద్యానము జాతీయారామము విక్టోరియావనాళి ప్రఖ్యాతములు. తద్వి క్టోరియా నందన నివహమున నద్వితీయ జంతుప్రదర్శనశాలయు సువిశాల మనోహర సరోవరంబును నలరారు. అనతికాలంబునఁ జూడఁ గలమని మధ్యేమార్గమున— 263

కం. స్మర జిన్మరజన్నిలయము
లరయుచుఁ బూజించి కాన్క – లర్పించుచుఁ ద
త్పురవనరాజముఁ గనఁ జె
చ్చెరనరుగుచు నూత్నభవన – శిల్పముఁ గనుచున్. 264

వ. కొంతసేపటికి విక్టోరియానాళీకాకరాకలితవనాళిం బ్రవేశించిరి. 265

# సీతారాముల వనవిహారము

సీ. పోకచుట్టును మల్లె - పూవులు విరబూసి
నీలిపిట్టలు పైన - వ్రాలినట్లు
తెల్లదామర మొగ్గ - లల్లన వికసింప
వానిలోఁ దుమ్మెదల్ - వరలినట్లు
దొండపండటుచాటు - దోఁచు చుండిన యంత
పండిన దానిమ్మ - బరగినట్లు
మంచు ముసుఁగులోన - పొంచి చూచెడి మంచి
ద్రాక్ష గుత్తులు రెండు - దనరినట్లు

తే. కొసరి కోకిల ముద్దుగాఁ - గూసినట్లు
చిలుక పకపక నవ్వుచుఁ - బలికినట్లు
లిట్టు లెంతేని వర్ణన - పుట్టుఁ గాన
వనలతా రూప దేవత - వచ్చెనేమొ. 266

కం. అని యనఁదగు సీతమ ప్ర
క్కన మాధవుఁ డనఁగఁ గూర్మి - గడలు కొనంగా
వినయ వివేక వచస్సుల
వనితామణి కెంతొ వంత - పాడుచు నడవన్. 267

సీ. కమనీయ వర్ణతా - కర్షణ పత్ర ప
ట్టాంబరముల నంద - మలరఁ దాల్చి
యహరహ వ్యాకీర్ణ - బహువిధ సౌరభ
ఘ్రాణ తర్పణ దివ్య - గంధ మలఁది
శాఖి శాఖా దీర్ఘ - సౌధాగ్ర సంవాస
భాసుర భవ్య వి - లాస మంది
యాత్మైక్య భావనా - హ్లాద మేదుర సూచ
కంబుగ గుచ్ఛాప్తి - కలసి మెలఁగి

తే. అల పరాగ కోశములను - నక్షతలను
గేసరకరమ్ములం బ్రేమఁ - గీలు కొలిపి

పొసఁగ దీవించు నవసుమ - పుణ్య సతులు
గాలిప్రేరణఁ జల్లి రా - ఘనుల మీద. 268

వ. అట్లాశీర్వదింపఁ బడి. 269

కం. తిలకించిన లతికాతతి
తిలకించుచుఁ దారసించి - తిలసుమనాసా
తిలకం బలరుల తావికి
నలరుచు రుచులీను సూన - మారయుచుండన్. 270

చ. అలరుల తీవ కొమ్మలకు — హారముగా దిగ్రవేల వానిపైఁ
జిలుకల జంట ప్రాలి కడుఁ — జెంతకుఁ జేరి విలాసచేష్టలం
గలకలకూసి చంచుపులఁ — గల్వ రతీపతి తేజి గజ్జెలే
గలగలలాడి నట్లమర — గాఁ గని రిర్వురు వాలుచూపులన్. 271

కం. పూలొరసి విరిసి కురిసినఁ
గాలువలై పాఱు తేనె - గల యవ్వని మేల్
చాలఁగ నొందని పులు గళి
జాల మ్మెద జాలిలేని - జంతువు గలదే? 272

కం. ఆరామ రామణీయక
మారామ కపారముదము నాపాదింపం
గారామునఁ బతి గనుమనె
సారాసార ప్రసార జలయంత్రంబున్. 273

వ. అట్టియెడ మలయానిల సముపార్జిత నానావిధ సుమ సౌరభ సంజాత సంతోష సంభరిత చిత్తయై. 274

మ. అరుదార న్మరుదారనాఁ దనరె న - య్యంభోజ పత్రాక్షి, త
త్పురిఁ దోఁట న్విరిబాటఁ బ్రక్కఁ బతి సం - తోషంబునం గ్రాలుచో
మెఱుఁగార న్మదిదీర సారస సము - న్మీలద్వచోల్లాసుఁడై
మఱపింపం దమకింప మే మనము సం - భావించి సానందయై. 275

మ. ననవిల్కానిశరాళి తావు లలమ - న్నారీశిరోరత్న మ
వ్వన బృందావనసీమ రుక్మిణిగఁ దాఁ - బ్రాణేశు సాక్షాత్తు కృ

ష్ణునిగా భావనచేసికొంచు నును బూ - సొంపుల్విలోకించుచుం
దనుదానే మఱచున్ దలంచు విధిమై - దగ్ధ్యం బనూనంబుగన్. 276

కం. వలపులు పూవలపులు లలిఁ
దలఁపుల తలుపులనువిప్ప - దరుణీతరుణుల్
గలసిమెలసి కవజక్కవ
వలె మెలఁగిరి తోఁటనాల్గు - బరులం దరులన్. 277

వ. అభిజనము చెన్నపురమగుటఁ దమిళపరిచయమొందుట సాంకేతిక విద్యాభ్యసనావసరంబున మహారాష్ట్రముఁ జవిచూచుట నిపుడు వినుకను దృశ్యస్వభావంబులఁ దాననుభవించుచున్న సంతసమునకంటె సీతకశ్రుత దృష్టిచరంబులగుట నయ్యింతి యనుభవించుచున్న యజ్ఞాతాశ్చర్య గర్భితానంద మధికమని గ్రహించి తద్వన కమలాకరంబుందఱిసి. 278

చం. అలికులవేణి! కంటె జల - జాకర మంబర మండలభ్రమ
ద్విలసిత వాయుయానగతి - వే గమనింపఁగ వైనతేయ సం
చలనవు భ్రాంతి మిల్గనఁగ - శత్రువిమానము యుద్ధవేళ భూ
విలగత పొరులట్ల యతి - భీతి నగాధజలంబుఁ గ్రుంకెడిన్. 279

* ఆ. వె. కనక లతల మిసిమి - కనక గట్టిగ నన
కుఱుకు సరస మహిమ - విరివి కనక
నళిన నయన యదియ - నవన నవీన జ
లజ ముఖము కులుకు త - లంత కణఁక. 280

* ఆ. వె. జలజ నయన కణిక - కులుకు లకుముకుల
కనక ముదము కళిక - కనక వలవ
వారెవా నవీన - వల్లవ కన్యక
నళిన లతల మహిమ - నటన కునుకు. 281

శా. వారింబుట్టి తదంతరస్థ సుఖసం — పక్షివనస్థాయి న
వ్వారిన్ మించఁ దలంచి ప్రాకఁడఱిరాఁ — బద్మాకరోత్పత్తికిం

* ఇవి ద్విముఖపది యను ప్రక్రియకుం జెందినవి. మదీయ నూతన సృష్టి. ఇందలి పదముల యక్షరములు త్రిప్పిపదివినను ఖపము మాఱదు. కాన వీనికి పేరు పెట్టితిని.

దూరే కారకుతౌట మేఘతతి పం - తం బొప్ప వర్షింపఁ ద
న్నీరేజ ప్రభడిందు నండగలఁ డెం - దే నోటమిం బొందునే. 282

మ. వనజాతోద్భవసృష్టి ధర్మ సుషమా - ప్రాగ్భార సంభావనా
వనసంకల్ప కృతిక్రియాత్మజ సుహృ - ద్భావైక కళ్యాణ స
ద్గుణ భాస్వద్రుతురమ్య పుష్పఫల ర - క్తుల్ పోషణాసీతముల్
వనమాలాద్యుతియుక్త మాధవుకళా - వైదగ్ధ్యముల్ గాంచితే! 283
(ద్వ్యర్థి)

మ. అరయన్నిర్మల జీవనంబు కవి వా - గ్వ్యాజస్తుతుల్ మౌక్తికా
భరణంబుల్ చల దూర్మికాచ్ఛటలు దీ - వ్య ద్రాజహంసీగతుల్
వరవల్లీ సుమజాలనేత్ర కళ యొ - ప్పం దోఁచెఁ ఒద్మాక్షి త
త్సరసీజాకర లక్ష్మి మాధవు మన - స్స్వాధీన ధర్మద్యుతిన్. 284
(ద్వ్యర్థి)

కం. నలినాదుల నలినాదము
లలఘగ కలకలము లాత్మ - కానందమిడం
బలుతావులఁ బలుతావుల
నలరుచు రుచులీను నలరు - లరయుదె యతివా. 285

శా. చింతల్వీడి యళుల్పుమాళి మధువు - ల్సేవించుట ల్సాచు చ
త్యంతామోద వినోద సంభరితులై - యయ్యాశు శక్తిస్తుతిన్
స్వాంతంబుల్ వికసింప దంపతులు స - ద్భావ ప్రభావంబునన్
సంతోషంబున సంచరింతురిట రా - జద్రాజ బింబాననా! 286

కం. నెట్టన వన మామధు లి
ప్పట్టునఁ జెండాటలాడఁ - బాయని రతి మై
నిట్టటుఁ గొట్టెడి - నాఁ దగి
టిట్టిభ మట్టిట్టు తిర్గె - డిం గనుగొంటే. 287

వ. తరుణీ! యివి వికసిత కుసుమలతాతతు లవి జలయంత్రద్యుతులు. ఇయ్యవి తియ్యమావు లవినడబావులు. ఇవి మగజాపాదు లవి శశి శిలా వేదులు. ఇవి బొండుమల్లె లవి సూదిమల్లియలు. ఇవి యంత్రముఖ నిర్య జ్జలకణము, లవి జలజగర్భనిర్గతాళిగణములు. ఏమి యీ పుష్పోద్యాన

శోభాప్రభావములు. మొగ్గలు విరిసి, రంగులు మెఱసి, పూలొరసి, తావు లొలసి, తేనెలు కురిసి, యొండొండు కలసి, కాల్వలై వెలసి, కన్దోయికి విందొనఁ గూర్చుచున్నవి. అన్నులమిన్నా! కన్నులున్న ఫల మనుభ వించు చున్నారము. మఱియు నొక్క విశేషము. నగర సర్వజనోప యోగ్యంబుగ యంత్రజలంబున్నను జలక్రీడాదివినోదంబులకుఁ గాకున్నను, బూర్వ దృశ్యవ్యామోహంబునఁ గేళివనాళిఁ గమలాకరంబుల సౌష్టవంబు చెడకుండఁ గాపాడుచుంద్రు. ఇట్టి దృశ్యంబు భవిష్యదభ్యుదయాశాజనక మాసేచనకము. వీన నిప్పరి విప్పిన పురివలె నెంత మనోహరము. ఇట శృంగార రసాధిదేవత నృత్యము సేయుచుండునన నౌనౌనని, సీత సరససల్లాపముల నుల్లాసము కలిగించుచుండ నల్లంత దవ్వరిగి యత్తా వులు నెత్తావులీనఁ బూఁదీఁగ పొదఁ బొదలు ప్రాలేయ రుక్మాంతాశ్మ వేదికపై సతీపతుపవిష్టులైరి. 288

కం. సకల కుసుమ పరిమళ యుత
నికట సరోవర విహార – నీడజనిచయ
ప్రకటిత కూజితముల వినఁ
జకిత మృగ దృగా భ కెంతొ – సంతస మయ్యెన్. 289

తే. అంగ్ల భూభాగ ఖగగా – యకాగ్రణి యని
మాటవినుట నైటింగేలు – పోటికొఱకు
తొగరు జిగి మీఱు నెలమావి – చిగురు మెక్కి
కొదమ కోయిల కొమ్మల – కొసరి కూసె. 290

తే. వాంఛితా మోదరస భృత్ప్ర – వాళ పుష్ప
మధుఫలాహారమదమున – మదన పృతన
పథిక వైదేశిక భ్రాంతి – వరల వనులఁ
గూసెఁ జంద్రశాలాచిత్ర – కూజితమన. 291

కం. ఉద్యాన గతులఁ గాంచుచు
నుద్యాన గతుల్ వినోద – మొందెడి వేళన్
హృద్యంబగు ద్యో వాణీ
పద్యంబులు శ్రావ్య మధుర – భణితి వినఁబడెన్. 292

వ. అంత నక్కాంత ఝుంకారముతో మిగుల విజృంభించుచు స్వైర విహారము సల్పుచున్న యొక్క బంభరంబును గని. 293

ఉ. క్రొవ్విరి తేనె నాని తెగ – క్రొవ్వి పొదన్ రొదసేయు తుమ్మెదా
యెవ్వరి యండదండఁగొని – యింత దినంతులు కొట్టిచుంటివే
పువ్విలుకానిదా యతఁడు – పొల్పుగ నిన్పొసవేసి నారిగాఁ
జివ్వకుఁ గాలు ద్రవ్వ – తటిఁ – జేర్చి వెసం గసి సాగ దీయునే 294

వ. అని నిజ మనోహర వదన విధు బింబ వినిర్గత లలితస్మిత జ్యోత్స్నాపీయూషాస్వాదాక్షి చకోరయై డెందంబు కందళింప మంద మధురమధురమ్ముగాఁ బెండ్లినాఁటి నునుసిగ్గు దొంతరల తెఱల మఱుఁ గున మరువిరిశరములఁ గరగిన హృదయ శర్కరా జలజములఁ దొఱంగు రసహావ బాష్పముల ననుభూతితో మేళవించుకొనుచు 'నాథా! ద్వితీయాశ్రమ స్వీకృత్యనంతర మిటం గొన్నినాళ్ళు సాంకేతిక విద్యాభ్యాసమున కున్నతటి నస్మచ్ఛరీర మటనుంటయేగాని మనస్సంతయు మీ పైనుంట రేల ముమ్మరపు వలపుఁగలలఁ గిలికించితములఁ బులకలలరుఁ గలికి కులుకులఁ బలుకఁ బలుకుఁ జెలికైన శక్యంబె' యన నతండు 'నావరాల జవరాలా! నీ ప్రేమైకామృతకలిత పదస్వరాలు నాకు ముత్యాల సరాలు. మన భాగధేయ దేవతకు నవనవోన్మేష శృంగారరస ధునీలహరులు,సముజ్జ్వల భవిష్యత్తునకు సారవరాలోలలనా! సమానగుణ శబ్దగ్రాహక యంత్రముల కాకర్షణమున దూరకాలములు ప్రతిబంధకములు కానట్లు సదృశాను రాగముగల మిధున మనోభావ రసోల్బణమునకు సుదూర సమయములు నిరోధక శక్తులు కాఁజాలవు. కావుటంజేసి నీకుంబోలె నాకునన నానళిన నయన యెంతయు సంత సించుచున్న!'నా తను ప్రాణములు నీవే, నా సర్వస్వమునీవే, నాకేడు గడవున్న నీవే. నీవు రాముఁడవైన నే సీత నయ్యెద. నీవు కృష్ణుఁడవైన నేను రుక్మిణి నయ్యెద. నీవు మన్మధుఁడవైన నే రతి నయ్యెద. నీవు మాధవుఁడవైన నే వనలక్ష్మి నయ్యెద. ఎన్ని జన్మములకైన నిన్నే వరింతుఁ దరింతు.' నని మంజిష్ఠారాగంబున నాడుచుండ నరుణ కిరణుఁ డస్తంగతుఁడయ్యె. మహాభాగ్యవంతునకు భౌతిక దశాది పరివర్తనంబుల నించుక కష్టములు ప్రాప్తించిన నవి సర్వవిధ బాధాకరములు

గానట్లు మునిమాపుసనన్ జగంబంధకార బంధురంబయ్యెఁ దన్మహా నగరం బత్యుజ్వల విద్యుద్దీపదీప్తిమైవెల్గ సర్వకృత్యంబులు దివసంబు నంబోలె నిరాటంకముగ జరుగుచుండె. అంత డోలాబ్జనాథుఁ డుద యింపఁ బండువెన్నెల కన్నులపండువుగానుండె. 295

శా. పొంగెన్వార్ధి కరంగె నిందుశిల లు – ప్పొంగె న్నిశాకాంత మా
తంగద్వంద్వము తుండముల్గలిపెఁ జింతాదూరడోలాబ్జ హృ
ద్రంగశ్రీవిలసిల్లె నోషధి మహో – త్సాహంబుమై నూఁగె సా
రంగం బాత్మసతీమణిన్నిమిరెఁ జం – ద్రజ్యోత్స్న రాజిల్లఁగన్. 296

వ. ఆకసపుటింతి వెలిచుక్కనులిసీలి జీబు ధరించి పాలపుంత యను గందపుఁబూఁతఁ బూసికొని యంగారకుఁడను కాశ్మీర తిలకము దిద్దుకొని కృత్తికయను ముత్యాల బుళాకి దాల్చి సప్తర్షి మండలమను పాపట బొట్టు పెట్టుకొని గురుశుక్రులనెడి తెలితాకమ్మలజోడూని చంద్రుఁడనెడి మగతాలబిళ్ళ నవతంసముగా నలంకరించుకొని త్రిపథగా మౌక్తిక హారము వేసికొని విశ్వకర్తకు సూర్యుఁడను హారతి పళ్ళెరము త్రిప్పు చున్నదో యన నొప్పె.

సుధాకర కరస్పర్శంబునఁ బకృతి సుందరి నూత్న చైతన్య కళావిలాసముల నలరె. అహా! సృష్టిధర్మ మెంతని వర్ణింపఁగలము!

తే. తరుణ చంద్రిక జీవా మృ - తమ్ముగాగ
రత్నపురుషాదు లతిశోభ – రా వరల వ
సంత కుసుమాకరం బాత్మ – సౌఖ్యమీయఁ
బూర్ణ చంద్రోదయము రస - పుష్టి నిడదె? 298
(ద్వ్యక్షి)

వ. అనంతర మాదంపతులు తనివిదీఱ నద్దెసఁ గలయం బరికించి నాఁటి కింత చాలుననుకొని యిలుసేరిరి. అవకాశము లభించినపుడెల్లె తక్కుం గల దివ్యస్థలాదులఁ బరికించుచు మహోల్లాసముగఁ గాలముఁ బుచ్చు చుండిరి. స్వధర్మ నిర్వహణమే మానవాభ్యున్నతికి మూలకందమని గ్రహించిరి. 299

ఉ. పుత్ర కళత్ర మిత్ర జన - పోషణ రక్షణ దీక్ష గేహి యే
మాత్రము పేక్షసేయక క్ర - మక్రమ ధర్మ పురోభివృద్ధిమై

గోత్ర యశోబ్జ చంద్రిక ల – కుంఠితరీతి దిశల్వెలుంగ స
క్షేత్రమునందు వృక్షమటు - కేవల సత్ఫల శోభిగాఁ దగున్. 300

కం. సదసద్వ్యయ పరిశీలన
మెదఁగుదురుగ నిల్పి నిత్య – మెఱుక బలిమిమై
సదయోజ్జ్వల కృత్యుండ
భ్యుదయంబున వరలుటరుదె – యూర్జస్వలుఁడై. 301

తే. భావిజీవిత సౌఖ్య సం–ప్రాప్తి కొఱకు
నేఁడ కష్టించు టుచితంబు – నీతివిదులు
స్థిరముగాఁ గృషి చేయని – చేతులు దిన
నోచుకొనని నిర్భాగ్యపు – నోరు లనరె! 302

వ. అని లోకజ్ఞానము నాత్మానుభవముతోఁ దులతూచుకొనుచుండ శ్రీరాముల జీవితంబుపై నదృష్ట దేవత యిఁకనిట్టు కన్నెఱ్ఱజేయనున్నదో యన నసౌఖ్యాధి దేవత ప్రేరణమ్మున నాతనిపైఁ బ్రకృతివికృత భావతీవ్రతరోష్ణ పవనావళిం బ్రసరింప సంకల్పించినదో యన గ్రీష్మర్తు వేతెంచె. 303

ఇయ్యది శ్రీమదాంధ్ర మహాభ్యుదయ ద్వితీయ భాగమునఁ
ప్రథమ ప్రకరణము

## ద్వితీయ ప్రకరణము

# గ్రీష్మర్తువు

శా. భూభుగ్న భ్రమణాణు కేంద్ర విచల – ద్వ్యోమగ్రహోక్షామరు
ద్భోభాస్పర్శ విభేద సంభవ ఋతూ – చ్చానాంక మొక్కింత ము
న్నోళించె న్నహజంబ బింబగతిఁ దోఁ – చున్ ఛాయ యొండొంటిపై
వే భాసింపఁ గొన స్సురాక్రమణ మొ – ప్పెన్వర్ష సర్వర్తులన్. 1

చ. కుటిలత బొంకు లీసు మధు – గూఢరతు ల్పశుతుల్య చర్య లిం
కిట గుణి బిందు శాత మిది – యీ శునకేఁ దెలుపంగఁ దేటు ద్రి
ప్పటకనఁ బిచ్చుగుంటు తన – యాన మరల్ప నుద క్తరజ్జుఁడై
యెటఁగని కర్మసాక్షి దగ – నేగె నుదగ్దిశ కుగ్రమూర్తియై. 2

తే. భువన మెరియించు రవి రథ్య – ములు మునుజనఁ
గదలె మలయపుగాలి జిం – క వయినెక్కి
తన విరోధి విరోధికిఁ – దాను సరగ
సాయపడి కీర్తిగాంచుట – సాజమెగద. 3

తే. నైకతస్నాన మొనరించు – సంజవేళ
జలిత పత్ర పక్ష్మంబులఁ – జటకచయము
పగలు పడమటి గాలికి – బడలి యడలి
పయరదిరిగిన మదికి నిం – పయిన లీల. 4

తే. చెర్వులం గాల్వల స్నీటి – చెమ్మలేమి
గుంటలం ద్రవ్వి బట్టలు – గుంజికొనుచుఁ
జెమట చిత్తడికోర్చుచుఁ – జెలమ జలము
త్రావు మడివేలు దప్పికిఁ – దాళలేక. 5

తే. రాట్పథంబున కిరుదెసఁ - గ్రాల్మిరీష
భూజములు పూచి తావులఁ - బొల్చి ఘ్రాణ
తర్పణమొనర్పఁ - దచ్ఛాయ - తాప మడఁప
నలతడిందఁ బాంథు లచట - నలరుచుంద్రు. 6

మ. ఘనసంఘర్షజశాఖవహ్ని రసనా - గ్రవ్రాతముల్సాచ్చి కా
ననదగ్ధాంక దవాఖ్య సార్థకముగా - నట్టాడ వాత్యాళి లే
చిన భస్మంబనఁ బ్రేల శాల్మలిఫల - శ్రేణి ప్రభూతంబులై
వినువీధిం గనఁ దూలజాలములు వ - ర్తింపం జిల్గుతే మబ్బునా. 7

మ. అల పెన్కానలతా వితానయుత శు - ష్కన   క భూజాన్విత
జ్వాలదగ్న్యుజ్జ్వలకీలజాల జనభో - వారె!   స్ఫుటల్
ఫలితాంభోదము వంశ ధూతఖ విశ   స్ఫులింగాళి చం
చల ధారోష్మమనంగఁ జాతకము వ - ర్ష భ్రాంతిమైఁ జూచెడిన్. 8

శా. ధీరోదాత్తులులేరె ? భారత ధరి - త్రిన్ క్షాత్ర మిట్టింకెనే
యారా! మాయని మచ్చగా జనని దా - స్యాందూభిదోత్సాహు లె
వ్వారున్ లేరె? యిదేటి పాపమని కో - పస్ఫూర్తి వేఁడెక్కుటన్
సూరుండుగ్రుఁడుగాఁ దనర్చె ననఁగా - శోభిల్లె గ్రీష్మంబునన్. 9

తే. వెట్టి కట్టుడికిన యట్టు - బిట్టు పుడమి
యుడుక మధుఁ డుర్విఁబాసె మ - ధూత్తమంబ
దెట్టు తేంట్లకనఁగ మల్లె - లెల్లఁ బూచె
నారు పోసిన వాఁడపో - నీరుపోయు. 10

ఊ. ఉమ్మకు నీరమింక దొరు - పూడ్పులకై యెలవేసి మెట్టులం
గుమ్ముచు దున్నుచో దొఱక - గొల్లలు మేలిమివోలెఁ దెత్తు రూ
రమ్మలు రమ్మకొమ్మనుచు - నాడఁగఁ దండుల తుల్య మూల్య మౌ
కమ్మని నమ్మదుంప కడుఁ - గమ్మని తెల్లని పూరిబియ్యమున్. 11

చ. తళతళలాడు జవ్వనము - తగ్గి జలాశయకాంత వృద్ధయై
బలమఱి నామమాత్రముగఁ - బాయని జీవన మాశ్రితాళికి
మలిన మణంచి క్రోలుదురు - మానవతం దొలికోడికూఁతతో
సొలయక లేచి తేఁ గతక శుద్ధుల జాంగల నీవృతాదులన్. 12

ఉ. మక్కువఁ గూలినాలిపజ - మచ్చికసేయఁగఁ దమ్మి నమ్మి పైఁ
బ్రక్కన పెర్గి పెన్గుడిసె - వాకిటఁ బచ్చని చెట్ల పాదులం
గుక్కలు కోళ్ళు నోర్దెఱచి - కుండల దగ్గఱ నేలఁ ద్రవ్వుచున్
మిక్కిలి వేడి కోడి వడి - మేన్తడి నొత్తుచుఁ గన్ను గూర్కెడిన్. 13

(అచ్చతెలుగు)

మ. నవతాళీదళశాల నీలగిరినా - నానాజనాకర్షక
స్తవనారంగ రసైకమిశ్రితలస - త్సద్ధోరసాభోగ వై
భవపానీయ ఘటీకుటీపటలమై - పాంథాళిపుణ్యాంక సం
భవమై మాన్యకృపాప్రపాహ్వయము న - న్నాసిల్లునందందటన్. 14

తే. ప్రకృతి మృగయుఁడు మును ప్రపా - పంజరమున
నేర్పు కూఁతన యౌవత - నినద మొప్ప
వెసఁ దిగియ నీలమేఘ క - పింజలములఁ
గాచు దీములు నా నీళ్ళ - కడవ లమరె! 15

తే. కెరలి పైఁచూవు క్రిందికిఁ - గ్రిందిచూపు
పైకిఁ బ్రసరించి సంశ్లేష - భాగ్య మంద
జోటి యటఁ బ్రియు దోసిట - నీటిదార
పోసె ధనదజునకు రంభ - పోసినట్లు. 16

తే. అతను విల్బోలు నునుమేను - నతని యేపుఁ
దూపు నరితూఁగు క్రీగంటి - చూపు లేఁత
చొట్టబుగ్గల చిఱునవ్వు - సూచితరతి
మందమధురమ్ముదూక్తుల - మగువవలికె. 17

సీ. పెల్లాకటింబిల్ల - తల్లిపైఁ జేవైచి
పాల్గోలి యటుప్రక్కఁ - బట్టెఁబట్టె
దగగొట్టి గొఁబఁబులి - యెగరోఁజి సెగరేఁగ
వావిప్పి వాకిట - వచ్చి చేరెఁ
గల్వ దామర నాచు - గమినీళ్ల మైనేగ్గు
సగమెండు మడువునఁ - జల్లుకొనియె

జిట్టముస్తె మెసంగి – తెట్టగట్టఁగఁ గ్రొవ్వ
          సలుపొర్లి పులకల – సలుగు గునికె

తే. నెండమావుల వానలు - మెండుకొనియె
లేళ్లు గార్చిచ్చుఁ గని దెస – ల్గ్రోళ్లువాఱె
గూళ్ళఁ బులుగులు గలఁగుచు - నోళ్లుచాఁచెఁ
*గడిది నడిజాము ప్రొద్దు షు – క్కన్ను దెఱవ. 18

(సంస్కృత పదరహితము)

మ. పరమేశుండల స్నానవాంఛ హృది నొ - ప్ప న్స్వర్ధునీపాత భూ
త్యురుశంపాకరమంచెఱింగి రవి వి - ద్యుద్యంత్ర సంకీర్ణ త
త్కరతంత్రీ ఘటనాను బంధములు నొ - క్క న్వారిభూభాండ మ
వ్వర శక్తిం బొగఁ జిమ్మెనాఁ దనరె న - వ్వాత్య న్రజశ్చక్రముల్.

మ. జలభాగమ్మున నెంత యావిరిగ వె – చ్చన్ని చ్చఁ బై కేఁగునో
స్థలసీమోద్భవ ధూమ మెంతతుకునో - ధారాధరాకార మె
ట్టుల ద్యోస్రష్ట సృజించునో యుసురుగా - డ్పందెంతొ వెల్గెంతయో
తలమే కన్గొన నంచెదం బ్రకృతి శా – స్త్రజ్ఞుండు యోచించెడిన్. 20

తే. వానకోయిల వానకు - స్వాతి చినుకు
కొఱకు శుక్తి కోయిల మధు – కొఱకు నితర
దేశవాసియా పతిసతి – దినము మనము
నెట్టొ యట్టులె పజ వాన - కెదురు సూచె. 21

తే. తరులఁ బురుషోత్తముండొ పి - తామహుండొ
నాఁటె ధాత్రుహృత్సం విత్తు - నాటినట్లు
బాటకిరుదెస ఘన వన – స్పతుల పంక్తి
చలువ పందిళ్ళ చాలునా – నలరుచుండె. 22

సీ. బిచ్చగాఁడు బయలఁ - బేద పైఁ గొల్లాయి
          నవతాళవృంతాన – నడిమివాఁడు
వానికంటెం గొంత - వసతి సిక్కినవాఁడు
          శిరపు వీవన - శీకరములఁ

* (ఇక్కడ మధ్యాహ్న సూర్యుడు శివరూపుఁడుగా నుంట గ్రాహ్యము)

జంచలాయంత్రవ్య - జనముల ఘన ధని
రారాజు వింజామ - రముల రమలఁ
బురిటి బిడ్డలు దల్లి - పుక్కిటి తిత్తులఁ
గ్రొంగొత్త మిధునము - గొంగుతుదల

తే. నాకు నల్లాడనట్టి య - య్యవసరముల
గాలి కల్పించుకొని యెట్లొ - గడపుచుండఁ
దానెచటనుండెనో జగ - త్ప్రాణుఁ డనెడి
మాట మఱచిన యామంద - మారుతంబు. 23

తే. పుడమి గుండ్రని వంకాయ - బుద్ధి పుట్టి
కటికి వేసంగి యనెడి మం - గలమునందు
నునిచి దుమ్ముకారముఁ జల్లు - చుండి సారె
సమయ మొదనికుఁడు వేఁపు - సలుపునేమొ. 24

కం. హరుఁ డొకచో మోసెను నీ
విరుదెస బరువూను దొర - యెన్నఁగ గంగా
ధరుఁడన నీవే యని కవి
కరమలరఁగఁ బొగడె నీళ్ళ - కావడి వానిన్. 25

తే. నీరు వేరున కందని - భూరుహములు
తల్లి పాలకు నోఁచని - పిల్లలవలె
జిగిబిగి తొఱంగి నానాఁట - శిథిలమగుచుఁ
గఱకుఁ దొడుగఱ లిలాయి కఱ్ఱలయ్యె. 26

తే. పరమ సజ్జన సురతతిఁ - బరిహసించు
నీచమానవ దానవ - నిచయముఁ గని
నిప్పులంగ్రక్కు విశ్వేశు - నేత్ర మనఁగఁ
బట్టపగటి దినేంద్ర బిం - బంబు దనరె. 27

తే. వరున విరిసిన విరవాది - పందిరిఁ గన
రిక్కగమి వెల్గు రే వింటి - చక్కఁదనముఁ
గాంచి నిజశక్తిఁ జూప సృ - జించినట్టి
కాలకౌశికు ప్రతిసృష్టి - గా వెలింగె. 28

సీ. జలసిక్త శీతల - సౌధోపరిస్థిత
తతహంస తూలికా - తల్ప మమరఁ
రంభా రసాల స - ద్ద్రాక్ష ఖర్జూరాళి
శర్కరాన్విత ఖండ - చయము దనర
నారంగ మృద్వీకా - క్షీర నానారిష్ట
మధ్వాసవాది సం- భార మొనర
నాగవల్లీ దళ - పూగ చూర్ణా పూప
శష్కులీలట్వ వి - స్తార మలరఁ

తే. బండు వెన్నెల సుధఁ జల్లు - చుండ నిండు
భ్రాంతిఁ జొసీతి బంధ సం - బంధ మెసఁగ
మల్లెపఱుపుల రాజదం - పతులు నిశల
మన్మధక్రీడఁ దనిసిరి - మహిత గతుల. 29

సీ. వఱువాత నొకచేతఁ - గఱకు గొడ్డలి దాల్చి
చంక మస్కర మొండు - సక్క నిరికి
యీడు జోడుగ వని - కిల్లాలితో నేగి
మూచూచి వేపి రా - ముందు వచ్చి
గిట్టి గాలెడి వేళఁ - గట్టెలం దరవాణి
చల్దికిచ్చి మెసంగి - సంజ దాఁట
నేటి కావలి తోఁట - నిసుక గుడిసె ముందుఁ
దంపి దోరఁగఁ గాల్చి - చింపిచావ

తే. నత్త మీ నెండ్రి కొక్కెర - నమలి త్రేంచి
లీల నేలలు వాడుచు - రేలఁ గేళి
రహి నవాది నరాకృతి - గ్రామ్య ధర్మ
మోదమున నుండు దంట - యేనాదిజంట. 30

సీ. దక్షిణాపథధునీ - తన్వినాథుని జేర
సేతు వెక్కఁగ లేమిఁ - జిన్నవోయె
నేటి ప్రాగ్భాగాన - నిసుము జిల్గులు పర్వ
దీవులన్నియుఁ జొకి - రేవులయ్యె

గట్టు గనిమ సక్క - బెట్టి నార్మడినేల
బహుమాండలిక దేశ - పట మనఁదగె
నండ మెండుండ నా - ర్యావర్త వేణిక
జీవనస్థితిఁ జియ్య - సిక్క కుండెఁ

తే. బండ్ల నెలమావి కందోయి - పండువయ్యె
సూదిమందిచ్చె దోమఁ వె - జ్జూఁది వడఁకఁ
జివికి మఱికాని దుస్తులఁ - జెమట లూరె
యంత్రఘటి యూఁకుఁ దోఁట న - ట్టడుగుఁదన్నె. 31

కం. సురగంగాన్విత శీర్షుఁ
హరు నష్టభిషేకధార - నర్చనసేయుఁ
విరివిగఁ జిందిన నీరనఁ
బురుభువగుఁ ఘర్మవారి - పూజారులకుఁ. 32

తే. వెట్టవేళల మబ్బులు - పట్టి గచ్చ
కాయ లటు చినుకులు పడఁ - గమ్మతావి
ఘ్రాణ తర్పణ మొనరింపఁ - గాఁ బుడమికి
గంధవత్యాఖ్య సార్థక - గతిఁ జెలంగె. 33

కం. మృగశిర బిందించినచో
బిగువుడిగిన ముసలియెద్దు - వేయును ఱంకెం
జగమెఱిఁగిన నానుడి యని
నగవొదవఁగఁ గర్షకాళి - నాగలి పట్టెన్. 34

తే. నారికేళామ్ర ఫలము ల - నాస యనఁటి
పాల తోడింత వాఁకుడు - పనస జామ
వేప బత్తా సపోటలు - వేఁడినన్ని
ముంజెలుం గొల్లలుగ వచ్చి - ముదముఁగూర్చె 35

తే. మిడిసిపడు నెండ నిప్పులు - మిసెడి గాలి
యంతలో నుమ్మదమ్మ న - ల్లంతలోన
నుడుకుఁ జిన్కులు నెడనెడ - జడులు పడఁగ
వానినే యెండకాలపు - వానలనిరి. 36

తే. ఉమ్మఁ జెమ్మింకఁ బెళుసయి - యొసఁగని విలు
ప్రోది తఱిగిన జ్యావల్లిఁ - బొదిపి తివియఁ
గుజనమైత్రినా పసచెడి - కొనఁ జెమర్చ
లచ్చికొడుకు చే దుసికిలె - లస్తకంబు. 37

తే. ధూళ్ల సూళ్లన్ని మక్కెక్కెఁ - ద్రుళ్ళె నగ్గి
త్రాళ్లతుకుఁ గోరె నూతికి - వెళ్లఁ సల్ల
బీళ్లు సుక్షేత్రములయట్లు - నోళ్లు తెఱచెఁ
గ్రేళ్లుఱికె లేళ్లు చల్లని - నీళ్ళు నూచి. 38

తే. కసరి కొట్టెడి వడమటి - గాలి హత్తికిఁ ఎండు
దట్టుకొనలేక పగలెల్ల - దద్దరిల్ల మీసఁగ
వడయుడర సంజ పనులందుఁ - బ్రొశల
యాపసోపాలు పడుచుండి - రఖిల జనులు. 39

వ. ఇట్టిట్టనరాని వెట్ట మట్టుమీఱి జీవులఁ గష్టపెట్టి యెట్టకేల కెడనెడఁ దొలకరింపం గొంత యుపశమించె. అయ్యాయి కాలంబుల కనువగు జీవిత విధానంబుల సీతారాము లుల్లాసంబుగ నాల్గేనేండ్లు గడపిరి. 40

మ. కలనాల్గింట గృహస్థ ధర్మమది శ్లా - ఘ్యం బౌట భావించి ని
ర్మల ధర్మాన్విత సీత మహిళా - మాణిక్య దీపంబు నా
నలర న్నిత్య పరోపకార పరతం - త్రానీత సత్కీర్తిమై
ఫల భారంబున వంగు వృక్షమువలె - న్భాసిల్లె రాముండటన్. 41

కం. ఏతాదృశీ సమజ్ఞా
సీతాభ్యుదయుండు సుకృతి - నిర్మల హృదయో
పేతుఁడు గార్హస్థ్యవ్రతి
సీతాపతి జీవయాత్ర - సేయుచునుండన్. 42

వ. కొన్ని దివసంబులకుఁ దత్సతి గర్భవతియై నవమాసములు నిండ నొక్కనాఁ డొక్క మగ శిశువుం గనె. అతం డేడెనిమిదినాళ్ళు మాత్రమ జీవించి మరణించె. అహా! యీశ్వరేచ్ఛ. ఎప్పు డేది యెట్లు జరుగునో యేరికెఱుక. అంతలో సుఖ మంతలో దుఃఖము. లోకమే స్వర్గనరకముల కలయిక. లౌకికార్థలంపటులు ద్వంద్వాతీతులు గారుగదా! రాముల నికేతనం

బునఁ దాత్కాలిక శోకతాపంబుల సౌఖ్యానంద రసమిట్టింకె. తోడ్తో నుద్యోగ జీవిత నాటక మధ్యమమున నుపరితల స్థితానవసర యవనిక జారి నటకుని శిరమునఁ బడినట్లు బాధాకర ఘట్టమొండు ప్రారంభ మయ్యె. మానవుడు మహీరుహమునఁ గల మంచి ఫలము మీఁదనే రాళ్ళు విసరినట్లు భగవంతుఁడు గూడ సజ్జన రత్న పరీక్షకై నిష్ఠుర మారములనే ప్రయోగించునా ? 43

ఉ. చిక్కులఁ జిక్కకున్న మన - చేతికిఁ జిక్కఁడు మానవుండటం
చిక్కరణిం బరాత్పరుఁడు - చేసెనొ చిక్కములోని పిట్టగా
నిక్కమెఱుంగ నెవ్వరును - నేరరు నేర్చిన దాని నొక్కరుం
జిక్కఁగ వర్తనంబున క - సాధ్యము కాదని చూప రేలొకో. 44

వ. పుత్రశోకంబునకుం దోడగ స్వ భ్రాతృసన్నిభుండగు నొక యున్న తోద్యోగి కంటుగొని నిప్పులు గురియు కంటఁ తన్నుగనుచుంట రాముల మనఃపుష్కరమున విచారజీమూతపటల మలముకొనె. 45

# ఉద్యోగబాధ

కం. ఘనకలుషాత్ముఁడు కుటిలుఁడు
తన పైయధికారి యతఁడు - తత్త్వమరయకే
యనయము కొఱకొఱలాడుచు
మనవి చనవు తెలియఁగకుండ - మనలం దొడఁగెన్. 46

ఆ.వె. అతఁడు లంచగొండి - యసమర్థుఁ డతికోపి
తనదు పనుల నొడలు - దాఁచుకొనెడి
సోమరి మరియాద - నున్న యన్న
పలుకనేల యతని - వర్తనంబు. 47

వ. కంచముడాఁగిన కండలు డాఁగునా ? లంచము దాఁగిన లక్షణము దాఁగునా ? అపప్రథానిధానమగు నవప్రదానమున కలవడిన వాఁడు వెలిచవులు మరగిన వెలఁదివలె నవకాశమున కనవరత మెదురుచూచు. మానావమానముల మాట మఱచు, 48

ఆ.వె. అల్పునకు నొకింత - యధికార మిచ్చిన
మిడిసి పడును సరిగ - మెలఁగఁ బోఁడు
క్రిందివానికెప్డు - కీడాప్టుఁ గలిగింపఁ
బొంచియుండు నీచ - బుద్ధితోడ. 49

ఆ.వె. దొంగతిండి తినుచు - దొరవోలె నడచిన
నవ్వుచుండు రతని - నడకఁ జూచి
యెగ్గు సిగ్గు లేని - హీనుఁ డెన్నిటికైనఁ
బాలుపడును మంచి - బాట విడును. 50

ఆ.వె. తప్పులేనివాని - దండింపఁ జూచినఁ
దనదు తప్పులన్ని - తడవుదురని
తలఁపఁ డెఱుఁగఁ డతడు - తామసి తామసి
యౌ నటంచు స్వేచ్ఛ - నడరుచుండు. 51

కం. నిజమాడిన నిష్ఠురమని
ప్రజలాడెడి పల్కులోని - భావమరయుటన్
సుజనుఁడు రాములు రాముని
భజియించున్నాని మాఱు - వల్కఁ డతనికిన్. 52

కం. కసరిన రుసరుస లాడిన
నిసుమంతయుఁ బొక్కఁ డెంత - యెదనిబ్బరమో
యసమాన శాంతమూర్తిని
నసమర్థుఁడుగాఁ దలఁచు - నాతం డాత్మన్. 53

కం. తనదోసము లేకున్నను
దనపై నేరమ్ము మోపఁ - దాల్మి వహించున్
దనయధికారికిఁ గల యా
ఘనదోషములన్ని చెప్పఁ - గాఁ దలఁపఁ డొగిన్. 54

తే. తన్ను బాధిందుచున్న యా - తనికి నెవ్వఁ
డధికృతుండొ వానికెఁ దన - యాపదలను
జెప్పి నిష్కారణ విరోధి - ముప్పు నుండి
తప్పుకొనఁ జూడఁ డెంతటి - తత్త్వపరుఁడొ. 55

కం. చెప్పినఁ దప్పొప్పులు గను
విప్పుగఁ జర్చించి మంచి – విలువ గణింపన్
దప్పునకుఁ దగిన దండన
మిప్పించెడి పుణ్యమూర్తి – యెవ్వఁడు చెపుఁడా ! 56

తే. శీల పరిశీలనమ్మింత – సేయ కమిత
నీతి నిష్ఠలఁ గాలమ్ము – నెట్టు ఘనుల
రాచి అంపానఁ బెట్టెడి – రక్కసులను
నడఁచు నరహరి యేవేళ – నవతరించు. 57

తే. తనకుఁ బైనున్న యధికారి – తనదు నడత
నెఱిఁగి నీచుఁడుగాఁ దన్ను – నెంచియున్న
నద్ది తలకెక్క కునికహో – మొద్దునరుఁడు
లొంగియున్నట్టి వారల – భంగపఱచు. 58

తే. ఒకఁడు లోలోన గ్రుగ్గు నిం – కొకఁడు పైకి
పలుకు నొక్కండు తఱిఁ జూచి – ప్రతిఘటించు
నొకొ..సు కాలమ్ముపై నాస – యుంచు నొక్క
రుండు దైవమ్ము గలఁ డంచు – నుండునొదిగి. 59

కం. నోరుండు వానికే గద
యూరుండుఁ గటా ! యిఁకెట్టు – లోపుదు వీనిన్
మారుకొన మాఱువల్కన్
నోరాడదు నీతిలేక – నోనాడు ననున్. 60

కం. వచ్చితిని దూరదేశము
ముచ్చటగా రాచకర్జ – ములు నెరవేర్పన్
మెచ్చుననుకొంటిఁ బైవాఁ
డిచ్చకములు వల్కి కుల్క – నే నోపనుగా ! 61

కం. నీపాలి యముని వోలెం
బాపాత్ముఁ డితండు దొఱకె – వాక్పారుష్యం
బాపఁడు మింటం బెట్టిన
దీపమునాఁ దోఁచు నింకఁ – దెరువెయ్యదియో ! 62

కం. అని దా ననుకొనెనో యది
తన తొలిజని కర్మఫలము – తప్ప దొకప్డుఁ
వినయమున విధి నొనర్చుచు
ఘనమనుకొనెనో వచింపఁ - గావశమౌనే? 63

ఆ.వె. కాని యాత్మలోన కడు – బాధపడుచుండు
నుక్తి యుక్తి శక్తు – లొప్పకుంట
నుండి యుండి యాతఁ – డుద్యోగ విరమణ
చింతఁ దగులు భావి – చింత మిగులు. 64

కం. మెలఁకువ తెలిఁగఁడు చతురత
గల మానిసిగాఁడు పూర్వ - కాలపునరుఁడీ
కలికాల లీల నేక్రియ
నిలిచిగెలుచు విధివచింప – నేరండొకఁడుఁ. 65

కం. మెత్తని వారిం జూచిన
నొత్తంగా బుద్ధిపుట్టు – నొరున కనిరి లో
కోత్తరుఁడని విడుచునె జగ
ముత్తమె సామెతలు రసము – లొప్పిన గుళికల్. 66

తే. పరగుఁ బరమాత్మకళ యాత్మఁ - బ్రతినరునకుఁ
గాంతికిరణంబు ఋజుమార్గ – గామి యైన
కరణి యది ధర్మమెఱిఁగించుఁ – గాని వినని
నరుఁడు నరుఁడౌనె వాఁడు వా - నరుఁడుగాక! 67

తే. తనకెగా దక్కె నధికార - మనుచు నుబ్బి
క్రింది వారలఁ దనకాలి - క్రింద నునిచి
రాచి ఱంపానఁ బెట్టెడి – రక్కసునకుఁ
బుట్టగతు లుండఁ బోవునే – పుణ్యజగతి. 68

కం. అదనుకొఱకుఁ బరికించెడి
యదయుని కడఁ బనికినుంట – యతికష్టతరం
బది యడకత్తెఱఁ బోకయ
ఘుదనొదవకె హానిసేయు – నతఁడెట్టిఁడొకో. 69

# కష్టపరంపర

కం. ఈరీతిగ నిట నుండఁగ
నారోగ్యము భంగమయ్యె - నర్థాంగికి నిం
కేరితనికిఁ జేయూఁతయొ
నారాయణుఁ డెఱుఁగు నతని - నానావస్థల్. 70

కం. ఇది యిటుండఁగ నటఁ గల
ముదుసలియౌ తల్లి రోగ - మును విని గతి యిం
కెది యని డోలాందోళిత
హృదయుండై మ్రింగికొనియె - నెదలో బాధల్. 71

కం. పట్టిన దెల్లను బైడిగ
ముట్టిన దంతయును నాణి - ముత్యముగా నె
ప్పట్టున శుభదినములఁ గ
న్పట్టును దనమాట రాచ - బాటని పొగడన్. 72

ఆ.వె. అడరు గ్రీష్మమునకె - యల్లాడు చెటును
గాఱుచిచ్చు హెచ్చి - కాల్చినట్లు
కాని కాలమందు - కష్టపరంపరల్
గలసివచ్చి నరుని - గస్తిపెట్టు. 73

కం. తల్లియు సోదరుఁడును మే
నల్లుఁడు చెన్నపురినుండి - రైనను నిచ్చల్
పెల్లారటపడఁ జొచ్చెం
దల్లింగని సేవసేయఁ - దగునని రాముల్. 74

ఆ.వె. తెలుగు నొగులు గుడుచు - మగువను గనుచున్న
మగని మనసు వగల - పొగలఁ జిమ్మె
నగ్నివంటి భార్య - రుగ్ణయై కృశియింప
బాధపడఁడె యెట్టి - భర్తయైన. 75

కం. మంచము పట్టిన మానిని
డించి వెడలలేక తల్ల - డిల్లుచు వెజ్జుం

గాంచి ధనమ్మిడి మందులు
మంచివిగా వాడుఁ డనుచు - మనసు యొసర్చెన్. 76

వ. ఈ దృగ్ఘటనల ఝంఝానమయ మహోపద్రవంబులె నెట్టి ధీరవర్యు మనమ్మైనఁ గలఁత నొందు సనుట సత్యదూరము గాదు. ఇరుపలంకులం గొట్టఁబడుచున్న కందుకమ్మువోలె నప్పుడతని యెడంద పలుకడలఁ దవ్వై యుండె. లుప్తారోగ్యయై పొగచుండి నెక్కి పయనింప సత్తిలేని సతంగని యాతండు వేడినిట్టూర్పులు పుచ్చె. 77

కం. ఊహింపలేరు పద్మ
వ్యూహమువలెఁ జుట్టుముట్టు - చుండెడి కష్ట
వ్యాహత జీవిత గతి గన
నాహా యిది యెట్టిదను మ - హామహులైనన్. 78

తే. అమ్మ యెట్లున్నదో యిపు డామయమున
దైవ మొకరీతి మామీఁద - దయఁ దలంచి
సీత కారోగ్య మిఁకఁ జక్క - జేసెనేని
దల్లిపదసన్నిధికి వేగఁ దరలఁ గలము 79

వ. అని రాములు దలపోయుచు నుత్తర ప్రత్యుత్తరమ్ముల జననీ వృత్తాంతమ్ములఁ దెలిసికొనుచు భగవల్లీలలు దన యెఱుక కందనివి కామింజేసి సర్వశక్తి సంపన్నుండగు సర్వేశ్వరు వేఁడికొనుచుండ నమ్మహా మహుని కరుణకల్మి సీతమ్మ కొండు రెండు దివసమ్ములక రుజ కొంత నడలె. జగత్పితను గుఱించి నమ్మికమైఁ జల్పిన వేఁడికోలు వితథయగునె.

## మాతృమరణము

ఆ.వె. ఇంక మద్రపురికి - నేఁగనౌఁ జుమ్మని
యాతఁ డాలితోడ - నాడుచుండఁ
దల్లి జబ్బు హెచ్చెఁ - దగదాలసింప వే
తరలి రమ్మటంచుఁ - దంతి వచ్చె. 81

ఆ.వె. వేగఁ జదువుకొనియెఁ - దీఁగ వక్కాణంబు
కనులలోన మెదలెఁ - గన్న తల్లి

లోకమెల్ల మఱచి – లోలోనఁ గుములుట
మనసు పర్వులెత్తె – మద్రపురికి. 82

వ. ఉద్యోగధర్మంబుగఁ దనయధికృతునొద్ద సెలవు గైకొనవలయు నను మాట జ్ఞప్తికిరా. 83

కం. వ్యథపడెఁ దనపైఁ గల య
య్యధికృతు నెద రాయియనుచు – నతఁ డీకొనఁడే
వదలక యాతనిపైఁ గల
యధికారికిఁ జెప్పి సెలవు – నందఁదలఁచుచున్. 84

వ. పదంపడి యెల్లసంగతుల నిల్లాలికి మెల్లమెల్లనఁ దెల్పి వైళమ చని నిజోపర్యధికృతునకుం దన పంపునమునకుంగల కతమెఱుక పఱిచి తంత్రీవార్తాపత్రము సూప దైవ వశంబున వాఁడును నడ్డుసెప్పవలను పడమి నెఱింగి వల్లెయనె. 85

కం. ఎసలిక పొసఁగక పోయిన
విసువక విధులన్ని తీర్చి – వేడుకపడు న
య్యసమాన నిర్మలాత్ముని
వ్యసనం బధికార గర్వి – కంటక యున్నే. 86

ఆ.వె. కండకావరమునఁ – గన్నుగానక లేని
తప్పు లెన్నువాని – దరిఁ గడపుట
పాముచెంత కప్ప – పనికున్న యట్టులే
కాన యద్ది యేరి – కైనఁ దగదు. 87

వ. అంత రాములు బ్రదికితి భగవంతుఁడా యనుకొని వలసినన్నినాళ్లు సెలవుంగైకొని సతీద్వితీయుండై ధూమశకటంబున బంబయినుండి క్రన్నం జెన్నపురి కరుగుచుండె. 88

తే. గుప్పు గుప్పునఁ జిమ్ముచు – నిప్పురవలు
పలు తెఱంగుల గూబలు – పగులు నట్టు
కూఁత వెట్టుచు రేవగల్ – కునుకు లేక
యూర శరవేగమున బండి – యరుగుచుండె 89

తే. ఎంత సంకల్ప బలమున్న — నేమి ఫలము
దైవ నిర్ణయ మెవ్వాఁడు — దాఁటఁ గలఁడు
చెన్నపురికింకఁ బొగబండి — చేరలేదు
కాని రాముల తల్లి స్వ — ర్గమ్ము సేరె. 90

ఆ.వె. తండ్రి యంత్యవేళ — దశరథరాముండు
చెంత లేని యట్లు — చింత పడియు
మాతృ మరణ మపుడు — మాన్యుఁడౌ రాములు
దవ్వునందయుంట — దైవ ఘటన. 91

వ. అనంతరంబ కొంతకాలంబున కా ధూమశకటమ్ము నిజవిరమణ స్థానమ్ముం జేరుడు తజ్జంపతులు డిగి వేవేగ వేఱొండశ్వ శకట మధిరోహించి యిలు సేరిరి. కాలు నేల మోపియు మోపకముంద యమ్మ యెచ్చట నని యడిగి యొక్క టెప్పపా టలబ్ధ ప్రతివచనుండై వెన్వెంటఁ దమ రాకకు మున్న యాకె నాకలోకమునకుంబోక యెఱింగి యామయసమయంబున నాయమ సేవ సేయు ప్రాప్తిలేకున్న నామె కడసారి వలుకులైన విననోచనైతినని తమ్ముఁ గుత్సితోఁ బలికి రాములు గ్రన్నం గన్నీరు గార్చి వెచ్చనూర్చె. ఆ తల్లి యంత్యకాలమ్మునఁ దన్నుఁ గన్గొనున్కిం దన రాకం గలవరించుచుఁ దల్లడిల్లెనని విని పెల్లుదురపిల్లె. సహోదర బంధు సుహృత్సమేతంబుగ జనని యంత్యక్రియలు యథాశక్తి నిర్వహించి యతండు మరల సకుటుంబముగ బొంబాయిఁ జేరుకొనియె. కాని యతని యుద్యోగస్థితిగతుల మార్పు మ్మృగ్యంబ. 92

ఉ. అయ్యధికారి బుద్ధి యిసు — మంతయు మాఱమి కేమిసేఁత కా
యయ్యకుఁ దోఁపదయ్యె గృహ — మందు సతీమణి రోగముంబలెం
బయ్యెన వాని క్రూరత మ — హావ్యథఁ గూర్ప దినంబు వర్ష మ
ట్లయ్యె సుఖార్కుఁ డస్తగతుఁ — డయ్యె విచార మహాంధ మెచ్చఁగజ్జ.

ఆ.వె. కర్మకౌశలంబు — గలవాఁడ నైయుండి
ధర్మ బుద్ధి శుద్ధిఁ — దగిలియుండి
చెట్టచేయుచున్న — చేదుగు గు ట్టగలింపఁ
జేతగాని వాఁడ — నైతి నకట. 94

వ. అని యాతఁడేమేమొ తలఁపునకుం దెచ్చుకొని పురాణవైరాగ్యముం బొందు. అజ్ఞాన జీవిత క్లిష్టసమస్యలలో మానవుని స్థితి యయోమయము గదా. 95

సీ. అంగ్లేయ వైద్య వి – ద్యాభ్యాసమున నున్న
తన తమ్ముఁ గుఱ్ఱకు – ధనమొసంగ
వలసిన బాధ్యతఁ – దలబూనె నిల్లాలి
స్థితిఁ జూడ నానాఁట – ధృతి తలంగె
నుద్యోగ విరమణ – మొప్పునా యిత్తఱి
నంచు నెంచుచు నాత్మ – నడలుచుండె
దీనికిం దోడుగా – మేనల్లు నొక్కని
మంచి చెడ్డలు తాన – గాంచుచుండె

తే. నిర్ధనుండయ్యుఁ దానిన్ని – నిర్వహింపఁ
బూనుకొన్నట్టి నిర్మల – పుణ్యమూర్తి
యిన్ని చిక్కులఁ జిక్కె నే – దెట్టులగునొ
యీశ్వరుని లీలఁ దెలియఁగా – నెవరి తరము. 96

# జా యా వి యో గ ము

తే. నోట నాలుక లేనిదీ – బోటి యేటి
కింత పెన్బాధ వెట్టె న – ర్వేశ్వరుండు
వ్యాధి కుదిరెడి చిహ్నమే – లేదటంచు
శోక దృష్టుల సీతను – జూచు నతఁడు. 97

వ. అన్యోన్యానురాగ రసయుక్తోత్తమ దంపతుల నొకరిశారీరక బాధ మఱియొకరికి మనోవ్యథగానుంట ప్రకృతి సిద్ధము. భర్తృవశవర్తినియగు సీతయుఁ బథ్యపానాదుల సునిశిత జ్ఞానము గలదిగావునఁ గడుంగడు జాగరూకత వహించె. ఎంత పెనఁగిన విధి యనుకూలించుచునట్లు దృష్టి గోచరముగాకుండె. బాహ్యాభ్యంతర శత్రువులచే బాధింపఁబడుచున్న రాజు హృదయమువలె రాములమనము స్థిమితమునకు దూరమయ్యె. దివస దివస వర్ధిష్ణు జేయరుజార్తిమెయి ఋృశకృశవివశాంగియగు

సహధర్మచారిణింగని తన్నాసికావ్యాగమ్ముల నుచ్ఛ్వాస నిశ్వాస చలన స్పర్శ మున్నంతవట్టు తత్సాధ్వికి నిర్విరామముగ సర్వవిధ సపర్యలు సక్రమముగఁ జేయుట తన ప్రధాన విధియని తలంచి నిర్మల కూర్మి మెయి నోర్మి పేర్మి నట్లొనరించుచు వైద్యవిద్యావ్రతంసములచే నౌషధ ముల నిప్పించుచుఁ దత్ఫలిత మ్ముదధిగర్భగతాగ్నికణమ్ముంబలెఁ దప్త లోహపాత్ర పతితజల బిందువుంబోలె నిరర్థకమగుచుండగని నిరాశాపూరి తుండయ్యు గంభీరహృదయుండై నిద్రాహారవిహార విరక్తి ప్రకృతిం దూరుఁ డగుచు దినమొక యుగమ్ముగఁ గడపుచుండఁ నతకయ్యది రాజయక్ష్మ వ్యాధియని భిషగ్వరేణ్యులు పరిశోధించి నిర్ణయించి పలుయు జాగర్యం జికిత్సలు నడపుచుండ. 98

తే. దిగులు దిగద్రావి పనులెల్ల – దిద్దికొనుచుఁ
దనకు నలుసంత యిబ్బంది – గలుగ నీని
మగనిఁ గని జాలిపడుచు న – మ్మగువ సీత
భర్తతోఁ బ్రేమమై నిట్లు – వలుకఁ దొడఁగె. 99

తే. నాథ నీవడు బాధ న – న్గలఁచె నిట్టు
లింక నీచేత సేవ సే – యించి కొనుట
కొప్పకున్నది నా బుద్ధి – తప్పకుండఁ
బుట్టినింటికి నను బంపు – పుణ్యగుణుఁడ. 100

వ. విధి నిర్ణయమెట్లున్నదో యట్లు జరుగక మానదు. ఇట నాకగదంకార శిరోమణుల చికిత్సకు గుణం బీదయ్యె. ఎంతకాల మిట్టు నావలన నహో రాత్రములు మీరు బాధపడఁగలరు. దీన మీకారోగ్య భంగము గలుగు నను శంకాధూమ మస్మన్మనోగోళమున నలముకొనుచున్నది. 101

ఆ.వె. మగని కూడి యమ్మ – మగువ యొనర్చుటఁ
గతలఁ బెక్కు వినఁగఁ – గలముగాని
భార్య కింత ప్రీతిఁ – బరిచర్య సేసిన
భర్త పేరు చెవిని – బడదు సుమ్మ. 102

తే. ఏను నీసేవ కయి నిర్ణ – యింపఁ బడఁగ
నాదు దురదృష్ట వశమున – నాకె మీర

లూడిగము సేయుచున్నార - లున్ను రనక
నేను మీ ఋణ మెవ్విధిం - దీర్చికొందు. 103

కం. నాయున్న తీరు తిన్నఁగ
మాయయ్యకు వ్రాయ నతఁడు - మఱునిముసమునన్
వ్రాయును మనలను రమ్మని
యాయూరికి నన్నుఁ జేర్పుఁ - డాదృతి మెఱయన్. 104

తే. అన్యథా మీరు భావింప - కాదరమునఁ
గమ్మ నంపుఁడు మాకెళ్ళ - గ్రామమునకు
జనని యిది విన్నఁ గన్నన - జనకు నిటుకుఁ
బంపునో లేక యొక తంతి - పంపునేమొ. 105

కం. అని యాడిన సతి మోమును
గని దైన్యవిచారభార - కంధి మునిఁగి వే
దనపడి తనచే నౌనది
గనుపటుమి బదులు పల్కఁ - గాదనుకొనియెన్. 106

కం. నానాఁటికిఁ గృశియించెడి
యానాతింగాంచఁ దిన్న - యన్నము నీరై
పో నాతం డొక యుత్తర
మా నాఁడిటు వ్రాసె గృహిణి - యాత్మ సలరఁగన్. 107

ఉ. సీత రుజార్తిమైఁ గడుఁ గృ - శించుచునున్నది దైవ నిర్ణయం
బీతఱి నెట్టులున్నదొ వ - చింపఁగఁ జాల మిదెంత వింత ప్ర
ఖ్యాత భిషగ్వరేణ్యులకు - నందమిఁ గుందుచునుంటి మీఁదఁద
జ్జాతక మెట్లొ యట్టగు న - సాధ్యము నాకని వ్రాసె మామకున్.

తే. ఇంత జాగేల చేసితి - రిప్పుడైన
వెంటనే రండు మీర ల - ప్పేడు వీడి
తీఁగకుం గాయ బరువౌనె - దేవుని దయ
సీతకిటనైన స్వాస్థ్యము - సిక్కునేమొ. 109

అ.వె. అనుచు మామ వ్రాసి - నట్టి ప్రత్యుత్తర
మందిసంత ముదము - నంది రాముఁ

డాలితోడ వెళ్ళి – యత్తకు మామకు
మ్రొక్కి సీత రుజను – జక్కఁజెప్పె. 110

వ. అట్లాకె జబ్బువడి బక్కటిల్లి యున్కింగని పుట్టింటివైపు ముఖ్యబంధులు జాలిమెయిఁ గొంత చింతించిరి. అంత రాములు. 111

ఆ.వె. మంచి వెజ్జుఁ బిలిచి – మందు లిప్పింపుఁడు
వ్యయ మొనర్తు రాక – పైస వోలె
వ్యాధి కుదుర సడియ – పదివేలు నాకని
వినయ ముట్టిపడఁగ – మనవి సేసె. 112

శా. ఆమాటల్ విని మాతులుండు మదిలో – నల్లాడి యేమంటి రా
మా మాయొద్ద ధనమ్ములేదె యిట మీ – మాభేదమొండున్న దే
యీ మా బిడ్డ రుజార్తి యెట్లడఁగునో – యేదేవుఁ డిడ్డమై
ప్రేమం గాచునొ యంచు నెంతు మది ని – ర్విణ్ణుండనై నిచ్చలుణ్.

తే. కూడు గుడ్డలతోఁ దృప్తి – కుదుర కంతొ
యింతొ మనమేల కూర్చుట – యిడుమ గుడుచు
చున్న తటిఁ బూర్తిగా నుప – యోగపడని
ధనము ధనమౌనె యద్ది యిం – ధనముగాక. 114

చ. అని యనురాగ ముట్టిపడ – నాడి తనూజను జాగరూకతం
గను తన మామఁగాంచి జన – క ప్రతిమానుఁడటంచు నెంచి శం
కనువిడి పూన్కిమై సెలవుఁ – గైకొని బొంబయిచేరె రాములే
డెనిమిది నాళ్ళలో దివికి – నేఁగెను సీత యిటణ్ రుజార్తమై. 115

కం. ఆవార్త యంద రాములు
కేవల దుఃఖాబ్ధి ద్రుంగి – కృప రేకెత్తం
బావన మతిఁ గడసారిగ
నావనితను జూడవలయు – నని వే వచ్చెన్. 116

వ. శుష్కగేఖ లలముకొని యున్న యాతని మోముంగని యాత్మ బంధుపు లెల్ల రుల్లములు దల్లడిల్ల గొల్లుమనిరి. అతండును గ్రుడ్లనీరు గ్రుడ్లఁ గ్రుక్కి కొనుచుఁ దనకుం దన భార్యకు ఋణము దీఱెననుకొని యైహికమునెడ

నిరాశాపూరిత హృదయుండై ప్రపంచమంతయు దుఃఖమయముగాఁ
గన్పింప సతీవియోగ సంతాపజలధి మునింగియుండె. 117

తే. ఎంత శోకించినను లాభ - మేమి గలుగు
విగత జీవి సజీవియై - వెలయఁ గలదె
యమరె సంజీవి లక్ష్మణా - హ్వయున కప్పు
డన్యులకు దక్కునే యది - యలమటింప. 118

ఆ.వె. పిన్న లెల్ల బిడ్డ - లెన్నఁ బెద్దలు దల్లు
లనుచుఁ బ్రేమ సూపు - నట్టి సీత
చిన్న వయసు నంద - సేరె స్వర్గమ్మని
యిరుగుపొరుగు వనిత - లేడ్చి రపుడు. 119

వ. అంత సుహృద్వ్రతంసములు నల్వురు పరివేష్టించి బహువిధ సాంత్వన వచనంబుల రాములఁ దచ్ఛ్వశ్రూశ్వశురులఁ గొంత తేర్చిరి. సగోత్ర సోదర బంధుమిత్రాదులంగూడి సీత కౌర్ధ్వదైహిక క్రియలు సక్రమంబుగ నెఱవేర్చి సత్తికొలంది నిఱుపేదల కన్న దానముసేసి యత్తమామలవలన ననుజ్ఞాతుండై లక్ష్మీతనూజుండు మరల బంబయిఁ జేరుకొనియె. శ్మశాన వైరాగ్యమే యెల్లరకు నిల్చియున్న లోకము నిల్చునా. ధైర్యారకూట కుండిక శోకహస్తచ్యుతమై భేదిల్లినను గాలలోహకారునిచే మాటువేయఁ బడును గదా. ఐనం దల్లియు నిల్లాలు నొక్కయేట మరణించుటం దల పోయ నతని హృదయసీమ నపుడప్పుడు నైరాశ్యరేఖ లలముకొను చుండె. ఒకదెస నంతగాఁ దనకుం గూర్చిన సద్గృహిణీ మరణమునకు లోలోన కుములుచు వేఱొకవైపు నిష్కారణముగఁ దధికృతుని క్రు[illegible] గ్నికి గుఱియగుచు నలిగి నలిగి యలుగులంపడుచు గత్[illegible] [illegible] జేసి యుద్యోగంబు తత్క్షణంబ వీడఁజాలకుండె కాని [illegible] క్రమక్రమముగ వైరాగ్యమున కున్ముఖమై కొనుమొదలు మొత్తంబు తఱిగిన సెట్టి చిత్తంబున కెనయయ్యె. ఇట్లు కొన్ని మాసంబులు చన రంగయ గుప్త యన్న సన్నిధికివచ్చె. వచ్చినవానికి వలయు రీతి మజ్జనభోజనాదుల సమకూర్చి. 120

# సహోదరుల సంభాషణ

ఉ. అప్పు డతర్కితో పనతు - నాత్మసహోదరు రాములావరం
బొప్పుగఁ జేరఁ దీసికొని - యోర్పు మెయిన్ భవదీయ విద్యయం
దెప్పుడు తెప్పగొట్టవని - యెంతుఁ గొఱంత రవంత లేదుగా
చెప్పు మిఁకేల వచ్చితనఁ - జెచ్చెర రంగయగుప్త యిట్లనున్. 121

శా. అన్నా నీదయయున్న నాళ్ళు కొఱతా - వంతైన లేదింతకుం
గన్నారల్పని రేమిసెప్ప మనమూ - కన్విప్ప మిట్టుండ నేఁ
గన్నారంగనుచుండ నీ గృహిణియుం - గైవల్యమును జేరె స
న్నెన్నంగాఁదగు బుద్ధుఁడంచు నెటులో - నీగేహ కృత్యావళుల్.122

ఆ.వె. గురుల బోధనముల - గుఱి నిల్పి పనినల్పి
వైద్య విద్య లోని - వాసి దెలిసి
రేయి పగలు నాక - హాయి సిల్గనకుండఁ
జదువుచున్న వాఁడ - సాధు చరిత. 123

వ. ఇంక నావచ్చిన విషయంబు విన్నవించెద సావధానుండవై యాలిం పుము. ఇప్పుడు మన కుటుంబమునకు నీవ పెద్దవాఁడవు. మాకుం దల్లియుఁ దండ్రియుఁ దోడును నీడయు నీవ. సమస్త భారము నీ భుజ స్కంధములపై నున్నయది. ఎందనుక స్వయంపాకుండవై కస్తిగడు తువు. దీనం గల్గు సిల్గు నుగ్గడింప నగ్గలంబు. నీపడుపాట్లు కొలఁదులు వెట్టరానివ. నీయునికింగన్నఁ బొడవు గైకొన్న శమదమములని సన్నుం జెప్పనొప్పు. నీకు లభించు స్వల్పజీతమ్ముమై నాకు మేనల్లునకిట్టి యున్నత విద్య లెట్లు చెప్పించుచుంటివో భగవంతున కెఱుక. నీవు శీఘ్రమ్మ ద్వితీయ వివాహమ్ము చేసికొని సుఖంబుంట మాకు ముదావహంబు. రెండవ పెండిలికింత జాగేలని మన బంధుమిత్రులు తఱిమి తఱిమి యడుగుచున్న వారలు. పిల్లనిత్తుమని పలువురు వచ్చుచున్నారని నీకుం దెల్లమ. మీకు నచ్చిన సంబంధంబు యొనగూర్తుమని యాత్మీయు లనుదిన మనుచుండ నీవిట్లుపేక్షించుట పాడిగాదు. నీవు సమ్మతింప ద్రుతిగతి నజ్ఞతనమొనర్ప మన పెద్దలు సిద్ధముగనుంటఁ దచ్ఛుభకార్యంబు నేత్రోత్సవంబుగ జరుగు. కావున నీమైకోలు వడయ నేనింతాడినాఁడ. నీమేలు మామేలుగదా.

నీమదిగుట్టు నాకవగతమ్ము గామింగలఁత నొందుచున్నాఁడ. కలరూపు బాహిర పెట్టుము. 124

శా. ఆనిపల్కం జిఱునవ్వు వెన్నెలలు గా - యన్ రాము లాతమ్మునిం
గని నీవాడినదెల్ల సత్తెమగు నా - కల్యాణముం గూర్చి చిం
తనయే లేదిపు డప్డు మేనరికము – న్నంగాదె చిన్నప్డ వ
ద్దనఁ జేసెన్మనతల్లి తొందరదియే - లా నుంత శాంతింపుమా. 125

కం. ఏనిపుడు పెండ్లియాడిన
యానాతియు నాదునడక - కందునొ లేదో
ధీనిధులారసి లోకము
మాణిక్యము వోవ వచ్చు - మసి ప్రాఁ తనరే. 126

కం. ఈవెఱఁగవె మన సోదరి
యేవిధముగ మనలఁ జూచి - యేఁగెనొ దివి క
ప్పావని సనినది మొదలుగ
బావకు బరువైన బిడ్డ - భారము మనదే. 127

వ. ఆంగ్లేయ వైద్యవిద్యాభ్యసనమ్మున నీకుం జతుర్థవర్షమ్ము గడచుచున్నయది. అక్కఱకు రానున్న ఫలంబని యానందింతు. భాగినేయుఁడును జక్కఁగఁ జదువుచున్నవాఁడు. ఇతరాదాయంబు లేకుంట నొక్క తెక్కమీఁద నిన్ని బాధ్యతలు నిర్వహింపవలసియుంట గమనించియ యేబాణిపీడనము మానుకొనుచున్నవాఁడ. దానికింగల కతిపయహేతువులు క్రమక్రమంబుగ వాకృత్తు. నాకలోక కల్పమ్ముగా నుండఁదగిన యీనా యుద్యోగ మొకానొక యధికారి కారణమ్మునఁ గొంతకాలమ్మునుండి నాకు నరకలోక సదృశమైనది. ఐన మీ సేమమ్ము పొంతె నేనిప్పుని నిందనుక నిలిచియున్నవాఁడ. ఉగ్రంపశ్యుఁడు దురహంకారవ్యగ్రయాయి యక్షిగతుఁ డలసుఁడు విరసుఁ డసమర్థుఁడైన తదధికృతు దుర్గుణములనే వెలార్పక యతని యానల శిరసావహించుటంజేసి నాపై స్వారి చేయుచు నాకిబ్బడి ముబ్బడిపని గల్పించుచు నాయందెట్టి లోపంబులేకున్న నన్నె చేతగానివానిగ నిరూపించుచుఁ బదవీత్యాగ పరిస్థితు లెడనెడఁ గల్పించుచున్నవాడు. దానమన్మానసిక వికాసము మటుమాయమగుచున్నది. 128

చ. అవమతిశల్య మాత్మనవు - డప్డు చలింపఁ జలంబు పూనకే
సవినయ బుద్ధి ధర్మరతి - శాంతవచస్కుఁడనై చరించితిఁ
శివశివ యేమిపాపమును - జేసితినో యతఁడింతమాఱిఁ డీ
ఖవినరరూప రక్కసులు - వో యిటువంటి దురాత్ము లెన్నఁగా. 129

తే. బాకునం గ్రుమ్మి నట్టుల - పల్కుచుండుఁ
బనికి నర్హుండు గా కున్నఁ - బైనవచ్చు
రూకలక చూచు గుట్టము - గ్రుడ్డిదైన
దాణకుఁ లేదు కొఱఁతంట - తథ్యమె కద. 130

కం. గుంటకు మెట్టకు లాగినఁ
గంటు గిలక వాని చెప్పు - కర్ణము లిట్టు
ట్టుంటు నెఱుంగక నల్పుట
మంటిఁ బరులవలనఁ జెడ్డ - మాట పడకయే. 131

కం. కట్టలుక వొడమ నెడపెడ
దిట్టిన నెట్టెట్టొ యెడఁద - దీల్పడఁ బోకే
నిట్టూర్చి యూరకుంటిని
గట్టా పాపులకు శిక్ష - గలుగదె జగతిఁ. 132

తే. అతఁడమాయికుఁడనఁ దోఁచు - నప్పుడప్పు
డద్ది యొక యెత్తుగాని యిం - కెద్దిగాదు
పరులఁ గికురింపఁ దా నొడ్డు - పట్టఁ బట్టు
బట్టి యేయెండ కా గొడ్గు - పట్టుచుండు. 133

వ. అతండు మూర్తీభవించిన స్వార్థంబ. వాని మనస్తుల దౌష్ట్యంబు దెనక ములుసూపు. పాపగ్రహ దృష్టింబలె నవ్వాని రూక్షవీక్షణాగ్ని జ్వాల నెవ్వనిపై నెప్పుడెట్టు ప్రసరించునో యెరికే ననూహ్యంబు. అది పిచ్చివాని చేతి బెడ్డ. దయాదాక్షిణ్యంబు లవ్వానికిం జాలదవ్వు. ఉపధాశుద్ధుల కీక ప్రభుత్వోద్యోగము లిట్టివారికిచ్చుట దేశమునకే కరము హానికరము. పెత్తనగాండ్రు వాని మెత్తమెత్తని మాయమాటల వాగురలం జిక్కికొని యుంద్రు. దానికిం గారణం బాదినుండి మాకు విదితము. 134

తే. మంతు కెక్కిన పైవారి - కింత మేపి
నక్క వినయమ్ము సూపుచు - మ్రొక్కి మ్రొక్కి

తొత్తువలె వారి పాదము - లొత్తు నతఁడు
గడ్డి పఱకట్ల మాబోంట్లఁ - గాంచుచుండు. 135

ఆ. వె. సూర్యరశ్మిచేత - శుభ్రాంశు చందాన
నధికు నండవెల్గు - నల్పుఁడైనఁ
గథ యొకింత లోటు - గలదైన సత్కవి
కవితఁ గతకు మహిమ - గలిగి నట్లు. 136

వ. తెచ్చికోలునవ్వులు, వినఁబడని యఱమాటలు, చప్పుడుఃగాని యడుగులు, సమయమెఱిఁగి యాకసమున కెత్తుట పాతాళమునకుఁ బడద్రొబ్బుట యిత్యాదులు మహా ధూర్తలక్షణములని జ్ఞానవృద్ధులంద్రు. ఇంక వాని చరిత్ర చెప్పందలంచిన నొక గ్రంథమగు. 137

కం. మును దాఁ జెప్పిన రీతిగ
నొనరించిన నిట్టునేసి - తొప్పదు నా సీ
వనినట్ల సల్పితిని యన
ననలేదని వల్కు తాన - యాడిన మాటల్. 138

తే. అతఁ డేతెగ కందునో - యరయలేము
యూగ్లినా చందమునఁ జర్య - లొప్పుచుంట
నెంత మంచికిబోయిన - నంతకీడు
గలుగు నవ్వాని చేఁతల - వలన నాకు. 139

వ. వాని సొంత పనియైన నిక్కార్యంబు నీ వలనం గావలయునన్న మాత్ర నొప్పరికింపక యెప్పగిదినేఁ బెక్కుమార్లట్టికృత్యంబులు సెప్పినట్ల సేసితి. కృతజ్ఞత లేమికిన్వగవఁగాని చివఱకు వానికి ప్రతిఫలంబులు వషట్కారంబులగుటకుం జింతింతు. 140

కం. లేకికి మే లొనరించిన
లాకేత్వము దాకుఁ గొమ్ము - లాలించి యిడుల్
నా కేశునైనఁ దెగడుం
గాకా నీకమ్ము పికము - గాఁ గూయు నొకో. 141

ఉ. దగ్గఱఁ జేరి కొండెములు - ధర్మవిరుద్ధముగా వచించినం
బగ్గె గొఱంతకావున సె - బాస్సని సాధుల కెగ్గుసేఁత కే

యొగ్గు నిజమ్ముదెల్ప నది - యూఁకొన నొల్లఁ డదేమిచిత్రమో
బొగ్గును బాలతోఁ గడుగఁ - బోవునొకో మలినమ్ముకింతయుఁ. 142

కం. ఇచ్చకముల నొరు దివియుట
కచ్చెనఁటిన పల్కు యొరుల - నాడఁగవలయుఁ
ముచ్చిలు మము మాపాలిటి
యచ్చపు యమకింకరుండ - యై మిడిసిపడుఁ. 143

ఉ. లేకరికాఁడు సత్తెమన - లెక్కగొనండు విధిన్విడుఁ సదా
రూకల దప్పి దీఱుటకు - రోయుఁ దలంపఁడు మంచి యేరికిం
బోకడ లన్నియున్ శకుని - పోకడ కన్నలె యన్న యెన్నఁగా
యేక్రియ వానియొద్దఁ బని-యెవ్వఁడు సేయఁగలాఁడు సెప్పుమా. 144

కం. తన ధర్మము దా నెఱుఁగక
పని కొడలిం దాచుకొనుచుఁ - బైవారియెడఁ
వినయము సూపని యుద్యో
గిని గెంటిన గెంటవచ్చు - గేవల నీతిఁ. 145

వ. ఏ పనియం దెప్పుడే నేమరిల్లి యెఱుంగ. ఇంతకేఁదెగుదారిఁ గామిం జేసి వాని యాటకట్టదయ్యె. నా చూపు నోర్పునేర్పులు జ్వాలదగ్ని నాజ్యంబు నల్లినట్లు పామునకుఁ బాలువోసినట్లు వాని దుష్కృతులగ్గల మగుటకే సాయపడుటఁ గనికని ఇసివి -పలుమార్లిప్పనికి రాజీనామా యీా సంకల్పించితి. సమయంబు పరిపక్వంబుగాకున్కి మదభీష్టంబు నెరవేరదయ్యె. మంచికాలమ్ముకొఱకు వార్చితింగాని యది కఱవయ్యె. 146

తే. అన్ని యోచించి ముల్లరఁ - టాకు సామె
తం దలఁచి యింతకాలంబు - తగినరీతిఁ
గడపినాఁడ మనమ్మున - గష్టపడుచు
మీరు గట్టెక్కు మార్గము - కోరి కుఱ్ఱ. 147

కం. తగిలిన కాలికె తగులును
ద్విగుణీకృత బాధవలన - దిగులు పడంగఁ
దగ నాడెద జగ మెఱుఁగఁగఁ
ఖగవానికి నైన నిట్టి - బాధలు దగునే. 148

తే. పేదఱికమి పెక్కుచిక్కుల - పాదొ యేమొ
పుట్టువుండొట్టి యగచాట్ల - పోతునైతిఁ
దల్లిదండ్రులు నిల్లాలు - దాఁటిపోయి
రింక నిప్పని నుంటకే - నిష్టపడను. 149

ఆ.వె. ఊరక కర్చుపెట్టి - యుద్యోగ వాంఛమై
యాంగ్లవిద్యనేర్చి — యధము క్రింద
బ్రదుకుకంటె మంచి - వ్యాపారిగా మాఱు
టెంత లెస్స యంచు - నెంచినాఁడ 150

తే. ఐన నీకిది వర్తింప — దాంగ్ల వైద్య
విద్య నీనేర్చు విద్యగా — వెలయు కతన
దొరతనపుఁ బనిగల్గఁగాఁ — దోఁచు స్వేచ్ఛ
యిరుపలంకుల నిశతోడ — నెసఁగు నదియ 151

తే. కావుటంజేసి పట్టమ్ము — గలుగ సిరికిఁ
గేవలము దావలమనఁ ద్వ - జ్జీవిక యిఁకఁ
వైభవోన్నత గంగా ప్ర — వాహ మట్టు
లొడుదుడుకులేక సాగుచు — నుండఁగలదు. 152

వ. అందనుక నేనీ సేవావృత్తి నుండఁజాల. 153

చ. అనవుడుఁ దమ్ముఁడగ్రజుని — యాత్మకథం గమనించి యన్న నీ
మనమున నొక్క మూర్ఖు పెను - మాయకు మాటకు జంకి కొంకి యి
ప్పనివిడనాడనౌనె గుణ - వంతులు పెత్తనగాండ్రు లేరె వా
రినిగని చెప్పికో వినరె — ప్రీతిగ లోకము గొడ్డువోయెనే. 154

వ. నీ వాడిన దానింబట్టి నా గ్రహించిన దేమన. 155

తే. నోరు మాటాడుచుండఁగా — నొసలు వెక్కి
రించు ననురీతి నతఁడు వ — ర్తించుచుండుఁ
గూడవచ్చుచునుండియు — కూఁతవేయు
గోముఖవ్యాఘ్రమును నమ్మఁ — గూడ దనిరి. 156

తే. నెయ్యతియ్యంబు లెఱుఁగని - నీచుఁ డొరులఁ
బంచి పనిగొని మిగుల రా - జించఁగలఁడె
యేమి లేనట్టి విస్తర - యెగిరి పడఁగ
నన్ని యున్నట్టి విస్తర - యణఁగియుండు. 157

తే. పదవి విడనాడి చనువేళఁ - బదరఁ బిలిచి
నిన్నుఁ బెట్టిన యిక్కట్టు - లన్ని సెప్పి
తెట్టతెర్వున వెస నిల్వ - బెట్టి వానిఁ
గడిగి విడిచినఁ గాని ని - క్కము గనండు. 158

వ. ఐనను నీ వంతవఱకు వచ్చుట మాకు హానికరము. 159

కం. ఆపద లగ్నిపరీక్షలు
పాపపుఫలితంబు లెట్టు - వాయుఁ గుడువకే
రూపమున వచ్చునో జను
లేపగిదిం దెలియనేర్తు - రీశ్వర లీలల్. 160

కం. నీ విప్పుని విడనాడిన
మావిద్య లిఁకెట్టుసాగు - మనసంసారం
బేవిధమున జరుగుఁ గృపా
పావనచిత్తమున నిట్టి - పని సేయకుమా. 161

ఆ.వె. ఇంత కాల మెట్లొ - యెంతొ యోపికపట్టి
యిట్టి స్థితికిఁ దెచ్చి - యిపుడు విడుతె
చక్కనీనఁ గాచి - నక్కల పాల్సేయు
టేల నీకుఁ జెప్ప - నే వలఁతినె. 162

కం. ఏకరువు వెట్ట నేటికి
నేకఱవు న్వెట్ట యెఱుఁగ - మీనాఁటికి శో
భాకర! నీకతమునఁగా
సాకల్యం బరసి యిట్టు - సలుపందగునే. 163

కం. ఆలింపుము నామాటలఁ
భాలసుఁ డధికారి యగుట - బాధయె ధరణీ

పాలురు గోడుంగుడువరె
కాలమునకు నెంతవాఁడుఁ - గట్టువడుఁగదా. 164

తే. దానముల నెన్న మిన్న ని - దాన మన్న
సుద్ది పాటించి మమ్ములఁ - జూడు మన్న
శీలమున నెప్పుడైన ని – న్యోలువారు
బీజమాత్రంబుగా నుందు – రీ జగాన 165

వ. ఇట్టట్టనరాని యిక్కట్టు లిట్టలమ్ముగఁ జుట్టుకొన్నతఱి నెట్టివారికైన దిట్టతనమ్మట్టి సడలుననుట నిక్కమ్ము. ఐన నధికారమ్ము పరిత్యజించి సాధారణవాణిజ్య మేల యభిలషించెదు. ఉత్తరోత్తరపదస్థితు లంత యజ్ఞానులా? తొలుదొల్త వానింగూర్చి చెప్పుకొనకుంటయ యింతకుందెచ్చె నని తలంతు. పనికిదూడలలో మేఁతకెద్దులలో నుండువానింగని యసహ్యా వడినంజెల్లు. నీవంటివాని నిట్లలయింపందగునా? 166

కం. ఏలొకొ యింతగఁ జాటెదు
పూలమ్మినచోట నకట – పుల్లల నమ్మఁ-
మేలని తలఁచెద విదిమన
చాలనిదినములకు గుర్తు - సౌజన్యనిధీ. 167

కం. ఈక్రియ నిన్బాధించిన
యాకతినుని యంతుగనక – యఘము విడుచునా
యేకట్టియ నిప్పుండిన
యాకట్టియ కాలుఁగాని – యన్య మెరియునా. 168

తే. డొంకతిరుగుడు దారుల – వంకఁ బోక
సత్తెమును నమ్మి ముకుసూటిఁ – జనుట లెస్స
కట్టె వంకర ప్రోయి దీర్పఁ – గలిగినట్లు
శివుఁడె యన్నింటినిం జక్కఁ - జేయగలఁడు. 169

వ. అన విని లక్షణశిక్షాదూరుని గ్రంథమున నెరసు లందందు గోచరించి నట్లు సామాన్య మానవజీవితమున స్వల్పలోపములుండకపోవు. కాని కావలయునని నన్నతఁడు కాఱియపెట్టుచున్నవాఁడు. వానివలనంగలిగిన

బస్నము తిన్నియన్ని గని యెన్ననేల. వానినన్నింటినిం జేమ్రింగినట్లు
మ్రింగితి. 170

కం. తనపైవానిం దండ్రిగఁ
పసక్రింద మెలంగువానిఁ - దమ్మునిగఁ బ్రజల
దనప్రజగాఁ గను నధికృతుఁ
డనఘుఁడు వెంట సుఖమందు — సంస్తుతి కమింస్తుల్. 171

కం. అదియెద నమ్మి చరించెడి
నదయుఁడు దుర్లభుఁడు లోక — జాలమునం దే
నిది స్వానుభవము దెల్పితిఁ
గుమరదు చట్టంవునడక - గుణహీనునకుఁ. 172

కం. భ్రష్టులకుఁ బదవు లబ్బినఁ
గష్టంబులెగాక సుకము — గల్గునె కలలో
దుష్టులకు లొంగుఁడని విధి
శిష్టులకుఁ నుదుట వ్రాసి — చేసెనొ సృష్టిఁ. 173

వ. కనంగన లోకము పోకడ నాకత్యాశ్చర్యకరంబుగ నున్నయది.

తే. గూటిలో గ్రుడ్ల నొక్కండు — వాట మెఱిఁగి
తీయ నాతని యొడినుండి - తీయు నొకఁడు
మాయమర్మంబు లెఱుఁగని - మనుజ తతికిఁ
గలియుగంబునస్థానంబు — గలుగ దెపుడు. 175

తే. నన్ననవె యూహదెలిసిన — నాఁటఁగోలె
నాత్మఁ గలదెద్దియైన నే — నాడు టన్నఁ
గుండబ్రద్దలు గొట్టిన — ట్లుండుఁ గాని
ముసుఁగులో గ్రుద్దులాటగాఁ - బొసఁగ దెపుడు. 176

కం. నాడిక కోర్వఁగఁ జాలని
నాఁడిఁకఁ ద్యాగంబ యలఘు - నాళిక హతియా
వాడిగల మనసు గల్గిన
ఘాఁ డోర్వఁడు చేసి మాట - వడుటకుఁ గుత్తా. 177

వ. కత్తులబోనులోఁ జిక్కికొన్న ప్రాణింబలెఁ జిత్తంబున నుత్తలంపడి యెట్టకేల కిదియుత్తలంపట యని యూరడిల్లితి. 178

కం. లోకప్ర...హారమ్ముల
సాకల్యం ...గినట్టి – సాల్సాలిఁక నా
పోకడ వేఱైపోయిన
దే క్రియనే దేశసేవ - కేగఁ దలఁచితిఁ. 179

వ. అక్కారణంబున నస్మత్ప్రాణౌకరణేచ్ఛ గుణవిహీన శరాసనంబుంబోలె నెన్నండో పరిత్యక్తంబయ్యె. 180

తే. హరుని నేత్రానలంబు చ - ల్లారుఁగాక
విష్ణు చక్రపుటంచులు – విరుగుఁగాక
యజుని శాపాగ్ని వెసవ్యర్థ - మగునుఁగాక
వమ్ముకాదిఁక నావాక్కు - తమ్ముఁగుఱ్ఱ. 181

వ. ఇది దేవునియాజ్ఞ. ఇయ్యది భీష్మప్రతిజ్ఞ. 182

ఉ. స్థావర జంగమాత్మక వి – శాల ధరాతలమెల్లఁ దిర్గినం
ధీవరులేరు నెందుఁ గన – నేరరు గాంధినిబోలు మానవుం
బావనమూర్తి యాతని ప్ర – వర్తన హింసకు దూర మౌటచేఁ
గేవల బుద్ధధర్మతతి - కే ములుసూపును శాంతిదూతగా. 183

కం. ఏతాదృశగుణిమణికిఁ
శీతాద్రిసమాన ధైర్య - శీలున కర్థో
పేతాఖిల జననాయక
చేతఃకమలాబ్జున కొగిఁ - జేసెద సేవఁ. 184

కం. ఏతఱి నేతరి గాఁడతఁ
డాతత ధీశక్తి భక్తి - నచలుఁడు కరుణా
స్వీతుఁడు భారతనేతృ
ఖ్యాతుం డతనిన్భజింప - నరుగుదు వత్సా. 185

కం. వినుకలి కనుకలి కలిమిని
మనన మ్మున మనసు మిగుల - మహి మాన్వితమౌ

ననుకొని విద్యార్థింబలెఁ
జనఁదలఁచితి నమ్మహాత్ము - సద్బోధ వినన్. 186

వ. అదియునుంగాక యేతన్నగరీమచర్చికం బెక్కుశరత్తు లుంటంజేసి యతిరథమహారథులగు దేశనాయకుల వాఙ్ముఖామృతము మనసారఁ గ్రోలఁగలుగు నదృష్టము నాకుంగల్గె. దాన నామనఃకమలము దేశసేవారుణకిరణోన్ముఖమయ్యె. దీన నీకెట్టిలోటు గలుగదు. మనమెల్లరము దైవానుగ్రహమున కెదురు సూడవలసినవారము. అదిమదినమ్మియుంట శుభంబులవంట. 187

కం. ఏడాప గాంధిగనుటి
య్యేడాఁప సబర్మతీ మ - హీరుహ ఫలమున్
వేఁడుకొని యనుభవించెద
వేడుక జని జనని సేవ – విమలతనొందన్. 188

వ. ఆ పరమపూజ్యుని వాక్కు వేదబుక్కు. అనిష్ఠాగరిష్ఠుని దృష్టి నూతన రాజకీయచైతన్యకలాసృష్టి. అమ్మహామహుని దీక్ష భారతీయ జనతారక్ష. ఆ జితేంద్రియునినడక స్వరాజ్యసంపాదనపుంగడఁక. ఆ శాంతిదూత నవ్వులు పతితజనుల పాలి పువ్వులు. అప్పరమహంస యహింస సర్వజ్ఞులీలాప్రశంస. ఆ దివ్యజ్ఞాని సందేశము దేశాభ్యుదయ మంత్రోపదేశము. అయ్యుపద్రష్ట రాచరికపురాయబారపుమైకోలు తెల్ల దొరలపీడ్కోలు. అయ్యవికత్థను స్వీయక్రియావివరణము దీనజనకర్ణాభరణము ఆ సత్యసంధుని శ్రమ లోకకల్యాణరాజ్యరమ. అమ్మహాత్ముని సుగుణంబు లభివర్ణింప నతీతవిధాతృకల్పాంతుండైన యనంతునకైన నశక్యంబన లాఁతులు వలఁతులా. 189

తే. పాపకూపంబునంబడి – పరితపించు
మానవుల నుద్ధరించెడి - జ్ఞాని యతఁడ
వాని పదపద్మ సన్నిధి – వరలి నట్టి
పూరి మేరువుగా మాఱి - పోవఁ గలదు. 190

కం. హరిజన గిరిజన పురజన
పరమార్థముపొందెఁ బాటు - పడిన నరుండే

నరుఁడనఁదగు గాంధీజీ
చరితార్థుండయ్యె నిట్టి - సత్కార్యతతిన్. 191

తే. శాస్త్రసాంకేతికజ్ఞాన - శక్తి నూత్న
సృష్టికిన్స్రష్టలను సృష్టి - సేయు కరణి
గాంధిసద్బోధ భారత - క్ష్మాతలమునఁ
దఱియెఱిఁగి నేతృవరులను - దగసృజించె. 192

వ. అతండ మాతృదేశదాస్యశృంఖలములభేదింపఁగల మహనీయుండు. కావున వైశమ యిప్పదవికి రాజీనామాయిచ్చి ప్రభుత్వోద్యోగబంధ విముక్తుండనై సబర్మతింజేరెద. ఎడనెడఁ జెన్నపురికరుదెంచి మీకు వలయుమార్గంబుల శక్తికొలంది సమకూర్తు. వగవంబనిలేదనఁ గాంగ్రెసునం బక్షద్వయంబేర్పడెనం డ్రద్దాని విధంబెట్టిదనవుడుఁ దమ్మునిగని దేశదుస్థితిఁ దొలఁగింప స్వరాజ్యముసంపాదింప నఖిలభారతజాతీయమహాసభాసభ్యులరగు దాదాబాయినౌరోజీప్రభృతుల కాలమునుండి తిలకుతఱి పఱకుఁ బ్రశంసాపాత్రమగు నమోఘకృషిజరిగె. కాని గోఖ్లే లోకమాన్యు లత్యంతప్రధానపాత్రలు నిర్వహించుచున్నసమయమున దక్షిణాఫ్రికాభారతీయుల స్థితిగతుల నుగ్గడింపఁ బూనాపత్తనమున నొక మహాసదస్సు సేఁతకై మహాత్ముఁడు మున్ముందు తిలకుందిలకించి తదను మతిం గోఖ్లేఁగాంచె. అట్లు దర్శించినప్పుడు లోకమాన్యుఁ డత్యాయతోన్నతశీతశిఖరిశ్రేణివలె నికటముంజేరనయితిగానట్లు గనంబడ గోఖ్లే యొక్కతేప బ్రుంగితేలుటకనువైన పరమపావనజాహ్నవింబలెఁ గాని పించెనని బాపూజీ నిజమనోభిప్రాయము ప్రజలకుగ్గడించె. అట్టిమహనీయుల గమ్యమొండయ్యు గతులువేఱయ్యె. (1) గోఖ్లే రాజ్యాంగపుం బట్టము జనసౌఖ్యవాంఛమై విస్తృతముగ వర్ధింపవలయుననఁ దిలకు సమగ్రముగఁ బునర్నిర్మాణమొనర్పవలయు నను. (2) అతఁడు ప్రభుత్వముతో నైకమత్యమునెఱపుచుఁ గలసిమెలసిపనిసల్పుచుఁ దద్విధానంబు లశేషంబుగగ్రహించుచు ననుకూలవాతావరణ మేర్పడువఱకు వార్చియుంట వలయునన నితఁడు నిరంతరము నిశ్చలదీక్షమై దానితో సంగ్రామమొనర్పవలయుననను. (3) అతఁడు మనకవకాశమున్నయెడల

దొరతనముగోరిన మేరకు సాయముసేయుచుఁ గాలానుగుణ్యముగ నక్కఱ గల్గినే నెదుర్కొనందగునన నితఁడు నిరంకుశవిధానముమెయి నధర్మోత్తరమ్ముగసాగుచున్న పాలనాపద్ధతి నతిశ్రద్ధతో ననుక్షణమడ్డుపెట్టి సిద్ధపడవలయునను (4) అతఁడు దెల్లదొరలయేల్బడియు దానిపెనుపును ముఖ్యవిషయములుగఁ జూడఁదలంప నితఁడు భారతజాతిపురోభివృద్ధియ కేంద్రలక్ష్యమను. (5) అతఁడు ప్రేమారాధనము దివ్యసాధనమన నితఁడు శౌర్యసాహసత్యాగార్చనయ యుత్తమాదర్శమను. (6) అతఁడు విదేశప్రభుత లోఁగొనందగునన నితఁడు తద్రాజ్యాంగయంత్రము నగ్నినౌకలకెక్కింపవలయునను. (7) అతఁ డన్యసహకారముపై నాధారపడనిచ్చగింప నితఁడు స్వయంసహాయమ్మ పట్టుఁగొమ్మయను. (8) అతఁడు ధనవంతులపై విద్యాధికులపై దృష్టినిలుప నితఁడు సామాన్యజనసమూహముమీఁద మనసిడు. (9) అతఁడు శిష్టపరిషత్తు గొంతవఱకు మనకుం గార్యరంగముగాఁదగునన నితఁడు మనకర్మక్షేత్రము గ్రామమంటపమను (10) అతఁడు హూణభాషాపరీక్షలం దుత్తీర్ణులై యాధునిక ప్రపంచజ్ఞానమొంది స్వపరిపాలనానిర్వహణమున కర్హులైయుంట లెస్సయన నితఁడు భారతీయుల జన్మపుహక్కగు స్వాతంత్ర్యము విదేశీయసంబంధవిరహితముగ నార్జింపవలయునను. (11) అతఁడు సంఘసంస్కరణమున కగ్రస్థానమీ నితఁడు దేశీయుల వీరపరేణ్యులుగ నొనర్చు కృత్యమునకె పైఁడిపీఁటనొసంగు. (12) అతఁడు దేశకాలోచితముగఁ బ్రవర్తింపవలయునన నితఁడు భావికాలమునకు మార్గదర్శకులమగునట్లు జీవింపవలయునను. ఈ యిర్వుర నడుమనిట్లేర్పడిన భావపరంపరలు తదనుయాయులయెదలం గాటమున నాటుకొనఁ గాలక్రమమున నేకసంఘమునందె మితవాదాతివాదపక్షంబు లేకస్కంధజనితశాఖాద్వయంబు భాతి నేర్పడె. గోఖ్లే గాంధి మోతీలాలు జవహరులా లన్సారీ వల్లభభాయి పటేలు సేనుగుప్త రాజేంద్రప్రసాదుమౌలానాఅజాదు కపూర్ఖాను గోవిందవల్లభపంతు బెసెంటు సరోజినీనాయఁడు పట్టాభిసీతారామయ టంగుటూరిప్రకాశము జమ్నాలాలుబజాజు సప్రూజయకరు జయరామదాసు దౌలతురాము మాలవ్యా యబ్బాసుతయాబ్జీలు మితవాదనాయకవర్గముగఁ దిలకు చిత్తరంజనదాసు సుభాషచంద్రబోసు విఠల్భాయిపటేలు శర

శ్చంద్రబోసు లాలాలజపతిరాయ్ శ్రీనివాసఅయ్యంగారు మద్దులూరి యన్నపూర్ణయ్య ప్రొఫెసర్ బరీ బులుసుసాంబమూర్తి సర్దారుశార్దూల సింగు లతివాదనాయకవర్గముగ నొప్ప నిరుగెలన మెఱయు వెగ్గలింద్రు వారివారి మార్గంబుల స్వకకార్యంబు లగ్గలమగు పట్టుదలమై సాగించుటం జేసి వాని స్వరూపంబుల మార్పు గానరాదయ్యె. 193

కం. అతివాదుల మితవాదుల
కత యీగతి సాగుచుండెఁ - గదనమునందుఁ
జతకుదురక తికమకలయి
వెతకుడువందొడఁగె గాంధి - వేయి తెఱఁగులఁ. 194

వ. అని సహోదరు పీఠ్కొల్పి పత్రికాముఖంబున వివిధపక్షనేతృమనః ప్రవృత్తుల నవగాహనము చేసికొనుచుండె. అత్తఱి ఖండఖండాంతర స్థితి గతు లెట్లున్నవన— 195

# ప్రపంచ స్థితిగతులు

శా. శరవేగంబున మాఱుచున్న పరదే - శ ప్రౌఢరాజ్యాంగ సూ
త్రరమాలాన్యవిశిష్టహాస్యసుషమా - తత్త్వార్థముల్ తత్ప్రజా
దరణీయార్థిక సాంఘికైహికకలా - ధర్మప్రబోధస్థితుల్
గురుతింపందగు వానిశక్తి వెసఁ బ్రా - కుంగాన ఘూమండలిన్.

తే. నరవి విజ్ఞానశాస్త్ర ని - స్తంద్రశక్తి
నెల్ల దేశంబు లొక్కటై - యేకరాజ్య
సంస్థకుం గట్టుబడియుండు - సమయమ్మరుగు
దెంచునాయను భ్రాంతి క - ల్గించుచుండ. 197

తే. అన్యవిషయమ్ముతోడ నా - కవసరమ్ము
లేదనుచుఁ జెప్పఁగలనాడు - లేదునాఁడు
కాన నన్యోన్య హితవైర - కారణమ్ము
లెఱిఁగి వాతావరణము నూ - హించు టొప్పు. 198

రష్యా

ఆ.వె. రాస్పుటేను మాట - రక్షగా భావించి
దేశసుఖ మొకింత - తెలిసికొనక
జారుచక్రవర్తి - సల్పె నిరంకుశ
పాలనమునఁ గష్ట - పడిరి ప్రజలు. 199

కం. పలుభాషల పలుజాతుల
పలుసంస్కృతులన్ సతంబు - ప్రఖ్యాతంబై
వెలిగెడిక్షీరష్యాయందు
జ్వలజాతీయోద్యమంబు - సాగెన్ వేగన్. 200

కం. మతబోద్ధల మతగృహముల
ధృతి నృపవంశములఁ గూల్చి - త్రీడించుచు న
ద్భుతరక్తపాతవిప్లవ
గతులన్ స్థాపించె లెనిను - కమ్యూనిజమున్. 201

కం. పంచాయతీ విధానం
బించుట నద్దాని పేర - నేల్బడి యొప్పెన్
గొంచెము కాలము జరుగ గ
తించె లెనిన్ స్టాలినపుడ - దేశము నేలెన్. 202

తే. పాదరక్షలు నిర్మించు - వాని పుత్రుఁ
డేలికొనని యెవ్వార - లెంచఁగలరు
కాలగతి యట్లులుండెఁబో - స్టాలి ననఁగ
నుక్కుమానిసి యనునర్థ - మొప్పుచుండు. 203

కం. అఱువది లక్షల కులకుల
వెఱవక చంపించి ముఖ్య - వృత్తుల నెల్లన్
దొరతనమె నడపుచుండుట
నరులకు స్వీయాస్తియందు - నమ్మిక పోయెన్. 204

తే: పంచవర్ష ప్రణాళిక - మంచి కట్టు
భాటుతో సాగ సౌఖ్యంబు - పొదుకొనియె

నార్థిక సమత్వ మొకకొంత – యవతరించెఁ
ప్రజల ముఖ్యావసరముల – బాధ తీఱె 205

టర్కీ

తే. ఆసియామైనరున గ్రీకు – లడుగువెట్టి
ప్రజల హింసింప నొకప్రక్కఁ – బాప మనక
సంశయింపక సెవ్రెసు – సంధిషరతు
పత్రముల మిత్రమండలి – బయలుపఱిచె. 206

తే. దేశభక్తుల సభసేసి – దీర్ఘ చర్చ
జరిపి స్వాతంత్ర్య సమరమ్ము – సల్పి విజయ
మందిన కెమాల యధ్యక్షుఁ – డైన కతన
నఖిల జనులకు సంతోష – మావహిల్లె. 207

కం. టర్కీరాజ్యరమాసం
పర్కంబున నితని శక్తి – బహుముఖమగుటన్
దర్కంబున కందక యతఁ
డర్కుండై వెలిఁగె దుర్మ – దాంధము తొలఁగన్. 208

తే. మూఢ విశ్వాసముల వ్యాప్తిఁ – బొసఁగఁజేసి
పేద సొమ్ము హరించు 'ద – ర్వీషుల'మఱి
మంత్రగాండ్ర ఫకీరుల – మట్టువెట్టి
జనుల సేవకె వారల – ధనము లిచ్చె. 209

కం. ఘోషా పద్ధతి తొలఁచెను
యోషలకున్ స్వేచ్ఛ నిచ్చె – నున్నత విద్యల్
భూషలుగఁ జేసె వాణికి
భాషను బ్రాణముగఁ జూచెఁ – బ్రజ ముదమొందన్. 210

తే. మొండిపట్టుదలగలవాఁ – డొండుమాట
వినఁడు ముక్కోపి జొరుండు – విశ్వసింపఁ
దొరుల మధుపాయి గుణము లి – ట్లున్ననేమి
దేశభక్తియ యతనికి – దేవతయగు. 211

తే. పేదకాపునకుంబుట్టి - వీరుఁడై య
నేకయుద్ధము లొనరించి - యెఱిఁగి రాజ
కీయ మత ధర్మముల మార్చి - కీర్తిపడసె
రాష్ట్ర పరివర్తనమునకు - స్రష్టయగుచు 212

ఇటలీ

తే. మిత్రమండలి కండయై - శత్రువులను
గెలిచి మిత్రుల సాయంబు - గలుగ కున్కఁ
గఱవు రాకాసి కోఱలు - మెఱయు నప్పు
డిటలిఁ గమ్యూనిజము దల - యెత్తఁ దొడఁగె. 213

తే. దాని నడఁచి రక్షించెడి - ధైర్యశాలి
యెవ్వఁడా యని ప్రజలెల్ల - రెదురుసూడఁ
గార్యశూరుఁడు వీరుఁడు - ఘనుఁడు వక్త
యౌ ముసోలిని తద్దేశ ని - యంతయయ్యె. 214

తే. కమ్మరికిఁ బుట్టి యొజ్జయై - కడఁక సామ్య
వాదియై పత్రికలకు సం - పాదకుఁడయి
మిత్రమండలి పక్షాన - శత్రు నోర్చి
మాతృదేశాభిమానియై - మనె నతండు. 215

తే. 'నల్లచొక్కాల' సేనల - నెల్లఁ గూర్చి
రోము ముట్టి వెఱచి ఱేఁడు - సామదాన
విధుల మంత్రిగ నియమింప - వేడ్కమై ని
యంతయై దేశపాలన - మతఁడ నడపు. 216

తే. తా సృజించిన 'ఫేసిస్టు' - ధర్మనిరతిఁ
దన విరోధులఁ జంపించి - తగినరీతి
సమ్మెలను మాన్పి యుత్పత్తి - చాలపెంచి
దేశభక్తియ మతమని - తెలిపెఁ బ్రజకు. 217

తే. శాంతి జాతీయ భావము - చక్కఁ గలిగెఁ
గాని వ్యక్తిత్వమనునది - గనఁబడదట

నల ప్రభుత్వపు లోపము – లాడువారు
మరణశిక్షకు గుఱియౌట – మాఱదయ్యె. 218

తే. నాయకుని పేరc గొందఱ – న్యాయ మనక
బందిపోటులు హింసలు – ప్రబలునట్లు
చేసి రద్దానc గళలెల్ల – శిథిలమయ్యె
రానురానది రాక్షస – రాజ్య మగునొ. 219

జర్మని

తే. మిత్రమండలి విజయంబు – మెఱయుచుండ
శక్తిచాలక జర్మను – చక్రవర్తి
పారిపోవ 'నాత్సి' పక్ష – పౌరు లపుడు
హిట్లరనువాని నేతగా – నెన్నుకొనిరి. 220

వ. అచంచలదీక్షా దక్షుండు ధైర్యస్థైర్య శౌర్యోపేతుండగు నాతండు. 221

కం. ఆదరమున ముసొలీనీ
యాదర్శప్రాయుఁడౌట – నాతనివలెc దా
మోదమున 'బ్రౌనుష'ర్టనc
గాఁదగు సేనలను బెంపc – గంకణ మూనెc. 222

తే. తాను స్థాపించినట్టి త – త్పక్షమునకుc
దనదు జీవితచరిత వే – దమ్ముగాగ
'బ్రౌనుషర్టు' పటాల సం – బంధ మహిమc
దా నియంతగ మాఱుట – తథ్యమింక. 223

తే. పేరులేనట్టి యొక నిఱు – పేదయింట
నాష్ట్రియాc బుట్టెc బసితన – మందతల్లి
దండ్రులు గతింప నిండ్లకుc – దగిన రంగు
వేఁత వృత్తిగ నతఁడు జీ – వించెc దొలుత. 224

తే. దేశ దుస్థితిc దొలగింప – దీక్షc బూని
సరగ హిట్లరు జాతీయ – సామ్యవాద

పక్ష మభివృద్ధి చెందెడి - పద్ధతులను
వ్యాప్తిచేయుచునున్నాఁడు - దృప్తిపడక. 225

చైనా

తే. రగిలియారిన భువనాజి - మిగిలినట్టి
యాయుధమ్ములు చైనాకు - నవతరింప
వానిఁగొని యొండొరుల్ పోరఁ - బూనుకొనిరి
నాయకులు రణభుక్తి వి - నాయకులుగ. 226

కం. ఇత్తెఱఁగున బాధలతో
నుత్తర చైనా కృశింప - నోర్వ్వ దలిర్పఁ
నత్తిఱ నఱయట్ సేన్దగ
నెత్తెం జాతీయకేతు - విం పెసలారఁ. 227

తే. అతఁడు పాశ్చాత్యవిద్యల - నభ్యసించి
తివిరి స్వాతంత్ర్యభావాలఁ - దీర్చిదిద్ది
నవల జాతీయసేన క - ధ్యక్షుఁడైన
చాంగుకైషేకు పాలన - సాగుచుండె. 228

జపాను

తే. మున్ను వాషింగ్టను నగర - మున సభనను
కొన్న శపథాల వీడి యాఁ - కొన్న సింగ
మట్లు చైనాను గబళింప - నదను సూచు
చున్నది జపాను తన జన - మురక పెరుఁగ. 229

తే. కృషికిఁ దగినంత భూమిలే - దింక వలస
పోవ నమెరికాదులనెను - రావలదని
వృత్తులంబెంచి సరకు ను - త్పత్తిచేసి
చౌకగానమ్మ సుంకము - చాల పెరిఁగె. 230

తే. ఇంకఁ బరదేశవర్తక - మేదుఁగాన
సరగఁ జైనా జయించి వే - సఱ వలనలు
విక్రయార్థమ్ము సృష్టింప - వేయికనులఁ
జూచుచుండె జపాను ని - స్తుల దురాశ. 231

అమెరికా

తే. కడచిన ప్రపంచ సంగ్రామ - కారణమునఁ
బెట్టుబడిఁ బెట్టుబెట్టుగా - వివిధవస్తు
విక్రయమ్మున నమెరికా - వెలయ నద్ది
గోటికిం బడగెత్తె న కుంఠితగతి. 232

ఆంగ్ల సామ్రాజ్యము

వ. ప్రపంచమునంగల నరులందఱు సహోదరులనియు నొకజాతిపై మఱియొకజాతి యొకరాజ్యముపై వేఱొకరాజ్యము సర్వాధికారము కలిగి యుంట కిల్బిషమనియు, వైరహేతువనియు వలసల సంరక్షణ కాంగ్ల సైన్యము స్వదేశమును వీడి పరవిషయములకుఁ బోవలసివచ్చినదనియు మాతృభూమి రక్షణమున కాత్మ మూలబల సమృద్ధి లేమింజేసి యొకా నొకప్పుడది యనర్థదాయకమనియు హూణతత్త్వవేత్తలు కొందఱు బహుళ ప్రచారమొనర్చిన కారణమున గెనడా[1] న్యూపౌండులాండు[2] న్యూజిలాం[3] డాస్ట్రేలియారాష్ట్రాళి[4] కేపురాష్ట్రము[5] నేటాలు[6] ఆరెంజి-ట్రాన్సువా[7] లైర్లండు[8] మొదలగువాని కితఃపూర్వమ స్వయంపరిపాలనాధికార మాంగ్లప్రభుత్వ మిచ్చె. కాని నాఁటినుండి నేఁటివఱకుఁ దత్ప్రభుతా విధానాదుల విద్యు ద్వేగంబున ననంఖ్యాకపరివర్తనంబులు ప్రవర్తిల్లె.

తే. ఆంగ్లదేశమ్ము భువనాళి - నందెవిజయ
మైన ఋణబాధ హెచ్చె బే - హార మడఁగె
నెగుమతులుతగ్గి దిగుమతి - యెచ్చఁ బసిఁడి
కొఱఁతవడె నిరుద్యోగుల - గోల పెరిఁగె. 234

తే. చిక్కులిట్లుండ మూలెడి - నక్కమీఁద
తాటికాయయుఁ బడినట - త్తఱి సహింప
రాని యార్థికమాంద్యము - ప్రభవమొంది
హూణసామ్రాజ్యశక్తి ను - జ్జూతలూపె. 235

1. 1848 2. 1855 3. 1856 4. 1850-60 5. 1872
6. 1893 7. 1907 8. 1921

## భారతదేశము

వ. ప్రపంచప్రధాన దేశపరిస్థితు లిట్లుండ భారతదేశ పరిపాలనాధికార సౌధ మాంగ్లేయుల హస్తగతమైనను దాని వారింకను గట్టిపునాదుల బలిష్ఠమొనర్పలేదని గ్రహించి సమయమును గమనించి ప్రాగ్భారత సంఘముం దొలఁచి బ్రిటీషు ప్రభుత్వమే హిందూదేశపాలన భారము వహింప వేచియుండె. అనంతరంబ. 236

తే. అల సిపాయితిరుగఁబాటు - నణఁచినంత
నాంగ్లపాలన స్థిరపడె - హైందవమునఁ
గాని పాశ్చాత్య విద్యావి - ధాన మిచటఁ
బెట్టి జాతీయ భావము - పుట్టి పెరిఁగె. 237

వ. దేశకాలపరిస్థితుల గమనించి యల్లాన్ ఆక్టవియన్. హ్యూము, దాదాభాయినౌరోజి, పిరోజిషామెహతా, గోకులదాస్‌తేజపాలు, బెనర్జీ, రంగయ్యనాయఁడు, భండార్కరు, జి. సుబ్రహ్మణ్యఅయ్య, రానందాచార్యులు, తెలాంగు ప్రభృతు లఖిల భారత జాతీయ మహాసభను బొంబాయిలో జాతిమత స్త్రీ, పురుషభేదశూన్య సర్వసౌఖ్య సంకలిత సమైక్యతాన్వితాతి పవిత్ర వాంఛారింఛోళీ సహితముగ స్థాపించిరి. తద్వార్షిక సభలు బెనర్జీ మొదలు జవహరు వఱకు *నల్వది యెనిమిదిమంది యధ్యక్షులుగ నయ్యె నగరీలలామంబుల మహోత్సాహంబునం జరుగఁ బ్రబల రాజకీయ చైతన్య మేర్పడె. అప్పుడ మహాత్ముని సత్యాగ్రహ సమర సందేశ మిత్తెఱంగున దశదిశల మాఱుమ్రోగుచుండె. అదెట్లన. 238

* (1) డబ్లియు సి. బెనర్జీ (1885) (2) దాదాభాయి నౌరోజి (1886) (3) బద్రుద్దీన్‌తయాబ్జీ (1887) (4) జార్జియూఁలు (1888) (5) వెడ్డర్ బరన్ (1889) (6) పి. యం. మెహతా (1890) (7) పి. యసంతాచార్యులు (1891)(8) డబ్ల్యు. సి బెనర్జీ (1892) (9) దాదాభాయి నౌరోజి (1893)(10)ఎ వెబ్ (1894) (11) సురేంద్రనాథ బెనర్జీ (1895) (12) యం. ఆర్. సయాని (1896) (13) సర్ శంకరన్ నాయర్ (1897) (14) ఆనందమోహనబోసు (1898) (15) ఆర్. సి. దత్తు (1899) (16) యన్. సి. చంద్రవార్కరు (1900) (17) డి. యి. వాచా (1901)(18) సురేంద్రనాథ బెనర్జీ (1902) (19) లాలుమోహనఘోషు ( 903) (20) సర్. హెన్రీకాటన్ (1904) (21) గోపాలకృష్ణగోఖలే (1905) (22) దాదాభాయినౌరోజి (1906) (23) రాష్‌బిహారీ ఘోషు (1907) (24) రాష్‌బిహారీ ఘోషు (1908) (25) మదనమోహన మాలవ్యా

# సత్యాగ్రహ సమర సందేశము

(ఆంగ్లేయులు)

చ. కలిగిన యిన్నుబొగ్గు పజ - కడ్పును నింపమి భేరమంచు ని
య్యిలకరుదెంచి మించి తుద - కెట్టులొ గట్టిగఁ బాడిపంటలం
గులుకు విశాలరాజ్యరమ - గుప్పిటఁ బట్టిరి నేతికుండపై
నెలుకతెఱంగు నుండి రిపు - డీదొర లీభువి పీడనేర్తురే? 239

ఉ. ఖ్యాతిగలట్టి పెద్దయధి - కారములన్నియుఁ జిక్కఁబట్టి భూ
నేతల నేతలం దమన - నీతి విభీతులఁజేసి చేఁతలుఁ
ప్రాఁతల వెట్టులున్న నిజ - పక్షబలంబున సిద్ధికాటినం
జీతము కాఱికుంటు సుర - సిద్ధులవోలె సుఖింతు రిద్దొరల్. 240

కం. మెడఁబట్టి గెంటుచున్నను
విడువక వెనఁ జూఱుఁ బట్టి - ప్రేలాడు క్రియం
గొడవెంత మనము సల్పిన
వడి పీడరు దొరలు లోక - వంచనపరులై. 241

కం. సుధయొ ుక్క పల్కుపల్కుచు
వ్యధగూర్చుచు మిత్రభేద - భవ హింసలతో
నధికారులు మనపాలిటి
కధికారులుగాఁగ మాఱి - రయ్యా కడకున్. 242

---

(1909) (26) సర్. డబ్ల్యు. వెడ్డర్ బరన్ (1910) (27)బిషన్. నారాయణధా (1911) (28) రాక్. యన్ మధోల్కరు (1912) (29) సయ్యదు మహమ్మదు (1913) (30) భూపేంద్రనాథ బాసు (1914) (31) సర్. యస్. పి. సిన్హా (1915) (32) యె. సి. మజుందారు (1916) (33) డాక్టరు బెసెంటు (1917) (34) యస్. హసన్. ఇమాము (1918) (35) మాలవ్యా (1918) (36) మోతీలాల్ నెహ్రూ (1919) (37) విజయ రాఘవాచారి (1920) (38) లాలా - లజపతిరాయి (1920) (39) హెచ్. అజ్మలుఖాన్ (1921) (40) దేశబంధు చిత్తరంజనదాసు (1922) (41) అబ్దుల్ కలాం అజాదు (1923) (42) యం. మహమ్మదాలీ (1923) (43) గాంధీ (1924) (44) సరోజినీ నాయఁడు (1925) (45) శ్రీనివాస అయ్యంగారు (1926)(46) డా. యం. యే. అన్సారి (1927) (47) మోతీలాలు (1928) (48) జవహరులాలు. (1929).

29

కం. కలవారలు పేదలఁ గని
కలమాన్నము వెట్టినట్టి - కాలము మాఱెన్
బులిగూటికొఱకుఁ దిరుగుచుఁ
బులిగూటిం జేరినట్లు - పొలిచెం బ్రమకుల్. 243

తే. వర్ణభేద పిశాచమ్ము - వాయి విప్పి
బడుగు దేశాల రక్త పి - పాస రేఁగ
మానవత్వమ్ము నెల్లను - మంటఁ గలిపి
నల్లవారల బాధింత్రు - తెల్లవారు. 244

తే. ఎన్ని బాధలు మనకున్న - వన్న నేమి
చచ్చినను నొచ్చినను వారు - జాలిపడరు
నెమ్మి గలఁగుచుఁ దనకంట - నీరు వెట్టు
వేఁటకానికి ముద్దౌనె - వేయుఁగాని. 245

కం. కనుకట్టుఁ దనం బెంతయొ
కనుపట్టుం దొరలయంద - గాధ హృదయులై
మనపట్టు న్మనగుట్టుం
గనిపెట్టుచుఁ బీఁటవెట్టి - కదలరు సరగన్. 246

కం. త్రివిధోత్పాతంబులకున్
సవనాదులవలన శాంతి-సమకూర్చు క్రియన్
భువనాధికారు లీభూ
ధవులను సత్యాగ్రహమున - దాఁటింపఁదగున్. 247

వ. అట్టి సత్యాగ్రహంబు రాజకీయంబుసందొక నూతన దివ్యాస్త్రంబు. దేశభక్తుల మేలి శీలముం బరిశీలింప సృజింపఁబడిన నూత్ననికషోపలంబు సత్యాహింసాసహనాదుల నిత్యము జపించి క్రియారూపమునఁ ద్రికరణశుద్ధిగ సిద్ధిపొందిన దేశారాధకుఁడే యద్దానిం గైకొన నర్హుండు. అయ్యది సన్న్యాసిపైనను సార్వభౌమునిపైనను సమముగఁ బనిసేయు. దాని మహిమ మనంత మద్వితీయ మమోఘము. స్వరాజ్యసముపార్జనా నాటక రంగమునకుఁ బూర్వరంగమనందగిన జాతీయైకమత్యాస్పృశ్యతానివారణ విదేశవస్త్ర బహిష్కరణ శాసనోల్లంఘన మద్యపాననిషేధాదుల

సాధింప నదియ సాధనమ్ము. కావునఁ దత్సమగ్రస్వరూప వర్ణనమ్ము
సర్వజనమ్ము సావధానమ్మున వినవేఁడుదు. 248

సత్యము

కం. సత్యస్వరూపి దేవుఁడు
సత్యమె ప్రాణంబు ధర్మ – సముదయమునకుఙ్
సత్యవిజయాగ్రహంబును
సత్యాగ్రహమనుచు సతము – చాటెదఁ బ్రజకుఙ్. 249

శా. వాగ్వాదప్రతిభావిశేషములఁ జా – ప్రనూపుఁగోల్పోక స
ద్దిగ్వేదండదివాకరాబ్జశరధి – స్థిత్యాశ్రయంబై ప్రభా
యుగ్విద్యాంస మనోహరంబయిన "స – త్యోత్థాపితాభూమి" యన్
ఋగ్వేద స్తవనీయవాక్యరమ గు – ర్తింపందగున్ సజ్జనుల్. 250

కం. బిసరుహ బాంధవ తేజః
ప్రసరంబున లోకమెల్ల – భాసిలు నటు ల
వ్యసమాన సత్యనిష్ఠా
భ్యసనంబున దివ్యబోధ – యాత్మ వెలుంగున్. 251

ఆ.వె. సర్వ ధర్మ వితతి – సత్య గర్భంబున
నమరియుండు నందు – రఖిల విబుధు
లవని జంతు కోటి – యడుగుల ముద్ర ల
య్యేన్గు పాద ముద్ర – నిమిడినట్లు. 252

తే. నిజము నిలుకడ మీఁదనే – నెగడు ననుట
నిండు సత్యము వినఁబడు – చుండు నిత్య
మద్ది గమనించి శాంత్యహిం – సాత్మకముగ
మనము వర్తించి జయలక్ష్మిఁ – గొనుట లెస్స. 253

వ. పతివ్రతలకుఁ బావనాంతరములతోఁ బనిలేనట్లు సత్యవ్రతున కన్య
వ్రతములతో నవసరములేదు. 254

చ. మనము సువర్ణమైన జన – మండిత మౌట సువర్ణభూమిగా
ఘనయశ మందెనాఁడిపుడు – గాంచ మనమ్మొక తుచ్ఛలోహమై

తనరిన మానవావళికిఁ - దావలమౌట నశించెఁ బేరిఁకన్
మనము పసిండిసేయఁగల - మార్గమెఱుంగఁగ వాంఛయున్నదే.

చ. వినుఁడది సత్యమన్పరుస - వేది స్పృశింపఁగఁ జేయుఁడీ యెడం
గనకమగున్మనమ్ము మన - కాంక్షఁ దనంతటతా స్వరాజ్యమే
వినయముతోడ వచ్చి కడు - వేడుక గూర్చును స్వర్గరాజ్యమై
కనవిన నింతకంటెను సు - ఖంకర మార్గములేదు లేదిలన్ 256

ఉ. కూలము పాపవార్ధి కను - కూలవిమానము స్వర్గసీమకున్
మూలము ముక్తిసాధన క - మూల్య సురాగపు టాలవాలమున్
వాలము ధర్మపావని క - పారయశోంగస కచ్ఛపట్టపుం
జేలము సత్యశీల మది - చేకొన నేరనివాఁడు మర్త్యుఁడే. 257

ఉ. భారత భావి సంతతి శు - భప్రతిభా విభవాభిరామ వి
స్తార యశోవిశాల విల - సత్త్స్రవనీయ కలావిలాసమై
సారతరంబుగా వెలుఁగ - సంతత సత్య విశిష్టనిష్ఠ నిం
పారఁ బ్రతిష్ఠసేయఁ దగు - నాత్మబలోన్నత హర్మ్యసృష్టికిన్. 258

శా. ఈసత్యాగ్రహమన్న శాంతిసమరం - బిద్దానికి న్సిద్ధమై
రోసంబీసునుబాసి పాలకులు స - క్రోధాత్ములై ధర్మమున్
పీసంబుం గణియింప కెవ్విధమునన్ - వేష్టించి వేధించినం
గాసింతైనఁ గలంగ కాత్మజయదీ - క్షాదక్షులై నిల్వనౌ. 259

తే. ప్రజలు బిడ్డలు సరియైన - ప్రభువు తండ్రి
యనుచుఁ గడిపితి మిప్పుడది - హద్దుమీటె
మనది ప్రహ్లాద మతమిఁక - మనదొరలది
కనకకశిపుని మత మెట్లు - గలుగు సుఖము 260

కం. రాక్షసనీతి నెదుర్కొన
దక్షులమై శిక్షనోర్చి - తను ధన మనముల్
దీక్షం దేశార్పిత మన
రక్షణగల రమ్య రామ - రాజ్యము గలుగున్. 261

కం. కరుణారసంబున లోకపుఁ
బరమార్థం బిమిడియుండ - వలచి "యహింసా

పరమోధర్మ" మ్మని మన
వరఋషులాడినది వేద - వాక్యనఁ దగదే. 262

కం. బుద్ధుఁడు క్రీస్తు మహమ్మదు
శ్రద్ధమెయిం దెలిచి వలచి - చాటి రహింసా
సిద్ధాంతం బది భూలో
కోద్ధరణ కమోఘమనుచు - నుజ్జ్వల మతులై. 263

కం. మీసలు గడ్డము జుట్టును
మీసము లేకున్న లేక - పెంచిన దానన్
దోసములు దొలఁగ దేవుని
దాసులలో శ్రేష్ఠులనుచుఁ - దలఁపం దగునే. 264

తే. హింస మఱియొక హింసకెం - దేని దారి
తీయు ననుమాట తథ్యంబు - తెలియ నొక్క
రాకుమారుని హింసింప - రాఁజి రాఁజి
ప్రథమసంగ్రామహేతిగాఁ - బరిణమించె. 265

చ. ఇదియొక మాఱుమూల జని - యించి హఠాత్తుగ విశ్వరూపమున్
హృదయవిదారకంబుగ ధ - రించి కలంచదె భారతాంబ దు
ర్మదమున హింసకుందిగుట - మాసప మారణహోమచిహ్నమౌ
నది కనులారఁగంటి మిఁక - జ్ఞానులు దాని వరింపనేర్తురే. 266

మ త స హ న ము

తే. ఎన్ని మతములు దేశమం - దున్ననేమి
యందఱకు స్రష్టయొక్కఁడే - యనుట నమ్మి
యొక్క పూరేకు లట్టుల - యొదిగి యుంట
సరస సౌజన్య సంతోష - కరము కరము. 267

శా. ద్వైతాద్వైత విశిష్ట శక్తిమతరా - ద్ధాంతంబు సిద్ధాంత మ
ద్వైతానందపథంబు పట్టు గమనిం - పన్ బ్రహ్మతేజోంకస్పృ
ష్ట్యైతాదృక్పరిణామబుద్ధికి జగ - ద్దృశ్యంబు దృష్టాంత సం
ధాతత్త్వంబునకందు వార్ని ధినదీ - తన్నైక్యగమ్యంబెకా. 268

వ. నాల్గుమూళ్ళుమూఁడునాల్గులు స్వరూపచిత్రణమున వేఱైనను బర్యవసానసంఖ్యలో నొక్కటైనట్లు బాహిరముగఁ గులమతభేదములెన్నియున్నను స్వరాజ్యసంపాదనాశయమున నందొకటేకమగుటత్యంతముదావహము. సూక్ష్మరంధ్రయుత కుండికాజలంబులంబలె మనదేశసంపద నానాఁటికి క్షీణించుచున్నయది. సజ్జ్యకర్మంబునకు సంసిద్ధుండైన యోద్ధవలె దానినరికట్ట మీరు నడుముగట్టవలయు. 269

తే. మతవిరోధపిశాచముల్ – మాఱుమసలి
కఱవున నధికమానమ్ము - గలుగఁజేసె
నేమహామంత్రజపమున - నిపుడు శాంతి
వీనికింగల్గు ననుచింత - వీడకుండె. 270

తే. మతవిభేదము సాకుగా – మనవిషయము
ముక్కలొనరింప సౌఖ్యము – దక్కఁ గలదె
కంచు కంచము రెండుచె - క్కలుగఁజేయ
నిండుఁదనమంత యోగ్యత - యుండఁ గలదె. 271

తే. మతము గీచిన గీతలో – మనెడి నరుఁడు
కలఁడె మచ్చునకైన నీ - కలియుగమున
దాని పేర హింసాకాండ – మానకుండ
ఘోర నరకానఁ బడుట వి – చారకరము. 272

ఉ. ఏమతమైననేమి పర - హింసకుఁ జోటునొసంగ కుంటయే
కోమలమైన మార్గమని - కోవిదు లాత్మవిశుద్ధవర్తనుల్
వేమఱుఁ జాటిరానుడులు – వీనులఁ జొచ్చియెడందనిల్వమిం
గాములు సోమరు ల్దెగని – కాంక్షఁ బెసంగుచునుందు రెప్పుడున్.

కం. అందఱు దేవుని బిడ్డలె
హిందువులు మహమ్మదీయు - లేలా వేఱై
సందేహంబునఁ గుందుట
యందఱిలో శాఖ లెన్నొ – యమరుట లేదే. 274

చ. క్షితిఁగల ప్రాణికోటిని సృ – జించినదేవుఁడె తత్పితాఖ్యతో
స్తుతిఁగను నందుమానవుఁడె - సూ మతిమంతుఁ డతండుదారతా

స్థితిఁ గని సర్వదా సకల - జీవుల సేవలు సేయఁబూనినం
బ్రతిపరమాణువందుఁ గను - పట్టును గోట్లకొలంది స్వర్గముల్.275

చ. కులమత భేదభావములఁ - గ్రుంగెడి భారత మన్య దృష్టికిం
జులుకనయాట యబ్బురమె - సూనృత దీర్ఘ మనోవివేకముం
గలిగిన క్రాంతదర్శికిది - కన్నులఁ గట్టినయట్లు తోఁచు స
త్ఫలములఁ గోరి మైత్రియను - పావన వృక్షముఁ బెంచుఁడీ దయన్.

ఉ. గూడును గూడుగుడ్డ యొన-గూడుటకై సమకూడి సత్కృతుల్
వాఁడును వీఁడునాక జన - వర్గము సోదరులంచు నల్పుచున్
వేడుక నిత్య నూత్నదశ - విశ్వయశస్సొగిఁ బొందుచుం జనుల్
పాఁడిదొలంగకున్న వెస - భారతదేశము స్వర్గసీమయౌ 277

చ. దయచెలి యావిబిడ్డ నిజ - ధర్మము రక్షణ యోర్పుతోడు సం
శయమె వినాశకారణము-శాంతమె సౌఖ్యము సత్యవాక్యమే
జయరణభేరి యైక్యతయ - జాతికి జీవ ముదారభావమే
నయ మిది యాత్మనమ్మిన జ - నమ్ము కరమ్ము ముదమ్ము వొందదే.

ఆ.వె. ఎవరి మతము వారి - కెంతొ గొప్పది యైన
నన్య మతము దూఱు - టఘముగాన
నిన్ను నీవు నూచు - కొన్నట్లె పరుఁజూడు
సహన మఖిల సౌఖ్య - సాధనమ్ము. 279

తే. ఇలఁగల విశాల దేశాల - నెన్నొ మతము
లుంటయుఁకఁ దప్ప దటుగానఁ - గంటు గెంటి
భ్రాతృభావభవోత్సాహ - బంధురముఁగ
జీవయాత్రలు గడపుట - సిరులు గనుట 280

కం. నీ నా మతభేదము లో
లోన దవాగ్నులను రేపి - లోకము నేర్పున్
మేనుల పెనఁకువ కాదిఁక
మానసముల కౌగిలింత - మనకున్ వలయున్. 281

వ. సువిశాలంబైన యాదేశమ్మునఁ గాలక్రమంబునఁ బెక్కుమతంబు
లేర్పడుటంజేసి వేఱె మెన్నక యెవ్వరైన నిరుగుపొరుగుగ జీవింపక తప్ప

దనుట జగద్విదితముగదా. వలదన్న నేమతమువారైనం దమకాణ యాదియైన యిప్పుడమి విడిచి మఱియొక విషయంబునకు వెడలఁగలరా. అది యసంభవంబగుటంజేసి పరస్పర సుహృద్భావ సుఖాపేక్షవలయుఁ గాని యన్యోన్య బాధాకరకలహకాంక్షతగునా. అయ్యది సభ్యమానవ లక్షణమా. తగవుమాలి యీసురోసములు పెనఁగొనిన తెగుపనెగసినం బగతెగునా. మానవుఁడుఁ సాధుజంతువులవలె సంఘజీవి యనుమాట మఱతురా. 282

చ. ఇలఁగల మూర్ఖపండితుల - కెన్నివిధంబులఁ జెప్పిచూచినం
గలుగదులాభ మింకజన - కంటక మార్గము రూపుమాపుచుఙ
ఫలముల నందుకోఁగలుగు - పద్ధతి రమ్యము గమ్య మన్నచో
వెలవెలపోవనేల యల - వేల్పులకైనను మార్పు తప్పునే. 283

వ. ఉష్ణశక్తివలన మంచుగడ్డనీరుగను నీరావిరిగను మాఱినను నా మూఁడురూపములకు మూలపదార్థమొక్కటియే యైనట్లు మానవుని మన స్తత్త్వముంబట్టి యేర్పడిన మతము లెన్నియైనను వాని ప్రధానసూత్ర మేకాశ్రయమనుట నిర్వివాదాంశము. 284

అస్పృశ్యతానివారణ

చ. హరిజను లాఱుకోట్లుగల - రందఱు హైందవులందు నెందఱో
పరమత బోధఁ జేరిరొగి - వారకక్రైస్తవ ముస్లిమాదులఙ
నిరత మిటుల్సనం బలము - నిల్చున జాతికి నిత్యనీతికి
స్ఫురమరహస్యముం దెలిసి - పావన పద్ధతులన్మెలంగుఁడీ. 285

ఉ. అంటియ సబ్బుతో జలక - మార్చి యెదో యొకపేరుపెట్టి వం
టింటన దూర దువ్వి బుజ - మెక్కిన కుక్కను బుజ్జగించుచుం
గంటికి ఱెప్పనా సతము - గాచుచు నక్కట తోడివానిఁ దా
నంటిన పాపమంట దుర - హంకృతి కాకిది సత్యధర్మమే. 286

ఉ. పంచములంచు నొక్కతెగఁ - బంచకునించుక చేరనీక పొం
డంచను టెన్న హైందవమ - హాఫలవృక్షపు వేరు త్రెంచుటే
మంచినెఱింగి వర్తిలుట - మానవ ధర్మముగాన నేఁటికిఙ
ఖించిన దేమిలే దిపుడు - మేల్కొని మేల్కొని మించఁజెల్లదే. 287

అ.వె. ఓర్మి కూర్మి పేర్మి – వేర్మి నెఱుంగక
నిర్మలముగ ధర్మ – శర్మదముగ
నాత్మ సత్య మరసి – హరిజనోద్ధారణ
మునకు దీక్షఁబూని – ఘనులుకండు. 288

కం. జాతీయసమైక్యతకై
యాతీరున మెలఁగు టెంతొ – యింపగు బలవి
ఖ్యాతుల నితరుల మతికతి
భీతిదమగు దానదాస్య – విచ్ఛిత్తియగుఁ. 289

కం. ఆదిమ వాసుల నీగతిఁ
గాదనఁగాఁ దగనె ధర్మ – కర్మం బగునే
వాదములకు దిగినయెడం
భేదమ్ములె పుట్టుఁగాని – ప్రేమ గలుగునే. 290

తే. అంటరానితనమ్మగ్ని - కంటఁగట్టి
మానవతతోడ నీదోడి - మానవునెడ
మెలఁగఁ గలుగును దలఁచిన - మేలు మేలు
కొని కను స్వరాజ్యపీఠమ్ము - మను సుఖాన. 291

చ. భ్రమమెయి నొక్కపంచముఁడె - క్రైస్తవుఁడైన మహమ్మదీయుఁడై
న మనము మైత్రినంటమ య - నారత మీగతి లేనిపోని క
ర్మముల సదానసహోదరుల - మన్నన కెన్నఁగ దూరమైన వే
ఱిమియిది దేశదాస్య ఘన - శృంఖలముల్దెగఁగొట్టఁ జాలునా. 292

కం. ఆలయ విద్యాలయ దే
వాలయ పఠనాలయముల – కా హరిజనులం
దాళక యాహ్వానింప వి
శాలమతిఁ సర్వ వర్ణ – సఖ్యము వరలుఁ. 293

వ. అస్మదాత్రికానుభూతి నివేదింతు. 294

శా. ఈదేశమ్మున మాలమాదిగల నె- ట్లీక్షింతుమో యట్టులే
యాదేశమ్మున భారతీయుల సదా - యాంగ్లేయులీక్షింతు రా

భేదమ్మెడ్డదహింపఁ దత్ప్రభుత ని - ర్భీతిన్విరోధించి మ
ద్వాద్రిశన్గలిపించికొంటి సమతా - ధర్మాజ్ఞ సంధిల్లఁగన్. 295

కం. మనతప్పు మనమెఱింగియ
మనసులు దగ మార్చుకొనుట - మంచిది పరులన్
ఘనముగఁ గన స్వాతంత్ర్యము
వినయమ్మున వచ్చి మనకు - వేడుక కూర్చున్. 296

కం. తక్కిన హిందువులంబలె
మక్కువ శుచి విద్య నేర్చి - మధుపానాదుల్
దక్కుచు గోమాంసమ్మున్
మెక్కక హరిజనులు చాల - మేలొందఁదగున్. 297

కం. లోక మ్మెక్రియఁ బోయిన
నాకేమనుకొనకు దేశ - నాయకులకునే
రాకున్నె కష్టసుఖము ల
నాకులుఁడవె సంఘసభ్య - నరుఁడవు గావే. 298

కం. హక్కుల నీక కృషికిఁ గు
మ్మక్కగ రమ్మనుట ధర్మ - మా వైదికదృ
గ్వాక్కులు వేదార్థంబుల
నిక్కమ్మున కెరఁగి యిడుఁడు - నీరాజనముల్. 299

వ. అభ్యాసంబు ద్వితీయప్రకృతిగాన బహుకాలం బొక్కగాడింబోవు బండిం దత్స్థానంబునుండి తప్పించుట కష్టతమంబైనట్టు మొట్టమొదటఁ హృదయమ్ము కలుక్కుమనుట నిక్కమ్ము. అరుణోదయమ్మున నంధకార మణఁగి నష్టాత్మజ్ఞాన ప్రేరణమ్మునఁ గ్రమమ్ముగ సంశయమ్ములు నశించు. 300

ఉ. ఏకులమైననేమి గుణ - మెన్నుట లెస్సయకాని కానినాఁ
డాకులపాటు నాకులకు - నైనను దప్పద విప్పి సెప్పినన్
సోఁకద లోకవుంజెవికి - సోకిన నిల్వదెడంద నిల్చినం
బోకడలట్ల దిద్దికొనఁ - బోలద సభ్యజనాళి కెయ్యెడన్. 301

కం. ఈ మాలలు నాకేలా
యీమాలల యంటుదోస – మిట్టింకనిచో
సామాన్యుల యభ్యుదయ మ
సామాన్యులు గోరనట్టి–చదువు లవేలా. 302

కం. పరమేశ్వరు బిడ్డలమని
మఱవక పల్కుదురు సర్వ–మతముల వారా
తెరువున మాలలకిపుడీ
హరిజన నామంబు సార్థ–కాహ్వయమగుతన్

ముఖ్యుల బిరుదు

సీ. నిఖిల భారత జనా – నీక ధారణలభ్య
నిక్షేప దత్తి చే – నేత వృత్తి
నిర్మల సత్య వా – క్నిష్ఠ శిష్టాకృష్ట
నీతి సంపత్తి చే – నేత వృత్తి
కలుషైక వర్జిత – కాయకష్టార్జిత
నియత సంతృప్తి చే – నేతవృత్తి
పరదేశ వస్త్ర ప్ర – వాహ బంధన కళా
నిశ్చల భిత్తి చే – నేతవృత్తి

తే. కర్మ కౌశల ఘన యశోం – కప్రభూత
నిత్య నూతన శక్తి చే – నేతవృత్తి
యమల సంస్కృతి విద్యోత – కాత్మవిషయ
జాతి వేష ప్రపత్తి చే – నేతవృత్తి 304

కం. రాటము భారత లక్ష్మి కి
రీటము స్వాతంత్ర్య సమర – రింఖద్భేరీ
ఝూటము పరశర ఖేటము
కూటము కీర్త్యద్రి కనఘ – కూటము మనకున్. 305

వ. ఏతద్విషయ సమగ్ర జ్ఞానసంపన్నులై సర్వజనమ్ములు మున్నీవిష
యమ్మున రహాటవృత్తిం బ్రవర్తిల్లిరి. అందు ముఖ్యముగ. 306

కం. గృహలక్ష్మి యైన రాట్నము
స్పృహణీయం బగుచు నిత్య - వృత్తిగ రైతుల్
సహనమున నున్నవారిం
బహురహా మద్దానఁ దీసి - రతివేలముగన్ 307

కం. పిల్లలు దల్లులు వృద్ధులు
సల్లాపముమై వడుకుచు - సాగించుచు నో
ర్తల్లం బాడం జొచ్చిరి
గల్ల యనంజనటు రాట్న - గానము శ్రుతియౌ 308

చ. చిలుకలు హంసలుం గరులు - సింహములుం బులు లశ్వముల్లతా
విలసిత పుష్పసంతతులు - పింఛెలు కాయలు పండ్లు పత్రముల్
కళికలు కేకు లబ్జములు - కాంచన సూత్ర వినిర్మితంబులై
యలరఁగఁ గమ్ములంచు లల - హైందవ వస్త్రకళల్వెలుంగవే 309

తే. మనకు మిగులుట జిలుగులు - పంచి వగుట
నల విదేశీయు లెందఱో - యడిగి కొనుటఁ
గోట్లు వచ్చుట నది ప్రజా - కోటి కగుట
భాగ్యవంతులుగా జనుల్ - బ్రదికి రపుడు. 310

తే. బహుళ సాహసమున దూర - భార సునక
యన్య విషయాల వర్తక - మాచరించి
ద్రవిణ మార్జించి దానక - ర్ణ ప్రశస్తిఁ
గోటికిం బడగ లెత్తికి - కొంద ఱిచట. 311

శా. వాపీకూపతటాకసత్రవనభ - వ్యగ్రామదేవాలయ
శ్రీ ప్రాప్తింప ధనాదులిచ్చి సుకృత - శ్రీనొంది రావర్తకుల్
భూపుల్పూర్వ మొనర్చి నట్లు యది సం - పూర్ణంబుగా మాటె నా
జ్యాపుల్పేహరు లాత్మశక్తిచన ని - ర్వ్యాపారులై క్రమ్మగెడిన్. 312

వ. ఔరా నాఁడెన్నఁదగిన రాజాధిరాజుల మన్ననలంది జగద్విఖ్యాతి గాంచిన హైందవ వస్త్రకళాలలనాలలామ నేఁడాదరణశూన్యయై వివర్ణ వదనయై జీర్ణపర్ణశాలలఁ గన్నీరుగార్చుచుఁ దలదాచుకొనుచున్నదా. విధి యనుల్లంఘనీయము. ఒకనాఁడు. 313

తే. ఏల యిటకు వివస్త్రవై - యేఁగుదెంచి
తనిన పాయుష్టఁగని బిడ్డ - జనక చీర
యేడఁ పొరల ధరించితి - నేనన నతఁ
డిచ్చె బాపూమతి పనివాని - కిచ్చమెచ్చి. 314

వ. ఇఁగ నియ్యాంగ్లప్రభుత్వమునందు 315

తే. ఎఱిఁగి బిసతంతు నిభతంతు - లెట్లు నేసి
రో యనూహ్యంబు లోక మౌ - రా యనంగ
నగ్గిపెట్టియ నును(జీర - నాంగ్లరాజ్ఞి
కంపినారఁట మనవార - లింపు నింప. 316

చ. అదిసుత యీసురోసముల - హైందవ వస్త్రకళాకలాప సం
పద సళియింపఁ దద్రమ శు - భంబుగ సీమనుసింహపీఠిపైఁ
బొదల నవీనయంత్రపరి - పోషకులై నులినూలిచేల లిం
పొదవఁగఁ బంపి యేట మన-యుర్వర నర్వదికోట్లకమ్మెడిన్. 317

చ. వడికిన నూలివల్వలను - వాడుట యన్నివిధాల మంచిదం
చెడఁదఁ దలంచి దీక్షమెయి - నెల్లరుఁ గట్టఁగఁ గోటులర్వ దే
వడువునఁ బోవుఁ బోనియెడ - భాగ్యమొకించుక వృద్ధిసెందదే
తడయక యట్లసేసి తగు - దారికివచ్చి సుఖింపఁగోరెదన్. 318

కం. కూపోదకమును దరుణీయు
నేపారిన మట్టిసీడ - యాఖాదియు నీ
నోపును సీతున వెచ్చన
దీపించిన గ్రీష్మమంద - దిర చల్లనయున్ 319

కం. మన నూలిని మగ్గములన్
మనసోదరు లిట్టునేసి - మన దరి నిల్వన్
మన బట్ట మనము కొనుటకు
మనసొప్పద యెట్లు మనము - మనఁగల మింకన్. 320

తే. వస్త్రకారకు లివు డన్న - వస్త్రములకె
దూరమగుచుంటఁ దెలియదే - భారతమునఁ

బోషణములేక తత్కాళి - పొగిలి పొగిలి
చివఱ కీనాఁడు శల్యావ - శిష్ట మయ్యె. 321

తే. కనులలోఁ బ్రాణములు పెట్టు - కొనిన జనులఁ
గాంచి నీ గుండెలో జాలి - గలుగలేదె
వారు భారత పౌరులు - గారె వారి
బలము నీ బలమని సుంత - తలఁపలేవె. 322

తే. మానవుఁడు సంఘజీవియన్ - మాట మఱచి
యెవని స్థితి వానిదే యని - యెంచెదేని
దేశ మేగతి పాలౌనొ - తెలియఁ గలవె
కాన నన్యోన్య సహకార - కాంక్షవలయు. 323

తే. హస్తనైపుణ్య మహరహ - మంతరింప
నొక శతాబ్దములో నెంతొ - తికమకలయి
లాంకషైరు మాంచెస్టరు - వంకఁ జూచు
గతికి దిగజాఱితిమి మన - బ్రతుకు బ్రతుకె. 324

కం. వయనము స్వదేశలక్ష్మి
నయనము పెఱ పెత్తనమ్ము - నౌకలమీఁదం
బయనము కార్మిక జనులకు
నయమది బలరవికి నుత్త - రాయన మౌఁగా. 325

తే. రాట్నగానమె స్వాతంత్ర్య - రాష్ట్ర గాన
మనుచు మది నమ్మి యింటింట - విసఁగలిగిన
మఱి లోరఁగు సీమ మనదొరల్ - మరలఁ గలరు
మఱవఁ బోకన్న కదురాడఁ - గఱవు సున్న 326

ఉ. అన్నము వస్త్రముం బ్రజల - కందఁగఁ గర్షక వస్త్రకారకుల్
మున్నుగ నన్నదమ్ములటు - ముఖ్యముగాఁ బనిసేయుటొప్పు వా
రున్నతిఁ బొందకున్న మన - కుండునె సౌఖ్య మదట్లు తోట నా
మన్నన వారిపట్ల నతి - మాత్ర మమాయిక జీవులన్మతిన్. 327

కం. ఈ వృత్తుల నీ వృత్తులఁ
భావనజీవన విధాన - భాసురమతులై

సేవింతురు భగవంతుని
గావున నవ్వారి మేలు - గాంక్షింపఁ దగుఁ. 328

వ. అందును మానవ మానసంరక్షణోత్కృష్టవృత్తియగుట వస్త్ర నిర్మాణకళ కామక మామక మనంబు నాకర్షించు. దానికిం బెక్కు కారణంబులుంట నిక్కంబు. 329

తే. తా నిరాహారదీక్షను - బూనియైన
రాజమార్గంబులం దిర్గి - రాఁ గలండు
వలువ లేకుండ బయటికి - వెలలఁగలఁడె
ధర్మసూక్ష్మము గమనింపఁ - దగు నరుండు. 330

వ. అన్నవస్త్రములన్న జనసామాన్యోక్తింబట్టి దీనిస్థానంబు ద్వితీయం బయ్యెఁ బ్రాణంబునకన్న మానంబు మిన్నయను నార్యవ్యాహారమ్ము దర్కింప నియ్యది యద్వితీయంబు. ఎప్పుడు రాటముల నటుకలమీఁది కెక్కించితిమో యప్పుడ భారతీయ హస్తనైపుణ్యము క్షీణించినదనంజెల్లు. ఇత్తఱి నేఁతనేయువారి పరిస్థితిం గనఁ గన్నీరుమున్నీరగు. 331

ఆ.వె. ఉండ నిల్లు లేక - పండ మంచము లేక
కట్ట బట్ట లేక - కడుపు నిండఁ
దిండి లేక చాల - తిప్పలు వడుచున్న
పేద మీఁదఁ గరుణ - లేదె నీకు. 332

వ. ప్రత్యక్షముగ నీచేనేఁతవృత్తి నుద్ధరించుట పరోక్షముగ నెన్నియో వృత్తులకు సాహాయ్య మొనర్చుట. ఖద్దరునకు వెచ్చించు ప్రతిరువ్వాయు నిఖలపేదల పోషణమున కుపయోగపడుటం గ్రహించి సర్వజనులు దానిం గట్టిన నాంగ్లసామ్రాజ్యాహంకార మణఁగు. శ్వేతజాతి వ్యాపారదృష్టిగల జాతి. వాణిజ్యనిర్వహణమున నేటేట నిటం బెక్కుకోట్ల రూప్యముల లాభము గడించుచుఁ గుబేరులగుచుంట వారు మనదేశమునకు స్వరాజ్య మీనొల్లరు. వారి బేరములందతి ముఖ్యమైన దీ వస్త్రవ్యాపారము. 333

ఆ.వె. తెల్ల దొరల కిందుఁ - జిల్లర మల్లర
వెన్నొ యున్న నైన - నేమి యిద్ధి

యన్ని బేరములకు - నాయువుపట్టని
యెఱిఁగి మత్స్యయంత్ర - మేయవలయు. 334

తే. చాల సన్నని సూలిక్రై - మేలి రకపు
రాట్నములఁ జేసి యిచ్చిన - ప్రమదమంది
వారలకు లక్షరూప్యముల్ - బహుమతి నిడ
దీక్ష వహియించితిమి మీర - తెలియుఁ డింత. 335

వ. కుటీరపరిశ్రమములం దీప్రవృత్తి యగ్రగణ్యమని యే సబర్మత్యాశ్రమమున రాట్నవాణీయంత్రములఁ బెట్టించి స్వయముగఁ గృషిసేయుచున్నాఁడ. మన మన్నవస్త్రములకొఱ కితరదేశములపై నాధారపడియుంట నింద్యము. తొలుదొల్త నార్థిక స్వాతంత్ర్యముం బడసినఁ బదంపడి నైతికరాజకీయ స్వాతంత్ర్యములు రాఁదలగు. కర్షకులు వర్షమునఁ గొన్ని మాసములు నిర్వ్యాపారులుగ నుండుదురుగాన వారలకీ రాట్నపుంబరిశ్రమ యుపవృత్తిగనుంట యెంతైన శ్రేయోదాయకము. మానవునకు సరియైన పనిలేనిచో సోమరితన మభివృద్ధియగు. దాన దేశమునకుం గీడగు. 336

కం. సోద్యముఁ గని దుర్భిక్షము
చోద్యముగాఁ దొలఁగు ననెడి - సుజనుల సూక్తుల్
హృద్యము లనవద్యము లని
యాద్యకథల్ ఋజువుసేయు - టరుదే యరయన్. 337

కం. ఈదినముమొదలు సోదరు
లీదేశపుఁ జేతి పనుల - నెంతయుఁ బ్రీతిం
గాదనక యాదరించుచు
వైదేశిక వస్తు వాంఛ - వదలుట లెస్సౌ 338

తే. ఇంత చారిత్రిక విశేష - మెఱిఁగి కరఁగి
యిచ్చు ఖద్దరు కొనుటకీ - విచ్చు ధనము
పంటకాలువ నీరట్లు - ప్రాకి పేద
ప్రజకు జీవనమై పుణ్య - రాశి యిడును. 339

కం. వాణీయంత్రం బాడిన
ఘాణీ వీణారవంబు - వలె ఘోయి నిడున్

వాణీధవు జనని యిటన్
రాణించున్ రాజ్య మెల్ల - రాజిల్లు వెసన్. 340

కం. పెద్దలు పిన్నలు నిద్దియ
తద్దయుఁ దగు సుద్దియంచుఁ - దలఁచి వలచి యే
ప్రొద్దుం దీక్షం గట్టఁగ
ముద్దుల ఖద్దరె స్వరాజ్య - మును మనకిచ్చున్. 341

వ. విదేశవస్త్ర బహిష్కారము మద్యపాన నిషేధము, శాసనోల్లం ఘనము, జాతీయవిద్య యనునవి గమనించి వలయురీతిం బ్రవర్తించినఁ గాని రమ్యంబగు గమ్యంబు సౌమ్యంబుగఁ జేరఁజాలమని వాని స్వరూప పరిణామాదులం బెక్కుభంగుల బోధించుచుండె. 342

ఇయ్యది శ్రీమదాంధ్ర మహాభ్యుదయ ద్వితీయ భాగమున

ద్వితీయ ప్రకరణము.

తృతీయ ప్రకరణము

# వీరశంఖారావము

ఆ.వె. భరత దేశ మేరు – పర్వత గుహ బోసు
దాస్య పాశ ముక్తి – దలఁచి వలచి
సింహ గర్జనమ్ము – సేయ పశ్చిమఖండ
మెల్లఁ బెల్లు దద్ద – రిల్లుచుండు. 1

ఉ. హెచ్చిన క్రోధహాలహల – మెల్ల స్వకంఠగతస్థితిం దగం
జిచ్చులకన్ను దాఁచికొని – చేఁగల ముమ్మొనవాలు వాలుగా
నచ్చపుఁ దళ్కులొల్కఁ బ్రమ – థాదులు విప్లవవీరులట్లుగా
వచ్చిన రుద్రుఁడో యనఁగ – భాసిలు బోసరి పిచ్చలింపఁగా. 2

మ. తులయెవ్వారలు బోసుబాబునకు స – ద్గోత్రోద్భవాత్మాబ్ధిజో
జ్జ్వలదివ్యార్థకళావిలాసనుతుఁడై – సన్మార్గ చారాప్తి ని
శ్చలతా తారకజిద్విశుద్ధయశుఁడై – చంచచ్ఛక్తియుక్తుండునై
కలితాస్థాసుమనోనురాగయుతుఁడై – కన్పట్టు సేనాని నా. 3

(ద్వ్యర్థి)

వ. అతని యుదాత్తగుణంబులె యాతనికి రవణంబులై హవణిల్లు. తేజో
వలిత లలితంబైన వాని మోముంగనిన నయనంబులు సముద్రనవనీతం
బుంగన్న కన్నులచందంబునఁ బరమాహ్లాదభరితమ్ములై విలసిల్లు. అతఁడు
మూర్తీభవించిన సుకృతమ్మునాఁజెల్లు. 4

ఉ. ఎల్లలుదాఁటి చీలికల – నేలికలై యెపుడేచుఁజెద్దు మిం
కొల్లమిఁ దెల్లవారలకు – నుల్లముఝల్లన నల్లపక్కలో
బల్లెమునాగ నుల్లసిలు – భారతవీరు సుభాషు వాగ్ఝరీ
ఫుల్లరణాస్థహల్లక స – మూహమధూదయ మయ్యె నీ క్రియన్. 5

వ. వీరభారతపౌరులారా ! 6

తే. ఆంగ్ల సామ్రాజ్య వృక్షమ్ము – హైందవమున
బెల్లగింతును గూకటి – వేళ్లతోడ

వలయునే నాదు నెత్తుట – వ్రాసి యిత్తు
వీరశంఖారవంబిది – వినుఁడు వేడ్క. 7

తే. రత్నగర్భ భారతమాత రాళ్ళ సీమ
చేసి రాంగ్లేయు లక్కటా – చెట్టి పుట్టి
గ్రాస వాస విహీనులై - కలత నొందు
ప్రజల కేరీతి శాంతిభ – ద్రతలు దనరు. 8

తే. చాల దవ్వున్న చిన్న దే - శంబుచేత
సకల శక్తుల వర్ధిల్లఁ - జాలినట్టి
భరతఖండము పాలింపఁ - బడుట యన్న
దోమ కుత్తుక యేనుఁగు – దూఱినట్లు. 9

ఆ.వె. ఇంధనముల కల్మి - నింతింత నాకుబ్బి
యాజ్య మందుకొన్న – యగ్నివోలెఁ
బెనువిభూతితోడఁ – బేర్చెడి తెలవారి
నణఁచ నోటి మాట - కలవి యగున ? 10

తే. చిక్కెనని పిండి పిప్పిగాఁ - జేయుచుండె
నాంగ్లజాతికి నింత దు - రాశ తగునె
యెన్నఁగఁ జెఱకు తియ్యఁగా – నున్నదనుచు
వేళ్ళతోఁగూడ నమలుట – వెఱ్ఱిగాదె. 11

తే. పరుని పెత్తనమునఁ గల్గు - బాధకంటెఁ
జిన్నరాజ్యాలు నగుటకు -సిగ్గిలఁ దగు
మగఁడు కొట్టిన దానికి - వగవదు సతి
తోడికోడలు నవ్వుట – దుఃఖకరము. 12

తే. విలువలేక జీవములేక - యిలఁ బడియును
పాదహతధూళి క్రోధాగ్నిఁ -. బట్టలేక
తన్నుఁ దన్నిన నరుజుట్టు – తాను బట్టు
కొనక విడువదె యది నేర్చు – కొనఁగ దగదె. 13

తే. అకట! యవనీపకుల వనీ – పకులఁ జేసి
యడుగ దొరలేచి కాల్పుల – కాజ్ఞ నిత్తు

రిట్టి చర్యలు విచ్చుము - పెట్టుకున్న
కట్టివేయుము కుక్కనన్ – కరణిఁ దోఁచు. 14

తే. అరరె! ప్రతిపక్షి మనదృష్టి - కందకుండఁ
బోఁగలుగు పెట్టు లైక్యత - పొదివి పట్టి
మిత్ర లెక్కింతువే మీన - మేషవితతి
నరులు శిరమెక్కి తాండవ - మాడుచుండ. 15

కం. తిమ్మిని బ్రహ్మిని బ్రహ్మిని
దిమ్మినిగాఁ జేయఁగలరు - తెల్లదొరలు వా
రిమ్మహి నిమ్మంబోలెఁ గ
రమ్మున నిమిడెడి తెలుంగు - రహిఁ జాతురుగా. 16

కం. క్షాత్రము నశింప హృదయ
క్షేత్రము బీడైన నరుఁడు – జీవచ్ఛవమే
గోత్రఖ్యాతి న్నిలుపని
పుత్రుఁడు పుత్రుండె భరత – భూమి జననికిన్. 17

ఉ. ఈవుల బ్రమానునా నిడి మ – హీస్థిలిఁ గీర్తిలతాంతభూషయై
తావుల నెల్లతావులకుఁ దావలముం బొనరించి బిడ్డలం
బావనజీవనార్థులుగ – భాసిలఁ జేసిన భారతాంబ నేఁ
డీవిధబాధలం దవిలి – నెంతగఁ జింతిలుచున్నదోగదా. 18

చ. గెలుఁడని దీవనల్సలిపి – కేల్వలకేల్డగఁ గీలుకొల్పి మో
నలఁ దలయూపి వీడ్కొలిపి - శత్రుచమూతతిఁ జించిచెండి యు
జ్జ్వల జయలక్ష్మితోఁ దిరిగి – వచ్చిన భర్తృపదాబ్జభృంగియై
గళమునఁ బూలమాల నిడు – కాంతను గన్నది భారతాంబయే. 19

కం. విషఘుటికలఁ బరపాలన
విషమాంబకు గెలువ మీరు – విషమాంబకులై
విషయవిలోలత విడి పర
సుషమా పరమానుషంగ – సుఖమతు లగుఁడీ! 20

తే. సన్యసించుట గాదహిం – స్వాత్రతంబు
పూర్తిగా సాగుటకు పుణ్య – పురుషులార

యవల సామ్రాజ్యవాదము – నణచు టన్నఁ
గొమ్ము తేన్గు నంకుశమునఁ – గుమ్మినట్లు. 21

చ. అతుల పరాక్రమాన్వితులు – హైందవులంచుఁ జరిత్ర సెప్ప నీ
గతి గతిమాలి తెల్లదొర – గారడి కాలిడిపోయి తద్దయుం
గోతుకుచు "దేహిదేహి" యని - కోరెడి దుస్థ్సితి వచ్చె నేఁటికి
ట్లుతుకుల బొంతయైన దక - టా! భరతావని యేటికర్మమో. 22

తే. వేళ్లు బలమెంత యిచ్చిన – వృక్ష మంత
గాలి దెబ్బకు తట్టుకోఁ - గలిగినట్లు
నేత కండగఁ బ్రజలెంత - నిలువఁ గలరొ
యంతశక్తి వైరుల ధాటి - కాగఁ గలఁడు. 23

ఆ.వె. ఎద్దు బండి రోజు - లెన్నడో పోయెను
నురక నామ మాత్ర – మున్న నేమి
పోటి సేయవలయు – ముందేఁగు దేశాల
నోర్చి నూత్నగతుల – నేర్చికొనుఁడు. 24

తే. కత్తి దూసిన వైరిపైఁ - గత్తి దూసి
కదనరంగమ్మునకు దూఁకఁ – గడఁగ కున్న
రమ్య భోగ ప్రదాయిని - రత్నగర్భ
మెత్త్యమెత్తని ప్వల్కుల - నిత్తురయ్య. 25

శా. ఆదేష్టన్మనసారనమ్మి శతకో - ట్యన్వీత సాహాయ్యమం
త్రాదుల్పాగ స్వదేశభక్త ఋషిఘో – షాన్యాధికారాజ వి
చ్ఛేదాత్తార్థమహోహవాగ్న్యరిహవి – శ్శ్రీఁగూర్చి సన్మార్గసే
వాధర్మద్యుతి శుగ్విముక్తి గనుఁడీ –స్వారాజ్య సౌఖ్యార్థులై. 26

(ద్వ్యక్షరి)

చ. పనివడి నగ్నసత్యమును - బల్కెద నుల్కక యుక్తమాటలం
దనిసన కార్ద్రచిత్తులయి – దాతలు లక్షలు కోట్లు క్రుమ్మరిం
పనియెడ వీరపుంగవులు – వారక ప్రాణము వీయఁ దీయనే
రనియెడ గాంధియొక్కఁడు స్వ - రాజ్యరథమ్మును లాగఁజాలునే. 27

తే. కడిఁది నాఁ జంచలాంబక - గర్జఁ గలఁచి
కాలబలమున దొనల శ – రాళి నెఱపి

చొచ్చి సరసుల పద్మినీ – శోభ లడఁచు
రాజహంసఁ ద్రోలెడి వాఁడె – రా ఘనుండు. 28

(ద్వారికి)

చ. కలరు కటారికాంధ్రుడు కడ - కం గదనంబునఁ గాలుఁబోలు చి
చ్చులపిడుగుల్ స్వదేశమున - శూరవరేణ్యులు కాని యైక్యతం
గలబలమెంచిమించ రది - కారణమింతకుఁ బోరనోడఁ గో
త్తలతలయెత్త చీలికలు - తామయి ముందుగఁ దాండవించెడిన్. 29

వ. ఈ దేశము నాయాదేశము ననుసరించిన నాఁడు. 30

కం. భస్మీకరింతు వైరుల
విస్మయ మింకేల యుద్ధ – విద్యానిధినై
యస్మద్దీక్షా దక్షత
సస్మితులై కనుఁడు వినుఁడు – సాహస చర్యల్. 31

కం. కాలికిఁ బెట్టిన వ్రేలికి
వ్రేలికిడినఁ గాలి కుచ్చు - వేసెడి యరి నే
లీలఁ దలఁదన్నవలెనో
లోలోనందెలిసి రండు – లోకము మెచ్చన్. 32

కం. జన మాన ధన వినాశన
మునకెద్ది కతంబొ దాని – మూలచ్ఛేదం
బొనరింపక రుచి నింపక
ఘనసౌఖ్య యశోవిభూతి - గలుగునె చెపుఁడా! 33

తే. అడరి యసహాయశూరుఁడై – యమరవరుల
ద్రవ్చి పీయూషకలశంబు - దెచ్చి యిచ్చి
తల్లి దాస్యంబు వాపిన – ధైర్యశాలి
యగు గరుత్మంతు డేమన - కగుత గురువు. 34

తే. కొంగజప మాచరించెడి - కుటిల మతులు
టక్కులాడులు భువనకం - టకులుగాక
వలయు జీమూతవాహనుల్ - వసుధ కిపుడు
వింతకాంతుల విశ్వంబు – వెలుఁగఁ జేయ. 35

ఆ.వె. కుటిల రాజనీతి – ఘోర శతఘ్నిని
భరత భూమి వైపు – గురియొనర్చి
యెదురు వచ్చువారి – నేర్తురస్నీతి స్పృ
శించినారు దొరలు – మించినారు. 36

కం. మిన్నెత్తినైన వీరుల
కన్నెత్తఁగనైన నచిర – కాలమునందే
యిన్నేల నీట నెత్తుటఁ
గ్లిన్నంబగునంద్రు బుధులు – గీష్పతి తుల్యుల్. 37

కం. జలియన్వాలాబాగున
బలిగొన్నది హూణసేన – భారత జనులన్
దలఁచిన రక్తము పొంగును
నలుపఁగలమె హతుల యాత్మ – శాంతిక్రియలన్. 38

ఆ.వె. నేల యీని నట్టి – నెలఁత లందఱు వచ్చి
దేశ దాస్య ముక్తి – దీక్షఁ బూని
పరులఁ బాఱఁ ద్రోలి – బంగారు భూమిని
గాచుకొనఁగఁ గత్తి –గట్టఁ గలరె? 39

తే. వ్రేటునకు వ్రేటు మాటకు – మాట యనుచు
శౌర్యనిధులైన హైందవుల్ – చాటలేదె
తెగువ దేవేంద్రపదవిగా – జగ మెఱుంగ
దీనులమొ ధీరులమొ నేఁడె – తెలుపఁ దగదె. 40

ఆ.వె. జీవ మన్న నిండు – జీలగ బెండుగాఁ
జూచి దేశభక్తి – నూపు యువల
నాయకుండు తిన – వినాయకుఁ డనరాని
జనుఁడు వలయు మాన – ధనుఁడు ఘనుఁడు. 41

సీ. ఇచ్చోటశౌర్యర – సేచ్ఛామృతము గల్పి
పురిటి బిడ్డల కుగ్గు – పోయలేదె
ఇచ్చోటయువతతి – కెచ్చినదీక్షతో
నేర్పుమైరణవిద్య – నేర్పలేదె

ఇచ్చోటఁబుట్టిన యింతి - కాంతుఁడుభూరి
వీరకంకణముల - వెలయలేదె
ఇచ్చోటఁ బగతుఱ - వెచ్చనెత్తురు ద్రాగి
కరుడుకట్టిన కత్తి - కడుగలేదె

తే. విజయలక్ష్మీ సమేతులై - వేడ్కవిభులు
శాంతి విశ్రాంతి జీవిత - సౌఖ్యమనుచు
లలితకళలను బో - షించి కులుకలేదె
తలఁచుకొనవోయి మేనెల్లఁ - బులకరించు. 42

తే. పరవిషయ కమలాకర - భ్రాంతి భరిత
హస్తపద్మైకలీలామ - దాన్వితోగ్ర
సార్వభౌమ విదాహ వి - శ్రాంతి గలదె
రక్త మృత్తికఁ బండి పొ - ర్లాడకున్న. 43

(ద్వ్యర్థి)

సీ. వారిధి రామాజ్ఞ - వానర నిర్మిత
సేతువింకను నీటఁ - జెదరలేదు
పాతాళ గంగను - బయటికిఁ దెచ్చిన
యర్జును గుణరవ - మాగలేదు
పరవీర రక్తవి - భ్రాజిత రసపుత్ర
కాంస్యదుర్గము లింకఁ - గరఁగలేదు
రాజ్యరక్షాదీక్ష - రాయల రణరంగ
బోధ లింకను మాసి - పోవలేదు

తే. ఛత్రపతి శివాజి మహాజి - చలిత వాజి
ఖురజ రవళులు శ్రుతివీధిఁ - దొరఁగ లేదు
చండతరవీర నేఁడు మృ - త్పిండ మట్లు
యేల కదలవు మెదలవే - నేల నేల. 44

తే. పోరుపోరని రణభేరి - మ్రోగుచుండ
వీరనారీవతంసము - వేడ్కఁ బతికి
హారతు లొసంగి కన్నుల - కద్దుకొనుచు
వీరగంధము పూసి దీ - వించె నిచట. 45

సీ. ఒఱకత్తి దూసిన - మెఱపులు మెఱవవే
నవ్విన ముత్యాలు - నివ్వటిలవె
మాటాడ వాగ్దేవి - మీటదే వీణను
హస్తమెత్తిన బలి - యణఁగిపోఁడె
మౌనముద్ర వహింప - మహిమ సేవింపదె
కన్నుదెఱచిన ము - క్కంటి యనరె
నిలిచినచోట భూ - తలము స్వర్గముకాదె
కలము పట్టిన రసం - బులికి పడదె

తే. భరతవీరాగ్రణీ నీదు - భవ్య శక్తి
మఱచియుంటివ యిఁకనైనఁ - గఱకుదేలి
మూఁడు వన్నెల జండాను - వేడు కలర
నెగుర వేయుము నీకీర్తి - జగము ప్రాక. 46

కం. మెత్తని వాడల కుత్తుక
నొత్తుటకే నీచవైరి - యూహించెడి యా
యెత్తులు జిత్తులు గనుగొని
కత్తికిఁ గత్తెదురు చూపఁ - గాఁ దగు వీరా. 47

శా. ధైర్యస్థైర్యహిమాద్రులంచు మనతా - తల్ తండ్రులంజెప్ప నే
కార్యంబౌ యశమేమిగల్గు నిపుడిం - కన్వేనవేల్ రెట్లుగా
శౌర్యశ్రీఁ బ్రకటింపఁ గాంచి జగమే - సత్యంబు గుర్తించి యౌ
దార్యంబొప్పఁగ నిన్ను నీపితరులన్ - దైవమ్ముగాఁ గొల్చురా. 48

శా. వాలుండాలును బూని ఘోరసమర - వ్యాలోలయై యశ్వధా
రాలావణ్యముఁ జూపుచున్ మెఱపునా - రాజిల్లుచున్ బౌకరున్
లీలామాత్రగఁ బాఱఁద్రోలి రణకే - ళిం బ్రాణమర్పించి నా
రీలోకధ్రువతారయై వెలుఁగు మూ - ర్తిన్ ఝాన్సిఁ గీర్తింపుమా. 49

కం. మేరువు తలక్రిందైనను
నీరధు లింకినను సూర్య - నీరజవైరుల్
మేరలు మీఱిన భారత
వీరాంగన రణమునందు - వెన్నూపునొకో 50

మ. తెలివెల్గుల్ వెదజల్లుచున్న వవిగో - ధీరాగ్రణీ రాళ్ళగు
ట్టలుగావయ్యవి మాతృభూమికొఱకై - "ఢంకాబజాయించి" శ
త్రులఁ జెండాడిన వీరభూవర సమా - ధుల్ వాని జ్యోతిర్ద్యుతుల్
తిలకింపం బులకించు దేహము రణో - త్కటంబుమై మ్రొక్కుమా.

ఉ. తొల్గని కంటుతోఁ దొడరి - దొడ్డదొరల్ జగజెట్టు లెందఱే
నల్గినఁ బుల్గుబల్గులకు - నందినయట్లయికూల బావుటా
వెల్గులు నల్గడ ల్వెలుఁగ - వేయికతల్ వెలయింపఁజేయుదే
కలుగును గల్మి బల్మి యరి - కంటకఘోరకుఠారధారివై. 52

కం. చెండాడిన రిపుశిరమునఁ
జెండాడెద విజయలక్ష్మి - చే చే గలుపన్
జండాంశుని వలెవెలిగెద
రండోయీ నాకుఁ దోడు - రాజ్యము కొఱకై. 53

ఉ. ఎక్కడొ యొక్కఁడీదొరల - యేల్బడి నొల్లక మాతృసేవకై
యొక్కటి బోరనిచ్చి యెటు - పోరినఁ బెక్కురనుక్కడంచి పెం
పెక్కి జయేందిరం బడసి - యేలఁగఁ జాలునె మొక్కవోక యు
క్కెక్కిన దండొకండు దన - కెల్లపుడండగ నుండకుండినన్. 54

సీ. స్వాతంత్ర్య మెల్లర - జన్మంపు హక్కని
జయభేరీ మ్రోఁతనాఁ - జాటె నెవఁడు
ఛత్రపతి శివాజి - శౌర్య చిహ్నంబుగ
స్మారకోత్సవముల - జరిపె నెవఁడు
కేరికారఁ గృశించి - గీతారహస్యమ్ము
వైదికనిలయమ్ము - వ్రాసె నెవఁడు
తన్ను రాజద్రోహి - యన్న షిరాలుపై
సింహగర్జన సీమఁ - జేసె నెవఁడు

తే. అమ్మహాధన్యుఁ దీవ్రవా - ద్యగ్రగణ్యుఁ
బుణ్యు వాఙ్మఖప్రావీణ్యు - బుధవరేణ్యుఁ
బ్రాకటవదాన్యు సౌజన్యు - లోకమాన్యుఁ
దలఁతు మనసార దాస్యబం - ధంబు దీఱ. 55

వ. అని యఖిలభారత యువజనమహాసభాధ్యక్ష పీఠమునుండి యెడనెడ నేతాజీ యూదుచున్న వీరశంఖారావసారాంశము దశదిశల మాఱు మ్రోగుచుండె. సారవంతమైన మృత్తిక విత్తిన బీజరాజముంబోలె స్వాతి కార్తెశుక్తింబడిన చినుకుంబలె నబ్బోధనములు రాములయెడ మహోజ్జ్వల భావపరిణామఫలజనకములై రాజకీయ నూతన చైతన్యముఁ గలిగింప భావింభావించి చొప్పరసి కనుల్విప్పి పదవింబరిత్యజించె. 56

కం. చలమునఁ బదవీ త్యాగం
బలవోకగఁ జేసి భార - మంతయుఁ దొలఁగం
దలగాము దలఁగ వెలిగెడి
నెలవోలెందనరె సౌఖ్య - నీరధిఁ దేలెన్. 57

వ. అంతమద్రపురి కరిగి తనకున్న సర్వస్వము నగర్భ్యునకడిభాగినే యుని యోగక్షేమము లరయుచుందుమని చెప్పి యుత్తరీయాంతరీయము లతో సబర్మతికిఁ బయనమయ్యె. 58

## సాబర్మత్యాశ్రమము

వ. ఏ పురుషోత్తముడు నిర్జిత నిర్జర స్వారాజ్య సముపార్జనకై యదితి కస్యపులకు దిగ్విజయ విజ్ఞానఖనియగు వామనమూర్తివోలె భారత స్వరాజ్యసంపాదనకై ఘూర్జరవిషయవిఖ్యాత సుదామపురాఖ్యాంతర శోభిత పోరుబందరు సంస్థానసచివావతంస సుప్రసిద్ధతేజస్వి కరం చందుగాంధివలనఁ జాతుర్మాస్య సూర్యోపాసనా చాంద్రాయణాది వ్రత నిష్ఠా ప్రతిష్ఠాకలిత నిరంతర శ్రీమహావిష్ణుభక్తి భావనాభరిత సంపాదిత సుకృత సుచరితయగు పుత్తలీబాయీ గర్భశుక్తి ముక్తాఫలముగ గాంధ్య న్వయ పయఃపారావార రాకాశశాంకుఁడుగ జన్మించెనో, యేసుశ్లోకుఁడు ప్రఖ్యాత జైనకర్మంది బేచార్జీస్వామి హితోపదేశవాగమృతాస్వాదనా ప్రముదిత మాతృదేవీచరణ సరోరుహాంతికోచ్చరిత నిజప్రతిజ్ఞాపరిపాల నార్థావర్జిత మద్యమాంసమత్తకాశినీవాంఛారింఛోళీ ఫలిత పరివర్ధిత స్వచ్ఛ వర్తనుండై వుటపాకంబునజిగిమిగులు స్వచ్ఛహాటకంబుంబోలె హరిద్వార జాహ్నవీజలంబులవలె, నిర్మలశీలరమాపరితోషిత గురుదత్త సంజీవనీ విద్యావైభవోపేత త్యక్తవృషపర్వపుర స్వర్లోకస్థమాతా పితృసన్నిధాన సమాగతకచుండుంబలె నాంగ్లాచలాఖ్యస్తోన్నత న్యాయశాస్త్ర పరీక్షా

లబ్ధవిజయుండై జనుర్దేశమునకు విజయముచేసెనో, యేన్యాయవాది నిష్కలంక న్యాయవాదిగా బ్రదుకఁ దలంచి సత్యాన్వేషణకుఁ దాన ప్రయోక్తగను స్వీయజీవితమునే ప్రయోగశాలగ నేర్పఱుచుకొని దివ్య శక్తిని బ్రదర్శించెనో, యే తత్త్వవేత్త శ్రావణ హరిశ్చంద్ర ప్రహ్లాద బుద్ధాది మహాపురుష ప్రతిపాదిత ప్రసిద్ధ విశుద్ధ సిద్ధాంత వారిధి మథనో ద్భూత సుధాధారలం గ్రోలి జీర్ణించుకొని ప్రతీకారేచ్ఛా విరహితుండై యహింసా ప్రబోధనమ్మున శాంతిదూతయను ఖ్యాతిసందెనో—

ఏ మహాశయుఁడు వర్ణవిభేద పిశాచావేశిత రాజకీయ దురహంకార పూరిత దుర్నిరీక్ష్య కాలాభీలదమననీతి దండధర సువిచారదూరాసభ్య మార్గవల్లద్దక్షిణాఫ్రికా ప్రభుతా జనతా పరిపీడిత తద్దేశస్థభారతీయ ప్రజా వ్యథాంధకారబిసరుహబాంధవ యశోవిశాలుండై, నిష్పాక్షిక సర్వ సమాన పౌరధర్మావకాశశాసన సృష్ట్యంశాస్థా నిరస్తసమస్త సౌఖ్యుండై నేటాలు భారతజాతీయ మహాసభాస్రష్టయై తద్రక్షణ విజయభారధూర్వ హుండై తన్మయత్త్వము చెందెనో—

ఏ భారతీయ శిరోరత్నము స్వదేశస్థితిగతు లామూలాగ్రముగ సునిశిత దృష్టితో గ్రహింపఁ బల్లీపత్తనంబులఁ బర్యటించి ప్రజాతత్త్వ మెఱింగి త్రికాలజ్ఞుఁడై నలువలంకులం గలయంజూచికొనుచు ద్విగుణీకృతో త్సాహంబున స్వాతంత్ర్యశాంతిసరమదీక్షా బద్ధకంకణుండై విజయభేరీ భాంకరణములు ఘనభోంతరాళంబులఁ బ్రతిధ్వనింప శ్వేతజాతి పాలన యంత్రము నౌకలపై నెక్కించి పడమటిదీవులకంప ధీరగంభీరసార వాక్సుమాసారము గ్రుమ్మరించి యాత్మగౌరవ సస్యము పండించెనో యట్టి మహామహుఁడు మోహనదాసు కరంచందు గాంధి యొక యాశ్ర మము స్థాపించె - అదియ సాబర్మత్యాశ్రమము.

అయ్యది సబర్మతీ ద్వీపవతీ తీరముననుంట నన్వర్థకాభిధానంబున నలరు. తత్తరంగిణీ నిజనిర్మల నవనవోన్మేషజీవనమువలె మానవజీవ నము సత్యస్వచ్ఛముగా దేశోద్ధారకముగాఁ బరోపకారకముగాఁ బ్రశాంత ముగా జరుగుటకే మహోద్యమములు స్థాపించి నడుపుఁడని బోధించు చున్నదోయనునట్లు తరంగమృదు ధ్వనులతో మెల్లమెల్లఁగాఁ బ్రవహించు చుండు. అయ్యాశ్రమము సత్యాగ్రహసాబర్మత్యాహ్వయముల ద్విజన్మము నొందగు—

మ. కులభేదంబొక మాటమాత్ర పిలుపుల్ – గోష్ఠుల్ మతైక్యంబుమై
నలరుంబంధులరీతి బంధురసుధా – షానందకందంబుగం
గలుముల్లేముల హెచ్చులొచ్చులటఁద – గ్గందగ్గవారందఱుం
బలుసేవల్ప్రచరించుచుందురు "మమా – త్మా సర్వభూతాత్మ"నా. 60

సీ. తతహంస తూలికా – తల్పంబు లటలేవు
నవకుశాస్తరణ సం – తతులెగాని
ద్రాక్షేక్షురసగుడ – ద్రవము లచ్చటలేవు
స్వచ్ఛతరంగిణీ – జలమెగాని
యిష్టమృష్టాన్న సం – తుష్టులచ్చోలేవు
శాల్యోదనాది భో – జనమెగాని
దాసదాసీజనో – ద్యత్సౌఖ్యమటలేదు
కృపమీఱఁగాస్వయం – కృషులెగాని

గీ. అతివినూతన ప్రకృతివై – ద్యంబెగాని
పూటపూటకు సూదుల – పోట్లులేవు
స్వార్థరహిత స్వరాజ్య త – పస్సెగాని
వ్యక్తిగతసౌఖ్యమార్గ ప్ర – సక్తిలేదు. 61

వ. సనాతనార్యర్ష్యాశ్రమములకు దీనికింగొన్నియెడల నంతరంబు గలదు. అధ్యాత్మికదృష్టితో వ్యక్తిగతమోక్షఫలము ప్రధానముగాఁ బ్రకాశించినవవి. అంతర్వాణీ ప్రబోధముతో నిత్యసత్యాన్వేషణ ప్రయోగమున స్వదేశస్వాతంత్ర్యమే చరమ పరమ ప్రయోజనముగా నెలకొల్పఁబడినదిది. వర్ణభేదవృక్షశాశ్వతస్థితి సంకల్పించి తదనుకూలోపదేశ జలంబులఁ దర్భూరుహంబులఁ బోషించినవవి. జాతిమతకుల విభేద రహితమైన విశ్వమానవసౌభ్రాతృత్వమును క్రియారూపకముగ బోధించినదిది. ఐహికవిరక్తితో నాత్మానందమే ముఖ్యముగాఁగలవవి. ఆత్మవికాసముతో రాజకీయ చైతన్యము జీవగఱ్ఱగా మెఱియ నిస్స్వార్థమానవసేవాధర్మసరణి సర్వలోక సౌఖ్యసాధము గమ్యముగాఁ గలదిది. యజ్ఞాదుల హింసను సమ్మతించినవవి. సర్వలోకసర్వావస్థల నహింసాసిద్ధాంతమును వీడనిదిది. మతసూత్రోపేత నిర్ణీత శాఖాజనిత ప్రజలు మాత్రమ ఛాత్రస్థానమున కర్హులనినవవి. అంతేవాసులుగనుంట కందఱ నామోదించినదిది. పైకు

దేవతల నారాధించినవవి. ఏకేశ్వరోపాసనకు దారితీసినదిది. ఇఁగ సస్య వృక్షలతావితానపరిపోషము, గోరక్షణ, శిష్యపోషణ, స్వయంకృషి, స్త్రీగౌరవాతిథి సత్కారాదులద్వయంబు సమానంబు. ఈ వేఱడములు దేశకాలపాత్రాదుల ననుసరించి యేర్పడినవేగాని తదన్యంబులుగావు. మార్పు సహజంబని ప్రకృతి నిరూపించుకొన్నదేగాని యుగపురుషులలో న్యూనతాధిక్యతలులేవు. లోకకల్యాణ దీక్షయే సనాతనాధునాతనాశ్రమముల యాశయము. అట్టి యాశ్రమస్థాపకుఁడై పరమపావనభావోపేతుండైన మహాత్ముని సద్గుణసముదయంబఖివర్ణింప వాణీమనోనాథున కైన నశక్యంబు. 62

## గాంధీవర్ణన

చ. గురుతర బాధ్యతాన్వితుఁ డ - కుంఠితదీక్షితుఁ డద్వితీయ ధీ
వరుఁ డురుకార్యదక్షుఁ డతి - పావన సద్గుణ నిత్యసత్య వా
క్చరితుఁ డమానుషాద్భుత య - శఃకలితుం డఘదూరుఁ డార్యుఁడా
దరదరహాసభాసుఁ డగ - ధైర్యబలుం డతఁ డెంతపుణ్యుడో. 63

సీ. అన్యోన్యహార్దహృ - ద్యద్బుద్ధి చతురుండు
నిర్భర్త్సితాఖిల - నీచరతుఁడు
దేశ దేశాత్త సం - దేశ దేశికనేత
సకలమానవ సౌఖ్య - శాంతిదూత
సత్యైక్య దాంత్యహిం - సా భాసహాసుండు
హరిహరాభేద క - ళ్యాణగుణుఁడు
సర్వసర్వంసహా - చక్రైకగృహ మహా
స్థాయిహాజయరాజ - కీయవేత్త

గీ. దానకౌముది బ్రహ్మ వి - ద్యా వినోది
సతత గీతామృతాస్వాది - సదయవాది
కులమత విభేద భూధర - కులిశధారి
సంధియుగధర్మ కర్మ సం - బంధి గాంధి. 64

వ. అతండు గృహస్థుండయ్యు బ్రహ్మచారి; రాజకీయనాయక శిరోరత్నమయ్యు వేదాంతి; సదాచార సంపన్నుఁడయ్యు సర్వమత సమన్వయశీలి,

యహింసా ప్రమోదియయ్యు న్యాయవాది. గమికర్మీకృతానేకగ్రాముం
డయ్యు నిశ్చల నిష్ఠాగరిష్ఠుండు. 65

సీ. చేటల నిప్పులఁ - జెఱగుచున్నను మంచు
గాలిగా మార్చుకో - గలుగుకతనఁ
బాతాళ గృహగర్భ - పరమరహస్యమేఁ
గరతలామలకమై - క్రాలుకతన
బిగిసిన యినుప గు - ప్పిడి మల్లెమొగ్గగా
నిచ్చ నూదిన నది - విచ్చుకతన
స్వర్ధునీ జాలపా - త్స్వగతంబు ద్యోవాణి
వీణారమ్ము గా - వించుకతన

గీ. మేరువుం బూరిగాఁ బూరి - మేరువుగను
మాట మహిమ మనమ్ముల - మలచుకతన
వాని ప్రజ్ఞావిశేష వై - భవ భరమ్ము
నెన్నఁ దరమౌనె నెంత య - హింసుకైన. 66

కం. అరికరిసృణి వితరణఖని
వరగుణి భువనద్యుమణి కృ - పాపావని యీ
శ్వరభక్తాగ్రణి ధీమణి
నరనాయకలోకహార - నాయకమణిగా. 67

సీ. సుమనోభిరామ భా - సుర ధర్మగుణవర్తి
సాధు సజ్జనలోక - చక్రవర్తి
శాసనోల్లంఘన - సత్యాగ్రహాస్త్రప్ర
యోగచాతురి జయో - ద్యోగియోగి
దిగ్దంతిదంత ము - ద్రిత యశోభాసుండు
సకలార్థసాధక - సత్యమూర్తి
నిర్మలీకృత మనః - కర్మ నిష్ఠానిధి
మానవకళ్యాణ - మార్గదర్శి

తే. విశ్వసౌభ్రాతృతా సిద్ధి - వేఁడి కూడి
దైవమును నిచ్చ ప్రార్థించు - తాపసేంద్రుఁ

దతని వాక్సుధ ప్రవహించి – నట్టి పట్టు
ధర్మదేవత నాల్గు - పాదముల నడచు. 68

వ. సహస్రదీపశిఖా సంశోభిత భవ్యభవన రాజంబుంబలె నతని ముఖము సత్యజ్ఞానానంద జనిత రాశీభూత తేజఃపుంజ పరివేష విభ్రాజిత మగుచుండఁ జూపఱకు నేత్రపర్వమగు టత్యుక్తికాదు. 69

శా. దృప్యద్విడ్వర జిత్కలాన్వితల స- ద్విద్యుత్ప్రభాభాసియై
లిప్సాలేఖ్యమహాకథార్థమహిమా - లీలాస్థిరస్థాయియై
గోప్యార్థావృత రాజకీయరచనా - కూలంకష జ్ఞానియై
దీవ్యద్దివ్యరసైకలోలుఁడయి చి - ద్విద్ధృగ్గుచిన్వెల్గెడిన్. 70

సీ. ఉన్నత గతుల బ్ర - హ్మోపాసనాశక్తి
రాజిల్లు మానస – రాజహంస
సుమనో మనోహర - శుచి జీవనప్రదా
కరకళా శ్రీశుభం – కరము కరము
సన్మార్గగమన ర - జస్తమోదూరశ
తారశోభాకర - చారునేత్ర
మర్థార్థిసుఖద మ – హాంకైకవిశ్వాస్య
భరతభాగ్యవిజయా – స్పదము పదము

తే. సత్యవాఙ్నిష్ఠయును నహిం - సావ్రతంబు
ననెడి కలమఫలాన్విత – మైన క్షేత్ర
మిట్టి యంగాంగి శక్తి క - న్పట్టునట్టి
యఖిల సద్గుణకంధి మ - హాత్మగాంధి. 71

(ద్వ శర్మ)

## శ్రీరాములు గాంధిని దర్శించుట

వ. అట్టి మహామహుండైన కస్తూరీబాయీ మనోనాథునిచే స్థాపింపంబడి తదాధ్వర్యవమున నిర్వర్తింపఁబడుచున్న యయ్యాశ్రమ బహిర్ద్వారాంతికమ్మున నిలిచి. 72

శా. కాంచెన్ రాములనూహ్యదివ్యసుష - మాక్రాంతాత్మశక్తిచ్ఛటో
దంచద్భారతమాతృఘోరచిరదా – స్యాందూళిదాస్త్యాఘభా

క్కించదోగ విదూరధీకలితజే - గీయార్థ సత్యాగ్రహ
ప్రాంచత్కంకణ కాంతియుగ్విజయసం - పద్గ్రంధినిం గాంధినిన్. 73

వ. అత్తఱి మోతీలాలు జవహరులాలు రాజేంద్రప్రసాదు వ్రజకిశోర ప్రసాదు సుభాష్‌చంద్రబోసు వల్లభభాయిపటేలు మదనమోహన మాలవ్యా రాజాజి సరోజినీదేవి పట్టాభి సీతారామయ్య లాల్‌బహదూరు శాస్త్రి లెజినాల్డురెయినాల్డ్సు శంకరలా లాంధ్రకేసరి టంగుటూరిప్రకాశము లాలాలజపతిరాయి శ్రీనివాస అయ్యంగారు కృపలానీ మగనలాలు ప్రభృతులు సద్యోవికసిత మల్లికా సదృశములైన ఖద్దరు వస్త్రములను టోపీలను ధరించి రాట్నమున నూలువడకుచు నర్ధచంద్రాకృతిగ నుపవిష్టులైయుండ నవ్వారల మధ్యంబున ముత్యాలదండ న్మేరువువలెం బ్రమథగణంబులం బరమేశ్వరుంబలె బాపూజీ ప్రకాశించుచుండె. కాల చక్రమీరీతిగాఁ దిరిగిపోవుచుండు ననురీతిగా దక్షిణహస్తమున రాటముఁ ద్రిప్పుచు నొకవ్యక్తికైన నొక దేశమునకైనన్నునున్న తాధోగతులిట్లు కలుగు చుండు ననునట్లు వామకరంబును గ్రిందికిన్మీదికిన్నడుపుచు దారముధీయు చుండఁ దత్సూత్రయంత్రమునుండి మధురమంజుల శబ్దంబొండు మోక్షలక్ష్మి మంజీరరవళింబలె భక్తుల యోంకారనినాదంబు చందంబునఁగర్ణ పేయంబుగా వినంబడుచుండె. సబర్మతీద్వీపవతి భాగీరధివడువునఁదదా శ్రమంబు కైలాసంబుగతి నతని యాత్మకుం దోఁచె. అత్తఱి. 74

కం. ధననిధిఁ బొందిన నిర్ధని
మనముంబలెఁ బొంగె నతని - మతి మహిమాఢ్యుం
జనవంద్యుని గాంధిం గన
ఘనుల మనశ్శక్తి చాల - ఘనతరము గదా. 75

వ. అట్లు పొంగుటంజేసి హృదయంబున. 76

తే. ఉదయరాగంబు రీతిగా - హృదయరాగ
మభ్యుదయభాగధేయమై - యలరుకతన
నాత్మఁ దర్శించి బుధులు మ - హాత్మబిరుద
మెంత సార్థకముగ వీరి - కిడిరొ పొగడి. 77

వ. దేశభక్తాగ్రగణ్యుండైన యిప్పరమ పూజ్యుఁడు. 78

కం. ఏకులరాట్నువుపీఠా
ప్రాకటగానమున మాతృ – బంధవిముక్తిం
జేకూర్చి సేతుహిమగిరి
చీఁకటికోణములఁ దేజుఁ – జిప్పిలఁజేయుఁజా. 79

తే. ఆకులలములు దినెడి మ – హర్షులైనఁ
గోపతాపాదులిట్టులఁ – బాపుకొనిరె
యుప్పువులుసులఁ దినుచు నీ – యురుగుణాఢ్యుఁ
డంతరంగపు శత్రుల – నణఁచివైచె. 80

చ. కులమతభేదభావములఁ – గూల్చి మహత్తర తత్త్వశాస్త్రసం
కలిత సమైక్య సద్గుణ వి – కాసవిలాసముఁ గూర్పు నేర్పుమై
వెలయఁగఁ జేసె నాశ్రమము – విజ్ఞులు దద్జ్ఞులు ప్రస్తుతింప నిం
దలరు నహింస బుద్ధుని మ – హాత్ముఁడు సద్గురువంచు నెంచెనో.81

వ. సినీవాలీసమాగమంబుంబలె నిట్టి దివ్యతేజస్వి యియ్యిలాతలంబున మిక్కిలి యరుదుగా నవతరించునని యాత్మం దలంచుచు సమీపించి నమస్కరించి గృహీతప్రతివందనుండై. 82

కం. ఖాదీకాంతాలోలా
పాదాబ్జవిశాలఫాల – పావనశీలా
వేదాంతార్థవిలోలా
సాధుజనకృపాలవాల – సమరసపాలా. 83

వ. ఏ నాంధ్రదేశమ్మునుండి వచ్చినవాఁడ. భవచ్ఛ్రుశ్రూషాభాగ్యప్రాప్తికి యోగ్యుండనను ప్రత్యయమ్ముగలాఁడ. మీయడుగుజాడందడబడక నడవంగోరువాఁడ. భారతమాతృపాదపద్మసేవాచికీర్షుండ. శ్రీరామాహ్వయుండ. నన్ననుగ్రహించి మీయంతేవాసిగ స్వీకరింపఁ బ్రార్థించెదనన నతండు శిరంబు పంకించుచు నాలించుచుండ. 84

కం. ముకుళితకరకమలుండై
నికటంబున నిల్చి యాత్మ – నిర్ణయ వాంఛం
బ్రకటించి మహాత్ముని దయ
యకళంకము శుభద మనుచు – ననుకొని పిదపఁజా. 85

కం. అర్ణవ గభీర భావో
దీర్ణమహాత్మాత్మశక్తి - దీవ్యద్వాక్యా
కర్ణన కౌతూహలియై
నిర్ణిద్రవిశిష్టభక్తి - నిలిపి యిటులనున్. 86

తే. ఆత్మసంయమనైకవి - ద్యాప్రవీణ
పరమహంసాగ్రగణ్య నీ - పాదపద్మ
సేవ సంసృతి జలనిధి - నావ దేవ
కరుణ సుజ్ఞానమణిసుధా - కలశ మిమ్ము. 87

వ. నీవ నాకిఁకఁ బరమగురుండవని నిలిచియుండ. 88

మ. వినతాస్యున్ సునుహాస్య వశ్యుఁ గని సం - ప్రీతిం గరంబెత్తి ర
మ్మని దీవించి కవుంగిలించుకొని యా - హ్లాదమ్ము సంధిల్లఁ జెం
తన కూర్చుండఁగఁజేసి స్వేచ్ఛమెయి స్వా - తంత్ర్యైక దీక్షారతిన్
ననుజేరం జనుదెంచితే గుణనిధీ - నాకండవై యుండగన్. 89

వ. అని యతనిపైరాగరంజితదృష్టిం గరుణామృతవృష్టిం గురిపింప రాములకెదియో నూతనచైతన్య మంతర్వాహినిగ హృదయాంతరాళ మునఁ బ్రవహించినట్టుండ నిట్లను. ఆర్యా యేమీపదసన్నిధినుండి. 90

కం. పదవులఁ గోరక సతమా
పదలకుఁ గుదురైన త్యాగ - పథము విడక సం
పదనెదనొల్లక సేవా
స్పదవిధమునఁ గృషియొనర్తు - సంతోషముగన్. 91

తే. అంతరీయోత్తరీయము - లవియ దక్క
నన్నియును వీడి వచ్చితి - నాశ్రమమున
కంకిత మొనర్తు జీవిత - మమితభక్తి
మాతృదేశమ్మునకు దీక్ష - మై మహాత్మ. 92

ఉ. భోగము నీకుఁ జుక్కెదురు - పూతచరిత్ర దయాక్రియారతిం
ద్యాగవిభూతి నీవ ధ్రువ - తారవు మేరుసమానధీర యీ
సాగరమేఖలాఖిల ర - సాతలమేలెడి సార్వభౌముఁడున్
నీగతి దిగ్దిగంతనుత - నిశ్చల నిర్మల కీర్తిపొందునే. 93

మ. పదవింగాదని యోగివై సుతసతీ – వ్యామోహముల్ వీడి దు
ర్మదసామ్రాజ్యసుఖైక సత్రబలిక – ర్మ క్రీడమాయించి సా
ఖ్యదదీనావన సూత్రయజ్ఞధృతి స – త్యారాధనాహింస నా
స్పదశక్తిం ద్రిజగంబులం గెలిచితే – సర్వజ్ఞుఁడా మోహనా. 94

(ద్వ్యర్థి)

ఉ. అంబర కేశునట్లడిగి – నట్టివొసంగుదు నిచ్చలున్నిరా
డంబరజీవితంబున కొ – డంబడి ఖద్దరు మొద్దుబట్టతో
సంబరమందుచుందు పస – చాలుదు సత్యము నిచ్చకంబునీ
కుంబగ నేఁడు నీకెనగఁ – గోటికొకండును నిల్వఁజాలునే. 95

వ. అను విశ్వాసంబును సముచితలోకజ్ఞానసమ్మను మీసత్యాగ్రహసమర సందేశాదులవలనం గలిగె. అవియ నన్నిట కాకర్షించెననవుడు కస్తూరీ బాయీవల్లభుం డతని నవలోకించి. 96

కం. బెడిదపు నేమంబులఁ గడు
నొడలు బడలు టన్న నీకు - నొప్పునె దిగినం
దడయక లోతెలుఁగుదు మా
పడుబాధల నోర్వ నోర్పు – వలయును రామా. 97

కం. ఒకదెస దేశోద్ధరణం
బొకదెస సామ్రాజ్యరణమ – హోజ్జ్వలకృత్యం
బొకదెస మతాజి దమనం
బొకదెస పరదేశసఖ్య - మూఁపుచుసుండుల్. 98

కం. దవ్వనక యిట్టు వచ్చితి
నొవ్వేఁగనివాఁడవేమొ – నూల్కొని కడఁకం
జివ్వకు మా వలె నిల్తువె
యవ్వయు బువ్వయును వలయు – ననరా డిచటల్. 99

కం. అని పలికెడి పలుకులు దా
వినయంబున నాలకించి - విబుధస్తుత్యా
దినపత్రిక మీజీవిత
మునఁగల విధులెల్లఁ దెల్ప - మును దెలియుదుఁగా. 100

వ. మీ జీవితనౌక విశిష్టనిబంధనజలధి నపూర్వమార్గమునఁ బయనించు చున్నది. దాని ప్రభావ మమోఘము. ఏ నొక్కండగా దీవిషయంబు జగంబెఱుంగు. 101

కం. మీనియమావళి నిచ్చలు
జానపదుల్ నాగరికులు – సంగీతకళా
జ్ఞానమున జంత్రములఁ దగ
గానము సేయుదురు ఱాలు – గరఁగం దొరగన్. 102

తే. భవ్యభవదీయ దివ్యసం – భాషణమున
భావ బంధానుబంధమ్ము – వాయుటరుదె
పూర్వజన్మసంస్కారమ్ము – పొరయకున్నఁ
గలుగునేయిట్టి సుజ్ఞాన – గరిమబలము. 103

కం. సత్య మహింసయుఁ బ్రేమము
నిత్యశుభంకరములనుచు – నీచెప్పెడి యా
ప్రత్యక్షరమున ధర్మువు
ప్రత్యక్షంబగుచునుండు – బహుతేజముతో. 104

కం. శ్రేయోరాజ్యస్థాపన
కై యీవొనరించునట్టి – ఘనకార్యములే
స్థాయింబొందెనొ యెఱుఁగరె
మాయునె నీకీర్తి విశ్వ – మానవచరితన్. 105

వ. అని రాములన గాంధి చిఱునవ్వునవ్వి యేఁ బ్రశంసలకుబ్బంగాని సద్గుణంబులెందున్నం గుర్తించి యాచరించుటకుద్యమింపం బ్రోత్సహింతు. అదియట్లుండ. పూర్వాపరంబుల సరిగఁ దర్కించుకొని యిటనుంటకుం బూనికొంటివా. ఈనీసంకల్పము పురాణవైరాగ్యము గాదుగదా. నీకు గృహిణీయు జననీజనకులుంగలరా. ఉన్నచో వారలయనుమతివడిసి వచ్చితివా యనుడుఁ గలరూ పెల్లవెల్లడిసేసిన నతండుల్లమున నుల్లాసంబు పెల్లుబుకఁ ఘనికికి సమ్మతించి యిఁక నియ్యాశ్రమ సభ్యులందీవునొక్కండ వని దీవించె. అంతం గొంతకాలంబుజరుగ మహాత్ముం డొక్కనాఁడు రాముంగని నేటి మధ్యాహ్న మిట దిగ్గజములవంటి యగ్రనాయకుల గోష్ఠి జరుగు. ఆర్థికసాంఘికరాజకీయాద్యనేక ముఖ్యాంశములందుఁ జర్చింపఁ

బడు. మహామహుల మనోభావము లవగతములగు. నీ పూర్వపుణ్య విశేషమున నీ యాశ్రమమునకు రాగల్గితని జవహరు ప్రభృతుల దెసం గనుగొని యనంతరకార్యక్రమమున కుపక్రమింతమన నెల్లరు రాటముల నాఁపి వారివారి కృత్యముల నిర్ణీతమార్గముల నిర్వర్తించి సొపడి సకాల మున సభావేదికంజేరిరి. సీతాపతియు వారల సహపంక్తింగృతాహారుండై యమ్మహానుభావుల సన్నిధానమున సముచితప్రదేశంబున నుపవిష్టుం డయ్యె. ఋసీ సమాసీనులైన మహర్షులవలె ఖాదీదుప్పటంబులపైఁ గూర్చుండియున్న తద్దేశోద్ధర్తల చర్చాదేశసందేశాదుల దత్తావధానులై విన సర్వదిశాసమాగతులరగు దేశభక్తులెందఱో యట వార్చియుండిరి. 106

# సబర్మతీసదస్సు

## ప్రథమ దివసము

ఉ. మన్నన రూపులం గొనిన – మాడ్కిఁ గళందగవెల్గు జ్ఞానసం
పన్నులు పూర్ణకుంభముల – పోలిక నేలిక లట్లు కొల్వుదీ
రన్నుతియింప నేరరాక – రమ్యసదస్సది నేత్రపర్వమై
పున్నమ చంద్రబింబమటు – వొల్చెమహాస్సను జ్యోత్స్నపర్వఁగఁ.

తే. తెల్లదామరపూవున – నుల్లమలర
వాణితో నిండుకొల్వున్న – బ్రహ్మయట్టు
కస్తురింగూడి కూర్చున్న – గాంధిఁ గాంచి
సంతసంపడె రాములు - స్వాంతమందు. 108

కం. బన్నము లెన్నియొ కుడిచియుఁ
దిన్నని తెన్నరయ కింకఁ - దీఱదనుచు శౌ
ర్యోన్నతి లోలోఁ గనలుచు
నున్న పృథాసుతుల భంగి – నుండిరి ధీరుల్. 109

వ. అదియెట్లన నేతత్కాలంబున కిదియొక యత్యద్భుత వీర భారత యుద్ధంబు. దానికిందీనికిం భేదంబులట్లు పోలికలున్వేలయు. అది నిరుపమాన క్రూరతరహింసాప్రపూరితం బిది యేకపక్షపరిపాలితశాంత్యహింసాద్యనేక విశిష్టగుణగణ సముపేతంబు. దానికాలవ్యవధి యష్టాదశదినంబులు

మాత్రమ. దీని సమయపరిమితి బహుదశాబ్దంబులనంగణుతికెక్కు. దాని పరిధి కురుక్షేత్రమ. దీని రంగస్థలము దేశవిదేశప్రదేశములనుట జగద్విదితమ. అది సైన్యైకభోగ్యంబ. ఇది ప్రజానాయకయోగ్యంబ. ఇట్టి సత్యాగ్రహసమరసన్నాహమున కాఁయువుపట్టగు నిప్పరిషన్మధ్యంబున గంభీరముద్రంచవిలి యాలోచనామగ్నమానసులగు నమ్మహాపురుషు లున్న తీరభివర్ణనీయము. పండ్రెండేండ్లటవీనివాసంబునంగ్రుస్సి పదమూఁడగునే డజ్ఞాతవాసంబునండస్సి యభిమన్యుపాణౌకృత్యుత్సవక్రియా సమాసాదితనూత్నబాంధవ్యబలంబునం గొంతదేఱి నిగ్రహానుగ్రహ సమర్థుండగు చక్రితోడ్పాటుమైఁ గీడ్పాటుదొలఁగ ద్రుతగతి స్వరాజ్య సముపార్జనంబ యవశ్యకర్తవ్యంబనిభావించి బంధుసుహృజ్జనసమేతులై తద్విపులప్రయత్నానుకూలమార్గనిర్ణయతత్పరత నుపప్లావ్యంబున నువవిష్టులైన పాండవులంబోలి యుండిరి. ఇయ్యధునాతనభారతసంగ్రామ రంగంబునం దెవ్వరి నెట్లూహింపఁబోలునన. 110

కం. తనచేత నాయుధమ్మం
గొనకున్కి నతండ హింస – కుం దవ్వొటఁ
ఘనసంగర కృత్యములం
దన బుద్ధిబలంబుచేత – దారి దెలుపుటఁ. 111

తే. సర్వసంగ్రామచక్రంబు – సక్రమముగఁ
ద్రిప్ప ననిమొననిల్చి స్వ – దేశవిజయ
బోధమఁ పాంచజన్యము – నూఁది స్వపర
తంత్ర రక్షణ శిక్షణ – దక్షుఁడగుట. 112

కం. తేజస్విగాంధికృష్ణుఁడు
రాజేంద్రుం డెన్న ధర్మ – రాజు పటేలే
యాజింజయించుభీముం
డోజన్నెహ్రూకిరీటి – యుజ్జ్వలదీక్షఁ. 113

కం. సరిహద్దుగాంధి నకులుం
డరయంగాఁ బిన్నయయ్యు – నద్భుతశౌర్య
స్ఫురణమునఁ జాఱుకుఁదనమునఁ
జరితార్థుండైన శాస్త్రి - సహదేవుఁడగుఁ. 114

కం. పరిపాలన యనినంతన
నిరతము రణమంచుఁ జింత - నిప్పులు గ్రక్కన్
సరియేరు వంగకేసరి
కరిహృచ్ఛల్యంబు బోసె - యభిమన్యుండౌ. 115

కం. కలిమి వదాన్యతమాన్యత
లలితగతుల రాచఠీవి - లక్షణముల ని
ర్మలదేశభక్తి గాంధికి
బలమగుటన్ మోతిలాలు - బలరాముఁడగున్. 116

తే. వెజ్జుపట్టాభి సాత్యకి - వినుతవినయ
పరుఁడు రాజాజి ద్రుపదుఁడు - స్థిరమతికృప
లాని విరటుఁడు విజయ సం - ధాన శక్తి
నుజ్జ్వలుండగు మాలవ్య - యుత్తరుండు. 117

కం. పరమార్థదృష్టిఁ బలుకుట
నరయ నజాదెన్న ధౌమ్యుఁ - డనఁగానొప్పున్
దిరముగ ధృష్టద్యుమ్నుం
డరిభీకరుఁడౌ ప్రకాశ - మనిచెప్పఁదగున్. 118

తే. జమ్నలాలుబజాజు వృ - షభుఁడు ధృష్ట
కేతుఁడలజయరాముండు - కీర్తిశాలి
శ్రీనివాసుఁడెమాగధుఁ - డెన్న చేకి
తానుఁడగును వినోబా ని - తాంతశాంతి. 119

కం. చలమున స్వరాజ్యమను స
త్ఫలముం గాంక్షించి శాంత - పావనమతి ని
చ్చలు గాంధిం గొల్చెడి ని
శ్చలచిత్తుఁడు సేనుగుప్త - శౌబ్యుండౌఁగా. 120

కం. విపులాజనసుఖదవచో
నిపుణుండై సంధికార్య - నిష్ఠాపరుఁడై
యెపుడు స్వరాజ్యముఁ - గోరుట
ద్రుపదపురోహితుఁడు నాఁగఁ - ద్రోఁచున్నప్రూ. 121

వ. ఇంతియకాక తత్సదస్సున. 122

ఉ. ఖద్దరుదువ్వటంబు మెఱు - గారు జరీపువుదీవ పేటుతోఁ
దద్దవెలుంగుదానిఁ బర - తంత్రమహాంధవిభేదనక్రియల్
దిద్దెడుదానిఁ గట్టుకొని - తెల్గునెలంతల కీర్తిమూర్తినా
నొద్దికనాయకాగ్రణుల - నొప్పె సరోజిని భారతింబలెన్. 123

శా. దీనార్తిందొలఁగించి భారతము సం - దీప్తంబు గావించి ని
త్యానందంబొనఁగూర్ప నిట్టు సభ సే - యంజూడఁ గన్పిందుగా
నానావర్గసమేతగాంధియుతమై - నాఁడా సదస్సెంతయుం
గ్లానక్షత్రరుచిస్ఫురద్గగనసం - కాశంబుగా వెల్గెడిన్. 124

వ. ఇట్లున్న పరిషన్మధ్యమ్మున మేరుగిరి శృంగమ్ములనడుమ నత్యున్నత స్థాయింబొల్చు శిఖరరాజముంబలె బృందారక బృంద పరివృతుండై పేరోలగంబున్న గోవిందుచందంబున బాపూజీ యధ్యక్షస్థాన మలంకరించి తన కిరుగడనున్న నెహ్రూద్వయంబును శాంత్యహింసల రాసులు వోయు నలఁతియలంతి బోసినవ్వులం బల్కరించి యెల్లరం బ్రేమార్ద్ర దృష్టిం దిలకించి యిట్లను: దేశభక్తవతంసములారా చారిత్రిక మహాపరివర్తనోద్దిష్ట విశిష్టమగునేతచ్ఛిఖరాగ్రసమావేశముల మనము భూతగతుల సింహావలోకనముసేసి వర్తమాన పరిస్థితి నాకళించుకొని భావి శుభాశుభంబుల నంతర్వాణి ప్రబోధనమున నవగత మొనర్చికొని విషయ చర్చ కుపక్రమింతము. ఈ దేశదుస్స్థితి హూణసామ్రాజ్యదమననీతి భావిగతి హృద్వీధి విమర్శించుకొని భారత జాతీయ మహాసభను స్థాపించిన జ్ఞానవృద్ధజన ముఖ్యుఁడైన యల్లాణాక్టివియన్‌హ్యూమాంగ్లేయుఁడగుట చరిత్రం గమనింపందగిన విశేషాంశము. సూక్ష్మదృష్టిం బరిశీలింప నిట్టివి లోకంబున సహజసిద్ధమ. ఏరాక్షసుఁడు హరిని ద్వేషించెనో యారక్కసు గర్భంబునన పరమభాగవతోత్తముం డనంబరగు ప్రహ్లాదుఁ డావిర్భవించె. క్రూరసర్ప విషమునకు విరుగుడు మణిరూపమునఁ దత్ఫణియుత్తమాంగమందయుదయించునండ్రు. అజీర్ణకరఫలంబులఁ దచ్చర్మగత పదార్థంబ జీర్ణకరంబై యొప్పు. ఇయ్యది యీశ్వరవిలాసము. ఇఁకఁ బారశీకులైన దాదాభాయి నౌరోజీ, ఫిరోజిషా మెహతా భారతీయులైన తేజపాలు బెనర్జీ ప్రభృతులు కాంగ్రెసునకు మూలపురుషులగుట వారల నిట స్మరించుకొనందగు. ఇట్లు జాతిమతకులవిభేదరహితముగ నెలకొల్పఁ బడిన యిమ్మహాసంస్థ నాఁటినుండి నేఁటివఱకు స్వాతంత్ర్య సముపార్జన

మునకు సర్వవిధ ప్రయత్నములు నిర్విరామముగ సల్పుచున్నదంట నిర్వివాదాంశము. 125

తే. సర్వ మత సంఘ జనములు - సదమలగతి
నెన్నుకొన్న ప్రతినిధులె - యేలికలయి
దేశపాలన సేయుట - దివ్య మదియ
కామ్య మదిసౌమ్య మదిప్రజా - స్వామ్య మనిరి. 126

తే. భరతదేశంబు నికమీఁద - భారతీయు
లె పరిపాలించుకొనుహక్కు - కృపమెయి నిడి
పాలనాయంత్రముగఁ బ్రజా - ప్రాతినిధ్య
మున్న సంస్థను స్థాపింతు రన్నకోర్కి 127

తే. కాంగ్రెసున కాదినుండియుఁ - గలుగుకతనఁ
బ్రతిసదస్సున నద్దానిఁ - బలుకుచున్నఁ
దెల్లదొరతన మఱికాల - ముల్లునాటి
నట్ల గణియింపదయ్యె నే - మనఁగవచ్చు. 128

తే. వేయఁగా వేయఁగా నొక్క - వ్రేటు దగులు
మాటి మాటికినన నొక్క - మాట నాటు
నన్ననుడినెంచి మనపెద్ద - లెన్నొగతులఁ
గష్ట నిష్ఠురములఁ దెల్పఁ - గడఁగి రెపుడు. 129

తే. కరుణ దొరలిక జనకంట - కంబులైన
చట్టములుడింద నూతన - శాసనముల
సుఖదసంస్కారగతులని - స్తుతఫలమ్ము
గూర్పకుందురె ప్రజలకుఁ - కుతుక మెసఁగ. 130

కం. అనుచుం దీర్మానమ్ముల
ఘనసబలం డెన్నొసేసి - కడువడి నంపం
గొనుచుం బుట్టంబెట్టుచు
మనదుస్థితి మార్ప మనసు - మార్చుకొనరుగా. 131

కం. అటనిటఁ గలయధికారుల
కుటిలవచోమార్గమరసి - కుమిలెడి ప్రజలం

దటనట నిరాశ గలిగినఁ
బటుతరముగ దేశభక్తి – బహుముఖమయ్యెన్. 132

తే. ధార్మికమ్ముగఁ బ్రజల స్వా–తంత్ర్య దీక్ష
యెంత పెరుగుచున్నదో – యంతకంటె
నధికముగ వారిఁ గసితోడ – నణఁగ ద్రొక్కఁ
బ్రభుత పన్నిన వ్యూహముల్ – బ్రహ్మ కెఱుక. 133

కం. ఎప్పుడు బెంగాల్ విభజన
తప్పదనెనొ కర్జనప్డు – తంత్రమరయుటన్
విప్పెను మూఁడగుకన్ ప్రజ
చెప్పిన వినకాతఁ డట్లు – చేసెనపకృతిన్. 134

కం. మతకలహమ్ములు వెంచియుఁ
గుతుకమ్మున లంచమిచ్చి – కూర్చికొని ప్రజా
గతి మార్చి యిద్ది తగదన
వెతవెట్టిరి నాయకులను – వేయితెఱఁగులన్. 135

తే. ప్రజల నెక్కొని మున్నున్న – రాజభక్తి
యను వనము ప్రేమజలశూన్య – మగుటఁజేసి
యెండుచుండంగ నేల్బడి – దండగమను
ప్రళయ కాలాగ్ని కీలల – భస్మమయ్యె. 136

వ. నాఁ డిద్దేశవాసులం దంకురించిన రాజకీయ చైతన్యమునకు మాతృ
దేశభక్తికి భౌగోళిక చరిత్రాంశములును గొంత ప్రోత్సాహజనకములుగ
నుండ రణమొనరించి జపాను రష్యా నోడించె. అది కార్యదీక్షాదక్షతను
బోధించె. ఇత్తెఱంగునఁ గతిపయశరత్తులు కడచనఁ బ్రథమ ప్రపంచ
సంగ్రామంబు ప్రాప్తించె. అంత. 137

కం. ఒకజాతి వారలను నిం
కొకజాతి నిరంకుశముగ – నుద్ధతినేలన్
సకలోర్విం దగదియ్యది
ప్రకటింపన యుద్ధమందుఁ – బాల్గొందు మికన్. 138

కం. ఏదేశపు బాగోగుల
నాదేశమ చూపుకొనుట – యర్థించి మహా
ప్రాదేశనముం జూపఁగ
మాదేశము శత్రువితతి – మార్కొనుఁ గడిమిన్. 139

తే. ప్రజల యెన్నిక వచ్చిన – ప్రతినిధు లిఁక
మాతృవిషయమ్ము పాలింప – మనుజ తతికిఁ
జాలసౌఖ్యము లబ్బునన్ – సత్య మెఱిఁగి
బడుగు దేశాల రక్షకై – ప్రతిన వట్టి. 140

తే. కత్తిదూసితి మరులపైఁ – గానమీరు
మాకు సాయమ్ము సేఁతకా – మీకులెన్న
యిద్దిగమనించి చేయూఁత – యిత్తురేని
మఱతుమే ప్రాణమున్నంత – వఱకుమిమ్ము. 141

కం. అని యాడిన యేల్బడి మా
టనువిని మన కెల్లరకు నె – డంద ద్రవింపం
జనియింపం బ్రభు భక్తియు
ఘనసహకారంబ నాఁటి – కర్జంబనుచున్. 142

తే. ఉక్కుతునక్కల కెనయగు – యువజనములఁ
గనకగిరి నిభ ధనములఁ – గదనమునకు
వలఁయునరకుల నైచ్ఛిక – బాలభటుల
నంపినారము పెండ్లికిఁ – బంపినట్లు. 143

వ. యుద్ధప్రారంభమున బెల్జియము నికటమున సముద్రమథన సమయంబున జగద్భయంకరముగ జనించిన హాలాహలానలజ్వాలాజాలములు విలయకాల బడబాగ్ని హేతిచ్ఛటాపటలాన్వితంబులై త్రిభువనంబుల నొక్కట భస్మంబొనర్ప విజృంభించినట్లు శతఘ్నులం బ్రేల్చుచు నయస్కాంత దుర్గపంక్తినేర్చుచు బహువిధ యంత్రసాహాయ్యంబున శత్రుల నవ్వడింగని లఘునాళికలంగాల్చుచుఁ గాల్బలములం గూల్చుచుఁ దత్ప్రదేశంబెల్ల బీభత్సంబు సేయుచు నల్దెసమిత్తికోఱల మెఱపించుచు మహాభీలంబుగఁ జనుదెంచుచున్న వైమానికాద్యనేక విధశార్మణ్య సైన్యముంగని శ్వేతజాతి గుండెలవియ మాఱొడ్డిన నిజయోధ్ధల ప్రథమశ్రేణిం దనవారి

నొక్కపుర్వునేనుంచక యద్వితీయసాహసోపేతులు భీమబలులు భారత వీరరత్నములునగు సిక్కుల ఘూర్కవరుల ననిమొననిల్పి వారకవారకా తెగించి పోరుచు నిట్టలముగఁ జుట్టుముట్టిన కార్చిచ్చు నట్టనడుమంజిక్కిన సింహసమూహంబుపగిది ఘూర్ణిల్లుచుఁ జిచ్చఱపిడుగులంబోని గుండ్లదెబ్బలకు జంకక కుట్టుసురువఱకుం బగఱందున్మితూటాడి యెట్టకేలకు ముక్కంటి కంటిమంటంగాలిన మారునట్లు బూదిగుట్టలగుట జగద్విశ్రుతంబు. ఏండ్లతరబడి నిర్విరామముగ జరిగిన తత్సంగ్రామరంగముల రక్తమును ప్రాణములను ధారవోసి హూణసామ్రాజ్యమునకు విజయలక్ష్మీకటాక్షవీక్షాపరంపరలఁ జేకూర్చిన యవక్రవిక్రమోపేతులు హైందవులే. అట్టి యద్భుతరాజభక్తిం గని సంతోషసాగరమగ్నమానసుండై యిండియా కార్యదర్శి క్రమక్రమముగఁ గొలఁది వర్షములలో భారతవర్షమునకు స్వపరిపాలనాధికారమిత్తుమని పలికిన పలుకులు భారతీయుల హృదయాంతరాళముల నేఁటికిని ప్రతిధ్వనించుచున్నవి. కాని యాంగ్లేయులకు సంపూర్ణజయము గలిగినంతన వారిదృష్టి మనయెడ వక్రించె. 144

ఆ.వె. మేయఁ బోయినంత – మెడఁ దగులొ్కనట్లు
రాజ్యమడుగఁ బెరిమ – రవ్వలేక
ప్రజలఁ ద్రొక్కిపట్టి – రౌలటు చట్టంబు
నెత్తి రుద్ది రకట – నింద్యమనక. 145

ఆ.వె. యుద్ధసమయమందు – శ్రద్ధమై మనవారి
నాకసమున కెత్తి – నట్టి దొరలు
తీఱె నక్కఱంచుఁ – గోఱమీసము దువ్వి
శత్రు లట్లు నూడ – సాహసించ్రె. 146

ఉ. పూలను జల్లి వారిపయిఁ – బూర్తిగఁ జూపిన రాజభక్తికిజా
ఱాలను రువ్వియాప్రజల – రక్తము కన్నులఁ జూడనెంచి యా
రౌలటుచట్టమజ్ఞ దుడుకు – రక్కసుసంపిరి తిన్నయింటి వా
సాలను లెక్కపెట్టఁగల – సాముల నేమరి నమ్మవచ్చునే. 147

కం. వచ్చెం గడునక్కఱ యని
చెచ్చెరఁ దలమీఁద మోసి – చెట్టెక్కి వెసజా

నిచ్చెనఁ దన్నెడి యచ్చపుఁ
గుచ్చితులకు నిచ్చ నమ్మఁ - గూడునె చెప్పఁడా. 148

తే. యుద్ధ మున్నన్ని నాళ్లు - హిందూర్విఁ బొగడి
స్వపరిపాలనమును లక్ష్మి - సరగఁ గూర్చ
మంచి రాజ్యాంగ శాస్త్రని - ర్మాణ మిపుడు
జరుగుచున్నది యని తటి - జరిపి కడకు. 149

తే. భరత రాజ్యాంగ శాస్త్రము - బయటఁ బెట్టి
నుత్త విస్తర మంచినీ - ళ్లుండె దాన
నింత మోసంబు గమనించి - యెదఁ గృశించి
వీరభారతమాత క - న్నీరు గార్చె. 150

ఉ. ఎట్టి విచిత్రనాటక మి - సీ యఘమియ్యది ఘోరమౌటచేఁ
దట్టుకొనంగఁ జాలరు కృ - తఘ్నుని పీనుఁగుడాసి చూచి వే
గుట్టునెఱింగి భీయనుచుఁ - గుక్కలు నక్కలు కాకి గ్రద్దయున్
ముట్టుట కల్లయంద్రు. ముని - ముఖ్యులు ధర్మపథైకదృష్టిమై. 151

కం. అన్నము వెట్టిన వారికి
సున్నము గ్రొంగొత్త దింత - స్రుక్కఁగఁ బెట్టం
గన్నారఁ గనదె లోకం
బన్నన్నా యింత ద్రోహ - మవనిం గలదే. 152

తే. ఇంత సామ్రాజ్య మేలెడి - యేలిక యిటు
సేసె వాగ్దాన భంగము - చెట్ట యనక
చెట్టు చెడుకాల మేతేరఁ - బుట్టుఁ గుక్క
మూతి పిందియ లనుసూ క్తి - లోతుదెలిసె. 153

వ. మహాహవవేళ నిటునంతఃకలహములు విప్లవములు జనింపవచ్చు ననెడిశంకమై నసాధారణశాసన పిశాచంబుల సృజించి దౌరతనము జనతంభీతిలంజేసె. వాని పర్యవసాన పరిపూర్ణరూపమే రౌలటు చట్టము - కుటిల రాజనీతి మహాభూతమున కది యధికారపట్టము. 154

ఉ. రౌలటుచట్టమన్న నది - రాక్షసరాజ్యపుఁ జిహ్నమెన్న నా
భీలముగాఁ బ్రజన్నలిపి - పిప్పియొనర్చి ప్రభుత్వశక్తియున్

కాలకరాలదంష్ట్రికల - కాంతులు దిక్తతిఁ బర్వదేశకం
కాళమునేలఁ జూచుటది - కావరమో వరమో గ్రహింపుఁడా. 155

కం. నేలనపెట్టి ప్రజాళిం
గాల నదుమనెంచి క్రౌర్య - కాంక్షాపరులై
జాలి యనుమాట యెఱుఁగని
పోలీసుల రాజ్యమనఁగఁ - బోలుందానిఙా. 156

వ. కేవలము పొట్టకూటికొఱక ప్రభుత్వోద్యోగమ్ములవాంఛించి సైనికులుగ రక్షకభటులుగఁ జేరి తాముదినుచున్నది హిందూదేశపు సొమ్మని గ్రహింపక భారతీయులే స్వరాజ్యదీక్షాపరులై దేశసేవచేయుచున్న భారతీయసోదరులఁ జోరులకంటె హంతకులకంటె హీనముగఁజూచి పసింగొట్టినట్టకొట్టి నెత్తుటేర్లు పెల్లుగవెల్లిగొలుపం గనివిని యాచట్టపు దౌష్ట్యము వారి యనాలోచితకృత్యము గర్హ్యములని యాత్మజ్ఞానముగల బుధులెల్లరల్లాడిరి. పౌరుల ప్రాథమిక స్వామ్యస్వాతంత్ర్యము లీచట్టమున మృగ్యంబులగుటంజేసి దేశనాయకులు. 157

కం. రేపగ లీ పజ కొల్పను
రేఁపఁగల ప్రబోధనములు - ప్రీతి నలుపుచుం
బాపఁగ దాస్యాంధము పర
భూపతులం బాఱఁద్రోలఁ - బూనిరి దీక్షఙా. 158

కం. ఎక్కడఁ జిక్కిన నేతల
నక్కడఁ జెఱసాలఁద్రొక్కి - రప్పుడు దొరలే
హక్కుల సీమిఁక యని ప్రజ
నక్కటికము లేక యడల - నడఁచిరి పెలుచఙా. 159

వ. రణరంగమున సహకరించిన భారతసైనికరత్నములకుఁ బార్లమెంటులో నభినందనతీర్మానముం బ్రతిపాదించుచు లాయడ్జార్జి సంతోషముతోఁ గలరూపు మఱుపఱుపక. 160

తే. నిజముగ మనకుఁ గలిగిన - విజయమునకు
యుద్ధమున నన్నివిధములఁ - శ్రద్ధతోడఁ
బూర్ణముగఁ దోడుపడినట్టి - పుణ్యభార
తముగుఱించి యిష్ట యోచింపఁ - దగును మనము. 161

తే. సంగరంబున మనకింత - సాయపడుట
వచ్చె నొక క్రొత్తహక్కు త - ద్ద్వారతమున
కది నిరోధింప నేవారి - కలవిగాదు
దాని యభివృద్ధికై యది - తహతహపడు. 162

తే. అద్ధరాభ్యుదయమ్మున - కడ్డుపడెడి
జంకుగొంకుల నీసురో - సాల నడఁచి
మేలి మెఱుఁగుల నల్గడ - మెఱయఁజేయు
హక్కది యనన్యసామాన్య - మనఁగజెల్లు 163

వ. అని పలికిన పలుకులెల్ల గాలిం గలిసె. ఆకృతినొందిన కుటిలరాజ నీతినాఁ బిట్టపిడుగువంటి చట్టమొండు బయటఁబడె. దేశీయ ప్రభువులు సభ్యులుగ రౌలటుసంఘాధ్యక్షుఁడుగ నేర్పడిన శాసనమగుటంజేసి దానిని రౌలటు చట్టమనిరి. నిష్ఠురదృష్టిగల యాష్టీకుల దౌష్ట్యమునకుఁ దుష్టి పుష్టి చేకూర్చిన యాశిష్టిబలంబున నెంతటిబలుమానుసులనైన నింకెంతటి విద్యావంతులైన నెంతసాధుజనులనైన లేనిపోని నెపంబేదేఁబెట్టి చెఱకు నెట్టవచ్చు. దొరతనమువారి లోటుపాటు లెవ్వండేనుగ్గడించిన నెట్టి విచారణలేకయ వానిం బంధింపవచ్చు. అనుమానమ్ముమై రాజద్రోహియని యెట్టి సత్పురుషాగ్రణినైనం గారంగ్రుక్కవచ్చు. నిక్కంబుచక్కంజెప్ప నక్కట బంది రచ్చకెక్కవీలుచిక్కదు. సర్వన్యాయస్థానంబు లేల్బడి పక్షంబునక ములుసూవు. పత్రికా స్వాతంత్ర్యమ్ము సమూలమ్ముగ ఛేదింపఁబడుటంజేసి తత్సంస్థలు జీవచ్ఛవంబులట్లదోఁచు. ఎవ్వనినే నీవిట నుండందగవన మఱియొండు కడకేఁగవలయు. వాక్స్వాతంత్ర్యంబు నిష్ప్రచ్చరంబు. ప్రజల మొఱలాలించు దిక్కెక్కడం గానరాదు. కంచెయే చేని మేయుచున్న కాలమది. 164

కం. ఉపథా శుద్ధుల నట్లపు
డపరాధులవోలెఁ జూచి-యపకృతిసేయం
గృప నూవుట ఖారపాటుని
యపరాద్ధ పృషత్కులట్లు-లైరి జనంబుల్. 165

వ. సంగ్రామసమయమ్మున మనమొనర్చిన సంపూర్ణసాహాయ్యమున కాంగ్లసామ్రాజ్యము మనకిచ్చినపారితోషికద్వయంబున మొట్టమొదటి

దీ చట్టము. రెండవది జలియను వాలాబాగు ఘోరమారణహోమము. ప్రథమ బహూకృతింగురిచి నా చెప్పినది రేఖామాత్రమ. నాకంటె మున్నుగఁ బాంచాలమున కరుగుటంజేసి ద్వితీయబహుమానకథాకథన మున కెంతయు సర్హుండని వృద్ధనెహ్రూను తద్వృత్తాంత సారాంశంబు వినిపింపంగోరెదనన మోతీలాలు సదస్యులఁగని సవినయముగ నిట్లు వినుపం దొడంగె. 166

ఉ. దక్కిన భారతంబు నక - టా యటు నల్లినివోలె నల్పుచో
దిక్కొకయింతలేక కడు - దీనదశం గృశియింప నత్తఱిన్
నిక్కమెఱింగి కష్టము గ - ణింపక చట్టము నాగభూమికిం
ద్రొక్కఁగ రాజకీయమున - దూఁకె మహాత్ముఁడు దేవదూతగా. 167

కం. దేశము నల్గడఁ గ్రుమ్మరి
యాశయములఁ దెల్పి ప్రజల - యాదృతిఁ బ్రభుతా
పైశాచికకృత్యాయః
పాశములం ద్రెంతు నంచుఁ - బట్టెం దీక్షన్. 168

కం. హిందూ ముస్లిము క్రైస్తవ
బృందం బీఘోరశిక్షి - నెట్లోర్వనగున్
డెందెనె మగటిమి హైందవు
లందఱు నడుముల్ బిగించి - యాపం దగదే. 169

కం. గత్యంతర మిఁక లేదని
నిత్యము నాబాట మీరు - నిలిచిన మీకే
భృత్యుఁడనై యీచట్టము
సత్యాగ్రహమంత్రశక్తి - సమయింతు వెసన్. 170

శా. సత్యాహింసలు వాలుడాలుగ మహా - శాంతంబె వర్మంబుగా
ధృత్యుత్సాహములే రథాశ్వములుగాఁ - బ్రేమంబె ఛత్రంబుగా
స్మృత్యర్థాత్మసుబోధసారథిగ వై - రిం బోర సాధింపఁగా
నిత్యం బాజియొనర్తు సర్వజనముల్ - నిల్వుండు నాతోడుగా. 171

తే. దాస్యమునఁ బాయసముకంటె - ధరణిమాత్ర
రంజకంబైన స్వేచ్ఛమై - గంజిమేలు

చెలమ సృష్టించుకొని దాని - జలముఁ గ్రోలి
గమ్యమును జేరి ధ్వజమెత్తు - ఘనులు వలయు. 172

తే. స్వల్ప విషయాలకై యాత్మఁ - జంపుకొనక
భరతమాతృ పాదాబ్జ స - ద్భక్తి విడక
హెచ్చులొచ్చులు దలఁపక - యెఱుకకడఁకఁ
గలసిరండోయి సుఖములు - గలవు వేయి. 173

తే. ఐకమత్య మడంగుచే - యాత్మహాని
యనెడి సూక్తియ వలతురే - నలరు ధరణి
గడ్డిపరకల నొకకొన్ని - కలిపి పేని
యేన్గు నైనను బంధించు - టేమి వింత. 174

తే. వివిధ విద్వేషములు ప్రభ - వించునట్టి
రాజకీయమునం దాత్మ - రక్షణకయి
శాంతియుతమైన పౌరుష - సహనశక్తి
నివురు గప్పిన నిప్పనా - నిలుచుటొప్పు. 175

కం. ఊరూర సభలొనర్పం
డాఱని ధృతిఁ జల్పుఁ డింక - హర్తాళంబుల్
నేరమని కారఁ బెట్టిన
నారీతి మెలంగుఁ డమ్మ - నాడు నుతింపన్. 176

కం. కట్టులుకఁ దిట్టి కొట్టిన
నిట్టట్టన కాత్మశక్తి - యింపెసలారం
బట్టిన పట్టును వీడక
నెట్టన సత్ఫలము నొందు - నేర్పంగనుఁడీ. 177

తే. ఏ నిరాహార దీక్షకుఁ - బూనుకొన్న
నెల్ల రటు సేఁత కొప్పన - దేమియన్న
శాంతిసమరాన ముఖ్య శిక్ష - సుంతలేక
తాళఁ జాలరు కావునఁ - దగరుతగరు. 178

కం. అని మోహనుఁ డాదరమున
నన నది సమ్మోహనాస్త్ర - మై మదినాటన్

జన మౌనన నప్పనులకు
ఘను లడుగిడినంతఁ బ్రభుత - కన్నె ఱ్ఱబడెన్. 179

కం. వెతచే బెసెంటు గ్రుంగిన
గతియిది యజ్ఞాన మూల - కారణ మనుచున్
మితవాదులు కాదన్నను
వ్రతమూపఁడు గాంధి భంగ - భగ్నపరుండై. 180

## జలియన్వాలాబాగు - ఘోరమారణహోమము

ఉ. కాదన కాన నూని తలఁ - గాంగ్రెసు సభ్యు లమోఘదీక్షతో
వేదన దెల్పుచుం భరత - వీరుల నిద్దుర లేపి రచ్చలం
బోధయొనర్ప గాంధిమత - మున్ విని లెస్సని శిష్టిభూతపుం
బాదునగల్ప మాతృపద - భక్తులు దూఁకిరి పస్తులుండఁగన్. 181

శా. యావద్భారత మిట్టు శాంతి సమర - వ్యాపారపారీణమై
చేవం జూపుచు నిల్వ నేలికలు కా - ర్చిచ్చుంబలెన్ రేఁగి పెం
గ్రోవుల్ ప్రేల్చిరి రచ్చపైఁ గరిపురిం - గ్రూరాత్ము లందందొగిన్
సేవాసక్తుల నిట్లుసేయ విని యా - క్షేపించె ముల్లోకముల్. 182

వ. ఆ సంవత్సరము భారతీయమహాసభ పంజాబునందు జరుగందగునని దేశనాయకులందఱు ముంద నిర్ణయించిరి. అదివిని తత్పరిష త్తట సాగనీరాదని పాంచాలపాలకుఁడు మైకేలోడ్వ్యయరు గట్టిపట్టుపట్టె. కాని స్థానిక మహానేతలగు సత్యపాలు, కిచ్లూ లాసదస్సాభూమింగామక జరిగింప నచంచల దీక్షంబూని యహోరాత్రములు వలయుజతనములం జల్పుచుండిరి. ఇది గమనించి యమృతసరాధికృతు లయ్యిద్దఱ బంధించి యెందో దాఁచిరి. 183

కం. అవ్వార్త విన్న ప్రజలం
దెవ్వరికిం గూడు నీళు - లింపక కడఁకం
జివ్వకునేఁ దెగి వచ్చిరి
యవ్వారల జాడ నరయు - నాసం బెలుచన్. 184

తే. కడకుఁ గదలిరి జిల్లాధి - కారి నడుగఁ
గోపతాపాలు లోలోనఁ - గుములఁ బ్రజలు
దేశభక్తులు ప్రిదులని - దీక్ష ముందు
నడువ జనవాహినిం గన - నడలు వుట్టి. 185

కం. వచ్చిరి జము బంట్లన భటు
లచ్చోటికిఁ గదలనీయ - మాగుండననఁగా
నచ్చక మూఁక నెవండో
గ్రచ్చన తాల్విసరె రెండు - కని సైనికులుణ్. 186

కం. ప్రేల్చిరి తుపాకు లిర్వురఁ
గూల్చిరి క్షతదేహులైరి - గొందఱు తలపైఁ
దాల్చి శవంబులఁ బురికిం
బెల్చన జనులేఁగుదెంచు - వేళకు సరిగా. 187

తే. మేలి నడతలఁ దెల్పఁ బాం - చాలమునకు
వచ్చుచున్నట్టి గాంధిని - బట్టి యట్టు
చెఱకునెట్టిరి దొరలని - చెవిఁ బడంగ
నబ్ధివలెఁ బొంగె నుద్రేక - మాజనులకు. 188

కం. చెలరేఁగి మగంద్రాంగ్లే
యుల నల్వురఁ జంపి రంత - నొడయురు గసితోఁ
గలరూపెఱుఁగక యీనిన
పులివలెఁ గాంద్రించి బ్రజల - బూదియొనర్పణ్. 189

కం. సేనల నన్నిటి డయ్యరు
సేనానికి వశము సేసి - చేచే కలిపెం
బూనిన మత్సరమున వెన
సైనికశాసనము నమలు - జరిపెం గడఁకణ్. 190

వ. అంత నడక త్తెఱంజిక్కిన శోకచందమ్మున నలఁగుచున్న రాష్ట్రముం గని పెద్ద లిద్దురాత్ములపాలనం బెట్టుకూలునాయని తద్దచింతించి దానికి న్వలయు మార్గమ్ములన్వేషింప నొకమహాసదస్సుంజరుపఁ గృతనిశ్చయు లైరి. ఇంతలో సారశరదాదియు నత్యాగ్రహవారపరిపూర్తియు నేక

దివసంబ సమకుఱ నానాఁడమృతసరమ్మున జలియన్వాలాబాగునఁ దత్సభ నిర్వహింపం బ్రకటింపంబడియె. అయ్యది నానావిధ మహీరుహ శరగుల్మలతావితాన పరిశోభితమై వివిధవర్ణపత్రవిలసితమై నందనముం జైత్రరథముం ధిక్కరింపఁగల చక్కనిపుష్పోద్యానము. అందు హృద యాహ్లాదకరసుమసౌరభంబు వెల్లివిరియు. రంగురంగుల పూలశృంగా రముంగన మనస్సుప్పొంగు. భృంగీభృంగసంగీతము చెవులకింపునింపు. సర్వజనాకర్షణీయంబగు వనదృశ్యముల కదియాకరంబు. శుకపికశారికా ద్యనేకవిధఖగనికరము లుభయ సంధ్యల రేల ముమ్మరముగఁ గిలకిల కూయు. దానికి నట్టనడుమ సమతలవిశాలప్రదేశ మొక పచ్చికబయలగుట గరుడపచ్చలు పఱచినట్లతిమనోహరముగ వెలయు. అదియు వృత్తాకార మున నొప్పు. భూలోకస్వర్గంబన నిదియ కాఁబోలుననిపించు. అత్తోఁటకు నల్దెస నున్నత కుడ్యంబు లలరు. అందుఁజొఱ నొకండ తెన్ను. అద్దియు నేకాయనపథంబనందగు. నిర్ణీతసమయంబునకె పర్వాహంబునం బయ నించు తైర్థికులట్లెడతెర్పిలేక యాబాలగోపాల మా సభకరుదెంచుట యాల మందల జింకపిండుల రాకంబొంచి కనిపెట్టుకొనియుండు బెబ్బులివలెఁ జమూపతి గమనించుచుండె. వింశతిసహస్రప్రజ లటనుపవిష్టులైయుంటం దెల్లగోక పఱచినట్లుండె. సైనికచండశాసన కబంధహస్తవిముక్తిపథ వివిధవిధాన్వేషణాన్విత గాంధేయ సూత్రవ్యాఖ్యానసహితముగ హంస రా జుపన్యసించుచుండె. గంభీరభావబంధురమైన యతని వాఙ్ముఖము శ్రోతలమనోదృష్టుల నేకరీతిం దిగిచికొనె. సమాధినిష్ఠనున్న తపస్వివలె సదస్యులు ప్రశాంతముద్రం దవిలియుండిరి. అత్తఱి. 191

ఉ. దూతల వెంటఁబెట్టుకొని - దూఁకు యముండన వచ్చి డయ్యరా
పాతకదూరులైన పసి - పాపల వృద్ధుల స్త్రీల బాలురన్
వే తెగఁగాల్చివేయుఁ డన్న - బిట్టు టపాటపకాల్చి రస్రధా
రాతతి వార్ధిగా శవప - రంపర నావలు నా గమింపఁగన్. 192

కం. చిచ్చఱ పిడుగుల వడువున
వచ్చెడి యగ్గుండ్లకులికి - ప్రాణార్తిమెయిన్
విచ్చెడి నిర్దోషులఁ గా
ర్చిచ్చువలెం గ్రమ్మ భటులు - ప్రేల్చిరదయతన్. 193

కం. అర్భకులు చంటిబిడ్డలు
గర్భవతులు బాలబాలి - కలు స్త్రీల్ముదుకల్
దుర్భర లఘునాళిక హతి
నిర్భిన్న శరీరులగుచు - నిల్వ్వసఁగూలన్. 194

కం. పదునార్వందలగుండ్లన్
వదలఁ బడిరి రెండువేల - ప్రజలిల నకటా!
తుదిగడియఁ దన్నుకొనుచున్
వదలిరి ప్రాణములు నాల్గు - వందల పౌరుల్. 195

కం. కాల్చేటొమ్మెమ్మగలం
డుల్చిన యారెండువేల్క - ఘోరవ్యథచేఁ
బిల్చిన నీరీకుంటన్
రాల్చిరి కన్నీళు లద్రి - రాజుగరంగన్. 196

వ. కట్టలుక నట్టాబెట్టిదులగుబంట్లు కిరాతమూర్ధన్యులు నట్టడవి సాధు మృగమ్ముల వేఁటాడినట్ల పిట్టలంగొట్టినట్లు కొట్టుచుండ విలయసమయ ఘనాఘనాళిల విద్యుద్గర్జావినిర్గతాశనిపాతసదృశలఘునాళికా వినిర్ముక్త లోహపుగుండ్లకుం దల్లడిల్లి యొక్కవ్రేటున కొక్కండుగాక పదుంద్రు పడుచున్నతటి దద్దఱిల్లి కలగుండుపడి యథాయథలుగాఁ బేరెమ్ములు వాఱునెడ నొండొరులెదురుతాకుటం బెకిల్లునందలలు వగిలినవారు డాఁకొనడబ్బాటులేవఁబోయి బీతుగుడిచి తడఁబడి మ్రొగ్గతిలఁబడువారు - పొదరుచాఱు లేమ్రాని శుష్కశాఖ కనుల్పొడుచుకొనఁ జతికిలఁబడువారు- తప్పుత్రోవంబాఱఁ బాదముల లతావితానము పెనఁగొన బిల్లబీటుగ బోర్లపడువారు - గుబురువాల్గొమ్మలఁ దూఱుదారింగాననేరక యిఱికి కొనంబోయి మ్రోడులొత్త రక్తసిక్తాంగులైనవారు - తత్తఱపాటున ఛిత్తులకెగఁబ్రాకుచోఁ దుపాకిప్రేటులకుం గుఱియై సాష్టాంగముగఁబడి దొర్లువారు - ఒండు రెండడుగు లిడనడరుపడంకునం గాల్నడసాగమి సాగిలంబడి పుడమింగఱచికొనియున్నవారు - కుట్టుసురున వావిప్పు వారు - పొల్లుడుచుచున్న పసిపాపను ఱొమ్మునకొత్తుకొని గుండెచెదర నడుగిడఁజాల కంగలార్చువారు - దవాగ్నిమధ్యమ్మునంజిక్కిన కొదమ లేళ్ళవలె ఘూర్ణిల్లి నిలిచి నలువలంకులంగనువా - రొరగినవారిపయిం

దుమికిదుమికి పోవువారు – పుర్వుంబోలె నేల నొయ్యొయ్యం బోరం
జరుగువారు – ముక్కంటికంటిమంటంగన్న తుంటవిలుకానికరణి గజ
గజవణకువారు – నిర్గమింప మార్గంబుగానక దుర్గతింబడి యెట్టకేల
కటునిటు పర్వెత్తి వెన్దిరిగి మఱువడి ఱొప్పి యుల్కి నాల్కెండఁ బల్కం
జాలక గ్రుడ్లుతేలవైచువారు – హాహారవంబుల విహ్వాలించి చివాలునఁ
గూలుఁవారు – కంగారున గుడిదిరిగి పఱుగిడి దగదొట్టి యెనయికసెడి
ముంగాళ్ళంగ్రుంగి కూర్చున్నవారు – విచ్చలవిడి కాల్పులెచ్చఁ గెవ్వునఁ
గేకవైచి వెలికిలఁబడువారు – సిడిమ్రానికింగట్టిన యజార్భకముంబలె
దీనదృష్టులంబఱపువారు – నైయనిర్వచనీయ బీభత్సంబునకాలవాలమై
యాస్తీర్ణరక్తరాంకవమనందనరి యార్తారావంబులు మాఱుచెలఁగ
నయ్యుపవనము ప్రళయకాల మృత్యుదేవతాకరాళదంష్ట్రాద్యుతిచ్ఛటా
కలితవికటాట్టహాసవికృతతాండవమునకు రంగస్థలంబయ్యె. 197

కం. వనముఁ సజ్జన బృందా
వనముం బావనము పక్వ – ఫలముఁ ఖగకీ
వనముం గడకీగతిఁ బితృ
వనముం బొనరించినట్టి – వారలు నరులే. 198

ఉ. ఇద్దరయెల్లఁ దెల్లదొర – యేల్బడి క్రిందికి రా మహోద్ధతిఁ
యుద్ధమొనర్చి చచ్చిన ప్రి – యుఁ సుతు సోదరుఁ దండ్రి మామలం
దద్ద తలంచి యేడ్చువని – తల్లల ధారణి కింతసేఁత స
త్పద్ధతికాదుకాదని ప్ర – పంచము చింతిలె నశ్రులబ్ధిగా. 199

తే. పామునకుఁ బాలువోయు నీ – భరత జనుల
నంచలను గొట్టినటు గొట్టి – రాంగ్ల భటులు
బక్కచిక్కిన పజమీఁద – బాంబు విసరు
టెంత పౌరుషమో వార – లెఱుగవలయు. 200

వ. సాయుధులగు ప్రత్యర్థులం జంపుట మగపాడిగాని నిరాయుధులగు
సాధుల నహింసావ్రతుల నిలువునంగాల్చుట వీరధర్మమా. అద్దళవాయి
యానంగలిగిన రాయిడి కెడందగాయమై కూయిడు జనతార్త ధ్వనివిని
దైవంబేని జాలిపడి రక్షింపఁడయ్యె. అత్తెఱంగునఁ గుప్పనఁగూరలేసినం

దనిననక పాతాళహృదయుఁడు, కలియుగ భస్మాసురుండునగు నప్పడ
వాలు విచారణీయములు గర్హ్యములు నగువల్కు లిట్లు వల్కెఁ. 201

చ. టకటక మచ్ఛతఘ్ని శక – టంబిట వచ్చుట కన్యగామి నేఁ
దికమకలైతి లేనియెడఁ – దీయనె యెల్లరప్రాణ మంట యే
రికిఁదగు డయ్యరొక్కఁ డటు – ప్రేలఁగఁబొంగిన రాష్ట్రపాలకుం
డిఁక నరకానఁగ్రుంగఁడె ద – హింపదెపాపము తచ్ఛమూపతిన్.

ఉ. నిక్కమెఱుంగ నేనచట – నిప్పులు గ్రక్కుచుఁ జూతునేని వా
రెక్కడి వారలక్కడికి – నేగుదు రాపయి లెక్కసేయకీ
తక్కిన లోక మెల్ల నెగ – తాళి యొనర్పదె నన్నుఁగాంచి నా
దిక్కు మొగమ్ము సూపఁగల – ధీరుఁడెవండిఁక భారతంబునన్. 203

కం. నవి యాడిన డయ్యరు మా
టవునని యోడ్వయరు మెచ్చి – యతఁడు నిజాజ్ఞం
దవిలి యటనుంట యగ్గికిఁ
బవనము దోడ్పడుట యంచు – భావించె నెదన్. 204

ఉ. అంతశమింప కోడ్వయర – హంకృతి మూన్నెలలుంచె శిష్టి త
త్ప్రాంతము క్రూరసైనికుల – పాదఘరట్టవిఘట్టనాన్వితా
క్రాంతవిదీర్ణమై కుమిలె – శాంతిసుఖాల్మృగతృష్ణలయ్యె దు
శ్చింతనెలర్చి రేవగ లి – సీ! తెగరేఁగెను శ్వేతభూతముల్. 205

## పాంచాల ఘోర దురంతములు

చ. శిరముననిన్పటోపి యొక – చే యమదండముఁబోని దండముం
బిరుదులబాకు కాసె నడి – వీపునఁ బెద్దతుపాకి కాళ్ళకుం
బిరుసగు మొద్దుజోడు కడు – భీకరదృష్టులు 'కాకి' దుస్తులున్
వరలఁగఁ దెల్లసేన జము – బంట్లనఁ జెచ్చెరవచ్చె హెచ్చుగన్. 206

వ. వచ్చి పల్లెలంబత్తనములం బ్రవేశించి దేశభక్తుల యిండ్లకరిగి. 207

మ. అనుమానమ్మునఁ బట్టి శృంఖలములన్ – హస్తంబులం గట్టి త
ద్ఘనులం బందెనడంచుగొడ్లవలెఁ బెం – డ్రాటన్ వెసంగూర్చి వా–

ద్యనినాదధృతిఁ ద్రిప్పి రప్పురజనుల్ దై –న్యస్థితింజూచి వే
దన నిట్టూర్చుచు నశ్రువుల్ విడువఁ బ్ర – త్యక్షాసురు ల్వీరనన్.

ఉ. అక్కట యట్లుద్రిప్పి కడ – కక్కడ వారలఁ బాకిదొడ్లలోఁ
గ్రుక్కిరి కూటసాక్ష్యములు – కూడవు పల్కుమనంగఁ బెద్దలం
బ్రక్కలు నల్లఁగొట్టి కసి – బందెనడంచిరి రక్తధారచేఁ
జొక్కుఘటిల్లఁ గట్టిలనుఁ – జొన్పిరి మూడులఁ జావుమూఁడఁగన్.

కం. ఒక్కొకని చేల డుల్చుచుఁ
గ్రక్కునఁ గంబమున కంటఁ – గట్టి చటుకనన్
ముక్కోణంబులఁ గొట్టిరి
చిక్కని నెత్తురులు వెలికిఁ – జిందం గుందన్. 210

చ. వఱలెడి రాణివాసముల – ధ్వంసమొనర్పఁ దలంచి చొచ్చి త
త్పురుషుల నెట్టి సాధ్వులట – బోరున నేడ్వఁగ వీధికీడ్చి కా
వరమున వంగఁబెట్టి మొల – వల్వలవిప్పిరి చెప్పఁ జాలఁ బై
జరిగిన దాకిరాతకులు – నచ్చి మహానరకానఁ గ్రుళ్ళరే. 211

ఉ. రాజసభాంతరాళమున – ద్రౌపది జిల్గుల నూడ్చియూడ్చియుం
గాజులు దొడ్డికొన్న మొన – గాఁడగు దుష్టుఁడు దుస్ససేనుఁడు
గ్రాజి సమస్తకిల్బిషమ – హాంధము గన్నులఁగప్ప – భీముచే
రోఁజుచుఁ జచ్చెనన్న మఱి – రోజులు పాపుల కేలరావొకో. 212

కం. సుతునిం జూపని పితరుని
పితజాడం జెప్పలేని – పిన్నతనూజుం
బతి నవ్వడి దెలియని సతిఁ
గొతుకుచుఁ గొరడాలతోడఁ – గొట్టిరి పెలుచన్. 213

మ. కొరడాదెబ్బలకోర్వలేక యబలల్ – గుట్టల్ యువల్ వృద్ధులున్
ధరమీఁదంబడి తన్నుకొంచు నకటా – దండంబులం బెట్టినన్
వరుసన్నిల్పిరి యున్నబోనున వసీ – వ్యాళంబులన్నిల్పిన
ట్టురెరే యాఁగిరిమండుటెండ నధికా – రాహంత కన్గప్పఁగన్. 214

కం. నీకు శకటమ డిగుమని తు
పాకి మడుమఁ బొడిచి పొరు – బాఁధెడి వేళం

గీకసములు నలినలియయి
కేకలు వెట్టినను విడరు - కీడ్పడి పడిన్. 215

చ. పఱపుల నెత్తిఁబెట్టి పద - పద్మము లెండకు బొబ్బలెక్కఁగా
గఱువల చట్టులన్ వరుస - గా నడిపించిరి దవ్వు క్రొవ్వునం
బిరబిరఁ బల్లెపల్లెఁ బ్రజఁ - బిల్చి తగంపమచెప్పులంటి లే
కరమర ముద్దుపెట్టుకొనుఁ - డంచు నదల్చిరహంతపొంగఁగన్.

కం. ప్రొద్దెఱిలఁ దోలెడు తఱి
హద్దగుఁ బ్రజమెలఁగ వీధి - నాపయిఁ దిరుగం
బెద్ద తుపాకులఁ గాల్తురు
గ్రద్దన స్వేచ్ఛావిహార - రాత్రించరులై. 217

చ. విసువక రేవగల్ పృతన - వేయివెతల్గలిగింప నెంతయున్
నసిచెడి దైవముం బరమ - సాధులు వేఁడెడివేళ దేశమున్
మసి యొనరింప సైనికవి - మానము లుప్పరవీదిఁ దిర్గుచుం
గసిమెయి బాంబులన్ విడిచెఁ - గాలెను బల్లెలు పట్టణావళుల్. 218

చ. పరమపవిత్రమైనవని - భావన సేయక గొలుగొట్టఁగా
హరహర చేయరాని పను - లన్నియుఁ జేసిరి గుళ్లబళ్ల నా
చరితములన్నియున్ వినఁగఁ - జెప్పఁగ సాధ్యముగాదు దేశమే
దురితము సేసికొంటి నిటు - దుష్టులపాలయి కుందెనోకదా. 219

ఉ. ఆఁకలిడప్పులన్నవసి - యాశలు సూచుచు నంగలార్పఁగా
పోకిరి మూఁక సైనికులు - పూర్తిగనాఁగిరి నీటిజంత్రముల్
వీఁకనుదెల్లవాఁడు కని - పించిన వంగినమస్కరింపరే
బాఁకునఁ గ్రుమ్మినట్లు పలు - బాధలు వెట్టిరి తిట్టి రత్తఱిన్. 220

కం. చక్కని చిక్కని మేనులు
చిక్కి కళాహీనమౌట - చే సైనికులన్
రక్కసులచేతఁ జిక్కుటఁ
గుక్కిన పేలైరి జనులు - గుమిలిరి లోలో. 221

తే. వేడ్కఁ బెంద్రోవ నూరేగు - పెండ్లివారిఁ
బట్టి చెఱసాలఁ బెట్టిరి - పాప మనక

పాడిపల్కరు లిరువంకఁ - గూడి విసర
నుబ్బి యుబ్బురముగఁ బెడ - బొబ్బ లిడిరి. 222

తే. చీరి పెద్దలఁ జీఁపురు - లేతికిచ్చి
పాకిదొడ్లను జిమ్మించి - పట్టు పట్టి
వారిజండాకు మ్రొక్కించి - వహ్నివంటి
యెండ నిలబెట్టి తిట్టిరి - హీనమతులు. 223

తే. నిరపరాధుల సాధుల - నీతిపరుల
బుధుల మౌనివరుల నిరా - యుధుల బాల
బాలికల స్త్రీల వృద్ధుల - జాలిలేక
మఱఘిరంగులఁ గాల్చి రి - మ్మహిచలింప. 224

ఉ. ఆశలు వీడియోడి సక - లాశలు సూచుచు నంగలార్చఁగాఁ
బాశములంబిగించి ధృతిఁ - బాసి కృశించు ప్రజాళిఁ ప్రేతరా
ట్పాశమువంటి పాశముల - బాదిరి మొత్తిరి వేణుయష్టులన్
నాశనమొంది వారమిత - నారకబాధలు వొందకుందురే. 225

ఉ. కూల్చిరి దేశభక్తులను - గొప్పగృహంబుల మందసాలలం
గాల్చిరి ధాన్యముంధనము - గ్రక్కునదోఁచిరి కోళ్ళఁగొంగలం
జీల్చిరి పంటచేల మసి - చేసిరి పౌరుల ప్రాణవాయువుల్
పీల్చిరి యొంటినున్నఁ గని - పిల్చిరి యొల్చిరి సొమ్ములన్నియున్.

ఉ. పచ్చికమేయు మేఁకలను - బట్టిరి కాదన మందకాపరిన్
ముచ్చెలకాళ్లమొత్తి రతి - మూర్ఖతఁ జచ్చెడిదాక రాష్ట్రమం
దెచ్చటఁ జూచిన న్నరక - మెచ్చుట నయ్యది మిత్తికోరకుం
గ్రుచ్చిన ప్రాణియయ్యెనన - ఘోరము లింతకు మించియుండునే.

శా. రోసంబీ సొకరూపుదాల్చి ప్రజలం - గ్రూరంబుగాఁ గూల్చుచో
గాసిన్ మాతృధరిత్రి గుండెలవియం - గాఁజూచి నిశ్చేష్టయై
దోసంబించుకలేని బిడ్డలని తా - దుఃఖింపఁ గన్నీరు గం
గాసింధ్వాది నదీనదాలఁ బడి వే - గంజేరె రెండబ్ధులన్. 228

వ. ఇంగ్లండునందలి భారతప్రభుత్వాధికృతులు సత్యపరిశీలన జ్ఞాన
శూన్యులై విన్నన్న చెప్పినద వేదమనుకొని స్వపక్షనివేదికనె ముద్దుపెట్టు

కొని ప్రజలె దోషులని నిర్ణయించుకొని దుర్ణయవృత్తికి వెనుదీయక యాంగ్లసామ్రాజ్యమునకు మఱియొక మాయనిమచ్చం గూర్పందలంచిన యవ్వృతనాధినేతడయ్యరు సమ్మానపాత్రుఁడని సంభావించి సందేశా దేశ పారితోషికాదులుపంప నదివిని. 229

మ. భ్రమగాకుండునె త్వత్సుఖం బఖిలపా - పంబుగ్రఘాతాకృతిం
గుసుమాలంజేయదె చాటరే కవులు నీ - క్రూరత్వము స్నీదొరల్
సుమమాలల్వైనవేసి మెచ్చుకొనినన్ - శోభింతువా యల్లదే
యమలోకంబున నగ్నికుండములు నీ - కై సిద్ధమైయుండెరా. 230

వ. అని భారతీయులనుకొనిరి. కాని పాంచాలపాలక ప్రభృతులు - 231

ఉ. హారమువేసిమెచ్చి యుప - హారము పచ్చలబాఁకునిచ్చి యా
హారవిహారసౌఖ్యముల - కన్నిటి కాతఁడు చచ్చుదాక నీ
భారతదేశపుంధన మ- వారిగఁ బించనొసంగి రద్దిరా!
క్రూరత ఘాతవైద్యు లల - ఘోరపిశాచముఁ గొల్వకుందురే. 232

ఉ. కత్తులబోనువంటి జన - కంటక పాలన మాఱ నేలికల్
చిత్తము మెత్తనై జనుల - శ్రేయము న్యాయముఁ గోరనేర్తురే
యిత్తడి పుత్తడౌనె మన - మెన్ని విధాల పుటంబువెట్టినన్
హత్తునె ధర్మసూక్తులు దు - రాత్ములయాత్మకు నెంతచెప్పినన్.233

చ. అలసితి వింతసేసి యిఁక - నాంగ్లధరిత్రికిఁ బొమ్ము చాల మే
మలరితి మంచుఁ బల్కి దొర - లంపిరి సీమకు స్తోత్రపాఠమ
వ్వలువకు నప్పగించి తమ - పాపము పండఁగఁ గ్రూరబుద్ధికిం
దెలివిగలారి ప్రాణములు - ధీయుటయన్నను బూలుగిల్లుటే. 234

వ. నరరూపరాక్షసులగు స్మిత్తుజాన్సను లిత్తెఱంగునన కసూరులాహోరులఁ బౌరులహింసించి నెత్రుటేర్లు పాఱించిరి. కాక గృధ్రజంబు కాదులకు విందొనర్చిరి. ఇట్టి ఘాతుకచర్యలకు దేశమట్టుడికి నట్టుడికెడి పట్టున రాజ ప్రతినిధి లేనిజాలిందెచ్చుకొని గారడి యొనర్చి తాత్కాలికముగఁ బజకన్నీళులం దుడువందలంచి హంటరధ్వర్యువుగ నొక సంఘమేర్పఱిచి జరిగినకథం బరిశీలించి మీకుఁ దోఁచిన సమీచీనము సెప్పుడనిపంప వారు పాంచాలమునకరిగి బంధితుల బాధితుల గుణవృద్ధుల సర్వసములఁ

దత్రత్యుల వాఙ్మూలములంగొనక క్షుల్లక జనుల రాచలెంకల లోభుల రాజ్యదంత్రజ్ఞుల జాలవిద్యావిశారదులఁ దమవలచినవారల నందంద కలసికొని యేదియోకొంత తాఱుమాఱుగ సేకరించి ప్రజలనవసరముగ నుద్రిక్తులై క్రూరకృత్యములు సేఁతకుండెగిరనియు నదిదురదృష్టకర మనియు వారిని వారించుటకు శస్త్రాస్త్రములు ప్రయోగింపవలసివచ్చె ననియు నైనను సైనికులొనర్చిన దతిస్వల్పమనియుఁ దీర్పుసెప్పిరి. తత్పరిశోధకబృంద మా తీర్పువెలార్పకమున్న కాంగ్రెసునేతలు సత్యము దెలిసికొనవలయునన్న నిర్ణయమునకు వచ్చుటంజేసి వారంప శ్రద్ధానంద స్వామి మాలవ్యా నేనుఁ బాంచాలమున కేఁగితిమి. అనంతర మాంధ్రదాసు జవహరు టాండనులు మముంబెరసిరి. అచిరమ బంధవిముక్తుఁడగుట మహాత్ముఁడరుగుదెంచి దుఃఖాశ్రువుల నానేల నాలుగుఁజెఱఁగులఁ దడ పుచుఁ బల్లియలఁ బత్తనములఁ బరికించె. అంతఁ దత్పరిశోధనమునకు మహాత్ముఁడధ్యక్షుఁడుగఁ జిత్తరంజనుడు, ఫజ్లుల్ హక్కు, జయకరు తయా బ్జీలు సభ్యులుగఁ గాంగ్రెసునందొక యుపసమితియేర్పడ వార లయ్యాయి తావులకుంజని నిజంబరసి యథార్థభానుకిరణశోభితంబగు నివేదికను రచించి యచ్చొత్తించి ప్రభుతయొనర్చిన దారుణచేష్టల భయంకరదృశ్య ముల లోకమునకుఁ గనులకుఁగట్టినట్టు సూపఁగల్గిరి. నిర్దోషుల నిరా యుధుల నిష్కారణముగ నిర్ఘృణుఁడై చంపించిన దళాధిపతిడయ్యరును వానినట్లుప్రేపిన పాంచాలపతి యోడ్వయరు నేతద్ఘోరమారణహోమ రహస్య మెఱింగియు నెఱుంగనట్లు నటించి గర్హింపక లోలోహర్షించి వారలగారవించిన భారతరాజ్యపాలకుఁడు ఛేమ్సుఫర్డును సామ్రాజ్యాధి కారులు తత్క్షణమ యుద్యోగభ్రష్టులంజేయుట సముచితమనియు నీముప్వుర ధర్మాధికరణమునకు రప్పించి దండితులంజేయుట న్యాయమైనను భారత పౌరులీవిషయమున నుదాత్తచిత్తులై యుపేక్షించుట లగ్గనియుఁ గస్తూరీ వల్లభుండందుఁదన మనోభావమును వ్యక్తమొనర్చె· అవహితులై యది చదివిన సర్వఖండవాసుల మృదుల కపోలయుగళగళితంబులగు కన్నీ ళులు కాల్వలై కలియుటంగాఁబోలు కడలిజలంబు కడుంగడునుప్పనయ్యె. అని పల్కి యాతండు నిట్టూర్చి యూరకుండె. 235

తే. అధికారికముగఁ గూళ - యైన డయ్య
రాచరించిన ఘోరకృ - త్యముల నెల్లఁ

దొఱఁగు కన్నీరు నునుఁజేలఁ – దుడిచికొనుచు
నాలకించె బెసెంటు దుః – ఖాబ్ధి మున్గె. 236

తే. పాపపుణ్యము లెఱుఁగని – ప్రజలపట్లఁ
గనివిని యెఱుంగ మింతటి – కఠినచర్య
లని సరోజిని కడుపు చె – ర్వగుటచేత
గ్రుడ్లనీర్గుడ్డలకు సారె – గ్రుక్కికొనియె. 237

వ. సామ్రాజ్యాధికారతృష్ణాబద్ధచేతస్కులగు నాదుష్టుల దుస్సహదుశ్చేష్టల విని తత్సదమునంగొందఱు దుర్భరదుఃఖవారాన్నిధి మునింగిరి. కొందఱు క్రుధాశుగ్రేఖాకలిత దృష్టులం బ్రసరించిరి. కొందఱు సమాలోచనామగ్నమానసులైరి. కొందఱు విషయరిరక్షుపులై వీక్షించిరి. ఇఁక బోసుందనుచరులును లోలోఁ బ్రజ్వలించుచున్నయగ్న్యద్రులైరి. మహాత్ముఁడు మాత్రము ప్రశాంతపావన గంభీరముద్రందవిలియుండెఁ. రాములది గమనించి యతం డద్వంద్వుఁడని భావించె. అంత సత్యాగ్రహ సమరస్రష్టవన్పున నవ్వలిహింసాఘట్టముల దిఙ్మాత్రముగ వల్లభభాయిపటే లిట్లు చెప్పందొడంగె. 238

## నాన్కానా హత్యలు

కం. సిక్కులకుఁ నాన్కానా
మిక్కిలి ప్రఖ్యాతిసెందె – మెఱసెడి తీర్థం
బక్కడఁ బండువు దినముల
నెక్కువ భక్తిఁ భజింతు – రీశుఁ భక్తుల్. 239

తే. అట గురుద్వారముంట మ – హానుభావు
లరుగుదెంత్రు తత్తీర్థయా – త్రాభిలాష
నట్టి పుణ్యస్థలంబున – నచల దీక్ష
సిక్కుయాత్రికు లోకసభ – చేసియుందు. 240

చ. పజపడుపాటు లేలికల – పద్ధతి నేతల నీతి వాక్సుమ
వ్రజము మహాత్ముదీక్ష మత – షైరమహోరగఘోరకృత్యముల్

నిజమరయంగలేక యవి – నీతికిఁ బాల్పడు దుష్టశక్తుల
క్కజముగ నెత్తుడాలు కడఁ – కం దలపోసి ప్రశాంతచిత్తులై. 241

తే. చర్చనీయాంశములఁ బల్కు – సమయమంద
నిండు పచ్చికఁ బన్నుండి – నెనురువేయు
నాలమందలఁ గని దూఁకు – వ్యాళములన
గువ్వలండాయు డేగల – గుంపనంగ. 242

తే. రక్షక భటాళి చనుదెంచి – రాక్షసులటు
ప్రేల్చిరి తుపాకు లదయులై – భీకరముగ
సాధుమూర్తులు సిక్కులు – సచ్చిరపుడు
రెండువందలమంది ధ – రిత్రి వడఁక. 243

తే. కట్ట! కొనయూపిరిం బట్టు – కొట్టుకొనెడి
ప్రాణులం బట్టి పెనుమంట – వైచి రింత
క్రూరకర్మలు మందున – కుజా లభింత్రె
కఱకు టెఱుకులకైనను – గలదె కరుణ. 244

చ. ఘనతరశౌర్యసాహసవి – కాస విశిష్టయశో విశాలుర
మ్మనుజులు సిక్కుసింహములు – మానవతామతమార్గగాములై
వినయమునజా మహాత్ముపద – వీనదవిష్ఠమనోవిలాసులై
మనుతఱి రాచబంట్లటుల – మారణహోమముసేసి రుగ్రులై! 245

కం. కట్టిఁడి కట్టడలను పెను
వెట్టకు నట్టుడికినట్టు – వెసనుడుకు మదిం
గుట్టుసురుతోడఁ బ్రజల
పృట్టునఁ బడినట్టి నెగులు – పలుకజా వశమే. 246

వ. లోకాలోకపర్యంత లోకంబెల్ల నాలోకించిన నింతటి చీకాకునం బడిన నాడెయ్యెడం గానంబడదు. జాతీయవాదులఁ దున్మితూఁటాడు తూఁటరుల తుపాకుల తూటాలకు గుఱియైనవారిసంఖ్య నరయఁ గన్నీరు మున్నీరగు. 247

కం. షుయ్యేల్ల సముద్రుండును
నధ్యార్థే యొక్కదిక్కు – నద్రీద్రుఁడునుం

దియ్యవుఁ జూపులఁ జూచుచు
నెయ్యముతోఁ గాచునేల – నెఱిచెడె నౌరా. 248

వ. అనిన అనంతరము తప్పక చెప్పికొనందగిన వరవీరకథ పల్నాటి కన్నెగంటి హనుమంతువధ. అది నే వినిపింతునని ప్రకాశమిట్లు చెప్పం దొడంగె. 249

## కన్నెగంటి హనుమంతు కథ

కం. కలదుగదా పలునాడల
తెలుఁగుపొలమునందు శౌర్య – దీప్తిచ్ఛటలన్
విలసిల్లుచుఁ జగమెన్నఁగఁ
గ్రాలున్ మించాలపాడు – గ్రామం బచటన్. 250

వ. అప్రదేశమున. 251

ఆ.వె. రా లగల్చి నీరు – రాఁ బంట పండింపఁ
గంకణంబు దాల్చు – కర్షకుండు
ఇల్లు ద్రొక్కికొనుచు – నెవ్వఁడు వచ్చినఁ
బ్రేమఁ బెట్టు నింత – పేదరైతు. 252

కం. వర్షాధారవుఁ బంటలఁ
గర్షకు లత్యంత కాయకష్ట మొనర్పన్
హర్షంబొదవ దపుడపుడు
వర్షాభావంబు పైరు – పచ్చల మాపన్. 253

కం. అశనాధారము ఘోషము
భృశమునఁ దద్వృద్ధి యాత్మ – వృద్ధిద మనుచున్
శిశుపోషణపలె నెంతురు
పశుపోషణ యద్ది వారి – భాగ్యేందిరయౌ. 254

చ. ఎఱుఁగరు కల్లయుంగపట – మెప్పుడుగొల్తురు క్షేత్రలక్ష్ములన్
సరిగధరింత్రుఖద్దరల – సజ్జలు జొన్నలు మొక్కజొన్నలున్
వరగలు రాగు లెక్కడుగ – బ్రాతిగ మెక్కుదు రారఘట్టముల్
ధిఘగఁగఁ బెంచికొంద్రు కడు – దిట్టలు గొందఱు మెట్టపైరులన్.

కం. కాఁపురము సేయు ముదమున
నాపల్లియఁ గన్నెగంటి - హనుమంతు సదా
కాఁపులు గరణాల్మెచ్చఁగ
దీపితజాతీయభావ – దివ్యచరితుఁడై. 256

మ. యువశక్తిన్నవశక్తిగా మలఁచి దే - శోద్ధారక ప్రక్రియా
జవసత్త్వస్థితిఁగూర్చి పూర్వకళలన్ – సాధింపఁగానెంచి మా
నవతావాదిగ సాహసించి జన స – న్మానంబునన్మించి భూ
ధవునెట్టైన నెదుర్కొనంగఁదలఁచెం – ధర్మప్రభావార్థియై. 257

కం. అప్పల్లియ కటు నిటు గల
ముప్పది కుప్పముల ప్రజలు - ముప్పననైనం
ద్రిప్పరు మడమల నాతఁడు
సెప్పిన చేఁతలకు బదులు – సెప్ప రొకప్డున్. 258

ఉ. ఆతని నేతృతామహిమ - నందఱుఁ గాంగ్రెసుదారిఁ ద్రొక్కి వి
ఖ్యాతు మహాత్ము నానలను – నౌదలఁ దాల్చి స్వదేశముక్తికై
నీతిగ నిష్ఠతో నిలువ - నేర్చి ప్రభుత్వపుఁ బుల్లరీక మా
భూతలమిద్ది మీరెవరు - పొందని రయ్యధికారు లడ్గినన్. 259

వ. అప్పరిసర గ్రామవాసులగు సైరికులున్నతవిద్యాగంధశూన్యులయ్యు లౌకికజ్ఞాన సంపన్నులు. అల్పసంఖ్యాకులయ్యు నైకమత్యారాధకులు. నిర్ధనులయ్యు నిత్యనిర్మల నిశ్చల మాతృదేశాభిమానులు. ఘనతరకష్ట జీవులయ్యు సమస్తప్రజాసుఖాభిలాషులు. వివిధవిషయచారిత్రికాంశానభిజ్ఞులయ్యు గాంధేయమార్గగాములు. కావుటంజేసి. 260

తే. ఉన్నతోద్యోగులకును నా - యూళులందు
మంచినీళ్ళైన పుట్టవన్ – మర్మ మరసి
చిన్న యధికృతు లెటు సాహ – సించియుంద్రు
ప్రజల పన్నుల మాట దై – వంబ యెఱుఁగు. 261

కం. మిసమిసలాడెడి పచ్చిక
పసులట మేయుటకుఁ గనలి – పాలకు లంపన్

వెసఁజని యధికృతు లెందఱో
కసితో బెదరింప మార్పు — కనఁబడ కున్కిన్. 262

కం. ఉపమండలాధికారియ
యపసర్పుల వాక్కులరసి — యాప్రజలు కరం
బపరాధులు కరమీయమి
నిపు డేఁ జని చక్కఁబఱతు — నిది నావిధియా. 263

కం. తృణకర నిరాసనంబిఁకఁ
గనికరమునఁ జూడఁదగదు — గా యని వేగం
జని కోలగొట్టు విడిదల
గ నిలిచి జానపదదీక్షఁ — గని నివ్వెఱతో. 264

కం. పేరుక్కునఁ బేర్గాంచిన
వారీ పల్నాటిగడ్డ — ప్రభవించిన వా
రేరీతి దారి దప్పక
వీరిన్ లోఁగొందునంచు — వెతగుడిచె మదిన్. 265

ఉ. గాంధిపథంబునన్నడచుఁ — గానఁదదాజ్ఞకు లోఁగుచుంబ్రజా
బంధువుగానఁదాఁబ్రతిన — వాఁయుటకొప్పునెదారితప్పునే
సింధుగభీరభావుఁడసి — చెప్పుదురాతఁడిఁకెంత చెప్పినన్
సంధికిసమ్మతింపఁడెటు — సాధ్యముదీనిఁ బరిష్కరింపఁగన్. 266

తే. శిష్టిధిక్కారమిద్ది వి — శిష్టగతుల
'వాయుగుండము'వలె నెటు — వైవుచుననొ
తొలుతనే దీనిమొదలంటఁ — ద్రుంపకున్న
హానికలుగుట నిక్కమం — చాత్మఁదలఁచి. 267

వ. అంతనొక్కవివిక్తస్థలంబున నించుకసేపునిలిచి కొండొకవిచారించి యనుచర బృందమ్ముతో మంతనమ్ముసల్పి కర్జంబుసూత్రపడు మార్గంబులు నలువలంకులం బరికించి కన్నెగంటివంశరాకానిశాకరుఁడు, కృషీవలావతంసుఁడు, వజ్రసంకల్పుఁడు, దృఢోత్సేధకాయుఁడు, విశాలపీనవక్షుఁ, డాజానుబాహుఁడు, కార్యనిర్వహణదీక్షాదక్షుఁడు, నిష్కలంకదేశభక్తుఁడు, ధైర్యస్థైర్యగోత్రభూభృత్తు, వీరశిఖామణి, గ్రామీణపంచజనహారనాయక

మణి, హాలికనాయకగ్రామణి, దాస్యాంధకారద్యుమణి, యగుహనుమంత యేతత్సత్యాగ్రహసమరసర్వసైన్యాధిపతియని యతని కాఁపురించుకొట్టిక మించాలపాడని యయ్యదికోలగొట్లు కన్వయించినదని తెలిసికొని యతని సామసాధ్యునింజేసికొంట సద్యఃఫలదాయకమని మానసించి విషయము శాంతముగఁ జర్చించుట యుభయతారకమని గ్రహించి నిజాస్థానమునకు వైళమరప్పింప నాజ్ఞాపత్ర మొక్కండు లిఖించి రాచలెంకలకిచ్చి పుచ్చిన వారునుంజెచ్చెరఁజని యవ్వార్తవినిపించి తత్పత్రమీ నాతండా గ్రామ సీమల మేలుకాంక్షించి పుల్లరీనొల్లమిఁ దెల్లముసేయ నుల్లాసంపడుచు నహింసామార్గమున రాజకీయరాయబారములు నిర్వర్తింపఁబడుట లగ్గగు ననియెంచి ద్విరదయూథాగ్రగామియగు వన్యగజేంద్రంబు చందంబున ననుచరబృందంబుతో నజ్ఞానపదజనమండలమండనుం డుపమండలాధి కారిసన్నిధికిఁ జనుదెంచు సమయమ్మున మధ్యేమార్గమ్మున రక్షకభటాధి కారి యొక్కండు. 268

ఉ. వీఁడన నెంత యింతధృతి – వీడక పుల్లరినీక పల్లెలం
బాడొనరించు బోధల న – పారముగా నొనరించి పామరుల్
వీడకతోడురాఁ బ్రభుత – వెట్టిన శాసన మొల్ల క్రీక్రియం
గీడొనఁగూర్ప నేలికల – కిన్కకుఁ బాత్రుఁడుగాక తప్పునే, 269

తే. బడుగు కసిచేతఁ జేతులఁ – బట్టి యూప
హూణసామ్రాజ్యవటవృక్ష – మూఁగునొక్కొ
కొండఁదగరొండు ఢీకొను – కోర్కెయిద్ది
సాగునే తలక్రిందుగ – జప మొనర్ప. 270

ఉ. చండతరైకశాసనవి – శాలధరాతలపాలకుల్మహో
ద్దండులుహూణులంచునెడఁ – దం దలపోయక యండదండలో
క్కండును లేకయాంగ్లనృప – కంటకుఁడై నడుముంబిగించునే .
నిండెను నూఱువర్షములు – నేఁటికి నేటికి సంశయంబికన్. 271

కం. తూరుపు పడమర యెఱుఁగని
వీరల సహచరులు గొప్ప – వీరుఁడె తృటిలోఁ
జేరఁడె యమలోకంబికఁ
బాఱుచుఁ దజ్జనము గుండె – బాదుకొనంగన్ 272

ఉ. కండలుప్రొవ్వి మన్నుమిను - గానగలేక చరించు నీతనిం
జండతరాగ్నియంత్రములఁ - జయ్యన భస్మముసేయు టొప్పదే
మాండలికాధికారి కెవో - మాటలుసెప్పి తరింపవచ్చు వీఁ
డుండినఁ జీడప్రాకు నిఁక - నుంచనటంచు మహోగ్రమూర్తియై. 273

కం. ముప్పంద్రు భటుల వ్యూహం
బొప్పుగఁ బన్నించి తా - మహోగ్రాకృతియై
నిప్పులు గ్రక్కుచు నుక్కన
నిప్పగిదిం జెప్పఁదొడఁగె - నెల్లరు వినఁగన్. 274

ఉ. ఎంతో యహంత పెంచుకొని - యేలిక కీఁదగు పుల్లరీక ది
గ్గంతి తెఱంగునన్నిలిచి - తక్కినపల్లెప్రజాలిఁ బ్రేచి మా
పంతము సెల్లనీక బహు - భంగుల గుంటకు మెట్టకీడ్చె నీ
మంతువు కన్నెగంటిహను - మంతుఁడు వీనిని బూదిసేయుఁడా. 275

మహాస్రగ్ధర :

అనువేళన్ వచ్చెనాతం - డతిధృతియుతుఁడై - హానరాజన్ముఖుండై
తనవెంటం బ్రాణమిత్రుల్ - దగఁబ్రజలునురా - ధైర్యహేమాద్రియై వే
కని రోషావేశులై వే - గభటులదయులై - కాల్చిరావీరవర్యున్
ధ్వనికాశాభిత్తులెల్లం - బగులఁగ జనభా - వంబులార్తిం జలింపన్.

వ. వ్యూహరచనాచణులై సాంకేతిక సంజ్ఞాలక్షణశిక్షితులైన పోలీసులు ముప్పంద్రు సుట్టుముట్టి కురియు తుపాకిగుండ్ల వర్షంబున మునిఁగియు బెదరకచెదరక నిల్చి కతిపయక్షణంబులలోన ఘోరనిర్ఘోషనికరనిర్భర నిర్ఘాతపాతితకులాచల శృంగంబుంబలె మూలచ్ఛేదంబునంద్రెళ్లు మహీరుహంబుమాడ్కి నేలంగూలిన దేశభక్తు ధీమంతు హనుమంతుదేహంబు నుండి కంఙరాగరంజిత గహ్వరీధర గహ్వరనిచయవినిర్గతనిర్ఝరవారము లట్లు కవోష్ణాస్రధారలు వారకప్రవహించుటంజేసి నల్దెసమడువులేర్పడుచుండ విరిసిన చెంగల్వకొలనివలెఁ గుసుమితపతితకింశుకంబునాఁ దోఁచు నాతండు. 277

కం. డప్పిక డప్పిక యనఁ బ్రజ
లప్పుడ జల మీయఁ బోవ - నటభటుఁడు గనులో

నిప్పుకలు రాలఁ గనుఁగొని
ముప్పగు మీకని తుపాకి - మొనచూపించెన్. 278

వ. అదిగని యోరిక్రూర యక్ర - తాస్తుఁడ హింసనెఱుంగ నిట్టినన్
మదమునఁ గాల్చినాఁడ విఁక - మామక సోదరులైన సైరికుల్
ముదమున రేఁగి మూఁగి మిము-ముప్పున ముంత్రు పరప్రభుత్వముం
బదపద హద్దుదాఁటుమని - పంపి స్వరాజ్యము నేలుకొంద్రురా. 279

కం. చత్తురు నొత్తురు నా కడ
కత్తెఱఁ బోఁకవలె నల్గఁ - గా నీ జనులం
జిత్తులఁ దొత్తులఁ జేయుచు
నిత్తెఱఁగున నెంతకాల - మేలెద రింకన్. 280

కం. స్వేచ్ఛైకతృష్ణ మాతృ
స్వచ్ఛందకళార్థి నన్నుఁ - జంపుట లగ్గే
యుచ్ఛిష్టాన్నము మెక్కుచుఁ
దుచ్ఛపుఁ గృత్యముల కిట్లు - తూఱుట సిగ్గే. 281

తే. అగుర! విసమానెదే కూలి - కరయ కడవి
పండుచున్నది కాకులు - పిండుకట్టి
యేరుకొని మెక్కుచున్నవన్ - తీరుగఁదిను
దొరల తొత్తుల కెటుదోఁచు - దోసమనుచు. 282

తే. కడుపుకక్కుర్తికయి దారి - గానలేక
పాపమిట్టుల యింకెంత - పంచుకొనెదొ
కన్నుమూయఁగనున్న న - న్గాంచియైనఁ
గన్నుదెఱచి యీదేశదు - ర్గతిని గనుము. 283

తే. కసవుపన్నియలేమని - కల తెఱుంగు
కొడుకు తండ్రికివలెఁ జెప్పి - కొంటి మద్ది
బధిరశంఖారవంబౌట - పాపమనక
కొసకుఁ గసివోక మసిబూసి - కొంటిరిట్లు. 284

తే. మరణశిక్షకుఁ దగినంత - దురితమేదొ
చెప్పుమది సత్యమైన నే - నొప్పుకొందుఁ

గార్హ్యగతియందు సద్గతి – గానలేక
చెనటి తెలుఁగున నిటుచేయి – చేసికొనెదె. 285

తే. కనులలోఁ బ్రాణములుబెట్టు – కొనిన జనతఁ
గాంచ నీకిసుమంతయుఁ – గరుణలేదె
ప్రజలు దమ కష్టసుఖములు – ప్రభున కెఱుక
సేయ కెవ్వరి కెఱిఁగింపఁ – జెల్లుఁ జెపుమ. 286

తే. ఆత్మబలమబ్బె మాకు మ - హాత్మువలన
నెంతకైనఁ దెగింతుము – పంత మెసఁగ
బాకులకు బల్లెములకుఁ దు – పాకులకును
జబురుజంగుల కిఁక మేము – జంకఁబోము. 287

కం. మజ్జనము రుధిర వాహిని
మజ్జన మొనరింపఁజేసి – మమ్మేలుదురే
గుజ్జరి తాపసి యొజ్జయి
హృజ్జలజములందు నిల్వ – నేమోఁడుదుమే. 288

తే. ఎండుచుంబండుచుంజన – ముండు నిచటఁ
దెల్లదొరతన మిఁకనుంట – కల్లమాట
గతిక గతికగనేయుండు – గతికఁ దిన్న
గుట్టమే చచ్చుననుసూక్తి – కోవిదోక్తి. 289

తే. ఎవరిదేశము వారలే – యేలుకొంట
తగుననక సర్వవిధముల – దమననీతి
మమ్ముఁ బాలింపఁ జూతురే – మాప్రయత్న
మఱుత ప్రేలాడు గుదిగట్టి - యగును మీకు. 290

ఉ. కూలిన దేశగౌరవము – గూర్చుకొనందలపడ్డ మాదుకం
కాళములేలుకోఁ దలఁచి – కాల్తురె? ధైర్యము సిక్కఁబట్టి యా
వేళన దీనులై కనుచుఁ – బ్రేక్షకలోకము రాల్చుచున్న క
న్నీటులు శాపవహ్నులయి – నీఱొనరించుఁ ద్వదీయదర్పముల్. 291

కం. చిక్కెం బెత్తనమని మీ
తెక్కులు విదిలింత్రె పీల్తు – రే నల్ల జనుల్

వొక్కం దక్కినదెల్లం
బొక్కెదరిట డొక్క లెండి - షోకం గనరే. 292

కం. ఆఁగదు స్వరాజ్యరథమిది
సాగదునీబండి నిన్నుసాఁ - కెడి దొరలిం
దాఁగక మూటయు ముల్లెయు
వేగం జంకనిడువేళ - వేంచేసెనురా.. 293

ఉ. కూటికి గుడ్డ కీవిపుడు - గొల్చు దొరల్ నినుడించిపోవ నీ
బాటలుదప్పు నాపయిని - భారతనేతయ నీదుగొంతులో
నీటినొ పాలనో విడుచు - నిక్కమెఱుంగక నిక్కుచుంటి వీ
మాటను గుర్తుపెట్టుకొను - మా కనుమా పరమార్థమాత్మలో. 294

ఉ. సర్వమతైక్యసాధన వి - చారశిరోమణి దిగ్విభాగ్యశో
ఖర్వుఁడు కార్యవాది కృతి - ఖడ్గకలార్జునుఁ డద్భుతక్రియా
నిర్వహణప్రభాహరి య - నింద్యచరిత్రుడు బ్రహ్మనాయఁడీ
యుర్విని బెంచె వైరిరుధి - రోజ్జ్వలకుల్యల శౌర్యసస్యముల్. 295

తే. అఖిల జనమాన్యుడు కలియు - గాభిమన్యు
బాలచంద్రుఁడు ఝళిపింప - బవరమందు
ఖడ్గకాంతులు దశదిశల్ - గ్రమ్ముకొంట
మెఱపులై మెఱయుచున్నవి - మింట నింక. 296

తే. మరుశరాహతిఁదన్గోరి - దరికిఁ జేర
మగనిమదిమార్చిరణవార్ధి - మందరమనఁ
దిరుగ దీవించి పంపిన - దివ్యచరిత
మగువ మాంచల కియ్యది మాతృభూమి. 297

కం. ఆఁడుది సేనల నడిపిన
నాడిది యీనాఁటికిట్టు - నవయుటఁగని తోఁ
కాడింతురె మీపడగల
వేడుక యెన్నాళ్ళు వచ్చు - విష్ణురథంబుల్. 298

కం. ధీరులు హంవీరులు రణ
వీరులు ఫాలించి మించి - విశ్రుతగుణులై

చేరిరి స్వర్గము బుధతతి
వారక తమపేరు నిల్ప - వాఙ్మయజగతిన్. 299

కం. అరిగుఱిచి యొగ్గులగ్గులు
నరిగంజర్చించి సుకృతి – సల్పుట లెస్సా
సరగున రమ్మని నాకొక
పరమానా పంపి యింత - పనిసేయుదురా. 300

కం. నిఱుపేదల సీమాత్రము
కరుణింపని రాజులేల - కనకపురాసుల్
దఱిగునె దొరలకు దీనం
బరనృపులకు భరతభూమి – బాధ తెలియునా. 301

తే. ఎన్ని మద్రక్త బిందువు - లిచట రాలె
నన్నిఁటికి నందఱిఁక నేత - లవతరించి
పాదుకొనియున్న సామ్రాజ్య – పాదపమును
వేళ్ళతోఁ బెళ్లగింతురు - వేగఁగనుఁడు. 302

తే. ఎన్నిగుండ్లిటు నాదేహ - మెల్లఁదూటె
నన్నివేలేండ్లు దుష్కీర్తి – ననుభవింపుఁ
డేను నామృతి కొక్కింత – యేని వగవ
తను వశాశ్వత మొకయశో – ధనమె నిల్చు. 303

కం. అని వానికి గుణపాఠం
బును నేరిపి శోకభార – మునఁ గన్నీటిల్
గనులం దిరుగఁగఁ దన్నుం
గను జనులంగాంచి వీర – కరుణము లొలుకన్. 304

కం. శోకం బుడుగుఁడు పుల్లరి
నీకుం డియ్యాంధ్రతేజ - మీరేడు జగాల్
ప్రాఁకం దొల్లిటి వీరుల
జోక న్నడుపుండు పేరు – జోతిగ వెలుఁగన్. 305

తే. ఏల దుఃఖింత్రు గర్జ మిం - కెంతొ గలదు
పుట్టి పుట్టిన చెడయట్టు - గిట్టఁ జన్నె

శత్రు హృత్పుటభేదన - శక్తి గలిగి
తల్లి దాస్యంబుఁ బాపని - తనయులేల. 306

కం. భారత జాతీయ సభా
భారధురంధరుల మాట - బంగరు మూటం
బారసి త్రివర్ణకదళీ
గౌరవమును శాశ్వతంబు - గావింపుఁ డిలన్. 307

కం. వలవని వగలం బొగులక
కలకాలము కీర్తి నిలుచు - కార్యంబగు ని
క్కలని న్నిలిచి మహాత్ముని
పలుకులు దలఁదాల్చి విజయ - భాగ్యముఁ గనుఁడా. 308

కం. అని రెండు జాలు జాలిం
గనఁదగు దగ చావునెగులు - కడు మిగులంగన్
దను వటునిటుపొర్ల నతఁడు
సనె వీరస్వర్గమునకు - జగము నుతింపన్. 309

కం. ఇంగువ గట్టినగుడ్డ తె
లుంగు పొలంబనుచు నిఖిల - లోకాల్వొగడన్
నింగిని బూల్సల్లుచు ది
వ్యాంగనలున్ నాట్యమాడ - నరిగెన్ దివికిన్. 310

కం. రక్షక భటాధినేత మ
హోక్షమునాఁ గిట్టి శిరము - నూపి బుషీశున్
భక్షించిన రాక్షసునటు
లక్షీణముదాన నరిగె - ననుచరతతితో. 311

వ. పదంపడి భేరీకాళికా మృదంగమురళీ ఘంటాఘంటికా శంఖ పటహఢక్కాది వివిధవాద్యధ్వనులు బధిరీకృతదిఙ్ముఖమ్ములగుచుండం దలపై గాంధీటోపీ కరమునమువ్వన్నెజెండా వెలుంగ శమితక్రోధయువ దళ మచిరమ మనోవ్యధయుడిపికొని యిరుకెలంకుల బారులుతీరి నడచు చుండ మహాత్మాగాంధీకిజే కన్నెగంటిహనుమంతుకుజే యను విరావములు విరామములేక దశదిశల మాఱుమ్రోగుచుండ నానావిధ భజనలనాద

ములు పతితపావనపథముల బోధించుచుండ జాతీయమై జయంతికాపటము లంతరాళమున రెపరెపలాడుచుండ ననేక గ్రామజనతావాహిని వెల్లి వొడుచుచుండ రాజభటవ్యాపాదితతచ్ఛూరశిరోమణి కళేబర మతిశ్రద్ధం దోకొనిపోయి కోలగొట్లకుప్పమునకుంజేరువంబాఱు సెలయేటిక్రేవం బాతి మీఁద నత్యంతరమణీయంబగు 'సమాధి' యొక్కండు రచియింపంజేసి యేలికల నిష్కృతిలేనిదుష్కృతి కిదిచిహ్నంబుగా నిల్చుననియెంచి దానం గల శిలాఫలకంబుఁ నవ్వీర కేసరి చరిత చెక్కించి కరణీయకార్యనిర్వాహకులై తత్ప్రజలు తమప్రియతమ నాయకునియెడఁగల సద్భక్తిని బర ప్రభుతయనం దమకుంగల విముఖతను బ్రకటించి సత్కీర్తిమించిరి. సత్తెమిత్తెఱంగుననొప్ప. 312

తే. గండగొడ్డలి ధరియించి - కాలకాలుఁ
డనఁగ మముఁజంప వచ్చిన - యతని మేమ
కాల్చితిమి వానియెడఁ గంటు - గలద వేఱ
యీసు లేదని రద్దు పో - లీసువారు. 313

కం. బొంకునకుం గింకరులై
శంకదొఱఁగి యంతనగ్న - సత్యము మాటం
గొంకక యిట్టాడిన యమ
కింకరు లెఱుఁగుదురె లోక - కింకరుల వెతల్. 314

ఆ.వె. రాళ్ల సీమ కాని - రత్నాలసీమ కా
దంచు నెంచ కతఁడు - హాని సేసె
దూర దృష్టి లేని - దుష్టున కీఁబడ్డ
పెత్తనంబు విసపు - విత్తనంబు. 315

మ. జనబాధ ల్వినిపింపవచ్చుఘనువి - శ్వాసార్హధీశాలి ని
ర్జనభూమింగసిఁగాల్చిచంపిరకటా - సామ్రాజ్యపుంబంటులే
మనవచ్చుఁ మనయుచ్చుపాయుటెటు దు - ర్మార్గాగమున్వ్రేళ్ళతో
మనమెళ్ళంగిఁబెకల్తుమంచుఁ బ్రజయా - త్మంబింతిలెంబెల్లుగా. 316

## శిష్టిధిక్కృతి

వ. ఈమైని టుజరిగె. ఇంకనువినఁదగిన విశేషాంశములఁ దెల్పెద వినుండు. గర్తపురీమండలమునంగల చీరాలపేరాలలం గలిపి యేకపుర

పాలకసంఘముగ నేర్పాటుసేయ ప్రభుతనిర్ణయింప నది నానావిధభాగధేయబాధలఁ బెంచుననిగ్రహించి దానినెదుర్కొనంగోరి ప్రజలత్తఱి నాంధ్రిం పర్యటించుచు నటకేతెంచిన యీ కస్తూరీనాథునకుఁ దద్వృత్తాంతము వించిన నీతండదిమీకింపనిచోఁ బన్నులీక పరిత్యక్తనికేతనులై జాతీయకేతనములతో నూళ్లసరిహద్దులకావలఁ గుటీరములు నిర్మించుకొని వసించుట లగ్గనియు సత్యాగ్రహసమరసిద్ధాంతాధారముగ నేతత్కార్యక్రమంబెల్ల నడచినం గాంగ్రెసిప్పట్టునఁ దాటస్థ్యమువహించుననియు నర్థసిద్ధింబొరయంగల్గుదురేని దానంగూరుఖ్యాతిం గొంతపాలు జాతీయమహాసభకుం దక్కునంట కల్లకాదుకాని యోటమివాటిల్లిననాపాదిల్లు నపయశంబు మీరయోర్వవలయుననియుఁ బలికి భగవానుఁడు మిమ్మోముగాతమని దీవించి చనియె. అంత నదియొకవిధమగు మైకోలుగభావించి తజ్జనత యాంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయార్య నాయకత్వమంగీకరింప నతండు తనరాణువకు రామదండని పేరిడి దానికిఁ దాన ప్రాణంబై యెడనెడ వీరకథాకథానికానీకకథనంబునం గ[illegible]సడలనీక దానిం గ్రమపద్ధతిం గమింపంజేసి యుద్యమము బ[illegible] ప్రచారమొనర్చె. జనులు నిజసౌధములవీడి శీతవాతాతపబాధలకోర్చుచు సైకతస్థలములఁ బూరి గుడిసెల జీర్ణపర్ణశాలల వసించి క[illegible]చుచుండ. 317

ఆ.వె. అచటి చరిత నెల్ల – [illegible]థార్థవర్ణులు
ప్రభుత కెఱుకసేయ – బట్టుపట్టి
యుద్యమంబు నడప – నుద్యోగులనుబంప
వారు మోపి రెన్నొ – నేరములను. 318

ఆ.వె. చలువరాళ్ళదివ్య – సౌధము ల్విడనాడి
పూరిగుడిసె ల్లు – పొక్కుచున్న
బంట్ల నంపి ప్రభుత – బహువిధ బాధలఁ
బెట్టుచుండెఁ బికు – నెట్టుచుండె. 319

ఆ.వె. బన్నములు దెలంగు – తిన్నని యోచనం
గుమిలి నల్వు రెటఁ – గూడియున్న
వేగు దెల్పు బంటు – వేగమ చనుదెంచి
తిట్టుచుండెఁ దరిమి – కొట్టుచుండె. 320

వ. ఇట్టి యిక్కట్టులం గనుచున్న నరు లిమ్మని యధికృతులు వేధించుచుం బ్రముఖులం బంధించిరి. శిష్టాధిక్కృతింబాటించి కారకరిగినవారిలో నేఁబదేండ్ల యవ్వ యొక్కర్తగలదు. ఆమెయ యలమేలమ్మ. తెలుఁగుల యాఁడుబిడ్డ. భారతదేశ రాజకీయరంగమున శాసనోల్లంఘనమొనర్చి బందిగమునకేఁగిన ప్రథమ మహిళామణి. ఈమెనామము హిందూదేశ చరిత్ర సువర్ణవర్ణములతో వెలుంగుత. త్రిలింగకాశ్యపిం గరనిరాసన నవసదీక్ష యిట్లుండ నిది కేరళదేశమునకుం బ్రాఁక నటఁగలమాపలాలు తమ మహోత్కృష్టమతాచార్యుఁడైన ఖలీఫా కాంగ్లేయులు గావించిన యవమతిందలంచి రోషారుణనేత్రులై రేసి రోసిరోసి తెలవారిండాసి యసి దూసి కసింగసిమెసంగిరి. అంతంబోక చివఱకది మతోన్మాదముగమాఱ నవ్వేఁడుఱ మేదురంబై యపథులనధిగమించ నొడలుదెలియని యావేశ పూరితులై హిందువుల మానప్రాణములఁ గ్రూరతరముగ బలిగొనిరి. దేశమునఁ బలుప్రదేశముల దానిప్రభావంబు దృగ్గోచరంబయ్యె. పిదప మృదుమధురోక్తుల మ్మనలనువలాలింప నాంగ్లప్రభుత్వమువారిపంపున నింగ్లండునుండివచ్చిన కాబోవురాట్టు బొంబయిపత్తనమునఁ గాలిడినతఱి జాతీయవాదులు ఖిలాఫత్తుసంఘసభ్యులు హరతాళము సాగించుచుండ రాజభటులు వారలఁ బసింగొట్టినట్ట పేఞ్ఞయిష్టులఁ గొట్టి శిక్షావిరహితులగు పౌరులుగొందఱు చండకోపనులై వారిందాఁక భీకరసంగ్రామంబుసాగ శోణితవేణివెల్లివొడువ నేఁబదిముప్వురు స్వర్గతులుగా నన్నూఱుమంది తీవ్రవ్రణితులైరి. అనంతరము సంయుక్తరాష్ట్రాంతర్గత గోరక్షాపురనికట స్థిత చౌరీచౌరానగరమునఁ గాంగ్రెసువారొక యుత్సవము జరుపుకొనుచుండ రక్షకభటులు వారివారించి యెంతకోరినం గదలనీకుంటంగని ప్రజలుద్రిక్తులై యెగచియెగచి వారివారి కారాగారమ్ములోనికినెట్టి యుక్తాయుక్తవిచారదూరులై దానికి నిప్పువెట్ట నిర్వదియిర్వురు రాచబంటులం దగ్గింబుగ్గియైరి. ఇట్టి ఘోరఘట్టములవిని జనులమనస్సహింసనమార్గమునఁ బరిణతిసెందమికి మహాత్ముఁడుల్లంబునఁబెల్లుగదురపిల్లి యద్దితనదోషంబుగ భావించుకొని మాటసెల్లమికి సిగ్గిల్లి జనతాకృతపాతకమునకుం బాచితముగఁ దానేనాళ్ళుల్లింబూనె. సమయముకాదని బార్డోలీసామూహికసత్యాగ్రహము మాన్పించె. వారమున కొకదివసము మౌనవ్రతముండి యంతరాత్మప్రేరణము గమనించి బోధించె. శిష్టాధికృతులు రాజకీయ

బహిరంగసదములు స్వాతంత్ర్యసమరయోధుల యుత్సవములు సేయం
జనదని కోటిమంది నూతనసభ్యులంజేర్చి ఖద్దరుపటవృద్ధి మద్యపాననిషే
ధాదులకై బడలుపడందగునని బార్డోలీకాంగ్రెసుకార్యకర్తృసదస్సునం
దీర్మానమొనర్పంజేసె. అంతంగొంతకాలమున కాంధ్రరాష్ట్రజాతీయ
మహాసభాసభ్యులు గర్తపురిసమావిష్టులై తెల్గుమాగాణమునఁ బ్రభుతశిస్తు
కట్టరాదని నిశ్చయించుకొన నేతన్నిర్ణయమెఱింగి త్రిలింగులెల్లరు పన్ను
లిండని సబర్మతీసంయమి ప్రకటింప నొక్కగుంటూరిమండల ప్రజలు
దక్కఁ దక్కిన తెన్గు లిచ్చిరని విని. 321

ఉ. దూషితమయ్యెదేశ మెది – దోఁపద నక్కనఁ దీర్చిదిద్ద ని
ర్దోషులుగా నహింసకతి – దోహద మిచ్చిననాఁడె యీ ప్రజల్
దోషితులౌదు రేలికల – తుందుడు కెల్లనశించునన్న నా
భాషిత మాత్మఁజొన్పరిది – భావ్యమె యెట్టిక మేలుగల్గునో. 322

శా. అంచుంగాంధితపించువేళ తెలుఁగ – య్యల్తేవ! యెద్దేని నే
మించన్మించము నీపథమ్ము పదముల్ – మేమైన నిప్పట్టునం
గాంచంగాంచన శైలధైర్యమునఁ జ – క్కన్నిల్చి పన్నీక మే
ల్గాంచంగాంక్షజనింపఁ గట్టితిమి దీ – క్షాకంకణాల్ బాపుజీ! 323

కం. విప్పుడనకు డోరము క
న్విప్పిన మము తిప్ప లెన్ని – వే వే గతులం
డెప్పరముగ ముట్టిన నీ
కొప్పిన శాంత్యాజి నిల్చి – యోర్తుము సామీ. 324

తే. శ్వేత దేహుల పాలన – చెట్ట గూర్చె
నంచుఁ గర్షక కార్మికు – లెంచి రిపుడు
దిరిగి సంగ్రామమున కీవు – దీవన లిడ
వేయిగుత్తాలక్షైనెక్కిన – విధ మెలర్తు. 325

కం. మీపంపు సేయ కెవ్విధి
మాపెంపగు నిత్యసత్య – మార్గ మహింసా
దీపితమై ప్రాపింపఁగఁ
గాపగు వాల్పొండళములు – గా మాకెందుల్. 326

ఉ. లోక హితంబుపొంగె మది – లో నుదయించిన దివ్యభావముల్
వాకొను మీప్రభావ మని – వార్య మఖర్వము నా నెఱుంగమే
మీకుఁ బ్రధానశిష్యులము – మేమని తద్‌జ్ఞుల మెప్పుపొంద నే
మీక్రియన్ శిష్టిధిక్కృతికి – నిత్తఱి నిల్తుము గెల్తు మాజిలో. 327

కం. బిన్నటు మొండెం జిక్కమి
డస్సిన నిఱుపేదరైత – డంగఁగ శిస్తుల్
నిస్సీమంబుగఁ బెంచుట
నిస్సి యిస్సీమ యెంత – చేడ్పడెఁ జెపుఁడా. 328

చ. అనితను వేఁడ నొజ్జ యపు – డౌననఁ గాదనలేక కొంతసే
పనితర దీర్ఘదృష్టియుతుఁ – డై చతురాస్యుఁడు "శిష్టిధిక్కృతిన్
వినయముమై నొనర్పఁగల – విజ్ఞుల మే"మని విశ్వసింతురే
ఘనకృతి కాఁక సెప్ప శ్రుతి–కంటకమార్గము ద్రొక్కఁబోకుఁడీ. 329

తే. దేశభక్తికి వలయు ప్రా – దేశనమున
నలరి రాంధ్రు లస్కీర్తి మీ – కబ్బుఁ గాక!
విశ్వసంరక్షకు కటాక్ష – వీక్షణముల
మేలి మెఱుఁగులు సతము మి – మ్మేలుఁగాత! 330

కం. సవి తంత్రీవార్తను నాం
ధ్రవసుంధర నాయకులకు – రయమున నంపన్
శివకరముగ గురుఁడానతిఁ
బ్రవిమలమతి నిచ్చినట్లు – భావించి రెదన్. 331

అ.వె. అయుత సైరికాళి – యానందమునఁ దేలి
సరగఁ బాలపర్తి – సభ నొనర్చి
కాంగ్రెసిష్టపడిన – కష్టమ్ములకు నోర్చి
పన్ను సమ్మె నల్పఁ – బ్రతిన గొనియె. 332

## పెదనందిపాటిపన్ను సమ్మె

తే. ముందడుగువేసి యాంధ్రికి – ముదము గూర్ప
సీమమున నిల్తు మనుచున్న – గ్రామ జనుల

నాయకుల వాంఛమై పెద - నందిపాడు
నంగరాంగణముగ నొప్పు - సాగె రణము. 333

చ. పెనుదెలి జక్కినెక్కి ఘన - వీరుఁడు వీరయ క్రీడి కైవడిꠂ
దనమొన వొంగ వచ్చెఁ బ్రమ - దానఁ జమూపతియాతఁడాతనిం
గన నొకనూత్నశక్తి గుహుఁ - గాంచిన దేవతలై ప్రజల్ యశః
ఖని యతఁ డశ్వముందిగఁగ గాంధికి జే యనిరొక్కపెట్టునꠂ. 334

కం. పర్వతనేని కులుండతఁ
డుర్వీదాస్యాంధకార - ముడుప నుడుపుఁడై
యౌర్వజ్వాలలనైన న
ఖర్వక్రియ నార్పవైవ - గా సమకట్టెꠂ. 335

తే. హరికథాకథనప్రవీ - ణాగ్రగణ్యుఁ
డాటపాటలఁ గడు దిట్ట - హాలికుఁడు కు
లీనుఁడు స్వదేశభక్తుఁడు - జ్ఞాని యగుటఁ
బ్రణతులర్పింత్రు వానికిఁ - బల్లెప్రజలు. 336

కం. సంకాన్వయాబ్ధిసోముఁడు
గొంకక రామయప్రధాని - కుడిభుజమై ని
శ్శంకం దనతో నిల్వఁగ
నంకిలి లేకప్డు వీర - యాఖ్యుఁడు వెడలెꠂ. 337

వ. చేతఃప్రీతిగఁ దన్నేతనీతుల నానతులఁ బాటించి తత్ప్రాంత జాతీయ మహాసమజ్యాసభ్యులెల్లరు. 338

మ. అనిదంపూర్వముదమ్మునం గదలి యా - యాగ్రామముల్వొచ్చి త
జ్జనతం బావనతా పథంబునకుఁ బె - ల్చంద్రిప్ప గాంధేయ ధ
ర్మనిధానోక్తుల శాంతియుద్ధగతులꠂ - రక్షాకళాదక్షతꠂ
ఘనమౌ కష్టసహిష్ణుతం గఱపి ర - క్కాంగ్రేసు భక్తాగ్రణుల్. 339

ఆ.వె. ప్రభుత కొల్వుసేయు - వారల కిరాచు
వస్తు లెవ్వి వస్తు - గస్తి కుడువ
నెవ్వఁడేని వాని - కేసర కమ్మినం
ద్రోషమనిరి మనకు - ద్రోహ మనిరి. 340

కం. ఆకర్షక జనముల మది
కాకర్షక వాక్సుధా మ - హాద్భుతకలశం
బీకరణిఁ గ్రుమ్మరింప సు
ఖాకరగతిఁ జెవులఁ ద్రావి - రగ్గ్రామీణుల్. 341

ఆ.వె. తిండి కొఱత వడిన - దీనుల పెనువెతల్
స్వానుభూతి వార - లరయవలయు
నంచు నట్లు నిర్ణ - యించిరి గాని బా
ధింపఁగాదు తగవు - పెంపఁగాదు. 342

కం. పసియిల్లోఁటల్దొడ్లిఁక
నసిగలపొలములు యథేచ్ఛ - నస్మానికినే
వెస వేలమువేసిన నొ
వ్వినుమంతయు ననక కరము - లీమనిరి గృహుల్. 343

తే. అటఁ గవాటములంగల - యంకెలల్లఁ
దుడిపి రధికృతి వాటిక - ల్వడిఁ గని యిది
పినిగీమని తెలిసికో - వీలులేమిఁ
బన్నడుగలేక వచ్చిన - బాటఁ బట్టె. 344

ఉ. మాండలికాధికారి జన - మార్గమెఱింగి దురాగ్రహంబుమైఁ
జండగరాగ్నిగోళముల - చందమ నేత్రములొప్ప వచ్చి యిం
దుండఁగ నత్రమెందుఁగల - దూరి సమాహ్వాయమేది యన్న నొ
క్కండును ముల్కఁడుల్కఁ డతి - గాఢవిధిం బెదనందిపాటిలో. 345

తే. ఏమి తోఁప కతఁడు తన - యిక్క కేగి
యున్న దున్నట్టు లున్నతో - ద్యోగుల కతి
శీఘ్రమే తంతి నిచ్చి ని - శ్చింతనుండె
తలకుమించిన పని సేయఁ - గలఁడె నరుఁడు. 346

వ. అగ్గ్రామటికలు దేవమాతృకములగుటంజేసి వర్షాభావంబు వాటిల్లి నప్పుడెల్ల డొక్కలెండుచుంట లావణిప్రభృత్యరులు సెల్లింపనేర కేలికలకుం దమపాట్లు నెన్నివిడుతల నతిపూర్వకవిజ్ఞప్తి పత్రములం దెల్పుకొన్నం గనివిని సుగతింగల్పించినవార్లు మచ్చునకైన లేరైరి. ఇంక వేఁడికోలునం

గార్యసాధనము గగనకుసుమమని తమయట్టిరె భారతీయ సైనికులెల్లరని యస్వాతంత్ర్యమ దీనికిం బ్రధానహేతువని దానినెదుర్ప నిటు దెగిరి. 347

కం. అడుగరు కరణాల్మున్నబు
లడిగిన సీరందఱేక — మైరి మనమ్ముల్
సుడివడఁ గొందఱు విడిచిరి
కడువడి నధికారములను — గ్రామోద్యోగుల్. 348

తే. రాటుదేలిన పెదనంది - పాటిమాట
యాఁటెపోటుగ సూటిగ — నాటె నిండు
నందుఁ గలదొరల యెడఁద — నాంధ్ర తేజ
మోపు జగముల నుఱ్ఱూత — లూపననఁగ. 349

ఉ. ఏలితిమింతదన్కను య — థేచ్ఛగ నల్వదికోట్ల మర్త్యులం
గాలముగాలమై భరత - ఖండము గన్నులువిప్పె నెట్టిఁకన్
వాలుగ గుప్పిటన్నిలుచు — వారు దవాగ్నిగ మాఱఁ గార్మొగుల్
పాలనమౌనె యంచుఁ బరి — పాలకు లార్తిఁ జలించి రెల్లరున్. 350

ఆ.వె. ఆంగ్లభూమి సచివు — లంత సహంత సా
మ్రాజ్యకాంక్షరేఁప — మనకుఁ గీడు
సల్పుఁ గాంగ్రెసింక — సమయింపవలె దాని
నంచుఁ దీర్చిరాగ్ర — హానఁ దోన. 351

ఉ. ఈవిఁక నెట్టులేని వెస - నేపడగింపుము కాంగ్రెసున్ జయం
బేవిధినైన నాంగ్లధర - ణీశునకబ్బఁగఁ జేయుమంచు ధీ
ల్లీవిభుహెచ్చరించి రవ — లీలనతండపుడంపె వేనవేల్
తీవ్రతగల్గు సైనికుల — దిట్టల నప్పెదనందిపాటికిన్. 352

కం. కాతాళంబునఁ బ్రజలం
బాతాళమునంటఁ ద్రొక్కఁ - బనుపం భటుల
బ్బేతాళులట్టు ముట్టుచుఁ
బూతాత్ముల జనులఁ జావ - మోదిరి పెలుచన్. 353

తే. కట్టు జాతీయవాదులఁ — బట్టి కట్టి
వారలెక్కిన జక్కుల — వాలమ్ములకుఁ

బర్వ్వాలె త్తించి రెంతటి — పాప మతులొ
కడకు వారల కేగతి - గలుగఁగలదొ. 354

ఆ.వె. పల్లె పల్లె ముట్టి — పన్నులిమ్మని కొట్టి
తోఁట దొడ్డి సొచ్చి - తోడితెచ్చి
వీధిఁ బెట్టి పశుల - వేలము వేయ నొ
క్కండుఁ బాడకున్నఁ - గంది రపుడ. 355

కం. మనుగడకు గడన సొలమిఁ
దనువు గడచు టెట్టులనుచుఁ — దపియించెడి య
మ్మనుజులఁ గని కనికరమ
మ్మనుజేశుల కొదవ దేమి — మానవత కటా! 356

కం. సత్యాగ్రహ మోహరమున
నత్యంతము డస్సినార - లాఁవుండనుచున్
నిత్యము నల్దెసనుండియు
స్తుత్యంచితరీతి వచ్చె - శూరుల కమ్మల్. 357

చ. తెలుఁగులు నల్గుటన్విని యు - దీచ్యులు నేతలు వచ్చి నిల్పిఁడీ
కలను మహాత్మువాక్యమిది — కానక నూటికి నల్వురిచ్చి నం
గలిగెజయంబు మీకని జ - గంబులు వాకొనుచున్నవన్న న
వ్వలుకుల నాదరించి కరి - ఖండనమాఁగిరి జ్ఞానమూర్తులై. 358

వ. క్రూరతరాసాధారణశాసనభైరవ పాదఘట్టనదుర్భరభారదోదూయమానమానసులై యున్న యమ్మనేలమానుసుల బన్నములం దలఁచి యెల్ల జగముల్లమునఁ బెల్లుదురపిల్లె. ఇంతనముత్పతనము పతనముకొఱక యనెడి యెఱుక లేని యయ్యశ్త్రజీవులు విలయకాలరుద్రునట్లు వీరవిహారము నల్పితిమని సంతసించిరి. అంత. 359

ఉ. వారిటు రిత్తవృత్తిఁబడి - వారిధిఁ ద్రచ్చిన దైత్యులట్లు ని
స్సార విచార గర్వతమ - సంబున హస్తిపురీశునాజ్ఞ ని
త్సేరిరి లాభనష్టములు - సేవకులన్ ముసిముట్టివన్న య
ట్టూరక ప్రేలుచున్మద మ - హోగ్రవు బెబ్బులులట్ల చూచుచున్. 360

(ప్రథమ దిన సభ సమాప్తము)

ఇయ్యది శ్రీమదాంధ్ర మహోభ్యుదయ ద్వితీయ భాగమునఁ
ద్వితీయ ప్రకరణము



అల్లూరి సీతారామరాజు

తే॥ సింహసంహననుఁ డరిజి - త్సింహసముఁడు
శిష్టరక్షణపర నర - సింహమూర్తి
ఘోరశార్దూల వనగిరి - కుహరవర్తి
రామనిభుఁడు సీతారామ - రాజవరుఁడు.

చతుర్థ ప్రకరణము

# అల్లూరి సీతారామరాజు చరిత్ర

## బాల్యదశ

వ. ద్వితీయదిన సభాప్రారంభమున వంగకేసరి తక్కిన నాయకులం గని పైదనందిపాటి కరనిరాసనకథానంతఁ మత్యంతస్మరణీయ మల్లూరి మహోజ్జ్వల విప్లవజ్వాల. ఝాన్సీరాజ్ఞి, తాంతియాతోపి, బహదూర్‌షాలు రవియస్తమింపనిహూణసామ్రాజ్యముతోఁ బ్రథమస్వాతంత్ర్యసమర మొనర్ప నాంగ్లేయులు సిపాయి తిరుగుబాటని తచ్చరిత్రకనూహ్యాన్యానతనాపా దించి క్రమక్రమ విజయపరంపరాపటిష్ఠులై భారతము నిరస్త్రముంజేయఁ దదయఃపాదఘట్టనల నల్గుచు మాతృభూమి బానిసత్వపాశాబద్ధమై క్రుద్ధమై తపించు విషమసమయమున నొకచెంపఁబాలు నొకచెంప నీర్గారు రాజు సల్పిన యద్వితీయ ద్వితీయ సాయుధ సంగ్రామమును రంపపితూరీ యని హీనముగఁ బరిహసించి యవ్వీరకిశోరమున కనేక కళంకము లాపాదించు గాథల సృష్టించి తద్యశోజ్యోత్స్నాలం బరివృతనీలనీరద నేపథ్యలం గావింపఁ బ్రయత్నించిరి. రామరాట్సత్యచరిత తన్మండల వాసి మహావక్త. పట్టాభిసీతారామార్యవర్యుండు సదస్సునకు సమగ్ర ముగ వినిపింప హృదయపూర్వకముగ నర్థించుచున్నవాఁడ ననం బొట్టి శ్రీరాము లుత్థితుఁడై సమజ్యకు నమస్కరించి బోసుమహాశయుఁడు కోరిన కోర్కి కడుంగడుఁ బ్రశంసనీయము. నిద్రాణప్రజావ్రజమున కుత్తేజము గలిగించి వీరభారతరాజకీయాంతరిక్షమున రవియైవెలింగిన పరపరిపాలన మదమాతంగ కుంభభిదాలంఘనక్రియాసింహ శాబకముం గగన రణ ఘటోత్కచుం ధనుర్విద్యైకలవ్య నలఘుబాహువీర్యశౌర్యధుర్యు నాంధ్ర హంవీరకుమారవర్యుం ద్యాగధన్యుంగూర్చి కాలపరిమితిని గణింపక విపులమ్ముగ సత్రయాగంబున సూతుండు శౌనకాదులకు సవిస్తరమ్ముగ నొక్క పుణ్యకథం దెల్పినట్లు మాకుందెల్ప సభాస్తారుల పక్షమ్మున నేను వేఁడుచున్నాఁడనన నెల్లరుల్లాసంబు వెలిపుచ్చ వాక్చాతుర్య ధుర్యమున భోగిరాజు సదృశుండైన భోగరాజు తత్కథా కథనకుతూహలాయత్త చిత్తుండై సభికుల నవలోకించి యిట్లనను.

మ. త్రిశరత్కాలమహోగ్రసంగరకళా - ధీనక్రియాలోలుఁడై
నిశితాఖిలధనుశ్శరైకధరుఁడై - నిర్నిద్రతేజస్వియై
వశియై యాటవికాళిఁగూడి గహన - వ్రాతాద్రి దుర్గంబులే
విశయంబై తగఁ జూపె రాజు నిజదో - ర్వీర్యం బవార్యంబుగన్. 2

వ. ప్రతాపసింహుఁడు ఖిల్లసైనికసహకారంబున ఢిల్లీచక్రవర్తితో రణ మొనరించినట్లు రామరా జాటవిక సేనాసాహాయ్యంబున నాంగ్లప్రభుతతో ననియొనర్చె - అట్టి యాంధ్రాభిమన్యుచరిత్రం బెట్టిదనిన. 3

సీ. సిద్ధనాగార్జును - బౌద్ధధర్మజ్యోతి
యజ్ఞానతిమిరంబు - నణఁచెనచట
బ్రహ్మనాయని బత్తి - బాలచంద్రుని కత్తి
యద్వితీయఖ్యాతి - నలరె నచట
నాగమ్మ సైన్యవి - న్యాసాన నాంధ్రకు
రుక్షేత్ర మచ్చోట - రూఢికెక్కె
మోహనాగిరిపుర- పునరుద్ధరణశక్తి
గణపాంబ యచోటఁ బ్ర - ఖ్యాతిఁగాంచె.

తే. దేశభక్తులు పెగ్గడల్ ధీరవరులు
సార్వభౌము లలనుకవి - సార్వభౌము
లచట జన్మించి రద్దాన - నద్ది వగలు
గుండెగాలంబు గుంటూరి - మండలంబు. 4

కం. బొప్పూడి యనెడి కుప్పం
బొప్పుం గర్తపురిసీమ - నుజ్జ్వల శౌర్యం
బొప్పార యశోలక్ష్మికి
కుప్పల వెలుఁగొంద క్షత్త్ర - కులమం దలరున్. 5

తే. ధర్మకర్మాభిరతి శౌర్య - ధైర్యమహిమ
సమద శాత్రవ ఖండన- సాహ్వనమున
భక్తి దత్తి లసచ్ఛక్తి - వఱలుచుండు
నక్కాలంబున నల్లూరి - యన్వయంబు. 6

తే. అందుఁగొందఱు బాంధవా - ద్యాదరమున
లలిత గోదావరీ మండ - లమున వెలయు

రమ్య చాళుక్య భీమవ - రమ్ము ప్రాంతఁ
జెలఁగు మోగల్లు చేరి వ - సించి రచట. 7

వ. ఆ భూభుజులు కరవాలమునకుమాఱు సీరముధరించి దేశము సుభిక్షముగఁ జేయువాంఛమై సేద్యమ ప్రధానజీవనముగ వసుంధర బహువిధ సస్యశ్యామలముగ నొనర్చుచు రైతురాజులు నాఁదగి భూనాయకశబ్ద మన్వర్థమొనరించుకొనుచుండ నందు గోపాలకృష్ణరాట్పౌత్రుండు వేంకట కృష్ణరాణ్ణందనుండు సంస్కృతాంగ్లభాషావిశారదుండునగు వేంకటరామ రాజు సూర్యనారాయణాంబను సింహాచలదేవాలయంబున నుపయమమ్మాడి సుఖంబుండం గొంతకాలమ్మునకు సుకృతవిశేషమ్మునఁ దజ్జంపతులకు రామరాజను పుత్రరత్నము ప్రాద్రెంకిల్లోఁ దన్మాతామహునింట జన్మించె. రాజుతాత సోదరి రాజయ్యమ్మ గీర్వాణాంధ్రముల నుద్దండ పండితురాలు. సంశయ విచ్ఛిత్త్యర్థము కాశీవిద్వాంసులుగూడ నామె యొద్ద కరుదెంతురని ప్రతీతి. అట్టి పండితకుటుంబమునఁ బుట్టిన యీక్కొండొకతన యుపవసథమునంగల పల్లెకూటమునవిశుద్ధశ్రద్ధాభక్తులతోఁ దల్లి బాసనేర్చి మీఁద నాంగ్లభాషాభ్యాసనిరతిమై మాధ్యమికపాఠశాలకరిగి నిర్విరామకృషినల్పి యయ్యాయి తరగతుల నుత్తమశ్రేణి నుత్తీర్ణుఁడగుటకు యత్నించుచుండ విధివశమున నాంధ్రకేసరికింబలె ద్వాదశవర్ష ప్రాయమునఁ బితృవియోగవ్యథ ప్రాప్తించె. 8

తే. తండ్రిమరణింప శోకసం - తప్తహృదయ
యై జనని బిడ్డలనుగొని - యరిగెఁ దనస
హోదరిగృహంబునకు నామె - యాదరింప
నోర్పు నేర్పుల నచ్చోట - నుండె తల్లి. 9

వ. కొవ్వాడ నప్పలనరసయ్యమ్మ తనయక్కయగు సూర్యనారాయణాంబను దత్సంతతిం గౌరవానురాగములతో గాంచుచుండ. 10

తే. నాఁడ బహువిధ కందుక - క్రీడలందు
నందెవేసినచేయిగా - నలరె రాజు
సర్వశాస్త్రాల రసవాద - శాస్త్రమన్న
ప్రాణతుల్యము వానిక - పారముదము. 11

తే. విద్యతో వినయ వివేక - విమల వర్త
నము పెరుఁగుచుండెఁ దార్కిక - క్రమసమీక్ష
బాల్యముందొట్టి తగుమైత్రి - వడయుకతన
సాము గరడీల గడిదేఱఁ - జాలె నతఁడు 12

తే. పూవుపుట్టంగఁ దగఁదావి - వొసఁగు నట్టి
శైశవంబాది సాహస - చర్య దోఁచె
నీడుతో వాని తచ్చర్య - వృద్ధి వొందె
వెన్నతో మాత వెట్టిన - విద్య యనఁగ. 13

తే. చెలిమి గలిగెను నానాఁడ - చించినాడ
మునసుబుసుతున కితనికి - ఘనతురగము
కలదు వానికి నెక్కుట - కలవిగాని
దానిఁ దా వంచి స్వారి ని - త్యంబొనర్చె. 14

వ. ధైర్యసాహసముల నితండు బాబరును జ్ఞప్తికిందెచ్చు. నిజజనకుండేరి కోరి తెచ్చుకొన్న యొకయశ్వరాజము తన ఛాయం దాఁ జూచి యెగిరిపడు చుంట నధిరోహింప నెవ్వరి కలవిగాకుంట గమనించి యది తత్థ్సితి కగ్గలముగాకుండునట్లు త్రిప్పి స్వాధీనముచేసికొని స్వారిచేసిన బాబరువంటి వాఁడని రాజును జదువరులు ప్రశంసించిరి. శరీర వ్యాయామమునకుందో డతండు యోగాభ్యాసమొనర్చుచుంటం జదువు సన్నగిల్లె. తచ్చరిత్ర యంతయు నుపమండలాధికారిగనున్న పితృవ్యుఁడగు రామకృష్ణరాజె ఱింగి వ్యథపడి చేరఁదీసి విద్యచెప్పించుచుఁ దనతోఁబాటు కాకినాడకుం గొంపోయి పిఠాపురమురాజా కళాశాలోన్నత పాఠశాలం బ్రవేశింపంజేసె. అత్తఱి మద్దూరి యన్నపూర్ణయ్య రాజునకు సహపాఠియయ్యె. అవ్విద్యా శాల వార్షికసభల విద్యార్థులు నాటకములు ప్రదర్శించుట పరిపాటి. నాటక కళయన్న రాజున కమితానందము. స్త్రీ పురుషపాత్రల నత్యద్భుతముగ నటింపఁగల్గుటం దత్కళ నతండు సవ్యసాచి యనం బరగు. 15

తే. ఆంధ్రకేసరి నటియించె - నద్భుతముగఁ
జిత్రరేఖా ధనంజయ - పాత్ర లట్ల

పొసఁగ శశిరేఖ నారద - భూమి కల ని
తఁడు సమర్థించెఁ బ్రేక్షకుల్ - తనివి నొంద. 16

తే. ఉత్తమ నటుండుగా నతఁ - డొందె జార్జి
పతక మదిదాల్చి మనగుండె - పై బ్రిటీషు
వాఁడు 'తిష్ఠవేసెఁ' గనుఁడు - వలదనఁజనఁ
డిది మదికి బాధగలిగించు - నెంచుఁడనియె. 17

వ. పిదప విశాఖపట్టణ కళాశాలోన్నతపాఠశాలం జదువుచున్నతఱి నొక జమీందారుకొమరిత సీత షోడశవర్షప్రాయుండగు రాజు షోడశ కళాప్రపూర్ణుండగు చంద్రునిచందమునఁ దనకంటికిఁ గనఁబడెనేమొ యతనిం బ్రేమించె. కాని యాతండామాయాజాలమున విశ్వామిత్రుని వలెం జిక్కుకొనక శుకమహర్షివలెం దప్పించుకొనియె. 18

తే. కైతఁ దనప్రాణ నిభముగఁ - గాంచుకతనఁ
గాకినాడ కళాశాలఁ - గ్రాలు వేళఁ
బద్యరచనం బొనర్చి శ్రా - వ్యముగఁ బాడి
యెలమిచేకూర్చె హితులకు - ధృతి నెలర్చె. 19

తే. కడఁగి తాఁ దుని యాస్థాన - కవివతంసుఁ
డైన శ్రీవత్సవాయి నీ - లాద్రిరాజు
కడన జ్యోతిష హఠయోగ - కళల నభ్య
సించి కవితకుఁ బసగలి - గించు కొనియె. 20

ఉ. నిచ్చలు తెల్గుగ్రంథముల - నిష్ఠమెయిం బఠియించె సంస్కృతం
బెచ్చగు దీక్షనేర్చె బల - వృద్ధికిఁగా గరడీల సాము వి
వ్వచ్చునిపోల్కి కర్ణునటు - బాహుబలుండగు భీమురీతిఁ బెం
పచ్చుపడంగఁ జేసె మది - నేర్పడినట్టి వివేక మెట్టిదో. 21

తే. తరతరంబులనుండి క్షా - త్రమున మెఱయు
రక్త మబ్బాలు తనువునఁ - గ్రాలు చుంట
నతని దృష్టికి నాంగ్లభా - షా వ్యసనము
దొరలసేవక యనిదోఁప - విఱిగె మనసు. 22

తే. వానిలో వెల్గు స్వాతంత్ర్య - వహ్ని కణము
ప్రజ్వలింప సాహసకృత్య - భావరేఖ
లతని యాంతర దృష్టిఁ బె - న్నలము కొంటఁ
జదువు సాలించె జాతీయ - శక్తి పెంచె. 23

తే. హూణ పాలనమున ద్వేష - మొదవెగాని
భాషపైఁగాదు కంటు ప్ర - పంచమందు
దానికిం గల స్థానముఁ - దగఁ దలంచి
యాంగ్లమునఁ జక్కఁగా మాట - లాడ నేర్చె. 24

తే. అతని చారిత్రిక జ్ఞాన - మగ్గలంబు
కావుటం జేసి పరతంత్ర - గాఢ తిమిర
బాల భానూదయ మ్మనఁ - జాలు స్వేచ్ఛ
గల్గు బెద్దని యతఁ డౌడు- గఱచి కొనియె. 25

తే. దివ్యసుందర విగ్రహ - దీప్తి మెఱయు
నతనిలో నాంధ్ర తేజము - హద్దు దాఁటెఁ
దనివి దీఱఁగ రాణా ప్ర - తాపసింహ
ఛత్రపతి సాహస కథలు - చదివి మెచ్చె. 26

చ. ఎఱిఁగి యెఱింగి యొక్క దెస - కేగి ద్వితీయుని గొట్టి యాపయిం
దొఱఁగక తొంటివాని పస - దూలఁగ జేయ వడంకి యిర్వురున్
నిరతము మీ పదాబ్జములు - నిష్ఠమెయి న్భజియింతు మన్న న
త్తెఱఁగున కొప్పికొంచు నిటు - దేశపుగద్దియనెక్కి రిద్దొరల్. 27

మ. అడఁగెన్ భారతజాతిగౌరవ మహా - హ్లాదంబు లీనాఁటికిం
గడఁక న్మత్తగజంబుఁ బట్టిన జలూ - కంబయ్యె నింగ్లండు చూ
చెడి దేశంబుల కెంత చుల్కనగు ని - స్సి యిట్టి హైన్యస్థితిం
గడు రోసమ్మునఁ బాపికోఁదగదె వే - గన్ హైందవం బుగ్రమై.

కం. అని దేశమునల్దెస తో
డన దిర్గి గ్రహించె లేమి - డస్సిరి యెటువో
యిన జ్ఞానము శూన్యం బీ
ఘను లిది దాస్యాంధకార - శక్తి యటంచున్, 29

తే. ఆత్మజుండెదొ యుద్యోగ - మాచరించి
తన కుటుంబపు భారము - దా వహించి
సౌఖ్యమును గూర్చు ననుకొనె - జనని గాని
దైవ నిర్ణయ మింకొక - దారిఁ బట్టె. 30

తే. ఏక వింశతి బీజాక్ష - రైక మంత్ర
జపమునం గాళిఁ బూజించె - సక్రమముగఁ
దమ్మునకు దాని బోధించెఁ - దన మొడంద
నేమి తలఁచెనొ వెనఁ గాశి - కేగె సతఁడు. 31

## ప రి వ ర్త న ము

వ. అటనుండి హరిద్వార బ్రహ్మకపాలాది దివ్యస్థలముల సందర్శించి బాలయోగిగ నాంధ్రవసుంధర కరుగెంచి యెక్కువకాలము నిల్వక తిరిగి యరిగి జరలీ, మలకానగిరీ బస్తరు రాజ్యములఁ దిలకించి నాశికాత్ర్యంబకమునకు వెళ్ళి చెల్లెలగు సీతపరిణయమునకుంగూడ రాక వారణాసి నొక్కవర్షముండి యమరవాణిం గృషిసల్పె. అనంతర మనేక పుణ్యతీర్థము లత్యంత భక్తిశ్రద్ధల సేవించి ఘోరారణ్యముల సంచరించి లౌకిక జ్ఞానమార్జించి త్రిలింగకాశ్యపీ ఖండమునకుం జనుదెంచి గోలుకొండ తాలూకాఁ గల కృష్ణదేవిపేటం జేరి యందొక యుత్తమ గృహస్థు హితోక్తిం బాటించి సహకారాది నానావిధ భూరుహభరితమై నిత్యఫల శోభితమైన ధారాగిరి తన నెలవున కనువైనదని గ్రహించి తచ్ఛిఖరి శిఖరంబునఁ గతిపయశరత్తులు తపోనిష్ఠం గడిపె. ఒక దివసమ్మునఁ దద్గహ్వరీధరావతరణం బొనర్చుచు మధ్యేమార్గమ్మున బాట తప్పుటంజేసి కాల్సేతుల ముండ్లుదిగఁ జిటికెల భాస్కరుఁడును దజ్జనని సోమమ్మయుఁ గంటకములఁబుచ్చి రాజునకుఁ బరిచర్యలుసేసి యతనికిఁ జనయిత్రియు ననుజన్ముఁడు సోదరి గలరని తెలిసికొని వారిరప్పింప నబ్బాలతపస్వి మాతృదేవతకు నమశ్శతంబులర్పించి యాముగ్వుర పోషణభారమెల్ల వహించి సముచితగతులు గల్పింపనెంచి సేద్యమ మంచివృత్తియని తలంచి ముఠాదారునొద్దనుండి ముప్పదియెకరముల పొలము సేకరించి తన బావను సాగుచేయుఁడన నతండు కొన్నాళ్ళుమాత్ర ముండి చనుటం

జేసి యక్కోరిక వితయయ్యె. కాని తత్కుటుంబమునకు వలయు నాహార పానీయమ్ములు ప్రజలేయందిచ్చుచుండఁ దా నీలకంఠేశ్వరాలయమ్మున నిత్యధ్యానదీక్షం దవిలి బ్రహ్మానంద మనుభవించుచుండె. అంతం దాండవ నదికెగువఁ 'ఙిక్కాలగడ్డ' గలియుచోట గ్రామస్థులు చిన్నయింటిం గట్టించి యీ నందుండి శ్రీరామవిజయనగరమనుకుప్పంబు నిర్మింప సంకల్పించె. తల్లి ప్రోత్సహించినం బరిణయవిముఖుండై రామాయణ భారత భగవద్గీ తాదులఁ బఠించుచుఁ దత్కథలఁ బ్రజలకు బోధించుచు బీదలయెడ దయా ళువై కాళ్యుపాసనాబలంబునఁ బ్రశ్నహస్తసాముద్రికాదులుగ్గడించుచు జాతకములు లిఖించుచు లగ్నములువెట్టుచు విభూతి మూలికాద్యనేకవిధ వైద్యము లొనర్చుచుఁ దాయెతులు గట్టుచు నిరంతర మానవసేవామగ్న మానసుండగుటంజేసి కొండజాతులవారి కతనియెడ గురుదైవభావములు గలిగె. అనాగరికులు నిరక్షరాస్యులైన కోయలు చెంచులు సవరలు భిల్లులు బోయలు ప్రభృత్యాటవికులయెడ నాఁడు ప్రభుత్వోద్యోగులు ప్రయోగించుచున్న దమననీతి సల్పుచున్న క్రూరకృత్యములు వర్ణింప వేనోళ్ళ శేషాహికైన దుశ్శకము. కదళీక్షీరఘృతకుక్కుటాదుల మూల్య మీకయ గృహస్థులనుండి లాగికొనుచుండ్రు. అరణ్యదహనసమయమున గ్రామీణులచే రేయుం బవళ్ళార్పించి రిక్తహస్తములఁ బంపుచుండ్రు. కుక్షి లోత్క్రమణావతరణములఁ గర్మణ్యాశూన్యముగ డోలీలమోసిన దూషణ ఘాతప్రతిఫలంబు లర్పింత్రు. కేవలారణ్యగేహులు తిర్యక్కులవేఁటలాడి మనుచుండ్రు. మన్నెపుఁ బ్రజలం గొందఱు పర్ణకందమూలజంబూసహకార భల్లాతకకంటకఫలకర్కటీకర్కంధూకదళాకపిత్థఫలంబుల క్షుధా వ్యధ వాపి కొండ్రు. సొఱకాయ బుఱ్ఱలోఁ జింత, జీడియంబళ్లు వెదురుబియ్యపు జావ ద్రావి జీవింత్రు. అప్ప్రదేశ మంటువ్యాధుల కాలవాలము. వైద్య సాహాయ్యము నిష్పచ్చరము. వలయుచోట సడవింగాల్చి కృషియొనర్చు కొనఁ గాననశాసనమున వీలుచిక్కమిఁ దత్ప్రాంతము నిరంతర క్షామ దేవతాస్వైరవిహారమున కాలవాలముగనుండె. అత్తఱి. 32

కం. 'ఏజన్సీ' స్థితిగతులను
రాజడిగి యెఱింగెఁ బ్రజలు – రాఁ దత్ప్రాంతం
బోజచెడియున్నఁ గ్రమ్మఱఁ
దేజము గలిగించు తెర్వు – తెలుపుచు దయతో, 33

కం. అత్తాకట నత్తాడెడి
కుత్తులఁ గని తల్లిపొందు – కుం దరయంగా
మత్తాకుఁ దెప్పఁ దేలెడి
కత్తిదొర దయంగనందు – గా యని తలఁచున్. 34

తే. మానవత్త్వైక దృష్టిపై – మమత నెట్టి
పెంచుకొన్నట్టి భౌతిక – వృద్ధి కలిమి
నెంత సామ్రాజ్య బలమున్న – నేమి ఫలము
పొలుపుగా నింత – పెరుఁగదు – బుద్ధిబలము. 35

కం. కుటిలాత్ము లుగ్రవర్తను
లటవీశాఖాధికారు – లందఱు నొకటై
కటకట! యియ్యాటవికులఁ
బటుబాధలు పెట్టుచుంట – పాపం బరయన్. 36

వ. పిల్లికిఁజెల్గాట మెలుకకుఁ బ్రాణసంకటము. 37

ఉ. లొంగి దురాశ కీసకల – లోక మమాయికమంచు నెంచి యు
ప్పొంగి దురాత్ములై కడకు – పుణ్యము పాపము నాక వీఁక స
త్సంగతిలేక పెత్తన మధర్మ – పథమ్మున సాఁగుచుండఁగా
దొంగలు దొంగ లూళ్ళపుర – దోపిడికై తగఁబంచి కొంద్రిటన్.38

ఉ. మెట్టిన సేవలం దనిపి – మేకొని కోర్కులఁదీర్ప మెత్తుర
ట్టిట్టనఁ బట్టికొట్టి కడు – హీనముగాఁ బరికింతు రయ్యయో
పెట్టినరోజు పెండ్లియును – బెట్టనినాఁ డీఁకఁ జావుగోరు వా
రెట్టుల యాప్తులౌదురు హ – రీనరులెంత కృతఘ్నులో గదా. 39

వ. చెఱకు తీపని వేరుతో లాగవచ్చునా? చేతులు పొడవని మూతులు పొడువ వచ్చునా? 40

తే. విషమ విషకంటకావృత – విపినవీధి
శీతవాతాతపంబుల – సిల్లైగాక
బట్టకుం బొట్టకుం గడు – బాధపడెడి
యాటవికులను హింసించు – టఘము గాదె. 41

తే. నిల్చి ప్రజనేత్రు కడుఁ బిల్చి - పిల్చియున్న
వాని హృజ్జలూకము దయఁ - బూనఁ గలదె
యూవములు కాల్చి కాల్చుచు - న్నట్టి నేల
మొక్కవచ్చునె రైతెంత - మోజుపడిన. 42

కం. పాతురె నీతిం జనతతి
ఘాతురె ఘాతుల యెడంద - రా యసఁ జంపం
జూతురె తీతువు లణచిన
రీతిం గుణిగతుల ఖ్యాతిఁ - బ్రీతి తొలంగన్. 43

కం. మట్టిద్దైనను నెట్టులో
గట్టిగ నాయెద్దె గెలువఁ - గాఁ దగుసంచున్
బట్టిన పట్టును వీడక
కట్టామునఁ బల్కు ఖలుని - గాదనఁ దరమే. 44

కం. దాయెద్దువోలెఁ గొందఱు
నీ యేల్బడి మేపుచున్న - దిది యెఱిఁగి మహా
మాయావు లమాయికులను
న్యాయాన్యాయములు నాప - యడఁతురు స్వేచ్ఛన్. 45

కం. జడివడువునఁ జెమ్మటలే
వెడలఁగ శ్రమసేయుచున్న - వేడుక దీఱం
గడి వరహోయగు బోసం
బొడయని కేగాక పేద - కొదవునె ధాత్రిన్. 46

వ. బ్రదుకుఁదెరువు సన్నగిలుటం బ్రిదిలిన యానమైఁ దొడుగరులట్ల దోఁచుప్రజ కుపకరింపని దొరతనము దొరతనమా? అంతర్మదయుతులైన శ్వేతభూపులు తృణావృతకూపములు. 47

తే. గిరిజనాభ్యుదయమ్మెఁకఁ - బరమలక్ష్య
మది యసువులొడ్డి సాధింతు - నరయ నరుల
సేవ హరిసేవ యనుకొని - దైవ మహిమఁ
గర్మయోగిగ మాఱె నా - జ్ఞాన యోగి. 48

కం. పంచాయితి సమితుల స్థా
పించెం బరిశుభ్రగతులు - పీ న్విందుగ బో
ధించెన్ వ్యసనములను మా
న్పించెం దత్ఫలితములను - బ్రీతిం గాంచెన్. 49

కం. ఊరూర సంచరించుచు
నోరారన్ సూక్తులెన్నొ - నొడువుచు వారల్
గారవమునఁ దనుఁ గాంచ న
పారదయాహృదయుఁడగుచుఁ - బ్రజలం గనుచున్. 50

వ. మన్యముననుండం గొంగసింగియనునూరఁ గూపద్వయంబుందీయ జలంబు శూన్యంబగుట జనులు చింతించి రాజుంగొంపోయి ముహూర్తంబు పెట్టించి బావి త్రవ్వం గంగ ప్రత్యక్షమయ్యె.అంగ్లభటాధికారియగుమంథామూర్తిరాజు బిడ్డల నిర్వర నాశ వదలుకొన్న వారిని రక్షరేఖలచే రాజు బ్రదికించె.కాని యహర్నిశలాంగ్లేయులఁగూర్చియాత్మం జర్చించుచుజనులతో.

శా. ఆరాధింపుఁడు దైవమున్ నిరత మా - హ్లాదంబుతో నిప్పపూ
సారాయిన్ మఱి జీల్గుకల్లు విడుఁడీ - సామ్రాజ్యపుం 'గోర్టు' లం
జేరంబోకుఁడు రాచలంకెలెపుడేఁ - జేడ్పాటు గల్గించినన్
వీరు ల్మీరలెదుర్కొనుండు జయము - ద్వేలంబుగాఁ బొందుఁడా. 52

తే. కంచెమేఁకవిధాన మె - క్కంగఁ జూచు
గొప్పయధికారి సుంత మీ - గోడు వినునె
మంట యడుగున మసియుంట - మనమెఱుఁగమె
చెఱకునకుఁ బండుపండుట - చేటుకొఱకె. 53

వ. ఈఁతకానికే జలగండమన్నట్టు హింసించువాఁడే హింసింపఁబడు. కాని కాలము చేరువగావలె. పండనిదే రాలదుగదా. 54

తే. ఏతదర్థంబ వచ్చితి - నెటిఁగితి నిఁక
నిట్టి యన్యాయముల నరి - కట్టఁ దగదె
గోముఖవ్యాఘ్రములతోడఁ - గూడిమెలఁగు
టెంత కష్టమొ నేఁటికిఁ - గొంత తెలిసె. 55

ఉ. ఏల నపీతిఁ బ్రీతి యది - యేహ్యా మనూహ్యా దరిద్రభూతవే
తాళమహోగ్రతాండవము - దారుణహింసల కాలవాల మా
ఖీలనికృష్టరోగదము - భీకరపాపకరం బపాస్త స
చ్ఛీల మగౌరవప్రదము - శీఘ్రమ దానిఁ ద్యజింపుఁడీ జనుల్. 56

ఆ.వె. కాకితోడ మీరు - కబురంపినంత నే
వచ్చి వ్రాలి దొరల - కుచ్చితముల
గోట మీటి మీదు - కోర్కులు కొనసాగ
ముందునిల్తు ముదము - నంద గెల్తు. 57

వ. అరికకుఁ జిత్తగండ మాఁడుదానికిఁ బిల్లగండ మన్నట్లు మీ కీ యధికారులే గండము. తిట్టినగాలికిఁ బోవును; దిన్నలోనికిఁ బోవు నని వారికిం దెలియు. వారీ మన్నెమునకు వచ్చుట చెఱకుఁదోఁటలో నేనుఁగు దూఱినట్లు. చితి చచ్చిన వానిం జింత బ్రదికిన వానిం గాల్చు - పండనియేఁడు పాఁటెక్కువన్నట్లు పెట్టనివాఁడే యెక్కువ కష్టపెట్టు. గాలియున్నప్పుడే తూర్పార పట్టిన ట్లోపికున్నప్పుడే యేపనియైనం జేయవలయు. నా రక్తములోని ప్రతిబిందువు మీక్షేమముకొఱకే చిందిం[illegible]శాస్త్రియజా, పాడీ ప్రజల బాధించుచుండిరని రక్షకభట[illegible]యయ్యకుఁ జెప్పితి. 58

ఆ.వె. అనుచు వారి తగవు - [illegible]ము న్యాయ
మూర్తియనఁగ గొప్ప - [illegible] నంద
నెంతొ యీాసు వెఱిగె - సెల్బుడివారికి
నల్ప దూళ్ళ కతఁడె - నాథుఁడంచు. 59

చ. జటిలసమస్యలం జులుకఁ - జక్కని తీర్పొనగూర్చునేర్పు నీ
కిటు లొదవించె దైవమని - యెన్నుదు రప్పుజలెన్నరాని సం
కటములనేఁ జలింపవని - గౌరవభక్తిభజింత్రు పాదముల్
నిటలముసోక మ్రొక్కి యత - నిన్ స్తుతియింతురు నిర్మలాత్ములై.

కం. తేజస్తోయజహితుఁడన
రాజిల్లెడి రామరాజు - రాకేందునిభ
భ్రాజియయి ప్రజకుఁ బ్రభుతకు
రాజీ యొనరింపఁ జేసె - రమణీయకృషిన్. 61

తే. అవసరము గల్గి వచ్చిన - యధికృతులకు
నెన్నివిడుతలో వివరించె - మన్నెముగతి
యొక్కరైన దయంగన - కుంటఁ గాంచి
విప్లవాత్మక దృష్టిని - బెంచుకొనియె. 62

తే. నిత్య ముద్యోగి కృతఘోర - కృత్య వితతి
నేల్బడికిఁ దెల్పఁ బాటింప - కితఁడె ద్రోహి
యనుచు రాజుపైఁ బోలీసు - లాగ్రహమునఁ
గట్టి 'సెక్యూరిటీ కేసు' - పెట్టిరపుడు. 63

వ. దొరతనము నర్సీపట్నమునుండి 'లంబసింగి' వఱకు 'ఘాట్‌రోడ్డు' వేయ సంకల్పించి తీర్మానించి వలంయు విత్తమిచ్చె. దేవుఁడు వరమిచ్చినం బూజారి వరమీఁడన్నట్టు లది ప్రజాసౌఖ్యమున కేర్పడినదని విశ్వసించి నను దన్నిర్మాణ కార్యక్రమమునఁ దధికృతులొనర్చిన యమానుషచర్య లనన్య సామాన్యములు. అందు- 64

## విప్లవ హేతువు

కం. తహసీలుదారు బాస్టియ
నహరహ మొనరించినట్టి - యక్రమ చర్యల్
సహియింప నెవరితరమగు
నహహా రాక్షసుఁడుగాక - యతఁడు నరుండే. 65

కం. అతఁడే విప్లవకారకుఁ
డతిమూర్ఖుం డనుచు నెఱిఁగి - యాతని యాస్తిం
జతురతఁ గైకొనె దొరతన
మతులిత సాక్ష్యమిది వాని - యవగడములకున్. 66

ఆ.వె. కఱ్ఱు చేతఁ బూని - యెఱ్ఱని యెండని
కుంభవృష్టి యనియు - గొణగ కద్రి
రాళ్లు వగులఁ గొట్టి - ఆ బాట నిర్మించు
కూలిజనుల నెపుడు - జాలిఁ గనఁడు. 67

ఆ.వె. ఆఱణాల కూలి - యాంగ్లేయు లిమ్మన
నందు నాల్గణాల - నపహరించి
బేడ కూలియిచ్చి - బీదల నేడ్పించెఁ
బెత్తనంబు చేతఁ - బెట్టినంత. 68

తే. కాసులకు దాసులైన పో - లీసువారి
నండగాఁ జేసికొని రాచె - నడవిజనుల
వనితలయెడ నతఁడు సూపి - న నడతఁగన
నట జినుండైనఁ బ్రళయాగ్ని - యై దహించు. 69

చ. అతని కబంధహస్తముల - నల్లలనాడనివాఁడు లేఁడు దు
ర్మతి యితఁడెప్పుడీల్గునని - మానక తిట్టనివాఁడులేఁడు క్రూ
రత నడఁగింప రండనుచు - రక్షణకోరనివాఁడు లేఁడు సు
స్థితి యెవఁడెట్లు గూర్చునని - చింతఁ గృశింపనివాఁడు లేఁడటన్. 70

శా. వెట్టింజేయనివానికాళ్ళు పయికిన్ - వ్రేలంగఁ గట్టించి పెన్
రట్టుంగూర్పఁ గశాహతిం బఱపి వ - స్త్రమ్మూడ్చి మూఁడిం గడుం
బెట్టించెంగదకార మఖ్యుఁడు ని - ర్భీతిన్ దయాశూన్యుఁడై
చెట్టిల్దిట్టలువొంది కుందిన విధుల్ - సెప్పంగ శక్యంబొకో. 71

తే. పురుషులను గొట్టి యాంధ్రురఁ - దఱిమి శిశుల
నెట్టి వగ్గుఁ దిట్టి పసులఁ - బట్టి బంది
వెట్టి వెట్టికి రానట్టి - దిట్టలయెడ
నతఁడు సేయని క్రూర కృ - త్యములు లేవు. 72

తే. దుస్స్పహ దరిద్ర భారానఁ - దూలుచున్న
యాటవికులన్న లోకువ - యగుటవలన
నమధికోత్సాహపూరిత - సాహసమున
నతఁ డొనర్పని ఘోరకృ - త్యములు లేవు. 73

తే. పెద్దయుద్యోగి యని గొప్ప - పేరెగాని
గొప్పగొనములు తచ్చర్య - గోచరింప
వౌర మంగళవారమన్ - పేరెగాని
మంగళకరంపుఁ గృతులష్టు - మనము గనము. 74

శా. ఆ భస్మాసురుఁ డెప్డు డేరితలపై - హ స్తంబు దాఁ బెట్టునో
యే భంగిన్ వికటాట్టహాసముల నే - యే యూళ్లలోఁ జొచ్చునో
యే భామామణిఁ జూచి యేమనునొ యెం - దేరీతి వ ర్తించునో
యా భూ తేశుఁడెఱుంగునంచు మదిలో - నల్లాడుచుం డ్రెప్పుడున్.

తే. అతని మెలకువ ప్రజకెంతో - హానిగూర్చు
తెలిఁగి యెఱుఁగనియటు లుండి - రెల్లదొరలు
అంత రాజది గమనించి - యడవి జనుల
కన్ను దెఱపింపఁ గట్టెను - కంకణంబు. 76

వ. గిరిజనుల కగ్గిర్య్ఋషి వృత్తాంతము నిత్యనూత్నముగ వినంబడు చుండె. మఱియు నగ్నికి వాయువు తోడుసూపిన ట్లా బాస్టియనున కోవర్సీలు సంతానముపిళ్లె యనువాఁడొకండు తోడ్పడె. ఇంక వారిర్వురు.

కం. సుందోప సుందులటు జన
సందోహము నేఁచి రేక - చక్రపురాగ్రసం
బందిన బకువలె రుధిరము
చిందించిరి పీల్చిపిప్పి - చేసిరి యూళుల్. 78

ఆ.వె. పంచదారకంటె - లంచమె కడుఁ దియ్య
నయ్యె నచట నున్న - యధికృతులకు
నగుట గుట్టు బయటి - కందీయ కన్యోన్య
మైత్రిఁ బ్రజల మచ్చ - మాపుచుండ్రు. 79

ఉ. కాదనువాఁడులేక కడ - కన్నుల కావరమెల్లఁ గ్రక్కుచుం
బేదమెకాలచాయ నిఱు - పేదలఁ జూతురు నీతిమాలి మా
ఖేదము లిట్లులున్నవనఁ - గేంద్రము వేగులఁబంపి నత్యసం
వాదమెఱింగి దిద్ద దెటు - వాయుఁ బ్రజార్తి పరేశపాలనన్. 80

తే. అమ్మహో ఘోరకృత్యము - లాలకించి
రక్షకభటాధికారి నా - రాజు పిలిచి
కామభూ పక్కణములకుఁ - గలఁతగలుగఁ
బ్రభుత కార్యాలయమ్ములు - వగులు ననియె. 81

వ. రాచలెంక లాలోచించి రాజును మన్యమునకు దూరముసేయనెంచి యడ్డతీగలకుఁ బంపయత్నించుచుండ నుపమండలాధికారి షజులుల్లాఖాను సద్గుణ సంపన్నుఁడుగాన సమకుపచ్చి తదుదారాశయము ప్రవర్తనము దేశభక్తి బ్రహ్మచర్యము నిస్స్వార్థప్రజాసేవ త్యాగనిరతి సత్యదీక్ష యచంచలధైర్యశౌర్యసాహసాదులు కని విని యత్తపస్వియెడ గౌరవ భావముగలాఁడై దుచ్ఛర్తిముఠాదారు చొక్కాలింగన్న దొరచే ముప్పది యెకరముల భూమినిప్పించి యొడయేటితీరమునఁ బైడిపుట్టగ్రామములో నివసించుటకు రెండు పూరిండ్లఁ గట్టించియిచ్చి సేద్యమునకు రెండుజతల యెడ్లు క్షీరమున కొకగోవు నొసంగె. తల్లి తనకండగనుండ రామరాజుటఁ దపోనిష్ఠాదుల నిర్వర్తించుకొనుచుండెం గాని దానం దనిసనక దీనజన రక్షామంత్రము జపించుచుండె. నానాఁటికి నానావిధ నరకయాతనలు మన్నెమున హెచ్చుచుండెనసువార్త లార్తులవలన నేనాఁటికానాఁ డాతని చెవిసోకుచుండె. అమ్మహావీరుఁడు పట్టువిడక ప్రభుతవెట్టిన కట్టడులకు లోనగుచు లోనగుచు. 82

కం. షేకుమదీనావలనఁ దు
పాకింగాల్చుటయునేర్చె - బాణములేయన్
బాకుం బల్లెము విసరఁ గ
శాకలితుం డెటిఁగె నేర - లప్యుం బోలెన్. 83

తే. ధాటికి న్వాటమైనట్టి - ఘోటకంబు
వలచి నుర్వీలు గ్రక్కంగ స్వారిసేసె
శాంతిరాజుమేనల్లుఁడు - సమరఖడ్గ
మిడఁగఁ ద్రిప్పుటనేర్చె ర - ణేచ్ఛ నిచ్చ. 84

తే. అంత నొకనాఁడు కానన - ప్రాంతమందు
గూడెముల పెద్దలందఱు - గూడవలయు
నెల్లి యపరాహ్ణమున వత్తు - నేనట కని
కబురు మన్నెమునకుఁ బంపి - కడఁకఁ జనియె. 85

వ. రాజురాకంగని పక్కణనాయకబృందము ప్రత్యుత్థానంబుసేసి జేజే లర్పించె. ఆ ప్రజాసేవకుం డుచితాస్తరణమున నాసీనుండగుటంగని వారు నుపవిష్టులైరి. బ్రహ్మవర్చసము తాండవమాడుచున్న యత్తపస్వి

మోముఁ గాంచి యామోదాశ్చర్యభరితమానసులైరి. భగవంతుఁ డీరూప మున వచ్చెననుకొనుచు నాస్వార్థత్యాగి దివ్యాకృతిని దనివిదీరఁ బరికించు చుండిరి. 86

ఉ. మేలిమిమించు మేనికళ – మిక్కిలి చక్కని ముక్కు పద్మముం
బోలు విశాలనేత్రములు – పూర్ణశశాంకునిగెల్చు వక్త్రమున్
నీలకురుల్ బొమల్విలు గ-ణింపవు బాహులు దీర్ఘముల్ శ్రుతుల్
గ్రాలల శ్రీలునా బవిరి – గడ్డము రాజున కొప్పె నొప్పుగా. 87

వ. అట్టి యమ్మహాయోగి. 88

కం. ఊడుపుఁడు మన్నెపు టిడుమల
నుడువుఁడు దేవతల క్షుత్తు – నుడిపినక్రియ మీ
రడుగిడి యని శరతతిచే
నడిగింపుం డాటవికుల – హక్కుల నెల్లన్. 89

వ. అని తన యంతరాత్మ బోధింప నిటకరుదెంచుటంజేసి యెల్లరకు బేదకుపెన్నిధి లభించినట్లుండె. అత్తఱి. 90

సీ. ఉంగరాల్దిరిగిన – ముంగురుల్ ఖరకర
కిరణాల జిగితోడఁ – గీచులాడఁ
దెల్లతామ్మల – దీధితు లటునిటు
ముకుకాడ తళుకుల – ముద్దులాడఁ
బాలసొరుంబోలు – పాలపూసలపేరు
కంఠెకాంతి రమింపఁ – గౌఁగిలింప
మోకాఁటిదాఁక వ్రే - ల్మతకగోచిపసందు
బిళ్లల మొలత్రాటఁ – గ్రేళ్ళుదాఁటు

తే. గళ్ళకంబళి మూఁపునఁ – గరయుగాన
ముగ్గువన్నెల మురువులు – మురువుసూప
రాజురాక రాకగనెంచి – రహి రహింప
నెఱుకుదొరవచ్చె జనతతి – కెలమిహెచ్చె. 91

సీ. చెంగల్వజిగిమీఱి – చెన్నారు తలచుట్టు
పిక్కిలి యీఁక బెడంగు – పకపకనగ

పులిగోళ్ళ పతకానఁ - బొల్చు మారుతిబొమ్మ
కటునిటు తాయెతు - లందమొలుకఁ
బరమౌషధీలతా - బంధురవలయముల్
భుజకీర్తులుగ బాహు - వుల వెలుంగ
మహిధూళిమైఁ గులు - మాపుడు నీర్కావి
రెంటెంబు జానువు - లంటిఁ వ్రేల

తే. రంగుగీరల జుబ్బా హొ - రంగుఁ జూపఁ
జెవుల నిత్తడిపోగులు - చెలువు గులుక
నవయువ యొకండు కోయల - నాయకుండు
రామరాట్సభ కరుదెంచె - రాణ మించె. 92

సీ. తలపాగ గ్రుచ్చిన - కలికితురాయినా
నెమ్మియీఁకలు కళ - ల్చిమ్ముచుండఁ
గాళికా భక్తికిఁ - గమనీయ చిహ్నమౌ
కాశ్మీర తిలక రే - ఖయు రహింప
బాలచంద్రునివంటి - పాలపూసలదండ
వెండికంటెకు వింత - వెలుఁగు లిడఁగ
బిళ్ళల మొలత్రాడు - చల్లడమున కెంతొ
జిగిబిగి గూర్చుచుఁ - జెలువు మిగుల

తే. రజత నూపుర మంజీర - రవళి తనదు
శౌర్యగాథలు బిరుదులు - సాటుచుండఁ
బ్రముఖ మిత్రులు వెంటరా - రాజుఁ గనఁగ
నమ్రుఁడై వచ్చె నొకచెంచు - నాయకుండు. 93

తే. గోఁజము జింక చర్మము - చారపప్పు
జున్ను వెదురుబియ్యము పాలు - జుంటితేనె
తునికిపం డ్లావునేయి క - స్తూరి రాజు
పాదసన్నిధినుంచి తాఁ - బ్రణతి సల్పె. 94

వ. కానఁ గోనఁ గ్రుమ్మరి మను మమ్మిట నధికారులు కారింత్రు దొరా చిత్తగింపుఁడు. 95

చ. దురితము నాక వన్యమృగ - తుల్యముగాఁ బరికింత్రు మమ్ముఁ ద
చ్చరితము దోషదూషిత మ - సాధ్యము దాని మలర్పనేరికిం
గరుణ యొకింతలేమిఁ గల - కాలము లంచపుఁగూళ్ళు మెక్కుటన్
మరగిన యిద్దురాత్మకులు - మమ్మొకప్రక్కన పండనిత్తురా. 96

వ. బంగారుగాలమునకు బంగారు చేపలుపడవు. మంచికూటిలోనికి మంచి కూరదొఱకదు - అధికారబలమున వారి తప్పులు చప్పున బయట పడవు సామీ. లావుమీఁద వంపుతెలియదు — కల్లగాదు దొరా నేలఁబెట్టి కాల రాచుచుందురననమ్మ. 97

ద్విపద

బాబయా మావెత - భగవంతుఁ డెఱుఁగు
నీబాధ లిఁకమీఁద - నేగతిఁ దొలఁగు
నధికారు లధికారు - లైరి మేమొందు
వ్యథ వాపఁగలవాఁడు - వసుధ లేఁడెందు
తడిగుడ్డతో గొంతు - తఱుగుదురయ్య
కడుకష్టముల మేము - కరఁగుదుమయ్య
యాబండలనుగొట్టి - యారాళ్ళమోసి
రాబాటవేయుచో - రాగుట్ట తగిలి
కాలిఁవ్రేల్పగిలి ర - క్తము కాఱుచున్న
కూలితేలని నెట్టి - కుమ్మింతురన్న
పడిపడి మ్రొక్కినఁ - బాపమ్మ నాక
పడనెట్టుదురు పట్టు - పగ్గాలు లేక
మఱుమాట వల్కిన - మసి యౌదురనుచుఁ
గొరడాలతో మమ్ముఁ - గొట్టింత్రు రాజ
కూలి చాలదు మాకుఁ - గూడులేదన్నఁ
బోలీసులను బంపి - పొడిపింతురన్న
కట్టికట్టికుఁ బెక్కు - బుట్టిలు వగుల
నెట్టిటోపీల వా - రేడ్పింత్రు జనుల
కామాంధకారంబు - గన్నులఁ గప్ప

లేమలలో మంచి – లేమ నాసింతు
రయ్యయో మొనమొన్న - యాపీరిగాని
నెయ్యపుటిల్లాలి – నిండు చూలాలి
గాసిలఁ జెఱపట్టి – కానకునెట్టి
చేసిన పనులేను – చెప్పలేనప్ప
బాధతో నష్టామె - ప్రాణాలు విడిచెఁ
గ్రోధాన జగమెల్లఁ – గుమిలి నిట్టూర్చె
నాఁకలి మంటతో – నల్లాడు ప్రజల
నే క్రియ రక్షింతు - రీ మానధనుల
నిందన్క మాగోడు - నెవ్వరు వినరు
కందిపోయెడి మమ్ముఁ – గరుణతోఁ గనరు
పండిన యడవులే – పంటపొలాలు
కొండగుహలె మాకుఁ – గూర్మి గృహాలు
రామన్నదొర యింతి - రత్నాల దొంతి
లేమిచేఁ దినుటకు – లేమిఁ జింతిల్లి
చింత యంబలి ద్రావ – జీర్ణంబు కాక
కొంత సేపటి కది – గోడు గల్గించి
యంటువ్యాధిగ మాఱి – నసువులం బాసెఁ
గంటిరా మాతీరు – గనులార మీరు
పక్కుల కంటెను – బశు జాతికంటె
దిక్కేది యుంటిమి – దేవరా వింటె
బీళ్ళఁ గంచెలు వేసి – బిగియించు కొనిరి
రాళ్ళు హద్దుగ నుంచి - రాఁగూడ దనిరి
వచ్చిక గలచోటఁ – బశువులు మేయ
వచ్చి బందెలఁ బెట్టి - బాధింతు రయ్య
యేనాఁటినుండియో - యిట సాగుచేయు
మానేల లన్నియు - మానక లాగి
తమ ముల్లెవలె ముఠా – దారుల కిచ్చి
శ్రమ జీవులను మమ్ముఁ – జంపుదురయ్య

పసికి మాకును దిండి – పసచెడిపోయెఁ
గసి దీర్చుకొనుశక్తి – కనఁబడదాయె
దుండగులకుఁ బాల – తోఁదిండి దొఱకఁ
గండలు పిండిన – గంజిలేదేమి
బలుదోమకాటుచేఁ – బ్రాప్తించునట్టి
చలివేకి కెందఱో – చత్తురు దేవ
మందు మాకులు లేవు – మమ్ముద్ధరింప
నోదొరా మమ్మేదొ – యొడ్డుపట్టించు
నీదు బొమ్మను నిల్పి – నిచ్చపూజింత్రు. 98

వ. వారిదృష్టిలో నోరుమూసినమూగ నోరు దెఱచిన ఱాగ. ఇంకెట్లు బ్రతుకుట సామీ యని యమ్మూగజీవుల వేదన నివేదింప మన్నోమను మహాగ్ని పర్వత మంతర్మథితమై తీవ్రతర క్రోధ దుఃఖాగ్నిజ్వాలలు విరజిమ్ముచున్నదని గ్రహించి యాగ్రహించి తగిన సమయమనియెంచి రణమునకుఁ బొంచి, మార్గములగాలించి, దివింబరికించి జనులమేలెంచి రాజల్లనఁ దలపంకించి నిట్టూర్చి నిబ్బరించుకొని పాలకపాలిత సుఖదుఃఖ యోగపద్యస్ఫురణతో నిట్లను. సామాజిక మతభేదాది నానావిధ బృహజ్జటిలసమస్యా నిర్మాతలు సామూహిక నిర్మూలనాయుధ చయాహంకార క్రూరకృత్యాచరణచణులు, సుదుర్వహాఖర్వగర్వధూర్వహులు హూణాధికారులు. 99

శా. ఔనౌ నెంతకులేరు తెల్లదొర – లాహా వారి దుష్కృత్యముల్
కానంజాలినవారి యాత్మరగులుం – గాదన్నవాఁడెన్నఁడేఁ
గానంజాలఁడు లోకముం జటుల సంగ్రామాగ్నిఁ దత్సైన్యముం
గానం దావమురీతిఁ గాల్చుఁగలుగుం – గా సౌఖ్యమీభూమికిన్. 100

ఉ. వారక దాస్యబంధమున – వర్ధిలఁజాలక యాత్మదేశ మీ
ఘోరదురంతదుఃఖముల – కుం గుఱియౌటఁ దలంచి నీతికిన్
హారతిపట్టి మానవుల – కందఱికి న్సుఖమబ్బఁజేయ నీ
భారము మోయ ధర్మమగు – భారతవీరులకంచు నెంచెదన్. 101

మ. ఒకపక్షంబును జంకఁబెట్టుకొని యే – వో పోరులన్ రేఁపి వే
ఱొకపక్షంబు నడంగఁద్రొక్కఁగల మా – యోపాయధీశక్తులం

ప్రకటింత్రాతెలవార లిద్ది తెల - వారన్వార్చియున్నార మో
పికతో నట్టిప్రశాంతవర్తనము ని - ర్వీర్యంబుగా నెంచెడిన్. 102

వ. రవిరశ్మినార్జింప శాఖోపశాఖలు దూరదూరముగ వ్యాపించున ట్లీ దొరలధికారాదాయార్థులై దేశదేశముల నాక్రమించి బొజ్జదువ్వుకొనుచుం బోఁజాలకుండిరి. అంచు వారలం గాంచి. 103

## జాతీయ చైతన్యము

ఉ. స్విన్నశరీరుఁడై విమల - శీతల వీక్షణరోచిఁ జూచి భా
వోన్నతచారు వక్త్రమున - నుజ్జ్వలతేజమెసంగ హాసనం
పన్నవచోవిలాసములఁ - బల్కె నిటుల్ ప్రజలార మీ మహా
భ్యున్నతి కీర పోరి విజ - యోద్ధతి హైందవ కేతువెత్తుఁడా. 104

చ. తొలఁగని యింద్రభోగముల - తోఁ దులదూఁగెడి రాచలెంకచేఁ
బలువిధ బాధలం జివికి - ప్రాణము గుప్పెట నిల్పుకొన్న మీ
కలఁకువ విన్న సన్నమొన - గల్గిన రాళ్ళ. బదాలువడ్డ యా
నలుగలవాని చందమున నా - నెగు లగ్రకపాల మంటెడున్. 105

తే. హీనకృత్యవినోదుఁడై - యెసఁగు కుమతి
మంచివారలు గాంచి గ - ర్హించుటరుదె
పంకమగ్నసుఖంబెంతొ - పడయు కిటిని
గని జుగుప్సాకరంబని - యనరె బుధులు. 106

తే. విశ్వమెల్లను వ్యాపించి - వెలయు వేల్పు
కంటికింగానరాకుండు - ఘనచతురుఁడు
ఇహపరంబులకధికారి - యీశ్వరుండు
సద్గుణంబులె మెచ్చు మో - క్షంబునిచ్చు. 107

తే. ఉండనిలు పండమంచ మొ - క్కండులేక
కానకోనల మీపడు - కష్టచయము
చల్వటాొకట్టడమ్ముల - సకల సుఖము
లనుభవించెడి తెలవాని - కర్థమగున. 108

ఉ. మేలిపదార్థ సంచయము - మీకిట దక్కఁగనీరు చేతులం
గాళుల బొబ్బలెక్క ఘన - కానన ఘోరదావాగ్ని నార్పినం
బాలకు లీరు రువ్వ యమ - బాధలిఁకెట్టు సహింత్రజేయులై
యాలమొనర్చి గ్రామరమ-నంది సుఖింపుఁడు మీరు బిడ్డలున్. 109

ఉ. పండిన దోసనాఁ గనుల - పండు లొనర్చెడి గీములేదు మా
ర్తాండనిశాకరుల్కరవి - తానముఁ జొన్పని కప్పులేదు భీ
ముండననొప్పఁ డెవ్వఁడును - బూచిన తంగెడువోలెఁ దోఁపఁడొ
క్కండును నేమిసీమయిది - గాంచిన విజ్ఞులకడ్పు చెర్వఁగన్. 110

మ. కులభేదంబులుగ్రుళ్ళి కంపెగయుటన్ - గుర్తించి కుత్కీలముల్
జలధుల్దాటి సమస్తభారతము నా - స్వాదించి పాలించిర
న్యులు మున్ నేఁడును దప్పదయ్యెనది మా - న్యాత్మోత్తురే యెట్టులే
బలశౌర్యమ్ములతో స్వరాజ్యరమ సం - పాదించుకోఁ జెల్లదే. 111

చ. మతకపు మాటలన్మరగి - మానవ సంఘపు భావతంత్రు లిం
దతుకక యైకమత్యమణి - హారపు సూత్ర విఖండనక్రియా
పతన మలీమసస్థితుల - భారతవీరమహోగ్రశౌర్యమన్
రతనము దాస్యధూళిఁ బడి - రాయిగఁ గన్పడు శ్వేతజాతికిన్. 112

ఆ.వె. మాఱు దలి ప్రేమ - మనల రక్షింపదు
కన్నతల్లి కరుణ - కాచుఁగాన
భరతవీరుఁ డెవుడు - పాలించు నీనేల
నపుడ మనకు సౌఖ్య - మావహిల్లు. 113

కం. ఊగుండెనైనఁ గరఁచున్
రాగాంధులు వీరొనర్చు - రక్కసి చేతల్
సాగిన విన్నాణ్ణిచ్చుటఁ
బోఁగాలము వచ్చె వీరి - పొగరిఁక నడఁగున్. 114

తే. ఇట్టి శఠు లిహపరముల - కెక్కక కడ
కేక వింశతి నరకాల - కేగఁ గలరు
పరమ పుణ్యాత్ముఁడొక్కఁడే - పాపులందు
నీలితెఱముందు వజ్రము - వోలె వెలుఁగు. 115

తే. మీవడు నవస్థ తెల్లను - దాప కుండ
బూనగ్రుచ్చిన చందాన - వ్రాసి తెల్ల
దొరల కంప నమ్మక ప్రభు - ద్రోహి ననుచు
నన్ను బాధింప నెత్తులు - పన్ని రెన్నొ. 116

కం. అచేత చేతఁ జేతము
రాచఱికముఁ ద్రోత లగ్గు - రాయనఁ దెగి నా
రాచము చేతంబట్టితి
రాచకొలంబెల్ల నద్ది - రాయన దీక్షన్. 117

తే. ఏల్బడిని గూలఁద్రోఁత నా - కిష్టమంచుఁ
బ్రజలక్షేమమునకుఁ బాటు - పడెదనంచుఁ
బ్రభుత సర్వంబు నన్గని - పడగ విప్పె
దండధరుఁడను గాకది - తల్లడిలున. 118

వ. శత్రుత్ములున్న ప్రదేశమేగాదు దేశమె విసర్జింపవలయునని విజ్ఞుల
సందేశము. కాని జననీ జన్మ భూమిశ్చస్వర్గాదపిగరీయసీ యనుసూక్తి
శల్యగతమైయుంట మన విషయమును మనముద్ధరించుకొనందగు. 119

కం. క్రూరాధికారి మోపిన
నేరము పైవారికే ము - నిజ మెఱిఁగింపం
గారుణ్యమునకు బదులుగ
నారుణ్యము సూపుచుందు - రంబకములలో. 120

తే. మోసగానికి మఱియొక - మోసగాఁడు
త్రాగుబోతున కింకొక - త్రాగుబోతు
జూదగానికి వేఱొక - జూదగాఁడు
సఖుఁడుగా నౌట యేమి యా - శ్చర్య మరయ. 121

తే. ఇట్టి యన్యాయ్య కార్యము - గిట్టి దన్నఁ
బట్టి బంధింపఁ జూచుట - చట్ట మగునె
యేలినాతండె పజ నిట్టు - లేచు టన్నఁ
గంచెయే చేని మేసిన - కరణిఁ దోఁచు. 122

తే. పుక్కిట విసమ్ము గ్రక్కెడి - పురుషుతోడ
సంధి సాగునె మన మెంత - శ్రమ పడినను
దల తగిలినప్పుడేగదా - తడవుకొనుట
జలధి విపరీత ఘోషలు - ప్రళయమునకె. 123

ఆ.వె. వెలిజగంబునెల్ల - వీక్షించుచుండియు
బూజుఁ జిక్కియున్న - పుర్వునట్లు
దాస్య బంధ జనత - తనశక్తి డీల్పడ
దైన్య హైన్య జీవి - తమ్ము గడపు. 124

తే. కల్లకపట మెఱుంగని - ఘనుల మిమ్ము
ఱాచి ఱంపానఁ బెట్టి రీ - రాచలెంక
లింక నిశ్శంకముగ వారి - కెదురు తిరిగి
హక్కులను బొంది సౌఖ్యము - లందవలయు. 125

తే. సత్యవాజ్నిధి గాంధి ప్ర - శాంతి కంధి
తా నహింసావిధానంబుఁ - బూనెఁగాని
ప్రభుత యన్మదగజమది - పాటిసేయ
దంకుశంబున నద్దాని - నణఁచవలయు. 126

కం. రణ వితరణ వీరులు పా
రణ హరిసంస్మరణ గుణ వి - రాజిత చరితుల్
జనభరణ కరుణ కల్మిన్
మనిన మహాకీర్తిపరులు - మన నృపు లాదిన్. 127

ఆ.వె. రాను రాను చిన్న - రాజ్యము లేర్పడె
మనుజపతుల కైక - మత్య ముడిగె
నధిప వితతి తెలియ - కన్యదేశీయుల
కాశ్రయంబు నిచ్చె - హాని దెచ్చె. 128

తే. జిగురుకండెకుఁ దగిలిన - ఖగము రీతిఁ
జిక్కియుంటిమి యీదాస్య - శృంఖలముల
నాంది యిది స్వరాజ్య సమర - నాటకమున
కంచు రణభేరి మ్రోగించి - మించు టొప్పు. 129

తే. దాస్యబంధంబునం దిట్టి - తగిలియున్న
భరతదేశమునంగల - భాగ్యలక్ష్మి
బహుళపక్షశశాంకుని - భాతిఁ దఱుగుఁ
గావున స్వరాజ్యదీక్షమైఁ - గ్రాలవలయు. 130

తే. తగరు కొండను డీకొంట - తగదిది యని
యెవ్వరేఁ జెప్ప వింటిరా - నొవ్వి తొలఁగ
దొగి స్వరాజ్యమెఁ స్వారాజ్య - మొగడనకయి
ప్రాణములనైన నీసిద్ధ - పడుట లెస్స. 131

కం. పరలోకమందు నెచ్చటో
పరగును యమబాధలంచుఁ - బల్కుదు రరయన్
నరకమన వేఱ కలదా
నరనాథులు వెట్టు బాధ - నరకము కాదా ? 132

తే. నరులఁ జూతురు వారు వా - నరులయట్టు
లాత్మగౌరవ శూన్యత - నది సహింత్రె
నివురు గప్పిన నిప్పునా - నిలిచె మన్నె
మగ్ని పర్వతమై ప్రేలు - టవసరంబు. 133

ఆ.వె. ఎట్టి మేలి గడియ - నిటకరుదెంచిరో
దోఁచుకొనుచు దుడ్డు - దాచుకొనుచు
నల్లవారి బాగు - తెల్లవారెంచ రిఁ
కెట్టు దేశమోర్చు - వట్టిఁ గలదు. 134

కం. వాడిమి పోడిమి సెడి మన
నాడీ నాఁడిట్టులై జ - న వ్రజ మెంతో
గోడుం గుడిచెడి వేళం
బాడిం బాటింప రెంత - పాపము సెపుఁడీ. 135

ఆ.వె. అకతాయలట్టు - యధికృతుల్ వర్తింప
బ్రతుకఁ గలరె ప్రజలు - వెత గుడుపక
పాడు నూతఁ బడ్డ - ప్రాణిపై నొక బండ
ఱాయి వేయు నట్లు - రాతు రకట ! 136

ఉ. ఇంత నిహంతలైరి దొర - లెట్టుల వీరి యహంత డిందు నిం
కెంత నియంతలై జనుల - నేగతిఁ జింతలపాలుసేయ నూ
హింతురొ చెప్పరాదిది స - హింతురె పెద్దలు జ్ఞానవృద్ధు లీ
బొంతను గాల్చివేయఁదగుఁ - బో చిఱుపేలను గ్రుక్కనేటికిన్. 137

తే. మెత్తఁదనమున స్వాతంత్ర్య - మిత్తురంచు
వార్చియుంటిమి యిందన్క - వారి దయకు
నెన్ని తెఱఁగుల బెనఁగిన - నింతవఱకు
దొరల వెలలించుటకు దారి - దొఱకలేదు. 138

తే. వాకిటికి వచ్చిరని పీఁట - వైచినంత
వంట యిల్సొచ్చి యజమాని - గెంటి రౌర
ప్రాణగొడ్డము పరపరి - పాలనంబు
ప్రాపణీయము స్వాతంత్ర్య - ఫలము పరము. 139

కం. సురసురభి తెఱఁగు దొఱకిన
భరత వసుంధర నెవండు - వాయఁ దలంచుం
గర ఖడ్గకాంతి విద్యు
ద్భరమునఁ గన్నెదరఁగొట్టి - తరుమక యున్నన్. 140

వ. జలమృగయుఁ డావుమాటునఁ జరించుచు జమ్ముకోళ్ళఁ జిల్వలఁ బట్టి పొట్టంబెట్టుకొన్నట్లు భారతీయాధికారులు కొందఱు హూణాధికృతుల యండన సామాన్య ప్రజలఁ గొట్టుకొని తినఁ జూతురు. గ్రహంబులకన్న నభిగ్రహంబులు బాధాకరములైనట్లు కరములకంటె నవప్రదానములు ప్రజలకు హింసాకరము లగుట కరము విచారకరము. దొర లవ హర్తలు గాని యువ కర్తలుగారు - మార్తురు మేలు గూర్తురా? అనుచు.

మ. ఘనదీక్షామహిమోగ్రతన్ రిపుల యా - జ్ఞావార్ధి బంధింప ని
ర్జన భూశైలవనాటకోటియుతుఁడై - జ్యాజాతవాంఛోద్ధతుం
దినవాథాదుల సాక్షిగా బలయుతున్ - ద్వీపాధిపుంగెల్తునం-
చనఘుం డాత్మఁ దలంచె రాముఁడు సమి - ద్వ్యాపారపారీణుఁడై.
(బ్రకోశి) 143

వ. మఱియు నతం డిటను.

కం. భరమగు నెట్లు కవాటము
లరయఁగ గుడి మ్రింగసవాని - కప్పడములెగా
ధరఁ బిడికిటఁ గొను నరునకు
బరువే భారతము మావి - పండగును గదా. 144

కం. పెన్నధికారుల యురవడి
కిన్నెలవయి యుంటనిచటి - కిగ్లాడికినే
మన్నెవుఁ బజ దలయొగ్గుచు
నన్నన్నా చెప్పరాని - యాపద లొందున్. 145

ఆ.వె. ఊర్వి యెంత కాల - ముండునో మన మంత
కాల ముండ మంట - గాథ సత్య
మింక నెంత దన్క - నీరీతి హైన్యత
నొరుల కాలిక్రింద - నుండఁగలము. 146

కం. పతితుల హింసించుటకై
ధృతినూపెడి భారతీయు - లీ యుద్యోగుల్
మెతుకులకొఱ కరుగంగా
బ్రతుకులు చెడె నన్నమాట - పాటింపరుగా. 147

కం. అధికారాయఃపదహతి
నధికముగా వ్యథలగుడుచు - నప్పుడు హింసా
ప్రధన మొక యొడ్డు సేర్చుం
దుదినిర్ణయ మిద్ది నాకుఁ - దోఁచిన వఱకున్. 148

కం. మన మన్గడ హైన్యస్థితి
నునికిం గని చూప రింత - యును నౌదార్యం
బని ఘనులనయము పోర
న్వెనుదీయరు దాస్యబంధ - భేదన పరులై. 149

కం. వారోర్త్రింతకు నైనం
గారలు నాలెక్కయంద్ర - కారణ జన్మల్
మీరటువలెఁ దెగి ఘనరణ
మారణ హోమమున ముక్తి - మార్గము గనుఁడా! 150

తే. ఆత్మధర్మాభిరక్ష మా – కభిమతమని
నాటికూడియ మొనరించు – నాయకతతి
యిట్టి రాకాసి తనమున – కెట్టు లోర్చుఁ
బాకలపుటేన్గుగతి వట్టుఁ – బ్రభుత కింక. 151

కం. వారీరన నీరీరన
నేరీతిగఁ దీఱుఁ గోర్కు – లెవరికి వారే
భారతము మనదియని సమ
భారము మోయుటకు రాని – వారిఁక నేలా? 152

కం. గుఱువెట్టి నిదురఁ గూరిన
భరతము మేల్కొంచి వారి – భరతము పట్టం
బరువెత్తుచున్న తఱియని
యెఱుఁగరయే నాంగ్లరాజు – లెగ్గు గుడువరే. 153

ఉ. ముక్కున గవ్వగట్టి మును – మున్నుగ హక్కులు లాగికొంటకై
చిక్కని వేడినెత్తురులు – చిమ్మఁగలాఁడ నిఁకెట్టులైన నా
ముక్కున నూర్పుగల్గఁ బల – ముం బలముం గలనివ్వెలార్చి పెన్
ద్రిక్కయడంచి యీదొరల – దీవులఁ జేరఁగఁ బాఱఁద్రోలెదన్. 154

ఉ. ఏటికి మాట నేరికడ – కేగిన వారికి వంతపాడుచుం
గూటికి మానవత్వమును – గూళల కమ్మిన నీచుఁ డెప్పుడీ
బాటకురాఁడు వచ్చినను – ఖండనమొల్లఁడు దాస్య భూతము
చ్చాటనపాటవ ప్రకృతి - శక్తుల రక్తము కోరకుండునే. 155

ఉ. రాటు రణంబుసేయక దొ – ఱంగదు రాజ్యము వీరభోజ్యమన్
మాట దినేశ చంద్రగతి – మాఱని మాఱదు ముజ్జగంబులన్
వేఁటకు నేగునట్టు రణ – వీథులఁ బూరుషు లంపపోటురుల్
ధాటిగసాగ కంబుధుల – దాఁటుదురా పరదేశపాలకుల్. 156

తే. విప్లవజ్వాల చెలరేఁగ – వేగ వెలయు
శాంతిసందేశ మామీఁద – సౌఖ్యమబ్బు
ముసుఁగులో గ్రుద్దులాట న – మ్మోదకరము
కాదు కదలుఁడు కదన రం – గమున కిఁక. 157

తే. హేతుమద్వాక్యముల నాతఁ - డిట్టు లనఁగఁ
దోఁకఁ ద్రొక్కిన త్రాచునాఁ - దోఁచి జనత
చదలు ప్రిదిలినఁ జెదరని - సాహసమునఁ
బోరి స్వాతంత్ర్య లక్ష్మిని - బొందుద మనె. 158

## గంటము రాజు నభినందించుట

తే. అమ్మహాజన వాక్యము - నాలకించి
విశ్వమానవ కళ్యాణ - విధిఁ దలంచి
గట్టుపాణకల మునసబు - గంటము దొర
వినయ వినమిత గాత్రుఁడై - యిట్టు లనియె. 159

తే. అతికుతూహల గతుల మీ - రాడినట్టి
పలుకులెల్లను మాకెంతో - ప్రమద మొసఁగెఁ
బతియవాయక మేము మీ - ప్రక్క నిలిచి
పిడికి లింతయు చిచ్చైనఁ - విడుగునైన. 160

తే. ఎవ్వఁ డేమన నీకేమి - యెగ్గు గల్గు
నిమ్మనకుఁ బట్టునే చెద - లేటి మాట
మాకు మీ సాహచర్యము - మంచి దయ్యు
పూలతోఁ గూడి నారయుఁ - బొందుఁ దావి. 161

తే. దేవ నీ రూపమును గృష్ణ - దేవిపేట
నలరు నా నీలకంఠేశ్వ - రాలయమునఁ
గాంచి ప్రత్యక్షమయ్యె ని - క్కరణిదేవుఁ
డంచు నెంచిరి గిరిజను - లాత్మలందు. 162

ఉ. ఆదరణీయు లాటవికు - లంచు మముంగృపఁ జూడవచ్చి తే
మీదయ మాకుఁగల్గ నని - మేషులనైన గణింప మిప్డు మా
ఖేద కథ ల్సెవింబడఁగఁ - గెంపుకడ న్స్ఫటికంబు రీతిగా
లేఁదొగరెక్కినట్టి కను - లే దెలుపున్భవదీయ భావముల్. 163

ఉ. కొమ్మని ప్రేమ పుష్పముల - కొమ్మని ముద్దులుగుమ్మ నీవకై
కొమ్మని కమ్మవింటి దొర - కుమ్ము శరమ్ముల వమ్ముసేసి నీ

తమ్మకుఁ దమ్మియమ్మ సత-తమ్ము భయమ్మును గ్రమ్మఁజేయఁ ద్యా
గమ్ము పరమ్ముగాఁ దలఁచి - కానల మమ్ములఁ గావ వచ్చితే. 164

తే. కీళ్ళు క్రిందయినప్పుడు - కిన్కఁ బూన
ఫలముగల్గునె యెంతటి - ప్రతిభ యున్న
దేశ మతిదుర్దశాబ్ధిలోఁ - దేలు చుండ
మదన వేదన కువిదరో - యదను గాదు. 165

కం. ఇంద్రియ సుఖ నిరతుండై
యింద్రువలెం జంద్రురీతి - నిహభోగ కళా
సాంద్రుండగు మానవుఁడు జి
తేంద్రియు గతి విజయ కీర్తు - లేక్రియ నొందున్. 166

వ. అని యామెకు సమాధాన మిచ్చి వచ్చితివని వింటిమి. 167

తే. వలపు టూయెల లూఁగిన - వనిత సీత
నెటు విడిచి వచ్చితయ్య యీ - యిడుమలుపడ
భోగ మొల్లక పూనితె - త్యాగ దీక్ష
నీదు సత్కీర్తి లోకాన - నిలిచి యుండు. 168

కం. పురజన రక్షక భటులిటు
నిరతము మముఁ గాలఁడాచి - నిర్భీతిమెయిం
జరియింతురు ధృతిమింతురు
సరియగు మార్గంబు సూపి - సాకుము రాజా! 169

ఉ. ఇందఱమిన్ని బాధలు స - హించితి మున్నది యుగ్గడించుచో
నందియమేల యీ ప్రకృతిఁ - జచ్చిన జంతుల నేరిమెక్కరా
బందులు వీరలో బ్రదికి - బాధవెలార్చెడి మర్త్యమెక్క రా
బందులు వాయునే నరక - బాధలు మాకిఁకనైన దేవరా! 170

కం. ఏ మెఱుఁగ మింత ప్రేమము
మామీఁదం జూపినట్టి - మనుజుల మును మీ
కోమల పదముద్రితమై
భూమి యిది పవిత్రమయ్యె - భూపకులేంద్రా! 171

కం. అడవుల నిడుములు గుడుచుచు
గడు(గ్రుంగిన మాకుదారి – కల్గించినచో
నెడవున( జలిపందిరి యిడు
కడు పుణ్యు(డు వొందు యశము – గలుగదె మీకున్. 172

చ. నికటమునందు నిల్చి తగు - నీతులు దెల్పి పురోభివృద్ధికై
సకలము ధారవోయ(గల - సాహసివై మము(గాచియుండ( దా
వక శుభవాక్సదానడవు – వారక మమ్మొక త్రాటిపైనిటన్
మకుటములేని రాజువని – మామక మానసముల్వచించెడిన్. 173

ఆ.వె. అచి తూ(చి పలుకు – నభ్యాసమున్న మీ
మాట మాకు మణుల – మూట యగుట
నెట్లు త్రోతు మద్ది – యెఱి(గి యొ'(దల( దాల్ప
కాద్య ఋషి సమాన - యయనిధాన. 174

తే. కాల మనుకూల మగుటచే - గాదిక్రింది
పందికొక్కులుగా వీరు - బలిసి రిప్డు
వాతికాసుల కాసించు – పలువ లమ్మ
నా(డికకు వన్నె గూర్తురా – నమ్మరాదు. 175

వ. ఇమ్మహాకష్టపరంపరలకు ముఖ్యకారకుఁడు బాష్టియను. అతనికి నాకు( బ్రత్యక్షసంబంధముంటచే నీ సంపూర్ణసత్యము మీకు మనవిచేయు చున్నా(డ. అదే యూరైనచో( గోళ్ళుకూయవా యన్నట్టు వాని హృదయ మున దయయున్నచో మామంచికే శ్రమించియుండెడివా(డు. నీతిలేని వా(డు కోతికన్న బీడు గదా. 176

కం. పాముని తొల(గి మెలంగిన
గామ్మై వెన్నాడి పట్టి – కాటియపెట్టున్
మేమెట్టు బ్రదుక( గలమిఁక
సామీ! యీాయొఱటు మాకు – జము(డై వచ్చెన్. 177

వ. నమాజుసేయ(బోగా మసీదు మీఁద(బడినట్టు లేచియే మనవిసేయ( బో(గా వా(డు మాపై విఱుచుకొనిపడు. దయలేని యత్తకు దండము పెట్టి నను తప్పే. దాసరి తిప్పలు దైవమున కెఱుక. మెత్తగానున్న మో

చేతితోఁ ద్రవ్వినట్టున్నది మాగతి. వజ్రమును వజ్రముతోఁ గోసినట్టు దుర్మార్గుని దుర్మార్గముచేతనే జయింపవలయు. 178

తే. ఒక్కసీతను జెఱపట్టి - నుసురు గొట్టి
సర్వనాశనమొందె రా - క్షసుల తేఁడు
సతులఁ బెక్కండ్ర నన్నిట - హతముసేసి
చెక్కుచెదరఁడు వీఁడెట్టి - రక్కసుండొ. 179

ఉ. భీకరకృత్యముల్సలిపి - భీతిలఁ జేసెదె యన్నఁ గ్రుద్ధుఁడై
బాకునఁగ్రుమ్మినట్లతడు - వల్కినఁ గుల్కిన దాననున్న యా
వేఁక మెఱుంగదా యనుస - రించిన సీతుల లోతుచూడదా
లోకము గ్రుడ్డిదా కటికి - లోభికిఁ జాగికి భేదమెంచదా. 180

తే. బల్లెపుం బోటులట్టి నా - ప్రశ్నములకు
సరిగఁ బ్రత్యుత్తరం బీయఁ - జాలకతఁడు
చల్లగాలికి నులక మం - చమ్ము వోలె
బిగిసికొనినాఁడు కోపము - బిట్టువుట్ట. 181

ఉ. ఏగతిఁగొల్చనం బ్రజల - నీఁగల దోమల రీతిఁజూతు రు
ద్యోగులు భోగులీతెగులు - యోగులు త్యాగులు మాన్పకున్నచో
సాగును వారితేరు జన - సంఘము చ్ఛిద్రథ చక్రఘట్టనం
బ్రేగులుప్రోగులై పడ థ - రిత్రి రజస్సున లీనమై చనున్. 182

# రణ ప్రేరణము

వ. అనఁ జెంచునాయకుఁ డందుకొని యోయయ్యా యీకొఱకరాని కొయ్య మమ్మిట నిలువనీయఁడు. గోవిందడవిలో నెండుచెట్టు పై గొడ్డలి వేయఁ బట్టించి పెడకేల్గట్టించి బండతిట్టులు తిట్టించి యొడలు పగులఁ గొరడాలఁ గొట్టించి చెఱఁబెట్టించె. పెదవలసమునన బెండు వదలుని దబ్బాఱ సేసి ముప్పుత్రిప్పలువెట్టి మూఁడు చెర్వుల నీర్ద్రావించె. గట్టుపాణకల గ్రామాధికారి గంటము దొరయు నతని తమ్ముడు మల్లుదొరయు నిట్టి పనులు దగవని వారింప వారి పొలములన్ని స్వాధీనము సేసికొనె. గూడెము ముఠాదారు ముట్టడము వీరయ్య దొరను జైలులోనికి ద్రొబ్బించె.

గంటము దొర యిల్లు కాల్పించె. ఈ బ్రదుకు బ్రదుకుటకంటెఁ జచ్చుటే మేలు. త్రాడో పేడో తేల్చుకోవలసినదేసామీ యనుచు గాముమల్లు దొర యందుకొని యౌను నీచమునకంటె మరణమే మేలంద్రు. ఈ రోడ్డు వేయుట మీ సుకమునకని యిఁకముందిట్టి మేళ్ళెన్నెని సేయుదుమని లేని పోని యాసలు సూపుదురు దొరా. 183

తే. ఎన్నటికొసాయ మొనరింతు – రన్న నద్ది
నమ్మి యందన్క మనమేల – నవయ రేపు
దినెడి నమిలికంటెను నేఁడు – దినెడి కాకి
మేలని వచింత్రు పెద్దలు – కాల మెఱిఁగి. 184

కం. దొరలున్న రూపుఁ గనుఁగొనఁ
దొరకొనమికి నల్లదొరలు – దోఁపిడికాండ్రై
గిరిజనుల రాతురక్కట
గిరిజయుఁ గరుణింపదెట్లు – కీడు దొలంగున్. 185

తే. చీడ పట్టిన చెట్టయ్యెఁ – జెంచు బ్రదుకు
కుంపినీవాఁడు మమ్మింత – కుంచినాఁడు
కాంచి రమ్మన మనవారు – కాల్చివత్తు
రేలపాలాక్షుఁ డెదురైనఁ – దేలిపోరు. 186

తే. రోహిణీకార్తె వెల్గు సూ – ర్యుని విధాన
మండిపడుచుంద్రు దొరలు మా – మాటయనిన
నాడు నానాఁటి కిటుకడు – నాసిరిల్లు
వర్షమున వర్షములులేని – పైరువోలె. 187

ఉ. పెట్టనికోటనీకు రణ – వీరులు గంటము మల్లు సోదరుల్
చుట్టువెలుంగు నాటవిక – శూరులు చిచ్చుబిడుగ్గు లాజిలో
జెట్టివి నీవు కట్టలుకఁ – జివ్వకు నిల్చిన వైరివర్గముల్
గుట్టలుగుట్టలై పడరె – క్రూరులపాలన మంతరింపఁగన్. 188

వ. అనుఁడు యోజనము పొడవున మలందొలచి పదునొకండుమలుపులు గల యీ రాబాట నిర్మించుట కేవలము మీరా రావులం జూడనోపకకాదు. అటవీసంపదనెల్ల హాయిగా బండ్లమీఁద దొర్లించుకొని చను టకు, ఎలుక చావునకుఁ బిల్లి మూర్ఛపోవునాయని రాజవీజయగు రామ

రాజనఁ గొవ్వెల్ల స త్తెము స త్తెమెఱను జూపి చేపనుబట్టుట కని తల యూపంగని. 189

కం. తెలదొరలు తమకు నండగఁ
గలరని యీ నల్లదొరలు - గావించిన యి
క్కలుషపుఁ గృత్యములను వినఁ
దలయేఱుగలానికైనఁ - దలయే రొదవున్. 190

తే. అసురాచార్యువలె ధర్మ - మనక వినక
యాసురాచారముల శాంతి - యబ్బు టెట్టు
నాక నాకులగతి సుఖా - నందమొంది
తనకుఁ దాగొప్పయనుకొంట - తగని తంట. 191

తే. నరకుఁడీతండు కాలిడ్డ - నాఁటఁగోలె
నిచటి గ్రామీణ జీవన - వృక్షమునకు
శిశిరఋతువయ్యెఁ గృషిమధు - సిద్ధు లొలయ
మూఁడుపూ లాఱుకాయలై - మొనరు బ్రతుకు. 192

ఉ. పాపము మూట కట్టుకొని - పైకి సుబుద్ధివలెం జరించున
ప్పాపిని దైవశాపదవ - వహ్ని వెసంగసితోడఁ గాల్పదే
చూపుఁడు త్వత్ప్రరాక్రమము - సూర్యశశుల్వెలుఁగొందుదాఁక మీ
చావకథల్ వ్యథల్ బుధు ల - జస్తుతిపాత్రముగా లిఖింపరే. 193

ఉ. ఆంధ్రజయధ్వజం బిచట - నాకసమంట వెలుంగ నష్టది
గ్బంధన మాచరింపవలె - వైరు లిటం జొఱఁబూనిరేని త
త్కంధర లుత్తరించి పర - తంత్రతమోర్కులమై యశః కళా
బంధుర రీతి మాతృపద - పంకజముల్భజియింపఁ గాఁదగున్. 194

వ. తిర్యగ్జాతింబలెం జరించువారి చరితందడవం బనిలేదు. లేదని యూర కొంటయు సాధ్యపడదు. కారణము లౌకికసుఖదుఃఖములం దేకదేశవాసు లొకవిధముగఁ బాలివారలగుట. దౌష్ట్యము సైఁపరానిదని గీతంబ్రుపీక రించి కృష్ణుఁడు ద్రిప్పిన రణచక్రగతి జగద్విదితము. ప్రవికంపిత జనుఁడు పరిక్షత చరిత్రుఁ డాగ్నేయ కీటక సదృశుఁడు నగు నియ్యధికృతి లోపము లవలాపము సేయ నెవ్వఁడోపు. ఉదా త్తతానుదా త్తతల గు ర్తింపక విధినిషే

ధంబులఁ బాటింపక దినదినపతితుఁడగుచున్న కృపణుని ధిషణ పచేళి మముం బొరయుట కల్ల. మాకుం దయాళుండవగుమని పెక్కువిడు తల ప్రార్థించి నొత్తుము చత్తుమన నతని చిత్తంబు మెత్తబడదు. సముత్థా నజ్ఞాన శూన్యం డౌషమువాడినట్లున్న యాంగ్లేయాధికారుల చర్యలు మన్నెమున కుపకరించుననుట దబ్బఱ. పైవారి కసత్యనివేదిక లీ బాస్టి యను కమీషనరుతోఁ జేయిగలిపి నిచ్చపనుప వానిన వారు విశ్వసించి మనలరాజద్రోహులుగఁ బ్రకటింత్రు. వీరవారలకుఁ గనులు సెవులు. హిమము సూర్యునికంటె బలహీనమైనదయ్యు నొక్కొక్కతఱిఁ దరణి సైతము పొదివి నిర్వీర్యునట్లకనంబఱచి నిజశక్తి విరజిమ్ముంగదా! మనమలంతులమని తలంచి తలవంచి తపించుట లగ్గుగాదు. పెద్దవాఁడైన చంద్రునకు లేని స్వయంప్రకాశము చిన్నవైన నక్షత్రములకున్నది. పెనుబామొక్కొక్కప్పుడు చలిచీమలకుం జిక్కి చచ్చు. నేఁడమ్మనాఁడు గుడుచు గోడాడ దుశ్శకము. ఇదివడకారుగాని జడికారుగాదు. శౌర్య మయూరంబు పురివిప్పక వీరవిప్లవజ్వాల లాంగ్లసైనికనికరముంగప్పక జగము కన్విప్పదు. ఉష్ణమ్ముష్ణమ్మున శీతమ్మగున, జ్ఞానవృద్ధులంద్రు. కొండదేవత మహాకాళి నిజకరాళవక్త్రముందెఱచి చలద్వేల్లల్లంబమానా రుణదీర్ఘజిహ్వయై క్షుధార్తి నేత్రగోళంబు లగ్నికుండంబులుగ వెలుంగఁ గ్రూరనరనాథరక్తాస్వాదనతృప్తిం గ్రొంగొత్తదీప్తిం బొంద వేచియున్నది. కాార్తికేయుఁడు నూత్నరాజ్యకాంక్షయై వార్చియున్నవాఁడు. అరణ్యవాసుల ముక్తికిఁ కరణమే శరణ్యము. 195

తే. కూడు మనఁ దీసివేసెడి – కొంటెతోడఁ
గూడునే సఖ్య మదియెంత – కోరుకొన్నఁ
గార్యవాదిగ నిదిసరి – గాదు గాన
ఖడ్గవాదిగ సాధింపఁ – గలము మనము. 196

చ. వనమునఁ జిక్కు నోషధుల – బల్లెల నెట్టెట్టొ యమ్మినూకలం
గొని తిను పేదలంచుఁ గడుఁ – గూరిమిఁ జూపక దుష్టబుద్ధియై
జనులను గష్టపెట్టి నిటు – సాగెను విప్లవమంచు నేలికల్
కనుఁగొన వాఁడు నిక్కమడ – కత్తెఱఁ బోకతెఱంగు కాఁడొకో. 197

ఉ. ఊళ్ళఁ గలంచి కృత్రిమవు – టూహలఁ బెంచుచుఁ బొంచి లంచపుం
గూళ్ళను మెక్కుచుం బ్రజలఁ – గొట్టుచుఁ దిట్టుచుఁ దన్నుఁగట్టిగాఁ

ద్రాళ్ళను దానె తెచ్చుకొనె – తప్పదు వానికి మిత్రియుత్తతిన్
గాళ్ళకుఁ జుట్టుకొన్న యహి – కామక గట్టిగఁ గాటువేయదే. 198

ఉ. అంగిటబెల్ల మాత్మవిన - మన్న జనోక్తి కతండ మూదలన్
సంగతి యెల్లఁ దెల్లమిఁక - జాగొనరింపక వాని దుష్క్రియల్
భంగమొనర్చి యిప్పుజల – భారముఁ దీర్చక తెప్పవాల్తునే
సంగరరంగమందరులఁ - జంపి యశమ్మొగిఁ గూర్చుకుందునే. 199

తే. చిన్నయుద్యోగి యని యూర – కొన్న మనకు
నార్తితీరని యెనలేని - హాని గలుగు
చూచుటకుఁ జాల చిన్నదౌ – చుంచెగాని
గోడ ద్రవ్వుటకుం బంది – కొక్కు సుమ్ము. 200

తే. ఉదధి నుష్ణప్రవాహము లున్నయట్టు
లతని హృత్సీమఁ గ్రోధాగ్ను - లమరి యుంట
నెంతచెప్పిన వానికా – వంతయైన
నెడఁద నాట దిఁకేమని - యెంచ వచ్చు. 201

తే. దృష్టిపథరోధి యాదుర – దృష్టవాది
బెడిసికొట్టుట యెఱుఁగని - బేల గాన
నగ్నికల్పులతోఁ జెఱ – లాట యంచుఁ
దలఁప కీరీతిఁ బ్రజకీడు – దలఁచుచుండె. 202

వ. రాచపగ త్రాచుపగ యని యెఱుంగఁడు. ఊతికుండ కినుపతెడ్డుగ నున్నఁగాని పనిజరుగదు. ముందున్నది ముసళ్ళ పండువు. 203

మ. ఇలువెళ్ల న్నిలువెల్ల ముల్లెగమితో - నిల్పేరు నుద్యోగికి
కలసత్యం బెటుగోచరించు జనసా – ఖ్యం బాతఁడెట్లెంచుఁ బా
జ్యాల బోధామృత మెట్లు గ్రోలు నిఁకదే - శోద్దీప్తి యెట్లబ్బునే
తలకీపద్ధతి హృద్వ్యథాకరము గా – దా మార్చు సిద్ధింపదా. 204

చ. ఉదధులు దాఁటివచ్చి మన - యుర్వి నిటేలెడి తెల్లవాఁడనం
గదురును భీతి మీకతని – కావర మైక్యత డింపఁజాలదే
చెదపురుగెంత పట్టుకొనఁ - జిక్కని చెక్కులనైన మెక్కదే
పదుపురు పట్టుపట్టి బల – వంతుఁడు సైతము లొంగిపోవఁడే. 205

ఉ. మానవ నాథు నానల న - మానుషచర్యలు నాక వీఁకమై
గానల వేఁటకాండ్రఁదొగి మృ - గంబులఁ గొట్టినయట్టు స్వేచ్ఛగా
వైణవదండధారు లతి - వేలరుషాగ్నికణోజ్ఝితక్రియా
దీనమనస్కు లుగ్రయమ - తేజులు మీఁపజఁ గొట్టి రుద్ధతిన్. 206

ఉ. నెత్తురుటేరు లీఁదఁగల - నిశ్చలులే నిలువుండు లేదయే
నొత్తగిలుండు భీరువులు - నూటికి ముగ్గురు నల్వురున్నచో
మెత్తబడుంబరాక్రమము - మీసము ద్రిప్పెడి వీరవర్యులే
కత్తులతోడ రండు జన - కంటకులన్నుఱుమాడి గెల్వఁగన్. 207

వ. తిండికిఁ దిమ్మరాజు పనికిఁ బోతరాజువంటివాఁ డిప్పనికిం బనికిఁరాడు.

ఉ. క్షేత్రమెఱింగి విత్తనము - శిష్యుని చిత్తమెఱింగి బోధయుం
బాత్రమెఱింగి దానమని - పల్కిరి వృద్ధులగాధదృష్టితో
క్షాత్రమొకింతలేని యొక - షండునకుం రణవిద్యనేర్పినం
గోత్రయశోర్థియై చటుల - ఘోరరణంబున నిల్వఁజాలునే. 209

చ. మలగొబలం సరస్సులఁ బ్ర - మాదభరంబనుకోక లోయ భూ
బిలముల వృక్షరంధ్రముల - వేణునికుంజములం లసజ్ఝరీ
జలముల సానుసీమల న - సాధ్యమునాక నిగూఢవృత్తిమై
మెలఁగి చెలంగి వైరులకు - మిత్తివలెం జరియింత మిత్రులం. 210

తే. నగరములనుండి వచ్చుసై - న్యముల యాట
యిట్టి యటవీకుభృత్తుల - నెట్టు సాగు
నొక్కయూరి కరణము మ - ఱొక్క యూరి
వెట్టి యనుమాట వినలేదె - వీరులార! 211

తే. కామధేనువుఁ బూజింపఁ - గలుగు ఫలము
వట్టిగొడ్డును బట్టనే - ముట్టి పడును
గొట్టినను సింహమునె గుహఁ - గొట్టు వలయు
నక్కఁగొట్టిన ముత్తెముల్ - దక్కఁ గలవె. 212

చ. కదలికలేని యంగమది - కాలగతిం బలహీన మౌనటుల్
కదనములేక చచ్చె నిట - క్షాత్రకళల్ జనముల్ దివాంధముల్

బ్రదికినరీతిగా బ్రతుక - పాడియె సంగర సాహసక్రియా
ఖిదురములేక దాస్యగిరి - భేదనముం బొనరింప నేర్తుమా. 213

తే. దమననీతిని బఱపెడి - దైత్యు లింక
నంకెకెటురారు మన్నెపు - టార్తి వినరు
పిల్లిశాపంబులకు నుట్టి - ద్రెళ్ళి పడదు
చీరఁదుడువంగఁ బోవదు - చిలువ కాటు. 214

తే. పృష్ఠమాంసాదనంబిఁక - విడిచి మనము
నవ్యక ర్తవ్యదీక్షకు - నడుము గట్టి
దొరల పడమటి దెసకు వే - దరిమి కొట్టు
టఖిల శుభవ ర్తకు హ్హేతు - వని తలంతు. 215

కం. ఎగ్గతమున నెగ్గాడెడి
కిగ్గాడులఁ గూడి కడకుఁ - గీడ్పడు కంటెం
బగ్గెగల చెలుల కలిమిన్
నెగ్గుట కృషియందుఁ జాల - నేర్పరి తనమౌ. 216

వ. నావుడు బాహుజను స్తిలకుఁడగురాజుంగని సామీచకుమునిరాయి యగ్ని షీజశూన్యమని తలంపకుఁడు. రామునివంటి రాజున్న హనుమం తునివంటి బంటుండు. గరగండమంగరాజు లాగరాయిపితూరీ జరిపె. సింగన్న కొడు కద్దానిలో మరణింప దుఃఖభారమునఁ దజ్జననియు గతింప నతండు దనయూటెకరముల కొంద్ర నేఁబదిదుడ్డుల కమ్ముకొని కడకు గతిలేకతఁడు బాస్టియన్‌దగ్గఱ వెట్టిచేయుచున్నాఁడు. దొరా! ధ్వారబంధాల చంద్రయ్య యొకపితూరీ నిర్వహించె. అడ్డతీఁగలలోఁ దెల్ల దొరలతనింజుట్టుముట్టి మూఁడహోరాత్రములు పోరాడి కడకు వీర మరణ మొందె. కోయరాముఁ డొకపితూరీ నడిపె. అన్నా! గోపన్న పితూరీయన్న నెన్నఁదగినదిగదా! ఇట్టు చరిత్రకెక్కిన నాల్గైదు విప్లవ జ్వాల లీ దొరతనముపైఁ గంటుమై వెంటంగుంటువడక మన్నెమున మండిన మంటలే యని గంటముదొరయన నౌనౌఁజేవదూలములో వెదురుమ్రోఁతవుట్టునా? అటవికులు గిరిజనులు పలుపర్యాయము లీ ప్రభుత నెదుర్కొనిరంట పరమ సత్యము. ముప్పదివేలమంది సంతానులు కలకత్తాపై దాడివెడలిరని విందు. కాని యవి కొల్లకేర్పడినవి. ఈ

యుద్యమ మట్లుగాక స్వాతంత్ర్యశాంతిసమరవీరరత్నమగు మహాత్మునకు జేయనుచు రాజకీయదృష్టి ప్రధానముగ సాగింపఁదగినది. లోకమాన్య బాలగంగాధరతిలకు స్వరాజ్యము నా జన్మవుహక్కనె. విప్లవము మా పుట్టు వుంజనవని సముపార్జితైకమత్యాద్భుత బలదుర్జయులమై నిర్జరులు బెదర గర్జింపవలయు. గుణాస్పదులగు జానపదులకు హాని గలిగించుట పుత్రవర మున కరిగి పతిం బలి యిచ్చుట. నేత్రాంచలస్థితప్రాణులై యష్టకష్టము లతోఁ గాలము గడపుచున్న యమాయిక ప్రజ లిఁక నెట్టియిక్కట్టుల నోర్వఁజాలరు. ఇరుసు పెటపెటలాడుచున్న బండిమీఁద మఱియొక మహా భారము వేయ నెవ్వఁడుంకించు. 217

తే. అధికారిక దౌష్ట్య ద – వాగ్ని నార్ప
రాచనెయ్యము నాకంట – రాని దయ్యె
దేశదౌర్భాగ్యవిధ్వంస – దీక్ష నరసి
లేమి నన్నాసి సుఖియింప – లేని దయ్యె. 218

తే. కండకావరమునఁ గన్ను – గాన లేక
దొరకు సన్నాసులైరి యా – దొరలు నేఁడు
హద్దుపద్దుగ నాపల్కు – సుద్దులెల్లఁ
జెవికిఁ జేదయ్యె నేనేమి – సేయు వాఁడ. 219

వ. అటవీశాఖాధికృతులు రక్షక భటులు పౌరశాఖాధిపతులు కంట్రా క్టర్లు ప్రాక్టర్లవలె మీ జీవనక్షేత్రములఁ బ్రవేశించి స్వైరవిహారము సల్పి సమూలముగ నాశనముచేయుచుంట జగమెఱుంగు. ఉన్నతస్థాయి భృతి గతి కల్పింపనిచోఁ గూలికింజనక యీనామువీక త్యాగధనులై యేక వాక్యంబుగ నెదుర్కొనుఁడు. అస్మజ్జననీ సోదరుల నరసాపురమున కంపి శీఘ్రమ తిరిగివత్తు. మాసద్వయానంతర మాంగ్లప్రభుతతో సాయుధ సమర మారంభింతు. నేఁ దిరిగివచ్చులోపల శాత్రవాగమ్యారణ్యావృతకు ధర శృంగ గుహాల సాంకేతిక స్థలముల నిర్ణయింపుఁడు. ఎఱిఁగిన యూళ్ళకరిగి సత్యము నివేదించి యర్థించి సమర్థులు సంతసమున సమ ర్పించిన యాహారపదార్థముల ఖడ్గకార్ముక శర శరధినికషోపలాది సంగ్రామ సామగ్రి సమృద్ధిగ రహస్యప్రదేశములకుం జేర్పుఁడు. స్త్రీ పురుషులకు గూఢచారులుగ వర్తింపఁదగిన శిక్షణ నొసంగుఁడు. వీరలేఁత కాకర ముదురన్నట్లు యుద్ధమునకు యువ హితోక్తికిశతవృద్ధు వలయు.

వ్యూహ నాయక నిర్ణయం బే మరలివచ్చి పరిక్షించి కావింతునని సెలవు
దీసికొని చన. 220

# ఆటవికుల ప్రతిజ్ఞ

తే. శత శరత్తులు సనిసను - జతపడునొకా
మన్నెమున కీర్తి శౌర్యసం - పన్నుఁ డొక్కఁ
డితని నేతృత్వమున మన - మిపుడ ప్రభుతఁ
బొడిచి గెలిచి యశశ్శ్రీలఁ - బొందవలయు. 221

తే. చినుకు చినుకు సందున దూఱు - ఘనమనీషి
మనకు రక్షకుఁడై వచ్చె - మన్యమునకు
ననఘుఁ డీతని యడ్గులో - నడ్గువేయ
బ్రదికినను జచ్చినను గీర్తిఁ - బడయఁ గలము. 222

తే. కాల కూట విషానల - జ్వాల వోలె
నేర్చు బాస్టియన్ దాపున - కేగి నంత
దవ్వుగా నుండు మన్నను - దారి లేదిఁ
కెట్టు లిక్కట్లు తొలఁగు మీ - రెఱుఁగఁ జెప్పుఁడ. 223

తే. పరువు పోక యెఱుంగని - పలువ యతఁడు
నోరులేనట్టి నరులను - నోవఁ జేసెఁ
గ్రూరహింసాప్రయోగ దు - ర్వార రాక్ష
సాగ్రతస్సరుఁడనుట కా - దతిశయోక్తి. 224

తే. దురభిమానంబునం ధర్మ - దూరుఁడైన
వాని బ్రదుకెన్నఁడైనను - బయట వడును
బడినఁ దలయెత్తి తిరుగుట - వలను పడక
క్రుంగి కృశియించుననుట ని - క్కువము సుమ్ము. 225

తే. ఎఱుకగలఁడేని యిట్టుల - యే లొనర్చు
నాఁడుఁ దోడునఁ బుట్టిన - నర్థ మగును
స్నేహపాత్రుల నీరీతిఁ - జేసి యాతఁ
డేగతికిఁ బోవునో పర - మేశుఁ డెఱుఁగు. 226

ఆ.వె. అతఁడు ప్రభుత కెప్పు - డల్లూరి యల్లరి
చేటు తెచ్చె నంచుం - జెప్పికొనుట
సూది పోయినదని - సోదికిఁ బోవంగఁ
బ్రాఁత అంకులన్ని - బయటఁ బడుట. 227

తే. గొఱ్ఱెలందిను నుద్యోగిఁ - గొట్టఁ బిదప
బఱ్ఱెలను మెక్కు లెంకలఁ - బంపఁ గలరు
వేళ్ళతోఁ బెల్లగించుట - చెల్లుఁ గాని
కొమ్మ గొట్టిన మోసులు - కొన్ని తొడుగు. 228

తే. మగల మగలయి యాంధ్రులు - మనఁగలారు
గాంచుఁడీ యను చందానఁ - గడగి రాజు
క్షత్త్రవీర్యంబుగాన తే - జః ప్రసిద్ధిఁ
దెల్గు మాగాణమున కెంతొ - దీప్తిఁ దెచ్చు. 229

చ. అతఁడనఁ గొల్లుగొట్టుకొని - నట్టుల యున్నది రాచబంట్ల క
క్కృతమున వాని నెట్లయినఁ - గా ఱియపెట్టఁదలంతు రద్ది ధీ
చతురుఁడు రాజెఱుంగుఁ దన - శక్తి విరోధులసత్త్వ మాత్మలో
సతతము తూచి కార్యగతి - సక్రమరీతి నమర్చు నేర్పునన్. 230

తే. పరుల కెవ్వరి కందని - బాణ విద్య
యేకలవ్యున కేగురుఁ - డెఱుకపఱచె
నాత్మదీక్షాబలంబున - కన్య మెద్ది
సాటిగాదని తెల్పు ని - మ్మేటి చరిత. 231

కం. సాలీడు బూజు నల్లెడి
లీలఁ జా వ్యూహమ్ము పన్ని - క్లేశ మెఱుఁగకే
వాలుగ శత్రుల నెఱిగా
వాలాయము గొనునతండ - వారిత యుక్తిఁజా. 232

వ. కార్యచతురత ఖడ్గనిపుణత యతనికిఁ దొడుగని తొడవులు. పౌరుష మాతనికిఁ బ్రాణవాయువు. సహనము సర్వగుణాలంకారమని రాజెఱుంగు. తదూర్ధ్వరేతస్కత యచంచలము. దుర్గమగిరి దుర్గఘోరారణ్య శార్కరి లతల గమన సమయమున సైకత స్థలవిహార తరుణమున నొక్కరీతి వర్తించు వీరవరుఁ డతండు. 233

కం. మన్నెపు బెబ్బులి బొబ్బలు
విన్న వియచ్చరచయంబు - విహ్వలమగు నీ
మన్నీ లన్నను లెక్కయె
క్రన్నన మీరన్ని చూడఁ - గలుగుదు రింకన్. 234

వ. కాని మీరందఱేకోన్ముఖముగ మాకుం దోడ్పడవలయు. నాగలి మంచిది కానిచో నెద్దులేమి చేయఁగలవు. నష్టపడియైన భ్రష్టుఁడు కారాదం[డ్రు]. 235

ఉ. కావున రాజు సెప్పినది - గాఢముగా నెదనమ్మి యాతనిం
దేవుని యట్లు గొల్చి రణ - ధీరులమై విజయేందిర ప్రభా
పావన జీవనస్థితి శు - భం కరమంచట గంటమాడ మీ
భావము లెన్నయంచొగి న - భాసదులెల్లరు వల్కి రీక్రియన్. 236

చ. జలనిధులెల్ల నింకిన వి -శాలధరాతలమెల్ల నూఁగినం
జలజహితుండుఁ చల్లబడి - చంద్రుఁడు వేడివెలుంగు చిమ్మినం
గులగిరులెల్లఁ గ్రుంగినన - కుంఠితదీక్ష రణంబొనర్తు మీ
పలుకుఁ బ్రతిజ్ఞగాఁ దలఁచి - ఖండనపాండితిఁ జూపుఁడి త్తఱిన్. 237

# స ర్వ సై న్యా ధి ప తి యె న్ని క

వ. అని వల్కినట్టిటసన్నహనము నేకదీక్ష సాయుధనమరసన్నాహమద్భుతముగ సాగించుచుండ నట రా జొక్కనాఁటిప్రాతర్వేళ ధాత్రీనికటంబున సుఖాసీనుండై మాతా నేపాళయాత్రావ్యాజమ్మున నుపమండలాధిపతి యనుమతినొంది రక్షకభట నిర్బంధమునుండి తప్పించుకొంటి. అత్యవసరకార్యాసక్తుండనై నేఁబెదవలసి మున్నాకు సత్వరమేగవలయు. జననీ పదసేవాదూరుండనగుచున్నను భారతాంబాపాదసంసేవామగ్నమానసుండ నని విశ్వసింపుము. తల్లీ! ననుఁగన్నఋణం బెన్నటికైనం దీర్చికొందునమ్మా. నామాట కడ్డుసెప్పక నేవచ్చువఱకు నీవు నవరజుఁడును నర్సాపురమునందుండఁ గోరుదునన నామెయు నురరీకృతిందెలుప వారల నారోహాశకటులంజేసి తాసుండీ లఘోటిక మధిరోహించి వెన్కన వేఁటమామిడివఱకరిగి యశ్వావతరణం బొనర్చి

జ్యాచరణ జలజనిక్షిప్తశిరస్కుండై నమస్కరించి తల్లిదీవన భీముఁడు బకునింబంపె. హెర్క్యులసట్లాసును జయించెనని యాశీస్సులంబడసి యనుజు నాశీర్వదించి కట్టకడపటి వీడ్కోలు సవినయముగఁ దెలిపె.238

తే. అతని జాతక మెట్లున్న - నట్ల జరుగు
నంచు నాతల్లి వీడ్కోలు - నందుకొనియెఁ
గ్రన్నఁ గడు దుఃఖమునఁ గ్రుంగెఁ - గన్నకడుపు
కనుటయేగాని వ్రాఁతలఁ - గాంచఁ గలరె ? 239

తే. ఎదలఁ బెదవిని మించిన - రదన మంచు
నెంచి తలిదండ్రు లెవ్వానిఁ - బంచి రిటకు
నట్టి క్లైవాంగ్లరాజ్యము - హైందవమున
నెలకొలిపి లార్డు బిరుదాన - వెలిఁగెనుగద ! 240

శా. అంతంబింత యొకింతలేక యతఁడ - త్యాసక్తుఁడై మన్నెపుం
బ్రాంతం బంతయుఁ జూచి దీనదశనం - భావించి యాంగ్లేయులీ
ధ్వాంతం బిచ్చటఁ గ్రమ్మఁజేసిరని స - త్యంబెల్లనూహించి వి
క్రాంతింజూపఁగ గామసోదరులఁ జే - రంబోయె సక్రోధుఁడై. 241

తే. అంబుశోణాంబరంబుల - నతఁడు దాల్చి
జలజహితు రీతి రాఁ గని - జనత యతని
దివ్యసుందర విగ్రహ - దీప్తిఁ గాంచి
రాముఁ డీ రూపమున వచ్చె - రా యనుకొనె. 242

కం. పులిపాలు ద్రావి వని బె
బ్బులిపైఁ దగ స్వారిచేసి - పులులు చెలులుగా
మెలఁగిన రా జనియను వని
మెలఁగఁడె మృగరాజువోలె - మిత్త్రవిధానన్. 243

శా. ఎందుంజూడమె పోరులిట్టుగలవే - యీరాజు ముక్కంటినా
క్రమందింపంగలవాఁడు వైరితతి సా - మ్రాజ్యాధిపత్యం బిటుం
గుందుందిక్కరి దిక్కరుల్ బెగడ మా - కుంగల్గు స్వాతంత్ర్య నం
బంధాత్యద్భుతసౌఖ్యమంచు మది సం - భావించి రచ్చోఁ బ్రజల్.

ఉ. రాజపుడశ్వమెక్కి నల - రాజువలెన్ రతిరాజువోలె రే
రాజుతెఱంగునం దివస - రాజటు నిర్జరరాజురీతి రా
రాజువిధాన సర్వరస - రాజిత భవ్యముఖారవిందుఁడై
తేజమిగుర్పఁగాఁ దిరిగె - ధీరతఁ దద్గిరి దుర్గమాటవిన్. 245

వ. ఆకారసదృశీప్రజ్ఞా యన్న వాక్కున కతనిస్ఫురద్రూపమేధాశక్తులే నిదర్శనములు. 246

శా. గామంతందనయోధవర్యులను జ - క్కన్నిల్పి దివ్యప్రభా
యామీవీరులు నిల్చిరాజ్ఞకొఱకై - యాక్షింపుఁడీ వీరలన్
స్వామీ మీర పరీక్షసల్పుఁడనుఁడున్ - సంగ్రామ రంగక్రియా
సామర్థ్యంబునుబట్టి యిచ్చెఁ బదవుల్ - సత్పాత్రదానంబునా. 247

ఉ. వార్పపుటగ్గివంటి పడ - వాళ్ళెసరేఁగి విరాగిమూగి ని
ర్గర్వముమై వచించి రిటు - కాంచుఁడు మత్సమరప్రవీణతా
ధూర్వహబాహు విక్రమ వి - ధూత విరోధిశిరశ్చటావృతా
పూర్వవిచిత్రదృశ్య మతి - మోదముమై సురలెల్లఁ జూడఁగన్.248

ఉ. శత్రునిబర్హణార్థ మతి - సాహసచర్య లవార్యలీలలన్
క్షాత్రమెఱుంగఁ జూపి జయ - శంఖము నూఁది ప్రజాప్రభుత్వపుం
బాత్రమొనర్చి దేశపరి - పాలనముం గొనసాగఁజేయ నే
మాత్రము జంకమింక మతి-మంతులు మెచ్చ శుభంబు హెచ్చఁగన్.

తే. అయినదయ్యేడుఁ గాకేమీ - యాగమంచు
వ్యూహనాయకు లుజ్జ్వల - సాహసమునఁ
గ్రోధకంపిత మూర్తులై - కుతల మ్రదువ
నార్చి పేర్చి రణోత్సాహ - మతిశయింప. 250

సీ. భారతస్వాతంత్ర్య - బాలభానూదయ
భర్మరశ్మిప్రభా - ప్రాభవంబు
గనెడి భాగ్యం బెవ్వ - గల్గునా యని మహా
నాయకాగ్రణ్యులెల్ల - నవయుచుండఁ
బ్రజలలో మతభేద - వైరముల్ ప్రేచి క్రిం
దికిఁ ద్రొక్కఁ జూతురు - తెల్లదొరలు

వారలకున్ వంత - పొడెడి వారయి
గోముఖవ్యాఘ్రముల్ – కొంద రుంద్రు

తే. దొరతనపు దౌష్ట్యముంగని - సరసు లనిరి
ప్రాణకంటక మాంగ్లేయ - పాలన మని
యింతవట్టును నోర్చితి – మెఱుక లేక
యొత్తుఁగాళుల నిల్చితి - మింక ననికి. 251

ఉ. వాలిని రాముఁడట్లు మన - వారలు మాటుననిల్చి శాతబా
ణాళులఁ గూల్ప నేర్తురుల – కందక కందక తంత్రముల్ సమి
త్కాలమునందుఁ దెల్పుదువు - గాలినిసైతము త్రాడుపేను ధీ
శాలివి శూలివోలె మము – సాఁక రణంబన మాకులెక్కయే. 252

శా. ప్రత్యర్థ్యర్థి విపాట పోషణ కళా - పారీణ విద్వజ్జన
స్తుత్యత్యంతవిరాజ రాజితదయా - శుంభత్కృతీ సత్కృతీ
నిత్యానందరసజ్ఞ సజ్జనహితా – స్వీతాత్మసత్యవ్రతా
ధృత్యుత్తేజితధీప్రతాపయుత దో – ర్వీర్యప్రభాశోభితా. 253

తే. సర్వసైన్యాధిపతివిగా – సంగరమున
నీవు నిలువంగ జంకము - నిర్జరులకు
నంచు గంటము తచ్చిహ్న – మనఁగ రామ
రాజు కంఠానఁ బూలహా – రంబు వైచె. 254

కం. కరతాళ ధ్వను లెసఁగఁగఁ
బరమానందమున రాజు – వారలఁ గని యో
గిరిజనులారా! విజయము
పరమేశుండిచ్చుమనకు – భావింపుఁ డనన్. 255

ఉ. రాల్చె లతానగంబు లతి - రమ్యసుగంధసుమంబు లావృతిం
గొల్చిరి కాళికాంబఁ గడుఁ - గూరిమి నాయుధపూజ సేయుచున్
వేల్చిరి హోమకుండములు – వీరవరేణ్యులు సర్వసైనికుల్
నిల్చిరి జైత్రయాత్రకయి – నిర్జరనాయకులైన భీతిలన్. 256

వ. ఆ దృశ్యము నవలోకించి యసదృశోత్సాహ సంభరిత భావుండై
రాటిట్లను. 257

కం. సబళముఁగొని మొనకరుగునె
కబళమనఁగ నోరు తెఱచి - కళ్ళెమనంగా
గబగబ వా మూసెడి నరుఁ
డభయంబిడి కృతు లొనర్ప - నర్హుండగునే. 258

తే. ఘోర రణమున నీకుఁ బ్రతి - వీరుఁడిచట
నింటఁబెట్టిన దీపమై - మెఱయ నలఁను
నగ్నికల్పులు మాత్రము - యనికి నిల్వఁడు
జీవితాపేక్షగలఁ డిటఁ - జేరఁ దగఁడు. 259

ఉ. అంగధరాతలేశ్వరు ర - థాంగము గ్రుంగినవేళఁ గొట్టరే
సంగరమందు శాత్రవుని - చావు ప్రధానముగా గణింపరే
యింగిత మింతెఱింగి పరు - లెక్కడఁ జిక్కిన నొక్కవ్రేటునన్
భంగమొనర్చి దాస్యఘన-బంధముఁ ద్రెంపుఁడు కీర్తి నింపుఁడా.260

కం. అనుచుండఁగ గోవిందుఁడు
ఘనుఁడగు సింగనయు వచ్చి - కాంచి ప్రభూ! మే
మును నీయనుచరులుగ నీ
రణమున వర్తింతు మనిరి - రాజలరంగన్. 261

తే. నట్టడవి నెండు చెట్టునేఁ - గొట్ట వీవు
పగుల గొట్టించెఁ గొరడాల - బాస్టియ నిదె
కాంచుఁడని చూపఁ గని రాజు - కరుణ పొంగ
నతనికింగాల మిఁకఁ జేరు - వయ్యె ననఁగ. 262

తే. జాలిఁ దన్నను - పతిపాల - పూలగుత్తి
దుర్భర దరిద్రవిప్లవ - దుర్గభిత్తి
చెనటి మర్మధీగ్రంధివి - చ్ఛిత్తి కత్తి
ప్రజల నవశక్తి యరిమిత్తి - రత్తి వచ్చె. 263

వ. వచ్చిన యా ముప్పుర భక్తి శక్తి యుక్తులం గూర్చి గంటము రాజునకు నివేదించి దినమున కొక్కవేషముతో రత్తి వైరుల రహస్య సమాచారము లందిచ్చుటలో నందెవేసిన చేయి యన సూర్యనారాయణాం

వికాసుతుండు దరహాసజ్యోత్స్నాప్రసారంబున వారల సంతోష గణా రోహకులం జేయు. 264

ఉ. పిచ్చుకకుంటు వేడ్కమెయి - వేగమ పర్విడఁ జూచురీతిగాఁ
గచ్చొగి హెచ్చుఁ బేదముదు - కం డొకవేశ్యను గోరినట్టుగాఁ
జెచ్చెర నాంగ్లరాజ్యమను - సింగముఁగొట్టి నృపుండు దాను గా
వచ్చునటంచు వచ్చె నిట - వారక మృత్యువునోటఁ జిక్కఁడే. 265

శా. ఆటోపంబున నెత్తివచ్చిన నమి - ద్వ్యాపారపారీణులౌ
మేటుల్ప్రాణులు మారణాస్త్రధరులై - మృత్యుక్రియ్ణ రారొకో
వేఁటాడింపనె వారిచేఁ బగఱ దో - ర్వీర్యప్రభావంబిటం
జాటంజాలనె యాంగ్లరాజ్యరమ య - శ్రాంతంబు శోభిల్లఁగ్ణ.266

తే. తేలుమంత్రము రాకున్నఁ - దెలిసి తెలిసి
పాముపడగపైఁ జేవెట్టి - బ్రదుకఁ గలఁడె
తడిసినంగాని కట్టఁడు - తగిన గుడిసె
త్రాగినంగాని మొగ్గడు - ధరణి మీఁద. 267

వ. కందకులేనిదురద కత్తిపీఁటకెందులకు? వీరి చుట్టమా పక్కమా? రాజుకత్తికి రెండువైపుల పదనను మాట యీరా తెలియంగఁడు. బాలపొంగు పాలపొంగు. పిల్లకాకి యేమెఱుంగు నుండేలుదెబ్బ. నక్క లెఱుంగని బొక్కలు నాగులెఱుంగని పుట్టలు గలవా? ఇక్కడివారి బ్రతుకంతయు నాకుం దేటతెల్లమ. ఈ యాటవికులం జంకఁబెట్టుకొని యధికారులమీఁదికి దండయాత్రయా? కుంటిగుఱ్ఱములు తోలుకత్తులు - ఎదగొడ్డునకు బెద రుండదు. ఫిరంగులకెదురు వింటిబ్రద్దలా? ప్రపంచమహాసంగ్రామమునఁ బ్రఖ్యాతవిజయశ్రీ నందిన వీరాధివీరులైన యాంగ్లసేనాధిపతుల కెదురు సీతారామరాజా? సార్వభౌముని సైన్యమున కెదురీ గిరిజనులా? 268

ఉ. పిట్టలఁగాదు కొట్టుటకు - భీకరులౌ యమదూతలంచుఁ దా
గట్టిగ నమ్మి వైదొలఁగ - క్ష్మాస్థలిఁ బ్రాణముతోడ నిల్చు ని
ప్పట్టునఁ బట్టినట్టి తన - పట్టును వీఁడఁడయేని బోరిలో
నెట్టననీల్గుఁ దద్ధితులు - నిల్చిన నీఱయిపోదు రిచ్చట్ణ. 269

ఉ. వన్యమృగాల మాంసము ల - పారముదంబున మెక్కి నిక్కి సౌ
జన్యముదక్కి యుక్కరణి - సాహసకృత్యమొనర్పఁ బూని తా

ధన్యుఁడుగాఁగలండె యతి - దారుణ హూణ శతఘ్నిఁగూలఁడే
మన్యమునందె వానికి స - మాధి నిజంబిది విశ్వసింపుమా. 270

తే. అల్పుఁ డధికునియటు గమ్య - మందు ననుట
నమ్మఁదగినదె యది జీవ - నదుల వోలె
చిన్ననదు లెట్లు సాగరుఁ - జేరఁ గలవు
తారతమ్యము గమనింపఁ - దగదె నరుఁడు. 271

ఉ. శూలినెదుర్చు ఘోరరణ - శూరులు భారతపూర్వపాలకుల్
చాలక శ్వేతభూపునకుఁ - జాఁగిలి మ్రొక్కిరి వీఁడు లెక్కఁగా
యేలిక యిచ్చు కం దెఱచె - నేగతిపట్టునో గడ్డపాఱతే
గాలికిఁ బోవుచుండ నడు - గం బనియేమిఁకఁ బుల్లెలందొరా. 272

కం. చీమకు దోమకు జంకిన
నేమేమి యొనర్తు మింక - నీ యడవులలోఁ
గామక మామక శక్తిం
దీమసమునఁ జూపువాఁడఁ - దెలిఁయుం డింకన్. 273

కం. మెతుకులు సల్లినఁ గాకులు
కుతుకంబున మూఁగినట్లు - కూడెడి మూకం
జతచేసికొనుచు మాకున్
వెతఁగూర్పఁదలంచు టెంత - వెడఁగుఁదనంబో. 274

వ. తాఁదూఱ సందులేదు డోలొండుమెడకన్నట్లు దాఁ బ్రతుక దారితే దతఁడు బ్రజల నుద్ధరించునట. ఈ కంటి కీ తెప్పలడ్డమా? కాలువ దాఁట లేనివాఁడు కడలి దాఁటునా? తాఁ త్రవ్విన గోతిలోఁ దానేపడును. 275

ఉ. పొంగి వనౌకసుల్పొగడఁ - బోలుదునంచుఁ దదీయరక్ష వే
భంగులఁ జూతునంచచటి - పామరులంగొని మూర్ఖతన్ సమి
త్రంగమునందు శ్వేతనృపు - ధాటి నెదుర్కొని పోరఁ జూచుటల్
సింగముతోడఁ బిట్టెలుక - చివ్వకు నిల్చిన భంగి కాదొకో.” 276

వ. అని బాస్టియన్ హెప్పెలుతో మిమ్ముఁగూర్చి చెప్పవింటినని సింగన యన. 277

మ. పిడిబాకుంగొని గ్రుమ్మినట్టుడఁద ద - స్పీడింప మిన్గాంచుచుం
గడు శౌర్యోజ్జ్వలదీప్తి వక్త్రమున వె - ల్గం గాయముప్పొంగఁగాఁ
బిడుంగుబోలె మహోగ్రశబ్దయుతుఁడై - బీభత్సకృత్యార్థియై
యడరెన్ సింహమువోలె రాజుహృదయో - ద్యత్క్రోధతామ్రాక్షుఁడై.

చ. తులువతనంబునం దనదు - దోషము లాత్మఁదలంపఁబోక మీ
సలుమెలిపెట్టినం బడయఁ - జాలునె వాఁడు జయేందిరన్ మహా
విలయకృశానుకీలలటు - వీరవరేణ్యులు చుట్టుముట్టఁ దా
నిలువఁగలేక గంతులిడు - నిప్పులు ద్రొక్కిన క్రోఁతికైవడిన్. 279

ఉ. చెప్పెడిమాటకుందనదు - చేష్టకు బొత్తిగఁ బొత్తులేమిఁదా
నొప్పుకొనండు వక్రగతు - లొప్పఁగభాష్యముతప్పుత్రోవకుం
ద్రిప్పి నిజంబు నాదియని - ధీరతవర్తిలు వాఁడు సంధికిం
జచ్చినరాఁడు సంగరమె - సర్వముదీర్చు జగంబు మెచ్చఁగా. 280

ఉ. సైరణదక్కి యిక్కరణి - సాహస వాక్యములాడఁ జెల్లునే
క్రూరుఁడువాఁడు ఘోరరణ - కోవిదుఁడెన్నడుఁ గాఁడు నిక్కతా
నేరకవచ్చెనా నిలిచి - నీతిగ నీచుఁడు పోరఁజాలునే
మోఱకు వాతఁబొచ్చి వెన - మూఁడీఁ జనుంగనువారు నవ్వగన్.

వ. దంచలేనమ్మయూఁదియూఁది చూచినట్లు చేయంజేతగానివానికి విమర్శలు మెండు. తాటాకు చప్పుళ్ళకుఁ గుందేళ్లు బెదరునా? ఇవి యినువగుగ్గిళ్ళుగాని మినుపగుగ్గిళ్ళు కావు. ఇఁక మంచికిఁబోయిన మంచినీళ్ళు పుట్టవు. 282

శా. ఉండెన్ప్రాణబలంబు మెండుగ రణో - ద్యోగంబు వాటిల్లినం
జెండంజాలుదునంచు బొమ్ముటిఱువం - జేడ్పాటు తథ్యంబిఁకం
గండ్రొల్కవ్వి యథేచ్ఛఁబల్కఁ గొనసా - గంబోదు తద్వాంఛమత్
చండక్రోధదవాగ్నికీలలకు భ - స్మం బౌ సమిద్భూస్థలిన్. 283

వ. పెద్దపులి చాటునకుఁబోయినయెలుకకు గండుబిల్లి నల్లితో సమానము. ఐనను వీని వసయెంత? పిడుగునకు గొడుగడ్డమా! 284

ఉ. నవ్విననాపచేనె యొక - నాఁడు ఫలింపదె యద్భుతంబుగాఁ
గ్రొవ్విననమాటలాడి వెత - గూర్చునె భావినెఱుంగఁ జాలునే

చివ్వకుఁ గాలుత్రవ్వఁగల - చేవ ప్రజంగలదంచు నమ్మఁడేఁ
గెవ్వన కేకవేసి రణ - కేళి శరాహతిఁ ద్రెళ్ళకుండునే. 285

ఉ. ధీరుఁడుదారభావరతి - దివ్యకళాకలితానుభూతిచేఁ
గ్రూరుని బాగుసేఁతకయి - కూరిమిఁ జేరఁగఁదీసి నీతి స
త్సారముఁ దెల్పినం గొనము - జన్మముతోడిది పాసిపోవునే
క్షీరము పోసిపెంచిన న - శించునె వేపకుఁజేదు ధారుణిన్. 286

చ. విడువక కాళికాంబ మన - వీఁపున మూఁపున నిల్చికాచు మీ
యెడఁదలఁ దల్లినిందలఁచి - యేక్రియకైన సముద్యమింపుఁడా
యడిదముసాక్షిగా జనని - యడ్గులసాక్షిగ దీక్షఁబూను మీ
బెడిదపుటంపఱం బరులు - భీతిలి చేఁతలుదక్కి చావరా. 287

కం. కూలికి విసమ్ము ద్రావెడి
పాలసులను నమ్మికొల్వ - ఫలముండునె మీ
మూలమున నడిమి మానుసు
లేలీల న్బాగుపడిరొ - యే నెఱుఁగనొకో. 288

కం. నక్కెరు పండ్లు మెక్కిన
నక్కవలెం బొక్కకుంద్రె - నవసిన యీ మీ
డొక్కలఁ గొట్టి మెసంగిన
టక్కరు లధికారు లాత్మ - ఢక్కాయగలన్. 289

తే. తేలునకుఁ బెత్తనం బీయఁ - దెల్లవార్లు
కుట్టుచున్నట్లు వర్తించుఁ - గుమతి కింత
పెత్తనంబీయ లోకము - బీతు కుడిచి
బాధపడకెట్లు సౌఖ్యము - పడయఁ గలదు. 290

కం. అన్నము పెట్టిన యింటికిఁ
గన్నము వెట్టుదురు సత్య - కరుణా బాహ్యుల్
జన్నమునఁ బసుల నట్టుల
మన్నెపుఁగుండమున వేల్వ - మా కనుచుండన్. 291

తే. సకల హైందవ శౌర్యంబు - సన్నగిల్ల
వెన్కవచ్చిన దొరలకుఁ - బెరిఁగె బలము

చెప్పనేటికి ముందున్న - చెవులకంటెఁ
బిదపవచ్చిన కొమ్ముల - పదను హెచ్చె. 292

ఉ. అగ్గిని బుక్కలింతమను - నాటవికుల్దెగఁబడ్డ నిద్దొరల్
బగ్గున మండిపోఁగల ర - పాయముపాయముచే మరల్చుకోఁ
దగ్గది యేకుమేకగు వ - ధమ్మును బట్టినఁ గొండత్రాచునే
డగ్గఱి తోఁకఁద్రొక్కినటు - డాయు భయంకరమృత్యువిచ్చటన్.

మ. అని నే నింతకుమున్నె చెప్ప వినరిం - త్రైసం దొరల్ క్రొవ్వనం
గనుగొంద్రింక వనౌకసప్రవరదో - ర్గర్వోగ్రపాండిత్యమున్
మొనకేముంద జనిల్చి ఘోరరణసం - భూతక్రియాచక్రమున్
జనతామోదముగాఁగఁ ద్రిప్పి జయమున్ - సాధింతు నమ్ముండికన్.

వ. నావుడు నాటవికులెల్ల రత్యానంద సూచకముగ ముదస్మితముతోఁ దలలూపిరి. 295

## చింతపల్లి రక్షకభటాలయము

వ. ప్రక్ష్వేడనమండలాగ్రభల్లకార్ముకాసికాకరవాళికాకుంతాదులనరాజుల జోడమ్ముల తరవరుల జముదాడుల సురియల యుద్ధమునకు సిద్ధమొనర్చు కొంటిమి. కాని దీర్ఘకాల సంగ్రామ నిర్వహణ సమర్థతకు స్వపక్షరక్షణకు వలయు నవీన వివిధాయుధ సేకరణార్థ మనేకనిరాఘాట ధాటీపరంపరల నిర్వర్తింపవలయు. ఏతత్కృత్యములకు నాందిగా రంపచోడవరపుటేజ న్సీకి సంబంధించిన చింతపల్లి రక్షక భటాలయముపై నిప్పుడ మెఱపు దాడి సల్పుదమన బూరలు కొమ్ములు సంకులు సైనికనికరము సమర సంతోష చిహ్నముగ వియత్తలమ్ముద్రువ నూఁదె. గంటము మల్లెండు పడలు గోకిరి యెత్తేసు వెంటరా ససైన్యుఁడై పయనించుచుండ మధ్యే మార్గమున లంబసింగిఘాటునికటంబునఁ దదాలయ సర్వాధికారి యెదురు పడ వానినాఁపి మాతృదేశమునుండి యాంగ్లేయులఁ బాఱఁద్రోలుటకుం దగిన సాంపరాయిక సాధనసంపత్తి సమకూర్చుకొనఁ దొలుదొల్త భవ త్కార్యాలయమున కేగుచుంటిమని రాజనఁ దధికృతి. 296

కం. పర్జన్యగర్జ శశమటు
అర్జునునకుఁ జిక్కినట్టి - హతశేషక్రియన్

దుర్జనుఁ డాతం డత్తఱి
నిర్జీవప్రతిమవోలె - నిలిచెన్ మ్రోలన్. 297

వ. నిలిచి నివ్వెఱపడి నాల్కయెండ గుండెవగుల దీనవదనుఁడై తన్నుఁ గాడన్నట్లు తలవంచుకొనియుండ నతని తీరుంగని. 298

ఉ. చిక్కెను బెత్తనంబనుచుఁ - జిక్కులఁ జిక్కఁగ జేసితీ ప్రజం
బెక్కురు నీచరిత్ర విని - పించిరి దాఁపక నీదు జీవితం
బెక్కరణిం గమించెనో వ - చింతువె త్వత్కృతపాపసంఖ్యలం
జుక్కల లెక్కపెట్టఁగల - సూరులకైన గణింప శక్యమే. 299

వ. నీవు రక్షకభటాధికారివా? భక్షక భటాధికృతివా? నీకీ పెత్తన మిచ్చుట పెయ్యనుగాచుమని పెద్దపులి కిచ్చుట. ఇంగితజ్ఞాన మానవ తాదులు నీకున్నవా? లోకమెఱుఁగని యజ్ఞానుల మూగజీవుల నోళ్ళుగొట్టి గట్టిగ మాటలెన్ని కట్టితివి? అమాయికసాధ్వీమతల్లుల నెందఱి వ్రతభంగ మొనర్చితివి. దినమున కెన్ని యసత్యములాడి యాడించితివి. జారచోర ద్యూతక్రీడావినోదులతో రహస్యముగఁ జేయిగలిపి యధర్మముగ నెంత యార్జించితివి? లజ్జావిహీనుఁడవై సజ్జనుల నెన్నివిడుతల బాధించితివి? ఒక్కసారి నెమరువేసికొనెదవా? అదిగో నీ పాపము. దినదినప్రవర్ధమానమై మహాపర్వతమం తైనది. వ్రాయలేక చిత్రగుప్తుఁడలసి నిట్టూర్పు పుచ్చుచున్నాఁడు. అగ్నిస్తంభములనడుమ కుండాగ్నులు మెండుగ మండుచు యమలోకంబున నీ కొఱకు నాల్కలు సాచుచున్నవి. హీనతం దీనతం బ్రకటించుచున్న నిన్ను నేను శిక్షించుటకంటె నీకుం దగినశిక్ష దైవము విధించుటే మంచిదని రాజన. 300

కం. తన తప్పులన్ని దెలుపన్
శని నిల్చిన జన్మరాశి - జాతకు దేహం
బన వానిమోము దనరెను
ఘనపాపము లెల్లఁ జుట్టుఁ - గ్రందుకొనంగన్. 301

ఉ. బూచి శిశుంగలంచుగతిఁ - బూని జనాళి దయావిహీనుఁడై
యేచిన పాపమెట్లు నశి - యించును నోరుమెదల్ప నత్తఱిం
బీచమణంచునంచుఁ గడు - భీతిలి యాతఁడు తెల్లవీసరం
జూచిన త్రాచుచందమున - సొక్కె స్వశౌర్యము రిత్తవోవఁగన్.

కం. ఏనిఁకఁగ్రై విసరినచో
నేనిక క్రై విసరినట్టు - లీవడఁగవొకో
దీనునివలెఁ గనఁబడుటన్
మానితి నన్దలఁచి బ్రతుకు - మా మహిమీఁదన్. 303

వ. అని రాజన పీఁడమిత్రక్రూరుఁడు. వీని న్విడువఁదగదు. ఆజ్ఞయిత్తురే మత్ఖడ్గకాళికిందొలికబళంబుఁ గావింతునని మ ల్లొఱనుండి కరవాలము జఱ్ఱునలాగ రామరాజు వలదని వారింప గంట మదిగని. 304

మ. భవదాజ్ఞానిగళైకబద్ధుఁడయి చం - పం ఖడ్గమున్ లాగియున్
జవసత్త్వాగ్రహశూన్యుఁనట్లు నిలిచెన్ - శాంతంబుతో మల్లు కే
శవుఁడైనన్ శివుఁడైన నిల్వఁగలఁడే - సత్యంబు వీఁడింతకున్
భువిపై నిల్చెడి యోగమున్నది ప్ర - భూ పోనిమ్మనన్ నవ్వుచున్.

కం. పొమ్మనె రాజవుఁ డాతఁడు
కిమ్మనక శిరమ్ము వాల్చి - కేవల భీతిం
జెమ్మటలు గ్రమ్మ బహు శాం
తమ్ముగ నడుగిడుచుఁ దొలఁగి - తాఱెం దారిన్. 306

వ. అంతగంటము రామరాజుంజూచి చూచితిరా మనమల్లురణోత్సాహము.

ఉ. ఖండనమన్న వాక్కువినఁ - బండిన కాకరవి త్తనంబుల
ట్లుండెఁ దదీయనేత్రము ల - నూహ్యము లాతని క్రోధ భావముల్
చండతరోగ్రశస్త్రయుత - శాసనుఁడై మునునద్వ సేనకున్
మండన మీతఁడన్న నను - మానము మల్లనగ్గి జల్లెగా. 308

వ. అనవిని వేంకటరామరాజ తనూజుం డనుకొన్న తెఱంగున ననుచర సహితుండై. 309

తే. విప్లవమహోష్ణవాయువుల్ - వీవసాగె
నింకఁ బరికింపుఁడని తన - యెఱ్ఱసెరలు
పరమశివు ఫాలనేత్రోత్థ - వహ్నివోలె
నగ్నివర్షము కురిపింప - నరిగె నటకు. 310

తే. చింతచెట్లకు నడుమన - చింతపల్లి
స్టేషనొప్పారె నద్దాని - చెంతనున్న

చెట్టునకుఁ గొట్టెబాణము - చీటి దనర
వేగ రాజాజ్ఞ విప్లవ - వీరుఁ డొకఁడు. 311

తే. మిరెవకాయటపాయని - మెఱయుచున్న
యక్షరాల్గల యుల్లాకు - నమరియున్న
శరము డగ్గఱి యామికుల్ - చదివి దాని
గుండె దడదడ లాడంగఁ - గూలఁబడిరి. 312

తే. ఈ దినాన మీస్టేషను - మీఁదికేము
దాడి సల్పుచు నుంటిమి - ధైర్యమున్న
నిల్చి మాతోడఁ బోరుఁడు - నేను రామ
రాజునని యుంటఁగని శిలా - ప్రశస్తులైరి. 313

వ. దీనిన మెఱపుదాటి యంత్రుఁడు. అంతఁగొంతిపయ నిమిషంబులకు వేంకట కృష్ణరాజపాత్రుండా రక్షకభటాలయము ముట్టడింప నందున్నముగ్గురు పోలీసులు భయకంపితులై నిలిచియుండ సమీపించి యాయుధాగారపుఁ దాళము లిమ్మన నీనొల్లకుంటంగని వారల స్తంభంబులకంటఁగట్టి తాళములు లాగికొని యటఁగల యేకాదశ లఘునాళిక లొకవేయిమున్నూట తొంబదిగుండ్లైదు ఖడ్గములు పదునాలుగు బాయొనెట్లు ద్వాదశశృంఖలలు నవాయశ్శలాకలు తీసికొని జరిగిన యీకార్యము తదాలయ దినచర్యా గ్రంథమున వ్రాసి చేవ్రాలుచేసి సఫలీకృతమనోరథుండై మహోత్సాహంబున మహాత్మునకు జేయనుచు నిజనివాసంబునకుం జనుచున్నతఱి నిర్వురు రక్షకభటులు గనఁబడ వారికింగల యొక లఘునాళిక నైదుగుండ్లు దీసికొని తన యురవునకుఁ జేరె. ఈ సంగతి స్టేషన్దు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికిం దెలిపె. 314

శా. ఆరే విప్లవవీరులెల్లప మహా - హ్లాదమ్ముమైఁ బుచ్చి రా
త్రీరుంబూడఁగఁ జింతపల్లి జనమెం - తేఁగూర్చె విశ్వాసమన్
సారాంశంబుగ్రహించెరా జతనియా - జ్ఞన్ సేన తన్నేరఁ ద
ద్ధీరోదాత్తుఁడు భావికార్యగతి చిం - తించెన్ రణోత్సాహియై. 315

# కృష్ణదేవిపేట

ఆ. వె. ఐన దంబ యొజ్జ - యంపఱ మిప్పుడ
కృష్ణదేవిపేఁట - కేగుచ మన
లెన్నయంచు వారు - లేవ లేనవ్వతో
ముందు రాజునడచెఁ - బ్రొద్దు పొడిచె. 316

శా. కాలవ్యాళకరాళఖడ్గధరుఁడై - కాలానలౌజ్జ్వల్యదృ
గ్జాలుండై పరహృద్విదారకకళా - గర్జాప్రతిధ్వానది
గ్జ్వాలస్థాఖిలజీవిభీకరచల - ద్బాహుభాగుఁడై ధైర్యకు
త్కీలుండై పృతనాసమేతగతుడై - తీంద్రించుచున్నాగుచో. 317

ఉ. వచ్చెనువార్త రాజు తమ - పైకి వెసం జనుదెంచునంచటం
జెచ్చెర బంట్లు తత్పతియుఁ - జెమ్మట గ్రమ్మఁగఁ బాఱిరార్తులై
చిచ్చఱపిడుగ్రమ్మోఁతవిని - చింతిలి డాగెడి యల్పజీవుల
ట్లెచ్చిన భీతిమైఁ బ్రజల - యేడుపు లీగతిఁగొట్టిరాయనన్. 318

కం. భూరి లతా భూజాన్విత
ధారాగిరి నొరసి పాఱు - తాండవవేణీ
తీరమునఁ బట్టపగలే
ఘోరంబుగఁ బోరుచుండుఁ - గ్రూరమృగంబుల్. 319

ఉ. అట్టి ప్రదేశము ల్గడచి - యర్థిమెయిన్ శరభన్నపాలెమున్
నెట్టనఁజేరి శంభుగుడి - నిల్చి వెసం బయనంబుసేయుచుం
గట్టలుకన్ ధృతిన్ మిఱెప - కాయటపానిడి మోడిగాని కి
వ్పట్టున మల్లుతోనరిగి - వైరులకిమ్మనె రాజు ముంచుగా. 320

ఉ. కిమ్మనకేగి వారు పరి - కింప నొకండునులేఁడు బంటు వే
గమ్ముగవచ్చి రాజుగనఁ - గాలముఁదీరిన వృద్ధయుండె నో
యమ్మ నిటేల నిల్చి తన - నాకె నినుంగను భాగ్యమబ్బునం
చిమ్మెయి నున్నదాన నని-యిమ్ముగఁబల్కె నమస్కరించుచున్. 321

తే. ఆమె యొకబంటు తల్లి త - దవసరమున
నాయుధాగారముననున్న - యట్టి యినుప

పెట్టెఁగని ధనమని దాచి – పెట్టి దానిఁ
బ్రభుతకర్పించి బహుమతిఁ – బడసెఁ గడకు. 322

తే. యుద్ధసామగ్రి గైకొని - యోద్ధల కిడి
విజయ చిహ్నముగా గుండ్లు – ప్రేల్చి దళము
తోడ గాంధికి జే యంచుఁ - దోన తిరిగి
గిరిఁదటీయ రాజు సింగన – పరుగులిడుచు. 323

## బాస్టియను పరాజయము

ఉ. వైశమవచ్చి బాస్టియన – వారితవాహినిఁగొంచు వచ్చెడిన్
మేలుకొనుండు సామియని – మిక్కిలి బత్తివచింప రాజహో
చాలఁగ మంచివార్త యిది - శత్రుల నిగ్గిరి డాయఁజేయుమం
దాలిమి వీరులార ! యిటఁ - దంగెడిగుట్టల డాగియుండుఁడా. 324

కం. అని రక్షకభట వేషము
మొన యలరఁగఁ దాల్చి వేగ – ముగఁ జని వైరుల్
చనుదెంచు దారి నిల్వఁగఁ
గని బాస్టియ నడుగ నతఁడు – కడు వినయముతో. 325

తే. రాజు పరివారయుక్తుఁడై – రాజసముప
నేటిదరి కేగినాఁడని – యెఱుఁగఁ జేయ
సరిగ సైనికశకటంబు - సాగి యాఁగి
నదికుఱంగట దింపెసై – న్యవ్రజంబు. 326

తే. ఆంధ్రవీరాభిమన్యుఁడై - యాంగ్లసైన్య
కృతమహావ్యూహభేదన - చతురుఁడగుచు
వాడివాల్కేలఁ గీల్కొల్పి – వచ్చు రాజుఁ
గనక బాస్టియ నంధుని - కరణి నడచె. 327

వ. కంకపత్రకళాకృతహస్తులు గోధాంగుళీత్రాణులు నిశితఖడ్గశరశరధి శరాసనధరు లుద్యద్ఘుణాశ్రేణీరమణీయతరు లగు గిరిచరులు వైరులకగోచర స్థానంబుల నిల్చి రాజాజ్ఞకు వీనులొగ్గియుండఁ దదన్యదిశన్వేచియున్న నిజానుచరులం గాంచి. 328

ఉ. తేజితశస్త్రశోభితను – ధీరతధైర్యహిమాద్రితుల్యమై
యాజవిహారతత్పరత – మై మన సైన్యము బిట్టుముట్టెడిన్
బౌజుగనేగి మీరెడను – బ్రక్కగ నిల్చి తఱింగనుండు వి
భ్రాజిత శౌర్యశాలులయి – ఖండనపొందితిఁ జూపుఁడుగ్రతన్. 329

వ. ఆంగ్లసైన్యాంతర్గతాంధ్ర భటులారా! 330

ఉ. తెల్గులు నల్గియల్గి యిటు – తీవ్రవరణప్రవణత్వమూఁది నేఁ
డల్గులఁ దెల్లవారల మ – హోఘ్నుల దాఁటుఁగఁగొట్టఁ బూనుచోఁ
దెల్గులుగారె మీరెదల – దేశపుత్తిఁ ద్యజించి వత్తురే
వాల్గల దానికిం ఫలము – వారక సోదరులన్ వధించుటా? 331

మ. అనుమాటల్విని బాస్టియన్ భటులు తీ – వ్రాలోచనా మగ్నులై
ఘనుఁడారాజిటు పల్కెఁ యుంతునను శం – కన్నద్దెనంటాచి యెం
దునుగానంబడకుంట కచ్చెసువుమై – దోదూయమానాత్ములై
యనికింజేతులురాక యొక్కక్షణమా – రా! నిల్చిరేకాగ్రతన్. 332

శా. కిగ్గాడుల్లనురీతిఁ జూతురె యరిం – గిన్కన్వెనంగాల్చి మీ
పగ్గెం జూపుఁడటన్న సైన్యపతియా – గ్వా వ్యఘాతమై సోఁకఁగా
నగ్గింజిమ్ము తుపాకులంగొనియు మో – హావేశులై సైనికుల్
భ్రగ్గర్హంగదలింపఁ బ్రేలవన వా – రింజూచి సక్రోధుఁడై. 333

కం. కాల్చెం దాఁ గని భటు లది
కాల్చిరి నద్దెనలనుండి – మను లాకోయల్
గాల్చిరి బాస్టియ నూపిరి
పీల్చక తనసేనతోడ – వెఱఁ బరువెత్తెన్. 334

చ. బిరుదుల రిట్టుకట్టులుక – భీషణ ఘోషణ శక్తియుక్తులై
నిరతగుణైక లోలతమ – నీషిమనీషితమార్గగాములై
యఱకొఱలేక వీక సమ – రంగణ రుద్రనిభప్రభావులై
యరయఁ గుభృత్కభృత్తులు మ – హాజయదీక్షితులై వెలుంగఁగన్.

శా. దోరుద్భ్రాంతమహోగ్రఖడ్గజనిత – ద్యుత్యుద్భటుల్ తద్భటుల్
స్వారాజ్యంబొ స్వరాజ్యమో పడయ దీ – క్షాదక్షులై నిల్వఁగాఁ
బోరంబోరయొసంగి రాజు సమర – వ్యోమార్క విక్రాంతుఁడై
ఘోరంబై ప్రతిశబ్దమీనఁ జలిపెం – గోదండ టంకారమున్. 336

కం. ఎక్కటి కయ్యంబున నరి
నుక్కడపందిక్కులరసి – యున్నతగిరిపై
మిక్కిలి కంటిం దెలిచిన
ముక్కంటి తెలుంగతండు – పొలిచె న్నిలిచెన్. 337

వ. నిలిచి. 338

శా. కాల్చంజేతఁదుపాకులున్నవని ని - క్కంగాంచి యెట్టోతలల్
వాల్చన్వ్రాలుగఁద్రొక్కి నిర్దయతమైఁ - ద్వజ్మాంసరక్తాదులం
బీల్చన్నిల్చితి రింతకాల మిఁక మీ - పీచంబడంపం ధృతిన్
నిల్చెన్మత్ప్రజ పెల్చగెల్చుమిము నం - దేహంబులేదింతయున్ 339

వ. అని వక్కాణించి. 340

శా. ఉగ్రక్రోధదవానలచ్ఛటుల గ - ర్వోద్రిక్తవైరివ్రజో
దగ్రప్రోత్థితశక్తిఘోరవనద - గ్ధవ్యూహుఁడై యాత్మబా
హాగ్రత్యక్తశరౌఘపాతపరుసై – న్యాధ్యక్షుఁడై యాంగ్లరా
డ్వ్యగ్రాత్యద్భుతశౌర్యధైర్యనిధియై - భాసిల్లె రా జత్తఱిన్. 341

తే. సాహసికశిఖామణి రాజు – సమయ మెఱిఁగి
త్రివిధయుద్ధంబులం దాటి – తేరియుంట
భీమసంగ్రామనిరతుఁడై – పేర్చి యార్చి
యహిపకల్పశరావళి – నరుల నొంచె. 342

ఉ. తొండము గల్గుమాత్ర నరి – తూగునె యేనుఁగుతోడ దోమ యు
ద్దండ ఘటాళి దండధరు – ధామము సొచ్చెను బోరి రాజుతో
గుండెలుగూలి సోలి మఱి - కొందఱు పర్విడి రేర్లుదాఁటి త
చ్చండబలుండు రాముఁడు ని-శాచరులంబలెఁ జెండుచుండఁగన్. 343

కం. మూర్తిం దాల్చిన శౌర్య
స్ఫూర్తి యనం బొల్చు రాజుఁ - జూచి గిరిజనుల్
కీర్తించిరి లోలో నమ
వర్తి యితండాంగ్ల రాజ్య – వైరికి ననుచున్. 344

వ. ఏతదఖండవిజయము సామ్రాజ్యాధికృతుల ధృతినగల్చ మాండలిక
న్యాయాధికారి హెండర్సన్ తంత్రీద్వారమ్మున మద్రపురీప్రభుత్వ ప్రధాన

కార్యదర్శియగు గ్రహామునకు నివేదింప నతండు తత్క్షణము తీవ్రతరచర్యా నిమగ్నుఁడై కండని రక్షకభటశాఖాసర్వాధికారికిఁ బరమానాపంప నాతండు ద్రుతగతి నర్సీపట్టణముఁజేరి స్టీవర్టుప్రభృతిముఖ్యులతో మంతనములు సల్పుచుండె. 345

## రాజవొమ్మంగి స్టేషను

తే. మూఁడవదినాన ముఖ్యులు - ముందు నడవ
మిరెపకాయ యంచెనొసంగె - మిత్తి యట్టి
జెట్టి యెత్తేసునకుఁ దన - చేవ మెఱయ
రాజవొమ్మంగిఁ జేరఁగ - రాజు వెడలె. 346

వ. అరూఢయౌవనుండు ధనుర్విద్యాజితశ్రముండగు రాజు ద్గ్రథితజటాఝాటుండై డామూఁపున ధనుస్సు దక్షిణాంసమున నాశీవిషసదృశశరనికరపరిపూరితశరధి కటీరమునంబిడిబాకు చేతందుపాకి తలపై శిరస్త్రాణము ఖద్దరు దుస్తులు ధరించి యుదర్కముం దర్కించుచు. 347

తే. అతుల రౌద్రాన ద్రుతగతి - నతఁడు వెడల
గాఢిగుండెలు సైతము - కదలఁ బాఱె
వానికెదురైన యెంతటి - వైరి యైనఁ
గత్తివాదర కెరగాక - కడవఁ గలఁడ ? 348

ఉ. పొంగుచు రాజు నేఁడిటకు - ముంగడ వచ్చుచునున్నవాఁడనన్
సింగపురాకకుంజెవరు - చిన్నమెకాలతెఱంగు రాజవొ
మ్మంగి భటాదులెల్లరును - మానము స్టేషనువీడిపాఱి రే
భంగినొ జీవయాత్రగడు - పందగుఁ బ్రాణములున్నయంచొగిన్.349

తే. రాజవొమ్మంగిస్టేషను - రాజుసేర
నేరులేకుంట నెత్తేసు - పాఱఁ జూచి
మిరెపకాయటపా బల్ల - మీఁద గ్రుచ్చి
కైదువుల్గొని పెన్గుఱి - కాండ్ర కిచ్చె. 350

వ. ఇందెనిమిది తుపాకు లెనిమిది వందలయిరువదియైదు గుండ్లు పోలీసు దుస్తులు లభించె. అనంతరము వైర్యఖర్వగర్వనిర్వాపణ శౌర్యధుర్యుండగు రాజు. 351

తే. లాగరాయిపితూరిలో - వీగ కిత(డె
పోరు సల్పినమగ(డని - పొంచి పట్టి
యందు( జెఱనుంచినట్టి వీ - రయ్యదొరకు
ముక్తిగలిగింప నాతండు - ముదము నొంది. 352

తే. ఒక్కదెబ్బకు జతపిట్ట - లురలినట్లు
స్టేషను జయించుటేగాక - చెల(గి నాదు
ప్రాణమానాదిరక్షణ - భాగ్య మీవ
కలుగ( జేసితి సామి! నీ - బల మదేమొ. 353

కం. భోగవిదూరా! నేని(క(
జా(గి శరణుసేసి నీదు - సన్నిధి సేవా
త్యాగముల సహకరించెద
నీగీచిన గీతదా(ట - నేరను దేవా! 354

తే. చివఱి రక్తపు బిందువు - చిందువఱకు
బవరమొనరింతు నీదుపా - ర్శ్వమున నిల్చి
యన( ఒడాల్ దిద్దె మోమున - నరుణ తిలక
మంత గంటమిడె( దుపాకి - నతి ముదమున. 355

శా. అంతంబ్రేల్చిరి గుండ్లుపైకి జయ చి - హ్నా భ్రాంతిలోకాళి వి
క్రాంతిన్మెచ్చ విశిష్టపీరులు వెసం - గాంధీకి జేయంచు( ద
త్సంతోషంబున రాజు పల్లెప్రజ కు - త్సాహంబు గల్గించి సు
స్వాతుండాశ్రమసీమ మిత్రతతితో - సౌఖ్యంబుమై నుండ(గన్. 356

# ఒంజేరి సంగ్రామము

వ. ఏతత్ప్రభుత్వప్రతనాపరాజయ పరాభవవార్తాజనితపరితాపాన్వితానే కాలోచనానిమగ్నులై సొంపర్సు బ్రేకనులు నర్సీపట్టణముసేర( జింతపల్లి యడ్డతీగల కోటనండూరు మంకరగిరి యేలేశ్వరములు వేనవేల్ రిజర్వు దళము లాక్రమింప గిరిరణనిపుణులగు స్కాట్ కవర్డు హైటర్ త్రైమన్ హార్ చాడ్విక్ హూమ్ షర్బిన్ డాసజ ప్రభృత్యాంగ్లేయ సైన్యాధిపతు లేతెంచి కదనమునకు( గాసె( గట్టి కాలుత్రవ్వుచుండ నొక్కదివసాభిజ

ల్లగ్నమున హౌర్ సర్వవాహినీశుఁడుగ బాస్టియన్ జమేదారులంగూడి విప్లవవీర ప్రకర చిత్రవధావిధానావధాన ప్రధాన విధిమై నొంజేరి ఘాటున వచ్చుచుంట గిరి శిఖర చరుండగు రాజెఱింగి రణ విద్యాసు శిక్షితులైన స్వపక్ష నాయకులం గని. 357

ఉ. తల్లడమింతలేక నృప - తల్లజుఁ డప్పుడ మోఘధైర్య సం
ఫుల్లవిశాలనేత్రుఁడయి - పున్నమవెన్నెలవంటి నవ్వు సం
ధిల్ల నిజాప్తమిత్రులకుఁ - దెల్లమొనర్చె రహస్యమెల్ల వా
రెల్లరు సైన్యయుక్తులయి - యెల్లల నిల్చిరి చాపహస్తులై. 358

వ. అంతందనిననక రా జాటవికుల నూతన సమాగతులఁ బ్రేపనాకాక్షించి వారల నుపలక్షించి. 359

కం. వాలంపసోనకురియం
జాలిన నెఱ జోదులెల్ల - సమరోన్ముఖులై
యేలికమొన దెన దెలియక
యే లిఁక మనబలమనంగ - నేయుండనినన్. 360

ఉ. ఆకుధరంబులన్వేలఁయు - నాటవికుల్ వెస గండగొడ్డళుల్
బాకులు బల్లెము ల్వెనుక్ర - పాణధనుస్సులు బాయిటీ టెలున్
వీఁకధరించి వచ్చి కడు - భీకరులై తటిఁగాంచిపొంచి పి
ర్వీఁకులువెట్టు వైరితతి - బ్రేటులఁ బోటుల నొంచి రుగ్రులై. 361

తే. అన్యదుర్లభసామర్థ్య - మతిశయిల్ల
వేయి వెలుఁగుల వెదజల్లు - వేడ్కతోడ
పార్వతీయబలంబు ల - పారశౌర్య
ధైర్యములఁ జూప రాజు సం - తసముపడియె. 362

తే. రాజు దుర్జయభుజశాలి - రణమున నని
యుక్కునం గొండమొక్కట - కొల్లఁ డయ్యె
నొక్కసైన్యాధిపతియు నిం - కొకరుఁ డెట్టు
గట్టుమెట్టు నుసురుఁతీపు - గా నరునకు. 363

వ. అదిగని రాజద్దెకువచ్చిన గుఱ్ఱము లగడ్తలదాఁటునా యనుకొనె. 364

శే. నగముక్రింద నొకరు – నగముపై నొక్కరు
పె పిల్చి గుండ్లు – ప్రేల్చుచుండఁ
కత ఖగమృగాది – చయముల రొద హెచ్చెఁ
గొండ గుండెలదురఁ – గుందఁ జొచ్చె. 365

తగిన దళమునుగొని జమే – దారు కొండ
పైకి చని తన వైరుల – బవరమందు
మందుగుండ్లున్న వఱకెట్లొ మార్కొని విధి
లేక లేఁకలతో ధృతి - లేకపాఱె. 366

వ. విప్లవయోధు లాహవదోహలులై హూణుల. 367

కం. వాహినిపై శరవాహిని
బాహాబలమొప్ప గుప్ప – భయ కంపితమై
యూహ కలంగఁగ నమ్మెన
మోహావేశమునఁ బడియెఁ - బొదలన్ ఝురులన్. 368

కం. రక్షకభట వరుఁ డొక్కం
డక్షీణ పరాక్రమమున – నరిఁ గోయదొరన్
లక్షింప పొంచి యుండఁగ
దక్షుఁడు రాజద్దిగాంచి - ధైర్యం బెనఁగన్. 369

కం. వేటలవిం బాటించుచు
గాటంబుగనాట నిశిత – కాండం బేయం
బోటొగ్గిన యగ్గడునరి
మాటాడక యేగె జముని - మందిరమునకున్. 370

చ. చెలఁగిననాగమట్టు కని – చే బుసగొట్టుచు వాలు పట్టుచున్
వలఁతులఁ ద్రేచి రాజు చని – వైరి చమూపతిరాక పీఁక న
గ్గలమగు తీక్ష్ణదృష్టిఁగని - కాలుని యిల్సొరునట్లువచ్చు న
బ్బలియునిగాల్చఁ గర్ణమునఁ–బాదమునందగిలెం గ్రమమ్ముగన్. 371

వ. మున్నుఁ బ్రజాహితదృష్టిం జరించుచుండ నది సరిపడక రాజద్రోహి యను నెపంబునఁ దన గ్రామాధికారక్షేత్రాదులఁ బరాధీనమొనర్చి గృహదహనాదులఁ గావించుపెట్టి గంటమొక్కనాఁడు బాస్టియనును సమీపించి నమస్కరించి. 372

ఉ. అన్న యిదేటి చర్య తగ – దన్న నహంకృతి బూటుకాలితోఁ
దన్నెను మూఁడు సార్లతనిఁ – దానఁ గశాహతిలేచు త్రొఁచునా
నున్న యతండు వానినొక – యుగ్ర శరంబునఁ గొట్ట నాయువెం
తున్నదొ తప్పెసద్ది నమ – రోర్వి శివాజ్ఞ నెఱుంగ శక్యమే? 373

మ. అణుమాత్రంబునఁ దప్పె బాష్టియను క – ష్టాపారిలోఁ జావు తో
డన ముచ్చెమ్మట గ్రమ్మ కాళ్ళు వడఁకన్ – డబ్బాటు పర్వెన్వెసం
దన ప్రాణాలఱచేతఁ బట్టుకొని చెం – తంగల్గు నే దారినో
యినుఁ డస్త్రాద్రికిఁ బోకముంద దొరతో-నిల్సెరి రా సైనికుల్. 374

శా. శ్రీరాజ ద్విబుధార్థకాంక్షి కృతి ధీ – కృద్భూసురాహీనలో
కారాత్యుగ్రమహః కలాపి సుమనో – త్రాశీః కలాశత్రు జి
ద్ధీరమ్యుం డసమాన పుణ్యజన హృ – ద్వ్రిక్కర్షదీవ్యత్ప్రభా
ధీరోదాత్త వరేణ్య ధన్యగుణి త – త్సేనాని సామాన్యుఁడే. 375

(ద్వ్యర్థి)

చ. అని బుధులాత్మమెచ్చ సమ – రాంగణసీమల రాజు తేజునం
గనలుచు వైరిచక్రఘన – కంటకుఁడై కరఖడ్గ కాంతులన్
ఘనగత చంచలాకృతులు – గల్గ దిశల్వెలుఁగొందఁ జేయుచుం
దనమొన కుత్సవం బెనఁగఁ – దద్గిరి దుర్గమునం జరించుచున్. 376

చ. వెఱకొఱలేక వీఁక మన – వీరవరుల్వరిఁ ద్రొక్కినిల్వ ని
వ్వెఱపడి పాఱిరా దొరలు – నిల్తురె త్యాగులముందు భోగు లె
త్తెఱఁగుననైన వీరిపని – తేల్తు స్వరాజ్య సురాజ్య భోగ్యభా
స్వరసురసౌఖ్యులై పరగు – భాగ్యము భారతపౌరు లందఁగా. 377

తే. అఖ్యవస్కందననిహతి – కాస్థ యిద్ది
తలకు మించిన పనియని – తలఁపఁ దగదు
అకటా ఘోరకటికిఁ జిక్కి – యలమటించు
ప్రజలిఁక గరిష్ఠ సౌఖ్యము – వడయవలయు. 378

చ. ఉడుగుఁడు దుష్టచేష్టలని – యోర్పునేర్పునఁ జెప్పిచెప్పి నే
డడిదము చేతఁబట్టితిమి – హంతకులెల్లరు నంతమొందఁగా
నడలక ఘోరసంగర వి – హార విఘాతవిచిత్ర కృత్యముల్
దృఢముగఁ జేయఁ బాల్గొనెడి – ధీరుల కబ్బు సుకీర్తి సంపదల్. 379

కం. ఇంద్రియ సుఖ నిరతుండై
యింద్రువలెం జంద్రురీతి - నిహ భోగ కళా
సాంద్రుండగు మానవుఁడు జి
తేంద్రియుగతి విజయ కీర్తు - లేగతి నొందున్. 380

తే. కాళిదయ విజయంబులు - గలిగెఁ గాన
భాద్రపద శుద్ధ పూర్ణిమ - భక్తి దేవిఁ
గొల్తు మీవార్తఁ దెల్పుఁడు - గూడెములకు
నని పలికెరాజు మేలుమే - లనియె దండు. 381

శా. ఆ వృత్తాంతము విన్న తెల్లదొర ల - త్యాభీలరోషాత్మలై
దేవీపూజకు విఘ్నమున్ సలిపి బా - ధింపంగ సైన్యాళితో
వేవేగంజని యొక్కచో విడిసి య - న్వేషించి నూత్నాంశముల్
భావోద్రేకముమై నసభ్యగతులన్ - భాషించి రచ్చోఁ బ్రజన్. 382

వ. టాల్‌బట్ కొంత దళముతోఁ బెదవలసంబర్యవేక్షకుఁడుగనుండ ద్వితీయసేనానాయకుండగు సాండర్సు మహావాహినీ సహితుండై కాళికా మహోత్సవసన్నాహ సంరంభ సంతోషిత స్వాంతంబగు గూడెమునకుం బయనించుచుండఁ దద్‌జ్ఞులగు ప్రణిధులది రాజునకుఁ వైళమ నివేదింపఁ దత్ప్రత్యాసార ప్రదేశముల గ్రహించి దానికిం దగు ప్రత్యాహ్రత్య త్క్రమాదు లెంచి తత్క్షణమ మన్నెపుదండుతోఁ బ్రళయసమయ పర్జన్య ధ్వని సదృశక్ష్వేడానినాదములఁ బెదవలస మ్రుట్టడింపఁ పచన ప్రయత్న నిమగ్నులగు ప్రభుత్వభటు లూహకలంగ నిజాధిపతింగూడి సింహగర్జన మునకుం బ్రధావించు వృకనికరంబుంబలెఁ బర్వఁ దద్వృత్తాంతము విని కింకర్తవ్యతావిమూఢుఁడై భయకంపితుఁడై పూజాభంగమునకుఁ బురోగమనమా టాల్‌బటు రక్షణమునకుఁ దిరోగమనమాయని వితర్కించి సాహసింపఁజాలక కడకు సాండర్సు ససైన్యుఁడై సరగ వెన్కకుంజనె.

తే. ఆంధ్ర హంవీరు పేర్విన్న - నాంగ్ల భూమి
గజగజవడంకె సామ్రాజ్య - గర్వ మింకె
భరతసైన్యాధిపతి జంకెఁ - బరనృపాళి
కొంకె బింకమడఁగె రాచ - లెంకలకును. 384

వ. అని పట్టాభి యక్కథనాఁప నాఁటి సభ ముగిసె. 385

ఇయ్యది శ్రీమదాంధ్ర మహోభ్యుదయ ద్వితీయ భాగమునఁ
జతుర్థ ప్రకరణము సమాప్తము.

# కాళీమహోత్సవము

వ. అంతం దృతీయదివస సమజ్యం బట్టాభి యిట్లు చెప్పందొడంగె. వన పర్వతసానుస్థితాటవికవారనిగూఢ దృఢశిబిర సమీప చతుర్ది శాశోభితాట్టాలకసన్నిభోత్తుంగ శృంగశృంగాటక మధ్య జలాశయ నికట నింబమాకంద తోరణ కదళనాళికేర దళయుత కాయమానా విరాజిత వివిధవర్ణ రంగవల్లీ విభ్రాజిత బిలముఖ ప్రతిష్ఠిత నూతన శోణ వసన నానావిధ పల్లవ పత్రపుష్పాలంకృత కాళికాదేవీ చరణార్చనా తత్పరులై వీరగిరిజనులు తత్సన్నిధానంబున నుపవిష్టులైయుండ ఘంటా శంఖ భేరీ పటహాశృంగ కాహళడమరుకాది వాద్యఘోషలు విశ్వంభరా వియదంతరాళంబులం గ్రమ్మి యహార్యగుహలఁ బ్రతిధ్వనింప హయ్యంగ వీనమున నఖండదీపారాధన సేయ గంధసుగంధసుమ దక్షిణ తాంబూలంబు లునుప రా జిరుణ కుసుమార్చన గావించి సహస్రనామములతో గుంకుమపూజ యొనర్చి యసంఖ్యాక రంభాజంబీర నారికేళపణ సేత్యాది ఫలంబుల ధూపదీప నైవేద్యంబుల నర్పించి యూర్ధ్వభాగ నిక్షిప్త ఘృతసూపాన్విత వేణు తండులోదనమ్ము కుంభమ్మువోసి కొల్చి మంగళగీతములతోఁ గర్పూర నీరాజన మొనఁగుచుండ రత్తి జానపద నృత్యముసల్పె నంత నతండు. 1

శ్లో. నానారత్నరుచిస్ఫురన్మకుట భాస్వద్దివ్యతేజోనిధిః
శిక్షార్థాసురమర్దనీ శుభకరీ మాహేశ్వరీ శాంకరీ
మోక్షానందకరీ సదాజయకరీ జ్యోతిర్మయీ శాంభవీ
భక్తౌఘార్చితపాదపద్మయుగళా మాంపాతు చాడేశ్వరీ. 2

శా. భోగీశాభరణాత్మతృప్తికర సం - పూర్ణ ప్రభాశోభితా
రాగద్వేషవిదూరధీరనుత చ - ర్యా యార్య సంపూజితా
యోగీంద్రామలహృత్సరోజమణి పీ - ఠోద్యత్కలారూపిణీ
వాగీశాద్యఖిలామరార్చిత పదా - జ్ఞా రాజరాజేశ్వరీ. 3

## దోధకము

సేవన వశ్య వ – శీకృత భర్గా
వావిరి విశ్వవి – పాకద కల్యా
శైవద రక్తిర – సారమణీయా
దీవన వేఁడెద – దీధితి నిమ్మా. 4

## సుగంధి

సార హీర హార కల్ప – సాలచేల భాలతా
తార కాధినాథమౌళి – దత్త శస్త్రశోభితా
తార కారిమాత దీర్ణ – దైత్యయుద్ధ రాజితా
తార సాన గెల్పు నిమ్మ – దానధర్మ ధీయుతా. 5



## నాగ బంధము

చ. కరిముఖమాత వైరిహర – కారణవిగ్రహ గౌరి శారదా
సురనుత రూప భూరినిభ – శోభ నిరస్తతమోగుణావిలా
వరహరివాహనీ రహిద – వాదన చక్రపరేఖదారయా
గిరిజ గుణైహధీర శివ - కేవల రక్షహరైత వాచకా. 6

# ఖడ్గ బంధము



కం. సురవర పరహర పరహర
కరుణాసంద్రైక లోల - ఘన జనవరదా
ధరణీధర సంజాతా
పరమాద్భుత శక్తి యుక్త - పావని శుభదా. 7



కం. త్రినయన మానస ధనమును
ఘనభక్తిం బొంది జగముఁ - గాతువు జననీ
వినయమున నీపదాబ్జము
లనయము భజియింతు విజయ - మందభవానీ. 8



కం ధృతి నుతి నతి యొనరించెద
సతత హత మహాసురాళి - సంగరకేళీ
ధృతశూలీ జయశీలీ
మతినమ్మితిఁ గా కపాల - మాలీ కాళీ. 9



కం. అహరహ సుహావర సుఖదా
మహిషాసురమర్దనీ యు - మా సతి గౌరీ
గహనజననీ శివకామిని
మహానాసుర రణవిహారి - కుధర కుమారీ. 10



కం. కారణరణపసభరవర
ధరజనోద్ధరణ శీల - తృప్తపరేశా
శారద నీరద భాసా
శూరజనార్చిత పదాబ్జ - సురవరదాశా. 11



కం. ముదమొదవ దయం గనుమా
కదనంబున జయము నిచ్చి - కావు భవానీ
హృదయాబ్జంబున నీ మృదు
పదముల భజియింతు మమ్మ - పార్వతి జననీ. 12

# దండకము

శ్రీమన్మహాదేవదేవీ భవద్భక్తరక్షాక్రియాస్వర్గవీ శాంభవీ వైష్ణవీ చిద్భవీ దుష్టసంహారిణీ శిష్టసంరక్షణీ పావనీ ముక్తిసంధాయినీ సత్య వాగ్రూపిణీ దాసహృత్పద్మభాసీ విశాలాక్షి రుద్రాణిశర్వాణి కళ్యాణి కాత్యాయనీ రమ్యరత్నాక్షతాలంకృతా రక్తరాజీవనేత్రా లసద్రక్త వస్త్రా మహాభీకరాకార వందారుబృందారకానంద సంధానమందార ధీరా గళద్వైరిధైర్యా దళద్దైత్యసంఘా భవానీయపర్ణామృడానీ శివా గౌరి చాముండికాచండికాసర్వలోకేశ్వరీసర్వభూతేశ్వరీసర్వసంపత్కరీ యంబ చంద్రావతంసా మణీకుండలాలంకృతా నవ్యకల్హారమాలాళి సంశోభితా బాలభానుచ్ఛటా రత్నరాజత్కిరీటా ఛవీరూట భాస్వ న్మణీపాదపీఠా మహాఖేట కాళీ గదాశూలపాశాంకుశప్రాసకోదండ బాణౌఘతూణీరచక్రాసి వహ్న్యస్త్రమేఘాస్త్రవిధ్యస్త్రనాగాస్త్రశార్ఙ్గ్యస్త్రశక్రాస్త్ర హార్యస్త్రశైవాస్త్రతార్క్ష్యాస్త్రహస్తా లసద్వజ్రవైడూర్య దీవ్యల్లలాటా కనద్రత్నకేయూరబాహూ రణద్దివ్యమాణిక్యమంజీర నానాస్వరూపాంచితా ఘోరగర్జాచలద్విశ్వవిశ్వంభరా కంచికామాక్షి మీనాక్షి చండాంశుశీతాంశునేత్రా జగత్పూజితా లోకమాతా దయో పేత సంగీతసాహిత్యలోలా జగజ్జాలవిధ్వంసినీ సర్వదేవాసురుల్ బ్రహ్మవిష్ణ్వీశులుఙ్ నిన్నుఁ గీర్తింతురో శాంకరీ నీమహాశక్తివిశ్వంబు సృష్టింపఁ బోషింప ద్రుంపంగ మూలంబుగానెంత్రు సూర్యాగ్ని శుభ్రాంశు నక్షత్ర తేజోమయీ జ్ఞానదాయీ చతుర్వేదవేదాంగ వేదాంతవేద్యానవద్యా సదారాధ్య దుర్గా లయోద్రేకకేళీ మహాకాళి చాడేశ్వరీ యీశ్వరీ యుద్ధరంగంబునన్నిల్చి నిన్వేఢ సింహంబుపై నెక్కి ప్రత్యక్షమై త్వత్సుతుందేవలుం బ్రోచినట్లే మముంబ్రోవఁగా రావె తల్లీ సుధీకల్పవల్లీ జయశ్రీమతల్లీ నమస్తే నమస్తే నమః. 13

వ. అని యచంచలభక్తిమైఁ బ్రార్థింప తో నాటవికవీరశిఖామణు లేక పంక్తి నమ్మహానైవేద్యముం దృప్తిదీఱ నారగించి సుఖోపవిష్టులైయున్న తఱి రాజు వారల నవలోకించి త్యాగధనులార భారతవీరరత్నమనఁదగు నొక్కబాలుని చరిత్ర సంగ్రహముగఁ దెల్పెద సావధానులరై వినుండు.

ప్రథమ స్వాతంత్ర్యసమరసమయమున విజయ రఘోగడ్ మధ్యమ శృంగాటకమున నాంగ్ల సామ్రాజ్యసైనిక నికరము కవాతుచేయుచుండ నయ శృంఖలాబద్ధుల పితాసుతుల రాజాశంకరషా రాజారఘునాథషాలం దదధికృతుల బృహన్నాళికలం గాల్చి చంపిరి. వీక్షించిన యనేక లక్షల ప్రజలు భయ సంభ్రమ శోకవ్యాకులిత మనస్కులైరి. అష్టాదశవర్ష ప్రాయుఁడు రఘోగడ్వారసుఁడు సర్జూసింగ్ తద్దృశ్యముంగని ప్రతిక్రియ సేయ లోలోశపథించి నిజహితుల నతుల సాహసులఁ గొందఱఁ గూర్చుకొని రణపరికరముల సేకరించుచుండె. అత్తఱిఁ దత్సంస్థాన రాజకీయ ప్రతినిధి సర్ జార్జికార్లె. అద్దొరకు సహకరించుచుఁ దద్దక్షిణ భారనిర్వాహకుఁడుగనున్న మీనబ్ ఆలీ సర్జూసింగ్ జతనము గమనించి యతని చెంత కరిగి యనన్య సామాన్య శక్తియుక్త శ్వేతసేన నెదుర్కొన నిన్నెవ్వరు ప్రేపిరన నాయంతరాత్మయని యుత్తరమొసంగ నేనివ్వార్త కార్లేకు నివేదించిన నిన్ను నీరాజ్యమును భవదీయాంతరాత్మ ప్రోవంజాల దిఁక మద్ధితవచస్సులకుం దలయొగ్గుట లగ్గని యుగ్గడింప నీవసీమదొరలకు జానిసీఁడఁగ బ్రదుకు మస్మత్స్వరాజ్యకాంక్షకుఁ బ్రతిబంధకము గలిగింప కని బాలుఁడాడ నాలీ బుద్ధిహీనులగు మహాద్రోహులతోఁ జేయికలుపుటకన్నఁ దెల్లవారి సేవసేయుటయే మంచిదని పల్క నేనాసీతిలేనిద్రోహినని సింగత నిందన కరవాలమున కెరఁజేసి విప్లవదళమునఁజేరి జబల్పూర్ ప్రాంతమున వసించుచు నాలువర్షములు ప్రభుత్వ గజాంకుశముగ వర్తించుచుండఁ గడకొక సఖుని కుట్రచే బంధింపఁబడఁ గమీషనర్ యార్స్కనొక నాఁటి సింగమిపుడు మా వంటయింటి కుందేలనె. పిదప నాతని ప్రియపుత్రిక సర్జూను మోహించి నిశీధినిం జెఱకేగి మనోరథం బెఱిఁగించి మిత్తివాతనుండి తప్పించుకొనఁ దన జనకునకు లొంగు మన నత్తరుణీమణి యనురాగమభినందించి విధినిర్వహణ దూరుఁడఁగాఁ జాలనన నిరాశాపూరిత హృదయయై కన్నీటి కాల్వల నీదుచు జీవింపనొల్ల నను నీవ వధింపుమని పిస్తోలీ మగటిమిగల మగవాఁడనై మగువ నాక్రమందించుట యని తన్నుఁదాఁ గాల్చుకొని మరణించె. దయారహిత దౌర్జన్య దమన నీతిం బఱపి స్వతంత్రతేచ్ఛాపరుల హతమొనర్చు శ్వేతజాతికి గుణపాఠము నేర్ప దీక్షవహించిన మనకు "యశోవామృత్యుర్వా" యను వాక్యమే స్మరణీయము. అనాగరికుల మని మీరు కుందం బనిలేదు. మీలోఁ జరిత కెక్కిన పుణ్యాత్ములు పెక్కురు గలరు.

సీ. కురుపాండవాతీత - కుతలైకధన్వి ధీ
పరుఁ డేకలవ్యుండు - గిరి జనుండు
శ్రీకాళహస్తీశు - చే మోక్షమందిన
వరగుణి కన్నప్ప - గిరిజనుండు
పార్థునకుం బాశు - పతమిచ్చి ప్రోచిన
గిరిజాపతి విశిష్ట - గిరిజనుండు
వనిఁ జంద్రహాసుఁగా - పాడి పోషించిన
పరమ దయాశాలి - గిరిజనుండు

తే. అట్టి గిరిజన వంశానఁ - బుట్టినట్టి
మీరు జగదేకవీరులై - మీఱిపోర
దాస్య శృంఖల విచ్ఛేద - ధర్మశక్తి
నెఱపి శాశ్వతసత్కీర్తి - నిలుపుకొనుఁడు. 15

ఉ. కాకులు గ్రుడ్లు పెట్టినవి - కావున నయ్యవి పిల్లలైన దా
కాఁక మహోగ్రవృష్టికని - యందురు విశ్వరహస్యవేదు లం
దాఁక నిగూఢ మార్గతతి - నాఁగ బిలాదులఁ దిండినింపుఁ డ
ట్టాఁకటికగ్గమైన జయ - మందఁగ జాలము సంగరంబునన్. 16

వ. అనెనంతం గొన్ని దినంబులకు. 17

## వర్షర్తు వర్ణన

సీ. గగన వీథింగాంచఁ - గాఁజాల మీ వెంత
దవ్వున నుంటివో - తరమ తెలియఁ
గడలి నీరముఁ దృప్తి - గాఁ గ్రోలి వసిలక్ష్మి
మేఖలం బోలెడి - మెఱుపు నగల
ధరియించి పవనర - థం బెక్కి చాతక
జాతము ల్బంటులై - చక్క రాగ
గర్జించి మృగరాజు - గర్జింపఁ జేయుచుఁ
గలకండవలె వడ - గండ్లురాల

తే. క్ష్మాతలం బెల్ల నీకు స్వా - గతము పలుక
నప్సరోంగన ఢమ్మిల్ల - మట్టిమేని
తోడ రైతుల కెంతొ సం - తోష మొదవఁ
గదలిరావయ్య జలధరా - కదలి రమ్ము. 18

వ. అనుచు లోక మెదురు చూచుచుండ. 19

తే. నిర్మలంబైన నింగిఁ దూ - నీఁగలాడెఁ
గాలలీల నెఱిఁగి కృషీ - లాలసంబు
లున్నతస్థలముల నెక్కి - మిన్నుసూచెఁ
డెప్పలుగ నప్పలిఁకనని - కప్ప లఱచె. 20

తే. కట్టివేలుపు పండె మి - న్నెట్టి నయ్యె
నెట్టి చీమలు గ్రుడ్లతో - నేగఁ దొడఁగె
నూపిరాడక నరతతి - యుమ్మదమున
మబ్బుతుటుములఁ గని మది - నుబ్బుచుండె. 21

తే. వాన మృగశీర్షమునఁ బడ - వసుధ ముసలి
యెద్దు గంతిడునని రైతు - లెంచి రెదల
సరిగ నార్ద్ర్ర వర్షంబు - కురిసిన నిఁక
నఱువది దినాలు పఱపగు - ననిరి బుధులు. 22

ఉ. దోసిలియొగ్గి కర్షకులు - తోయదనాథు నకాలవృష్టిమై
గ్రాసము గూర్పవేఁడిరి త్వ - రందగసాగెనునేరువాక తా
నో సరె వేడిగా డప్పలరి - యూయెల నూఁగెడిబిడ్డ బుడ్డలన్
వేసె హసించుచుం బగిలె - వేగమ చీమలపుట్ట లత్తఱిన్. 23

తే. ధూమపంక్తుల చందానఁ - దోఁచి తోఁచి
గాలిలోఁ దేలిపోయె మే - ఘములు మొదట
గచ్చకాయలు రాలిన - కరణిఁ బిదప
నుడుకు చిన్కులు దబదబ - పుడమిఁ బడియె. 24

తే. గంధవత్యాఖ్య కడుసార్థ - కమ్ముగాగఁ
గమ్మ కమ్మని వాసనఁ - జిమ్మె వసుధ
వెన్కనెఱ్ఱఁగఁ గాలిన - పెనము మీఁద
నిడిన నీర్వలెఁ దేమ య - దృశ్యమయ్యె. 25

ఉ. పొంగిన వార్ధి వీచికల - పోలిక వారక దేవదానవుల్
సంగరకేళి తత్పరత - సాగిన రీతిగ జంతు పంక్తి వే
భంగుల సంచరించుగతి - పక్షికుభృ ద్వరవార మట్లుగా
జంగమ సౌధరాజముల - చాయఁ గనంబడె మేఘ ఖండముల్. 26

కం. సుక్షేత్ర రక్షణైహన్
రక్షస్సులతోడ ఘోర - రణమొనరింపం
దక్షత నెత్తిన ధనువనఁ
జక్షుఃప్రీతిగ మహేంద్ర - చాపము దోఁచెన్. 27

మ. స్తనయిత్న్వర్భక జన్మజాతకరకా - దంతాళి యూడం జనిం
చెను వే బెగ్గురులన్ స్థిరద్విజము లా - శీస్సిచ్చె క్షేత్రావనాం
గన భూభృద్ఘన విగ్రహంబు లతఁగెం - గంధర్తరాణ్మౌళి శో
భనమంచుం దివ మాక్రమించె నిజశం - పాఖడ్గధారాచ్ఛవిన్. 28

ఆ వె. సద్దు నన్ను మించి - చనఁ జాలదని తాన
పందెమొగ్గి మెఱపు - ముందె వచ్చెఁ
బ్రకృతి దత్త సత్త్వ - భాసురు నోడింప
శక్యమగునె యెంత - జాణకైన. 29

ఉ. కల్లులతోడ బాదినటు - గా జగమెల్లను ముంచివైచు న
ల్లొల్లులు నీళ్ళఁదేలునటు - లింద్రరథార్భటి నాకనంబునం
దొల్లులువడ్డయట్లు జల - ధుల్ నదులైక్యత నొక్కరీతిగా
బొల్లులు పెంచుకొన్నయటు - వొల్చెను వర్షము లోకహర్షమై. 30

తే. ~~ప్రాంతపూరింటఁ బండిన — వాకిటైన~~
నీటిదారలు పడనిండు - నిదుర సెడఁగ
నాలు బిడ్డలు తనచుట్టు - నడల గేస్తు
నిబ్బరము వీడి విడిచెఁ గ - న్నీటి బొట్లు. 31

తే. పొలమున న్హోరుగాలికిఁ - గలఁతచెంది
వర్షధారాహతి న్నిల్వ - వశముగామిఁ
బాలకుని లెక్కసేయ క - కాలమంద
పరుగిడుచు వచ్చె నిండ్లకుఁ - బశులమంద. 32

తే. మున్ను ఝుంఝులకుం జిక్కి - తిన్నదెబ్బ
లన్నివిని వార్థితీరమం - దున్న యూళ్ళు
వానకుం దోడుగాఁ బెను - వాయు వొకటి
వీచెనా గాలివానని - వెఱచె వగచె. 33

వ. పర్జన్యరఘురాముండింద్రకోదండమను శివశరాసనమెక్కువెట్టు
చున్నంత భూకాంత యనెడి సీత తిలకించి పులకించె. మహాపురుషబోధా
మృతాస్వాదనమున సామాన్యమానవ హృదయగతదుర్గుణము లెట్లు
దృశ్యములగునో వర్షపాతంబున నౌదుంబరఫలంబు లోని పుర్వులట్లు యెగిరి
పోయె. తద్రంధ్రములు సువాసనలు గ్రక్కె. 34

తే. వీధులం బిల్లకాల్వల - విధము జలము
పాఱుతఱి బాలబాలిక - ల్బహుముదమునఁ
గాగితము చిన్న పడవలు - గా నొనర్చి
నీటిపైనిడి చనుచుండ - నిలిచి కంద్రు. 35

తే. అభ్రగర్జకు గర్జింప - హరి గిరి గుహ
మెఱపు జిగి కన్నులకు మిఱు - మిట్లు గొల్ప
దీర్ఘ శాఖాగ్రముల నిల్వ - దిటము లేక
చెదరి ఖగములు వెసదూఱెఁ - బొదల గూళ్ళ. 36

తే. శౌరి కౌఁగిట వెలిఁగెడి - సత్య యట్లు
మేఘునెమ్మేన మెఱసెను - మెఱపు కాంత
హరశరోగ్రాగ్నిఁ ద్రిపుర సం - హారదీర్ణ
పతన దైత్య శరంబనఁ - బడెను పిడుగు. 37

తే. ~~బాలబాలిక లతిభయ - భ్రాంతులగుచు~~
~~నర్జునా యర్జునా యని - యఱచి రపుడు~~
~~కొండలను బిండిసేయు న - ఖండశక్తిఁ~~
దనరునదిగాన లోకము - దద్దరిల్లె. 38

ఆ.వె. ఎగసి మబ్బు గ్రమ్మ - నీదర గాలికి
బిట్టు వణఁకె నమిత - వృద్ధ జనము
మెఱపు గనులకెంతొ - మిఱుమిట్లు గొల్పెను
బిల్ల లులికి పడిరి - పిడుగు పడఁగ. 39

కం. అర్జును పేళ్ళను మేఘుఁడు
గర్జించెడివేళఁ దలఁచి - కంపిల్లి జనుల్
నిర్జించి యాశలను ఘనుఁ
బర్జన్యుని నభయమీయఁ - బ్రార్థించి రెదన్. 40

ఆ.వె. జీవి కోటి కెల్ల - జీవన ప్రదమైన
మేఘుఁ డేల విడిచె - మృత్యు రూప
మైన పిడుగుఁ బ్రకృతి - యంద మంచియు చెడ్డ
యనవరతము లీన - మగుట నిజము. 41

తే. సర్వజీవుల దయఁజూపు - జలధరుండు
మిట్టపల్లము లేకమా - నట్టు కురిసి
సామ్యవాదిగఁ గన్పట్టె - సరగ వేఱు
లింకఁ దొంటినిజమ్ము ని - శ్శంకఁ దోచె. 42

తే. సూర్యరశ్మికి నుదయానఁ - జూరు బొట్టు
లాణిముత్యాలు రాలుచు - న్నట్టులుండఁ
బిల్ల లల్లన నొండొరుఁ - బిలిచి కొనుచు
సంతసంబునఁ జేతులు - చాపు చుంద్రు. 43

తే. కుతల కూపపుఁజేఁత్రాళ్లు - కుఱుచలయ్యె
గుంపులుగఁ గూడి వ్రాలుచుఁ - గొంగ లఱచె
కాళికా వక్త్రముక్తాగ్ని - కణిక లనఁగఁ
దనరె నారుద్ర పుర్వులు - దశదిశలను. 44

తే. వానకాఱునఁ బుట్టి దై - వ దయవలన
మేన నతికించుకొనె నేమొ - మెఱుపు రవ్వ
లనఁగ మిలమిల మెఱయుచు - నచట నచటఁ
దిరిగె నిశలందు మిణుగురు - పురుగు లపుడు. 45

మ. జ్వలనాస్త్రోద్భవకీల వారుణ మహాస్త్రం - బిట్టె చల్లార్చిన
ట్టిల దావాగ్ని నడంచె మేఘపతి వ - ర్షాపాత సత్త్వోద్ధతిన్
విలసద్వేణువనాళిఁ జేరరు మఖా - ఖీలాభ్రగర్జన్నరుల్
జలధారాహతిరాలెఁ దాళఫలముల్ - శైత్యానిలం బొప్పఁగన్. 46

చ. చలమున సూర్యుఁ డుగ్రకర – జాలములం బ్రసరించుచుండఁగాఁ
గలఁగుచు గ్రీష్మకాలమునఁ – గల్గిన తృష్ణకు వారిదంబు ల
జ్జలనిధి నీరమానుట వె – సందగఁ బేరిన యుప్పుగండ్లొగిన్
బెలుచ నిరమ్మదాగ్నిఁబడి – ప్రేలెడి పెన్ధ్వనిగర్జయండ్రిలన్. 47

తే. పద్మినికిఁ గష్టదినములు – ప్రాప్తమగుడు
మెట్టతామరకుంగడు – మిసిమి హెచ్చె
నొకఁడు దుర్దశనొంద వే – ఱొకఁడు పెరుఁగు
నినుఁడు గ్రుంకఁగ శశియుద – యించినట్లు. 48

ఉ. ఎక్కడ యాకసంబు మఱి – యెక్కడ భూమి ఘనుంగనంగడుం
జక్కఁగ నెమ్మి నృత్యమును – జల్పె ముదంబున దూరమడ్డమా
నిక్కవుఁబ్రేమయున్నయెడ – నిండు విధుంగని కల్వ చెల్వయుం
బక్కున నవ్వదే సరస - బంధము భేద మొనర్ప శక్యమే. 49

తే. ధరణి జీవికి జీవన – దాతయైన
జలద సఖవరుఁ గన మేను - పులకరింప
వివిధ రత్నాల కుంచెతో - విసరు చున్న
వనఁగ శిఖులు పురుల్విప్పి – యాడఁ దొడఁగె. 50

తే. చిన్న సెలయేరులకుఁగూడఁ – జియ్య వట్టె
నదులు పింపిళ్ళు గూయుచు - నాథుఁజేరె
నిరతరతిఁదేలెఁ గల్లోలి - నీవిటుండు
క్షేత్రలక్ష్మి పచ్చనిపట్టు – చీరగట్టె. 51

తే. కంటికాగదు గద గిజి – గాడు చూడ
గూడు కట్టుటలో నేర్పు – గూడుగట్టెఁ
గుతల ఖారంబునాఁబడు – కుంభవృష్టి
కింత తుంపర చొఱదందు – నేమనందు. 52

ఉ. వ్రేలెఁడు పిట్టకెంత తెలి - విం దయచేసె విధాత దాని యిల్
వ్రేలు మహోగ్రఝుంఝు కఱి - ఖీతిద శబ్దముతో వనస్పతుల్
తూలినఁ దూలుఁగాక యది – తూలదు వ్రీల దొకింతయేని నే
లీలరచించెనో తెలియ - లేము పరాత్పరు దివ్యలీలలన్. 53

తే. సద్మనిర్మితి తనకు న – సాధ్య మగుట
జడిఁ గడుపు కొఱకుఁ దిరుగ – జలుబుచేతఁ
గోయిలకు గొంతు బొంగురు – వోయె నౌర!
పాటకున్మెచ్చియుఁ బ్రకృతి – ప్రాపు నిడదు. 54

మ. వనమింకం గలుషంబు తమ్మిస్థితి దు – ర్వారం బిటన్నిల్వలే
మని క్రౌంచాద్రిబిలాన మానస సమా – ఖ్యం జేరె హంసౌఘముల్
ప్రణయాహ్లాదపరైక దీధితి సఖీ – వశ్వేత శంఖావళుల్
వినువీథిం జనురీతి సారసములు – ద్వేలాళిగా నేగెడిన్. 55

చ. ఘనవనపాన జీవన వి – కాసలసచ్చర చాతకావళుల్
దినదిన వర్ధమాన నవ – దీధితి దీపిత సస్యరాజముల్
తృణ జల నిత్య తృప్తి తను – దీప్తిపయోదపశు ప్రకాండముల్
దనర సమస్త జీవితతి – తాపము వాసి సుఖించె నయ్యెడన్. 56

ఆ.వె. ఎండవేళ జల్లు – నెసఁగు నీర్ష్యయు దయ
తనుజు మీఁదఁ జూపు – దనుజు నట్లు
గొడుగులేని యధ్వ – గులు చెట్లక్రిందికిఁ
జనుచునుంద్రు వేగ – జడికి నళికి. 57

తే. బొమ్మజెముడు కుటజములు – పూలు పూచెఁ
దగఁ గదంబము కుసుమక – దంబ మయ్యెఁ
బుట్టగొడుగులు నొకచోటఁ – బుట్ట నవలఁ
బుట్టకొక్కులు పుట్టెను – బుట్ట నేల. 58

తే. సమయ మన్మథ శరహతి – సరిగఁ గాఁడ
స్వాతికార్తె యన్వితబిందు – పతనమునన
వివృత జఘన శుక్తి తరుణి – వేగ గర్భ
వతియయి కనియె మౌక్తిక – భవ్యబాలు. 59

ఉ. ఓలవుఁ బోషణేహలఁ బ – యోధర ధారల నాన సస్య బా
లాళి ముదంబుమైఁ గను న – హర్నిశ లాఁకలి నిత్యనూత్నమౌ
టోలినెఱింగి వత్సలత – యొప్పఁగ నయ్యవి తీర్చు వాంఛలం
జాలిగలట్టి డెందముల – చర్యల జీవనదంబులౌఁ గదా. 60

తే. క్షణములో వర్షమును మఱు – క్షణములోన
తీవ్రతరమైన యెండయుఁ – దేజరిల్లె
నంతలో నేడుపును మఱి – యంతలోన
యమిత కోపముఁ జూపు గ – య్యాళి వోలె. 61

## కవర్డు హైటరుల రాక

వ. కృష్ణదేవీనగర నర్సీపట్టణ మధ్యస్థ మహారణ్య మార్గమున మన్యపు దండుమట్టుపెట్టి యత్నించి విఫలమనోరథుండై క్రోధపరీతచేతస్కుండై నిజధ్వజినీ సమేతుండై స్టీవర్టు లంబసింగిఘాటున వచ్చుచుండ రోషభీషణ ఘోషణముల భయంకర వ్యాఘ్రరాజ మొకండు కరీంద్రముపైకిం దుముకు మృగేంద్రంబు చందంబునఁ దచ్ఛకటోపరిభాగంబునకు లంఘించి పంజాతోఁగొట్టుచుండం జోదక సహితుండై ఝుంఝుకుం జిక్కిన పక్కి ఫక్కి వాత్యాహతిందిర్గు జీర్ణ పత్రంబు భాతి భ్రమించి శ్రమించి చిట్టచివఱకెట్టో తనయునికి పట్టుంజేరె. ఏ తద్వృత్తాంతము నిజగూఢచారులగు రత్తి గోవిందులు రహస్యముగ విన్నవింప రాజెఱింగి సంతసించె. రక్షక భటాలయముల సైతము రక్షించుకొనఁజాలని దుస్థితి బ్రిటీషు సామ్రాజ్యమునకుఁ బట్టినదని గమనించి విప్లవమును సమూలముగ నాశన మ్మొనర్ప సంకల్పించి రాజకీయ తంత్రజ్ఞుఁడు కుటిల వర్తనుఁడు నూతన మండలాధిపతి యగు రూథర్‌ఫర్డ్ కార్యాలయమున నాంగ్లసేనాను లార్మిటేజి, నాఫ్ ప్రపంచయుద్ధ వ్యూహాధిపతి మేజర్ జనరల్ గూఢాల్ ప్రభృతులు కొల్వుదీరియుండ జిల్లాధికారి క్రొత్తన్న బాలయ్య పడాలుల గ్రామాధికారి పదవుల రద్దుచేయించి "మార్షల్‌లా" యను మహాస్త్రము ప్రజలపైఁ బ్రయోగించి కోయనాయకులఁ బట్టియిచ్చిన వారలకు విరివిగ ధనరూప పారితోషికము లిత్తుమని యూరూరం జాటంబంచి విశాఖసైనిక న్యాయసభా స్థాపనమున కాననిచ్చి భటాదులం గని. 62

ఉ. ఈ బలమే మొనర్చె నరు – లేగతిఁ జిక్కక తప్పిపోయిరో
మీబ్రదుకుల్ నిరర్థకము – మిమ్మిటు పోషణ చేయనేలరా?

దేబెలు! పల్లెలం బ్రజకు - ధీరత రాజును బట్టియిచ్చు చో
నేఁబదివేల రూప్యముల - నిత్తుమనుండు ధనాశపాశమౌ. 63

వ. అనఁ దదనేహస్సునఁ భీకరాకార సాయుధ నిజ పిశాచ సమూహ సంకలిత బ్రహ్మరక్షస్సునాఁ జెన్నపురీ కేంద్రాలయాగత ప్రాణి శ్రేణి శ్రవః పుట భేదన దక్షాక్షీణక్ష్వేళాకరాళనిర్హ్రాద ప్రతిధ్వనితరోదసీకుహర విదీర్ణహాటకగర్భాండకటాహ రవిరథతురగవేగవియదంతరాళ వికీర్యమాణవిస్ఫులింగోగ్రసమగ్ర విగ్రహావేశవాంత ధూమ్యామేఘధ్వాంత సంయుత ప్రత్యేక దృఢతర ధూమశకటనిర్గతాతి ఘోరాస్వాముఘూర్ణా సైన్యచయగమన సమయ సంజనితాయః కీలాన్వితపాదరక్షా ధ్వనులతో ధరాతలంబు దద్దరిల్లుచుండ నిస్తంత్రీయంత్రనికరములతో నాఫ్రికా, యేడెన్, ఆఫ్ఘన్‌స్థానముల యెడారి సంగర రంగముల నందెవేసిన చేతులు స్కాట్ కవర్టు హైటరులు రా నున్నతాధి కృతులమితాహ్లాద పరశులై మధుపానమదోన్మత్త వినోదక్రియల నొండొరులం గౌరవించుకొనుచుండ బృహన్మరీచపుండపావచ్చి మేజాకుంగ్రుచ్చికొనంగని యాశ్చర్యచకితులై శరంబుపెటికి దానికొనం గలపురోణీందిలకింప నెల్లి చోడవరము మీఁదికి దండయాత్ర చేయుచున్నారము. గుండెగలదేని ఖండనంబున మమ్మెదుర్కొనుండని యందుంటకుంగనలి యనంతర కార్యక్రమం బాలోచించుచుండఁ బ్రభుత్వ పరాజయ పరాభవ పరంపరా వార్తాపరితప్తుండైన రాష్ట్రాధిపతి స్థానికముగ రాజుస్థితియెట్టిదని నిస్తంత్రీ ద్వారమ్మునఁ బృచ్ఛింప. 64

మ. ధనురాచార్యనిభ ప్రభాకలితు వి - ద్యావేధకల్పున్ సుధీ
జన వంద్యున్ గ్రహరాజతేజు రణ భా - స్వచ్ఛక్తియుక్తుణ్ శివా
ఘనపూజానిరతున్ స్వరాజ్య రతు ని - ష్కామైకనిష్ఠా వ్రతున్
జనులెచ్చోఁగని యంజలింత్రమల వి - శ్వాసాత్ములై భక్తులై. 65

తే. ఐకమత్యము సమకూర్చి - యాదరించి
నితరలోఁగూడఁ దమమేలె - యెదఁ దలంచి
యెవనికందని కృషి సల్పు - టెంచి యిచటి
మనుజు లాతని దైవ స - మానుఁ డంద్రు. 66

తే. ఒక్కపరివృద్ధురీతి వే - ఱొక్క సారి
యువతెలుంగున నొకతేప - యోద్ధ యట్లు
యొకతడవ మౌని చందాన - నొప్పి రాజు
మానవాతీత శక్తుల - మసలుచుండు. 67

ఉ. ఏళ్ళదరింబులుల్ జిఱుత - లెన్ములు దుప్పులు కోళ్లులేళ్లు కుం
దేళ్లు వరాహముల్ కరులు - తేళ్లును జెఱ్ఱులు రేచుత్రాచు తో
డేళ్లు వృషమ్ము లెల్గులు క - డింది ముదమ్మున సంచరింపఁగాఁ
గాళ్లకుఁ గన్నుఁ గన్నయటు - కాన నతండు చరించు రేవగల్. 68

చ. ప్రజనెవఁడేవచింపఁడిటు - రామ రహస్యము గొట్టఁదిట్ట మే
మజునకు శక్యమా తెలియ - నాతని మాంత్రికశక్తియుక్తి త
ద్ధ్వజిని షడానన ధ్వజిని - బాణము రాముని బాణమౌ యెటై
న జయము సార్వభౌముల క - నర్గళరీతి ఘటింతు మాజిలో. 69

వ. అని రాజుగుణంబులంగూర్చి మున్న వీరయ్య దొరసెప్పినట్లు వెల్లింగ్ట
నున కధికృతులు నివేదించిరి. 70

# స్కాట్ హైటరుల మరణము

తే. అవలకొలఁదిదినంబుల - కద్భుతముగ
నాంగ్లసేనాధిపతులు వ్యూ - హములు పన్ని
నవనవాయుధ శకట స - న్నాహమమర
బయలుదేరిరి విప్లవ - వరులఁబట్ట. 71

వ. రాజొక్కనాఁటి పట్టపగలు ధారాహార్యపార్శ్వస్థితమ్మగు గాము
కొండపైఁ బడాలుతో భాషింపుచుండ బధిరునివలె నటించి కసుబాయగు
నర్సీపట్టణమున బృహన్మరీచపుండపావేసి తప్పించుకొన్న సింగన నిమ్మ
గడ్డనుండి వచ్చి నిఖిల భూమండల మహాసంగ్రామరంగ విజేతలగు పతా
కినీ పతులని ప్రఖ్యాతివడసిన జగజెట్టులు స్కాట్కవర్టు, హైటరులు
స్టెన్ గనులతో నపార వాహినీవారముతో రానుండిరని చెప్పి రహస్య
మార్గమునఁ దన యున్కికిం జేరె. బహువిధ యుద్ధముల విజయలక్ష్మి

పాణిగ్రహణ మహోత్సవముల ననుభవించిన యాంగ్లసైన్యాధ్యక్షులెల్ల రొక వ్యూహముం బన్నుకొని యడ్డతీగలలో ఈవ్లింగ్, కొయ్యూర డాసన్, కృష్ణదేవిపేట ఫర్బిస్ కీసెలు, గొర్తెడులో హ్యూమ్, పెదవలస, గూడెము, చింతపల్లి ప్రాంతముల సాండర్సు, టాల్బట్, స్కాట్కవర్డు, హైదర్, ఛాడ్విక్కులు, లమ్మసింగి మార్టిన్ తమతమ పృతనతో సంగర రంగమునకు సంసిద్ధముగ సుండిరి. 72

తే. ఇట్టు హూణబలంబుల - యెసకమెసఁగ
మన్యమొక యుద్ధభూమిగ - మాఱిపోవఁ
గాఱుమబ్బులఁ జీఁకటి - గ్రమ్మినట్టు
లచటి ప్రజ చిత్తములఁ జింత - యలముకొనియె. 73

తే. పల్లె లందొట నిట విప్ల - వమ్ము రేఁగె
ననెడి విశ్వాసమునఁ గ్రోధ - మంకురింప
గూడెముల నున్న జనులకు - గుండెగాల
మనఁగ వర్తించుచుండె న - య్యాంగ్లసేన. 74

వ. అత్తఱిఁ "ప్రియమైన స్కాట్కవర్డు, మీరు నాకొఱకు గాలించుచున్నట్టు నాకు సమీపమున నున్నట్టు తెలియుచున్నది. ఇటకేతెంచి మాతోఁబోరుదురా? లేక మమ్ము మీయొద్దకు రమ్మందురా? పుట్టుకతో నింగ్లీషువాఁడవు గావున న్యాయమును వాస్తవమును దెలుపు" మని రాజు కవర్డునకు మిరెపకాయటపానంప నతండు "ప్రియమైన రాజూ, నిజమైన భారతీయుఁడవైనచో మాతోఁ బోరాటమున కచ్చోట నాఁగవలయు. మేము రేపటియుదయము ప్రథమయామాంతమున నటకు వత్తు" మని జవాబిచ్చె. మఱునాఁటి వఱువాత గిరిజన మహానాయకుండు భూభృత్కూటములఁ జదురులగు వేగరుల నిల్పి బిలముఖ బృసీసమాసీనుండై తపోనిష్ఠఁ దనర హఠాదాగతశృంగనినదస్ఖలిత సమాధియోగుండై వైశమ తచ్ఛిఖరారోహణ మొనర్చి యిరుగడఁగెంధూళి వియత్తలమున కంటుచుంటం గని నిజయోద్ధృమండలిం జేరం జీరి. 75

చ. ధృతిమతిగామిఁ గామితము - దీఱక యూరక కిన్కనాడఁగా
గతిగలదే ప్రపంచమునఁ - గామక మామకవాక్కు విన్నచో

సతతశుభాస్పదైక జయ - సంగతి వెల్గుదురంచు రాజు మీ
రతిశితశస్త్రఘాతముల - కందక నిల్వఁడనంగఁ బొంగుచున్. 76

తే. అతఁడు చూపిన మార్గాన - నడుగు లిడుచు
వ్యూహనాయకు లుజ్జ్వల - సాహసమున
నదరులుమియుచు వైరి జా - డరయఁ బొదల
నక్కి నల్దెస వెస నిక్కి - నిక్కి కనఁగ. 77

వ. రామరాజు నలువలంకులం బరికించుచు నాలోచించి. 78

సీ. కాఁబోలు శాత్రవ - ఘన శతఘ్నులమోఁత
భీకరంబుగఁ జెవి - సోకుచుండెఁ
గాఁబోలు వైరి వ - ర్గముల గుడారముల్
వెనుమంచు గుట్టల - విధము దనరెఁ
గాఁబోలుఁ బరిపంథి - గంధాంధ చారులు
తారుచుండిరి దొంగ - దారులందుఁ
గాఁబోలు శస్త్రాస్త్ర - కలిత శతాంగముల్
తిరుగుచున్నవి గుర్తు - తెలిసికొనక

తే. వింతదుస్తుల దస్యూల - వితతి వోలె
నరిచమూతతి కాఁబోలు - నచటఁ దోఁచె
నక్కడక్కడ నక్కి వి - ల్లెక్కుపెట్టి
నిలిచియుండుఁడు వైరుల - గెలిచి రండు. 79

ఉ. కాకులఁగొట్టి గ్రద్దలకుఁ - గమ్మనితిండి లభింపఁజేయు నీ
భీకరు లీక్ష్యతాంతులు సు - భిక్షము గూర్పరు తీర్పరాపదల్
వాకొక ఖాకుగా విసరి - వైచితి మాఱువు వారిడెందముల్
మూఁకలు మూఁకలై మనల - ముట్టిన నెట్టన మట్టుపెట్టమే. 80

ఆ.వె. గంప సిరులు గావు - గాలంపు సిరులివి
నింపఁ గలము సీమ - కంపఁ గలము
కుటిల దమన నీతిఁ - గూల్పంగ నిల్వఁడు
పవన వైనతేయ - పాటవమున. 81

ఉ. ఘోరరణైకదీక్షితులు - క్రూరు లకుంఠిత విక్రమాన్వితుల్
వీరిదె వచ్చువా రఘుల - భీకర యుద్ధమునన్ వధించుచో
భారతపారవర్య లతి - భక్తి భజింపఁగ మీఱె మీయశం
బారవి చంద్రమౌఁ గడఁగుఁ - డద్భుత సాహసశక్తియుక్తులై. 82

వ. అని అనుచుండ. 83

తే. వైరు లపమార్గమున మిత్తి - వాతఁ బడఁగ
ముఖ్య గుల్మాళి కుష్టీష - ములను జుట్టి
వచ్చితినిటన్న గోవిందు - మెచ్చె రాజు
ఛత్రపతికివ రణయుక్తి - సాటి యనుచు. 84

వ. అంత వీరయ్యదొర యగ్గిదొర క్రొత్తన మోదిగాఁడు మూఁగఁడు గోవిందు ప్రభృతు లయ్యాయి సాంకేతికస్థానములకు వ్యూహరచనతో నరుగ సిద్ధపడియుండి. 85

చ. తుఱఁగలికొన్న దీప్తి రమ - తో నసిదూసిన రాజుఁగాంచి వా
రెరగలిగ్రక్కి గ్రక్కదలి - రెల్లరు నెల్లలు లేని దీక్షతో
మఱుగుననుండి పొంచి తద - మానుషచర్యలనెల్లఁ గాంచి స
త్వరగతిఁ దీవ్రఘాతవిత - తమ్యతి నొంపఁగఁ బేరునింపఁగన్. 86

వ. తత్క్షణమరాజు వీరచతుష్టయమగు మల్లుపడాలు గంట మెట్టేసుల నిజపార్శ్వంబుల నిలువుకొని శాత్రవ ధ్వజినీపతుల నడకం గనిపెట్టం దీక్ష దృష్టిం బ్రసరించుచు నస్మదాజ్ఞయైనం గాల్పుఁడన వారలు వల్లె యనిరి. స్కాట్ హైటరులు కాఱడవి నర్ధయోజనమ్మరిగి రంపోలుదాఁటి మొగలిదొడ్డి ఘాటునఁ బ్రాణమ్ము లఱచేత నిడుకొని మృత్యుముఖగహ్వర మునకుంజేరనోయన హస్తములఁ బిస్తోళ్ళు ధగధగ మెఱయుచుండ గామునగమునకు ధారాగిరికి మధ్యమమున నున్న లోయలో తెప్ప వాల్చక యూపిరి పీల్చక పొంచిపొంచి యెఱకరుగుచున్న మార్గాలంబు తెఱంగునఁ బాదనినదశూన్యంబుగ నడుగులిడుచునుండ దూరసాంద్ర నికుంజపుంజస్థిత వృకవ్యాఘ్రాది వన్యమృగంబు లవ్వారి నతాత్తుగఁ బొడ గని నిశితదృష్టిం బ్రసరించుచుండ విప్లవవీరవర్యులు జాగరూకులై. 87

తే. హైందవదళద్వయము లోయ - ముందు వెన్క
నడువ నిర్భరు తత్పతుల్ - నడుమ నుంట

నరయుచుఁ గవర్డు హైటరు - లని తలంచి
పొంచియుండిరి వారలఁ - బోరి గొనంగ. 88

వ. తఱిఁగని రాజాననొసంగ. 89

తే. అశని నిర్ఘోష మట్టుల - నవి ధ్వనింప
నల్వురుంగాల్చి రల లఘు - నాళికలను
నంగరక్షకులు కవర్డు - హైటరులును
జచ్చి వాగునఁబడ రాజు - మెచ్చెఁ జెలుల. 90

తే. ప్రీతి నాయుధముల ముద్దు - పెట్టుకొనిరి
కోయదొర లంత సితసేన - గుండ్లు ప్రేల్చెఁ
దోఁక ద్రొక్కిన త్రాచునాఁ - దోఁచి కొండ
పణుకుమాటున విప్లవ - భటులు నిలిచి. 91

కం. మండలిత చాపులై రిపు
మండలములఁ జెండుచుండ - మార్కొన నని ను
ద్దండులకు గుండె సొలమి
దండుగలఁగి మలఁగి తప్పు - దారింబట్టెన్. 92

కం. చండాంశుతేజు నృపకుల
మండనుఁ గనఁ జాల కరులు - మసలుచునుండం
జండశరాహతి రాజొగి
ఖండించెఁ హూణసేనఁ - గని కలఁతపడఁగ. 93

వ. అత్తఱి డైనమో ప్రేలినతఱి ఱాతికొండలు తున్కలైనట్లు రామరాజ
శరాహతికి వైరినికాయముల కండలు ఖండ ఖండములై పడుచుండం
గొండరాజులు. 94

తే. వేణువులనేర్చు కార్చిచ్చు - విధము దోఁప
నటఁ గతిల్లను నినదము - లబ్బురముగ
నావహిల్లఁ దుపాకుల - నంబకములఁ
బఱపి రయ్యరిసేనలు - పర్వులిడఁగ. 95

వ. ఇయ్యాటి రక్షక భటులిర్వురు రాజునకుఁ జిక్కి దిన ద్వయంబుంచు
కొని కడుంగడు గారవించి పంపె. నాఁటంగోలె హైటరు తుపాకిని గవర్డు

గ్రాసుబెట్లు నాతండు ఘరించె. అయ్యాంగ్లసేనానుల మరణమునకుఁ జింతించి తన్మృతకళేబరములఁ దెచ్చుకొనఁ సార్మిటేజి కీనీ ప్రభృతులు మహావాహినితోనంతాడ ఘాటునొద్ద ముక్కోణమునకుఁజేరఁ దత్పర్వత కూటంబునుండి వార్తరా రాజు సైన్యసమేతుండై చని. 96

శా. పంజావిప్పిన సింహమట్లమిత కో - పస్ఫూర్తి దీపింపఁగాఁ
గెంజాయన్నయనంబు లొప్పనిలిచెం - గేలందుపాకిం గొనెన్
రంజిల్లందసవీరవాహిని సమి - ద్రంగక్రియాలోలుఁడై
ఖంజించెన్ వ. వైరి వర్గమును బీ - భత్సంబు రేకెత్తఁగన్. 97

తే. వేగ గుం డార్మిటేజి టో - పీకిఁ దగుల
మరలిచని రాజునొద్దకు - మధ్యవర్తి
నంపి యాతండు కోరిన - యట్ల యప్ప
డైదు వందలు ధనశిక్ష - యతని కిచ్చె. 98

వ. తచ్ఛవంబులఁగొని చని శ్వేతసైన్యాధిపతుల స్మారక చిహ్నములుగ సమాధి ద్వయమ్ము మాత్రమ కట్టించిరి. అవియ యాంధ్రవీరశిరోమణుల యవక్రపరాక్రమమునకు మాతృదేశభక్తికి నాంగ్లజాతి వర్ణభేద విచారణ చర్యకుఁ జిహ్నములై వెలయుచుండె. 99

తే. ఆంగ్లవీరులతోఁగూడి - యసువులిడిన
భరతభటులకు గోరీల - ప్రాప్తిలేదు
రుద్రభూమినిగూడఁద - రౌద్రమేమొ
తెలుపు నలుపుల భేదంబుఁ - దెలిపి రౌర! 100

# అడ్డతీగెల ముట్టడి

వ. అనంతరము రాజు గిరిచరవీరవార పరివృతుండై కాకులుదూరని కారడవిం బ్రవేశించి యేడువంపుల ఘాటునఁ జింతాలమ్మకు మ్రొక్కి యాంగ్లపదాతితత్యర్థాగతాహార పదార్థచయముంగొని ప్రజకుంబంచి కాకరపాడుమీఁదుగ ముషిణవనముదాఁటి యడ్డతీగెల ప్రాంతముఁజేరి దాని ముట్టడింప స్థిరసంకల్పుఁడై రక్షకభట ప్రణిధియగు నాదినారా

యణుం బిల్చి దినత్రయంబున కడ్డీతీగెలపై దండయాత్రచేయ నిశ్చయించు కొంటింగాన నియ్యది త్వదీయాధికారుల కెఱింగింపుమని చెప్పిపంపె. అది విని డాస నధికసైన్యసముపార్జన వాంఛావ్యాజమ్మునం గాకినాడ కరిగి తప్పించుకొన యత్నించె. బ్రేకన్ రిజర్వుదళముతో సార్జంటు నంపి సంతృప్తినందె. మాండలిక న్యాయాధికారి గుండెపగులం దిమ్మాపుఠమున నిల్చి యోచించుచుండె. నిర్ణీత దినంబున రాత్రి ద్వితీయ యామప్రారంభ మున రాజు నిజానుచరులంగూడి యడ్డ తీగెలుచేరి తుపాకిధ్వనుల నగ్రామ సీమ మాఱ్మోగంజేయ సంక్షుప్తంబెల్ల దద్దరిల్లె. యెదుర్కొన్న మలబారీయోధులవధించి స్టేషనులోనికిం జని విప్లవనాయకుల వానరహ స్యములుగ్గడింపలేదని కారాకుడ్య మధ్యమ్మున జానపద జనంబులనుంచి చిత్రహింసాకృత్యనిమగ్నులై యున్న యస్సాము సైనికుల సంకుల సమర మున సంహరింప రిజర్వు రక్షకభటాధికారి మందుగుండు దీసికొని మీ కనువైనయెడ డాగవచ్చునని తన బంటులకు రహస్యవార్త నంపె. కొందఱు పాఱ నెదుర్కొన్న యుద్ధభటులు వైరిశరంబులం బిట్టలవలె నేల వ్రాలిరి. షెర్లాక్ బ్రదుకు జీవుఁడాయని కేకి కూఁతవిన్న విషధరంబు చందంబున, సింహగర్జనంబు విన్న జింకతెఱంగున పఱుగిడి యూరికి దూరముగఁ బచ్చిగడ్డిందూఱె. ప్రాణగొడ్డమిది యని రక్షకభటాధికారి యడ్డాల సుబ్బారావు పూటకూళ్ళ ముసలమ్మయింటం దూటాలు పట్టుకొని డాగె. అంత రాజు బందిగపు బీగమ్ముల భేదించి కవాటముల విప్పఁ దృటద్వారానిర్గత కపోత వ్రాతంబు రీతి జనతతి రివ్వున వెల్వడి శుజ్మో ద్రాశునమ్మిళిత దృక్ప్రసరణంబుల నతనిం జుట్టుకొని. 101

తే. దుడ్డుఁగఱ్ఱల వారల - దుడుకు రేఁగఁ
బగిలెఁ గోయల తలలు - దుర్భర మనంగ
నెంత నిర్దయ హృదయులో - నెఱుఁగరాదు
మాలదైవము నేఁడు మా - పాల లేదు. 102

తే. దయ్యములముందు బ్రదుకుదు - రయ్య బిడ్డ
లెట్టో మాంత్రికుఁడవు మాకుఁ - బట్టువడితి
కర్ణధారుఁడవై మమ్ముఁ - గావఁ దగదె
యూల మరలింపువాఁడెపో - యర్జునుండు. 103

తే. దొడ్డపని కర్షులముగాము - గ్రుడ్డి కన్ను
తెఱచినను మూసినను నేమి - యొరగఁ గలదు
మనుచునుందు మజాగళ - స్తనము లట్లు
లేమి యొద్దానికిం దావు - లేమి సామి. 104

కం. పిన్నతికము పెద్దతికం
బెన్నక తన్నుదురు నుసురు - లీయిలఁ దగులన్
మన్ను దినిపించి రిచ్చటి
మన్నెపుఁ బ్రజచేత వీరి - మరణము దరియన్. 105

వ. అని రుద్రయ్య యన. 106

ద్విపద

మఱవక రాజును - మా కప్పగింప
దొరలిష్టు మాలావు - దుడ్డిత్తమంట్రు
సొప్పండి మీరెప్డు - సూత్తిరోయన్న
నెప్పుడుఁ గనమన్న - నేడ్పింత్రుసామి
యెట్టి టోపీ బంటు - లెగిరివడ్డారు
కుట్టో మొట్టో యన్నఁ - గుమ్మిరి రాజ
ఆ కట్టములఁ బజ - లదిరి పోతుంట్రు
మాకేమి తెల్దన్న - మండి పడింట్రు
సిత్తుగాఁ గొట్టిరి - సింగాలముందు
మెత్తని దూడలు - మెదలుటేమందు
కూటికి నేదని - కుమిలేటి వాళ్ళ
కాటికే పంపేటి - కటికి తోడేళ్ళ
తన్నులు దినలేక - తల దాచుకొన్న
మన్నెపోళ్ళను బట్టి - మట్టు పెట్టింట్రు
కుంపినీ వాళ్ళొచ్చి - గూడేలు సూచి
గుంపుగూడితిరేని - కూలుత్తుమంట్రు. 107

చ. అనియొక చెంచు చెప్ప విమ - లాత్ముఁడు రాజపుడగ్నిపిండమై
కనలుచు మంత్ర రుద్ధ భుజ - గంబటు గాంచుచు నాలకించి వే

దనపడి నిబ్బరించి జన - తత్వమహత్వపటుత్వ సంపదం
దొసకక వే గ్రహించి తన - తోడిదలోకమనంగ మెచ్చుచున్. 108

తే. వీరు రేరేఁగు వాతపు - వేఁకి యట్లు
భరత దాస్యాంధకారానఁ - బ్రబలి రిట్లు
గ్రుడ్లగూబలు చీఁకటిఁ - గోరిన గతిఁ
పారతంత్ర్యమె వాంఛించి - బ్రదుకు చుంద్రు. 109

తే. అతుల భీకర దావాగ్ని - కడవి మెకము
లింధనమ్మైనయట్టు లీ - పృతన యింక
నస్మదంబక వహ్నికీ - లాళిఁ జిక్కి
నీఱుగాకుండ నా మ్రోల - నిలువఁ గలద. 110

వ. హిందూదేవాలయనిర్మాత యుపమండలాధిపతి ఫజులుల్లా ఖాన్ మరణ వార్త దెల్పి యాతని కడపటి దర్శన భాగ్యము గలుగఁజేసిన రుద్రయా నీ ఋణమిప్పుడీ గతినన బంధవిముక్తుండైన యతండు దీవించి గిరిచర ప్రవీణ పంచకల్యాణి లక్షణ లక్షితంబగు నిజఘోటకరాజమునీ దశ్రధువ శోభితంబగు దాని నధిరోహించి సహచరసహితుండై రాత్రి కొండలమీఁదుగఁ బాపికొండల నికటస్థిత చోడవరమున కరుగుతఱి నాశ్విక సేనా సహితుండై స్వేదధారాపూరిత శరీరుండై నుర్వ్యులుగ్రక్కుచు జాన్ వాహనారూఢుండై వచ్చుచుండ మన్నెపుదండు క్షుధావ్యథాకలిత సింహ సంహతింబలె సీతపల్లివాగు చెంతం బొంచి తఱియెఱిఁగి చెట్లకుఁ గట్టియున్న పగ్గపుటుచ్చులు జాఱవిడువ జాన్ ప్రభృతు లావాగురలంజిక్కి కొట్టుకొనుచుండ రాజు శత్రువాహినీ నాయకుని చెంత కరిగి యోరీ వీరమ్మన్యా కక్షంబూని యాక్షణమ శిక్షింపందగిన నిన్ను క్షమించి రక్షించుచున్నవాఁడ. భారతీయుల సాహసౌదార్య సత్యనిష్ఠ లిట్టివని మీ తెల్లదొరలకుం దెల్లమొనర్చి హిందూదేశమునకు స్వరాజ్యమిచ్చుట పరమ శుభదమని మెల్లగ బోధింపుమని చెప్పి యుచ్చుల విప్పించి సహచర బృంద సమేతుండై చనె. అనంతరంబ. 111

తే. కిన్క విప్లవ భటులఁ ద్రొ - క్కింపఁ దలఁచి
జయ పురపురాజు పంపిన - సమద కరుల

హౌరు సౌందర్యు లెక్కి య - ర్ధబ్దరేఖ
గ మొన గిరిఁజుట్టి వచ్చి రొ - కదెనఁ బెలుచ. 112

తే. పెద వలసనుండి బాస్టియన్ — వెంట నంటి
బాటఁ జూపంగ రంపులు - ఘాటునుండి
వచ్చె టాల్బర్టు విజయ వి - శ్వాస మెసఁగ
నర్ధ చంద్రా కృతిగ వ్యూహ — మసుర సరగ. 113

కం. ఇగ్గతిఁ జక్రవ్యూహం
బగ్గరి నాగంబు కుజము — నట్టుల చుట్టం
బగ్గెన్ రా జప్పొదలం
దిగ్గిన, గాల్వంగ నఱచెఁ - దీ్రడించు పులుల్. 114

తే. బెదరి గజములు పడఁ(ద్రొక్కె — శ్వేతసేనఁ
జెఱపకు చెడెదవను రీతి — విఱుగ నెమ్మ
లైసటాల్బర్టు ముందున — కరుగవ్యూహ
మతని తొడఁబట్టుకొని యీడ్చు - నవసరమున. 115

తే. భటుఁడొ బెబ్బులిఁ గాల్వఁ డా - ల్బర్టునదియుఁ
గొట్టుకొనుచుండె నెత్తుటఁ - బట్టుపట్టి
వానిశకటమ్మునకుఁ జేర్చి — పరుగులెత్తెఁ
బ్రతన పెన్గాలిఁ జిఱుమబ్బు — లేగినట్లు. 116

వ. ఆత్మరక్షణకెయసమర్థమై నిరంతరాధికారిభీతిదుఁడగు రాజుందదను చరవర్గమును నిర్జింపంబ్రభుత్వము స్థిరతరప్రతిజ్ఞపూని స్వీసీకివా ర్తనంపె. కింగ్ సైన్యాధ్యక్షుఁడుగ మలబారునుండి సిక్కుపటాలములఁ దెప్పించె. లెఫ్టినెంటు బిషప్, రక్షణశాఖా సభ్యుఁడు సర్ ఆర్థర్ నాఫ్, స్వైన్ చను దెంచి యటం జరించి సంగతుల నాలించి పరిస్థితులు గమనించి వైద్యాలయ తంత్రీని స్తంత్రీత్యాది సకలవిధ సౌకర్యములు తమ సైనిక శిబిరములకుఁ గలిగించిరి. మన్యపుమధ్యేమార్గములు విశాలశూన్యములై సుదూరముగనుంట జయపురము రాజొనంగిన షడ్గజరాజములపై గంచర గాడిదలపై నిజసేనల కాహారమందిచ్చిరి. విప్లవకారుల కెవ్వరెట్టి సాయ మొనరిునం గఠినశిక్షలకుం బాత్రులగుదురని ప్రకటించిరి. యుదనేరసుల

కొఱకు వాల్తేరులో నారంటుదొరన్యాయాధిపతిగఁ బ్రత్యేక ధర్మస్థాన మేర్పఱిచి ప్రజల బాధించుచుండ. 117

తే. గాఢదీక్షానిమగ్నులై - గూఢచారు
లన్నివార్తల నెప్పటి - కపుడ తెలుప
నౌడుగఱచుచు రాజు మ - హాగ్రహమున
వారి పనిపట్టు వ్యూహము - పన్నుచుండె. 118

తే. వేగరణమున జయము ల - భించెనేని
భౌతికానంద మెంతయేఁ - బడయఁ గలము.
పోర నీల్గిన స్వర్గమ్ము - పొందఁ గలమ
టంచు బోధించె రాజప్పు - డనుచరులకు. 119

వ. రణరంగ గగనమార్గమున రాజు రాజుగఁగాక రవితేజమున రాజిల్ల హూణబల ప్రతీకార చర్యాహిమజాలము పటాపంచలయ్యె. రాజు సాధించిన విజయపరంపరల నడ్డతీగెల ఘనవిజయము మకుటాయమానంబనందగె. 120

ఉ. ఆగతిఁగాంచి ధైర్యధృతు - లాఱఁగ నండరువుడ్డు చింతతో
నాఁగకయేగి తాన మన - యాంగ్లబలంబిపుడడ్డతీగెలం
జాగముమీఱ ఘోరముగ - సాగిన రేఁగిననంగరంబునం
దీఁగలవోలెరాలెనని - యెంతయు స్వీనికిఁ దెల్పె సత్యముఁగా. 121

వ. మఱియు నతండీ తిరోగమనము మాస్కోనుండి నెపోలియన్ జరిపిన తిరోగమనముతోఁ బోల్పందగినదనె. అంతరాజు. 122

ఆ.వె. సంగరమునకైన - సంభాషణమునకే
రమ్మనంగ దొరలు - రాకయుంటఁ
బైడిపుట్టి నొక్క - పగలుండి పిమ్మట
రంప చోడవరము - రాజుచేరె. 123

వ. చేరఁగందాలూకా కచేరి ప్రాంగణమున రాజాజ్ఞ విప్లవవీరులు లఘునాళికల వియద్వీధికింగాల్చ రాజు నెదిరింపవచ్చిన జనరల్ జాన్ ప్రళయ కాల పర్జన్యగర్జాపరంపరలకు భీతిల్లు పేదమేకంబు చందంబున గుండెలు వగుల నెగరోజుచు నిజవాహినీ సహితుండై కానకోన నాకపాఱె. ప్రజ

లేత ద్విజయుభానూదయ వికసితహృదయారవిందులై యానందంబు చిందించుచు రాజునకు జోహారు లర్పించి స్తుతించి జయజయధ్వానమ్ము లతో వెంట నడచిరి. కతిపయదినములకు రక్షకభటాధికారియగు నిత్యా నంద పట్నాయకుని బంధించి గామునోదర ప్రభృతులు పెదవలస భూభృచ్ఛిఖరముననున్న రాజు సన్నిధికిం దోడ్కొనిరా నతండు వానికిఁ దన మంచముపైనున్న త్రిశతశరాసనముల లఘునాళికా నికరములఁ జూపి. 124

తే. ప్రజల బాధించినటువార్త – వచ్చెనేని
లెక్కలను గట్టుకొనిర్వాలి – రేలనైన
బాణవర్షము కురిపించి – ప్రాణములను
దీసి జయభేరి మ్రోగింతుఁ – దెలియుఁ డింక. 125

తే. బాధ్యతారహితంబుగఁ – బాపమనక
నోరులేని జనంబుల – నోవఁజేయు
నట్టి యన్యాయ చర్యచే – పట్టుబెన్న
నరఁటిచెట్టొక గెలవేయు – టనుము చనుము. 126

తే. అనఁగవాఁడదరి చనఁగ – నాతఁడంత
గానుకొండకుఁ జని కొంత – కాలమునకు
జ్వరము పీడింపఁ బెదగడ్డ – పాలెమునకుఁ
జేరె వింశతి సహచరుల్ – చెంతనుండ. 127

తే. అంతఁ జలివేకి యిరుదెన – నలముకొనఁగ
నాంగ్లసేనకు మాత్రమ – యందెమంటు
లడవి దొరలకు నేసాయ – మందకున్కి
నన్నివిధముల బహుబాధ – లంది రపుడు. 128

## నిశీధిని రాజుపై దండయాత్ర

తే. బవరమునరాజు నోడించి – పట్టుకొనుట
యతని శిబిరంబులందుండ – నలవిగాదు

కానఁ బల్లెలకేతెంచఁ - గ్రమ్మియపుడ
మట్టుపెట్టుట మనకెంతొ - మంచిదనుచు. 129

తే. మెల్లమెల్లగనటఁ బల్లె - పల్లెకేగి
ప్రజలఁ గొందఱకే వేవొ - బాసలిచ్చి
యపుడ పెదగడ్డపాలెము - నందెరాజు
కలఁడనెడువార్తవిని యాత్మ - నలరి జాను. 130

తే. అద్దితఱియని ఘనశత - ఘ్న్యాళియుక్త
సైన్యసంయుక్తుఁడై ముట్టి - సరకుగొనక
భీకరంబుగ విప్లవ - వీరు లప్పు
డని యొనర్చిరి ధైర్యహే - మాద్రు లనఁగ. 131

వ. నూత్నఘోరాయుధయుతాత్యధిక శత్రుసంఘముల నెదుర్కొనుటం దద్భీకర సంగ్రామరంగంబునం బదునైదుగురు క్షతగాత్రులుకాగా నల్వురాటవిక వీరులు వీరస్వర్గ మలంకరింప నాహార రణ పరికరములు వైరుల వశమగుట రాజు మెలకువగ దప్పించుకొని పరివారముతో నిజ నివాసమునకుం జనె. ఈదయమున జరిగిన యీఘట్ట మాంగ్ల సైన్యాధిపతుల కుత్సాహజనకమగుట శత్రుల వెన్నాడి మట్టుపెట్టవలయునను దీక్ష హెచ్చె. 132

తే. కొలఁది దూరానఁ గలదొక - కొండలోయ
దాని చెంతన మన్యపు - దండు నిలుచు
ననుచుఁ దెలియంగ సంతస - మంది హూణ
వాహినీ పతు లటకేగ - వచ్చుననుచు. 133

శా. అధివ్యాధిఁ గృశించిఁయుందురని య - త్యాఖిల సైన్యాళితో
సాధింపందగువేళ యిద్దియనుచుణ్ - సంగ్రామరంగక్రియా
క్రోధోద్రిక్త శతఘ్ని సేనఁగొని య - క్కుత్కీల ఘోరాటవీ
బాధల్సెంత గణింపకేగిరి రణ - ప్రావీణ్యముం జూపఁగణ్. 134

వ. నాఁటి మహారాత్రమున స్వైవెన్, కీనీ, గూడ్వెల్ ప్రభృతులు నిజ సైన్య సమేతులై యేకోన్ముఖంబుగ రాజు శిబిరముపై దండయాత్ర సల్ప సాహసోపేతులగు సహచరులతో నమ్మహా శత్రుసమూహమును రా జెదుర్కొన నిర్విరామంబుగ నిర్వురుం గొంతసేపు కాల్పులు సాగింప

హూణధ్వజినీ నాయకులు నిర్విఘ్నముగ శతఘ్నులం ద్రేల్వం గోయవొర లెనమం డ్రసువులం బాయ నల్వురు వైరులకుం జిక్కి రాజా చిక్కం గమనించి. 135

ఉ. ఆతతవాహినీయుత మ - హాద్భుత నూతన మారణాస్త్ర సం
ఘాతవిఘాత మెంచి తటి - కాచని యయ్యని వెన్కవెన్కకుం
క్షితిలకేగి వైరుల క - భేద్య శిలాస్థలిఁ జేరె దండుతోఁ
జేఁతకు మీఱినట్టిపని - సేయఁ దరంబొకొ యెట్టివారికిన్. 136

తే. రాత్రి తగిలిన గుండ్లకు - రాజు పఱపు
నిండఁ దూట్లుండ నాతండు - గుండు దగిలి
చావఁగొంపోయియుండురు - సహచరులని
యొక పుకారును బుట్టించి - ర్వలేక. 137

వ. అమ్మఱునాఁడు ఘనవిజయోత్సాహంబున హూణపృతన దశాధికవిప్లవ వీరుల మృతకళేబరముల బీభత్స స్వరూపములఁ బ్రేక్షకులకు భయకంప ములు గదురం బ్రదర్శించుచు గ్రామవీధుల వికటాట్టహాస మొనర్చె. 138

తే. శత్రువశమయ్యె నాయుధ - సంచయంబు
గాయపడి చచ్చి రెందఱో - కదనమందు
నింత నష్టము రాజెపు - డెఱుఁగఁ డనుచు
నతని శక్తిని శంకించి - రపుడు ప్రజలు. 139

వ. అంతం గతిపయదినంబులకు రాజు సాయుధానుచరులతో బుదరడ్డ, కంటారము, రేవడ్లు, డూచెర్తై, శంఖవరాది కుప్పముల స్వేచ్ఛగ సంచరించుచు వినయముగ నాహారపదార్థముల సేకరించుకొని శత్రు తతితో నింకను ధైర్యముగఁ బోరాడఁ గలనని వైరులెవ్వరుం దనదరిఁ జేర సాహసింపకుండిరని ప్రజలకుం జెప్పి స్వామిదర్శనార్థ మన్నవర మేగ నిశ్చయించుకొనె. 140

## స్వామి దర్శనము

తే. రాజు సాహస కృత్యముల్ - రాష్ట్ర మెల్లఁ
బత్రికలు దెల్పుచుండె ని - ర్భయముతోడ

సరగఁ జక్రాన విప్లవ - జ్వాల రేఁగు
ననెడి భీతి హూణులకాత్మ - నధికమయ్యె. 141

ఉ. దైవబలంబు తగ్గెనని - తా నెదనెంచెనొ శ్రాంతికోరెనో
భావనచేసెనో పరము - బాహ్యత దేవునిమీఁదఁబెట్టి తా
దీవనలందఁగోరెనొ సు - ధీనిధి రాజుల స్వామిదర్శనం
బే వరమంచు నన్నపర - మేగె సుహృత్తతి వెంటరా వెసన్. 142

వ. సాయుధహస్తులై గంటము మల్లుదొరలు మఱి నల్వురు యోధులు తన కంగరక్షకులుగ వెంట నడువ రాజు తపాలాకార్యాలయమున కరుగం దధికృతులవనతశిరస్కులై నమస్కరింపం జిఱునవ్వునం గని వైశమ రక్షకభటాలయాధికారిం దహసిల్దారును గౌరవసూచకముగం గలసికొన వారతనిం దమగీములకుం గొంపోవం దద్గృహిణులు రజతభాజనంబులం బాదప్రక్షాళనం బొనర్చి తజ్జలముం దమ యుత్తమాంగములపై జల్లుకొని బిడ్డల శీర్షములపై జల్లి యతని శుభాశీస్సులంది పవిత్రులైరి. అంత రాజు కొండనెక్కి దేవాలయమునఁ బ్రవేశింప. 143

ఉ. ఏనె యనంతరూపముల - నిట్టు వెలుంగుదునంచు స్వామి సు
జ్ఞానము బోధసేయు ననఁ - గా వెలిఁగెన్ శతదీపముల్గుడిం
దానయి నిచ్చమచ్చరణ - తామరసంబులఁగొల్వ మోక్షల
క్ష్మీనిలయమ్ముఁ జేరునని - చెప్పెడినాఁ గరమొప్పె నొప్పుగా. 144

ఉ. సర్కసునందు నాయకుఁడు - జంతువులంబనిగొన్నయట్లు ల
య్యర్కసహస్రతేజుఁడు మ - హామహిమాన్వితుఁ డీశుఁడాత్మసం
పర్కుఁడు సర్వజీవుల స్వ - భావములం గమనించి త్రిప్పుచుం
గర్కశదూరుఁడై జగముఁ - గాచు నిరంతర దివ్యదృష్టితో. 145

వ. అట్టి స్వామిని దర్శించి ధూపదీపకదళీనారికేళ తులసీదళ కర్పూర నీరాజనాదులం బూజించి. 146

శా. ఓ త్రైలోక్యనియంత యోసతత స - త్యోత్సాహదాతా హరీ
ప్రీతిం ద్వత్పదపంకజంబుల మనః - పీఠంబునన్నిల్పి ప్ర
ఖ్యాతస్తోత్రతతిం భజింతు నిను బ్ర - హ్మానంద సంధాయకా
స్వాతంత్ర్యంబిడు భారతంబునకు దే - వా సత్యనారాయణా. 147

మ. దిగధీశవ్రజరక్షణా వరగుణా - దీనావనా పావనా
నగధారీ నిగమార్గగోచర మహా - నందైకతేజోనిధీ
సుగుణవ్రాతశుభంకరా భవహరా - సూర్యార్య శంభున్నుతా
సుగతింజూపి సుబుద్ధినిచ్చి సుజన - స్తోమంబునుం బ్రోవరా. 148

చ. నిరతము నీపదాబ్జములు - నిర్మలభక్తి భజించు భక్తులం
గరుణను గావరావ జన - కంటకులైన విదేశరాజులన్
నరగున బంపలేవ జన - సత్త్వములెల్ల నశించిపోవ ని
త్తెలుగున భారతాంబ కడు - దీనదశం గృశియించుటొప్పునే. 149

వ. అని వేడుకొని పర్వతావరోహణంబొనర్చి యొక్కనక్తంబునందునుండి నీ సమాచారము సమీపగ్రామస్థులకందం బ్రష్పఫలాదులంగొని తండోప తండములుగ వచ్చి రాజున కర్పించిరి. ఒకసారి తనతో మాటాడరమ్మని రాజు మండలాధిపతికి మిరెపకాయ టపాను వెదురుగొట్టమునందు బెట్టి పంపె. అతఁడు రా సాహసింపకుంటం గని తన యనుచరులతో వాస ప్రదేశంబున కరిగె. అన్నవర శంఖవర ప్రజలు రాజునకు ఖద్దరువస్త్ర ధనకుసుమమాలికాదుల నమర్పించి సన్మానించిరని విని మండలకర గ్రాహి యాగ్రహించి తద్గ్రామ ద్వయంబునకు సాముదాయిక ధనశిక్ష విధింపం దత్ప్రజ నిర్లక్ష్యముగం జెల్లించి రాజునెడ భక్తిగౌరవములు జూపిరి. 150

# అర్ధరాత్రి బ్రిటీషు శిబిరముపై దాడి

తే. సంస్కృతాంధ్రాంగ్లభాషలఁ - జక్క నేర్చి
కాళికాశక్తిఁ బూజించి - కాఱడవులఁ
బర్వతగుహాల ఘోర త - పస్సుచేసి
కాయసిద్ధిని బొందిన - ఘనుఁడు రాజు. 151

తే. ఇంత విజ్ఞోడు పోరికి - నిట్లు దిగుట
కెంత గుండెగలాఁడని - వింతగఁ బ్రజ
రక్తిఁ దచ్ఛక్తిఁ బొగడఁగ - రాజు కీర్తి
నేల నాలుగుఁ జెఱఁగుల - నిండె నపుడు. 152

తే. ఇతరదేశాలతోఁ దల - యెత్తి తిరుగ
భరతదాస్యాంధకారము - పాయుటెపుడొ
యనుచు జపియించుఁ బగలెల్ల - నదియ చెలుల
కలరుచుందెల్పు నదిరేలఁ - గలవరించు. 153

చ. కడువున కన్నము న్సరిగఁ - గంటికి నిద్దుర లేకపోయినం
దడఁబడ కాజిఁ దేజమున - ధైర్యముతో వరవైరి వర్గముం
గడగడలాడఁజేసి సర - గం బరలోకముఁ జేర్చునంచు న
య్యెడ సకలాంధ్రదేశము ను - తింపఁగ రాజలరారె నేపునన్.154

వ. అనంతర మొక్కనాఁడు గంటము నిజదళముతోఁ గొయ్యూరనుండం దత్ప్రహచరు లపరాధపరిశోధక రక్షకభటాధికారిని బాస్టియనునకు బదులుగ వచ్చిన తహసిలుదారు కందర్పమూర్తిం బంధించి గంటమున కప్పగింప నతండు వారితో సంభాషించి మూర్తిసుజనుఁడని వినియుంట నాతనిం గొట్టినందులకుం దనవారి క్షమింపుఁడని కోరి రాజాజ్ఞ వారల విడిచె. పిదప రాజు మలుకనగరికరిగి రిజర్వుదళముతోఁ బోరయత్నింప నది యసంభవమగుట నిరుత్సాహముతో వెడలుచుంటి. ద్రుతగతిం బాంచాలమునుండి నాకు సహకరింప వీరవరులు రాఁగలరని తదధికృతు లకుం దెల్పి పెదవలస శిబిరమునకు వెడలిపోయె. ఇంతలో భారత జాతీయ మహాసభ కాకినాడలో జరుగుచున్నవార్త విని పాంచాలైచ్ఛిక భటవేషంబునం జని శక్తికొలంది తత్సమజ్యకు సేవలొనర్చి ప్రభుత్వ ప్రణిధుల కగోచరంబుగం దిరిగివచ్చి విషయములు విప్లవ వీరులకు వివరించె. తన యంగరక్షకులం బ్రధానపురుషుఁడు, మహాసాహసియగు మల్లు దురదృష్టవశమున దురభ్యాసపరుఁడని తెలిసికొని పలుపర్యాయములు నీతిబోధించిన వినమి నతని కిచ్చిన తుపాకిం దీసికొని నీదారినీవుపొమ్మని పంపె. కొలఁదిదినంబుల కొక్కనడురేయి మల్లుదొర నడిమిపాలెమునం దన ప్రియురాలియింటం గలఁడని మువ్వురు మునసబులు కీరస్సునకుం దెలుప నతండు ప్రత్యేక యోధులం బంపి వానిం బంధించి యండమాను దీవులకంపె రాజు రహస్యము లెఱిఁగింపమికిం గిన్కగదుర నానా హింసలపాల్సేసి రత్తిగోవిందుల శత్రువులు వధించిరి. 155

తే. కార్యసాధకుఁడుగఁ గీర్తి - గాంచుచున్న
రాజు తద్వార్తవిని క్రుధా - భ్రాజి యగుచు

ననమన మరానఁ బ్రజలకై – యసువు లిడిన
యాటవిక బృందమునకు జో – హారు లనియె. 156

ఆ.వె. పాలు పిండు కొంట – పరమ ధర్మముగాని
పొదుగు కోసికొంట – పోల దంటె
వినక నిజము కనక – వింతగా వర్తించి
యింతవఱకుఁ దెచ్చి – రేల విఱుగు. 157

తే. గూడెముల దాపునందుంట – గుట్టెఱింగి
సులువుగ ఫిరంగులంగొని – చొచ్చి రిటకు
ననుచుఁ దనవారిఁ దోకొని – యరిగె రాజు
శత్రుదుర్భేద్యవనఘోర – గోత్రమునకు. 158

వ. అనేక యోజన విస్తీర్ణ భీకర వ్యాళమృగజాలాకీర్ణంబగునయ్యరణ్య మెట్టిదన: భౌమిక వాతావరణ ప్రేరణజనిత వర్షాధిక్యంబున నందం దేర్పడిన గభీరజలాశయ తీరంబుల మీలకొఱకు జపంబొనర్చుబకపదంబు నొక్కకర్కాటకంబునొక్క గ్రక్కునం బ్రక్కకుందొలంగి ముక్కునం బొడిచి ఱెక్కలల్లార్ప నదరి గట్టునెట్టి యాకొని క్రిమికీటకాన్వేషణార్థం బిట్టట్టు గంతులిడుచున్న మండూకంబులును, భేకంబులం జాడంగని పెట్టి మట్టుపెట్టి పొట్టంబెట్టుకొనం బర్విడు మూషికంబులును, మూషికంబులం గని ముదముప్పొంగ ఱయ్యేన నేటవాలుగ వ్రాలు గృధ్రంబులును, గృధ్రపత్రపటపటాత్కారంబునకుం బెదరి చెదరిన కుక్కుటాద్యండజం బులంగాంచి మించిన వేడ్కంబయింబడు జంగుపిల్లులు, నయ్యడవిపిల్లుల కూఁతలకు నిజనిద్రాభంగంబుకా శాఖాశయ్యనుండిలేచి నల్వలంకులం బరి కించి కోపోద్రిక్తత నతిభీకరంబుగ నఱచుచు క్షుధార్తిం దట్టువడి పుట్టకూటికి నఖభిదురంబులం గొండకొమ్ములంబోలు కోనలలరు వల్మీకంబులఁ దద్దయు గుద్దలించి తద్బిలగతపిపీలకాదులం జెదపుర్వులం జుఱ్ఱుకొను భల్లూకంబు లును, భల్లుక భయంకరశబ్దంబులకులికి తత్తద్రంధ్రనిర్గతపవనాంధో జాలంబుల నోటంగఱచుకొని పాదనఖంబుల నిఱికించుకొని ఱెవ్వన విను వీధికిం జనుచున్న శిఖిగరుడులును, దన్మయూరతార్క్ష్యపక్షనిస్వనమ్ముల నాలించి గూళ్ళనున్నమితశీర్షంబులై బిట్టుకూయుఖగశాబకంబులం జక్క న్మెక్కంజెట్టెక్కుచున్న మార్జాలంబులును, దదఖుఖుక్కులంగాంచి తమ

యున్నతస్థానమ్ముల నాక్రమింపవచ్చెనని క్రోధదృక్కోణశోణంబులం జంకించుచు వటవిటపిజటార్ఘాటంబులంబట్టి యూయలలూగుచుం గిచకిచ లాడుచు నాగండుపిల్లులమీఁదికి దుముకుచున్న శాఖామృగంబులు, నవ్వా నరసందోహంబుల సందడికిందోడు ఘీంకారనినాదయుక్త కరివరకరా కర్షణశక్తి న్వీఁగుశాఖోపశాఖల పెళపెళార్భటులకుం బెల్లు దద్దరిల్లి క్రేళ్ళుదాఁటుచున్న లేళ్ళవెన్నాడి పంజాగొట్టి మార్మెడలువడి వ్రేలాడదృఢ తర దంష్ట్రికలంగమిచి పాఱుచున్న తరక్షువులు, నమ్మృగాదనమ్ములం గనుంగొని పెల్లుభీతిల్లి చెల్లాచెదరైన గిరికురరుల బిట్టుకొట్టి యట్టిట్టు కొట్టు కొనుచుండ గట్టిగఁబట్టుకొని యీడ్చుకొనిపోవు వృకంబులు, నయ్యాహా మృగంబుల నవలోకించి లంఘించి వీపెక్కి మూపుకండలంగొఱికి క్రింది సహచరబృందమునకుంబడవేయు తేఁచులబాధపడఁజాలక వేల్లల్లతాసాంద్ర తరనికుంజపుంజములం దూఱు నడవికుక్కల యాక్రందనమున కడలి మందలుమందలుగఁ బేరెములువారు కుందేళ్లకుచ్చులువన్ని నిరీక్షించు వాగురికులును, వాగురికుల నానావిధ వికారధ్వనులు వినుచుం దిరుగుచు నొండొంటిందాఁక నసితపాషాణకఠినవిషాణకోటి సముట్టంకిత సంఘర్షణ సంభవ కఠీల్పెఠీలను శబ్దచ్ఛటలు భూధరోరుదరీ ద్వారంబులం బ్రతిధ్వనింప నన్యోన్య జయకాంక్షం గసిమెసకమెసంగం బోరుచున్న కారెనుబోతుల తాకునకు జీర్ణభూరుహకుహరవినిర్గత కృకలాలసోలూకంబులం దన్ను చున్న కాకిమూకలును, గాకానీకంబులకుం గొంకక సరోవర వారితీరాల్ప జలంబులం బిండుగట్టి పన్నుండి మోరలుపైకెత్తి కుంభప్లవంబునాఁ దన రిన భూదారవారంబునం దొక్కదాని మకరంబు చిక్కించుకొని లాగ నదిగీపెట్టం దక్కినవి తప్పించుకొని ఘుర్ఘురధ్వనులతోఁ బరుగిడు కిటి పటలమ్ములంగాంచి వ్రేటలవింబాటించి పటుతరశరాహతి నేలగూల్చు వేఁట కాండ్రును, నమ్మృగయుల నవ్వడికి జంకి గగనమున కెగురు కపోతముల వేఁటలాడు డేగలు, నాశ్యేనములఁగని యెదయదురం బొదలుసొచ్చు కౌజు పోజుల వీక్షించుచుఁ బచ్చలు పఱచినట్లెచ్చు ముచ్చటగొల్పు పచ్చిక బీళ్ళ గముల్గట్టి మేనువాల్చి కురంగ్యుల్లిహ్యమానోద్గ్రీవమ్ములగు కురంగ మ్ములును, సారంగంబులకొఱకు తురంగలించి యవియందమిం గోకర్ణ మృగంబులంగొట్టి నల్లంబీల్చి వక్షంబు చీల్చి గుండె భక్షించి తత్కాయం బాకులలములంగప్పి వ్యాఘ్రంబులుచన నది క్రుళ్ళి కంపెగయ మశక

వనమక్షికంబులు ఝంఝమ్మని ముమ్మరమ్ముగఁ గ్రమ్మం జుట్టలువెట్టి మూగురాబంపులును, గంకంబులరాకం గమనించి దొడ్డికాపరులు వాకట్టు కట్టి నాహారపానీయంబులు పెట్టంజాలక క్షుత్పిపాసలతీంద్రం గాంద్రు కాంద్రని పెడబొబ్బలిడెడు చిఱుతలమ్రోఁతలం జెవులు చిల్లులువడు నమ్మహారణ్య మధ్యంబున కుంజౌఱ మనోబలంబుసాలమిఁ దన్నికటంబున గుడారంబులు నిర్మించుకొనియుండ. 159

చ. పరిపరి పోరిపోరి తల - ప్రాణము తోఁకకువచ్చెనంచుఁ గొం
దఱు దిగజాఱిపోయి రది - తక్కినవారలుగాంచి యాత్మలోఁ
గొఱకొఱలాడి రిట్లు తన - కుం దరితోఁపనిరీతి యేర్పడం
గురుతరబాధ్యతం దలఁచి - కొంకక గమ్యముఁజేర నెంచుచున్. 160

తే. ఆయుధంబులు వైరుల - హస్తగతము
లగుట తిండిని రానీక - యడ్డుపడుట
వేగులం బట్టి చెఱసాలఁ - బెట్టుట కని
కనలి తనవారితో నిట్లు - లనియె రాజు. 161

ఉ. దెబ్బకు దెబ్బ తీర్చికొని - ధీరత వైరుల యగ్నియంత్రముల్
గొబ్బున లాగికొన్నఁ గలు - గుంబల మెక్కుడు గాన నేఁటి రే
బెబ్బులు లట్లు దూఁకి యతి - భీకరయుద్ధమొనర్ప రండు మీ
కబ్బు జయంబుతో యశ మ - నంతముదాబ్ధి మునింగి తేలఁగన్. 162

మ. ప్రతిపక్షీయులు పన్ను వ్యూహగతి సం - భావించి తద్భేదన
వ్రతముంబూనకయున్నఁ దెన్నుగలదే - భాసిల్ల దేశాంబ కీ
బ్రతుకెవ్వానికిశాశ్వతం బిచట దు - ర్వ్యాపారపారీణులన్
క్షితిపైడుల్పకయున్న భావిజనతా - శ్రేయంబు శోభిల్లునే. 163

చ. కలనొగిఁగల్ల సాయముగఁ - గామక రాఁగలమంచుఁ బల్కు న
ప్పలుకులు విశ్వసించి రణ - భారము గొంతవహింతురంచు నేఁ
జెలులకుఁ గమ్మలంపితిని - జెచ్చెర వచ్చెదరంచు వార్చితిం
బొలకువ గానరాదెదియుఁ - బోరన భీతిలువారు వత్తురే. 164

ఉ. క్రొవ్వునఁ జివ్వకుంగదియ - ఘోరశరాహతి వైరివర్గముల్
కెవ్వునఁ గేకవేసి జమ - గీమున కేగుట నిక్క మందఱుం

దవ్వుననుండి చూతురిఁకఁ - దాళ రమేశ మహేశు లడ్డమై
చివ్వకుఁ గాలుఁద్రవ్వకని - చెప్పినఁ జేసెద ఘోరయుద్ధమున్. 165

మ. గిరిజాజానికటాక్షవీక్షణతతిం - గీడ్పాటులేకుండ సం
గరముల్పెక్కులొనర్చి నేఁటి కిటు చి - క్కంగల్గె నొక్కింత యీ
గిరిదుర్గాటవిఁ జొచ్చి భూరిభుజశ - క్తిన్నిల్చి పోరాడ మ
చ్చరవర్షచ్ఛట వైరివర్గదహన - జ్వాలాళిఁ జల్లార్పెదన్. 166

వ. ఇది క్లేశసాధ్యమని తుందపరిహృజుఁ డిందుఁబనికిరాడని ముంద
చెప్పితి. నైస్పృహ్యామసహ్యాము. ఆశయసాధన కకుంఠితాత్మ ప్రత్యయ
మున నడుగిడి జగామగలమని జగంబునకుఁ జాటవలయు. పట్టపగటి
వేళనైన నిట్టి నట్టడవిం జొఱ నెట్టిదిట్టకైన నడలు వుట్టుననన నింక మహా
రాత్రమ్ము మాట జెప్పనేల. 167

కం. దొరయంద్రు తెల్లవానిని
దొరయందురు మిమ్ముఁగూడ - దొరదొర ధర్మ
స్థిరతకుఁ బోరుట సహజము
చరితార్థులు గండు శౌర్య - సాహస చర్యన్. 168

చ. భిదుర సమాన బాణహతి - భీకరవైరి చమూ సమూహముం
గదన విహారరంగమునఁ - గాకులు గ్రద్దలు మెక్కఁ జెండ మీ
రదనిది లెండురండు మన - కాయుధముల్గొఱతయ్యె వానినే
విధముననే గడించి తని - విన్ రణశూరుల మాటలగ్గగున్. 169

ఉ. కాటుక కొండలట్లపుడు - కన్పడకుండె నగంబు లంధము
గ్రాటవి విశ్వరూపమనఁ - గ్రమ్మ మహాహిమణీద్యుతిచ్ఛటన్
వేఁటకు వెల్వడెం గరులు - విశ్రమభూమి సుఖానఁబండె ను
చ్చాటనలేచు శక్తివలెఁ జయ్యన బెబ్బులి లేచి కాంద్రవెన్. 170

తే. కను పొడుచుకొన్న నంతయుఁ - గానరాని
యీ నిశీథి మృగాలు య - థేచ్ఛఁ దిరుగఁ
జెట్టు పుట్టలు మెట్టలు - గట్టులనక
సైకతో జాగరూకతఁ - జనుట లెస్స. 171

వ. అనంత వైభవోపేత భవ్యవైజయంతమువంటి భారతము మిక్కిలి బక్కచిక్కినది. కత్తులఝళిపించుగాలముగాని స్వర్ణవీణలాలపించు సమయముగాదు. అసదృశసాహసోపేతులరై దిక్కులుగ్రక్కదల నార్చుచు కొండపేటున వ్రేటునకువేయిగా నఱికి ప్రోగులుపెట్టుఁడు. ఏండ్లుపూండ్లుగా సాగుచున్న యీ స్వరాజ్యసమరము దీన నటొ యిటొ తేలవలె. మామకీన పతాకిని యసృగ్ధారలు చిమ్ముఁగాని విఱిగిపాఱదని నాయచంచల విశ్వాసము. అది వమ్ముగానీకుఁడు. యోద్ధృమండలి మీరగ్రిమస్థానమలంకరింపఁ గలరు. యంత్రప్రవర్తకులు సైనికశకటముల నిటకుఁదే యత్నించు చుండిరని వింటి. ఐనను వైరులు కఠోరకాంతారమార్గగమన శ్రమకోర్వం జాలకట నిల్చియుంద్రు గానం బ్రతీకారచర్యకిదియ యదను. మాతృభూమిపై ననిర్వచనీయానురాగము సూపి మీ రణకౌశలత శతగుణంబులుగం బ్రదర్శించి శాశ్వతజయస్తంభము ప్రతిష్ఠింపఁదగిన తరుణమిది. సమయాతిక్రమణ మపయశముం గూర్చు. హృదయధైర్యమే నాకు లీలా కుఠారము. సూర్యాచంద్రమసులు త్రోవతప్పినను మడమఁద్రిప్ప. ఎవ్వఁడే నాకల్పమీనేలనేలునా? నీటిబుడగ జీవితము, ఓటి పడవ యౌవనము, క్షాత్రధర్మమే క్రుంగిన నింక దేశమునకు రక్షణయేది? సజ్జన తతిఁ బతితజాతి నుద్ధరింపఁగల యతులవ్రతమేది? అసమర్థతాపంకమగ్న మానసుల కభ్యుదయముగలుగుట యసంభవము. వజ్రపంజరమువంటి వీరహృదయము గాలిబుడగవోలెం దేలిపోవునా? భవిష్యల్లోకము మీ దేశభక్తిని రోళ్ళరోకళ్ళఁబాడు. అరివరసమదవారణకుంభవిదారణ కేసరికిశోరసన్నిభులరై రణచణగుణగణ్యులరై పోరలెండు. రండన. 172

చ. అతులవచోనులాపముల – నాటవికాగ్రణు లద్రిధైర్యులై
ధృతివిజయాభిలాషులయి – దేవునియాజ్ఞగ రాజునాజ్ఞ సం
స్తుతిఁదలఁదాల్చి యాయుధత – తుల్ధరియించి విశేషరోష వ
ర్ధితబలయుక్తులై బహుళ – తేజమెలర్ప గమించి యవ్వనిఙా. 173

తే. కాలరాత్రి నతాత్తుగఁ – గదనమునకు
వచ్చి శరతతిఁ జిమ్మంగ – వైరి వరుల
నెదురుకొన గుండెసాలమిఁ – జెదరి యాంగ్ల
సేన పర్వెత్తెఁ జెచ్చెరఁ – జెమటగ్రమ్మ. 174

తే. రామరాడ్బృందనిశిత శ - రప్రయోగ
ఝంఝ హోరున కడలెను - జంతుచయము
నాఁటెరే బీతు గుండెల - నాటుకొనఁగఁ
బక్షిగణమేగె వెస నంత - రిక్షమునకు. 175

తే. పాటి యిదియొక జయమన్న - భంగి వారి
సైనికులు నష్టపడకుంట - శత్రువులకు
యుద్ధపరికరములు చిక్క - కుస్కి చాల
మేలనుచు సంతసించి ర - మ్మేటిదొరలు. 176

ఉ. ఖండనభూమి నిల్వఁగల - పౌరుష మొక్కనికేనిలేక యా
ఖండలుఁగన్న వృత్రుబల - గంబటు పాఱిరటంచు నవ్వుచుం
జండతరాశుగాహతికిఁ - జిన్ని గుడారములెల్లఁ దూంట్లుగా
నుండఁ దుపాకియొక్కటియు - నుండమికిం దలయూఁపె రాజటఁ.

వ. అనంతర సంగ్రామంబులఁ బడాలు మూగఁడు వీరస్వర్గ మలంకరిం
చిరి. కొమ్మల్లున్మ ప్రోడ్పడుకుజంబు చందంబునందనరియు ధైర్య
మేరువుం బ్రద్దలు కానీక యాకొన్నసింగంబు తెలుంగున రాజుండె. అతని
జాడందెల్పలేదని ప్రభుత్వపుం బటాలములు పల్లెలం గాల్పందొడంగ. 178

ఆ.వె. ఇల్లు వాకి లనక - యిల్లాలు పిల్లలు
గొడ్డు గోదమనక - గూడె మనక
పల్లె పల్లె వీడి - పరుగులెత్తిరి జనుల్
యూళ్లు కాలుచుండ - నోళ్ళు తెఱచి. 179

ఆ.వె. అది దవాగ్ని యంచు - నడవి మెకంబులు
తోన మోరలెత్తి - తోఁక లెత్తి
ప్రాణభీతిచేతఁ - బరుగులెత్తుచునుండ
నద్దు నాల్గుదెసల - హద్దుమీఱె. 180

కం. పొంగుచు నింగిని నాకెడు
నంగార జ్వాల జాల - మదిగనఁ బడఁ దా
నుం గడు భీతిం డాగెడు
భంగి పతంగుండు ధూమ - పంక్తి నడంగెన్. 181

తే. భస్మసాత్కృతమైన న - ప్పల్లెలఁ గని
యది యసద్ధేతుకమ్మని - యాత్మ దెలుపఁ
బ్రజలసొమ్మిన్ని విధముల - బాడుచేసి
యేఁగతికిఁ బోదురో దొర - లెఱుఁగనౌర! 182

కం. ఈ వనమే జీవనముగఁ
బావన మానసులు వీరు - బ్రదుకుచునుండన్
గావర మొగదట్టఁగఁ బజఁ
గావరు భూవరుల బంట్లు - కాలము దఱియన్. 183

ఉ. నీతినిఁగూలఁదన్ని యవి - నీతికి నూఁతనొసంగి దుష్టపుం
జేఁతకు జీవగఱ్ఱయయి - స్త్రీప్రసుషాదులఁ జావఁగొట్టి ని
ర్భీతిఁ జరించు దుష్టులిఁక - విజ్ఞుల సూక్తుల నిచ్చగింతురే
ఆతనొనర్చెధాత యవు - రాహ్పాదివారిది యేమి సేయుదున్. 184

వ. స్థలజలాంతరాళ చరాను కూలవాహన సహిత నవీనమారణాస్త్ర యుతా సంఖ్యాకాక్షౌహిణీ సేనాసమన్వితా ఖండ భూమండల సముపార్జిత సార్వభౌమాధికారిక బలముతోఁ ద్రిశతకాండీరాటవికదళాధిష్ఠాతనై సనాతనాయుధసముదయమున వర్షత్రయ మని యొనర్చితి. దేశాభ్యుదయమునకై యస్మత్ప్రాణదాన మొనర్ప నిప్పటికిని సిద్ధముగ నున్నవాఁడ. కాని ప్రభుత ననుజయింపఁజాలక యమానుష కృత్యముల నోరు లేని యమాయిక గ్రామీణుల నిష్కారణమ చిత్రవధ సేయుట విని కూడు కూర్కులొల్లక కృశించుచుంటి. 185

తే. ఉన్నయిడుమలు దీర్చుట - కుద్యమించి
పొంచి యని కేను బూనుట - ముల్లు పుచ్చి
కొఱ్ఱుగ్రుచ్చిన చందమై - కుందఁ జేసె
నా? మఱెట్టుమాఱుఁ బ్రజల - నరకమింక. 186

తే. ధర్మరాజ సమాఖ్య సా - ర్థకముగాఁగ
నాన నిల్పు బంట్లఁ గృతాంతుఁ - డచట నిచట
నాంగ్లదళపతి యను నూత్న - యమునిభటులు
హద్దులేక చరింత్రు స్త్రీ - లలమటింప. 187

ఉ. ఏనిఁకఁ జూడఁజాలఁ బర - మేశ్వర యీప్రజ బాధ లేక్రియం
దీనులఁ బ్రోతువో తెలియ - దీనికి హేతువు నేనయైనచో
మానకశిక్ష సేయు మను - మానములేక భరింతు నక్కటా!
తానొక టాత్మలోఁ దలఁప - దైవము వేఱ తలంచినట్లైగా. 188

మ. అల ప్రహ్లాదుఁడు బుద్ధుఁ డేసు బుధులా - ద్యర్షుల్ ప్రబోధించి రు
జ్జ్వలధీశక్తి నహింస యుత్తమ గతిన్ - సాధించు మార్గంబుగా
మెలఁగున్ గాంధి సతంబు తత్పథమునన్ - మేలెంచికాఁబోలు ని
బ్బల మాసూత్రములంగ్రహించి చరియిం - పం జూచునే యెన్నఁడే.

తే. హింస ప్రేచును మఱియొక - హింసఁ ద్రోవ
దని మహాత్ముఁడు వాకొన్న - యతుల సూక్తి
దివ్యమహిమాన్వితంబని - తెల్పు నాత్మ
యేమిసేయుదు సర్వేశ - యేదిదారి. 190

## రామరాజు నిర్యాణము

వ. అని దీర్ఘాలోచనామగ్నమానసుండై. 191

ఉ. గురుహితబంధుకోటిఁ గని - కుందినక్రీడివిధానఁ ద్వత్సుతుం
డరిగెను స్వర్గసీమ కన - నస్త్రము వట్టని ద్రోణుకైవడిం
బరమదయాళువై ప్రజల - పాట్లు వినంగనఁ జాల కెట్టులేఁ
దరలక తాన యాత్మబలి - దాన మొగర్పఁగ నిశ్చితాత్ముఁడై. 192

వ. పగఱకేఁ ఱిక్కకిక్కడి పల్లెప్రజల యిక్కట్టులు పెక్కు నిక్కముగఁ దీఱవు. 193

తే. తుంగమడువునఁ దిరుగు మా - తంగమట్లు
నలగఁద్రొక్కెఁబెక్కూళ్ల సైన్యము బలానఁ
దొంటివెతఁ బాప ననిసేయఁ - దుదకుఁ బెద్ద
పుండుపైఁ బుల్లసోకిన - పోల్కి యగున. 194

వ. అని యనుకొని తన పరోక్షమునఁ దార మోపుకాండ్రై యప్రమాదార్థంబుగా నిర్వర్తింపవలసిన విధుల ముఖ్యానుచరులకుం దెలిపి రాత్రి

కడపి యధర్మ సమరక్రియానిర్వహణమున సుయోధనపతన కథా శ్రవణ సంజనిత క్రోధోద్రిక్తమానసుండై రాజరాజశ్రీః పేయకృత ప్రతిజ్ఞాపాలన ఖారధూర్వహుండై నిశీధినిధృష్టద్యుమ్నాది పాంచాలోప పాండవ వధావిధాన స్వైర విహారమొనర్చి ప్రాతఃకాలమున గంగా తరంగిణీ స్నానపవిత్రీ కృతగాత్రుండైన యశ్వత్థామ తెఱంగున నరుణో దయమున సెలయేటినీటఁ గృతావగాహుండై తత్తీరమున నిర్వర్తిత సాంధ్యకృత్యుండై యున్నతఱిఁ దద్వృత్తాంత మంతకు మున్ప వేగుల వలననో జానపదులవలననో యెఱింగిన యాళ్వారునాయఁడు నిజధ్వజినీ సహితుండై చని యవక్రపరాక్రమశాలియగు రామరాజును జక్రవ్యూహ మ్మున బంధించి యంతేంద్రియ శక్తులఁ దప్పించుకొని పోవునేమో యను భీతిమై నాపాదమస్తకము పెన్మోకులతో మంచమున కంటఁ గట్టి గూఢాలు మ్రోలకుం గొంపోవ నతఁడదిగని కనులెఱ్ఱచేసి యిమ్మహా వీర వర్యు నిట్టు కట్టి తెచ్చుట యెట్టివారికేఁ దగదని నాయనిపై బిట్టుకినిసి బంధవిముక్తుం జేయించి కరచాలనమునకుం జేచాప నారాచబిడ్డ నాతని మొగం బెగాదిగఁ జూచి. 195

తే. మా మహోన్నతదశనెల్ల - మట్టిపాలు
చేసినారలు మీతోడఁ - జేయికల్పఁ
బాపపంకిల మౌను నా - పాణి తలము
కానఁ గరచాలనము సేయ - లేను నేను. 196

వ. అని నిరాకరింప నాతండించుక సహనమును బ్రదర్శించి హసన్ము ఖుండై నీవాంగ్లపతాకినిం జేర సమ్మతింతువేని సర్వసైన్యాధ్యక్షపదవి నందఁగలవు రాఁగలవా ? యన నది యీ జీవితమున నసంభవము. మీ పరిపాలనమున సస్మద్దేశమాతకు సర్వవిధముల ననూహ్యాదుస్స్వాస్థితి గలిగినదన శ్వేతవృతనాధిపతి క్రుధామధిత మనస్కుండై సంవర్తసమయ సాగర సన్నిభుండై యిప్పుడింతము పడినపాట్లకు నీవకారణమగుట దండనార్హుండ వింక నిన్ను విడువరాదని మలబారు భటులచే నొకమహా వృక్షస్కంధమునకంటఁ గట్టించి నీ ముఖ్య బంధుమిత్రాదులకెద్దియేఁ దెల్పుదువాయని పృచ్ఛింప నేదియులేదని సత్యమావిష్కరింప న్యాయ సభాంతరమున నన్నేల నిల్పవు? నామనోవేదన లోకమునకుం దెల్పు కొన నేల యవకాశమీయవు? నన్నేల వధింతువని. 197

ఉ. ఏనిఁకఁ జూడఁజాలఁ బర - మేశ్వర యీప్రజ బాధ లేక్రియం
దీనులఁ బ్రోతువో తెలియ - దీనికి హేతువు నేనయైనచో
మానకశిక్షసేయు మను - మానములేక భరింతు నక్కటా!
తానొక టాత్మలోఁ దలఁప - దైవము వేఱ తలంచినట్లగా. 188

మ. అల ప్రహ్లాదుఁడు బుద్ధుఁ డేసు బుధులా - ద్యర్షుల్ ప్రబోధించి రు
జ్జ్వలధీశక్తి నహింస యుత్తమ గతిన్ - సాధించు మార్గంబుగా
మెలఁగున్ గాంధి సతంబు తత్ప్రథమునన్ - మేలెంచికాఁబోలు ని
బ్బల మాసూత్రములంగ్రహించి చరియిం - పం జూచునే యెన్నఁడే.

తే. హింస ప్రేచును మఱియొక - హింసఁ ద్రోవ
దని మహాత్ముఁడు వాకొన్న - యతుల సూక్తి
దివ్యమహిమాన్వితంబని - తెల్పు నాత్మ
యేమిసేయుదు సర్వేశ - యేదిదారి. 190

## రామరాజు నిర్యాణము

వ. అని దీర్ఘాలోచనామగ్నమానసుండై. 191

ఉ. గురుహితబంధుకోటిఁ గని - కుందినక్రీడివిధానఁ ద్వత్సుతుం
డరిగెను స్వర్గసీమ కన - నస్త్రము వట్టని ద్రోణుకైవడిం
బరమదయాళువై ప్రజల - పాట్లు వినంగనఁ జాల కెట్టులేఁ
దరలక తాన యాత్మబలి - దాన మొగర్పఁగ నిశ్చితాత్ముఁడై. 192

వ. పగఱకేఁ జిక్కకిక్కఁడి పల్లెప్రజల యిక్కట్టులు పెక్కు నిక్కముగఁ దీఱవు. 193

తే. తుంగమడువునఁ దిరుగు మా - తంగమట్లు
నలగఁద్రొక్కెఁబెకూళ్ల సైన్యము బలానఁ
దొంటివెతఁ బాప ననిసేయఁ - దుదకుఁ బెద్ద
పుండుపైఁ బుల్లసోకిన - పోల్కి యగున. 194

వ. అని యనుకొని తన పరోక్షమునఁ దార మోపుకాండ్రై యప్రమా
దార్థంబుగా నిర్వర్తింపవలసిన విధుల ముఖ్యానుచరులకుం దెలిపి రాత్రి

కడపి యధర్మ సమరక్రియానిర్వహణమున సుయోధనపతన కథా శ్రవణ సంజనిత క్రోధోద్రిక్తమానసుండై రాజరాజశ్శిరః పేయకృత ప్రతిజ్ఞాపాలన ఖారధూర్వహుండై నిశీధినిధృష్టద్యుమ్నాది పాంచాలోప పాండవ వధావిధాన స్వైర విహారమొనర్చి ప్రాతఃకాలమున గంగా తరంగిణీ స్నానపవిత్రీ కృతగాత్రుండైన యశ్వత్థామ తెఱంగున నరుణో దయమున సెలయేటినీటఁ గృతావగాహుండై తత్తీరమున నిర్వర్తిత సాంధ్యకృత్యుండై యున్నతఱిఁ దద్వృత్తాంత మంతకు మునుప వేగుల వలననో జానపదులవలననో యెఱింగిన యాళ్వారునాయఁడు నిజధ్వజినీ సహితుండై చని యవక్రపరాక్రమశాలియగు రామరాజును జక్రవ్యూహ మ్మున బంధించి యంతీంద్రియ శక్తులఁ దప్పించుకొని పోవునేమో యను భీతిమై నాపాదమస్తకము పెన్మోకులతో మంచమున కంటఁ గట్టి గూఢాలు మ్రోలకుం గొంపోవ నతఁడదిగని కనులెఱ్ఱచేసి యిమ్మహా వీర వర్యు నిట్టు కట్టి తెచ్చుట యెట్టివారికేఁ దగదని నాయనిపై బిట్టుకినిసి బంధవిముక్తుం జేయించి కరచాలనమునకుం జేచాప నారాచవిద్ధ నాతని మొగం బెగాదిగఁ జూచి. 195

తే. మా మహోన్నతదశనెల్ల - మట్టిపాలు
చేసినారలు మీతోడఁ - జేయికల్పఁ
బాపపంకిల మౌను నా - పాణి తలము
కానఁ గరచాలనము సేయ - లేను నేను. 196

వ. అని నిరాకరింప నాతండించుక సహనమును బ్రదర్శించి హసన్ము ఖుండై నీవాంగ్లపతాకినిం జేర సమ్మతింతువేని సర్వసైన్యాధ్యక్షపదవి నందఁగలవు రాఁగలవా? యన నది యీ జీవితమున నసంభవము. మీ పరిపాలనమున నస్మద్దేశమాతకు సర్వవిధముల ననూహ్యాదున్స్వహస్థితి గలిగినదన శ్వేతవృతనాధిపతి క్రుధామథిత మనస్కుండై సంవర్తసమయ సాగర సన్నిభుండై యిప్పాంతము పడిసపాట్లకు నీవకారణమగుట దండనార్హుండ వింక నిన్ను విడువరాదని మలబారు భటులచే నొకమహా వృక్షస్కంధమునకంటఁ గట్టించి నీ ముఖ్య బంధుమిత్రాదులకెద్దియేఁ దెల్పుదువాయని పృచ్ఛింప నేదియులేదని సత్యమావిష్కరింప న్యాయ సభాంతరమున నన్నేల నిల్పవు? నామనోవేదన లోకమునకుం దెల్పు కొన నేల యవకాశమీయవు? నన్నేల వధింతువని, 197

చ. పటుపటు పండ్లుగీటి-నిజ - బాహుబలం బిట రిత్తయౌట కు
త్కటి చటులోగ్రమూర్తియయి - కన్నుల నిప్పులురాల వైరులం
గటువుగఁగాంచి కార్యగతిఁ - గానక బోనునఁ బిడ్డ సింగమై
నిటల తటానఁ జెమ్మటలు - నిండఁగ నంతిమవాక్కు లిట్లనున్. 198

ఉ. పౌరుషమున్న నాకొక తు - పాకి నొసంగి మదీయ బంధమ
వ్వారిగఁ ద్రెంచి యొక్కొకఁడు - ఖండన భూమిని నిల్చి పోరుఁడీ
యేరిబలాబలంబు లవు - డెల్లఱకొక్కక్షణానఁ దెల్లమౌ
వీరులు మెచ్చుకొంద్రు పృధి - వీస్థలిఁ బ్రాకు యశఃప్రకాశముల్.

ఉ. ఇందఱుగూడి యొక్కని య - థేచ్ఛగఁ జెట్టున కంటఁగట్టి యా
నందముతోడఁ గాల్చిన జ - నంబులు మెత్తురె కాన్కలిత్తురే
కుందనొకింత మిత్తికిఁకఁ - గ్రూరులు మీరలు పాపపుంజముల్
పొంది యనంత దుర్గతికిఁ - బోవుట నిక్క మహాంతనిక్కనన్. 200

తే. మల్లయుద్ధ మొనర్చెడి - మగలు గలుగ
దానికిన్నేను సిద్ధమ - ధైర్య మున్న
నొక్కఁడొక్కఁడు రండు మీ - చిక్కు దీర్తు
నాంధ్ర జనయిత్రి కేను న - ద్యముఁ గూర్తు. 201

ఉ. ఏనిపు డేరికైె యసువు - లిచ్చుచునుంటినొ వారు రేఁగి మీ
ప్రాణము లొక్కదిక్కునసె - పొవుట నిక్కము ధైర్యమున్నచోఁ
బూనికఁ గట్లువిప్పి రణ - భూమిని నిల్చి యెదిర్చి చూడుఁడీ
యేనుఁగు తాటిమట్టనటు - లేనిఁక మిమ్ములఁ జీల్చివైచెదన్. 202

ఉ. చిక్కని వేడిరక్తమును - జిందఁగఁజేసి స్వరాజ్యకాంక్షమై
దిక్కులు పిక్కటిల్లునటు - ధీరతఁ జూపుట మీరెఱుంగరే
యొక్కనిఁ బల్వురిట్టు పరు - వొల్లక కాల్చిరి కత్తియున్నచోఁ
పక్కున నవ్వరే పరమ - పౌరుషవంతులు ధీరశాంతులున్. 203

కం. ఓడక యాడెద నిక్కం
బాడుదియు న్నేయదిట్టి - యన్యాయం బీ
నాడిట్టిపాఁడిఁ గూడుం
జేడియ మా ఝాన్సి చరిత - చెప్పన్వినరే. 204

కం. వరయుద్ధ ధర్మవెల్లం
దురితమునకు లోఁగి పీడి - తొందరపడి నన్
బొరిగొనఁ బుట్టుదురిటఁ జె
చ్చెరవీరులు వేయిమంది - సీతారాముల్. 205

వ. అభిమానధనులు విశ్వవిఖ్యాత వీరవరులునగు మా యాంధ్రులు మృగముల మృగయుసెట్టి మిమ్ముల వేఁటాడియాడి యెల్లల నెల్లదాఁటి పోవఁ దఱిమితఱిమి కొట్టఁగలరు. కోరికోరి భారతపౌరులు పారతంత్ర్యశృంఖలములఁ బటాపంచలు చేయఁగలరు. స్వాతంత్ర్య భానూదయంబునఁ గళకళలాడఁగలరు. 206

కం. మీదేశముపై మీకెటొ
మాదేశముపైని భక్తి - మా కటులెగదా
యీధర్మముఁ బాటించిన
మాదేశము మాకునిచ్చి - మరలుఁడు సరగన్. 207

తే. ఆయుధ బలంబులేమి మే - మణఁగి యుంటి
మంతియేగాని హీనుల - మని తలఁపఁకుఁ
డింక యెన్నాళ్ళు మీ భోగ - మేగుదెంచె
నంతిమదినం బిదియ సత్య - మైన వాక్కు. 208

వ. అన నిను నాయిచ్చవచ్చినట్లు సంహరింప సంకల్పించితి. నా సంకల్పమునకు వికల్పములేదు. కడసారి దేవుని బ్రార్థించుకొమ్మన నాయాంధ్ర వీర రత్నము నిమీలితనేత్రుండై గంభీర ముద్రాలంకృతుండై పరమేశ్వర ధ్యాన నిమగ్నమానసుండై యుండఁ దొలుత కంచుమీనన్ రెండు గుండ్లు ప్రేల్వ రామరాజు. వామభుజంబునం దగుల గుఱిదప్పుట కతనిఁగని గ్రుడ్లుఱిమి క్రోధావేశ పూరితుండై గూఢాలు తాన వేంకటకృష్ణరాజపౌత్రు వక్షంబు లక్షించి లఘునాళికం బ్రేల్వ నగ్గోళజాలంబు విశాలోరమ్మున నుచ్చిచన వజ్రసంకల్పుండై వేంకట రామరాజ తనూజుండు వందేమాతరమ్మనుచు ఘుసృణ కుసుమగుచ్ఛచ్ఛవిచ్ఛటావిలోకనంబుల నప్రతిహత క్షతజోక్షిత ధరాతలుండై వీరస్వర్గమలంకరించె. తత్కాయంబు గాయంబులఁ గుసుమితకింశుకంబట్లు దనర గిరిశిఖర వినిర్గత గైరికద్రవఝరీ పూరం బేకకుల్యంగల లాఁపరాతూపరాణి శాఖోపశాఖలుగ వెడలు విధం

బునఁ దద్దేహనిర్యల్లోహితధారలొప్పె. కౌరవసైన్య మహానాయక పరివృత నిహతాఖిలసైన్యం దలపించుచు బంధవిముక్తిం బెన్విన్యాలితాఁకునం బెళ్ళగిలిపడిన మంచి గంధపు మ్రానింబోలె నేలంగూలిన తెలుంగు నెఱజోదుంగని ముల్లోకంబులుల్లంబు జల్లునఁ గన్నీరు గార్చె. అండనున్న దండి కొండలు గుండెలు వగులం బొగిలె. హద్దుమీఱిని సముద్రుండద్దిగని తద్దయు హోరుననేడ్చె. ఆకసముకల్వోయె. ఉడు లుల్కావ్యాజమ్మున నశ్రులు రాల్చె. లతలు క్షితిలి తరుతతులఁ గౌఁగిలించుకొనె. మహామహీరుహంబులు పరికంపితోత్తమాంగంబులయ్యె. చంచరీక సంచయములు ఝుంకార మిషన్వాపోయె. కుసుమకోమలులు జాలిన్నేలంగూలె. తరణి తనువున నరుణిమ క్రచ్చఱహెచ్చె. 209

ఆ.వె. కస్తి కోర్చి పరుల – కష్టము ల్దీర్పఁ గం
కణము గట్టుకొన్న – ఘనుని గొట్టి
వ్రేటుగంటిఁ దొరగు – వేడి నెత్తుటఁ దోఁగి
యశ్రు లురల నేడ్చె – నాంధ్రమాత. 210

ఉ. భారతమాతృపాదముల – భక్తి భజించుచు సోదరప్రజా
కారుణి కత్వదృష్టి రణ – గాథకు నాయకరత్నమై మహా
వీరరసాబ్ధి వీచికల – వేయి తెలుంగులఁ దేలిశూలికిన్
మాఱిన నొప్పి యిప్పగిది – మారణహోమమునందుఁ గూలితే. 211

వ. అని తద్దృశ్యముం జూడఁ జాలక వనదేవత కనులు మూసికొనియె. భారతాంబ శోకవ్యాకులిత హృదయయై నిట్టూర్చె. అవ్వార్త విన్నంత. 212

# మిత్రుల సంతాపము

కం. ఫణి భూషణ మణి భూషణ
గుణ తోషణ సత్యధర్మ – ఘోషణ రిపురా
ణ్మణి భీషణ మృదు భాషణ
ఘనసాహస కృత్యకరణ – కరుణా భరణా. 213

కం. కమలాంబక కమలాంబక
కమలాప్తనిభప్రతాప – కరణ ఘనయశః

కమలాంబక దూరమనః
కమలా కమనీయశీల – ఘనరణ లీలా. 214

తే. ఎట్టి దుష్పటమునుగన్న – నెద్దులట్టు
లెట్టిటోపీని గన జన – మెగిరిపడును
సార్వభౌముని తోడనా – సంగరంబు
గుండెకాదు నీయది వజ్ర – ఖండమేమొ. 215

వ. అర్చిత మహాకాళీ పూజితశూలీ సహనశీలీ దయాశాలీ హూణఘన సేనారణకేళీ చివఱకిట్లమరపురి కరిగితివా యని మహాత్యాగాహార్యశిఖరాగ్రరాజత్త ద్వీరకేసరితోఁ బ్రత్యక్ష పరిచయ భాగ్యశ్రీ నలరిన ఘన సుజనవర్యులు నుతించుచు నిట్లు చింతింప మఱికొందఱు. 216

చ. జనసుఖ మాత్మసౌఖ్యమని – సాహసకార్య కళాకలాపియై
మనుచు సమస్తమార్గముల – మన్యము వృద్ధినిగోరి రాజయో
యిననిభతేజుఁడయ్యుఁ గడ – కిట్టియె దైవము చిన్నచూపు చూ
చిన నతఁడెట్టిఁడైన జయ – సిద్ధి సమృద్ధిగఁ బొందజాలునే. 217

కం. బలనిర్జిత దిఙ్నాగుఁడు
విలయానలశౌర్యశాలి – వినయ వివేకా
మలచిత్తుఁ డుదారాశయుఁ
డలరాముంబోలు రాముఁ – డనఁజెల్లు ధరణ్. 218

ఆ.వె. అబ్ధి నీదు చేప – యడుగుభాగమ్మునేఁ
గాంచఁగలుగు నేర్పు – గల ఘనుండు
అనమబలముతోడ – నన్నియొనర్చి విజయ
మందలేక స్వర్గ – మందవలసె. 219

కం. అల్లూరి యల్లరంచుం
దెల్లదొరలు వల్కి రెంతొ – తేలికగా వా
రెల్లరుఁ దద్ఘను బ్రేమోలం
జెల్లుదురే యతనికీర్తి – శిథిలంబగునే? 220

వ. శరప్రయోగచాతుర్యంబున గుణశరధి దాశరధిని యుక్తిశక్తిం జాణక్యుని బోలు నాతని విచిత్ర చరిత్రంబు జగత్రయశ్రోత్రపేయపాత్రం

బని గెరిల్లాయుద్ధమున భారతదేశమున నిట్టి జెట్టిపుట్టలేదని స్తుత్యంజలి ఘటించిరి. రామరాణ్మరణవార్తవిని పగిలిన యనలాద్రులభంగి నిప్పులు గ్రక్కుచు గృహిణులు మహాటవుల నల్లాడుచున్నను సరకుగొనక గంట మెల్లేసు ప్రభృతులు పరప్రభుత్వపుం బటాలములతోఁ బోరిపోరి మరణించి సనాతన యశస్సు సంపాదించుకొనిరి. ఇది యల్లూరి సీతారామరాజు సత్య చరిత్రయని పట్టాభి సీతారామయ్య యుగ్గడింప నెల్లరు కరతాళధ్వనుల నభినందించిరి బుద్ధుని శాంతము కృష్ణుని దుష్టశిక్షణ శిష్టరక్షణ పృథ్వి రాజు సాహసము శివాజీ దేశభక్తి రాయలపరాక్రమము తనలోఁ దాండ వింపఁ జేసికొన్న యాంధ్రహం వీరు కథ వినిపించిన ధన్యునకివే మనః పూర్వక నమశ్శతంబులని పొట్టి శ్రీరాములన గాంధీజీ స్మేరాననుండై పట్టిన పట్టుపీడక మంటినుండి మాణిక్యములు పెకలింప దేశమునకై బలివోయిన యతండు. 221

శా. ధీరోదాత్తుఁడు సత్యసంధుఁడు మహా - ధీశాలి నచ్ఛీలి వీ
రారాత్రిప్రవరేభ సింహము స్వరా - జ్యార్థ్యర్థి కష్టక్రియా
సారోదారుఁ డపూర్వసాహసి యహిం - సావాదియేయైనచో
నారాజున్ సరిపోలరెవ్వరని నే - హర్షింతు వేరెట్లుగన్. 222

కం. ఊరూర మాఱు మ్రోగెం-
బారావారములుదాఁటి - పర్విడె రాజన్
పేరిఁక సీమన్ ఘనరణ
భేరీరావంబువోలె - భీతిం గొల్పున్. 223

వ. ఆ నిరాడంబర జీవితమునకుఁ గష్టసహిష్ణుత పూర్ణమానవతకుఁ బ్రాతిపదికయై యజరామరకీర్తి ధ్వజమెత్తించినది. 224

తే. ఉగ్రసాయుధ రణవాంఛ - యొకటి తప్ప
నొప్పునన్నింట నాదర్శ - యువ యనంగ
నేఁడుగాకున్న రేపైన - నిక్క మెఱిఁగి
యంజలించు జగంబు స - త్యంబనంగ. 225

వ. బోసానంద కందళిత హృదయారవిందుండై తలపంకించి మహమ్మ దాలీ యధ్యక్ష పీఠ మలంకరించిన కాకినాడ భారతజాతీయ మహాసభకుఁ దురగ రాజముపైఁ జనుదెంచి "యవిచార దుర్మదులైన రక్షక భటులు

మృగయులు మృగముల ఖగముల వేఁటలాడినట్లు మన్నెపు వాసుల హింసింతురు. దారిద్ర్య కృశులగు ప్రజల దయార్ద్రహృదయముమైఁ జూడని రాజులేల ? తెల్లవాని యేల్బడి దొల్లనడచినంగాని నాయుల్లము చల్లఁబడదు. అందన్క నాప్రాణమునకు మత్కృపాణమునకు శాంతిగాని విశ్రాంతిగాని యుండదు. లావుకత్తెలావలవలయుంగాని తొలుతఁ బిదుగులతోఁ ప్రాయి రాజందగునుగాన నడవి దొరలయుంక నసికిఁదిగితి" యని రాజు నాకుం దెల్పె చనె. అమ్మహామహుఁ డేస్వతంత్ర దేశమున నైన జన్మించియున్నఁ దదభ్యుదయార్థియై యింతకంటె సాహసకార్యలు బంపి జగద్విఖ్యాత యశోవిశాలుండై యుండెడివాఁడు. స్వాతంత్ర్య సముపార్జన సన్నాహమున నాశౌర్యధనుని మార్గమంగీకరింపని వారుసైతము మా స్థిరసంకల్పుని యద్వితీయ త్యాగదీక్షను వేనోళ్ళఁ గీర్తింపక మానరు. అమ్మహాశయుని యత్న మవితథమగుఁగాక యన నెవ్వరూ మహోత్సాహవంతులై బ్రిటీషు సామ్రాజ్య సామజ కుంభ భేదన క్రియోల్లాస భాసురమై క్షత్రియశూర కిశోర సింహశాబకము లంఘించి చరితకెక్కుట ముదావహము. ఇంత వఱకు రామరాజునుగూర్చి విశేషముగఁ దెలిసికొనక పోవుట నా దుర దృష్టము. వ్రేళ్ళపై లెక్కింపఁదగిన యనుచరులతో రవియస్తమింపని రాజ్యము నెదుర్కొని వర్షత్రయమ్ము గజగజలాడించిన యసామాన్య సాహసోపేత భారతవీరరత్నమని యిప్పుడు గ్రహించితినన వంగ కేసరి నఖిలుల నవలోకించి యట్టిరాజు పట్లెలం గొల్లగొట్టు దేశద్రోహియని ప్రాతిహారకులు తెల్లదొరలు ప్రచారమొనర్చిరి. నిరాయుధుఁడుగ నేకాకిగఁ బ్రశాంతముగఁ బట్టువడిన శౌర్యధను విద్రావితారివరు నానతశాత్రవ శిరస్కు కరుణాకర మనస్కు జగదేకధానుష్కు న్యాయస్థాన విచారణ రహితముగ వధించుట లోకము మెచ్చుకొనదని వీపున గుండ్లదెబ్బలున్న యట్లొక్క భిషక్కుచే నిర్ధారణ పత్రమంది తజ్జీవితమునకు మాయనిమచ్చ నాపాదింప యత్నించిరి. కాని తన్మాయాహిమజాలము సత్య భాస్కర కర ఘాతములఁ గరఁగిపోయెనన నగ్గనాయకులెల్ల రా జెట్టికన్నాకునకు జోహారు లర్పించిరి. 226

చ. బెడిదపుటంపఱంబఱపి — భీకరమృత్యువిహార కృత్యముల్
కడుకొనఁ జేసి యాజి జయ - కాంక్ష మహారథి కర్ణురీతిగా

నడరి విరోధివర్గదుర - హంకృతి హుంకృతి మాపనోపి కా
రడవుల సంచరించిన మ - హారణవీరుఁడు రామరాజెగా. 227

వ. అట్టివాఁడు కోటి కొక్కండైన లభించుట దుర్లభము. ఇతరులఁ గష్ట పెట్టియైనం దా సుఖింపవలయునని తలంచువాఁడె గాని యితరుల సుఖమునకై తా సర్వవిధ కష్టముల ననుభవించుటకు సంసిద్ధముగ నుండు వాఁడెవ్వఁడో యెవనికి వాఁడు గుండెపైఁ జేయివైచికొని యోచించిన సత్యము దేలును. అప్పుడ రామరాజు ఘనత సూర్యప్రకాశమున వస్తుచయము వలె స్పష్టముగ గోచరించును. 228

కం. పదునెనిమిది దినములెకా
కదనము కురుపాండవులకుఁ — గర మొప్పారెం
బ్రధన మిది యసమ బలముల
కదిరా! మూఁడేండ్లు జరిగె - ననుకొని రెదలన్. 229

ఇయ్యది శ్రీమదాంధ్ర మహోభ్యుదయ ద్వితీయ భాగమునం
బంచమ ప్రకరణము సమాప్తము.

షష్ఠ ప్రకరణము

# సంపూర్ణ స్వాతంత్ర్య చర్చ

వ. చతుర్థ దివసంబున నానాదేశాగత నాయకరత్నంబులు — 1

సీ. సురదీర్ఘికాస్నాన - శుభ్రశరీరులై
యమృతమ్ముఁ ద్రావిన — యమరులట్లు
కోరి సబర్మతీ - వారిఁ గ్రుంకిడి సాత్వి
కాహారమునుగొని — యాత్మతృప్తి
నంది రంత మహాత్ముఁ — డందఱఁ గనుఁగొని
కర్తవ్యమగ్నులౌ — ఘనులు మీర
లిక్కాలమున మన — మెట్లు చరించిన
దేశదాస్య విముక్తి - తేజరిలునొ

తే. యద్ది చర్చించి తత్కృత్య — మాచరించు
టవసరంబని మీరెల్ల — రాత్మలందుఁ
దలఁచి మీమీయభీష్టముల్ — దెలుపుఁ డనుచు
కరుణరసరథసారథి — గాంధి పల్కె. 2

వ. అగ్రాసనమధిష్ఠించి బాపూజీ యిట్లువాకొన మౌనముద్రాలంకృత సదస్యాననద్యోతకాలోచనా చిహ్నముల నల్దెసనవలోకించి ప్రసన్న దృష్టింబ్రసరించి యాదేశసందేశోపదేశగర్భితముగ నిట్లువల్కందొడంగె. ప్రథమదశ విజ్ఞానశాస్త్రముంబలె జాతీయమహాసభాప్రచారము దొల్త మందముగనడచిన నిపుడదిమనోవేగముగ సాగుచున్నదంట నగ్న సత్యము. సంపూర్ణ స్వాతంత్ర్యసముపార్జనసన్నాహ సమాలోచనాసభ యిది. సునిశిత చర్చలం గంతవ్యమార్గము గమనింపదగు. జగద్ధితము మనమతము. 3

ఉ. ధీరత మీ రగాధజల — ధిం గలరత్నములం గ్రహించి స
ద్భారతజాతికీర్తిరమ — భాసిలఁ జేయఁగలా రహింస యన్
సారపుటస్త్రమిచ్చు జయ — శాంతి గణింపుఁడు ధర్మనైచికీ
క్షీరముఁ గ్రోలుమానవుల — క్షేమము దైవము నూడకుండునే? 4

తే. కలముతోఁ దెచ్చు రాజ్యము – నిలుచుఁ గాని
కత్తితో వచ్చినను బహు - కాలముండ
దిప్పు డీదేశ గతిఁగని - చెప్పు సూక్తి
యొప్పకుండినఁ దప్పక - ముప్పు వచ్చు. 5

ఆ.వె. కంటి కింత నీకుఁ – గనఁబడకున్నను
బాప మన్న నెచటొ – బయట లేదు
నీదు చేఁతలందె - నిలిచి నిన్బాధించుఁ
గాన ధర్మవెఱఁగి - కడఁగు పనికి. 6

తే. నిఖిల పక్షము లొకత్రాట – నిలిచి వలచి
సర్వ సంగీర్ణ సంస్కృతి – సమ్మతించి
మనిన నన్యోన్యమైత్రిమై – మాతృధాత్రి
క్రొంజెలువుగుల్కఁ బలిమిని – బుంజి కొనును. 7

కం. సత్యాహింసనములు నా
కత్యంత ముదావహమ్ము – లని వినియు దొరల్
నిత్యము బాధాకర జన
హత్యాకృత్యముల కిట్టు – లడుగిడి రకటా! 8

కం. ముక్కులు వగిలెడి గౌలుం
గ్రక్కు బురదనీటితోడఁ – గదలిన యంత్రం
బక్కట! కాంగ్రెసు రచ్చల
రక్కసివలెఁ జిమ్మెపావ – రసగంధమునా. 9

కం. కూలికి విసమ్ము ద్రావెడు
బాలిశులకుఁ బాపపుణ్య – ఫలిత విచారం
బేల మదిఁ బుట్టు వారలు
జాలముతోఁ గాలమెల్ల – జరుపుటఁ గనమే. 10

కం. దక్షతలేమి నొరుదయా
భిక్షల నర్థించి విజయ – వృద్ధిగలిగినన్
రక్షించిన వారలనే
భక్షించెడివార లెట్టి – పాపాత్ములొగా. 11

ఆ.వె. బాల్య మాది నున్న - భావావరణమంద
యెపుడుఁ దిరుగు గాను - గెద్దువోలె
దాని దాఁటి విశ్వ - ధార్మిక దృష్టిమై
సత్య మెఱఁగికొనుట - శ్రమము మదికి. 12

కం. దోషజ్ఞులైన పరమ మ
నీషావంతులకుఁ దెలియు - నిచ్చ లలాబూ
పాషాణన్యాయ్యమ్ముగ
భాషావేషాదులఁ బ్రజ - భాసించుటిలన్. 13

తే. ఆంగ్లసామ్రాజ్యవాద నా - శగాని
యాంగ్లజాతిపై ద్వేష మా - వంత లేదు
వారు సోదర్యులని యెంతు - వారి బాధ
మనకు బాధగఁ దలఁతుఁ ద - న్మైత్రి వలతు. 14

ఉ. ఎప్పుడు హిందువుల్దురక - లేకకుటుంబజులట్లు యుందురో
యప్పుడ రాజ్యమిత్తుమని - యంగ్రడిది చెల్లునె ముక్కు వెంగ్రుకల్
గొప్పున కందినట్టితఱిఁ - గోరిక లారఁగఁ దీర్తుమన్న నా
చొప్పున కెవ్వరొప్పుకొనఁ - జూతురు హైందవులంత వెఱ్ఱులే. 15

తే. స్వేచ్ఛ జనిహక్కుగా జని - యించెఁగాని
యినుప సంకెళ్ళలోఁ జిక్కె - నెందు నరుఁడు
అత్మఁ బుట్టిన జ్ఞానంబు - నందుకొనుచు
నమలుపఱచిన వాఁడెపో - యనఘ వరుఁడు. 16

తే. నియమ బాహుళ్య భీతిమై - నిరసనమ్ము
తగదు మద్వాక్యతతి నాత్మ - తత్త్వమరయ
శాస్త్రదృష్టగురూక్త్యంశ - సార మెఱుఁగ
నిత్యనిష్కామయోగికి - నిజముజయము. 17

తే. తప్పుదారిఁ జన నరుఁడు - త్రిప్పలువడు
మరులు దీవను మెట్టిన - మనుజుమాడ్కి
గ్రహబలముకంటె మిన్నని - గ్రహబలంబు
దాని సాధించు వాఁడె పో - ధన్యతముఁడు. 18

తే. దేశకార్య్యహేతువు దాస్య - పాశమనెడి
సూత్ర మెఱుకకురా లస - త్సూరు లెల్లఁ
దద్విదాధర్మ దీక్షావి - ధానమహిమ
బ్రభుత నెదిరింత్రు దైవమే - భంగిఁ గనునొ. 19

కం. క్రమశిక్షారతి నిజవి
క్రమరక్షామతి విశిష్ఠ - కార్యాదృతి ను
ద్యమదీక్షాగతి భారత
కమలార్చన మనకుఁవలయు - ఘనమతులారా! 20

కం. ఈనాడిక వజనద్గతి
కీనాఁడిఁక మనకుఁదగ్గ - కృతియెది యేరి
న్నోనాడక జయపథముం
బోనాడక యద్ది సేఁత - పురుషోచితమౌ. 21

ఆ.వె. చెప్పవినకమేలు - చేజాఱె ననమేమి
ఫలము పెనర చేనిఁ - బాఱవేసి
పప్పుదాక వెదుక - చొప్పడునా యది
యొప్పరాదు దారి - దప్ప రాదు. 22

ఆ.వె. ఆశ లాశయంబు - లన్యాయక్లిష్టమై
యెడమొగంబొకండు - పెడమొగంబొ
కండు నున్న గమ్య - గమనంబులకుఁ బొత్తు
గుదురఁబ్రోవు మేలు - గడుదగ్గపోదు. 23

వ. ఇఁక రాజాజీ నిజాభిప్రాయంబువెలార్చునన నతండందుకొని త్వద్బో ధనములు సర్వపూనవ శ్రవఃకుహరములఁ బ్రతిధ్వనింప నవశకమాపుట దుశ్శకము. ఆత్మప్రత్యయ రహితుఁడు నిష్ప్రయోజకుఁడు. బ్రాహ్మ్య ముతోఁగూడిన క్షాత్రము క్షాత్రముతోఁగూడినబ్రాహ్మ్యము ధీరోదాత్తుల యెడ గోచరించు. ఒకరికొకరు సైదోడుగవర్తింపందగుంగాని సైతానుగఁ జరింపందగదు. తర్కవితర్కంబులు కర్కశవాక్కులంగాక జ్ఞానార్కోదయ శుభసంపర్కముగ సాగింపవలయు. భారతీయ స్వాతంత్ర్య మహోద్యమ పథమ్మున కడ్డముగ నావేష్టకమునిర్మింప ననువగు పథకమ్ముల సామ్రాజ్య వాదులు సృష్టించి చీలదీసిపాలింపవలయునని గ్రహించిరి. వైళమ

కొందఱు దమవశముఁజేసికొననెంచి యమాయికులు పతితులునగు పంచములఁ జేరఁదీసి మనభూమిని భూదానముగ నిచ్చి మన ధనముతో విద్యాదానముసేసి తమమతములోఁ గలుపుకొనిరి. దీనికిందోడు మతవైషమ్యముం బ్రేచి తొలుతంగాంగ్రెసువాదియైన జిన్నాను దిగిచికొని రాజకీయ ప్రతిపక్షములు తలలెత్తునట్లొనర్చి యధోగతిస్థితకులోద్ధరణ మవశ్యకర్తవ్యమ్మని జస్టిసుపార్టికానసూపిరి. కార్యకారణ సంబంధసహిత సర్వవిధ ప్రకృతి ధర్మరహస్యమహోదధివయింగల యలలమాత్రమ సామాన్యమానవుఁడు పరికింపంగలుగు. అద్భుతమేధావి జ్ఞానయంత్ర సాహాయ్యమ్మున నాగనాకలోకరహస్య రత్నములనేరికోరి గ్రహింపఁగలఁడు. అయస్కాంతము నిచ్చలుత్తర దక్షిణధ్రువములనే సూచించినట్లు పరిణత మనస్కులవాక్కులు నత్యధర్మములనే ప్రబోధించు. 24

ఆ.వె. తెల్లదొరతనమ్ము - మెల్లఁగా దిగఁజాఱు
మార్గమేదొ నీవ - మప్పవలయు
దేశవికసనంబు - దిద్దితీర్చెడి దేవ
దూతవంచు మాకుఁ - దోఁచుచుండు. 25

తే. ఇంచుక వివేక మెఱుఁగకె - ద్దీనిన దన
గాటఁ గట్టుండనెడి నరుల్ - గలరు జగతి
వారి నొకకూటువుగఁ జేర్చి - భారతైక
మత్యమున కగ్గివెట్టుట - మహితకృతియ ? 26

తే. ఎన్నియుడిగిన నన్నిటి - కన్ని ప్రభుత
చెప్పి స్వాతంత్ర్యమనఁ బెఁత - చెవినిబెట్టు
నెచ్చటే బావయనుటకు - మెచ్చుఁగానిః
వంగతోఁటను బావంట - వలవ దనును. 27

ఉ. నీచవుస్వార్థదృష్టి నవ-నీతసమానమనస్కునైన నా
లోచనకెంతొ దవ్వనిపి - లోఁగఁగలాగి నికృష్టవృత్తికిం
గాచమణీవిభేద మెఱుఁ - గందగుఁ దెల్వినిగోలుపుచ్చుచుం
దోఁచెను గాళ్ళువెన్కయని - తోఁకకుఁ గళ్ళెమువేయఁ జేయదే? 28

తే. ఐకమత్యము సడలిన - నరికి దూది
రేణువునకంటెఁ దేలిక - గాను నీటి

కంఠెఱ బలుచనగ మనము - గనఁబడుదుము
తెలిసియుం దెన్ను దప్పిన - ఫలము గలదె? 29

కం. కనుగలిగి బ్రదుకకున్న
న్మనతిప్పలు దైవమెఱుఁగు - మధురోక్తులతో
వినయవివేకసమైక్యత
వననిధులం దాఁటఁగొట్టి - వలయు న్వారిన్. 30

కం. అనవుడు మోతీలాలి
ట్లను నుత్తర దక్షిణముల - కంతర మెంతో
మనకు న్వారికిఁ దగవునఁ
గనభేదంబంత యేమి - కానున్నదియో. 31

తే. పీడితులకుఁ బీడించెడి - పెద్దలకెటు
కఱవనౌ నీతి తృప్తిగఁ - గఱవుమన్నఁ
గప్పకు న్విడ్వుమన్నచో - సప్పమునకుఁ
గోపమంట యెఱుంగదే - గుణిగణంబు. 32

తే. ప్రాచ్యపాశ్చాత్య సంస్కృత - పథవిభేద
మత్యధికమౌట సులువుగా - దైకమత్య
మైన రెంటికి వంతెన - యైన కరణి
నూత్న ధరైకమార్గము - నొడువు టొప్పు. 33

వ. ఇప్పుడు రాజేంద్రుహృదయంబెఱుంగంగోరుచునన నప్మనీషిమణి ప్రసాదమేదురంబైన చూడ్కులం జూపఱకువేడ్కసేయుచు నిట్లను. 34

కం. కుదురుగ నోట్లామీటరు
పదిలపఱిచి నింపినట్టి - వారింగలయా
యుదజనిని నాష్ఠజనినిం
జెదరక విద్యుత్తు వేఱు - సేసెడి భంగిన్. 35

వ. ఆంగ్లాధికృతులు హిందూముస్లిములకు నిరంతరము వేరడముగల్పింతురు. దాస్యకూపమునఁ ద్రోయఁబడినదేశము పైకివచ్చుట కష్టతరము. మనమతివాద మితవాదభేదంబులు మఱవందగు. ఏకస్కంధ జనితశాఖాద్వయంబు వాయువశంబున రాపాడుట సాజముగదా! అవయవముల కిరు

వైపుల సంకోచకవ్యాకోచకకంఠరములున్నట్లు పురోగమనతిరోగమన హేతువులు ప్రతిసంస్థకెడనెడఁబొడసూపు. క్షణక్షణము వానింజక్కదిద్దుకొనుచు గమనించి గమ్యంబుసేరుటయె మహాపురుషలక్షణంబు. కావున నీయుద్యమవాహిని విజయవార్ధింగలియుదన్క నిల్వరాదు మహాత్మా! 36

కం. అదయుల సదయులఁ జేసెడి
కదనంబిది దెన్నుదెల్పఁ - గా దుశ్శకమౌ
నిదిపోలుం బోలదునా
కెదినీకగు నదియనాకు - నింపగు ననఘా! 37

కం. 'ఇండెంచరు' పద్ధతి మును
ఖండించుచు మాన్పినట్టి - కరుణాకంధీ
దుండగమను జీఁకటికిం
జండాంశుఁడ వాత్మవిజయ - సౌజన్యనిధీ! 38

కం. పొంగారు స్వార్థరతి నిను
భంగింతురు గిన్కఁ దెల్ల - వారు జలధిపై
నంగార వృష్టి గురిసిన
భంగిందత్ప్రల మకీర్తి - భరితంబ యగుఁజా. 39

కం. ఆ సురశక్తులఁ గోరక
యాసురశక్తుల వరించి - యలరించెడి నీ
దాసినని విజయ వనితయు
వాసిఁ గలసివచ్చి నిన్ను - వారకచేరున్. 40

కం. బండ్లోడలగును నోడలె
బండ్లగు నిది ప్రకృతిరీతి - భాగ్యేందిర తా
గొండ్లియొనర్చున యొక్కెడ
గండ్లుపడిన గట్టె తిరిగి - గట్టిపడుఁగదా. 41

తే. వలనదీసిన దారలింత - వఱకు పెరిఁగి
యూఁచముట్టుగ విషయము - దోఁచుకొంద్రు
కరుణరసమింత వారికిఁ - గలుగు టన్న
నూసరక్షేత్రమున సస్య - మొదవినట్లు. 42

వ. ఇంతవఱకు మనముసాధించినఫలిత మంతగా కన్పట్టదు. నేఁటి కర్తవ్య మజాదునోట వినవలఁయునన నమ్మోని సన్నిభుండు విఱునవ్వు నవ్వి. 43

సీ. బీహారురైతుల - వెతవిని 'తిన్‌కఠి
యా' తొల్గ గాంధిజీ - కండయెవ్వఁ
డస్వాము దమనకాం - డాగ్నిఁ జల్లార్పంగ
నారణ్య సంచార - ధీరుఁడెవఁడు
మును గురుకాబాగు - ముల్తాన హత్యలు
మాన్పశ్రమించిన - మాన్యుఁడెవఁడు
ప్రీలి రక్తము కాఱ - బీహపూర్ సత్యాగ్ర
హాన దెబ్బలుతిన్న - యనఘుఁడెవఁడు

తే. కార్మికులనమ్మెఁ బలుచోట్లఁ - కష్టమనకఁ
జక్కఁజేసిన సమరస - సరసుఁడెవ్వఁ
డిమ్మహాత్ముని బోధల - నమ్మ నెవ్వఁ
డట్టి రాజేంద్రు వాక్కతి - యమృతనిభము. 44

వ. అని మహాత్ముని జూపి— 45

ఉ. సారమెఱింగి సత్యము వి - చారణసేసెడి యోర్పునేర్పులం
భారధురంధరత్వమున - భారతభాగ్యవిధాతయౌట నీ
ధీరసుబోధ బాధలను - దీర్చు మనస్సులమార్చు ధర్మసం
భారముగూర్చు హృత్కలుష - పాపములేర్చు యశంబుఁజేర్చెడిన్.

ఉ. ఒక్కపతాకక్రింద మన - ముంట మహోజ్జ్వల కీర్తికాంతకుఁ
నిక్కపుస్వాగతంబిడుట - నిర్మల సోదరభావ మైత్రికిం
జక్కనిబాట రాజ్యరమ - సంధిలఁ గాచెడి కంచుకోట యు
క్కెక్కిన వీరభారతమ - హీస్థలి సింగపుఁబీఁట యారయఁ. 47

తే. రాజనైతిక జీవితా - రామమందుఁ
బూచె నెత్తావిఁ జిమ్ముచుఁ - బూలురెండు
సత్తెమన నహింసనమన - సర్వజగము
మేలుమేలని తనకత - మెచ్చుకొనఁగ. 48

ఆ.వె. దేవదూత గాంధి – దేశికుఁడగుట సం
దేశమొసఁగు భరత - దేశమునకు
దానిమౌళిఁదాల్చి - దాస్యబంధము ద్రుల్చి
గద్దె నెక్కి సుకము - గనుఁడు మనుఁడు 49

వ. మానవుఁడు సంఘజీవియయ్యు నభేపవాదికాఁడుకాన కష్టములు గలుగు. ఆరోగ్యకరమైన జీవసమునకు రవిరశ్మియత్యవసరమైనవిధాన నేతత్సంస్థాపురోభివృద్ధికి మహాత్ముని సందేశాదేశములు ముఖ్యాతిముఖ్యములు. నావుడు గఫర్ ఖానందుకొని కర్మాగారసద్యోవినిర్మితావిష్కృతంబైన బెళ్లియవు దర్పణంబుంబలె సీసబర్మతీఋషి హృదయంబతినిర్మలము. సత్యశక్తిని ప్రత్యక్షప్రయోగద్వారమ్మునఁ దెలిసికొనుచున్నవ్యక్తి మహాత్ముఁడు. ఇమ్మేటి మాటంబాటింపను యిరువాగుకుం జేటువాటిల్లు. | 50

కం. దరహాసాంచితవక్త్రము
వరహేలన్ మూటగట్టు – వాగ్వైఖరియున్
నరజాతిని సురజాతిగ
సరిదిద్దెడి భావమితని – జన్మసుకృతమో. 51

కం. కాతరమెఱుఁగని ఘనుఁడు శి
ఖాతరువనఁబరగు సుకృత - కంధి గుణి దయా
స్వీతసుధారసహృదయుఁడ
జాతారి యితండపార – శాంతుం డరయన్. 52

ఆ.వె. చెఱకునరుగుటన్నఁ – జెఱకుఁ గొఱికినట్లు
కాని యొండు వితము - కానఁబడదు.
దేశభక్తి యెంత - ధీరుని జేసెనో
తెలియఁగలమె వీని – దివ్య మహిమ. 53

కం. ఎంతటి కష్టంబున్నదొ
యంతటి సౌఖ్యంబు దాని - కనుబంధమెకా
యింత యెఱిఁగి పుణ్యాత్ములు
సుంతయు ధర్మంబుదప్పఁ – జూడ రనంగన్. 54

# సాయుధ సంగ్రామ చర్చ

శా. ఉష్ణాంశుప్రతిభావిరాజితబల - వ్యూహోగ్రయుద్ధక్రియా
తృష్ణాయత్తుఁడ నోఘకార్యరతుఁడా - త్రిధ్వంసి సౌజన్యవ
ర్ధిష్ణుం డాఢ్యసహిష్ణుఁ డంచితయశ - శ్శీఘ్రాజి దేశార్చనా
నిష్ణాతుం డసమానశౌర్యఖని సం - దేహింపకబ్బోసనున్. 55

వ. ఏతజ్జాతీయ మహాసామ్రాజ్యస్వయంసత్తా స్థితభూతనుం బూర్వం బిండిలస్సృష్టి మహాత్ముండు సుర్ధ్వంబు పరదేశస్థ పాలనతత్స్థ పాలనభారం బున భారతీయాత్మగౌరవ విశ్వాసము లిట్టించె. వానిఁ బునరుద్ధరింప మృత్పిండమును మహాస్వాతంత్ర్య సమరయోధుఁడుగ నొనర్పఁ బ్రజోద్య మము జీవనదిగఁ బ్రవహింపఁజేసు నిత్తుండవలంతి. ఇమ్మహాసంస్థమూల మ్మున నహింసాతత్త్వ బీజావాపనసంస్కారమెన్నఁడో జరిగె. ఫలితమిం దన్కసరిగంగానము. రాజకీయ పరిభావంబు సైరింపంజాలని విప్లవవాది నని పెక్కుసార్లేవించితి. నైరాశ్యమేఘాప్పృతంబైన నామనస్సు తేజ స్సును గోల్పోవుచున్నది. శౌర్యసాహసఁ కాంక్షము పునర్జన్మమొంద వలయు. కోరికలు కోరకములుగనున్న భము. ఐతె ముద్దులుగులికిన ముచ్చటపడి యిచ్చిందీర్చునదిగా దీసామ్రాజ్యాధికార భూతము. విపరీత మైన కల్లోలముచే లోకప్రఖ్యాతిగాంచిన కాంబేసింధుశాఖవలె నిపుడీదేశము భయంకరవిప్లవములచే జగత్ప్రసిద్ధినొంది రాజ్యరమవడయవలయు. శత్రుశవతతిపై స్వైరవిహారముసల్పి తన యదృష్టసౌధము నిర్మించు కొన్న పాలకుని రాజ్యమేరాజ్యము. అది దుర్భేద్యము. దుర్నిరీక్ష్యము. తదుపరి శాంతిస్థాపనము. ఈ మహాపథ మేమఱిచరించువారి కొక్కొక్క తఱి మహాపథమగు. ఇది దూరాలోచనగాని దురాలోచనగాదు. ప్రపంచ పుంజివ్వయను పెనుతుపాసున దొరల హృద్భూమింజనించిన స్వార్థరసా న్వితమాయామానవతావాదవల్మీకంబునంగల రెండుకోనలనుండి కట్టకడకు రౌలటుచట్టముఁ జలియన్‌వాలాబాగు హత్యలను రెండు పెను బాములు విసముగ్రక్కుచు బుసలుగొట్టుచు వఱికుఱికినవి. "ప్రభూణాం హివిభూత్యంధా ధావత్యవిషయేమతిః" అనుసూక్తి స్పష్టపడినది. ఆస్ట్రో హంగేరియన్ సామ్రాజ్యము కూలిపోయినది. జార్ సామ్రాజ్యము పరిచ్యుతమైనది. కుటిల దమన నీతి తంత్రాన్వితాంగ్ల సామ్రాజ్యము పతనోన్ముఖమై యూఁగుచున్నది. ఈ విషమసమయమున సత్యాగ్రహ

గ్రష్ట మనల సక్రమమార్గమున నడుపుగాక! అస్వాతంత్ర్య దేశమున నుండి బహుళబలోపేత సామ్రాజ్యమును ఢీకొనుటకై రాజకీయ రంగమున దూకుటయుఁ బాలపాన్పుపై శయనించుటగాదు. నిప్పుతోఁ జెరలాట. మసపుతేన్గుతో పోర్కొనుట. సింహమును జూలుపట్టుకొని గుంజుట. జననికి నిజజీవముల బూటాపృష్ఠములుగా నెవఁడు సమర్పింప సంకల్పించునో వాఁడదానికి యోగ్యుఁడనుచు. 56

తే. రక్తరాంకవమట్లు నే – త్రములఁడసరఁ
బాము బుసకొట్టి నట్లుల – శ్వాస మమర
నాంగ్ల సామ్రాజ్యఘోరకృ – త్యములు దలఁచి
యాగ్రహోదగ్రుఁడై యిట్లు – లనియె నపుడు. 57

చ. తనువులశాశ్వతంబులని – ధైర్యరసుందెగిపోరి దాస్యబం
ధనములుద్రెంచి మంచిని స – దాగమనించుచు లోకరక్షకై
ఘనకృషిసల్పెదం దగజ – గంబులుమెచ్చగ మట్టినుండినే
మణులవెలార్తు మద్భరత – మాతకుఁగూర్తు సమస్త సంపదల్. 58

ఉ. నేరకయూరకొన్నఁ దెగ – నిక్కుచు భారతదేశసార మి
చ్ఛారతిఁబీల్చు తెల్లదొర – చర్చిలు చర్చల లొంగఁ డెంతకుఙా
వారక తిన్నయింటఁ గల – వాసము లెన్నెడువాఁడు వానితోఁ
బోరికినొగ్గకున్నఁ గనఁ – బోము స్వరాజ్యము వీరభోజ్యమున్. 59

మ. పలుమార్లెంతగ వేఁడినన్వినఁడు ఛేం – బర్లిన్ ప్రశాంతస్థితిం
బలుకంజూచుచుదువ్వ నత్ఫలమునం – భావించి యీడింతయుం
గల సత్యంబల పార్లమెంటువిననౌ – క్కడ్డే వచింపండెటుల్
దొలఁగంజాలును దాస్యబంధము రణో – ద్యోగంబు పాటింపమిన్. 60

తే. ఇట్టి రాకాసితనము లిం – కెట్లు సాగుఁ
బైత్యరోగికి రుచ్యమా – పంచదార
సురనరనరాదు లెల్లరుఁ – జూచిమెచ్చ
నాయసువులొడ్డి నిల్తు ర – ణంబునందు. 61

కం. యుక్తి నహింసముక్తి మన – కొప్పుట కల్ల రణైకరక్తితో
శక్తి కుమారుశక్తినటు – చయ్యనఁజూపుఁడు మాతృదేశ స

ద్భక్తిగలారు ముందడుగు – వైచి పరీక్షకు వత్తురేని నా
రక్తముతోడ వ్రాలిడుడు – రండిటుసేఁతకు గుండెలున్నచో. 62

ఉ. దేహపుమోహపాశ మతి – తీవ్రతఁ దున్కలుచేసివైచి నే
నాహవకాంక్షమై నహర – హంబుతపింతు రణంబుగల్గినా
వాహిను లస్రవాహినుల – వారక యీఁదెడివేళ వైరులన్
సాహసకృత్యముల్ సలిపి – చంపెద నింపెదఁ గీర్తిచంద్రికల్. 63

చ. స్థిరమతు లిట్టువల్కుదుర – దెబ్బకు దయ్యముపాఱిపోవునం
చెఱుఁగనివారులేరు ధృతి – హీనత యింతకుఁదెచ్చెఁ జెచ్చెఱం
బురహరురీతి భారతము – మూఁడవకంటిని విప్పకున్న న
ద్దారలిఁకహద్దుమీఱి పసి – దొడ్డికిఁదోలినయట్టు తోలరే? 64

శా. ఇట్టుల్ నాఁ దిలకింతు రింతయలుసే – యెట్లేఁగనుల్ విప్పి వే
జిట్టత్రాడుగ నైకమత్యబలులై – చివ్వన్వెసంగోరుచో
మట్టింబోలె స్థిరంబయన్న పరసా – మ్రాజ్యం బిఁకంద్రెళ్ళదే
గొట్టెల్ సింహములైన దిక్కుగలదే – గొల్లండటన్ నిల్వఁగన్. 65

కం. పొలికలని రక్తనదులకు
గలఁగక నిలువంగలారె – కాల్త్రొవ్వఁడు సం
చలనమనస్కుల కిందుం
గలుగదు స్థానంబు పిఱికి – కండల కలిమిన్. 66

కం. రణపీఠిక నినదము మా
రణగుణగణ పాతకుఁడగ – రాణింపఁగ మా
రణహుతశ్యామమగు మ
ద్ఘనధారము దవము పగఱ – కాఱడవులకున్. 67

తే. లీల మననేల నీలీలఁ – దాళుటేల
చల్లచల్లని పల్కులఁ – దెల్లదొరల
మనసు మార్పయత్నించుట – మట్టిగోడ
మురికి పోఁ దోమనెంచిన – పోల్కిగాదె. 68

కం. మదిపేపద్దైన లోకం
బిదియుడనని మొత్తి యెంత – కేనియుఁ దేనో

పదె యదితెలిసి మెలంగుట
పదిలము పరమార్థపథము - ప్రజ కెవ్వేళన్. 69

తే. ఏవొ కొంతగాని హక్కులీ - నేమిలాభ
మాకొని ముసిండి దిన్న - యట్లగును గాన
నింక పూర్ణస్వరాజ్యము - నిచ్చు దన్కఁ
గంకణవిసర్జనమునకుఁ - గాలమగునె ? 70

కం. ఎత్తులపై నెత్తులతో
నెత్తున కెగఁబ్రాకు టొల్ల - నెత్తెఱఁగుననేఁ
గత్తికిఁ గత్తి తళతళ
లొత్తుగఁ జూపించి జయము - నొందఁ దలంతున్. 71

తే. మెదడు హృదయము మొదలైన - మృదుపదార్థ
ములను గావంగఁ గంకాళ - మలరు భంగి
దీనజనమానరక్షణ - దీక్షఁబూని
యుక్కుకోటగ వరవీరు - లొప్పవలయు. 72

కం. దిటవుసెడి కడలు నూచుచు
నిటు మన మెందన్కనున్న - నిత్తురె రాజ్యం
బటొయిటొ తేల్చికొనన్వెనఁ
బటురణమున నిల్చి వారి - పని పట్టఁదగున్. 73

కం. ఒడబడ్డయట్టి కనఁబడి
కడుపడిఁ బెడదారికీడ్చి - గాసిలఁజేయం
జెడుచున్న దేశముం గని
విడదు ప్రభుత పట్టుపలను - వీసంబైనన్. 74

తే. ఉర్వి నెందన్కబ్రదికిన - నొక్కరోజు
చావు దప్పదు జీవికి - సత్తెమరయ
విశ్వమానవసౌహార్ద - విధిఁజరించు
వాని జీవిత మొకపూట - యైనఁ జాలు. 75

కం. స్థిరపై స్థిరముగ నిల్తుమె
యరులన్నురుమాడి గెల్చి - హైందవుఁ డొకఁడే

దొరయై యేలెడి దన్కఁ
గుఱువెట్టింగ త్రియెుఱుసు - గూర్పం బగునే? 76

వ. పరోపకారార్థమిదం శరీరమ్మను సుభాషితమ్ము నా దరింతము. నావుడు సర్దారు శార్దూలసింగు మద్దులూరి యన్నపూర్ణయ బులుసు సాంబ మూర్తి ప్రభృతులు మేము మీతోడివారలమన శ్రీనివాస యయ్యంగారిట్లను. బో సాంగ్లప్రభుత్వము పాలియగ్నిపర్వతము. అది యెప్పుడెట్లువగిలి యే వైపున కేమి చిమ్మఁగలదో యని తదధికృతులు నిచ్చలు గమనింత్రు. 77

సీ. బుధజనసంస్తుత్య - పుణ్యప్రభావతీ
జానకీనాథసం - జాతుఁడెవఁడు
ధర్మసంస్థాపనా - ర్థము నిల్చి గురుపుతో
గ్రుద్దులాడిన జయ - ఘోషి యెవఁడు
ప్రాదేశికమ్మగు - రాష్ట్రీయ సమితికిఁ
దత్త్వబోధకుఁగార్య - దక్షియెవఁడు
స్వచ్ఛందసేవక - సైన్యనిర్మాణంబు
కావించి తీర్చించు - ఘనుఁడెవండు

తే. గుండెదిటవున మాండలే - నుండె నెవఁడు
దేశబంధు పథంబునఁ - దిరుగు నెవఁడు
శౌర్యగంభీర వాగ్రమా - సహితుఁడెవ్వఁ
డట్టి బోసు ఘోరరణ వి - హ్యావిరాజి. 78

వ. భారతీయులఁ గొందఱనాకర్షింప హూణాధికారులు బిరుదముల నిచ్చిరి. కాని. 79

ఉ. ఊకెటు నూకయా బిరుద - మూరకయిచ్చితి మంచు నద్దొరల్
వాకొనరాని హేళన న - వారితరీతినొనర్చి వీరిటుల్
చేకొనినంతమాత్రమునఁ - జెల్లునె రత్నవిభూషణంబుగాఁ
గాకికిఁ గేకిపుచ్ఛమును - గట్టుట యంచు దలంత్రు నవ్వుచున్. 80

తే. ఇతని తండ్రియు విశ్వక - వీంద్రుఁ డిద్ది
యరసి బిరుదులు వీడిన - యట్టి యతఁడు

వదలేఁ దనపట్టమును మొట్ట - మొదటె సతము
భరతమాతృపదాబ్జముల్ - భక్తిఁగొలువ. 81

వ. లోకము కత్తికిఁ గప్పు మంచికి భయపడదు. దుర్మార్గునకు భీతిలి
సంత సన్మార్గుని గౌరవించు [illegible] వలస [illegible] ఆంగ్లేయులూ
రక హాటులతో వదలిపోవుచున్నారు [illegible]. 82

కం. కీలెఱిఁగి వాతపెట్టం
జాలక మీ కరుణ [illegible] - జాలిపడింతే
పాలించెడి దేశంబుడు
పాలిచ్చెడి సురభియుంచు - భావింపదగున్. 83

ఉ. అల్లెపుఁ బెండ్లికొడుక్కులటు - హాయిగ మెక్కెడి తెల్లవారలన్
మెల్లఁగ నిల్లుసేరుఁడన - మేకొని మేలు మూటముల్లెయుం
జల్లగ సర్దుకొందురె యు - సౌఖ్యపుటూహలు స్వప్నవార్త లీ
చెల్లనిమిన్కులేల [illegible]టు - సేసిన లగ్గ పనో తలంపుఁడీ. 84

కం. పెఱయేల్బడి సింగపు జూల్
కరమున గ్రహియించి గుంజి - గర్జించి విడం
భరతోర్వి మరలఁ బుట్టిన
భరతుఁడు నా బోసునిబ్వ - భయమేల యికన్. 85

చ. మొనతలఁ జచ్చినం భరత - ముఖ్యులు పోయినపోకయాట మా
మనమున కద్దిముద్దగు స - మస్తవిధమ్ముల మాతృదాస్య బం
ధనములగల్పఁ గంకణము - దాల్చిన వీరులు నిత్యమౌయశో
ధనము త్యజింపఁగోరుదురె - దాస్యము నారకమంచెఱుంగరే? 86

ఉ. బిందువుబిందువుంగలసి - భీకరమైన ప్రవాహరూపుముం
బొంది స్వకీయమార్గమునఁ - బోవుచు నడ్డమువచ్చు జీవులన్
మ్రందఁగఁజేసి గమ్యమతి - రౌద్రముగా రహిఁజేరదే యటుల్
పొందికమై సమస్తజన - ముద్దెగి పోటునకొగ్గ నెగ్గమే? 87

తే. తిలకు భావంబులకు నొడల్ - పులకరింపఁ
జిత్తరంజను బోధకుఁ - జిత్తమగలఁ

బూర్ణవిప్లవవాదియౌ - బోసుచర్య
తలకొఱవియయ్యె సామ్రాజ్య - తత్త్వమునకు. 88

కం. ఫల భుక్వలభుక్కుల కెటు
చెలిమిగలుగు మనసు నడత - చెరియొకటగుటఁ
జలముం బలముం జూపక
యలుసైనం జెవులువట్టి - యాడింతురయా. 89

తే. వాసికెక్కిన వీరుఁడౌ - బోసుఁ గన్న
నెఱ్ఱిగుడ్డను గాంచిన - యెద్దులట్లు
బెదరుచుందురు దొరలీతఁ - డెదురులేని
సాహసముసూపఁగల శౌర్య - శాలియగుట. 90

ఆ.వె. వయసునందుఁ బిన్న - భావాలలోఁ బెద్ద
కూఁత ఘనము పిట్ట - కొంచె మౌర!
వీని వాఙ్ముఖంబు - వీనుల సోకిన
భీరువైన యుద్ధ - వీరుఁడగును. 91

ఆ.వె. అడరి హద్దు మీఱి - యబ్ధిఘోషించిన
వానగాని గాలి - వానగాని ండు
వచ్చునట్లు వీర - వాక్కుల విప్లవ
జ్వాల పుట్టి పగలి - పైకి దుముకు. 92

కం. మొఱకుఁదనమసక చేఁయ్వుల
కఱకుఁదనంబెల్ల జూపఁ - గడఁగక రాజ్యం
బఱచేతఁ బెట్టి పోదురె
గురుశుక్రుల కాత్మమైత్రి - గూడునె చెపుఁడా! 93

కం. నవయుగ నిర్మాణ రతిం
జవసత్త్వము లుడుగలేదు - జనులందఱిలోఁ
గవదొనలవాని తీరున
యువలు రణోత్సాహులగుచు - నుండి రనంగన్. 94

వ. ఆంధ్రకేసరి యతనింగని యుడుకురక్తమున మీనొడివిననుడులు తత్క్షణాచరణయోగ్యములనంజెల్లదు. అపారజననష్టహేతువగు సాయుధ

సమరమునకు ధైర్యస్థైర్యములెక్కువ వలయు. "ధైర్యే సాహసే చలక్ష్మీః"
అను వృద్ధోక్తి నాకుం దెల్లమ. ఐన - 95

ఆ.వె. దిగిన లోతెఱుంగుఁ - దిన రుచి తెలియును
నొద్దనుండి వేయు - గడ్డలన్ని
సార్థకములుగావు - వ్యర్థములునుగావు
అనుభవంబు గొప్ప - దనఁగనొప్పు. 96

వ. తోడేలునోటిందప్పించుకొని పులివాతంబడినట్లు పరాసుల పాలనము
నకుం జిక్కకున్న నాంగ్లేయుల యేల్బడికి లోఁబడక తప్పదయ్యె. 97

కం. ఏ లగ్నంబున నిద్ధరఁ
గాలూనిరొ కర్మమెంత - గాఁ దోఁచ్పడెనో
మేలిమిగట్టునమ్మెట్టిన
వేలుపుదొరలట్టు దొరలు - వెలుఁగుదు రిచటన్. 98

తే. విఘటితకవాట గృహమున - వేపిదూరి
నట్ల శత్రులు దూరుదు - రని తలఁపక
రాజు లిటమున్న యన్యోన్య - రణవినోదు
లౌటఁ బరదేశనృపు లిటు - లధిపులయిరి. 99

కం. ప్రీతిగఁ బొలమున మేసియుఁ
జేతోముదమొదవ దప్పి - చేఁ బసరంబే
జాతొట్టి ముట్టె నొత్తిన
నేతీరున బ్రీలు దీరుఁ - డెట్టుల బ్రాలుఁజా. 100

కం. ఎందఱు బందాలైన నిఁ
కెందఱు నచ్చిన మఱెంద - ఱేమైనను వే
ఱెందఱు క్షతతనులైనను
డిందదు స్వాతంత్ర్యవాంఛ - డీల్పడరు జనుల్. 101

కం. మరణానకైన నోర్తుము
శరణంటకు నొప్పుకొనము - శాశ్వతకీర్తి
స్ఫురణముతో స్వాతంత్ర్యం
బరుదేరఁగ మెత్తు మద్ది - యర్ఘ్యంబనుచుఁజా. 102

ఆ.వె. తెల్లదొరలు తార - దివిజుల మనుకొని
నల్లవారిఁ గంద్రు - నల్లుఁబట్ల
యింత భేద దృష్టి - కెద్ది కతమ్మునా
దేశ దాస్య మంచుఁ దెలియలేమె? 103

కం. తెలవానిపెత్తనమ్మిఁక
నిలువదు మననేల నెంత - నిక్కిన దానిం
జలమునఁ గూలం ద్రోఁతకు
నిలిచెఁ దేశమ్ము నిత్య - నిర్మల దీక్షఁ. 104

కం. త్యాగధనులు మనబాటకు
రాగా రాగానులాప - రాజితఘనులై
మ్రోగింతము జయభేరిఁ
సాగింతము దండయాత్ర - సామ్రాజ్యముపై. 105

వ. ఇందలి వృద్ధులుం బౌరుషశూన్యులుకారు. కాగి చల్లారినపాలుగానఁ
గార్యాలోచనమెండన లెస్సయని పట్టాభి యిట్లను 106

కం. వ్రేలికిఁ బెట్టినఁ గాలికిఁ
గాలికిడినవ్రేలి కిట్టు - కలఁతు రొకప్డున్
జాలియను వెలుఁగువోపద
యేలీల స్వరాజ్య మింక - నేర్పడఁగలదో. 106

తే. ఒకటికిఁ బదాఱు గల్పించి - యున్నతాధి
కారులకు వార్తలంపి ని - క్కమ్ముఁ ద్రొక్కి
కపటనాటకమాడు క్రము - క్కడులక్రింద
నెంతకాలము భారత - మిట్లునవయు. 108

కం. మనమడిగిన స్వాతంత్ర్యం
బెనలేని ముదాన మనకు - నిత్తుర యూరా
యను సంప్రశ్నము గొందఱు
మనముల బాధించె దొరల - మార్గము సూడఁ. 109

వ. అఖిలభారత జాతీయ మహాసంస్థావాహిని మితవాదాతివాద పక్ష
భేదాభిప్రాయ పర్వతమునకు డీకొనిరెండుపాయలైనచోఁ దక్ష్ణలహీనత

గుర్తించి తచ్ఛాఖాద్వయమును రెండురికాబులుగఁ జేసికొని కాళ్ళు వెట్టి యధికారాహం కారాశ్వారోహణమొనర్చి శ్వేతజాతి వారక యిట్లెంతకాల మైన స్వైరవిహారమునల్పు. "మహాజనోయేన గతస్సపంధాః" అను విపశ్చిత్ప్రవరవచస్సుంబాటింపందగు నన నదిమాకుందెల్ల మింతకుఁగడ్డు సమస్యగనున్న లీగువిషయమెట్టిదని వంగకేసరి పృచ్ఛింప సత్యాగ్రహ సమర సత్రర్త్విజుఁడిట్లను. 110

కం. బొమ్మల కుంపటి యైనది
సుమ్మీలీగ్సేఁత యేమి – చోద్యమొ సమరం
బెమ్మె విజయముగాంచునొ
యిమ్మానవకృషికి నీశు - డెటుతోడ్పడునో. 111

వ. మతపదప్రయోగేంద్రజాలమున నమాయికులవంచించు నల్పసంస్థ యగు లీ గాత్మనిగ్రహముగల రాజకీయచైతన్యవిలసితుల నాకర్షింపఁజాల దయ్యెననుట కజామఖానాలీసోదరప్రభృతులు ప్రత్యక్ష నిదర్శనములు. తదాశయము పురోగమనముగాదు. పునరుద్ధరణ. సనాతనదృక్పథమా ధారముగ నాధారరహితా సత్యప్రచారములొనర్పఁజంకదయ్యెను. లీగు భారతీయ మహమ్మదీయులకేకైక ప్రతినిధియని కాంగ్రెసు హిందువుల ప్రతి భువని జిన్నాయను. ఈ ద్విజాతివిభేదవాదసంజనితమే భారత విభజన నినాదము. కాని, ముస్లిములలో నధికసంఖ్యాకులు చేనేఁతపారిశ్రామికులు నిర్ధనులునగు మోమినులు లీగునకుఁబ్రత్యర్థులు . జాతీయమహాసభకత్యంత సహకారులు. జమియత్. ఉల్. ఉలేమా సంస్థగూడ దీక్షన్మనపక్షంబున నిల్చె. ఐన లీగునాయకుఁడు తమవశంబుననుంట నాంగ్లేయులు మనల నాడించుచుండిరని గ్రహించి నేనతనింజేరి. 112

తే. ఏల ముక్కలుసేసె దీ – నేల నిట్టు
బాటతప్పెనయా నీదు – బ్రహ్మరథము
అన్న! శంకాకలంకిత – మైన చరిత
సృష్టిసేఁతక మనమింత – కష్టపడుట. 113

కం. చీలిచి కూలిచి యేలుట
మేలను తెలవారి మాట – మేకొని నీవుం

గాలిడితివ యాబాటం
గాలమె మాపాల గుండె - గాలముగాఁగన్. 114

కం. జిన్నా! మున్నుడి నెన్నక
యిన్నివెతల్గూర్చుటేల - యేకీకృతికిం
దిన్నఁగరావా భారత
మన్నా! ఖండములుసేయ - నగునే నీకున్. 115

కం. ననుఁజీల్చి చీల్చుదేశం
బనఘా యని వేఁడుకొంటి - నావంతయుఁ ద
న్మనమున మార్పంగనమికి
ఘనచింతాజడధిమున్గి - కని యిట్లంటిన్. 116

చ. మతిగలవేని మద్ధితము - మస్తమునందధరించి సత్క్రియా
గతిగలిగించి కించిదవ - కాశ మధర్మమువొందకుండ భా
రత మిది రత్నగర్భయను - రావము నిస్తులరీతినిల్వ నం
స్తుతివడయం బ్రవర్తిలుము - శోభనముల్ నినుగూడివెల్గఁగా. 117

ఉ. మానుమపాయ మా దురభి - మానము మానకతోడివారలన్
మానవ సంఘసఖ్యలుగ - మన్ననసేయు ముదారబుద్ధితో
జ్ఞానముపెంచి మంచికొాక - స్థానమునీయుము దేశమెల్ల స
న్మానమొనర్చి నీపథము - నం జరియించు సుఖించు నిచ్చలున్. 118

కం. అని యింత మాటలాడిన
నను సుంతయు సరకుఁగొనఁడు - నానుడులెల్లన్
మనలాభంబునకనుకొని
తనమదికది హత్తకునికిఁ - దలనట్టుద్రిప్పున్. 119

వ. పీవిషధరపతియట్లు ప్రజాహితదృష్టిహేతులు నూవంగలను. తనయునికి మేల్గదిరివెల్గంగోరికొనుంగాని చిక్కులంటిక్కి క్రుంగనెవఁడే నమ్మతించునే. నీకనురక్తచ్ఛాయలనెఱింగి మెలంగవలసిన పనిమాకేమి. మేము మతైకధీరహితులమ. వదార్థరతులకివి యంతరాయముల యను. 120

(ద్వ్యర్థి)

తే. ఎదురుసేఁతయ గొప్పని - యెన్నిపన్ని
మతవిరోధమ్ము ప్రేచెడి - మానిసి పగ

కోమలరసోక్తిఁ బాయునే - పాముకాటు
చీరచెఱఁగునఁ దుడిచిన - సేగి చెడున. 121

తే. ఐకమత్యము తొలఁగించు - నాపదలని
యంద్రఁడు సుజ్ఞాను లదియుట - సనువుపడదె
యెంత చెప్పిన నతఁడు ర - వ్వంత వినఁడు
బధిరశంఖారవం బను - భంగిఁ దోఁచు. 122

తే. జాతిమతకులాచారవై - షమ్య మున్న
దేశమెన్నఁడుఁ బ్రగతిమై - దీప్తిఁ గనదు
అవమున గచ్చకాయవే - యకుము మమ్ము
నమ్మి రమ్మన నతనికి - నాటదెడఁద. 123

వ. మనమెంత స్వచ్ఛభావనావసనాలంకృతులమై నిల్చినను మతైక దృష్టింబరికించు నాతని హృదయచ్ఛాయాగ్రాహక యంత్రాంతర్గతకాచ ఫలకమున నస్వచ్ఛముగఁ వ్యత్యస్థముగ బ్రతిబింబించు చున్నారము. నిర్మాణవిచ్ఛిన్న కార్యద్వయ మేకకాలమందజీవులం జరుగుచున్నట్లు స్వాతంత్ర్యసమర సన్నాహకృత్యములు తద్విరోధకార్యము లొక్కట నడచుచుంట విచారకరము. ఘనరూపస్థితాహారము భూజములు గ్రహింపఁజాలనితెఱంగున విశ్వజనీన సత్యసాక్షాత్కృతాగరిమను సంకుచిత దృష్టిగలవారందుకొనఁజాలరు. అయ్యు దుదారచరితులకుమాత్ర మవగతమగు. 124

కం. ఊరున్నయునికి గోడల
తీరే బోధింపఁగలదు - దివ్యతరముగా
నేరీతి మనము దెలిపిన
మాఱఁడు మనతోడఁగలసి - మననొల్లఁడుగా. 125

ఉ. దేశచరిత్ర నెంచుకొని - దేవునిపై భరముంచి దాస్యపుం
బాశముద్రెంచి సర్వపరి - పాలనభారముఁ దానపూన నా
వేశమునూప మద్దికడు - వేఁగనుకొన్న వలంతినిల్చి తా
నీశుతెఱంగ యీ ప్రజల - నేలు ననన్వినఁడెంతపంత మో. 126

తే. మతముపేర జిన్నా లోన - మండిమండి
కొనకుఁ గసివోక మసిఁబూసి - కొనఁదలంచి

యెన్నో మెలికలఁదిరుగుచుఁ - దెన్నుదప్పి
చిక్కుకొన సిద్ధపడె నేమి —చేయఁగలము? 127

కం. అతఁడు నూపెడి హేతులు
హేతులు మతయుద్ధమునకు - నీర్ష్యాగ్నిచల
ద్ధేతులు సమరససస్యపుఁ
గోతలు గోతులు మదాంధ - కుంజరతతికిన్. 128

ఆ.వె. ఈఁతగాయ మనకు - నీతగాఁ డనుకొనఁ
గూడ వచ్చి వచ్చి - కూఁతవేసె
నట్టె పొంచిపొంచి - నట్టేట పుట్టిముం
చెడితలంపు జనత - చెట్టపెంపు. 129

ఉ. పాయఁగఁ జూచుఁగాని సదు - పాయము సెప్పఁడు సర్వమానవ
ధ్యేయము సౌఖ్యజీవనము - దీనిఁదలంచి సమైక్యబుద్ధిమై
న్యాయముగాఁ జరింతుమన - నమ్మఁడు చీదినసూడు ముక్కుతోఁ
జేయునదేమి తోఁపదిఁకఁ - జెడ్డయొ మంచియొ మీరతెల్పుఁడీ. 130

తే. ఎత్తులెత్తుచుఁ గుత్తుక - లుత్తరించు
గడ్డు గతుల ముస్లిముఁలీగు - జడ్డిగమున
మిడుతపోటయ్యెఁ గృషియెంతొ - మడతపడియె
నెట్లు స్వాతంత్ర్యసస్య మీ - యిలఫలించు. 131

తే. అన నజాదనుఁ దద్విధ - మరయ మున్న
యుద్ధులో 'హంసపాదు' నా - నాత్మఁదోఁచె
వాని వలచినయటు లీగు - వంతపాడ
వెంగలికిఁ దోడు వేల్పులన్ - భంగిఁ దనరె. 132

తే. అర్హతానర్హతల మాట - యనక వినక
యుల్లమల్లాడి వెల్లనై - యొల్లఁబోవ
మల్లగుల్లాలు పెట్టిన - మాత్ర చెడున
లాఁపరావెట్టి వెల్లువ - నాపఁగలఁడ? 133

తే. జాతిభేదంబు లించుక - సడలఁ దగని
యాసవిడి యాసుదోసము - లదిమి చిదిమి

ప్రజలికఁ గరిష్ఠసౌఖ్యము - పడయఁగోరి
కలసివచ్చిన నెంతటి – ఘనతగలుగు. 134

తే. యోగియో విప్రయోగియో – బాగుగఁ గని
పొగడఁటో లేక తెగడుటో – పోలుఁగాని
యడుగులో నడ్డువేయున - ట్లాన సూపి
మొండికాలడ్డుపెట్టుట - మొఱకుఁదనము. 135

తే. భయభరమ్మునఁ గ్రుంగిన – వారి మరల
దుఃఖకరమైన వార్తలఁ - ద్రోయునట్లు
దాస్య గాఢాంధకారానఁ దగిలిపొగుల
మతవిరోధాగ్నిఁ జిమ్ము - టేగతికిఁ జెపుడ 136

కం. మతమన నాత్మజ్ఞానము
మతమనఁగా సత్యధర్మ – మహిమాన్విత మా
గతిఁజూపక మతిఁ జెఱచెడి
మతము మతంబగునె బుద్ధి – మంతులరయుఁడా. 137

తే. మతవిరోధమ్ము మనజన – గతినిరోధ
మని గ్రహింపక చెప్పిన – వినక దానిఁ
బ్రేవఁ గల రూపు రూపటి – బెట్టెదముగ
మృత్యుదేవత కోటలు – మోయము టరుదె ? 138

ఉ. శిష్టజనో త్కిగాదని ని – షిద్ధగతి న్నిజలాభదృష్టిమై
నష్టము భ్రష్టము నవి - నాశము నెన్నక యిష్టచేష్టలం
దుష్టిగలాని నేతయని - తోడ్పడఁ గీడ్పడదే జగంబొగిం
గష్టములన్ని యొక్కతటి - గా గుమిగూడి పెనంగఁ జూడవే. 139

కం. ఏకట్టియు నిప్పండిన
నాకట్టియకాలుగాని - యన్యమెరియదన్
లోకో క్తిం బాటింపఁడు
సాఁకఁ దమాటుకుల దేశ - శాంతి దలఁచుచున్. 140

కం. రణమా మతక్షేమము కా
రణమా యేమెఱుఁగసట్టి - ప్రజకియ్యది మా

రణమా ఘాతాలకుఁ బా
రణమా గుణమా స్వతంత్ర - రాజ్యార్థులకున్. 141

కం. భిన్నత నేకత యేకత
భిన్నత వెలుఁగొందుచుంట - విశ్వవిలాసం
బన్నది పరిశోధనచేఁ
గన్నది యింతెఱిఁగి హద్దు - కడవరు పెద్దల్. 142

కం. హిందూముస్లిము లైక్యత
నొందరయే స్వేచ్ఛవచ్చి - యును లాభములే
దుందురు పడుగుంబేకగ
నెందే దేశమునఁ జీల్చి - యెట్టిఁకఁ జెపుఁడా! 143

తే. మంచినెంచుచు బ్రొక్కిబ్రొ - క్కించుకొనుము
పిలిచి పిలిపించుకొనుమని - పెద్ద లనరె
యట్టి సంస్కృతి యందఱు - కెట్టు పుట్టుఁ
బుట్టువుందొట్టి యేర్పడఁ - బోలుననుచు. 144

వ. పురోగామిగాఁదగినవాఁడు పురోభాగియగుట బ్రమని విచారమ్ము వెలి
వుచ్చ ఖానుసాలోచనాదృక్కులనాలోకించి 145

కం. చట్టులవలె మెలఁగుచు యశ
మెట్టొవడసి కీడుసేయ - నెంతురు భళిరా!
చెట్టెక్కి యనువుసిక్కఁగ
గట్టిగ నిచ్చెనను దన్ను - ఘనులుందురుగా. 146

కం. పెక్కుర క్షేమంబునకై
యొక్కని విడనాడు టెంతొ - యుచితమని ప్రసిశో
ధాక్కులు జ్ఞానులు వల్కరి
నిక్కువమని యట్టొర్ప - నీతి నిజమనన్. 147

వ. వంగకేసరి యజాదు ఖాను పలుకుల కలరికస్తూరీ వల్లభుంగని. 148

మ. తవులంజూతువు సత్యధర్మముల నం - తర్వ్యాప్తి సూచించున
ట్లెవరీ రేడుజగాలనీడవును నీ - కీలోకవుంబోక్షకడే

యవలీలం దల్రక్రిందుసేయఁగలవ - య్యా యిమ్మహాసంస్థకుం
జవముం జీవముపోసితీవని నమ - స్కారమ్ము లర్పించెదన్. 149

కం. ఉక్తులు యుక్తులతోడి చ
లోక్తులుగా రక్తిగలుగ - నూహించి యనన్
శక్తుఁడవు దైవభక్తిన్
ముక్తిన్ లోఁగొన్న దివ్య - మునివి మహాత్మా! 150

తే. జీవితంబెల్ల నీగతిఁ - జివుకుచుండ
నెంతకాలము ప్రజలింత - శాంతినుంద్రు
సభ్యమానవజాతిలో - స్థానమేది
చావు మేలని యనరె నీ - చమునకంటె. 151

ఉ. ఇల్లరికంపుఁ బెండ్లికొడు - కెట్టులొ యట్టుల మెక్కుచున్న యీ
తెల్లదొర ల్దొలంగుఁడనఁ - దేల్తురె మెత్తనిపల్కుతోఁ గడుం
దెల్లమ చెల్లదంచది మ - దింగమనించియుఁ దెన్నుమార్చుకో
నొల్ల విదేమిచిత్ర మిఁక - నొడ్డకుఁ జిక్కనిబాట సిక్కునే. 152

తే. నీటిలో నడ్డుజాడను - నిశ్చయించు
నేర్పరివి నీకుయుక్తులు - నేర్పవలెన
నగవు నగగాఁగఁ బల్కుదు - సొగసుఁ బల్కు
పల్కె పులకండముల వల్కు - లొల్కినట్లు. 153

మ. నెఱకుల్నాటఁగనాడి వేఁడిన భవ - న్నీతుల్మహానిష్ఫలం
గటికన్నెట్టినయట్లు నెట్టి రిఁక ఖడ్గ - క్రౌర్య సంగ్రామపుం
గఱకుంజూపక వెచ్చనెత్తురులు చి - క్కంబాఱకే చిక్కునా
చెఱకా బెల్లము నిమ్మటన్న నదినీ - చేఁబెట్టునా బెల్లమున్. 154

ఉ. ఈవిఁక నిట్టులాడ మన - కెన్నటికైన స్వరాజ్యమిత్తురా
పోవఁగఁ జూతురా భరత - భూమిఁ ద్యజించి దొరల్ తమంతతా
రీవిధి నమ్మ యయ్యయని - యాచన సేయుట రాచకర్దమా
చావక నోవకబ్బునొకొ - సత్ఫలము ల్భువన ప్రసిద్ధముల్. 155

ఆ.వె. " కోరమీసలు మణి - భూరికిరీటముల్
భరత నృపులకున్న - ఫలమదేమి?

సర్వ శక్తి సహిత – సామ్రాజ్యశాసన
మంత్ర రుద్ధ ఫణుల – మాడ్కినుంద్రు. 156

ఆ.వె. బాహుపురులు సరులు – బారెడు కత్తులు
వరలనేమి తెల్ల – దొరల చేతి
కీలుబొమ్మ లగుట – కేవలమొకరీతిఁ
బగటివేసగాండ్ర – పగిదినుంద్రు." 157

వ. అని స్వదేశసంస్థానాధీశులంగూర్చి కాశీకాంగ్రెసుమహాసదస్సున మీరు సెప్పిన వాక్కులు దిగ్దిదిక్కుల భారతమున నింకను బ్రతిధ్వనించు చున్నవి. 158

ఉ. ఏతరు లేతఋల్లమకు – నింపవొ యప్పుడ స్రగ్గిమొగ్గి యె
ప్డాతతసానుకూలసమ – యంబగు నష్టవకాశవాదులై
గోతులుదీఁత స త్తె మను – కూలగతుల్గనుదాఁక జంతువుల్
శీతలమండలానఁ గడు – సీతున జీవసమాధినుండవే. 159

తే. తేలుకొండెకుఁ జీవఋఁబూఁ – దేనెయున్నె
సానికుఁ డెఋంగునే దయా – సాగరంబు
బయలిమేడల ఫలితంబు – వడయఁగలమె
పిల్లిశాపంబులకు నుట్టి – ద్రెళ్ళిపడునె. 160

తే. అఖిల భారత రాజ్య సిం – హాసనంబ
యడిగి యదిపొందఁజాలక – యలఁతి పదవు
లిడుఁడనుట యోర నూకల – కేడ్చి పిదపఁ
దవిటికి విచారపడినట్లు – తనరు బ్రదుకు. 161

తే. చక్క విసిరినయమ్మకు – బొక్కినదియ
దక్కుదల యన్న భంగిగఁ – దనిసనుదమ
చిన్నపెత్తనములఁ గార్య – సిద్ధి సున్న
వణిగయెంతైన సమమౌనె – పంటతోడ. 162

కం. పాటింతుము మీమాటలు
దాఁటింతువె దాస్యకంధి – దాంతుఁడవై నా

నోటికిఁ దాళమువేయుదె
పోటరులదిగాక పుడమి – మునులదె చెప్పుమా. 163

తే. పండిత కవీంద్రకృతహృద్య – పద్యకావ్య
బోధనమ్మున వ్యాకృతి – బోధసేయ
కుంటువడు రసంబటు నీవు – కొనరితెల్పు
శాంతవాక్కుల విప్లవ – జ్వాల లడఁగు. 164

తే. అవులించిన బ్రేవుల – నట్టెలెక్క
పెట్టఁగల దిట్టలెందఱో – మట్టుపెట్టఁ
బడఁగఁ ద్వచ్ఛాంతిసూత్ర మె – ట్భంగినిల్చు
క్షాత్రతేజంబు భరతోర్వి – సమయ దనఘ! 165

తే. ఉత్తమ క్షత్త్ర ధర్మంబ – యొప్పు దీన
హీనయాచన మేలన – నేల మనల
మానవులమాడ్కిఁ జూడని – మనుజపతుల
మనసు మాటల మాఱునన్ – మాట నమ్మ. 166

చ. గొరగొర యెంతగ్రొవ్వినను – గొఱ్ఱెకు బెత్తెఁడె తోఁకయన్క్రియం
దొరలమన స్సుదారగతిఁ – దోఁపదు భోగములెన్ని కల్గినన్
మెఱసెడిదంత మేల్మియని – మెచ్చుటఁ జిక్కులువచ్చె నింతకుం
గరుణకుదూరమై కరుడు – గట్టిన స్వార్థము త్రుప్పుపట్టునే. 167

ఆ.వె. సిరులఁ దూఁగఁ దగిన – సింహాసనంబిక
యేమొ పదవు లీయ – నేమి ఫలము
ఓడవర్తకమున – నొదవిన నష్టంబు
వడ్లదంపకమునఁ – బాయఁగలదె. 168

తే. ఎల్లిదముగ మనలఁ గను – తెల్లదొరలు
మెత్తమెత్తని పల్కులఁ – జిత్తవృత్తి
మాఱి రాజ్యమునిత్తురే – మంత్రములకుఁ
జింతకాయలు రాలునే – చెప్పకుఁడిఁక 169

తే. మృదుమధురముగఁ బ్రార్థింప – నిదురబోవు
వాని కాళ్ళకు మ్రొక్కిన – భంగినుండె

వారి ప్రత్యుత్తరము చెవిఁ బడుటయన్న
నగ్నిమండలపుంబుర్వు - నంటినట్లు. 170

ఆ.వె. మాటపోటుగాదు - మల్లుపోరనఁజెల్లు
రాజకీయమందు - రక్తపాత
మింతర్యైన లేక - యెట్లు గమ్యముఁ జేరఁ
గలమొ తెలియఁజాలఁ - గా మహాత్మ ! 171

వ. అనవుడు యువజనసంఘోద్ధరణరంగమున వంగకేసరితోఁ జేయి కలిపి కృషిసల్పుచున్న జవహరులా లిప్పుడీక్లిష్టసమస్య నెట్లు పరిష్కరింపంజూచునని గాంధీయన నాతండొక్క క్షణమాగి యిట్లను : ఒకదెస నన్యోన్యసౌజన్యశూన్యముగ జిన్నా సార్వభౌము చంకంజేరి యపూర్వాటంక కంటకావృతమొనరింప వేఱొకయిక్క సుభాసచంద్రుఁడు సామ్రాజ్యముతో సాయుధసంగ్రామ నిర్వహణమే కర్తవ్యమ్మను. కత్తి నాగలి సందున నలఁగుచున్నట్లున్నది. జనం బోసనినట్లు. 172

ఆ.వె. రాజకీయ మన్న - రమణీయ తరువుల
పండ్లతోఁట గాదు - ముండ్లబాట
కాన దేశ కాల - కరణీయములు గని
యడుగులిడిన శుభము - లందఁగలము. 173

తే. వ్యాకృతిజ్ఞానశూన్యుప్ర - బంధమందుఁ
గుప్పతిప్పలుగానుండు - తప్పులట్లు
ధర్మసూక్ష్మార్థమెఱుఁగని - మర్మమతుల
చేఁత దొసఁగులు పొసఁగుటఁ - జెట్టవుట్టు. 174

కం. ఎమ్ముల బొమ్మలఁ గని హృద
యమ్ములు సుంతైనఁ గరఁగ - వాంగ్లేయులకుం
గమ్మని తిండిందిని మన
సొమ్మెల్లం దోఁచుకొనఁగ - జూతురు సతముఁ. 175

ఉ. ఏయెడ వారివస్తుతతి - కెత్తునకెత్తుగఁ బుత్తడిత్తురో
యాయెడకడ్డువెట్టి జయ - మందిరి వాహ్వారె! "సాహసేనల
క్ష్మి" యనుసూక్తి సూటివడెఁ - జిక్కులఁ జిక్కియుఁ జెక్కుచోకడల్
పోయెడి భారతీయులకు - మోక్షము గల్గునె దీక్షవెల్గునే. 176

ఉ. అమ్మొయిఁ దొల్లి సంపదల - కాస్పదమై విలసిల్లినట్టి రా
జ్యమ్ము పరార్ధవంచకసు - ఖాకరమయ్యె విచిత్రదైవయో
గమ్మున నీటఁదేలి సిత - కంజము వింజమునాగ నాఁగ భా
గ్యమ్ములు బోగ్యమౌగతి న - గస్త్యుఁడు పచ్చిన మార్గమిచ్చునా?

వ. అని చింతించుచుండ మహాత్ముండు లభించె. దుష్కరంకిం మహాత్మ నామ్మనిరిగదా పెద్దలు. ఇద్దేశోద్ధారకు మనోవికాసమహిమ యనన్యసామాన్యము. శ్వేతకాంతి సప్తవర్ణమిశ్రమమైనరీతి నిష్పాక్షిక నిశ్చల నిర్మల హృదయము సర్వమతసార సమ్మేళనము. కావున నిప్పట్టున నన్నింటి కితండవలంతి. 178

చ. నవయుగ ధర్మసూత్రఘట - నం దగవాగనుశాసనుండుగా
భువిభవజీవిరక్షణవి - భూతిమతిం బురుషోత్తముండుగా
దివిగతు లీ మహేశుఁడుగ - దివ్యనుతింగను లోకబాంధవో
త్సవకరభాగ్విభాప్తి జడ - జాతవికాసము వేగఁగల్గదే. 179

(ధ్వని)

తే. ఐకమత్యము లేకున్న - హైందవమునఁ
గష్టములెగాని సుఖములు - గలుగఁ బోవ
పారభారమైన పరాధి - కారదాస్య
కంధి దాఁట మహాత్ముఁడే - కర్ణధారి. 180

తే. ప్రళయకాలాగ్నికీలలఁ - బ్రతిఘటించి
యమృతము సృజింపఁజాలు పు - ణ్యాత్ముఁడితఁడు
దేశ మీదేశికుని యాన - దిద్దఁ బడిన
మూఁడుపూలాఱుకాయలై - ముద్దుగుల్కు. 181

వ. క్షమావీరన్యభూషణమ్మనిరి విద్వద్వరేణ్యులు. దౌర్జన్యరాహిత్య సిద్ధాంతము మౌనులకొఱకే యేర్పడలేదు. దానింగనిపెట్టిన పరిణత మనస్కులు న్యూటనుకంటె మేధావులు. వెల్లింగ్టన్‌కంటె సమరవీరులు. సావిద్యాయావిముక్తయేయనిరి జ్ఞానులు. మహాత్ముఁడు ఘనుఁడు. లోక కళ్యాణ స్వాతంత్ర్య సస్యములు ఫలింప మాతృభూమికి సత్యాహింసామృతమ్ముల వర్షించుచు నిరమ్మదమ్మును సామ్రాజ్యవాదాహంతకుం జవి చూపు. భారమితివలన భవిష్యద్వర్ష మహాచక్ర పాతాదులందెలిసికొన్న

విధమ్మునఁ బరిణతమైన యాత్మజ్ఞానమ్ముచే రాఁబోవు కష్టసుఖముల గమనించి వర్తించు. 182

తే. నవయుగప్రవర్తయగు నీ - న్యాయవాది
యేది సెప్పిన నదియపో - వేదమగును
జల్లి పొల్లుల నొల్లని - యుల్లమగుట
నాఁచితూఁచియ మాటాడు - నమృతమొలుక. 183

తే. సత్యదాసుఁ డహింసాప్ర - శాంతదాసుఁ
డఖిల మానవలోక క - ల్యాణదాసుఁ
డైహికాముష్మికాతీతుఁ - డైన దేవ
దాసుఁ డీఋషి మోహన - దాసుగాఁడు. 184

వ. నిరుపాధికస్వచ్ఛవస్తు వనుషంగదోషమున సోపాధికముకాఁజాలనట్లన్యుల ప్రేరణ మహాత్ముల మనమ్ము మాఱదు. మదాంధాంగ్ల సామ్రాజ్యాధికార పరిపంధిగంధనిర్గంధనుఁడు గాంధి. 185

తే. పుష్కరమ్మున కొకసారి - పూలు పూయు
మంజుల మసారసారని - కుంజపుంజ
రంజితంబన వెల్గుకు - రంజిమొక్క
కరణిఁ గారణజన్ములి - ద్ధర జనింత్రు. 186

కం. ధీశరధి గాంధి మైథిలి
దాశరధింబోలె నబ్ధి - దాఁటిన ప్రభుతా
శ్రీ శస్త్రాదులు లేకయ
నాశము గోరకయ తెచ్చి - నవయుగపితయా. 187

వ. అన్యుఁడేతత్క్రియానిర్ణయనిర్వాహకుండగుట సముత్థానజ్ఞానశూన్యుఁడౌషధమ్మువాడినట్లు. మానవునకు హృదయమువలె జలాంతర్గామికిఁ బెరిస్కోపువలె జాతీయమహాసభకు మహాత్మువల్కు ముఖ్యాతిముఖ్యము.

తే. వర్ణ విద్వేష రోగ ని - వారణౌష
ధమ్ముఁ గనిపెట్టఁగల పుణ్యు - తముఁ డితండ
కర్షకాకర్షక సకాల - వర్ష మట్లు
తత్ప్రబోధమ నూత్నమై - తన్య మిచ్చు. 189

కం. శిశిరానంతర మామని
నిశివెన్కం బగలు వచ్చు - నియమముగ మహా
దశచెఱచిన దాస్యము సన
భృశముగ స్వాతంత్ర్యసౌఖ్య - మెటు రాకుండుఁ. 190

కం. జగడాలుగుల్కు పేరున
మగటాపతకంబువోలె - మన నాయకులం
దగవెల్గు గాంధి మిన్కులు
సిగపూలటు దాల్పకుంద్రె - శిరమున సుజనుల్. 191

వ. విశ్వమునఁ దొలుదొల్త భూతదయాజ్యోతిని దిశదిశల వెలిఁగించి యాచరించినవాఁడు బుద్ధభగవానుఁడు. 192

చ. అతని యహింసనందుకొని - యాత్మపరీక్షఁ జరించుచున్నస
న్నుతుఁడు మహాత్ముఁ డీతని మ - నోహరవాక్సుధఁ గ్రోలి సజ్జనుల్
ధృతిమెయి ధర్మదీక్షఁ జను-దెంత్రు సబర్మతి కొల్వు సేఁతకై
యతుకుల బొంతయైన మతి - కందునె యిందలిపండు నిండుగా. 193

చ. సరసులజీవనమ్ము బుధ - శర్మదకల్పము రాజహంస సు
స్థిరగత మానసమ్ము కవి - దివ్యరసాశ్రయ మన్యలోకదృక్
స్ఫురణము సర్వపుణ్యజన - పూజ్యమనోహర మాత్మఖాక్కళో
ద్ధరణము తద్దయామృతము - దానిమహత్తు జగత్తెఱుంగునే. 194
(ద్వ్యర్థి)

తే. తుట్టతుదిదాక పట్టిన - పట్టు విడఁడు
మిత్రు శత్రు సమతఁగను - మేళ్ళఁగీళ్ళ
నాంగికవికారమున కిసు - మంతయైనఁ
దావొసంగఁడ యదియెంత - తాల్మికల్మి. 195

వ. భూతచరితమంత్రజ్ఞులు ధీరహితులు మార్గవేదులు పరార్థరతులు తదంతరాయములఁ దెలియకుందురా. 196
(ద్వ్యర్థి)

సీ. పరమార్థమున కెప్డు - స్వార్థమ్ము బలివెట్టి
భీష్మప్రతిజ్ఞమై - వెలయు నితఁడు

కల్మిలేముల నొక్క - కంటఁగాంచుచు సత్య
నిష్ఠబద్ధుండరైు - నిలుచునితఁడు
అఖిలలోకైక సా - ఖ్యాద్వైతమతమున
శంకరుఁ దలపింపఁ - జాలునితఁడు
దేశకల్యాణ సం - దేశ శంఖారావ
మొనరింప విష్ణుఁడై - తనరునితఁడు

తే. రామరాజ్యముగాఁ బ్రజా - రాజ్య మలరఁ
బ్రమదమునఁ జూచు వేడ్కమై - రాజకీయ
సరస వాగ్వాద భారత - సమరమందుఁ
గృష్ణుఁ డనఁజెల్లు నితనికి - నెవ్వరీడు. 197

చ. అనయము సూక్తిరత్నముల - నారసి యార్యపథైకలోలుఁడై
మనమున ధర్మనిష్ఠగల - మాన్యుని డెందమునందుఁగాక నీ
చుని హృదయాంతరాళమున - శోభిలునే దయ తా బ్రమతంత్రిఁ దా
నెనసినఁగాక కొయ్య మెఱపెన్నడునేఁ బ్రవహింపఁజాలునే. 198

వ. లోకహితైషి ధర్మాభిలాషి మృదుభాషి సాహితీసంతోషి యాంధ్రూ సాంగ్లేయుఁడయ్యు నక్షీణనిష్పాక్షికదృష్టిన్సమీక్షించి నయానయాల విమర్శించి సత్యప్రదర్శన ప్రచారార్థియై "స్వాతంత్ర్యము - సత్వరావసర" మను తన గ్రంథమున భారతీయుల పరాభవము దాని నిర్మూలనమను విషయమ్ముల విస్పష్టముగ విశదీకరించుచు శాంతముతో స్వరాజ్యమును సాధించుటే హిందూదేశమునకత్యంత శ్రేయస్సని నిజాభిప్రాయమును వ్యక్తపఱచుట మనకెల్లరకుందెల్లమ. సూక్ష్మాతిసూక్ష్మవిమర్శనాత్మక విజ్ఞానఖనుల హితోక్తి యర్థరహితముగాదుగదా! 199

చ. అనయతమో ఒరినోర్చి బుధు - లాదర మేదురదృష్టిఁగొల్వఁ గొ
ల్వునఁ గళలీనురాజువలె - భూరి జయాంకము శంఖఘోషద స
ద్వినుతపతాక వీఁక విను - వీథివెలుంగ మహోత్సుకుఁడింపుమై
నెనయనరానివేడ్క నెవు - డెక్కనొ భారత సింహపీఠముఁ.200

వ. ప్రథమప్రపంచ సంగ్రామంబున నాంగ్లేయుల యనన్య సామాన్య నౌకాబలము మిత్రమండలి విజయమునకెట్లు కారణభూతమయ్యె నట్లు యీ సత్యాగ్రహ విధాత బుద్ధిబలము భావిభారత ఘనవిజయమునకు హేతువు

గాఁదగు. ఈనిష్కామకర్మయోగి జనతావ్యక్తవాంఛల వ్యక్తీకరించుట కేర్పడిన దివ్యమూర్తి గాఢాలోచనాప్రమితింబర ప్రభుత ననురాగపూరిత దౌర్జన్యరహితకృత్యతతిం బ్రతిఘటించు. హేతువాదములకుంగాక గుణ శీలములదెసకుములుసూపు. మతిరేవబలాద్గరీయసీయనువాక్కు నిక్కమ్మని నమ్ము. జాతీయోద్యమ జాతిరత్నమును సత్యాగ్రహసమరనికషమున శాణమిగులుకోణములుదీర్చి సహస్రోజ్జ్వల మెఱపిచ్చిన మహామణికారశిఖామణి మహాత్ముఁడు. ఇతండు దిద్దితీర్చిన సంస్థగాని దేశముగాని బుక్కపుష్టం బైన సౌగంధికంబుంబలె మనోనయనాహ్లాదకరమ్మగునని నమ్మిగయన సుభాసచంద్రుఁడు జవహరుంగని నీవును మహాత్మునివైపునకే మరలు చుంటివా? 201

కం. ఏ తిరుమంత్రము సెప్పెనొ
యీతీరునమాఱితీ వ - దేమి విచిత్రం
బాతామస మాదీమస
మీతరుణమునంద తగ్గు - టెంతయు సరుదౌ. 202

వ. వరికివాక దొరకుమూఁకయనిరిగాన మూఁకంజేపట్టిన నెట్టననెట్టి కార్య మ్మైన గట్టిగసాధింపనచ్చునని తలంచితిమిగదా. 203

కం. ఈక్షణమ యన్యపథగతి
కీక్షణమ మరల్చుకొంటు - యేలొకొ నెహ్రూ
దీక్షాదక్షుఁడవై నా
పక్షంబున నిల్తువంచు - భావించితినే. 204

కం. జోకొట్టెడి వాక్కులనిఁక
నూఁకొట్టను నెట్టులన్న - నోర్తు నహింసా
ప్రాకారము పడఁగొట్టిక
యేక్రియ మనరాజ్యలక్ష్మి - యివుడు లభించుఁ. 205

కం. అడుసున గ్రుచ్చిన కంబము
కడుబలియునివైపు తిరుగుఁ - గాదనఁ గలమా
యెడలటుగావున వలఁతియె
పడయుందోడ్పాటు వాక్పౌ - భావము కలిమిఁ. 206

కం. డస్సిన( దెస్సిన( బ్రజల న
మస్సులు వాంఛింత్రుగాని – మన్నన మనపై
నిస్సీమమైన ప్రేమం
బిస్సి యాసీమవారి – కేర్పడ( గలదే. 207

కం. ఘటనాఘటన సమర్థత
కిటుకులతో( గలిగియుంట( – గీడ్పడ దేశం
బిటు లేల(గలిగి రింకిట(
గుటిలగతుల్తొంటియట్ల - కొనసాగునొకో. 208

తే. ఔర సూదిదబ్బన మౌట – నరయ కిచట(
జేరనిచ్చుట మనకింత - చేటు వచ్చె(
గోటి చిఱుపేలెపుడు గ్రుక్కు - కొనుటకంటె
బొంత తగులబెట్టుట మేల – దెంతొ పీలు. 209

కం. అ(కట్టుకట్టు మనకిం
కేకరణి జయముగల్గు - నిత్తఱి శాంతం
బేక్రియ సాధకమగు మ
ద్యాకే బాకన్న దొరలు – పకపకనగరే. 210

మ. సకలోర్వీతలనాథు లాత్మబలతే – జస్స్ఫూర్తి పెంపొంద వా
రకయత్నించెడివేళ భారతము ని – ర్వ్యాపార నిర్వీర్యముల్
బ్రకటింపన్ఫలమేమి రాజ్యమునొ స్వా – రాజ్యంబునో పొంద(గా
మకదీక్షన్మఖదీక్షవోలె నడుప - న్మాన్యుల్లలంపం దగుణ్. 211

తే. ఈ(గపులి పులియాట యెం - దేని( గలదె
బ్రదుక వచ్చిన వారలు - ప్రభువులైరి
పచ్చపచ్చని పైరున( – జొచ్చిమేయు
నట్టి తుట్టున( బాఱునే – యిట్టివోలె. 212

కం. రాజ ప్రతినిధి కౌరవ
రా జల రాష్ట్రాధిపతులు – ప్రభు సోదరులే
యోజం గన నాంగ్లావని
రాజిలు భరతాధికారి – రాజ జనకుడే. 213

తే. మచ్చునాల్కవాని - మాట నమ్మినవాని
మచ్చుమాయగాని - మనఁడు హాయి
నట్టి యవసరమున - నాసలు చూపిన
దొరల విశ్వసింప - జరుగుఁ గీడు. 214

కం. తలతోఁ జేయుదునని పదిఁ
దలఁతో తలతోఁకలేని - తలఁపుల నెల్లన్
వలవని చేతకు లోఁగుట
యలవడునే క్షాత్రరతుల - కాపదలందున్. 215

కం. దూడన దత్తన పడదీ
వాడిన నుడి యింతమాత్ర - నగునే పసి నో
నాడితినని యనుకొస కే
జాడనపోఁదగునొ యట్ల - ననుటయె లెస్సా. 216

తే. ఇంట నీఁగల మ్రోఁతయు - నింటి బయటఁ
బల్లకీమ్రోఁత యన్నట్లు - భారతాంబ
బ్రదుకు దనరె నీఁకెట్టుల - భవ్య గతికి
దారితీయఁ గలారమో - దైవ మెఱుఁగు. 217

వ. పరప్రభుతపట్ల త్వదహింసాసిద్ధాంతప్రయోగ మెంతవఱకుఁ గృత కృత్యమగుచున్నది సోదాహరణముగ నిరూపింతు. ఎల్లరు నిష్పాక్షిక దృష్టింబరిశీలింపందగు. హస్తినగర మలహాబాదు జలియన్వాలాబాగు పాంచాలము రైబెరిల్లీ జయితోమ్మదపురి త్రిలింగ కాశ్యపుల సైనిక శాసన ముల నుక్కుచట్టముల నిరాయుధుల సాధుల సత్యధర్మార్థులఁ బ్రభుత్వ మెంత క్రూరతరముగ వధించినది లోకమెన్నండైన మఱచునా? కారా గార నియమమించుక యుల్లంఘింప నజదను షోడశవర్ష ప్రాయుంగట్టి వేసి ప్రతిఘాతమునకు మహాత్మాగాంధీకి జేయనుచుండ స్పృహదప్పి పడి పోవువఱకుఁ గొరడాలతోఁ గొట్టించినదీ యేల్బడి. సైమన్ సమాగమ సందర్భమునఁ దనయసమ్మతిం దెల్పెనని యాంగ్లేయ రక్షకభటుం డొక్కండు కఠినవేణుయష్టిం గక్షన్వక్షంబునఁగొట్టఁగదా పంజాబుకేసరి కొలఁదిదినంబులక దివంగతుడయ్యె. ప్రజాహితైకజీవి జితేంద్రా నధికారి కృత బాధలనుభవింపంజాలక యఱువదియొక్క దివసమ్ములుపవసించి

మరణించె. బందిగ్రమందిన భారతాంబారాధన తత్పరులసంఖ్య యేరుసెప్పఁ గలారు. దానిం దలంపగుండె బెండువడు. నెమిలి కంటనీరుగార్చ వేఁటకానికి ముద్దా? ఇది యిట్లుండ బంబయి దంతిపురి కేరళము బంగాళము నౌఖాళీ పంజాబు కాశ్మీరముల మతకలహ ప్రళయకాలకాలాహి కాటునకందిన వారెందఱో గణింపఁదరమా? ఒకనాఁడు కరిపురమున జేముమసీదు సభామంటపమెక్కి క్రీస్తు బుద్ధభగవానులవలె నహింసావాదియై హిందూముస్లిముల యైక్యతకద్భుత వాఙ్ముఖమొసంగిన మహర్షిస్వామి శ్రద్ధానందు నొక మతోన్మాది నిష్కారణముగ ఖడ్గప్రహారణంబున సంహరించిన సంగతి విశ్వవిదితముగదా! ఇంక మీచెప్పునహింస యెటు సాగుచున్నది. ధర్మమడఁగంగూల్తురే; కాల్తురే. ఝూన్సీరామరాజులేమైరి? భగత్సింగుశుకదేవుల దోషములు న్యాయసభానిర్ణీతములా? స్వరాజ్యము వచ్చినఁ గేవలమహింసానిష్ఠమై మనల మనము పాలించుకొనఁగలమా? అన్వీక్షకీ దండనీత్యాదులు వ్యర్థములా? సుశిక్షిత సేనలు రక్షకభటులు న్యాయమూర్తులు పాడిపట్టులులేక దుష్టశిక్ష శిష్టరక్షణ జరుగఁగలదా? "మార్దవేబహవోదోషాః" అంటవినమా? రాజ్యము వీరభోజ్యమను నుడి యర్థశూన్యమా. ఎన్నిదశాబ్దములనుండి మనయీ ప్రార్థన. పాలకుల గుండె కరఁగెనా? ఇఁక నీతెచ్చు స్వరాజ్యముంగనవలెనన్న మార్కండేయుంబలెఁ జిరాయువై యుండవలయుననఁ బ్రకాశము నిజనేత్ర ప్రకాశమతిశయింప సంగరసముత్సాహసాహస సంభరితుఁడైన బోసు వెన్నుచఱచి. 218

సీ. నిచ్చలండనుశక్తి – హెచ్చంగ సర్వోర్వి
స్వీయహస్తాబ్జసం – సిద్ధివాంఛ
నాంగ్లభూవనరాశి – నతికాంక్ష లంఘించి
యధికార సార్వభౌ – మాఖ్యజీవి
భరతపద్మాకర – భవ్యసిమంజేరి
సుకవివాగ్విముఖత – సూపి కెరలి
పంకమగ్న విలాస – బహాళచక్రాదిష్ఠ
కరకరహతి సదా – గ్రహనిరూఢి.

తే. సరససుమనోవ్యథా క్రియా – సక్తిఁ దనరెఁ
రబమనత్యాగ్రహోగ్రహా – గురలఁబట్టు

టో రణహరిదంత కాంతులఁ – బరపుటో యిఁకఁ
దేలపలయు స్వరాజ్యంబు – గ్రాలవలయు. 219

(ద్వ్యర్థి)

వ. వీరణ స్తంభంబు స్తంభంబుగ హర్మ్యంబునకుఁ బనికివచ్చునా? ఈ సత్యాగ్రహ సమరము సమరమని పేరెగాని సాయుధ సైనికబలోద్రిక్త సామ్రాజ్యశక్తిం బాతాళమునకుంద్రొక్క సమర్థతగల సాధనమగునా? యనెడి శంక కొందఱంబాధించుచున్నదనఁ బట్టాభియందుకొని యుక్తియుక్త వచశ్శ్రీ విలాసుండగు నాంధ్రకేసరి వంగకేసరివాక్యం గేవలము వ్రేత్తుగఁ ద్రోసివచ్చునా బుద్ధిబలంబున నాసియాఖండము యూరపునకుం దీసిపోదని వేల్పు పండితుఁ డూరక వాక్రుచ్చెనా "శామ్యేత్ప్రత్యపకారేణనోపకారేణ దుర్జనః" అను విషయమున సింహద్వయమేకోన్ముఖము కాకుండునా? యన రాజాజీ సంతసించి. 220

తే. ప్రకృతిమర్మంబు గమనించి – పలుక వశమె
యోగికైనను నమ్మహా – భోగికైన
నొకటి పురివిప్ప నరిపడ – కొకటి చనును
ఘనుఁడు సేసినతప్పేమి – కలదు సెపుఁడ. 221

వ. భిన్నరుచిర్హిలోకమన్న నుడిసార్థకము అగుంగాక. రాజకీయ రమణీ శిరోమణి నామూలచూడము చూడనివారిమాటం బాటించుట ప్రమాద హేతువు. కాలకర్మములు కలసిరావే నెంతటి వలంతులు వంతనొందక తప్పదు. పాకశాసనుఁడు నిషధగిరిఁ బ్రచ్ఛన్నవేషమునఁ జరించుట వామనావతారమున హరి బలినియాచించుట, రవి గోదేహంబున నజ్ఞాత వాసము సల్పుట పురాణప్రసిద్ధము. కావున "బలీయసీకేవలమీశ్వరేచ్ఛా" యనిరి బుధులు. సత్యాగ్రహులు ఋత్విజులుగ మహాత్ముఁడుపద్రష్టగబోస్ నెహ్రూ రాజేంద్రప్రసాద్ లాల్‌బహదూర జాద్ప్రభృతులు హోతలుగ సత్యాహింసలు స్రుక్స్రువములుగ సామ్రాజ్యవాద పశువిశసనము స్వాతంత్ర్యసమరయజ్ఞమున జరుగుట లెస్స. "పతనాంతాః సముచ్ఛ్రయాః" అను సూక్తి యేతత్పాలనమునకు వర్తింపనున్నది. మఱియు.

కం. తీరెఱిఁగి భారతీయులు
వాదల సైన్యములఁ జేర – వాంఛింపరయేఁ

గోఱలఁ బుచ్చిన యురగము
తీరగు నేల్బడి నిజంబు - తెలియం దగదే. 223

సీ. తుచ్ఛపు రాజ్యభోగముల - తోఁ దులదూఁగుచు మౌనిచంద్రులన్
మెచ్చక వారి ధర్మములు - మేలిగొనంబులు చిత్తవృత్తికిన్
నచ్చక రాక్షసాధములు - నాశమునొందరె యీ ప్రభుత్వముం
జచ్చు సబర్మతీఋషివ - చస్సుల నాత్మబలోగ్రశక్తులన్. 224

కం. నెఱనెత్తిఁగి చుట్టి కొట్టన్
సరియైన తుపాకులేవి - శస్త్రాస్త్రంబుల్
మఱలు విమానము లున్నవ
కొఱవిం దలగోకికొనుట - కూడదు మనకున్. 225

వ. కావున నీయుగ్రమార్గము సమగ్రముగ నుపసంహరించుకొంటలగ్గు. ఆంగ్లేయుల వాగ్దానము జలాక్షరన్యాయమట్లు కన్పట్టునంటనిక్కమ్ము. జనం బ్రథమాలీఢమధవః పిబంతికటు భేషజమ్మనినట్లు చివఱకు వీరికేగతి పట్టునో జగంబ గనం గలదు. నీసూచించిన ఝూన్సీరామరాజుకథలే యుద్ధమున కిదియదనుకాదని బోధించుచున్నవి. "అస్త్రమస్త్రేణ శామ్యతి" యనుట యిప్పట్టునమనయెడ సార్థకముకాదు. నహింసావిదధీతన క్రియామ్మను సూక్తియే మనముగ్రహింపఁ దగినదన బోసు క్షణమాగి. 226

కం. ఉక్తులు యుక్తులతోడి చ
లోక్తులుగా ర క్తిగలుగు - నూహించి యనన్
శక్తుఁడవు నిన్నుఁ గాదన
దిక్తతియం దెవ్వఁ డోపు - ధీరవరేణ్యా! 227

కం. ఈచేఁత చేతగాదన
నీచెప్పిన చొప్పు రాజ - నీతికిఁ దగవే
మాచేష్ట మాను మందువు
వాచా వైదగ్ధ్య మహిమ - వచ్చెనె స్వేచ్ఛల్. 228

కం. పడమటఁ బటేలు దూర్పునఁ
కడువడి నే నుత్తరమునఁ - గనలుచు నెహ్రూ
కడమదెస నీవు దృఢముగ
విడువక విప్లవము రేప - విజయము గల్గున్. 229

వ. సంచరచ్ఛవత్వంబునం బ్రవర్తిల్లుట మాకుంగానిపనియన నయ్యంగా రలరి విహాయసమున విహరింపంబోవు విహంగము స్వపక్షముల విదుల్చు కొన వానినుండి బలహీనమైన యీఁకలురాల శేషించినవి తద్వ్యోమగమున మునకుఁ దోడ్పడినట్లు త్యాగకృత్యంబునకుఁ గొంకునగ్గవారల సహాక రింత్రు. ఈ భరతఖండ మొక చిన్నదేశమునకులొంగి దాసోహమ్మనుట కరము విచారకరము. ఔనౌను. మేసత్తకూఁకునకు గడ్డము మీసలు వచ్చిన బాపయనక తప్పునా? సామ్రాజ్యవాదులారా, పరహింసాపరా యణులారా, గాంధీజీ నఖిల భారతజాతీయ మహాసంస్థ నెప్పుడో యొక ప్పుడు చండతరశాసనాఖిల ప్రళయాగ్ని నిశ్శేషముగ నాశనముచేయక తప్పదని దుశ్చింతమై భవదభ్యర్చనార్హ్వాతం బెప్పుపెరిఁగి వియచ్చరులనే లక్ష్యపెట్టినట్టు కనంబడు చర్చి లక్కటిక మొక్కింతయులేక నొక్కి వక్కాణించెనట. పంతంబున నది యెంతవఱకు సాధించునో చూతము.

ఉ. ఎన్నివిధాల సేవలకు - నే మనివేళలనొగ్గ నెగ్గుతే
నెన్నక యింతలో మఱతు - రే జగమయ్యది మెచ్చునొక్కొ ముం
దన్న యుదారవార్తతుల – నాచరణంబునఁ బెట్టుఁ డన్నచో
మిన్నక తప్పుకొండ్రె కడు - మీగడ త్రాఁగిన పిల్లికైవడిన్. 231

కం. ఆపదలో నున్నారని
మీపదములనమ్మి యంత - మేలొనరింపం
జూపుదురె కత్తి నిప్పుడు
పాపంబిది పాపుకొను ను - పాయము గలదే. 232

వ. దేశభక్తులారా, నయవినయాదులతో మనమెంత యంగలార్చిన వారి యుత్తమాంగంబున కెక్కునట్లు తోఁపదు. ఆ సంగ్రామ సమయం బున నెంతమంది పుణ్యస్త్రీలు భర్తృహీనలై యల్లాడిరో యెంతమంది పసిబిడ్డలు దండ్రులం గఱవుచేసికొని యలమటించిరో యెందఱు వృద్ధులు తమ పుత్రుల మరణవార్తలు విని కుప్పగూలిరో. ధనకనక వస్తువాహ నాదు లెన్ని తరలించుకొనిపోయిరో భారతదేశ మెన్ని కష్టనష్టములకు గుఱియయ్యెనో యించుక యోచించినవారు పాలకులంగలరా? కరుఁడు కట్టిన స్వార్థపరుం డొకం డొకానొకప్పుడు తనమూఁడికానిచోఁ గాశివఱకు దేకుదు ననెనట. పరుల కష్టములఁ బరిగణింపనివాని పలుకు లట్లుండు.

అతని సింహగర్జనల సరకుసేయని శరభరాజంబు లిటఁగలవని యెఱుంగడు. కాని యయ్యుత్పాదకములు దంష్ట్రికోత్పాటన దాస్యశృంఖలాదులఁ జిక్కి నవసిఁయుంటం గనులారఁ గంట నట్లుడరి నొడివె. 233

తే. ఆయుధంబులు మనకున్న - ననికి నిలువ
వానిబండార మదిబయ - ల్పడునుగాన
శాసనంబున బంధించి - చంపఁ దలఁచెఁ
బాపములకెల్ల వాఁడెగా - భైరవుండు. 234

ఉ. భాగము పంచి యిమ్మనఁగ - భారతయుద్ధముగల్గె నొక్కభూ
భాగమునంద యిప్పుడిది - భారతదేశము సర్వమేకమై
లోఁగి కృశించు ఘట్టమని - లో నరినెత్తుటఁ దోఁగకున్నచో
రాగలదే స్వరాజ్య మవు - రా పొడిమాటలఁ గోటచిక్కునే. 235

మ. చతురబ్ధ్యావృతసర్వభూతల లస - త్సామ్రాజ్యభోగైక సం
గత విత్తోద్ధతిఁ గుల్కువారిటుల చు - ల్కంజూచుటల్చిత్రమే
వితథంబయ్యె సమస్తయత్నతతి దో - ర్వీర్య క్రియాలోలతన్
వెతలంబావుకొనంగఁజెల్లునని హృ - ద్వీధిన్సదా యెంచెదన్. 236

ఉ. నావుడఁ నారసంబటుల - నాటిన మాటకు బోసుశిష్యులిం
దీవరవైరిచందమునఁ - దేజముఁ జిమ్మెడి మోముతో లస
ద్ధీవర! వీరలెవ్వు భవ - దీయ మహత్తర శక్తినెంచి మీ
త్రోవకు దోహదం బొనఁగఁ - దోడ్పడిరే యన శాస్త్రి యిట్లనున్.

తే. సమరమున నేలికలకింత - సాయపడుట
పామునకుఁ బాలుపోసిన - భంగియయ్యె
నేరఁబోతులు నీతికి - నిలుతురొక్కొ
పరనిపీడన మేరీతిఁ - బాయఁగలదొ. 238

వ. తన్ను మేపువానింగన్న వృషభంబు సముత్క్షిప్త వాలవిక్షేపంబున సంతసంబు వెళార్చినట్టు నాఁడింతంత యనరాని ప్రేముడిం గనఁబఱచి నేఁడు ముందున్న పల్కులం గాపాడుకొనుండనఁ దోఁకఁద్రొక్కిన త్రాచులం బలెఁ గన్నునిలేచి విసంబు గ్రక్కుచుఁ బడగవిప్పి యాడుచుండిరి. ఈ జాతీయమహాసభ యన వారికొక లెంకకూటువుగఁ దోఁచుచున్నది. 239

ఆ.వె. ఓడ నెక్కు దాక – యోడమల్లయ యని
బోడిమల్లయ యనె – యోడ దిగఁగఁ
దెల్లవారి మోస – మెల్లర కీనాఁడు
తెల్లమయ్యె నాఁడు – తెలియదయ్యె. 240

వ. పిండిబెల్లమిచ్చి పిన్నమ్మా ప్రసాద పన్నట్లున్నది మనపని. అంగిట బెల్ల మాత్మవిసమన్నట్లున్నది వారిపని. కానిండు. కాలము జరుగనిండు. అట్టు దినఁగనే కుట్టు పుట్టునా? అదృష్టము చెప్పిరాదు. దురదృష్టము చెప్పిపోదు. అధికారికిఁ జెవులుండును గాని కన్నులుండవుగదా. గతిచెడి నను మతిచెడరాదు. నీరు నిలిచియున్నంతవఱకు మీను మిట్టిపడు. అధి కారమున్నంతవఱకు నరుఁడదరిపడు. మానవుని గొప్పలన్ని గుప్పెడు మన్ను కాకతప్పదని యెఱుంగడు. 241

కం. గని గడ్డవంటికైతం
గని యుబ్బెడు నరసుభంగిఁ – గడుముదమెనఁగం
దనకుం గూర్చెడి దేశం
బని వచ్చిరి మెచ్చి రిచటి – యనుకూలతకుణ. 242

వ. దమన నీతికి సాధనములుగా నికృష్ట భావగర్భిత జాతివిచక్షణలు భారతమున నభివృద్ధి నెందుట విచారకరము. ఇఁకమహాత్ముఁడన్ననో.

ఉ. ధైర్యము లోనదాచి పర – దారుణ చర్యల నోర్చుచున్మ హా
హార్య మనోబలస్థితిఁ బ – రాధిపకోటికి గుండెగాలమై
కార్యకలాపముల్గురువు – కారణజన్ముఁ డనంగ గాంధియే
సూర్యుని దివ్వెపట్టుకొని – చూపుటయా నితనిన్నుతించుటల్. 244

వ. రాజకీయ ప్రపంచమున సమవిషమ వాతావరణ ఘట్టముల నలఁగుచు. 245

తే. ఇంగలంబులు గ్రక్కెడి – యెండవేళఁ
గుంభవృష్టిగ వర్షము – కురియువేళ
నొక్క పక్కిగ నోర్పుమై – నుండుకతన
గాంధి శాంతాన బుద్ధుఁడన్ – ఖ్యాతిగలిగె. 246

ఉ. తేజితధీసమన్వితుఁడు - దివ్యఋషి ప్రతిమానుఁ డార్తర
క్షాజితరామచంద్రుఁ డతి - శాంతవచస్స్వర్థచిత్తుఁ డద్భుతా
వ్యాజకృపాలవాలుఁడు శు - భంకరకార్యకలాకలాపి భూ
భ్రాజితనిర్జరోత్తముఁడు - వంద్యుఁడు మాకు మహాత్ముఁడెన్నఁగన్.

ఉ. తార్కికదృష్టి లౌకికము - ధర్మసమీక్ష యుదారలాభసం
పర్కవిశాలభావరతి - బంధురసూక్తి విచిత్రసృష్టి య
య్యర్కనిభప్రభాప్రతిభ - యార్యజన స్తవనీయపుణ్యభా
క్కర్కశవాగ్విసర్జనము - గాంధి మహోన్నతిఁ జాటుటెక్కముల్.

తే. రాజకీయాశ్వదేహ వి - రాజమాన
మగు దశధ్రువాల నెఱింగి - యంతరంబు
లరసి యాత్మమాహాత్మ్యంబు - నందమేళ
వించి యాడెడి పరమ వి - వేకి యితఁడ. 249

కం. కడలేని యెఱుక బలిమిం
దడయక నూత్నప్రయోగ - దక్షత కలిమిం
బుడమికి నుడిగ మొనర్చుచు
నొడుచును దాస్యాంధకార - ముష్ణకరుండై. 250

కం. నాయకులకు నాయకుఁడై
న్యాయాన్యాయంబు లెఱిఁగి - నటియించు మహా
నాయకుని త్రోవ త్రొక్కిన
వేయేల సుఖంబు జయము - వేగఁగలుగదే. 251

కం. శుష్కోక్తులఁగాక క్రియా
విష్కరణపరోపకార - విధిపథనిధియౌ
నిష్కామకర్మయోగికి
దుష్కరమగుపని యొకండు - దోఁచునె జగతిన్. 252

తే. పాలసంద్రము త్రచ్చఁగా - హాలహలము
పుట్టిగా నమృతంబంతఁ - బుట్టె నట్టె
కంటకాటవిదాఁటినఁ - గల్పఫలము
లందవచ్చు యశోరమఁ - బొందవచ్చు. 253

వ. ఏకార్థసముపేతులమైన మన మనేకానర్థ సముత్సుకులముకాకుంట యగ్గలికమైన లగ్గు. ప్రజాహిత జీవితమున సుపరిజ్ఞులగు స్పర్ధుల యధిక సంఖ్యాకుల యభీష్టమునకు వైయక్తికాభిప్రాయములొంగుట ధర్మువు. అద్యతనభావి సబర్మతీయోగి స్వాతంత్ర్యోత్సవసంధాయకుండుకాఁగలఁడు. మననుదుటనే ప్రొద్దుపొడువలేదు. బృహత్ఖండమైన యమెరికాసైత మొక ప్పుడు దాస్యబంధమునఁజిక్కి తల్లడిల్లలేదా ? ఎప్పుడెవ్వరికేగతిపట్టునో యెవ్వరూహింపఁగలరు? ఎల్లమానవులమన స్సొకరీతిగ నుండదుగదా. ఎడారిప్రదేశమున శీతోష్ణస్థితులు విపరీతమగు తెఱంగున దయారస శూన్యహృదయమ్మున మంచిచెడ్డలు మితిమించియుండు. ఆదర్శమాచార మైక్యమైన సామ్యముగరమ్యముగ గమ్యముంజేరఁగల్గు. గాంధీజీ నవ యుగసూత్ర నిర్మాత. పట్టాభిరాజాజీలు తత్సూత్ర వ్యాఖ్యానకర్తలని పల్కం బట్టాభి తదభిప్రాయమునకనుగుణముగ నిట్లను. వివిధ విషయ పరిజ్ఞానప్రదర్శిత తేజిత సత్యాస్త్రనిర్మాణమునకు వలయు ముడిసరకు బాస. ఆ భాష స్వచ్ఛముగనుండదే వస్తువు సర్వోత్కృష్టముగ నుండఁ జాలదనుట తత్కర్మమర్మజ్ఞులైన విద్వత్కవీంద్రబృందమునకుందెల్లము. సత్యాహింసనమ్ములమాహాత్మ్య ప్రత్యయమ్మున మానవకోటికి మానసిక పరివర్తనము జరుగనిదె మారణహోమములు మానవు. హూణ సామ్రా జ్యాధికారులు భారతీయుల జీవితముల నాటవస్తువులుగఁ జేసికొని యాడు కొనంజూతురనఁ బ్రభుతాదౌర్జన్య హింసాచర్యాచయమునకుం గుమిలి కరుణాతరంగితాంతరంగుండై కస్తురీవల్లభుండు సదస్సుంగని యీ దౌర తనము వినాశోన్ముఖకాలనయమునకుండు లక్షణములన్నియు ద్యోతక మగుచుంట నిక్కంబు. వ్యపగతాయుష్కుం డగవంకారుద్వేషించుఁగదా. పశుబల బుద్ధిబలదైవబలంబు లుత్తరోత్తరములు బలీయమ్ములని గర్వాంధు లెఱుంగరు గదా. దూడకుంగూడఁ బాల్విడక పిండుకొని పోఁజూచు గొల్లండ్రీ తెల్లవాండ్రు. కేశదుష్టంబైన రుచిరాన్నంబు కరణి వీరిసాయం వీఁక వర్జనీయంబన వంగకేసరి చిఱునవ్వుతోఁ దలపంకించి. 254

కం. నయవినయంబుల దేశపు
టయమిది యని పెక్కుసారు - లాడిన సేనా
వ్యయకర్తన మొల్లమి నం
శయమగు మనస్వేచ్ఛ నీఁగి - సామ్రాజ్యపరుల్. 255

ఉ. అబ్బురమైన పోషణపు – నందుచుఁ బొంగుచు నాంగ్లసైనికుల్
దెబ్బదివే లిటంగలరు – తీవిగ, నెందులకంచు వారలం
గొబ్బునఁ దీసివేయుఁడని – ఘోషిల సుంతయు లెక్కసేయరె
ట్లబ్బు స్వరాజ్యమింక జను – లందఱు ముజ్జలధిన్మునుంగఁగన్. 256

వ. రణపాలకుం బత్రాంచలమునుండి వేళ్ళుపుట్టినట్టు శ్వేతభూపునకు నెత్తిపై గొమ్ములు మొలచినవా? 257

చ. అజుఁడును వారిబుద్ధి నిసు – మంతయు మార్చఁగలాఁడెయంచు స
ద్వ్యజమన వింటిఁ గంటి నిఁక – దాంతిని శాంతిని నెట్టుచున్ రణ
ధ్వజమునునెత్తుచే పరమ – ధన్యత మాన్యత కాన భారత
ప్రజల పురోభివృద్ధికయి – ప్రాణమునైనను ధారవోసెదన్. 258

తే. కుట్టుసురు గల్గునందాక – ఘోర రణము
వలయునను బోసుపౌరుష – వాక్యతతికి
మేనుపులకింపఁ బెఱలకు – మ్రింగరాని
కబళముంబలె నాతండు – కానిపించె. 259

వ. భారతీయ సోదరులే ప్రభుత్వసేనలంజేరి నిర్దయంబంపులకంటెం బెంపుగ దేశోద్ధర్తలఁ బ్రజాసేవకుల ఘోరాతిఘోరముగ లఘునాళికల దగ్ధంబొనర్చుచుండ నాంగ్లాధికృతులది వినోదముగఁ జూతురన విషయ దుస్థితి నేమందు. స్వార్థమున కెట్టియసహ్య కృత్యమునేఁ జేఁతకు ముదమున ముందంజవేయువారు కొందఱుందురని రాజేంద్రప్రసాదన సరోజిని. 260

తే. పేసికకుఁ బెండ్లియాడంగఁ – బెద్దగాని
కూడువెట్టుట యవ్వాని – కులమెఱుంగ
దన్న సామెత దొరలకు – నతుకుఁగాన
నేటిపెత్తనమిది సీమ - కేగుఁడనుఁడు. 261

ఉ. వచ్చినకోలె వారు మన - వారిఁ దృణంబటు సూతురింతకున్
హెచ్చె దరిద్రభారమిటు – నేక్రియ దానిని బాపుకోఁదగున్
గ్రచ్చుఱ మూటముల్లెఁగొని – కంధులుదాఁటి దొరల్చనంగదా
యిచ్చటి సంపదల్చనక – యెల్లరకు న్సుఖమిచ్చు నిచ్చలున్. 26

వ. అనసింగు మనంబుపొంగఁ గొదమసింగంబు ఘంగిందోఁచి. 263

కం. రథిలేనిసారథియు సా
రథిశూన్యుండైన రథియు – రాణింతురె సా
రథిరథి తెగి పోటొగ్గినఁ
బ్రథితజయశ్రీని బొందు – భాగ్యముఁగనరే! 264

కం. ధీరత నడలఁగ మనమా
హారవిహారార్తి నడలి – యడఁగిన జాలిం
గోరిన సింహాసన మిడి
హారము వేయరు రణప్ర – హారము లేమిన్. 265

వ. ఏయాకురాలిన నీతాకురాలదన్న ట్టివ్వారు చివ్వకువెన్నాడిన బోసా
డఁడు. నావుడు పట్టాభి. 266

ఉ. సర్వము మత్కరస్థమని – చాటుచు మీనము దువ్వఁ జెల్లునే
గర్వము చేటుదెచ్చు నది – గానరుగా నరులెందుముందుగా
నౌర్వమహీనసత్త్వయుత – మయ్యు మహాబ్ధియడంగియుణ్ యశో
ధూర్వహమౌనటు ల్మణఁగి – తోఁచును భారతమాంగ్లపాలనన్.267

తే. చెడ్డచేనికి మూఁడుమం – చెలను పోల్కి
దశచెడినదాని రక్షకై – దారు లెన్నొ
కానిపించినఁ జివఱకు – గాంధిమాట
కంచుకోటని మనమెద – నెంచవలయు. 268

తే. ఉభయసంధ్యల సర్వేశు – నొనరఁగొల్చి
యాత్మబోధించు తెరువున – నరుగు నితఁడు
కుసుమకోమల మనసును – ఘోర కఠిన
శిలతెఱంగున నేటికిఁ – జేసికొనును. 269

ఉ. ఈతని పల్కినట్టు మన – మిప్పుడు వర్తిల శాంతిభద్రతా
నీతులు ఖ్యాతిగన్మనము – నిల్పుకొనంగలమంచు నాత్మ వి
ద్యోతితమయ్యె సాయుధ – రణోద్ధతి రేగినఁ బ్రాణహాని యిం
కీతఱిఁ జెప్పశక్యమగు – నే యరఁటాకును ముల్లుపోలికన్. 270

ఉ. చిత్తముమెత్తనౌట గుణ – సిద్ధి మహాత్ములు దీర్ఘదృష్టితో
నెత్తురుకూటి కానపడ – నేరరుగా పరమార్థచింతచే
విత్తిన ధర్మబీజములు – వృక్షములై సఫలంబులైనచో
మెత్తురు వారిమార్గమును – మేకొన మేలగు సర్వవేళ౯. 271

వ. అని పల్క బోసు. 272

కం. ఎడఁద సుడిగాలి రేగిన
నడపఁగ శక్యంబ బ్రహ్మ – కే నది ఫలముం
బడయక కడువడి విడుచున
తడయక మాబాట మేము – తరలుదు మనఁగ౯. 273

వ. పటేలు కొంచెముసేపు యోచించి సాయుధసమరమున జయము సాధ్యము కాదని శంకించి యువరక్తంబుగాన వంగకేసరి విజృంభించి గర్జించుచున్నదని గమనించి దూరదృష్టిని బాటించి దేశస్థితిని గుర్తించి బోసుంగని వీరశిఖామణీ! దేశభక్తాగ్రణీ విను. 274

ఉ. నిప్పులు మ్రింగుచు న్వెలికి – నీరముఁ జిమ్ముచునుంటి మంతెగా
కిప్పుడు తెల్లవాఁడు మన – కేలికయంటకు లజ్జఁగ్రుంగమే
యెప్పుడు వీడు వాఁడనుచు – ఘోర్షు న్వలతు౯ స్వరాజ్యముం
దప్పదురా రణంబనిన – ధైర్యబుద్ధి [illegible] బరిదూఁకి నిల్వనే. 275

కం. వడకుట తప్పను నెట్లని
యడిగిన నదియొక్క తప్పె – యౌ నని కినుకం
బెడచెవిని బెట్టు మననుడి
పెడదారులు వట్టు ప్రభుత – పెంకెమనసుతో. 276

కం. ప్రాణము లొడ్డియ మానము
మానక కాపాడుకొంట – మానవధర్మం
బీ నియమము పాటించుట
కే నిలిచితి మింతవట్టు – లీగతి ననఁగ౯. 277

సీ. ఎవని తండ్రి జవేరు – బవరాన ఝాన్సికిఁ
గుడిభుజంబుగ నిల్చి – పడసెఁ గీర్తి
నెవఁడు గీచిన గీటు – నెల్ల విద్యార్థులు
దాఁటక విజయానఁ – దగ వెలింగి

రెవఁ డెన్నికల గురు - హేళన చేసిన
వ్యక్తి నోడించి స - ద్భక్తిఁ జూపె
నెవఁడు న్యాయస్థాన - మెక్కిన ధర్మాధి
కారియుఁ గని గజ - గజ వడంకె

తే. నహమదాబాదు నగరాన - నంటువ్యాధి
మాన్ప నిల్లిల్లు దిరిగిన - మాన్యుఁ డెవ్వఁ
డచల ధైర్యండుగా ఖ్యాతి - నందె నెవ్వఁ
డట్టి సర్దార్పటేలు నే - ననుసరింతు. 278

తే. జనులు ఫాలాక్షునైనను - సరకుగొనని
పుడమిఁ గైరాప్రదేశానఁ - బుట్టినట్టి
జెట్టి వల్లభభాయి వ - చించు వాక్కు
నమృత తుల్యంబుగా నెంతు - నాదరింతు. 279

వ. అని శాస్త్రి యుగ్గడింప. 280

తే. వంగకేసరి దేహము - ప్రాంగఁ గాంచి
చిఱునగవు మోముదామరఁ - జెంగలింపఁ
గాలకాలుని బోలు వ - టేలసంగ
నుక్కు మానిసి యనుమాట - నిక్క మనియె. 281

వ. అమ్మాటవిని పటేలిట్లను. సోదరా తేజస్సాహసాదు లెన్నియున్న ధర్మజుని యాజ్ఞ తత్సోదరులకెట్లనుల్లంఘనీయమో మహాత్మునిమాట మాకట్లనుల్లంఘనీయ మగుట మచ్ఛౌర్యధైర్య పంచాస్యంబులు శృంఖలా బద్ధంబు లయ్యెనన. 282

ఉ. వాలువెలుంగుకూళ పడ - వాలు నెదుర్పఁగ రిక్తహస్తముల్
చాలునె కార్ముకాసిబల - జాలము సిద్ధమొనర్చుకొన్న యా
వాలకమెల్లఁ గాంచి తెల - వారలు బిచ్చుఱపిడ్గులైనచోఁ
గేల నమర్చుకోఁగలుగు - క్రీడి యెవండని కుంది రెందఱో. 283

వ. అత్తఱి క్షణకాలము మౌనముద్రవహించి తన దృఢసంకల్పమును మార్చుకొనం జాలక బోసుబాబు మరలనిట్లను. 284

కం. కులగిరులు గ్రుంగిపోయిన
జలనిధు లుప్పొంగి యాక - సము దాఁకిన నా
జలజాప్తుని వెలుఁ గుడిగినఁ
గలఁగను నావాక్కు రిత్త - కాఁదగ దెందున్. 285

తే. జలమునకంటె నిర్మల - జలదములేదు
శక్తులం దాత్మశక్తికి - సాటిలేదు
అన్న చాణక్య వాక్కు న - త్యఘనఋక్కు
తెలిసివర్తింప నతికెక్కు - ఫలముదక్కు. 286

చ. అతుకుల బొంతయట్టు ఖర - తావని నైక్యతలేమి లేమిచే
గతిచెడి రజ్జుబద్ధ హరి - గాఁ గ్రుధ గర్జిలుచుంటి మింతకుం
జతురత నింకనైన ఘన - సాహసచర్యల వైరినొంచి దు
ర్గతినెడఁబాసి వేగ నిజ - రాజ్యరమన్ సుఖియించు టొప్పదే. 287

తే. కురుహ మొకఘోర ఝంఝకుఁ - గూలునట్లు
తెల్లవారల యేల్బడి - డొల్లనడవఁ
గట్టె వంకర బ్రొయి దీర్చి - నట్టులగును
నంత శాంతికి నిలయమై - యలరు నాడు. 288

ఉ. ధర్మము ధర్మమంచు నల - ధర్మజురీతి వచింప నెప్పుడీ
కర్మమువాయు వాయుజుని - గట్టిని గాదని గెల్వఁజాలునే
ధర్మజుఁ డేటిమాట యిఁకఁ దప్పక - హింసలఁగాని తేలదీ
మర్మము నిర్మలత్వమునఁ - మానము ప్రాణము పోవనుండెడిన్.

వ. అన మహాత్ముం డిది యిట్లుండ జిన్నా ప్రథమ ప్రత్యర్థిగ మాఱుట విచారకరమన బోసుబాబు ముస్లిముల మేలుగోరిగదా ఖిలాపదుద్యమమున మన మనన్యసామాన్య కృషి సల్పితిమి. అదియుం జిన్నా మఱచుటత్యంతాశ్చర్యకరము. 290

ఉ. తాలిమిమీఱ మీరలిటు - ధర్మము లెన్ని వచించిన న్మదిం
జాలి జనింప దాతనికి - సర్వము శూన్యము యత్నమింక నా
వాలకమెల్లతెల్ల మొక భంగిగఁ బట్టువిడండు కీడనన్
ఫేలన నేమిలెక్క గుడి - మ్రింగెడివానికిఁ దల్పులడ్డమా. 291

వ. సామాజిక సుహృద్భావచందనమునకుం గొడ్డలి పెట్టగు మతకలహముల నేనాయకులు ప్రేపించినది యెవనియేనేతలు శోకించినది లోకమునకవశ్యజ్ఞాతవ్యము. పెద్దల హృదయములందెంత మతవిద్వేషదవాగ్ని ప్రజ్వలించుచుండెనో కవిజ్ఞానశూన్యులైన ప్రజలయెదల నదియింకెంత తీవ్రతరముగ నుండునో ముల్తాను కలహకలనటకరిగివచ్చిన రాజేంద్రప్రసాదునోట విననలతుమన నతండిట్లనె. తద్ఘోర మారణహోమ వృత్తాంతంబు చెవిసోకఁ గాంగ్రెసధ్యక్షుఁడు హకీమజమల్ ఖాన్, మాలవ్యా, జమ్నాలాల్, శ్రీప్రకాశము నేనటకరుగం బక్షద్వయంబు తీవ్రస్పర్థనుద్ఘాతలూగుచుండె. అపుడీయమానుషచర్యలకు హేతువేమని పృచ్ఛింప ముస్లిములతాజియా యూరేగింపు బయలుదేర హిందువులందెవ్వండో దాని మీఁదికి మట్టిగడ్డవిసరెనని తుఱకలన మేమేపాపమెఱుంగము, మాగృహమ్ములఁదోఁచుకొన ముస్లిము లంతకుముందె యత్నించుచుంటం దాజియా యొకవంకయని హిందువు లనిరి. మేమంత హృదయవిదారక ఘట్టములు జరిగినతావులకేగ నట హిందువులగేహంబులు కొన్ని పూర్తిగదోఁచుకొనఁ బడెం గొన్ని తగులఁబెట్టఁబడెం బురుషులు పెక్కురు వధింపఁబడ స్త్రీలు మాత్రమమిగిలి యల్లాడుచుండిరి. హైందవదేవాలయంబులు ధ్వంసము చేయంబడె. ఒక వనిత కన్నీరుమున్నీరుగా నేడ్చుచు గద్గదస్వరముతో ఱొమ్ము బాదుకొనుచు నమస్కరించుచుఁ దనయిల్లంతయు దోఁచుకొని తగులఁబెట్టి యప్పటికిందృప్తిదీఱక తానల్లారుముద్దుగఁ బెంచుకొనుచున్న చిలుకతోఁగూడ పంజరమును మంటలోఁబడవేసిరని చెప్పనగ్గృహదహన భస్మంబున నినుపచువ్వలపంజరము గనంబడుచుండె. ఆయమ దుఃఖమును గాంచి హకీముసాహబు హృదయము ద్రవించిశోకసంతప్తమగుట నాతని ముఖచిహ్నముల నే స్పష్టముగ గ్రహించితి. నాగుండె నీరయ్యె. మాలవ్యా బాధపడి యచటి హిందువులతో "మీరుకూడ కులభేదముల మఱచి యొక్కటై సంఘబలమును బెంచుకొని మీప్రాణ మానధనమర్యాదలకుఁ బ్రమాదము వాటిల్లుచున్నతఱి వైరులగట్టిగ నెదుర్కొనవలయు"ననిబోధించి దుండగీండ్ర నతికఠినముగ శిక్షింపం బ్రభుత్వమునర్థించె. బీహారు భగల్పూరు ఢిల్లీ గుల్బర్గాకోహాట్పట్టణముల నిట్టిజగడములు జరుగమేమటకేగి.

కం. ఇక్కలహంబుల నెడనెడఁ
 జిక్కని నెత్తురులఁ జిందఁ — జేసికొనంగం

దక్కునె సుఖము స్వరాజ్యము
దక్కిన నది కల్ల కాన – ధర్మ మెఱుఁగుఁడీ. 293

చ. మతకలహంబులెప్డు మటు – మాయము సెందునొ యప్డె దేశమం
చితగతి నైకమత్యమ్మది – శీలమహోజ్జ్వలమై వెలుంగు ధీ
రతనలరు న్వెసంబరమ – రమ్యతరంబుగ రాజిలుఁ సుధీ
మత మిది మంచిమార్గ మిది – మంగళమంత్రము మానవాళికిఁ.

కం. అంతఃకలహము లుడుగుట
కింతాడితి మిట్లు సత్య – మెఱిఁగి సమైక్య
స్వాంతంబున మనుటెంతయు
నంతోషఫలప్రదంబు – సజ్జనులారా! 295

చ. కులమతభేదముల్మఱచి – కూరిమిమై భరతాంబ పాదముల్
గొలువుఁడు లక్ష్యసిద్ధికల – ఘువ్రతమూనుఁడు దేశరక్షణో
జ్జ్వల దృఢకాయులై పగఱ – సా[illegible] జయించి మించుఁడీ
యిలఁగల సర్వఖండముల – హీనః ఘుఁ జూచి మెచ్చగఁ. 296

తే. అమరు లట్టువచించుచు – నసురులట్టు (ఘను)
వర్తిలెడి వారలుందురు – వారితీరు
తెలిసి నటియింపకున్నఁ జి – క్కులు జనించుఁ
బ్రభువరేణ్యులకైనను – బ్రజలకైన. 297

ఈ. రామరహీములొక్కటన – రా సమబుద్ధులు జ్ఞానవృద్ధులై
యామహితాత్ములాడు పలు – కాదృతినెంచక జ్ఞానశూన్యులై
కామిత మింతదీఱక జ – గంబును బ్రింగఁ దలంత్రు కొంద ఱిం
కేమతమైననేమి జను – లెల్లరు దేవుని బిడ్డలేగదా. 298

తే. పరమ నిర్లిప్తభావసం – భరితుఁడైన
మౌని వృషభుని చందాన – మను నెవండు
జీవ కారుణ్య మూర్తియై – చెలఁగు నెవ్వఁ
డట్టి గాంధీ ప్రబోధము – నందుకొనుఁడు. 299

వ. అని బోధించితిమి. తద్ఘోరకృత్యములకు గాంధీజీ విచారసాగర మగ్నమానసుండై యేకవింశతి దివసంబు లుపవసింపం గసాయిదుకాణము

నుండి యొకగోవుందెచ్చి యహింసారాధ సకుం జిహ్నాముగ మౌలానా
మహమ్మదాలి మహాత్మునకు బహూకరించె. 300

తే. మానవత్వంబు మదమున - మంటఁగలిపి
పరుల హింసింపఁ జూచుట - పాడియగున
సర్వ దేశంబులం గల - సకల జనుల
ఖ్యాతికిం జీవనజ్యోతి - నీతి జగతి. 301

తే. ఇరుగుపొరుగునఁ గలహము - లెంతకీడొ
దూరదృష్టి గ్రహించి త - ద్దోషమెంచి
పరమకరుణాంతరంగులై - భారతీయు
లొండొరులు సోదరప్రేమ - నుంటలెస్స. 302

వ. స్వీయమతైక శ్రేయోదృక్పథగామియగుచు జిన్నా సిక్కుల ఘూర్కుల బౌద్ధాదుల స్థితి నించుకయే యోచింపకుంట నాయక లక్షణమా? విఘ్ననాయక లక్షణమా? ననుఁజీల్చియన్నా, జిన్నా! దేశముంజీల్చుమన్న నవ్వాని హృదయము ద్రవించెనా? మురుగునీరు వ్యాధివ్యాపకప్రాణుల వృద్ధిసేయు భంగి మతకలహములు హింసాచర్యలఁ బెంచుననుటెఱుంగఁడా? ధూమకేతువు లహర్పతిచుట్టు నేకకక్ష్యం బరిభ్రమించుచుండు నట్లు కేవలస్వార్థపరు లైశ్వర్యాధికారాన్వితు చుట్టుఁ బ్రదక్షిణంబు సేయు చుంద్రు. ఒక్కొక్క ఋతువున నొక్కొక్క వృక్షము పుష్పించి ఫలించు నట్టులొక్కొక్కవేళ నొక్కొక్కనికనుకొనని యదృష్టము పట్టు. ఇంత కను రాగములేని యనుబంధము కుదురదు. కలసిమెలసి యున్నను మన శోభ కడ్డు తగులువానిం గుందనపుఁ బనివాఁడు పరస్థలములం గోసి తీసివైచిన తెఱంగునం గొన్నియెడల విసర్జించుటలగ్గు. నిరాశా నిస్పృహలు స్వైరవిహారము సల్పుతఱి వివిధ విప్లవ శక్తులు వివృత భీకరముఖ గహ్వర జిహ్వాగ్ని జ్వాలికా మాలిక లల్లార్చుచు దశదిశల నావిర్భవించు. సకల జన రుచికరంబైన యాహారంబు పైత్యరోగికిం జేదైనభంగి మన సత్య సహిత సవినయ విజ్ఞాపనము ప్రభుత మన్నింపదు. కావునఁ దద్భిన్న మార్గముం ద్రొక్కక స్వరాజ్యము దక్కదు. చేతులు పట్టుకొనుటయే చేతగానివాఁడు కాళ్లు పట్టుకొనుట కల్లగదా. మీ కిలువేల్పైన రాముఁడు హింసతోగదా శత్రువుం జయించె. గీతాకర్త మాయానాటక సూత్ర

ధారియై తీవ్రతర మారణహోమశక్తి ప్రేరణంబున రణంబునఁ గురు పాండవ సేనాసహితంబుగఁ గౌరవులఁ జంపించిగదా ధర్మజునకుఁ బట్టంబు గట్టించె నని బెంగాల్సింగము నొక్కి వక్కాణింప నౌనని నెహ్రూ యిట్లను. ఆ ఘట్టము నాఁటి పరిస్థితులు వేఱు. ఈ ఘట్టములు నేఁటి పరిస్థితులు వేఱు. సామ్రాజ్యమ్ముతో సాయుధ సంప్రహారమ్మునకుం దలపడిన నా డల్లకల్లోలమై సహచర సహిత నాయక ప్రజానీక మనిర్వచనీయ మహాపదాబ్ధిం ద్రుంగ దేశస్వరూపమే పరివర్తనము సెందునేమోయని మన్మనం బాందోళన మందుచున్నది. కాలవ్యవధి కోర్చియైన శాంతి సూత్రలబ్ధస్వేచ్ఛ ననుభవించుటయే యుత్తమోత్తమమని మదంతరాత్మ బోధించుచున్నది. ప్రగాఢప్రత్యయాంతర్గత ప్రభూత నిర్ణయము శబలితము కాఁజాలదు. ఘనద్రవ వాయుపదార్థము లుష్ణస్పర్శ నుత్తరోత్తర మధికముగ వ్యాకోచించునట్టిట్టి క్లిష్టపరిస్థితుల వృద్ధయువబాలురొకరిన్మించి మఱియొక్కరగ్గలికముగ నుద్రిక్తులగుట నైజము. ఇరుపార్శ్వగత జలధారలు గంగం గలసి పవిత్రమైన ట్లెన్ని రాజకీయపక్షములైన గాంధేయ పథగమనమ్మున ధన్యతనొందు. మహాత్ముఁడు ప్రతిభాసంపన్నుఁడు.303

కం. జేగీయమాన చరితుఁడు
సాగర గంభీరుఁ డితఁడు – సత్యాహింసా
రాగపు వేగున ద్రుతగతి
సాగక నిజకృత్య మెంతో – సతమత మయ్యెన్. 304

మ. శుచితాసజ్జనతా మనోహరమునై – శోభిల్లు సత్రాళి స
ద్వచనంబుల్మును శౌనకాదులు లస – త్తత్వజ్ఞుఁడౌ సూతుచే
సుచరిత్రంబులు విన్నయట్లు యిపుడీ – చోఁ దత్సుధాసూత్రవా
క్సంచయంబుల్విని ధన్యతం బొరయమే – నీయాత్మయోచింపుమా.305

తే. ఘడియలో దేశదేశము – ల్దుడిచివైచు
మారణాస్త్రౌఘములు తెల్ల – వారి కుండె
నుత్తచేతుల వారితో – నుగ్ర రణము
నెట్లు సేయఁగలారమో – యెఱుకపడదు. 306

తే. తాఁ బ్రయోగించి నమ్మిన – ధర్మములకె
కట్టుబడి జీవితంబును – గడపుచుండి

శాంతి సంగ్రామ నేతయై - సక్రమముగ
నాఫ్రికా ఖండమున జయ - మందలేద. 307

తే. కష్టసుఖములు దెలిసిన - శిష్టజనుని
వాక్కు ఋగ్వేదఋక్కు స - వ్యమగు దిక్కు
శిష్టజనుఁడన గాంధికిఁ - జెల్లుఁగాన
నతని హితబోధ లోక క - ళ్యాణకరము. 308

వ. నావుడు సరోజిని సంతసించుచు నౌషధంబున కుపరసంబుంబలె సాయుధ సంగ్రామం బొక కోణంబునఁ బరోక్షంబునఁ గొంతవఱ కుపకరించుచున్న దనుట నిక్కువంబ. కాని దానసంపూర్ణ విజయము సిద్ధించు ననుట విచారణీయంబు. అది దేశకాలపాత్రాది పరిశీలనంబున వర్జనీయం బనియ బాపూజీ వినూతన రాజకీయ మార్గంబు బోధించె. 309

కం. ఎడ పేర్పున నుడికినయెడఁ
దొడరును జవి కూరకట్ల - దొడ్డ నరుండీ
తఁడు యోచించి వచించిన
వడువునఁ గృషిసల్పు విజయ - భానూదయమౌ. 310

వ. ఇది నాయాత్మ విశ్వాసమ్మన బోసద్దానికి సమ్మతింపక కార్యభారమ్మున ననారోగ్యమునకు గుఱియగుచుఁ దన ప్రాణమ్మునేఁ దృణప్రాయమ్ముగ నెంచుచు సంచరించుచు భారతదేశ దుస్థితిం బాశ్చాత్య ఖండములం బ్రచార మొనర్చి విఠల్‌బాయి పటే లంతర్జాతీయాసామాన్య సానుభూతి మన మాతృదేశ మందుకొనుచున్నదని పలుసార్లు వించిన విషయము నే నెన్నండును మఱవను. అది నా మనస్సును శతవిధమ్ముల ననుక్షణమ్ము ప్రేచుచున్నది. సంపూర్ణ స్వాతంత్ర్యవిజయ ధ్వజోన్నయ మాకాంక్షించుచున్నది. అయ్యది మృదుమధుర శాంత వచనములతో శంకరుఁడే సాధింపఁజాలఁడు. 311

కం. నేర్తు నవీనరణకళలఁ
గూర్తును సాధన చయంబుఁ - గోరినవారిం
జేర్తును సేనల హూణులఁ
బూర్తిగ నోడించి జన్మ - భూమికిఁ దార్తుణ్. 312

వ. ఇప్పటికే యనేక సహస్రసంఖ్యాన్విత స్వేచ్ఛాసేవక సైన్యమునకు రణశిక్షణ సంపూర్ణముగ నిచ్చితి. దిగ్విదిక్కులనుండి యువలింకం దండోపతండములుగ వచ్చి తత్సేనం జేరుచు సముచితోత్సాహ ప్రదాత లగుచుండిరి. మన మాతృభూమిపై నత్యంతానురాగముగల యన్య దేశము లీ విషయమున సర్వవిధ సాహాయ్య మొనర్చునని నా దృఢతర విశ్వాసము. 313

కం. దిక్కులు తార్మారైనను
జుక్కలదారి వెచ్చనైనఁ - జుక్క లురలినన్
ముక్కంటి కంటి నిప్పులు
నిక్కముగాఁ జల్లనైన - నేమాఱననన్. 314

వ. తటాలునఁ బట్టేలందుకొని నీ సంకల్పసిద్ధికిది సమయముగాదని పలువు రాడుచుండ నీ పట్టినపట్టు వీడకుంట పాడిగాదు. 315

ఉ. అర్మిలి హ్యూన్మహోద్ధి బడ - బాగ్ని నడంచి సమస్తభూప్రజా
శర్మదమెంచి వించె నతి - శాంతవచస్సుల నిమ్మహాత్ముఁడా
నిర్మల ధర్మబోధ యవి - నీతి గజాంకుశమై వెలుంగఁ ద
ద్ధర్మదవిష్టమైన కృతిఁ దాఁ - దలఁదాల్చునె జ్ఞాని యెన్నఁడున్.316

వ. జగదుద్ధర్తలగు మహామహుల ధీశక్తినుండి విశ్వజనీన నవనవోన్మేష సూక్తిరత్నప్రభ ప్రభవించుంగాని సామాన్యమానవుని మనస్సునుండి జనింపదు. విద్యుత్తాకసమునుండి పుట్టుంగాని భూమినుండి పుట్టదుగదా.

సీ. శోత్రఘోషవిఘాత - శోభిత రంజిత
మహనీయ రసవేణి - మధురవాణిఁ
బ్రదనరేణు నిభలన - ద్ధర్మ సూక్ష్మాంశముల్
క్రీడగా నరగఁ బ - రిష్కరించి
యావులించిన వైరి - యాంత్రముల్ లెక్కించి
శాంత్యహింసాశక్తి - సర్వ మెఱిఁగి
యైహికాముష్మికా - హ్లాదైకశీలియై
పురుషోత్తమఖ్యాతి - పొంది మనకు
తే. కనివినని మార్గముం జూపి - ఘనవిజయము
గలుగఁజేయుట కితఁడు కం - కణము గట్టెఁ

దొలగ కీతని యడుగుజా - డలఁ జరింప
శ్రేయమగునని నాయాత్మ - చెప్పు ననఁగ. 318

వ. లాల్‌బహద్దూరుశాస్త్రి సాలోచనాదృక్కులం బ్రసరించుచుఁ బ్రశాంత వచనంబుల బోసుం బ్రతిఘటింపందలంచి. 319

మ. నిటలాక్షుండును బొందఁ జాలఁడనుచుఁ - నీవంటి నీవంటివాఁ
డిటులన్నం బరమార్థ దృష్టికిఁకఁ జో - టేదీ సుధీరత్నమా
పటుశౌర్యోద్ధతిలేని హీనులని సం - భావింపకీయెల్లరం
జటులోగ్రాజికిఁ గాదు జంకినది యా - చార్యోక్తికంచెంచుమా. 320

ఆ.వె. గురుఁ డనుజ్ఞ నీయ - ఘోరయుద్ధంబున
నీకు ముందు నేను - నిలువఁగలను
స్వర్గ తుల్య మైన - జన్మభూమికొఱక
యసువులైన నిత్తు - యశముఁ దెత్తు. 321

చ. చెడుగుడు లాడినట్టి రణ - సీమలఁ గేళియొనర్తు మంతెగా
మడమటు ద్రిప్పనేర్తు మొకొ - మారణహోమము ప్రజ్వలించినన్
బిడుగులఁ గేలఁ బూని కడు - భీకరతాండవ మేనొనర్పనే
కడువడి వైరివర్గము క - కావికలై విజయంబొనంగఁగన్. 322

ఉ. ఎమ్మెయిఁ జూచిన న్సమయ - మియ్యదిగాదని చెప్పుచుండగా
నిమ్మెయి మాటలాడఁ దగు - నే యనిగల్గిన నాంగ్లజాతిఘో
రమ్ముగ మారణాస్త్రనిక - రమ్ములఁ జిమ్మినఁ బాయసప్రమా
ణమ్ములుసేసి నిల్తుము ర - ణమ్మున నిగ్గురుఁడానతిచ్చెనే. 323

ఆ.వె. అచి తూచి పలుక - నలవాటుపడిన యి
మ్మెటిమాట మనకు - మేలి బాట
కోప మున్న చోటఁ - గోటి నష్టములుండు
శాంతి యున్నచోట - సౌఖ్యముండు. 324

వ. కావున దూరదృష్టిం బ్రసరించి శాంతించి యాత్మజ్ఞానమును బెంచి సమైక్యతాభావంబును సంఘటించి ముందంజ కుపక్రమించుట లగ్గన రసోల్బణోచిత పదప్రయోగవిశిష్టత రాణించు కవికులాలంకారుంబలె న త్తఱి శాస్త్రి రాణించె, 325

ఆ.వె. కొండమిరెపవంటి - కోడెత్రాచుంబోని
శాస్త్రి మాట కెంతొ - సంతసించి
బోసుబాబు కితఁడు - తీసిపోవండని
యాత్మలందుఁ దలఁచి - రచటి జనులు. 326

ఆ.వె. కనుల కాగ కున్నఁ - గడుతెంపరుల మిన్న
పొట్టివాఁడు చాల - గట్టివాఁడు
పట్టు పట్టె నేని - బ్రళయ రుద్రునితోడఁ
బోర బోర నిచ్చు - ధీరుఁ డనిరి. 327

చ. కలకల మిట్టుపుట్టె మన - కాంగ్రెసునం దిది యెట్టుమాఱునో
చలమున సత్త్వహీనుఁడును - సాహసవాక్యము లాడఁజెల్లునే
బలియుఁడు బోసుబా బతని - భాతిగవర్తిలు టున్న నక్కతా
పులిఁగని వాతఁ బెట్టుకొను - పోలిక యంచెదఁ గొందఱెంచఁగన్.

వ. ములుకులవంటి శాస్త్రి పలుకులు విని యక్కరముల నిక్కమ్ముగ నహార్యబృహన్మరీచికా సదృశుం డితఁడని యంతర్గతహాసభాసియై సభం బరికించి నెహ్రూ యిట్లను. భారత జనతాస్వాతంత్ర్య చైతన్య జ్యోతిర్లతా వితానపటుచ్ఛటలు తటితటియఁబర్వి పరసార్వభౌము నయనంబులకు మిఱుమిట్లు గొల్పి నిల్వ నీడలేకుండం జేయు. వాంఛజనించినయెడఁ బాశ్చాత్య సంబంధముం బూర్తిగ విసర్జించుకొనంగలిగిన సమర్థత గల్గియుంటయ యధినివేశ ప్రతిపత్తియని పట్టాభి వ్యాఖ్యానమొనర్చిన నది మనచుట్టుం బన్నఁబడిన వాగురయని నా విశ్వాసము. కావున సుభాసచంద్రు డనినట్లు సంపూర్ణ స్వరాజ్యమే ధ్యేయమన హర్షించి పొట్టి శ్రీరాములు. 329

ఉ. అక్కఱ నానదీర దమ - నాంకుశమెత్తుచు నక్కజిత్తులం
బెక్కులు నూపు నాంగ్లపృధి - వీపతి రాజ్యమొసంగనేర్చునే
యుక్కివు చెల్మి గూర్చు మది - కుత్తుల పాటొగి నెట్టిపుట్టలం
ద్రొక్కినఁ బాదముబ్బి జల - తో నరు మిక్కిలి బాధపెట్టదే. 330

ఉ. వచ్చిన తావునం దొలిచి - పుర్వుటు వాస మొనర్చినట్టుగా
నిచ్చటి యైక్యతాగుణ వి - హీనత సందొకయింతయూఁ బరుల్
వచ్చి యడంచిరాజుల న - వారితలీలల నేలసాగి రీ
తుచ్ఛపు భోగభాగ్యముల - తోఁ దులదూఁగుచు ధర్మదూరులై. 331



లాల్ బహద్దర్ శాస్త్రి

ఆ॥ వె॥ పట్టు పట్టెనేని – భవుఁ డడ్డు వచ్చినఁ
ప్రాణమిచ్చుఁగాని – పట్టు వీడఁ
డనుచుఁ గీర్తి గన్న - మననేత యాతండె
పొట్టివాఁడు చాల – గట్టివాఁడు.

ఉ॥ పెత్తనమున్నయప్డు కడు – పేదతనంబది మొత్తునప్పుడుం
చిత్తమునందుఁగాని మఱి – చేఁతలయందునుగాని మచ్చ కిం
చిత్తును దోఁపనీక జన - చిత్తవశీకరణైకవిద్యలం
గుత్తకఁగొన్న నీయశము - గొప్పది లాల్ బహదూరు శాస్త్రికి !



జనాబ్ మౌలానా అబుల్ కలామ్ అజాద్

ఉ॥ భారతదాస్య శృంఖలముఁ - బాపఁగ గాంధికిఁ దోడునీడగా
వారక నిల్చినట్టి గుణ - వంతుఁ డజాదు ప్రజాహితైషి వి
ద్యారతుఁ డార్యసన్నుతుఁ డు - దారమనస్కుఁడు శాంతిభద్రతల్
కోరు ఋషీంద్రతుల్యుఁ డతఁ - డో కనుఁ డాఘను భౌతికాకృతిన్.

మ॥ మతవిద్వేషములేని మానవుఁడు ధ - ర్మజ్ఞుండు శాంతిక్రియా
వ్రతుఁ డుద్యద్గుణుఁ డగ్రనాయకుఁడు దై - వప్రార్థనాసక్తుఁ డూ
ర్జితదేశాభ్యుదయైకదీక్షితుఁడు వా - సింగన్న ప్రజ్ఞాయుతుం
డతికారుణ్యరసైకభాసురుఁ డజా - దాఖ్యుండు సామాన్యుఁడే!

ఉ. చిక్కినదంచు సంకెలల - సింగము మచ్చికచేసి బోనులోఁ
ద్రొక్కినరీతి భారతము - దోఁచు నిదెట్టదిసించి దూఁకునో
నిక్కపుఁ ద్రోవసూపఁగల - నీతి నిధుల్దగనెంచకున్నచో
దక్కనె రాజ్యలక్ష్మి జన - తాఘనతాప నివారణంబుగన్. 332

తే. మన విషయ నాయకవరుల - మనసులకుఁ ద్రి
శుద్ధిగ శ్రుతిగలియకున్న - చో స్వరాజ్య
మెట్లు సాధింపఁగల మయో - యింట గెలిచి
రచ్చ గెలుమన్న మాట వ - ట్రాల మూట. 333

ఆ.వె. తెడ్డు క్రిందఁ బెట్టి - తెప్పను నిల్పుట
కదనుగాదు మదికి - ముదముగాదు
దేశమాత యింత - దీనయై నవయఁగాఁ
బ్రతినవలయు నామె - బాధఁ బాప. 334

ఆ.వె. దిగినఁగాని లోతు - తెలియదు తినినగా
ని రుచితెలియ దట్లు - నరుఁడు నిరత
మనుభవమునఁ గాని - యరయఁడు నిక్కువ
మిద్ది పెద్దలాడు - సుద్ది సుమ్ము. 335

ఉ. భారతదాస్య శృంఖలముఁ - బాప మహాత్మునిత్రోవఁ ద్రొక్కకే
తీరున భేదభావములు - దెల్పినఁ గార్యము చక్కనౌ నొకో
యీరిఁక నిత్య సత్యము గ్ర - హించి స్వరాజ్యరథంబు లాగరే
ధీరవరేణ్యులార ! పర - దేశి మనోధృతి దూలిపోవఁగన్.. 336

ఆ.వె. పరుసవేది యిన్నుఁ - బైఁడిగా నొనరించు
పగిది మనయెడందఁ - బసిఁడిఁజేసె
నిమ్మహాత్ముబోధ - యెనలేని నవసుధ
యబ్బ నెవరు దాని - ద్రొబ్బఁ గలరు. 337

తే. కృతక భేద విభేదనా - చ్యుత సుజనుఁడు
నైకసంస్థల నెలకొల్పి - నడుపు ఘనుఁడు
భావిపరిణామ మూహించి - పలుకఁ గలఁడు
రాజకీయాస్త్రవిద్యలో - రాముఁ డితఁడు. 338

కం. మానవ ధర్మము మసియయి
దానవ ధర్మంబు రాజ్య – తంత్రము నడుపన్
జ్ఞానులు సైతురె సత్య
శ్రీనిధులై బుధులు తెలుప – రే సత్పథమున్. 339

కం. తలతగులఁ దలఁకి తలగుట
తెలివియె మున్నాడఁ దెలిసి – ధీచతురుఁడవై
మెలఁగి సుఖముంట మేలని
పలుకరె సజ్జనులు దానిఁ – బాటింతు మనెన్. 340

ఉ. సాయుధయుద్ధ చర్చ యిటు – సాగ మహాత్ముఁడు కార్యసాధనో
పాయము లెన్నియేఁ దలఁచి – కానఁడు శాంతిపథంబు దప్ప న
న్యాయము న్యాయముం గెలుచు – నాయను నాత్మబలంబు పెంపుమై
ధ్యేయమహింసయేయను సు – ధీవరు లిద్ది తలంపుఁడీయనున్.341

వ. దానికి బో సిట్లను. బుద్ధుఁ డహింసా సిద్ధాంతమ్ముమైఁ బిత్ర్యమైన రాజ్యమ్ము సైతము పరిత్యజించెనేగాని క్రొంగ్రొత్త రాజ్యమును సంపాదింప లేదు. ప్రహ్లాదుం డేతన్మార్గగామియై జనకు నెదుర్కొన్నం దాన నతండు నమ్మిన దైవమ్ముచే నాతని పిత వధింపంబడినంగదా తద్వైరమ్ముతీఱె. లబ్ధార్థ రక్షణ సామర్థ్యశూన్యుఁ డన్యాక్రాంతామూల్య స్వీయవస్తుచయము నెట్లు స్వాధీనము చేసికోఁగలఁడు. మీచిత్తవృత్తి తగరపుఁగత్తి. హృదయ గోళ సంగతంబైన యింగలముం బొంగింపకున్నం దానిపొగ లెగయ కెట్లుండు. మనచెయ్దము పారమెయ్దుం ద్రొక్కవలసిన మార్గమిందన్కం ద్రొక్కలేదు. సౌజన్య దౌర్జన్యంబు లొక్కొక్కప్పుడు జోడుగుండ్ల బారుం బలెం బ్రయోగించినం గాని కార్యసిద్ధింబడయఁజాలము. మ్రింగిన చంద్రుని రాహువు కొలఁది కొలఁదిగ వెడలఁగ్రక్కునట్లుపడ్డించుచుక పెత్తనములిత్తు మంత్రదిది యేరికెలమిఁ గూర్చునన మహాత్ముండు చిఱునవ్వు నవ్వి యోవీర రత్నమా నీ చెప్పిన దర్థరహితమన. 342

ఉ. జ్ఞానము సర్వశ్రేష్ఠమని – సాధులనన్విని దాని నమ్మితిన్
మానని తెల్లవారల న – మానుషకృత్యము లాత్మనిల్పవే
యేనిపుడెంత శాంతగతి – నేగుచునున్నఁ జరిత్రమాయునే
వానలు వడ్డ వాయునొకొ – వాతలు చేఁతలు సాక్ష్యమీయవే. 343

శా. ధ్వాంతంబెప్డుధిఁ బాయు వెల్గెబుల సం - ప్రాప్తించు దేశప్రజల్
గంతవ్యాధ్వగతాటి యెట్లనుచుఁ జ - క్కంజూచి యాంగ్లేయుపైఁ
బంతంబెంతగనున్న నాత్మశుభముం - బాటించి పూర్వాపరా
లంతర్దృష్టి విమర్శసేసి తగఁ - శ్లాఘ్యమై వచింపందగుఁ. 344

వ. ఏ నిష్కళంక దేశభక్తిని శంకింప. తరుణుఁడగు వృద్ధనాయకుఁడని దేశబంధు చిత్తరంజనదాసుచే నవ్యాజముగ హృదయపూర్వకముగఁ బ్రశంసింపఁబడిన స్వాతంత్ర్యయోధాగ్రణివి. దృఢసంకల్పుఁడవు. ధీరోదాత్తుఁడవు. సత్త్వసమేతుండవు. విద్యాధికుండవు. విశ్వాసపాత్రుఁడవు. కావున భారతమాతృపదపద్మ సేవారతి భారతదేశ మాండలిక పరిపాలనాధికార పట్టమునకు రాజీనామా యిడిన ప్రథమ భారతీయుఁడగు నేతాజీ సహజ నాయకుఁడని మహాసమజ్యలం బెక్కిక్కల వక్కాణించితి. 345

ఆ.వె. పిత్ర్యమైన సత్తి - విలసిల్లు బోసులోఁ
గాన రాజకీయ - గాఢపటిమ
జనువు చనవు వోలె - జనియించుటంజేసి
చిన్ననాఁడె యింత - పెద్దయయ్యె. 346

వ. అంటి. అట్టి ప్రజ్ఞాశాలివగుట నా పల్కులలోని సారాంశము సమగ్రముగ గ్రహింప గోరుదు. ఉదారచరితానాంతు వసుధైవకుటుంబకమ్మనిరి జ్ఞానవృద్ధులు. ఆత్మప్రత్యయ సహజావబోధ కృషులతో లోకము పురోగమింపవలయునన. 347

ఉ. పొంగెడిపాలపై జలము - వోసినభంగి శమించెఁ గోప మా
సంగతు లన్ని విన్నతటి - శాంతశమాదులు గొంత మోముపై
నింగనిపించె బోసునకు - నిర్మలదృష్టి సమగ్రయోచనా
భంగిమ దోఁచె వృద్ధజన - పావనవాక్తతి రిత్తవోవునే. 348

వ. అదిగని గాంధీజీ లోలో ముసిముసినవ్వులు నవ్వుకొనుచుండ. 349

మ. అనిదం పూర్వముదంబునం బొదలు చి - హ్నాంబా ముఖోత్పన్నమా
టను గాంచెఁ హితబృంద మద్దిగని నె - ద్దం బిట్టుతోషించె స
జ్జనసంఘం బది భావి సత్ఫలదమా - సౌజన్యరేఖాంకమా
నని ధీరోత్తము లాత్మనెంచిరి హృదా-హ్లాదంబుతోఁ దత్సభఁ. 350

తే. అంత గాంధి యహింస నే - నాదరింతుఁ
జేత మొప్పని చేఁతనే - చేయుటెట్లు
గోటితోఁ బోవుదానికి - గొడ్డలేల
కష్టముల కోర్చినప్పుడే - కలుగు సుఖము. 351

శా. కోటల్పేటలు కూల్చుఁగాల్చు రణ శ - క్త్యుల్వ్యర్థముల్ మీరలీ
బాట న్యాసనధిక్కృతిన్నిలువ స - ర్వంబేర్పడుఁ నమ్ముఁడా
మాటం గాంచనగోళమైతనరు సా - మ్రాజ్యాధికారంబిఁగఁ
మీట న్విచ్చెడి కాచగోళమగు సం - దేహంబులే దింతయుఁ. 352

వ. ఇంక మదీయాహింసా సంగ్రామ నిశితశస్త్రాస్త్రముల వివరింతు. ప్రశాంత గంభీర మనస్కుండవై యాలింపుము. ఖాదీప్రచారపాశుపతము విదేశ వస్త్ర బహిష్కరణ నారాయణాస్త్ర, మనహాయోద్యమ బ్రహ్మాస్త్ర. మస్పృశ్యతా నివారణ వాయువ్యాస్త్రము, శిష్టిధిక్కారాగ్నేయాస్త్రము, మద్యపాననిషేధ బ్రహ్మశిరోనామకాస్త్రము, జాతీయవిద్యాబోధన వారి వాహాస్త్రము మత్ప్రశిక్షాశరధిం బ్రకాశించు. 353

తే. భారతావని దేవతా - సారభేయి
నాంగ్లవస్త్రవణిగ్గలూ - కాళివట్టి
గట్టిగా నల్లఁ బిల్చెడిఁ - బొట్టనిండ
ఖద్దరను నస్త్రహతి దానిఁ - గడపవలయు. 354

ఆ.వె. రహాటు చక్ర రవము - గ్రామములం గమ
లాకరానఁ బంచ - రీక రవళి
కరణిఁ జెవుల కింపు - గావలెఁ బోవలె
లేమి జనుపు చనవు - లేమి పుడమి. 355

కం. ఈ క్లిష్ట సమస్యలలోఁ
దక్షి మనకెంతొ ధైర్య - ధనమిడ రాజ్యం
బక్లేశ వృత్తిరా జన
తాక్లాంతి తొలంగు సత్య - ధర్మము వెలుఁగుఁ. 356

తే. తరణి యెందాక వెల్గు నం - దాక నాఁక
నాక సాఁక సిరులరేక - రాక యనఁగ

జోక వెలయు త్రివర్ణ ప - తాక వీఁక
నెగురుఁగాక విస్వీధుల — నెదురులేక. 357

వ. నావుడు సభాస్తారు లెల్లరు హృష్టతనురుహులై తథాస్తనం బృందారక బృందము సబర్మతీ మహర్షి వాక్కవితథమగుంగాక యని పల్కం బరీక్షాసమయ విద్యాశాలంబలెం గతిపయక్షణంబు లాసదస్సు నిశ్శబ్దంబుగ నుండ వంగకేసరి దీర్ఘాలోచనా తత్పరుండై నిర్ణీతదివసంబున సంపూర్ణ స్వాతంత్ర్య పతాకా ప్రతిష్ఠ జరుగుటమనకుం బ్రతిష్ఠ. శాసనసభా సభ్యత్వాద్యధికారము లన్నియు విసర్జించి దేశస్వేచ్ఛా దిదృక్షాపరులంద ఱేక ముఖంబున నేల్బడిం బ్రతిఘటించుచు నధికార దుర్వినియోగము హత మొనర్ప నహరహము శ్రమింప దీక్షంబూని సంపూర్ణ స్వాతంత్ర్య సముపార్జనకు నిర్ణీత దివసంబునఁ బ్రమాణస్వీకారములు జరుగ న్వాంఛింతు. వృద్ధనాయకాభీప్సిత మేకోన్ముఖమగుట నేనింకం గొంతకాలము త్వద్ధర్మ సూత్రబద్ధుండనై దాసోహమ్మందు. ఫలితంబు శూన్యంబయ్యేనే నస్మచ్ఛస్త్రాస్త్ర చయమునకుం బరిపూర్తిగఁ బని కల్పింతు ననవుడు నట్టయగుంగాక యని కొందఱన్నట్టు దలపంకింప రజనీముఖంబుదాఁట నాఁటి గోష్ఠి మ గియ వల్లభభాయి ప్రభృతులు దక్కం దక్కుంగలారలు వారి వారి యిక్కలకుం జనిరి. శ్రీరాములు బాల్యమునఁ దల్లిదండ్రులకు నిత్యము గృహకృత్యముల నత్యంతోత్సాహమునఁ దోడ్పడినవాఁడగుటఁ దద్గుణంబు లిప్డు డెక్కుడుగ వికసించుటంజేసి యయ్యాశ్రమమున వృద్ధ రాజకీయనాయకులకు స్నానపానాదుల వలయుసామగ్రి సకాలమున నందిచ్చుచు వారి యపార ప్రేమానురాగంబులం బడయుచుండె. ఆశ్రమ సంబంధ విధ్యుక్తధర్మ నిర్వహణమున నాతని దినచర్యం గాంచి సబర్మతీ మహర్షి స్వాంతమున నెంతయే సంతసించి యితండొక మహాపురుషుఁడు కాఁగలడని తలంచె. వినోబాజీ కాకాకలేల్కర్, మహాదేవ్‌దేశాయి, నరహరి పరిక్, ఇందూలాల్ యాజ్ఞిక్, మగన్‌లాల్‌గాంధి. నారాయణదాసుగాంధి ప్రభృతులు మహాత్ముని నాయకత్వమున నిర్మాణ జాతీయశిక్షణ కేంద్రముగ సాబర్మత్యాశ్రమమును నడిపించుచుండుటంజేసి రాముల కప్పు ముఖ నాయకులతో సంపూర్ణ పరిచయభాగ్యము గలిగె. గాంధీజీ నన్ని

హితానుచరులలో నతండు ముఖ్యాతి ముఖ్యుఁడయ్యె. మగన్‌లాలు నారాయణదాసుల యొద్ద చరఖా వడకుట నేఁతనేయుట నేర్చుకొనె. ఘూరరభాష నభ్యసించె. గురువర్యు నడుగుజాడ నడచుచుండె. తత్సాహచర్యమున నగాధ రాజకీయ రహస్య విశేషంబు లనేకంబు లాకళించుకొనుచు లోకజ్ఞాన మభివృద్ధి చేసికొనుచుఁ దార్కికదృష్టి పెంచె. సత్ప్రవర్తనమున శోభించె. దేశభక్తుల రాణించె. బుధోక్తులఁ బిపీలకంబు శర్కరాకణంబుంబలె మధుకరము మధువుంబోలెఁ బరిగ్రహించుచు బాపూజీకి బహువిధ సపర్యలు సేయుచుండె. 358

ఇయ్యది శ్రీమదాంధ్ర మహోభ్యుదయ ద్వితీయ భాగమున

షష్ఠ ప్రకరణము సమాప్తము.

సప్తమ ప్రకరణము

# ఉప్పు సత్యాగ్రహము

## నక్షత్ర వర్ణన

కం. ఏలికతో నే నెపమున
నాలంబొనరించి జయము - నందుదు నంచుం
దాలిమి మహాత్ముఁ డూహా
జాలంబునఁ జిక్కియున్న - సమయమునందుఁ. 1

వ. ఒక్కనాఁటి రాత్రి నిర్మల గగనసీమ. 2

తే. కాలయాంత్రికుఁ డీశాజ్ఞఁ - గీలు ద్రిప్ప
దేవ భువన భవన దివ్య - దీప్తి దిశలఁ
గనద మోఘ విద్యుద్దీప - కళిక లనఁగ
మింటి ధిష్ణ్యముల్ మిలమిల - మెఱయుచుండె. 3

ఉ. నిన్నటిరేయి చందురుఁడు - నిక్కుచుఁ దా నపరాద్రిఁ గాలిడం
గ్రన్నన జాఱి యబ్ధిఁబడఁ - గా మదిజంకుట వేఁకినోఁకె నం
చెన్ని తదీయరాగము గ - ణించుచు నద్దెసదాది భక్తముం
దిన్నఁగఁ జల్లెఁ బెల్లుదిగఁ - దీసి యనన్వెలుగొందె ఋక్షముల్. 4

ఉ. జంకక నాకలోకవిభు - సామజరాజము స్వర్గవీధులం
బొంకముగాఁ జరించి వెస - వ్యోమధుని న్విహరించుచుం గడుం
బింకముమీఱఁ దజ్జలము - బిట్టెగఁజిమ్మఁగఁ దోఁచుచున్న త
త్కంకణ బుద్బుదంబులనఁ - గా నలరెం దివి తారకావళుల్. 5

తే. పెక్కు రకముల రిక్కల - కిక్క విన్ను
స్థూల సూక్ష్మ కోరక పుష్ప - జాల శోభి
తాద్భుతా లోకనోత్సవ - మై తనర్చి
సన్నజాజుల పందిరి - చాయ నొప్పె. 6

తే. అరయ బ్రహ్మాండ భాండస్థ - శరధి శరము
రవికరాగ్ని సూక్ష్మమయి పై - దివమనియెడి
మూఁతనంటి సంజపయర - మొనసి నీటి
బిందుతతియయ్యెనా నుడు - వితతి తోఁచె. 7

చ. ఇనుఁడు ధవుండు ప్రాగ్దిశ య - ధేచ్ఛ వెలింగి క్రమక్రమంబుగాఁ
జనిరల పశ్చిమాద్రికని - సత్యమెఱింగి యుడూత్తమాంగనల్
చని రటులొ వసుప్రదుని - బూర్ణకళానిధియైనఁ బాయునే
యనవరతంబు సాధ్వులు నిజా - ధిపు మార్గము ద్రొక్కకుందురే.8

తే. రిక్కలెల్ల నెట్లెట్లొ చ - రింపఁ గనుచు
సత్పథస్థితి ధ్రువుఁ డచం - చలత మెఱసె
లోకపుం బోకడకు సుంత - లోఁగ కెఱిఁగి
జ్ఞాని తత్త్వైక నిజనిష్ఠ - మానఁడు గద! 9

తే. నీరజారాతి కొదవని - నిష్కళంక
సహజరుచి మాకుఁ గలదని - సమదలీలఁ
బ్రకటనముసేయ కెంతయేఁ - బతికిలొంగి
తోఁచితోఁపని యట్టులు - తోఁచు నుడులు. 10

తే. ఉన్నత స్థాన గౌరవ - మొంది భర్తృ
పదనిషేవణ వృత్తిని - బాయవుడులు
గొప్ప యింట జనించిన - గొప్పపదవి
నందిన ధవుసేవ విడువ - రతుల మతులు. 11

తే. ఘోర సామ్రాజ్య భూతము - న్బాఱఁద్రోల
నూతన మనుప్రయోగ సం - ధాతయైన
గాంధి సత్యాగ్రహ విధమ్ము - గాంచనున్న
సురల నేత్రౌఘ మన దివిఁ - జుక్కలమరె. 12

వ. ఆ నిర్మలాకాశమునం బ్రకాశించు నక్షత్రములం దిలకించుచు నేదియోదీర్ఘాలోచన సల్పి మహాత్ముండు నిద్రించె. అంతం గొంత సేపటికి.

తే. తొలుతఁ దొలిమల పందిట - వెలుఁగురేక
బొట్ల పూల్ రాశి బోసిన - పోల్కి దోఁచె

నరుణసితఖాభ్రలేశాళు - లర్థ పక్వ
దాడిమీబీజతతి భంగిఁ - దనరెఁ బిదప. 14

కం. మాగధ మంగళ గాన
శ్రీగరిమ న్మేలుకాంచు - పృథ్వీశుపలెన్
వేగ మహాత్ముఁడు తత్యగ
రాగంబుల నిదురలేచె - రాముఁ దలఁచుచున్. 15

కం. ఆశ్రమ జలములు తజ్జన
తా శ్రమజలములఁ బెనంగఁ - దరుపులు దగ న
య్యాశ్రయ నరతతి కెల్లపు
డశ్రమ సుఖఫలదములుగ - నలరు నలరులన్. 16

వ. అట్టి సబర్మతిఁ గల్యకరణీయంబులు నిర్వర్తించి సామూహిక ప్రార్థన పూర్తిగావించి కరంచందు సుతుఁడు లవణశాసనధిక్కార కృతనిశ్చయుండై తద్ధేతుతతి రాజప్రతినిధికిం దెలుపందలంచి యొక పత్రమందు కొని "గౌరవార్హుండవైన పాలకాగ్రణీ! త్వత్పరిపాలనమ్మున నస్మద్విషయమ్ము న కపారనష్టకష్టమ్ము లొదవె. ఇటుఁగల ధనదులు భృతకులుగ మాఋనంతవఱకు మీరు మాకుంబెత్తనపుటాసం జూపుచునే యుందురు. జాతీయ మహాసభకు నేఁడు సర్వాధికారమున్నఁ బ్రతికర్షకుఁడు కోటీశ్వరుఁడుగ జీవించుస్థితికిఁ దేఁ గలదు. కుపితులైన రైతుల సైతము సముచితపథమ్మున నడుపుచున్న దీసంస్థ. మధుపాననిషేధము తీవ్రతర శాసనరూపముం దాల్చుట, మారకపు విలువ దిగజార్చుట, యత్యధిక వేతన రసాకరసైన్య వ్యయకర్తన మామోదించుట, యుప్పుకప్పముం దొలఁచుట, విదేశపటములపై రక్షణభాగధేయము విధించుట, పయోధి ప్రయాణ నియమ న్యాయశాస్త్రము నంగీకరించుట, రాజకీయ బంధితుల విడుచుట, గూఢపురుషశాఖం దీసివేయుట యాత్మరక్షణార్థము లఘునాళికల ధరింప నాజ్ఞాపత్రము లిడుటయను నియ్యేకాదశ వాంఛల వైళమతీర్పఁ ద్వద్ఘనతశ్లాఘింతు. మీమాఱుఁ గమ్మకు నిరీక్షింతు" నని వ్రాసి యొక్క హూణసుహృన్మణి ద్వారమ్మునఁ బంపి ఛాత్రజనపరివృతుండైన సూతుభంగి పటేలు శాస్త్రి శ్రీరామాద్యంతేవాసి బృందము గొల్వం గొల్వుండి యిట్లను. ఈ నిరంకుశ ప్రభుతతో నిదియ కట్టకడపటి

కదనరంగము. విదేశవస్త్ర బహిష్కార సంఘమునకు నేను మద్యపాన నిషేధసమితికి రాజగోపాలాచారి యస్పృశ్యతా నిర్మూలన పరిషత్తునకు జమ్నాలాలు బజాజి యధ్యక్షులుగనుంట మీకుందెల్లమ. నేనాఱువారము లాంధ్రిం బర్యటింపఁ దద్దేశభక్తులు ఖాదీవృద్ధికొఱకు రెండులక్షల డెబ్బది వేల రూప్యము లొసంగుట గమనార్హము. ఇది వారి యౌదార్యమున కుదాహరణము. 17

ఉ. మారశరారులై విమల – మారుత పారణ సారనిష్ఠమై
ఘోరతపోగ్నిఁ గ్రాగు ఋషి – కుంజరు మంజుల వాక్సుధారసం
బారఁగఁ గ్రోలి దివ్య పథ – మందెడి వర్తన కీర్తినీయమౌ
తీరుగ దిద్దుకొన్న మన – దేశము నేఁటికి నిట్లులయ్యెఁగా. 18

సీ. ద్రవ్యోల్బణంబున – ధరలు హెచ్చెడి ఖాతి
నుత్సాహమున శక్తి – యుబికెడు గతి
మంత్ర సాధనమున – మహిమ యెచ్చెడి రీతిఁ
బ్రేమచే నైక్యత – పెరిఁగెడి విధి
నధికారమున దర్ప – మతిశయించెడి భంగి
నోర్మిచే జయవృద్ధి – యొదవు రేఖ
సాముచే దైహిక – సత్త్వ మబ్బెడి చాయ
విడిముడి సుకము పె – ల్లడరునట్లు

తే. యమల సత్యాగ్రహంబున – నాత్మబలము
మూరిఁబోవఁగ దినదిన – ముం బెనంగి
దొరలఁ బడవల కెక్కించి – హరు భజించి
కంకణ విసర్జనము చేయఁ – గలము మనము. 19

తే. ముజ్జగములేలు ముప్పది – మూఁడు కోట్ల
వేల్పులండౌట వ్రజి యా – విధమ నేము
గలము నల్వదికోట్లు మా – బలిమి కలిమి
మమ్ము మే మేలుకొందుమన్ – మాట వినరు. 20

ఉ. రైతులు రాటుదేలి తమ – రాజ్య రథాంగము దామ త్రిప్పుకోఁ
జూతు రిఁకాఁక లేక యెటు – సూచిన కాలము మాఱుచున్న దీ

రీతినెటింగి భారత ధ - రిత్రిఁ ద్యజించి స్వరాజ్యమిచ్చి పోఁ
ఖ్యాతిలభించుఁ దెల్లదొర - గానఁడు కీరితివెల్గు గూఁడియై. 21

కం. కుడియెడమల భేదంబులు
వడివడిగా రెచ్చఁగొట్టి – వారిన్వీరిం
గడిగాళ్లువేసి యన్నిట
గడుసరుల నడంచి జాతి – ఘనత న్మాన్పెణ్. 22

వ. అని వల్లభ భాయింగని యిర్విను ప్రభువునుండి తంత్రీవార్త యసం
తృప్తిగ వచ్చెనేని దండి యుప్పు సత్యాగ్రహ మారంభింతుఁ గాన నీవేగి
ముస్ముందు బార్డోలీ ప్రజల సమరసన్నద్ధులం జేయుమన వల్లెయని యతం
డచ్చోటి కరిగి జనతం జేరఁదీసికొని. 23

# ప టే లు ప్ర బో ధ ము

సీ. శౌర్య ధైర్య స్థైర్య - సాహసోపేతులు
హైందవ రత్నము – లైన నౌర
వాణిజ్య కాంక్షమై - భారత దేశానఁ
గాలు మోపిన దొరల్ – కాల మెఱిఁగి
యింతింతయై వటుఁ – డింతయైనట్లుగా
దేశాధినాథులై – తేజరిల్ల
శలభ ధట్టికఁ జెడు – సస్యంబునా భార
తోర్వీరమాశోభ - యురక తరిగె

తే. పరులయేల్బడి డిందుట – పాడియంచుఁ
గంకణము గట్టికొన్నారు – కార్య శూరు
లెంచనుక హీనగతి దాస్య – శృంఖలములఁ
జిదియు దేశము బోనున - సింగ మట్లు. 24

తే. పరుల పెత్తన మిట వేళ్లు – పాతుకొనఁగఁ
గొఱకరానట్టి కొయ్యగాఁ - గఱకుదేలెఁ.

బాపమొల్లక పాలించు - ప్రభులె ప్రభులు
తండ్రి ప్రజనటు ప్రజఁగనఁ - దగును ప్రభువు. 25

తే. ప్రాచ్య పాశ్చాత్య భేద భా - వ ప్రబోధ
గాదు సామ్రాజ్య పీడా వి - వాద నాద
ఖేద బాధయిది ధమన - గీతి మాని
పాడవలె దయాగేయ మీ - పాలకు లిఁక. 26

తే. కాంగ్రెసును లెంకకూటువు - కరణిఁ గనుట
తగవుగాఁ దనరేఁగి పం - తమునఁ గారఁ
గోలగగ్గరలం బోలెఁ - గూలఁ ద్రోసి
పాలనముసేఁత ప్రభుత కే - పాటి ఘనత. 27

వ. భేదమ్ములు పుట్టించి వాదమ్ముల గుట్టించి కారలనెట్టించి లాఠీలఁ గొట్టించి మనల మట్టువెట్టం గట్టిపట్టు పట్టిన దీశ్వేతాధికార భూతము. మనము సంకేతించుకొన్న తెఱంగున నేల్బడితోఁ జిక్కంబెనంగం దగు. స్వాతంత్ర్యోదన్యాపనోదనంబున కెంతేబడలు పడవలయు. 28

కం. తినఁ దిండి కట్ట బట్టయు
నొనగూడక యంగలార్చు - చోపిన కొలఁదిం
బనికొగ్గుచున్న నిఱుపే
దను దన్నుట ప్రభుత మొదటి - ధర్మవుగాదే. 29

ఆ.వె. గ్రామ రాజ్య మొండె - రామ రాజ్యం బొండె
రైతు మేలు గనక - రాదు మఱియుఁ
గర్షకునకుఁ దోడు - కార్మికుఁ డనియెంచి
యిరుదెఱంగు శుభము - నెన్నవలయు. 30

తే. మూఢవిశ్వాస చయము ని - ర్మూల మయ్యె
గడ్డు రోజులు గడచు నీ - గడ్డ మీఁదఁ
గర్షకా! కను నద్దెస - హర్ష మొదవ
నిన్నుఁ బూజించుసమయ మా - సన్న మగును. 31

ఉ. మడ్డిమతుల్ దొరల్పలుకు - మాటలఁ జూపెడి దొడ్డయానలం
గ్రుడ్డిగ నమ్ముచుం గెరలి - కుత్సితభావ విషోగ్రమూర్తులై

యద్దము దిద్దుచుందు రది - హానికరంబగు స్వీయజాతికిం
గొడ్డటఁ గట్టిదూటి తన - కుం గల వంశపురూపు మాపదే. 32

కం. వార్చితి మెన్నో వర్షము
లోర్చితమి కృతాంత బాధ - లోర్చున నౌరా!
కార్చిచ్చునట్టి వ్యసనం
బేర్చెడిఁబో దొరల క్రొత్త - యేర్పాటులకున్. 33

ఉ. మీతలిదండ్రు లిచ్చిరని - మిక్కిలి మూటనొసంగ బిడ్డకే
ఖ్యాతి ముదమ్ము యట్టి మన - భారతమున్ మనకిచ్చిపోవుచో
నాతత సఖ్యసంభరిత - మై నిరువైపుల మేలుగూరఁగా
ఖ్యాతి లభించు నిర్వుర క - ఖండముగా నన నొప్పరింతయున్. 34

మ. మసిచేసెన్మనహక్కులన్ని పర సా - మ్రాజ్యంబు తత్పద్ధతిం
గసిచే భస్మము చేయకున్న మనసా - ఖ్యం బెన్నఁగానున్న నేఁ
డసిడాల్వట్టిక యాత్మశక్తిమహిమా - స్త్రాళిన్ యగ్నిఁ గోలాహలున్
వసువోలెన్ వెస గోటమీటఁ దగదే - వైరి ప్రభుత్వాగమున్. 35

తే. శాంతియుత సహజీవన - భ్రాంతి యున్కి
బ్రహ్మ నమ్మితుఁడని గాంధిఁ - బ్రస్తుతింతుఁ
జీఁకటిం జీవరత్నమై - చెలఁగు నతఁడ
మనకు నారాధ్యదైవ మ - న్మాట నిజము. 36

ఆ.వె. శాలివాహనువలెఁ - జతురత గలసేన
శిక్ష గాంధి చక్కఁ - జేసి వెడలు
లవణ శాస నాబ్ధి - లంఘించి రాష్ట్రమా
లబ్ధి విజయ కీర్తి - లక్ష్మి నంద. 37

తే. ఇది భగీరథ యత్న మిం - కిద్ది యాఁప
నోపఁ డెవ్వఁడు ఫలితంబు - వాపఁ డెవఁడు
కోటి మేరువుల్ ధూళిమై - కూలుఁగాన
రండు దండికి సాహసో - ద్దండు లగుచు. 38

చ. అటుకదియేల యక్రమ దు - రాక్రమణాదుల నిండ్లు వాకిటుల్
పొలములు గొడ్లు దొడ్లు కొని - పోదురె సీమకు మీవి తెల్లవా

రలు నిలువుండు శాంతి సమ - రాన మహాత్ముని కండదండగాఁ
గలుగును మీకు సద్యశమ - ఖండముగా నవఖండమండలిన్. 39

వ. నావుడు జినా, మహాత్మ మార్గంబున గమించునా యాతని స్థితి యెట్లుండెనని గుజ్జరిజనంబు పృచ్ఛింపఁ బటేలు సాలోచనాద్భుతదృక్కులఁ బ్రసరించి తద్విచిత్ర ప్రవర్తనమ్ము నేమని వర్ణింతు. 40

ఉ. ఔర! స్వదేశభక్తుని మ - హాత్మ శరుంగని నట్లు గాంచునే
కైరవ మిత్రుఁ డీ భువన - కంటకుఁడంట సహింపవచ్చునే
నేరక నేతనా యిటు గ - ణించుట ధర్మవిచారదూరమౌ
వైరి సమాసమట్లతని - వాక్తతి కర్ణకఠోర మయ్యెడిన్. 41

శా. ఆయెంబోయె నిటెంత సెప్పిన వినం - డాయయ్య యీాకయ్యముల్
డాయన్మాయలు పన్ని తప్పుకొను మా - టల్వొల్కు నీ దోసముల్
పాయంజాలక పారతంత్ర్య శిఖికీ - లల్ పాయునే డాయునే
న్యాయశ్రీయుతమైన స్వేచ్ఛ గుణి గ - ణ్యంబై యశంబందఁగన్.42

మ. మతమాత్సర్యము స్వార్థముంగలసి ధ - ర్మధ్వంసకార్యక్రమో
ద్ధతిసూపం బరదేశపాలకుల చెం - తం జేరినాఁ డింతకే
గతి దేశంబున కెట్టుపట్టునొ జగ - త్కల్యాణ వాంఛాపరుల్
హితమేరీతి వచించినన్ వినఁడు కా - నీ యేమికానున్నదో. 43

కం. చెఱపకు చెడెదవు నిరతము
పరమత సహనంబు పరమ - పథమగుఁ దలఁపం
దురితమె మరణం బంచుం
బరమార్థముఁ బల్కు నుంత - పాటింపఁ డెదన్. 44

ఆ.వె. చీల దీసి యేల - మేలని మతభేద
భూతములను రేపి - పుచ్చు నవ్వ
డఖిల పక్ష నాయ - కైక్యత సడలిన
నెల్లిదముగఁ జూతు - రెల్ల దొరలు. 45

ఆ.వె. మతగరాగ్ని రేఁపి - మందిని భ్రమదింప
నాయకాహ్వానములు వి - నాయకులయి

కడఁగి లోక వితతిఁ - గజశింపఁ జూతురు
వెఱ్ఱి బిఱ్ఱి లట్టి - వెంట నడువ. 46

తే. వార్థి వసన వసుంధరా - వలపు మెల్లఁ
గలయఁ దిరిగినఁ గనరాఁడు - గాంధి తుల్యుఁ
డమ్మహానిధి యిది విధి - రసించుఁ దెలుపఁ
జలియిఁపుక సల్లినటు లాత్మ - సౌఖ్య మెసఁగు. 47

తే. దేశమాతృ విశృంఖల - దీక్షమై వి
రాళములఁ గూర్చు నయజయ - శీలి గాంధి
పూవు టింతికి నొవ్వింత - పొసఁగ కుండ
మధువు ద్రావు ద్విరేఫమ్ము - మాడ్కిఁ దనరు. 48

కం. అసమాన బుద్ధి మత్తం
ద్రసరేణు విభేద విదుఁడు - దాక్షిణ్య కళా
రసలుబ్ధుఁడు త్రైలోక్య
ప్రసరణ కీర్తిప్రభా వి - భావసుఁ డతఁడే. 49

చ. కఱకు కిరాత బాణహతి - ఖండిత పక్షవిహంగమట్టు యీ
భరత మపార దాస్యమున - భగ్నమనోరథమై కృశించెడిన్
భరత దిలీపభూప రఘు - భార్గవ రాఘవ వీరవిక్రమ
స్ఫురణ వహించినట్టి మన - భూమి కటా! యిటులయ్యె నేఁటికిన్.

కం. రేవగలు వగలఁ బొగులుచు
నీవిధమున మనుట యెంత - హీనము బ్రమకో
చావో తేల్చు కొనందగు
భావి శుభం బరయుఁడన్నఁ - బ్రజ యిట్లనియెన్. 51

చ. పలుకులు యుష్మదీయములు - భవ్యములై హృదయమ్ము నాఁటఁగాఁ
గలిగెను జ్ఞానమిప్డు కల - కాలము కాకిగ నుంటకంటె నీ
యిలపయి హంసగా నిముస - మేని చరించుట సార్థకంబురా
సులలిత భావ బంధుర వి - శుద్ధవచోరచనా ధురంధరా. 52

ఉ. పొక్కుచు స్రుక్కుచుం గడును - పోకలు పోవక శాంతిమార్గముం
ద్రొక్కుచుఁ బెక్కుచిక్కుగమిఁ - దోఁగుచు నిల్చి స్వరాజ్యమింక మా

హక్కన నిక్కి యిప్పుడుకు - హానియొనర్చునె రాజరాజు తా
నెక్కినకొమ్మఁ గొట్టికొన - నెంచునె యెంతటి జ్ఞానశూన్యుఁడే. 53

కం. కరతతిఁ బెంతురు సస్యము
కలవైనం గరుణలేక - గారింత్రు దొరల్
స్థిరధైర్య వీర్య చర్యల
సరగునఁ బడఁ ద్రోతలగ్గు - సామ్రాజ్యంబున్. 54

తే. కుండపోతగ వర్షము - కురియుచున్నఁ
జెలఁగి నర్దిసఁ జిచ్చులు - చెఱగుచున్న
మిమ్ము వెన్నంటి వత్తుము - మిన్ను విఱిగి
మీఁదబడిన ననంబచే - లోమ్మిదమంది. 55

మంజరి

గుజ్జరి ప్రజలపై నొజ్జకునెంతో, విశ్వాసమున్నది వృథయొనర్పకుఁడు
ఇంతబృహత్కార్య మిద్దిమీమీఁద, నాధారపడియున్న దనినమ్మిరండు
ప్రతియూరుశిబిరమై పటుశక్తిఁజూప, ముదమార జాతీయ ముక్తిలభించు
వెఱపుమిమ్ములఁగాంచి వెఱచిపోవలయు, నాదర్శజీవులై యలరారవలయు
నగ్నిపరీక్షల కాగెడివారె, విజయదీక్షారతి వేంచేయుఁడనుచుఁ
బ్రతినవట్టినయట్టు బార్డోలినతఁడు, పల్లెపల్లెకునేగి పలుకుచునుండ
రాసనుగ్రామాన రాజిల్లువేళ, వల్లభాయినిబట్టి బంధించెఁ బ్రభుత
ఘూర్జరముగ్రమై ఘోషించిపిర, కంకణముందాల్చి కదలెఁగడంక. 56

వ. అటునట్లుండ నింకెట "మీయొనర్చు కృత్యము చట్టమున కసమ్మతమ్ము. శాంతిభద్రతలకుం గొడ్డటిపెట్టు. మదాత్మకు బాధాకరమ్ము కాన దాని మానుం" డని యిర్వినుప్రభువునుండి తంత్రీవార్తరా నిజనికటంబున నుపవిష్టుండైయున్న రాములఁగని యాశిషమ్మొలిడి యాశ్రమవాసులతో నిట్లను. ఈతండు రాజకీయ రంగమునఁ బ్రాథమకల్పికుఁడయ్యు నియమ పాలనంబునఁ దనకుంబూర్వుల నధిగమించుచున్నవాఁడు. ఇట్టివారు దేశమున వ్రేళ్ళపై లెక్కింపదగినవారుగ నుంద్రు. ఏతదాలయ కార్యనిర్వాహణాధికారిగనున్న నారాయణదాసుగాంధి కీతండు సర్వవిధ సహకారిగ మెలంగుచున్నవాడు. పటేలుంగారంద్రోఁతకు లోకము తుకతుకయుడుకు

చున్నది. దండియాత్రాసమయమాసన్నమైనది. విజయమో వీరమరణమో దీనందేలు. సహనశీలులు త్యాగధనులు సుశిక్షితులు నైనదేశభక్తులు డెబ్బదియొకండ్రు నాతోఁగలసి సత్యాగ్రహ మొనర్తురు. అందు ఘూర్జర జాతీయవిద్యాపీఠ పఠితలు గఁరని ప్రస్థాన సుముహూర్తమురా నిజాను చరులతో నీశ్వరప్రార్థనాదులు నిర్వర్తించి పయనింప సంసిద్ధముగనుండ సబర్మతీ తీరము నేలయీనినట్లు జనతతి గిటకిటలాడుచుండె. అహమ్మదా బాదు పౌరులు నానారాష్ట్ర నాయకాగ్రణులు విద్యత్కవివతంసములు పరిసరజనపదవాస్తవ్యులు దేశవిదేశాగత వార్తాపత్రికావిలేఖకులు ఛాయా గ్రాహకులు చలనచిత్ర నిర్మాతలు దాతలు పరివేష్టింప వేణుయష్టింగొని త్రివర్ణపతాకం బూని మౌనముద్రాలంకారుండై శిష్యబృందముతో వెడలు వ్యాసునివలెనొప్పు మహాత్మునకు జే యను ధ్వానంబులు విధ్యండకర్పర ఖిదా విధానంబునం దనర సీతాపతి గాంధీజీని ఖాదీసూత్రకృతగ్రైవేయ భూషితుంజేసి నమస్కరించి యొక్క నేరారోపణపత్ర మందీయఁ గస్తూరీ వల్లభుండది యాశ్రమకార్య నిర్వాహకుండగు నారాయణదాసున కొసంగ నతం డద్దానిం బఠించి తనతప్పు లందుంటకు లోలోఁగనలి యేలయిట్లు వ్రాసితని రాములనడుగ నాతండు నిర్భయముగ నాహృదయమున కెట్లుదోఁచె నట్లు లిఖించితినన నతండును శాంతించి శ్రీరాములు సత్యవాది యని గ్రహించె. అంత. 57

తే దారి కడ్డము లేకుండ – దర్శనార్థ
మిరుదెసం బ్రజ నిల్చి య – హీన భక్తిఁ
జిత్తముప్పొంగ గాంధికి – జే మదీయ
భరతమాతకు జే యంచుఁ – బలుకుచుండ. 58

కం. దండికిఁ బయనంబయ్యెను
దండి ప్రజానాయకుండు – తన యనుచరు లు
ద్దండ మనోదీక్షారతి
యండగ మెండుకొనియుండ – నత్యుత్సుకుఁడై. 59

తే. లలిత సాహిత్య సౌహిత్య – కళఁ జెలంగు
నతని మధురాతిమధుర భా – వాళి నూఁగి

శౌర్యరస భాసుర స్థితిఁ - జౌకళించి
సాగెఁ బ్రజ నాఁడపూర్వపుం - జైత్రయాత్ర. 60

కం. పురి పురుగులేదు విప్పిన
పురివోలెం దండియాత్రఁ - బొల్చె జనము సం
బర మేమిసెప్ప బరువై
ధరక్రుంగెనొ సర్పరాజు - తలతోఁ గూడన్.  61

వ. సర్వసర్వంసహా విఖ్యాతినందిన విజ్ఞానఖని ప్రఫుల్లరే ప్రశంసకుం బాత్రంబైన నయ్యాత్ర నస్లాలి, జంబుసారు, సూర, తానంద, రాసు, బోర్సదు, భరోంచ, నవసారి ప్రభృతి ప్రదేశంబుల దేశికుండాఁగుచు సత్యాగ్రహసమర ధర్మముల నుపదేశించుచుండ.  62

ఉ. కేవల మర్త్యమాత్రుఁడవె - కీడ్పడఁ దోడ్పడు దేవదూత వీ
భావన నిన్భజింతుము కృ - పానిధి నీపద ధూళిసోఁకుటం
బావన మయ్యె మానెలవు - భవ్యమనస్కులఁ జేసితీవ మా
దీవనకోల లందుకొని - దీవన లీవ యొసంగు బాపుజీ!  63

మ. అతిలోకుండవటంచు సర్వజనమా - హ్లాదమ్మమై డాయుచోఁ
గుతుకస్మేరముఖాబ్జుఁడై భరత భ - క్తుల్ మీర లీయుద్ధ మం
దతిశాంతస్థితి నిర్వరండని యతం - డాడంగ సోత్సాహులై
ధృతిమై దండునఁ జేరిరెందఱో ధరా - ర్తిధ్వంసదీక్షారతిన్.  64

కం. ఈదృగ్విధ గుణగణమణి
పాథోధి యతండు భరత - భాగ్యము పండన్
బాదచరుండయి దండికి
మోదంబున నరిగి యచటి - మున్నీటి దరిన్.  65

తే. లవణ శాసన ధిక్కార - లక్షణముగ
నుప్పు పట్టితిఁ బిడికిట - నొప్పుమీకు
నిట్టు సేఁతనా నందఱు - నట్టొనర్పఁ
బొంగె హృది గాంధి యలల ను - ప్పొంగెఁ గంధి.  66

వ. నిర్విఘ్నముగ నిష్టార్థసిద్ధి నందినందుల కీశునకు భరతధరణీశునకు జోతలు కృతజ్ఞతలు దెల్పి సమర్థులగు సత్యాగ్రహులు దేశమందెల్లెడల

ఇట్లొనర్పంబడునని సర్వసైన్యాధ్యక్షుండాతఁ డాంధ్రమున సాగరతీరము నంగల యెల్లజిల్లాల నుప్పుపట్టయుం బ్రోసిరి. ముఖ్యముగ గర్తపురీమండలమున గంజాము గణపవరము నిజాముపట్టణము మోటుపల్లి క్రొత్తపట్టణము దేవరంపాడు ప్రభృతి ప్రదేశంబుల లవణ శిష్టిధిక్కృతి జరిగె. మద్రపురి రాజాజి లవణశాసనధిక్కారమునం బ్రగాఢప్రత్యయమహాస్యుండై తత్సత్యాగ్రహ సమరమునం బాల్గొనఁగ. 67

ఉ. పాలకు లింతమాత్రమున – భారత దాస్యవిముక్తి కెంతయుఁ
జాలివహించి సమ్మతముఁ – జాటు టసత్యము మేఁకతోకనం
గూలునె కొండ కొంపఁ జొక – గుంపుగఁ జల్లిన వేఁడినీళ్లతోఁ
గాలునె యిండ్లు కావనుచుఁ – గన్పడకుండఁగఁ బోయె నత్తఱిన్. 68

వ. ఆంధ్రకేసరి మైలాపూరులో నొక యుప్పు సత్యాగ్రహ శిబిరము నెలకొల్పి. 69

తే. అతఁడు దీక్షించి గాంధిజీ – ననుసరించి
చెన్నపురి శిష్టి ధిక్కృతిఁ – జెప్పఁ దలఁచి
'ట్రిప్లికెన్‌బీచి' సభసేయ – విప్లవమున
వచ్చె జనసంఘ మద్దొరల్ – పిచ్చలింప. 70

మ. హరువొప్ప న్సభనున్న నప్పుజల న – శ్వారోహకుల్ సైనికుల్
కొరడాలంగొని కొట్టఁబోవుచు మహా – క్రోధంబుతో నల్లెసం
దిరుగంగాంచి ప్రకాశ మాభటుల మీ – ధీరత్వము న్నావయిన్
సరగంజూపఁగ రండనంగఁ జని రు–త్సాహంబు క్షీణింపఁగన్. 71

వ. సమజ్యాజయప్రదంబుగఁ జరిగెం గాని ప్రకాశము బంధింపంబడె. ఇవ్విధంబుగ నుప్పు సత్యాగ్రహంబు పలుప్రదేశంబులం బ్రదర్శింపం బ్రభుత్వము క్రోధోద్రిక్తమై దేశ దాస్యకుట్టకశక్తియుక్తుల మట్టుపెట్ట గట్టిపట్టుపట్టి రక్షకభట సైనిక నికరంబులం బంప. 72

తే. ఎఱ్ఱటోపీలవా రవు – డెఱ్ఱవారి
కఱ్ఱలన్బాదఁ బలువుర – పుఱ్ఱె లగలి
నల్లవఱ్ఱోడె జగమిఁది – యెల్ల యెఱిఁగి
కంటఁ దడివెట్టెఁ బ్రభుత పైఁ – గంటువుట్టె. 73

కం. బాదినది భారతీయులు
బాదించినవారు తెల్ల - వా రౌ రౌరా!
బాధయని పట్టువిడరిఁక
నాధైర్యంబరసి యమ్మ - హాత్ముడు ఘటులన్. 74

కం. అత్యాచారము లుడుగుఁడు
సత్యమునకుఁ గట్టుపడుఁడు - సత్కృతిదేశౌ
న్నత్యము న కన్మికనలక
నిత్యము ఋజుమార్గమంద - నిల్వుఁడనంగన్. 75

మ. అతినిర్లక్ష్యమునూపు తద్భటుల చ - ర్యంగాంచి దుఃఖించియుం
ధృతికోల్పోవక వచ్చె వాసమున కం - తేవాసి బృందంబుతోఁ
బ్రతిభాశాలి మహాత్ముఁ డట్టితఱి యా - పద్భారతం బాతఁడే
గతిమాకంచుఁ జరించెఁ జెప్పినటుశం - కాపంక నిర్ముక్తమై. 76

వ. కరాచీ కలకత్తా పాట్నాలం బాలకులు లఘునాళికలఁ బ్రయోగించి ప్రజంజముగీమునకంపిరి. దత్తాత్రేయరేవాచందులఁ బోరిగొనిరి. వేణియష్టి ఘాతముల జయరామదాసు దౌలతురాము మృతసదృశుండయ్యె. ఇత్తెఱంగున బ్రహ్మోత్తరంబుగాఁ బ్రవర్తిల్లుచున్న శిష్టోల్లంఘనమందరగిరి హూణనియంతృత్వాధికార వారాన్నిధిమథనోగ్రంబౌటం బరికించి ప్రఖ్యాత మహాత్ముం బంధింప నగ్గురునితో భాగినేయ సహితుండై పొట్టిశ్రీరాము లెఱవాడ చెఱ కరిగె. తత్కష్టతతికోర్చి నిష్ఠాపటిష్ఠుండై సబర్మతీ యోగి పుంగవునకు సదాసపర్య లొనర్చుచు. 77

చ. చెఱ గురుసేవసేయుటయె - శ్రీహరి సేవగ నెంచి యమ్మహా
పురుషుఁడు పల్కు నీతి నతి - పుణ్యకథంబలె నాలకించుచుం
బరమదయాంతరంగుఁడయి - భారతమాతృ విముక్తిఁ గోరుచున్
స్థిరమతి రాములుండెఁ బరి - శీలన చేయుచు ధర్మకర్మముల్. 78

తే. అల సరోజిని యట్టి స - త్యాగ్రహమున
ధృతి సడలనీక పాల్గొని - దేశికుఁడగు
నమ్మహాత్మునితోఁ జెఱ - కరిగి యచటఁ
పూల మొక్కలు పెంచె న - ప్పుణ్య చరిత. 79

వ. కారాగార విముక్త్యనంతరము కస్తూరీవల్లభు ననుజ్ఞవడసి సీతాపతి భూకంపమున నపార నష్టభ్రష్టముల నల్లాడుచున్న ప్రదేశమునకుం జని కని కరుణాతరంగితాంతరంగుండై యనంత ప్రజాసేవం బ్రదర్శించి యమోఘశ్లాఘాపాత్రుండై పిదప నహమ్మదాబాదు జాతీయకళాశాలాభ్యుదయ వాంఛాపరుండై దేశికశిఖామణ్యాదేశంబున నారాయణదాసు గాంధితో నటకేగి తద్విద్యాలయాభివృద్ధి కనన్యసామాన్యకృషి నల్పి యాదర్శజీవిత ఖ్యాతి నలరుచు సహచరుం డేగవలదనియెంత ప్రాధేయపడిన వినక శ్రమజీవి సంఘసహకార తత్పరుండై తరవాడఁజేరి నిరంతర కార్యాచరణదీక్షా దక్షుండై యశశ్శ్రీనందె. మరణశయ్యనున్న మాతులున కతి శాంతచిత్తుండై పరిచర్య లొనర్చి యగణ్యపుణ్య మార్జించె. అంత స్వరాష్ట్రసేవాసక్తుండై నిజవాంఛ సత్యాగ్రహ సమర స్రష్టకు నివేదించి యాశిషమ్ము లందుకొని నెల్లూరికి విచ్చేసి విశాలాంధ్రమ్మునఁ బర్యటించి లోపము లరసి వానిం జక్కసేయ నుత్సహించె. మూరెళ్ళ వైద్యశాల స్థాపించె. అట మధుపానము మాన్పింప దినద్వయ ముపవసించె. స్వదేశ పట ప్రచార కంకణధారియై యొంగోలు జువ్వలదిన్నె కావలి ప్రభృతి గ్రామసీమల గర్తపురీ కృష్ణామండలముల వేనవేలుగ రాట్నములు నెలకొల్పి నిత్య సూత్రక్రతుకృత్యమ్ములఁ గఱపె. సాధుసుబ్రహ్మణ్యాదులం గలసి యంగలూరి యాశ్రమమున కత్యంత సహకారియై రేషన్పెక్కిక్కట్టుల కిక్కయని దానిం దొలఁచం బెలుచ నిరాహార దీక్షంబూని యేల్పడి నుత్తుూతలూపె. 80

చ. హరిజన వాటికా నిచయ – మారసి వారలతీరుఁజూచి ని
బ్బరముగఁ జేరఁదీసి బహు – బంధురవాక్కుల గాంధి నీతులం
గఱపుచు దుర్వ్యయం బుడుగఁ – గల్గు సుఖంబిఁక మిమ్ము మీరలే
నరగున నుద్ధరించుకొనఁ – జాలుట సన్నుతి పాత్రమౌఁగదా. 81

తే. తనకుఁ దా సాయమొనరించు – కొను నరునకు
దైవమును దోడుపడు నంద్రు – తత్త్వవిదులు
మన ప్రవర్తన సరిచేసి – కొనని యెడల
శాంతి భద్రతలం బొందఁ – జాల మెపుడు. 82

తే. మనకు స్వాతంత్ర్య మబ్బిన – మఱుక్షణంబ
సహకరించును బ్రభుత మీ – సౌఖ్యమునకుఁ

గావున మహాత్మ మార్గానఁ - గదలి రండు
ఫలము గనుచూపు మేరలోఁ - గల దనంగ. 83

తే. కట్టుకొని యున్న యట్టులఁ - గాంచి వార
లపహసించిరి తొలుదొల్త - నతని వాక్కు
లన్ని విని ప్రజాసేవకుఁ - డంచు నమ్మి
యాదరించిరి హరిజను - లమిత భక్తి. 84

వ. ఇవ్విధంబున రాములు ప్రజాసేవాధురంధరుఁడై కతిపయ దినంబు లాంధ్రదేశమ్ముననుండి మరల మహాత్మునకు సహచరుఁడుగనుండ నబర్మతి కరిగె. 85

తే. కోర నిర్విను గాంధిజీ - గుంట్రడబల్ల
నభకరిగివచ్చె రిక్త హ - స్తములతోడ
నతఁడు లండను నుండంగ - హైందవమున
నాయకుల బందిఁబెట్టి ర - న్యాయ మనక. 86

తే. గాంధి బొంబాయి రేవులోఁ - గాలిడఁగనె
పట్టి చెఱసాల నెట్టిరి - పాప మనక
కాంగ్రె సుద్యమ మాపంగఁ - గాంచి ప్రభుత
యాంక్ష తొలఁగించె నెన్నిక - లవతరించె. 87

తే. అతి సమర్థతతోఁ బటే - లన్ని పనులు
నిర్వహించుచునుండ న - నింద్య గతులఁ
గెరలి కాంగ్రెసు పనినల్పి - కేంద్ర రాష్ట్ర
శాసన సమజ్యలం గొప్ప - జయము నందె. 88

తే. రెండవ ప్రపంచ యుద్ధము - రేఁగనుంటఁ
జేయరా దెట్టి సాయము - చివ్వ కన్న
వ్యక్తి సత్యాగ్రహమునకుఁ - బ్రథమ కబళ
మాయెఁగా వినోబా ప్రశం - సార్హుఁడగుచు. 89

## నేతాజీ యంతర్హితుండగుట

వ. అంతం దొరతనము తీవ్రతరదమననీతిం బాటించుచు రాజీవ్యతిరేక సమజ్యనుండి తిరిగివచ్చి "హాల్ వెల్ మాన్యుమెంటు" దొలఁగింప యత్నించు

చున్న బోసును భారతరక్షణ వ్యాజమ్మున బంధించి తద్గృహంబునం దుంచ నాతం డేకాకిగ నొకగదిం దపోనిష్ఠం దనరుచుండె. తద్ద్వారసీమ నీలవర్ణ యవనిక వ్రేలాడఁచుండె. లోనికరుగ నెవరి కధికారములేకుండె. తెఱకీవలనుండియె యాహారపదార్థము లందీయ భుజించి బాబు పళ్ళెర మును బరదాకు బయట పెట్టుచుండె. ఇట్లు కొంతకాలంబు జరుగ నొక్క నాఁడు నేతాజీ యిట్లాలోచింపం దొడంగె. 90

ఉ. ఓర్వఁగఁజాలనింక భర – తోర్వికి స్వేచ్ఛలభింపకున్కికిన్
సర్వము తెల్లమయ్యె నిఁక – జాగొనరింపక ధైర్యసాహసా
ఖర్వపరాక్రమం బెఱుఁగఁ – గా ననిసేయుట కొగ్గకున్నచోఁ
జర్విత చర్వణం బనఁగ – సాగు మహాత్ముని శాంతియుద్ధముల్. 91

వ. అస్త్రమస్త్రేణశామ్యతి యని చెవినిల్లుగట్టుకొని పోరితి. బాలాదపి సుభాషితమ్మనుట సబర్మతీ మహర్షి యెఱుంగఁడా. లౌకికాధ్యాత్మిక రాజ కీయ రంగానుభవముగల గాంధీజీ. 92

చ. సుముఖుఁడుగాఁడు నాయెడలఁ – జొన్పడు మద్వచనంబులం జెవిం
బ్రముఖులఁ బెద్దలంగని య – పారకృపామతి నాదరించుఁ ద
ద్విముఖత మన్మనంబునకు – వేదనగల్గు మదీయభావముల్
భ్రమయను నాత్మనిశ్చయముఁ – బాపుకొనంగ నసాధ్యమౌఁగదా. 93

తే. నాకు విజయంబు గలిగిన – నాఁడు గూడ
నేలొకో సంతసింపఁ డొ – క్కింతయైన
నే నొనర్చిన లోటేమొ – యెఱుకపడదు
ధీరుఁ డాధన్యు దృష్టికి – దూర మైతి. 94

ఉ. ఐనను మాన నాప్రతిన – నాహవదోహలులైన మత్సఖుల్
ప్రాణములొడ్డి నిల్వఁగల – బాహుబలాఢ్యులు జంకకింక ని
ద్రాణజనాళి మేల్కొలిపి – రంగమునం దిగునట్లు చేయరే
దాన జయంబు గల్గదొకొ – ధన్యత భారతమాత వెల్గఁగన్. 95

తే. అమ్మహాత్ముని యద్దులో – నడుగు వైచి
వార్చి యున్న స్వరాజ్యము – వచ్చుటకయి
యెన్ని వర్షంబు లిగ్గతి – నేగవలెనొ
తెలుపఁగలడొక్కొ యెంతటి – ధీరుఁడైన. 96

చ. వయసునఁ జిన్నవాఁ డితని - వాక్కులతోఁ బనియేమి యంచు ని
శ్చయముగ నెంచెనో రణము - సాధ్యముకాదని భీతిచెందెనో
భయమది యేలయంచు బహు - భంగులఁ జెప్పిన నాలకింపఁ డీ
నయవినయంబు లెట్టు మన - నాటికి బంధవిముక్తిఁ గూర్చునో. 97

ఉ. వేఁడిన నిత్తురంచు బహు - వేదనతోఁ బలుపాట్లకోర్చినం
జాడయొకింతలే దెటుల - సాధ్యము దాని గడింప మాటకుం
దోడయినట్టి కన్పడుచుఁ - ద్రోయును గాల మదంతెగాన నీ
కీడుఁ దొలంగఁజేయఁగల - కీలకముం బరికించు టొప్పదే. 98

ఉ. పాలకవర్గమెల నన - పాయసుఖస్థితి నుండుదారికే
కాలిడుచుండు దీని గుణ - గణ్యులు నిచ్చ గ్రహించుచుందు రా
వాలక మిట్టిదన్న నతి - వాదులు మీరని ధిక్కరింతు రే
లీలఁ బరిష్కరింపఁబడు - లే దనికంటెను మార్గ మొండిఁకన్. 99

తే. సర్వ సంతర్పకుఁడు గాఁడు - సార్వభౌముఁ
డంట తెల్లము స్వార్థము - మంటఁ గలిపి
మనకు స్వాతంత్ర్య మిచ్చున - న్మాట కల్ల
వినయమున వేయివిధముల - వేఁడుకొన్న. 100

తే. కాంతి విక్రాంతి చచ్చుట - ఘనతగాదు
మాయ పాచికలకు లొంగి - మనుట తగదు
నిండ మునిఁగినఁ జలి యెటు - లుండఁగలదు
విధికృతంబున కెందైన - వేఱుగలద. 101

మ. అసమర్థుల్భరతావనీ ప్రజలు నా - నాంగ్లేయ భూపుండిటన్
హసముఖన్ సాహసముం గనంబఱచు నా - త్మాలోచనల్గాచి నం
తసముం గూర్పఁగ దువ్వఁ బైకదియ తం - త్రంబంచు మేమెంచమే
రసనాగ్రోద్భవవాగ్విలాసి పరహ్మా - ద్రాజ్యంబు పాలించునే. 102

ఆ వె. కాంచి కాంచి కనులు - కాయలు కాచె నిం
కెంత కాల మిట్లు - చింత పడుట
అయ్యె వచ్చు వఱకు - నమవస యాఁగదు
కానఁ జేయఁ దగును - గదన మిపుడు. 103

తే. అధికారిక శాసన - మనుచు దొరలు
కదలినం జెఱసాలకుఁ - గదలుఁ డంద్రు
దానిఁ దప్పించుకొను గొప్ప - దారి యేది
నవ్య మార్గాన ఘోర ర - ణంబు దప్ప. 104

తే. ఇంత యంతని యనరాని - హింసఁ గనఁగ
బందిఁ గృశియించు దేశబం - ధులను గనఁగఁ
గొటికునకైనఁ గలుగునే - కరుణ యనఁగ
నన్యులనుగూర్చి వేఱుగా - నాడ నేల. 105

ఉ. కొందఱు నాదు మార్గమున - కు న్మనుమున్నుగ సమ్మతించి నేఁ
డెందులకో తొలంగిరి గ్ర - హింపఁగఁజాలఁ దదీయబుద్ధి లిం
కెంద రిటుల్లటించిన న - హించుచు మించుచు సాగిపోయెదం
గొందలమంద కుగ్రరణ - కోవిదు లాజికిఁ గాల్వుత్రవ్వరే. 106

వ. ఆఱుమాసంబులలో స్వరాజ్యమీకున్న యుద్ధమారంభింతుమని మున్నె యాంగ్లాధికారులకు వార్త నంపితి. అట్లొనరింపమే దేశమునకు మహా నర్థము వాటిల్లునని భారతజాతీయ మహాసభాధ్యక్షుఁడుగ నుద్ఘోషించితి. స్వేచ్ఛాసేవక సైన్యము మాతృభూమి నర్దైన విరాజిల్లవలెనని దార్శని కాంత ర్దృష్టితోఁబాటు రాజనైతికాంతర్దృష్టి వలయుననియంటి. నా మార్గము నచ్చక మహానాయకులు బలవంతముగ నాచేఁ బదవీత్యాగము చేయించిరిగదా! స్వాతంత్ర్య లక్ష్మిని గాంధీజీవలననే పొందవలయునని తద్భక్తుల యఖిలాష యగుటంజేసి సజీవమై ప్రగతిశీలమైన నా యాందో ళన వారిచెవికిం జేదయ్యె. బహుకాల విషసంయోగాహారస్వీకృతి మర్త్య మహావ్యాధిగ్రస్తుంజేయున ట్లనేక వర్షంబు లనుభవించిన దాస్యాంధకారం బిట శౌర్యధైర్యంబుల క్షీణింపంజేసె. విఠల్‌భాయి పటేలువలె నేనును ఖండఖండాంతరములం జరించి వాతావరణము గ్రహించితి. 107

ఉ. పరదేశంబుల సాయముం బడసి భా - స్వద్యుద్ధసామగ్రితో
పరసైన్యంబులతో మహోగ్రగతితోఁ - బ్రత్యక్షమై ఘోర సం
గరచర్యం జయమంది మాతృధరణీ - కష్టంబులం దీర్చెదం
జరితార్థం బదియంచు మత్ప్రజలు స్వే - చ్ఛావాయువు ల్పీల్వఁగణ.

వ. అప్పుడ. 109

కం. స్థిరజీవన రతులై సు
స్థిరదీక్షం గృషి యొనర్చి – సిద్ధించిన త
ద్వరఫలము లనుభవించుచుఁ
బరమ సుఖాస్పదు లనంగఁ – బ్రజ లుండురుగా. 110

ఉ. ధర్మము నాల్గుపాదములఁ – దాండవమాడఁ బ్రజల్స్వతంబు స
త్కర్మములాచరింత్రు నిజ – కార్యపరిచ్యుతినొంద రాత్మలో
మర్మము దాచఁబో రెప్పడ – మాయికులం దిగఁద్రొక్క రెల్లరున్
నిర్మలచిత్తులై సహన – నిష్ఠ సుఖింత్రిల నాక మోయనన్. 111

కం. ఎన్నడు స్వతంత్ర మబ్బునో
కన్నారం గనఁగ నాఁడె – కమనీయంబై
వెన్నెల రేవలె దేశము
చెన్నలరుం బూలతీవ – చెలువున నొప్పున్. 112

వ. అని భావించి సుదీర్ఘ రహస్యప్రయాణమునకుం గొన్నియేర్పాటులు మున్న చేసికొంటంజేసి ద్రుతగతి మాస్కోనుండి బెర్లిన్ నగరంబున కరుగందలంచి నిరశనవ్రతమాది శ్మశ్రువృద్ధిగావించుకొంట మౌలవీ వేషము ధరించి యద్వితీయ ప్రతిభాభాసియగు బోసు నిశీధిశిశిరకుమార చోదితశకటమధిరోహించి పూర్ణజ్యోత్స్నానంద మనుభవించుచు నతివేగముగఁ బయనించి పగటిపూఁట నొకచోట డాగి గోమోపురముసేరి "నేనరుగుచున్నాఁడ. నీవు తిరిగి పొ"మ్మని కడపటిమాట శిశిరబాబునకుం జెప్పి ధూమశకట మధిరోహించి పెషావరునకేగి సుహృత్సహకారంబునం బఠానుదుస్తులు తొడిగి విశ్వసనీయుఁడు విప్లవవీర కుటుంబస్థుండగు భగత్ రాము సహచరుండుగఁ బడసి యతని నామము రహమత్ ఖానని నిజాఖ్యజియాఉద్దీనని మార్చుకొని సుభాసచంద్రుఁడు బధిరునివలె మూఁగ తెఱంగు నటింప నిర్ణయించుకొని పఠాను బిర్బా రంగరక్షకులుగ లఘు నాళికలంబూని కొంతదవ్వరాఁ గష్టపడి కాబూలు సత్రముంజేరి ప్రణిధి బాధలు ధనదానంబునం దప్పించుకొని యుత్తమచందునింటనుండ. 113

తే. హానికరమని యెఱిఁగియు – నాదరించి
యమిత గౌరవముగఁ గాంచి – నట్టి యాతఁ

డేల మాస్కోకు మీరిప్పు – డేగు టున్న
సలరుషం గని బోసుపా – బనియె నిట్లు. 114

కం. జననష్టంబని సాయుధ
రణమొల్లక ధర్మబుద్ధి – రాజిల శాంతిం
బెనఁగిన కొలంది హూణుల
మనము కఠినమగుచునుండె – మార్గంబేదీ ? 115

వ. బ్రిటనుతో రణరతమై జర్మని యున్నది. రష్యా యింగ్లండునకుం బరమ శత్రువు. మాస్కోలో భారత స్వాతంత్ర్య ప్రచారకార్య మారంభించుట కిది శుభ సమయము. రక్తపాతశూన్యముగ హూణులు భారతము విడువరుగాన విదేశ సహకార మత్యవసరము. రష్యా విప్లవమునకు జర్మనులు పరోక్షముగఁ దోడ్పడుట పరాసుల సాయమున నమెరికా బంధవిముక్తి చెందుట జగద్విదితము. 116

తే తగ్గవాఁడెవ్వఁ డిప్పని – కొగ్గ కున్కి
నిద్ది నావంతెకా యని – యిట్టు బయలు
దేరితి మనోబలంబుతో – దేవుని దయ
భరతమాత జయంబును – బడయుఁగాత. 117

తే. అస్త్ర శస్త్ర ప్రయోగ వి – ద్యా ప్రవీణు
లవసరంబౌట వారల – నాశ్రయించి
సర్వవిధ యుద్ధ సామగ్రి – సైన్య తతిని
బడసి రణభేరి మ్రోగింప – వలయుననియె. 118

వ. అంత నిటలీరాజదూత సెనోరాకరోనియు నతని ధర్మపత్నియు నిగూఢ తీవ్రతర ప్రయత్నమొనర్చి విదేశయాత్రానుమతి పత్ర మాధికారికముగ లభింపంజేయుటంజేసి బోసు మాస్కో కరిగి యటనుండి బెర్లిను జేరె. 119

తే. అధిపతులు దన్ను ప్రేమించి – యనుమతి నిడ
యుద్ధ బంధితులం గూర్చి – యోర్పు నేర్పు
లెచ్చుగాఁ జూపుచు నజాదు – హిందుఫౌజు
పేరితో వేగ సైన్యము – వృద్ధిసేసె. 120

తే. సర్వసైన్యాధిపతియయి - జర్మను ప్రజ
సకల విధములఁ దనకెంతొ - సహకరింప
నాత్మతుల్యుడుగా హిట్ల - రమిత గౌర
వముగఁ గాంచఁగ నొకనాఁటి - పగటివేళ. 121

వ. బోసు హిట్లరొక్కసారిగ సైనిక వందనము స్వీకరింప శతఘ్నుల మ్రోఁతలు దివి భువిఁ బ్రతిధ్వనింప హిట్లరు తన వృతనంగని యోజర్మను వాహినీ వరులారా నే నెనిమిదికోట్ల ప్రజాస్వార్థ సంరక్షణ కిటనుండ మహామాన్యుఁడైన బోసు నల్వదికోట్ల భారతీయుల వాంఛాసిద్ధికి వచ్చి యుండె. మీ నేతపై మీరెంత భక్తిగౌరవములం జూపుదురో సుభాస చంద్రునియెడ నతని ప్రభుత్వమునెడ నంత గౌరవభక్తులం బ్రదర్శింపుడన.

ఆ.వె. పదునొకండు సార్లు - బందిని నన్నుంచి
దొరతనంబు పరమ - దురిత గతులఁ
బెట్టి రాని బాధ - పెట్టె దాని జయింప
వచ్చితి నని బోసు - పలికె నపుడు. 123

వ. జర్మన్జపానై మ్రైత్రినుంట బెర్లినుద్వ్యోవాణి బోసొసంగిన గంభీరవాఙ్ముఖ మాసియావాసులు విన(గలుగుట జపాను సాయమ్మునం దత్తండమ్మున మోహనసిం గజాద్‌హిందుఫౌజును స్థాపించె. జర్మను జలాంతర్గామి బోసు జపానుచేరి యటనుండి సింగపూరున కరిగి రాసబిహారి బోసు ప్రేరణమున ఫౌజునకు సభాపతిగనుండి యాంగ్లసామ్రాజ్యమునకుం బెట్టనికోటగనున్న సింగపుర మిపుడు భారతజాతీయవాదుల కంచుకోట యగుట ముదావహము. ప్రతిజాతి కుచ్ఛనీచస్థితు లనివార్యములు. ఒక నాఁడు సురక్షిత స్థితినున్న నగరదుర్గములు నేఁడు సామ్రాజ్య సమాధి భూములగుటం బరికించితి. అమెరికా జార్జివాషింగ్‌టనుకు సైన్యముంట రణమొనర్చె. గారిబాల్డున కండగ శస్త్రాస్త్రస్వేచ్ఛాసేవక సేనయుంట నిటలీ స్వేచ్ఛనందె. అదిగో భారతమాత దాస్యాయశ్శృంఖలాబద్ధయై దీన దృక్కుల నలుదిక్కులఁ బరికించుచున్నది. మీర తత్స్వాతంత్ర్య ఫల ప్రదాతలుగ నజరామరకీర్తి నంద నభిలషింతు. అంతస్సారశూన్య వ్యవస్థలు నిష్ప్రయోజనములు. వైళము త్రివర్ణ జాతీయపతాక ఢిల్లీ యెఱ్ఱ కోటపై నెగురవేయ భగవంతుఁడు మన సైన్యము నాశీర్వదించుఁగాక యనుచు. 124

ఉ. చారుతరైకమూర్తి ఘన - సాహసలబ్ధసుకీర్తి బోసు తా
ఘోరరణప్రచారభర - ఘోష దిగంతములెల్లఁ బర్వఁగా
భారతవీరరత్నసభఁ - బల్కె మహోజ్జ్వల భావసంపదల్
ధీరులు మెచ్చ శౌర్యరస - దీప్తులు తప్పటులందు హెచ్చఁగన్. 125

తే. అమ్మహాసభ సంతస - మతిశయిల్ల
బోసు కంఠాన వేసిన - పూలదండ
నొక్క ముస్లిము ధనమును - లెక్కగొనక
కోటిరూప్యంబులకుఁ గొని - చాటె భక్తి. 126

వ. రంగూను ప్రజల ప్రగాఢవాంఛమై సువర్ణ తులాభారము తూగి తద్ధనమంతయు స్వాతంత్ర్య సమరమునకు సమర్పించి ధ్వజినిం ఝూన్సీ మహిళాశాఖ నెలకొల్పి తన నాణెములం జెలామణికిఁ దెచ్చి వాణిజ్య కోశము స్థాపించి యాంగ్లేయులతో సంగ్రామ మారంభించి యనేక విజయములంది ఛలో ఢిల్లీ యను నినాదము చెలరేగంజేసి సాది ప్రాంతమున కరిగి. 127

తే. అట నజాద్‌హిందు సైనికు - లాహవమున
నమెరికా బ్రిటన్ సేనల - నడలఁగొట్టఁ
దాను గనులారఁ గని భట - తతిని మెచ్చి
విజయధైర్యంబుతో బోసు - వేడ్కనుండి. 128

వ. తన దొరతనపుఁ బద్ధతి కనుగుణముగ మఱియొక సంధికృత్యము నకై టోకియోకి బయలుదేరె. అంత సుభాసచంద్రుఁడు విమానప్రమాదంబున దివంగతుఁడయ్యె ననువార్త పత్రికాముఖంబునం దెలిసికొని సహజ సౌందర్య శోభాప్రభావమున ఘన సత్కీర్తి సుగంధగరిమమున సాగంధికమంబోని బోసు కడకట్టయ్యెనని భారతదేశ మపారచింతా పారావారమున మునింగె. జాతీయమహాసభాధిష్ఠాన వర్గపారిజాతమునుండి యొక ప్రధాన ప్రసవము రాలిపోయెనని. 129

ఉ. కాలపుఁ బోకడం దెలియఁ - గా వశమౌనొకొ యెంతవారికిం
జాలియొకింతలేక గుణ - శాలి చరించెడి యావిమానముం
గూలఁగఁజేసె దైవ మతి - ఘోరము లోటిది తీర దిద్ధరం
భాలనసేయఁగాఁ దగిన - భారతసింహ మదృశ్యమయ్యెగా. 130

తే. మతవిభేదము లన్నియు — మఱచిపోయి
మానవుల సేవయే మోక్ష — మార్గ మనుచు
దేశభక్తిని సానల — దీరినట్టి
జాతిరత్నము కటకటా - జాఱిపోయె. 131

కం. తరములు గడచిన దాస్యపు
భరమిది తీఱంగ లేదు - బవరమ్ముచేతన్
సరగునఁ దీర్చెద నంటివి
హరహర యది చూడకుండ — నరిగితె దివికిన్. 132

ఉ. ఎక్కడ జన్మభూమి మఱి — యెక్కడ నీ మరణంబు వీరుల
పక్కఁ జరిత్ర కెక్కుట స్వ — భావమనందగు వంగకేసరీ
చక్కనివాఁడవంచుఁ ఘన - సాహసివంచు నసూర్థివంచు ని
న్మక్కువఁజూచు నీ భరత — మాతకుఁ గన్పడవింక నక్కటా. 133

చ. అదనిది యుద్ధకృత్యమున - కంచు నంచంచలదీక్ష వైరితోఁ
గదనముచేయుచుం జయము - గాంచుచునుండఁ దదీయవార్తలన్
ముదమెదఁ బొందువేళ నిటు - ముంచె విచారమునందు దైవమా
బ్రదుకనిబిడ్డ బారెఁడను — భాష నిజంబనితోఁచె నిత్తఱిన్. 134

తే. భరత భాగ్యోదయమునకుఁ - బ్రాణ మిచ్చి
విశ్వ విఖ్యాతి నందిన - వీరవర్య
మాతృదేశ చరిత్రలో - మఱవరాని
స్థాన మందితి వీవు స — జ్జనవరేణ్య. 135

ఉ. క్రన్న జయేందిరా కలిత — కార్యకలాపుఁడవై ప్రజల్గడుం
మన్ననఁజూప సర్వజన — మాన్యతముండ వనంగనొప్పు నీ
కున్నది రాజభోగము మ — హోజ్జ్వలయోగ మటంచునెంచఁ దాఁ
దిన్నఁగఁ గాంచఁజాల కిటు -దేవుఁడు దూరముసేసె దానికిన్.136

శా. క్రౌంచారిం దలపింతు వుగ్రరణరం — గస్ఫార శౌర్యంబునం
దెంచంబోవాక స్వార్థముం బ్రజల మే — లే యిచ్చ కాంక్షింతువే
మంచిం బోషణసేయరా సురలు ధ — ర్మంబింక గెల్పొందదా
యుంచుదలంతిలి రెందఱో యతని స — త్యత్యాగమున్మెచ్చుచున్. 137

# తాత్కాలిక స్వరాజ్య స్థాపనము

వ. ఇంతకుముందు ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామ ప్రారంభసమయం బున నాయకాగ్రగణ్యులతో సంప్రతింపకయె భరతదేశము సమరమున కురికినదని రాజప్రతినిధి ప్రకటింప. 138

తే. జన్య మొనరించుటకు మహా - శయుఁడు లెవ్వి
భరత భూమికి దాన లా - భంబు గలద
యని మహాత్ముఁడు ప్రశ్నింప - నపుడు వైసు
రాయి బెల్లము గొట్టిన - రాయి యయ్యె. 139

తే. యుద్ధమున సాయ మొనరింప - నొల్లకున్కఁ
బ్రభుత నేతల బాధింపఁ - బ్రతిన పూని
కంటుగా నుంట మంత్రులు - గాంచి సరగఁ
బదవులఁ ద్యజించి రుద్యమ - భ్రాంతులగుచు. 140

తే. ఉచ్చనీచంబు లెవరికే - నుండవచ్చు
నిండియాయుండదింక మృ - త్పిండమట్టు
తెలిసి తెలియని యట్టుల - తెగినదాక
లాగు టెవ్వారికేఁగడు - లగ్గుగాదు. 141

తే. భారతంబన నదియెంత - భాగ్య మనుచు
లెక్కచేయక యున్కి నీ - చిక్కు లొదవె
శీఘ్రముగ దానితో సంధి - చేసికొనుట
యన్ని విధముల మేలని - యాత్మఁ దలఁచి. 142

తే. అట్టు సేఁత కయ్యమెరికా - పట్టు పట్టి
యాంగ్ల సామ్రాట్టునకు సల - హా నొసంగఁ
ద్రోసివేయంగఁ జాలక - ద్దొరతనంబు
తగిన రీతిగ నించుక - తలను వంచె. 143

తే. ఒక్కదెస వైరు లత్తఱి - నుక్కు మిగుల
వారికిందోడు బోసాక - వైపునుండి

యాత్మబలమున హైందవ - మాక్రమింప
సిద్ధముగనుండె ననువార్త - చెవులఁ బడఁగ. 144

తె. భరతభూమికిఁ జర్చిలు - పంపినంత
వచ్చె దూతగఁ గ్రిప్సు సం - బరముతోడఁ
గాని తద్దౌత్యకృత్యంబు - కడకదేమొ
యెవరికిం దృప్తిలేకుంట - నేగె నతఁడు. 145

వ. పిదప మహాత్ముని కట్టుకడపటి బ్రహ్మాస్త్రంబగు క్విట్టిండియా నిన దమ్ము విద్యుద్వేగమ్ముగ యావద్భారతమ్ము వ్యాపించె. గాంధేయ మార్గ గాముల విదేశ వస్త్రదహన ఖాదీవసనధారణ సురాపాన నిషేధా స్పృశ్యతా నివారణా సహాయోద్యమ నిర్వహణాదులఁ గని దొరతన మ్మనివార్య క్రౌర్యమ్ము మేరమీఱ వారలంగారలం గ్రుక్కింపం దద్దేశ భక్తులు కీటకావృత సూక్ష్మశిలాన్వితాన్నంబు మెక్కుటంజేసి భీమబలు లెందఱో రుగ్ణులై బందిఖానంద లోకంబది యెఱింగి వ్యాకులంబయ్యె. ప్రఖ్యాత నాయక నికరంబును బంధించిరని విని ప్రజలు విజృంభించి విధ్వంసక చర్యలకుం బూనుకొనం గొన్నియెడలం బ్రభుత్వమే స్తంభించె.

చ. జలధితరంగ సంఘముల - చాయ ననంతతరంగిణింబలెం
గలచెఱలెల్లనిండఁ దమ - కంబున వచ్చెడి రాజకీయయో
ధులఁగన నెద్ది యేల్బడికిఁ - దోఁపకపోయె నడంప నెట్టులో
బలమున మాన్పెఁ గాని తల - ప్రాణము తోఁకకు వచ్చె నత్తఱిఁ.

తే. యుద్ధ మతితీవ్రముగ సాగు - చున్నవేళ
నిండియా గెల్వ నరివచ్చు - చుండె ననఁగ
వేయి యూహల కలఁకతో - బ్రిటను మనసు
పెండ్యులమువోలె నూఁగెడి - వేళ సరగ. 148

తే. బవరమున గెల్వఁ గడకు జ - పానుమీఁద
నమెరికా వేసె నణ్వస్త్ర - మూఁగె రణము
పాసె మర్త్యంబునకు మహా - ప్రళయ భయము
శాంతిభద్రత లిల పొందఁ - జాలు ననఁగ. 149

తే. అంత నట్లీ ప్రభుత్వ మ - య్యాంగ్లభూమి
కవతరింప నతండిఁక - హైందవమ్ము

తనదు గుప్పిటిలో నిల్వ – దని యెఱింగి
దాస్య బంధంబుఁ బాపుటే – ధర్మ మనుచు. 150

వ. భారతాధిపతికిఁ దన మనోభీష్టంబుం దెలుప నతండు నాయక శిఖామణులతో దౌత్యకృత్యంబు నిర్వహింపుచున్న యెడ "జాతీయ మహాసభా సభ్యుల కొక్క పదవియు నీక సర్వసచివస్థానంబులు లీగున కర్పింతురేని దేశవిముక్తికి మీతో సహకరింప సంసిద్ధుఁడ" నని జిన్నాయన రాజప్రతినిధి యది యధర్మమని హూణసచివసభ రాయబారవర్గము సూచించిన యెన్నికలు జరిపించి కాంగ్రెసఖండవిజయము మండితము కాఁగా నూతన రాజ్యాంగ పరిషత్తేర్పఱచి చట్టమును రూపొందించి మహాత్ముని హితోపదేశ మందుకొని నెహ్రూ నాయకత్వమునఁ దాత్కాలిక స్వరాజ్య స్థాపనోత్సవము జరిపించునెడ జవహరు పటేలు రాజేంద్రాది ద్వాదశామాత్యులు బిర్లాభవనమునుండి వివిధ మంగళవాద్య ధ్వనులతో బయలుదేరి పూజ్య బాపూజీని సవినయముగ దర్శించి యాశీర్వాదములంది కొందఱ హితులం జేరఁదీసికొని రాజప్రతినిధి సూచిత సూక్తి ముక్తావళి నాదరించుచుం గార్యాచరణ ధుర్యులై యుండ నదిగని జిన్నా కోపించి దేశమ్మును జీల్చుకున్న యహింసా రహిత ప్రత్యక్ష చర్య సాగింప లీగుచేఁ దీర్మానము చేయించె. 151

ఉ. రాముని పెండ్లిలోఁ బరశు – రాముని గర్వమణంగినట్లుగాఁ
దా మదినెంచి లీగుపతి – తగ్గక తామసియై స్వదేశ సం
క్షేమముఁ ద్రోసిరేసి పలు – చిక్కులుగూర్చు మతైక కక్షలు
ద్దామ దవాగ్ని చందమునఁ – దార్కొనఁ బ్రేచెను వంగభూములన్.

మ. తొలుతం గాంగ్రెసునందు సభ్యుఁడయి యం–తోయింతొ గాంధీకడం
దెలివింబొంది మతైకదృష్టిఁ బరుఁడై – ధీమంతు లేమందురన్
తలఁపావంతయులేక నేఁటి కకటా – తత్సంస్థకే శత్రువై
జలధిన్ముంచఁగఁజూచు ధర్మపు న్నవ – క్షుభ్రాంతి మిన్నందఁగన్.

ఉ. ఎన్ని మతంబు లిద్ధరణి – నిత్తఱి నుండెనొ యన్ని ఖండముల్
క్రన్నన చేయఁగావలయుఁ – గా తనవాదముఁ బట్టి యేలొకో
యెన్నఁడు దీని స్వార్థమది – యెంతగ గుండెల గూడుగట్టెనో
పన్నె నహింసఁబాసి యతి – పాపపువ్యూహ మనంతశక్తితో. 154

శా. హిందూదేశమునందు హిందువులనే – హింసింపఁగా ఖడ్గమున్
సందేహింపకయెత్తఁ బ్రేచు నకటా – సర్వేశుఁ డీసత్య మా
క్రందధ్వానము లుప్పతిల్లుతటి లో – కంబందుఁ జాటింపఁడా
యెందే డాగినఁ బాయునే నరుఁడు దు – ష్కృత్యాఘవహ్నిచ్ఛటల్.

ఆ.వె. బంధు వట్టి యుండి – గాంధి మనముఁ జాలి
గొన్నవాఁడు చదువు – కొన్నవాఁడు
అర్య వరుల మాట – యమృతంపుఁ దేఁటరా
యన్నవాఁడ యిట్టు – లున్నవాఁడు. 156

శా. నిష్ఠాతోజ్జ్వల సర్వసద్గుణ దయా – నిర్భాగ్య ధర్మైకధీ
నిష్ఠోత్కృష్ట వివేకహీను కళలెం – దేఁ బొందునే మాన్యతన్
శ్రేష్ఠార్థ ప్రతిపాద వాక్యరచనా – శ్రీపాత్ర సిద్ధించినన్
సుష్ఠూచ్చారణశూన్య నాట్యకళ సం – శోభించునే భూమికన్. 157

ఉ. పూని యకృత్యముం దెలుప – ముందుగ నెవ్వఁడు కాలుత్రవ్వునో
వానిదె దోషమండ్రు బుధ – వర్యు లిఁకాత్మపరీక్షచేసికోఁ
గానఁగనౌ నిజం బటుల – గాక నికృష్టవుఁ బక్షపాతవుం
గాననసీమఁబడ్డ నరుఁ – గాల్చు దవాగ్ని దయావిహీనతన్. 158

తే. పిలిచి పిలిపించుకొనుటయె – ప్రీతి కరము
మ్రొక్కి మ్రొక్కించుకొనుటయె – ముదముఁ గూర్చుఁ
జంపి చంపించుకొను టేమి – సౌఖ్యహేతు
వెఱుకగలవారలకు రోఁత – యిట్టి చేఁత. 159

ఉ. చిత్తము దేశమెట్టయినఁ – జీల్చుటకే ములుసూపఁ దద్వ్యథా
యత్తమనస్కుఁడై యిహప – రాదుల నెంచక మిత్తిరూపమౌ
కత్తుల బోనులోఁ బ్రజలు – గాసిల మీసము ద్రిప్పుకొనుచుఁ దా
నెత్తురు కూటికాసపడ – నేర్చె మహాత్ముని గుండె వ్రీలఁగన్. 160

## నౌకాళీ ఘోరకృత్యములు

వ. అత్తఱి జిన్నా యనుయాయి యగు సుహ్రావర్దీ నేతృత్వమున లీగు నుత్రవథా వంగపాలలునాధికారము కరగతము చేసికొంటంజేసి తన్నాయ

కుల తీవ్రతర ప్రోత్సాహమ్మున మహ్మదీయాతతాయులు కుల్కాయుం జెల
రేఁగి నౌకాళిం గేంద్రమ్ముగఁ జేసికొని కలకత్తా ఢక్కా చిటకాంగు చాంద
పురము త్రిపురల హిందువుల నిక్కులఁ జెక్కసవారిం జిక్కఁబట్టి చిత్రవధ
గావింపఁ దద్రక్తము కాల్వలై నదులై ప్రవహింపఁ ప్రాగ్వంగ బంగాళా
ఖాతంబులు శతకోటి శోణాస్తరణ శోభితమ్ములనంచనరె. 161

తే. తనదు నూతన చర్యకుఁ – దగిన రీతి
సభలు హర్తాళములు లీగు - జరుపుఁ డనఁగ
వచ్చె నవకాశమని సుహ్రా - వర్ది సెలవు
నిచ్చె వలదన్న రాష్ట్రానఁ – దెచ్చె ముప్పు. 162

కం. బాలింతలఁ జూలింతల
బాలుర వృద్ధులను స్త్రీలఁ - బాపాత్ములెదం
జాలి యొఱుంగక నిజకర
వాలమ్ముల నఱికి పాఱ – వైచిరి వరుసన్. 163

తే. వేల గీములఁ దెగగాల్చి – వేలయిండ్ల
దోఁచుకొని హిందువులు తల - దాఁచుకొనెడి
తావులేకుండ నల్దెసం – దరిమి తరిమి
యాతతాయులు సంతోష - మంది రపుడు. 164

వ. హంతకులు హౌరావంతెనమీఁదం జేరి యనేక సహస్ర యాతాయాత
జనంబులంబట్టి యట్టె గంగలో విసరివైచిరి. హుగ్లీనదీ జలంబులపైఁ దేలు
చున్న మృతదేహంబుల కంతులేకుండె. రాజమార్గమ్ముల దగ్ధగృహంబులఁ
గర్దమకుల్యల శవసమూహము పడియుండె. ఢిల్లీలో నాదిర్‌షా చేయిం
చిన హత్యాకాండ కిద్దియుద్ది యనందనరెనని పెద్దలు తద్దదుఃఖించిరి. 165

ఉ. ఘోరదురంత కష్టములఁ – గ్రుంగెడి దీనులఁ గోడు చూడఁగా
నీరగు గుండె యన్న నట – నేతకుఁ జింతయొకింత లేదనం
గ్రూరతగాదె శాంతి నయ – కోవిదు లయ్యది మెత్తురే మహా
ఘోరముగాదె యట్టి నర - పాలుర మోయుట భూలతాంగికిన్. 166

వ. ధూర్తులు సప్తసహస్ర హిందువుల చిత్రవధ గావించి వింశతి సహస్ర
ప్రజల క్షతగాత్రులంజేసి తనిననక విజృంభించుచున్నతటి వ్యాఘ్రముచయం

బుంగన్న కురంగీ మచర్చికల తెఱంగున నికటంబున కేతెంచిన డేగతుటుము నవలోకించిన కపోత వనితలభాతి క్రౌర్యచర్యా నిర్వహణ ధూర్వహరక్షః పరివృత తపస్విజనాంగనలరీతి నిల్వనసీరై వడవడ వడంకుచుఁ గన్నీరు మున్నీరుగా శోకించుచుఁ దల్ల డిల్లుచున్న యిల్లాంధ్ర నిండుచూలాంధ్ర తరుణీ శిరోమణుల నపహరించి యిట్టట్టని చెప్పరాని హింసలు పెట్టిరి. ఇటనిట్టుత్పన్నం బైన ఘోర విలయాగ్ని కణచ్ఛటలు విద్వేషేర్ష్యాక్రోధ మహావాయు వశం బునం గొట్టుకొనిపోయి బంబయి పాంచాల ప్రభృతి స్థానంబులంబడి విజృం భించి యుగ్రజ్వాలామాలికల మానవాళిం భస్మము చేసివైచె. 'ఏకః పాపాని కురుతే ఫలం భుంక్తే మహాజనః' అను సూక్తి యిత్తఱిం బ్రత్యక్షసత్య మయ్యె. ఇంక నవకాళిం దుండగీంద్ర ప్రతిహత స్వైరవిహారము సల్పుచు బాకుల కత్తుల బల్లెములఁ జూపుచుఁ దమ మతమునఁ జేరుఁడని కొందఱ నిర్బంధించి బంధించిరి. గుళ్ళ దేవుళ్ళఁ గూల్చిరి. బళ్ళ నూళ్ళఁ గాల్చిరి. నవకోలా కుప్పమున నొక్క సదనమున కరిగి యైదువందల రూకలు లీగునకులుపోయీకున్న మిమ్మిప్పుడ చీల్చి కాకులకు గ్రద్దలకు వేయుదు మన భీతిలి వారాధన మొసంగిన మఱుక్షణమ తద్గృహస్థు కృత్త శిర స్కుంజేసి తదాత్మజు కంఠంబు నఱకి వలదన్న తల్లిని ముక్కలుసేసి యంతందని నసక వేఱొక్క వేశ్మమున కేగి యజమానిం జంపందలంపఁ దత్తనూజ కాళ్ళప్రేళ్ళఁబడి చతుశ్శత రూప్యములు మచ్ఛరీర శోభితా ఖిలాభరణము లిత్తునని యీ నొకచే నందుకొని వేఱొక్కకేలఁ దత్పిత్రృ పాదుని కుత్తుక నుత్తరించిరి. కర్పూరాపురస్థుఁడు ధర్మవాది సమితృధ్య క్షుఁడునగు రాజేంద్రలాల్ చౌదరి జరుగఁబోవు కాళీపూజ నజరక్తంబునకు బదులు తుఱకల శోణిత మర్పింతుననెనని యనృత ప్రచారమొనర్చి ప్రల్ల దీంద్ర కధిపతి షాపూర్వాసి దీర్ఘస్థూలకాయుఁడు గులాంసర్వారు భీకరనేత్ర గోళములు విస్ఫులింగమ్ములు చిమ్ముచుండఁ బ్రళయ సమయ బేతాళ సదృశ వికటాట్టహాస వికృత రసాన్వితుండై చౌదరిని వధింప దుండ గీంద్ర సంప నక్కఁతినాత్ములు భవ్యభవాన్యాలయమ్ముం బడగొట్టి విపణి శ్రేణిం గొల్లగొట్టి చౌదరి గేహమును ముట్టడించి శిలావర్షమును గురిపించుచుండ నాతం డాత్మతనూజ సహితుండై మార్కొని గూండాల

మున్నూర సంహరింపఁ దక్కిన గుంపు వైశాప చని యెక్కువ మూకం దోడ్కొనివచ్చి రాజేంద్రుని యింటికి నిప్పంటింప మంటలు రేఁగుచుండ నబలలు రక్షింపుఁడని యక్కుటిలమతులఁ బ్రార్థింప నిశ్రేణీసందిచ్చి వారు వెకిలిరాఁ బురుషుల వివస్త్రులంజేసి వంగఁబెట్టి యంగలపైఁ దబలు పెట్టించి బలిపశువులను జంపినట్లు చంపి పిదప శిశు బాల స్త్రీల ఛేదించిరి. రాయపూరున నివసించు నొక పండితవరేణ్యుఁడు రానున్న యాపదకుం గుమిలి తనయొద్దనున్న యిర్వదివేల రూప్యములతో రక్షకభటాధికారియొద్ద కరిగి రక్షింపుఁడన నతండు వల్లెయని కాచుచుండ హంతకులు చనుదెంచి బెదరింప నతం డవ్విద్వాంసుని వెలికినెట్ట తద్ధనంబు లాగికొని యిస్లాము మతమును స్వీకరింపుమన నతం డద్దాని కంగీకరింపమి నొక్కవ్రేటునఁ దలఁ దెగగొట్టిరి. ఇట్టి ఘోరకృత్యములు శతాధికముగ జరుగుచున్న వార్తలు వినుచు సుహ్రావర్ది గడ్డము దువ్వుకొనుచుండె. అత్తఱి. 167

తే. మతమహాద్వేషరోషాన – మనుజ వితతి
చెవుల కొనరని చెయ్వులు – చేయుట విని
కరుణ రసభాస హృదయుఁడై – గఫరుఖాను
హితమితోక్తుల సందేశ – మిట్లు పంపె. 168

తే. సకలలోకంబులకు దేవుఁ – డొకఁడెకాన
సర్వమానవు లాతని – సంతెనాక
శంక సోదరు లొండొరుఁ – జంపుకొనుట
తండ్రి కెంత విచారమో – తలపవలదె. 169

చ. గఱువలు సెప్పినట్టు మన – కర్జము దిద్దుకొనంగ లెస్సయౌ
కెఱిఁగి విభేదబుద్ధి నిటు – లేల చరింత్రు కలంత్రుధాత్రి నీ
దురిత మదింతనంత వెనఁ – దూలదు పోల దధర్మమార్గముం
జొఱఁ ద్వరమేలొకో యుడుకు – జుట్టుకొనం గడునోరుకాలదే.170

మ. జని యజ్ఞానియ మర్త్యుఁ డగ్గుణతమిజ్ఞా – జ్ఞానార్కబింబద్యుతిం
జనఁజేయం జనవంద్యుఁడౌ నిదిలసత్స–త్యంబు నిత్యంబు సా
ధనచే సత్క్రమమార్గముంబెరసి యం – తశ్శత్రులంగూల్చి పా
వనుఁడై దైవసమానుఁడౌఁ గడకు నం – భావింపుఁ డీపద్ధతిజ్ఞా.171

ఉ. చెట్టుతొలంగు మార్గమిది - చేతులు గాలినమీఁద నాకులం
బట్టుకొనంగఁ జూచుటది - భావ్యమె మున్ముగ భావినెంచుఁ డీ
పృట్టున నోర్పు నేర్పులను - బాసిన దాస్యమహాంధకార మిం
కెట్టు నశించు మానవత - కే మఱిమాయని మచ్చుఁ గూర్తురే. 172

కం. కాన సుఖానం బ్రదుకుఁడు
కానం గోనం జరించు - ఖగమృగ జాతుల్
కాన జగాన సమైక్యత
గా నటియింపవె ప్రియమ్ము - గాఁ బ్రజలారా. 173

ఆ.వె. ప్రజల మేలు కొఱకు - స్వాతంత్ర్యమును గోరి
జనము మతము పేరఁ - జంపుకొనుట
సుతవరమ్ము కొఱకు - పతి బలియిచ్చుట
కాన హింస మాని - ఘనతఁ గనుఁడు. 174

వ. నవి పంపిన తద్ధిత బోధనము బధిరశంఖారావమయ్యె. జాతీయ ప్రభుతనున్న లీగు సచివులు తమ శాఖల స్వేచ్ఛగ నేలందొడంగి దేశ విభాగ మత్యవసరమనుచుండ గాంధీ నెహ్రూ పటేలు రాజేంద్రాదు లత్యంత వేదనా నిమగ్నమానసులై ఢిల్లీనుండ గోరుచుట్టుపై రోకటి పోటుచందమున నౌకాళీ ప్రత్యక్షచర్య లప్పుడ బాపూజీ చెవింబడ వారలంగని నే నిప్పు డట కేగుచున్నవాఁడ. అయువున్నం దిరిగివచ్చెద నన శ్రీరాములు నికటంబున నిల్చి. 175

తే. ఆత్మగురుసేవ - హరిసేవ యంచు నెంచి
వినయ వినమిత గాత్రుఁడై - విమల బుద్ధి
నేను మీవెంట నచ్చోటి - కేగుదెంతు
నన మహాత్ముఁడు వానితో - ననియె నిట్లు. 176

తే. రావలదు నేఁడు నాతోడ - రామనామ
భావికాలాన దేశ సౌ - భాగ్యవాంఛ
నెన్నియో మంచిపనుల నీ - వెన్నుకొనుచుఁ
జేయఁ గలవని నాయాత్మ - చెప్పుచుండె. 177

తే. ఇఁక సబర్మతి కీవేగి – యేను దిరిగి
వచ్చునందాక వలచిన – పనులు ధర్మ
బద్ధముగ సాగునట్లుగా – వ్రతము పూని
నిలువు మచ్చోట నిర్మల – నీతి నిరత. 178

ఉ. చెప్పెడివారు చెప్పినను – జేసెడివారికి జాలిలేక యీ
తప్పుడు త్రోవ త్రొక్కిరెటు – దాగుఁ జరిత్రకు నెక్కకుండ నీ
ముప్పునణంప సాధ్యమొకొ – ముఖ్యగ దైవముమీఁద భారముం
తప్పకవైచి యేగుదు వ్య – దామథితంబగు వంగభూమికిన్. 179

ఉ. త్రిప్పుడు రాజ్యచక్రమతి – ధీరత నగ్నిపరీక్ష కాఁగుచున్
ముప్పున ముంచఁబోకుఁ డతి – మూర్ఖత దేశము మంట్రగక్కుచున్
నిప్పుల కుంపటయ్యెనని – నీతి నడల్పక నిల్చిగెల్వుఁ డేఁ
జెప్పఁబనేమి పెద్దలకు – శ్రీప్రమ వత్తునొ చత్తునో యటన్. 180

చ. అనిచన నార్తవంగమున – కచ్చటి మంతిరి సుహ్రావర్ది తా
ననుచరవర్గముం గని న – హాయము గాంధికిఁ జేయరాదనెన్
వినయముతోడ మ్రొక్కుచును – వే తన చుట్టునుజేరుచున్న యా
జనులనుగాంచి గాంధి కడు – శాంతమె మీకిఁక రక్షయౌ ననెన్. 181

వ. దీనజనబాంధవుఁడగు గాంధి మఱుదినంబు తన దళంబుతోఁ గాళీ ఘట్టమునఁగల సోదేపురాశ్రమముననుండ గత్యంతరములేక సుహ్రావర్ది యట కేతెంచె. తరణిండగ్గఱినకొలంది ధూమకేతువు వాలంబు హ్రస్వమ్మగునట్లు మహాత్ముం డాసినంతం గ్రోధంబు కొంతతగ్గ నాతండు బాపూజీ! గోహత్య యొనర్చు బక్రీదు వచ్చుచున్నది. అవ్వధ వలదన్న నేది యెట్లగునో. కాన నప్పండువు చనువఱకు నిటనుండుఁడన వల్లెయని యీ దుండగీంద్ర కధిపతివి నీవయని వల్వురన వింటినన మహాత్మా మిమ్మెన్నం బరోక్షమున నిందించువారు లేరా యనఁ గొలఁదిమందియైన నను మహాత్ముఁడంద్రు. నిన్నందురా యని హిందూ ముస్లిములు సరిసంఖ్య నుండునట్లు శాంతిసమితి స్థాపించి సుహ్రావర్దీ నధ్యక్షుంజేసి ప్రజా రక్షాభార మా సంఘముపై నిడె. ఇది యిట్లుండ నౌకాళీ మండలమున వణిక్కుణులుగ జీవయాత్ర నడుపుచున్న బీహారు హిందువులు వల్వురు దుండగీంద్రచే వధింపఁబడ శేషించినవారు రిక్తహస్తములతోఁ దప్పించు

కొని తమ జన్మభూమింజేరి యటం బ్రవర్తిల్లిన హింసాకర కథలు వ్యథతోఁ గన్నీరు గార్చుచుఁ గన్నులకు గట్టినట్లుగ్గడించిరి. చర్చిలు వేవెలు లీగున కండదండగనుంట కృచ్ఛభూయిష్ఠమైన రాజకీయ తంత్రమని విహార భూప్రజలు గ్రహించిరి. ఇది యింతనంతఁ దీఱదని యూహించిరి. ఓర్వ సమర్థతగ భావింపఁబడునని భావించిరి. కులవిభేదము లైకమత్యముం జెఱచి హిందువుల బలహీనులఁ గావించెనను నిశితరహస్య మవగతము సేనికొనిరి. హిందూమతము చచ్చుటో బ్రదుకుటో తేలవలసిన తరుణ మాసన్నమైనదని యెంచిరి. దానికిందోడు వంగరాష్ట్రమున హిందూస్త్రీల నానావిధ హింసలకు గుఱిసేసినతీరు హిందూమహాసభవారు కరపత్ర మ్ములద్వారమ్మునఁ బ్రచారమొనర్చుటంజేసి దురంత ప్రతీకారచర్యా భారధూర్వహులై తోఁకద్రొక్కిన కోడెత్రాచులవలెఁ గన్నులెఱ్ఱచేసి... నూపిన మదగజంబువలె ఘీంకరించుచు జూలువట్టి గుంజిగుంజి విడిచిన సింగంబులవలె గర్జించుచుఁ దప్తతామ్ర పాత్రపతిత జలబిందువు చందం బున వివేకంబు నశింపఁ బుణ్యాపాపంబుల నమీక్షింపక హిందువులు కొందఱు దుండగులై కత్తికిఁ గత్తియని యల్కమల్కలఁ బిల్కుమార్చు చుండ నవ్వార్త మహాత్ముని వీనులసోక నతండు చింతాజలధి మునింగి తత్క్షణమ చని తచ్చర్యల వారింపుమని న్నెహ్రూకుఁ దంత్రీవార్తనంప నతండు పటేలు ప్రభృతులతో నరిగి నల్దెసఁ దిరిగి దుండగములు జరిగిన వని లేఖ పంప మాంఘీరున శాంతి చేకూరువఱకు నేనిట్టుపాసింతునన.

ఆ.వె. ఎల్ల లేని యిల్లి — కీ వొగ్గుటన్న మా
కెగ్గ గాని నుంత — లగ్గు గాదు
మానవత్త్వముంట — మంట దూఁకిఁక శాంతి
కూర్పఁ గలము కరుణ — నేర్పఁ గలము. 183

వ. నీవులేని స్వారాజ్యము మాకేల. శాంతిభద్రతలం జేకూర్ప విశ్వ ప్రయత్న మొనర్తుము. నీ నిరాహారదీక్ష మానుమని నెహ్రూ ప్రభృతులు ప్రార్థింప బాపూజీ యర్థోపవాసదీక్షంబూనె. ఛపరాలో జన్మించిన తద్భ యంకర దావానలము ముంగేరు గయ పాట్నా మండల నగర గ్రామం బులకుం బ్రాక జవహరు వల్లభభాయి రాజేంద్రప్రసాదు లియాఖత్ అలీ

నిర్విరామంబుగ నయ్యాయి ముఖ్యప్రదేశంబుల నతిశీఘ్రంబుగం బర్యటించుచు సైనిక సహకారంబు సరగ సందనందున రక్షకభట సాహాయ్యంబున శాంతిభద్రతలు చేకూర్ప యత్నించుచున్న సమయమున గాంధీజీ యుపవాసదీక్షావార్త ఓహోరున వ్యాపింపఁగనే యుక్కార్చిచ్చు చాలవఱకు చల్లారె.

ఉ. అత్తటి వంగముంగని మ - హాత్ముఁడు తత్తరమంది మందికిం
జిత్తవిశుద్ధి శూన్యమని - చింతిలి ముస్లిములందుఁ జొచ్చి మీ
రెత్తినకత్తి దింపుఁ డిది - యే సహియింపఁగఁజాల లేద నా
కుత్తుక నుత్తరింపుఁ డని - కోరుచు వారక సంచరించుచున్. 185

మ. కినియింపందనకింపకున్కిఁ బ్రజలం - గేల్మోడ్పపై వేఁడఁ ద
జ్జనతం గొందఱు బుద్ధిమంతులు వెసన్ - శాంతిం బ్రతిష్ఠించుచుం
గినుకన్వీడి మహాత్ము గొప్పఁదనముం - గీర్తించి తన్మార్గమే
జనవంద్యమ్మని యెంచి సర్వజనర - క్షా దీక్షమై నిల్వఁగన్. 186

వ. మఱునాఁడు గాంధీ ధూమశకటంబునం బయనించుచుఁ గుస్తియా ప్రజలు తన్నుఁజూడరా దయలేని జాతి నిల్వదని తెల్పి యారాత్రి చాందుపురముననుండి మఱుదినము లక్ష్మమను పల్లియఁజేరి శరణార్థి శిబిరస్థుల నోదార్చి భగవంతుని నమ్మియుండుఁడని బోధించి మఱియొక కుప్పంబున కేగి నడివీధి నిల్చియుండ నొక శునకరాజము మహాత్ముండాసి మోర పైకెత్తి దీనదృక్కుల సబర్మతీ మహర్షి ముఖ మవలోకించుచు రెండు మూఁడు పర్యాయములు నేలంబసిపట్టుచు నొక బాటం జూపుచుం దిరుగుచుండ ననుచరులు దానిం దోలఁబోవ వారి వారించి దాని వెంటం జననట నొక గృహంబు దోఁచుకొనంబడి నిర్మానుష్యముగ నుంటం దిలకించి తిరిగి యవ్వేపితో వేఱొకచోటి కరుగ నచ్చోట నాయింటివారల నందఱ జక్కాడి యొక్క గుట్టగ వేసియుంటంగని గాంధీజీ దుఃఖసాగరమున మునింగి కన్నీరుగార్చె తన యజమానియెడ నక్కుక్కురము సూపిన విశ్వాసమునకు బాపూజీ మెచ్చుకొనె. సాయంసంధ్యకు చౌముహానీ పురమునఁ బ్రవేశించి యుభయపక్షములవారితో సేవాకార్యక్రమ మారంభించి ప్రార్థన సభ జరుగుచుండ మహాత్ముని రక్షణకుఁ బ్రభుత్వము పంపిన రక్షకభటులు యుద్ధవీరు లటకురా ముస్లిములు గజగజ వణఁకిరి. హిందువులు తెప్పఱిల్లిరి. హత్యలు దోపిళ్ళు జరిపించిన లీగు

నిష్కృతిలేని తన దుష్కృతము నంగీకరింపదేమి? సుహ్రావర్ది సూనృత
మును వాకొనఁడేమి? ఖురానిట్టి కిల్బిషచర్య లొనర్పవచ్చని చాటెనా?
ఇస్లామనశాంతిగదా! సలామాలేఖు మన నీకు శాంతిగలుగుఁగాక యని
గదా! యని సబర్మతీ మహర్షి పలుక షంసుద్దీనహమ్మదు దయార్ద్ర
హృదయుఁడై యిట నిష్కారణముగఁ గ్రూరు లొనర్చిన ఘోరకృత్యము
లిస్లామునకే గాక సర్వమానవ జాతికే మాయని మచ్చ. 187

కం. తులువతనంబున నన్యుల
తలలూరక నఱికి యెంత - తహతహపడినం
గలనైన వీరు తలఁచెడి
నెలవంకపతాక నిచట - నిలుపంగలరా? 188

ఆ.వె. ఇరుగుపొరుగువారి - నీరీతిఁ జెలరేఁగి
యేపఁదగునె యుసురు - పాపఁ దగునె
యైహికంబెకాక - యాముష్మికములేద
యంచుఁ బలుక నెవ్వ - రాఁగరైరి. 189

ఆ.వె. తన్నుఁ జంప ఖలుఁడు - తనపైకి వచ్చిన
నెంత భీతిపడునొ - యంతె గాదె
పరులకైననంచు - భావింప కక్కటా
చెప్ప రాని పనులు - చేసిరిచట. 190

కం. దుష్టుల శిక్షింపనిచో
శిష్టులకుఁ రక్ష యెట్లు - చేకుఱు ధర్మ
భ్రష్టులయి జనులు మెలఁగినఁ
గష్టమ్ము లెగాక సుకము - గల్గునె యనఁగన్. 191

కం. కని కరము నంతసంపడి
కనికరమునఁ జూచి యతని - కరమునఁ గరమున్
వినయమున నిడి మహాత్ముఁడు
ఘనబుద్ధివి నీకు జరుగుఁ - గల్యాణ మనెన్. 192

వ. పిదప గాంధీజీ నౌకాళీ మండలంబునంగల గోపైర్‌బాగను కుప్ప
మునం జొొఱ నటకరణమునింట నిర్వాది యొక్కంద్రం జక్కాడి గుట్టవేసి

కాల్చిరని విని కన్యంగుళ్ళ భూతలముం దడిపి నాటినిశకు శరణార్థి శిబిరమున్న దత్తపారా కరిగి యనంతరాహమ్మునవేడికోల్తలి మహా మ్మదీయులారా హిందువులతో వసింప మీ కిష్టముకాని చో వారు కంచము చెంబులతోఁ గదలిపోదురు. సత్యము తెల్పుఁడన ముస్లిముల యెదలుసిరౌటఁ గని వేటొకపల్లెం బ్రవేశింప నొక వేఁపి మూఁగ బాసతోఁ గస్తూరీ వల్లభుండాసి పసిపట్టుచు నల్లంత దూరమున కేగి మరలివచ్చి మహాత్ముని వంక దీనదృష్టులం బ్రసరింపఁ గెలంకులంగల లెంకలు కసర గాంధి వారి వారించి కుర్కురముపెంటం జన నట సప్తశవంబులతోడ దాని యజమాని మృతకళేబరముంటంగని బాష్పాంజలి ఘటించి తదుపది దాస్ఘురియాకుఁ బోవ సంకల్పింపఁ దన సేనలోని అమ్తుస్సలామను ముస్లిము కన్య ముందుగ వెడలి యిస్లామున కీడ్చిన స్త్రీలఁ దిరిగి హిందూమతమ్మునఁ జేర్చి వారితోఁగలసి రామభజనసేయుచు బాపూ సన్నిధికిరా నతండెనలేని ముదంబునం బొదలె. అంత సుహ్రావర్దివచ్చి పునరావాస కార్యక్రమము నడపుదమన రాజకీయ మహర్షి లెస్సయని శ్రీరామపురముననుండ బీహారు ప్రశాంతస్థితికి వచ్చెం బన్తుమానుఁడని రాజేంద్రప్రసాదు శాంతి దూతకుఁ దంతి యిచ్చె. అత్తఱి నొక ముస్లిము శతవృద్ధు గాంధీని దర్శించి యిట హిందువులు పడిన హింసలు చెప్పలేనని కన్నీరు కార్చుచు మూఁడు కాళ్ళ ముదుకఁడ నేనే మొనర్తునన. 193

కం. జిన్నా పుణ్యం బిది యో
యన్నా నీవెంత వగవ – నాఱని మంటల్
కన్నారఁ గాంచలేకిటు
కన్నీరోడ్చెదవు జీవ – కారుణ్యనిధీ! 194

కం. తన పూర్వు లెవరొ జిన్నా
మనమున యోచించెనా య – మానుష చర్యల్
గని మన పితృదేవత లా
రనిశోకదవాగ్నిఁ గ్రాఁగ – రా యనుకొనెనా. 195

కం. ఏమనవలె నాతని నెటు
లేమనవలె మనవిచనవు – లేమి ఫలించెఁ
రామరహీము లొకండని
యేమాడ సహింపఁ డెంత – యీర్ష్యయొ కనుఁడా. 196

కం. జానెఁడు పొట్టకుఁ దిండి య
నూనముగా బట్ట ప్రజకు - నొదవద యయ్యో
జ్ఞానుల పాలన యేటికి
ఖానాలేకున్న యాతు - ఖానా యేలా? 197

తె. ధర్మదేవత కిరవు స - త్య వ్రతంబ
యద్ది కలవాఁడ యగ్రపూ - జార్హుఁ డగును
అనఘుఁ డెవఁడహింసావ్రత - మాచరించు
నతని కీరేడు భువనము - లంజలించు. 198

కం. పిడివాదము నాడుల దోఁ
పిడివాదము ఖేదనాద - పీడిత జనతా
దృఢ సంతాప వివాదము
పడఁగూడని ఘనజనాప - వాద మనంగన్. 199

కం. ఇరువాగు వారి మదికిన్
సరసగతిన్ నచ్చఁజెప్పు - సాధూత్తంసా
కరుణాకర! నీ పల్కులె
విరసములని యెంచు టెంత - వింత మహాత్మా! 200

తే. నేర్పుగల తీర్పు సెప్పెడి - నిపుణతఁగన
బహుముఖ ప్రజ్ఞ కయ్యది - ప్రబల సాక్షి
అఁక సెప్పక త్వద్వాక్కు - లాలకింప
స్వర్గ సర్గానుభావము - సంభవించు. 201

వ. అనుచుండ నొక్క మౌల్వీ వచ్చి సత్యాగ్రహ స్రష్టకు నమస్సు మనస్సు లర్పించి యాతిథ్యమున కాహ్వానింప గాంధి వల్లెయనె. అంత నూరూర హిందూముస్లిములు సమాన సంఖ్యగల శాంతి సంఘముల నేర్పడి యేర్పరచె. పాంచాలరాష్ట్ర వాసులగు ముస్లిములు బాధితులకుఁ బంచసహస్ర రూప్యము లందఁజేసిరి. అస్సామునుండి ధనమేతెంచె. బోసు సైన్యమున సమర్థుఁడనిపించుకొన్న నిరంజనసింగు, జీవనసింగు, ప్యారీలాలు, సుశీలానయ్యారు, అమ్తుస్సలాము, సుశీలాపాయి, అభా గాంధి, కనూగాంధి, ప్రభుదాసు ప్రభృతులు నౌకాళిలో గాంధీజీ కనుచరులుగాఁ బ్రజాసేవ సేయఁ గొంత శాంతి చేకూరఁ బత్రిక లన్నియు మహా

త్మనిం బొగడె. ఇట నిట్లుండ విహారధరణిం బల్లెలఁ బట్టణములఁ బర్య టించుచు మతమైత్రి చేకూర్చుచు నాయకాగ్రణులు కొందఱు విశ్వమానవ ప్రేమ చాటుచుండ లీగువారు కోర సత్యతపస్యానిధి బీహారున కేగి యా గడీంద్రొనర్చిన రాక్షసకృత్యంబులు విని యయ్యాయిస్థలంబులంగని దుఃఖసాగరమున మునింగి మసౌరీయను పురంబున కరిగి ప్రాతసంధ్యా ప్రార్థనాసదస్సునం బౌరులు క్రిక్కిరిసియుండ సర్వజీవులలో నుత్తమ మైన మనుజ జన్మమెత్తి క్రూరతిర్యక్తతివలె సోదరమానవుల హింసించు టెంత విచారకరము. రాజప్రతినిధి మౌంటుబాటెన్ పంచదశ మాసంబు లలో మీ రాజ్యము మీకిచ్చి వెడలనుంటిమనె. చేతికందుచున్న ఫలమును జెడఁగొట్టకుఁడు. మీ రహింసాదీక్షకుఁ గంకణము గట్టుఁడు. 202

తే. ఆత్మవత్సర్వ భూతాని – యనెడి నీతి
నేర్పినది భారతీయులన్ – నిజ మెఱింగి
మన మహర్షుల మార్గంబు – మఱచిపోక
జీవకారుణ్యనిధులుగాఁ – జెలఁగుఁ డింక. 203

కం. కరుణాకరుఁడగు సుగతుఁడు
నిరతము బోధించె నెట్టి – నీతి "అహింసా
పరమోధర్మః" యనునుడి
భరతమహర్షులదిగాక – పరులదె చెప్పుఁడా. 204

తే. బాధితులఁ జూడ నాగుండె – వగిలెఁ గాన
కరము చాపుదు వారికై – కరుణ మెఱయ
నిండు మెండుగ నన దయా – న్వితమతులయి
చిత్త ముల్లుగ ధనము వ – ర్షించి రపుడు. 205

తే. ఇట్టి పను లెన్నడును సేయ – మిది ప్రతిజ్ఞ
బుద్ధి వచ్చెను బెద్దల – బోధవలన
మతములన్నియు మాకు స – మానమంచు
ఖిన్నులయి దుండగీంద్రు దుః – ఖించిరాత్మ. 206

వ. నాఁటిసాయంసధ్యాధ్యాన సమయమున శాంతిస్థాపనాచార్యా మతవై రములు మాకంటవు. హిందూముస్లిములము సోదరులవలె మనుచుంటిమని సెయిను బార్నీ గ్రామస్థులు వ్రాసిన జాబులు శరణార్థులకుఁ గొంత రొక్క

మజ్ఞాతశత్రువు చేతికి రా నతండంతులేని ముదంబంది యూవెన్క వీరను నూరనహింసా ప్రబోధమొనర్చి యాలరులు నిజదోషంబు లొప్పుకొని దీనుల మనుగడ కనేకవిధముల సహకరింపవలయునని తెల్పి యిట శాంతి చేకూర్చుటో నేఁజచ్చుటో తేలవలయుననఁ దులువలు తలలువంచి బాపూజీ చెంతకు వచ్చి క్షమాభిక్ష వేఁడిరి. అనంతర మసాదిహోయను కుప్పముం జేరి ప్రతిఘాత మేరికిం దగదు పరులు ధర్మద్రోహులైన మనమట్లు కావలయునా ? ఇఁక నొక్క ముస్లిమునకు హాని జరిగిన నది నాకు జరిగి నట్లెంతు. ఇటు విశ్వమానవ సౌభ్రాత్రుత్వము నెలకొల్పఁజాలనేని యేన మరణింతునన సమజ్వ్యాజనంబు లజ్జాభరంబునఁ గ్రుంగె. ఆవల గోర్ఖాను, పిపల్వా, పాటలీపుత్రము, జహనాబాదు, బెలాయి, యమాత్వా, నోక్రి ప్రభృతి జనపదముల సంచరించి శాంతిభద్రత లావరింపంజేయ రాజ ప్రతినిధి యాహ్వానింప నతండు కరి నగరమున కరిగి రాజకీయ చర్చలు జరుపుచుండ. 207

శా. పాంచాలంబున లీగు ప్రేరణమునం – బ్రారబ్ధ హత్యా క్రియల్
మించఁగా హిందువు లార్తనాదములతో – మీరైన రక్షింపుఁడా
యంచుం దంతిపురంబు సేరఁ గని కో – పావిష్టులై హైందవుల్
పాంచాలంబున నేర్చుకొంటిమని త – త్పాఠంబు వల్లించుచో. 208

కం. మలకలు మెలికలు దిరుగుచుఁ
దలదాచుకొనంగఁ దమకుఁ – దా వేర్పడమిం
దలయొక దెస కరిగిరిపో
నిలుచునె పెనుగాలి రేఁగ – నిప్పుక లోకచో. 209

తే. దూఁకు మనువాఁడు తోడుగ – దూఁకఁ డనుచుఁ
దెలిసికొనలేక హింసకు – దిగెడి తులువ
లెఱుఁగుదురె యెన్ని ప్రాణము – లెగురు ననుచుఁ
బెక్కు మూలల నిద్ది వ్యా – పించు ననుచు. 210

శా. దేవా యీశ్వర కావుమంచు శరణా – ర్థివ్రాత మాసీమలో
నావాసాశన దప్రదేశరతిఁ బె – ల్లల్లాడుచుందిర్గ ద
త్సేవాధుర్యతఁ గొందఱుండఁ గనుచుం – జింతించె బాపూజి నా
త్రోవంద్రొక్క రిఁకెట్లు మాన్పఁగలనీ–దుష్కృత్య మంచాత్మలో. 211

వ. నౌకాళింబలెం బాంచాలంబుస నతిశయించిన హత్యల కుద్దిక్తులై హిందూమహాసభా సభ్యులు ఘోరతర ప్రతీకార చర్యాన్వేషణ తత్పరులై యుండ వారి వారించుచుం గాశ్మీర భూనాథుం దన పథంబునకుం ద్రిప్పి కొని తిరిగి నౌకాళి కేగుచుం గాళీ ఘటమునంగల ఖాదీ కేంద్రమున విడిసె. అత్తఱి విభక్త బంగాళమునం బశ్చిమ వంగమునకుం బ్రఫుల్ల చంద్రఘోషు ముఖ్యమంత్రిగా రాం దోడనం గలకత్తాపురమున నిర్యాతన నిశ్చిత మనస్కులైన హిందువులు మారణహోమ మారంభించిరని విన్నంతం గన్ను దెఱచి తా రగుల్కొల్పిన మంటలు తన శక్తికిమించి మింటనంట వ్యాపించినవని గ్రహించి కార్చిచ్చు నడుమం జిక్కిన వేట కాని చందంబునం బరితపించి గత్యంతరంబు లేమింజేసి సుహ్రావర్ది వచ్చి శాంతిదూతకు జోహారు లర్పించి యార్తత్రాణపరాయణా యిట నిల్చి పౌరుల మాన ప్రాణములం గాపాడవేయని ప్రార్థింపం బ్రాగ్వంగ శాంతి భద్రతలకుం బూంటకాంపుగ నుందువాయన నన్యహార్గంబు గానమింజేసి వల్లెయన బాపూ యహింసాబోధకుం గడంగ సభ్యులం దొక్కండు లేచి.

తే. అనుదినముం మిత్తితోడం జె - లాటలాడు
మాకుం దెలియును నిచ్చోటి - మనుజ మహిమ
యంగలార్చెడి నౌకాళి - కండ యెవరు
దెబ్బ తిన్నట్టి వారికే - తెలియు బాధ. 213

ఉ. ఏలిక యిట్టు సేయ జను - లేలిక నూరక చూచుచుండ్రు మా
పాలికి వచ్చి ధర్మపరి - పాలన రాంగలదంచుం బల్కె దీ
గోల యెవండు నమ్మెవుడు - క్రూరుండు జీవములుండనిచ్చునా?
వాలు ధరింపకున్న యమ - పట్టణ మెన్నడొ చొచ్చియుందుమే. 214

కం. పంచునె హత్యకుం గ్రూరులం
బంచునె యాదేశమెల్లం - బలు ముక్కలుగా
వంచన మంచిది గాదని
యెంచండు తత్స్వార్థ దృష్టి - యెంతకుం దెచ్చెన్. 215

ఉ. ఘోర కఠోర కృత్యముల - గూఢముగా వెన రేంపుచుండంగా
భారత మాతృ సేవకుండు - భవ్యుం డితండని యందురే మహో

తోరపుఁ బ్రేమతోఁ బిలువ - తోఁకను జూపి విసంబు లేదనన్
ధీరులు నవ్వరే భరత - దేశజను ల్బహుకష్ట మొందరే. 216

కం. మిడిసిపడు క్రూరకర్ముని
గడుసాధువు నొక్కరీతిఁ - గాంచుట తగవే
పిడుగునకుం బియ్యమునకు
నడుపుదు రొకమంత్ర మేమి - న్యాయము సెపుఁడా. 217

శా. కంసారాతియు ఖడ్గవాదియయికా - కౌంతేయు గెల్పించె వి
ధ్వంస క్రీడనకాదె రాముఁడు జయ - ధ్యానంబు పూరించె ని
స్సంసర్గుల్మునుల ధ్వరక్రియల హిం - సా దూరులై యుండిరే
హింసంగాక యహింస రాజ్యరమ నెం - దే బొందెనే యెవ్వఁడే. 218

కం. గతము నశోచ్యం బందువె
క్షతనిహతుల మున్ను చూడ - జాలి గలుగదే
జతనమున మైత్రి గూర్చిన
నతుకతు కేగాక మొదటి - యట్టిటులుండున్. 219

ఉ. గుఱ్ఱమునడ్డి కళ్ళెమును - గూర్తురె కూర్చిన బండిసాగునే
యఱ్ఱులు సాచి వేఁడికొను - నార్తుల రక్షణ గోరి ధూర్తులం
బిఱ్ఱగు శాసన క్రియల - భీతిలఁ జేయనిచో స్వరాజ్యమం
దిఱ్ఱుల వ్యాఘ్ర మట్లమిత - హింస యొనర్పరె క్రూరులుగ్రులై. 220

చ. ఎఱుఁగరె రాజకీయమన - నెట్టిదొ యట్టి యమాయిక ప్రజా
మరణము లిట్టుసాగ వెన - మాన్పఁగఁ జాలని నేత నేతయా
దురితమదింతనంత మఱి - తూలునె కాలుని బాధతప్పునే
చరిత నశింపకిట్టగతిఁ - జాటద మీటద కల్పనాకథల్. 221

ఉ. ఓ భగవంతుఁడా యెచట - నుంటివి మామొఱలాలకింపవా
ప్రాభవ మెట్టొ దక్కెనని - ప్రాణము లిట్టిటుఁ దీయుచుండిరే
మాభయ మెల్లదీఱ వెన - మారణహోమము మాన్పుమంచుఁ జిం
తాభరితాత్ములై ప్రజలు - తాఱుచుఁ బ్రార్థనచేసి రీశ్వరున్. 222

శా. ఉన్నాఁడా భగవంతుఁ డిప్పుడతఁడే - యున్నం దయాదృష్టితోఁ
గన్నాఁడా మముఁ గావరావె యనఁగాఁ - గారుణ్య చిత్తంబుతో

విన్నాఁడా గజరాజుఁ గాచినటుగా – విశ్వంబు రక్షింప రా
నున్నాఁడా యని హిందువుల్ వగచిరీ – యుర్వి న్మహాభీతితో. 223

చ. గిరివరధీర ! ధీరహిత – కిల్బిషకృత్య వినోదవైరి హృ
త్వర ! పరమార్థ సత్యశుభ – భాసుర భక్తవిచార ! చారదృ
గ్వర ! వరదాత్య మోహగుణ – బంధుర భావవిభాస ! భాససుం
దర ! దరహాస శోభిత వ – దాన్య గుణాకర వేంకటేశ్వరా. 224

ఉ. నాఁడు గజేంద్రుఁ బ్రోచిన య – నంతుఁడు శ్రీహరి విష్ణుమూర్తి మా
గోడు వినండు చక్రమతి – కోపముతో వెసఁ బంపఁడేలొకో
నేఁడిఁక మాకు దిక్కెవరు – నిల్వఁగ నిచ్చట దారిలేదు కా
పాడుము శిష్టరక్షణ కృ – పాకర మావర వేంకటేశ్వరా. 225

వ. అని ప్రాణాలఱచేతంబెట్టుకొని చెల్లాచెదరగుచుం బ్రజానీక మల్లాడు వేళ ఢిల్లీ ప్రభుత్వము తత్క్షణమే రక్షించినదా ? హంతకులఁ గఠినముగ శిక్షించినదా ? ఆర్తుల రోదన మరణ్యరోదనమైనదిగదా ! 'అంగారశ్శత ధౌతేన మలినత్వం న ముంచతి' యనుట మీ రెఱుంగరా ? 226

తే. దాస్యబంధంబు తొలఁగిన – ధర్మవృద్ధి
కలుగుననఁ దొంటికంటె న – క్రమమె తోఁచెఁ
గొండ నాల్కకు మందింత – కోరియిడఁగ
నూడిపోయెను నక్కటా – యున్న నాల్క. 227

వ. దమన నీతిం దుర్జనుల యెడం బ్రయోగింపం గేంద్ర మద్వితీయ సంపూర్ణశక్తి సామర్థ్య సమన్వితమా ? ఐనచో నిట్టి ఘోరకృత్యము లింత సులువుగ నిట జరుగునా ? దిక్కులేని దీనజనుల మైతిమి గదా. మతేర్ష్యా దవాగ్ని సాధుమృగంబులం బోవె హిందువులు భస్మమగుచుండి రని తత్ప్రభుతకుం దెలియదా ? 228

తే. గోళ్ళు వెనుకకుఁ దగలాగి – కొనెడి వన్య
జంతుతతి యట్ల ద్రోహులు – సంచరింతు
రెంతకాలము మేము స – హింపఁ గలము
బ్రదుకలేము సుఖాన నీ – పాదమాన. 229

ఆ.వె. మొత్తుచుండ్రు మిగుల - మెత్తని వానిని
గట్టిలేని వాని - గొట్టె గఱచు
నండ్రు దాని నెఱిఁగి - యాత్మరక్షణకయి
కత్తిఁ బట్టఁ దగును - గదనమునకు. 230

వ. విషస్య విషమౌషధమ్మనిరి గదా విద్వద్వరేణ్యులు. 231

తే. నిదురఁ గూరిన ప్రజలపై - నిప్పుల జడి
కురిసినటు రాళ్ళవర్షము - క్రుమ్మరింత్రు
పుట్టఁ బడఁగొట్టు సర్పముల్ - పట్టు పడవె
యని తెగించితి మిది సత్య - మయ్య గాంధి. 232

ఉ. పూజ్యులు త్యాజ్యులంచుఁ జెడు - బుద్ధులు పుట్టుట నేఁడు పాపమే
ప్రాజ్యము దానిఁ బాపుదువె - రాట్నపుఁ జక్రముగాదు త్రిప్పఁగా
రాజ్యపుఁ జక్ర మిద్ది జన - రక్షణ శిక్షణలేక సాధ్యమా
యాజ్యము పోసెదే పరిభ - వాగ్ని మహోగ్రముగా వెలుంగఁగ౼.

ఉ. మానుము మాటలిట్టివిఁక - మానము పోయినఁ బ్రాణమేల యి
మ్మానవరూపరాక్షసులు - మాటలతో మది మార్చుకొందురే
జ్ఞానము దెల్పి నీవు చన - స్థానికుఁ డెచ్చటికేగు హంతకుల్
మానరు వారిచేష్ట యను - మానము లేదిది విశ్వసింపుమా. 234

ఉ. మాపడు బాధ చెప్పతర - మా పరమేశుఁ డెఱుంగుఁగాని మా
తాపము శాపమిచ్చుట వృ - థాయగుచున్నది వారు రేఁగుచోఁ
గోపము పాపఁగాఁ దగిన - కోవిదుఁ డుండునె పెద్దగాలిలో
దీపము పెట్టి నీమహిమ - దేవుఁడయన్నఁ జలింపకుండునే. 235

కం. సంధి యొనర్చెదె యిర్వుర
బంధంబులు పోయకుండ - బహుశాంతముతో
బంధుల యటు మెలఁగఁగ ని
ర్బంధంబునఁగాక ధర్మ - భావవితతితో. 236

వ. పెద్ద మనుష్యులుగ మధ్యవర్తులుగఁ జనుదెంచి మధుర మధుర ముగ మంచిమాటలు చెప్పి మరలి చను రాజకీయనాయకులకుం గలుగు కష్ట మేమున్నది. తల్లి గండము బిడ్డగండమే గాని నడుమనున్న మంత్ర

సానికి గండమున్నదా? అనుచుండ వేఱొక్కండు లేచి దిగంబరునకు గాఢాంధకారము సీలచేలమైన ట్లీయాలరుల కిచ్చుటె యేల్బడి పెట్టని కోట యయ్యె. తురుష్క పాలనమున హిందువు లెట్లల్లాడిరో చరిత్ర చదువ లేదా? స్పృహకు రాదా? అది మాఱినదనుకొంటివా? ఈ సుహ్రావర్ది నిజాధికారమున నెందఱం జంపించెనో సంఖ్యం దెల్పెనా? అట్టివానిం బిడ్డవోలెం జూతువా? మా బంధుమిత్రులం దెచ్చి మాకుం జూపుము. మా ప్రేగులు తఱుగుకొని పోవుచున్నవి. గాంధిం బోనిండు. మీపని పట్టెద మని ప్రాగ్వంగమున ధూర్తు లనుచుండిరట. 237

తే. కత్తి చూపుచుం గత్తుల - మొత్తి మొత్తి
మతమునం జేర్చుకొన్న య - మ్మనుజ సంఖ్యం
జెప్పతరమౌనె వారల - జీవితములు
చివఱ కేయొడ్డు పట్టునో - యెవం డెఱుంగు. 238

తే. ఏడ్చుచుం దండములు పెట్టు - నింతులం గని
లాగి రాదన్న సేనుండు - లాగినట్లు
బెదరి తొలంగిన విడువక - యదయులగుచు
సరగం బైంబడి రయ్యా కీ - చకునివోలె. 239

తే. వలదు వలదన్న చెల్లెలి - వంటిదాన
నన్న మిన్నక క్రన్ననం - దన్ని యీడ్చి
యబల లని జాలిలేకుండ - నడరి తొడరి
తరిమి కొంపోయి రౌర సైం - ధవుని భాతి. 240

తే. బవరమునం దమ్ము ఖండింప - వచ్చు నట్టి
శత్రువులం బిల్కుమార్తురు - క్షాత్త్ర పరులు
సాధు సజ్జనులను నిట్టు - చంపునట్టి
తులువ లేమయిపోదురో - తెలియం జాల. 241

తే. ఎంత కాలమునుండి వా - రిట్టి కుత్రి
యాత్మ నెంచిరో యిటు హిందు - వనెడి వాండు
మచ్చునకునైన లేకుండ - మచ్చుమాపం
దలంచినారేమొ చెప్పంగాం - దరముగాదు. 242

తే. ఎంతకాలము బ్రతికిన - నెవరికైనఁ
జావు తప్పదు గాన నీ - సమయమందు
మిత్త్రికిఁ దెగించి జగమెల్ల - మెచ్చుకొనఁగ
శత్రు సంహార మొనరించి - చచ్చుటె తగు. 243

తే. వలదు మీమతమన స్త్రీలఁ - బట్టి తిగిచి
తీసికొనిపోయి పెండిలి - చేసికొనిరి
యేమొనర్చిరొ కొందఱు - నింతుల నివు
డెటకుఁ జేర్చిరొ యీనాఁటి - కెఱుకపడదు. 244

తే. క్షితిని నేదేశమందైన - మతము పేర
జరిగెనే యిట్టి కృత్యముల్ - చరితఁ గనఁగ
నూఱు చెప్పిన మాఱదీ - ఘోరచర్య
యేమి కానున్నదో వంగ - భూమి నింక. 245

వ. మా ప్రాణములు పోయిన పిదప నీ స్వరాజ్యమువచ్చి మమ్ముద్ధరించునా? ముప్పదికోట్ల హిందువులు నీమాట విన నొక్కండెవ్వఁడో వినక యింతకుఁదే మాకు నీతులు సెప్పవచ్చితివా? చాలుచాలిఁకఁ గట్టిపెట్టుము. పొమ్ము పొకాలుమనుచుండ సబర్మతీ మహర్షిపై నెవఁడో దుడ్డుకఱ్ఱ విసర నది దైవవశంబునం దప్పిపోయి తలుపునకుం దగిలె. అంత గాంధి చిఱునగవుతో సఖికులం గని. 246

చ. సవినయబుద్ధి సజ్జనుల - సఖ్యమొనర్చెడివాఁడ నిచ్చలుం
బ్రవిమలవర్తనుండ జన - బాంధవుఁడన్ నను బాధపెట్టఁగా
నెవఁడిల నుద్యమించు నని - యెంచకు విశ్వరహస్య మారయన్
రవి శశి యంతవారలకె - రట్టొనఁగూర్పరె రాహుకేతువుల్. 247

చ. మఖశిఖి కాజ్యమిచ్చు ఘన - మౌని దవాగ్ని సహింపఁజాలునే
శిఖియను పేరి పక్షియు వ - సించునె వేసవి మండుటెండలో
నిఖిలజనం బసౌఖ్య ధర - జీస్థలి కాఁపురముండఁ జాలునే
సుఖము ప్రజాళికినియెడ - శోభిల నేర్చునె రాజ్యలక్ష్మియున్. 248

తే. తోడి మానవ ప్రాణముల్ - తోడితీసి
పెత్తనముసేయఁ జూచుట - వెఱ్ఱిగాదె

నీతి నియమాదు లన్నియు - నీటఁ గలిపి
బ్రదుకఁ జూచుట యెవరికేఁ — బాడిగాదు. 249

తే. ఉక్కు మానిసి సాహసి - యుగ్ర కోపి
మేరు ధీరుఁడు గుణశాలి - మేటి నేత
వల్లభునివల్లఁ జిక్కేమి — వచ్చునొ యని
యలుకమాన్పితి శాంతి బో - ధామృతమున. 250

వ. అన మహాత్ముని శిష్య శిఖామణులం దొక్కండు లేచి సభాస్తారులకు నమస్సు లర్పించి బాపూజీని నిర్లక్ష్యముగ మాటాడిన వానిం గని. 251

చ. చితికిన కాపురం బమిత - శ్రీఘమ యభ్యుదయంబు నొందుసం
చతులిత కౌతుకాన్విత హృ - దంబుజులై జనులుండ నింతలో
మత కలహంబు లేర్పడియె - మారణహోమము ప్రజ్వలించె నే
గతి యిది మాఱునో తెలియఁ-గా ఋషితుల్యునకైన శక్యమే. 252

శా. తాలుంగట్టి యెఱుంగకిష్ట కినుకం - ద్రాచౌచు నిట్టాడెదే
చాలుంజాలు నిఁకాఁపు మిప్పలుకులఙ - నత్యైకనిష్ఠాక్రియల్
గ్రాలంజాలఁగ మేలుగూర్చు ఋషినిం - గంజాత సంజాతునిం
బోలంజాలిన గాంధి నిట్లనుట యిం - పుల్నింపునే సోదరా. 253

చ. ఇది యెటుసాగు నింక గడ - యెక్కను మద్దెలఁగొట్టు నొక్కఁడే
గద నలుమూలలం బెనఁగఁ - గావ మహాత్ముఁడు విశ్వరూపుఁడా
మృదుహృదయంబుమైఁ గరుణ - యేర్పడ మానవ మానరక్షణం
బది పదిలంబు సేసికొను — నర్హత మర్త్యుల కుండఁజెల్లదే. 254

శా. పాపోఘాగ్ని ఘనాఘను న్నవయుగ - బ్రహ్మం బ్రజాసేవకుం
గూపస్తంబగు కప్పగాఁ దలఁతె భూ - గోళంబు గాలించినాఁ
డేపక్షంబున కేని మేల్దలఁచి న — త్కృత్యంబ బోధించు దు
ర్వ్యాపారంబన రూపుమాపు శుభసం - పద్వృద్ధి చేకూర్పఁగఙ.255

ఉ. హంత కులింత సేఁత హృద - యాబ్జము చిల్లులువడ్డవేళ నీ
వింత వచింపనేల? యిపు — డెల్లెడ జల్లెడవట్టివచ్చు మా
కంతయుఁ దెల్లమయ్యెను మ - హాత్ముని సన్నిధి నీ ప్రవర్తనల్
మంతున కెక్కుటన్న హను — మంతుని దగ్గఱఁ గుప్పిగంతులే. 256

ఉ॥ వాలుమెకంబువోలెఁ బడ - వాలు చరించిన నూరకుండునే
యేలిక యేలెఁకం గలుష - మెల్లను మెల్లన కడ్గఁజాలు ధీ
శాలి కృపాలవాలుఁ డిటు - శ్రద్ధమెయిం జనుదెంచియుండ మీ
కేలభయంబు సర్వము త్య - దీప్సిత మల్లనఁ జక్కఁబెట్టఁడే. 257

శా. జ్ఞానజ్యోతి వెలుంగుతావునఁ దమో - జాలంబు గాన్పించునే
మానుండింకఁ దదీయశంక జనతా - మాన్యుం డహింసావ్రత
ప్రాణాధారుఁడు రాజ్యదీక్షితుఁడు ని - ష్పక్ష క్రియావాఙ్మనో
నానాకష్ట విశిష్ట జీవితకథా - నంద్యాత్మపడ్డట్టుండఁగా. 258

తే. మనసు పోయిన చందాన - మత పేర
నుక్కుగోడలు గట్టి ర - త్యున్నచరిత్రఁ గనఁగ
నిత్య రక్షణచే నవి - నెగడు చు...
వాని భేదింప నెవ్వరి - వశము గాదు. 259

ఆ.వె. జన నైకమత్య - మఖిలషించి చరింప
శాంతి భద్రతలకుఁ - జావు లేదు
దీని మర్మ మెఱిఁగి - దేవదూతగ వచ్చె
గాంధితాత మనలఁ - గాచు నేత. 260

ఉ. కుమ్మరిపుర్వు తేనెనెటు - గ్రోలు సుమంబునుజేరి యద్దియా
తుమ్మెదకే తగుం గుమతి - తోరపు బత్తి మహాత్ముడాసి మో
దమ్మునఁ దద్వచోమృతము - ద్రావఁగలాఁడె సుబుద్ధి యద్ది తాఁ
గమ్మగ నాని జీవిత సు - ఖంబును గీర్తియు నొందుధారుణిన్.261

వ. సత్యాగ్రహసమర సత్రత్త్విజుఁడు మహాత్ముఁడు. సానుక్రోశాహింసా
రాధనతత్పరత నిమ్మర్షి హృదయమున రుషాగ్ని దవీయఃప్రేషితమయ్యె.

తే. చిత్త వృత్తి నిరోధ వి - ద్యాత్త మహిమ
సత్య వర్తన నయశాంత - సదయమూర్తి
మేలి శీలమ్ము-వాలుగా - గ్రాలు ధీవి
శాలు గాంధీమహాత్ము గు - ణాలు దలఁతే. 263

మ. విపరీత ప్రతిభాష లాడఁదగునే - విద్యా వయోవృద్ధులన్
గృపతో నాపలుకాలకింపఁ దగదే - కించి ద్వివేకంబుతో

జపహోమాదులకన్న మిన్నయగు సూ - నత్యం బహింసాత్మకం
బపవర్గ ప్రదమంచు జ్ఞాను లనరే - యావంత చింతింపుమా. 264

ఉ. ఎద్దును జూచి మేఁతయను - టెన్నవె యందఱు నొక్కరీతిగా
దిద్దఁ దరంబె యేరినెటు - త్రిప్పిన లోకము మేలుపొందునో
యద్ది గ్రహించి త్రిప్పుట మ - హాత్ముల లక్షణమౌట వారలా
పద్దశ వైదొలంగఁ దగు - పద్ధతి సెప్పి శుభంబు గూర్పరే. 265

వ. ఈ కర్మయోగి కలరూపు మెచ్చుకోలు మేల్మితెఱంగునం గనంబఱచుం గాని కొఱగాని గాలి బుడ్డల నుబ్బించుటకుం దలంపఁడు. స్వీయ షుద్రా శూన్యుండయ్యుఁ బ్రజారాజ్యాధిపతిగ వెలుఁగు. జీవుల ముఖ్యలక్షణము సంతానోత్పత్తి యనందగిన ట్లీమ్మహాత్ముని ముఖ్యలక్షణము జీవకారుణ్యము. ఈ జ్ఞాని చెప్పినంగాని ప్రజల హృదయమున నాటదు. శంఖమునఁ బోసినంగాని తీర్థము కాదు. 266

ఉ. ప్రాక్తన వాసనా భరిత - భావవిపాటన సత్త్వశూన్యతో
ద్రిక్తత ధర్మసూక్ష్మ పరి - ధిం గమనింపక క్రూరవాహినీ
భర్తను ధూర్తు నత్యమిత - పాపుని హంతకునైన నోర్చు సం
స్కర్తను నోర్వదిజ్ఞన మ - సాధ్యము చక్రము గాడితప్పుటల్.267

కం. తిన్నని మార్గము నరులకు
నెన్నుచు జగముద్ధరించు - నీతని ఘనతం
గ్రన్ననఁ బ్రశ్నించుట యన
మిన్నందిన వాని పొడవు - మీ రడుగుటయే. 268

చ. ఇనుమున కెట్టువట్టు చెద - లేటికి మేటికి వంక పెట్టెదే
మను మనువంశసంభవుని - మాడ్కి సమంజసచిత్తవృత్తిమైఁ
దనమన భేదమేద జన - తా ఘనతా పనివారణైకవా
గ్జనితవిశేషభావ నవ - సంస్కృతి సజ్జన సేవ్యమే గదా. 269

ఉ. పిన్నవు జ్ఞానవృద్ధు లిటు - ప్రేముడిఁ బల్కఁ బ్రశాంత బుద్ధిమై
నెన్నవ యుప్పుకప్పురము - లేకమ యందఱు నింద్యులుందురా
యెన్నరె యుత్తమాధముల - నిత్తడి పుత్తడి రాళ్లు రత్నముల్
వన్నెల నేకరీతిఁ గనఁ - బడ్డ షరాబులు విల్వఁ గట్టరే. 270

చ. పరుల లఘూకరించుట స్వ - భావము మానవకోఁటి కద్ది ధీ
వరులకు గిట్టదట్టుగుట - వారలు వల్కుదు రాఁచితూఁచి యు
త్తెఱఁగు గ్రహించి తీర్పఁగల - దిట్ట మహాత్ముఁడుగానఁ దద్వచ
స్సెఱఁగి చరించు టెల్లర క - హీన సుఖాస్పదమై చెలంగదే. 271

ఉ. జీవిత సర్వకోణ పరి - శీలన వెల్గిన జ్ఞానమూర్తి సం
భావిత సత్యకీర్తి పర - పాలన నొల్లనివ్యక్తి యిట్టియీ
దేవసమాను మాన్యుఁడని - దీవన లందుకొన న్విధేయులై
సేవలొనర్పఁ జెల్లు నిటు - చిన్నతనంబున నాఁడఁ జెల్లునే. 272

వ. అపృష్టోఽపి హితం వదేత్తని జ్ఞానవృద్ధులాడిరి గాన నే నింతగాఁ
జెప్పుచున్నవాఁడ. 273

కం చనుఁ జనదని కన కనయము
జనహింసా కృత్యములకు - సాగెడి నరులం
గని ప్రభుత మిన్నకుండునె
సునిశిత శిక్షా గరాగ్నిఁ - జూఁడక యున్నే. 274

శా. ఏతరి తఱిదొఱకిన నతి
పాతక మనుకొనక యెట్టి - పనికే నొగ్గుం
జేతమునకు వ్యతిరిక్తపుఁ
జేఁత యసాధ్యంబు సత్య - శీల ప్రవతికిన్. 275

కం. ముక్కున్ననాళ్లు పడిసెము
దక్కనె యన్యోన్య మిత్ర - ధర్మము చెడినం
జిక్కులఁ జిక్కరె విజ్ఞులు
మక్కువతో సంఘజీవి - మనుజుండనరే. 276

కం. సదయుఁడె దైవసమానుం
డదయుఁడె దైతేయతుల్యుఁ - డది పరికింపన్
హృది మంచిది కానిది యెది
పదిలంబుగ నొదవు సౌఖ్య - వార్నిధిఁ దేలన్. 277

తే. పూజ్యతములైన జ్ఞానుల - పుణ్య పథము
హీనముగఁ జూడఁ జాలునే - యెవ్వఁడైనఁ

గోరి నైవేద్యమును బుచ్చు - కొనుట కొఱకు
వామహస్తంబు చాచెడి - వాఁడు గలఁడె. 278

వ. ఈ రాజకీయమహర్షి మృదుమధుర వాక్కుల నాదరింపుము. కపిత్థం సర్వదా పథ్యమన్నట్లహింసా సిద్ధాంత మెల్లప్పుడు మంచిదేయన. 279

కం. సారమెఱిఁగి యీతం డట
సీరవుఁడై నిలిచె నీతి - నిర్మల దృష్టిం
గోరి భజించె మహాత్ముని
భారతమందార మంచు - భావించె మదిన్. 280

కం. పండిన యనుభవమున నొక
దండితనంబొప్పు గొప్ప - తత్త్వజ్ఞునితోఁ
మొండిగ నాడెడి బాలుఁడు
దండిగ వాదించి గెలువఁ - దరమగునె ధరన్. 281

వ. అంత శాంతిదూతయగు సబర్మతీ తపస్వి యమ్మహాజనసమూహము నవలోకించి యిచటి ప్రభుత్వ ప్రేరణమ్మున నింత జరిగెనని మీ వలన దృఢముగఁ దెలిసికొంటి. ఒక్కనాఁడు మదాశ్రమంబున సుప్రహవర్దీయనినేనంబోధింప నట్లనకుఁడు; బిడ్డాయని పిల్వుండనిపల్కిన మానవు నకిమ్మహాఘోరకృత్యములం బరోక్షముగ సంబంధంబుగలదనివిని చింతా జలధిమునుంగు చున్నవాఁడ. నిత్యసంస్కార సహితశిరోజముల సులువుగ దువ్వి ముడి వేయఁగలముగాని జడలుగట్టిన జుట్టుం జిక్కం దువ్విముడి వేయుట సులభసాధ్యమా ? 282

ఉ. ప్రాణిహితప్రచార మతి - పావనవర్తన మాత్మగౌరవ
జ్ఞానము వృద్ధ సాధు బుధ - సంగతి రాజిలు రాజనీతినిం
దానగుణైకలోలతను - ధార్మిక చింతను వీడి సర్వదా
హీనమనః ప్రవృత్తిగలఁ - డెవ్వఁడు నేతగ వర్థిలండిలన్. 283

ఉ. దారియుడొంకలేని పెడ - దారులు పట్టెడి క్రూరసంఘముం
దారికిఁ ద్రిప్పలేక యతి - దారుణ చర్యలొనర్చి లోకమున్
ఘోరదవాగ్నిలోఁ గుమిలి - ఘోషిలఁజేయు ప్రభుత్వ మేలరా
నేరకయెన్నుకొన్న నవి - నీతిగ నెంచి కలంచి మార్పరా. 284

వ. మతద్వేషదేవతకుఁ బల్లిపత్తనములు బలిపీఠములై నిరపరాధులు నిరాయుధులు నమాయికులు నగు సామాన్యప్రజలు బలిపశువులుగ నిష్కారణముగ వధింపఁబడుచుండిరేయని యహర్నిశలు శోకించుచున్నవాఁడ.

తే. రాక చింతిల రా గట్టి – రట్టు గలిగె
నేమి చెప్పుదుఁ బెండిలి – యేక గర్భ
జనితులకు నేకలగ్నాన - జయముగాని
చందమున రాజ్యకాంక్షలు - సంభవించె. 286

కం మతదంభంబున మాయురె
శ్రుతికింపని కృతులు నాదు – శ్రుతికిన్వచ్చెన్
బ్రతుకుదురె శాశ్వతంబుగఁ
గుతలముఁ బాలింపఁ గలరె – కుమతు లింకిటన్. 287

వ. హితముమతోద్రేకపిహితమైన పథ్యము తథ్యముగఁ దోఁపదు. మతము మానవనిర్మితమేగాని దైవదత్తముగాదను మూలసూత్ర మెఱుంగరీయమాయిక ప్రజలు. దేశము సాంస్కృతికముగఁ గన్దెఱవలేదు. ఇప్పుడిప్పుడే ఱెప్పకదలు చున్నది. 288

శా. ఈ గడ్డన్నలు మూలలం దిరుగనా – కేకాళ్ళు రావక్కటా
యాగుండెం గరఁగించు ఘట్టముల ము – ద్రద్వేనవేల్గో చెడెన్
సాగంజాలదురా స్వరాజ్య రథమీ – చందంబున న్వర్తిలన్
యోగం బెట్టిదియున్నదో కడకునే – నూహింపలే నీశ్వరా ! 289

తే. కూలికి విసమ్ము ద్రావెడి - కూళలున్న
నిబ్బరిక మెట్లు దేశాన – నివ్వటిల్లు
దయ్యముల ముందు బిడ్డలో – యయ్యె నరిగ
బ్రదుకగలరె ప్రశాంతితో - వరలఁ గలరె. 290

ఉ. ఐనను శాంతియత్న మెవు - డాఁపకుఁ డయ్యది జీవగఱ్ఱ యీ
మానవమాన్యజీవిక క - మానుషకృత్య వినోదులైన యీ
మానవరూప రాక్షసుల – మాటలు నమ్మి చరింప కాత్మ వి
జ్ఞానమె సర్వలోక ఘన – సౌఖ్యద కల్పక మంచునెంచుఁడీ! 291

తే. మ్రొక్కి మ్రొక్కించుకొనుటయే – ముదము గూర్చు
తిట్టి తిట్టించుకొను ఖేమి – తెలివి పరుళఁ

జంపి చంపించుకొను టది – సమ్మతంబ
యెఱుక గలవారలకు రోత – యిట్టి చేత. 292

ఆ.వె. ఔపనిషదవిద్య – కాలవాలంబైన
భారతాంబ కిట్టి – పాటు గలిగె
గోటఁ బోవు పనికి – గొడ్డలి యేల నా
మాట వినుఁడు మంచి – బాటఁ గనుఁడు. 293

ఆ.వె. మనసు మంచిదైన – మార్గము మంచిదౌ
తడిసి గుడిసె గట్టఁ – దగును జనము
పరులఁ జంపఁ దలఁచి – భస్మాసురుఁడు సచ్చె
ననుభవంబె యాత్మ – కరయ సాక్షి. 294

ఆ.వె. దూడ ద్రావకుండ – దుత్తన పడకుండఁ
గార్య హాని సేయఁ – గడఁగు నరుల
మనమెఱింగి మనము – మసలుట లెస్సయౌఁ
గాన శాంతిఁ గూర్చి – ఘనతఁ గనుఁడు. 295

ఉ. పిన్నలు జ్ఞానవృద్ధులగు – పెద్దల పల్కు లుపేక్ష సేయుటల్
మన్ననగా దనమ్మత మ – మానుషచర్య జగాన నేరికిం
దిన్నని యాత్మబోధగల – ధీరులు పొంగరు నిశ్చలంబుగా
నున్న మధువ్రతంబునకు – నుండునె ఝుంకృతి సృష్టి|నారయఁజా.

ఉ. కానక ధర్మ సూక్ష్మములఁ – గ్రౌర్యము శౌర్యమటంచు మించుచుం
బ్రాణము దీయనేర్తు వవు – రా మఱి ప్రాణము నీయఁజాలుదే
దానవ కృత్యు శీర్షమునఁ – దాండవమాడును దైవశాపముల్
దీనజనావనుండయిన – ధీరున కీశుఁడొసంగు దీవనల్. 297

చ. అన జనమానసాబ్జరవి – యై నిజవాక్తతి వెల్ల గాంధి బో
ధనధన దానదాసులుగఁ – దత్ప్రజసేసి మరొండు సీమకుం
జని తనశాంతి మార్గమును – జాటి జయంబునుబొంది శిష్యులం
బనిచె సమస్త దిక్కులకు – భద్రతకూర్ప జనంబుఁ దేర్పఁగఁజా.298

తే. వజ్ర సంకల్పమునఁ బరి – వార మెల్ల
ముదల యూదలఁ దాల్చుచు – మెదలు చుండ

వృత్తి కులమత యువవృద్ధ - భేద శూన్య
నీతి నియమైక బోధల - నెఱపె గాంధి. 299

తే. అతిభయంకరమైన యీ - హత్యల విని
యుదరి దేశము తుకతుక - యుడుకు చుండఁ
జెవులలోఁ జెట్టుమొలచెనాఁ - జెప్ప రొక్క
మాటయే లీగునాయకుల్ - మనసదేమొ. 300

తే. తాను మదినెంచినట్టి ప్ర - త్యక్షచర్య
కిదియ నాందియని యతఁడూ - హించె నేమొ
యింత జరిగిన జిన్నా య - దేమి చిత్ర
మొక్కపలుకైనఁ బలుకక - యూరకుండె. 301

తే. ఎట్టి తపమాచరించెనో - యెంత యాత్మ
శక్తి గలవాఁడొ గాంధి త - త్సూక్తి వితతి
మంచుఁ దడిసిన విడిపోవు - మదిర మత్తు
మాడ్కి మతవైర మట మాటు - మణఁగిపోయె. 302

వ. అటనుండి మహాత్ముం డనేక ప్రదేశంబుల కేగుచు హితబోధ సేయుచుండె. 303

# శ్రీరాముల ప్రచారము

తే. అంత రాములు దేశము - కొంత శాంతి
పొందెననుకొని గురునాజ్ఞ - నొంది యంగ
లూరి యాశ్రమమునఁజేరి - కోరి ప్రజల
చిత్తమలరంగ సేవలు - చేయుచుండె. 304

తే. ఆంధ్ర నేతృమణీ దృష్టి - కాగ కున్న
నిట్టు బ్రహ్మాస్త్ర తుల్యమై - నిచ్చ తనర
ముఖ్యవిషయాల గాంధిజీ - ముదల వడసి
యుద్యమింపుమమండి తా - నొక్కనాఁడు. 305

తే. ఏను నిర్మాణ కార్యక్ర - మైక నిరతి
నరుగుచున్నాఁడ నెల్లూరి - కనివచింప
నంగలూరి ప్రజానీక - మంగలార్చె
నాత్మబంధువు వీడ్కోలు - నట్టు లంత. 306

వ. విక్రమ సింహపురిం జేరి. 307

ఆ.వె. మద్య పాన ముడిగి - మంచి ఖద్దరు గట్టి
యంటరానితనము - గెంటివైచి
కణఁక దేశవృద్ధిఁ - గనుఁడంచు వ్రాసిన
యక్కరములు వెలుఁగు - నట్టుల జత. 308

తె. వెన్నున నురాన నమగతి - వ్రేలుచుండఁ
గేల మేలి మువ్వన్నెడా - ల్గ్రాలుచుండ
గాంధి కుళ్లాయి ధరియించి - ఖాది దాల్చి
భరతమాతకు జే యంచు - బయలు దేర. 309

చ. ఇతఁడొక వెఱ్ఱియంచు నవ - హేళనసేయుచుఁ గుఱ్ఱ లెందఱో
కుతుకము మీఱఁ జప్పటులు - గొట్టుచు నన్నని రాలు రువ్వుచుఁన్
ధృతిమతి వెంటనంట నతి - ధీరత చిర్నగవుత్తరంబుగా
జితమదుఁ డమ్మహాత్మునకు - జేయనుచుం జరియించు వీధులన్.310

ఉ. ఇగ్గతి మండుటెండల క - హీనహిమానికి వర్షధారకుం
దగ్గక రాచబంట్లు యతి - దారుణ చర్యలకు న్నదాశిరం
బొగ్గుచు క్షుత్పిపాసలకు - నోర్చుచుఁ బేర్చి స్వరాజ్యకార్య భూ
దిగ్గజమై సమైక్యతకు - దేవుఁ దలంచుచు సంచరింపఁగన్. 311

చ. ఎవరితఁ డేదియూ రిచటి - కేకత మేకత మిచ్చవచ్చె నీ
ప్రవిమల ధర్మబద్ధునకు - బంధువు లెవ్వరు నిత్యనిష్ఠతో
సవినయ బుద్ధితో నిటు ప్ర - చార మొనర్చుచు జీవన క్రియం
దవులఁడటంచు నెంచఁడు గ - దా యొకఁడైనను దత్పురంబునన్.

కం. రచ్చల నెచ్చట జనతతి
హెచ్చగు నచ్చటికిఁ జనుచు - నిచ్చ మహాత్మున్

సచ్చరితు నిచ్చ మెచ్చుచు
నచ్చపుటాసక్తిఁ బ్రజల - నతఁ డీట్లాడుఞ. 313

వ. దేశభక్తులారా! మహాత్ముఁడు మహానాయకుఁడు. స్థితప్రజ్ఞుఁడు. నిర్ధార్యుఁడు. నీతినిధి. రాజకీయ నిష్కామకర్మయోగి. ఐకమత్య నిగ్రహోత్సాహాదులు ప్రజం బ్రతిష్ఠింపంగల చతురమతి. కటుత్వరహిత పటుత్వ సహిత వచోరచనా బృహస్పతి. శమదమ దూరదృష్టి సహజస్ఫురణాధ్యాత్మికశక్తి యుక్తు లమ్మహావ్యక్తికిం బెట్టని సొమ్ములు. ఉష్ణోగ్రత సుస్థిరముగ నుంచు చర్మంబు చాయ తద్ధితోక్తి శాంతిభద్రతల స్థిమితపఱచు నని యెంచి యాలించి మేలెంచి యాచరింపందగు. శూకాగ్రబుద్ధి వజ్ర సంకల్పుఁడునగు గాంధీజీ సర్వపక్ష సంధానకర్త. అట్లగుటం దత్ప్రవర్తన మనువర్తనీయము. ప్రపంచ పరివర్తనము విద్యుద్వేగమని గమనింపమి గమ్య మగమ్య మగు. మలినాంధకారంబులు రోగవ్యాప్తి కనుకూలించు భాతి మూఢవిశ్వాసాహంతలు దేశతిరోగమనమునకుం దోహద మొసంగు. మతద్వేషము హృదయమున కంటినంతన నరస్పర్శ తగిలిన యత్తపత్తివలె మనుజుని వివేకము ముకుళించు. ఉద్దిష్ట నిర్దిష్ట లక్ష్యము లేని మానవుని జీవితము నిర్ణీతావతరణ స్థలశూన్య నౌకాయానమ్ము భంగి లౌకిక సాగరమ్మున నిరంతర సంచార సంచలన సముపేతము. సుమేరియా పార్శ్వ పరిశోభిత మెలము రాజ్య మపార రజత ఖని సమేత మగుట గ్రహించి పొంచి చుట్టుంగల యిలావతు లవకాశము లభించినప్పుడెల్ల తన్మండలముపై దండయాత్ర లొనర్చినట్లు భారతమాత రత్నగర్భ యని విని పరదేశ ధరాధిపులు సారెసారె దండెత్తి పూచిన మల్లెం గిల్లుకొన్నట్లు దోఁచుకొనిరి. నేఁడు దొరల కిద్ధర దుశ్చరగవి. అట్టి తదాన్యైచికిన్వదలుకొనుట కష్టతరము. అభిజనము దుస్త్యజముగాని వలస రాజ్యము లెరువుసొమ్ములవలెం బరువుచేటని సులువుగ విడుపరుగదా. పయోధిపవన ప్రసరణ ప్రాంతమున లోహక్షయ మధికమైన తెలంగుసఁ బరపాలన ప్రదేశమున ధనమాన హరణ మనూన మనందగు. అధికృతి కత్తి కిరుదెస పదను. ఐన నది లోపభూయిష్ఠము. పాప నికృష్టము. కావున మనము సుశిక్షిత దీక్షం బ్రదర్శించి సంపూర్ణ స్వరాజ్యంబు వైళము వడయవలయు. మనలో మన కత్యంత ప్రత్యయమున్న దైవము

సహకరించు. నాడునకూడిగముసేయు వాంఛమై మిము వేఁడుచున్న
వాఁడ. 314

చ. ఎముకలగూళ్ళు ప్రాణమున – నిట్టటు తిర్గుచునున్నయట్లు లీ
శ్రమపడు జీవులెల్లరుఁ బ్ర – సాద విహీనతఁ దోఁపఁ బాలకుల్
విమలమతిం దయామృతపు – వెల్లువముంచ ముదాన నిష్ప్రజల్
క్రమముగ శక్తియుక్తులయి – కమ్రశరీరులుగా వెలుంగరే! 315

తే. సకల కళ్యాణ సముదయ – సాధనంబు
గాంధి బోధామృతంబు త – ద్ఘనత నెఱిఁగి
యాత్మ గౌరవ రక్షణా – హ్లాద శక్తిఁ
గలఁగ కల్గక శాంతిమైఁ – గలని నిలుఁడు. 316

కం. హరిజనుల నుద్ధరింపుఁడు
హరి మిమ్ముల నుద్ధరించు – నాదిమ జనులన్
సరిసంఖ్య తారలంబలె
వరలుదు రనుకూల గతుల – వైభవ మలరన్. 317

కం. సాయము వొందఁ దలంచియ
సాయము నొనరింత్రు జనులు – సత్య మెఱుఁగమే
కాయలు కాచెడి తఱిఁదగ
తోయము లధికముగఁ బాదు – దొర్లింతురుగా. 318

చ. వెలిదొరలేల నేల పరు – వే బరువే కఱవే దురంతమౌ
నలుగులఁగాక కాకపలు – కాడక పీడక నిల్వ గెల్వఁగాఁ
గలవరమేల మేలనుచుఁ – గామక మామక వాక్కు విన్నచోఁ
గలుగు జయం బితోధికము – గా నదిగానరుగా సహోదరుల్. 319

తే. భోజ్యమిది మీకు నంచు స్వ – రాజ్య మిచ్చి
దొరలు పడమటి దీవికి – సరగఁ జనఁగ
నేడు లక్షల గ్రామము – లేక రీతి
భోగముల రాగములఁ దుల – దూఁగు టెపుడొ. 320

తే. అస్త్ర విద్యా ప్రదర్శన – మందు ముందు
కర్ణుఁడు కదర్థితుండైన – కారణంబు

కుల విభేద పిశాచ సం - కుచిత బుద్ధి
గాక వేఱొండు గలదె ని – క్కం బెఱుంగ. 321

ఉ. మీఁదులు చూచువాని కటు - మీఁదటఁ బొందునదేమిలేమి నా
మీఁదులు క్రిందులైనఁ దల - మే ఫలరూపము లుగ్గడింపఁ బెం
పేదిన నేదినంబయిన – నేరును నేరును బోలె నడ్డమై
వాదము భేదముం జరుపఁ - బాల్పడి బేల్పడఁజేయఁ జూడరే. 322

తే. పారిభాషిక పదసము – ద్భాసితముగ
వ్రాయు విజ్ఞానశాస్త్రమే – వన్నె కెక్కు
కరణిఁ గాలానుకూలమౌ - కార్య సరణి
ద్రొక్కి గెల్చినపుడ ఖ్యాతి – దక్కు మనకు. 323

తే. నరులు తరులు విడుచు గాలి – తరునరులకు
తెలియకయ ప్రాణవాయువై - వెలయునట్లు
ప్రాణు లన్యోన్యసహకార - పద్ధతిఁ గని
జీవయాత్రను గడపుట - శ్రేయ మగును. 324

తే. నిక్కి కోర్కులు పెనుగొండ - లెక్కుచుండ
నడుగున నదృష్టములు పడు - నన్న పోల్కి
మన పురోగతి కాఁకయై - జన తిరోగ
తికి దొరల్ నిచ్చ దారులు – తీయుచుండ్రు. 325

అ.వె. స్వర్గ సీమ కన్న – జన్మభూమియ మిన్న
యనరె బుధులు మున్న – యద్ది యెన్న
నఖిజనాభిమాన – మత్యంత శక్తిమైఁ
బ్రేవకున్నె మనలఁ – గావకున్నె. 326

కం. ఎన్నెన్నో తెన్నులు గల
వన్నా యీ రాజకీయ – మం దరయంగా
నన్నియు సమగ్ర దృష్టిం
దిన్నఁగ గమనించి మేలు – తెలియుం డనుచున్. 327

వ. సంపూర్ణ స్వాతంత్ర్య ప్రాప్తికిందగు సూక్తులు ప్రజలకు బోధించు చుండ గాంధీజీ సహధర్మచారిణియగు కస్తూరీబాయి నిర్యాణంబు సెంద

నాయమ జ్ఞాపకార్థము నిధిసేకరింప నాయకులు కృతనిశ్చయులై యొక్కొక్క రాష్ట్రమున కొక్కొక్కని కార్యనిర్వాహకుడుగ నిర్ణయించి యాంధ్రికి శ్రీరాములఁ గార్యదర్శిగ నియమింప నతండు తత్కృత్య మతిశ్రద్ధాభక్తుల నాచరించుచు నందఱవలెఁగాక నిర్ణీత వేతనమునుండి పొట్టకుంబట్ట కతిస్వల్పముగ గ్రహించి తక్కంగల ధనంబానిధింజేర్చుటా కర్ణించి భారత నేతలు సంతోషభరితులైరి. తత్సేవధి ప్రజోపయోగ ధర్మకృత్యముల కుపయోగపడుచుండ — 32౮

చ. పరమ సతీమతల్లి జన – వంద్య మహాత్ముని భాగ్యవల్లి సు
స్థిర కరుణాసమేత దిన – దివ్య తపస్విని నిచ్చ లెంతయేఁ
బెరిమ ముదాన భర్తృపద – వీనపపీయు శుభాంతరంగ క
స్తురి ఘనకీర్తి సౌరభము – సోఁకెను గస్తురిబావి మించుచున్. 329

# సంపూర్ణ స్వాతంత్ర్య మహోత్సవము

వ. అనంతరము హూణశకము వేయితొమ్మన్నూటనల్వదియేడాగస్టు పదునాల్గునాఁటి నిశీధింద్రుతీయయామారంభమున సర్వాధికార సమన్విత సంపూర్ణ స్వాతంత్ర్యము భారతపాకిస్థానముల కొసంగఁబడునని బ్రిటీషు ప్రధాని ప్రకటింపం జిన్నా తన వీడ్కోలు సందేశమున హైందవమున నున్న ముస్లిములందఱు భారతప్రభుత్వమునకు విధేయులై యుండవలెనన ముసల్మానులతనిచే వంచింపఁబడినటు నిస్సహాయులైనట్టు తలపోసి యజాదుతో మొఱపెట్టుకొనిరి. రెండు దేశములకు మౌంట్‌బాటెన్ రాజప్రతినిధిగనుంటకుం దొలుదొల్త నంగీకరించి చివఱకు తత్స్థానము తనకేకావలయునని జిన్నా కోరె. నిర్ణీత సమయంబున స్వాతంత్ర్య మహోత్సవ సందర్శనార్థ మనేక ప్రదేశాగత నేతృరత్న గగనయాన జాలంబులు హస్తినాపురవరంబున వైనతేయకలాపంబులంబోలె నిలాతలంబునకు దిగుచుండె తన్మహోత్సవదిదృక్షాయత్తచిత్తుండై శ్రీరాములు కరిపురమున కరుదెంచి తత్కృత్యములంబొల్గొనె. నానానగరగ్రామ సమాగత ప్రజానీకము రాజ్యసభా భవనముం బరివేష్టించియుండం దదం

తర్భాగంబున నవమల్లికా సదృశ ఖాదీవసనధారులై మానససరోవరం బున రాజహంసలవలెఁ బురుషులు కొందఱలర చిత్రవర్ణనేత్రాన్విత నానా విధవర్ణోష్ణీషాలంకృత దీర్ఘకాయులు కొందఱందందుం బారావతకుక్కు టాదుల మధ్యమ్మునంగల మయూర రాజంబుల రీతిరాజిల్ల బహువిధోజ్జ్వల వర్ణవస్త్రధారిణులై వనితామణులు ప్రేక్షకాసనాసీనలై యుండ నింద్రధ నుశ్శతం బొక్కచోటం బ్రత్యక్షమైనట్లుండె. క్రమముగ ఘటికాయంత్రపు ముండ్లు బహుకాలంబునకుం గలసికొన్న మిత్రద్వయంబుంబలెం గౌఁగి లించుకొని ద్వాదశసంఖ్యం జేరె. భేరీశంఖధ్వానంబులు మిన్నుముట్టుచుండ లార్డుమౌంటుబాటెన్ నిజరాజలాంఛనములతో విచ్చేసి సంపూర్ణ స్వాతం త్ర్యము భారతమునకిప్పుడిచ్చితిమని యాధికారికముగ నుగ్గడించె. అధ్యక్షస్థానమలంకరించిన రాజేంద్ర ప్రసాదు మహాత్ముని ప్రస్తుతించి జోహారులర్పించె. 330

తే. అమ్మహాహర్మ్యరాజమం - దలఘురీతి
వర్ణనాతీతముగ బహు - వర్ణ వితతు
గనులు మిఱుమిట్లుగొల్పెడి - కాంతిప్రభ
వెలిఁగె నారాత్రి దివ్వెలు - వేలకొలఁది. 331

తే. కర్మవశమున శప్తమై - కడకు ముక్తి
పొంది యానందమునఁ దేలు - పోలఁతి విధము
శీతవాతాతపములకుఁ - జెదర కగముఁ
జేరి తపియింప ఫలమును - జెందిన క్రియ. 332

తే. దాచుకొన్నట్టి ధనమును - దోఁచుకొన్న
వాఁడె కొమ్మని యిచ్చిన - భంగి దేశ
మంధకారాన నార్నెల - లలమటించి
యర్కుఁ గన్నట్టి ధ్రువవాసి - యట్టు దనరె. 333

శా. సాహంకారత నన్యరాజ్యదమనా - హ్లాదక్రియాదృష్టి నై
నూహాతీతబలాన్వితంబయిన యా - హూణాధికారంబుతో
బాహాబాహి పెనంగ నేఁటికిటు సం- ప్రాప్తించుటంజేసి యా
రాహుగ్రస్త విముక్త చంద్రునివలెన్ - రాజిల్లె నా డత్తఱిన్. 334

తే. నూట యేఁబది వర్షముల్ – దాఁటి పోవ
నేఁటి కీ వేడు కిటు జగ – న్నేత కరుణఁ
జేసికొను భాగ్యమబ్బుట – శ్రేయ మనుచు
నిండు సంతోషమునఁ జన – ముండె సభ్యుఁడు. 335

వ. అమ్మఱునాఁటి ప్రథమయామాంతంబున రాజ్యాంగ పరిషత్సమావేశ ప్రారంభకాలమున సచివముఖ్యులు రాజప్రతినిధిని సగౌరవమ్ముగ దోడ్కొని రా నాతనియాధ్వర్యవమునఁ గార్యక్రమ మారంభింపఁబడె. 336

ఉ. ఆదినశోభ నెన్నఁ దరమా – చతురాస్యునకైన సన్మనో
దీధితి రాజిలెం బ్రజల – దృక్కుల నత్తఱి వేదికాస్థలిఁ
మోదముతో లలాటమున – ముద్దుగ బొట్టును బెట్టి ప్రీతితో
నైదువరాం డ్రొసంగిరవు – డారతి మంత్రుల కాశిషంబులన్. 337

వ. ఇట్లు నెహ్రూపటేలులు పుణ్యస్త్రీలచే దీవింపంబడం బ్రేక్షకులు హర్షంబునఁ బూలవర్షము కురిపించిరి. ప్రధానిగ నుపప్రధానిగ నెహ్రూపటేలుల ప్రమాణ స్వీకారములు జరిగె. ప్రధాని సభాసదులనవలోకించి మహాత్మున కసమ్మతముగ ద్విమత సిద్ధాంత సూత్రప్రాతిపదికగ జాతి మత స్త్రీ పురుష భేదశూన్య సర్వసౌఖ్య సంకలిత సమైక్యతాన్వితాతి పవిత్ర వాంఛారించోళీసహితముగ ఖండితభరత ఖండమునకుఁ బ్రజా సత్తాక రాజ్యంబు ప్రాప్తించె. ఈ స్వాతంత్ర్య భానూదయ సమయమున మోడువారి నమన బ్రదుకులు దిరిగిచిగిర్చినవి. మూగపోయిన మన కంఠములు మరల శ్రావ్యగంభీరధ్వనుల వెలార్చినవని తత్క్షణ పావిత్ర్య ప్రాధాన్యతాద్యోతకముగఁ బలుక రాజ్యాంగపరిషత్సభ్యుల యానందమున కవధిలేకుండె. రాధాకృష్ణ గోవింద మాలవీయులు నిజవాఙ్ముఖశంఖారావమ్ము లాకసమంటనూఁదిరి. శ్రీమతి సుచేతాకృపలానీ "సారే... ...సే, అచ్చా హిందూస్థాన్ హమారా" యనుగేయమునాలాపింప భారత రాజ్యాంగపరిషత్తు తాత్కాలిక పార్లమెంటుగఁ బ్రారంభింపఁబడె. పెక్కేండ్లు పారతంత్ర్య చిహ్నముగ నిలిచిన యాంగ్లేయ పతాకనుడించి యాసాయంకాలము ఢిల్లీరాజపథమున భారతజాతీయ పతాకావిష్కరణోత్సవ నిర్వహణ బాధ్యత రాజప్రతినిధి కప్పగింపఁబడె. 338

శా. శీలంబొప్ప సమస్యసౌఖ్యతతితోఁ - జెల్వొంద మీరాజ్యముం
బాలింపందగు మీర లంచుఁ గడుసం - భావించుచుం బెక్కుచం
దాలం భారతవృద్ధికాంక్షమెయి నా - నాదేశము ల్పంపఁగా
"శ్రీలస్వేల్గుత" యంచువచ్చె నపుడా - శీర్వాద పత్రావళుల్. 339

శా. వానింగొన్ని పఠించెమంత్రి విని సం - భావించుచుం బ్రాభవ
శ్రీనందం భరతంబు కీర్తిరమతోఁ - జెన్నారెడిం గౌరవ
స్థానంబిప్పుడు సర్వదేశజన హృ - త్స్నేహంబునం గల్గె నం
చానందాంబుధి నోలలాడి రపుడ - య్యాబాలగోపాలముల్. 340

తే. దివ్యతరముగ బాలికల్ — దేశ భక్తి
గీతములు పాడి రప్పుడా — చేత మలర
నాఁటి పౌరుల సముచితా — నందమునకు
దోహదంబుగ విజయ దుం — దుభులు మ్రోగె. 341

తే. పాంచభౌతికమైన ప్ర — పంచమందు
విజయ చిహ్నముగాఁ గడు — వేడ్క మీఱ
వరుసగాఁ బ్రేల్చిరి శతఘ్ని — పంచకంబు
దివిభువులు నొక్కరీతిఁ బ్ర —తిధ్వనింప. 342

తే. ఇంతకాలంబునకు స్వేచ్ఛ — యిపుడు వచ్చె
వేయి విధముల ముందంక — వేయు కతన
భాగ్య భోగ్యంబు లలరఁగ — భరత భూమి
శత్రుదుర్భేద్య మని ధ్వని — చాటె ననఁగ. 343

తే. పారతంత్ర్యాంధకారంబు — పాయుకొఱకు
ప్రాణములఁ బాసి దివినున్న — భరత వీర
వర్యు లాశీస్సు లిడుచున్న — భాతి నచటి
ప్రజలు చల్లగఁ బైనుండి — పడియెఁ బూలు. 344

తే. నినదవర్ధకయంత్రముల్ — నిఖిల దిశల
నమర లక్షల ప్రజ లుప — న్యాసములను
స్పష్టముగవిని యానంద — జలధి మునిఁగి
తేలిరిఁక నూత్నయుగమని — తెలిసి కొనుచు. 345

కం. సురవైరుల నోడించుచు
వరబుషులం బ్రోచు దివ్య — వందిత పదుఁడౌ
గిరిధరు పుటభేదనమనఁ
గరిపుర మొప్పారె విజయ — కళ్యాణ రమణ. 346

చ. అతుల తపస్సు కల్మిఁ బర - మాత్మనుగన్న తపస్విరీతి సు
స్థితిఁ బురలక్ష్మి నవ్యదశఁ - జెన్నుగ భూషితయై వెలుంగఁగాఁ
గుతుకముతో సతీపతులు - కోరి యలంకృతులై కనంబడం
బ్రతిదిశ పెండ్లియిల్లువలె - భాసిలె నూత్నమహోత్సవంబునన్. 347

మ. అలరుందండలు ద్వారసీమ నయనా - హ్లాదంబుగా వ్రేలఁ జె
న్నలరం గేతనము ల్నికేతనములన్ - హత్తంగఁ గైసేతలం
దిలకింపం బులకించు దేహ మరెరే - దేవేంద్ర లోకంబుగా
నలరారెం గరిపట్టణంబు సురల - త్యాసక్తి వీక్షింపఁగన్. 348

శా. అంతశ్శాంతిభిదావ్యథాకలితజ - న్యాలోచనాదాస్యవుం
ధ్వాంతం బంత తొలంగ సర్వజన హృ - ద్యస్ఫూర్తి రాజత్కళా
నంతశ్రీ వెలుఁగొంద సంతసముతో - నాసేతు శీతాచల
ప్రాంతంబెల్ల మహోత్సవక్రియల సం-రంభంబుతో నొప్పఁగన్. 349

మ. పరదేశారుల కాఁకకట్టలన నొ - ప్పందోరణాళ్వీధులన్
వరభేరీధ్వని వైరిహృద్గిరి పవి - ప్రాబల్యతం బర్వ నం
బరచుంబి ప్రభఁ గేతనాల్సురనుమ - ప్రాప్తిం బ్రదీపింప ని
ద్ధర ఖండస్తుతి పాత్రమై తనరె స్వా - తంత్ర్యోత్సవశ్రీలతో. 350

తే. కమ్మకమ్మని తావులు - గ్రుమ్మరింప
గమ్మములు నిండు పసుపు కుం - కుమలఁ గ్రాలఁ
జారుతరమగు పచ్చని - తోరణములఁ
గుసుమ తతులఁ గైసేసిరి - గుళ్ళు బళ్ళు. 351

కం. ఆయా మతముల వారవు
డాయా మతదైవతముల - నాహ్లాదముతోఁ
బాయని భక్తి భజించిరి
శ్రీయుతయై దేశమాత - చెన్నలరారన్. 352

శా. పట్టుంగుచ్చుల యంత్రసంగతనటు - త్ప్రాంచాలికాళిం గథా
ఘట్టిస్ఫోరక దివ్యచిత్రతతులం - గాంధ్యాది శిల్పాల మే
ల్పుట్టిం భారతమాతృవిగ్రహములం - బుష్పాఘవిద్యుత్ప్రభా
ఘట్టిన్వేల్గు 'ప్రభాళి' తూర్య రవహృ - ద్యశ్రీలనూరేగఁగ౯. 353

సీ. అసుర చర్య నలంగి - యపరాద్రిఁ గ్రుంకిన
తరణి తూర్పునఁ దోఁచు - తఱి తెలుంగు
పలుబాధలకు నోర్చి - జలధిఁ దెచ్చిన సుర
లమృతపానమొనర్చు - నవసరమటు
లడవుల పాలైన - యవనిజా రాములు
తిరిగి యిల్సేరిన - దినము భంగి
కలిమాయ మాయమై - నల దమయంతులు
తమపురిఁ జేరిన - సమయ మట్లు

తే. అహరహము మేని సుధఁగ్రోల - నణఁగి విధుఁడు
పూర్ణుఁడై వెల్గు దివసము - పోల్కి సకల
మానవ హృదబ్జ రవినిభ - మహిత మహిమ
నుల్లసిల్లె స్వరాజ్య మ - హోత్సవంబు. 354

మ. ధనధాన్యంబులు లడ్డు వస్త్రములు గ్రం - థంబుల్ ఫలాదు ల్ముదం
బున సత్పాత్రత నెంచి పంచిరి మహా - పుణ్యుల్ వదాన్యుల్పురం
తన నృత్యంబులు రూపకంబులు కళా - ధన్యుల్ప్రదర్శింపఁగా
జను లానందరసైకలోలురయి మె - చ్చన్సాగి రావేడుకల్. 355

తే. తల్లి దాస్యముఁ బాపిన - తార్క్ష్యు నట్లు
భరత సంతతి సంతోష - భరిత మయ్యె
మిత్ర దేశంబు లన్ని యా - మేలు నేఁటి
కబ్బెనని చాల యానంద - మందె నపుడు. 356

తే. ప్రకృతి సిద్ధైక దేశమౌ - భరత భూమి
ముక్క చెక్కలుగాఁ జేసి - ముదము పడెదె
పక్కలో బల్లెములు పెట్టి - పయన మైతె
తెల్లదొరతనమా యేమి - తెలివి నీది. 357

తే. యవన హైందవ భేదము – లతిశయింపఁ
గిన్క భరతాంబ కెసలేని – కీడు గలుగఁ
జేయవలసిన పనులన్ని – చేసి చేసి
సాగిపోయితివి చవితి – చంద్రుఁడనఁగ. 358

కం. ప్రాభాతిక పద్మముపగి
నీభారత జాతియెల్ల – నేకోన్ముఖమై
ప్రాభవ వైభవ శోభా
సౌభాగ్యశ్రీల నంత – సంబిఁక నందుఁజా. 359

తే. కాలచక్రము తిరిగెడి – లీలనందు
నాకు పైక్రిందులకు నెట్లు – రాకయుండుఁ
జీఁకటియు వెల్తురుండదె – లోకమందు
నంచు భావించి రెండఱో – యాత్మలందు. 360

వ. అంతంజతుర్థయామారంభమున నేకవర్ణవస్త్రధారులై తురంగారూఢులై సైనికులు పార్శ్వద్వయంబునఁ బంక్తులుఁదీరి ముందు నడచుచుండ రంగురంగుల గులాబి జాజి విరజాజి సన్నజాజి సంపెఁగలతో నందివర్ధన కనకాంబర కుటజ సరోజ కింశుక కల్హార సౌగంధిక పుండరీ కేందీవర కదంబ భూకదంబ పృధ్వీపద్మ పారిజాత చండక కురవక వర్షకేతు మాలతి మాధవి మధూకాది కుసుమాలంకృత ప్రత్యేక శకటరాజంబు రాజప్రతినిధి యధిరోహించి నిర్ణీత స్థలంబునకు బయలుదేర నిసుకవైచిన రాలకుండునట్లు జనంబు తచ్ఛకటంబుంబరివేష్టించి నడచుచుండం దాని నంటియున్న నెహ్రూ జనసమ్మర్దమునఁ గ్రిందఁబడఁబోవ మౌంటుబాటెన్ తనమోకాలితోనాఁపి నాతని శకటములోనికిం దిగిసికొని ముప్పుదప్పించె. కొంతసేపటికి తచ్ఛకటము నిజమార్గముందప్పి ప్రక్కదారింబట్టి నిర్ణీత సమయంబునకు గమ్యంబుచేరంజాలమి ఘనులకొఱకేర్పఱచిన యుచితాసనములపైకి ప్రజలు త్రోసికొనివచ్చుటంజూచి యుండియూ సర్వసేనాని ఫీల్డుమార్షల్ సర్ క్లాడ్ అచిన్‌లెక్ జనుల మొరటుఁదనమునకు విసుగుపడ నిత్తఱిభారతీయుల నానందసంరంభముల కడ్డుతగుల నెవరితరమని మౌంటుబాటెన్ సంజ్ఞచేసి తనకు మాఱుగఁ బ్రాచీన నూతన పతాకావరోహణాధిరోహణోత్సవ మొనర్ప సైనికులకాజ్ఞనిడ "గాడ్ సేవ్ ది కిం"

గను బ్రిటీషు జాతీయగీతము వాద్యబృంద మాలపించుచుండ యూనియన్ జాక్ క్రిందికి దింపంబడె. "జనగణమన" యను గీతము గానముచేయు చుండ భారత జాతీయ పతాక గగనవీధికి సొగసుగనెగిరె. 361

ఉ. బారులుతీరి యుద్ధభట – వర్గము తోన కవాతుచేసి భూ
భారముతగ్గఁ బాపులను – ఖండనభూమి జయించు వాంఛమై
భారతకేతనంబున క – పారముదంబున మ్రొక్కెఁ బ్రేక్షకుల్
వారక తద్వినోద మతి – పావన భావనఁ జూచుచుండఁగన్. 362

కం. నేరస్థుల శిక్షించుచు
గౌరవనీయులను గాచు – కర్తంబగుటన్
వీరోచిత కర్మంబిది
సారతరంబంచు జ్ఞాని – సంతోషించెన్. 363

తే. శత్రు సంహారమొనరించి – శాంతిఁ గూర్చి
దేశ రక్షణ చేసెడి – ధీర వరులు
కాన వీరి బలంబెంత – యేనివలయు
నంచుఁ దలఁచిరి కొందఱు – య్యవసరమున. 364

తే. దేశభక్తిని బ్రకటించు – దీక్ష కిద్ది
స్థిరతరంబైన వీరుల – చిహ్న మనఁగ
సర్వ సైన్యాధిపతి చండ – శాసనమునఁ
బ్రేల్చఁ బడియె శతఘ్నులు – భీకరముగ. 365

వ. మర్త్య భువనంబునం గల – మనుజ పతులు
చకితులైరన నేమి యా – శ్చర్య మరయఁ
దద్ధ్వనికి నూర్ధ్వలోకాలఁ – దనరు సకల
దేవ దానవ హృదయముల్ – దిగ్గురనఁగ. 366

తే. దివికి శరవేగమునఁ బాఱి – దిశలఁ బ్రాకి
పెటపెటీలను శబ్దాల – భీతు గొల్పి
రంగు రంగుల యగ్గిపూల్ – రాల్చు నట్లు
బహువిధంబులఁ గాల్చిరి – బాణసంచు. 367

ఆ.వె. ఇనుఁడు తనదు కాంతి – నినుమడింపఁగఁజేయ
వంద నంబు తనకుఁ – బ్రజలు సేయ
నద్రి మీఁది కెక్కి – నటు త్రివర్ణపతాక
యెఱ్ఱకోట మీఁద — నెగిరె నపుడు. 368

వ. దేవతలో పితృదేవతలో పూలవాన గురిపించుచుండిరన సన్నజల్లు
వడె. భరతమాత చల్లనితల్లియని ప్రకృతి ప్రకటించె. 369

కం. ఆద్యమహాదశ యిపు డన
వద్యంబుగఁ గలిగె ననఁగ – బహువర్ణ లసత్
విద్యుద్దీపము లానిశ
హృద్యంబుగ వెలిఁగె స్వర్గ – మిదిరా యనఁగన్. 370

తే. హ్యూము నౌరోజి మెహతాను – నుత్సవమున
మంచి వేళఁ గాంగ్రెసును స్థా – పించి రంచు
సత్య చరితార్థ విదుల ప్ర – శంస లెసఁగ
సర్వ సీమల జరిగెను – సంబరంబు. 371

ఇయ్యది శ్రీమదాంధ్ర మహాభ్యుదయ ద్వితీయ భాగమున
సప్తమ ప్రకరణము సమాప్తము.

# హరిజనోద్ధరణము

ఉ. వేడుకలెల్ల ఢిల్లిఁ గను - విందుగఁ గాంచి హితానులాదృతిం
జూడఁ గొలందినాళ్ళచటి - గోష్ఠులఁ బాల్గొని రాజకీయపుం
జాడలఁ బాలన స్థితుల - శాంతమతిం బరికించి తత్పురిజా
వీడి తెలుంగుకాశ్యపికి - వేగమ రాములు వచ్చె సేవకై. 1

వ. వచ్చి నెల్లూరు సొచ్చి మిత్రబృందంబులుంగలసికొని గజపురమున జరిగిన వేడుకలందెలిపి నిర్భరానందమగ్నమానసంబై ఆంగ్లేశ ప్రభుత్వ స్థాపనాతితృష్ణా శాపగ్రస్తాంగ్లేయ సామ్రాజ్యగ్రాహ మనేకాగాధకంధి మార్గములగమించి యొడ్డుపట్టి యధికారవజ్రదంతవక్త్రంబున భారత రాజ్యగజరాజుంబట్టి బాధింపఁ దత్కరివర ప్రార్థనాకర్ణన రక్షణాయత్త చిత్తుండై శ్రీహరి గాంధీజీరూపంబున నేతెంచి సత్యాగ్రహావక్రచక్రము హూణప్రభుతానక్రముపైఁ బ్రయోగించి గంజేంద్రమోక్షము గలిగించెనని ఘనానందంబున వెల్లడించి యిఁక సకలకళావిద్యాగంధి ధర్మదేవతా సైరంధ్రి పూజ్యపురంధ్రి యగు నాంధ్రమాతృపదపంకజ సేవాతత్పరుండనై యిటకరుదెంచితినని తొలుత హరిజనోద్ధరణ మవశ్యకర్తవ్యమని జాతీయమహాసభా సభ్యనిర్వర్తిత సమజ్యామధ్యంబునందాని ప్రాముఖ్య ముగ్గడించుచు నంచరించుచున్నతఱి. 2

తే. తనదు వాఙ్ముఖముల గల - ధర్మ మరసి
ప్రజలు తనచుట్టుఁ జేరి స - ద్భక్తిఁ జూప
వేయి రేకుల కమలము - విచ్చి నట్లు
ముఖము కళకళలాడెఁ బె - న్మదము గదుర. 3

కం. మీరాక రాక మాకని
యూరూరం గొంద ఱెదురు - నొంది భజింపం
ధీరుఁడు రాములు దిరిగెను
నోరార నహింస శక్తి - నొడువుచు నచటన్. 4

సీ. అన్యుల గౌరవ – పఱుపఁగఁ ద్రొక్కించు
నీ యాచారములకు జో – హారులయ్య
పరులు హీను లటంచు – భావించు నీ యాభి
జాత్యంబునకు నమ – స్కారమయ్య
జాత్యహంకృతి నెంతొ – చాటెడి నీకథా
భాగంబులకు నివే – ప్రణతులయ్య
స్వార్థమ్మునకు బర – మార్థమటంచు నీ
నటనల కివె వంద – నంబులయ్య

తే. యనుచు హైందవు లెందఱో – యన్యమతము
కైకొనుట మీరు కనులారఁ – గాంచలేదె
కడఁక నస్పృశ్యతా కళం – కమ్ము కడిగి
వేయకుండిన దేశము – వెలుఁగుటెట్లు. 5

వ. సదాచార సంపన్నులగు మహాభక్తులు కులమునకంటె గుణమునె ప్రధానముగఁ జూచిరనుట చరిత్ర ప్రసిద్ధము. రామానుజాచారి గురు పంచకమున ద్వితీయుండు పరమభాగవతోత్తముండు నగు తిరుక్కచ్చి శూద్రుడు. తిరుమళిశైఆళ్వారు తిరుమంగైఆళ్వారు శూద్రులు. కులశేఖర అళ్వారు క్షత్రియుఁడు. పన్నిద్దరాళ్వారులలో నొకండగు తిరుప్పాణ్యా ళ్వారు హరిజనుడు. ఆపత్కాలమున రామానుజాచార్యుల గురువగు పెరియనంబిచే సర్వవిధసపర్యలందిన మహాభాగవత శిఖామణియైన మారనేర్‌నంబి హరిజనుఁడు. భక్తనందనార్ హరిజనుఁడు. ఇంతయో చించి యస్పృశ్యతావృక్షమును సమూలముగఁ బెళ్ళగింపుఁడు. 6

ఉ. వాకొకరాని కష్టముల – పాలయి చింతిలియుంటి మెంతయో
యేక్రియనైన సత్యము గ్ర – హించి మహాత్మునిమాట నమ్మ న
స్తోకబలంబు చేకుఱ య – శోలలితంబగు మాతృభూమి మీ
శోకడ తెల్లమాని నవ – పుణ్యపథాన గమింపుఁడీ వెసన్. 7

కం. ఆచారంబన శుచియని
ప్రాచీనులు దలఁప దాని – భావమరయక
ర్వాచీనులు సోదరులనె
నీచులుగా నెంచు టేమి – నీతి గణింపన్. 8

తే. ఎంతకాలము నుండియో - యుట్టు వేఱు
చేయుటంజేసి పరులలోఁ - జేరి రకట
దాన దేశబలంబెంతొ - తగ్గలేదె
సుంత యోచింప రిదియెంత - వింత కనఁగ. 9

ఉ. కుక్కకు వంటయింటికడఁ - గోరిన తిండి యొసంగి సబ్బుతోఁ
జక్కఁగ నీళ్ళుపోసి యొక - సన్నని తిన్నని గుడ్డనద్ది పెం
పెక్కిన ప్రేమ ముద్దుగొని - యెవ్వడొ తోడి నరుండు చేరఁగా
నక్కట యంటరాని యతఁ - డంచుఁ దొలంగుట కేమిహేతువో. 10

ఉ. పుత్తడివంటిసూక్తు లతి - పూతచరిత్రుఁడు గాంధి తెల్పె మీ
చిత్తములందు నిల్పుఁ డవి - శ్రేయమనన్వెస స్వాతికార్తెలో
ముత్తెపుఁ జిప్పలోఁ బడిన - ముత్యముగా నగు చిన్కువోలె నా
యుత్తమవాక్యము ల్ప్రజల - నుజ్జ్వల శక్తులుగా నొనర్పఁగన్. 11

వ. సంతసించుచు రాములు విక్రమ సింహపుర దేవాలయముల
దర్శించె. 12

ఉ. ఈడెవఁ డప్పరేశునకు - నీఁడె యెవండెది నిష్ఠఁగోర వా
యోడక యోడకే బుధులు - యోగులు తన్మహిమంబుఁ దెల్పరే
పాడుచు నాడుచుందు రట - భక్తులు దైవము నెంతనమ్మిరో
వేడుక వేఁడ కగ్గుడుల - వేవిన వేవిన నౌను స్తోత్రముల్. 13

శా. నాదబ్రహ్మవినోదభక్తజనపు - ణ్యం బాత్మగణ్యంబుగా
నాదృశ్యంబులఁ గాంచి తానపుడు బ్ర - హ్మానందముంబొంది ని
ర్వేదశ్రీధృతి మానవాభ్యుదయ సం - ప్రీతిన్ సమాలోచనా
మోదుండై తగుకృత్య నిర్వహణమే - ముఖ్యంబుగా నెంచుచున్. 14

వ. హరిజన దేవాలయ ప్రవేశాదికార్యంబుల నిర్వహింప నిశ్చయించు
కొని. 15

తే. వేణు గోపాల దేవుఁడు - వెలసి యున్న
దేవళము మ్రోల జెండా ప్ర - తిష్ఠ సలిపి
స్వామికిం గేతనమునకుఁ - జక్క మ్రొక్కి
భవ్య పద్మాసనస్థుఁడై - పరమ నిష్ఠ. 16

మ. శివుఁడే విష్ణువు విష్ణువే శివుఁడు యో - చింపంగ భేదంబులే
దవునంచున్మను తిక్కనామలనరే - యధ్యాత్మ విద్యానిధుల్
కవివాగ్రత్న మమూల్యమంచెడద నా - కాక్షింతు దద్దీధితుల్
భవభారాంధవిభాకర ప్రభలుగా - భావింతు నశ్రాంతముఁ. 17

(హరి హర ప్రార్థన)

తే. భువన పావన భవనాత్మ - భూ శత ద్యు
తియుత సకల కలావ సు - ధీ మనోజ్ఞ
రాజిత పదాంక యకలంక - రణ గుణాంక
చారుతరమూర్తి దేవతా - చక్రవర్తి. 18

(ద్వ్యర్థి)

తే. విదళిత తమోంత రౌజ్జ్వల్య - వినుత చరిత
ధార్మికాబ్జారిధర తపో - ధన సుగతిద
నిరత కుశచీవరస్తుత్య - నిత్య సత్య
సమరస వికాస యచలాత్మ - జా విలాస. 19

(ద్వ్యర్థి)

తే. భూరిధరధర పరమ వి - భూతి కలిత
కాలికాన్విత కాయ నా - గపతి సేవి
త బుధనుత సత్యవచనాత్మ - ధామ సదయ
సతత సజ్జన పూజిత - చరణ శరణు. 20

(ద్వ్యర్థి)

చ. అని తన మానసాబ్జమున - నజ్జగదీశుఁ బరాత్పరుం గృపా
వననిధి భక్తబృంద పరి - పాలకు నిల్పి యనల్పశక్తి మై
దినమటులుండఁ దచ్చరిత - దేశము నల్లెనఁ బ్రాకెఁ దత్పురీ
జనమటుఁ జేరి రాము వ్రత - చర్యఁ గనుంగొనుచున్ననంబునఁ. 21

కం. ఈవచ్చిన జనమెయ్యది
యీావచ్చినఁ గొనఁడు కనఁడి - దేటి నియమమో
పావని యీతని ధృతిఁగనఁ
భావనఁ దలపించు ధర్మ - బంధుర వతితిఁ. 22

తే. దేశ నాయకమణి దీప్తి - దిశల నిండు
నొక్కసభ గాంధి యాతనిఁ - జక్కఁ జూపి
యిట్టివారున్నఁ బదిమంది - యెపుడొ వచ్చి
యుండెడిది రాజ్య మనెనట - యోగ్యుఁ డగుట. 23

ఉ. ఎందఱు నేతృరత్నముల - నిప్పుడిఁ గాంచఁగలేను వారిలో
నెందఱు నిల్తురిట్టు పర - మేశ్వరుసాక్షిగఁ ద్యాగమూర్తులై
సందియ మీతఁ డీతనికి - సాటియటంచుఁ దలంప నాత్మలోఁ
గొందలమంద కాఘనుఁ డ - కుంఠిత సాహసనిష్ఠ నిల్వఁగన్. 24

ఉ. అమ్మరునాఁటి రేపు పర - మాత్మునుతించి మహాత్మశిష్యవ
ర్గమ్మొకకొంత తన్నెరయఁ - గన్గొని కన్గొనలన్ ముదాశ్రువుల్
గ్రమ్మఁగఁ గమ్మఁగాఁ బలుకు - గాంధిహితోక్తుల నాచరించు భా
గ్యమ్ములభింపఁ గంకణము-గట్టుఁడు నెట్టుఁ డనైకమత్యమున్. 25

వ. అంచువచించె. తత్పూర్వమ హరిజన దేవాలయప్రవేశముంగూర్చి
రాము లాలయపాలకులవేఁడి విఫలమనోరథుఁడై కడకు నిరాహారదీక్షం
బూనవిని యాతనింగన వారి చనుదేర. 26

ఉ. లోకమనుక్షణంబు నతి - లోకబలంబున మాఱుచున్నది
క్ష్వాకులనాఁటి పద్ధతుల - వాకొన నూకొనువాఁడెవండు మీ
పోకడమాఱదే భరత - భూమి పురోగతి గాంచఁబోదిఁకన్
సాకులు చెప్పినం దుదక - సాధ్యము సాధ్యముగాఁ దెలంగునే. 27

ఆ.వె. ధర్మకర్తలార - దాక్షిణ్య ధాములై
హరిజనాళి వచ్చు - నలరు లిచ్చు
దారి యిండు గుడికి - దర్శించి హర్షించి
లక్ష్యసిద్ధి మోక్ష - లక్ష్మి నంద. 28

చ. అనుచుఁ దవాలయాధిపుల - హర్నిశ లిట్లు కృశింపనేల యో
గుణనిధి గాంధివచ్చి మముఁ - గోరిన నట్లయొనర్తుమన్నఁ దత్
క్షణమ సబర్మతీఋషికిఁ - గార్యగతిం దెలుప న్మహాత్ముఁడ
ప్పని యిపుడాపుఁడంచు వెసఁ-బల్కె నతండుపసంహరింపఁగన్. 29

కం. అలరులు నల్లిన వడువున
నలరిరి ప్రజలత నికష్ట - మాఁగిన కతనం

దొలఁగక గురు శాసనమును
దలఁదాల్చు వివేకి యంచుఁ – దలఁచిరి పెద్దల్. 30

వ. అంతంగొంతకాలమ్మునన హరిజనాభ్యుదయ వాంఛాస్థిరచిత్తుండగు రాములు తదుద్ధరణయోగ్య ప్రభుత్వశాసనార్థియై నెల్లూర వింశతి దినంబులుపవసింప నాంధ్రకేసరి సచివవర్గము మూర్తిప్రభృతులతో విక్రమసింహపురికేతెంచి తత్కృత్యనిర్వాహణ వాగ్దానమొనర్చి తద్వ్రతము విరమింపజేసి కతిపయమాసంబుల కతండుకోరినట్లాచరించె. కాని దానలాభంబులేమింజేసి ప్రతినెల చివరిరోజు సెలవిచ్చి యుద్యోగస్థులచే హరిజనపురోభివృద్ధికి వలయు ప్రచారముచేయించుట లెస్సయని మదరాసు దొరతనమునకు విజ్ఞప్తినొనర్ప నాఁటిముఖ్యమంత్రి యోమాండూరి రామస్వామిరెడ్డి దానింబెడచెవింబెట్టె. ఎట్టకేలకుం బట్టినపట్టువీడక సీతాపతి శాసనసభాప్రాంగణమున నిరశనవ్రతమారంభింపఁ దత్సభ్యు లుపద్రవవర్తనారోపణంబున బంధించి చెఱనుంచి రబ్బరునాళమ్ములద్వారమ్మున నాహారమెక్కింతుమని కఠినోక్తులు పల్కుచుండ రాములు— 31

ఆ వె. ధర్మమే జయంబు – ధర్మమే రక్షణ
యనిరి పుణ్యపురుషు – లనుభవమునఁ
గాన దాని నమ్మి – మానవ సేవకై
దీక్షఁ బూని నాఁడఁ – దెలియుఁ డనియె. 32

తే. దానఁ గాంగ్రెసు పెద్దలు – ధర్మ విదులు
గాంధి సూత్రప్రచార స – త్కార్యమునకు
నడ్డు తగులుట యెట్లని – యంత కొంత
శాంతి చూపిరి రాములు – సంతసింప. 33

తే. అట్లు లాతండు నెల్లూర – ననవరతము
హరిజనోద్ధరణక్రియ – యాది కార్య
మనుచుఁ దత్కృత్యమున కను – వైనరీతి
నీతి కలుపుచునుండె గాం – ధీ పథాన. 34

వ. ఇటు నిట్లుండం బాంచాలంబున యవనులు హింసాకాండంబ్రజ్వలింపంజేసిరని విని శ్రీరాములు. 35

తే. సర్వశాస్త్రార్థ విజ్ఞాన - సహిత మహిత
విద్వదాదరణీయ వి - వేక వాక్కు
లెంత చెప్పినఁ జెవికెక్క - దింక నెట్టు
మంచి మార్గము వట్టు నీ - మనుజ జగతి 36

తే. కీడు గలిగించు నెన్నఁడు - కూడ దనక
విబుధవర్యుల మాటలు - వినక మెలఁగు
మనుజ హంతకు దుర్బుద్ధి - మార్చు టన్న
విషము నౌషధముంజేయు - విధము సుమ్ము. 37

తే. ఇంద్ర భోగము లభియించు - నింక నంచు
నెంతయో సంతసింప నేఁ - డిట్టు లయ్యెఁ
జెడ్డ పనిచేయుకుండునె - చెనటి చెలఁగి
చలనచిత్ర మదెట్టు ని - శ్చలత నుండు. 38

తే. శాంత చిత్తుని జూచిన - నరకుగొనరు
మొట్టు వానికె లోకము - మ్రొక్కు చుండుఁ
దెలిసికొనునని కుమతికిఁ - దెలివి సెప్ప
ఁకేన్గునకు గంధమును బూయు - టే తలంప. 39

తే. బలము గలదని పొంగి ని - ర్భయముతోడఁ
బరుల కపకృతి సేయుట - పాఁడి యగునె
చేసికొన్నట్టి పాపము - చెంత నుండి
ఘన గరాగ్నిగ వానిని - గాల్చ కున్నె. 40

తే. కేవలము స్వార్థదృష్టితోఁ - గినుక పూని
పరుల బాధించు టొక మహా - పాప మనక
దోష దూషితమైన యీ - దోహదంబు
పరమ కళ్యాణ కరమని - పలుకఁ దగదు. 41

కం. ఈయంధకార మెట్టుల
పాయుం గూయిడిన జాలి - పడ రెవ్వారల్
మాయురె యీదేశంబున
ఘాయని మచ్చయ్యె నిద్ధి - మాన్పం దగదే. 42

ఆ.వె. త్యాగ ధనుల మాట - ధన ధాన్యముల మాట
యనుచు నాలకింప - కన్య జనుల
బాధ పెట్టు వరమ - పాపాత్ములకు స్వర్గ
ఫలము గలదె కీర్తి - ఫలము గలదె. 43

తే. ఊసివాసము పడలపై - నుంచ( దగునె
మౌర్ఖ్యమున నిట్లు సేయుట - మంచి దగునె
యెందనుక దైవమైన స - హింప( గలుగు
యాలకింపంగ గుండెలే - యవిసిపోవు. 44

వ. అని యాత్మందలంచుచు హస్తిపురికేగె. అత్తఱి. 45

# కాందిశీకుల కడగండ్లు

తే. భరత భూమికి వచ్చెడి - ప్రజల( బట్టి
కత్తి కెఱసేయుచుండిరి - కఠిన మతులు
గొందరెట్టులో తప్పించు - కొనుచు గట్ట
కడకు వడ(కుచు( జేరిరి - కరిపురంబు. 46

శా. అల్లాభక్తుల మంచు( జెప్పుకొనువా - రల్లాడ(గా జేయ(గా
నిల్లున్వాకిలివీడి దీనదశతో - నిల్లాలితో నంతుతో
డిల్లీ చేరితి మిట్లు మాగతి గనుం - డీ యన్నయార్తధ్వనుల్
పెల్లై యెల్లెడ మాఱుమ్రోగె( బ్రజలా - బీభత్స మూహింప(గన్. 47

ఉ. ఏమిస్వరాజ్యమిద్ది పర - మేశ్వర మాయను రిట్టులీయుదే
యేమెవుడేడ్చినార మిటు - లియ్యది రావలెనంచు( బంచ మా
భూములు గొడ్లు గోదములు - పోయె క్షుధార్తులమై కృశింతు మే
బాముననేమిచేసితిమొ - పాయని కష్టము లిట్లు కల్గెడిన్. 48

కం. హద్దా(పు లేక ప్రజనే
ప్రొద్దుం బాధించువారి - ముకుద్రాళులతో
నిద్దపు దారికి లాగని
యద్దేశపు నేత నేత - యా యోచింపన్. 49

ఉ. బిడ్డకుఁ దల్లియుం బతికిఁ - బ్రేయసియుం గఱవయ్యె నింక మా
పడ్డ యవస్థలెల్ల భగ - వంతుఁడెఱుంగుఁ గృపాలవాలురీ
చెడ్డపనుల్ సహింతురె వ - సింతురె సత్ప్రజ లిట్టినాడులం
దొడ్డప్రభుత్వమో పరమ - దోషలరాజ్యమొ తేలదేవెసన్. 50

ఉ. నేరములేని మమ్మిటవి - నీతికిఁ బాల్పడి చేసినట్టి యా
ఘోరదురంతము ల్మఱవఁ - గూడునె దైవమ యేడదాగితే
తీరని యిట్టిలో నెవరు - తీర్పఁగలారని యాత్మశాంతిలే
కూరక యేడ్వ నేడ్వఁ గను - లుబ్బెను గొందఱ కెంతబాధయో. 51

ఉ. వీధుల శోకతప్తులయి - వేలకొలందిగ నున్నవారి యా
వేదన మెల్లవిన్న పృథి - వీసతి గుండెలుగూలెఁ దన్మనో
వేదన చెప్పఁగాఁ దరమె - వేధకు శేషునకైన నమ్మహా
రోదన మాలకించి ప్రజ - రొట్టెల బట్టల నిచ్చె నాదృతిన్. 52

కం. తిన్న పదార్థము నీరగు
చున్నది యవ్వారిఁ గాంచి - నంతన యంచుం
గన్నీ రోడ్చిరి పౌరులు
పున్నమ యమవసగ మారెఁ - బో యిపుడనుచున్. 53

ఉ. వీధియె వాసదేశముగఁ - బృథ్వియె శయ్యగఁ గట్టుబట్టలే
యాదిన మాస్తిపాస్తులుగ - నప్పురి పౌరులె తోడునీడగాఁ
బాధలు పెళ్ళగింపఁబడ - వాడిన తీవల యట్టు లచ్చోటం
ఖేదమహాబ్ధిమున్గి రటు - కీడ్పడ వారలఁ గాంచి యప్రజల్. 54

ఉ. ఇందఱ కేకకాలమున - నెట్టొనగూడును గ్రాసవాసముల్
సందియమంచుఁ గొందఱు వి - చారమహాంబుధిమున్గఁ గొందఱే
కొందల మందకుండ సమ - కూర్చుఁ బ్రభుత్వము సర్వమంచు వా
కొందురు ఘోరకష్టముల - కుం గుఱియైరని కొందఱేడ్వఁగన్. 55

తే. తాము బ్రదికిన బ్రదుకులు - తలఁచి తలఁచి
యేమితోఁపక బోరున - నేడ్చుచున్న
కాందిశీకుల కన్నీరు - కాల్వలగుచు
నిఖపురపు వీధులం బ్రవ - హించె నపుడు. 56

కం. ఢిల్లీ ప్రభుత్వ మత్తఱి
నుల్లంబునఁ దల్లడిల్లి – యుదు వేగముతో
సల్లాపంబుల సౌఖ్యము
లెల్ల న్నుమహర్ష్వ జతన – మెంతయుఁ జేసెన్. 57

వ. మహాత్మున కివ్విషయంబు చెవినింపఁ గాళీఘట్టము వదలి కరిపురము నకువచ్చి శాంతిప్రియుల హిందూముస్లిములఁ దనవెంటంగొని కాందిశీకు లున్న హరిజనవీధులకుంజని వారినోదార్చి దేవాలయముల మసీదుల గౌర వము కాపాడవలయు. కరుణాశూన్యుండైన నరుండు ధరకు భారమని నిద్రాహారములుగణింపక రేయుంబవళ్ళు హితోపదేశమొనర్చె. కాని పూర్ణశాంతికలుగమి గాంధీజీకారోగ్యముచెడె. నిజజయంతి దివసంబున బాపూజీ పరివారముతో నుపవసించి తనజయంతిని చరఖాజయంతిగ మార్చి తన్మహిమ నుగ్గడించె. నేలనాలుగుచెఱగులనుండి వేలశుభాకాంక్షలు తంత్రీద్వారమ్మున వచ్చె. లక్షల విలువగల భూషణములు కాన్కలుగ స్త్రీలర్పించిరి. అమ్మఱునాఁడ శాంతిదూత యహింసా ప్రచార మారంభింప. 58

కం. పగ వలదని యెది వలదని
యగచాట్లకు నోర్చి వచ్చు – హైందవ జనులన్
మృగముల మృగయునివలె నటఁ
బొగబండిని నిల్పి చావఁ – బొడిచిరి యవనుల్. 59

కం. ఆవార్తవిని మహాత్ముఁడు
కేవల దుఃఖాబ్ధిఁ బ్రుంగి – కేశవ రామా
యీవిధ దుర్భర చర్యల
నేవిధి మాన్పంగలాఁడ — నెఱిఁగింపఁగదే. 60

కం. మందిని మరలించుటకే
నొందిన వ్యధ యెల్ల నిష్ప్ర – యోజనమయ్యెం
గుందిది యెవ్వఁడు వావుసు
వందారు సుధీశరణ్య – వరగుణగణ్యా. 61

ఉ. ఏనివు డేమిసేయఁగల – నింతకువచ్చె జనార్తి హెచ్చె నా
మానసమెల్ల నీరయె న – మానుషకృత్యము లిట్లుసేయుటల్

మానవ ధర్మమౌనె యిది - మార్గము నాకిఁక మాధవా హరీ
దీనజనావనా సకల - దివ్యశరణ్య రమామనోహరా. 62

తే. ఇట్టి చిక్కులు వచ్చునం - చెఱిఁగి నేను
చీల్పవలదని యెంతయో - చెప్పినాఁడ
దుందుడుకు చేష్ట లెట్టుల - తొలఁగి పోవుఁ
జేయి దాఁటెను నిపు డేమి - చేయువాఁడ. 63

వ. ఈ ఘోర కృత్యములు చూచుటకై బ్రదుకవలయుననుకోర్కి నాకిక లేదు. అంగ్లేయులతో సంగ్రామమొనర్చితిఁగాని యిత్తఱి నేను పడుబాధ యెన్నఁడుంబడలేదని యహింసా విజయమునకై గాంధీయుపవాసదీక్షఁ బూనె. అర్థరుమూరను అంగ్లేయుఁడు గాంధీజీతో నుపవసించె. హింస మానరేని బాపూజీ పస్తుమానఁడని యజాదనె. నీవెద్దిచెప్పిన నద్దిచేసెద నిట్టుపీడుమని పటేలనఁ బాకిస్థానమునకీయవలసిన రొక్కమిమ్మనె. జిన్నామార్గమును ఖండించి తత్పురుషుందలంచి. 64

ఉ. మున్నెవరైన భారతము - ముక్కలొనర్చిరె రాజకీయపుం
దిన్నని మార్గముం గనవు - దేశసమైక్యత నాశహేతువా
యన్న యిదేటిమాట తగ - నాడవు లోకము గొడ్డువోయెనే
పున్నమనాఁడు వచ్చునొకొ - పూర్ణరవిగ్రహణం బశాస్త్రమై. 65

తే. ఏవలాదంచుఁజెప్పిన - నీవు వినక
యింతకుందెచ్చితివి యిప్పు - డేది దారి
విత్తొకటి నాట మొలచునే - వృక్ష మొకటి
కలభముల కేళిఁ బావదే - శలభ చయము. 66

తే. దేశ కాల పాత్రాదుల - తీ రెఱింగి
వలయు రీతిగ వర్తింప - వలయు నంచు
నీకు నేఁ దెల్పు ననుభవ - నీతి చయము
బూదివోసిన పన్నీరు - వోలెఁ దనరె. 67

తే. నీవు నేమించినట్టు నే - నిల్తు నంచు
నాడి నాడిన వాక్యంబు - లబ్ధిఁ గలసె
నాన లణగారెఁ గడకునె - న్లొనొ కడఁక
కల్పమే కానికాల్దానఁ - గల్ప మగునె? 68

కం. హాసము పాల్సేయక వెసఁ
గూసములోఁ జేయిపులపు – కొనుటయె లెస్సం
చేసమయంబునఁ జెప్పినఁ
గాసింతయు విన వదేమి – కర్మభరంబో. 69

కం. పల్లాడఁగొట్టుకొనుటకుఁ
గల్లెయ్యదియైన నొకటి – గాదే దేశం
బల్లనఁ జీల్చుట నాతను
వెల్లం జీల్చుట యటంచు – నెంచవె జిన్నా! 70

ఉ. నెప్పళి మొప్ప ధిక్కృతుల – నిప్పలు ద్రొక్కిన క్రోఁతిరీతిగా
నెప్పుడు కన్నుబున్ననుచు – నింతకు నంతకు లేకపోయినం
దప్పుల నెన్నుచుꣳ మెలిక – దారుల నడ్డెడివాని కెప్పుడుం
జెప్పెడి వాఁడు లోకువని – చెప్పరె మానవతత్త్వకోవిదుల్. 71

తే. వచ్చెనో లేదొ స్వాతంత్ర్య – మిచ్చవచ్చి
నట్లు మతకలహాగ్ని పె – ల్లలముకొనియె
సరిగసాగునె పాలన – జడ్డిగమున
మిడుత పోటయ్యెనిఁకనెట్లు – మేలు గలుగు. 72

ఉ. కోపమె నారకంబునకుఁ – గూరిమి నెచ్చెలి యంధకారవుం
గూపసమాన మీర్ష్య యివి – గూడవు సజ్జనశాప మెంతయుꣳ
జాపవిముక్త బాణమటు – చయ్యనహానికరం బదెట్టు నా
ద్రౌపది భంగపెట్టుటఁ గ – దా కురువంశము గూలెఁబూర్తిగా. 73

శా. ఏమైపోయె నహింస యిప్పుడు మహా – హేయ క్రియాలోలమై
గామై పట్టెను హింస మాంత్రికులు వే – గం భూతి మేల్గూర్తురే
కామాంధంబునఁ గన్నుగానని నరుల్ – కాంక్షింతురే ధర్మముꣳ
ధీమద్రత్నము లిట్టి కష్టవనధిం – దీనాళి దాఁటింతురే. 74

ఉ. అన్నెము పున్నె మేమెఱుఁగ – నట్టి యమాయికుల న్వధింపఁగా
నిన్నరలోక దానవుల – కేగతిఁ జేతులు వచ్చె నక్కటా
యున్నది ఘోరనారక మ – నూహ్య మసహ్యము వారి కెంతయుం
దిన్నది తేనువుం బొరయ – దే శిఖినంటినఁ గాలకుండునే. 75

వ. అని దుఃఖార్ణవమగ్నమానసుండై హరిజనవాటిక నిర్వాసితజనాకీర్ణ మగుటదావిర్లా భవనముననుండఁ దీవ్రవాదాగ్రణులు హిందువులు కొందఱు గాంధి ముస్లిము పక్షపాతిగాన వధార్హుఁడని కేకలువేయుచుఁ దన్మందిరమును ముట్టడింప నెహ్రూ గాంధీజీని దిలకించి. 76

ఉ. సాయుధ యుద్ధశూన్యముగ - సర్వజగంబున నూత్న పద్ధతిం
ధీయుతులెల్లమెచ్చ నిటు - దెచ్చిన రాజ్యము సాధుభోజ్యమై
న్యాయము తేజరిల్ల నన - యంబు మహాభ్యుదయంబు నందునం
చో యఘదూర యెంచ నిటు - లోర్వఁగరాని స్థితుల్ జనించెనే. 77

మ. ఇరుపక్షంబుల మేలుగోరి మనమెం - తే శాంతి సందేశముల్
నిరతంబీఁ జెవికెక్క కిప్పజలు హా - నిం గూర్ప యత్నింతురా
తరమే బ్రహ్మకునైన వీరల సదా - ధర్మార్థులంజేయ నె
త్తుఱుఁ గీగండమువాయు భద్రత కిఁకే - దీ దారి యంచాడఁగన్. 78

వ. దేశమాత స్వరాజ్యశిశువును గనునపుడు పడుచున్న నొప్పులివి యని శాంతిదూత వాకొన నెహ్రూ నామెనొప్పులు మనకుం జెప్పరాని గొప్పముప్పులనె. ఇంతలో బయటిప్రజల భీకరశబ్దంబులు మిన్నుముట్టు. 79

శా. ఉగ్రక్రోధరసోద్భవాత్యరుణ వి - ద్యు ద్దీపనేత్రచ్ఛటా
వ్యగ్రుండై గదినుండి దూఁకి యెవరా - బాపూజి హింసించువా
రగ్రస్థానమునందునిల్తు నను ధై - ర్యంబున్నచోఁ జంపుఁడా
యుగ్రుండైన వధింపఁగాఁగలఁడె మే - ముండ న్మహాదేశికున్. 80

మ. అన లంఘించి పటే ల్ప్రజాళిఁగని సిం - హంబట్లు గర్జించి పూ
జ్యుని బాపూజి వధింప గుండెగలదే - యుచ్ఛ్వాస నిశ్వాస లీ
తనువందుండఁగ మీతరంబయది శాం - తంబంది పోపొండిఁకం
జనవంద్యుండు మహారథుం డతఁడెకా - సాధించె నీరాజ్యమున్. 81

మ. నవి పల్కంగ నజాద్ ప్రజాళికి నమ - స్కారంబు గావించి సం
స్తవనీయుండు మహాత్ముఁడంచనక స్వే - చ్ఛన్వాకొనం జెల్లునే
యెవరీడాతని కిట్టిగాన ఖలు లే - యేకష్టము ల్దెచ్చినన్
సువిచారంబునఁ జక్కపెట్టఁగలఁ డీ - శుద్ధుండు సామాన్యుఁడే. 82

ఉ. తెల్లనివాఁడు కల్వచెలి - దివ్యకళానిధి సౌఖ్యదామృతం
బల్లనఁ జల్లువాఁడు జగ - మంథమువాపి వసుంధరౌషధుల్
మెల్లఁగ మన్చువాఁడనుచు - మీరును మేమును గొల్చుచుందు మా
చల్లనిచంద్రు నాతఁడు ప్ర - శాంతికి మూపలగాడె సోదరుల్. 83

ఉ. భూషకు భూషగాఁ దనువు - పొల్చుట భాగ్యమెకాని శాంతమే
భూషణమంద్రు పెద్దలది - బుద్ధిని నిల్పి స్వరాజ్యమాతకే
భూషణమౌట లెస్స తన - పుట్టువు నిక్కమెఱింగి మర్త్యుఁడీ
భీషణ కృత్య దూరుఁడయి - ప్రేమకు దోసిలి యొగ్గలగ్గగున్. 84

ఉ. తీవర మింతలేక జగ - తీగతి చర్చయొనర్ప నుండునే
కేవల మొక్కరీతిగనె - గ్రీష్మదినంబులు చన్నరాదొకో
శ్రావణమెన్న నిప్పుకలు - రాలిన కంటనె నీరుకారదే
యావిరి లేచిలేచి కడ - కంబుదమై జడి గ్రుమ్మరింపదే. 85

చ. విరివిగ లేదు సంఘమెటు - పెత్తనమబ్బునటంచు మూర్ఖతం
దురితమొనర్చి పొందఁగల - దోహద ముండదు స్వార్థదృష్టితో
నరులిటు గొప్ప సంఘమును - నాశముసేయుట కొగ్గ లగ్గుగాఁ
బరగునె త్రాడు చిన్నదని - బావిని పూడ్చుట వెఱ్ఱికాదొకో. 86

ఉ. పాలిత ధర్మనిర్మలులు - భారతనేత లజాతశత్రు లీ
లీల గడించి రాజ్య మవ - లీల నిడం జెడగొట్టుకొందురే
కాలము మాఱిపోయినది - కావున వెన్కటి త్రోవఁ ద్రొక్కుచో
మేలొనఁగూడదింకఁ దల - మే యొకరీతిఁ జరింప బ్రహ్మకున్. 87

శా. దేశద్రోహులు కొంద ఱిట్లు నలువం - ధీమంతు లాలోచనా
దేశశ్రీ విలసిల్ల శాంతిశుభ సం - దేశంబులందిచ్చి దే
వాశీస్సుల్వెలుగంగ సర్వజన క - ల్యాణంబు సంధింపరా
నాశం బందఁగఁజేసి క్లేశముల ధ - న్యత్వంబు చేకూర్పరా. 88

ఉ. అందఱు మంచివారని మ - హాత్ముఁడు పల్కిన పల్కుఁబట్టి మే
మందల మెక్కినార మది - యక్కట పెళ్ళుమనెన్ హఠాత్తుగాఁ
గొందలమంది శాంతియొనఁ - గూర్పఁ దపించుచునుంటి మద్ది మా
కందని పండుగా నమరు - నా యని చింతిలుచుంటి మెంతయున్. 89

వ. నావిని హిందూమహాసభాసభ్యుం డొక్కండు క్రోధతామ్రాక్షుండై. 90

మ. కరుణాలేశములేక హైందవులఁ జ - క్కాడం ద్వదీయాజ్ఞ లే
శరధిం ద్రొక్కిరి సైపఁజాలమిఁక మీ - శాంతంబు మీకుండనీ
నిరతాంతర్గత శక్తియుక్తపురజి - న్నేత్రాగ్ని చల్లారనీ
స్థిరమై నిల్చి మదీయశౌర్యశిఖి వా - సింగూర్చు హిందూర్వికిన్. 91

శా. ఈ దేశంబున కాదినుండి యిది యి - ట్లేయయ్యె విన్నారె మీ
యూదేశంబులు పూర్తిగా బధిరశం - ఖారావ తుల్యంబులై
ఖేదం బిగ్గతిఁగూర్చె నేఁటి కెటులీ - కీడ్పాటు రాకుండు నా
హ్లాదంబీదు త్వదీయవాదమది మి - ధ్యావాద మట్లొప్పెడిన్. 92

వ. నావుడు లాల్ బహద్దరుశాస్త్రి వానికి వందనమొనర్చి. 93

కం. అంతఃకలహంబులతోఁ
జంతించుచునున్న మనకు - శ్రేయము గలదే
పంతములు విడిచి శాంత
స్వాంతంబుల మెలఁగు టెంతొ - సౌఖ్య ప్రదమౌ. 94

కం. తలవంచిన యల పోవును
తల యెత్తినఁ బడఁగ ద్రొబ్బుఁ - దటి దొఱకుటచే
ఖలు లొకపరి చెలరేఁగిన
మెలఁగవలెం దొలఁగి యద్ది - మేలొనఁ గూర్చున్. 95

మ. బలమేకాదు బలంగమున్నయది యె - వ్వాఁడడ్డు నాచేష్టకి
కలలోకంబున నంచు ఱొమ్మువిఱువం - గారాదు సామాన్యుఁడే
సిలుఁగుం బొందిననాఁడు నిన్నుమనుచున్ - సింహం బురింజిక్కినం
జెలికి న్సాయమొనర్పఁ ద్రొడ్గొఱికి తాఁ - జిక్కెల్క రక్షింపదే. 96

ఆ.వె. శక్తి యున్న చోట — సహనమ్ము వెలసినఁ
గనకమునకుఁ దావి — గలిగి నట్లు
కాన వాని రెంటి — ఘనముగ సాధించి
భువిని దివినిజేయఁ — బూనుకొనుఁడు. 97

తే. సర్వ తంత్ర స్వతంత్రత — సంభవించు
వేళఁ బలుప్రాంతముల నిట్టి — విలయ మొదవె

ఫలము చేతిది మనవాతఁ - బడునో లేదో
కాల పుస్తక పుటల నే - కథలు గలవో. 98

కం. పలు సద్గుణముల సదయుఁడు
పులుగడిగిన ముత్యమట్లు - పొలిచినను ఖలుం
డలుకం గలిగించినచో
పలుకనిదే మందు సుజన - పద్ధతులందుఌ. 99

వ. అన విని తజ్జనంబు మరలిచనె. ప్రాయోపవేశముమానుఁడు, లీగు చేసినదితప్పని మహమ్మదీయ మతగురువులు మహాత్ముని గోరిరి. హిందువులు సిక్కులరుదెంచి ముస్లిముల సహోదరులవలెఁ జూతుమని వ్రాసియిచ్చిరి. పాటియాలాప్రభువు మలేర్కోటనవాబు మాసిక్కులిఁక హింస సేయరనిరి. రాజప్రతినిధివచ్చి ప్రజలయైక్యతకు శ్రమించుచుంటిననె. శాంతిగూర్చితిమని యజాదు నెహ్రూ ప్రభృతులాడ దేశికుఁ డుపవాస ముడిగె. పిదప పశ్చిమపాంచాలమునుండి హస్తినకేతెంచిన కాందిశీకుఁడు పంచవింశతివర్షప్రాయుఁడు మదనలాలుపావా గాంధీజీ ప్రార్థనాసదస్సున బాంబుప్రేల్చె. ఆకసము ఛేదింపఁబడినట్లు భయంకరశబ్ద ముద్భవింప నచటికుడ్యముకూలె. పావా కుట్రమూకకుంజెందినవాఁడు. ఆ గుంపునకు రాష్ట్రీయ స్వయంసేవకసంఘ ప్రముఖుఁడు హిందూరాష్ట్రమను మరాటీ దినపత్రికకు సంపాదకుఁడు హిందూరాజ్యకాంక్షి, దెబ్బకుఁబదిదెబ్బలను వాఁడు నాథూరామ్ వినాయక్‌గోడ్సేయను నాయకుఁడు నిరంతరము హిందువులు హింసింపఁబడుచుంట పాకిస్థానమున కేఁబదికోట్లధన మిచ్చుట తత్పక్షప్రజ కసమ్మతముగ నుంట వారు శాంతిదూతయగు గాంధీజీయెడ నిప్పులు గ్రక్కుచుండిరి. 100

# గాంధీ నిర్యాణము

కం. అటువారిటు నిటువారటు
చటులగతి న్వలసపోవఁ - జంపిరి ప్రజలం
గుటిలమతుల్ మతవాదులు
కట యది వర్ణింపఁదరమె - కమలభవునకుఌ. 101

ఉ. నిత్య మనైకమత్యముల - నిర్మల సౌఖ్యము గల్గ దెన్నడీ
సత్య మమోఘమం చనక - శాంతమతిఌ మతవైరదృష్టి దు

ష్కృత్యము సేఁత జేతలకుఁ - గేవల చిహ్నముగాఁ దలంత్రహో
పైత్యపుమంట యాఁకలిగ - భావన చేసెడి రుగ్ను కైవడిన్. 102

చ. కులమత భేదభావములు - క్రుళ్ళి యసాధ్యపు రోగజీవులం
గలుగఁగఁజేసి మృత్యు ముఖ-గహ్వరము న్నరులొందఁ జేయుచోఁ
దెలిసిన నేతృవైద్యు లతి - ధీరత వేగఁ జికిత్ససల్పి ని
ర్మల సుఖసంపద ల్వెలయ - రక్షణ తత్ప్రజకీయఁ జెల్లదే? 103

ఉ. కొమ్మకుఁ గొమ్మ రాచుకొని - ఘోరదవాగ్ని జనించి కాల్చు వృ
క్షమ్ముల రాజు రాజమిత - కక్షల యుద్ధమొనర్చి లోకవృ
క్షమ్ముల గాల్చుఁ గాన నది - గాదు ప్రశాంతికిమార్గ మాత్మబో
ధమ్మున మర్త్యసౌఖ్యకర - ధర్మపథంబున వర్తిలం దగున్. 104

శా. పెల్లౌ మార్పులు సృష్టికి న్సహజముల్ - విజ్ఞాన సంపత్తితో
నల్లం భౌతికతత్త్వ మెంచుచు శరీ - రారోగ్య రక్షాక్రియల్
చెల్లుంబో ఋతుసంధ్యలం దటు కడుం - జేడ్పాటుమై పాలనం
బెల్ల న్మారెడివేళ దేశనరులెం - తే జాగృతిం బూననౌ. 105

తే. కాల దేశోచితమ్ముగఁ - గడవు నేర్పు
మత విషయ లంపటున కెట్టు - మదికిఁ దట్టు
నవసరములేని శంకల - నదరుట పొగ
మంచుఁ గని ధూమమంచు భా - వించి నట్లు. 106

తే. హితము చెప్పుటలో నిజం - బెఱుక పఱచి
జాతి జనకుఁడు జనకుని - రీతి మిసుల
గాటపుం బ్రేమఁ బల్కిన - మాట లన్ని
చవుట నాటిన విత్తుల - చాయ నయ్యె. 107

తే. పూజ్య భావైక నిష్ఠన్స్వ - రాజ్య మొంద
నెనఁగు సౌఖ్యమనన్ హింస - హెచ్చె నకట
కఠిన శాసనమునఁగాక - కలుగవొక్కొ
శాంతిభద్రత లదియెట్లు - సంభవించు. 108

తే. లశునపట పద్మరాగాన - లక్ష్మి తొలఁగు
కరణి నీ ద్వేషబుద్ధి నై - క్యత నశించు

దాన దేశాన నొదవిన — ధర్మ హాని
కాల కూటానల జ్వాల — లేల నేర్చు. 109

ఉ. భారత మాతృ గర్భజులు - భ్రాతలుగాక తదన్యు లౌదురే
సూరిజను ల్విచారపడ - సోదరు లిట్లు వధింపు కొందరే
కారణ మెద్దియైన నగుఁ - గాక సహింపకుఁ జోటులేపొకో
మారణ హోమ మార్గమున - మానవ సౌఖ్యము వృద్ధి పొందునే.

కం. పరమేశుఁడు ప్రతిజీవిం
బరగుట నరహత్య ఘోర — పాపం బీశుం
డురక విడువఁ డీ సత్యం
బిరుతెగలు గ్రహింపకున్న — నెవరి వశంబౌ. 111

ఉ. ఇట్లు మహోగ్రదృష్టి జని - యించిన యక్కలహాసురక్రియల్
బిట్టుగ రేఁగ నాఁపఁగల - వీరవరుల్ కఱవౌట గాంధిచే
పట్టి సమస్య శాంతిహిత - భావపరంపరబోధసేయ న
ప్పట్టునఁ దొంటిక్రౌర్య మెడ - బాయరు తన్మతవాదు లుగ్రులై. 112

కం. ఒకపక్షము శాంతించిన
నొకపక్షము రేఁగుచుంట — కోర్వక శాంతిం
బ్రకటించుట వృథ యనుకొని
యకటా గోడ్సే మహాత్మ — హత్యకుఁ గడఁగెన్.  113

ఉ. అంత ననంతశౌర్యరతుఁ - డై తటిఁ జూచుచు నుండెఁగాని ర
వ్వంత యొనర్పఁడయ్యెఁ బర - మార్థవిచారము సర్వలోకవుం
బొంతము మేలుకూర్చునని - బుద్ధుఁడు క్రీస్తు మహమ్మదిక్రియన్
శాంతిని బోధచేసిరను - సత్యము వానికిఁ దోఁప దింతయున్. 114

వ. అంతం గాంధీజీ యస్వస్థ స్థితియందుండియు నుషఃకాలంబున నుత్థితుండై కల్యకరణీయంబులఁ దీర్చికొని నూతన జాతీయ మహాసభానియమముల సవిమర్శం దిలకింపుమని ప్యారీలాలునకిడి నిజాంతరంగిక భృత్యుండగు విశ్వమునుబిల్చి లేఖలందీసికొని ప్రత్యుత్తరములు లిఖించి యిచ్చె. పటేలు రా రాట్నముఁద్రిప్పుచు ననేకసమస్యలుచర్చించె. పిదప నొకండు లోనికిఁబ్రవేశించి మీతోసంభాషింపఘూర్జరదేశస్థులిర్వురు వాకిట

వేచియుండిరన నామేన(బ్రాణముండిన దైవధ్యానానంతరము మాటాడు మనవె. ఇద్దరు మనుమరాండ్రు తన రెండు భుజములఁ బట్టుకొని తోడ్కొనిరా సభ్యులు దారియీ వేడ్కోలువేదికకుఁజేరి సభకునమస్క రింప మర్కటవర్ణపటధారి గోడ్సే బాపూజీ యెదుటకువచ్చి మనూకన్య యాఁపిననాఁగక యామెంబ్రక్కకునెట్టి నమస్కరించుచున్నట్లు వంగి జేబు లోని పిస్తోలులాగి మహాత్మునిగుఱిచేసి ముమ్మారులుబ్రేల్చె.రెండు గాంధీజీ గర్భగోళమునుండిదూఱిపో నొండుగుండెనుండె. 115

ఆ వె. గుండెనుండి నల్ల – దండిగా వెల్వడి
యడుగులంటి చుట్టు – మడుగు గట్టె
యన్య చింత లణఁచి – యాతఁడు మ్రొక్కుచు
రామ రామ యంచు – వ్రాలె నేల. 116

తే. కార్య పరిశీల నాత్మక – ఘన చతురత
రసహృదయ రంజనాద్భుత – రమ్య గతుల
దేశమున కెప్డు నూత్న సం – దేశ మిచ్చు
లోక బాంధవుఁ డరిగె న్వ – ర్లోకమునకు. 117

శా. స్తంభించెంక్షణ మిజ్జగంబు బహుధా – ధాతాండగోళంబు సం
రంభించె న్వడఁకెన్ శుగ్రశుతతులన్ – రాల్చెన్ వ్యధాదృష్టులా
రంభించెం దమమావరించె జనవార్తా – వాణిగాద్గద్యముల్
దంభాపేతములయ్యె నయ్యుచనఁ జిం – తాధూమసంఛన్నతన్. 118

శా. లోకంబెల్ల మహాంధకారమునకున్ – లోనయ్యె దుఃఖాబ్ధి య
స్తోకంబై వెసఁ బొంగెఁ గార్యగతు లెం – దుం గర్తృహీనంబులై
మూకత్వంబుననుండె దిక్సతుల మో – ముల్వాడిపోయెం గళా
ప్రాకారంబులు బీటువాఱె నపుడ – వ్వార్తా ప్రచారంబునన్. 119

శా. సత్యాహింసల దాసుఁ డీతఁడు సదా – సన్మార్గ సంచారి సం
స్తుత్యార్థ్యుం డసమాన ధర్మబల ని – స్తుల్యుం డుదారాశయో
న్నత్యశ్రీ నరలోకబాంధవుఁడు ధ – న్యశ్రేష్ఠుఁ డంచెంచకీ
కృత్యం బెట్టులొనర్చె మర్త్యుఁడని దుఃఖించెం జనంబెంతయున్.120

ఉ. ఎంతయకృత్య మొక్కటృటి – నిట్టియెఁ బట్టుఁడు కొట్టుఁ డాతనిం
బంతము మీఱనంతుఁ బలు – పల్కులు నల్దెస మాఱుమ్రోగ శు

ర్ధాంత రుషోజ్జ్వలాగ్నికణ - ధామసదస్యజనౌఘ ముగ్రమై
వంతెనమీఁదఁ బాఱు పొగ - బండివలెన్ రొదసేసె సత్తఱిన్. 121

తే. పరుల కుపకృతి సల్పెడి - భవ్య మతుల
మంచిఁ దోషించి బుధులు భూ - షించు నట్లు
యెప్పు డెంతటి వానినే - నెంచి పొంచి
దోష కృత్యములం దూఱి - దూఱి కుంద్రె. 122

శా. ఆలో సర్వదిగంతరాళముల క - య్యాకాశవాణ్యాదులున్
భూలోకంబుననున్న పత్రికలు సం - పూర్ణంబుగా గాంధిజీ
మేలౌ సత్యచరిత్రతోఁ గఠినమౌ - మృత్యువ్యధాగాథయుం
జాలం భక్తి భజించుచుం దెలిపె వి - శ్వంబెల్లఁ జింతిల్లఁగన్. 123

తే. అంగరక్షక తతి నిత్తు - నన్న వలదు
వలదు నాకేల యని యిట్టు - ప్రాణ హాని
దెచ్చుకొంటివి మావ్యధ - తీరు టెట్టు
సకల సద్గుణ సముపేత - శాంతి దూత. 124

కం. రక్షణ శాఖకు సర్వా
ధ్యక్షుఁడనై యుండి యిట్టి - దారుణ హత్యా
రాక్షస కృత్యముఁ బాపెడి
దక్షత కఱవయ్యె నాకు - దాక్షిణ్యనిధీ! 125

తే. కష్టపడి గీము నొక్కండు - కట్టి నందు
హాయిగానుండు వేఱొకఁ - డన్న రీతి
నష్ట కష్టాలు పడి తెచ్చి - నట్టి రాజ్య
భోగములు పొందకుండ నీ - వేగితి గద. 126

వ. అని పటేలుచింతింపం దక్కిన ప్రజానాయకరత్నంబులు మహాత్ముండు స్వర్గస్థుండగుటం గాంగ్రెసు చిలుకలేని పంజరమువలె దీపకళికాశూన్య గృహంబు చందంబున పుష్పహీన లతభాతిం గళాహీనమయ్యె నను కొని. 127

కం. చిక్కనసమస్యల నెవరికిఁ
జక్కంగాఁ దీర్చి జయము - సాధింతురు మే

మెక్కరణి నిన్ను మతులము
నిక్కపు నేతాధినేత — నీతి విధాతా. 128

కం. నీమాట మాకు వేదము
మోమోటములేక ధర్మ — మును వాకొందే
యేమేరి గురుత్వంబున
నీమా పరిపాల నాబ్ధి — నిఁక నీఁదుదుమో. 129

కం. సాకితివి యోర్పు నేర్పులఁ
గాకలు దీరంగఁ గరుణఁ — గాంగ్రెసు కాంతన్
నీక్రియ నెవ్వఁడు మెలఁగును
మాకిఁకఁ జూక్కా నెవండు — మాన్యచరిత్రా. 130

కం. చెట్టొకఁడు పెంచ ఫలముల
దిట్టముగా వేఱొకండు — తినఁ బుట్టినయ
ట్టిట్టుల నీతెచ్చిన ఘన
పట్టపు భోగంబు మాకుఁ — బ్రాప్తంబయ్యెన్. 131

తే. అంచుఁ బరిపరివిధముల — నడలి నడలి
పితృ వియోగంబు గలిగిన — బిడ్డ లట్టు
కృష్ణుఁ బోఁగొట్టు కొన్నట్టి — క్రీడ వోలె
నాయకాగ్రణు లెల్లరు — నవసి రంత. 132

ఉ. తాలిమిఁ దాలనీక నర — దారు పశేలటు రాజకీయపుం
గీలకము ల్గ్రహించి శ్రుతి — కిన్ హితకృత్యము లాచరించుచుం
గాల మదెంత వక్రగతి — గాఁ జరియించిన నిచ్చ గాంధిజీ
మౌలిక సూత్రబద్ధమయి — మామక జీవితము ల్గతించుతన్. 133

వ. అంచాత్మందలంచి మహాత్ముని గుణగణంబులఁబ్రశంసించి హింసా దౌర్జన్యముల నశాంతికాలవాలమైన యిత్తరుణమున మముపీడిపోయితివా యని వాపోయిరి. 134

ఉ. వ్రాలె జగద్ధ్వజాళి బహు — భారసమన్వితమౌట గుండియల్
ప్రీలె మహాత్మశిష్యుల క — ఖేద్యమహోగ్రవిభేదదుర్గముల్

కూలెె నరస్వభావగత – ఘోరవిమోహ మహాంధకారముల్
తూలెె వివేకమష్ట తుల – తూఁగె విరాగవుఁ ద్రాసునందొగిన్. 135

చ. కలత యొకింతలేక కల – కాలము కష్టసుఖాల నోర్చుచున్
నిలిచి యనేక ఘట్టముల – నెమ్మదిఁ గాంచుచు గుండెగట్టికిన్
నిలయములంచుఁ జేర్వడియు – నిబ్బనిరయి యూఁచఁజాలకే
యల సెలయేళ్ళ వ్యాజమున – నద్రులు కార్చె శుగశ్రుధారలన్.

తే. పరుల ప్రాణాలు కరుణఁ గా – పాడఁదలఁచి
యెరగలిందూఁకుటకునేని – వెరవఁబోక
యెవఁడహింసను బోధించె – నిజ్జగాన
నతఁడెహింసకు గుఱియౌట – యబ్బురంబు. 137

వ. ఇవ్వార్తవినినంతన ద్యోవీధి ఖండఖండాంతరాగత వ్యోమయాన శ్రేణులు నేత్రసమన్వితమై విష్ణురథంబులంబలెఁ గరిపురోపరిభాగంబునఁ జక్రరేఖందిరుగుచుండిగ, భూతలంబున గాంధేయమార్గగాములతో ధూమ శకటంబులు చతుర్దిశలనుండిచనుదేర నేలయీనిన ట్లాబాలవృద్ధముగా నాస్త్రీపురుషముగా నసంఖ్యాకప్రజానీకము శోకసమన్వితావనతశిర స్కమై పరివేష్టింప నగ్రనాయకులు దుఃఖభారంబున వంగి రాజలాంఛనముల రాజఘాటున యమునానదీతీరంబున మలయజఖండంబులఁ దన్మృతకళేబరమునకు దహనసంస్కారమొనర్చి తచ్చితాభస్మ మఖండ జ్యోతిసమేతముగఁ బ్రత్యేకధూమశకటంబునం గొంపోయి భారతమునం గల సర్వజీవనదులం గలిపి నిర్వర్తితాంత్యక్రియులై చితాభస్మస్థానంబున సమాధికట్టించి నెహ్రూ రాజేంద్రప్రసాద జాదు శాస్త్రి, పటేలు ప్రభృతులు క్రమంబుగ దాని సుమమాలాలంకృతంబొనర్చి ప్రణతిసల్పిరి. అనంతరము రాము లట్లయొనర్చి దోసిటంబూలుగొని. 138

## పుష్పాంజలి

సీ. అస్తమించెె మహాత్ముఁ – డను లోకబాంధవుం
డేతేజ మంధమ్ము – నెగురఁ గొట్టు

సంత్వర్థితంబయ్యె - నల ధర్మదేవత
  న్యాయంబు నేశక్తి — నడుపఁ గలదు
జాతిపోయెను నహింస - సాసూత్ర మేదయా
  జ్యోత్స్న దీనావనో - ద్యోగి యగును
అంతరించినది స — త్యస్థాయి యేనీతి
  నిష్ఠమై నరజాతి - నిలుపఁ గలదు.

తే. మృగ్యమయ్యెను శాంతి యిం — కేతపస్సు
లోక కల్యాణ రాజ్యప — తాక నిల్పు
నెన్ని యుగములు చన్ననీ — పృథ్వీమీఁద
గాంధినింబోలు పుణ్యాత్ముఁ — గాంచఁగలమె. 139

వ. అనియనుకొని సత్యాగ్రహసమరస్రష్టా! 140

శా. లేవా నీవిఁక భారతోర్వి కమిత — క్లిష్టస్థితుల్ రూపఁగన్
రావా యీవ వరంబులీవ జనతా — రక్షాకళాదీక్షఁ దే
లేవా స్వర్గము హైందవావనికి ని — ర్లిప్తానుబంధంబుతో
దేవా సేవలు సేసి పోయితివ య — ర్థింపంగ దేవాధిపుల్. 141

శా. హింసాదూరుఁడవై చరించి బహుధా — హింసంబ్రబోధించియున్
హింసింపంబడినాఁడ వేమికతమో - యెవ్వారలూహింపనౌ
కంసారాతిఁ గిరాతుఁ డట్లడఁచె ని - క్కంబొక్కఁ డయ్యయ్యొ వి
ధ్వంసంబయ్యెఁ బ్రశాంతి లోకమిఁక నం — తాపంబునం బ్రుంగఁగన్.

శా. దోసంబింతయులేదు భూతదయ నీ — తోఁబుట్టినా చీమనే
గాసింబొందఁగఁ జేత పాపమని యి — క్కాలాన శాక్యర్షిగా
వాసింగాంచి స్వరాజ్యమంది నరగన్ — స్వారాజ్యముం బొందితే
నీ సిద్ధాంత మనన్యసాధ్యము సదా — నిస్స్వార్థ సేవానిధీ. 143

శా. రక్షఃక్రౌర్యకఠోరచిత్తులు ప్రజా — రాజ్యంబునన్ రెచ్చఁ ద
ద్భిక్షాదక్షత శూన్యమైనఁ బ్రభుతా — శ్రీ యెట్లు రాణించుఁ ద
త్కక్షల్ట్సీ పురుషార్థకాదిహీననో — గ్రంబై వ్యథాపూర్ణ దు
ర్భిక్షంబై యమలోకమై బహుళదా — రిద్ర్యాంధముల గూర్చఁగన్.

చ. గతిచెడి యచ్ఛపుం బ్రగతి - గానక కానలఁబడ్డ దీనులై
మతిచెడి స్రుక్కు మానవుల - మంచి దలంచి శ్రమించి మించె దా
యతి నిశితాస్త్రమై పరగు - నట్టి యహింసన సత్త్వచాప సం
గతిఁ జెవిఁదాఁకఁ జిమ్మెదవు - కల్మషచిత్తుల గుండె వ్రీలఁగన్. 145

ఉ. దైవసమాన! యార్తజన - తా సుఖదాయక విశ్వశాంతి సం
భావన ధీనిధీ! దృఢత - మస్సు మహస్సుగ మార్చఁజాలు నీ
జీవిదనూతవస్సు నవ - జీవనదంబగు నీ వచస్సు నీ
పావన రూపరేఖ లెదఁ - బాసెఁగదా భరతోర్వి బాపుజీ! 146

శా. ఆరాధించితి నిత్యనిష్ఠ నిట న - త్యాహింసలన్ స్వర్గముం
జేరన్నీ వెనువెంటఁ దద్వయము నీ - చేసేవలంబొందు వాం
ఛార్తిం జనుదెంచె నాకమున కా - చార్యాగ్రణీ కానిచో
నేరీతిం బరికించినం ధరణి లే - వే తద్వయం బిత్తఱిన్. 147

ఉ. దేశవికాసలబ్ధి కతి - ధీరత వీరత దివ్య నవ్య సం
దేశములిచ్చి యిచ్చి మము - దీనులఁజేసి దివంబుఁ జేరితే
యీశసమానుఁ డీతఁడని - యెల్లజగంబులు నిచ్చమెచ్చ మా
యాశలు దీరకుండ సకలాశలు బాష్పముల న్వెలార్పఁగన్. 148

వ. నీశమన మహంకృతికి దమనము. నీప్రగాఢాస్తికత ప్రశమితనాస్తికత. నీయాత్మ విశ్వాసములు సూనృతాధి దేవత కుచ్ఛ్వాస నిశ్వాసములు. నీ నిరాడంబరత పరతత్త్వపరత. నీరాక యవిద్యాతిమిరమునకురాక. నీ ప్రోద్యోగము సర్వసంపద్యోగము. నీ నిద్ర లోకశాంతికి ముద్ర. నీ సంస్కారము ధర్మదేవతకుఁ బురస్కారము. నీదాంతము పరిపూర్ణ వేదాంతము. నీ చేతము ద్వంద్వాతీతము. నీ సమదృష్టి స్వయంపోషకేష్టి పరిపుష్టి. నీ స్పర్థిబుద్ధి కుంఠీకృతప్రత్యర్థి. నీ నిరశనము హింసామృషా నిరసనము. నీయాదర్శంబు లోకాలోక పుణ్యఫల దర్శనాదర్శంబు. నీ పట్టిన పట్టు రిక్తులకుం బెట్టుఁజెట్టు. నీమాట హింసార్థికిం బెట్టనికోట. నీ వాఙ్ముఖము విశ్వకల్యాణ మహాకావ్యమున కాముఖము. నీ నిర్వేదము చతుర్వేదవాదము. నీ భ్రూభంగము రిపుకోటికి శృంగభంగము. నీ కరము పతితార్తాభయంకరము. నీ నవ్వు పారతంత్ర్య పిశాచమునకు నొవ్వు. నీ దాత్యము విశ్వసౌభ్రాత్రత్వ సాహిత్యము. నీకదన మాత్మబల

పరీక్షాసదనము. నీకృప సామ్రాజ్యవాదమున కపత్రప. నీ గమనము భువన దుఃఖోపశమనము. నీ చూపు దయారసేందిరకుఁ బ్రావు. నీ కమ్మ పలుకుం జెలి చెవికమ్మ. నీవ్రాఁత నూతన భగవద్గీత. అట్టి మహాత్మా నీ కిదే నా కడపటి పుష్పాంజలి యని యక్కుసుమములు సమాధిపైఁ జల్లి యశ్రుతర్పణ మొసంగి యహర్దానాద్యంత్య క్రియానంతర మాంధ్రదేశ మ్మున కేతెంచి. 149

# గాంధీ సూత్ర ప్రచారము

తే. అంగలూరికిఁ జని యతఁ - డాశ్రమమున
దేశభక్తుల దర్శించి - దీన జనుల
నుద్ధరించెడి మార్గము - లుచ్చరించి
శీఘ్రముగ వచ్చె విక్రమ - సింహపురికి. 150

తే. హరిజనుల మేలు గోరు మ - హాత్మ శిష్యుఁ
డిప్పురికి వచ్చె ననువార్త - యెఱిఁగి వారు
తన్నుఁ గన వచ్చినంత సం - తసము మీఱ
వారలం జూచి దయతోడఁ - బలికె నిట్లు. 151

కం. హరిసేవా నిరతస్థితి
హరిజన నామంబు సార్థ - కాహ్వాయ మగుతఱి
నిరతము భక్తులఁ బ్రోచెడి
హరి మిమ్ములఁ గాచుఁ గాత - యనవరతంబుఱ. 152

వ. అని దీవించి యట వసించుచుఁ గర్మయోగి నిర్యాణమునకు లోలోఁ గుములుచుఁ దదాత్మశాంతికై నిర్మాణకార్యక్రమ మగ్నమానసుండై "హరిజనసేవయే హరిసేవ - మానవ సేవయే మాధవుసేవ" అని వ్రాసి యున్న యట్టుల ఱొమ్మున వీపునఁ గట్టుకొని గాంధీమహాత్మునకు జే యనుచు వాడవాడలఁ దిరుగుచుఁ బ్రతిశృంగాటకమున నిల్చి సబర్మతీ మహర్షి సూక్తుల నుపదేశించుచుండె. ఇట నిట్లుండ నుత్తరదేశంబున. 153

ఉ. ఇంతటనైన సత్యము గ్ర - హించి సహోదరభావమెంచి ని
శ్చింతగ నుంట మేలని వ - ఛించిరి పెద్దలు గాంధిలేని లో

కెంతకుఁ దీర దెస్సటికి - నే యుగధర్మము నుద్ధరింపఁగా
సంతటివాఁడు పుట్టడని - రాత్మపడు ల్మహుదూరదృష్టులై. 154

చ. మితియిడరాని ద్వేషము ని - మేషనిమేషమునం జనింపఁగా
హతజన తాపతప్త భర - తావని వేళ్ళొగిఁ బాయుకొన్న త
న్మతకలహంబు తొంటి బున - మాసి మహాత్ముని జంపినంతనే
గతిచెడి మంత్రబుద్ధ భుజ - గంబటు లాఁగె నదేమిచిత్రమో. 155

తే. అచట నట్లుండ నింకిట - ననవరతము
హరిజనాభ్యుదయంబున - కమిత దీక్ష
నెంత చెప్పిన ఫలితంబు - సుంతలేమి
హృదయమునఁ జింతపడి రాము - లిట్లు పలికె. 156

చ. ఫలమెటులున్న వేమననఁ - బాములు జెట్టులు మీఁదఁ బ్రాకిన
ట్టులఁ దలపోయువారును గ - డుంగడుఁ గాలమహత్తెఱుంగుచుఙ
వెలవెలపోయి లో వెలికి - వేమన వాక్యమె వేదవాక్య మఙ
పలుకులు పల్కుటెంత పరి - వర్తనమో పరికింపుఁడీ ప్రజల్. 157

ఉ. అట్టి మహాత్ముఁడన్న నమి - తాదర మేదుర దృష్టిఁజూచి యా
దిట్టి హితోపదేశము హృ - దిం బదిలంబుగనిల్ప రక్కృతుల్
గట్టిగ నాచరింప రెటు - గల్లు స్వరాజ్యసుఖం బమోఘమై
యుట్టియ యెక్కలేని నరు - లోవుదురే మఱి స్వర్గమెక్కఁగా. 158

ఉ. ప్రాక్తన వాసనా భరిత - భావ విపాటన సత్త్వశూన్యతో
ద్రిక్తత ధర్మసూక్ష్మ పరి - ధింగమనింప కదేమొ క్రూరతా
సక్తిఁ జరింతు మానవుల - సాధ్యము వీరలఁ జక్కజేయ సా
ధూక్తుల విశ్వసింపక శు - భోదయ మెట్టులగల్గు నేరికిఙ. 159

చ. గుణమును గౌరవించు జన - కోటి జనించిననాఁడు నాడు నం
దనమయి సౌఖ్యపుష్ప భరి - తంబయి కీర్తిపరీమళచ్ఛటా
ఘనధనశోభితంబయి స - కాల ఫలాన్వితమై మహేంద్రుఁడుఙ
ధనదుఁడు మెచ్చుకోఁ దగు వి - ధంబున వెల్గదె శాశ్వతంబుగా. 160

ఉ. మద్యమునెట్టి నూల్వడికి - మానక ఖద్దరుగట్టి గాంధీజీ
హృద్య వినూత్నసూక్తుల న - హీన ముదానఁ బఠించి తద్యశో

వాద్యము లాలకించి యన - వద్యకృతిహాఁ జరించి సత్కళా
విద్యుదుదారకాంతితతి - వే యెగజిమ్ముఁడు సర్వదిక్కులన్. 161

శా. న్యాయస్థానముఁ జేరఁబోక పెఱక - న్యాయంబు యోచింపకే
చాయ న్వర్తిల నీకు దేశమునకున్ - సౌఖ్యంబు చేకూరునో
యాయామార్గములన్మెలంగ ఘనధ - న్యత్వంబు గల్గుం దుదిం
గాయ మ్మాయువు దీఱఁబోయిన యశః - కాయమ్ము పోనేర్చునే. 162

ఆ.వె. అఖిలషింపుఁడయ్య - హరిజనాభ్యుదయము
సంటురాని తనము - గెంటి వైచి
విశ్వ కర్త యైన - వే ల్పొక్కఁడే గానఁ
దలుపుఁ దెఱచి గుడికి - దారి యిండు. 163

వ. అని యివ్విధంబున హరిజనౌన్నత్యమునకు నిర్విరామకృషి సల్పుచున్న రాముల కథ విని సహకరింపందలఁచి సేవాగ్రామాశ్రమ కార్య నిర్వాహకుఁడగు ప్రభాకర్జీయాతనిందన చెంతకుఁ బిలిపించుకొనె. ఐన నాశ్రవాస్థు లేవేవో కుంటిసాకు లఁగ్గడించి రాముల నిరశనవ్రతం బాప యత్నింప సీతాపతి యేరితోడ్పాటులేదే నే నొక్కండన యే వృక్షచ్ఛాయనో దీక్షం బూనుదునని వైళమ సత్యాగ్రహంబు ప్రారంభించె. నిరాహార దీక్ష యిర్వది యెనిమిది నాళ్ళు గడచినఁ దత్సహచరు లెల్లరు నిర్లక్ష్యంబుగఁ గనుటంగని యతని కృత్యం బఖివర్ణనీయ మాదరణీయమ్మతఁ డిట్లు మరణించుట లగ్గుగాదని తత్కఠిననిష్ఠ కాశ్చర్య చకితుఁడై ప్రశాంత గంభీర హృదయుఁడు, ప్రజారంజకుఁడు, రాష్ట్రపతి రాజేంద్రప్రసా దాశ్రమమునకు వచ్చి రాముల నికటంబున నిల్చి వెచ్చనూర్చి. 164

చ. పతితజనావనాద్భుతకృ - పాకర! దేశహితైకదృష్టి ని
గ్గతి కఠినవ్రతస్థ ఘన - కష్టపరంపరనోర్చు త్వన్మన
స్థితిగని సానుభూతి నినుఁ - జేరరు పోరరిఁకాత్మహింసతో
నతి ధృతిదేహమిట్లు జఠ - రాగ్నికి భస్మముచేయఁజూచెదే. 165

ఉ. ఎంతటి దేశభక్తి మఱి - యెంతటి రిక్తజనానురక్తి యిం
కెంతటి త్యాగశక్తి కడ - కెంత విరక్తి మహాత్మశిష్యులం
దింతటి దీక్ష యిప్పటికి - నెవ్వరుపూనిరి? చూడఁజాలని
శ్చింతగ నీదుచర్య గుణి - శేఖర! తీర్తుఁ ద్వదీయవాంఛలన్. 166

చ. ఇది సమయంబుగాఁదలఁచి - యీవిఁక దీక్షకు స్వస్తిచెప్పు పం
పెద వెసవార్తమంత్రి కట - వేగమ శాసనరూపమొందుఁ ద్వ
ద్హృదయ గతైకవాంఛయిట - నెవ్వరి యాదరణంబులేమి నీ
కొదవెను బెక్కునాళ్ళ వెత - యోర్పనసీయదె రామయాగ్రణీ! 167

కం. బుద్ధున కానంపుంబలె
నిద్ధచరితుఁడైన గాంధి — కితఁడేగద త
త్పద్ధతిఁ దొలిశిష్యుండని
సిద్ధించుం ఖ్యాతినీకు — శిష్టవరేణ్యా! 168

ఉ. మచ్చయొకింతలేని జన - మాన్యుఁడ వంతియకాదు లోకపుం
దుచ్ఛపు భోగభాగ్యముల - తోఁ దులదూఁగెడివాంఛలేదహో!
మెచ్చెజగంబు నీనడత - మిత్రవతంసమ! స్వర్గసీమకుణ
నిచ్చెనవేసికోఁగలవు - నీతుల నీతుల యెవ్వరిద్ధరణ. 169

"కం. అట్టడుగున మనసోదరు
లెట్టుండిరొ యింతకాల — మిఁకమతములలో
గుట్టెఱిఁగి మంచి నెంచుచు
చెట్టులుదొలఁగంగ వారి — శ్రేయముఁగనుఁడా! 170

తే. మతమె చూడక ధర్మ న — మ్మతము చూడు
కులమె యెంచక యెంచుము — గుణ గణంబు
పరమునఁ గుసీద మాసించు — నరున కరయ
లలిత సత్పాత్ర దానము — లాభ కరము." 171

కం. అని గురుఁ డాడఁగ విని యి
ట్లనయము హరిజనుల క్షేమ — మాసించిన నీ
ఘనకృత్యము వృథయగునా
యనుమానము లేక దీక్ష — నాఁపు మనుచు వే. 172

కం. నిస్తంత్రీ ద్వారమ్మున
వాస్తవ మెఱిఁగించె రాష్ట్ర — పతి మంత్రికిఁ ద
త్స్వస్తి గమనించి శాసన
మస్తోక ముదానఁ జేసె — హరిజను లలరణ. 173

వ. ప్రతిమాసాంత దివసము హరిజనాభ్యుదయమునకై వినియోగింప వలయునని మండలాధికారులకు మద్రపురి పరార్థ్యమంత్రి పర్మానాలు పంపె. తత్కృతియు సంపూర్ణఫలప్రదంబుగామిఁ గామితముదీరక వేఱొక మారము రాము లన్వేషించుచుండె. ఇటు లిట్లుండ భారతజాతీయ మహా సభాశిఖరాగ్రనాయకరత్నములు కరిపురమున నొకసదస్సొనరించి విశ్వ విఖ్యాతచరిత్రుఁడైన గాంధీజీ స్మారకనిధిని సేకరింప దృఢసంకల్పమును వెలార్చిరి. అత్తఱి మహాత్మునివంటి పురుషోత్తముని పేర నిధి సేకరించుట కష్టముకాదుకాని తత్సేవధి యన్యాక్రాంతముకాకుండఁ పరిపూర్ణప్రజోప యోగకరకృత్యములకు సర్వోదయ సిద్ధాంత ప్రచారమునకు వినియో గించుటకై తీసికొనందగిన జాగరూకత ముఖ్యమని యొకవృద్ధవిద్వన్మణి వాక్రువ్వ నది సత్యంబదిసత్యంబని సహృదయవరేణ్యులగు సభాసదు లెల్లరుం దలలూపిరి. దానంజేసి నాఁటిస్థితిగతులం గమనించి యొక్కొక్క ప్రదేశమున క్కొక్కొకనాయకుని గార్యనిర్వాహకునిగఁ జేయుచు నాంధ్ర దేశవిషయము చర్చించి బాపూజీ హృదయపూర్వక ప్రశంసాభాజనుండు పరోపకారపారీణుఁడు నిర్మల నిశ్చల నిరాడంబర నిస్స్వార్థ నిష్ఠాపరుఁడు సత్యాగ్రహసమరయోగి సుఖవిరాగి సద్గుణాభిరాముఁడగు పొట్టిశ్రీరాముల గార్యదర్శిగ నియమించి యవ్వార్త సీతాపతికిందెలుప నతండు తదాజ్ఞ శిరసావహించి సంచాలక పదవి స్వీకరించి తద్ధనార్జనమునకుంగడంగి వివిధ పల్లిపతన ప్రయాణకాల నిర్ణయపత్త్రిక రచించుకొని తదనుకూలం బుగఁ ద్రిలింగదేశమునఁ బర్యటనము ప్రారంభించె. 174

శా. సేవారంగమునందు దూఁకుటకు సం - సిద్ధుండుగానుండు త
ద్భావోద్రేక మదెట్టిదో విజయ వి - శ్వాసోజ్జ్వల శ్రీలకుం
దావై యొప్పు మహాత్మువర్తనము నా - దర్శంబుగా నెంచి యా
త్రోవన్దా మెలఁగందలంచుఁ బ్రజకెం - దు న్మేలుచేకూర్పఁగన్. 175

వ. అంత నొక్కనాఁ డస్పృశ్యత యదృశ్యముకావలయునని లిఖింపఁ బడిన యట్టల ముందువెన్కలఁ గట్టుకొని యున్నతపాఠశాలావిద్యార్థుల కడ కరుగ వా రతని నొకవెట్టివాఁడనుకొని చుట్టుంజుట్టుకొని కరతాళ ధ్వనులతో నవహేళనసేయుచు వెగటుగన వ్వుచుండ నందొక్కబాలుండు ముందువెన్కలరయక ముందునకువచ్చి. 176

కం. నీవొక్కఁడ విటు సేసిన
సేవకు సంపూర్ణ ఫలము – నీకుఁ గలదే
యీవేషంబుల కేమిఁకఁ
బోవయ్యా యిట్టి చేఁత – పోలదు నీకున్. 177

కం. మోకాలి వఱకె వస్త్రం
బీక్రియ ధరియింప గాంధి – కెనయాదువొకో
పోకడలివి మాను మెదో
చాకిరికిం బొమ్ము పొట్ట – జరుగును నీకున్. 178

ఆ.వె. పగటివేసగాండ్రు – పలువు రేతెంచిరి
కాని యిట్టి వానిఁ – గాంచ లేదు
వింతయయ్యె మాకు – వేష భాషలు చూడఁ
బొట్ట కొఱక లేక – బట్ట కొఱక. 179

ఆ వె. క్రొత్త బిచ్చగాఁడు – ప్రొద్దెఱుంగండని
యన్న మాట నీక – యతికి పోయె
వేళపాళలేక – వెట్టి వై యీరీతి
నూరుదిరుగ లాభ – ముండ దెపుడు. 180

ఆ.వె. మూఁగ వ్రతముఁ బూని – మోనముచేయ నీ
తరమె నీదు తాత – తరమె చాలు
మెచ్చుకొంటిఁ దరలు – వచ్చిన దారిన
పోటు మాట లెన్నొ – పుట్టు నిట్టి. 181

ఉ. నావుఁడు మందహాసవద - నంబును నల్లన నెత్తి చూచు న
ప్పావని రాముఁ గాంచి యొక – బాలుఁడు సత్యవివేకశాలియై
యీవిధిఁ బల్కఁ బల్కఁదగు — నే యని మిత్రునిమందలించి న
ద్భావ మెలర్పఁ దక్కఁగల–వారల నన్నల నాఁపి యిట్లనున్. 182

కం. అల్లరి సేఁత వినోదము
పిల్లల కని మీకుఁ దెలియుఁ – బ్రేమ విపంచిం
జల్లఁగ మీటుచుఁ గనుఁడికఁ
బ్రల్లదములు పలుకలేరు – బాలు రనంగన్. 183

చ. పకపకనవ్వి రాము లెద - బాధజనింపదునాకు దేశవుం
దికమక లెట్టువాయునను - దీక్షఁజరింతు మహాత్మబోధమైఁ
గకవికలైన రాజ్యరమ - గాఢ సమైక్యత నేకరీతిగాఁ
జకచక వృద్ధినొందఁ దగు - సాధనమా వ్రతమంచుఁబోవుచో. 184

ఆ.వె. వింత వేస మూని - విరటుఁ జేరనరుగు
కంకు దారిఁ బ్రజలు - గాంచి నట్టు
పొట్టి రాముఁడట్టు - పోవుచో పురజనుల్
చూచుచుండి రెంతొ - చోద్య మనుచు. 185

ఆ.వె. పిల్ల లెల్ల వారి - తల్లుల కెఱిఁగింప
నింటినుండి వేగ - నేగుదెంచి
వింత వేష ధారి - వీఁ డెవ్వఁడోఁ చూడ
రమ్మ యనుచు వనిత - లరసి రవుడు. 186

కం. కొకిబికి వేసంబులతో
రకరకముల నరులు వచ్చి - ప్రజల మనంబుల్
తికమకలు సేయుచుందురు
ప్రకటింపఁగ వశమె వీరి - భావము లెల్లన్. 187

వ. అనివారనుకొనిరి. ఇట్లొండు రెండువిడుత లప్పాఠశాలకేగ నట్లు జరిగె. అంతనొక్కనాఁడు రాముల దేశభక్తిపూరిత మహోన్నత గుణగణమ్ములఁ బ్రశంసించుచు గాంధీజీవ్రాసిన లేఖను దద్విద్యార్థులకుంజూప వారాశ్చర్యచకితులై యతనిఘనత గ్రహించి విధేయులై మహాత్మునకుం దగిన ఛాత్రరత్నమని తద్బోధల నతిశ్రద్ధమై నాలించిరి. అమ్మఱునాఁడట్లు కళాశాలకేగ విద్యార్థులు గొందఱు దీర్ఘాలోచతో నతనింబరికించి సమీపించి నీవు గాంధీశిష్యుఁడవా సబర్మతినుంటివా యనిపృచ్ఛింప నౌనన నట్టులైన మహాత్ముఁడు నిన్నెట్టాదరించె. తద్వర్తనంబులు నాశ్రమస్థితి గతులెఱిఁగింపుమన నాతండిట్లను. నేను బాపూజీ సన్నిధిక [illegible] 188

కం. కని కనికరమున నానుడి
విని వినియోగపడు వీఁడు - వీడని తగు పొం
దని దనివిసని మదికి నిం
పని పనిసేయంగ నెపుడు - పనుపఢ నియతిన్. 189

కం. మనదేశ విముక్తికి స
జ్జనసంఘంబుండు నపుడు - సముచిత రీతిం
ధని నిర్ధని భేదంబుఁ
గనరాదు మహాత్మునందు - కారుణ్యమునన్. 190

కం. ఉఱవెఱిఁగి పలుకు పలుకున
దొఱఁగం బూఁడేసె తేఁటి - తోఁచినయుల న
క్కఱ మీఱ పలుకు పనులను
గఱువదెలుపఁ జట్టు బత్తిఁ - గర్త మొనర్చున్. 191

(అచ్చతెలుఁగు)

వ. ఎల్బడి నెమర్కొను కార్యక్రమమునఁగల కష్టనష్టములు నిచ్చలు త్రవ్వి త్రవ్వి పొక్కుచు. నాఁటి జనముల ప్రవృత్తులంబట్టి కట్టుదిట్టము లొనర్చె. పాఠములు రానివాఁడు బడికి దొంగ. పనిసేయనివాఁ డింటికి దొంగ. పన్నుగట్టనివాఁడు దివాణమునకు దొంగ. విధుల నాచరింపని వాఁ డాశ్రమమునకు దొంగ. 192

కం. వసుధఁగతి గనుచు వెన ని
ద్దెనఁ గాంగ్రెసు పనులనెల్లఁ – దీర్చుచుఁ గించి
త్తెనలిక పొనఁగమి విసువక
కనరక సహచరులఁ గార్య – కర్తగ మెలఁగున్. 193

వ శాలిబీజమంజరీకంటక సదృశసూక్ష్మాంశములనే నట్టె గ్రహించుచు నొక్కటి నెన్నికష్టములు చుట్టుముట్టినను సహస్రకరకరోత్కరము సోఁకిన జలజమట్లుండు. ఘర్మజలోపేతతనువునకుఁ బడమటిగాలిచుం జల్లఁగనుండుఁగదా. మెచ్చుకొన్న నొచ్చుకొన్న నగ్గురునకు నచ్చినమాట నుచ్చరింపక మానండు. ఇంతవట్టు గాంధింబోనివాని నేయుగంబుననేఁ గనివినియెఱుంగ. అమ్మహర్షి నిబోధన మొకబోధనము. 194

తే. తోఁచె సామ్రాజ్య వృద్ధురా – ల్దుర్దినముల
నుబ్బసపురోగి చందాన – నుండ దెంతొ
కాల మిఁక నిట భావి దు – ర్గతి గణించి
జన్మభూమికి నరుగుట – సౌఖ్య మనెను. 195

వ. అమ్మహాత్ముఁడు ప్రవ్రజ్యాసమయసమజ్యా ప్రబోధముల గ్రామీణుల మేల్కొల్పి యొక్కత్రాటిమీఁద నడిపింపందలంచి. 196

తే. పాలవండ్లూడ స్థిరదంత – పంక్తి వచ్చు
కరణిఁ బరపాలనము పోవఁ – గలుగు భార
తీయ పరిపాలనం బది – ధ్యేయ మగుట
జనులు దానికిఁ దగుకృషి – సల్పుఁ డనియె. 197

వ. మఱియు నొక్కొక్కప్పుడు బాపూజీ. 198

ఉ. సాగత భావగీత రస - సంగతి సారస సంగభృంగమై
యోగిమనస్సకాశమయి - యొప్పు మహత్తర దివ్యబుద్ధితో
రాగవిరాగముద్దెలియ - రాని యలౌకిక తన్మయత్వసం
యోగకళాప్రపూర్ణుఁడయి యుండు నొకించుకసేపతండటన్. 199

వ. ఆననొకవిద్యార్థి సామ్యవాదసిద్ధాంతమునుగూర్చి గాంధీజీ యభిప్రాయమేమన నతండిట్లను. 200

తే. ధన గుణ బల మేధాశక్తు – లనుఁ బ్రజఁగన
న్యూనతాధిక్యతలు పెక్కు – కానిపించు
యాప్యయానము నెక్కిన — యతఁడు మోయు
నతఁడు సముతౌదురా యది – యమర దెపుడు. 201

తే. ఏకగర్భజములయైన – నీ జగాన
ధ్వనిగతిని మించి ద్యుతిగతి – దనరి నట్టు
లొక్కతల్లికిఁ బుట్టిన – నొకట నున్న
నందఱకు శక్తి సమముగ – నమరఁ గలద? 202

ఉ. ఎల్లనరుల్సమానులని - యేల వచింతువు లేవె భేదముల్
తల్లియు భార్యయున్సములె - ధార్మిక లౌకిక దృష్టిఁజూడఁగం
గల్లయు సత్య మొక్కటియె - కంకుఁడు మౌనికినీడె దుష్టుఁడుం
జల్లని యుల్లముంగలుగు - సాధువునుం దులయాదురే ధరన్. 203

తే. ఉర్వి నొక్కొక్కప్రాణి కొ – క్కొక్క రీతి
శక్తులిడె దైవ మదిచెప్ప – శక్య మగునె

కనఁబడని కాళ్ళు గలయట్టి – క్రాపవేము
గమన వేగము నరునకుఁ – గలదె చెప్పుము. 204

తే. సామ్యవాదము పరిపూర్ణ – సత్య వాద
మౌనె యది కల్ల యొకవాడు – నంట నాఁటి
నట్టి విత్తనముల యొక్క – లక్ష్య మొక్క
రీతిఁ బెరుఁగునె కాయునె – ప్రీతిఁ గనఁగ. 205

వ. మానవుల నందఱ నన్నిఁట సములఁగఁ జేయ సంకించుట సముద్ర గర్భస్థ స్థలమును నిమ్నోన్నత రహితముగఁ జేయ యత్నించుట యను ప్రకృతి తత్త్వజ్ఞులగు బుధులంద్రుఁడిదియ మహాత్మునిమతము. ఇఁక మీకొక హితోక్తి. మానవసమాజ రూపరేఖల ననుకొన్నరీతి దిద్దుకొనుట కనువైన యద్వితీయసాధనము విద్య. 206

తే. ధనమునకుఁ దగ్గ సదయ వ – దాన్య మున్న
వాని సత్కీర్తి దశదిశా – వ్యాప్తమైన
విధమ వినయాన్వితంబయి – విద్యయున్న
నతఁ డఖిలలోక పూజ్యుఁడౌ – ననుచుఁ జనియె. 207

కం. విజ్ఞాన జలధిఁ ద్రచ్చుచు
సుజ్ఞాన మణివ్రజంబు – శోధించి కొనుఁజ
జిజ్ఞాసువగుటఁ బ్రాజ్ఞుల
ప్రజ్ఞకుఁ బ్రాధాన్య మిచ్చి – వర్తిలుచుండుఁజా. 208

వ. ఉపగుప్తుఁడు బౌద్ధసిద్ధాంత ప్రచారమునకు నిజజీవిత సర్వస్వము నెట్లుధారవోసెనో యట్లు రాములు సబర్మతీమహర్షికి ఛాత్రరత్నమగుట నమ్మహాత్ముని సర్వోదయసూత్ర ప్రచారము నిచ్చలొనర్చుచు నిధి సేక రింపందలంచి. 209

తే. శాంతి సౌశీల్య సామర్థ్య – సామరస్య
సకల సౌజన్య సౌభాగ్య – సాధనకయి
గాంధి సూక్తిముక్తావళి – గ్రామ సీమ
లందు బోధింపఁ దొడఁగె ని – త్యం బతండు. 210

వ. ఇట్లీకకాలమందె కార్యద్వయంబు సాధించుచుండె. తక్కిన సంచాలకులు సంచారవ్యయసహిత వేతనముం బూర్తిగఁ గొనుచుండ రాములు తనకు గౌరవవేతనముగ నిర్ణయింపఁబడిన నూటయేఁబదిరూప్యముల నుండి మాసమునకు ముప్పదియో నల్వదియో మాత్రము గైకొనుచు మిగిలినరూకలఁ దన్నిధికిం జేర్చుచుండె. గాంధీజీ ప్రియశిష్యుఁడన్న రాములకేచెల్లు. ఔరా! యెంతపొదుపు. అహో త్యాగధనుల లక్షణ మిట్టిదికాఁబోలు. ఉదారాశయుల సహజస్వరూప మిట్టిసామాన్యవిషయ ముకురంబునసైతము ప్రతిబింబించు ననుట కిదియ సాక్ష్యము. తత్కృషి నాతండు వర్షత్రయంబు కడపె. 211

# ఆంధ్ర రాష్ట్రయత్నము

తే. గాంధినిధి సేకరించుచు – ఘనుఁ డతండు
తెలుఁగు నాడెల్లఁ బలుసార్లు – తిరిగి తిరిగి
తోటుపాట్లన్ని తనయాత్మ – లోఁ దలంచి
శ్రేయ మొనగూర్చు టెట్లని – చింతపడియె. 2

వ. ఉమ్మడిరాష్ట్రమున నాంధ్రప్రదేశమున కన్యాయముజరుగుచు దని గ్రహించి ప్రత్యేకాంధ్రరాష్ట్రములేనిదే యేతత్పక్షపాత ఘాతమ నుండి విముక్తిం బొందంజాలమని. 21

కం. న్యాయాన్యాయ విచారణ
చేయక యిక్కార్య మెట్లు – సిద్ధించు నయో
పాయంబున ఘన జన తతి
సాయంబున దీని నెట్లొ – సాధింపఁ దగున్. 21

వ. తమిళులపక్షంబున రాజాజీ యేకైకమహావీరుఁడుగ నిలువంబడు గాంధీజీకి వియ్యంకుండగుట నతనికత్తికి రెండువైపులపదనుండు త్రికరణ శుద్ధిగ విభజనమున కంగీకరింపఁడేమోయను సంశయంబు బాధింప ఇక్కార్యంబు సాధింప నాప్రాణంబులు పణంబుగనైననొడ్డెదంగాని దీ విడువ. 21

మ. తమిళాంధ్రమ్ముల సంచరించి వెనవ్య - త్యాసంబు చింతించి స
క్రమమార్గంబునఁ దెన్గుదేశమును జ - క్కంజేయ నూహించి యే
శ్రేష్ఠమైనం దగవోర్చి రాష్ట్రరమ వే - సాధింపనంగాక త
త్ర్యమునం బెట్టులభించు నాంధ్రికను డు - ర్వారవ్యథాయుక్తుఁడై. 216

ఉ. ఖద్దరుఁగట్టి జాతిపిత - గాంధికి మ్రొక్కి సభాస్థలంబులన్
ముద్దుగఁ బెద్దగాఁ దఱచి - మోహను సూత్రము లాలపించి నేఁ
డద్దిర యొక్కఁడైనను స - హాత్మ్యవథాన గమింపఁడింక మా
కెద్ది శరణ్యం మీభరత - పృథ్విని స్వర్గమొనర్ప దైవమా. 217

ఉ. ఉక్తవచోనురక్తి బుధ - సూక్తి నిరంతర భవ్యభావ సం
సక్తి వివేకశక్తి జన - సౌఖ్యరతి న్నిజమాతృభూమిపై
భక్తి యపారమౌట నన - పాయమపాయమునాక వీఁకమై
రక్తము ధారవోసిగద - రాజ్యము దెచ్చిరి నాఁటి నాయకుల్. 218

ఆ.వె. మందిఁ జేతఁ బట్టి - మనుజాధినేతయై
కుందఁ జేయు చుండెఁ - గొాదమ వారి
గాంధి నీతు లన్ని - కంధిలోఁ గలసె నిం
కేమి సేయు వాఁడ - నీశ్వరేచ్ఛ. 219

కం. నోటిచ్చిన నోటిచ్చుట
చేటునకే గాక జనుల - శ్రేయంబునకా?
బూటక మెదొ నిక్కం బెదొ
గాటముగా నెఱిఁగి నడవఁ - గలుగు సుఖంబుల్. 220

తే. తీర్పు సెప్పెడి సమయాన - ధీర వరులు
మనుజు లందఱు మాకు స - మాన మంత్రు
కాని కృత్యంబులం దది - కానఁ బడదు
స్వార్థ వార్థి మునింగిన - స్వాంతు లగుట. 221

తే. హేతువాదైకదృష్టి పె - క్కేండ్లనుండి
రాష్ట్రముం గోర సాకులు - ప్రభుత వలుక
నాఁడునాఁటికి నాంధ్రుల - నమ్మ కమ్మ
లనిలముననిడ్డ మంచుగ - డ్డయ్యె నకట! 222

చ. ఎఱుఁగఁడు రాజకీయమన - నింతటిదంచు మహాత్ముఁ డాత్మలో
నెఱిఁగినఁ గట్టుదిట్టముల - నేల యొనర్పక పోయెఁ బోయెఁబో
ధరనుత నేత లిట్లు పెడ - దారులు పట్టఁగ నేల పట్టినన్
సరసులు ధీమదగ్రణులు - చక్కని త్రోవకుఁ ద్రిప్ప రేలొకో. 223

ఉ. వీరులఁ గన్నతల్లి యని - పేరుగడించిన యాంధ్రి యిగ్గతిన్
నీరస మౌటకుం దెలుఁగు - నేతల కైక్యత లేని దోషమే
కారణ మంచెఱింగి మొన - గాఁడని తక్షణ మాంధ్రకేసరిం
జేరి స్వరాష్ట్రచర్చ తగఁ-జేయ నతండది ప్రోత్సహించుచున్. 224

చ. తెలివియు సత్ప్రవర్తనము - దేనికినిం గొఱగాక పోవుటం
దలమొల లేనివాఁడు నర - దారయి మిన్నులనంటి తిర్గెడిం
గలదొక కీలకం బదియ - గానరుగా నరులెందు సత్యముం
బలికెడువాని హింసకెడ - బాటగువాని వరింప రిప్పుడల్. 225

కం. తూరుపు పడమర యెఱుఁగని
మోఱకుఁ డొక నాయకుఁడుగఁ - బొలిచెడి వేళం
ధీరులు వీరు లుదారులు
నేరని జనులట్లు దృష్టి - నిగిడింపఁ దగున్. 226

ఉ. ఏమనుకొన్న నేమిఫల - మింతకుఁ గాఁగలదేదొ యైనదీ
సీమకుఁ జీడపోవఁగల - సిద్ధ మహౌషధరాజ మెద్దియో
నామదిఁ దోఁపకున్నది య - నామకు లెందఱొ పెద్దగద్దెలం
దేమరకుండ నిల్చి రొక-యింత స్వరాష్ట్రవుఁ జింత లేకటుల్. 227

తే. సభ వచించిన వాఙ్ముఖ - సార మెల్ల
నడతఁ జూపు ఘనుండు స - న్మాన పాత్రుఁ
డట్లుగా కొండువితమైన - నతని మనము
గోముఖ వ్యాఘ్రమని యెంచు - కొనుట లగ్గు. 228

కం. ముకుద్రాడులాగ బసవఁడు
సకలములకు శీర్షమూఁప - సాగెడు గతి నేఁ
డకటా నేతల స్థితు లిటుఁ
బ్రకటితము లిఁకెట్లు జయము - వడయంగలమో. 229

చ. సుగుణి పరోపకారి పరి - శోధన సాధనశీలి శాస్త్రపా
రగుఁ డతిధీరుఁ డార్యజన - రక్షకుఁ డస్ఫుతదాత నేతయై
నిగమపునీత బుద్ధిపరుఁ - డెన్నఁడు సాంఘిక నైతి కార్థిక
ప్రగతి విధాన మారయుచుఁ - బాలన సేఁత ప్రజాహితంబగుఁ. 230

కం. గురుని గుమాస్తాగాఁ గను
నరులుండెడి దేశమెట్లు - నవశోభలతో
వఱలును మును పెను వేరుసెఁ
బురుగేర్పడఁ దరువు పెరిఁగి - పుష్పించునొకో. 231

కం. వైషయిక సౌఖ్యములకై
దోషంబులు పెక్కు నల్పు - దుష్టమతులు ని
ర్దోషులవలె భాషించినఁ
దోషణమో దూషణంబొ - తోఁపదె ప్రజకుఁ. 232

చ. కరుణఁ బ్రజానురంజకము - గా నిజజీవిత యాత్రనల్పి సు
స్థిరతర కీర్తిమై వెలుఁగు - చెన్నపనాయకుఁ డాంధ్రుఁ డాతఁ డీ
పురముఁ బ్రతిష్ఠచేసెనని - పూర్వులు పల్కుదు రద్ది సత్యమో
చరితముగాన నిద్ది మన - జన్మపు హక్కని నేఁ దలంచెదఁ. 233

వ. అనననిని రాములు హర్షించి యెవ్వరే నొకరిద్దఱు దృఢప్రయత్నము
నకుం గడంగినంగాని యీ జటిల సమస్య పరిష్కృతము గాదని 234

ఉ. వాసిగలారు పూర్వు లతి - పౌరుషవంతులు ధీమదగ్రణుల్
మానము లెవ్వరంచుఁ గడు - మాన్యుల మంచుఁ గ్రియావిహీనతఁ
మీనము ద్రిప్పిన స్సురలు - మెత్తురె వుత్తడి కాన్క లిత్తురే
గ్రాసము వాసముఁ సరిగఁ - గల్గునె నిశ్చల కీర్తి వెల్గునే. 235

ఉ. శక్యమె యాంధ్ర రాష్ట్రరమ - సత్వర మందఁగఁ దెల్గునేతలం
దైక్యతలేని దోషమున - హాని జనించె గణింపరింత మా
ణిక్యమువంటి నాడు కడు - నీరసవృత్తిఁ గృశించె గాంధిజీ
వాక్యము లాలకించియు శు - భంకర మార్గముఁ ద్రొక్క రేలొకో.

ఉ. మాటల నాలకించు తఱి - మంచితలంపుల నుండి మీఁద నా
బాటకు రాకయున్న నగు - బాటగు నంచెదనెంచ రేలొకో

పాటవ శూన్యులట్టు కను - వట్టుట కిద్ది ప్రధాన హేతువౌ
సాటి జనుల్ గణింపరను - సంగతి యోచన సేయు రింతకుఁ. 237

కం. ఈమహి మేలుం గోరుచు
సామూహిక లాభమునకె - సత్వర సేవా
ప్రాముఖ్య మిడుట కార్యము
ధీమంతులు దీని కొఱకె - దీక్షింపఁ దగుఁ. 238

తే. సాంఘి కార్థిక ప్రగతి ని - శ్చయము సుగతి
యంచు దానిని సాధింప - నడుగిడుదువు
విలువ కందని నీమాట - వెలుఁగు బాట
యఖిల బుధపాల సుగుణ ర - త్నాలవాల. 239

వ. అని సెలవుగైకొని శ్రీఘమ భీమవరమునకుం జని స్వామి సీతారాములం గని యార్యా యాంధ్రరాష్ట్రార్జనకై నిరాహారదీక్షం బూన సంకల్పించి పూజ్యపూజా వ్యతిక్రమంబు కాకుండుట శ్రేయంబనియెంచి యింతకు పూర్వము మీర యే తత్కార్య సాధనకై శతవిధముల ఘోషించి కొన్ని దినంబు లుపవసించితిరి గాన మార్గదర్శకులు వయోజ్ఞానవృద్ధులు నగుటం జేసి భవదాశీఃకుసుమంబు లందుకొన ముందుగ మీ సన్నిధి కరుదెంచినాఁడ నన నతం డమందానందభరిత హృదయారవిందుఁడై చిఱునవ్వు నవ్వుచు.

శా. తేస్వప్త్యస్తని హస్తమెత్తి కరుణం - దీవించి నిస్తుల్యధీ
భాస్వద్రక్తి వచించె నిట్లతని సం - భావించి సత్యవ్రతా
యే స్వార్థంబునులేక దేశమును నెం - తేఁ గొల్తు వెల్లప్పుడుఁ
నీ స్వాభావిక ధర్మచింత వెలుఁగుఁ - నిర్మాణ కార్యాదృతిఁ. 241

వ. నేను నిట్టు నిర్వహించుచున్నతఱి నత్యంతాసక్తి నీ సహకారంబుఁ గోర "నేనిఁక రాజకీయంబులతో నంబంధము పెట్టుకొన"నని దాక్షిణ్య రహితంబుగఁ బలికితివే. ఇప్పుడిట్టి సంకల్పము నీకెట్టు పుట్టెనన నాంధ్ర తమిళ ప్రదేశములఁ బర్యటింపఁ ద్రైలింగులకు జరుగుచున్న యపకార మవగత మగుట నే నీ దృఢనిశ్చయమునకు వచ్చితి. ప్రత్యేకాంధ్ర రాష్ట్రము లేని యాంధ్రుఁడు గాండీవములేని యర్జునుఁడు. 242

కం. కులగిరులు ప్రయ్యలైనను
జలధులు పొంగినను లోక - జాలము వ్రేగై

ప్రళయమున ద్రుంగినను నా
పలుకునకుం దిరుగులేదు - పరమ పవిత్రా! 243

తే. దైవ మనుకూల పథమునఁ - దనరెనేని
సాధ్యమగు నసాధ్యంబు ని - స్సంశయముగ
నుక్కువాల్గల దనుజుల - నుక్కడంచె
జాతివార్ధార లోకమా - హా సుసంగ. 244

వ. అన్నింటికి సర్వాంతర్యామియైన సర్వేశ్వరుండు గలఁడు. ఇది భగీ
రథ యత్న మింతట నాఁగదు వీగదన. 245

చ. అలఘు మనోపికానటని - తాద్భుతసత్య విమర్శ శక్తికిం
ఫలముగఁ గల్గె వాంఛ యిది - పావనమైన హృదబ్జపీఠిపై
నిలిపితి వాంధ్రమాతృపద - నీరజముల్ భవదీయదీక్షకుఙా
ఫలితము దక్కఁ జేయుఁడని - ప్రార్థన చేయుదు దివ్యవర్యులఙా. 246

ఆ.వె. పరులు సేయ లేని - పనులు నీ వొనరింపఁ
గల సమర్థత తగఁ - గలదు గాన
నిన్ను విశ్వసింతు - నీ వర్తనము నెంతు
రమ్య సుగుణ ధామ - రామ నామ. 247

కం. అంతము పంతంబున సు
స్వాంతంబున నిల్పి చూడ - వలచి తలఁచితే
గంతవ్యమార్గ మిక్కృతి
కెంతయుఁ దగుదీవ యంచు - నే మది నెంతుఙా. 248

తే. నివురు గప్పిన నిప్పునా - నెగడు కతన
నంద తెలుఁగరు రామ నీ - యాత్మ బలము
గాంధి సంస్తుతి బొందిన - ఘనుఁడ వీవు
నీదు దీక్షకు విశ్వంబు - నివ్వెఱపడు. 249

చ. అనితరసాధ్యమైన పని - యొఁట జగంబిది బూటకంబుగా
మనమున నెంచవచ్చు జన - మాన్యులు వ్యాఖ్యయొనర్చి నీ కృతిం
ఘనముగ నెత్తిచూపఁ గల - కాలము వచ్చు మహాంధ్రరాష్ట్రల
క్ష్మిని మణిపీఠిపై నిలిపి - కీర్తి గడించుము రామయోగ్యగణీ! 250

తే. రాజ్యమును దెచ్చె గురుఁడని – రాముఁ డిపుడు
రాష్ట్రమును దెచ్చె నెంత వై - రాగ్య మౌర
గురువునకుఁ దగ్గ శిష్యుఁడు - కుదిరె ననుచు
ఖండ ఖండాంతర ఖ్యాతి – కలుగు నీకు 251

వ. ప్రభుత్వోద్యోగ కార్యాలయ రాజమార్గనిర్మాణ వ్యావసాయికార్థిక రాజకీయవిద్యారంగాదుల సఖవదేశమున కధికసహకారములభించుచుం ఓంజేసి యది నాఁడునాఁటికి నపవసంతశోభలతో నలరారుసుందర నందన వనమువలెఁ గనులకు విందుసేయుచుండ నాంధ్రప్రదేశము పోషణశూన్య ఫలవృక్షంబుచందంబున శిశిరర్తువునందలి యుద్యానముంబలె నత్యంత కళాహీనముగఁ గన్పట్టుచున్నది. ఇది యింకెందన్క సహింపఁగలము. రాజకీయపరిజ్ఞానములేని సామాన్యప్రజల కీవ్యత్యాస మవగతముకాదు గదా. ఇది యగ్రనాయకులపై నాధారపడిన విషయము. వారిలోఁ గొందఱయాత్మలు స్వార్థమ్మె దెనకు ములుసూపుటంజేసి యాంధ్రప్రజోద్ధరణమున కత్యవసరమైన యమిత ప్రధానమైన యిప్పనిసాధింప నెట్టనఁ బట్టుపట్టి గట్టిగఁ బ్రయత్నింపరైరి. ఆంధ్రభారతము కవిత్రయముపూర్తి సేయ భాగవతము పోతనకొఱకునిల్చియున్న ట్లీకార్యము నీకొఱకిట్టాఁగియున్నదేమో. తద్గౌరవము నీకుందక్కంజేయుట భగవన్నిర్ణయమై యుండవచ్చు. అదిలభించిననాఁడు తెలుఁగునాడు పండినచేనువలె దండి నిండుఁదనముతో మెండుగఁగన్నులపండువుగనుండు. ఎందన్కవసుంధర నాంధ్రభాషయుండునో యందన్క దశదిశలఁ ద్వద్యశోంగన లలితనృత్య మొనర్చునని స్వామిసీతారాములు క్రన్ననమన్నన రాములవెన్నుచఱచి నజ్యకార్ముకుండై ముక్తశరుండైన దశరథరామునకు భార్గవరాముఁడు సహజనిజతేజంబొసంగినభంగి స్వీయాత్మబలంబును మనోభావంబున శ్రీరాములకిచ్చి మెచ్చి శుభస్యశీఘ్రమ్మని ముదమ్మునదీవించిపంప నతండు మహోత్సాహపూరితమనస్కుండై వైశమ మద్రపురింజేరి కర్తవ్యసమాలోచనామగ్నమానసుండై బులుసుసాంబమూర్తిం దర్శించి నిజసంకల్పంబు నివేదించి యాంధ్రరాష్ట్రోద్యమచరిత్ర యాదినుండి సంగ్రహముగ శ్రవఃపేయముగ మీనోటవినంగోరుదునన నాతం డాంధ్రాభ్యుదయార్థియై రాములు పడుచున్న హృదయవేదన కాత్మనంతసించి తత్కథాకథనకుతూహలుండై యిట్లను. భారతరాజ్యాంగ పరిపాలనాసౌలభ్యసౌహార్దసౌష్ఠవ

సాహిత్యసౌఖ్యములకు భాషాప్రయుక్త రాష్ట్రవిభజనమే మూలసూత్రమని మహాత్ముఁడుపదేశించిన మంత్ర మమోఘమైనది. కాన నాంధ్రులు నివసించుమండలముల నన్నింటిఁజేర్చి ప్రత్యేకరాష్ట్రముగఁ బ్రకటించుట తత్పురోభివృద్ధి కత్యవసరమని దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు చట్టినరసింహరావు జొన్నవిత్తులగురునాథ ప్రభృతు లాంధ్రాంగ్లభాషలలోఁ బ్రముఖపత్రికలలోఁ నేనాఁడో బ్రచురించిరి. అనంతరము నానావిధనూతన మారణాయుధోపేత ప్రథమప్రపంచ మహాసంగ్రామఘోరప్రళయాగ్నిజ్వాలలఖండభూమండలంబెల్ల నెట్టనగట్టిగఁ జుట్టుముట్టి సంసిద్ధముగనున్న సమయమున బాపట్లలో నాంధ్రమహాసభజరుప నిర్ణయించి గుంటూరిలో దేశభక్త కొండ వేంకటప్పయ్య యధ్యక్షుఁడుగ నొకయాహ్వానసంఘ మేర్పడె. 252

కం. కృతి వేదమ్మున కోంకృతి
కుతుకమ్మునఁ జుట్టినట్టు – గుణనిధు లాంధ్రుల్
ధృతిఁ దొలిసభ నారాయణ
నతులిడుచుం జరిపె భావ – నాపురి నడుమన్. 253

కం వాసిగల పెద్ద లెందఱొ
యాసభ రాష్ట్రోదయార్థు – లై విజ్ఞాన
శ్రీ సహితోపన్యాసము
లాసక్తిగ నిత్తురంచు – నాంధ్ర జనంబుల్. 254

కం. బాలురు వృద్ధులు మహిళలు
చాలఁగ సంతోషపడుచుఁ – జనుదెంచి కళా
శ్రీలు విరజిమ్ముచున్నటు
లాలలిత సదస్సునందు – నాసీనులుగా. 255

వ. బయ్యానరసింహేశ్వరశర్మ తత్సభ కగ్రాసనాధిపత్యము వహించె. తత్సదస్సునఁ బ్రత్యేకాంధ్రరాష్ట్రము వలయునను దీర్మానము యువలచేఁ బ్రతిపాదింపఁబడి తీవ్రవాదోపవాదానంతర మదియుపసంహరింపఁబడె. అనంతరము న్యాయపతి సుబ్బారావధ్యక్షుఁడుగ విజయవాడలోజరిగిన ద్వితీయాంధ్రమహాసభలోను నిడదవోలు మహాసభలోనయ్యు దేకగ్రీవముగ నామోదింపఁబడె. నాఁటినుండి తత్కార్యదర్శియగు వేంకటప్పయ్య

యున్నవలక్ష్మీనారాయణ ప్రభృతులు సహచరులుగనుండఁ ద్రిలింగదేశమునఁ దత్ప్రచారమొనర్చె. పిదప గాడిచర్లహరిసర్వోత్తమరా వధ్యక్షుఁడుగ గుళ్ళపల్లివున్నయ్యశాస్త్రి కార్యదర్శిగ నెన్నుకొనంబడ నాంధ్ర మహాసభలు జయప్రదముగ జరుగుచుండెనన. 256

ఉ. కారణమేమి యక్కరణిఁ – గాంక్షజనించుట? కాంధ్రులున్న త
ద్ధారణికెల్లలేవి జనతా – స్థితి యెట్టిది? సంఖ్యయెంత? యే
తీరున హేతువాదమున – ధీరులు తెల్పి రమోఘసత్య మిం
పారవచింపుమిద్ధ మన – సార వినందగు ధీమదగ్రణీ. 257

వ. అని రాములడుగ నాతండిట్లను ఆంగ్లేయులు స్వీయపాలనానుకూలముగ విభాజితమొనర్చుటంబట్టి యాంధ్రదేశవైశాల్యము ప్రజాసామాన్యమున కగోచరముగనుంట నిక్కము. ఇటు శ్రీకాకుళ మటుచెన్నపట్టణ మీదెసబెంగుళూ రటుబళ్ళారి యావైపు హైదరాబాదునకుత్తరమున నాగపురప్రాంతమువఱకాంధ్రావని వ్యాపించియున్నదంట నగ్నసత్యము. ఈ త్రిలింగదేశమునకుత్తరదిశ నుత్కలమహారాష్ట్రదేశములు ప్రాక్కకుప్పున బంగాళాఖాతము యామ్యహరిత్తున ద్రావిడ కర్ణాటదేశములు పశ్చిమమునఁ గర్ణాటమహారాష్ట్రము లొప్పు. దీని విస్తీర్ణము లక్షయిరువదివేల చదరపుమైళ్ళు. జనసంఖ్య మూఁడుకోట్లు. ఆంధ్ర పల్లవ చాళుక్య చోడ బాణ వైదుంబ హైహయ బేటవిజయాదిత్య కళింగ విష్ణుకుండిన కాకతీయ కోట మనుమసిద్ధ రెడ్డి యాదవ వెలమ సాళువ తుళువాద్యన్వయజులు బిడౌజుఁడు దివిజలోకంబునేలినట్లు దీనింబాలించి విశ్వవిఖ్యాతి నార్జించిరన నింతటి ఘనచరిత్రగల యాంధ్రప్రదేశమును బ్రత్యేకరాష్ట్రముగ నొనర్చినఁ దదభ్యుదయమున కనేకమార్గములుగలవని నాఁటి యాంధ్రమహాసభానాయకాదులు ప్రవ్రజ్యాలం బ్రజలకుబోధించిన విధంబు వినఁగోరుదునని రాము లతికుతూహలంబున నర్థింప నతండిట్లు వల్కు. "ఆంధ్రమాతృగర్భశుక్తి ముక్తాఫలములారా! మేల్కొనుఁడు. ఆంధ్రమాత దీనదశంగనుఁడు. ప్రతివాసుల మహోన్నతస్థితిం దిలకింపుఁడు. కారణము యోచింపుఁడు. ప్రత్యేకరాష్ట్రమురానిదే యాంధ్ర మహాభ్యుదయము గలుగదని గమనింపుఁడు – 258

చ. అరయ 'శుభస్య శీఘ్రము' మని – రాత్మవిదు ల్బుధులింక దీక్ష స
త్వరమ వహించి రాష్ట్రరమ – వారక పొందెడిదాఁక నిద్దురం

దోఁచఁగ తదీయ దివ్యజప - ధూమములం బరవాద భూతములా
నరగునఁ ద్రోలి దిగ్విజయ-శంఖము నూఁదఁగలెండు సోదరుల్ 259

ఉ. నిర్మల నిష్ఠనిల్చి యువి - నీతి నదల్చి సునీతిఁ దాల్చి స
త్కర్మములైన సమస్తవసు - ధాస్థలి కీర్తిగడించి నేఁటికీ
శర్మవిఘాత జీవన వి - చారముసంబడి మ్రగ్గ లగ్గొకో
ధార్మిక దృష్టిఁజూడ నను - ధారణవృత్తి మెలంగు టొప్పునే. 260

చ. అనుపమ శౌర్యసాహస బ - లాన్వితు లేత్రిజగంబులేకమై
యనికరుదెంచిన న్నిలిచి - యార్చి జయధ్వజ మెత్తు నేర్పరుల్
ఘనగుణ భోగాభాగ్య బహు - దానకళా కమనీయ మూర్తులే
ఘనులు తెలుంగు లిట్టి కడ - గండ్లకు లోనయియుంట భావ్యమే. 261

చ. అతుల సుధీవరేణ్యా తతి - కాలయ మయ్యును జన్మభూమి దు
స్థితి కిరవౌటకుం గతము - చింత యొనర్పుఁడు మర్త్యలోకవుం
గతి గమనించుచుజా వలయు - కార్యము నల్పుఁగ లెండురండు మీ
రితరులకంటె దీనులుగ - హీనులుగా బ్రదుకంగఁ జెల్లునే. 262

శా. "అలస్యాదమృతంవిష"మ్మనెడివా - క్యంబెంచి రాష్ట్రోదయ
శ్రీలక్ష్మ్యవ్రత మూని విఘ్నహిమరా - శిం భానుతేజస్వులై
తూలంజేసి తెలుంగుతల్లితల ని - స్తుల్యప్రభాయుక్తమై
మేలుంగూర్చు కిరీటముంచి ధృతిమై - మిన్నందుఁడీ సోదరుల్. 263

ఉ. ఉల్లము దర్పణంబు వలె - నొప్పఁగఁ దెల్లని వెల్లఁ బాలుగా
నల్లని వెల్ల నీరముగ - నమ్మ నమాయికు మోసపుచ్చుటల్
చెల్లునె శౌర్యచిహ్నముగఁ - జెప్పదె యెవ్వని యాత్మవానికిం
గల్ల నిజంబు సత్యము జ - గాన జయధ్వజ మెత్తకుండునే. 264

వ. స్వాతంత్ర్యబాలభానూదయమ్మునఁ గమనీయకనత్కనక కాంతులతోఁ గళకళలాడనారంభించిన నాత్మపారతంత్ర్యఘనౌఘము నమగ్రముగ నదృశ్యముకాలేదని తేజితధీశక్తి స్విజ్ఞాననేత్రంబువిప్పి విలోకించిన మీయుల్లంబున కల్లందెల్లమగు. ఇవి దుర్దినములు. నమయానుకూలోన్న తోద్యోగమహామారుతాహతిఁ దన్నీలకంధరములఁ బాఱఁద్రోలి స్వీయ గౌరవప్రదవాంఛారాంచోళిం బ్రసరింపఁజేయుఁడు. అర్థులు నమర్థులని

నిర్ధారణమైన సుచితజ్ఞులగు వృద్ధనాయకాగ్రణులు వ్యర్థముగఁ బోనీరు గానఁ గృతార్థులగుదురు. తమకుఁదాము సహకరించుకొనువారికే దైవము గూడ సాయపడు. 265

ఉ. మాసిన వల్వఁదాల్చి యతి - మాత్రవిచార నిమగ్నచిత్తయై
గాసిలి హస్తకంజమునఁ - గ్రమ్మ ముఖాబ్జము వాల్చి దుర్గుచిన్
రోసము ఖాసిలన్నిజపు - రోగతి గానక తల్లడిల్లుచున్
వాసియు వన్నెయుం దొఱఁగి - వందురు మాతృఋణంబుఁ దీర్పఁడా.

వ. ఆంధ్రవీరరత్నమా! యనన్యాదృశధైర్యస్థైర్యశౌర్యగాంభీర్యసాహసౌదార్యాదుల కాటపట్టైన నీపితరులచరిత్ర నేత్రోత్సవముగ నవలోకింపుము. శ్రవఃపేయముగ నాలకింపుము. నీశరీరము పులకరించు. రక్తము పొంగు. తేజము ద్విగుణీకృతంబగు. 267

మ. కొను నీరాష్ట్రమధైర్యమందకు శిలా - కుడ్యాళు లడ్డంబులై
నిను గాలూనఁగనీక నిల్చిన భవ - న్నిర్మాణ కార్యక్రమం
బును సాగింపు నిరోధముల్దొలఁగురే - పోమాపొ కాలాహతిన్
ఘనభూభృద్ధ్వజమైన ఘోరతర ఖూ - కంపబునం గ్రుంగదే. 268

తే. సహజముగ శోభగలదయ్యు - సాంద్రమైన
మంచుచేఁ గాంతి బాయువ - ద్మంబు వోలెఁ
దగ్గెరా వెల్గు మనతెల్గు - తల్లి మోము
మహిత దీక్షా రవి ద్యుతి - మంచుఁ బాపు. 269

తే. ఉన్న సత్యంబు దెలియ రా - ష్ట్రోదయంబె
యైహి కాముత్రిక సుఖాల - కాట పట్టు
తల్లి హాయిగ మనుచున్న - తరుణ మందె
పిల్లల యదృష్ట మెంతయు - వెల్లి విరియు. 270

ఉ. మానవసేవ మాన్యమగు - మాధవసేవ యటన్న సూక్తి నీ
మానస వీథినిల్పి యన - మాన మహాభ్యుదయైక దీక్షమై
గానము సేయుమా తెనుఁగు - గాథల నయ్యది దివ్యబోధమై
వేణువు కృష్ణుఁ డూఁదినటు - వేగమ నీవశమౌను లోకముల్.271

కం. కణ్వుని కాలము కాదిది
యణ్వస్త్ర పరీక్షసేయు – సదనిది మనసఘా
మన్వన్వయ జాతుఁడవే
విన్పది సురీ ప్రశంస – వెలుఁగ వెలయుమా. 272

తే. కష్ట నష్టాల సమ్మతి – రాఁపురంబు
తగదు రాసిన మెక్కి సొం – తముగ బలిసి
చందమయ్యె నదెవ్వరు — సైపఁగలరు
కాన రాష్ట్రముఁ గొన దీక్షఁ — బూన వలయు. 273

వ. బోయరు రాష్ట్రములకుఁ బ్రజాస్వామ్య మెన్నడో యాంగ్లేయులిచ్చి యుంట జగద్విదితము. మన కన్నులయెదుట విహారరాజ్యము ప్రత్యేకింపఁ బడె. అదియునుంగాక నిన్నమొన్న. 274

సీ. ఉత్కల సింధుదేశముల - కొప్పుగ రాష్ట్రములిచ్చి యాంధ్రికిఁ
హృత్కమలోదయార్కనిభ - హృద్యము రాష్ట్ర మొసంగ రిమ్మహా
చిత్కళఁగాంచి తద్గతవి - శేషరహస్యమెఱింగి వేగఁ ద
త్సత్కృతు వాత్మముక్తిఫల–సాధక మౌనని నమ్మి నిల్వుమా. 275

వ. ఏతత్పరివర్తనములు ప్రవర్తిల్లుచున్నతఱి మనము మైమఱచియుండి యనంతరము ఘోషించిన నయ్యదరణ్యరోదనంబగు. పరులు పరిహసించిన నిరుత్సాహపఱచిన స్థిరసంకల్పముతో ధైర్యసాహసములతో "హోంరూలు"ను సాధించిన యైరిష్ప్రజల నాదర్శంబుగఁగొని యీ పవిత్ర కార్యక్రమమునఁ బాల్గొనుము. మనప్రగతి భావిసంతతికి సుగతి. 276

తే. ద్రావిడులు పెక్కు రిచ్చోటఁ — దర తరాల
గొప్ప యుద్యోగులుగఁ జిక్కఁ — గుదురు కొనఁగ
నఱవ రాజ్యంబునం దొక్క — యాంధ్రుఁ డైనఁ
గలఁడె కారణమును జెప్పఁ — గలవె యాంధ్ర. 277

వ. ఈత్రైలింగులలో విజ్ఞానన్యాయవాస్తువైద్య ఖనిజ ఖగోళ భూగోళ సాహిత్యాది శాస్త్రపారంగతులు పరాణభాషాపండితప్రకాండు లెందఱు లేరు. ఉన్నతోద్యోగ్యాళ్యాహ్వాయపత్త్రికలలో నొక్కయాంధ్రుని నామమైనఁ గనఁబడునా? కడకు మండలన్యాయాధికారపదవియుఁదెలుఁగు

వారికిదక్కునా? కావున మనమిఁక నుపేక్షింపక మనకష్టనష్టము లామూలాగ్రముగఁ బ్రభుత్వమునకు నివేదించి మనోరథము సిద్ధించుదనక నిర్విరామకృషిసల్పుట మనకు మన సంతానమునకు శ్రేయస్కరము.

తే. పాలనంబున మీకుఁ దో – డ్పడుట కడుగ
నయ్యె నిట్లనఁ గాదన – రధిపులెవుడు
కొడుకుఁ బ్రసవింతునని తన – కోడ లనఁగ
వలదనెడి యత్తయుండునే – వసుధ మీఁద. 279

తే. తొలుత నాంధ్రుల కౌన్నత్య – మలరి యున్నఁ
దమిళు లున్నత దశతోడఁ – దనరి రిపుడు
చెప్పనేటికి ముందున్న – చెవుల కంటె
వెనుకవచ్చిన కొమ్ములు – వృద్ధి పొందె. 280

తే. ఎన్ని యనుకూలగతుల వా – రెనఁగు చుండ
నేమిలేనట్టి నరుఁడెట్లు – వృద్ధి నొందు
కఠిన దీక్షాపరుండయి – కాలుఁ గాక
పరిగయేరి యేఁడు మణి యు – ప్పరిగఁ గట్టు. 281

తే. మంచిగాఁ బంచుకొని మైత్రి – మనఁ దలఁచినఁ
గార్యకర్తలు గావారు – కలసి రారు
గూడుగట్టిన స్వార్థానఁ – గుములు చున్న
వారలకు నైక్య మార్గంబు – వలను పడున. 282

సీ. పట్టణమందుఁ బల్కుబడి - బాగుగ వృద్ధియొనర్ప వారికిఁ
ముట్టినదెల్ల ముత్యమయి - మోదముఁ గూర్చు తెలుంగుబిడ్డకుఁ
బట్టినదెల్ల మట్టియయి - బాధలఁ బెంచు స్వరాష్ట్రమున్నచోఁ
బట్టినదెల్ల బైఁడియయి - ప్రాభవ భోగములందు నాంధ్రుడుఁ. 283

తే. అన్నియును విప్పి చెప్పుట – కలవి యగునె
యెంచ లోగుట్టు పెరుమాళ్ళ – కెఱుక గాదె
మనము ప్రత్యేక రాష్ట్రముఁ – గొనక యున్న
నుప్పు ఘత్తిరి పట్టి దీ – యుర్వి నిజము. 284

వ. అవిభక్తరాష్ట్రమునఁ దెలుఁగుపొలము రాహువక్త్రగహ్వరస్థరవిబింబమువలెఁ నిస్తేజమైయున్నది. కష్టసుఖములు విషవత్తునందివారాత్ర

ములు. భవనమును జయింపలేనివాఁడు భువనమును జయింపునా? విద్యుల్లతలవలె సన్యరాజన్యుల కన్నులకు మిఱుమిట్లుగొల్పిన పురాంధ్ర తేజఃపుంజము నొక్కసారి సంస్మరింపుము. తత్పూర్వాంధ్రులు కాలగర్భమునఁ గొన్నిలీనమైన మఱికొన్ని మసకబారినవి విగ్రహరత్నముల నూతన యశశ్చంద్రికల విరజిమ్ముచున్నవని తెలియుము. 2౮౫

సీ. రాజరాజై యాంధ్ర - రాజ్యంబు స్థాపించె
విష్ణ్వంశభవుఁ డాంధ్ర - విష్ణు నృపుఁడు
మంత్రి సుశర్మను - మ్రందించి మగధను
జేకొని పాలించె - శ్రీముఖుండు
శకమొండు తనపేర - శాశ్వతంబుగ నిల్పి
వసుధనేలెను శాలి - వాహనుండు
విద్వత్కవీంద్రుల - విక్రమాదిత్యుని
వోలెఁ బోషించెను - హాలవిభుఁడు

తే. శౌర్యసాహసియై సహ - సాను గెల్చె
గౌతమీపుత్రుఁడైనట్టి - శాతకర్ణి
రణకళానిధి కాన క్ష - త్రపుల నోర్చి
మాళవంబేలెఁ బులమావి - మహిమ వెలుఁగ 2౮6

సీ. కాకతీయాంధ్ర వి - క్రమమెసంగిన కోట
బురుజులింకను గూలి - పోవలేదు
చోళరాజన్య య - శోదీప్తులొలుకు దే
వాలయాఖండంబు - లాఱలేదు
పల్లవాన్వయ పరి - పాలన భండార
భాగ్యమెల్లెడఁ గచ్చు - పాయలేదు
బొబ్బిలి వీరవి - స్ఫూర్జిత గాథార్థ
తాత్పర్యమున మోజు - తగ్గలేదు

తే. తెలుఁగు జాతీయ విజ్ఞాన - మలవరించు
రాయల కళావిభూతి క - న్మాయలేదు
బ్రదికి చెడిన మహాంధ్రవై - భవ భవమ్ము
తలఁచుకొనవోయి మేనెల్లఁ - బులకరించు. 2౮

మ. తొలి నీయాంధ్రమహా స్వోకానోకపుడా - తూర్పిండియాదీవులం
వెలిఁగెం దన్మహనీయ శిల్పకళలం - దే నాఁటికి న్నేఁటికిం
నిలిచెంగాని తదీయపహ్నానముల క - న్నిరోడ్ఫుచుం దెల్గువా
రల ప్రత్యేకత, జాట నేమిషల మా - ర్యా యాత్మలేకున్నచో. 288

తే. అక్కటా! యాంధ్రదేశము - దాంధ్రు లిపుడు
పొట్ట చేఁబట్టుకొని వల - పోవుసంద్రు
తాము మును పూవు లమ్మిన - తావు లందు
నిమ్ముచెడి కిమ్మనక కట్టె - లమ్మవలసె. 289

సీ. రెడ్డిరాణ్మణి రణ - క్రీడా సముత్పన్న
విజయభానుని దీప్తి - వెలిఁగి వెలిఁగి
బ్రహ్మన్న వైష్ణవ - పరతత్వ సిద్ధాంత
భావమేఘమ్ములు - ప్రబలి ప్రబలి
బాలుని ఖడ్గధా - రాలవోన్మేషముల్
మెఱపు లొక్కుమ్మడి - మెఱసి మెఱసి
ఒంగవోల్ చినరాజు - సంగరాంగణమున
శరవర్ష మాపోవఁ - గురిసి కురిసి

తే. సిద్ధనాగార్జునాచార్యు - సృష్టి కతన
నమర విజ్ఞాన చంద్రోద - యమ్ము గలిగి
తన యశోదీప్తి నజ్ఞాన - తమ మణంచి
మంతుకెక్కెను గుంటూరు - మండలమ్ము. 290

తే. వాసిగల యా నవద్వీప - వాసియైన
యంబికాదత్తుచే బిరు - దంది నట్టి
కావ్యకంఠగణపతి ని - క్కముగఁ దెనుఁగుఁ
దల్లి కొరసుఁడనుమాటఁ - దలఁపు మయ్యా. 291

ఉ. కన్నడభాషఁ దొట్టతొలి - కావ్యము వ్రాసిన నాగవర్మ వి
ద్వన్నుతుఁడైన యాంధ్రుఁడె గ - దా కలిభీముఁడు రామమూర్తి పే
రన్ని దెసల్వెలింగె నతఁ - డాంధ్రుఁడు సంస్కృతసత్కవిత్వసం
పన్నుడు లోకవందితుఁడు - పండితరాయలు నాంధ్రుఁడేగదా. 292

కం. రాగద్వేషవిహీనుఁడు
యోగీంద్రసమాన మాన — యోజ్జ్వలుఁడగు గాం
త్యాగము గీతామృతమును
ప్రాగని వాఁడెవ్వఁ డాంధ్ర — ప్రజ వలచుంగన్. 293

తే. కోటి ధాతుల సంభవను — జ్యోతి యాఁక
యుత్తరంబున వింధ్యాద్రి — నుత్తరించి
మాగధులు కీర్తిలక్ష్మికి — మాగధులయి
కొలువఁ బాలించి రాంధ్రులు — కలిమి బలిమి. 294

శా. వీరస్వర్గమునుండి మీదు పితరుల్ — వీక్షించుచున్ బ్రేమతో
భీరుత్వమ్మునుగాంచి సిగ్గుపడిరో — వేసారి చింతించిరో
కారుణ్యంబును జూపుచుండిరో జగ — త్కల్యాణసంధాయులై
లేరా సోదర! నీమహోజ్జ్వలకళా — విలాస ప్రదర్శింపగన్. 295

వ. ధర్మబద్ధస్వేచ్ఛావాయువులంబీల్చ లోకమెల్ల నారాటపడుచున్న దిన ములలో మీరు కుంభకర్ణునివలె గాఢనిద్రలో మునింగితిరా? ధ్రువప్రాంత వాసివలె సంధకారమున కలవాటుపడితిరా? ఇంద్రజాలికుల కనుకట్టుల కగ్గమైతిరా? సమ్మోహనాస్త్రాహతిఁ జైతన్యరహితులైన విగ్రహవీరుల వలె సొమ్మసిల్లియుంటిరా? అదిగో మీయదృష్టదేవత నానాఁటికి దవ్వగు చున్నది. కనులువిప్పి కదనుద్రొక్కి కదలిరండని తమవారు ప్బోధించిరి. 296

ఉ. తల్లివిముక్తికై పరమ — ధార్మికు లిమ్మెయి సూక్తిరత్నముల్
కొల్లగఁ జల్ల సత్కవులు — కోమల పద్యసుమాళిఁ దన్వఁ గా
నుల్లము పల్లవించునటు — లొప్పిన యుద్యమ దివ్యతేజముల్
వల్లెకుఁ బట్టణంబునకుఁ — బ్రాకెనవోజ్జ్వల కృత్యహృద్యమై. 297

ఉ. భారత దేశముక్తికి న — పారపరాక్రమవహ్నికీలలన్
వారక పర్వఁజేసి బహు — భంగుల వల్లభుచేత గాంధిచే
వీరవరేణ్యులాంధ్రులని — వేయివిధాలఁ బ్రశంసలంది నేఁ
డూరక చూతురే తెలుఁగు—లుద్యమముద్ధృతమయ్యె నయ్యెడన్. 298

వ. ఆంధ్రకేసరిసంజీవరెడ్డిపట్టాభిరంగా ప్రభృతులు రాష్ట్రసాధన ప్రయత్న మగ్నమానసులైరి. ఉద్యమతీవ్రదశ పెద్దలకాందోళనము గలిగింప భారత ప్రధాని నెహ్రూ, కాంగ్రెసధ్యక్షుఁడు పట్టాభి సీతారామయ్య, స్థానికశాఖా సచివుఁడు సర్దార్ వల్లభభాయిపటేలు సభ్యులుగ నొకయుపసంఘమేర్పడె.

తత్కృతంబు జె.వి.పి. నివేదికాఖ్యంబరగె. భారతభాషారాష్ట్రనిర్మాణకార్య క్రమమున కదియ ప్రాతిపదిక. కాని యయ్యది త్రైలింగులలో నిరాశా నిస్పృహల రేకెత్తించె. వదాన్యశిఖామణియైన యాంధ్రపృథ్వీపతిచే దాన మీఁబడి యాంధ్రపారిశ్రామికులచే ననన్యసామన్యముగ నత్యంతదర్శ నీయముగ నిర్మింపంబడి యాంధ్రశ్రేలతో సర్వవిధసమృద్ధినొందింపంబడి యాంధ్రప్రజలతోనిండియున్న చెన్నపగర మాంధ్రులకుఁజెందదనుధ్వని దానియందుంట నాంధ్రులహృదయవీధులలో ఘనఝుంఝునుసృజింప నందందు విద్యార్థులు కొంద ఱుద్యమదీక్షాబద్ధకంకణులై విజృంభించి ప్రజల ప్రధానసమస్యగా దాని నత్యుచ్ఛస్థితిన్విరాజిలంజేసిరి. అంత నాంధ్రరాష్ట్ర పరిశిష్టచెన్నరాష్ట్రముల యాస్తిహక్కుల భాగింప రాష్ట్రముఖ్యమంత్రి కుమారస్వామిరాజా భక్తవత్సలము ప్రకాశము గోపాలరెడ్డి కళావేంకట రావు ప్రభృతులతో విభజనసంఘమొండేర్పడి దీర్ఘచర్చానంతరము కోటి రూప్యముల పరిహారముతో నాంధ్రులుమద్రపురిఁగలహక్కులుసమస్తము పరిత్యజించుకొనవలయునన నత్తఱిం దత్పురికరుదెంచిన భారతప్రధాని కాంధ్రాగౌకసము తనయసంతృప్తిని దెల్లమొనర్ప నప్పటికప్రప్పయత్న మాఁగె. 299

తే. నాఁటినుండియు మనమెంత - పాటు పడినఁ
బెడచెవిని బెట్టుచుండిరి - పెద్ద లకట
నల్వ దేఁడులు కడచిన - నాటి కింక
ముక్తి చేకూర దింకెట్లు - పోరయఁ గలమొ. 300

మ. నవి పల్క న్నవిమర్శదృష్టిఁగని రా - ష్ట్రంబింక సాధింపకీ
భువి జీవించిన నేమిసార్థకము నం - పూర్ణాత్మవిశ్వాస సం
భవ దీక్షావిధమూని నిల్తు నిఁడు భ - వ్యంబైన యాశీస్సులౘ
శివమౌ సర్వమటంచు రాములన మె - చ్చె న్సాంబమూర్త్యాత్మలో.

తే. బాల్యముందొట్టియాస్తిక్య - పటిమయుంట
జ్ఞానవృద్ధులయెడ భక్తి - గలిగియుంట
మద్రపురిఁగలనాయక - మణులనెల్లఁ
గాంచియాశీస్సులందెఁ ద - త్కార్యమునకు. 302

ఇయ్యది శ్రీమదాంధ్ర మహోద్యమయ ద్వితీయ భాగమున
అష్టమ ప్రకరణము సమాప్తము.

నవమ ప్రకరణము

# దీక్షారంభము

వ. అంతఃప్రవేశజ్ఞానిర్మిత శుభాహ్వాన జగదంధకారమును జయించిన యుషశ్శ్రీసమాగమసమయంబునం బ్రకృతికాంతవిజయభేరి మ్రోగించుచున్న పోలెస గృహాగ్రముల శాఖిశాఖల నిక్కినిక్కి కుక్కుటములు కొక్కొరో కోయనికూసె. కాంతికన్య యుదయాద్రివేదిక నెక్కి మందహాససుందర వదనారవిందయై నృత్యము సేయుచుండ నాకెకాలిగజ్జెలు ఘల్లుఘల్లుమను చున్నవోయన బిట్టలు పీచుపీచుమనె దిగంగనలమొగంబున జిగిహెచ్చె. బాల భాస్కరసువర్ణకరప్రకరప్రసరణంబున నంధతమసము దివాంధముంబలె గిరిగహ్వరగర్భములం జొచ్చె బ్రహ్మాండంబు పైఁడిపూతం బ్రకాశింప జీవి వితతి జాగృతిజన్యనవచైతన్యకళం గ్రాలం బద్మాకరంబు పద్మాకరగృహం బుం బోలెం గనువిందుగఁ గళకళలాడ రేయెల్లం బ్రేయసీకరకమలంబులం బంధింపంబడి యప్పుడ వెలువడిన ప్రియునివలెం జలజంబునం జిక్కిన తుమ్మెద వెలికురికి ఝుమ్మనికమ్మని నినదమొనర్చుచుండ మలయజపరిమళ మిళితవాతపోతములు మందమందముగ మర్త్యమనఃప్రమోదమ్ముగ వీచు చుండ రాములు సముద్రస్నానపవిత్రీకృతగాత్రుండై శ్వేతనేత్రపరిశోభి తుండై కఠోరామరణనిరాహారదీక్షాబద్ధకంకణుండై సాంబమూర్తిసదనం బునఁ బ్రశాంతవాతావరణంబున గభీరభావచిహ్నామౌనముద్రాలంకృత సుహృద్వ్రతంసపరివృతుండై లతాంతాన్విత త్రివర్ణజయంతి నత్యంతభక్తి స్థాపించి జోహారొనరించి జాతీయగీతమాలపించి ప్రాగ్దిశోన్ముఖుండై నానా వర్ణరమణీయ రంగవల్లీవిరాజిత ప్రదేశస్థితనూత్నకుశకటోపరితలంబున పద్మాసనాసీనుండై యూఁదువత్తులామోదంబాపాదింపఁ బార్శ్వద్వయం బున బాలబాలికలు కుసుమవర్షముకురిపింప జేజేలకుజేజేలర్పించి భార తాంధ్రజనయిత్రులకు జయజయధ్వానంబులుగావించి బహుపురాణప్రసిద్ధ పవిత్రత్రిలింగధ్యానతత్పరుండై ముకుళితకరకమలుండై యర్ధనిమీలిత నేత్రుండై నిర్మలహృత్పుండరీకంబునఁ బరమేశ్వరుం బ్రతిష్ఠించుకొని. 1

(త్రిలింగస్తోత్రము)

శా. శ్రీకల్యాణగుణాకరా శుభకరా - శ్రీగౌరిచిత్తేశ్వరా
లోకానీకశివంకరా బుధదయా - లోలాత్మతేజస్విరా

రాకాబ్జద్యుతిమచ్ఛరీర హరభ - ద్రశ్రీలసద్భాసురా
శ్రీకాళేభవరప్రదా భవహరా - శ్రీకాళహస్తీశ్వరా. 2

మ పరమేశుండని సర్వకర్తయని సం - భావించి పూజింప క
ధ్వరబాహ్యుండని దూటి గౌరిమది బా - ధంగూర్చి దక్షుండు త్వ
ద్భరకోపాగ్నికి భస్మమయ్యె నెవఁడో - వంజాలునీశక్తి న
స్థిరుణం దీవనలిచ్చి కావుమురదా - క్షారామభీమేశ్వరా. 3

మ. భవదీయాలయ గోపురాగ్రము గనం - బ్రాప్తింపు మోక్షంబనఁ
శివ నీదర్శనభాగ్యమెన్నఁ దరమే - శ్రీకంఠ! యస్పృశ్యతా
రివి సర్వజ్ఞుఁడ వాదిమూర్తివి కళా - శ్రీచిత్తనాళీకవా
సివి మమ్మేలు పరాత్పరా పురహరా - శ్రీశైలమల్లీశ్వరా. 4

వ. అని ప్రార్థించి యనంతర వేఁడుకొండలసామి నెదనిల్పుకొని. 5

(శ్రీవేంకటేశ్వరప్రార్థన)

శా. తృష్ణాసూత్రనిబద్ధబుద్ధినయి యో - దేవా భవత్సేవలో
నిష్ఠాతుండనుగాక పుచ్చితి నిటెం - తేఁగాల మోశార్ఙ్గి యో
కృష్ణా నీపదపద్మముల్గొలుతు ర - క్షింపంగరావే హరీ
జిష్ణూ విష్ణు పరాత్పరా భవహరా - శ్రీవేంకటేశప్రభూ! 6

చ. మనసిజరూప రమ్యమణి - మండితచాప కృపాకలాప స
జ్జననుతదివ్యదీప నిజ - శక్తి విఖండితదానపాప పా
వన సురలోక భూప బుధ - వంద్య సమస్తకళాస్వరూప దీ
వనలిడి కావరా సకల - భక్తకరార్చిత వేంకటేశ్వరా. 7

మ. నరజన్మం బతిదుర్లభంబనుచు మా - న్యశ్రేష్ఠులంద్రో హరీ
వరపుణ్యంబున నట్టిపుట్టువొౘదవెం - బ్రజ్ఞావిశేషోల్లస
త్పరమార్థార్థిగ నిన్నుఁగొల్చుచుఁ దరిం - పంజాతు గోవింద సు
స్థిరకారుణ్యముతోడఁ గావుము సదా - శ్రీవేంకటేశప్రభూ! 8

చ. తెనుఁగుఁబొలంబునన్వెలసి - దివ్యతరంబుగ వెల్గుదేవరా
పనుపడలేద నీదుపద - పద్మపుఁ బూజలు మాకెడందలోఁ
గనపడలేద మాపడెడు - కష్టపరంపర దీనరక్షకా
వినపడలేద మామొఱలు - విశ్వవిభాసుర వేంకటేశ్వరా. 9

(రాజరాజేశ్వరీస్తోత్రము)

శా. గౌరీ శాంకరి శాంభవీ గిరిసుతా - కాత్యాయనీ యీశ్వరీ
సారాధార దయార్ద్రపావనమతీ - శర్వాణి రుద్రాణి మే
మారాధింతుము త్వత్పదాబ్జముల నం - బా ప్రీతిమై సర్వవి
ద్యారాజ్ఞప్రద మంగూర్పుమా భువనమా - తా రాజరాజేశ్వరీ. 10

వ. అని వేడుకొని నిజరాజకీయగురువరుండైన మహాత్ముండున్ప్రహకురా.

సీ. ఎవ్వాఁడహింసాప్ర - తేచ్ఛకు దాసుఁడై
బ్రదికిన నాళ్ళెల్ల - బడలుపడియె
నెవ్వాఁడు తగని య - స్పృశ్యతాఘాతంబు
భరతదేశమునుండి - పాఱఁద్రోలె
నెవ్వాఁడు మాతృమ - హీదాస్యదుర్భేద్య
శృంఖలములు దీక్షఁ - ద్రెంపివైచె
నెవ్వాఁడు నిత్య స - త్యేందిరానందుడై
బహుమతైక్యతకయి - ప్రాణమిచ్చె

తే. ఎవ్వఁ డిరుసంధ్యలందు స - ర్వేశుఁ గొల్చు
దేశకల్యాణ సూక్తులఁ - దెలిపె నెవఁడు
నీతి నిర్మల ధర్మ పు - నీతుఁ డెవ్వఁ
డట్టి మహనీయుడైన మ - హాత్ముఁదలఁతు. 52

తే. కలుషము లడంచు విజ్ఞాన - ఘనత నించుఁ
దత్త్వసాధన గలిగించుఁ - దాల్మిఁ బెంచు
దేశసౌభాగ్య మొదవించు - దిగులు డించు
గాఢకరుణామృతపుఁజిన్కు - గాంధిమిన్కు. 53

తే. అశ్రుతిస్మృతిసూత్రవా - క్యాళికెల్ల
నైక్యతఘటింప నేకవా - క్యంబు [illegible]
నస్పృతపరిపంధి యాత్మవి - దా[illegible]ఁ గోర.
పరమసత్యాగ్రహైకనం - [illegible]ం [illegible]

శా. దోషోద్ఘాటనవేళ సూక్తి[illegible] యఖిలభారత [illegible] ప్రారంభించు
ద్వేషాంధార్కనిభప్ర[illegible]స్వరా "నీసంఘము[illegible] కెఱింగింపనతండు.

ద్భాషాప్రౌఢిమ రమ్య మంచితదయా - భాసంబు తద్దృష్టి ని
శ్శేషం బెన్నఁగ స్వార్థచింత పొగడన్ - శేషాహికిన్ శక్యమే. 15

శా. పాపంబన్న భయంబెకాని జముపే - ర్వల్కన్ రవంతే నెటుం
జూపండల్కు సమస్తధర్మముల సం - శోధించు స్వీయాత్మలో
నేపక్షంబునకైన హానిదలఁపం - డెష్టే సదా దేహళీ
దీపన్యాయ్యముగా వచింపఁగలఁడా - ధీరుండు సామాన్యుఁడే. 16

మ. బుధవర్గంబునుతింపఁ గామదమనో - ద్భూతాతి తేజస్వియై
వ్యధనోర్వంగల ధర్మరాజనఁగ మా - యాముక్త సర్వజ్ఞుఁడై
సుధచిందన్నవతత్త్వబోధనకళా - శుంభత్క్రియాలోలుఁడై
యధికారాశకుదూరుఁడై సుగతుఁడై - యత్యంత కీర్తిందగెన్. 17

(ధన్యార్థి)

సీ. పురుషోత్తముఁడెగాని - పురుషోత్తముఁడుగాఁడు
దుష్ట శిక్షణ సమి - ద్ధూరుఁ డగుట
సర్వజ్ఞుఁడేగాని - సర్వజ్ఞుఁడాకాఁడు
మృత్యుదేవతచేత - మ్రింగఁబడుట
నరుఁడనందగుఁగాని - నరుఁడనంగఁదగండు
తానహింసకు నిత్య - దాసుఁడగుట
నలగుణాఢ్యుఁడెగాని - యలగుణాఢ్యుఁడుగాఁడు
వనట కవితాలతాంగితోఁ - గలయకుంట

మ. నరజన్మం ...నఁదగుఁగాని - ధర్మరాజు
వరపుణ్యంబున...బు గురుహింస - కాడకుంట
త్పరమార్థార్థిగ ...బంధి - శాంతి కంధి
స్థిరకారుణ్యముతోడఁ ...పరి - వంధి గాంధి. 18

చ. తెనుఁగుఁబొలంబునన్వెలసి - హాగుణసిద్ధికి మెచ్చఁగా నిరా
పనుపడలేద నీదుపద - పద్మపుఁగంగి నిరంతరదేశసేవతో
గనపడలేద మాపడెడు - కష్టపరంత్రశమాదులఁ దామరాకుపై
వినపడలేద మామొఱలు - విశ్వవిభాసుఁడు లౌకికమాయ నాత్మలో. 19

కం. కత్తియుఁ గలమును బట్టక
చిత్తం బస్మజ్జనాళి – సేవా ధర్మా
యత్తమొనరించి రాష్ట్రముఁ
దెత్తు విశాలాంధ్ర మమర – దేవత లలరఁగా. 21

కం. ధీరహితులు ధీనహితులు
సారసమతు లతులనీతి – చర్యా ధుర్యుల్
భారత సత్యాగ్రహమున
మారణ శస్త్రాస్త్ర హతుల – మడియుట వినరే. 22

వ. అంపనేనెంత-జీర్ణక్రియ వక్త్రమునందె ప్రారంభమగునట్లు జన్మ దివసంబునుండియె ప్రాణికాయుక్షీణమారంభమగుటనిక్కము. దేహము బుద్బుదము. అదియెప్పుడెట్లుబట్టునోయెఱుంగము నశ్వరశరీరము లోకోప కారంబునకుపయోగపడుట ధన్యము. ద్రవపదార్థములకు స్థిరమైనయా కారములేనట్లు చంచలమనస్కులకు స్థిరసంకల్పముశూన్యము. సమీ కృతాహారలోపంబున నరుఁడనేకరోగములకుగుఱియగుచున్నట్లు సహిష్ణు తాశూన్యతచే దేశము బహువిధబాధలకులోనగుచున్నది. సంద్రముల యాటుపోట్లు చంద్రమునివలనఁగలుగుచున్నట్లు ప్రజలశాంత్యశాంతులు ప్రముఖనేతృవాఙ్ముఖాధారమ్ములైవర్తిలు. చిరంతనశాల్యోదనం బారో గ్యకరంబైనయట్లు మహాత్ముల ప్రబోధంబు సుధామధురంబై దేశసౌఖ్య దంబగు. కాన దానింబాటింపందగు. ఇది నాకాత్మబలపరీక్షాసమయ 52 అగ్నిపరీక్షాతరుణము. సత్యాహింసాసత్త్వపరిశీలనకాలము. రాష్ట్ర ణమో రాములమరణమో. అన్యంబుశూన్యంబు. మాతృభూ భాషపై మమకారముఁజూపని మనుజుఁడు మనుజుఁడేకాఁ

చ. కులగిరులెల్లఁ గ్రుంగిన స – ఘోషల ఘూర్ణిలి 53
జలజహితాబ్జతారక ల – శాంతిగ వక్రగతిం
జలమున భారతాధిపతి – చంపఁగ ఖడ్గ
గలఁగ నిదేప్రతిజ్ఞ జయ – ఘంటిక 07

వ. అని. గోర.

ర్పం

చ. చెదరఁగనీకధైర్య మతి – యఖిలభారత ప్రారంభించు
బదిలముగాఁగ నిల్పి స్వరా "నీసంఘ కెఱింగింపనతండు.

కం. తొలి యాంధ్రజాతి పౌరుష
బల శక్తులఁ బలికి నేఁడు - పాటింపనిచో
విలువ యెటులుండు మనకిఁక
బులికడుపునఁ గడకు మేఁక - పుట్టిన విధమౌ 83

మ. అలనాఁడేమిటి నేఁడుగూడఁ బనులం - దారంభశూరత్వమే
వెలుఁగుం దెల్గులనంచుఁ బల్కు రది ము - వీక్షించితిం బెక్కుమా
రులు నీవయ్యది వమ్ముసేయఁదగు ధీ - రుల్మెచ్చ ధీశాలివై
కలనైన న్వెనుకాడఁ గూడదు సుమా - కార్యంబు నెగ్గింపుమా. 84

కం. ఒక్కొక్క జాతి కరయఁగ
నొక్కొక్క గుణంబు సహజ - ముర్వి మనకిఁకం
జిక్కని యూహకు ముందుగఁ
జిక్కని యావేశముండి - చిక్కులు దెచ్చెన్. 85

కం. అవకాశవాదు లెందఱొ
ప్రవిమలగతి మాని యడ్డు - బాటలఁ బట్టన్
నవనమిది సాగకుండెం
జివఱకు నీవంతు వచ్చె - సిద్ధించు నిఁకన్. 86

తే. పారతంత్ర్యాంధకారము - పాయుపొంటె
నాంధ్రు లెంత తెగించిరో - యరయఁ దగదె
మూఁడు వర్షముల్ ప్రభుతతోఁ - బోరిన ఘన
వీరుఁడగు రామరాజు జీ - వితమె సాక్షి. 87

తే. అఖిల భారత స్వాతంత్ర్య - మఖిలషించి
యసువు లర్పించి రెందఱో - యతని యట్టి
యిన్ని కథలన్ని మన్నన - విన్నయట్టి
కేంద్రమునకైన జాలియొ - క్కింత లేదు. 88

తే. గుండ్ల దెబ్బకు మగటిమి - గుండె లిచ్చి
శాశ్వత యశంబు వడసిన - జాతి తనదు
వినపడక ఁడుగుచున్నదని కేంద్ర - మైన నరగ
తీర్పు సెప్పఁగ - న్విప్పదేమి. 89

వ. ఇది మానవదుర్భేద్యమైన వైష్ణవమాయగానున్నదిగాని వేఱొండు గాదు. సకలభాషలు భారతాంబభాషలని సౌజన్యముం బ్రకటించుట భారతీయులముఖ్యధర్మము-మగఁడుండియు మొండిమొడచేనుండియుఁ జేరెఁడు గింజలు లేవన్నట్లున్నది మనస్థితి— 90

ఆ.వె. విన్న వాని కంటెఁ – గన్న వాఁడె ఘనుఁడు
కన్న వాని కంటెఁ – దిన్న వాఁడె
యధికుఁడంచుఁ గొంద – ఱాడుదు రదినేఁడు
నిక్కమయ్యె దారి – చిక్కదయ్యె 91

వ. అనుచుండ నాంధ్రపంచాస్యమరుదెంచి తెలుఁగుఁదల్లి నెట్లు తేర్తునా యను నాలోచన లాలోచనములు సూచింప హర్షామర్షముల రామునన్నికర్షమున సమాసీనుండై దీక్షారంభమున రాములేమనిప్రకటించెనని ప్రశ్నింప. “చెన్ననగర భవితవ్యము ప్రజాస్వామ్య సిద్ధాంతార్థ దృష్టి నేతత్పురీవాసులే నిశ్చయింపవలసియున్నది. ఇటనున్న యాంధ్ర తమిళ నాయకులొకచోటంజేరి ధర్మబద్ధముగఁ జర్చలు జరుపవలయు. పట్టణ ప్రజాన్యాయనిర్ణయక్రియ జరుగవలయునన్న నివ్వర మిర్వురకుం జెంద వలసియున్నట్లుతోఁచు. అదిప్రజలే ప్రదర్శింపఁ గలరు. ఈ సమస్యా పరిష్కార మార్గములు రెండు. హింసాపద్ధతి యహింసాపద్ధతి. గాంధేయ పథగాములగు నహింసావాదులు కదలకుండఁగూర్చున్న హింసావాదులు బలపడఁగలరు. అయ్యదత్యంత ప్రమాదకరము. అమోఘ సేవా ధురంధరండగు స్వామి సీతారాము రాష్ట్రేచ్ఛ నహింసామార్గమునకు మరలించె. ఆంధ్రరాష్ట్ర చెన్ననగర చరిత్ర సోదాహరణముగఁ బూసగ్రుచ్చినట్లు సర్వము విశదీకరించె. సర్. శంకర్‌నాయర్ తమిళరాష్ట్రనిర్మాణముఁగోరినతఱి మద్రపురి తమిళనాడులోనిదికాదని యతండెట్లు సూచించెనో శ్రీరాములుగుర్తునకుఁదెచ్చి విభజనసంఘనివేదిక, యాంధ్రకేసరి యభ్యక్తాభ్యంతరాది విషయములువివరించి పరిస్థితులు శూర్పణక పిత్థముల వలె స్పష్టముగ గోచరించుచుండ రాష్ట్ర నిర్మాణబాధ్యత భారత ప్రధాని, శీఘ్రమెవహింపక పోవుట చింతనీయము. పక్షద్వయాధినాథులకు సంధి కుదుర్చుట కీప్రయత్నమత్యవసరమనియేత త్క్రియారంగముననేనొనర్పందగిన యాంధ్రమాతృసేవానిర్వహణమ్మునకే యీదీక్షం బ్రారంభించు చున్నాఁడ”నని ప్రకటించెననిసాంబమూర్తి ప్రకాశమున కెఱింగింపనతండు.

కం. ఇది యొక గడ్డు సమస్యగ
మదకిం గనుపట్టు నేది – పూర్గంబిక నే
రిది ధర్మపథమొ కేంద్రము
సదయత వీక్షింప దెట్లు – సాధ్యంబగునో. 93

తే. మనసులోమాట మనసున – మఱుగుపఱచి
పైకి నందఱు చక్కఁగాఁ – బలుకు చుంద్రు
సంద్రమున నూనెగను లున్న – చందమునవె
యెవరికడుపున నేమున్న – దెఱుఁగఁ దరమ. 94

ఉ. చెల్లనిమాటలెయ్యె మన – శ్రేయము గోఁరెడివారు లేమిచే
నుల్లము నష్టకష్టముల – కోర్పు వహించుట నెంతకాలమో
తొల్లి గతించె మాతృధర – దోహద శూన్యత నేఁటికిన్నిశం
దిల్లిక లేని యిల్లువలె – దీనదశన్ రుచిహీన మయ్యెడిన్. 95

మ. చెడుగున్మించిని తూఁచితూఁచి మదిలోఁ – జింతించి శాంతిక్రియం
గడుసుంటోకలుపోక చక్రమునకై – జ్ఞానంబు వెచ్చించినం
బొడగానంబడ దొక్కవెల్గు హృదయో – ద్భూతాశ సిద్ధింపఁగా
నడినంద్రమ్మునఁ బంటచేను గననౌ–నా? యెంత వీక్షించినన్.96

వ. అని సమాలోచనాయత్తచిత్తుండై ఘనరూప స్థితాహారమును భూరుహములుగ్రహింపఁజాలనట్లయుదారచరితుల కవగతమగు విశ్వజనీన సత్యసాక్షాత్కృతామహిమను సంకుచిత దృష్టిగలవారందుకొనఁజాలరు. నిర్మాణ విచ్ఛిన్న కార్యద్వయమేకకాలమంద జీవులయందు జరుగుచున్నతెఱంగునఁ బ్రత్యేక రాష్ట్రసమర సన్నాహకృత్యములు తద్భిన్నకార్యక్రమము లేక సమయమంద నడచుచున్నతరుణమది. భారతప్రధాని చెన్నపట్నగర ముఖ్యమంత్రి రాష్ట్రపాలకుఁడాంధ్రప్రదేశమునఁ బర్యటించినతఱి విద్యార్థిమహాసభాసభ్యు లేతద్విషయము సర్వము నివేదించుచు వినతిపత్రము సమర్పించిరి. దానికి సత్ఫలితముకలుగక పోగా బాధ్యతగలవ్యక్తియైన రాజాజీ మద్రపురియాఁవలదేయని యుగ్గడించుట యర్థరహితము. అదేమి చిత్రమో. ధ్యూంధ్ర ధాష్ట్రము పేరెత్తిన నతం డదియవాంఛనీయంబనుకొని దుర్వాసుండగుచుండు. 97

శా. భాషారాష్ట్రము లేర్పడన్ స్థిరముగా - స్వాతంత్ర్యచిహ్నంబుగా
ద్వేషింపం దగదంచు గాంధి యనఁడే - వేచిక్కులంబెట్టి యీ
భాషారాష్ట్ర మడంపఁ జూచును దలం - పం భారతంబంతయున్
శేషం డీభరనెల్ల దాల్చుగతి నిః - శ్శేషంబుగా మోయునే. 98

శా. ఎంతేఁ జింతిలి యాంధ్రరాష్ట్ర రమకై - యే నెట్టు వాంఛించినన్
సుంతైన న్సమదృష్టిఁ జూడఁడెద నీ - సుంబెంచి మద్రాసనం
బంతంబొప్పఁగ మీదికాదను సదా - స్వార్థక్రియాలోలుఁడై
యంతర్భేద వినోదతత్పరుఁడు దే - శౌన్నత్య మర్దించునే. 99

శా. కట్టల్కన్మనవాంఛ భంగపఱుపం - గాంక్షించు రాజాజి వే
చుట్టుల్చుట్టుచు గుంటమెట్టలకు నీ - డ్పుం గేంద్రమవ్వానికిం
బట్టైయున్నది దానిగుట్టెఱిఁగి శం - భద్దీరతన్నిల్పుమా
నట్టేటన్మఱిపుట్టిముంచకుసుమా - నవ్యాంధ్రరాష్ట్రార్థివై. 100

మ. ఇది ప్రహ్లాదమతంబు వేఱొకని కిం - శేబాధగల్గింప కే
వ్యథనైనం దనుదాన పొంది జయసం - పద్యుక్తుఁడై నిత్యని
ర్మదుఁడై లోకముసుద్ధరింపవలె ధ - ర్మత్యాగలీలారతిం
గదనంబియ్యది నీకు సాధ్యము జగ - త్కళ్యాణ సిద్ధామతీ. 101

వ. ఇక్కార్యంబున రాజాజీ మనతో నేకీభవింపకపోవుట కడుంగడు
విచారకరము- 102

ఆ.వె. ఊతగింజ నిచ్చి - యెంతేని యుక్తిమైఁ
దాటిగింజ లాగు - మేటి యతఁడు
పాటిసేయఁ డొక్క - మాటైన మనకిఁక
వాటమైన మంచి - బాట యేది. 103

తే. జ్వరముపడి పథ్యమును గొన్న - నరుని యట్లు
తెప్పరిలుచుండె భారత - మిప్పు డిపుడె
యింతలో నిట్టి కలహాల - కిక్కయైన
నభ్యుదయ మెట్లు సాధింతు - రను నతండు. 104

తే. భావి గమనించి తనవైపు - బాగుపఱుచు
కొనుటయేగాక మద్రాసు - కొసదలంచె

నెన్నియున్నను దృప్తిలే – దింతవఱకు
చెప్పుమా నిండుబండికిఁ – జేట బరువె? 105

తే. స్వీయ రాష్ట్రాభిమానియై – న్యాయమనక
యాడు తద్వాక్యములకు ని – రాశ చెంది
దక్కినది యేదొ చాలని – తలఁచు టెన్న
గ్రుడ్డి బసవన్న చేనిలోఁ – బడ్డ రీతి. 106

మ. వరుసంగల్గు వ్యయప్రయాసలకు నో – ర్వంజాలు ధర్మాత్ముఁడే
స్థిరసంకల్పముమై నమోఘవిజయ – శ్రీనొందు నర్హుండు నీ
చరితం బట్టిదయౌట నీవెతగు దీ – సత్కార్య సంసిద్ధికో
నరలోకస్తుతి పాత్ర నీకొదవు ధ – న్యత్వంబు సత్కీర్తియున్. 107

ఉ. ఒప్పెను నోడరేవిచట – నుజ్జ్వల సంస్థల కాలవాలమై
గొప్పయశంబుఁ గాంచెఁ బ్రజ – కోరిన సౌఖ్యము లెన్నొ యుండఁగా
నిప్పురమెల్ల వీడి ధన – మేదొ గ్రహించుట కిచ్చగింతురే
కప్పుర మిచ్చి యుప్పు గొనఁ – గా నవివేకము తేటతెల్లమౌ. 108

మ. వెలయన్ సత్యచరిత్ర కేంద్రమునకే – విజ్ఞప్తు లెన్నెన్నొ నం
కలితంబు ల్దగఁబంపినం బధిరశం – ఖాన్యాయమైపోయెడిన్
దెలుఁగుంగడ్డకు రాజయోగదశకై – దీక్షించి వీక్షించు నీ
వలఁకు ల్పత్రికలెల్లఁ జాటినను నం – భావింప రానాయకుల్. 109

తే. నక్కజిత్తులు పన్నుట – నాకుఁ దెలియ
దెట్టుమనవనిసాగు నిం – కెట్టు ఫలము
దక్కునను చింత నాయాత్మ – కెక్కి నిలిచె
దైవ మెట్లంగిఁ దలఁచునో – తరమ తెలియ. 110

మ. అనఁ జింతించుచు సాంబమూర్తి నిజమా-ర్యా యెంత ప్రార్థించినన్
వినరానాయకు లందు ముఖ్యుఁడననౌ-వృద్ధుండురాజాజి యా
తని వాక్కెల్లెడఁ జెల్లుచుంట మనపం-తంబింతయు న్సాగ దే
మనివాక్రుత్తు నతండె మూలపురుషుం-డభ్యంతరం బాడఁగన్. 111

కం. తలక్రింద కొఱివి యయ్యెం
దలక్రిందులు సేయుచుండె – ధర్మము లెలం

దలమానిక మిట్లగుటుం
దలమా ఫలమొంద బ్రహ్మ – తరమా మాన్పన్. 112

తే. ఆంధ్రరాష్ట్రము పేరెత్త – నతఁడ దేమొ
యేన్గునకు సిళ్ళుసూపిన – ట్లెగిరి పడును
పీసమైనను మనమాట – వీనులఁ జొఱ
దేది యెట్లగునో తెల్ప – నెవరి తరము. 113

తే. రాజకీయేంద్రజాల దు – ర్వారశక్తి
హస్తగతమౌట విశ్వాస – మతిశయింప
మఱవకుండెన్నఁడైనను – మద్రపురము
తమిళరాష్ట్రంబునకు రాజ – ధాని యనును. 114

తే. హేతుమద్వాక్యముల కాతఁ – డింతయైనఁ
గట్టువడఁ డింక నెట్టుల – పట్టువడును
దప్పినను వీవు బుజమది – తప్ప దింక
నయ్యవారలముద్ర య – న్నట్టులగున? 115

కం. ఘనహస్తలాఘవంబున
జనులను నమ్మించు నైంద్ర – జాలికు భంగిన్
మనయగ్రనాయకులమదిఁ
దనపై విశ్వాస మొదవు – దారిఁ జరించెన్. 116

చ. తన ప్రజమెచ్చగా బరమ – ధార్మికదృష్టి నడంచి పల్కు రా
జునుగని జహ్వారేమనఁడు – చోద్యము వారలతీరుఁజూడ నే
మని మనభావి నెంచఁగల – మక్కట యెంచుట గేదెచేనిలోఁ
గొనకొని నిల్చియున్నతఱిఁ – గొమ్ములు కన్గొని బేరమాడుటే. 117

ఉ. కూకల బొబ్బ లెచ్చరయఁ – గుప్పన గింజలు నున్నయన్నటుల్
వాకులు బాకులై వెడల – వచ్చుఁ బ్రియం దగఁజూప నేర్చునే
యేక్రియ నెంతశక్తిగలఁ – డేని ప్రభుత్వపు టూఁతలేనిచో
బ్రాకుడుఁగొయ్యలేని లత – భంగి మహోజ్జ్వలవృద్ధి పొందునే. 118

వ. "వైళమ యాంధ్రరాష్ట్ర ప్రాప్త్యర్థ మఖిలపక్షములు తీవ్రతర సంచలనము గలిగింపం దగు. వివాదాస్పదముగానిప్రదేశములతోశీఘ్రమ

రాష్ట్రనిర్మాణము జరుగవలయు"నని యాంధ్రమహాసభాధ్యక్షుఁడు గాడిచర్లహరిసర్వోత్తమరావు పత్రికాముఖంబున నభ్యర్థించుట లోకవిదితము. రాజాజీ హృదయ పరివర్తనాహస్కరోదయంబునంగాని మనకృషినీరేజము వికసింపదు; మనమార్గము నిష్కంటకము కాదను రాజులను సత్యమని యాంధ్రకేసరిం గని. 119

చ. ముడివడకుండఁ జేయుటకు - మూలము తొలఁగని చెన్నపట్టణం
బెడపక మాకు రాష్ట్రమిడు - టెంతయు ధార్మికమార్గ మంచొగిం
గడువినయంబుతో నడుగఁ - గాంచఁడు సత్త్వసమైక్యదృక్కులం
గడుపున లేని ప్రేమ బిగి - కౌఁగిటఁ జేర్చిన వచ్చునే వర్గసంసిద్ధి. 120

తే. భుజబలము బుద్ధిబలమును - బుజము బుజము
దాకికొనుచుండ నడచిన - ధన్యతముఁడ
కదలె స్వాతంత్ర్య రథము నీ - గర్జనమునఁ
దెలుఁగు వెలుఁగులు దెసలెల్లఁ - దేజరిల్ల. 121

శా. ధీరోదాత్తుఁడ వీవు త్యాగపథసం - దేశంబు లందిత్తు వో
వీరాగ్రేసర యాంధ్రకేసరి భవ - ద్విశ్వాసముం దెల్పుమా
నారాష్ట్రేచ్ఛ ఫలించునా యనఁగ జ్యో - త్స్నాసన్నిభాలోకన
శ్రీ రాజిల్లఁగఁ బల్కెఁ బల్కుల రస - శ్రీ నృత్యము న్సేయఁగన్.

చ. ప్రకటితమయ్యె నీమనసు - బాధలనెల్ల గ్రహించినాఁడ నేఁ
ద్రికరణశుద్ధిగా నిజము - దెల్పెద నమ్ముము నాదువాక్యముల్
వికటకవిత్వముం బలుకు - వింతగ రాజెనొ స్వార్థదృష్టితో
సకలము ధర్మబద్ధముగ - సాగుట కల్లయటంచుఁ దోఁచెడిన్. 123

మ. పడగాడ్పుల్ చెలరేఁగి రేఁగి సడఁగన్ - వర్షం బమోఘంబుగాఁ
బడు రీతిన్ విపదబ్ధిఁ దోఁగఁ గతకం - బ్రాప్తించు సౌఖ్యం బఘం
బడఁగం బుణ్యము వెల్గు రాత్రిగడవం - భానూదయంబౌను నీ
కడఁకన్ రాష్ట్రము దక్కు నం చతఁడు వే - డ్కం జూచి యేగెన్ వెసన్.

వ. అంతం దృతీయదివసంబునఁ బ్రశాంతంబుగ నికటోపవిష్టుండైన సాంబమూర్తిం గని యార్యా యేతద్రాష్ట్రసమస్యామార్గము ప్రాక్పశ్చిమాంధ్రభేదనిశితకంటకావృతమెట్లయ్యె నది యెప్పు డెట్లు పరిష్కృతమయ్యె వివరింపవే యన నతం డిట్లను— "ఆంధ్రమహాసభానాయకులు ప్రజల

కాది నట్టు ప్రబోధించుచుండ మననేలన్మనమేలుకొనుట కిష్టపడక యుమ్మడి రాష్ట్రమునఁ గమ్మగ మెక్కుచున్న కపటనాటకసూత్రధారులు కొందఱు చీలదీసి పాలింపం దలంచి ప్రాగాంధ్రపశ్చిమాంధ్రసమస్యావ్యూహము రహస్యముగ నుపదేశింప నది మిత్రభేదమని గ్రహింపక యతిపతన హేతువని తలంపక దానికగ్గమై పశ్చిమాంధ్రులు తమకుం బృథగ్రాష్ట్రము వలయునని వాంఛించి జరిపిన యాదోనినదస్సు సునిశితవాదోపవాదములకు గుఱియై యాంధ్రమాతకు మనోవ్యథనాపాదించె. అవిభక్తరాష్ట్రమన్నివిధమ్ముల నిజానుకూలమ్ముగనుంట మహాహ్లాదమందుచున్న తమిళుల కిది శతగుణంబుల ముదావహంబగుట వారదనిదియని తన్మంత్రంబు దృఢంబుగఁ బాఱునని రాయలసీమను లోలోఁ బ్రేచుటం బసివట్టినత్రిలింగ కాశ్యపృ్యద్యమకార్యకర్తలపరదిగాంధ్రసోదర్యులకిట్టుహితోపదేశమొనర్చిరి.

తే. రాష్ట్రరమ నందుకొనలేక - రట్టుపడెడి
వేళ మనలోన మనకిట్టి - భేద మొదవె
కఱవున నధికమాసము - కలసినట్లు
కష్టములలోన కష్టముల్ - కలసివచ్చె. 126

కం. కదనము మనలో మనకుం
గదురుట మనరాష్ట్రమునకె — ఘాతం బగుటన్
ముదమొదవఁగఁ బరులందఱు
యదుకులమునఁ బుట్టె ముసల — మని తలఁతు రిఁకన్. 127

తే. ఆంధ్రరాష్ట్రోద్యమోగ్రశం - ఖారవంబు
వైరిహృద్భేదనైకవి - వర్ధనంబు
కావునఁ దదిచ్ఛ నడఁచుట - కార్యమనుచు
శతవిధ మహోగ్ర తంత్రముల్ - జరుపుచుంద్రు. 128

శా. పన్నాగంబులుపన్ని యాంధ్రధరణీ - భాగ్యావరోధంబుగా
సన్నాహంబు లొనర్చువారు కలరన్ - సత్యంబు నూహించి యే
తెన్నుం ద్రొక్కిన వ్యూహభేదనకళా - దీప్తుల్ జయధ్యానముల్
క్రన్నంగల్గునొ యట్లు వర్తిలఁగ దీ - క్షాదక్షులై నిల్వఁడా. 129

తే. ఐకమత్యబలంబున - కన్య మెద్ది
యుద్ధికాదను నార్యుల - సూక్తి వినరె

యూవ లీవల పల్కుల - నాలకించి
యేలచెడెదరు మీమంచి - నెంచుకొనుఁడు. 130

తే. ఆంధ్రసోదర్యులార! మీ - రందఱైక్య
భానమున నిల్పి గోష్ఠ్యాసు - పడయుఁ డయ్య
కొందఱటు కొందఱిటు లాగఁ - గొనకుఁ దెగిన
నందఱకు హాస్యహేతువై - యడలు గూర్చు. 131

ఉ. చండతరైకదృష్టి ఘన - శాంతరణం బిటు మార్పుసేయ ను
ద్దండులు నూఱిపోసిన వి - ధంబున మీరలు మేముమాము పో
పొండని పల్క మెత్తురొకొ - ముంతెఁడు నీళ్ళకె జంక బానెఁడె
వ్వండిఁకఁ బోసికోఁ దగుఁ బ్ర - ఖాతమురాదె నిశాంతమందొగిన్. 

కం. అంతః కలహంబులతోఁ
జింతించుచునుండ నెట్లు - శ్రేయ మొదవు మీ
యంతఃకరణమ్ములలో
శాంతి యొదవు నెట్లు జయము - సమకూరు నెటుల్. 133

తే. ఆత్మ గౌరవ కాంక్షులై - యఖిల విధులఁ
బెరిమ నాంధ్రమ్మునకు నగ్ర - పీఠ మిడుఁడు
స్వర్గమునకంటె గొప్పది - జన్మభూమి
తల్లిఁ బూజింపఁజాలని - తనయు లేల. 134

తే. ఘనపరాక్రమ విజ్ఞాన - ఖనులటంచు
వసుధ విఖ్యాతి నందిన - వారలైన
తెలియుఁడీ నేఁడు తెలుగుల - తెల్వి తేట
లడవిగాచిన వెన్నెల - యయ్యె నకట. 135

తే. వెనుకవచ్చిన రైల్బుంచు - చనిన యట్లు
తమిళులభివృద్ధినొందిరి - తరతరాల
రాజకీయవు టెత్తుల - రాణమీఱి
రిఁకఁ దెలుంగులగతి యేమొ-యీశుఁ డెఱుఁగు. 136

మ. అతిలోకవ్రతనిష్ఠ నింద్రునకు శం - కౌఘంబుఁ జేకూర్చి నం
స్తుతి పాత్రుండగు రాముఁడే తనకు శి - ష్యుండై తగన్ సృష్టికిం

ప్రతిసృష్టింబొనరించి పేర్వడిన వి - శ్వామిత్రువంశస్థు లు
న్నతశౌర్యోజ్జ్వలు లాంధ్రులంచు ప్రతిగ - న్యాంబౌటఁ జింతింపుఁడా.

వ. ఋగ్వేదైతరేయబ్రాహ్మణ మాంధ్రులవేనోళ్ళ ప్రశంసించినది. కాణ్వ వంశ్యులజయించి నన్నూటయేఁబదియాఱువర్షములు మగధరాజ్యమాంధ్రు లేలిరని పురాణములు ఘోషించుచున్నవి. గంగాతీరమున నెనిమిదివందల వత్సరములు త్రైలింగులు పాలించిరని విల్ఫర్డు లిఖించె. ప్రాచీనసూత్ర కారులం బోధానాపస్తంబులిర్వురు దాక్షిణాత్యులసం దగిరి. అందాపస్తంబుఁ డాంధ్రుఁడు. బౌద్ధులప్రధానదేశికుఁడగు పార్శ్వకుస యాచార్యపీఠ మధిష్ఠిం చిననాగార్జునుఁ డాంధ్రుఁడు. శిల్పశాస్త్రజ్ఞశిఖామణియని ఖండఖండాంత రముల నఖండకీర్తి నార్జించిన శిల్ప్యగ్రణి నాగ్నజి త్తాంధ్రుఁడు. వేదవేత్త లలోముఖ్యాతిముఖ్యుఁడై జైమినిసూత్రతతికి భాష్యమువిరచించిన మహా మేధావి కుమారిలభ ట్టాంధ్రుఁడు. మెగాస్తనీసు, హౌనుత్సాంగు, టాలమీ మార్కొపోలో. యాబూరిహా నిత్యాది విదేశయాత్రికుల నిస్తులస్తుతులకుం బాత్రుఁడైనవాఁ డాంధ్రుఁడు. యసిక, యస్మిక, మూలక, సురాష్ట్ర, కుకుర, యనూప, విదర్భఁ యకరావంతిదేశముల నేకచ్ఛత్రాధిపత్యముగఁ బాలిం చెనని నాశికశాసనముచేఁ గీర్తింపఁబడిన గౌతమీపుత్రశాతకర్ణి యాంధ్రుఁడు. చీనాచక్రవర్తులచే చరిత్రకారులచే బలి-యవద్వీపవాసులచే నిండియాసార్వ భౌములని ప్రశంసింపఁబడినవా రాంధ్రులు. జావా సుమత్రా దీవులఁదన యానసూయాణముగనొనర్చిన పూర్ణవర్మ యాంధ్రుఁడు. ఛత్రపతి శివాజీకి రాజకీయగురువు సమర్థరామదా సాంధ్రుఁడు. పీష్వాలకుం బ్రధానియై రాజ్యతంత్రచక్ర మవక్రపరాక్రమంబునం ద్రిప్పిన మోరోపం తాంధ్రుఁడు. చైతన్యున కమోఘభక్తిమహిమలఁ బ్రబోధించి దివ్యజ్ఞానవిద్యుద్దీపపంక్తులఁ బ్రకాశింపఁజేసిన బిల్వమంగళుఁ డాంధ్రుడు. హిందీకవితాలతాంగికిఁ గ్రొం గ్రొత్తనృత్యకళ నేర్పిన భట్టపద్మాకరుఁ డాంధ్రుఁడు. విఠ్ఠలదేవాలయస్తంభ ములచే సప్తస్వరములుపలికించినవాఁ డాంధ్రుఁడు. వేదోచ్చారణము విన వలయునన్న నాంధ్రునినోటనే వినవలయునని పండితప్రకాండుఁడగు భాండార్కరుచేఁ బ్రస్తుతింపఁబడినవాఁ డాంధ్రుఁడు. అట్టివారివంగడమునఁ బుట్టిన మనమిట్టి దీనస్థితి నుండఁదగునా? చెట్టుపేరుసెప్పి యెందన్క కాయలమ్మఁగలము? కావునం గలసిరండు, కలిమిమెండు, కలదుపండు, కడుపునిండు—ఆంధ్రభాషాయోష ప్రకటితోన్మేష యగు. 138

ఉ. అంజక వింజమాకిడిన - నాఁగక వజ్రివలెన్ సధైర్యులై
యంజనిడం బఘంబిడు న - హార్య మహీనశుభాస్పదంబుగా
మంజుల వాగ్విలాస జయ - మంగళగీత మహాసుధీ మనో
రంజనమై నిరంజన పు - రాసకలాంధ్రకథావినోదమా. 139

ఉ. "మీకును మాకుఁ బొత్తిఁక ని - మేషముగూడదు లేదు లేదు మీ
వాకుననమ్మక" మ్మనెడి - పల్కు వచించుట గోరుచుట్టుపై
రోకటిపోటు చందమయె - రూఢిగ ధర్మనిబద్ధబుద్ధులై
నాకమొ నారకమ్మొ పయి - నాయకులైనను దేల్చకుందురే. 140

తే. తమిళ కర్ణాట కేరళ — ధాత్రి జనులు
మీకు మేల్గూర్చు బాంధవా .. నీక మనుచుఁ
బ్రాగ్దిశాంధ్రాళి మీపాలి — వైరివర్గ
మంట మతికెంతొ చింతయౌ — టబ్బురంబె. 141

మ. సకలాంధ్రావనిమేలుగోరుచు మహా - సత్యాగ్రహత్యాగముల్
ప్రకటింప న్మము వంచకవ్రజముగా - వాకొంట యెట్లొప్పు మీ
సుకమాసింపక మేమొనర్చినక్రియల్ - సూచింపఁ డేయేకమే
ముకురంబున్నది వక్త్రమున్నదిగదా - మోమోట మింకేలనో. 142

శా. సేవాసక్తులు తీరవాసులు జయ - శ్రీకాంక్షు లంచెంచ కే
వేవోనిందలువల్కి యల్కలకుఁ దా - వీయన్పలంబౌనె మీ
భావోద్భూత విరక్తియో పరులు చెప్ప న్నమ్మివాకొంటిరో
యేవాగ్దానమొనర్చితప్పితిమొ త - ద్దృష్టాంతముం దెల్పుఁడీ. 143

మ. "అవివేకుల్ జగదేకనీచు" లని మీ - రన్న న్మముం జెందునే
నవనం బియ్యది యాఁగునే యెటిఁగి ప - శ్చాత్తాపముం బొందరే
యవురా యిప్పటికాంధ్రసోదరులె యి - ట్లాడ న్మనోవేదనం
దవులంజాలితి మీకుటుంబకలహా - ద్ధత్యంబు వర్జింపుఁడా. 144

ఉ. రాయల రాజ్యరక్షణ క - రాతుల రక్తపుఁగాల్వ లీదమో
ధ్యేయము వైరిరాజ్య మన - ధీబల దేహబలంబు సూపమో
పాయక కొన్నివేళల న పాయమునంబడి ప్రాణమీయమో
న్యాయము సెప్పి మమ్ము చెడ - నాడిన నెంతొ సహింతు మింతకున్.

శా. తూర్ణోచ్చాళ్వమహాగజప్రవజర - ఘోద్భూతాద్భుతధ్వానసం
కీర్ణోగ్రోజ్జ్వలవాహినీపతియుతా - కీర్ణార్భటీఘాటిమై
దీర్ణానేకవిరోధిహృద్ధరజ కీ - ర్తి జ్యోత్స్న రాణించె సం
పూర్ణశ్రీధృతి రాయ లాంధ్రజనతా - పూజ్యుండుగాకుండునే. 146

ఉ. పంపు నిలింపశాసనని - భప్రభ దక్షిణభారతంబునం
బెంపుజనింపవెల్గునటు - పృథ్వినిరంకుశ లీలనేలఁడే
యింపుదలిర్పఁదచ్చరిత - యిద్ధరఁబర్వదె యెంతదాచినన్
సంపెఁగతావి దాగునొకొ - సజ్జనవర్యుల కీర్తియంతెగా. 147

మ. మిహిరాంశుప్రతిమాను మానధను స - న్మిత్రున్ యశఃపాత్రుధీ
రహితున్ రాజ్యరమాసమన్వితుఁ గళా - రమ్యున్మహామాన్యు వే
దహితాచారవిచారు ఘోరరణ వి - ద్యాదక్షు సౌజన్యధూ
ర్వహుబాహాబలభీముఁదత్ప్రభు బుధుల్ - వర్ణింప నాలింపమే. 148

ఉ. పోషితసత్కవీంద్ర ఘన - పుణ్యచరిత్రుఁడు వైరివర్గ హృ
ద్భీషణభాషణుండగుచు - వెల్గిన రాయలవేళ రత్నరు
గ్భూషణముల్ధరించి రస - గుంఫితయై కడకిట్టు లయ్యెయో
పోషణచక్కలేని తను - వుంబలె నాంధ్రము సన్నగిల్లెడిన్. 149

శా. వంచింపంబనియేమి తత్కథలు శి - ల్పంబు ల్చరిత్రాంశముల్
గాంచందోఁపదె యాంధ్రజాతియొకడన్ - గాఢైకసత్యంబు మే
లెంచ న్మంచిగ్రహించి ధర్మమునకీ - రేయగ్రతాంబూలముం
బంచాంగంబులుపోవుగా కెటుల పో - పంజాలు నక్షత్రముల్. 150

తే. పెమ్మసాని నరేశులు — వీరవరులు
నీతినిధులైన సాయప - నేనివారు
రావెళాన్వయు లాకృష్ణ — రాయపృతన
నాఁజి నడిపించి సత్కీర్తి — నందలేద. 151

శా. మీకుం బుట్టుము మాకు శత్రువె మహా - మేధావి తద్రాట్టుహో
మాకున్మీకుఁబ్రభుండెగా నతని సా - మ్రాజ్యంబు తత్సీమగా
వీఁకం దేహళిఁద్రొక్క లక్ష్మి తలుపుల్ - వే మూయ యత్నింతురే
సాకల్యంబుగ్రహించి యాంధ్రజననీ - సౌఖ్యార్థులై రండిఁకన్.152

వ. మీక్షామతలంబున క్షామదేవత ప్రత్యక్షముగ విలయకీలలనెగఁజిమ్ము. కోటిద్వయంబైన యాదాయంబు శూన్యంబు. కఱవునుండి తప్పించుకొనం దుంగభద్రం గట్టందలంప దశకోటిద్రవిణంబు వలయు. అయ్యది మీకు లభించుట శశవిషాణము. ఇఁకం బ్రత్యేకరాష్ట్ర నిర్వహణమన్న పుష్కర పుష్పము. సమానోదర్యులారా! మీ వైఖరిం గని యాంధ్రమాత వేడి నిట్టూర్పులతోఁ దలవంచి కన్నీరు విడుచుచున్నది. 153

తే. నీరు పల్లమునుం బోలె — నెమకి కొనుచు
జీవనాధార మెచ్చటఁ — జెలఁగు చుండు
నటకె పఱసేరు నది సత్య — మగుటఁ గనమె
బ్రదికిగా తక్కినవి యన్ని — పడయ వలయు. 154

ఉ. అంగిట బెల్ల మాత్మవిన — మన్న తెఱంగు నటింప నేరికే
భంగిఁ గృపల్పులించు మృదు — పద్ధతి సోదరు లిర్వు రేకమై
భంగవిహీన భావ నిర — పాయ శుభస్థితిఁ బాల్గొనం గళా
రంగమునందు సద్యశము — రాజిలు సర్వజన ప్రమోదమై. 155

మ. ఉపజాపం బురుశాపమంచెఱుఁగకీ — యుద్యోగభంగక్రియా
నిపుణుల్గొందఱు పన్ను వ్యాహతతులన్ — నిర్మూలముంజేసి స
త్కృపతోరండు సమైక్యభావరమ నెం — తేదక్కు రాష్ట్రంబిఁకం
జపసిద్ధిన్ముదమంది యభ్యుదయమున్ — సాధింత మశ్రాంతమున్.

కం. ఆవేశపడక సరగ స
మావేశముజరిపి తెలుఁగు — మాన్యుల గోష్ఠిం
గావించి దానఁ దేలిన
భావవిశేషమునుబట్టి — వర్తింపుఁ డిఁకన్. 157

తే. మర్లుమాతంగితీఁగను — మట్టినట్టి
మనుజుమాడ్కి మార్గముదప్పి — మనసులు చెడ
నింటఁ గల్లోలములు రేఁపు — టెంత ఘనత
కడఁక నైక్యత సోదరు — ల్గదలి రండు. 158

కం. మనసున్న మార్గ ముండును
మనసులుచెడఁ బనులు తాఱు — మాఱగు చుండున్

మనమెఱిఁగియెదురొ్కనకిటు
మనుపీనుఁగులట్ల బ్రదుక - మనకుం దగునే. 159

కం. ముత్తునియఁ జేయఁ జిత్తం
బెత్తెఱఁగున నొప్పు దాన - నేసౌఖ్య మగుఁ జా
బొత్తొనగూడునె సిరిదా
హత్తునె కనువారి కింత - హ్లాదంబగునే. 160

ఉ. కంటకమాడి సోదరులఁ - గంటుసృజింపఁగఁ జేయుకుట్ర మీ
కంటిన నిర్వ్యూడుం బెనఁగ - హాని జనించును దీర్ఘదృష్టిమై
నింటరమిద్ది నెట్టఁదగు - నెల్కలరాయిడి కుల్కియల్కమై
నింటికిఁ జిచ్చువెట్టుకొను-నే నరసంఘ మదంత వెఱ్ఱిదే. 161

ఉ. కాదనఁబోక యిట్టి ఘన - కార్య మొనర్పఁ గరండు రిత్తవా
గ్వాదమదేల తేలదిది - వైళమ వైరముతో శుభాస్పదం
బేదొ గ్రహించి భావి నెద - నెంచి చరించుట చాలమేలు మ
ర్యాదనతిక్రమించునెడ - రక్తి విరక్తిగ మాఱకుండునే. 162

మ. అతిలోకస్తుతిపాత్రు లాంధ్రులని లో - కానీకవాగ్వైఖరుల్
మతికాహ్లాదమెలర్ప విన్నచెవు లి - మ్మాడ్కిన్ వృథావాద సం
గతి హీనస్థితి నుండిరంచు విన న - జ్ఞానాంధకారచ్ఛటా
వృతులై వెల్గును జూడకుండిరని యెం - తేఁ జింతిలం జెల్లదే. 163

చ. స్థిరతరధైర్యసాహసను - ధీనిధు లాంధ్రవతంసు లివ్విధిం
గురుతరబాధ్యతన్ సుజన - కోటినుతింప నిజంబుచాటఁగా
నరగునబోధనందుకొని - స్వాతిగతుండగు శుక్రుఁ డేక్రియం
గురియఁగఁ జేయు వాన నటు - కూర్మిని దత్ప్రజ క్రుమ్మరింపఁగన్.

వ. ఆంధ్రమహాసభాధ్యక్షుఁ డాత్మనలరి. 165

కం. స్థిర శపథం బొనరించిన
హరికౌస్తుభమైనఁ దెచ్చి - యర్పించెడి మీ
చరితం బెవ్వరెఱుంగరు
నిరత సమైక్యతకు మేము - నిల్తు మనంగన్. 166

వ. ఉచితజ్ఞులు సంతసించిరి. అప్పటినుండి ప్రాక్పశ్చిమభేదంబులంతగాఁ బొడకట్టవన రాము లమందానందకందళితహృదయారవిందుండయ్యె. పదంపడి మూన్నాళ్ళు జరుగఁ దన్నుం గనవచ్చిన యాత్మజ్ఞానసంపన్నుండగు స్వామిసీతారాము నవలోకించి యవనతశిరస్కుండై నమస్కరించి రాష్ట్రచర్చానంతరము శ్రీరాము లోతత్త్వవేత్తా! రాజకీయతంత్రములు వినివిని వేసారితి. ఇత్తఱి మీ దర్శనభాగ్యముగల్గుట ముదావహము. మీరిటనున్న యన్నినాళ్ళు బ్రహ్మజ్ఞానామృతము నాకుఁబ్రసాదింపవేఁడెద. ప్రకృతి-పరమహంస యను విషయము చమత్కారగర్భితముగ రసరంజితముగ మీనోటవినం గుతూహలపడుచున్నాఁడనన మందస్మితవదనుండై యతం డిట్లను. విశ్వవిలాసమనిర్వచనీయము. వేదాంత శిఖరాగ్రముననిల్చి లోకమునకుఁ బ్రప్రథమమున శాంతిసందేశ మందిచ్చినది భారతదేశము. నేటికి నం దగ్రపీఠము భారతీయులదే యనుటకు రామకృష్ణపరమహంస జీవితమే నిదర్శనము. రాధాకృష్ణుని స్థానమే దృష్టాంతము. ప్రపంచమున మానవ మనస్తత్త్వము బహుముఖము. ప్రకృతి మాయామహిమాన్వితము. అయస్కాంతమినుమునువలె నది జీవిని దనవైపునకాకర్షించుకొనును. కామక్రోధాద్యంతశ్శత్రుహస్తగతుండై దైహికభోగలంపటుండై జననమరణ సంసారచక్రమునం జిక్కి పామరుఁడు పరిభ్రమించు. పైత్యరోగికిఁ బంచదారచేదైన ట్లతనికాత్మజ్ఞానము రుచింపదు. వాతప్రకోపముచే రుచిగ్రహణశక్తిం జాలవఱకుఁగోల్పోయిన జిహ్వాగ్రమువలె నతనిమనస్సు సత్యధర్మశక్తిం గ్రహింపఁజాలదు. జీవబ్రహ్మైక్య సతతసాధనసమన్విత చిత్తుండై ప్రకృతికెదురీది కడకుంబరమాత్మలీనమగువాఁడు పరమహంస. ఇర్వురమనః ప్రవర్తనములు దక్షిణోత్తరధ్రువములు. 167

శా. రాయాశం గడురాయిడిం దవిలిభ – ద్రప్రాప్తిశూన్యక్రియా
మాయానాటకరంగభూమికలు క – ర్మవ్యూహభద్రాత్ములై
పాయంజాలక పెక్కుమార్లు నటియిం – పం జూతు రజ్ఞానులై
ధ్యేయంబున్గమనించి పొందరుగదా – ధీశక్తి సంపృక్తులై. 168

సీ. పతి భోగినీకీర్తిఁ – బల్కుమన సుకవి
భాజనస్మాన వి — రాగియయ్యెఁ

దొలఁగకుంట వెస వ – ధూనికా వాక్శక్తి
భోగి విప్లవకవి – యోగి యయ్యెఁ
జూవనోపఁగ దేశి – కోపదేశము దేవు
నాస్తికుఁ డాస్తికా – ధ్యక్షుఁ డయ్యెఁ
బాప సంబంధంబుఁ – బ్రశ్నింపఁ బరమాత్మ
పరిపంథి తొలికవి – పట్ట మందె

తే. మందకాఁపొండు సతిమాట – మనసు నిలిపి
దేవిదీవనఁ గవికుల – తిలకుఁ డయ్యెఁ
బ్రకృతి పుస్తక పుటరసో – త్పన్న మహిమ
మెవరి నెపుడెట్లు మార్చునో – యెవ్వఁ డెఱుఁగు. 169

సీ. ఎద్దు నెక్కినవాని – కేస్గు నెక్కిన వాఁడు
వరదైవమని తల – వంచి మ్రొక్కెఁ
గలముఁ బట్టినవానిఁ – గత్తిఁ బట్టినవాఁడు
ప్రజ్ఞాధనుండని – ప్రణుతి సలిపె
ఘనజటాధారికి – మణిమకుటవిభూషి
పరమ ధర్మార్థియై – వందన మనె
హాలధారి పరిశీల – నాద్భుత విజ్ఞాన
శాస్త్రధాతకు నమ – స్కార మనియె

తే. స్వార్థరతుఁడైన వాఁడు ని – స్స్వార్థపరు మ
హాత్ముఁడని జోతలిడె దీని – హానికలుగ
మత్తచోదకురథమట్లు – మార్గమనక
హద్దుమీఱినఁ బాపము – బ్రద్దలగును. 170

సీ. ఆత్మలో నొకపల్కు – నాడెడి దొకపల్కు
చేతవేఱొకటైన – చెనఁటిఁ దెలిసి
నమ్మించి బురదలోఁ – గ్రుమ్మించి కులికెడి
నక్కజిత్తుల వాని – ఫక్కి నరసి
నోరు మాటాడుచో – నొసలు హేళనసేయు
కపటనాటక సూత్ర – కారు నెఱిఁగి

మోకుదిర్గని లావు – మొదలు చెట్టెక్కించి
నిచ్చెన తొలగించు – నీచుఁ జూచి

తే. యరయ నఱచేత వైకుంఠ – మమరఁ జూపి
నమయమునఁ దప్పుకొనఁ జూచు – శఠుని గాంచి
తామరాకున నీటి వి – ధమ్ముగాఁగ
నంటియంటక యుండు ప్ర – జ్ఞాన్వితుండు. 171

వ. ఈ మర్త్యమున నజ్ఞానులుగొందఱు గర్వాంధకారమున మన్ను
మిన్ను గానక. 172

సీ. పరమభక్తుని జూచి – పరిహసింతురు దంతి
వీక్షించి మొఱిగెడి – వేపు లట్లు
విద్యాధికుని మాట – వినసహింపరు కూయు
కోకిలంగని తన్ను – కాకులట్లు
బ్రహ్మవేత్తల శక్తి – పరికింపలేరు వె
ల్గుఁగన నొల్లని గ్రుడ్ల – గూబ లట్లు
ధర్మాత్ముఁ దిలకించి – తగవాడ రల రాజ
హంసలఁగని కొంగ – లఱచి నట్లు

తే శీలవంతుని చెంతకుఁ – జేరఁ బోరు
గొల్లవానిని నమ్మని – గొఱ్ఱె లట్లు
ఔర! లోకము పోకడ – యద్భుతంబు
శేషునకునైన నది విప్ప – చెప్పదరమె. 173

సీ. ప్రతిమానవుఁడు దానె – రాజుగావలెనని
గాలిలో మేడలు – గట్టుచుండుఁ
దక్కంగలారలు – తనక్రింది బంట్లుగాఁ
బనిసేయవలెనని – బ్రమలు సూపు
నంద అందలమెక్క – నది మోయువారేరి?
యెవ్విధి వశమని – నవ్వు బ్రహ్మ
బ్రహ్మతత్త్వముఁ గోరి – పయనించి కౌశిక
మార్గులై కొందఱు – మచ్చులు వడ

తే. నీవు దలుపుకొనుచు నెట్టి - చూపు చూచి
యెవరు దన్జూడ లేదని - యితరులఁ గని
లేనితప్పులు సుజనుల — కేని గూర్పఁ
దలఁతు రావలఁ దన్నుర — చ్ఛలకు సిద్ధ్వ. 174

సీ. రహినిల్పలేక మా - ర్పండె వ్యాసుఁడు మత్స్య
గంధిని యోజన - గంధి గాగఁ
బతిచింతఁ బలుకని - పడఁతి శపింపఁడే
రోసంబు మీఱ దు - ర్వాసమౌని
మంజీర రవళికి - మాని తపస్సెల్లఁ
గౌఁగిలింపఁడె కాంతఁ - గౌశికుండు
పాపమో పుణ్యమో - పరికింపకే జమ
దగ్ని చంపింపఁడే - ధర్మపత్ని

తే. అడ్డగింప శపింపరే - యాగ్రహమున
ద్వారపాలుర సనకాది - తాపసేంద్రు
లట్టివా రిట్టు గా లాఁతి - కంతరంగ
శత్రులార్వుర నోడింప - శక్య మగున. 175

వ. స్వచ్ఛైకలోహనిర్మితలోలక ముష్టాగ్రగత మాఱినప్పుడు తత్పరిమాణ పరివర్తనముచే ఘటికాయంత్రము లేకరీతిం జిక్కనడువనిభంగి మానవుఁడు సహజముగ మంచివాఁడయ్యుఁ గామక్రోధావేశములు పెరిఁగినప్పుడతనిమనస్సు సాధారణగతిం బనిసేయదు. 176

కం. గాలికిఁ గదలెడి వారల
జోలికిఁ బోరాదు మంచి — నుంత తెలియకే
మేలరయు వారి నెత్తిం
గాలిడుదురు దత్త్వదృష్టి — కడు నశియింపన్. 177

వ. సత్యశీలి, పరోపకారి, వాఙ్మి, నిర్మముఁడైనజ్ఞాని కపకారమొనర్చిన నదియూరకపోదు. అతనిహృదయవిషాదము విషానలజ్వాలలయి దహించు. అతనియాశీస్సమృతవర్షమై రక్షించు-బహిరబహిరకల్మషుఁడు వంద్యుఁడు.

సీ. అగ్నిమాంద్యముకంటె - నతిసారమే ప్రాణ
హానికరంబైన - యట్లు సాదు

పలువ కీడొనరించుఁ - బలువకంటె నొకింత
యుబ్బక పరులఁ ద - బ్బిబ్బుసేయు
శుద్ధకోష్ఠువు జిహ్వ - సురుచిత్వరం దెల్పు
నష్టకల్మష బుద్ధి - యరయుఁ బాఁడి
కలుపుగోలుతనము - తలపుల పంటని
తద్జ్ఞులంద్రది సరి - దాఁక దయ్యె

తే. నెట్లో యొనగూడె నా గద్దె - నెక్కు వాంఛ
గలఁడెగా మానవుఁడు ధర్మ - కాంక్ష గలఁడె
రంభ సంరంభమునఁ గోరి - రా నెవండు
కూడదనినెట్టు నొక్క శు - కుండు దక్క. 179

తే. ప్రకృతి వికృతిరసాప్లుతి - ప్రగతి జగతి
యుత్తమాధమ గుణయుక్తి - చిత్ర శక్తి
స్వర్గనరకాల పథము సం - సార రథము
స్వార్థనిస్స్వార్థపరమార్థ - పరులు నరులు. 180

వ. అంతర్బాహ్యవృద్ధుల జీవినిర్జీవులు పెరిఁగినచందంబున నాధ్యాత్మిక భౌతికశక్తులవలన జ్ఞానాజ్ఞాను లభ్యుదయమందుచుంద్రు. 181

తే. గాలిలో లీనమైయుండు - ధూళివోలెఁ
గపటి హృద్గతకలుషంబు - గ్రాలుచుండు
నంతరాళము జడిశుభ్ర - మగును గాని
వానియెద కల్మషము వాప - వలను పడదు. 182

సీ. ఐహికాముష్మికా - హ్లాదమ్ము లొనగూడు
ధనముచేఁ దత్త్వసా - ధనము చేత
నంతర్బహిశ్శక్తు - లద్భుతమ్ముగ వెల్గు
గతులచేఁ ద్యాగ సం - గతుల చేత
నభయ సభయ సుమి - త్రామిత్రనుతి హెచ్చు
హసనముచే నమిత సా - హసము చేత
లౌకిక సుజ్ఞాన - లక్షణ రమగల్గు
పురముచే మంచికాఁ - పురము చేతఁ

తే. ప్రజనుతింపంగసుమనోను – రాగమెచ్చు
నుక్తిచేత లలితకళా – యుక్తిచేత
నెవ్వఁడేతద్గుణంబుల – కిక్కయగునొ
యమ్మహాత్ము యుగపురుషుఁ – డం్రడు బుధులు. 183

తే. కాలయాపనసేయక – కర్షకుండు
కలుపు మొక్కలఁ దొలఁగించు – కరణి యోగి
దుర్గుణంబుల మొదలంటఁ – దుడిచి వైచు
నమలగుణధామ! పొట్టివం – శాబ్ధిసోమ. 184

వ. ఇనుమయస్కాంతముచే నాకర్షింపఁబడినరీతి సజ్జనుఁడు ధర్మముచే నాకర్షింపఁబడవలయు. సమతల దర్పణమున వస్తురూపము సహజముగఁ ప్రతిబింబించినట్లు నిర్మలహృదయమున సత్యము సక్రమముగఁ ప్రకాశించు.

సీ. అంతరాత్మ తగ స – త్యముదెన ములునూపు
దిక్సూ చ్యదీచిని – జూపు కరణి
దేహహృత్సౌందర్య – దీధితుల్ రెట్టింప
సాధకం బేకైక – శరణ మనుచు
సాధువు యోగవి – జ్ఞాన నిష్ఠామతి
దర్శించుకొనుచుండుఁ – దన్నుఁదాన
యాత్మపరీక్షార్థి – యై యహరహ ముంట
నపకృతి దెసకొక్క – యడుగిడండు

ఆ.వె. కాన పరమహంస – కాఁదలంచి యతఁడు
నీరు విడిచి పాలు – నేర్పుతోడఁ
గ్రోలు రాజహంస – లీల వర్తించుటఁ
గాంచనగును మంచి – నెంచ నగును. 186

తే. ప్రకృతిపార్వతి పురుషుఁడే – పరమశివుఁడు
వారిదైక్యత విశ్వమై – వరలఁ గలిగె
మన ఋషీశ్వరు లీమూల – మంత్ర మెఱిఁగి
యుపనిషత్సారమును బిండి – రుజ్జ్వలముగ. 187

తే. ఒకటి రెండయ్యె రెండును – నొకటి యగుట
తెలిసినప్పుడు జ్ఞానంబు – తేజరిల్లు

జ్ఞానసౌధాగ్రగామియై - జాఱకున్న
నతని జన్మమె సార్థక - మగును జగతి. 188

కం. ఈ క్షణమే మన దనుకొని
యాక్షణమే దైవ చింత - కెంతయుఁ బ్రదిప్తుఁ
మోక్షణములు వృజినములకు
మోక్షశ్రీ మనకుఁ గడకుఁ - బొసఁగుట యరుదే. 189

కం. అక్షీణ భక్తి సతతము
పక్షిగమను దివ్య పాద - పద్మములందుఁ
నిక్షిప్త మనోధనుఁడై
ప్రక్షాళన సేయు టురవు - పాపౌఘంబుఁ. 190

తే. సకల విశ్వంబునకు దేవుఁ - డొకఁడెయైన
నతనిశక్తులు బహుముఖ - మై చెలంగు
నెఱిఁగియెఱుఁగక యెవ్వరెం - దెట్లు పిలువ
నొప్పు నతనికె యద్వితీ - యుండుగాన. 191

కం. లో వెలుఁగులో విలీనత
గావలెనన మనము మృదువు - గావలెఁ గోర్కుల్.
పోవలె శమమును దమమును
రావలె నిర్మలత కలసి - రావలె సరిగా. 192

తే. ఆత్మదిక్సూచి సత్యోత్త - రాశ సూపఁ
గనక నావికుఁడైచ్ఛిక - గతి గమింప
జనన మరణాఘ సుకృతసం - సార జలధి
ముక్తి తీరంబుఁ జేరఁ దా - శక్తి గలఁడె. 193

ఆ.వె. కష్టసుఖములందు - గడియించుకొన్నట్టి
యనుభవాను భావ - మలరు నరుల
వాక్కులెల్ల వేద - ఋక్కులు నాఁజెల్లు
వాని విన్నవాఁడె - జ్ఞానియగును. 194

కం. నూఱెందుకు ధర్మము నిజ
మారయ నొకమాటలోన - నాడెదను నరుల్

తారెట్టట్టుగ నితరులఁ
గోర స్సురపురమువేఱ - కోరవలయునే. 195

తే. జనన మరణైక సంసార - సాగరమున
శుద్ధనీతి సమేతయౌ - బుద్ధి కంత
రాత్మయే కర్ణధారిగా - నమరియున్న
జీవితపు నౌక తీరమ్ము - చేరఁగలదు. 196

ఆ.వె. తనువు వేఱుతెలియఁ - దావేఱుగుట చేత
సాధువాత్మతత్త్వ - సాధనమున
లోకబంధములను - లోలోన తెగ ద్రెంచు
నల్ల చింతకాయ - గుల్లవోలె 197

తే. మానవత్వంబుగల మంచి - మానవులకె
యుపకరించును దైవత్వ - ముజ్జ్వలముగ
నజ్ఞుఁడద్దాని లాభమే - మందఁ గలఁడు
కనులు గలవానికే గదా - కాంతి వలయు. 198

తే. భౌతిక సుఖైక వాంఛలఁ - బ్రజల మనసు
వలమున కేగు జలమట్లు - పరుగులిడును
దాని నరికట్టి ముక్తిప - థానఁ జనుట
యేటి కెదురీఁత యదిసేఁత - యెంత ఘనత. 199

వ. జగద్బంధువు భువనమునకుఁ గాంతిచ్ఛాయాకరుఁడైన తెఱంగునఁ బ్రకృతింగల సుఖదుఃఖములకు యోగవియోగములకు విశ్వస్రష్టయైన భగవంతుడే సర్వాధికారి. 200

తే. అక్కరంబుల నఱసున్న - నక్కి చక్కఁ
గంటికేగాని తెలియదు - కర్ణములకు
నట్లు ప్రకృతిలోఁ బరమాత్మఁ - యావరించి
కర్ణగోచరమగుఁ గంటఁ - గానఁ బడదు. 201

ఆ వె. కాలు చేతులాడు - కాలానఁ గఠినతఁ
గాలు చేతలాడ - వీలు లేని

కర్మనిర్మలుండు - కైవల్యమున కర్హుఁ
డగును గాక - యధముఁ - డర్హుఁ డగునె. 202

తే. ఎన్ని నీతులు సెప్పిన - నెన్ని విన్నఁ
కడకుఁ దేలిన టొక్కటే - ఘన జగాన
నాశగలవాఁడు మోక్షము - నందలేఁడు
క్ష్వార్థమున నిత్తునకు సంధి - కలుగనట్లు. 203

తే. లేమి కష్టంబునకు జగ - ల్లీల లరయఁ
గలిమి సంతోషమున కొక - కారణంబు
కాన నరునకు ధనతృష్ణ - ఘనతరంబు
దాని నదుపునఁ బెట్టఁడే - జ్ఞానికాఁడు. 204

కం. ధనమే సౌఖ్యమునకు సా
ధనమా సర్వజ్ఞుఁ డేల - దాని న్వదలెఁగా
మనన్నృపులు చివరిదశలో
వనములఁ దపమాచరింప - వాంఛింపరొకో. 205

తే. లౌకికమువయిఁ గల పార - లౌకికంబు
శాశ్వత సుఖైక సాధన - సంపద యని
పరమ పురుషులు ఋషులు త - త్ప్రాప్తిఁగోరి
ఘన తపస్సునఁ గాలము - గడవు చుంద్రు. 206

ఆ.వె. ఆత్మహింసకైన - సంగీకరించును
బరుల హింస కెపుడు - పాలుపడఁడు
ధర్మ తత్త్వ మరసి - తరియింపఁ జూచును
మాయ మర్మములను - మాని జ్ఞాని. 207

ఆ.వె. తనదు చేఁత లన్ని - తానె విమర్శించు
కొన్న నిక్క మెల్ల - గోచరించు
నద్దమందు రూప - మరసిన చందమా
టపుడ యాత్మ బోధ - యందుకొనును. 208

తే. సౌమ్య సారస్వతామృతా - స్వాదనమునఁ
బుష్టినొందిన నీటోటి - పుణ్యతముఁడు

హీనమానవ దుర్బోధ - లెన్నివినినఁ
గపట నాటక మధుపాన - కాంక్షిగాఁడు. 209

తే. నవనవోన్మేష సంస్కృతి - నాటుకొనఁగ
మూఢవిశ్వాస మెడలు స - మూలముగను
నొక్కవైపునఁ గెంజిగు - రుద్భవింపఁ
బ్రాదళంబు లింకొకవైపు - రాలుచుండు. 210

కం. వర్గత్రయలోలున కప
వర్గం బెటుగూడుఁ గల్గు - స్వర్గంబైనన్
మార్గము దివిభువిగతికది
దుర్గతిఁగా దలఁచి యోగి - తొలఁగి మెలంగున్. 211

ఉ. దోమకుఁ బైరగాలివలె - దొంగకువెన్నెలభంగిఁ బుంశ్చలీ
భామకు రాజమార్గమటు - పాపికి నాకమువోలె గర్భిణీ
రామకుఁ జుక్కరీతి జవ - రాలగు వేశ్యకు సత్యవాక్క్రియన్
గామికి మోక్షమార్గమది - కంటకతుల్యముగాఁ గనంబడున్. 212

కం. ముత్తిగ కంతలతిత్తిని
నిత్తెమ్మని నమ్మి భోగ - నీరధిదాఁటం
జిత్తమ్ము లేమి ముత్తికిఁ
దొత్తగు మానిసికి ముత్తి - దొఱకదు కడకున్. 213

మ. వపురాదు ల్లఘుకంటవం బెఱుఁగ కీ - వాత్సల్యలౌల్యవ్యథా
కృపణత్వాదులఁ జిక్కి పెక్కుగతులం - గీడ్పాటులం బొందుచున్
విపులం బుట్టుచుఁ జచ్చుచుంద్రు జను లీ - విశ్వంబు మాయామహో
చపలత్వంబునఁ దోఁగియుంటఁ గనియుం - జ్ఞానక్రియాదూరులై. 214

కం. ఐహికభోగములకు దా
సోహమ్మను వారె గాని - యరయఁగ జగతిం
గోహమ్మను ప్రశ్నమ్మును
సోహమ్మను తెల్విగల్గు - నా యెల్లరకున్. 215

వ. గీర్వాణము వివిధభాషాసరస్వతుల నంతర్వాణిగఁ బ్రవహించునట్లు పరమాత్మ సర్వాంతర్యామియైయుండు. ప్రయోగసాధనలేనిచో జ్ఞానము

గాలింబెట్టిన కర్పూరమువలె నశించు. నిత్యనిష్ఠ సత్క్రియాసాధనమునకు
మూలధనము. శుభశ్రేణి కదినిశ్రేణి. 216

తే. మూఢవిశ్వాసవృక్షమ్ము - మొదలు నఱికి
యాత్మవత్సర్వభూతాని - యంచుఁ బలికి
యాత్మపరమాత్మయందు - నైక్యంబు సేసి
యాశవిడిచిన వాఁడెపో - యచల యోగి. 217

తే. కొద్ది సామగ్రి పథికున - కుణ్ణ సుఖంబు
గల్గఁజేసెడి కరణి లో - కంబునందుఁ
దక్కువగఁ గోర్కులున్నచోఁ - దన్నరులకు
జీవయాత్ర హాయిగ సదా - చెలఁగు చుండు. 218

కం. ఏఁజెల్ల పుణ్యపాపము
లోజం జరియించు నొరసి - యొండొండ గనం
దేజస్తిమిరన్యాయం
బీజగతీసృష్టి నరయ - నేరికిఁ దరమౌ. 219

వ. సామాన్యదృష్టికి గోచరింపని పదార్థము సూక్ష్మదర్శినీద్వారమ్మునఁ
జూడఁగలిగినట్లు చర్మచక్షువుతోఁగనఁజాలని సచ్చిదానందపరబ్రహ్మమును
యోగశక్తింగనంగలిగినరీతి నిరక్షరాస్యుఁడగు పామరుఁడెఱుఁగలేని
ప్రకృతిరహస్యనిశితాంశముల విజ్ఞానవేత్త యాత్మజ్ఞాననేత్రమ్మునఁ జూడ
నోపు. తార్యత్రికానందము సులువుగసమకూడునట్లాత్మజ్ఞానానందరసా
స్వాదనము సామన్యమానవులకు లభ్యపడదు. 220

చ. స్థపుటితభూప్రచారముల - శాద్వలసీమల నొక్కరీతిగా
రిపుహితసింహగోగణ ప - రీతరసాదుల నొక్కరీతిగా
నిపుణత హృత్సరోజమును - నిల్పినవాఁడె నిరంకుశుండుగా
జపతపదానధర్మసుర - శైలశిరంబున కెక్కివెల్గురా. 221

ఆ.వె. బుడ్డమూతి వెట్టి - బిడ్డ కన్నీరింత
కార్చినంత నక్కుఁ - జేర్చు తల్లి
వోలె దేవుఁడొకఁడు - పాలించు మనలను
గాన వాని నమ్మఁ - గలుగు ఫలము. 222

ఉ. కాశనిభాభివృద్ధి యెటు - గాంచు నివేశము తృప్తి దీఱఁగాఁ
బ్రాశనమెట్టులబ్బు గుణ - వంతుఁడు మెచ్చని ద్రోహికెంతయుఙ్
రాశిగఁజేసికొన్న యది - రాధవుఁ దుర్మము చెంతనుండఁ గాఁ
గాశికిఁబోయినం ఫలము - గల్గునె కీడు తొలంగిపోవునే. 223

మ. జనమధ్యంబుననుండి లేచిన జలో - ష్మంబాకసంబంటినఙ్
మననేత్రంబులఁ జూడఁజాలనటు క - ర్మప్రోద్భవంబైన పు
ణ్యనికాయంబును బాపజాలమును గా - నంజాల మట్లయ్యుఁ ద
ద్ఘనశక్తిం బడు పిడ్గులం జడుల నాఁ - గంజాలునే లోకముల్.224

వ కప్పు సరిగాలేని యింట వసించుగేస్తుంబలె స్వత్వవర్తలేని దేహి యందున్న జీవుఁడు సారెసారెకు దుఃఖానుభవించు. మాయాంధకారము సాంద్రముగాఁ గ్రమ్మినప్పుడు మంచిమాటలు తలకెక్కవు. తిర్యక్కుల కంటె విజ్ఞానమెక్కుడిచ్చినను మానవుఁడు వానికంటె మానసికముగ సుఖపడుచున్నట్టుగానము. 225

తే. పండువెన్నెల కన్నుల - పండువైనఁ
జిమ్మచీఁకటి బాధాక - రమ్మె యగును
జ్ఞానమాత్మకు సంతోష - జనకమైన
జ్ఞానశూన్యత హృదికి వి - చారకరము. 226

ఆ.వె. ఇసుక రేణు వంత - దొసఁగుఁ జేసిన యంత
పరమ భక్తుఁడెంతొ - పడును జింత
చెప్పరాని తప్పు - చేసియు మూర్ఖుఁడు
చింతపడఁ డొకింత - సిగ్గుపడఁడు. 227

తే. భోగలంపటునకు ముక్తి - పొసఁగ దెపుడు
విలుపట్టిన వారెల్ల - వేఁటకాండ్రె
యాత్మబోధామృతమ్మును - నచలయోగి
నూటికొక్కఁడొ పరికింపఁ - గోటి కొకఁడొ. 228

వ. నిర్వాణగామి కష్టసిద్ధులతో నక్కఱలేన ట్లభిజిల్లగ్నమునకు నవ గ్రహవీక్షణములతోఁ బనిలేనితెఱంగున నాధ్యాత్మికజ్ఞానపరిపూర్ణునకు లౌకికజిజ్ఞాసతో నావశ్యకముశూన్యమైనవిధాన మానవసేవయే మాధవ

సేవయనిభావించి లోకోపకారముసేయు మహాత్ములకధికారముతో నవసరముండదు. 229

తే. కింసఖుల పల్కులను నాల - కింపఁ దగదు
సుజన పూజనమున మహా - సుకృత మొదవు
మునులు మనసారఁగోరెడి - మోక్షసిద్ధి
కరము సుకరము నిష్కామ - కర్మఠునకు. 230

తే. ప్రకృతి వైరుధ్య ధర్మచ - ర్యల నసాధ్య
సాధ్య నైసర్గికము మాఱఁ - జాలదెప్పు
డినుపరథ మాకసంబున - కెగురఁ గలదె
వాయుయానంబు భువివేగఁ - బాఱఁ గలదె. 231

తే. ఉన్నతస్థాన పతన ప్ర - యోగ మరయ
నలఘులఘువస్తులు సమాన - మట్లు భ్రంశ
మచ్చు నీచ మనస్స్థితి - యొక్కరీతి
కౌశిక కిరాత జీవిత - గతులు గరులు. 232

వ. సచ్ఛీలరత్నరథమధిరోహించి లలితకళాధవళసైంధవములఁబూన్చి విజ్ఞానప్రజ్ఞాసారథినుపయోగించుకొన్నచో నరుఁడు దివ్యభోగమను గమ్యస్థానముఁజేరఁగలుగు. పరమాత్మ తేజఃపుంజమును దర్శించిన ధన్యున కన్యములు గుణగణ్యములుగావు. చర్మచక్షువున కగోచరమగు విషయముల జ్ఞానచక్షువుచే నతఁడుగ్రహించు- 233

తే. పరమపద వైభవము దేనఁ - బ్రాప్తమగునొ
దాని యారాధనమునందె - తగులు జ్ఞాని
సర్వకాలములందల - చాతకంబు
వర్షబిందువునకె పాటు - పడుట వినమె. 234

ఉ. క్రూరతరైకకృత్యముల - కుం దలయొగ్గక సారహీనసం
సారసరోవరస్థ నవ - సారసపత్రముభంగి నంటియుం
ధీరతనంటఁబోక కడు - నేర్పున వర్తిలు సత్యయోగి తాఁ
గోరును జిద్విలాసము చ - కోరము వెన్నెలఁగోరుకైవడిన్. 235



సర్ పిట్టీ త్యాగరాయ సెట్టి

తే॥ న్యాయపక్షవిధాత త - న్న్యాయపక్ష
నేత శత్రువిజేత వి - ఖ్యాతదాత
పట్టువిడువక పనిసల్పు - దిట్ట రాజ
కీయమున సెట్టి సర్ త్యాగ - రాయసెట్టి.

వ. నిర్మలోదకస్నానమున దేహమును బరిశుభ్రముచేసికొన్నట్లాత్మ జ్ఞానమున హృదయమునకల్మషముగఁజేసికొనుటంజేసి నిర్వాతస్థలదీపికా కళికవలె నతనిమనంబువెలుంగు. దివ్యజ్ఞానానందము శాశ్వతము. భౌతికానందము క్షణికము. జీవబ్రహ్మైక్యసాధనమే యోగము. యోగసిద్ధి పొందినవాఁడే మోక్షార్హుఁడు. 236

తే. అంచు బోధించి దీవించి - యభినుతించి
స్వామిచనువేళ రాములు - సవినయముగ
మహిత గౌరవ దృక్కుల - మంచిదంచు
మస్త కన్యస్త హస్తుఁడై - మాఱుపలికె. 237

వ. అట్లుచని స్వామిప్రతికాముఖంబున రాములదీక్షాదక్షతం బ్రశంసించి రాష్ట్రనిర్మాణవిషయమున నిజమనోభీష్టంబుం బ్రకటించి కేంద్రప్రభుత్వమునకుఁ బ్రత్యేకవిజ్ఞప్తినంపె. అంతం దొమ్మిదవదినంబునం దనకుఁజిరపరిచితుండు మాతృభాషాకోవిదుండు గాంధేయమార్గగామి దేశభక్తుండునగు నొకస్థానికాంధ్రసోదరుఁడుతనయనన్యసామాన్యమహాత్యాగదీక్షకాశ్చర్యచకితుఁడై తన్నుదర్శింపనేతెంచి నికటోపవిష్టుండుకాఁగా మందస్మితముతో సాదరముగనతని నవలోకించి రాములిట్లను. విద్వద్వరేణ్యా! మీరు జ్ఞానవృద్ధులరు. సత్యవాగ్భూషణులు. మీనోట నీనగరరాజమును బహువర్షమ్ము లద్వితీయకీర్తితోఁ బాలించిన త్యాగరాయసెట్టి జీవితచరిత్రాంశములను వినవలతు. అతఁడాంధ్రమాతృగర్భశుక్తిముక్తాఫలమగుట నాకీకోర్కెగలిగె నన నీవు నన్నడిగిన తెలుంగునం దక్షిణవితవిశేషంబులం దెలిసికొనంగోరి నేనుం బెక్కురఁబ్రశ్నించితి. ఆవుమరణించినపిదప దానిపాలు బయటఁబడిన ట్లాతండు స్వర్గస్థుండైనయనంతర మాధీశాలి సద్గుణంబులు స్థానికాంధ్రసోదరులుపల్వురుసెప్ప విన్నతెలుంగు నీకు న్వినిచెద నాకర్ణింపుము. అమ్మేధావియొకపక్షమునకు నాయకరత్నమగుట నతనిజీవితవిశేషములెట్లు బహిర్గతముకాకుండు. పర్వతముపైనున్న మహాపట్టణమును దాచిపెట్టనెవరితరము. 238

# పి ట్టి త్యా గ రా య సె ట్టి

తే. న్యాయ పక్ష విధాత త - న్న్యాయపక్ష
నేత శత్రు విజేత ప్ర - ఖ్యాత దాత

పట్టు విడువక పనిసల్పు - దిట్ట రాజ
కీయమున జెట్టి సర్ త్యాగ - రాయసెట్టి 239

కం. పేదలయెడ దయ చూపును
లేదనక డర్థింప ధర్మ - లీలారతుఁడై
కాదనఁడు సత్యవాద
మ్మాదినముల నతని మాట - కడ్డము గలదే. 240

కం. అడుగుసఁబడి కృశియించెడి
బడుగులకుం దారిఁజూపఁ - బహువిధములుగా
నొడయనికిఁ దెలిపి సాయం
బడుగడుగునఁ జేసినట్టి - యనఘుం డతఁడే. 241

ఉ. చక్కనివాఁడు సర్వగుణ - సంపదలుంగలవాఁడు దీనులఁ
మక్కువఁజూచువాఁడు జన - మాన్యవదాన్యగుణుండు సద్యశో
భాక్కు విశాలదృక్కు కడుఁ - బ్రాభవవైభవశాలి శూలినిం
జక్కఁగఁ గొల్చువాఁ డతని - సద్గుణ వర్ణన శక్యమౌనొకో. 242

తే. వినయ నయములతో నిత్య - విమల బుద్ధి
రాజకీయంబుతో ధర్మ - రమ్య మార్గ
మరయ నిస్స్వార్థదృష్టిఁ బ - రార్థ చింత
భూషణములుగ వానికిఁ - బొలుచు నండ్రు. 243

తే. ఎఱిఁగి తత్సేవ దొరలుబ్బి - యీయ రావు
బహదరు దివాన్ బహద్దరు - వరున సరగ
సర్ బిరుదులొందెఁ బ్రఖ్యాత - శాంతమూర్తి
యద్వితీయ యశస్వి మ - హామనస్వి. 244

తే. చిత్తశుద్ధిఁ బ్రజాసేవ - సేయు కతనఁ
గోరి పురికెన్నొ సౌఖ్యముల్ - గూర్చు కతన
నపుడు ప్రతిపక్ష నాయకు - లైన నతని
గౌరవించిరి సద్గుణ - గణము లుంట. 245

వ. అతండయ్యప్పసెట్టికాత్మజుఁడు. ఉత్తరమద్రపురియాయనజన్మభూమి. వణిఙ్మణి. న్యాయపక్షాంతరిక్షద్యుమణి. రాజకీయవీరశిరోమణి. 246

కం. గత్యంతరంబు లేమిం
బ్రత్యర్థియె వచ్చి తన్నుఁ - బ్రార్థించిన సం
స్తుత్యుండాతఁడు సాయం
బత్యంత ముదానఁ జేసె - ననిరిట సుజనుల్. 247

కం. చీమను ద్రొక్కినఁ జింతిలు
కోమల హృదయుండు మేటి - కోవిదకోటిన్
క్షేమమరసి మన్నించెడి
ధీమంతుఁ డమోఘకృత్య - ధీరుం డతఁడే. 248

తే. ఆంగ్లపరిపాలనమున వా - రమిత మైత్రిఁ
దనదు సలహాల కెంతయు - స్థాన మిడుట
నమ్మహాధర్మమతి మకు - టమ్ము లేని
రాజన వెలింగెఁ బురిఁ ద్యాగ - రాయసెట్టి. 249

కం. అజానుబాహుఁ డనఘుం
డోజోగుణశాలి బుధను - తోజ్జ్వలకీర్తి
భ్రాజి కళారాధనవి
భ్రాజి యనుచుఁ గొంద ఱిందుఁ - బల్కఁగ వింటిన్. 250

తే. కూలివారల పూరిండ్లు - కాలినంత
నన్నవస్త్రములిచ్చి పె - ల్లాదరించి
తిరిగి గీములఁ గట్టించి - దిశల యశము
పొందెనని చెప్పుకొనె మద్ర - పురి జనంబు. 251

వ. దీనింబట్టి నితఁడు పేదలకష్టనిష్ఠురములాలించి మేలెంచి లాలించిపాలించిన కమలకోమలహృదయుఁడని లోకము గ్రహించియుండు. 252

తే. దానకర్ణుడు వినయ వి - ద్యా వివేకి
దీన రక్షణ దక్షుఁడు - ధీర వరుఁడు
స్నేహపాత్రుఁడు నయవేత్త - శ్రీగలాఁడు
న్యాయగతిదిట్ట యలత్యాగ - రాయసెట్టి. 253

వ. ఇట్టిగుణగణంబుల నలరుటచే నానేత యాంధ్రమాతృపుత్రరత్నంబనఁ దగిన వాఁడే యన రాములది నిక్కంబనె. వీతద్గుణాలంకృతుఁడై పుర

పాలకసంఘాధ్యక్షుఁడుగ నెన్నుకొనంబడి పెక్కేండ్లు ప్రజాసేవచేయుటంజేసి యిమ్మహానగరపాలక సంఘకార్యాలయముఖద్వారనికటంబునన య్యుదార స్వభావుని రమణీయ పంచలోహ విగ్రహప్రతిష్ఠజరిగె. అది యాధీశాలి విశిష్టయశస్సునకు శాశ్వతచిహ్నమన రాములుచిఱునవ్వులతేనెచిందయథార్థ మనె. అంత నవ్విద్వద్రత్నము మఱియు నిట్లుసెప్పందొడంగె. 254

తే. అతని పేరఁ గళాశాల - యలరె నూత్న
నగర మొక్కటి వెలసె గ - ణ్యత సెలంగ
నుత్తమోత్తమ నేతకు - నుండఁ దగిన
గుణము లతనికిఁ గలవను - కొంద్రు ప్రజలు. 255

తే. ఉభయసంధ్యలఁ బరమేశు - నభవుఁ గొల్చు
నతిథిసత్కారమన్నఁ బ్రి - యంబు నూవు
ఘనుల విద్వత్కవీంద్రుల - గారవించు
న్యాయధృతి జెట్టి శ్రీత్యాగ - రాయసెట్టి. 256

వ. ఆంగ్లభాషాపట్టభద్రుఁడు రాజకీయధురంధరుఁడు న్యాయపక్షమూల పురుషుఁడు నాయకశిరోమణి యగు సర్. పి. త్యాగరాయసెట్టి యాంప్రథ మముగఁ గ్రీస్తుశకమిర్వదవశతాబ్ద్యాదినుండి చేనేతవృత్తింబునరుద్ధరింపం బూనుకొన్న పుణ్యపురుషుఁడు. సేలమున వేటపాలెమున (బాపట్లతాలూకా లోనిది) ఫ్లైషటిల్ మఱిమగ్గముల నెలకొల్పి తానావాణీయంత్రముల కర్మా గారమొండుతండియార్పేటలో స్థాపించియెల్లరకునేర్పించిన కార్యశూరుఁడు. -ఈనాయకాగ్రణి కతిథిగనుండి గాంధీజీ తత్కర్మాగారమునఁ జేనేతనభ్య సించెననుటయే తద్ఘనతను వేనోళ్ళఁజాటుచున్నది. మజ్జినులకు నుపయో గించిన నూలు వడుకునూలని యానిశితవిమర్శకుఁడే నిరూపించెనట యన విని రాములిట్లనె. ఓవిబుధాగ్రణీ యిప్పుడునా కొక్కసంశయమ్మొజనించె. తెల్పెదవినుండు. ఇట్టి సుగుణఖని యఖిలభారతజాతీయమహాసభకుఁ బ్రత్యర్థిగ నేలనిలిచె? మహాత్మునకు నితనికి నేవిషయంబుల నభిప్రాయ భేదంబులుగలిగె వినవేఁడుదునన నతండిట్లను- 257

తే. అమలగుణధుర్య యాంధ్రవి - ద్యాగ్రగణ్య
యడుగవలసిన ప్రశ్న మీ - వడిగితయ్య
భేద మత్యల్ప మైనను - వాదమునకుఁ
బెద్దదిగఁజేసి చూపుట - పృథ్విఁ గలదు. 258

వ. "హూణభాష ప్రపంచభాషగఁ బరిణమించుటంజేసి దానిని మనము విసర్జించుటవివేకము. బహుభాషాభరితమైన భారతదేశసమైక్యత కవ్వాణి యెంతయేనుపకరించెననుట సత్యదూరముకాదు. పరిపాలనాపద్ధతులు క్రమశిక్షణ మనకు సమగ్రముగనలవడువఱకు హూణులీవిషయపాలకులు గనుంట యెంతయు శుభదాయకము. జనసామాన్యమున బొత్తిగవిద్య లేదు. విద్యాజ్ఞానముగలిగి మనలమనము పరిపాలించుకొనఁగలమను విశ్వాసము దానికిందగిన ప్రవర్తన ప్రజలలో సంపూర్ణముగఁ గనఁబడు వఱకుఁ ద్వరపడరాదని యన్యోన్యసహకారమవసర"మని యమ్మహా పురుషుని ముఖ్యాశయము- పతితజనోద్ధరణ యస్పృశ్యతానివారణ నిరక్షరాస్యతానిర్మూలనాహింసామద్యపానని షేధాదుల మహాత్మునితో నతఁడు సంపూర్ణముగనేకీభవించు-ఆంగ్లేయులు త్యాగరాయసెట్టిని పరోపకారిగ విశ్వాసపాత్రుఁడుగ నాత్మమిత్రాగ్రణిగ భావించి గౌరవించి మాటపాటించి సక్రమపరిపాలనాది సమర్థతలగమనించి. 259

చ. ఒకపరి మంత్రివర్యుఁడుగ – నుండుమన న్మను న్యాయపక్షనా
యకుఁడగు త్యాగరాయఁ డది – యక్కఱలేదనె తెల్లవారితోఁ
బ్రకటిత నేతృనేతగ స్వ – రాజ్యముదెచ్చిన గాంధి పెత్తనం
బొకటియుఁ గైకొనం డిపుడ–హో! ఘనలక్షణమన్న నిట్టిదా. 260

వ. ఇత్తెఱంగున నుదాత్తాశయుండు నన్వర్థకాభిధానుండునై యలరారుచు–

కం. అతఁడు త్యాగైక యశో
పాత్రుఁడు వలదనుచుఁ బదవిఁ – బ్రజకు బ్రభుత కుఙా
నీతి నడల్పక నతతము
చేతోముద మొదవ సేవ – చేసెద ననియెఙా. 262

వ. కాని యొక్కొక్కప్పుడు కొందఱు సజ్జనులనుగూడ దూషించుచుంద్రు.

తే. వసుధ గాంధిని దెగడెడి – వారు గలరు
కాని దాన మహాత్ముఁడు – గాఁడె యుతఁడు
విషధిజునకెట్లు సద్గుణ – వితతి గలుగు
నంచు విరహిణు లాడరే – యబ్జు నైన. 264

వ. కావలయునని గాలించినచోఁ బ్రతిమానవునిలో మచ్చగాన్పించు. చంద్రునిలోలేదా? అంతమాత్రమున సుధాకరుఁడు నల్లనివాఁడా? 265

చ. పరువుప్రతిష్ఠలేని యొక - పామరుఁ డేదొవచింప లెక్కయా
గురుతర బాహ్యతం దెలిసి - కోవిదుఁ డాడిన పల్కువింట స
త్పురుషుల ధర్మమౌ ఋషుల - వాక్కులు మూర్ఖులవాక్కు లేకమా
నరసులు చెప్పకోఁ దగిన - జన్మమె జన్మము మర్త్యకోటిలో. 266

తే. కీలగా నొక్కవనికేని - లేవలేని
చవట మీసాలు ద్రిప్ప మె - చ్చంగఁ గలరె
కార్యశూరుండు విజయ వి - క్రమ ధనుండు
సాహసాంకుఁడు వ్యర్థవా - చాలుఁ డగునె. 267

ఉ. వంచనమాని మంచినెద - వర్థిలఁజేయుట యుత్తమంబు రా
ణించునతండు లోకమున - నీతినిధు ల్బుధులొప్పుకొంద్రు సా
ధించు నిహంబునుం బరము - దేవుఁడు మెచ్చును ధీరశాంతుడై
మించి యశోరమన్వడయు - మిత్ర నగంబుల మేరువట్లుగన్. 268

ఉ. అంధునిచేతి దివ్వియటు - లౌను వివేకములేనివిద్య కా
మాంధునకాత్మతత్త్వ మహి - మాతిశయంబది యర్థమౌనె దు
ర్గంధము ప్రాకురీతిని సు - గంధము వ్యాప్తముగాదు వేగఁ బు
ష్పంధయచంచలాత్ముల క - చంచల కీటపాలెమబ్బదెన్నఁడున్. 269

వ. అన్నిటికంటె సులువైనది యితరులదోషాలెన్నుట అన్నిటికంటెఁ గష్టమైనది తనతప్పుదాఁదెలిసికొనుట. ఇది యాతం డెఱిఁగిచరించునట. అధికారికభోగవిసర్జనము సామాన్యవిషయముగాదు. అదియ యతని ఘనతకు నికషోపలము-అతనికీర్తికాంతకు నిల్వుటద్దము. మఱియు మద్రపురికి యువరాజేతెంచినతఱి సంస్థానాధీశప్రభృతు లతనిందర్శింపఁ ద్యాగరాయసెట్టి యాతనికడకరుగకుంటంగని న్యాయపక్షనాయకుండవైయుండి నీవుమాత్రమురానికారణమేమని యువరాజుప్రశ్నింప నిన్నుంగనుగొనవలయునని వాంఛయున్నను నీయొద్దకేతెంచుటకు లాంఛనముగఁ బ్రత్యేకమైనదుస్తులుధరింపవలయుంగాన నయ్యది మన్మనోభావమునకుసరిపడక నిను వీక్షింపవీలుకాదయ్యె నన జార్జిచక్రవర్తికుమారుఁడు మీయిష్ట ప్రకారమురావచ్చునని వర్తమానమంపం జని యాతని విలోకించి దేశస్థితిగతులఁజర్చించిన స్థిరసంకల్పుఁడు-దక్షిణభారతనాయకాగ్రణిగఁ బ్రఖ్యాతి నందిన యాంధ్రజనయిత్రీ పుత్రరత్నము- 270

తే. పదవి వలదనువాఁడెపో – పరమ ఘనుఁడు
భావనాత్మక నిర్వృతిఁ – బడయఁ గలఁడు
అదిగదా దివ్యశక్తి మ – హామహులకు
రమ్యగుణధామ పొట్టి శ్రీ – రామ నామ. 271

ఉ. నేరక శత్రుపక్షమని – నేరములూరక మోపవచ్చునే
తీరునె దానఁ గక్ష యది – దేవుఁడు మెచ్చునె కీర్తి దెచ్చునే
కైరవిణీసహాయు జన – కంటకుఁ డంట సహింపవచ్చునే
గౌరవ మిచ్చిపుచ్చుకొను – కాంక్ష సుహృజ్జనులందు వెల్గెడిఁజా. 272

వ. త్యాగరాయసెట్టి గాంధీజీవలె నహింసావాదియనుట కొకచరిత్రాత్మకమైన యుదాహరణము దెల్పెదవినుము. ఆసదయహృదయు సదనమునఁ గళ్యాణమహోత్సవముజరుగుచుండ నూత్నవధూవరులు కంకణవిసర్జనచేయువఱ కిప్పటిభేదనంబున నెటనేఁగురర్యజాదులహింసజరుగకుండఁ బ్రభుత్వపుటాజ్ఞలఁబ్రసరింపఁజేసి కట్టుదిట్టముగ జీవహింసనాఁపించిన కరుణార్ద్రచిత్తుఁడు. అంతియకాక యావివాహసమయంబునఁదనసొంతవ్యయంబుతో నూఱుపెండ్లిండ్లుచేసి పేదకుటుంబములసంతోషపెట్టినవదాన్యశిరోమణి. అదినమంతయు నవిచ్ఛిన్నముగఁ బేదలకన్నదానముచేయించిన పరిపూర్ణదయానిధి. భూతదయాళురగు పుణ్యాత్ములకే యిట్టి సద్బుద్ధిపుట్టును. ఇంతియకాదు. అతండు విద్వత్కవీంద్రులహరికథాప్రవీణుల నటకాగ్రణుల గాయకరత్నములననవరతమాదరించినధీశాలియనరాములువిని– 273

అ.వె. ఎట్టి భావ మైన – నింపు సొంపులు గుల్క
మృదుల ఫణితిఁ బల్క – మీక చెల్లు
నడుగు చుందు నేన – యనుమానముల నెల్ల
విప్పి చెప్పఁ దగును – విబుధవర్య! 274

వ. త్రిదశవర్షంబు లొకయాంధ్రనాయకాగ్రణి యవిచ్ఛిన్నముగఁ బరిపాలించినమాట సత్యమగుట నీనగర మాంధ్రులదేయనుట కిది మఱియొక ప్రబలోదాహరణమని నాయంతరాత్మ తెలుపుచున్నది. నిన్నమొన్నటిదాక నిప్పురవరసర్వాభ్యుదయమునకై యశేషకృషినల్పిన మహామాన్యుఁడొక యాంధ్రనేతృరత్నంబని తచ్చరిత్ర చెప్పుచుండ మన్మనం బత్యానందభరితంబగుచున్నది. ఇంక నతని గుణగణంబులఁగూర్చి వినవలతునన

నతండిట్లును — మల్లెపూవువంటితెల్లనిధోవతి కేతకీకుసుమదళమువంటి చొక్కాయ నందివర్ధనపుష్పమువంటితలపాగ మంచుపొరవంటి సన్నని యుత్తరీయము ధరించి యాంధ్రత్వముట్టిపడుచుండ రాచఠీవితో నలరెడి వాఁడు. అతనిదుస్తులే తన్నిర్మలహృదయమునకుఁ బ్రత్యక్షసాక్ష్యములని కొందఱంద్రడు. చేనేతవస్త్రములుదప్ప నితరాంబరములు ధరింపనివాఁడు. దక్షిణభారతమునంగల స్వదేశరాజులందఱతనికిసహచరులుగ వర్తించుచుం గనుసన్నమెలంగెడివారు. తత్పక్షమున కానాయకునివాక్కే వేదబుక్కు. అతఁడాశ్రితులనాదరించిన యశస్వి. మహాసదస్సుల వేదికనెక్కెనేని మృదుమధురవాగ్ఝరింబ్రవహింపఁజేసి సభికులముగ్ధులంజేయఁగల చతురవచోవిలాసి. 275

చ. ఎవఁడుదయార్ద్రచిత్తుఁడయి - యీజగతింగల జీవకోటికిం
బ్రవిమలలీల సేవనలు - పంగలఁడో యతఁడీశుప్రేమకుం
దివిజనుతైకకీర్తి కతి - దివ్యతరంబుగఁ బాత్రుఁడైనదా
నవశుభశోభల న్వెలయ - నమ్రతఁ జూపును ముజ్జగంబులుꣳ. 276

వ. జాబిల్లికంటెం జల్లనిది సుధకంటె మధురమైనది నీలశరదాకాశమునకంటె నిర్మలమైనది వెన్నకన్నమృదువైనది దయ. దయాసత్యముల నెవఁడుతనహృదయఫలకమునలిఖించుకొని వర్తించునో వానింజూచి దేవుఁడును జనులును సత్పురుషుఁడని సంతోషింతురు— 277

ఆ.వె. పండు నొలిచి నట్లు - పదివేలు పలికిన
ఫలముఁ జూపలేని - పలుకు లేల
యెండ నున్న వాని - నెవ్వాఁడు నీడకుఁ
జేరఁదీయు నతఁడె - ధీర వరుఁడు. 278

వ. ఆదినములలో గాంధీజీకిఁ బ్రతిపక్షనాయకుఁడుగ నిల్వఁదగినవాఁడొక్క త్యాగరాయశ్రేష్ఠియే. అతఁడు జీవించియున్నంతవఱకు లండనునుండి మద్రాసురేవున నౌకదిగినప్రతిగవర్నరునకుఁ బ్రథమకరచాలనోత్సవము గలిగించిన భారతీయుఁడతఁడే. తిరిగి యారాష్ట్రపాలకుఁడు స్వదేశమునకుఁ బోవునప్పు డాతని చివఱికరచాలనకుంబాత్రుఁడైన యాంధ్రనాయకశిరోమణి యతండే. అమ్మహాధీశాలి మహావక్త. అయినను హితమితభాషి. చారిత్రికసత్యాన్వేషి. ఆశ్రితపక్షపాతి. నిత్యతోషి. సజ్జనహితైషి. మిత్రాభ్యు

దయాభిలాషి. విజయవిలాసి. సమరసగుణభాసి. ఇట్టివాఁడుదేశస్వాతంత్ర్య విషయమున మహాత్మునితో నేలయేకీభవింపలేదనిగదా నీప్రశ్న. సంపూర్ణ స్వరాజ్యముకాంక్షించుట కెక్కువకాలవ్యవధికోరుచు హూణసహకారాతి శయమున సర్వతోముఖాభివృద్ధిం గొంతవఱకుసాధించినయనంతరము మనసరాజ్యమును మనము సక్రమముగఁ బరిపాలించుకొనఁగలము. దానికిందగినపరిపక్వదశ దేశమునకింకనురాలేదు. విద్యాజ్ఞానముశూన్య మగుటచే నెన్నికలమహత్తరమైనశక్తి సామాన్యప్రజలకింకనుతెలియలేదు. స్థానికస్వపరిపాలనాసామర్థ్యము గ్రామసీమలకింకం జక్కఁగ నేర్పడలేదు. కావున మనమింకంగొంతకాలమువేచియుంట మంచిదని త్యాగరాయని యభిప్రాయము. ఈయభిప్రాయభేద మఖిలభారత జాతీయ మహాసభా నాయకులలోఁగూడజనించి మితవాదులని యతివాదులని పక్షద్వయ మేర్పడుట సర్వజనవిదితము. మితవాదులు త్యాగరాయనియభిమతమున కించుకసన్నిహితులు. ఎత్తెఱంగుననైనందత్క్షణమ సంపూర్ణస్వరాజ్యము సాధించితీరవలెనని తీవ్రవాదులగు నతివాదులయాకాంక్ష. కుందేలునడక పందెపుగుఱ్ఱపువేగమునకుఁ దులయగునాయనివాదన. గాంధీజీకిఁ ద్యాగ రాయనికిసదవగాహనసామరస్యసమాలోచనసమముగనున్నను స్వరాజ్య కాలనిర్ణయవిషయమునఁ గించిద్భేదముదయించుటంజేసి యేకోన్ముఖనిశ్చ యమునకు రాఁజాలరైరి. అంతియకాని యానాయకరత్నములకిర్వురకు వ్యక్తిగతవైరుధ్యం బిసుమంతయులేదు. కావుననే కృష్ణుఁడు విదురుని యింటికతిథిగావెళ్ళినటు గాంధీజీ త్యాగరాయనిగృహమున నతిథిగానుండి చేనేతవిద్యనభ్యసించె. సూర్యచంద్రులవలె వీరిర్వురు దేశమునకుఁ గాంతి కిరణములఁ బ్రసరింపజేసినవారేకాని యంధకారావృతము కావించినవారు కారు. న్యాయపక్షనాయకుని జీవితవిశేషాంశములు నాకన్నతెఱంగు నావిన్నవిధంబు వివరించితినన రాములు సంతసించి కృతజ్ఞతందెలుప నతండు. 279

ఉ. కావలెనంచు నిట్టిఘన - కార్యమొనర్చెడి త్యాగశీలుఁడా
నీవలె నెందఱుంద్రు నవ - నీతమనస్కు లుదారశేఖరా
పావనమైన నీహృదయ - పద్మమునం జయలక్ష్మినిల్చె న
ద్భావమె నీకుశక్తి యిది - పాయనికీర్తికి నాలవాలమౌ. 280

ఆ.వె. విబుధ లోక మందు - వెల్ల టేనుఁగుమీఁద
శచిని బతిని జేర్చి - చాల కుంటఁ
బవినొసంగి యమృత - భాండంబు నిచ్చిన
భళిర! నీదు యశమె - భార మయ్యె. 281

ఆ.వె. మేరు శిఖర మెక్కి - తారాపథము ద్రొక్కి
స్వర్గసీమ మెట్టి - శశిని జుట్టి
సత్యలోకమునకు - సాగి జగంబుల
నీదు కీర్తి కాంత - నెగడుచుండె. 282

వ అని సెలవు తీసికొని యతండు యథేచ్ఛం జనియె. 283

# ఢిల్లీ నగర వర్ణన

తే. అంతఁ బదియవ దినమున - సాదరమునఁ
దన్నిరాహారదీక్షావి - ధాన మరసి
యాంధ్రనేత లాతనిజయ - మభిలషించి
విశ్వనాథుని మనసార - వేఁడుకొనిరి. 284

వ. ఇటునిట్లుండనట నార్యావర్తంబున నిలాబుధతనూజుండగు పురూరవుండు శౌర్యస్థైర్యధైర్యసాహసాది క్షాత్రగుణోపేతుండై నిరంతరార్తత్రాణపరాయణుండై దుష్టశిక్షణశిష్టరక్షణకళాదక్షుండై త్రయోదశద్వీపమ్ము లేకచ్ఛత్రాధిపతిగ నేపురరాజము నిజరాజధానిగఁజేసికొని ప్రజంబ్రజగాఁ బాలించెనో—వైరిగిరివజ్రియై వదాన్యశిఖామణియై నిర్వర్తితశతక్రతుండై లబ్ధదేవేంద్రత్వమహాకీర్తియుక్తుండైన నహుషుం డేషహరు తనకు ముఖ్యపట్టణంబై వెలుంగ సర్వసర్వంసహాచక్రంబు నవక్రపరాక్రమంబునఁ జక్రవర్తియైయేలెనో—యరికరిహరియై యిష్టాపూర్తంబుల వనీపకచాతకానీకఘనాఘనుండై యనవరతగురుజనసువిధేయుండైన యయాతి యేనగరము ప్రధాననగరముగ నిజరాజ్యము పరిపాలించెనో—వివిధవిమల విద్యాజ్ఞానానుకూలుండై క్రూరపరభూవరభుజంగాహితుండికుండై పితృవాక్యపాలనాయత్తచిత్తుండై జనకేచ్ఛందీర్చి రాజ్యేందిరంబడసిన పూరుఁ డేపురి నిజనివా

నంబుగఁజేసికొని వీనుమిగిలెనో-కృతాశ్వమేధత్రయాత్తనితాంతదిగంగకీర్తి కాంతాసంయుక్తుండైన జనమేజయుం డేపీట నధివసించెనో—ప్రాగ్దిగ్విజయంబునఁ బ్రాచీశుఁడన నన్వర్థాభిధానంబుననలరారిన ధన్యరాజన్యుఁడు త్రసుండునునిలలుంచెనపుటబేదనంబునవసించిరో-రథంతరీలలతనుజుండై పరనృపమృగవిసరకేసరియై సుహృత్తతినుతహితవర్తనంబున శతమఖసఖుండగుట నిఖిలలోకగౌరవనీయుండై సౌందర్యవిజితరతిపతియై కటాక్షవీక్షాజోత్స్నాపోషితమార్గణగణచకోరుండై కవికోవిదగాయకవసంత్రియవసంతుండై బృందారకసదృశ మహర్షిబృందాశీర్వాదామృత పరివర్ధితాదృష్టలతాయుత ప్రహర్షమాణుండైన దుష్యంతుఁ డేమహానగరాధిరాజమును స్వస్థానముగఁజేసికొనెనో శకుంతలోదరఖనిజరత్నరాజమైబాల్యలీల సర్వదమనాఖ్యంబ్రఖ్యాతిసెంది సింహసంహననుండైన దౌష్యంతి యేపుటభేదనంబునఁ బారీంద్రపీఠమధిష్ఠించి జ్ఞానచక్షుఃప్రకాశంబున విధినిషేధయుక్తాయుక్తవిచారసారతరగుణుండై సత్త్వసాహస సముపార్జితసార్వభౌమత్వ మతిసమర్థతతోనిర్వహించి నిజాహ్వయంబున నేతద్దేశముభాసిలంజేసి సదాతనయశోవిశాలుండయ్యెనో—భుమన్యునకు సుహోత్రున కెద్ది ప్రధానపట్టణమో సువర్ణాసుహోత్రతనంజాతుండైన హస్తి నిజనామధేయం బేవత్తనంబునకిడెనో—సంవరణ కురు ప్రతీప శంతన విచిత్రవీర్య ధృతరాష్ట్ర దుర్యోధన ధర్మజాదు లేనగరరత్నమునఁ బట్టాభిషిక్తులైరో—మహాభారతయుద్ధకథానాయకులకెయ్యది కేంద్రస్థలలీలంగ్రాలుప్రోలో-దివ్యభవ్యస్తోత్రపాత్రుండు వల్లవీహృద్వల్లకీవాదనవినోదుండు రాధాధరమధుపానమత్తచిత్తుండు. శ్రుతిహితవేణుగానాకర్ణనాకర్షితగోగణపరివృతుండు దేవకీగర్భశుక్తిముక్తామణి యశోదానయననాళీకద్యుమణి యర్జునాజ్ఞానాంధకారతరణి రుక్మిణీరమణీమణీమనోహరుండగు శ్రీకృష్ణుండు జలవిహారమ్మొనర్చిన కాళిందీతటంబునఁ బ్రకాశించు ప్రసిద్ధప్రధానపుటభేదనం బేదోయట్టిహస్తినాపురావతంసంబు నేఁడుఢిల్లీయాహ్వయంబునవర్ధిల్లుచుంట విశ్వవిదితంబు. నేఁటిఢిల్లీ ప్రాచీననవీనాఖ్యల నగరద్వయంబుగ శోభిల్లు. అందు నూతనఢిల్లీయే భారతదేశమునకు రాజధాని. ఎడ్విన్‌లూటెనను భవనవాస్తుశాస్త్రప్రవీణుఁ డిప్పట్టణ ప్రణాళిక నేర్పఱచె. స్వరాజ్యప్రాప్త్యనంతరము షట్కోణాకృతిగల వరుసవీధులతో నియ్యది నిర్మింపంబడె. హిందూయవనపాశ్చాత్యశిల్పకళ లిందుం దగురీతిమేళవింపంబడుటంజేసి ప్రేక్షకలోకంబున కాహ్లాదంబుగలిగించు.

తే. వేల వత్సరములనుండి - వివిధ నృపుల
పాలనంబున నిప్పూరి - పరగు కతన
నిందనేక సంస్కృతు లొగి - నెసకమెసగఁ
బ్రభువులను బట్టి నడచిరి - ప్రజలు నాఁడు. 286

వ. నవఢిల్లీకర్థయోజనదూరంబునం బ్రాచీనదుర్గ (పురానకిల్లా) నామంబునం బిలువంబడు నొక్కకోట నేఁటికిని నయనానందకరముగఁ గానంబడు. వనభోజనాదులకనుకూలంబుగ నందు సుందరోద్యానవన మొండు దనరు. 287

మ. యమునాతోయములందు యాత్రికులు న - వ్యానంద సంయుక్తులై
రమణీయాద్భుత భక్తిగేయములతో - రాధాప్రియాలాపులై
శ్రమదీరం జలకంబులాడుదురు కృ - ష్ణా కావరాయంచు ని
ర్మములై యత్తఱి నద్ది మోక్షమునకు - న్మార్గంబు నాఁ జెల్లదే. 288

వ. ఇమ్మహాపురవరం బెన్నియోవిప్లవజ్వాలలకు గుఱియౌట ఋతుధర్మంబునకు లోనగుచు నిలిచియుండు వనస్పతివలెం బహువిధ పరిణామంబులఁ బడయకతప్పదయ్యె - ఆటుపోటులు మహార్ణవమునకుంగాక పిల్లకాల్వలకా? ఎన్ని ఝంఝు లెవ్విధంబునఁ బైకొనినం జలనిధి తనయునికిం గోల్పోవదుగదా. 289

( విష్ణ్వాలయము )

తే. వినయ వినమిత గాత్రులై - వేడ్క మీఱ
భక్తబృందము నిచ్చలు - వచ్చి పోవ
దీపకళికాళి రత్నదీ - ధితులఁ బెంప
నలరు నవ్వీట గొప్పవి - ష్ణ్వాలయంబు. 290

తే. అది బలదేవదాసబి - ర్లాహ్వయుండు
సప్త సంతానముల గుడి - సజ్జనాళి
యొండని వచింప భక్తిమై - దండి బుద్ధి
నరసి కట్టించె నారాయ - ణాలయంబు. 291

తే. దివ్య గాయన మునిజన - దేవతతుల
ప్రతిమలుం భక్తసూక్తుల - వరుస లలరు

హైందవ పురాణపట్టి చి - త్రాంచితమయి
వివిధ వర్ణాలఁ గుడ్యము - ల్వెలయుచుండు. 292

(ఎఱ్ఱకోట)

వ. "ప్రాగ్విషయ ప్రమోదాశ్చర్య జనకాద్వితీయ మహారాజ మందిరమిది. ఒక్కతూర్పుదేశములందేకాక సమస్తప్రపంచమునం దియ్యదత్యద్భుత ధరాధీశ వేశ్మమైయుండనోపు" నని ఫెర్గ్యుస నెద్దానిం బ్రశంసించెనో "భూమిమీఁద స్వర్గమనునదియున్నచోఁ నయ్యది యియ్యదియే. దీనికంటె వేఱొండులే"దని యొకపర్షియన్మహాకవి దేనికుడ్యంబున నక్షీణసువర్ణాక్షరములతో లిఖించెనో యట్టి యెఱ్ఱకోటను వర్ణింపనెవరితరము. తన్మనోజ్ఞాభ్యంతరహర్మ్యావతంసము పుష్పరూపశిల్పకళాద్యోతకక్షీరాశ్మఫలక స్థగితమగుటం బ్రేక్షకజనానందకరంబననొప్పు. పూర్వసార్వభౌమాధిష్ఠిత సర్వవిశ్వంభరాపరికీర్తితామూల్యమయూరకంఠీరవపీఠాన్వితంబని చరిత్ర ప్రసిద్ధింబొందినశోణదుర్గరాజ మీ బృహన్నగరంబునరాజిలు-ఇప్పురమును ముఖ్యపట్టణముగఁజేసికొని పాలించిన తోమరవంశీయుఁడగు ననంగ భూపాలుడే యెఱ్ఱకోటనుదొలుతనిర్మించె. పూర్వపుశోణదుర్గమును షాజాహాను గొన్నిమార్పులుచేయింప నేఁడుమనోహరముగవెలయునదే లాల్ ఖిల్లా. అందాస్థానభవన రాజభవనాఖ్యలంబరగు మందిరమ్ము లీనాఁటికిని శిల్పవాస్తుశాస్త్రజ్ఞుల మన్ననలందుకొనుచుండు. భారతరక్షకసైన్య మందు నేఁటికిని నివసించుచు దానిని సర్వవిధంబులంగాపాడుచుండు. రాజకీయ మహోత్సవదినంబులఁ బ్రప్రథమమున నందుఁ బతాకావిష్కరణోత్సవము జరుగు- 293

(భరతఖండము ఖద్వారము)

ఉ. భారతయోద్ధ లత్తొలిప్ర - పంచరణంబునఁ గూలిరెందఱో
వారల జ్ఞాపకార్థ మొక - ద్వారము కట్టిరి తత్పురంబునఁజా
వీరుల జన్మభూమి యిది - వెల్గునిరంతర మన్నరీతిగా
నాఱని శౌర్యచిహ్నముగ - నచ్చట నిచ్చలు జ్యోతి వెల్గెడిఁజా. 294

కం. లక్షలకొలంది ప్రజ లిట
వీక్షింపఁగ నుత్సవముల — వెలయును సరియౌ

రక్షణ పచ్చిక బయలొక
టక్షీణ విశాల మగుచు – నలరిన కతనఁ. 295

కం. దివవనమనఁ దనరెడియా
యుపరాజుల వనమునందు – నొప్పె నదికసం
ఖవి సంస్థానాధీశుల
భవసంబులు వనముచుట్టు – భాసిలుచుండుఁ. 296

తే. వీరవర రక్షితంబయి – వెలయు కతన
వైరులకు గుండెగాలమై – పరగు నిద్ది
యన నపాయవుఁ జిహ్నమా – నట్టి యెఱుపు
మాట సూచింప నపుడెట్టి – కోట యనిరి. 297

(కుతుబ్ మినార్)

వ. సర్వభరతోర్వీతలంబున నద్వితీయమహౌన్నత్యంబునన్వెలయు శిలా నిర్మాణము కుతుబుద్దీన్ప్రతిష్ఠిత కుతుబ్ మినార్. ఇన్నూటముప్పదెన్మి దడుగుల యున్నతిందనరు దీనినధిరోహింప మున్నూటడెబ్బదితొమ్మిది మెట్లెక్కవలయు. ఇందైదంతస్తులలరు. తొలిమూఁడంతస్తులరుణాశ్మనిర్మి తములై మలిరెండంతస్తులు చంద్రకాంతోపలవినిర్మితంబులై మనోహ రములుగనుండు. 298

(గాంధీసమాధి)

తే. విశ్వ మానవ కళ్యాణ – వీక్షణ రతిఁ
దనదు జీవిత మెల్లను – ధారవోసి
యిందు సన్నిభ యశమందె – నెవ్వఁ డతఁడె
మోహనుఁడు వాగ్రమా జగ – న్మోహనుండు. 299

ఉ. మించినప్రేమతోడ నని - మేషులు నిచ్చలు మెచ్చ లోకముం
గాంచిన పుణ్యశాలి కడు - కష్టములోర్చి స్వరాజ్యలక్ష్మి సా
ధించిన శాంతమూర్తి నిజ – దేశమహోన్నతిఁ గోరుకొంటచే
మంచికి మాఱుపేరనుచు - మానవకోటి యను న్మహాత్మునిఁ. 300

ఆ.వె వడుకు నూలి పోగు – వడవడ వడఁకించెఁ
దెల్లదొరతనంబు – మెల్లఁగఁ జన

గాంధి యాత్మ శక్తి – కళ్యాణ సంపత్తి
దాస్యమునకు మిత్తి – ధర్మశక్తి. 301

వ. పుండొకచోటనుండ మందొకచోటవేయుటని మదించలంపక. 302

తే. పరమధర్మాత్ము దుష్క్రియా – పరుఁడనుకొని
యంతటి మహానుభావు న – నాదరమున
నొకఁడు హింసించె నప్పురి – నోర్వ లేమి
దానఁ గట్టించిరి సమాధి – జ్ఞాన నిధులు. 303

ఉ. మానవు లందఱింతటి య – మానుషచర్యలఁ జేయఁబూనుచో
నీ నరజాతి కెట్టిగతి – యేర్పడునో గమనింపకుండ న
జ్ఞానమహౌఘఘోరతమ – సంబునఁ జిక్కిన దారిదక్కనే
మానవ సంఘమెల్ల మటు – మాయముగాదె జగల్లయంబునా. 304

ఉ. అన్నిమతంబులెన్న నదు – లన్నియు సాగరుఁ జేరు రీతిగాఁ
దిన్నఁగ దైవదర్శనపుఁ – దెన్నునె చూపి తదీయకాంతిలోఁ
బున్నెము పండ లీనమగు – బోధ మొసంగునెకాని యన్యమిం
కెన్నఁడు చూప విద్ధిగణి – యింపక మానవ శాంతిగల్గునే. 305

తే. కోరికల నెంత తగ్గించు – కొన్న యంత
సుఖము మదికుంట సత్యమ్ము – సుమ్ము జగతిఁ
గోరికలె గొప్ప పందెపు – గుఱ్ఱములయి
యీడ్చుకొనిపోవఁ బ్రజ శాంతి – యెట్లు గలుగు. 306

తే. అతి నిశితదృష్టిఁ గనఁగ స్వ – ర్థాద్యదినుండి
దురితమని యాత్మఁ దలఁపక – దుర్జనుండు
సాధుజనులను హింసించు – సత్య మిద్ది
జ్ఞాని పరులను బాధింపఁ – గడఁగఁ డెపుడు. 307

వ. కలుషితమైన వాతావరణమున జీవించు మానవుని మనస్సు కలుషితమగుటయాశ్చర్యజనకముగాదు. అవ్విధంబుగ స్వర్గస్థుండైన బాపూజీ జ్ఞాపకార్థముచిరత్నసూత్న ఢిల్లీనగరమధ్యమమునం గాళిందీద్వీపవతీతీరంబుననమున్నతస్థలంబునంబ్రశాంతవాతావరణంబునంబరివేష్టితప్రాకారంబై గాంధీజీసమాధివెలయు. అప్ప్రదేశమునురాజఘాటంబ్రడు. 308

సీ. యమునాతరంగతో - యార్ద్రశీతలవాత
 పోతపరీవృత - బుధతతినుత
మరకతాస్తరణసం - భరితఘాసన్నిభ
 ఘనసాంద్రమృదుశర - కలితలలిత
కుసుమశోభితలతా - కుంజపుంజోపేత
 పరిమళమిళితపా - వనవసమ్యుత
వరభృగువాసర - ప్రార్థనా సంయుత
 భక్తజనామోది - వరవినోది

తే. గర్వనిర్వాసనాపాది - కలుషభేది
సర్వసమశాంతిసంవాది - సౌఖ్యపరిధి
విమలవైరాగ్యజనకని - ర్వేదవాది
దివ్యసితరుక్ప్రబోధి గాం - ధీసమాధి. 309

(అయస్స్తంభము)

వ. నిజవిజయపరంపరావైభవసూచికాయస్స్తంభంబొక్కండాబృహన్నగర రాజంబునఁ బుష్కరదేశాధీశుండగు చంద్రవర్మ నిర్మించె. ఇక్కంబం బొకప్పుడు విష్ణురథచిహ్నాన్వితంబై తార్క్ష్యధ్వజ ధ్వజస్తంభమైయుండ వచ్చుని చరిత్రకారులంద్రు. పంచదశశతవర్షంబులనుండి యెండకెండి జడికిందడిసియుస్నిగ్ధతాద్యుతియుతమై రవ్వంతైనంద్రుప్పుపట్టమిం దల్లోహ వైశిష్ట్యము తచ్ఛిల్పిధీచాతుర్యము ప్రశంసార్హములని ప్రజలు వేనోళ్ళఁ బొగడుచుంద్రు. 310

ఉ. అంటినమాసిపోవు నను - నట్టులు శోభిలు సౌధకుడ్యముల్
గెంటును గోపురంబుడులఁ - గేవల మానవదివ్యభాగ్యపుం
బంటనఁ గంటికింపఁ బరి - మంటికి మింటికి రాకపోకకై
దంటలు గట్టుకొన్న సుఖ - దస్థిత హర్మ్యము లొప్పునప్పురిణ్.311

వ. ముస్లిముతేఁడులుకట్టించిన మసీదులలో జుమ్మామసీదు రమణీయమై యలరు. మొగలులకాలమున నిప్పటిఢిల్లీనమునంగల చాందినీచౌక్ ఘామండలంబునంగల విపణులందెల్ల భాగ్యవంతమైనదని ప్రశంసింపఁబడె.

ఉ. అందలివస్తుసంచయ మ - నంతకళాకమనీయకాంతులజ్జ
విందొనగూర్చు కన్నులకు - వేగ జనించుఁ గ్రయాభిలాషయున్

సుందరమందిరంబు లట - శోభిలు స్వర్గము వచ్చెరాయనం
డెందము కందళించుఁ గదు - దీవిగ నంగడి వీధు లొప్పఁగన్. 313

తే. అనుచు బహుదేశ సంచారు - లా విశిష్ట
విపణి రాజము నర్థైన - వేడ్క మీఱఁ
దిరిగి తిలకించి శ్రేష్ఠత - తెలిసికొనియ
యట్లు స్తుతియించిరని జను - లాడుకొంద్రు. 314

తే. జోడుగుఱ్ఱాల సారటుల్ - సుఖదలీలఁ
బౌరులకు వాహనములుగఁ - బరగు నచట
సర్వమత సర్వదేశ ప్ర - జా ప్రవజంబు
నచటఁ గననౌను మదికి నా - హ్లాద మొదవ. 315

తే. పొలుపుగులికెడి యాగజ - పురము నందు
వెలయు నల విమల విశాల - వీధి తతికి
నిండుగా బాంధజనులకు - నీడ నీయ
భూజపంక్తులు రెండువై - పులఁ జెలంగు. 316

కం. జిగిమీఱెడి పుష్పలతా
నగజాతులతోడఁ దనరి - నవరీతులతో
నగరోద్యానము లచ్చట
సొగసుగ నలరారు నిత్య - శోభాస్పదమై. 317

కం. స్థల జల పక్షుల రవములు
స్థలజలజాకరములందు - శ్రవణ సుభగమై
లలితానందము గూర్చుటఁ
గులుకుచు విహరింత్రు జనులు - కుసుమ వనములన్. 318

కం. ఎందఱొ యేలి గతించిరి
యెందఱొ పాలింపఁబడిరి - యేగిరి మార్పుల్
కొందఱు చేసిన నందము
పొందుచు నిట్టుంటి ననుచుఁ - బుర మెద నెంచున్. 319

(జంతర్మంతర్)

వ. గగనగోళశాస్త్రపారంగతుండగు జయపూరుమహారాజు జయసిం
గిప్పురవరమున జంతర్మంతరాఖ్య నొక్క సుప్రసిద్ధఖగోళదర్శిని దర్శ

నీయముగ నెలకొల్పె–సూర్యచంద్రాదిగ్రహగతుల పరిజ్ఞానపరిశీలనార్థము షడ్యంత్రంబు లందమర్పంబడుటంజేసి యయ్యది జనాకర్షణీయంబగు. 320

తే. భారతాభ్యుదయైక సం - భారభరిత
నిత్యవిద్యార్థిజనవాంఛ - నీయ మగుచు
ననవరతసాధనంబున - కప్పురమున
నుండె విజ్ఞానశాస్త్రప్ర - యోగశాల. 321

తే. భరత నాగరికత నెంతొ - బలపఱుచుచు
విహిత కృత్యములకు సర్వ - విషయ జనుల
రాకపోకల కనువుగ - రమ్య మగుచు
నమరు నవ్వీట నొక విమా - నాశ్రయంబు. 322

వ. అయ్యది పాలమను పేరంబరగు. 323

తే. తొంటి వైదిక ధర్మవి - ద్యోతకముగ
నలరు నప్పురి నొక్క సూ - ర్యాలయంబు
రాష్ట్రపతి సౌధ పరిసర - ప్రాంత మందె
క్రైస్తవుల ప్రార్థనా మంది - రంబు వెలయు. 324

తే. అఖిల మతములవారు స - ఖ్యత మెలంగఁ
దోఁచు నవ్వీడు కల్యాణ - దుర్గ మనఁగ
భారతాంబకు నాస్థాన - భవన మనఁగ
నన్నియధికారముల కేంద్ర - మై తనర్చు. 325

తే. అన్నిమతములవారి క - య్యాయి విధుల
వేఁడికోర్కెముక్తులెన్నియో - వెలయు చుండు
నెవరి పండువులకు వార - లేగి యచటఁ
బ్రార్థనలు సల్పుకొందురు - పరమ భక్తి. 326

తే. వివిధ భాషల వారట - వేడ్క నుంట
నదియు సంతోషజనకమై - యలరుచుండు
నిఖిల నాగరికతలకు - నిలయ మగుటఁ
బరగు నయ్యది చిన్నప్ర - పంచ మట్లు. 327

(వస్తుప్రదర్శనశాల)

వ. ఆసియాఖండమధ్యభాగలబ్ధపదార్థపరిశోభితంబై మధ్యాసియాపురాతనవస్తుశిలాఖ్యానొక్కండు సనాతననానావిధాయుధములఁ బరంపరాగతానేకరాజముద్రికల రజతమహారజతాది వివిధలోహకృతంబులగు నాణెముల, చిత్తరువుల, భౌగోళికపటములఁ, బక్కంగ బంధించుకొనం దనరుత్రామదుర్గాంతర్గత ప్రదర్శనవేశ్మంబు వేఱొకండును ప్రథమప్రపంచసంగ్రామప్రభృతిపరాజితశత్రుసమార్జితాస్త్రశస్త్రాదిరణోపకరణసహిత భారతీయయుద్ధవీరవరజ్ఞాపకార్థవినిర్మిత శోణదుర్గాంతర్భాగప్రదర్శన మందిరంబు మఱియొండును–హైందవచిత్రకళాప్రతిభా శిల్పకళామహౌన్నత్యస్థితుల వేనోళ్ళంజాటు జాతీయ భారతజాతీయపదార్థప్రదర్శనశాలాహ్వయంబున నింకొకండును వస్తుప్రదర్శనశాలలు చతుర్విధంబులందనరు. 328

(క్రొత్తఢిల్లీ)

కం. భూపతు లెందఱో యేలుటఁ
ప్రాపించెను రూపు లెన్నొ – ప్రాఁతపురి కొగిం
బ్రాపంచిక నాగరికత
చూపుంగద క్రొత్తఢిల్లి – చూపఱు వొగడన్.  329

ఉ. చక్కనిపూలతోఁటలు వి - శాలమనోహరరాజమార్గముల్
చుక్కలనంటు సౌధములు - చొక్కపు వాహ్యము లవ్వనావళిం
బెక్కుసరోవరంబు లతి - వేలజనాకలితాపణంబు లు
క్కెక్కినసైన్యసంఘము ల - హీనముదంబొనగూర్చు నప్పురిన్.

కం. ప్రవిమల భారతవర్షపు
దివిభువిపథదివ్యకేంద్ర – దీప్తి వెలుంగున్
నవయుగ నరలోకపుర
స్తవనీయానిలవిమాన – సంగతి నలరున్.  331

(రాష్ట్రపతిభవనము)

వ. మున్నూటముప్పదియెకరముల ప్రభుత్వభూభాగమున మున్నూటనల్వదిగదులలర నర్జునారుణేష్టకానిర్మిత సువిశాలాతిమనోహర హర్మ్య

రాజంబగు రాష్ట్రపతిభవన మనంతకాంతిసంతతులతో వైజయంతముం దలపించు. దాని పిఱిందిదెస దేవేంద్రుని నందనవనంబును ధనదుని చైత్రరథంబును గ్రిందుసేయంజాలి విశ్వవిఖ్యాతింగాంచిన మహాపుష్పోద్యానవన రాజం బొండురాజిలు. తీర్చిదిద్దినకమలాకరములతో, పదపథములతో నిర్మల నీరప్రవాహములతో జలకణక్షేపకసాధనసంపత్తితో, రమణీయభూమీరుహశ్రేణిచ్ఛాయాస్థిత నానావిధానాసనములతో సుమసమన్విత గుల్మలతాపంక్తులతో, వివిధవర్ణవిద్యుద్దీపశుంభత్స్రంభావళులతో సజ్జకపుంబూసెజ్జలతో నయ్యది హృదయాహ్లాదకరముగ వెలయు. 332

కం పూజ్యమహానాయకమణి
భోజ్యంబై భరతవర్ష - పుణ్యాఫలంబై
త్యాజ్యంబై పాపుల కట
రాజ్యసభా భవనమలరు - రమణీయంబై. 333

ఉ ఆ నగరంబునంగల మ - హామహులెల్లరు రాష్ట్రసిద్ధికై
ప్రాణము లొడ్డియున్న గుణ - వంతు మహాత్మునిశిష్య సత్క్రియల్
వీనుల సోకినంత నతి - వేలవిచారముచూపి రమ్మహా
మానవసేవకోత్తముని - మాట జయింపఁగ వేఁడిరీశ్వరుఁ. 334

తే. అప్పురంబునఁ గల ప్రజ - లపుడు రాము
సత్య దీక్షకు నాశ్చర్య - చకితులైరి
గాంధిశిష్యుఁడనంగ నా - ఘనునకె తగు
నంచు శ్లాఘించి కోరిరి - యతని జయము. 335

కం. పరదేశవాసు లప్పురి
కరుదెంచిన రాజ్యసభల - హర్మ్యంబుల సం
బరమునఁ జూచి నుతింతురు
కరిపురమున నవ్వి మిగుల - కనువిందౌటఁ. 336

వ. కేంద్రశాసనసభాభవనమునందొకభాగమ్మున నత్యున్నత న్యాయస్థానంబలరు. హూణపరిపాలనకాలమున వైస్‌రాయి రజతపత్రాచ్ఛాదిత దారునిర్మితాలంకారయుతోత్తమహాయద్వయాన్విత శకటమధిరోహించి ధ్యంగరక్షకసహితుండై రాజకీయోత్సవసమయంబుల నిర్దిష్టప్రదేశంబులకుం

జని రాజలాంఛనోద్దీపితముగ గౌరవింపఁబడె అయ్యాచారమట్లు నేఁటికిని నిలిచియుండె. తచ్ఛాసనసౌధమత్యంతరమణీయము. 337

# కేంద్ర శాసన సభ

తే. అభవన రాజమునఁ గల - యద్వితీయ
శిల్పనైపుణ్య మెంతని - చెప్పఁగలము
నిన్ననో నేఁడో కట్టిన - ట్లున్న కతనఁ
జూచువారల మదికెంతొ - చోద్యమగును. 338

కం. ధ్వనివర్ధకయంత్రములు ప
వనయంత్రము లన్నిదిశల - భాసిలుచుండుం
గనులకు విందొనగూర్చెడి
ఘన విద్యుద్దీప పంక్తి - గ్రాలు న్నిశలన్. 339

వ. విషయచర్చాసౌలభ్యవాంఛమై లోకరాజ్యసభాహ్వాయంబుల కేంద్ర శాసనసభ ద్వివిధంబుగ విభజింపంబడఁ దత్సభ్యజనాసనంబు లర్ధచంద్రాకృతినమర్పంబడు. తత్సౌధంబు మూఁడంతస్తులనలరు- కేంద్రమందిరంబు సభాద్వయసభ్యమహాశయవిశ్రాంతివేశ్మముగ నొప్పు. ఆదిత్యోదయసమయంబునం బతాకోన్నమనోత్సవం బొనర్పంబడు. ప్రతివత్సరంబునం దొట్టితొలిసారి తత్సభాద్వయంబును నిజలాంఛనములతో భరతదేశాధ్వర్యు వరుదెంచి ప్రారంభించు. తత్సమయంబునం ధవళితాశాతటపటలోజ్జ్వల నిశితసితదీర్ఘఖడ్గధారులై రక్తవర్ణోష్ణీషయుక్తులై మల్లీహిమ రజతశ్వేత గరుచ్ఛశిసదృశధవళనేత్రధరులై యంగరక్షకులార్వురిరుదెసం బురోభాగంబున గమించుచుండ బయలుదేరి యొక్కటెప్పపాటైన ముందువెన్కలుండనివిధంబున నిర్ణీతకాలంబునకునరిగ సభాభవనముం బ్రవేశించు. సమజ్యాసౌధమున నాతఁడరుదెంచుద్వారసీమనుండి యుపవిష్టుండగు పీఠమ్మువఱకు కరుణవర్ణరత్నకంబళిపఱచిఁయుండ దానిపైనడచివచ్చు. సభాధ్యక్షుఁ డాభారతాధ్యక్షుని సగౌరవముగ లాంఛనానుకూలముగఁ దోడ్కొనివచ్చి తనప్రక్క నుచితాసనంబునఁ గూర్చుండఁబెట్టుకొని భారతాధిపతి యుపన్యసింపఁబోవుచున్నాఁడనితెల్పినంత నతండట్లు వాఙ్ముఖామ్ము

తమ్ముగ్రుమ్మరించివెంటనెవెడలిపోవు. అనంతరకార్యక్రమమును సభాపతి నిర్వర్తించు. అట్టి కేంద్రశాసనసభాభవనరాజము, నభివర్ణింప సహస్రముఖశేషాహికైన శక్యమా? 340

తే. రేపు వచ్చిన వర్షము - మాపు వచ్చి
నట్టి చుట్టము వదలిపోఁ - డన్నరీతి
నన్య భూప్రజ లదిగని - నంతఁ దిరిగి
వారి స్వస్థానముల కేగు — వాంఛ నడలు. 341

వ. హృదాహ్లాదజనక చారుతరసుస్నిగ్ధసుషమాప్రతిఫలితగతాగతప్రాణిగణగణనీయఘనకళావైదగ్ధ్య బహిరబహిరభాస్వన్నవీన నానావర్ణయుత శుంభద్భూరిస్తంభశ్రేణీసంభరిత ప్రాలేయరుక్కాంతారుణకిరణకాంతోపల నిర్మిత ప్రస్ఫురత్కుడ్యజాలాన్విత సద్యోవికసితాబ్జసదృశాకర్ణాంతాకర్షిత శరాసనసన్నిభరథాంగసంకాశ రాకానిశాకరనిభ సంపూర్ణవర్తులాన్వితోత్తాలసువిశాల మహాసంసదనుకూల యాతాయాతశీతలవాతపోత సమన్వితాధికారయోగ్యానుకూలతరతమభేదసూచితమధ్యమోత్తమోత్తమోత్తమస్థానోచితవివిధదారువినిర్మితశుకపికశ్వేతగరున్మయూరకరిహరిహయనికరభ్రమరసముపేత సుమలతాలలిత దాడిమ్యామ్రాదిఫలాకారకనత్కాంచనసూత్రవయనభరితపట్టపోత్రాంచిత బహువిధరూపాసనసముపేత ద్రవిణాధీశ గంధర్వరాజ మహేంద్రసమజ్యాసాధసమధికరాజద్రాజసభాభవనరాజంబున సమున్నతపీఠంబున నుపరాష్ట్రపతి యధ్యక్షస్థానమలంకరించియుండఁ బాలకవర్గసభ్యమహాశయు లర్హాసనములనాసీనులై ముఖ్యాతిముఖ్యాంశముఁ లఁజర్చించుచుండ నఖిలభారతభాషారాష్ట్రసంఘాధ్యక్షుఁడగు లంకసుందరముఁద్ధితుఁడై యాంధ్రరాష్ట్రనిర్మాణార్థము భారతరాజ్యాంగ ప్రథమానుబంధమునకు రాజ్యసభలోఁ బరివర్తనము ప్రతిపాదించుట కురరీకృతినొసంగ సభాపతిని లిఖితపూర్వకంబుగ నభ్యర్థించి తదనుమతిని పూర్వవిజ్ఞప్తి నిట్లారంభించె. అధునాతన త్రిలింగ కాశ్యపీపరిస్థితులం బరినిజర్ణంబుగ నాకళించుకొని నాయొనర్చువిజ్ఞాపన మత్యంతశ్రోతవ్యమని చెవియొగ్గి వినంగోరుదు 342

మ. శరదాకాశనికాశమానసుఁడు విశ్వ - ప్రేమ సందేశసం
భరితాధ్యాత్మికవాగ్విలాసుఁ డనఘ - వ్యాపారి సత్యవ్రత

స్థిరచిత్తోజ్జ్వలశాంతిదూత కరుణా - శ్రీహృత్సరోజుండు శ్రీ
హరిభక్తాగ్రణి రాజయోగి యెవఁడీ - డా గాంధి కిద్ధారణిన్. 343

శా అంతర్వీక్షణదీక్ష దివ్యఋషినా - నధ్యాత్మవిద్యాద్యుతిం
ధ్వాంతధ్వంసవచోవిలాసయుతవి - ద్యత్ప్రాజ్యుఁడై సత్క్రియా
శ్రాంతశ్రాంతశరీరుఁడై భరతదే - శ శ్రీవికాసార్థియై
గంతవ్యాద్భుతపుణ్యమార్గగతుఁడై - కాంచెన్ యశం బెంతయున్.

వ నిత్యసత్యవాది యహింసావినోది ప్రజాశుభప్రతిపాది న్యాయవేది సమరసాపాది పరివరిపాలనాందూభేది యన్యమతద్వేషచ్ఛేది సద్గుణామోది యగు మహాత్ముఁ డశ్లీలార్థస్ఫూర్తిందొలఁచి విరచించు విద్వత్కవిసార్వభౌమువిధంబున ననర్థకృత్యవిరహితంబగు ప్రణాళికల సృష్టించెననుట సర్వజనవిదితము. 345

ఆ.వె. వసుధ మీఁదఁ బడని - వర్ష బిందువు వలె
నమిత నిర్మల మగు - నతని వాక్కు
నాదరింపకున్న - నభ్యుదయంబును
బొందఁగలమె కీర్తి - నందఁ గలమె. 346

వ. బహుజనాకీర్ణ నానాభాషాసమన్విత సువిశాలదేశపరిపాలనసౌలభ్యసౌకర్యవాంఛాతత్పరుండై భాషారాష్ట్రములేర్పడవలయునని స్వాతంత్ర్యోదయమునకుం బూర్వమె జాతిపిత నిర్ణయించుట భారతనేతలకెల్లరకుం దెల్లము. దాని నాధారంబుగఁగొని నల్వదేండ్లనుండి యాంధ్రప్రజానీకము ప్రత్యేకరాష్ట్రమర్థించుచుండం దత్ఫలంబాజనతకుందక్కకముంద విహారోత్కళరాష్ట్రంబులేర్పడుట సువిదితము. ఈడుపుగంటిరాఘవేంద్రరావు నాగపూరురాష్ట్రపాలకుఁడుగఁ బనిచేసిపిదప లండనునగరమున భారతదేశపరిపాలన కార్యనిర్వాహకకార్యాలమున (India Secretariat) నుద్యోగిగనుండి యాంధ్రరాష్ట్రసిద్ధికి వలయు సర్వవిషయంబుల నాంగ్లేయుల కందిచ్చె. కాని నాఁటినుండి నేఁటివఱ కయ్యది సిద్ధింపకుంట శోచనీయము. ఏతత్సమస్యాప్రతిష్ఠంభన పరిష్కారపథప్రయత్నమింతవఱ కారంభంబున భంగి మహోన్నతస్థాయిలో జరుగలేదనిగ్రహించి తత్ప్రాప్తికై రాములామరణనిరాహారదీక్షం బూనియున్నవాఁడు. 347

చ. సమయము సేసి తత్సమయ - సాహసలీల సమస్తవాంఛలన్
సమయఁగఁజేసి శాంతియుత - సంగర రంగమునందు నిల్చి స
క్రమముగ రాష్ట్రముం బడయ - గాంధిహితోక్తుల నమ్మియున్నవాఁ
డమరఁగ వాంఛదీర్చి ముద - మందఁగఁజేయుఁడు తెల్గువారలన్.

తే. ఆంధ్రరాష్ట్రోద్యమంబను - సద్వితీయ
భారవాహకుఁ డనఁదగు - ధీరుఁడతని
దీక్ష శంకింతు రెందఱో - తెలియ కద్ది
బకజపముగాదు ధ్రువుని త - పంబుగాని. 349

కం. మన్మిన్నేకం బైనను
మన్ననమిఁక మాఱఁబోదు - మఱు మాటేలా
కన్మని దీక్షన్విడఁడు జ
యోన్ముఖుఁడై గాంధిఁ దలఁచి - యుజ్జ్వల మతియై. 350

ఉ. ధీగలఁ డెన్నిసౌఖ్యములఁ - దేలుచునున్న విపత్పరంపరం
దోఁగుచునున్నఁ నొక్కగతిఁ - దోఁచు నిజంబిది కుంభవృష్టిచే
వాగులు వాఁక లన్నియును - వచ్చెడి వేళ మహోగ్రగ్రీష్మమే
సాగెడివేళ నబ్ధి తన - స్థానము దప్పునె పొంగి క్రుంగునే. 351

వ. శూన్యంబున నాకర్షణశక్తి శూన్యంబైనను నిల్చియున్న గోళంబులంబలెం గొందఱు నిరాధారులయ్యు సత్యమునకుం గట్టుబడియుంద్రు. అట్టి మహనీయులం దీ పొట్టి శ్రీరాముం డొక్కండు. 352

తే. వేయి కాగడాలను వేసి - వెదకినఁ గనఁ
బడదు లోటింత రాముల - యెడఁదయందు
నెన్న భౌతిక భోగము - లెవరికున్న
గుణము గౌణముగా నెంచఁ - గూడదు గద. 353

వ. గీర్వాణమున స్వర్ణాఖ్యలు చంపకమునకు, నిశాహ్వాయములు హరిద్రకు, తోయదనామంబులు తుంగకుంజెల్లునట్లు మహాత్మునకున్న సుగుణంబులన్నియు రాములకుంటం దద్విశేషణంబులెల్ల నితనికిం జెల్లు. 354

కం. పొంగారు మాతృసేవా
రంగేచ్ఛం గురుని మించి - రాములు దనరం

బంగరునకు వెలిగారము
భంగి నసికె వారియెద ల - భంగుర ఫణితిన్. 355

వ. గాంధేయమార్గగామి దేశపురోగమనకామి స్వాతంత్ర్య సమరయోధా గ్రణి భారతమాతృ భక్తశిరోమణి పొట్టి పంశరత్నాకరరాకాసుధా కరుండు సబర్మతీ మహర్షి ప్రశంసల సందుకొన్న ఛాత్రరత్నము, మిత భాషి జనహితైషి యభ్యుదయాభిలాషి సత్యవాగ్భూషి నిత్యసంతోషి నిరాడంబరవేషి యగు శ్రీరాములు కేంద్రపాలకులకుఁ దనమాటగా నిట్లని మనవిసేయు మనియె - భగవద్భలంబునం బ్రపర్తిల్లుచున్న యిమ్మ హోజ్జ్వలోద్యమరంగభూమి నే నొక భూమిక నిర్వహించుచున్నాఁడ. ఏఁ బ్రాణానం గలుగంగ హింసాకృత్యంబులనొల్ల. ఏ తత్కృతికిం గృతా రంభులైన నాటంగోలె నాంధ్రనేతలు శతవిధముల బడలుపడుట జగ ద్విదితము. 356

తే. మృత్యుదేవత లయకాల - నృత్యమాడ
నితర దేశాల మార్పు లెం - తేని జరిగె
శాంత్యహింసలె స్వాతంత్ర్య - సాధనతతి
యనుచు భరితోర్వి చాటె లో - కాళికెల్ల. 357

ఆ.వె. మాతృ భూమి మీఁద - మాతృ దేవత మీఁద
మాతృ భాష మీఁద - మమత లేని
మనుజు లుండ రంచు - మామకాత్మఁ దలంచి
యేను బూని నాఁడ - నిట్టి పనికి. 358

తే. చిన్న యధికారములు నేత - లెన్నియిడినఁ
బ్రమదమందరు ప్రజలు స్వ - రాష్ట్రమీక
పాలకుత యెత్తినప్పుడు - పంచదార
పెట్టినను దృప్తిపడనట్టి - బిడ్డ లట్లు. 359

శా. సూర్యాచంద్ర మసుల్గతుల్దొలఁగనీ - క్షోణీతలంబున్నతా
హార్యాళ్యన్వితమై చలద్దళిత ఘో - రాటోపమై క్రుంగనీ
శౌర్యస్ఫూర్తి సురాసురుల్చెనకి స్వే - చ్ఛన్మాన్పఁగాఁ జూడనీ
ధైర్యశ్రీరుచినిల్పి గెల్చెద వృథా - దర్పంబుగా దింతయున్. 360

వ ఇది సంయుక్త భారతమును విడదీయుటగాదు. భారమును సమాన ముగఁ బంచుకొనుట. ఇయ్యది సంకుచిత ప్రాంతీయతత్త్వమునకుం గుఱి యగుట గాదనుటకు గాంధీజీ నిర్ణయమే ప్రబల సాక్ష్యము. గ్రామ, మండల, రాష్ట్ర, దేశంబు లన్యోన్యవిలీకరణంబున ప్రపంచాంతర్భాగము లనుమాట మఱవంగానిదని మాకుం దెల్లము సర్వతోముఖవికాసమునకు హేతుభూతము రాష్ట్రావతరణము. అఱచేతిలో వైకుంఠముం జూపుట హర్షింపందగిన విషయముగాదు. కదర్థితుల బాధ వృథపోదు. మాది సమదృష్టిగాని విషమదృష్టి గాదు. విశ్వకళ్యాణమునకై హాలాహలము నైన భక్షింప సంసిద్ధులము. పాలకుఁడు గోపాలకునివలె నడ్డదిడ్డముగఁ బోవువాని నదలించి ధర్మదేవత నాల్గుపాదముల నడుచునట్లు చేయ వలయు. 361

ఉ. ఆశ్రిత పక్షపాతము మ - హామతికైనను దప్పదందురా
నాశ్రమరిత్తయౌన జన - నాయకులం దొకఁడైన సత్య ధ
ర్మాశ్రయదృష్టిఁ జూడఁడ - మహాత్ముని మార్గము మృగ్యమౌన మీ
యాశ్రవ మెప్పు డబ్బినను - నాంధ్రజనాశ ఫలింపఁ జేయరా. 362

ఉ. మున్నవలీల నేలనలు - మూలలనేలి విరోధులం దలం
దన్నినరాష్ట్రి మాతెనుఁగు - తల్లి నిజంబుగఁ దొంటియట్లుగా
మన్ననలేమి క్లేశమున - గ్రమ్గి ముఖాబ్జము చిన్నబోవఁగాఁ
గన్నుల నీరునింపుకొని - కాంచుచు నున్నది బిడ్డ లందఱిన్. 363

తే. ఆ దినుండియు స్వాతంత్ర్య - మఖిలషించి
యఖిల భారత ముక్తికై - యాంధ్రమాత
హూణపతితోడ జరిగిన - యుద్ధమందు
నెంత త్యాగము చేసెనో - యాశుఁ డెఱుఁగు. 364

చ. గతమును విస్మరించి యిఁకఁ - గాఁగల కార్యము సంస్మరించి స
మ్మతమున మాధరాతలము - మాకిడినంతన సర్వభారముం
గుతుకముమై వహించి యొన - గూర్తుము సౌఖ్యము తెల్గుతల్లికిన్
వితథముగాదు నాపలుకు - వేగఁ దదాజ్ఞ నొసంగ వేఁడెదన్. 365

వ. భూపతి రాష్ట్రపతియను నామాది స్వల్పభేదంబులేకాని కర్తవ్య నిర్వ హణాదులంబాలక పాలిత ప్రధాన ధర్మసూత్రములకు భిన్నంబెన్నం

డును రాదు. అదిత్యాంశ విభ్రాజిబోధగుణోద్భాసి సత్పథసంచారి తమో నిశాట విపాటన చణాగ్రణి యనలధామశోభి చక్రహితైషి జగద్బంధుండు, వసుతి, పద్మానందకరుండు, కళానిధిపోషణుం, డవక్రవృత్తాన్వితుండు, బుధనుతుండు, లోకాలోకనశీలి, శ్రీకరుండు, స్వీయసేవాసక్తజనావనుండు, శ్రుతిహితవచోనురాగుండు, నగునినుండు పూజ్యుండు. పవిత్రగోత్ర ప్రసిద్ధితో, భూరివేదులతోఁ బున్నాగతతితో, సుమనస్సుగంధబంధుర సరసులతోఁ దద్గృహమలరారునని సౌజన్యంబున మాన్యులైన విద్వద్వరేణ్యులుగ్గడింప శ్రద్ధమై వినియుంటి. అయ్యది నగ్నసత్యంబని నమ్మియుంటి.

(ద్వ్యర్థి)

కం. ఘనవనములు ఘనవనముల
మనుపుగతి న్మానవులను – మనుజాధీశుం
డనయము మనిపినఁ గాదే
జనవంద్యుండగుచుఁ బరము – సాధించునొగిన్. 367

మ. దిగధీశాంశజుఁ డుర్వినాథుఁడను సూ - క్తిన్నమ్మిమున్భక్తిమైఁ
దగఁ బూజించెఁ బ్రజాళిరాజు నదిమి - ధ్యాప్రత్యయేచ్ఛాలవం
బుగ భావించుననేఁ డెవండయినఁ ద - త్ప్రాజ్యాధిపత్యంబువోం
దగనర్హుండను శాసనంబున సుధ్ర - గ్ధర్మప్రబోధంబునన్. 368

చ. మృదుల హృదబ్జ పీఠమున - నీశ్వరునిల్పి యనల్పభక్తిమై
సదమల సర్వధర్మముల - సారమెఱింగి సమస్తమానవా
భ్యుదయముఁ గోరి యెవ్వడు మ–హోజ్జ్వలసత్కృషిసల్పు నాతఁడే
పదవికినైన నర్హుఁడని – భారతజాతి దలంచు నిత్తఱిన్. 369

చ. నవశకమాఁప దుశ్శకము – నాయనుభూతి యదట్లు దెల్పు మా
నవత నవత్వమూను జన – నాయకు లద్దియెఱింగి వర్తిలన్
శివమగు దేశదేశములు - శీఘ్రగతిం గడుమార్పు సెందుటల్
సువిదిత మావరాత్పరుని - శోభనలీల లెఱుంగ శక్యమే. 370

ఘ. "భయమే మృత్యువు ధైర్యమేబలము కో - పస్ఫూర్తియేవైరి సం
శయమే యోటమి జ్ఞానమేవెలుఁగు వి – శ్వాసంబె దైవం బనా
ధ్యయనంబే తమ మార్దవతాగుణమె మి - త్రత్వంబు సౌజన్యమే
జయభేరీ ధ్వని యింతయెంచి నడతన్ -సాగింపుమో ఛాత్రుఁడా."

వ. అని సత్యము మహర్షీంద్రు లుపదేశించిన యమృతవాక్కులు హృదయంబున నిల్పుకొని యేతత్ప్రాయోపవేశంబునకుం బూనితి. 372

తే. పనికి రాని కొన్ని - పదవుల నిడ నాంధ్ర
దేశ దుర్దశ తగఁ - దీఱఁ బోదు
చూరు నీళ్ళతోఁడఁ - దీఱ దేనుఁగు దప్పి
కాన రాష్ట్రమియఁ - గలుగుఁ దృప్తి. 373

తే. పసిఁడి బువ్వను మెక్కెడి - భాగ్యవంతుఁ
డైనఁ జివఱకు మట్టిపా - లగును గాన
లోక మేకార్ణవంబైన - లోఁగ నాఁగ
రాష్ట్రసిద్ధికి నర్పింతుఁ - బ్రాణమేనిన. 374

వ. అట్లుకాదేని నేనేదిజీవితపరమావధియని తలంచితినో దాని పరిధిం ద్రొక్కనివాఁడ నగుదు. విషము నమృతముగ నగ్గిని మంచుగ మార్చుకొనుచు నేనీ దీక్షను సాగింపవలయును. సత్యాహింసలు సమాంతర రేఖలుగ సాగుచున్న సమరమిది'' యనె కావున. 375

ఉ. కేవల నిష్ఠ నిట్టుల భ - గీరథయత్న మొనర్చు త్యాగికిం
దీవనతోడ రాష్ట్రమిడ - దేశయశస్సభివృద్ధిపొందు నం
భావనమీఱ నాంధ్రధర - భాసిలు నూత్నకళాకలాపియై
గ్లావుదయంబునం బరమ - కౌతుకమందు జగంబు రీతిగా. 376

తే. మద్రపురి లేని రాష్ట్రము - మాకు వలదు
దానికొఱ కేను బూనితి - ధర్మ దీక్ష
నని కలవరించు నిచ్చలా - ఘనుఁడు దాని
నిజస్థితిమెఱిఁగి నిర్ణయింపుఁడు - నీతినిధులు. 377

వ. అని వాక్రువ్వఁ దదధ్యక్షుఁడు చెన్నపురి విషయమున నాంధ్రుల యభిప్రాయమేమన దానిం దృతీయ శ్రేణికిం జెందిన రాష్ట్రముగఁజేసి కేంద్రప్రభుత్వ పాలితముగ నుంచుట లెస్స. అక్కఱగలిగిన నుభయ పక్షంబులు తమతమ రాష్ట్రప్రధానకార్యాలయములుమద్రపురి నుంచుకొన వచ్చుంగాని యద్దె చెల్లింపవలయునను సూత్రమునకుం గట్టుబడి యుండవలయు. మఱియొక్క ముఖ్యాంశంబుఁ దెల్పెద. మద్రాసు విషయమునఁ

త్రిలింగదేశ సర్వపక్షనేతల కిత్తఱినున్న యేకాభిప్రాయ మింతకుమున్ దెన్నండును గలుగలేదు. కాన వివాద విరహితమైన ప్రాంతములతో వెంటనే యాంధ్ర రాష్ట్ర నిర్మాణ కార్యక్రమ ప్రకటన ప్రధాని నెహ్రూ యొనర్చి రాముల ప్రాణములఁ గాపాడవలయుననఁ దత్సమజ్యాధిపతి మద్రాసును విసర్జించుటంగూర్చి వృద్ధనాయకాగ్రణియగు ప్రకాశము నిజాభిప్రాయ మేమని యుగ్గడించెనో యథార్థంబు వెలిబుచ్చుమన నతం డిట్లను. 378

మ. ఖిదురాభేద్యమనః ప్రవృత్తియుత ని – ర్భీతి ప్రభాయుక్త భా
స్వదఖండామరభ క్తిభావకలితా – వ్యాజప్రజారాధనా
స్పదకృత్యైకవిచారసంగతసదా – సారస్వతానంద సం
పదయుగ్రమ్యుఁడు టంగుటూరి తలమే – వర్ణింపఁ దచ్చర్యలన్.

వ. అయ్యాంధ్రకేసరి పల్కినపల్కులు వినుండు. "అసంతుష్టాద్విజానష్టానంతుష్టాశ్చైవపార్థివాః" అనిరి మునులు. మేము పార్థివులంగాక పోయినం దద్వ్యాపారముననుంటంజేసి చెన్నపురిపై మాకున్నహక్కును సహస్రదృష్టాంతములతోఁ దెలుపుచున్నారము. న్యాయదృష్టితోఁ బరికింపందగు. 380

చ. అదనుగ్రహించి సింహము గ – జాధిపుఁగుంభముఁగొట్టు నన్యమున్
బొదవదు పెక్కువర్షములు – పూర్ణజపంబొనరించినట్టి నా
వ్యథఁ దెలియుండు మద్రపురిఁ – బాసిన రాష్ట్రము నిచ్చగింతునే
మధువుఁ దొఱంగి సిక్థకము – మాకను టెంత వివేకహీనమో.

శా. కుక్షివ్యాపృతిమీఱి పీఠికకు నె – క్కుం గొప్పవాఁడే యశో
శాక్షీణామరశక్తియుక్తి జనతా – హ్లాదైకసంధాక్రియా
దక్షుండున్నతనేత్రుఁ డేమర నిజా – ర్థధ్వంస వర్తుండ యా
వృక్షాగ్రంబున నిద్రపోవు నరుఁడె – ప్డేఁ బాటుకుం దప్పునే. 382

వ. మున్నూటపదునొకండు వత్సరముల క్రితము చంద్రగిరిరాజగు శ్రీరంగదేవరాయలిచ్చిన సనదులోఁ జెన్నపురి తెలుఁగుపట్టణమని దాని యాంధ్రత్వమెన్నటికిమార్పరాదని లిఖించె. దక్షిణభారతభూమశకటు మార్గమేర్పడువఱకది తమిళులకు వానప్రదేశముకాకపోవుటంజేసి ఫాత

శాలల నాంగ్లాంధ్రమ్ముల బోధించెడివారనుట చారిత్రికసత్యము. కాన దీనినెల్లరు గమనింపందగునని. 383

ఉ. పాయక దేశసౌఖ్య మన - పాయపరిస్థితి వెల్గున ట్టిఁకం
జేయుఁడు స్వార్థముం విడిచి - చేఁతల వ్రాఁతల నీతినింపుఁ డ
న్యాయపుదారిఁ ద్రొక్కకుఁడు - నాయకుఁ డన్నపదంబు సార్థక
స్థాయిని నిల్పుకొన్న జయ - సంపదతో యశమబ్బు మీకిలన్. 384

వ. సత్యము నిష్కాపట్యము నిర్దోషిత్వము హృదయస్థైర్యము స్వచ్ఛందసేవాతృష్ణ ప్రజాహితులకుండందగునని బుధులు బోధించిరిగదా. మహాపురుషుల త్యాగఫలమే మనమూలబలమని ప్రజలెఱుంగుదురు. ఇఁక శ్రీరాములన్ననో సామాన్యమానవుఁడుగాఁడు. మహాత్మునిచే శ్లాఘింపఁ బడినఁ గాంధేయమార్గగామి. దేశసేవాగర్భమున నధికారతృష్ణను సృజించుకొన్నవాఁడుకాఁడు. 385

తే. పతితజాతుల వృద్ధికి - బడలుపడిన
పరమ కరుణాంతరంగుఁ డీ - భవ్య చరితుఁ
డంచుఁ బండిత పామరు - లతని మెచ్చి
కొనిరి కొనియాడి రంచిత - కుతుక మెసఁగ. 386

ఉ. ఈసును రోసముం విడిచి - యీశు పదాబ్జములంద నిండు వి
శ్వాసము నిల్పి లోకము సె - బాసన వర్తనమూని మానియై
వాసికి వాసిగూర్చు గుణ - వంతుఁడు దాంతుఁడు దేశభక్తుఁడే
దోసములేని మానిసని - తోడన నాతని కోర్కెఁ దీర్పఁడా. 387

తే. భారతీయుల నందఱఁ - బరమ కరుణఁ
జూడవలసిన బాధ్యత - సుమ్ము మనది
కాన నిష్పాక్షికవుదృష్టిఁ - గార్య గతుల
నరసి వలసిన పని వేగ - జరుపఁ దగును. 388

వ. ఎవరికి నష్టము కలిగినను దనకుఁగలిగినట్టు భావించుట యుత్తమ నాయకుని లక్షణము. నిరాహారదీక్ష శారీరికముగ మానసికముగ నమ్మహాదేశభక్తుఁ డెంత బాధపడుచుండెనో సభ్యమహాశయు లూహింత్రు గాక! భారసంఘము మద్రపురి యుభయుఘులనగరముగఁ బ్రత్యేకరాష్ట్ర

ముగఁ జేయుటుచితమని తెలుపుట మనకెల్లరకుందెల్లమ. ఏదియెట్లున్నను బలుబాసలవారటనుంట నెంతమందికేదిమాతృభాషగనుండెనో నిష్పక్ష పాతబుద్ధితో సత్యబద్ధముగ గణించి ధర్మసమ్మతముగఁ దీర్పు సెప్పుట ముదావహాము. 389

తే. ప్రాణములతోడఁ జెలలాట - గాన దీనిఁ
జిన్నవిషయముగా నెవ్వ - రెన్నఁ దగదు
తెలుఁగు సోదరు లెల్లరు - తీర్పు వినఁగ
నెదురుచూచుచునున్నార - లిది నిజ మన. 390

వ. పక్షద్వయసమానబలాకర్షితరజ్జువుంబలె మద్రపురివిషయము బిఱ్ఱబిగిసి కేంద్రమునకొకగడ్డుసమస్యయగుటంజేసి ప్రగాఢముగ సుదీర్ఘముగ సునిశితముగఁ జర్చింపవలసియుంట జాగగుచున్నదని సభాపతి వాకొన నింకంగాలహరణమవాంఛనీయమ్ము; శుభస్యశీఘ్రమ్మను నార్యోక్తి స్మరణీయమ్మని లంకసుందరము నొక్కివక్కాణింప సభాధ్యక్షుం డాంధ్రరాష్ట్రవిషయము వేగఁబరిష్కరింపఁ బడుమార్గమన్వేషింతుమనె. 391

తే. విషయమెల్లనుబూర్తిగా - వీనులఁబడ
సరగజనియించె గుసగుసల్ - సభ్యులందు
నాఁటికాచర్చనాఁపెఁ ద - న్నాయకమణి
సభయు ముగిసెను నిర్ణీత - సమయమునకు. 392

తే. ఎంతయత్నించినను దీని - యంతుతేల
దింతవఱ కన్యమార్గ మిం - కేది యనుచు
నాంధ్రదేశ సమాగతు - లంద ఱదియ
యాత్మలోఁ గొంత చింతించి - యరిగిరపుడు. 393

వ. ఇవ్విధంబునం దర్జన భర్జనలు సాగుచుండ రాముల ప్రాణశక్తి క్షీణించుచుండంగని పలువురు దయార్ద్రహృదయులు విచారపడిరి. 394

తే. అస్త్రశస్త్రహతుండగు – నట్టి నరుఁడు
కొన్నిక్షణముల నుసురులు – కోలుపోవు
నా నిరాహారదీక్షితుఁ – డనుభవించు
బాధ వర్ణింపఁదరమౌనె – బ్రహ్మకైన. 395

ఇయ్యది శ్రీమదాంధ్ర మహాభ్యుదయ ద్వితీయ భాగమున
నవమ ప్రకరణము సమాప్తము.

# అరుంధతీ నగర మహాసభ

తే. లంకసుందర సుగ్గతి - లలిత రీతిఁ
గేంద్రశాసనసభఁ బల్కె - సాంద్ర కరుణఁ
గాని పెద్దలలో మార్పు - కాన రామిఁ
దెలుఁగు దేశంబునకుఁ దెన్ను - తెలియ కుండె. 1

వ. అంత నేకాదశాహమ్మున రాములదీక్షం బ్రోత్సహించుచు సహస్ర హరిజనగృహాశోభితంబగు నరుంధతీ నగరంబున నొక్కమహాసభ జరుగఁ దదధ్యక్షస్థాన మలంకరించిన యాంధ్ర మహామహారథుండు మహర్షి బులుసు సాంబమూర్తి తత్సభికుల కిట్లను. పరపరిపాలనమున దేశము దరిద్రదేవతావశమై క్రిమిదష్టదళముపలెఁ గళాహీనమయ్యె. ప్రాదళం బులురులం గ్రొంజిగుర్వెలయునట్టు పెఱియేల్బడితోలఁగ స్వతంత్రపాలన మేర్పడె. ఇపుడిప్పుడ నల్మాలలఁ బ్రజలుప్రబుద్ధనయనులగుట ముదావహము. నిస్స్వార్థప్రజాసేవకులే దేశోద్ధారకులు. 2

సీ. సంపత్స మృద్ధమౌ - సామ్రాజ్య మిరసా
స్పర్శ మాత్రవిభిన్న - శక్రలోక
మనిరి బుధోత్తము - లవ్విధి సద్గుణి
దివ్యయశఃకాయ - దీప్తి మహిమ
మర్త్యుఁడయ్యు నిజంబ - మర్త్యుఁడౌ ననుసూక్తి
యక్షరసూనృత - మగుట నరసి
దారపుత్రీపుత్ర - ధనధాన్యతతి లెక్క
సేయకే సత్కీర్తి - సిద్ధికొఱకు

తే. అహరహము ధీరవర్యు ల - త్యంతదీక్ష
సర్వమాసవ సాక్షాత్కృ - సౌఖ్య నరస
జీవయాత్రార్థులై నిచ్చ - చెలఁగు టరుదె
భరణ రక్షణ గుణగణ - పరులు ఘనులు. 3

తే. విషమఘట్టమునందాంధ్ర - విషయ ముంతఁ
బౌరుషోద్యోగములు భంగ - పడఁగ నీక

ఘనుఁడు రాముఁడు దీక్షించె – జనము వొగడ
దైవకృప యెట్టులుండు నో – తరమ తెలియ. 4

వ. నిర్వివాదప్రాంతములతోఁ బ్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణము జరుగవలయు
నను నంశమును తుషారచటర్జీ రెండు వత్సరములక్రిందటఁ గేంద్ర
శాసనసభం బ్రవేశపెట్టె అనంతర మావిషయమునే పైడావేంకటనారా
యణ సుందరయ్య లభ్యర్థించిరి. మద్రాసుశాసనసభం దెన్నేటి వావిలాల
నాగిరెడ్డి ప్రభృతు లేతత్సమస్యా పరిష్కారమత్యవసరమని, దానింజర్చ
కుందెచ్చినంత వాదోపవాదములు జరిగె. అత్తఱిఁజెన్నపురవిషయమున
సర్వపక్షములేకాభిప్రాయమునకురావలయునని యట్టియొకంబడిక కుదు
రుట కుత్తరప్రత్యుత్తరములు జరుగుచున్నవని నెహ్రూ పలికె. ఆసంగ
తిని విపులముగఁదెలుపుమన రాజాజీ యది రహస్యమనె. అదియెంతకుం
దేలకుంట రాము లామరణనిరాహారదీక్షంబూనె. 5

ఉ. పావనుఁడైనగాంధి పద – పద్మములం భజియించి రాజ్యముజ
సేవలఁదన్పి రాష్ట్రరమఁ – జేర్పఁగఁ బ్రాణముమీఁద నానలే
కీవిధి దీక్షఁ బూనఁగ గ – ణింపరు కేంద్రపుటగ్రనాయకుల్
కావడి మోయువాఁడెఱుఁగుఁ – గష్టము చూచెడి వాఁ డెఱుంగునే. 6

ఆ.వె. ఎంచి పాఱవేయు – మేటిలోనైనను
దల్లిబిడ్డలకును – దగును న్యాయ
మనిన సూక్తి మర్మ – మరసి యుపేక్షకుఁ
దావొసంగఁబోరు – ధర్మ విదులు. 7

కం. కడలేని యెఱుక బలిమిం
గడియించె స్వరాజ్య మెంతొ – కౌతుక మెసఁగం
గడకిట్టు లైకమత్యము
చెడ స్వర్గమునందు గాంధి – చింతింపఁడొకో. 8

కం. దాచిన ధనంబు కర్తకు
వే చేర్చినయట్లు లీయ – వివిధవిధములం
బూచిన తంగెడు వోలెం
దోఁచును రాష్ట్రంబు నిత్య – తుష్టిం బుష్టిఁ. 9

వ. అనవసరనిరోధములవలన విరోధములుగలుగు. ఆడెడిమాటలకుఁ జేసెడిచేష్టల కన్వయముకుదురనివానింగనఁ గొట్టెడిగంటలకు ముండ్లు సూపెడికాలమునకు సంబంధములేని ఘటికాయంత్రమును జూచినట్లుండు.

చ. నలుబది యేండ్లఁగోలె నతి – నమ్రత వేఁడ నొకింత కేంద్రమం
దలఁజడితోఁప దెట్టులిఁక – నందఁగలారము సత్ఫలంబు ని
శ్చలమతి రాము లామరణ – సద్వ్రతియై జలమైనఁ గ్రోలకే
నిలువునఁ బ్రాణమిచ్చుతఱి – నిబ్బరముండునె తెల్గువారికిన్. 11

ఉ. చెన్నుఁడు దెన్గురా జతని – చేతులతోడఁ బ్రతిష్ఠసేయుటం
జెన్నపురంబునాఁ దనరె – చెప్పెడిదేమి తదాది దీని య
భ్యున్నతిఁ గోరి యాంధ్రులు బ – హూత్తమకృత్యములంబొనర్చి సం
పన్నమొనర్చి రట్టిఘన – పట్టణ మెట్టుత్యజింతు రిత్తఱిన్. 12

తే. ఆంధ్రతమిళుల కిట సమ – మైనహక్కు
లున్నవని బిసెంటు పలికె – మున్నె యరసి
యామె జాతీయసభకు న – ధ్యక్షురాలు
కాన నమ్మాట పాటింప – ఘనత గలుగు. 13

వ. నేఁడు భాషారాష్ట్రవ్యవస్థీకరణ మొక ముఖ్యాంశము. సర్వపరిపాలనకృత్యంబులు మాతృభాషంజరిగినప్పుడే న్యాయము రక్షింపంబడఁ గలదని మహాత్ముఁడన్నపల్కులం బురస్కరించుకొని నిద్రాణమైయున్న యంతశ్శక్తులమేల్కొల్ప రాములీదీక్షంబూనె. అతని శరీరము నందలి ప్రత్యణువు దేశభక్తిరసపూరితమే. ఆతని యాత్మనిగ్రహోద్భుతత్యాగము లద్వితీయములు. అమ్మహానుభావుని ప్రాణరక్షణ మవశ్యకర్తవ్యము. 14

తే. పేరుగాంచిన పెద్దలుం – బిన్న లెన్న
హద్దు దాఁటిన మర్యాద – లందఁ బోరు
కాలుజాఱినఁ దీసికోఁ – గలరు గాని
నోరు జాఱినఁ దీసికో – నేర రెవరు. 15

తే. కొంకక వచింతు నిజమిది – కొన్నియెడల
గొప్పవారని పేరికిం – గొప్పె గాని

చొచ్చి చూచిన నదియే మొ - నచ్చ దొర
గచ్చుచేసిన నేలపై - ఆోచ్చు హెచ్చు. 16

తే. శరధికౌశేయవేల్లిత - ధరణియెల్లఁ
గైవసము చేసికొన్నను - గలదె తృప్తి
తనివిలేనట్టి నరునకుఁ - దాల్మి లేదు
తాల్మి లేకున్న సాధు స - త్తముఁడు గాఁడు. 17

తే. జ్ఞాని సక్రమపథమంది - సౌఖ్య మిచ్చుఁ
గాంతికిరణంబు ఋజుమార్గ - గామి గాదె
మూర్ఖుఁ డక్రమవర్తియై - ముప్పు దెచ్చు
గ్రహము వక్రింప నశుభము - గలుగుఁ గాదె. 18

తే. ఎంతచదివిన ధర్మము - లెన్ని విన్న
సహజగుణ మెన్నడును బాయఁ - జాలఁ డెవ్వఁ
డెంత యెత్తున కెగిరిన - నెటు తిరిగినఁ
దెలియ గృధ్రంబునకు నధో - దృష్టియగద. 19

వ. ఉపజాపకుఁ డవిశ్వాసవిషలతాప్రరోహకుఁడు కుతర్కక్రియా కుశలుఁడు దేశసౌభాగ్య సంధాతలు కాఁజాలరు. ఇద్దియెఱుంగని నరులు భూలోకనరకమునకే దారితీయుదురు. స్వచ్ఛపవనమనుభవింపక దేహమలినములు విసర్జింపఁబడనట్లు దివ్యజ్ఞానసముపార్జనలేక యంతశ్శత్రువులు తొలఁగిచనవు. అంతర్దృష్టిశూన్యుండు సత్యసత్పథముంజూపఁ జాలఁడు. శ్రీరాములు మహాజ్ఞానిగాని మూర్ఖుడుగాడు. ఇన్నగరంబునఁ బుట్టిపెరిఁగి గాంధీజీకిఁ బ్రియతమాంతేవాసియై యనేక సత్యాగ్రహములం బాల్గొని మహాత్మునితోఁ గారాగార శిక్షల ననుభవించి, సేవాగ్రామమున హరిజనోద్ధరణకై యిర్వదెన్మిది దివసంబు లుపవసించి విజయంబుఁ గాంచిన హరిజన బాంధవుఁడగు నతని కరుంధతేయులుచవఱు సాను భూతిం దెలుపవలయుననఁ "చతుర్భాషా ప్రజకుం బ్రధానుఁడుగనున్న రాజాజీ మద్రపురి పూర్తిగం దమిళులదే యంట యన్యాయ" మని భాగవతుల లక్ష్మీనారాయణ యుగ్గడింపఁ "జెన్నపురిలో నాంధ్రులకు హక్కు లేదన్న రాజాజీకి మద్రపురము సర్వము తైలింగులదే యనుట నత్యబద్ధమైన ప్రత్యుత్తరమనివా స్తవములవక్రీకరణవాంఛ వాంఛనీయముగా"

దని వీరనారీ శిరోమణి సుభద్రమ్మ నొక్కి వక్కాణించె. అంతం దాడిమేటి శంకరశాస్త్రి ఢిల్లీలో లంకసుందర మొనర్చుచున్న యమోఘ కృషిం దెలిపి. 20

ఉ. ఇందఱు మున్నివర్షము ల – హీనకృషిం బరిశోధనంబులం
దందయొనర్చి మద్రపురి - యాంధ్రుల హక్కని పెక్కుసార్లుగా
ముందుగ జెప్పమే చరిత – ముఙా మొగమున్నది యద్దమున్న దిం
కెందుకు సందియమ్ము కడ - కెట్టులొ సత్యము తేలకుండునే. 21

మ. ఇరుపక్షంబులు రెండునేత్రములుగా - నీక్షించి చారిత్రిక
స్థిరసత్యంబు గ్రహించి ధర్మపథముం - జింతించి యాచారముం
బరమార్థంబును తూచి తీర్పెదగదే - ప్రావీణ్యముం జూపుచుం
గరుణాసాగరుఁడైన గాంధి మతముం - గాపాడుటే పాఁడియా. 22

కం. పరుల కుపకృతి సేసెడి – నరుఁడుష్కోటి
కొక్కఁడుండ నపకృతికిఁ - బెక్కురుందు
రిద్ది నిక్కంబు గాన మీ - హృదయ పటిమ
నిర్వ్యరకు న్యాయమును గూర్చు - టెంతొ మేలు. 23

శా. కారాగారములందు మ్రగ్గితిమి సం – గ్రామంబు గావించి మా
వీరుల్గుండ్లకు గుండెలిచ్చి యరులఙా - వేఁటాడి యింగ్లండులో
ధీరుల్వీరని కీర్తిపొంది రిది యీ - దేశం బెఱుంగుంగదా
యీరే మాకిఁక మాపురం బనఘు లెం- తే సత్యమూహించుచుఙా.

వ. "అంచుం గేంద్రము నాంధ్ర కేసరి యభ్యర్థించెనని లంక సుందరము తత్సభనివేదించె. కాని యిందన్క నటుఁగదలిక కనఁబడకుంట శోచనీయము. శుష్కారణ్యమునకు నిప్పు పెట్టుట సులభమేగాని ప్రజ్వలించిన దావాగ్నిం జల్లార్పుట సులభసాధ్యము కాదుగదా. 25

కం. మించిన యధికారేహో
దంచిత మాయా విలాస - మది తగ దెందుఙా
పంచన మంచిది కాదని
పంచిని బోషింపలేని – మనుజుఁ డనఘుఁడా. 26

ఉ. కల్లను నిక్కమంచు జన - కంటకవృత్తిఁ జరించు మర్త్యుఁడె
ష్ఠొల్లఁడు సాధుబోధవిన - నోర్చున నాత్మగురూపదేశమే
యొల్లని మానవుం డొరుల - సూక్తులకుం జెవియొగ్గి నిల్చునే
తల్లికి గంజినీఁడు పిన - తల్లికిఁ జీరలు పెట్టనేర్చునే. 27

వ. ప్రజల విద్వేషభాండము బ్రద్దలైనతఱిం బ్రభుత్వమ్ప్రమత్తత వర్తిల్ల దేని దేశమధోగతిపాలగు. ఎంత రాజకీయ వైదగ్ధ్యమున్నను బాధ్యతారహితవర్తనము గర్హ్యము. ఆత్మగౌరవముగల మానవతాస్థితికి మహాత్ముని బోధ లత్యవసరములు. సర్వజన భాగ్యోపబృంహణము వాంఛనీయము. ఎన్నివిధంబుల మన బాధలందెల్పినఁ గేంద్రము. 28

కం. ఇద్దఱు ససేమిరా యని
గ్రుద్దుకొనం జూతు రెట్లు - కుదురును బేరం
బెద్దియుఁ దోఁపక యిగ్గతిఁ
బ్రొద్దులు పుచ్చెదము సత్య - మును దెలియుఁ డనేఁ. 29

వ. ఇఁక శ్రీరాములన్ననో సామాన్య మానవుఁడు గాఁడు. 30

ఉ. పుట్టువుఁదొట్టి యిట్టి పరి - పూర్ణ దయామతి నున్న దిట్ట యీ
సెట్టి స్వదేశసేవకుల - జెట్టి స్వలాభమునెట్టి మంచిచే
పట్టి క్రియాకలాపుఁడయి - వారక పట్టిన పట్టు వీడఁడె
ప్పట్టున దైవభక్తుఁ డతి - పావనవర్తనుఁ డీతఁ డెన్నఁగన్. 31

వ. దైవదయార్ద్ర క్షణక్షణ నూత్న తేజోన్వితుండగు. మాత శిశువునుం బోలె భగవంతుఁడు భక్తులను బ్రోచు. సేవానిరతి ధర్మద్యుతియని దీక్షఁ బూనిన రాములయెడఁ బ్రజలకుఁ బ్రేమనిండినను నోముపండలేదు. కాని దీక్షయను కతారి వతారి సంఘమునకుఁ బవిత్ర జీవితముగల వ్యక్తి యవసరముకాన వాని ప్రాణరక్షణ మవశ్యకర్తవ్యము. మానవ చైతన్య జీవన విధానము వికాస భాసురమగుటకుఁ బ్రత్యేక రాష్ట్ర మవసరము. అందఱు చదువుకొన్నవారేగాని ధర్మనిర్ణయ మిట సరిగ జరుగకపోవుట విచారకరము. 32

ఆ.వె. చదువుకొన్న దాని - సారాంశ మెల్లను
శుద్ధవర్తనమునఁ - జూపఁ డేని

పుస్తకమును విస్న - పుర్వు చందంబని
యాడు చుంద్రు పెద్ద - లనవరతము. 33

చ. ఇలపయి సూర్యచంద్రులటు - లెవ్వఁడు నిల్వఁడు శాశ్వతంబుగా
నిలిచిన యన్నినాళ్ళమిత - నిర్మల నీతిఁ జరించు నాతనిం
దలఁతురు సజ్జనుండనుచు - ధర్మవిదు ల్బుధులాదరంబుతోఁ
బలుపురు మంచివాఁడనుచుఁ - బల్కుటయే పదివేలు గాదొకో. 34

కం. ఎవరెన్ని యన్న రాముల
నవనమువలె నవన మెవఁడు - నల్పునొ వాఁడే
భువి నెఱుఁగు దాని కష్టము
కవి కష్టము దెలియ గొప్ప - కవికే చెల్లున్. 35

కం. నలువది యేడుల నుండియుఁ
గలనిది సాగింప నుంత - కనఁబడదయ్యెం
ఫలమని చివఱకు రాములు
నిలిచె నిరాహారదీక్ష - నిశ్చల మతితో. 36

కం. సర్వోదయసిద్ధాంత మ
ఖర్వగతి న్సాగిపోవఁ గాంక్షించి క్రియా
నిర్వాహణోత్సాహకళా
ధూర్వహుఁడై రాములుంట - తోఁపదె మనకున్. 37

ఉ. పావనుఁడైన గాంధి పద - పద్మముల న్భజియించి రాజ్యమున్
సేవలఁ దన్పి రాష్ట్రరమఁ - జేర్పఁగఁ బ్రాణముమీఁద నాసలే
కీవిధి దీక్షఁ బూనఁగ గ - ణింపరు కేంద్రపుట్రగనాయకుల్
కావడి మోయువాఁ డెఱుఁగుఁ - గష్టము చూచెడి వాఁడెఱుంగునే ?

కం. అమ్మహనీయుఁడు కడు విన
యమ్మునఁ జేమోడ్చి ప్రజల - కాడిన వాక్కుల్
సమ్మదమున వివరించెద
సమ్మానింపుఁడు తదీయ - సంభాషణమున్. 39

వ. నాగపూరు భారతజాతీయ మహాసభలో విజయరాఘవాచార్య
-ధ్యక్ష్యమున స్వాతంత్ర్యము లభించినంతన భాషారాష్ట్ర విభజన

మవశ్యకర్తవ్యమని తీర్మానింపఁబడె నాంధ్రతమిళులిట సమానమైన హక్కు లనుభవించుట లోకవిదితము. సర్. శంకర్నాయర్ (Council of State) రాష్ట్రసభలో నఱపరాష్ట్ర సర్థించుచుం జేసిన తీర్మానమున నిర్ప్వరదనుభావముస మద్రాసుసంయుఁజేర్పరుంట యగ్రనేతృశ్రేణి యెఱింగిన విషయమే ఇరుదెసలవారికది ముఖ్యపత్తసముగనున్న కల కత్తావంటి బృహన్నగరముగవృద్ధిపొందు. కాదేని ద్వయంబుగసమ విభక్తంబుకాకతప్పదు. భాషావిషయికముగఁ బురప్రజలసంఖ్యనెంతయ క్రమముగఁజూపినను శతసహస్రోదాహరణములతో మద్రాసాంధ్రులదని ఋజువుచేయఁగలము. వెలమవీరుఁడైన దామెర్లచెన్ననృపుని పేరం జెన్న పట్టణ మేర్పడెనంట చరిత్రప్రసిద్ధము. (పోర్చుగీసువారు) బుడతకీచు లాంధ్రుల జెంటూసనియు వారిపురమును జెంటూపురియనియుఁ బిలిచిరి. సెంటుజార్జికోటవఱకు చెన్నపురియనియుఁ దానికుత్తరదిశంగల యెన్లనే డనుప్రదేశమునకు మాదరాజుపుటభేదనమనియు నాఁటి పేర్లొప్పె. మాద రాజొకతెలుఁగుఱేఁడు. మాదరాజునగరమే క్రమముగా మద్రాసనంబరగె. ధార్ సంఘమాంధ్రులహక్కు నంగీకరించె. సమీక్ష్యకారికిందలి సమీచీనము దోఁపకుండునా ? మతసాంఘికరాజకీయాది వివిధసమస్యాపరిష్కారము లతిశాంతియుతముగ నిర్వర్తింపఁబడుట మానవతానిర్మలధర్మసూచకము. దేశకల్యాణకరము. ఆంధ్రరాష్ట్రోద్యమాంకురార్పణ మెప్పుడుజరిగెనో రాజాటికేగాక మీకెల్లరకుందెల్లము. 40

శా. నాఁటంగోలె విధిజ్ఞు లెన్నొవిడుతల్ – న్యాయంబు స్పష్టంబుగాఁ
జాటంజొచ్చిరి పత్రికాముఖములజా – సర్వంబు తన్నేతకె
ప్పాటన్నాటుమి బాటయెట్లొదవు స – ర్వంబీశ్వరాధీన మ
న్నాటన్నమ్మి స్వరాష్ట్రదీక్షమెయి ధ – ర్మప్రక్రియన్నిల్చెదజా. 41

కం. ముదియ్యాబు పురాణంబులు
నెయ్యముమైఁ జదివినట్టి – నిపుణులు గూడం
గయ్యమునకు గాల్ద్రవ్వుట
యయ్యయ్యో యైకమత్య – మడఁచుట గాదే. 42

తే. పలుతెఱంగులఁ బరికించి – కలికి నులికి
ధర్మదేవత కాఁబోలు – ధైర్య ముడిగి

యాదరించెడి వారెవ్వ - రైనఁ గలర
యంచు వీధులవెంట న - ల్లాడుచుండె. 43

కం. ఏకట్టియు నివ్వండిన
నాకట్టియ కాలుచుంట - సరయమె నరగన్
రాకెట్టులుండు రాష్ట్రము
వాకట్టుం గట్టఁ బరుల - వశమా మనకున్. 44

తే. నవ్య మానవతా పూత - నాగరికత
దివ్య మహిమాన్వితంబయి - దెసలనిండ
ఖ్యాతియుత సత్క్రియోపేత - ఘనబుధనుత
నీతి జాతికి జీవన - జ్యోతి యగుత. 45

వ. అనిపలికె. కేంద్రసంకుచితదృష్టి ముఖ్యమంత్రిరాజకీయతంత్రములు జీవన్మరణసమస్యావిషయమున స్పష్టపడుచున్నవని లౌకికజ్ఞానవేత్తలు కొందఱంద్రని శంకరశాస్త్రి. 46

కం. ఆతని ప్రాణము వోయిన
నాతత విప్లవముపుట్టి - హానిం గూర్చున్
నేతలిది యెఱిఁగి మెలఁగిన
జాతికి గడుమేలుగలుగుఁ - జయ్యన ననియెన్. 47

తే. అమ్మహాసభ పెద్దల - ట్లాడ నిజము
కన్నులకుఁ గట్టినట్టుల - కానఁ బడఁగ
సమ్మతిం దెల్పుటో యన - సభ్యజనుల
కేకిసలమ్రోఁత శ్రుతులకు - గింగురుమనె. 48

## మి త్రా లా ప ము

శా. అవిశ్వాసమదెట్టిదో ప్రతిన ర - వ్వంతైన వీడండు సం
భావింపందగు రాముసంచుఁ గరుణా - పాథోధి యాంధ్రప్రజా
సేవాసక్తుఁడు సాంబమూర్తి యెదలోఁ - జింతించుచున్ వాకొనన్
వావాదున్ విని సంతసించె సభిక - వ్రాతం బశేషంబుగా. 49

వ. పొట్టిశ్రీరాములకుజే. రాష్ట్రమురావలె. మాకష్టములు పోవలెనని ప్రజలుద్రేకముతో దిక్కులుమార్మోఁగ నఱచిరి. 50

శా. భోగంబీగికిఁ దుల్యమెట్టనుచు రా — ష్ట్రుండట్టులుండం గనన్
వేగన్వచ్చుసుధీవరేణ్యు హితునిన్ — వీక్షించి ముద్వార్థిఁ దాఁ
దోఁగెం బెన్తలపోఁతలం దగిలి ప్ర — త్యుత్థానసమ్యక్క్రియం
గ్రీఁగంటన్నగి కేలుకేలఁగొన భ — క్తింబల్కె మిత్రుండిటుల్. 51

కం. అన్నగతి ప్రాణంబని
రన్నా తనువున్న యన్ని — యమరు పదుక్తుల్
మన్నింపవు దినదినమీ
తిన్నని మై చెన్నుదొఱఁగె — ధీరత పెరిఁగెన్. 52

కం. కోరినపని మనశక్తికి
మీఱినఁ దఱికొఱకుఁ జూడ — మేలగు సరగన్
మూరెఁడు ముందుకు దూఁకియు
బారెఁడు వెనుదిరిగి చనుట — భావ్యంబగునే. 53

కం. తెంపరితనమున నాలో
చింపక నీజీవరసము — చిందించియు సా
ధింపమి నేతగఁ దగ రా
ణింపవు గిరిఁదాఁకు తగరు — నీవౌదువుగా. 54

కం. కుడువుడిగి యేమి సేసెద
వడుగడుగున నడ్డువత్తు — రఱవలు మనకే
వడువున జయమగుఁ దద్గతిఁ
బొడగన మనపానకమునఁ — బుల్లై తోఁచున్. 55

వ. మనలనడంచినంగాని తమిళులింక మహోన్నతస్థితికింజనరు. ఏతమునవొకకొమ్ము పూర్తిగఁద్రుంగిననంగాని రెండవకొమ్ము సమగ్రముగఁ బైకిలేవదు. రెండురెండుకన్నులులుగఁగనందగిన యడదడి తూష్ణీంశీలమగుట శోచనీయము. కలసివచ్చెడిరోజులతో నడచివచ్చెడి బిడ్డవుట్టు. కానిదినములఁ గఱ్ఱగొఱ్ఱెయైకఱచు. 56

ఉ. నె త్తిన నోరు పెట్టుకొని – నేనిటు లెన్నివిధాలఁ జెప్పినన్
హ త్తదు నీదుచి త్తమున – హాస్యమటంచుఁ దలంచితేమొ నీ
కుత్తుక నూపిరుండ నొన – గూడదు రాష్ట్రము తెల్లువారిలో
బొ త్తిగ నైకమత్యమది – పూజ్యము రాజ్యము భోజ్యమౌనొకో. 57

కం. కొండకు నాగలి వేయుదె
మొండితనంబేల చాల – మోహిత మతివై
పిండెదె జీవరసంబుల
నిండదు నీకోర్కి యింక – నిల్పు తపంబున్. 58

కం. ఏటికి నెదురీదగ నీ
కేటికి నేతలకులేని – యింతటి దీక్షం
గూటికి నోచక తనువను
గూటికి నిఁక దూరమగుదె – గుణిమణి రామా. 59

కం. గురుశిష్యుల న్యాయ్యమ్మునఁ
బరమపదము నందుకొంటి – భవ్య మనస్కా
నర సుర లోక స్తుత్యా
భరతావని బాగుసేయ – బ్రదుకుము తండ్రీ! 60

ఉ. క స్తి భరింపరానిదిది – కావునఁ గన్నుల నీరునింపుచున్
హ స్తములంటి వేఁడిన ర – వంతయు నిష్ఠనడల్ప వయ్యయో
నిస్తుల సాహసోజ్జ్వలత – నిల్చెదె గెల్చెదె జమ్మియాకుతో
వి స్తరకుట్టు యత్నమిది – వే విరమించుట లెస్స మిత్రమా. 61

చ. తగదిది యేటిమాట విస – తంతువు మేరువు లాగఁజాలునే
తగరపుఁగ త్తి యాకృతికిఁ – దక్క విరోధుల రూపుమాపునే
వగచిరె నేత లీస్థితికిఁ – బల్కిరె నీకనుకూల వై ఖరిన్
దిగులుజనించు నిన్ననిన – దీక్షకు నీవిఁక స్వ స్తిచెప్పుమా. 62

తే. ఎందఱినొ చంపి చచ్చి గ – డించినట్టి
విజయ గౌరవ కీర్తులు – విభున కబ్బు
భంగి నెందఱొ కష్టించి – పడసి నట్టి
ఫలము తన్నేత్నమణికి సం – ప్రా ప్తమగును. 63

వ. అయ్యాయుతఙుల నసాధారణరాజకీయతంత్రము శతముఖోపేతా సామాన్యానూహ్యాథర్మోద్రిక్తమైవర్తిలు. 64

ఉ. అంగధరాతలేశ్వరుఁడ – నంగనిభాంగుఁడభంగసంగరో
త్తుంగశతాంగసంగతుఁడ – తుల్యభుజాబలవిక్రమార్కుఁడు
త్సంగవినిర్గతాసృగతి – ధారసమర్చితభార్గవుండు వ
జ్రాంగుఁడధర్మయుద్ధహతుఁ – డౌట యెఱుంగమె రాజ్యకాంక్షమై. 65

కం. శ్రుతిమించిన రాగంబై
మతికతుకదు ముఖ్యమంత్రి – మాట తెలుంగుల్
శతవిధముల యత్నించిన
గతిగనఁబడ డింకనేమి – కానున్నదియో. 66

కం. ఇందఱిలో నీవొకఁడవ
మందనఁగా ప్రామనుదెచ్చు – మతిమంతుఁడవే
యెందుల కింతటి త్యాగము
తొందరవిడనాడి శాంతి – దూతవు గమ్మా. 67

కం. అనవిని మందస్మితమునఁ
గనుఁగవఁ గ్రొంగొత్త కాంతి – కడలొకొనంగం
గని తనువిది శాశ్వతమా
పనియొక్కటి ప్రజకుఁ జేత – ఫల మనుకొందుణా. 68

కం. చేపట్టుదొఱక కిప్పనిఁ
జేపట్టితి పట్టు విడువఁ – జెల్లునె గుణికిం
జాప విముక్త శరంబది
యేపగిదిం దిరిగి వింటి – నెనయుం జెపుమా. 69

వ. రాజకీయతంత్రరాజము శతసహస్రముఖముల విరాజిలు. అందు నిపుణులైన కొందఱు తెఱచాటుననుండి నాటకమాడింత్రు. 70

ఆ.వె. పేరి గాని విలిచి – పీఁటపై నెక్కించి
తొత్తు వోలె నుంచి – పెత్తనంబు
మనము సేయ వచ్చు – ననెడి పెద్దల మాట
నీటి మూట గాక – నిశ్చలంబె. 71

తే. ధగధగ వెలుంగు ముద్దు ఖ – ద్దరు ధరించి
వాటమై వెల్గు జవహరు – కోటు దొడిగి
గాంధి బొమ్మకు మ్రొక్కి త – త్కథలు వల్కి
చెప్పరానట్టి పనులెన్నొ – చేయుచుంద్రు. 72

కం. ముకుద్రాడు లాగ బసవఁడు
సకలమునకు శీర్ష మూప – సాగెడి గతినేఁ
డకటా! కొందఱ స్థితులిటఁ
బ్రకటితము లికెట్లు జయము – వడయం గలమో. 73

తే. నాయకుఁడ నన్న మాత్రాన – నమ్మి ప్రజలు
ప్రక్కతాళము వేయుట – పనికి రాదు
జ్ఞాని యజ్ఞాని మానవు – లైన సములె
స్వాతి వాన విభాఖవ – ర్షంబు సమమె. 74

తే. దేశ దాస్య తమస్సెల్ల – దీఱెఁ గాని
భావ దాస్యాంధ కారంబు – పాయలేదు
మూఢ విశ్వాస నిచయ వి – ముక్తిలేక
ప్రజలు ముందంజ నిడి శోభ – వడయఁ గలరె. 75

తే. శాంతిదూతకు మేమెగా – ఛాత్రుల మని
విఱ్ఱవీగెడి గఱువలు – వేగఁ గదలి
యూరి నడిబొడ్డునంజేరి – యేరి కోరి
గాంధి నీతులు ప్రజలకుఁ – గఱపవలయు. 76

తే. మాతృ దాస్య విముక్తిమై – మనము మేలు
పొందఁ గలమన నదితల – క్రిందులయ్యెఁ
గాన మామాటకున్విల్వ – లేని యెడల
బ్రదుకు చేలిఁక భూమికి – భార మనఁగ. 77

మ. పలుమార్లెందఱు కేంద్రనాయకుల సం – ప్రార్థించినన్ సత్ఫలం
బలరంజాలమిఁ గొన్నదీక్ష నెటుపా – యంజూతు నేమైనఁ గొం
దలమందన్మది మాఱదీశపథ మీ – నంగాచి యిట్లింక న
క్కఁటపాల్సేఁతకుఁ బ్రాణమొప్పదనెఁ ద్యా – గశ్రీప్రకాశింపఁగన్, 78

వ. రాములట్లాడినంజెలికాఁడుపిడక నిట్లాడందొడంగె. ఘు 79

తే. ఎంతకోరిన రాష్ట్రమై - దేండ్లవఱకు
పొసఁగదట మీఁదనెట్లొనొ - ముక్కు లోని
వెంట్రుకలు కొప్పుకందిన - వేళ మాట
కాన మద్రాసు వదలుట - కార్య మగునె. 80

తే. రాష్ట్రవిభజనసంఘ ని - ర్ణయముల కొగిఁ
గాల దోషము పట్టెను – గాన విలువ
నీయఁ బనిలేదు వానికి – నింకఁ గ్రొత్త
న్యాయమర్థించి రాష్ట్రము – నందఁ దగును. 81

వ. అని సంజీవరెడ్డివక్కాణించె. కొందఱు రాష్ట్రవిభజనసంఘపు సలహాలనమ్మతించుటలగ్గని మఱికొందఱు చెన్నపురిసహితరాష్ట్రమే వాంఛితమని యింకంగొందఱు సంపూర్ణార్థికాభివృద్ధికి సర్వవిధయత్నము లొనర్చుచు రాష్ట్రముకొఱకు వేచియుంటయుత్తమమని ముత్తెఱుంగుగఁ బల్కుచుండిరి. ఇ యిట్లుండ గోరుచుట్టుపైరోకటిపోటుచందమున హిందూ ముస్లిముల్ [illegible] గలిగినప్పుడు స్వరాజ్యమిత్తుమన్న తెల్లదొరపాటనందు కొని నెహ్రూ వివాదాంశవిషయములం బక్షద్వయంబేకభావోన్ముఖమైనప్పుడే రాష్ట్రమీఁబడుననం గేంద్రప్రభుత్వమాడుచున్న దాఁగిలిమూఁత లామూలాగ్రమాకళించుకొనియే స్థితప్రజ్ఞుఁడైన శ్రీరాము లీదీక్షాయజ్ఞహోమకుండమున నిజరక్తమాంసములవ్రేల్చుచున్నాఁడని యున్నవలక్ష్మీ నారాయణ ప్రవ్యక్తమొనర్చె రాష్ట్రసిద్ధికొఱ కాగ్రహావేశావేదనములు పెనఁగొనఁ బ్రతివానిగుండె యాఱునికుంపటివలెం గుమిలిపోవుచున్నది. కాని స్థిరనిర్ణయదీక్షాకృషిపూజ్యము. తిరుపతివఱకఱవలదేయనఁ గన్పని లేచి తక్షణమతలవంచు తొంటికష్టములఁదలంచు. ఏతత్కార్యసిద్ధికత్యంత గాఢాభినివేశముశూన్యమనుట కిత్తఱినాంధ్రప్రదేశజాతీయమహాసభ చేసిన తీర్మానమే సాక్షియని నాగ్లనిజాభిప్రాయమెఱింగింప రాష్ట్రముఁగోర నిదే మంచిసమయమని కళావేంకటరావు, తాత్కాలికరాజధానిమద్రపురినుండం దగునని వేమారెడ్డి, చెన్నపురి సమవిభక్తముకావలయునని యమ్మన్న రాజా, ముఖ్యమంత్రి పాక్షికదృష్టిసబబుగాదని కాళేశ్వరరావు, రాజాజీ ఘనలరాక్షసులనుటనుచితమని శ్రీనివాసయ్య యుగ్గడించిరి. దూధన

దు త్తనపడనీని పెద్దలుంగలరు. కాన నాంధ్రానామనేకత్వమన్నది సార్థక మగుచున్నది. నై రాశ్యము స్వైరవిహారమొనర్చుచున్నది. ఇటునిట్లుండ నట రాములసువులంబాసిన నాంధ్రదేశమునశాంతికిస్థానముండదుకావున నేతత్సమస్యాపరిష్కారమత్యవసరమను నివేదికను లోకసభాధ్యక్షుడు మౌలంకర్ త్రోసివేయుచు వ్యక్తులనిట్టులు గమనింపంబడ వైనదది మద్రాసుదొరతనమువారిదనెనట. ఇట్టిక్లిష్టపరిస్థితిలోఁ బరమలక్ష్యము సాధింపనిదే చాలింప, విజయమో వీరస్వర్గమో యనెడి నీపలుకులుమాకు ములుకులు 82

తే. తల్లిగడ్డకు నసువుల - ధారవోయు
నీదు కర్తవ్య నిష్ఠ గ - ణింప రకట
లౌకికార్థ నిరంతర - లంపటులకు
ధర్మదర్శన మాత్మలోఁ - దనరఁ గలదె. 83

మ. మతిమంతుల్ నిను సానుభూతిమెయి నం - భావించి యాత్మార్పణ
స్థితిరాకుండ ననుగ్రహింపుడని యెం - తేఁగోర నాలించిరే
జతనంబెంత యొనర్చినం ఫలమిఁక ఙ్ - సాధింప నీశక్యమా
ఘృతకోశాతకి నాజ్యమున్వెదకు టీ - కృత్యంబు సత్యంబుగా. 84

తే. ఆంధ్ర తమిళ వివాదంబు - లంతరించు
తటి తటియదిప్పు డింకెద్ది - దారి మనకు
అక్క యల్లాడుచే గాని - యరయ బావ
బ్రదుకఁ డనునట్లు రాష్ట్రని - ర్మాణ మొప్పు. 85

చ. విడుమన సాంబమూర్తి విని - వీనుల విదంగు త్వద్ధితోక్తులం
గడువడి మున్నెపల్కి రతి - గాఢదయామతు లెవ్వరెంతగా
నొడివిన నొవ్వి నోర్చుకొని - నోముఫలింపఁగఁ జూచుఁ జూడఁగాఁ
గడకయొకింతలేక ఘన - కార్యము లెయ్యవి యొద్దుపట్టునే. 86

తే. సర్వ సంరక్షకుఁడు గదా - శంకరుఁడని
నమ్మిదీక్షించె సత్కృషి - వమ్మగునొకొ
యేము తత్సిద్ధి కాత్మజ - పించుచుంటి
మనుచు రాముల వీక్షించి - యాడె నిట్లు. 87

కం. ముక్కోటి దేవతలవలె
ముక్కోటి తెలుంగు జనులు - ముద మెసఁగఁగ నీ
దిక్కుం జూతురు ఫలితము
దక్కు ననెడియాశ నీకు - దయరా దింకజ. 88

కం. నిప్పులు చెఱగిన గాలియె
నప్పులలో ముంచు లోక - మా హా యనఁగా
నెప్పటి కెయ్యది ప్రాప్తమొ
చెప్పఁ దరమె విధికృతంబు - చెఱుప న్వశమే. 89

తే. ఆననముఁ దీసివేయఁగా - నలవి యగును
గాని తలవ్రాఁతఁ జెఱుపఁగాఁ - గలఁడె మనుజుఁ
డెవ్వ రేమనుకొన్న నీ - కేమి లెక్క
యాల మరలించు వాఁడెగా - యర్జునుండు. 90

వ. ఈమీనెచ్చెలి త్వదీయవ్యథంజూచి తానుంబాధపడి యాడినపల్కులే గాని వేఱొండుగాదు. ఐననొకండుచేయుకృత్యంబున కింకొకండేదెనొక వంకపెట్టకమానఁడు. ఇదిలోకధర్మము. 91

కం. పనిహారల లోటును జె
ప్పనివారలు లేరు వారి - పన గని పెట్టం
బనిచేసి చూపుఁ డన్నం
దినదిన్నఁగ జాఱుఁగలరు - ధీరవరేణ్యా. 92

తే. ఇట్టి కార్యంబు సాధించి - తేని నిన్ను
నగ్రతాంబూలమున కర్హుఁ - డతఁడె యంద్రుడు
విశ్వవీరవతంసమై - వెలయఁ గలవు
రమ్య గుణ ధామ పొట్టి శ్రీ - రామనామ. 93

కం. ధృతివిడుమనఁ దగదన నా
దృతిమీఱఁగ నాడినాఁడ - దివ్యర్షినిభా
యతులవచో వైభవయుత
చతురమతివి నీకుఁజెప్ప - శక్యమె నాకుజ. 94

వ. అని తత్సహృద్వరేణ్యుండు కొంతతడవు నయాలాపంబులం గడపి చనినంత రాములు. 95

తే. అర్థశాస్త్రార్థ విదుఁడ వ - హార్యధైర్య
యుక్తి వైచిత్ర్య మహిమమై - నుత్త మాధ
మాది భేదము లెఱిఁగింపు - మన మహర్షి
పరమ సంప్రీత హృదయుఁడై - పలికె నిట్లు. 96

తే. అధముఁ డెల్లపు డొరులకు - నపకరించు
నుత్తముఁడు నిచ్చఁ బరులకు - నుపకరించుఁ
బాపపుణ్యంబు లీరెంటఁ - బడయు నరుఁడు
సర్వ శాస్త్రార్థ శోభిత - సార మిదియ. 97

కం. దుష్టుఁడు దుష్టుం జెనకఁడు
శిష్టునకుం గీడొనర్చుఁ - జిఱునగవులతో
దుష్టునకుఁ జెప్పఁ డెవ్వఁడు
శిష్టునకే నీతు లన్ని - చెప్పఁ దొడంగున్. 98

కం. లోకము హింసాబహుళం
బేక్రియనే సాధుజనుల - నేతురు దుష్టుల్
వాకొనరు వారి సాధుతఁ
గాకానీకంబు పికము - గాఁ గూయునొకో. 99

ఉ. పెద్ద సహించి కీడుతల - పెట్టమిఁ బెల్లుగ రేఁగు మంచికిన్
హద్దొకటున్నదంచెఱుఁగఁ - డాడిన యాటలు సాగిపోవుటన్
సుద్దులు వేల్వచింపఁ బరి - శుద్ధమనస్కుఁడుగాఁడు హీనుఁడే
బద్దలు వేసి కట్టినను - వంకర పోవునె కుక్కతోఁకకున్ 100

వ. కాని కర్మఫలమవశ్యభోక్తవ్యమ్మగాన నొక్కొక్కప్పుడు. 101

శా. ఘోరాజ్ఞానతమఃప్రభాకలితభూ - గోళాఖ్యవేశ్మజ్వల
ద్ధీరోదాత్తలసత్ప్రదీపగుణభృ - ద్దివ్యచ్ఛటల్గాంచితాఁ
బోరంగెల్చి సృజింతు నంధమనుచుం - బుర్వొందు పోరాడి వే
సీతాఁ దద్దతిఁ దగ్గి వెల్గు నదియం - తే ధీరనీచస్థితుల్. 102

చ. ఘనజనలోకపూజ్యజయ - గౌరవభాగ్యమహావిలాసముల్
గని సహియింపలేక విష - కంటక దృష్టిని బెంచి హీనుఁడీ

సునఁ జెడనాడి తాన చెడు - సూర్యుని మీఁదికి దుమ్ముచిమ్ముచోఁ
దనతనువెల్ల నిండు నది - తాకునె యించుక లోకబాంధవుః. 103

శా. అజ్ఞప్రాజ్ఞవిశేషమెన్నక మహా - హంకారి హుంకారముః
విజ్ఞప్రజ్ఞ వెలుంగుచోటఁ జలుపః - విధ్వంసముం బొందుఁ ద
త్త్వజ్ఞుండెప్పుడు ధర్మపక్షమునె సం - భావించు నేతన్మహా
సుజ్ఞానంబున సాధురత్నములు సం - శోభింతు రశ్రాంతముః.

తే. భౌతికాభ్యుదయైక సం - భ్రమమెగాని
శూన్య మాధ్యాత్మికానంద - శోభ ప్రజల
నున్నసత్యంబు యోచించు - కొన్న మిన్న
యెన్నియుగములుగన్న లే - దింత కన్న. 105

తే. పుడమి మానవ సంఘము - పుట్టి నట్టి
నాఁడు మొదలుగఁ గనఁగ నీ - నాఁటివఱకు
సహజగుణములు మాఱిన - జాడలేదు
మఱియిఁకెన్నఁడు మాఱునో - యెఱుఁగ రాదు. 106

వ. నాగరికతవృద్ధియైనకొలంది కాలానుకూలముగఁ దద్గుణతతి నంత రాంతరములనిముడ్చుకొనుచుఁ బైపైమెఱుంగులు దిద్దుకొనుచుఁ బ్రగతి మార్గమునగమించుచున్నట్లు నరుఁడుకనంబడునసం బ్రజారాజ్యమున రాజకీయచతురత యెట్లుండందగుఁ బాలకపాలితధర్మరూపంబులెట్టివని పృచ్ఛింప నతండు ప్రజారాజ్యమైన రాజరాజ్యమైనఁ బ్రధానధర్మ సూత్రము లెప్పుడు మాఱవు. సర్వోదయసూత్రబద్ధంబుగఁ బ్రజాభీష్టంబు పరిపూర్ణంబుగఁ బాటింపంబడునది ప్రజారాజ్యము. దేశకాలపాత్రోచితం బుగ క్షాత్రధర్మనిర్వహణంబుగ నభ్యుదయమార్గగమనంబుగ వృద్ధ సచివోపదేశానుకూలంబుగ నాత్మేచ్ఛాప్రాధాన్యంబుగ రాజుచేఁబాలింపం బడునది రాజరాజ్యము. ఇరువాగుల సారాంశపరమావధి స్వరాజ్యము స్వారాజ్యముగరూపొందించుటయే. ఇంకంబాలక పాలిత లక్షణంబు లాకర్ణింపుము. 107

తే. రక్ష్య రక్షణ దక్షుండు - రాజగునెడ
దేశ సత్కీర్తి మణిదీప్తి - దిశల నిండు

ద్విద్వయోపాయ చతురత - వెలయ నేత
పాలనము సేఁత జనతకుఁ - బరమ సుఖము. 108

ఉ. పాలును నీరు వేఱుసలు - పం దగ హంసకుఁజెల్లుఁగాని యే
లీలనొనర్చుకొంగ యవ - లీలగ నట్లు సుధీవరేణ్యుఁడే
పాలకుఁడైన నిర్వహణ - భవ్యతరంబగు, నొప్పుతప్పులం
గీలుగ్రహించి వేర్పఱచుఁ - గేవల సత్యము నిల్పి గెల్వఁగన్. 109

కం. కూపెట్టినఁ గాపాడుట
కోపుటఁగా రాజనామ - మొప్పు నరునకుం
బాపికిఁ బ్రాపగు భూపుఁడు
భూపుండే నరకకూప - మునకుం బోవున్. 110

కం. మణిచే భూషిత మయ్యును
ఫణి భీతిదమగును గాని - బంధుర మగునా
ఘనమకుటధారి యయ్యును
జనసుఖకరుఁడగునె క్రూర - జనపతి యెందున్. 111

కం. కని కరము కనికరమ్మున
జననాయకుఁ డఖిలజనవ - శంవదుఁ డగుటన్
మనురాజ్యము స్వారాజ్యం
బన ననయము నయము వినయ - మలరున్ వఱలున్. 112

కం. టంకసముట్టంకితమై
పొంకమ్ముగఁ దోఁచు ప్రతిమ - పోలికఁ బ్రజ ని
శ్శంకమ్ముగఁ గ్రమశిక్షణ
యంకించిన రాజ్యభోగ - మనపాయంబౌ 113

ఉ. బేలరి బేడిజంబు కని - పెట్టిన పాలకుఁ డుగ్రమూర్తియై
వాలుగఁ గీలెఱింగి తగు - వాతను బెట్టక యూరకున్నచోఁ
దేలికయౌను దత్ప్రజకు - ధీరులు మెచ్చరు ధర్మకర్మముల్
చాలఁగఁ దాఱుమాఱగు న - సాధ్యము వానిని జక్కఁజేయుటల్. 114

శా. ధీశాలుల్గడుమెచ్చ సత్పురుషమై - త్రింబొందఁగా నింటిక
య్యాశాన్యంబుననున్న కూపమటు లెం - తే మేలుచేకూర్చుఁ గా

కాశోద్రిక్తత దుష్టమానవుల స్నే – హంబంద యామ్యాశఁ ద
ద్వేశ ప్రాంగణమందు నూయివలె భా – వింపంగఁ గీడిచ్చెడిన్. 115

ఉ. గొజ్జగ పూలు సల్లినటు – గోష్ఠియొసంగును ముత్సుధాబ్ధిలో
మజ్జనమాడఁజేయుఁ గల – మంచివెలార్చు దురంతదుఃఖపుం
గజ్జల సూర్యరశ్మియగు – కష్టపయోనిధిదాఁట నౌకయౌ
సజ్జనమైత్రియున్న నిజ – సన్నిధిఁ బెన్నిధి యున్నయట్టిగా. 116

తే. మంచి నెంచని మూర్ఖుల – మైత్రి పులుల
చెలిమి చందాన శ్రీఘమ – చిట్లి పోవు
సారతరబుద్ధిశాలుల – సఖ్యముఁ గన
క్షీర శర్కర న్యాయమై – చెలువు మిగులు. 117

వ. కాని, కొన్నియెడల 118

తే. తులసివనమున గంజాయి – మొలక యట్టు
లుత్తముని వంశమున హీనుఁ – డుద్భవించు
జాతి భూమినిజన్మించు – రత్నమట్లు
ఖలునివంగడమున మహా – ఘనుడు పుట్టు. 119

వ. ఉత్తమునిగర్భమున నుత్తమోత్తముఁడు జన్మించు టమితాహ్లాదకరము. కాని యయ్యది యరుదు. చందనవృక్షము పుష్పింపదు. తద్భూజరాజమునకుం గుసుమమేయున్న నదియెంతసువాసన గలిగియుండెడిదో. 120

ఉ. పూచిననాఁడుగాదె లత – పొల్పు బయల్పడు నూత్నశోభతోఁ
గాచినవేళగాదె సహ – కారవిలాసము వెల్గు సత్క్రియం
దోఁచినఁగాదె మానవుని – నోముఫలింప యశోవిశాలుఁడౌ
యోచనచేసియింత నరుఁ – డొప్పుగఁ బుణ్యపథంబుఁ ద్రొక్కనౌ. 121

వ. పరోదీరితోక్తులెల్లం బసగలవియనుకొంట నేతలకులెస్సగాదు. జ్ఞాననిధులైన పలితకేశులపల్కుంబాటించి మేలిబాటంగమనించి ధర్మాధర్మములగాలించి ప్రజలంబాలింపందగు. సజ్జనసాంగత్యమే పరమపదసౌధారోహణమునకుంబ్రథమసోపానమని శంకరాచార్యమతము. అది ఖండితసమ్మతము. కానరాజేర్రైతే మంచిహృదయముగలవానిమైత్రి

మన్నింపవలయు. నావిష్ణుఃపృథివీపతియన్నమనీషతే రాజ్యాంతేనరకం ధ్రువమ్మనిరి. విధ్యుక్తధర్మనిర్వహణమున లోపమున్నప్పుడే ద్వితీయ వాక్యమునకుస్థానము. ఒక్కొక్కతఱి మిత్రులుశత్రులగుదురు శత్రులు మిత్రులగుదురు. ఏలికలకహర్నిశలఁజారదృష్టియత్యవసరము. 122

చ. అడిగిన సత్యమాడు మహి – తాత్ముల వృద్ధుల సూక్తి సుంతయుం
బడయక లేశమే నసుభ – వప్రభలేని నవీనబాలకుల్
నొడివినయట్లసేఁత మది – నొంచు నిజంబిది పొట్టపూవునా
నుడుకనియోగిరమ్ముఁ దిన – నొప్పునె గర్భము నొప్పిపుట్టదే. 123

తే. ఉత్తముని మైత్రి సామాన్యుఁ – డొంద నుత్త
మోత్తముని చెల్మి వానిచే – నొందఁ గలుగుఁ
బూవులోనున్న చీమయుఁ – బూజ వేళ
శంకరుని పాద మంటిన – చంద మరయ. 124

చ. గుణవతియైనభార్య తన – కుంగడుఁగూర్చుతనూజులుం దపో
ధనుఁడగు దేశికోత్తముఁడు – తత్త్వవిదుండగు తండ్రియుఞ్ యశః
ఖనియగు పుత్రుఁ డర్థిమెయిఁ – గంటికి ఱెప్పగనొప్పుమిత్రమే
జనునకుఁ గల్గునో యతఁడు – నల్పిన పుణ్యము నెన్న శక్యమే. 125

వ. అది ఖనులం గనకంబు శిలామిళితంబైయున్నయట్లు ఘనులు తొలుత సామాన్యమానవసమేతులై చరింత్రు. గుణగ్రహణపారీణులు తద్గుణం బెఱింగి తగినస్థానమీ వెసం బ్రకాశింతురు. భూమి యెంతశక్తితో నొక వస్తువునాకర్షించుచుండునో యంత భారమావస్తువుగలిగియున్నట్లు ప్రజ లొకనరున కెంతయెన్నికబలమొసంగుదురో యతఁ డంతయధికారసత్త్వ యుతుండగు–పాలకుండు ప్రజాగతుండగుటం దత్కష్టసుఖంబు లెఱింగి వర్తించు. సమర్థుఁడైనపరిపాలకునియెడ బాలితులు విశ్వాసగౌరవమర్యా దలతో దివారాత్రంబులు మెలంగందగు. అన్యోన్యానురాగంబున నత్యం తోన్నతాధికారులు ప్రజ లొండొరులఁ గంటికిఱెప్పవలెంగాపాడుకొను చుంట లెస్స. ప్రజలులేనిదే రాజ్యములేదు. రాజులేనిదే రక్షణలేదు. పాలన యంత్రచక్రధారి ప్రధాని యన్నిటం బ్రధానుఁడే. కాని యెన్నికల విలువం గ్రహించుట ప్రతిమనుజుని ప్రథమకర్తవ్యము. స్వీయమహానాయకనిర్ణయ జ్ఞానచైతన్యము సర్వనరుల కత్యవసరము. ఉత్తమోత్తములు మహో

మేధావులునగు బుధాగ్రణులకు సముచితస్థానములొసంగుట విషయ క్షేమంకరము. ప్రలాపనప్రలాపముల నాకళించుకొని చరించుట శుభ దాయకము. నాభిగతవాత ప్రకోపమును లాలాజలము సూచించినట్లు హృదయగతాభిప్రాయము ముఖముప్రదర్శించు. 126

తే. సత్వ్రవర్తనగలవానిఁ – జక్క నెఱిఁగి
యెన్నుకొనరేని జనసౌఖ్య – మెట్లు గలుగుఁ
దాళి గట్టించుకొనుదాక – తగును స్వేచ్ఛ
కట్టఁగఁ దదాజ్ఞకే సతి – కట్టువడదె. 127

కం. ఛత్రధరం బూనిన నరు
గాత్రమునకు నీడ నిచ్చు – గద యది యట్లే
పాత్రునకుఁ బదవి యొసఁగిన
మిత్రునివలె సతము ప్రజల – మేలుం గోరుఁజా. 128

చ. అపచితతృప్తదివ్యుఁ డమ – రాపగతుల్యపవిత్రుఁ డీప్రజా
జపముఫలించెనాగ బుధ – సన్నుతు లొప్పఁగ గ్రీష్మవేళలం
బ్రపవలె హాయిఁ గూర్చెడి య – పారకృపారసవాహినీశుఁ డీ
విపులకుఁ బాలకుండయిన – వేగమ కల్గదె కల్మిబల్మియుఁజా. 129

వ. నిస్స్వార్థప్రజాసేవాధురంధరులగు మహనీయులనే మహానాయకు లుగ జనతగణించుటధర్మము. గాంధీనెహ్రూబోసురాజేంద్రప్రసాదజా దాదు లాకోవకుంజెందినవారగుట స్వరాజ్యంబుసిద్ధించె. వారియెడఁ గృత జ్ఞతంజూపుట మానవతాచిహ్నము. కాని లోకము దుర్మార్గునకు భయ పడినంత సన్మార్గమును గౌరవింపదు. పరవంచకవృత్తి గర్హ్యమేగాని ప్రశంసార్హముగాదు. 130

కం. అంహతి శూన్యుఁ డయోగ్యుఁడు
సంహతి బలయుక్త విజయ – సాధన మార్గుం
డంహఃఖని యని యెఱిఁగియు
సింహాసన మిచ్చుటెంత – చేడ్పాటునకో. 131

తే. వ్యక్తి సచ్ఛీల నిర్మాణ – శక్తిజాతి
కనఖ దుర్భేద్య వజ్రదు – ర్గాష్టకంబు

తదృలార్థులై నేతలు — తగిన యట్ల
నిశ్చయింతురు శాసన - నియమ వితతిఁ. 132

తే. నీతి నియమములెల్ల ము — న్నీటఁ గలుప
యత్నమొనరింత్రు కొందఱు - స్వార్థ పరులు
అనఘ శాసన భీతి లే - నట్టి ప్రభుత
యంకుశములేని మావటి — యట్టులుండు. 133

వ. విజ్ఞానశాస్త్రజ్ఞామోఘకృషిఫలితంబుగ మానవుఁడు ప్రకృతిశక్తులం గొన్నింటి వశమొనర్చుకొంటంజేసి సమస్తమర్త్యప్రపంచము సన్నిహితంబగుట వైదేశికవ్యవహారదక్షత మహానేతల కరతలామలకమై యుండనొప్పు. ప్రతివ్యక్తి యాదేశమునాది దీనియభ్యుదయమేనాయభ్యుదయమని మనసారమాతృభూమిని ప్రేమించుట పరమధర్మము. అయ్యాయి కాలంబులఁ బాలకుఁడే పాలితుఁడగుఁ బాలితుఁడే పాలకుఁడగు. ఏతద్విషయంబును హృదయకోశంబుననిడుకొని వ్యవహరించుట మానవతా చిహ్నము. అత్త యొకరియింటికోడలే మామయొకయింటి యల్లుఁడే యను మాట మఱవరానిది. తుమ్మకుముల్లు వేఁపకుఁజేదు పామునకువిసం బెట్టు పుట్టువుతోఁబుట్టునో యట్టె మానవునకు సుగుణదుర్గుణంబులు కొంతవఱకు జన్మంబుతోనకల్గు. ప్రతినరుఁడు దాగమనించిన మంచినిబోషించినచో లోకమెప్పుడో బాగుపడియుండెడిది. దుష్టులు స్వార్థదృష్టితో నెందఱశిష్టశ్రేష్ఠులం దమపొట్టంబెట్టుకొనిరో చెప్పశక్యముగాదు. కొందఱల్పాల్పస్థానేహంబహువిధ భూమికలధరింత్రు. 134

ఉ. మాటల గారడంబమర — మంచిగఁ బొంచులు వేసి చిక్కినన్
వాటమెఱింగి గుంజుకొని - వంతకు నల్బురమేపి మీసమున్
మీటుచు గోటఁ, బుంజుకొని - మేల్మికిరీటములేని రాజునా
నీటుగఁ దిర్గు ముక్కడుల — నేర్పులు సాధులు మెచ్చుకొందురే. 135

ఉ. దర్పమెలర్పఁ జూపఱకుఁ - ద్యాగధనుండనఁగా నటించుచున్
నేర్పున సొంతమీక పరు - నెత్తిన రుద్దుచు నీయజాండపుం
గర్పరభేదిగా నడరి - గాలికిఁ బోయెడి పేలపిండిరా
మార్పణమన్న మెత్తురె మ — హాత్ములు గ్రుడ్డిదె లోకమంతయున్. 136

చ. అమపస పున్నమన్న నెవఁ - డౌసను సంధుఁడుతప్ప నిభ్భవిం
ద్యుమణి వెలుంగుచున్నతటిఁ - దోఁపక యున్నను రాత్రిదెల్పదే
క్రమముగ నిక్కముం బరుల - గాసిలఁ జేసెడి మూర్ఖమానవుఁ
విమలమనస్కుఁడన్న నది - విశ్వము మెచ్చునె కీర్తి నిచ్చునే. 137

తే. ధనమె మూలము జగతికి - సనఁగ ఏనమె
కాన నరులకు నదిచేదు - గాదు దుడ్డు
పోకుఁ దినిపించు ననుమాట - పూజ్యులంచు
సార్థకముగాదు జనలోక - సత్యమరయ. 138

కం. కుడియెడమల వడివడిగా
విడిముడి గడియించి బిడ్డ - బిడ్డతరముగా
నడరెడి తెన్నులు తడవెడు
కడులోభి కనండు లోక - కల్యాణంబుఁ. 139

ఉ. నిగ్రహశక్తిలేక యవి - నీతికిఁ బాల్పడి సజ్జనామరా
నుగ్రహదూరుఁడై ధనమ - నుక్షణమెట్టిటొలాగు లోభి పా
పగ్రహదృష్టి యట్లది య - వాంఛిత మంచుఁదలంచి సాధువుల్
ప్రగ్రహకర్షణాన నఘ - భావతురంగము లాఁపుకొంద్రిలఁ. 140

ఉ. గోత్రవివర్ధనక్రియల - గోరక నేరక మందబుద్ధితా
నాత్రముతోఁ బరుల్పలుకు - నజ్ఞవచశ్చలనాత్ముఁడౌట స
త్పాత్రమెఱింగి తెల్పగల - పండితవాక్కు లెడంద నాటునే
సూత్రము గ్రుచ్చనేర్చునొకో -సూచిఁగరంబుభ్రమింపఁజేయుచో. 141

ఉ. ఎంతొ మహోన్నతస్థితుల - నెవ్విధినేఁ బడయంగఁ గల్గియుఁ
సుంతమహాకవీంద్రులను - జూడఁ దహంయువు గ్రుడ్లగూబ తా
నెంతవనస్పతీంద్రు శిర - మెక్కియుఁ జీఁకటితొఱ్ఱనుండు నా
వంత దివోజ్జ్వలుండగు న - హస్కరు వెల్గుఁ గనంగఁ జాలునే. 142

వ. మహీలత కర్షకునకు సహజమిత్రమైనట్లు సాధువు సర్వజననిసర్గ హితైషి. రోగజీవులంధవళకణములు సంహరించునట్లు సుజనబోధనములు దుర్జనదుర్గుణముల నశింపఁజేసిన దేశమాత యారోగ్యస్థితి నుండు. 143

తే. అనుభవజ్ఞానియైన మ - హాత్ముపలుకు
ఖండ శర్కల పల్కన - కుండ నేదొ
దురభిమానంబుతో ఘోర - నరకమునకు
సిద్ధపడువాని కెవ్వఁడు - బుద్ధి సెప్పు. 144

వ. నానావిధ శ్రావ్యమంగళవాద్యధ్వనులతో శ్రుతిహిత పురోహితమంత్రాశీశ్శతాదులతో వేదచోదితముగ నొక్కరి వైవాహిక క్రతువుజరుగ మఱియొకరి పాణిగ్రహణ మన్యోన్యకంఠనిక్షిప్తహారమాత్రంబుగం బూర్తియగు. ఐన వారునువీరును భార్యాభర్తలే. గృహస్థాశ్రమధర్మనిర్వహణమున నధికారబాధ్యతల నాయిాసతీపతులుసములే. పూర్వరాజులు రాజలాంఛనాఖ్య బహువిధాలంకారప్రియులు. నేఁటినాయకులు గాంధేయమార్గకాములగుట నిరాడంబరప్రియులు. పాలకుఁడనరాజే. పాలితులనఁ బ్రజలే. ఒక్కర్థమునంబెక్కుపదములుండు. పదములమార్పేగాని పదవుల మార్పుగాదు. ఇంకం గ్రొంగొత్తకూర్పులుతీర్పులు శాఖామాత్రంబులుగాన నేతద్విషయమున నిద్ది దిఙ్మాత్రప్రదర్శనమనుచు. 145

మ. వరవిజ్ఞానపయోధికుంభభవుఁ డ - వ్యాజక్రియాశీలుఁడొ
సురరాడ్దేశికునట్లుతండు హితముల్ - శోభిల్ల నేతద్విధిన్
దరహాసాంకురదృక్సుధారసము చిం - దంబల్కఁ బల్కాంక్షమై
బరమానందహృదైకవందనములొ - ప్పన్మెచ్చె రాముం డెదన్. 146

కం. ఏకైక ప్రతినిధిగా
వాకొను రాజాజి యఱవ - వారలకెల్లన్
మాకాఘనతకొఱంతని
శ్రీకంఠుండలఁచుఁ ద్యాగ - శీలత నిలుచున్. 147

కం. సత్యాగ్రహ దీక్షాపరుఁ
డత్యంతవిశాల దృష్టి - నాంధ్రోద్యమమే
కృత్య మనుకొని యశోవా
మృత్యుర్వా యనెడి మాట - మెచ్చిచరింపన్. 148

# మద్రపురి శాసనసభ

వ. రాయలసీమంగల ప్రజలయందత్యధిక సంఖ్యాకుల యభిప్రాయము రాష్ట్రనిర్మాణవిషయమునఁ బ్రతికూలముగ నున్నదని శాసనసభలో ముఖ్యమంత్రి రాజాజీయొనర్చిన ప్రకటనకాశ్చర్యమగ్నమానసుండై యద్దాని నామూలాగ్రముగ ఖండించుచు నాగిరెడ్డి "రాష్ట్రముకొఱకు రాయలసీమవారనవరతమాతురతపడుచున్నారన్న సంగతి ప్రభుత్వమున కింతవఱకు సుస్పష్టముకాలేదనుట చిత్రాతిచిత్రము. స్వార్థపరులవచస్సుల విశ్వసించి ప్రతికూలురరెచ్చఁగొట్టుట కీప్రకటనచేసిరా? ఏతద్వ్యతిరేకిఁ తీవ్రతరాసమ్మతముం దెలియఁజేయుచున్నాఁడ. అంతఃకలహములు వృద్ధించు నిట్టిజతనములు హారింకవిరమించుటలగ్గు. ఏతత్ప్రకటనముల ద్వారమునఁ గృత్రిమవిభేదములఁ గల్పింపందలంచుకొన్న దానికిందగిన ఫలితము లనుభవింపకతప్పదు. ఏగూటిచిలుక కాగూటిపలుకే. తనకంట దూలముఁబెట్టుకొని పరులకంటిలోని నెరసులెంచుటతగదు. కల్లపసిఁడికిఁ గాంతిమెండని మాకుందెల్లమ. ఎడమచేతితోఁజేసినఁ గుడిచేతితోననుభవింప వలయుననుట సత్యము. పేరొకరిది నోరొకరిదేయని మాహృదయావేదన. చీఁకటికొన్నాళ్ళు వెన్నెలకొన్నాళ్ళు. తేళ్ళలోఁగొండి పాములలోఁబడగగ నున్నదిదితేలుటెట్లు? నరకమునకు నవద్వారములు నాకమునకొక్కటే. 149

శా. ధ్యేయంబైన మహాంధ్రదేశమునకై – దీక్షింప వీక్షించి య
న్యాయప్రక్రియలఁజ సృజించి ఘనధ – న్యత్వమ్ముసాధింతువే
గాయంబయ్యెహృదబ్జ మాంధ్రులకు ని – క్కంబెంచవీ వింతయుఁజ
మాయానాటకమాడువారలకు స – మ్మానమ్ము చేకూరునే. 150

శా. మేటుల్పోటరు లాంధ్రులంచెఱుఁగవే – మీరాజకీయార్థి యే
యాటుంబోటులనున్న జంక మిదిమా – హక్కన్న యప్వీట నీ
యాటల్పాటలు సాగ రేఁగి యిటు మా – యల్పన్నుచున్నాఁడ వె
ప్పాటం బాటునకీవురావనుచు మ – త్పాంతంబు బోధించెడిఁజ. 151

చ. కుతుకముమీఱఁ బెత్తనము – గూడఁగఁ గూడని చేఁతచేసెదీ
జతనమెఱుంగు లోకమిఁక – సర్వవిధంబుల మొండివాదముం

బ్రతుకఁగనీము నీమమున - రాష్ట్రముఁబొందుట నిక్కమింత కీ
వతుకని మాటలాడి ఫల - మందుట దుర్ఘటమంచు నెంచుమా. 152

శా. హక్కుల్పెక్కులభింప నూత్నరుచిమై - నాంధ్రాంబ సింహాసనం
బెక్కం దక్కను దివ్యభోగమని యెం - తేఁ దెల్గువారుబ్బ నీ
షక్కం జిక్కులఁ జిక్కయోచనలె ని - చ్చల్సల్పఁగాఁ బాడియే
మ్రొక్కన్మోట్టినచంద మాంధ్రులిఁకఁ బె - న్రోసంబుమై వెల్గరే. 153

ఉ. మోసమొనర్చి సోదరుల - ముప్పునముంచుట కంటె సత్యస
న్యాసముమేలు చాలునిది - స్వార్థము నూటికినూఱుపా ళ్ళుప
న్యాసములెన్నిసెప్పిన ర - వంతయుఁగల్గున మేలు తత్పద
న్యాసముతీరుగాంచి విష - యజ్ఞు లసహ్యపుదృష్టిఁ జూడరే. 154

ఉ. పాయక నీవధర్మపరి - పాలనకుం దెగబడ్డ వెన్కకుం
బోయెదమంచు నెంచ కది - పుట్టదు కిట్టదు తెల్గుగడ్డకుఁ
రాయల రుద్రమాంబ నరి - రాణ్మృగసింహము బాలచంద్రునిఁ
నాయకురాలి బ్రహ్మనను - నాగమనాయకునిం దలంపుమా. 155

కం. తబ్బిబ్బగు నీపల్కులు
బొబ్బిలి బెబ్బులుల తీంద్ర - ముల్వీన నీతిం
ద్రొబ్బరు తెల్గులు గొబ్బున
నిబ్బరికమె రవణమనుచు - నిల్తురు కడఁకఁ. 156

తే. రంగరాణ్మౌళి వేంగళ - రావు తాంద్ర
పాపరాయండు రణమునఁ - జూపిన ఘన
శౌర్యసాహసములు విని - జంకి బుస్సి
గజగజవడంకె నిక్కమ - క్కథను వినవె. 157

కం. అల్లూరి విప్లవాగ్నికిఁ
దెల్లదొర ల్తల్లడిల్లి - దిక్తతిఁ గనరే
చెల్లవు కుయుక్తులింకిటఁ
బ్రల్లదములు వల్క నీకుఁ - బాడియె చెవుమా. 158

కం. ఇంతకు మాలోమాకే
స్వాంతంబులు కలియకున్కి - సంతసపడి నీ

వింతయొనర్చితి తొలుతనె
మంతనములుమాని మంచి – మార్గము గనుమా.” 159

# పత్రికా పుత్రికలు

వ. అనె. అంతం బత్రికా పుత్రికలు. 160

ఉ. తేలక యీ సమస్య యతి – ధీరులు చింతిల ముఖ్యమంత్రితా
జాలిఁగనంగలేక ఘన – జాలముఁ బన్నుచుఁ జూపుచున్నయా
వాలకమెల్ల తెల్ల మొక – భంగిగఁ బట్టువిడండు కీడనఁ
మేలన నేమిలెక్క గుడి – మ్రింగెడి వానికిఁ దల్పు లడ్డమా. 161

వ. బలుసులేని తద్దినము బులుసులేని యజ్ఞము లేదన్నట్లుర్వులకు రాజాజీ లేని రాజకీయము లేదు. అంద ఱొకయె త్తగస్త్యుఁ డొకయెత్తు. పెదవి మందహాసము హృదయము చంద్రహాసము. ఈవలకు రమ్మన్న నిల్లంతయు నాక్రమించిన క్రమంబున నున్నదా వృద్ధుని వాగ్ధోరిణి. జాతి నూతి కినుప బొక్కెన యన్నట్లతనికి దగ్గవారిద్దెన లేనందున నయ్యాట సాగుచున్నది. బడుగును బలవంతుఁడు గొట్టిన బలవంతుని భగవంతుఁడు గొట్టునుగదా. ఎవ్వరేనాససిగ్గెఱుంగదన్నట్లు నటించుటలగ్గా? ఈనాఁడింటిలో రేపు మంటిలో. మానవునకు నిల్చియుండునవి మంచి చెడ్డలు రెండే. ఎంత ప్రయాసపడిన నిది ఘట్టకుటికా ప్రభాత న్యాయముగ నుంట శోచనీయము. రాముల వాంఛంగల సత్యధర్మముల నెహ్రూ రాజాజీలు మఱియొకసారి దీర్ఘముగ యోచించుట మంచిది. 162

ఉ. టంకముతోడ నిర్వ్వర యె – డందలు ముందుగ హత్తుకొంట నా
టంకము లిన్నిగల్గె నెటు – డగ్గఱు రాష్ట్ర మహోదయోత్సవం
బింకిట శాంతి భద్రతల – కెయ్యది మార్గము సత్యధర్మము
ద్రాంకికమైన దీక్షయెటు – లాఁగునొ లాగునొ ప్రాణవాయువుల్.

ఉ. కొందల మందనేల మన – కోరిక తీరకపోదు కేంద్రమం
దెందఱు నేతలున్న నిపు – డిప్పని యిర్వురచేత నుండఁగా

నందఱినన్న నేమి ఫల - మయ్యెయొ పుం డొకచోట నున్నచో
మందొకచోట వేయుట సు - మా గమనించి వచింప నింపగుఙా. 164

మ. చటులాఖిలమహా వ్రతైకపరులీ - శాంత్యుగ్రసంగ్రామ స
ద్భటులై నిల్వఁగ గొందఱూఁతమిడఁగా - వాహ్వారె కుడ్యంబుపైఁ
బటు మార్జాలముఖంగి నిల్చి పదవీ - వ్యామోహబద్ధాత్ములై
యెటు మాటాడరు కొందఱిట్టిస్థితి నె - ట్టివాంఛ యీడేరునో. 165

వ. త్రిజ్యేష్ఠము శాస్త్రసమ్మతము కానట్లు నాయకత్రయ సంఘనిర్ణయము న్యాయసమ్మతము కాదు. నిర్యాణమునఁగాని యీ నిర్మాణము జరుగదు. కడకు ధర్మమునకుం గట్టుబడరేని యజహత్కళంకపంక నిమగ్నులగుదురు. నామమునకు నాయకత్రయ సంఘమనియేకాని. 166

కం. న్యాయాన్యాయ విచారణ
సేయక యొక వృద్ధు నిచ్చఁ - జేయఁదలఁచు నీ
మాయానాటకమును విని
యూయెలలో బాల కుడువ - కుండెం బాలఙా. 167

తే. శల్యమాత్రావశిష్టుఁడై - జాలిఁ గూర్చు
రాముదెసఁ జూప రత్యను - రాగ మహిమ
యంత నిర్లక్ష్య దృష్టిమై - నతని గనుట
పూల త్రోపున నిప్పులు - పోసి నట్టు. 168

ఉ. దీపము తైలహీనమునఁ - దేజము తగ్గెడు రీతిదేహ మి
ప్డీపగిదిం దినంబు కృశి - యించెడి రాముల బాధఁజూడఁగా
నోపక యాంధ్రమాత మృదు - లోల్లము తల్లడిలం గవోష్ణధా
రావరిపూర్ణ నేత్రయయి - ప్రార్థన సేయుఁ దదిష్టదైవముఙా. 169

వ. జనమేజయుండు వైశంపాయనునివలనఁ బరీక్షిత్తు శుకమహర్షివలన ధర్మజుఁడు మునీశ్వరులవలన నానావిధ ధర్మములు ధర్మసూక్ష్మములు విన్నయట్లు శ్రీరాము లేతద్దీక్షానేహస్సుల జ్ఞానవృద్ధానుభవ విశేష హితోపదేశంబుల నింతవఱకుఁ గాలంబు పుచ్చె. కాని యిప్పుడతండేమాత్ర శబ్దంబునే సహింపఁజాలని స్థితికి వచ్చె. 170

తే. ఆంధ్ర తమిళుల సంఖ్యల – నరయు వేళ
సకల విధములఁ దంత్రము – ల్జరిగె నంట
యద్ది సరిదిద్దుపని కఱ – వైన యెడలఁ
జెన్నపుర మెట్టు లాంధ్రులఁ – జేరఁ గలదు. 171

ఉ. అక్కఱమీఱ నాతఁ డిపు – డాంధ్రమహోభ్యుద యైకశీలియై
మిక్కిలిచిక్కె యెక్కరణి – మేలొనఁగూడునొ చెప్పఁజాల మిం
కొక్కటి దెల్పనొఁ బ్రదికి – యుండఁగ రాష్ట్రముఁ బొందగల్గుచోఁ
జుక్కలఁ జంద్రునట్లతఁడు – శోభిలు నాంధ్రుల నేత్రరత్నమై. 172

ఆ.వె. దీక్ష నాఁవు మంచు – దేవుఁడే వచ్చిన
మిన్ను విఱిగి తనదు – మీఁదఁ బడిన
జంకు కొంకులేక – సాధించి తీరును
రాముఁ డతఁడు పరశు – రాము నట్లు. 173

వ. పొయ్యిసెగ పొంతకుండకుఁ [illegible]పోదు. అయాసమొకరిది యను భవమింకొకరిది. అదృష్టముపంద్రహాసము[illegible]ర్లగు. నీతియే లోకము నకు జ్యోతియనురీతి వర్తింపనిచో నపఖ్యాతిగలుగుటనిక్కము. పడిన గోడలు పడినట్లుండవు. ప్రజలమాట ప్రభువులకోట యనుపెద్దలమాట రత్నాలమూట. ఇంతయెఱింగి రాములరక్షించుట పరమధర్మము. 174

తే. ఇట్టి దీక్షమైఁ దత్తను – వింత కరఁగి
నను బెరిఁగె యశోదీధితి – నాల్గు దెసల
రమ్యముగ సానబట్టిన – రత్న మునకుఁ
గాయ మొకయింత తగ్గినఁ – గాంతి హెచ్చు. 175

తే. అమ్మహాత్ముని ప్రియశిష్యుఁ – డనఁగ నొప్పు
నీతివిదుఁ డాతఁ డాషాఢ – భూతిగాఁడు
వాని ప్రజ్ఞావిశేష వై – భవభరమ్ము
నెన్నఁగలఁడొకొ యెంత య – హీనుఁడైన. 176

తే. అతని ప్రాణమమూల్యమై – యలరుఁ గానఁ
బ్రథమధర్మము తజ్జీవ – రక్షణమ్ము
పాలకులు పాఁడి యెఱిఁగి కా – పాడకున్న
శాంతి భద్రతలకు లోటు – సంభవించు. 177

వ. దేవకార్యార్థియై మన్మథుఁడు నిజప్రాణములొడ్డి శివతపోభంగము నకుం గంకణముగట్టుకొన్నట్టు, సురశుభాకాంక్షియై సంజీవనీసంపాద నార్థము కచుఁడు శుక్రసేవాదీక్షంబూనినట్టు రాము లాంధ్రాభ్యుదయ వాంఛ నిట్టిత్యాగమునకుసిద్ధపడె. అతని శరీరమునం బ్రత్యణువు దేశ భక్తిరసపూరితమే. 178

ఉ. బాధఁ గనంగఁజాల కిటు - పల్కుటెగాని తదీయసత్క్రియా
సాధన వస్మునేఁత మన - సాధ్యము బోధ్యమ నిత్యనిష్ఠనా
రాధితగాంధి శాంతరస - రమ్యపథైకకృపాలవాలుఁడీ
సాధువతంస మెట్టితని - సాహసదీక్ష జయించునోగదా. 179

తే. మద్రపురి యాంధ్రులది యని - మహిని గల్లు
చేతనాచేతనంబులు - చెప్పుచుండ
నేయి యన్నముఁ దినుమహా - నేతలార
ధర్మనిర్ణయ మొనరింపఁ - దగరె యనఁగ. 180

వ. విన్నతెలుఁగునాడెల్ల వివిధవిధములఁ జింతించుచుండఁ గురుపాండవ ఖండనమెన్నాళ్ళుజరిగె నన్నాళ్ళుగతించె. భార్గవశాంతనవసంగ్రామం బెన్నిదినంబులునడచె నన్నిదినంబులుగడచె. కృష్ణజాంబవంతుల సమి ద్రంగంబెన్నియహోరాత్రమ్ములుప్రవర్తిల్లె నన్నియహోరాత్రమ్ములుకడ చనె. అంతందీక్షితునారోగ్య మత్యంతాందోళనకరమని భిషగ్రత్నములు ప్రకటింప నాయకులబలహీనత సంఘటితకృషిరాహిత్యము ప్రజల నిర్లక్ష్య మిట్టిస్థితికింగారణమని పరరాష్ట్రములంగల త్రైలింగులెల్ల రేత త్కార్యసాధనతత్పరతం దీవ్రతర ప్రయత్నమొనర్చుచుండఁ దెలుఁగు వారెల్లరు రామప్రాణరక్షణ దీక్షాబద్ధకంకణులుకావలయునని యాంధ్ర ధీరాగ్రగణ్యులు కొందఱు ఘోషించిరి. 181

తే. అన్య చక్రమ్ములందున్న - యాంధ్రు లప్పు
డానినద మందుకొని వెస - నాంధ్ర రాష్ట్ర
సిద్ధికయి చేయఁదగుపనుల్ - చేసి రెన్నొ
యైనఁ జెవిటికి సంకూది - నట్టులయ్యె. 182

కం. సమలోష్టహేమఁ డాతఁడు
సమసిన నేమార్పుతోడ - సాగునొ సమరం

బమరులు తెలుపం గలరా
శ్రమయసి విడనాడఁబోరు-జ్ఞానుల్ తెలుఁగుల్. 183

కం. గుటిపెట్టిన పనికొలిక్త్రై
గుటికలిడక కృషియొనర్చు - గుణవంతునకే
దొఱకును సత్ఫలమని బుధ
వరులందురు వమ్ముగావు - వారల వాక్కుల్. 184

కం. ఈరీతి రాములుండఁగఁ
గారుణ్యముఁజూప రెంత - కఠినాత్ములు పూ
కోరిక తీర్చుట కొల్లరె
యారాయని యొడుగఅచి - యార్చిరి తెలుఁగుల్. 185

వ. ఆంధ్ర విశ్వవిద్యాలయస్నాతకోత్సవ సందర్భమున "విఖజనజరుపక పోవుట ప్రమాదభరిత"మని యరవిందుఁడేనాఁడోయనె. ఎవరెన్నివిధంబుల హితోక్తులఁబల్కినం గార్యమునెరవేరదయ్యె. 186

## స్వామి సీతారాములు

కం. యమయాతనపడుచుండియు
నమలమనస్కుండు రాము-లాకేంద్ర గతుల్
క్రమముగ నాంధ్రుల చర్యలు
గమనార్హంబనుచు వినెడి - కాలము నందున్. 187

వ. చెన్నపురింబ్రత్యేకరాష్ట్రముగఁజేసినం జిక్కిపోవునని మంత్రిసుబ్రహ్మణ్యమువల్క నదియుమ్మడిరాష్ట్రముగ నుంటలెస్సయని శ్రీరాములనె. నిరశనవ్రతమునకు రాష్ట్రప్రభుత్వమునకు సంబంధమున్న గతృష్ణయని రాజాజీప్రభృతు లీర్ష్యోద్గాఢోద్గరణముంబ్రదర్శింప వావిలాల గ్లముచిత ప్రశ్నలనెదుర్కొనియు సంతృప్తికరసమాధానమందఁజాలఁడయ్యె. రాములిట్లు జఠరాగ్నిజ్వాలామాలికాత ప్తతనుండై శల్యమాత్రావశిష్టుండై మహావ్యథాసహిష్ణుండై యుండ్కివిని స్వామిసీతారామతివిచారగ్రస్తచిత్తుండై సాంత్వనవచనంబుల మనశ్శాంతిగలిగింప వైళమ తెక్కలుగట్టుకొని సత్యాగ్రహిచెంతవ్రాలె. వ్రతధారి నారికేళతైలమర్దితదేహుండై కొంతతడవా

తపస్సాసమాచరించి శైత్యోపచారముగ గోదావరీమృత్తికను దేహమున కలమికొని నింబవృక్షచ్ఛాయం భూశయ్యం బవ్వళింప స్వామియభ్యర్ణ నిషణ్ణుండై. 188

ఉ. ఏనిఁక రాజకీయమున-కెన్నఁడు రానని రాష్ట్రసిద్ధికై
ప్రాణము లొడ్డి దీపిపుడు – బాపురె యాంధ్రులయందు బాపుజీ
స్థానము నాక్రమింపఁగల – సాహసి రాములె యంచు మెత్తురీ
జ్ఞాన మనేకజన్మకృత – సద్వ్రత పుణ్యమనంగఁ జెల్లదే. 189

తే. అద్దిరా వేదికల బల్ల – గ్రుద్ది సుద్ది
చెప్పుదురెకాని చేఁతల – కొప్పుఁ బోరు
పెద్దలనుకొనువారె నీ – కద్దిలేదు
చేసి చెప్పెడి ఘనత ని – న్నైందనయ్య. 190

కం. శుష్కవచోరచనాపర
ముష్కరునకుఁ గార్యసిద్ధి – పొసఁగుట యరుదౌ
నిష్కామకర్మయోగికి
దుష్కరమగు కృత్య మొకఁడు – దోఁపదు జగతిన్. 191

తే. పచ్చిగంగయుఁద్రావక – పస్తులుంట
నాఁడునాఁటికి దేహము – నవసినవసి
జీవకళదప్ప నాంధ్రుల – చిత్తసీమ
నలముకొనెఁ గ్రోధశోక ద – వాదలంబు. 192

చ. స్పృహయొకకొంతతగ్గె తను – వెల్లఁగృశించెఁ జలింపవేలొకో
సహనమునందు నీకెవఁడు – సాటి ధరాస్థలిఁ బ్రాణబాధ నీ
వహరహమెట్టులోర్తు వల – యాంధ్రమహాభ్యుదయైకశీలవై
యహీమహి మోసినట్టి బరు-వంతయు మోయుదె నీభుజంబునన్. 193

ఉ. చాపము పట్టినట్టి నవ – శాంతనవా యిటుతైలశూన్యమౌ
దీపముభంగి నీతనవు – తేజము దప్పె నికెంతకాల మి
ట్లోపుదునిల్వ నిన్గన న – హో! ప్రజతెర్ధికులట్లురా సదా
నీపడు బాధనెంచి నవ – నీత మనస్కులు తల్లడిల్లెడిన్. 194

తే. సూరిజనసూక్తితతికామ – సుగుణధామ
రామ సీత్యాగమహిమచే – రాష్ట్ర మబ్బ
నంధకారంబునకుఁ జిక్కి – యలమటించి
వెలుఁగునకు వచ్చినట్టుల – యలరు నాంధ్రి. 195

కం. కలఁగక దీక్షం దొలఁగక
తెలుఁగులకుఞ్ రాష్ట్ర మీవు – తేగలిగినచోఁ
గలలోఁ గాంచిన వస్తువు
లిలఁజేతికిఁ జిక్కి నట్టు – లెంతుము రామా. 196

తే. మబ్బు చివరకు మంచుగా – మాఱినట్లు
కడకు ఘనహృదయౌఘంబు – కరఁగకున్నె
యాంధ్రరాష్ట్రంబు త్వద్దీక్ష – నమరినంత
నాహృతామృతునట్లు నీ – వమరఁగలవు. 197

మ. మనబంగారము మంచిదైన వినుమో – మాన్యా నగంజూచుచుం
బనియేమున్నది స్వర్ణకారునన న – ద్వాంచార్థ సంసిద్ధికై
ఘనులౌనాయకు లింతకుం బొరయరై – క్యం బాంధ్రరాష్ట్రంబు స
జ్జనసంస్తుత్యముగా లభించునను వి – శ్వాసంబు క్షీణింపఁగఞ్. 198

చ. అనహానబుద్ధు లాంధ్రులని – యంద్రదది కేవల నిత్యసత్యమై
వ్యసనముఁగూర్చు నేఁటికిన – హార్ద్యమనోధృతి గల్గియుండియుం
బనచెడినట్టి కానఁబడ – భావ్యమె భాగ్యము వ్యర్థమైచనఞ్
హానమున కిట్టు తావిడ మ – హాస్సు తమస్సుగ మాఱిపోవదే. 199

కం. నగ్గారి జిత్తులకుఁ దల
లొగ్గెడి కిగ్గాడు లెవ్వ – రూరక, తగుపో
టొగ్గక నిగ్గుం దేల్చక
నెగ్గఁగలమె యెంతకైన – నిల్తుము రామా. 200

శా. దక్షాహంకృతివృక్షఖండనకళా – దక్షుండు భాస్వజ్జగ
చ్చక్షుం జక్షువుగాఁగలాఁ డమిత దు – శ్చర్యోగ్రరక్షస్తతిం
గక్షన్నిక్షయొనర్చు త్ర్యంబకుఁడు ర – క్షాభాసి శంభత్సుధీ
రాక్షాభాసిగనుంటు యబ్బురమె భ – ద్రశ్రీలఁ జేకూర్చుచుఞ్. 201

వ. విపదబ్ధింబయనించు భవద్రాష్ట్రేచ్ఛానౌక సురక్షితముగ గమ్యస్థానముంజేరుఁగాక. నీయుదాత్తవృత్తము సర్వజగత్తునంజిరస్మరణీయ మగుంగాత. నీయశశ్చంద్రికకుబ్రహ్మాయువగుత యని యాశీర్వదించి యాంధ్రదేశమునఁ దీవ్రతర రాష్ట్రప్రచారమొనరింతునని బాససేసి రాష్ట్రోద్యమహోమకుండమునం బ్రథమసమిధకాకుండ రాముల రక్షింపుఁ డని యేలికలకువిజ్ఞప్తులంపి ప్రతిజ్ఞానిర్వహణార్థము చయ్యనమరలి చనియె. ఇత్తెఱంగున నల్వదిమూఁడుదివసంబులరుగ బహుళపక్షక్ష పాకరుంబలె నానాఁటికింగృశించుచున్న యఃకర్మయోగినిగని "రాముల స్థితియత్యంతప్రమాదకరము. శరీరోష్ణోగ్రత దినదినపతనగతిసుండె. తనువిర్వదియైదుపౌనులబరువుతగ్గె. హీనస్వరమేర్పడె. నేత్రములు చెక్కిళ్ళు లొట్టులుపడఁ జర్మమెల్లముడుతలుపడె. హృద్ధ్వని స్పష్టముగ శ్రవణగోచరముకాదయ్యె. కండలన్నికరఁగె. నాడీస్పందనమేగాక యుచ్ఛ్వాసనిశ్శ్వాసములును మందగించె. వమనములు క్రమముగ హెచ్చె. పోషకశక్తులుక్షీణించె" – నని కె. నారాయణమూర్తి – లెఫ్టినెంటుకర్నల్ టి. యస్. శాస్త్రి – యల్. యస్. కాంతారావు – ఎ. వి. అవధాని ప్రభృతి భిషగ్రత్నసమితిప్రకటింప శీఘ్రమయాంధ్ర రాష్ట్రమువలయునని హరిజనులర్థించిరి. పల్లీపత్తనముల మహాసభలు జరిగె. నాప్రాయోపవేశమింకను ఫలింపలేదని నిర్ధారుఁడగు రాములు దైవమునకంజలించె. అతనిభాగినేయుఁడు యస్. ఆర్. గుప్త, యెర్నేని సుబ్రహ్మణ్యమవ్వానికింబరిచర్యలుచేయుచుండ నవ్వీధిమొగదల నాంగ్లాంధ్ర తమిళభాషలలో సువర్ణాక్షరలిఖితరామప్రాయోపవేశ విషయపటాలంకరణ కలితలలితతోరణశ్రేణులు కట్టఁబడియుంట. 202

తే. నేల యీనిన భంగిగా – నింగి కురిసి
నట్టి తిరునాళ్ళ నందడి – యటు జనతతి
రాము దర్శింపవచ్చె ధ – రా భరంబు
మించ శేషుండు తనతల – వంచు ననఁగ. 203

ఆ.వె. నిఖిల దిశల నుండి – నిర్విరామమ్ముగా
నాఁవుఁ డింక దీక్ష – ననుచుఁదీఁగ

వక్కణంబులెన్ని - వచ్చినరవ్వంత
యాలకింపఁడనఘుఁ - డచలయోగి. 204

తే. ఏటి కెదురీఁదు టెందుల - కిట్టు లన్న
నిండ మున్గినచోఁ జలి - యుండ దనుచు
నకృతపూర్వంబు కృత్యంబు - నాచరింతు
యదృవిష్యున కెటు జయ - మబ్బు ననియె. 205

తే. ప్రజసంకల్పుఁడగు రాము - వాక్కులు విన
హాలహాలమును గర్భమం - దణఁచి కొనుచుఁ
బూర్ణచంద్రోదయమ్మునఁ - బొంగు వార్ధి
భంగిఁ దత్ప్రజ కాత్మ ను - ప్పొంగె ముదము. 206

## ఆంధ్ర కేసరి

కం. నలుబది యేడవ దినమునఁ
గలవిధమున కాత్మఁ గనలి - కర్తవ్యంబుజా
బలు తలపోఁతల నెమకుచుఁ
గలఁగెఁ దెలుఁగుసింగ మంధ - కారస్థితికిజా. 207

వ. అదిగనిదీక్షితుఁడు - 208

కం. సెగలేనిదె పొగలేదని
తగఁబల్కిరి చింత లేదు - దయ లేకున్నజా
మగరా మది వగ గూరజా
నగరా యిది మగలమగలు - నగధైర్యనిధీ! 209

వ. అన నాంధ్రకేసరి తలయూపి. 210

ఆ.వె. రాము చెంతఁ జేరి - రాజాజ్ఞి వైఖరి
యింతవఱకు మాఱు - దేది దారి
యాంధ్ర దేశ మెల్ల - నట్టుడికి నటుల
యుడుకు చున్న దంచు - నుగ్గ డించి. 211

తే. అమితవృద్ధుఁడు గాంధివి - య్యంకుఁడంచు
నతనివ్యూహంబు ఛేదింప - నయితిగాళ

నీతి నిశ్చలమతులగు – నేత లిపుడు
దవ్వగుచునుండి రేలకో – ధర్మవిధికి. 212

శా. ఏదీ నీదుతపోబలంబునకు నిం – తే సత్ఫలం బింతకుఁ
రాదా రాష్ట్రము నీవె తేల్పవలె ధై – ర్యస్థైర్యభార్యాదివై
యౌదార్యంబన నీదెరా యని జనం – బల్లాడ నాత్మార్పణం
బాదర్శంబుఁగ జేసి యాంధ్రఘనక – ళ్యాణంబు సాధింపుమా. 213

తే. రామ భవదీయ సంకల్ప – ధామ బలము
రామబాణముగా నల – రార సుకవు
లాంధ్ర వీరావతంస నీ – యచ్చ చరిత
దీక్షలిఖియింత్రు శుభసువ – ర్ణాక్షరముల. 214

వ. సత్యంబును దుర్భేద్యరసాతలగర్భంబునం బాతిపెట్టినను సహస్ర వజ్రాయుధశక్తిం భూమిని వ్రక్కలించుకొని పాతాళగంగంబలె శర వేగంబునం బైకుబికి కోటిప్రభాకర ప్రభాభాసురంబగునని ధర్మవిదు లంద్రు. ఆంధ్రదేశమునందలి ప్రత్యణువు రాష్ట్రమురాష్ట్రమని యాక్రో శించుచున్నతరుణమిది. 215

తే. ఇంగితజ్ఞాన మిసుమంత – యెఱుఁగ కున్నఁ
బామరుని కంటెఘనుఁడౌనె – పండిత వరుఁ
డెల్లరున్మంచివారొకో –యేఱు దాఁటి
తెప్పఁ గాల్చెడి వారుందు – రెప్పుడైన. 216

ఉ. మానవజిత్తులెత్తులను – మానన మా నవరాష్ట్రసిద్ధికై
పూనితి దీక్షఁ బ్రాణములు – పోయినఁ బోవునుగాక వీడ మ
న్మానసశక్తి నీమనసు – మార్పద ? కూర్పద సత్ఫలంబు లీ
దీనుని వాంఛదీర్ప దివి – దివ్యులు దీవనలిత్తు రంటివే. 217

ఉ. వైభవమొల్ల కాంధ్రసుఖ – వాంఛ నిజోర్వికి సేవసేయ ది
వ్యాభజనించె నీచరిత – కందఱ కందని సొమ్ము నీవెరా
ప్రాభవముం దరిద్ర మొక – భంగి గణించుటచేత దిక్తటీ
శోభిలు త్వద్యశోరమకు – సూర్యుఁడు హారతి పళ్ళెరంబురా. 218

ఉ. సద్గురుఁ డాత్మశిష్యునకు – సంస్తుత సద్గతి సూపినట్లు మ
ద్భృద్గత భావవీచికల – నేనతనిందగఁ దేలఁజేయఁగా
గద్గదకంఠుఁడై తనదు – కాంక్షవెలార్చి విడండుదీక్ష దీ
వ్యద్గుణశాలి రాముఁడని – బాష్పపుఁ జుక్కలు నేల రాల్చితిన్. 219

వ. కేంద్రప్రభుత్వకృతాంధ్రరాష్ట్రనిర్మాణసమగ్ర ప్రకటన ద్వారమున వినా రామప్రాణరక్షణ కన్యపథంబు శూన్యంబు. ఆంధ్రనాయకులకుఁ బ్రజలకు నియ్యదియగ్నిపరీక్షయని జ్ఞానవృద్ధులు చాటుచుండిరని స్వామి సీతారామనెనని యడదడిబారినమెఱింగి నిజమనోభిప్రాయము దానికిట్లు వ్యక్తముసేయదొడెంగె. గాంధీయం శేవాసులలో శ్రీరాములుముఖ్యాతి ముఖ్యుడు. రాజకీయనాయకుల నటనలగ్రహించి ప్రాయోపవేశము ప్రారంభింపకమున్న నాతండు సర్వాంగీకృతమార్గంబు సూచించె. మద్రపురియాంధ్రనిర్మితమైనంబిదపం బెక్కుజాతులు చనుదెంచుటంజేసి యెల్లరుకుంగలిపి ప్రత్యేకరాష్ట్రముచేయుటలగ్గనె. నెహ్రూ యింతకుమున్నె ట్లాడిన రామసిద్ధాంత మిప్పుడంగీకరింపకతప్పదు. నల్వదియేడుదినముల నుండి రాములుపవసించుచున్నం బ్రభుత్వమునకుఁ జీమకుట్టినట్లైన నుండ లేదు. ప్రధానిజాగొనర్చిన త్రైలింగులు వలయుకృత్యంబునకుఁదలపడుదు రని నొక్కివక్కాణించె. రాజ్యసభాధ్యక్షోపాధ్యక్షులగు మౌలంకరనంత శయనమయ్యంగారలు నిరశనవ్రతమాపుఁడని శ్రీరాములనభ్యర్థించిరి. రాష్ట్రమిడిరాముర క్షింపుడని సర్దార్ లచ్చన్న ప్రధానికిఁదంతినిచ్చె. 220

తే. రాము స్థితి కాత్మఁజింతిలి – రాష్ట్ర రమణి
జాలియొక్కింతలేక రా – జాజి పల్కు
కర్ణశూలములైన వా – క్యముల కగ్ని
పర్వతంబయ్యె నది యెప్డు – పగులఁగలదొ. 221

ఉ. కాదనకుండ నేవొ కడు – గడ్డుసమస్యల నడ్డు వెట్టుచున్
వాదముపెంచి మించి పెఱ – వారలఁ గుంచఁదలంచుచున్ వృథా
భేదచయమ్ముఁ గూర్చి శ్రమ – పెట్టు తదీయ విచిత్రకృత్యముల్
ద్వాదశమందునున్న శని – ఖాతి మనోవ్యథఁ గల్గఁ జేసెడిన్. 222

ఆ. వె. వయసు ముదిరినంత – వలపులు చెదరవు
లోభి తనియఁడెంత – లాభ మొదవ

మేలి మిత్తుమన్న – మెడచుట్టుఁ దిరుగునా
యంచుఁ గొండయంత - యాశ సూపు. 223

ఆ. వె. అవ్వకంటె ముసలి – దెవ్వతె మనమింకఁ
దేల్చుకొనుట లెస్స - దీని యంతు
నమ్మపెట్టు దొరుల - నడిగి మెక్కఁగనీయ
దెట్టు పొట్టనింపు – నెవరికైన. 224

కం. ఎల్లర దయతోఁ జూచెడి
యుల్లము నీదనుచు లోక - ముల్లాస పడెం
గల్లయుఁ గపటు మెఱుంగని
సల్లాపివి నిన్నుఁ బొగడఁ – జాలరు రామా. 225

కం. ఏరెన్ని నీతులన్నను
వారల రాష్ట్రంబొసంగు - వైఖరి గలదే
యూరున్న యున్కి దెల్పును
వారక కుడ్యంబు లనెడి - వాక్యము పొల్లే. 226

మ. భగవంతుండు దయామయుం డరసి ప్రో - వంజూచునో లేదొ పె
న్వగగూరుం భవదీయబాధఁగన నె - బ్భంగిన్విచారించినన్
మృగతృష్ణం జలమాననేగుటయ ను - మ్మీ వారి నర్థించుటల్
దిగధీశుల్గనుఁగాచుఁగాత నుతగాం - ధీ సత్యధాత్రాగ్రణీ. 227

తే. వినదు నీమాట కేంద్రము - వేడి నీళ్ళఁ
గాలునే యిండ్లు మాను మి - క్కార్య మనుచు
రామునకుఁ దంతు లిచ్చిరి - ప్రజలుకొంద
ఱంతమాత్రాన నాఁగునా - యతని దీక్ష. 228

ఆ.వె. మతము వేఱ యైన - మానస మొక్కఁడే
క్రతువు వేఱ యైన - వ్రత మొకండె
భాష వేఱ యైనఁ - బరభావ మొక్కటే
కాన దీనిఁ దెలిసిఁ - జ్ఞాని మెలఁగు. 229

# సమాలోచన

తే. అరివీరపుం దపసి - కాహ్లాద మొదవ
శాంతి సంగ్రామ మిగ్గతి - జరుగుచుండఁ
గరిపురంబున నాయకా - గ్రణులఁ గొంత
మంతనంబులు హెచ్చెఁ ద - న్మతులు నొచ్చె. 230

వ. అంతం బర్వదినసమహోదధిం దుఱంగలించు తరంగతతితెఱంగు కుంభ
వృష్టిసముద్యత్తుహినాహార్య నిర్గతోపనదీ నదీవిధంబు శర త్తరుణమానస
సరోవర ప్రోత్తిష్ఠద్వ్యామ్యహరిద్ఘసమహాసేరనకృతక్రౌంచగిరి సుషిరద్వా
మ్మునం జాహ్నవిం జేరు శ్వేతగరుచ్ఛ్రేణులంబలె మహావదాన్యశిఖామణ్యు
దవసితపాణిపీడనోత్సవకాలాగత మార్గణగణంబుచందంబునం శర్క
రాకర్షితపిపీలికాజాలమ్ములవలెఁ బరిపక్వఫలభారసమేతసముల్లలితోపశాఖా
సహితసహకారాకాంక్షం జనుదెంచు శుకనికరములభాతి నుచ్ఛృంఖల
వృత్తి దివారాత్రాంధ్రదేశాగతానూహ్యానేకలేఖాతంత్రీ వార్తావృతుండై
గంతవ్యమార్గాన్వేషణతత్పరుండై యభ్యంతరమందిరనిషణ్ణుండై మౌన
ముద్రాలంకృతుండై నెహ్రూ నిట్టూర్చి యిట్లుతలపోయు. స్వాతంత్ర్య
సౌధరాజమునకింకను వజ్రతుల్యమైన గట్టిపునాది యేర్పడలేదు. నవ
భారతపరిపాలన వటభూజరాజము జటాపటలపరిశోభితముగ నింకను
వేళ్ళుపాతుకొనలేదు. ప్రభుతాబాలకు బాలారిష్టదోషములు తొలఁగలేదు.
కంటికిఁగల్గువర్ణభ్రాంతియే శక్రచాపమైనచందమున మూఢవిశ్వాసంబె
పరమతద్వేషహేతువగుట జాతిమతవైషమ్యము లింకనుసమూలముగ
నాశనము కాలేదు. ఇత్తఱినంతఃకలహములంకురించుట దేశారిష్టదాయక
మని యనుభవజ్ఞులండ్రు. అద్భుతరాజకీయతంత్రజ్ఞుఁడు నిర్వర్తిత
మహోన్నతాధికారి మేవడికాఁడు రాజాజి. అతనివ్యూహంబత్యుత్తగ
నువ్వెత్తుగ భేదింపందలంచినఁ బరిపాలనయంత్రమున కేమిముప్పౌదే
యత్నించునో. కాన వాని నెదుర్కొన నిదియదనుగాదు. కొండఱకువయసు
పరిపక్వమునకువచ్చినను మనసుపరిపక్వదశకురాదు ఆంధ్రులు సమస్త
దక్షిణభారతమేగాక గంగాకూలమ్మున విజయధ్వజమ్ముప్రతిష్ఠించి మగధ
వణికేకచ్ఛత్రాధిపత్యముగనేలిన మహావీరాధివీరులు. క్షోదక్షమాదక్షులు.
విదేశీయయాత్రికవర్యులు వారి సామ్రాజ్యలక్ష్మిని భారతాత్మచిత్కళగా

విలసిల్లిన త్స సంస్కృతిని భాషాయోషను గ్రంథరూపముల వేనోళ్ళఁ బ్రశంసించుట చారిత్రికపరిశోధకాగ్రణులకెల్లరకుం గరతలామలకంబ - ప్రాచ్యైటలీయమని ప్రసిద్ధిగాంచినయాంధ్రవాణి, అట్టిత్రిలింగజనయిత్రీ పుత్రుల రుషాగ్ని తారాపథమ్మునకంటనున్నతరుణమిది. 231

ఆ.వె. తెలుఁగుదల్లి కీర్తి - దెసలెల్ల వెలుఁగంగ
సార్వభౌముఁ డదర - సంగరమున
హూణ జాతి నెల్ల - స్వబ్ధూత లూగించె
రాముఁడొకఁడు పరశు - రాము నట్లు 232

ఆ.వె. రాముఁడొకఁడు మున్ను - రాక్షస చయమును
గ్రోఁతి దండుతోడఁ - గూల్చి నట్టు
లాటవికులతోడ - నాంగ్లసైన్యంబును
మట్టుపెట్టె ధైర్య - మహిమ నతఁడు. 233

ఆ.వె. అతఁ డొకండు తప్ప - నఖిల భారతమున
మూఁడు వత్సరములు - మోహరమున
సార్వభౌము గుండె - జాఱిపోఁ జేసిన
వాఁడు కానరాఁడు - నాఁడు నేఁడు. 234

చ. అతులపరాక్రమాన్విత మ - హాభుజు లుగ్రరణైకకోవిదుల్
చతురులు సర్వవిద్యల న - సాధ్యులు సాహసలీల ధీనిధుల్
వితరణశీలు లుత్తములు - వేదవిదాంవరు లార్తరక్షకుల్
ధృతియుత దేశభక్తు లతి - ధీరు లుదారులు తెల్గు సోదరుల్. 235

వ. ఇందెవ్వరును దక్కువతిన్నవారులేరు. చినికిచినికి గాలివానయన్నట్లు పరిణమించినదియీసమస్య. ఎక్కమన్న నెద్దునకుఁగోపము దిగుమన్న గుంటికిఁగోపము. బట్టకొమ్మన్న నిట్టకొమ్మన్నట్లున్నది వీరివాదన. ఎద్దెండకు లాగ నెనుబోతునీడకులాగినట్లున్నది వీరినడక. పోట్లాడుకోళ్ళు పొడిచి నంటోవుగదా. 236

కం. ఇఁక రాజధాని కిర్వుర
కొకపురమే వలయునందు - రొప్పనె పగయే

ప్రకటించెడి వారల కిది
యొకగుహా సింహద్వయంబె - టుండుం జగతిన్. 237

వ. ఉత్తరయురిమినఁ బాముతరిమినఁ గురవక కఱవక మానదన్న ట్లాంధ్రులీసమస్యను విడువరు. ఎంతకఱవైనంబులి పూరిమేయునా ? ఆఁకలి గొన్నకరణము ప్రాఁతకవిలెతీసినట్లున్నది యాంధ్రులస్థితి. ఎవరేవిషయ మున నెంతప్రయత్నించినను దైవనిర్ణయములేక ఫలసిద్ధిఁబడయఁజాలరు. అలకాపురము కొల్లగొట్టినన దృష్టహీనునకేమియు దక్కదు. 238

కం. కత్తిఁను నాగలి నందున
నిత్తెఁఱగున నిఱికికొంటి - నెదిసేయుటకుం
బొత్తిగఁ దోఁపదు చిత్తం
బెత్తెఱఁగున శాంతిపొందు - నీర్ష్యలు డిందున్. 239

వ. ప్రసాదమునకుముందు పనికివెనుకయన్నట్లు నటించినవారుకారు త్రైలింగులు. ఆంధ్రవిహారఘూర్జరప్రజలు స్వరాజ్య సముపార్జనకు ముందంజవేసినదిట్టలు. తెలుఁగులకవకాశముచిక్కక యింతకాలమెంత యణఁగియున్నం ద్యాగశౌర్యరసస్ఫూర్తినన్యుకంటెఘనులంటనిక్కము. ఏనుఁగుపరుండినను గుఱ్ఱమంతయెత్తని నాకుందెల్లమ. చుట్టుశ్రీవైష్ణవులే; చూచినఁగల్లుకుండలేదు. అందఱచ్చపుదేశభక్తులే సత్యమెచ్చటనున్నదో తెలియలేదు లోగుట్టుపెరుమాళ్ళకెఱుక. పుట్టించినవాఁడు పూరిమేవునా యన్నవిశ్వాస మిర్వురకులేదు. 240

ఆ.వె. పాలు పిండు కొంట - వద్ధతి యగుఁగాని
పొదుగుఁ గోసికొంట - పోల దంటి
దేశకాల గతులు - దీర్ఘ దృష్టి గణించి
యుడుగుఁ డంటి నిట్టి - యుడుము పట్టు. 241

కం. మనుజాభ్యుదయంబునకయి
ఘనులెంతొశ్రమించిఫలము - గనఁజాలిరె యీ
జనసంఖ్య పెరిఁగినంతగ
గుణవృద్ధిం గనము విబుధ - కోటితెలిపినన్. 242

వ. ఒకచెట్టుకాయలేయొకటిగ నుండవుగదా యెల్లర మనస్సులొకటిగ నెట్లుండునని చింతించితి. ఇఁక నీగోలఁబడజాల. ప్రజలందఱుక్రమశిక్షణ కలవడలేదుగాన నలజడిచెలరేఁగుట తథ్యము. కందెనవేయని బండికిఁ గావలసినంత సంగీతము. 243

కం. కుల ధన జన బలములు కడు
గలవనుచుం బెత్తనంబుఁ - గైకొని ప్రజలం
జులకనగఁ జూచి ధర్మపు
జలధులలోఁ గలుపువాఁడు - జననాయకుఁడా. 244

తే. దురభిమానంబునం ధర్మ - దూరుఁడైన
వాని బ్రదుకెన్నడైనను - బయటఁ బడును
బడినఁ దలయెత్తితిరుగుట - వలనుపడక
క్రుంగి కృశియించుననుట ని - క్కువము సుమ్ము. 245

కం. మేర యెఱుంగని కోరిక
టఱుక యది కల్ల యెట్టి - ధీశాలులకుఁ
వారిధి కెల్లను వారధి
వారక చెలువాఱఁ గట్టు - వారలు గలరే. 246

తే. చెన్నపురి కిర్వురును మేలు - చేసి రనుచు
నిద్దఱకు ముఖ్యపురముగ - నిత్తు మన్న
వినసహింపఁడు రాజాజి - ఘన సమస్య
లీలగాఁ దేల్చుటకు వీలు - లేకయుండె. 247

చ. నిదురయుఁ గూడు నీళుల గ - ణింపక చేసిన యాతపస్సుత
ద్హృదయుములం గరంచెఁ బర - మేశ్వరు సాక్షిగ నీమనోరథం
బది నెరవేఱు మద్రపురిఁ - బాసిన రాష్ట్రమునిత్తురన్న నా
కదివిన నింపుకాదనె మ - హాత్ముని శిష్యుఁడు రాములుగ్రుఁడై. 248

కం. ఎక్కడ వేసిన గొంగడి
యక్కడనే యున్న దెట్టు - లాలోచింపం
జిక్క దిరుపక్షములకుం
జక్కఁగ సంతసముగూర్చు - సదుపాయ మిలఁ. 249

వ. న్యాయబద్ధమగునాంధ్రులవాంఛావిషయమున జంపొనర్చుట సమంజసముగాదు. ఒకదెసమహాబ్ధి వేఱొకదెసనగ్న్యద్రి. దీక్షితుఁడు సబర్మత్యాశ్రమవాసి. మహాత్మునకత్యంతప్రియాంతేవాసి. మచ్చలేనిమానిసి. అతని ప్రాణములమూల్యములు. కింకర్తవ్యతావిమూఢుండనై పక్షద్వయభావసమన్వయసముచితదశకై నిరీక్షించుచుం దీఁగలాగినంబొదకదలునని పాముచావకుండ ఒడితవిఱుగ కుండం దఱింగడపుచుంటి. పాలకులకుఁ జెవులుకన్నులన్యులేగదా. ఇర్వురికన్నులు మద్రపురిపైఁ బడినవి. అచారియయ్యది సంపూర్ణముగఁ గబళింపంజూచుటఁ దెలుఁగులకలుక హెచ్చె. ఈ సమస్యాపరిష్కార మెట్లుసేయందగునో తోఁపకున్న దనుకొనుచు నిండు మనంబుతోడం బ్రత్యుత్తరములీయఁజాలకుండె–మద్రపురినున్న్రపకాశము నెహ్రూవై ఖరిఁదలంచిచింతించుచు. 250

తే. అతనికెదితోఁచె నదియ స – త్యంబటంచు
దలఁచు నిచ్చటితంత్రంబుఁ – దలఁపఁ డింత
తాను వలచినయదిరంభ – తా మునింగి
నదియె గంగ యను జనోక్తి – కతఁడె సాక్షి. 251

ఉ. ఏదెటుసేయ నింత కృశి – యించిన యాంధ్రికి మేలుగల్గునో
కాదనకట్లొనర్ప సుప – కారముగల్గుఁ దెలంగు సీమకుఁజా
వ్యాధికిఁ దగ్గ యౌషధము – వాడినఁగా యదితగ్గు రోగముఁజా
బాధ నెఱుంగలేని నవ – వైద్యుఁ డొనర్చు చికిత్సపాలునే. 252

కం. వినయ వివేకాన్వితుఁడయి
గుణము గ్రహించెడి ఘనుండు – కోటి కొకండే
యనుకొని యెటుతోఁపక కసిఁ
గనుఁగొలకులఁ గెంపుగదుర – గా నిట్లనియెఁజా. 253

వ రాజాజీమాటలవిన్న ననిత్యానిశరీరాణి యంచటిసొమ్మమనకేరానీయన్నవేదాంతివాక్కులు స్ఫ్రహకువచ్చు. ఇంతవఱకన్నెముపున్నెము తినుటకాలితమ్ముఁడు; అబ్బాతద్దినముపెట్టుటకు మగనితమ్ముఁడన్నట్లున్నది యాంధ్రులస్థితి త్రైలింగులపలుకులు ములుకులవలెఁదోఁప నాచారి యాదినుండియన్నిటికడ్డుదగులుచుండె. అబద్ధపుఁబంచాంగమున కఱువదిగడియలుత్యాజ్యమే. జరుగునంతవఱకు జయభేరి. జరుగనిఘోరణభేరి. 254

తే. ఆంధ్రులం దైకమత్య మి - ట్లడఁగె నంచు
గట్టి యన్యాయమున కొడి - గట్టఁ దగునె
తిన్నదుద్గారమున వచ్చు - తెన్నఁ దగదె
పెరుఁగునే బొజ్జ యూపిరి - పీల్చి చూప. 255

వ. ఆంధ్రసోదరులారా డబ్బియనివాఁడుపడవముందటెక్కు. అన్నవస్త్రములకొఱకుపోగా నున్నవస్త్రములూడిపోయినట్లున్నది మనపని. మామిళ్ళకుమంచుచెఱుపు కొబ్బరికిఁబుడితిచెఱుపు. చెన్నపురిలేనిరాష్ట్రముమనకుఁ జెఱుపు. ఏగాలికాచాపనెత్తుట మనకుంజేతగాదని లోకమెఱుంగు. ఏగుంట నీరాగుంటనింకునని యెంతయో యోర్పువహించితిమి. కొందఱి సందేశములు మందికిఁజెప్పితిని గాని మనకుఁజెప్పితినాయన్నట్లుండు. 256

కం. జనయిత్రారాధనకై
జనులందఱు నడుముగట్టి - సాగుఁడు రాముల్
మనరాష్ట్రం బొనగూర్పఁగ
జనియించెఁ గుతంత్రమేఘ - ఝంఝానిలుఁడై. 257

వ. అనిప్రబోధించె. చెన్నపురివిషయమటుంచి నిర్వివాదప్రాంతములతో నాంధ్రరాష్ట్రనిర్మాణమత్యవసరమని యుగ్గడించి మల్లంపల్లిసోమశేఖరశర్మ నిజమనోభిప్రాయశంఖారావమిట్లొనర్చె. ప్రత్యేకరాష్ట్రరహితమగుట ననుదినము కష్టనష్టము లాంధ్రజాతినధోగతికింద్రొక్కుచుంట రాజకీయమర్మజ్ఞులకవగతంబ. త్రైలింగులకుఁ బలుకుబడిలేదు. ప్రతిష్ఠయు నాత్మగౌరవము నానాఁటికి క్షీణించుచున్నవి. నిరాశానిరుత్సాహములతిశయించుచుండ నేరంగమునందును దెలుఁగువాఁడొక్కండే మహోన్నతదశనందినట్లుగానము. ఇదియిట్లుండ నాంధ్రులందన్యోన్యవిభేదములు వర్ణనాతీతములు. ఇట్టిస్థితి నాయకులంద ఱేకగ్రీవముగ ముక్తకంఠముతో రాష్ట్రమంగోరుట కనిష్ఠసామాన్యప్రమాణము. త్రిలింగదేశమునకుం జెందవలసిన మద్రపురికాంధ్రాధినేత లితఃపూర్వమ హద్దులునిర్ణయించుట జగద్విదితము. తన్మహానగరవ్యవహారము స్పృహకువచ్చినప్పుడు నాకుఁ బంచతంత్రములోని గుహలోఁదలదాచుకొనుటకుఁబ్రవేశించిన కంటకవరాహకథ జ్ఞప్తికివచ్చు. చెన్నపురమున నాంధ్రజనసంఖ్య రాజాజీచెప్పినంతతక్కువగలేదు. ఇట్టివివాదములకేమాత్ర-మేఁదావీకుండం బ్రవర్తింప

వలసిన మంత్రివర్యుఁడాచారియే స్పర్థవర్ధిల్లునట్టుభిభాషించుట శోచనీయము. 258

ఉ. చల్లనివాగ్రమం బ్రజకు - శాంతినిగూర్చుటచెల్లుఁ బెల్లుగా
నుల్లము దల్లడిల్ల జన - తోద్యమముం దలక్రిందుసేయునే
కల్లను నిక్కమన్నఁ బలు - గాకిని నుత్తముఁడన్న నొప్పునే
మల్లియ నుల్లిగాఁ బలుకు - మానవుఁ డెన్నఁటికేని నెగ్గునే. 259

ఉ. చిక్కని రాజ్యతంత్ర మఱి - చేతికిఁ జిక్కెనటంచు బాపురే
యొక్కొకవేళఁ జక్రమును - నొక్కొకరీతిగఁ ద్రిప్పి తెల్గువా
రక్కట చిక్కుఁజిక్క నిటు - లాడును బిచ్చముపెట్టకుండినం
గుక్కను గట్టివేయు మని - కోవిదపుంగవు లుగ్గడింపరే. 260

వ. నాయింటికినేనేపెద్దను పిల్లికిఁబెట్టరాపంగనామాలనుట సజ్జనలక్షణము కాదు - త్రవ్వఁగాఁ ద్రవ్వఁగాఁ ధథ్యముతేలు - అండయున్నఁగొండ ప్రాకు, నోరున్న నూరుండుననిరి పెద్దలు. ఎక్కడమేసిన మనయింటిలోఁ బాలిచ్చినఁజాలునన్నట్లున్నది యాచారివాదము. మక్కొకుఁబోయినను టక్కరితనము మానలేదన్నట్లు చరించుటయేరికిని మంచిదిగాదు. 261

ఉ. నీతులుసెప్పు నయ్యవి వు - నీతమతిం గ్రియఁ జూపనేర్చునే
వాతెఱ నవ్వు నాత్మఁగ్రుధఁ - బల్క నకల్మషవాక్కుఁ బోలునే
పూఁతపసిండివస్తు వెటు - పోలును స్వచ్ఛసువర్ణభూషతో
నీతిపథానవర్తిలు మ - నీషులు సత్యముఁదప్ప మెత్తురే. 262

ఉ. పాపమొసర్పరాదు పొర - పాటుననే నదివెంటనంటి పె
ల్లేపకమాన దెట్టయిన - నింగల మంటినఁ గాలకుండునే
యోపినయంత పుణ్యముల - నోర్పునఁజేయఁ దదీయసత్ఫలం
బేపున స్థాయి హాయి నిడు - నెప్పుడు చందన చర్చరీతిగా. 263

వ. రాష్ట్రరమాదేవి త్రిలింగదేశసింహాసన మత్యంతద్రుతగతి నధిష్ఠింపవలయు. గ్రహగతులుమాఱిన నీదృఢసంకల్పము మాఱరాదు. జాతికిది జీవన్మరణసమస్య. ప్రభుత్వము మద్రాసువిషయమున నాంధ్రులవాదము నొప్పరికించినఁ గైతవకిరాతుఁడతిప్రీతిం గిరీటికొసంగిన పాశుపతము వలె మహాత్ముఁడుప్రసాదించిన సత్యాగ్రహబ్రహ్మాస్త్రము త్రైలింగుల

కున్నది. మద్రనగరాధిదేవత నెప్పుడెటు(బ్రచ్చించిన నిప్పారమాంధ్రులదని తప్పక ప్రబలసాక్ష్యములిచ్చు. ఇత్తఱి దేశాభిమానిరతింబరమపూజ్యుడైన రాములప్రాణరక్షణమవశ్యకర్తవ్యమనె. అంతనే(బదియొకటవదినంబున( బ్రకాశము, సీతారామయ్య, సాంబమూర్తి, మోతేనారాయణరావు, హరి సర్వోత్తమరావు, స్వామివేంకటాచలముచెట్టి వితర్దికాతలముపైనుపవిష్టులై యుండ సర్వపక్షప్రతినిధులతో( జెన్నపత్తనమున నఖిలాంధ్రపరిష త్ప్రారంభమున రాములకు(బ్రగాఢాభినందనలుదెలిపి యూతని యారో గ్యముకొఱకు సర్వశక్తిసంపన్నుండైన సర్వేశ్వరుని బ్రార్థింప దీక్షితుడు తత్ప్రదస్సునకునమస్సుమములుపంపెనని యతనివ్రతముకఠోరతరమని తద్బాధాతైక్ష్ణ్యమభివర్ణింప శారదకేనిశక్యముగాదని యాశ్చర్యచకితుడై యుద్రిక్తుడై కృష్ణంరాజునివేదించి మఱియు నిట్లను. గాంధియేకవింశతి దివసంబులుపవసింప భరతఖండమెల్ల గజగజవడంకె. చటకచిక్రోడగళ నినదములు సన్నిహిత సంబంధ సహితములైన చందమున రాముల ప్రవర్తన మహాత్మునినడంతబోలియుండు. మరీచిబ్రహ్మకు రెండవమెట్టు వాడని కవికులతిలకుడన్నరీతిగా గాంధీజీకతండుద్వితీయసోపానతుల్యు( డని విద్వద్వరేణ్యులంద్రు. అట్టినబర్మతీఋషిశిష్యాగ్రణి యర్థశతా హమ్ములు కఠినతరశుష్కోపవాసమ్ములు(గడపిన నిసుమంతేని సాను భూతింజూపినట్లుతో(పకపోగా వెట్టియనియవహేళనచేయుచున్నట్లుగనప్పట్టు చున్నది. అమ్మహనీయునిదీక్షారుణోదయమున దేశమున నవచైతన్య ముద్భవించినదనుట నగ్నసత్యము. కాని యమ్మహాత్యాగి జీవించుననను నాసలేదనె. తోన "చెన్నపురిని దానిపరిసరప్రదేశములను చీఫ్‌కమీషనర్ రాష్ట్రముగ(జేయసంకల్పించి తాత్కాలికముగ మద్రపురిముఖ్యపట్టణముగ నాంధ్రరాష్ట్రమతిశీఘ్రముగనేర్పడంజేయవలయునని యేతత్పరిషత్తువారు కోరుచున్నా"రని తత్సభాస్తారులు తీర్మానింప నధ్యక్షుడుదానినకలు ప్రధానికంపె. 264

చ. పరశుభకాంక్ష దీక్షమెయి( — బ్రాణము దానముగా నొసంగుచుఱా
నరనుతి పాత్రుడౌచు స్వజ — నంబును దుఃఖమహాబ్ధిముంచి నం
గరశరతల్పశాయియగు — శాంతనవుంబలె రాములుండె దు
ర్భరయమయాతనాదళిత — భావమడంచి ప్రశాంతచిత్తుడై. 265

వ. అతండట్టిస్థితియందుండియుఁ బెక్కుతలపోఁతలందగిలి. 266

కం మాటకు సత్తెమె యుసురని
పాటించి మహాత్ముపలుకు - పాటప మొప్పన్
మేటులు సూటిగ సరియగు
బాటస వర్తింతురంచు - భ్రాంతిపడితిఁగా. 267

ఉ. నిక్కమెఱుంగకుందె జనని భవదీయదయార్థినై సదా
పెక్కుతెఱంగులం దలఁచి - పిల్చినఁ బల్కవు ధర్మదేవతా
యెక్కడడాఁగితమ్మ భయ - మేటికి నీసహకార మబ్బదే
దిక్కెది సజ్జనావళికి - దివ్యకళానిధి యంచుఁ జింతిలున్. 268

# రాష్ట్రచర్చ

వ. అత్తఱిసాంబమూర్తిరాములస్థితింగని. 269

ఉ. కాయికవాచికాత్మిక వి - కార మొకింతయుఁ దోఁపనీక యా
నాయకుఁ డాంధ్రరాష్ట్రరతి - నాకముఁ జేరుచునున్నవాఁ డహో
పాయని దీక్ష యెంతటి య - పాయమునే గణియింపఁడింకఁ గా
త్యాయని యేమిసేయునొ క - టా! నరశక్తికి మించిపోయెఁగా. 270

సీ. పెక్కుబాసల మీఁదఁ - బ్రేమ యెక్కువెగాని
మాతృ భాషా సేవ - మఱవఁ బోఁడు
సర్వరాజ్యములపై - సదభిలాషయెగాని
నిజరాష్ట్ర నియతికై - నిదురవోఁడు
సకల మానవ సంఘ - సౌఖ్య మెంచునుగాని
హరిజనోన్నతిఁ జింత - నాఁపలేఁడు
వివిధ దేశాచార - విధులారయునుగాని
భారతీయ ప్రథమ్ముఁ - బాయలేఁడు
తే. శాంత శమదమ సద్గుణ - స్వాంత యుతుఁడు
కవ్యకాపరమేశ్వరీ - గానరతుఁడు

మహిత గాంధేయ సత్యస - న్మార్గగతుఁడు
అతనికెవరీడు త్యాగభా - గ్యమున నేఁడు. 271

ఆ.వె. ఉండ వీలు లేక - యూడిపోఁ జాలక
కండ లెల్లదినము - కరఁగిపోవ
సతనిప్రాణ మెంత - యల్లాడుచుండెనో
యెంచవలదె కరుణఁ - గాంచవలదె. 272

శా. దైవీశక్తివివృద్ధమై విజయస - త్త్వశ్రీప్రభాయుక్తమై
భావావేశపరంపరాన్వితయశో - భాసత్క్రియాధుర్యమై
సేవాసక్తు విశిష్టదీక్షసరగన్ - సిద్ధింపఁ బ్రార్థింతుఁ ద
ద్దేవాధీశుల భక్తరక్షకుల హ్రా - ద్వీధిం బ్రశాంతంబుగన్. 273

తే. పరఁగ స్వాతంత్ర్య మబ్బిన - భరత భూమి
యింద్రపురమగునని గాంధి - యెంచెఁగాని
చెన్నుగా నయ్యవారిని - జేయఁబోవఁ
గ్రోఁతిగా మాఱునా యను - భీతి గలిగె. 274

వ. అనియనుకొనె. ఏఁబదిరెండవదినమున ఢిల్లీకేంద్రశాసనసదస్సున "రాష్ట్రసిద్ధికై దీక్షాబద్ధకంకణుండైన యొకమహావ్యక్తి జీవన్మరణస్థితి నున్కిం దత్సంగతిం గమనించుట ముఖ్యాతిముఖ్యమని నెహ్రూసమ్మతించియుం బ్రధానవిషయనిర్ణయములం దిట్టియొత్తరమైనయొత్తడము కూడదు. ఏదౌరతమద్దానికంగీకృతింజూపదు. కాన శాసనబద్ధపథంబులం జరించుట సముచిత"మన నేఁబదిమంది ప్రతిపక్షసభ్యులసమ్మతిందెలిపి తీవ్రతరముగఁదద్వాక్యతతిని విమర్శించి వైళమ తత్పరిషత్తునువీడి వెడలి పోయిరి. "శోణితసహితనిష్ఠ్యూతములతో వమనములతోఁ గంపములతో వెక్కిళ్ళతో రేయెల్లరాములమిత బాధపడుచుండె. నాడీదీపిక కొండెక్కు స్థితినుండె"నని భిషగ్వరేణ్యులు పత్రికలంబ్రకటించిరి. పిదపనేఁబది మూఁడవదివసంబున శ్రీరాములదేశభక్తి నద్వితీయత్యాగాసక్తిం బ్రశంసించి చిట్టచివటిక్షణంబుననే నాతండు వ్రతవిరమణచేయంగలఁడను నాశాభావమువెల్లార్చి యగ్రనాయకత్రయనివేదికా ప్రస్ఫుటసూత్రసమ్మతముగఁ జెన్నపురమ్ముందద్యజించి నిర్వివాదప్రాంతములతో రాష్ట్రనిర్మాణా

త్యవసరచర్యానిమగ్నులమగుటకు సిద్ధముగ నుంటిమి. తానతిప్రధానమని విశ్వసించిన యొకయాదర్శముకొఱ కొకలోకసేవకుఁడైచ్ఛికముగ నింత మహాత్యాగము సేయుట ప్రజలనెంతోయూఁపువేయుట. ఇట్టిపిపాటించినం బ్రజాప్రభుత్వయంత్రమేస్థంభించు''నని నెహ్రూపలికె. అప్పాటనే రాజాజీ పాడి "యనేకకోట్లమానవులకు సంబంధించిన సమస్యల నొకమనుజుని మొండితనమునకు పదలిపెట్టంజాలము. ఈదీక్షపూనిసంచులకు నాకుఁ జాలవిచారముగనున్న''దనె. 275

తే. హృదయశల్యములైన య – వ్వదములు విని
కొందఱానఖఁ గొందల – మంది కుంది
యాత్మఁ బరమాత్మఁదలఁచి ని – రాశ చెంది
క్రోధఘూర్ణితమతులయి – కుమిలి రంత. 276

తే. అరయ నియ్యధికార మ – య్యాంధ్రదేశ
మిడినభిక్షయెకాన నిం – కిట్టి స్థితుల
నేలమేముంట నిటనంచు – నేగ్గ వెలికి
లంకసుందర మతినిష్క – లంకమతిని. 277

వ. సత్యమునుద్రోసిపుచ్చినవాని కహింసయాచరణీయమా ? తల్లిచెవులు త్రెంపినవానికిఁ బినతల్లిచెవులు బీరపువ్వులు. రాజకీయతంత్రజ్ఞులు తినునవి తిప్పకాయలు వెడలఁగ్రక్కునవి వెలగకాయలు. దీపముండఁగనే యిల్లు చక్కఁబెట్టుకొనకపోవుట మనకింతయిక్కట్టువచ్చినది. పెదయర్థమునకుఁ బెద్దరోగమునకు మందేలేదనిపెద్దలంద్రు పేనుకుఁబెత్తనమీయఁ బెసర చేనునాదేయన్నదట. అండలేనియూరనుండదోషము; అశలేని పుట్టింట నడుగదోష మన్నట్లున్నదిమనగతి. 278

ఆ.వె. ప్రాణమానములకు – భంగకరంబైన
పనిగ నిద్ది నేఁడు – పరిణమించెఁ
దానొకండు దలఁప – దైవమొండు దలంచె
నేమిసేయువార – మిపుడు చెపుడ. 279

వ. సమైక్యతాకవచధారణమునకు వీరలపట్టుగొడ్డలిపెట్టు. ఉదాత్తభావ శూన్యుండు పుష్పితపలాశముంబోనివాఁడంద్రు. కేంద్రము తన పక్ష

మగుటరాజాజీ నిమ్మకునీరెత్తినట్లుండె. 280

తే. విత్తనమునాటి చెట్టును - బెంచినట్టి
వారలకు హక్కులేదన్న - వారు గలరె
నేఁటి కీమాట చెవిఁబడె - నీతి నిధులు
దీనికిం భాష్యమెట్టులు - తెలుపఁ గలరొ. 281

వ. వ్యావహారికవిషమఘట్టముల నొక్కొక్కవేళ మిత్రులేశత్రులగుదురు. శత్రులేమిత్రులగుదురు. తగదునమ్మాయని దక్కిన చక్కనితక్తుల నెక్కి నంతమాత్రమున ధన్యులుగారు. 282

తే. శాంతిని బటిష్ఠ మొనరింప - జతన మెపుడు
నలుపఁదగునని చెప్పెడి - సచివవరులె
యింత పూర్వాపరంబుల - చింతలేక
పలుకు టెంతటి వింతయో - తెలుపఁ దరమ. 283

వ. బండెడుధనమిచ్చిన బావమఱఁది లేనిచుట్టఱికము చేయరాదన్న ట్లెన్నికోట్లిచ్చిన మద్రపురిలేనిరాష్ట్రమునకు సమ్మతింపరాదు. సమ్మతించితి మేని బాజాలసందడిలో మంగళసూత్రముమఱచినట్లుండు. మనలో మనకుభేదములుగలుగుట యితరులకింతయలుసైనది. పక్కయింటిపోరు పండుగంతవేడుకగదా! ఆంధ్రదేశమన్ననన్నపూర్ణాగారమనిప్రసిద్ధి. కాని, యేమిలాభము. పేరుగంగానమ్మత్రాగబోయిన నీరులేదు-మెఱపుకొలంది వర్షము, కష్టముకొలందిఫలమనినపల్కు శ్రీరాములయెడసార్థకమగునో లేదో. 284

ఉ. సేవలుసేసిభారతపుఁ - టిక్కులరక్తముధారవోసి న
ద్భావనఁబట్టణంబిడిశు - భంబుగవేగస్వరాష్ట్రసౌఖ్యముం
దీవనతో నొసంగుఁడనఁ - దేల్పక యింతకుఁదెచ్చిరక్కటా
దేవుఁడుకొట్టఁగాదలఁప - దెబ్బలకుంగఱవేమిధారణిజా. 285

తే. ఆంధ్రు లసమర్థులని యెవ్వ - రనుకొనినను
గాలవాహిని కెదురీఁదఁ - గలఁడె నరుఁడు
మంచిచెడ్డల మనసులో - నెంచుకొనక
యెవ్వ రెట్లీడ్వ నట్లేగు - టేమి గొప్ప. 286

తే. అనుచుఁ బ్రతిపక్ష సభ్యులు – నతనితోడ
నరిగి రలపాండవులు వని – కరిగి నట్లు
కదలకుండిరి కొందఱు – గతి యెది యని
దిమ్మల వెలుంగు చక్కని – బొమ్మలట్లు. 287

వ. అపుడు ప్రధానిప్రత్యుత్తర మేమాత్రమే సంతృప్తికరముగ లేదని బెజవాడరామచంద్రారెడ్డియన మాగంటిసీతారామదాసందుకొని కమ్యూనల్ అవార్డుకొఱకు సత్యాగ్రహస్రష్ట నిరాహారవ్రతముపూనుట జ్ఞప్తికిం దెచ్చి యాంధ్రాతిముఖ్యసమస్యాపరిష్కారవాంఛాతత్పరుండై శ్రీరాములు దీక్షించుట న్యాయవిరుద్ధమెట్లగునని పృచ్ఛించి యీదీక్షయశాస్త్రీయముగఁ బ్రధానమంత్రిముఖ్యమంత్రి యెట్లుతలంపఁగలుగుచున్నారనినంత నయ్యద్ మహబూబు తెలుగులోనొకప్రశ్నవేయ నధ్యక్షుఁడు ప్రత్యుత్తరమీయ నిరాకరించి తచ్చర్చ నాక్షణంబయాఁపె. 288

తే. ఆంధ్రసభ్యులు తద్గతు – లరసి యరసి
చేయునదిలేక వెలికి వ – చ్చిరి విచార
పడిరి మార్గము చిక్కక – బాధపడిరి
విషమ దశనుండె రాముల – విషయ మ౯రి. 289

తే. పొక్కె యివ్వార్త భారత – భూమి నెల్ల
దెలుఁగుసింగము గర్జించెఁ – దీవ్రగతుల
వీర విప్లవ రేఖలు – వెల్లివిరియు
జాడ కాన్పించెఁ బగఁబెంచె – శాంతిఁ గుంచె. 290

ఆ.వె. రెండు మూఁడు దినము – లుండెనే నుపవాస
ముల్ల మెల్లఁ బెల్లు – తల్లడిల్లు
నిన్నిరోజు లిట్టు – లింతని యనరాని
యాత్మహింస కెవ్వఁ – డనుమతించు. 291

ఉ. ఇందఱ మిన్నిరీతుల వ – చించుచునుండఁగ బుద్ధిమాఱదే
మందుము మీకు సాధ్యమగు – నా మదరాసునుబొంద దానికై
కొందలమంద నేల యిటు – కోరినకోరిక లెల్లఁదీరునే
యుందని గొప్పవంచనుకు – నట్టులు సాచిన నందనేర్చునే. 292

కం. అనెనట రాజాజీ యిటు
లనుటకు మనమెట్టులొప్పె - నామద్రపురిం
జనసంఖ్యఁబట్టి యిరువుర
కును హక్కుగ నుంచుఁడంచుఁ - గోవిదు లనరే. 293

కం హృదయ విదారక దీక్షఁ
మదరాసును గోరికాదె - మానఁడు ఘనుఁడా
సదయుఁడు దానిని విడుమన
విననొల్లఁడు ప్రాణమేని - వీడఁ దలంచుఁ. 294

తే ఇఁక నుపేక్షింప నాంధ్రుల - కెగ్గు గల్గుఁ
గానఁ దెగఁబడి జయమును - గాంచు టొప్పు
నంచు యువసింహములు కోప - మణఁచలేక
మించి యతిభీకరముగ గ - ర్జించు వేళ. 295

వ. సంపాదకీయరూపంబున నార్ల యిట్లు వల్కె. 296

మ. వ్యవహారజ్ఞత కార్యసాధనవచః - ప్రావీణ్య శుంభత్క్రియా
నవచైతన్యవిలాసబంధురత గ - ణ్యప్రాభవాకర్షణో
ద్భవసోత్సాహసమైక్యసద్గతి మహో - దాంతిన్విశాలాంధ్రముం
దివముఁ వ్రజితెలుంగు పొందవలె హ్బ - ద్వీధిన్విమర్శించుచుఁ.297

ఉ. ఖారము దింపుకో నెదురు - ఖావము మెత్తఁగఁ ద్రుంపఁగాఁ దగుఁ
నేరములెంచి నేతలగ - ణింపక క్రోధముతోడఁ బుండుపైఁ
గారమునల్లినట్లు పలు - కందగదెప్పుడు కార్యసాధకుం
డోరిమిమై జయంబుఁగొన - నొప్పు వివేకవిచారహారియై. 298

శా. ఇష్టప్రాప్తివిహీనహృద్వ్యసనఖా - రైకోత్థరోషానలా
విష్టోక్తుల్గవింకఁ గాలగతులఁ - వీక్షింపనౌ వెన్కకుం
దృష్టింబర్వఁగనిచ్చి సాధ్యముచెడఁ - దృ ష్టస్థితుల్పావుటల్
మృష్టాన్నంబున మట్టికొట్టుకొనుచే - మీసంబులం దువ్వుచుఁ. 299

వ. అనియాడె. మఱియు. 300

ఉ. త్రాసునఁదూచినట్లిటుల - ధర్మవిధిజ్ఞత నార్లవల్కె మ
ద్రాసులు నూఱువేలయిన - రాములకుందులకావటంచు మీ

రానుజనోక్తి నిక్కమని - యమ్మహనీయుని ప్రాణరక్షకై
వే సరియైన మార్గమున - విజ్ఞులుపొందుఁడు రాష్ట్రసంపదన్.301

వ. అనిలోకజ్ఞులుద్ఘాటించిరి. మద్రపురిరహితరాష్ట్రనిర్మాణమునకుంగొన్ని పక్షముల వారామోదించిరి. నీటిచుక్కదిగక రాములువిషమస్థితినుండె. అతనికి నిరాహారవ్రతము మానుఁడని నిజాముకమ్యూనిస్టునాయకుఁడు మక్దుంమొహియుద్దీన్ తీఁగవక్కాణమంపె. అంగళ్ళుమూసివేయుట నాంధ్రదేశమునఁ బల్లిపత్తనముల విపణివీధులు జనసమ్మర్దశూన్యమగుట శిశిరర్తు భూరుహంబులంబలెం గళాహీనంబులయ్యె. ఏఁబదియైదవదినమ్మున "రాష్ట్రసంసిద్ధికై నిజజీవములఁ బణముగనొడ్డి ప్రాయోపవేశగతుండైన శ్రీరాములు మాతృదేశపుటాధ్యాత్మికౌన్నత్యమును ద్విగుణీకృతమొనర్చె. నెహ్రూచిత్తశుద్ధితోఁ బ్రకటించిన విషయము గమనించి యాసుగుణిమణి దీక్షవిరమింపఁగలఁడని విశ్వసింతు. ఇతోధికముగం బ్రజాసేవసేయుట కమ్మహనీయునకాయురారోగ్యములు చేకూర్పభగవంతుం బ్రార్థింతు. అడిన మాటతప్పుట త్రిలింగజాతి కనుచితముగాన నాయకత్రయనివేదికాసూత్రముల కిప్పటికి బద్ధుండ"నని రంగారాములఁ బ్రశంసించుచు. 302

ఉ. మందన ప్రూకుఁ దెచ్చు నతి - మానుషసత్త్వసమేత నీవుగా
కెందఱు దీనికి న్వలయు - నెన్నఁ ద్వదీయతపఃప్రభావ మిం
కందఱి డెందము ల్గరఁచి - యాంధ్రమహోభ్యుయంబుగూర్పదే
సందియమేల నీయశము - చంద్రదినేంద్రులవోలె నిత్యమౌ. 303

వ. అనె. కాలయాపనకోర్వఁజాలక యాంధ్రులుద్రిక్తులై పట్టాలపైఁబరుండ ధూమశకటంబులు నిరోధింపఁబడె. సమ్మెలురేఁగె ప్రజాప్రదర్శనములు సాగె. న్యాయస్థానకృత్యములాఁగె. సర్వవ్యాపారసంస్థలు సవృతకవాటములయ్యె. ఆంధ్రదేశమగ్నిగోళముగ మాఱినుండె. అవ్వార్తవిని రాములు. 304

## రామలుహితోక్తి

శా. స్వాతంత్ర్యంబు లభింప నభ్యుదయముం - సాధింతుమంచెంచ ని
ర్భీతింఖీతిదకృత్యముల్ప్రబలె నే - రీతిన్నివారింపనౌ

నేతత్పూరులు నీతినిర్మలకళా – నిర్ణేతలై జాతికిం
ఖ్యాతింగూర్పక మెత్తురే బుధులు దే – శౌస్యత్య మొప్పారునే. 305

ఉ. లాఁతివిలాతులెల్ల నతి – లాలనముంబ్రకటింప నోర్పుమై
జాతికి వన్నెగూర్పఁగల – శాంతిని రాజ్యముదెచ్చికొంటి మా
నీతినె రాష్ట్రముంబడయ – నేర్పు వెలార్పఁగనొప్పు నంతెగా
కాతతతీవ్రవాదమున – కాహుతి యౌట సమంజసంబొకో. 306

ఉ. లోక మనేకమార్గముల – లోఁ బయనించు సమస్తమేకమై
శ్రీకరసూత్రబద్ధమయి – చేవయొనర్చును దేశవృక్షముం
బ్రాకటశక్తియుక్తి నల – రారెడి కేంద్ర బలంబులేనిచోఁ
బ్రాకుడుఁగొయ్యలేని లత – భంగిగ రాష్ట్రము వృద్ధిపొందునే. 307

తే. వివిధ హింసాకరాన్విత – విప్లవంబు
దుష్టచిత్తున కొకరీతి – దోహద మిడుఁ
బరులకు జుగుప్సగలిగించు – ఖరము క్షీర
ముబ్బసపురోగి కెంతయే – నుపకరించు. 308

ఆ.వె. సర్వజనుల సతత – సంక్షేమ మరయుచు
నున్నవారు మేలుకొన్న – వారు
రత్నగర్భ నిట్టు – రక్తగర్భనుజేయఁ
దలఁచువారు శుభముఁ – దొలఁచువారు. 309

ఆ.వె. ధర్మహీన వాక్కు – తాలిమి సడలించు
న్యాయ బద్ధ వాణి – ననువు గూర్చుఁ
బచ్చి యాకు రాలుఁ – బడమటి గాలికిఁ
జిగురువట్టుఁ బైర – చెలఁగి నంత. 310

ఉ. జాతి సమున్నతిం బడయఁ – జాలునె నీతికి స్థానమీనిచో
ఖ్యాతి సమస్తదేశములఁ – గల్గునె పాలనయంత్రశక్తి ని
ర్ణీతగతిన్వెలుంగునె గు – ణిప్రజగౌరవ మింతనిల్చునే
పూతచరిత్రులార పరి – పూర్ణవివేకముమై మెలంగుఁడా. 311

చ. మనము ప్రభుత్వ మొక్కటను – మాట మదిన్మఱవంగఁబోక స
జ్జననుత పాత్రమౌ నటుల – సాగఁగఁజేయుఁడు శాంతియుద్ధము

వినయము మై స్వనాయకుల – వేఁడి సధర్మపథమ్ము ద్రొక్కుచుం
బనిసెఱవేర్చుకొంట తగు – పద్ధతి యుద్ధతి వీఁడి నిల్వుఁడా. 312

వ. రేఖామాత్రమే నపపథముం ద్రొక్కరాదని ప్రజలకు హితోక్తులం బలికి సాంబమూర్తిం గని. 313

చ. శ్రుతిహితవాక్సుధాకవిత – సుందరమూర్తి సాంబమూర్తి వీవి
పతితజనావనైకమృదు – పద్ధతి బోధయొనర్చి పృద్ధన
మ్మతముగ రాష్ట్రముం బడయు – మార్గము నూపి తరింపఁజేయవే
సతతము దెస్గుబిడ్డ నిను – సన్నుతిసేయ సుధీసుధాకరా. 314

తే. నిత్యనిర్మల నిఃఖేద – నీతి విడిచి
మూలఘాతంపుఁ గృతులకు – మొనయఁ దగదు
దంచనలసేన కెదురేది – ధర్మవేది
యెదరు దొడరిన మనకు ది – క్కెవరు చెపుమ. 315

ఆ.వె. పండు టాకు రాలఁ – బట్టువా చిగురులు
నేను పోవ నొకఁడు – నిలుచుఁ గృషికిఁ
బ్రకృతిశక్తి గర్భ – భావరహస్యంబు
తెలియ నెవరితరము – ధీర యనఁగ. 316

మ. నడిసంద్రంబుననున్న జీవినెటులై – నంగావఁగానెంచి యి
య్యెడ విఘ్నంబులనేకముల్నడుప నే – దీ సత్ఫలంబింతయుం
గడకీరీతిఁ గ్రుధావ్యథాక్రియలు రేఁ – గన్నిల్పశక్యంబొకో
కడకఁ ఘోరలయాగ్నికీల నెపఁడేఁ – గన్నీటితో నార్పునే. 317

వ. అపర్యములు శిఖరమెక్కికూర్చున్న నవసరములధోగతి కీడ్చుచున్నవి. విప్లవజ్వాలరేఁగినఁ బ్రాణనష్టము. రేఁగకున్న రాష్ట్రోదయమ సంభవము తినిన నాయాసము, తినకున్న నీరసము. అయినను. 318

తే. సవన నిర్వహణాంతాన – యువజనాళి
యటొ యిటో తేలఁగాఁ దగి – నట్టివేళ
నెంతొ శాంతముమై నుండ – కిట్టు సేఁత
కడకుఁ దనకంటఁ దనకుఁ దాఁ – బొడుచుకొంట. 319

కం. విగతధృతి నిట్లొనర్చిన
నగరే బుధు లాత్మనాశ – నక్రియలగ్గే
పగవారికేనిఁ దగదిది
మగటిమిగల యాంధ్రు లిట్టి – మాటపడుదురే. 320

వ. అనియతండనె. అఱువదివత్సరములుపోరాడ భరతఖండస్వాతంత్ర్యంబులభింపఁ నల్వదివర్షంబులనుండి సమరమొనర్చుచున్నను రాష్ట్రఫలమందలేకపోవుటత్యంతవిచారకరము. ఈసమస్యా పరిష్కారముపై రాములజీవితమాధారపడియుంట నుద్రేకమత్యుచ్ఛస్థితికేగుటయునైజమే. కాని దానింగ్రమబద్ధశూన్యముగ విశృంఖలముకానిచ్చిన నదిమనలబలిగొనుటనిక్కువము. మనపూర్వులీసత్యమునుగ్రహించివర్తించుట మహాసామ్రాజ్యనిర్మాతలై పాటలీపుత్రమాది కావేరీపర్యంత మయ్యాయికాలములం బరిపాలింప నేఁడుమనమొకప్రత్యేకరాష్ట్రమును సైతము నిర్మించుకొనఁజాలనిదుస్థితినుంటిమి. కాన నైక్యతతోనహింసాత్మకముగ నాందోళనజరుపుట హృదయపరివర్తనమార్గము. ఆంధ్రప్రదేశజాతీయమహాసభావైఖరి యిప్పటివఱకు స్పష్టపడకుంట శోచనీయము. శాలిధాన్యోత్పత్తికిం బ్రధానస్థానములైన కృష్ణాగౌతమీసేతువుల నిర్మాణమున నిర్లక్ష్యమునూపి కోసీ, కోయినా, చంబల్, రీహిందుల కధికవ్యయ మొనర్పనుంటకుం గారణమనూహ్యము. తండులముతక్కువగనున్న దేశమిది. వరిపంటకుంబనికిరాని హీరాకుడ్ దామోదరవ్యాలీలపైఁ జూపిన వ్యామోహ మిటనేలచూపలేదని దృఢతరముగఁబ్రచ్ఛించిననాథుఁడు లేఁడుగదా. ఇట్టిస్థితిం దీక్షవిరమించి యారోగ్యమంది తెలుఁగుజాతికి నాయకుండవగుమని రాములనర్థించుచు నార్ల పత్రికాముఖంబున నిజాభిప్రాయముద్ఘాటించె. ఏఁబదియాఱవదినంబున "ఈప్రపంచములో సత్యమునకు స్థానమున్నదా"యని రాములు ప్రకాశమును బ్రశ్నింపలేదని ప్రత్యుత్తరమీయ. సత్యమునకుస్థానములేని ప్రపంచమునఁ దనటోటివారికిఁగూడస్థానములేదని యతండు నివేదింపఁబ్రకాశము. 321

ఆ.వె. దివిజ దనుజ మనుజ – ధీరవరేణ్యుల
కందరాని త్యాగ – మందుకొంటి

వసషు నీదుకీర్తి - యాచంద్రతారార్క
మై జగాన వెల్గు - టబ్బురంబె. 322

తే. ఇన్నిదినములు కూడునీ - ళ్ళెఱుఁగకుండ
నెట్టులుంటివో యాబాధ - యెఱుఁగఁ దరమ
యన్యహింసకుఁ బాల్పడ - నట్టి దీక్ష
గాంధిమించిన జెట్టివి - ఘన తపస్వి. 323

వ. చంద్రపరివేషమ్మున వర్షయోగమున్న ట్లీప్రాయోపవేశమ్మున రాష్ట్ర
సంప్రాప్తియోగమున్నదని తలంతు. కాని కాలమహిమఁగొమ్ములకులేని
వాడిచెవులకు వచ్చినట్లున్నది. రాజకీయమున నెల్లరేక పథగాములుకారు. 324

తే. గాంధిబోసులు నాయకా - గ్రణులెకాని
దాన్యకుట్టకశక్తి భే - దములులేవె
యిర్వురుం గాంతినిచ్చిన - నెన్నఁడేని
జంద్రమోవహ్నులు గుణాన - సములగుదురె. 325

తే. నీతి నియమములెల్ల ము - న్నిటుఁ గలుప
యత్నమొనరింత్రు కొందఱు - స్వార్థపరులు
ధర్మరక్షణ దీక్షమై - ధైర్యమూని
యసువులేవీడఁగలరు ని - స్స్వార్థపరులు. 326

తే. జనువుచనవని మేమెన్ని - సారులన్నఁ
బెడచెవినిబెట్టిరిందాఁకఁ - బెద్ద లిప్పు
డొకమహాపూరుషుఁడు ప్రాణ - మొడ్డి నంతఁ
గనులుదెఱచిరి జయమందఁ - గల మటంచు. 327

శా. ప్రావృట్కాలపయోధిఘోషనిభవా - గ్వైచిత్ర్యమేపారఁద
ద్భావోద్రిక్తతలన్వెలార్చి వెస నె - ట్భంగింగ్రియాసిద్ధియా
దేవా యీశ్వర కావరావ యితనిం - ధీరోత్తమున్ మాతృభూ
సేవానందమనస్కు నంచుఁ బలికెం - జింతాబ్ధి నోలాడుచున్. 328

# రామనిర్యాణము

వ. అనంతరమేఁబదియెనిమిదవదినంబున రాములనికటంబున మృత్యుముఖకరాళగహ్వరంబు తెఱవంబడియుంటం దెలిసికొని యాంధ్రదేశంబెల్ల బీటలువాఱిన జ్వలనాద్రివలె సెగలుపొగలెగజిమ్ముచుండె. లోలితమతులై యెందఱు బాలచంద్రులుగ బ్రహ్మనాయలుగ రాయలుగ రంగరాయలుగ వేంగళరాయలుఁగఁ బాపరాయలుఁగ బళియరుద్రులుఁగఁ బ్రతాపరుద్రులుగ మాఱుదురోయనుశంక పొడమె. ఏనోటవిన్న రామనామమే. ఏబాటంగన్న పత్రికాపఠనమే. ఏపీటికింజన్న రాజకీయచర్చయే. ఎచ్చోటికేగిన వియద్వాణీ ధ్వనియే. ఎవ్వాని మోముంగాంచినఁ గ్రోధశోకరససూచకమే. లోకబాంధవా నీవీఘట్టంబుఁజూడఁజాలవన్న ట్టిడనెడ మేఘుఁడు జగచ్చక్షువుంగప్పె. ఇన నిటనుండి యమ్మహామహునిమరణ మీక్షింపలేనట్లహస్కరుఁడస్తంగతుఁ డయ్యె. నిజమనోహరుహృదయవేదనందెలిసి పద్మినీరమణీమణిస్తీవ్రవిచార జలధినోలాడుచుంగళాహీనయయ్యెనన జలజము ముకుళీభవించె. అట్టి ధర్మాత్ముఁడేయిట్లయ్యె. కేవలభౌతికభోగాసక్తిందనరు మనయట్టిపుట్టువులు పుట్టినగిట్టినసార్థకంబేమియని వైరాగ్యంబుపూనెనోయన జక్కవకవయెడ బాసె. ఇట్టిసత్పురుషునిదీక్షయెడ భరతదేశమెంతనిర్లక్ష్యముసూపుచున్న దనుక్రోధమున నటరాజమూర్తి నేత్రద్వయము జేవురింపందిలకించెనోయన సంజకెంజాయలలమె. ముక్కోటి త్రైలింగులకొఱకీతండాత్మ బలిదానం బొసంగుచున్నాఁడోసురలారారక్షింపుఁడని యెలుఁగెత్తిప్రార్థించుచున్నవో యనవిహాయసవీథి విహంగసంఘంబులు కలకలకూయుచుఁ బ్రకటిత ప్రదోషప్రదేశమగుట నిఁకనిటనుంట దోషాచరలక్షణమగునేమో యని కులాయకూటములకరిగె. రామతపోగ్నిజనితధూమస్తోమము దశదిశల వ్యాపించుచున్నదోయన లేఁజీఁకటిగ్రమ్మె. అధర్మదేవత నీలచేలాంచితయై విజృంభించుచున్నదోయన నంధకారము ప్రబలె. గంభీరహృదయుఁడయ్యు బరోపకృతిభృతిమతియగు వ్రతిగతిఁదలంచి శోకించుచుండెనన మహారాత్ర మున సముద్రఘోషయతిశయించె. కనులకుమిఱుమిట్లుగొల్పు కాంతిచ్ఛటలతో నొకమహానక్షత్రము దివినుండిభువింబడె. ఆసన్న మరణసమయమున దీక్షితునవలోకింప నాకసంబున కరుదెంచిన యమరులోయనఁ జుక్కలుపిక్కటిల్లె. కాల్లాడక వాయుదేవుఁడు మందమందముగఁ గదలుచుండె. మహావదాన్యవీరశిఖామణి యసువులంబాయుదృశ్యముంబరికింపం

జాలక ప్రకృతిమాత శుగ్రశుబిందుసందోహంబునురాల్చుచున్నదోయన హిమబిందువులురాలె. ఇంతటి బాధాకరత్యాగమేరికిందగదన్నట్లు వన స్పతులుతలలూపె. ఇటిమహాదేశభక్తుఁడీ మర్త్యలోకమున జన్మించుటరు దని ధర్మదేవత కన్నీటిచుక్కలు విడుచుచున్నదోయనఁ బూఁబునేలరాలె ఈసాధువతంసుపల్కులఁ జుల్కనచూతురా యనునల్క వీరస్వర్గాధిదేవత కనులనిప్పులురాల్చినదోయన నుల్కలుదొరలె. రాములప్రాణములవలె నాలయముల దివ్వెలు మిన్కుమిన్కుమనె. ఆంధ్రమాత సత్కుమార ఘోరమరణవార్తను వినఁజాలనని చెవులుమూసికొన్నదోయన నర్చకాళి గుళ్ళతలుపులుమూసె. పరిస్థితింబసిపట్టి పాలుగ్రోలుచున్నపసిపాప తల్లి స్తనముఁబాసె. దివిజులారా స్వర్గసీమకరుదెంచుచున్న యిమ్మహాతపస్వికి మర్యాదాసూచకముగ సుస్వాగతమొసంగుడన్నరీతిగా రేతాలిజామునఁ గొక్కొరోకోయని కోళ్ళుకూసె. పూర్ణసమాధినిష్ఠనందుకొనుచున్నయోగి మనస్సువలె విశ్వముప్రశాంతస్థితినుండ నిశీథమున. 329

తే. ఆదిపద్మాసనాథ జో - హారు లనుచుఁ
చంద్రమశ్శేఖరా నమ - స్కార మనుచు
స్వర్గమునుజేరె రాములు - సర్వ సురలు
కుతుకమున వచ్చి మెచ్చి స్వా - గతము లీయ 330

ఉ. ప్రాణములిచ్చి కీర్తి దివిఁ - బ్రాకఁగఁజేసిన పుణ్యమూర్తిపై
రాణచెలంగ ఖేచరులు - రామకథాకథనైకలోలవై
మానికమానినీ మధుర - మంజుల గానకళావినోదులై
వీనులవిందొనర్చుకొన - వేగమ స్వర్గముఁజేరిర త్తరిన్. 331

శా. ఆటోపమ్మున నిత్యనిష్ఠయుత రా - మాత్మోత్థ సచ్ఛక్తియే
'యాటంబాంబు'ల మేటిప్రేటులుగ రూ - పందంగ ఢిల్లీపురిం
గోటల్బీటలువాఱె రాజ్యసభనం - క్షోభక్రియాలోలురై
యూటాడె న్నరతోర్వి బిట్టడలె శా - పోత్పాతభీతాకృతిన్. 332

మ. వసుధామండలమెల్లఁగ్రక్కదల నా - ప్రత్యూషమాసంధ్య ము
ట్టిసుకన్వైచినరాలకుండ జనవా - హిన్యాళియే తీర శు
గ్రసముప్పొంగెఁ బురాధిదేవతకు ని - క్కంపుంగళల్వింటఁ ద
ధ్వన్యున్నసనం బెంతకుపీడదయ్యో నరుల్ - ర్ణ్యాలోలురంచెంచుచున్. 333

తే. ప్రజల పదధూళి వార్ధుల - వారి యింకఁ
దెలుఁగుఁదల్లి దుఃఖాశ్రులఁ - దిరిగి నిండె
నపుడు వైమానికులు నల్లు – నలరు గుములు
దివిభువికిఁ బుష్పమార్గమై – తేజరిల్లె. 334

తే. ఆ యపూర్వ మహోత్యాగ – మాలకించి
వగపుఁ దరఁగలఁ దేలుచుఁ – బగటివేళఁ
జలనచిత్రప్రదర్శన - శాలవోలెఁ
గడుఁ గళాహీనతం బుర - కాంత తనరె. 335

వ. విశ్వదుఃఖధ్వనివలెం బారావారఘోష నావికులచెవింబడ దిక్సూచి దిటవుసెడి దిగ్భ్రాంతమై నిజకృత్యమొనర్పక నిలుచుటంజేసి దిక్కు దెలియక నౌకలు కతిపయనిమిషంబులాఁగె. ఒక్కభారతమేగాక సర్వ ప్రపంచజనానీకము తలవంచి చింతాసాగరమున నోలలాడె. 336

కం. సత్యాగ్రహశిబిరంబులు
నిత్యం బూరూర వెలసె – నిశ్చల దీక్షా
కృత్యంబుల నాంధ్రోద్యమ
భృత్యులు తెగిరెంతకేని – విజయశ్రీకై. 337

తే. విలయరుద్రులవలె నాంధ్ర – వీరు లడర
నాఁగుఁడని తెల్లునాయకు – లాడి రిట్టు
లెక్కి కూర్చున్న కొమ్మ ని – ట్లేలకొట్టి
కొంట యదితంట మానుఁడీ – వెంట యనుచు. 338

వ. భారతమాతృజీవనాళములు స్థంభించె. మదగజమునకంకుశము సూపినట్లు కోడెత్రాచుతోఁకఁద్రొక్కినట్లు కొదమసింహమును జూలుపట్టి కొని లాగినట్లు దిక్తతి యుద్రువనాంధ్రులయందుద్రిక్తత రెపరెపలాడె. ధీరుఁడేనీనుఁడేఁగావలయునను నార్యోక్తిజనతకుంజ్ఞప్తికివచ్చె. 339

తే. తనురుగనమయజ్యోత్స్నావి – తాన మీన
జటులు జ్ఞానాగ పల్లవ – చ్ఛట వెలుంగఁ
గుంచెసారించి తిలకించి - కుతుక మెసఁగ
నారివేరవుఁదపసి నా – ట్యం బొనర్చె. 340

వ. రామనికటగతుండైన ప్రకాశము. 341

తే. అసువులంబాయువఱకిట్టు - లాలసించి
రంచుఁ గ్రోధాగ్ని యిటువంటి - యచ్ఛశీలుఁ
డరుదనెడి దుఃఖధూమము - లలముకొనఁగ
హోమకుండముగా హృది - యొప్పనపుడు. 342

ఉ. పట్టినపట్టువీడని కృ - పామతి నిట్టులుపేక్షసేసి మీ
పొట్టనపెట్టుకొంటి రిది - పోలునె తాళునెతెల్గునాడిఁకం
గిట్టకయెట్టొవల్క విఱి - గీషువునంటదు వాసిమాసిపో
దిట్టితపస్విసచ్చరిత - యిజ్జగమెల్ల ధ్వనింపకుండునే. 343

ఉ. పట్టినపట్టెగాని పర - భావపరంపరఁ జర్చసేయఁ డి
వ్వట్టున నెట్టునెగ్గు మన - వారలవాదము రాజ్యతంత్రపుం
గుట్టునెఱింగి ధర్మమున - కుందలయొగ్గఁడు పొట్టివానికిం
బుట్టెఁడుబుద్ధులంద్రు సరి - పోయెఁ బ్రధానికి దండపాణికిన్. 344

కం. నెత్తురుపిండక రాష్ట్రము
దెత్తురె రాజ్యంపుఁగథలు - తెలియరె మున్నా
యుత్తరు నొక్కని బంపిన
నెత్తెఱఁగునవచ్చు విరటు - నింటికి గోవుల్. 345

శా. జాతిప్రాభవవైభవంబులకునై - స్వాతంత్ర్యఘోరాజి ని
ర్భీతిన్ రక్తము ధారవోసితిమి యే - రీసాటి మాతోడ మా
మాతృశ్రీనరికట్టి కట్టలుకమై - మాయింపు మాయింప మీ
చేతన్వ్రాతనుగాదటంచెఱుఁగుఁడీ - సిద్ధించు రాష్ట్రంబిఁకన్. 346

చ. అదనెద నెంచిపొంచి యిసు - మంతయు వీడక పిండుకొన్న సం
పద పదవీ ప్రదంబనుచు - భౌతికసౌఖ్యనిబద్ధబుద్ధికిన్
ముదమొనగూర్చునంచెఱిఁగి - భూసతి సూర్యుని చుట్టుకాదుగా
యొదిగి తనంతతాఁ దిరుగు - చున్నదిగా ధనలక్ష్మిచుట్టొగిన్. 347

తే. లక్ష్యసాధన సిద్ధాంత - లక్షణుండు
ఢీలుపడుచుండె నేలొకో - కోలుకాఁడు

తెలుఁగువారల బాధ గు - ర్తింపకున్కి
నగ్నిగోళముగామాఱె - నాంధ్రపృథ్వి. 348

తే. ఏమికానున్నదో యాంధ్ర - భూమి యిప్పు
డాగ్రహావేశపూరిత - మై జ్వలించు
దానిఁ జల్లార్ప నెవ్వరి - తరము చెపుమ
యమల భావాల భారవి - యమరజీవి. 349

కం. సత్యాగ్రహబలిపీఠం
బత్యుత్సాహమునఁ జేరి - యఖిలాంధ్రసుధీ
స్తుత్యుఁడవై ప్రాణము లిడి
ధృత్యున్నతి దేవజగతి - కేగితె రామా. 350

కం. ఏఁబది యెనిమిది దివసము
లీబవరము సాగఁ గడకు - నీల్గితె రామా
సేబాసని మెచ్చె జనం
బీబాసకు నుద్దియెద్ది - యిన్నర జగతిఁ. 351

తే. రామనామంబు దాల్చిన - ప్రజలు లేరె
రాముఁదలపించిరె గుణాళి - రాములగుచు
రమ్యతరమైన రాష్ట్ర సం - ప్రాప్తికొఱకు
జీవమర్పించిన యమర - జీవి వీవ. 352

తే. బుద్ధిమంతుఁడు బ్రదికిన - ప్పుడును బచ్చి
నప్పుడును గీర్తితోఁ గడు - నొప్పు చుండు
గందపుంజెట్టు జీవించు - కాలమునను
నెండియుఁ బరిమళమ్మునె - యిచ్చును గద. 353

కం కాయ మపాయం బదియొరు
సాయంబునకైనఁ గూర్చు - సద్గతి యనుటఁ
నీయాడు వారలెవ్వరు
నీయాడసఁ జెప్పఁదగును - నిర్మల చరితా. 354

తే. కాఱుమబ్బులు తొలఁగని - కారణమున
వెలుఁగురేకలు గనఁజాల - కలమటించి

యసువులంబాసితయ్య నీ - యాత్మశాంతి
కేమొనర్పంగవలయునో - యెఱుఁగ లేము. 355

తే. ఆంగ్లపతితోడ ననిఁ బ్రాణ - హాని లేదు
జీవములఁ బాసితే రాష్ట్ర - సిద్ధికొఱకు
జీవనది పూరమునకేని - జెడని దీవి
బడుగుసెలయేటిచే ముంచఁ - బడియె నకట. 356

తే. స్థానమున్నదె యెటనేని - సత్యమునకు
ననియడిగి ప్రాణములవీడి - తమలచరిత
బ్రదికి సాధించి రన్యు లీ - ఫలిత మబ్బఁ
జచ్చి సాధించితని నిన్ను - మెచ్చుకొంద్రు. 357

తే. ఇంతజరిగిన మీఁదట - హీనమనక
యేదొ దొఱకిన దానితోఁ - దృప్తిపడుట
తనకుఁ దగదనుకొని యోలి - తక్కువ యని
గ్రుడ్డిదానిని బెండ్లాడ - గోరినట్టు. 358

వ. అనిచింతింప సాంబమూర్తి హరాణపాలనమున నణామీఁద నాంధ్ర భాషయున్నది. తమిళములేదు. కాన మాభాషామహోన్నత్యము మా రాష్ట్రగౌరవాతిశయ మాంగ్లచక్రవర్తులే గమనించిరను నిత్యసత్యమున కదియొకప్రధానచిహ్నమని మద్రపురిమహాసభలోఁ బట్టాభిపల్కినపల్కు లెల్లరకు స్పృహణీయంబులని ఘోషించి దేశరూపమ్మును భాషించి మాతృభూమిని భూషించి నిష్ఫలంబునకురోషించి భీష్మప్రతిజ్ఞానిర్వహణంబున శోషించి శోషించి నిండుప్రాణములు నిలువునఁదీసికొంటే. రాష్ట్రలక్ష్మికి స్వాతంత్ర్యమకుటముంతునంటే. నీ నిబోధనంబున బోధనమున్నది. దాని కిదిష్టాంతమే దృష్టాంతము. ధార్మికమౌలిక కార్మికసూత్రశ్రద్ధానిబద్ధబుద్ధివి. త్వద్దృఢ్రాజదవ్యాజత్యాగనిరతి ప్రజావిజయవైజయంతి. రాజకీయార్థికనైతికసాంఘిక పరిస్థితులం జక్కపెట్టుటకే సత్యాగ్రహసూత్ర నిర్మాణమొనర్పంబడియుంట రాజకీయమునందును రాజమార్గమే రమణీయతరము కావున జటిల కౌటిల్యము సౌశీల్యమున కానుకూల్యమనం జెల్లదంటి. 359

తే. దినము గడచినఁ జాలని – యనుకొనకుము
తనువు గడచిన గొప్పని – తలఁపు మంటి
కనఁగఁ దనుదాన బ్రదుకుట – ఘనతకాదు
నల్వురకు దారిఁ జూపుట – నాణె మంటి. 360

తే. మౌలికాదర్శ విశ్వాస – మహిత నిష్ఠ
విశ్వ మానవ కల్యాణ – విహిత దీక్ష
మాతృభూ శ్రీకరోత్కృష్ట – మాన్య చర్య
నీకు నీవెగదా సాటి – నేతృ కోటి. 361

ఆ.వె. చచ్చియేమి నరుఁడు – సాధించు ననుమాట
వమ్ముచేసినట్టి – వ్రతివి నీవ
నీదు త్యాగ లక్ష్మి – నిఖిల మంత్రులగుండె
లూపి రాజ్యతంత్ర – మాఁపివైచె. 362

కం. భోగమెదంగోరక జన
భోగమె తనభోగమనుచుఁ – బూర్ణాహుతియై
వేగంటి భోగ మందెడి
త్యాగి యమరజీవి సాటి – ధన్యుఁడు గలడే. 363

తే. అరయఁగా దైవనిర్ణయ – మద్ది యెంతో
యంతెగా వంతువచ్చిన – గంతువేయఁ
దప్పునా యని పెద్దలు – సెప్పలేదె
తెలియఁ దరమౌనె యీశ్వరు – దివ్యలీల. 364

తే. అతిరథమహారథుల్గదా – యాంధ్రులందఱ
జేలకోస్వీయరాష్ట్రంబు – నెంచకిట్టు
గువ్వ మాదిరిగా గూటఁ – గూరుచున్నఁ
బడునె తప్పల మఱచేత – నిడునె నేత. 365

వ. అని విచారపడె. అత్తఱి నమరావతి దేవసభ జరుగుచుండె. అయ్యది యెట్టిదన— 366

సీ. కన్నతల్లుల కింత – కడుపారఁ బెట్టని
కఠినాత్ములకుఁ దావు – గలుగలేదు

కాలుచేయాడని – కాలానఁ దంత్రడిని
కోసి దేబెకుఁ – జోటులేదు
సతియిల్లాండ్లనల్లాడ – సౌనిపాదములొత్తు
చవటకు నచ్చోట – స్థలములేదు
ధనము పరులసొమ్ము – తెగఁదిని యెగవేయు
నీచుల కట నిల్వ – నీడలేదు

తే. పాపులకు దవ్వు పుణ్యుల – పాలిసవ్వు
సఖల తలపుష్వు – నాస్తిక – సమితి నొవ్వు
లలితవిద్యావిశాల వి – లాసశీల
యమలగుణవర్మ శుభకర్మ – యా సుధర్మ. 367

తే. తత్సభాధ్యక్షుఁడై క్రాలు – ధార్మికుండు
దేవలోకాధిపతి యాత్మ – దీని నెఱిఁగి
వడి సపరివారుఁడై యిట – వచ్చె ననఁగఁ
దిరుగుచుండె విమానముల్ – దివి వెలుంగ. 368

తే. అమరవిభుశాసనంబున – నప్సరసలు
నృత్యగీతాల లోకసం – స్తుత్యరాము
వరుసఁదోడ్కొనిపోనిటు – వత్తురనఁగఁ
దొలిదెసజనించె వేఁకువఁ – తెలివెలుంగు. 369

మ. రణరంగంబున నిల్చి యాత్మధరకై – రక్తంబు చిందించు యో
ధునిచందంబునఁ దెన్నుబిడ్డ బహుధా – దుర్దాంత దీక్షాలస
ద్ఘనశౌర్యస్థితినిల్చి గెల్చుటది ని – క్కంబంచు ఘోషించెనా
వినువీధిం ఖగజాతికూసె విలస – ద్విశ్వంబు మేల్కాంచఁగన్. 370

శా. అంతంజింతయొకింతవీడి యరుణో – ద్యత్కాంతిపుంజార్భటిం
బంతంబుం బ్రకటింపఁ బెల్లుబికి వి – స్పష్టంబుగా మద్గతిం
ధ్వాంతధ్వంస మహామహప్రభల న – ద్యశ్శ్రీల రాష్ట్రంబు ది
గ్దంతుల్మెచ్చఁగవచ్చు నింకన జగ – ద్బంధుండు తోఁచెందివిన్. 371

తే. తనమనోహరు తత్త్వంబుఁ – దాగ్రహించి
చిఱునగవుతోడ నావలెఁ – జెలఁగు నింక

నాంధ్రరాష్ట్రరమాదేవి - యనెడి ఖ్యాతిఁ
బద్మినీకాంత వికసిత - వదనయయ్యె. 372

తే. అంధ్రరాష్ట్రప్రజానీక - మైకమత్య
మద్భుతంబుగఁ జూపుదు - రన్నరీతి
దోష నిర్దోషతఁదగి పొం - దును ద్యజించి
కడకు సత్తఱిఁబ్రకవా - కములు కలసె. 373

ఆ.వె. దీక్షవిడని మేరు - ధీరుఁడౌ శ్రీరాము
మరణ వార్త విన్న - మఱు క్షణంబ
యాంధ్రదేశ మెల్ల - నగ్నికుండంబయ్యె
నేమి జరుగఁ గలదొ - యెవ్వఁ డెఱుఁగు. 374

చ. బధిరితదిఙ్మహానినద - భాషణభీషణరోషదుగ్రుచి
వ్యధిత మనస్కులై ప్రజల - పారమహోదధివోలెఁ గ్రమ్మి రా
బుధనుతుఁజూడ దేవతల - పూర్వగతిందివియెల్లనిండి వా
జ్మధురిమఁ దచ్చరిత్ర నతి - మాత్రముగా స్తుతియించి రత్తఱిన్.375

వ. బహువిధవాద్యధ్వనులతో భగవన్నామ సంకీర్తనలతో రామసత్యాగ్రహ సంగ్రామగేయగానములతో ఛాయాగ్రాహకయంత్రకృత్యములతో నాంధ్రమాతకు జే యమరజీవికి జే యను నినదంబులు దశదిశలఁ బ్రతిధ్వనింప రామానుజన్ముఁడు, తద్భాగినేయుఁడు ప్రకాశము, సాంబమూర్తి స్వామిసీతారాము, లెఫ్టినెంటుకర్నల్ శాస్త్రి, యొర్నేని సుబ్రహ్మణ్యము, మోతేనారాయణరావు, మద్దులేటి ప్రభృతులు రుషాశోక సంతప్తమాన మానసులై పరివేష్టించియుండ వివిధవర్ణ నానాసుగంధసుమాలంకృతంబై ఘట్టికా నిక్షిప్తమైనరాముల భౌతికకాయము దహనసంస్కారార్థము కొంపోవుతఱి నడుగొకయామడగా సాగుచుండ. 376

తే. వాడవాడల మేడలపైన నిలిచి
యమరజీవికి జే యంచు - నభినుతించి
స్త్రీలు కురిపించి రతనిపైఁ - బూల వాన
కమ్మతావులు పురమెల్ల - గ్రమ్ముకొనఁగ. 377

ఆ.వె. అవిధదృశ్యముంగనుచు - హర్మ్యములఁజ మఱికొందఱంగనల్
క్రోవులనింపి యత్తరులు - కొల్లగఁ జిమ్మిరి బాష్పనేత్రలై

దేవతల|భవీధి నతి – దీధితి పర్వఁగఁ గల్పవృక్షపుం
బూవులు చల్లి రప్పురుష – పుణ్యు మగణ్యమటంచు నెంచుచున్. 378

వ. చూలై శ్మశానవాటిక సుగంధద్రవ్యసమ్మిళిత శ్రీఖండ ఖండములతో వేదనాదములతో నమ్మహనీయుని సంచయనముజరిగె. ఘృతాన్వితబృహజ్జ్యోతిచ్ఛటల సమస్తజీవనదులఁ దదస్థినిమజ్జనాదికృత్యంబులు నిర్వర్తింపఁ బడుచుండ నాంధ్రభాషాయోష కవుల కలముల కదనుద్రొక్కుచు వివిధ రూపముల వెలువడుచున్నదోయన వార్తాపత్రికాపుత్రికలు గద్గద కంఠములతో రామకథాకథన నిమగ్నమానసలై యుండఁ బల్లీపత్తనముల సంతాప సభలు జరిపి రాష్ట్రతపస్వి కాంధ్రులశ్రుతర్పణ లర్పించిరి. అంత. 379

# ఆంధ్రుల క్రోదాగ్ని

శా. పక్షీంద్ర ధ్వజసంభవాద్భుత తపో – భంగోద్భవక్రోధరూ
క్షాక్షోగ్రార్చ్చటి తుల్యభీషణ మహా – హంకారహుంకార వా
గ్దక్షక్షోభితమర్త్యమై తెలుఁగు మ - ర్త్యవ్రాత ముప్పొంగెఁ ద
ద్దీక్షాభక్షిత రామవాంఛిత ఫలో – ద్దిష్టాశయోద్రిక్తమై. 380

మ. ఒకరాముండు బ్రిటీషురాజ్యరమఁ దా – నుజ్జృంతలూగించి కొం
కకప్రాణంబులు ధారవోసె భరత – క్ష్మాదేవిముక్త్యర్థియై
సకలోర్వీతలనాథభూషిత మహా – సత్యాగ్రహావేశియై
యొకరాముఁడు నిజాసువుల్విడిచె రా – ష్ట్రోద్వాహనవ్యగ్రుఁడై. 381

శా. ఊహాతీతమహేంద్ర భోగకలనా – త్యుత్సాహశుంభత్ప్రభా
బాహానిర్మితరమ్యరాజ్యరమణీ – వ్యాసంగదీవ్యద్రమా
స్వాహానాథనిభోగ్రవీరవర సం – పద్భవ్య మీరాష్ట్ర మా
రాహుగ్రస్తశశాంకురీతిఁ దనరెం – బ్రాగ్భారహైన్యస్థితిన్. 382

శా. ప్రాణంబుండిన నూడిన న్విడువ మి – ప్పంతంబనంతోద్ధతిన్
మానంజాలము మత్ప్రతిజ్ఞజపమున్ – మద్రాష్ట్రగానధ్వనుల్
ఘూనాకంబులనిండి చండతరమై – బుద్ధుల్దగన్మార్చి రా
ష్ట్రానందంబిడుదాఁక నంచు జనుల – త్యంతంబు ఘోషిల్లుచున్. 383

మ. దురహంకారత విశ్వనాథు హరు ని - ర్దోషిం బరాభూతికిం
గురిసేయన్ సతినట్లొనర్చి శివు న - క్రోధాత్ముఁడై దూఱఁ ద
ద్వరవై రోద్భవభద్రుఁ డుగ్రుఁడయి త - ద్దక్షాధ్వర ధ్వంసియై
చరితార్థుండయినట్లు లాంధ్రులు మహా - శౌర్యక్రియాలోలులై. 384

శా. నిర్ణీతాంశము తృప్తిశూన్యమని సం - ధింపంగ సన్మార్గముల్
నిర్ణేతల్మఱి నిశ్చయింపమిఁ గృధా - నిర్మగ్నులై యాంధ్రు లి
వ్వర్ణోరాశి జగల్లయోద్ధృతి తరం - గాళిక్రియంగ్రీష్మ భూ
జీర్ణారణ్యసముద్భవంబయినకా - ర్చిచ్చుంబలెన్ రేఁగుచున్. 385

ఆ. రమ్మురమ్ము నిమ్ము - రాష్ట్రేందిరాసౌఖ్య
మంద నంద మొంద - యశము పొంద
ననెడి నినదనికర - మాంధ్రదేశంబెల్ల
మ్రోగె శౌర్యరసము - దీఁగ సాగె. 386

కం. రాముల క్షేమముఁ గోరక
వేమారులు చెప్ప వినక - వినుత గుణాఢ్యం
బామరు నటు పరికించిరి
కామక మాబాధ దీర్పఁ - గలరే యింకన్. 387

ఉ. ఈనినబెబ్బులింబలె న - హీనపరాక్రమసత్త్వయుక్తులై
కానక మన్నుమిన్ను నిజ - కాంక్షను దీర్చికొనంగఁ బొంగుచుం
బ్రాణములొడ్డి తత్ప్రజలు - పాలనయంత్రము నాఁపి యూపఁగాఁ
బూనిరి దీక్ష భారతవి - భూతి చలింపఁగ భీతిఁబెంపఁగా. 388

తే. ఇష్టమైనట్టి పనికెంత - కష్టమైనఁ
బడును నరుఁడుంట యనుభవ - వాక్కుగాదె
యిద్ది చింతించి యాంధ్రుల - యెద గ్రహించి
తీర్పు సెప్పక యింతకుఁ - దెచ్చిరి గద. 389

మ. ఒకమాణిక్యముఁ గోలుపోతిమని యెం - తోచింతతోనుండ మా
మకవిజ్ఞప్తులు మంటిలోఁగలిపి రె - మ్మాడ్కిన్ సహింపంగనౌ
వికటాలాపములాడ భీతిలుదుమే - విధ్వంసకోగ్రక్రియం
బ్రకటింపందగుఁ బౌరుషాగ్నులని సం - భావించి రుద్రిక్తులై. 390

తే. పట్టు విడువక యిక్కార్య - భార మూని
ప్రాభవము పొందఁదగునని - బయలుదేఱఁ
బట్టణంబులఁ దొలుదొల్తఁ - బుట్టి కడకు
పల్లెలకుఁ బ్రాకె విప్లవ - జ్వాల లెల్ల. 391

చ. మనసు చివుక్కుమన్న నౌక - మాత్రన తద్వ్యథమాన్పశక్యమా
జనతతి వేగ రేఁగఁ బరి - పాలనయంత్రము చక్కసాగునా
ఘనులిది దీర్ఘదృష్టిమెయిఁ - గానక భారతశాంతిభద్రతల్
వినయవివేకముల్ నిలుప - వీలగునా లఘునాళికాళిచే. 392

కం. పరిగణకుల గారడిచే
సరియగు సత్యంబు తెలియఁ - జాలక కేంద్రం
బిరువురకుఁ దగిన న్యాయము
సరగునఁ జేకూర్పకున్కి - శాంతి నశించెన్. 393

వ. రంగదుత్తుంగాభంగభంగతతి నింగినంటు ప్రళయసమయజలధిరీతిం బ్రావృట్కాల ధరాధరధారాధరధారాపాతజనితా ఖండోల్లోలోల్లాసితాఖిల గభీరకల్లోలినీ శిరోమణ్యఖండ గౌతమీప్రవాహంబుభాతిం గ్రుధాసంతప్త ప్రజాప్రవాహంబు విధ్వంసకచర్యాహార్య ధైర్యమైపొంగి వెల్లివిరియుచు ధూమశకట విరామస్థాన న్యాయస్థానాది వివిధప్రభుత్వకార్యాలయ సకల కృత్యభగ్నకరంబుకాగా దొరతనమువారు దమననీతింబాటించి యసాధారణ శాసనాస్త్రములంబఱపి జంకకున్కింగమనించి హింసాబలప్రయోగంబున విజయంబుఁగాంచనెంచి సుగ్రీవాజ్ఞగాఁ బరేతరాట్కింకర సదృశ రక్షకభటపటలమునియోగింపఁ దద్వేణుయష్టిఘాతంబుల ననేకనగరంబుల జనతారక్తధారల ధరణీతలంబు కెంబట్టుపుట్టంబులు పఱచినట్టయ్యె. వాల్తేరు కాల్పులం బదునైదుగురుక్షతగాత్రులుఁగా నొకతరుణి మరణించె. విక్రమసింహపురి నైదుగు రనకాపల్లిముమ్మువ్వురు తాడేపల్లి నిర్వురు రాజమహేంద్రవరమున నిద్దఱు హతులైనందద్ధత్యాకాండకణమాత్రమే భీతిలక విద్యార్థి ప్రదర్శనములు సమ్మెలు తీవ్రతరముగ విజృంభించె. నెల్లూరిలో లఘునాళికాగోళములకు గుఱియైన దేశభక్తుల కళేబరముల వీరాలాపములతో జయజయధ్వానంబులతో బహువిధవాద్యధ్వనులతో ముప్పదివేలపౌరులైదు గంటలసేపు పట్టణంబెల్ల నూరేగించిరి. ఇవ్వార్తలు చెవింబడఁ బ్రభుత్వ

దమననీతిని నిరసించుచు నసెంబ్లీకౌన్సిలుసభ్యులు తెన్నేటి విశ్వనాథము సుబ్బతాతరాజు విజయనగరమురాజా దంతులూరి నారాయణరాజు సీతారామయ్య సోమయాజి ప్రభృతులు తమ పదవులకు రాజీనామా లిచ్చిరి. 394

మ. తొలియౌన్నత్యయశోర్థు లాంధ్రులు సదా – దోదూయమానాత్ములై
బలిదానప్రభ రాష్ట్రసిద్ధి వెసనం – భావింపనిట్లయ్యె ని
స్తులనీరమ్ములఁ గ్రోలఁగష్టపడి నూ – తుల్త్రవ్వ బేతాళముల్
వెలికిందూఁకెనొనాఁ దుపాకులు మహా – వేగంబుతోఁ బైకొనెన్. 395

వ. అదివిని. 396

తే. క్రోధఘూర్ణితమతులయి – కొంకుజంకు
లేక వెన్కకుఁబోక చీ – కాకుపడక
నవ్యకాలాగ్నితుల లఘు – నాళికలకు
నెదురునిల్చిరి త్రైలింగు – లెంతఘనులొ. 397

ఉ. ఆఁకలిగొన్నసింగమటు – లార్చు తెలుంగుల నాఁపశక్యమా
చీఁకటి యిద్ది వచ్చునని – చింతిలి చెప్పితిఁ దప్పదయ్యెనా
వాకు వరాకుగల్గె నని – వార్యగతిం దెసలెల్ల నిండె నీ
పోకడమానుఁడన్న రణ – భూమిగ మార్చిరి తెల్గుభూస్థలిన్. 398

మ. కదనంబియ్యది శాంతిమార్గమునె యా – కాంక్షించివర్తిల్లు నం
చెదలోనెంచితిఁ దొల్తఁ గాలగతి వీ – క్షింపంగ హింసాత్మక
వ్యథకే పాల్పడునేమొ యంచు బహుధా – భావించి శంకింపఁగాఁ
దుదకిట్లయ్యెఁ దలంచినట్లు మదినెం – తో సోది లోనంతెగా. 399

శా. ఔగ్రాస్త్రౌఘ్యనిభప్రభావయుతులీ – యాంధ్రుల్ స్వరాష్ట్రోదయో
దగ్రాత్యద్భుత శౌర్యధైర్యనిధులై – ధ్వంసక్రియాలోలురై
దిగ్రాజిన్నిజకీర్తికాంత వెలుఁగం – దీక్షించి రాహోమహో
న్యగ్రాజిన్విరజిమ్మ సిద్ధపడి రే – రీతిన్నివారింపనో. 400

వ. అని నెహ్రూ యోచింపందొడంగె. 401

తే. ఆంధ్రదేశమహాభ్యుద – యార్థులగుచు
స్వార్థరహితంబుగాఁ గొంద – ఱట్లొనర్చ

సంఘవిద్రోహు లిదిమంచి – సమయమంచు
దోషమెంచక సందంపు - దోఁచుకొనిరి. 402

మ. ఘనుఁడా రాముఁడు ప్రాణమీఁ బ్రజలవా - క్యంబేకమై పర్విన౯
మనరాష్ట్రేచ్ఛ విశిష్టదృష్టుల సభ - న్మప్రక్రియం బాపరే
మననౌ నేతలనంచు మించి యిటుసే - య౯ లగ్గుగా దెవ్వఁరేఁ
గినుకం బౌరుషమున్నదంచుఁ బడబా - గ్నిన్మిం గఁగాఁ జూతురే. 403

కం. హక్కులఁ గోరుచు విధులన
ధిక్కారముఁ జూపుటద్ది - ధీరత యగునా
నిక్కముగఁ బౌరధర్మము
చక్కఁగ నెరవేర్చి మేలు - సాధింపఁ దగు౯. 404

కం. ఈరసములేని దృష్టుల
నీరసము గ్రహించుటొప్పు - నీర సశుద్ధి౯
మేరన్మీరక వారక
ఖారమనక కార్యసిద్ధి - పడయుట లెస్సా. 405

మ. క్రమబద్ధంబుగ జీవితంబు గడుపం - గాఁ జేతగాకున్న యీ
శ్రమకుందగ్గఫలంబుసున్న ప్రజలీ - సత్యంబు పాటింపరే
రమణీయంబుగ రాజ్యరాష్ట్రరమణుల్ - రాజిల్ల రేనాఁటికేఁ
గ్రమశిక్షామహిమ౯ వెలుంగవలె న - ర్వశ్రీల దేశంబిక౯. 406

వ. "కార్పాలికాప్లమము" విషక్రిములతోఁబాటు ధవళకణములఁగూడ నాశనము చేయునట్లు స్వాతంత్రోద్యమమునఁ బాత్రాపాత్ర విచక్షణ శూన్యముగఁజేసిన రాజకీయబోధలవలన దాస్యభావాంధకారములతోఁ బాటు స్వధర్మనిర్వహణనయవినయాది సద్గుణములుగూండం బెక్కు దెనలఁ జాలవఱకు నశించినవని లోకజ్ఞులంద్రు. సూర్యోదయ సమయోప రాగమువలె రాములమరణ మేదేనొకయుపద్రవమునకు హేతువగు నేమోయనుకొంటి. అది యీ రూపంబునఁ బ్రత్యక్షమయ్యె. రాష్ట్రావతరణ ధృతావష్టంభుఁడైన తత్తపస్వి హింసాత్మకచర్యలు గర్హ్యములు. కాన క్షమార్హములు కావనె. ఎంత జతనమ్మునసే జనతం జక్కపఱచుట దుశ్శకమనికుందె. ఐనందీపి నీరు పాఱించినఁ జవిటినేలగూడ సారవంత



డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య

తే॥ ఆంధ్రరాష్ట్రోద్యమంబు న - త్యంతదీక్ష
నడపిన యశస్వి వక్త శాం - తవ్రతుండు
గాంధిసూత్రంబులకు భాష్య - కారుఁ డితఁడె
భోగమెఱుఁగని గణి మన - భోగరాజు.



ఆచార్య రంగా

శా॥ జ్ఞానీ రైతుల కండయౌట నిను స్వే - చ్ఛన్ రైతురంగా యనం
జీనేతం గడుఁ ప్రోత్సహింపఁగఁ బ్రజల్ - చేనేతరంగా యనం
గా నిచ్చల్ కడుఁ గీర్తిగాంచితి జగ - త్ప్రశ్లాఘ్యాకార్యార్థివై
నీ నేతృత్వము సార్థకంబుగద గాంధీ శిష్యసంఘాగ్రణీ!

మగునను జ్ఞానముంబొందె. కాన నాంధ్రసోదరులారా శాంతింపుఁడు. వివేకంబు వీరత్వంబునకుత్తమాంగంబుగాన మాతృదేశహానికరకృత్యములకు న్వెనుబడకున్కి గర్హ్యమనిగ్రహింపుఁడని సాంబమూర్తి విజ్ఞప్తులంపిన సగ్నిచల్లారకుండె. ఇదియిట్లుండ నట రామనిర్యాణ విషమవిషయము వియద్వాణీ ద్వారమ్మున నానాఁడవిని యఖిలభారత జాతీయమహాసభా చరిత్రకారుఁడు పట్టాభి యిట్లు చింతించె. 407

# పట్టాభి పరితాపము

చ. తగుముదునళ్ళఁబంచి కల - ధర్మువు సక్కవదించి పంచికిం
 బ్రగతికి రాచబాట బహు - భంగుల నేర్పడఁజేయ రెంట బ
 ల్పుగతిలభించునంచు నతి - సుస్థిరయత్నమొనర్చి నిష్ఫలం
 బుగ నిజజీవముల్విడిచెఁ - బుణ్యుఁడు రాముఁ డగణ్యమాన్యుఁడై. 408

మ. జనయిత్రిన్మణిసింహపీఠిపయిఁబె - ల్చన్నిల్ప గాఢేచ్ఛమైఁ
 దనసర్వస్వము ధారవోసిన తపో - ధన్యుండు రాముండె యి
 వ్వని సాధింపఁగఁ జాలఁడయ్యెఁ గట దై - వ ప్రాతికూల్యస్థితిం
 జనుఁడెట్లొందుజయంబు దీపశిఖ మిం - చంజాలునే భాస్కరుణ్. 409

ఆ.వె. ఎంతకేని నిల్చి - యిట్లాదినుండియుఁ
 బోరుచున్న పరమ - పుణ్యమూర్తి
 యతని దేశ భక్తి - నాంధ్రానురక్తిని
 బొగడ నీడ యనుచుఁ - బొగడఁ దగును. 410

చ. హరిహరులేని మిమ్మెదుర - రన్న యశంబునుగొన్న తెల్గులి
 త్తఱి నొకవృద్ధుతంత్రహతిఁ - దాల్మిఁదొలంగఁగ నాతఁడెంతయే
 గురుబలమున్నజాతకుఁడు - కోవిదుఁడైనటు కేంద్రమండగాఁ
 బరగుట సర్వనాయకత - వర్ధిలి యింతకుఁదెచ్చె నాంధ్రులణ్. 411

కం. మొదలొగి నణకుచుఁ గొమ్మల
 నదయతఁగనినిట్లు యతని-చర్యలు దెఃపుం
 గదనమిది యతని యుక్తిం
 గద యిట్టుల సాగి ప్రాణ - ఘాతమొనర్చెణ్. 412

వ. చిమ్మటకుఁ జీరేమిచేసె. ఔ. లోకమున సహజ గుణము మాన్ప నెవరితరము. 413

ఉ. వాదము పెంచుకొన్నఁ బగ - పర్థిల్లునంచొకవృద్ధవాక్యముం
గాదనలేక మౌనమునఁ - గార్యగతిం గనుచుండినన్ వృథా
ఖేదములెన్నొగూర్చి శ్రమ - పెట్టెడి యాతని చర్యలన్నియుం
ద్వాదశమందునున్న శని - భాతి మనోవ్యథఁ గల్గజేసెడిన్. 414

కం. ఘనులధికృతులని యాంధ్రులు
వినయమ్మునవేఁడ వారి - వీనులఁ జొరదా
జనవాక్యమె కర్తవ్య
మ్మనిపల్కిరి బుధులు దాని - నాలింపరుగా. 415

కం. వాసిగల గాంధినోటనె
ఘాసించిన మాట కడ్డు - పల్కుట తగవా
యాసేతుశీతనగమి
ట్లాసించి చరింప నెవ్వఁ - డాఁపఁగ నోపున్. 416

కం. ముక్కోటి దేవతలు తగ
నొక్కటియైరిప్పుడెట్టు - లొదవదొ రాష్ట్రం
బెక్కరణి నీయకుందురొ
నిక్కంబిఁక నుక్కుమిగిలి - నిల్తురు కడఁకన్. 417

వ. నాయకత్రయంబున నే నొక్కండనయ్యు నాచారి వచస్సుదెసక నెహ్రూ ములుసూపుట నేనొక్కండనైతి. ఈ చిక్కెడలింప దిక్కుదోఁప కున్నది. నవి తలపోఁతలకుంటిక్కి వేదనావిదళితహృద్వినరుహుండై వైశమ ప్రగాఢతరచర్చంగాని యియ్యదితీరదని జవహరుసన్నిధికింజని యంతకుమున్న తీవవక్కాణమ్ములుపెక్కు రామమరణవార్తాజనిత బాధా క్రోధావేశభరితమ్ముగ ఘోషించుచుం దన్నుంజేర మానవతావాదిగానఁ దద్ఘట్టమునకు బిట్టునిట్టూర్చి వ్యథాపూరితహృదయుండై సంకటస్థితికిం గటుకటపడుచున్న నెహ్రూఁగని కరచాలనపూర్వకాన్యోన్య కుశలప్రశ్నానంతర మిట్లను— 418

చ. తెలుఁగుజగామగల్మిగుల - తేజున రాజిలి రాముప్రాణముం
దలఁచి తెగింప విప్లవము - తప్పదు ఘోరలయాగ్నికీలలే

యలమిన దేశమాతకు మ - హాపదగల్గుఁ బ్రధానివౌట నీ
తెలివిని జూపి శాంతరస - దీవితమౌనటు తీర్పుసెప్పుమా. 419

వ. ప్రళయతాండవ కేళీలోలుఁడైన శూలినేత్రాగ్నియైన గభీరాంభోధి గర్భస్థబడబాగ్నియైన విలయకాలమార్తాండ మండలాభీలజ్వాలామాలికలైన వైళమచల్లారునేమోగాని త్రిలింగదేశవాసులరుషానలకీలలుమాత్రము రాష్ట్రోదయమువఱకుఁ జల్లారవు. 420

చ. వినవె తదీయవార్తల వి - వేకివి చల్లకువచ్చి ముంతదా
చినఫలమేమి యున్నస్థితి - సెప్పితి నీమతిఁ జర్చచేసి తో
చినయటుసేఁత లగ్గటుల - సేయక జాగొనరింపనెగ్గు నా
మనము గ్రహించుటొప్పు జన - మాన్యతమా పరమార్థ
మెంచుమా. 421

వ. అధర్మమునకెంతవెఱతునో జమునకేనంతవెఱవనని వదాన్యగ్రామణి వీరశిరోమణి యగుకర్ణుఁడు పల్కినపల్కులలోని గభీరభావముగ్రహించి చరించిననేతలు సర్వమానవహృదయవిజేతలగుదురని నా విశ్వాసము. అద్వితీయ మహోజ్జ్వలత్యాగము ముందు భగవంతుఁడు గూడ గజగజ వడంకు. 422

కం. నిండుగఁ దలయుం గడ్డము
పండిన నరుఁడేని జిన్న - బాలుండేనిం
బండితుఁడేఁ బామరుఁడే దండి
మనసుగలఁడె మిగుల - ధన్యుఁడు జగతిన్. 423

తే. ఎఱిఁగి గట్టిగ మాటాడ - నేమి కోప
మూనునో కేంద్రమని కొంద - ఱూరకొనిరి
అంతమాత్రాన నైక్యత - యంతరించె
ననుట యది యేమిధర్మమో - యరయఁజాల. 424

వ. ఏదేశమందే నేకాలమందే న్యాయబద్ధముగ నేలిన వాని యశస్సె యాచంద్రార్కముగ నిలిచియుండు. గూడియా, ఉర్ ఎంగుర్, డుంగీ, ఉరుకాజినాదులు సుమేరియాను ధర్మయుక్తముగఁబాలించి నరలోకమును సురలోకమొనర్చిరని చారిత్రికపరిశోధకులు బహువిధంబులఁగీర్తించుటం

జేసియే వారి పేరులిప్పటికి విద్వత్కవీంద్రులనోటఁ బలుకఁబడుచున్నవి. దాని విలువ మనమును గ్రహింపదగు— 425

చ. ప్రణవసమర్చనాద్భుతపు – రాకృతపుణ్యవిశేషమో ప్రజా
ఘనమున నిండియున్న యఖి - మానమొ స్థానములిట్టుచేకుఱ
ఘనతను నిల్పుకోఁదగిన – కార్య మొనర్పఁగఁజెల్లు గానిచో
దినము శపింతురీప్రజలు – దీవన లీయరు సంతసంబునఁ. 426

వ. కష్టము గలిగినపుడు దేవునిసైతము తక్కువపఱచి మాటలాడువా రుంద్రన నిఁక మన సంగతిఁ జెప్పనేల. 427

కం. పెంచినఁ గుంచిన నీచే
మించని పనియంచు వేఱ - మేమననేలా
మంచి నెదనెంచి వైళమ
యంచితగతిఁ బంచి కీర్తి – నందుట లెస్సా. 428

ఉ. ఒక్కనిమాటకిట్టు చెవి – యొగ్గి తదన్యులగోడుఁ జూడకే
ఫక్కఁజరింపమేలె మన - పాలన సర్వజనానుకూలమౌ
టొక్కటె వాంఛనీయ మను – టొప్పదె వృద్ధుఁడ దీర్ఘదృష్టితో
నిక్కరణిన్వచింతు గణి – యింపుము సత్యవచోమృతంబిఁకఁ.429

కం. మోమోటమ్మునఁ బదవీ
వ్యామోహమ్మున నధర్మ – పథముం ద్రొక్కఁ
సామాన్యులు వాంఛింతురు
ధీమంతులు లోఁగ రెట్టి – స్థితి యేర్పడినఁ. 430

కం. ప్రాణము లొడ్డియ మనమా
హవాణులతోఁ బోరి బాధ – లొందుట మఱతే
మానముపై నభిమానము
మానని మనుజుండు మరలు – మార్గముఁ గనునే. 431

తే. ఇంట గెల్వక రచ్చల – నెట్లు గెల్చు
ననుచు దీక్షింపఁ గడకిట్టు - లయ్యె నకట
మంచితన మిప్పుడేలోకో - మంటఁ గలసె
దైవ నిర్ణయ మెవ్వాఁడు – దాఁట గలఁడు. 432

తే. సందె చీఁకటివేళ ము - న్ముంద ధరకు
పెద్దనక్షత్రములె కాని - పించు కరణి
నిట్టితటి నగ్రనాయకు - లే ప్రజాళి
మానసికదృష్టికిం దోఁచు - మాట నిజము. 433

వ. పదునైదువత్సరములక్రిందట సేవాగ్రామమునుండి మహాత్ముఁడు రాధాకృష్ణునకు వ్రాసినలేఖను మీరుందిలకించియేయుందురు. అందు "సర్వ రాష్ట్రపునర్విభజన భాషాప్రాతిపదిక పైజరుపు టస్మల్లక్ష్యము. ఈ సూత్రమాంధ్ర రాష్ట్రోద్యమమునుండినే గ్రహించితి. కాన నాంధ్రప్రదేశము ప్రత్యేకరాష్ట్రప్రతిప త్తితోఁ బునర్మిర్మాణము జరుగుట నాకత్యంత ముదా వహ"మ్మనియుంట మీకు స్పృహకురా నుగ్గడించితి. 434

ఉ. జీవిత మాత్మభూప్రజల - క్షేమసమృద్ధికి ధారవోసి తా
దేవపురంబుసేరె వర - ధీరుఁడు రాముఁడటంచునెంచి వే
పావనభావనాకలిత - బంధురధర్మవిశిష్టదృష్టిమై
దీవనఁ బ్రాలుసల్లి యొక - దీవనతో నిడఁజెల్లు రాష్ట్రముఙా. 435

తే. కాలకూట విషానల - జ్వాలవోలె
నతిభయంకర విప్లవ - మలముకొనియెఁ
దెలిసి శ్రీఘమకన్నులు - తెఱవకున్నఁ
దీఱని మహాపదలుగల్గు - దేశమునకు. 436

తే. ఆంధ్రులందైకమత్యశూ - న్యమునఁగాదె
వెచ్చనూర్పుచుఁ గాలముఁ - బుచ్చవలసె
నింతయెటిఁగియె రాములు - పంతగించె
నతని సత్కార్యదీక్ష మా - కమృత భిక్ష. 437

వ. ఆంధ్రదేశసుస్థిరశాంతిస్థితిఁ బునరుద్ధరింపుఁడని తన్ముఖ్యులకు విజ్ఞప్తి చేయుచు "ద్రుతగతి నాంధ్రరాష్ట్రనిర్మాణమున కేను ప్రధాని నెహ్రూ కృషిచేయుచుండ నాంధ్రప్రజలకకస్మాత్తుగ మతిచెడినందుల కేనెంతయుం జింతించుచున్నాఁడ"నని కుంభకోణమునుండి రాజాజీచెప్పిన వాక్కుల లోని కుంభకోణమును దెలిసికొన్న తెలుఁగువీరుల కొడలుతెలియని యావేశముగలిగె. దానింజల్పార్చ సీవవలంతిషి. 438

ఉ. పాయకసత్యనిష్ఠ నన - పాయపరిస్థితి కల్పనాక్రియా
న్యాయమె సౌఖ్యసాధపుఁ ఖు – నాది యనాదిగనంచు నీజగ
చ్ఛ్రేయమె నాదుశ్రేయమని – జీవితయాత్ర మెలంగు నాతఁడే
యీయధికారపీఠమున - కర్హుఁడు నిక్కము మంత్రిసత్తమా. 439

వ. బాధ్యతారహితముఁగ హక్కులులేవు. విధిశూన్యముగ నధికారములు లేవు. రాజ్యాంగసూత్రాంతర్గత సత్యము గమనించియె భాష్యముం బలుకుట నమబుద్ధుల లక్షణము. వ్యక్తిగత ప్రయోజనానుకూలముగ వ్యాఖ్యానముమార్చుట యనర్థదాయకము. మేధాశక్తిని వక్రమార్గమునఁ బ్రయోగించుట యార్యసమ్మతముకాదు. మహాత్ముఁడు రాజకీయమహర్షి. సౌహార్దసామనస్యసౌశీల్య సంతోషసంశోభితమైన యాతని వ్యక్తిత్వ మనన్య సామాన్యము. సుఖదుఃఖములకుఁ బొంగిక్రుంగని సుజ్ఞాని. గాంధీజీకృతప్రజాహితైకబోధ కోడియైకూసి దిగ్గజమైనిలిచినసి. బాపూజీ నవ్యదివ్యభవ్యపథంబు శతకోటివిద్యుద్దీపికా పరిశోభితంబు. 440

తే. మృగముఁ గని వెంటఁ బరువెత్తు – మృగయునట్లు
యఖిల కర్మఫలంబు వెం – ట్రాడు నరుని
కాన సుజనుఁడు సత్కర్మ – గతుల మెలఁగి
తన్మహోఘాతముల కెప్డు – తావు నిడఁడు. 441

వ. బాపూజీ మనకుగురుతుల్యుఁడు. లోకము నంటియునంటనివాఁడు. ఆయనవాక్కమోఘముగాన శిరోధార్యము. 442

శా. నిర్లిప్తప్రతిభాప్రభాజనితవా - ణీభావసూర్యద్యుతుల్
స్వర్ణోకాధిపు హృత్సరోజమునె వి – ప్పంజాలునాఁ జూతురే
నిర్లక్ష్యంబుగ నన్యులట్టిహితముఁ – నిర్నిద్రతేజఃకళా
దోర్లీలావిజయైకశీలియునుదో - ష్ణోమెచ్చి కీర్తింపఁడే. 443

కం. అనఁగాఁ గుతంత్రమణఁగెడి
పనిసేయక తెలుఁగులేల – ప్రొల్మాలిరి యీ
దినముల బలమొగిఁ జేకుఱ
ఖినసేర్తురె స్వార్థపరులు - వినయసయోక్తుల్. 444

కం. దూషించినంత సులువుగ
భాషించుట కిష్టపడరు - భూప్రజలెందుం
భాషించిన ధర్మమ్మును
బోషించెడి వారలరుదు — బుధు లరయంగన్. 445

కం పసలేని పల్కులెన్నియొ
పసపోసిన పిట్టవోలెఁ - బలికిన ఫలమా
విసువక సేవాధర్మ
ప్రసరమునకుఁ గృషియొనర్పఁ — బడయు శుభంబుల్. 446

కం. ప్రాంతీయభేదములతో
నంతఃకలహంబులొదవ - నాశయమెచెడున్
స్వాంతమున శాంతి నెక్కొన
దింతయొఱఁగి మైత్రిమై న — వృద్ధిఁబడయుఁడీ. 447

వ. బంతిలోనేవలదన్న విస్తరాకుతెమ్మన్నట్లున్నది మీవాదన. 448

ఆ.వె. నీదుకష్టములను — నీవెతీర్చికొనుము
పరులుతీర్తురనుట - పాడిగాదు
నీదు వ్యాధిపోవ — నీవెయత్నింపక
యన్యులెట్లుతీర్తు — రనిరి బుధులు. 449

తే. తెలుఁగువారల పక్షాన - ధీరవర్య
మీరలిటువచ్చి యవ్వారి - మేలుగోరి
చాలఁబలుకుట యననిది - ఊోలువోయి
మద్దెలకుఁ జెప్పుకొన్నట్టి — మాడ్కిఁదనరు. 450

తే. అనె నెహ్రూ పట్టాభియుఁ
గనిఁ పెడదారికిఁజనుట య - కార్యముగాదే
మనమున్నది దేనికి నిట
మనుజులఁ గ్రమమార్గమునకు - మరలించుటకే. 451

కం. తమిళములోఁ బ్రశ్నింపఁగఁ
దమిళంబటనేర్చికొంట — దాన జవాబీఁ

దమిళులని వ్రాసికొనిరట
గమనింతురె దాని మహిమ — కలజనులెల్లన్. 452

ఉ. రాఁగలయంశముద్దెలిసి — రక్షణదక్షతనెంచి రాములీ
త్యాగముసేసెఁదత్ఫలము - తప్పక కూర్పఁగఁజెల్లు వేగనా
శ్రీగలచెన్నపట్టణము — చేర్పకయిచ్చెడి యాంధ్రరాష్ట్రమా
తీఁగలులేని వీణయని — ధీరులువల్కిరి తప్తచిత్తులై. 453

వ. ఏనుఁగెత్తువడ్డ నేనుఁగేలేపవలయు. కాయకత్తి నీచేతిలోనేయున్నది గదా? కడవంతగుమ్మడి కాయకత్తి పీఁటకులోకువయన్నట్లు సర్వరాష్ట్రములున్ కేంద్రాధికారమునకు లోఁబడియుండవలయుఁగదా! తనలోఁదప్పు లేనిచో గురువుతో గ్రుద్దులాడవచ్చుననిరి గాన మీతోనింతగట్టిగమాటాడు చున్నవాఁడ. పైరదోలినఁ బత్తిపండు; ప్రభువు కరుణించినఁ బ్రజల యదృష్టముపండు. మద్రపురిలేని రాష్ట్రము శొంఠిలేని కషాయము. స్వాతివర్షము చేమకుహర్షమన్నట్లు చెన్నపురిస్థానముంటందెల్గులకు నోము పంట. కాన నద్దాని విషయమున నీవు తాటస్థ్యము వహించుట ధర్మువు కాదు. ముక్కున్నవఱకు పడిసెముండు. 454

కం. ఆదనిదియుద్రేకమునకు
సదయతనద్దాని నణఁపఁ - జాలని యెడలన్
మొదటికె మోసముదెచ్చును
నిదియెఱిఁగి చరించువార — లే కడుధన్యుల్. 455

ఉ. నీయెదయెల్లఁదెల్లమయె - నేఁటికి నేటికి మాట మాఱెదో
న్యాయమనూహ్యమంచు జన - నాయక నీవు దలంపఁజెల్లునే
ధ్యేయముదెల్గుసోదరులు — దెల్పిరి నిక్కమెఱింగి వారిక
న్యాయ మొనర్పకున్న సుజ — నవ్రజమెంతయుఁమెచ్చునిచ్చలున్. 456

ఆ.వె. నష్ట పడిన వాఁడు - కష్టపడును లాభ
మంది నట్టి నరుఁడు — పొందు సుఖము
దీనినెఱిఁగి మనము - తీర్పు సెప్పెందగుఁ
గాన దీర్ఘదృష్టిఁ - గనుము మరల. 457

ఆ.వె. బ్రదుకు దెఱువుకొఱకు - పరభాష చదువుట
మాతృ భాష మీఁద - మమత తొలఁగు
వికృతరూప మొందు – వినఁ దెనుంగానోటఁ
దెలుఁగుఁదల్లి ఋణము తీర్పలేఁడు. 458

వ. కుతంత్రమును గుతంత్రముచే మీరేల యెదుర్కొనలేదని ప్రశ్నించి తిరి. అయ్యది నీతివిదులమతమేగాని వజ్రాయుధద్వయంబుఢీకొనఁ జిటచిట నిప్పులు తప్పకరాలు. దాన హింసాత్మక విప్లవ జ్వాలరేగు. అది మహాత్ముని మతముకాదని ధర్మమే జయమను విశ్వాసమ్ముమై నిలిచి యుంటిమి. ఇద్ది గమనార్హము. అంతియకాదు. ప్రశంసార్హము. శ్రీకాంతు నకే భూకాంతునకే నిట్టి రాజకీయచర్చ యేకాంతంబుననుంట లగ్గంద్రుకాన నేనిప్పుడిట్టు నీకడకరుదెంచితి. 459

శా. "ప్రాయిన్వెల్లెడి తెల్గులోర్వఁగలరే – రాజాజి ధీశక్తికృ
న్మాయావాగురఁ జిక్కి యిక్కరణి సం - భాషించినన్మెత్తురే
న్యాయాన్యాయవివేకబుద్ధివలదే – యాంధ్రాళి కష్టాదులన్
శ్రేయోవృద్ధిని దూచిపల్కఁదగదే – శ్రీఘంబ ధీరోత్తమా." 460

వ. అని నినుఁగూర్చి ప్రకాశముపలికినపలుకులు స్పృహణీయములు. 461

ఉ. గాటపుబత్తి దేశమును – గంటికి ఱెప్పవిధానఁ గాచునీ
బాటకు నడ్డువచ్చుటని - భావన సేయకు ముందువెన్కలం
గోటి తెలుంగులం గనుట - కోవిదలక్షణ మీజగంబునఁ
మాటకుఁగాక చేఁతలకె - మన్ననలిత్తురు విద్వదగ్రణుల్. 462

వ. నాయీవాక్యంబులా దరణీయంబులని సెలవుతీసికొని యిలుసేరె. ప్రధానియు నప్పలుకు ప్రధానమని యెంచె. అంతనిట బహుగ్రంథద్రష్ట వివిధదేశచరిత్రల సమగ్రముగ నాకళింపుకొన్నధీశాలి రాజకీయరహస్య పరిశోధనాతత్పరుఁ డవ్యాజప్రజాహితైషియగు నార్ల ప్రజ్వరిల్లనున్న విప్లవజ్వాలను గమనించి నిజమనోభీష్టమిభ్భంగి వెలార్చె–"నిర్వివాద ప్రాంతములతో రాష్ట్రమేర్పరతు"మని యింతకుమున్నె యగ్రనాయకులు వాగ్దానమొనర్చుటంజేసి యేర్పడినయవకాశమును శుభపరిణామదశకుం దిగిచినద్వినియోగంబొనర్చుకొనందగుంగాని త్యజింపఁదగదు. కల్లకపటము లేనివారికిఁ గష్టములుతప్పవన్నట్లు మనమిక్కట్లుపడుచున్నమాట వా స

వమే. కట్టినవారొకరు కాఁపురముచేయువారువేరొకరనుబాధ తీరనిదే. ఏయెండకాగొడుగుఁబట్టునేర్పు మనకులేదు. తుంపురులపసేగాని మంత్ర ముల పసలేదన్నట్లున్నది మనస్థితి. ఇత్తఱినేదోయొకవిధముగ రాష్ట్ర మును స్వీకరింపమేని త్రాగనేరనిపిల్లి బోర్లబోసికొన్నట్లగు. నడకనేర్చి పరుగెత్తవలె— 463

మ. గతగాథల్గమనించి న్యాయఫల మా - కాంక్షించి త్యాగక్రియన్
వెతనే మ్రదపురింగొనందలఁచుటల్ - వీరత్వామౌ నిత్తఱిన్
ఘృతకోశాతకి నాజ్యమున్వెదకుటీ - కృత్యంబు సత్యంబుగా
వితథంబయ్యధి వీడి తక్కఁగలవృ - ద్ధింబొంద వీక్షింపుఁడా. 464

ఉ. మేళ్ళను గీళ్ళఁదెల్పఁ దల - మేమతితెల్పననాఁపశక్యమే
పాళ్ళొకపాడికిందొఱఁగ - బాగె విధిప్రభ సింహమౌరకుం
దేళ్లకుఁజంకుఁ గాలమొక - తీరుగనుండునె యుల్లికోళ్ళు ని
ట్రాళ్లుగమాఱు దైవగతి - రక్షణగా నిజపక్షమున్నచో. 465

కం. మ్రింగుడు వడని కషాయము
భంగిగ నున్నది సమస్య - భద్రముగా ద్రా
వం గలుగును వెన స్వస్థత
పొంగారున్ రాష్ట్ర మిద్ది - పూర్ణశశివలెన్. 466

వ. చంద్రపరివేషమున వర్షయోగమున్నట్లే ప్రాయోపవేశమున రాష్ట్ర ప్రాప్తియోగమున్నదని మున్నెతలంచితి. ఐన నిది దండుగలోఁబండు వని కొందరంద్రు కాని, 467

కం. ఇంకేల కేలఁ జిక్కను
శంకాటంకములులేక - సత్వరగతి వే
అంకిలి సెప్పక తొల్లిటి
బింకమ్ములు మఱచి విజయ - వీరులుకండా. 468

కం. పగపగఁ దెగదన వినరే
తగవెఱిఁగి చరింపఁ గడకు - దైవమె మనకుం
దగుదారిఁ జూపఁగలదిది
నిగమజ్ఞుల నీతి దీని - నిల్పుఁ డెడందన్. 469

వ. అనె. అంతరాముండు స్వర్గస్థుండైన యాఱవదినమునఁ జెన్నపురి రహితాంధ్రరాష్ట్రము నిర్మింప భారతప్రభుత్వము నిర్ణయించినదని ప్రజా ప్రతినిధుల యుభయసభలలో నెహ్రూ చిఱునవ్వుతోనుగ్గడింప శ్రోతల హర్షధ్వానమ్ములు తద్భవనరాజమ్ములఁ బ్రతిధ్వనించె. గ్రీష్మాతపంబున బీటలువాఱియున్న పృథ్వింధారాపాతముగ వర్షముకురిసినట్లయ్యె. 470

ఉ. న్యాయమెఱింగియుం భరత - నాయకులీరె స్వరాష్ట్రమంచు వా
పోయిన సభ్యవర్యులకుఁ - బున్నమ వెన్నెలకన్న మిన్నయౌ
హాయినిగూర్ప నప్పలుక - నంతముదబ్ధి మునింగిర త్తఱిఁ
వేయిహయంబు లెక్కినటు - వేడ్కఁ జనించె మహాంధ్రజాతికిఁ. 471

తే. రాష్ట్ర ముదయించు ననువార్త - రా సమస్త
జనత సంతోషవార్ధి - మునిఁగితేలెఁ
బండు వెన్నెల రాత్రులఁ - బక్షి గణము
కుతుకమున వేకువకుముందె - కూయునట్లు. 472

వ. కృష్ణానదియానకట్టప్రమాదాదులు స్వరాష్ట్రవిషయమున నిఁకజాగు సేఁతతగదని చెవినిల్లుగట్టుకొని చెప్పుచున్నవిగాన నేతత్సదవకాశముం బోఁగొట్టుకొంట లగ్గుగాదని యుచితజ్ఞులనఁ దెలుఁగునాట సంతోషసహిత ప్రశాంతికొంతనెలకొనె. అమరజీవి శ్రీరాముల స్మారకచిహ్నముగఁ దక్షిననమరణ గేహంబుల ముప్పదివేలరూప్యంబులకే విలిచి ప్రజోపయోగ సంస్థల నటస్థాపించి తత్త్యాగధనమే యాంధ్రరాష్ట్రమని శాశ్వతముగ ఋజువు సేఁతధర్మమని స్వామిసీతారాములు వెల్లడించె. ప్రధాని ప్రకటన కాంధ్రపితామహమాడపాటి హనుమంతరావు సంతసింప నూత్నరాష్ట్ర మునకుందగిన రాజధాని హైదరాబాదని సామ్యవాదపక్షనాయకుఁడు మహాదేవసింగుద్ఘాటించె. నీరమ్మునంగరంగని తైలఘృతంబులు కర్పూర తైలమునం గరఁగినట్లు స్వామిసీతారాముదీక్షంగరంగని రాష్ట్రకేంద్ర ప్రభుతాహృదయంబు లీ శ్రీరామ ప్రాణత్యాగదీక్షంగరంగెనని మహర్షి సాంబమూర్తి హర్షించి రాముందంచి— 473

మ. కన స్వార్థమ్మునుగోరి పుణ్యజనచ - క్రంబేర్చె రాముండు పం
ఫెనహింసాత్మకశక్తి శత్రుమతి దిం - పెంజచ్చి నిస్స్వార్థని

ర్ధనుఁడై రాముఁడితండు వీరలచరి – త్రలఁ రాగవైరాగ్య భా
ష్యనభోగిం గడుఁద్యాగిఁ దెల్పునని ప్రా – జ్ఞప్రజ్ఞకుందోఁపదే. 474

తే. పక్షిపన్నగముల ప్రాణ – రక్షణమ్ము
పలచి శిబియును జీమూత – వాహనుండు
జీవదానమ్ము సేఁతకు – సిద్ధపడియు
బ్రదికి రది నీకులేదాయెఁ – బ్రథితచరిత ! 475

తే. రష్య్రరాష్ట్రోదయక్రాంతి – రామువంతు
రహిఁ దదానందమునుబొందఁ – బ్రజలవంతు
ప్రసవవేదన దేవకి – వంతుకనిన
సుతునిముచ్చటగనఁగయ – శోదవంతు. 476

కం. తన కొఱకుకాక దివిజులు
తనియునటుల్మేలు సేయఁ – దా బలి వేఁడెం
జనవంద్యుఁడు శ్రీహరి యటు
ఘనుఁ డొరులకు సహకరించి – ఘనయశ మొందుౘ. 477

తే. ఒప్పుగ సకాలమునఁగాక – యొదులపయిఁ
జేలకుం జేటుగూర్ప వ – ర్షించినట్లు
ముందుగానీక యిచ్చెరా – మునికిఁ దోడు
కొందఱాంధ్రులు బలియౌట – కుం దలంకి. 478

వ. అని యనుకొనె— 479

ఇయ్యది శ్రీమదాంధ్ర మహాభ్యుదయ ద్వితీయ భాగమున
దశమ ప్రకరణము సమాప్తము.

# ఆంధ్ర కేసరి



టంగుటూరి ప్రకాశము పంతులు

ఉ॥ కాసులు రాసులై సనిగ గ్రాసము వేసము గూర్చు వృత్తి స
న్యాస మెసంగఁ ద్రోసి వెలిఁ గన్నది కోశము దీసి స్వార్థముఁ
ఖాసి స్వతంత్ర ధర్మగత వాగ్విశిఖంబుల దాస్యశృంఖలం
జేసితి ధైర్యభూరిగిరి! యేరిల నీసరి ఆంధ్ర కేసరి!



డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్

శా॥ రాధాకృష్ణుఁడు గీతతోఁ దనివి కూర్పంగాఁ కి ధాత్రిపై
రాధాకృష్ణుఁడుగా జనించి ఋషివర్య ప్రోక్త వేదాంత స
ద్బోధానంద సుధాబ్ధి లోకతతి సంపూర్ణమ్ముగా ముంచి స
త్యాధారుండను కీర్తిమై భరతదేశాధ్యక్షుఁడై యొప్పెడిన్.

# ఆంధ్రరాష్ట్రావతరణము

వ. రాజధానిని మీరనిర్ణయించుకొనుండని ప్రధానియనుటంజేసి రంగా ప్రభృతులు తిరుపతిని సూచింపం బ్రకాశము కర్నూలి పేరెత్త నందుం దగినభవనములులేవని కొందఱనఁ గోటీరూప్యములేనివెచ్చించి హర్మ్యములు కట్టింతునని సంజీవరెడ్డి యుద్ఘాటించె. ఇట్లువాదోపవాదానంతరము కర్నూలు తాత్కాలిక రాజధానిగ నిర్ణయింపఁబడ రాష్ట్రావతరణ దివసంబునఁ గార్యనిర్వాహణ సన్నాహసముత్సాహసంభరితహృదయులై దేశభక్తులలర జాతీయకేతనకాయమానాదుల రాజభవనంబుకై సేయంబడె. తత్ప్రాంగణమున. 1

కం. రంగారు రంగవల్లుల
శృంగారము తోరణాల – చెలువలరంగా
మంగళవాద్య ధ్వనులతి
మంగళకరమౌచు మ్రోగె – మంజుల గతులఁ. 2

వ. రాష్ట్రపాలక సచివపదవీ ప్రమాణస్వీకారము మద్రాసు ప్రధాన న్యాయమూర్తి రాజమన్నారు చేయించె. అత్తరి ధూమశకట విరామస్థానమాది రాజభవన పర్యంతము నానావర్ణవిద్యుద్దీపికాశ్రేణు లివి దేవలోక సత్యలోక వైకుంఠకైలాసములకు మార్గములని నిర్దేశించుచున్నవోయన నిరుదెసబాహుమార్గంబుల సముజ్జ్వలకాంతుల విరజిమ్ముచుండఁ దత్పథభూజరాజములు లఘ్వలఘుచంచలాదీపచ్ఛటాపటల శోభితములై సంతానసంతానము లిట్లు దివినుండి భువికిదిగి నూతనతేజంబులతో విరాజిల్లుచున్నవో యనందనరె. త్రివర్ణపతాకాకృతిలో నృపసౌధాగ్రమున మెఱపు దివ్వెలు మిలమిలమెఱయుచుండఁ దద్ధర్మ్యశిఖరమున నాంధ్రప్రభుత్వపు మొహరురూపమున మనోహరముగఁజెక్కఁబడిన యొకచక్కనిపలక వివిధ వర్ణభాసురమై నయనానందకరముగ నుండ. 3

కం. అందచందాల రాణులై – యలరు స్త్రీల
విగ్రహంబులు దానికి – వేడ్కఁ మీఱ

హారతులు పట్టుచున్నట్టు - లలరెఁ జుట్టు
నిట్టు దేవత లారతుల్ - పట్టి రనఁగ. 4

వ. తద్దీపాలంకరణదివ్యదీప్తులకు దివిజవల్లభుఁడుసైతము నిజసహస్ర నేత్ర దృష్టిచాలదని దిగ్భ్రాంతిపడుచుండె. వైశమ 'విశాలాంధ్ర' వెలయ వలయునను నక్షరవిలసితములైన యట్టలతో నమరజీవి శ్రీరాములు కొండ వేంకటప్పయ దుగ్గిరాల గోపాలకృష్ణయ కాశీనాధుని నాగేశ్వర రాయ ప్రభృతుల ఛాయాచిత్రపటములతో విరాజిల్లుచున్న కమానులు తోరణము లెల్లవీధుల నందం దమర్పఁబడె. పట్టణంబెల్ల రామపట్టాభిషేక సమయాయోధ్యవలెనలరారె. 5

తే. పొలుపుగులికెడి నిర్మాణ - కళ చెలంగ
ఘ్రాణతర్పణముగఁదావి - గ్రాలుచుండ
రాజభవనంబునకుముందు - రమ్యమైన
రంగురంగులపూలతో - రణములలరె. 6

తే. వివిధశాఖలయుద్యోగి - బృందముంట
నటపటకుటీరపటలము - లమరియుంటఁ
జూచువారలకుంగడుఁ - జోద్యమగుచు
నదిగుడారాలపట్టణ - మనఁగఁదనరె. 7

కం. ప్రతిగృహమునఁ గళ్యాణవు
వ్రతమట్టుల దోఁచె బాల - బాలికలకు స
మ్మతమున ఫలము లొసంగిరి
మతిమంతులు రాష్ట్రభక్తి - మహిమ వెలుంగన్. 8

కం. వరవీరు వదాన్యంబునఁ
బరమానందైకలీల - భాసిలెఁ బురమ
ప్పరమేశు దయాదృష్టిం
జరితార్థుల మైత్రిమనుచు - సజ్జను లనఁగన్. 9

ఉ. కాంచమహామదమ్మోదకుఁ - గల్గఁగఁజేసెడి పత్రపుష్పశో
భాంచితమై సుగంధయుత - మై శుభసూచకమై జయాంకమై

ప్రాంచదఖండచిత్రకళ - భాసిలు పందిట మేలుకట్టునం
గాంచనకందుకోజ్జ్వలతఁ - గ్రాలె వినూతన కాచగోళముల్. 10

వ. ఢిల్లీనుండి ప్రత్యేకధూమశకటమున నెహ్రూ, రాధాకృష్ణుడు, కట్జూ, మద్రపురీహైదరాబాదుల ముఖ్యమంత్రులు వచ్చుచున్నవార్తవిని తద్ధూమశకటవిరామశాలనుండి రాజసౌధమువఱకు రాజమార్గమునఁ బార్శ్వద్వయంబున నాస్త్రీపురుషముగా నాబాలగోపాలముగాఁ బ్రజలు నేలయీనినటు నింగినుండి యూడిపడినట్లు నిలువంబడి తద్దర్శనభాగ్యాయత్తచిత్తులై నిరీక్షించుచుండ శకటమేతెంచె. ప్రధాని ప్రభృతులవరోహణమొనర్ప నెహ్రూకు జనులు జయజయధ్వానము లొనర్చిరి. 11

కం. శ్రీగలిగి దేశభక్తి
శ్రీగలిగి మహాత్మబోధక్తి- సేవాధర్మ
శ్రీగలిగి వెలయు నెహ్రూ
స్వాగత మిదెయనెఁ ద్రివేది – సస్మితముఖుఁడై. 12

వ. కాయమాన ముఖద్వారమ్మునఁ బ్రధాని నెహ్రూజీకి సుస్వాగతమని యాంధ్రాక్షరరూపమునఁ జపలాదీపికలు ప్రకాశించుచుండె. అంతంగుసుమత్రివేదీ త్రివేది నెహ్రూల నూరేగించుచుం బ్రజలు కాయమానస్థవేదికానికటంబున కరుదేర. 13

ఉ. వారక యందఱొక్కవిధ - వస్త్రములం ధరియించి ప్రీతిమై
గోరిన పూలుదాల్చి తమ - కుంగల నిశ్చలభక్తిఁజాటఁగాఁ
జారుతరైకమూర్తులయి - శాంతముగా నట రెండువైపులం
బారులుతీరి హారతులు - పట్టిరి బాలికలప్పుధానికిజా. 14

తే. ఆంధ్రకేసరి సముచిత – మైనరీతి
వేదికకుఁ జేరుచుండంగ - మోద మెసఁగ
జనులు కరతాళనినదము - ల్సలుపుచుండ
వచ్చెను బ్రధాని యాంధ్రుల - మెచ్చుకొనుచు. 15

వ. చాతకములు వర్షబిందువులకొఱకుఁ జకోరములు చంద్రికకొఱకు వచ్చుచందంబునం బౌరజానపదాదులు పాలకుల వాగమృతముంగ్రోలం

జనుదెంచి తత్సమజ్యనుపవిష్టులైయుండ మందస్మితంబున హృదయగతా నందంబును జిందించుచుం బ్రధాని రాష్ట్రావతరణోత్సవ వితర్దికంజేరం బ్రజలకు నెహ్రూకు వందన ప్రత్యభివందనములు జరుగ నవజీవన శోభ వెల్లివిరిసె. ప్రజాకరతాళధ్వనులెసంగ సుషమాశోభాతిశయవత్కాశేశయము భంగి తత్పరిషద్రంగంబు రంగుమీఱె. అట్లు. 16

తే. అతఁ డుపన్యాస వేదిక – కరుగుదేర
మొలకనవ్వుల పువ్వుల – ముఖ్యమంత్రి
వేఁగ జనుదెంచి వైచెనె – ప్రహారా గళాన
లలితరుచులొల్కు గొప్పగు – లాబిమాల 17

వ. ఆంధ్రాంగ్లహిందీపత్రికావిలేఖరులు లేఖినీశ్వేతపత్ర సంశోభితహస్తులై వితర్దికానికటోపవిష్టులై యవధానముమైఁ గనుచు వినుచుండిరి. ప్రభుతానిర్దిష్టపటోష్ణీషాలంకృతులై రక్షకభటులు తరతమభేద సూచక చిహ్నములతో శృంగారశృంగాటకముల జననాథపథముల నిల్చి శకట చోదకులకుఁ బాదచారులకు మార్గదర్శకులగుచుండఁ దత్కాఖోన్నతాత్యు న్నతాధికృతులు సదస్సునకు నల్దెస సంచరించుచు నించుకంతేని బ్రమా దము గలుగకుండ వేయికన్నులతో వీక్షించుచుండిరి. 18

ఉ. కూడినతత్ప్రజాళిఁ గల – కోవిదకోటికిమ్రొక్కి యాత్మలో
వేడుక వేదికన్నిలిచి – వీరుల చర్యల రాష్ట్రదాస్యపుం
జీడ దొలంగెనంచలరి – శ్రీమతి సూర్యకుమారి రక్తిమైఁ
బాడెను శ్రావ్యగానమునఁ – బ్రార్థనగీతము భక్తిపూతముగా. 19

వ. భారతపరిపాలనారంగస్థలకీలకపాత్రధారి ప్రధాని మందస్మితవద నుండై సదస్యుల నవలోకించి యిట్లను. ఏతచ్చిరస్మరణీయ సన్నివేశ మున మిమ్మెల్లరంగనంగల్గు టొకసుకృతము. ఇది యాంధ్రుల నల్వది వత్సరముల ప్రగాఢతపఃఫలము. విషయము గుర్తింపఁబడిన ననేక ప్రతిబంధకములవలనఁ గాలవిలంబనము తప్పినదిగాదు. శ్రద్ధావినయ భక్తులుగల విద్యార్థికి జ్ఞానధనమ్ముపోలెం దప్పకిదిదక్కె. భారతమునకీ నూత్నరాష్ట్ర మాదర్శప్రాయముగ వర్ధిల్లవలయునని మనసారవాంఛిం చుచు శక్తివంచనలేని సాయమొనర్పసిద్ధముగ నున్నారము. దీనిం

బలిష్ఠముగ శ్రీలతాలవాలముగం జేసికొన నాంధ్రుల సమైక్యకృషి యత్యవసరము. 20

కం. అంతర్వైరుధ్యంబులు
చింతలకేగాక మేలి - సిరులకు నగునా
యంతర్వాణీబోధన
గంతవ్యస్థానగమన - కాంక్షఁ దనరుఁడీ. 21

తే. తమిళులకు మీకుఁ గొంత వా - దంబు జరిగె
నదియు దురదృష్ట మనియెంతు - నైన దానిఁ
బీడకలనటు మఱచి వే - వేడ్క మీర
లన్నదమ్ములవలె నుంట - నఖిలషింతు. 22

తే. ప్రజలలో నైకమత్యము - పాదుకొన్న
దేశమెంతయు బలముతోఁ - దేజరిల్లు
దాన సకలార్థసాధక - ధన్యవృత్తి
భూతలము స్వర్గతుల్యమై - పొలుపుగులుకు. 23

వ. విధ్వంసకచర్యలవలనఁ బీడయంటునేగాని సిరియంటదు. వివేకము లేనివిద్య వ్యర్థము. ఆమడలుదూరమైననంతఃకరణములు దూరము కారాదు. ఇరుగింగలము పొరుగు మంగలముగ నుండరాదు. 24

కం. మననడవడి కొరవడిగా
ఘనులనడతఁగొనుట పరమ - కల్యాణముగా
జనమెంచి చరించిన నిహ
మనఁ బరమన భేదమెంతొ - యగపడునొక్కో. 25

శా. హిందూదేశపుఁబారతంత్ర్యమునకై - యెంతేని చింతించి ని
ష్పందామోఘవిశిష్టశక్తి ఘనులీ - స్వాతంత్ర్యదీక్షారతిం
గందండెందము దివ్యఘోరతపముం - గావించి నిర్మించి రా
వందేమాతరమన్నశబ్ద మదినం - పాదించె రాజ్యేందిరన్. 26

వ. నైతికబలము దివ్యశక్తిఫలదమని యయ్యదత్యంత ప్రధానమని పాలకులు ప్రజలు భావించిచరించుట ప్రథమ ధర్మము— 27

ఉ. పాయనినిష్ఠ రాజ్యపరి - పాలనసేఁతకు సర్వసమ్మత
ధ్యేయము ధర్మమార్గమని - యెంచక స్వేచ్ఛఁజరించి దోషముల్
నాయకుఁడేయొనర్చిన జ - నస్థితి యేమిఁక నావుచేనిలో
మేయఁగ దూడగట్టునను - మేయునె యెన్నియుఁగాలు మాఱినన్. 28

చ. సరసతలేక స్వార్థరస - సంగతి హద్దులుదాఁటి పెద్దలం
గఱచిన మోఱకుల్దగ జ - గమ్మును ముందఁచలంత్రు కొందఱు
త్తెఱఁగుగ్రహించి గాంధియుప - దేశపథమ్మున మాతృసేవకై
వెఱవక సత్యధర్మపద - పీనదపీయసప్రవృత్తి నిల్వఁడా. 29

వ. దురాశాపిశాచావిష్టుఁడు స్వార్థరథమెక్కి ధర్మాశ్వముల నిజానుకూల పథంబున నడుపంజూచిన నయ్యవియెదురెక్కి వెనుకటికాళ్ళతోనరద మునుదన్నంజూచుచు నడ్డబాటుంబట్టుంగాని ముందునకు సరిగ సాగవు. సాగినంగడకు వానింగంటకమార్గంబున కీడ్చుకపూనవు. సురాసురులు సుధార్థులై యబ్ధి మథింపహాలాహలము జనించినట్లు సత్ఫలవాంఛం గృషి సల్పఁ గొన్నిపట్టులఁ జెట్టవాటిల్లు. లోహభక్షణ లక్షణము లాఘ్నముల కున్నట్లు సజ్జనుల కపకారముసేయు స్వభావము దుర్జనులకుండు-బలము తిన్న మాత్రమున రాదు. తిన్నది జీర్ణించుకొన్నవచ్చు. చదివినవాఁడు జ్ఞానికాఁడు. చదివినది తననడతంజూపినవాఁడుజ్ఞాని. దయాదపీయమైన హృదయము హృదయముగాదు. 30

కం నిర్మల హృదయుల గురువుల
శర్మదవాక్యములు వినక - జడమతిఁ త్రిజగ
ద్ధర్మాధర్మము లెఱుఁగని
దుర్మదులకుఁ బుణ్యపథము - దోఁచునె వసుధన్. 31

ఉ. చండతరాజ్ఞలం బ్రజ న - శాంతి రహస్యముగా సృజించు మూ
ర్ఖుండొకవేళ వెల్గిన మ - రుక్షణ మంతయుమాయుఁ బాపముల్
పండిన నెట్టివారికెది - ప్రాప్తమొ భావినెఱుంగశక్యమే
డుండుభమట్లు వర్తిలు శ - రుల్జననీ పదభక్తులౌదురే. 32

తే. శ్రద్ధమైఁ గన నొకవయో - వృద్ధునందు
లేని గుణ మర్భకునియంద - కానిపించు

జగతిఁ జంద్రునకునులేని - సహజ కాంతి
మిణుగురుం బుర్వునకు నుంటఁ - గనమె మనము. 33

ఉ. పెద్దయు బుద్ధిదిద్దఁగల - పెద్దలు గద్దెలకెక్కరేని యా
పద్దశగల్గు యిద్ధి ప్రతి - వాఁడు గ్రహించుటలెస్స యెద్దియే
రద్దియొనర్చుకోఁదగదు - రాజ్యరమారమణీయవృద్ధికై
తద్దశ్రమించి పెంచుట స - దా శుభ సూచకమంచు నమ్ముఁడీ. 34

వ. ఏమహానాయకుండేఁ బ్రజోద్యమము నైంద్రజాలికునివలె శూన్యము నుండి సృష్టింపఁడు. ప్రజాస్వామ్యము జయప్రదమగుట కద్దానివెన్క వివేకముగల ప్రజాభిప్రాయబాధ్యతయుంట వటంబునకు నట్టైన సుదీర్ఘ మూలజాలంబుంట. హింసాకరవిప్లవోద్రిక్తత బాల్యదశాసూచకము. అది రాజకీయభూకంపము. కాన ననపేక్షణీయము. ఏతద్రాష్ట్రము యుష్మత్పైతృకధనము. జగద్ధితంబువ్రతంబుగా సాధుసమ్మతంబుమతంబుగా నభ్యుదయపథంబభిమతంబుగాఁ బాలనఁపుజరుగనఖిలషింతు. స్వరాష్ట్రము నెడ దురభిమానముఁజూపుట సమైక్యభారత నిర్మాణమున కాటంకముగఁ బరిణమింపఁగల సంగతులఁ గల్పించి రేకెత్తించుట యనునవి నేనణుమాత్రమేని సమ్మతింపని విషయములు. అట్లంట సమస్తాధికారములు కేంద్రీకృతమైయుండవలయునంటగాదు. స్థానికముగ స్వపరిపాలనాధికారము వీలైనంత విరివిగ వికేంద్రీకృతముగనుంట యుత్తమమని యస్మదభిమతము. ముఖ్యాధికార కేంద్రీకరణబలంబునంగాని విషయాభివృద్ధి సాధించుకొనఁజాలమనునది జ్ఞప్తియందుంచుకొంట హితము-దేశముమీఁద కన్న దానంగల వివిధభాగముల శ్రేయస్సుమీఁదమాత్రమ దృష్టినిల్పి కృషిసల్పంబూనినచో రాజకీయముగ దుర్బలమైపోవుటయేగాక దేశీయార్థిక వ్యవస్థాభివృద్ధికిం దగుచర్యలందీసికొంట దుష్కరమగు. భారతజాతియంతయు నొకటేయను భావము ప్రజాహృదయములఁ బ్రగాఢముగ నాటుకొనంజేత ప్రధాన కర్తవ్యములలో నొకటియని గమనించుట శ్రేయోదాయకము. ఏతద్రాష్ట్రమునకు మాహృదయపూర్వక శుభాకాంక్షలన శిరఃకంపంబునంగొందఱు చిఱునగవున మఱికొందఱు శ్రోతలు హృదయానందమును బ్రకటించిరి. 35

తే. ఉభయతారకమార్గమై – యొప్పనప్పు
డర్హమగురీతి శుభవాక్కు – లాడ నవియ
పశ్చిమానిలస్పర్శమై – వాడిన తటి
మలయమారుత మట్లు స – మ్మదము గూర్చె. 36

వ "ఆంధ్రులచిరకాలవాంఛ ఫలించుట ముదావహము. ప్రతి ప్రసవము వేదనాసహితమే. నూత్నశిశువును శ్రద్ధమై(బోషించు టత్యవసరము. మన రాజ్యాంగాంతర్భాగముగ నావిర్భవించు రాష్ట్రవిషయమున(గూడ నీసహజక్రమమువర్తించు. దీనింబెంచి పెద్దదానింజేయవలసిన బాధ్యత యాంధ్రాంధ్రేతరులమీ(దగూడ నున్నది. తెలు(గుబమీ(ద నత్యధికముగ న(న్నదనుట సత్యదూరముగాదు. కాన వారు సమైక్యకృషినొనర్చి వృద్ధినొందు(టలగ్గు ఇదియ నాసందేశము. మనము వ్యయమొనర్చు ప్రతి పైసా చేయు ప్రతియాలోచన, పల్కు ప్రతిపల్కు నిర్వహించు ప్రతికార్యము రాష్ట్రాభివృద్ధికి( దోడ్ప(డుటలెస్స. అవి దేశక్షేమమున కవరోధకములు కాగూడదు. సద్వాంఛాసిద్ధికొఱకు వివేకము ధైర్యము స్వార్థత్యాగము ప్రజలు నాయకు లలవఱచుకొని ప్రభుత్వమునకు సుస్థిరత్వము చేకూర్తురని విశ్వసించుచున్నా(డ"నని భారతాధ్యక్షు(డు రాజేంద్రప్రసాదమూల్యసందేశమంపె. 37

తే. శాంతశమదమమూర్తి ని – శ్చలయశస్వి
భారతాధ్యక్షు( డారీతి( – బంపిసట్టి
యమలసందేశమును జెవు – లారవినుచు
నంతసించిరి సభికులు – స్వాంతమందు. 38

వ. "ఇది యాంధ్రరాష్ట్ర మవతరించుచున్న శుభసమయము. ఇత్తఱి జరుగుచున్న ప్రారంభోత్సవము లాంఛనప్రాయము. నిజమునకిది కేంద్రశాసనసభ నవతరించినది. పదునైదుదినములు చర్చించి ప్రజాప్రతినిధుల సభ యాంధ్రరాష్ట్రపు 'బిల్లు' నామోదించె. అత్తఱి శుభసూచకద్వయంబు దృగ్గోచరమయ్యె జన్మాష్టమినా(టియు(దయమున( నదిప్రతిపాదింప(బడె. కృష్ణు(డు జన్మించిన సమయమున యమునకు గొప్పవరదలువచ్చె. అట్లె యీరాష్ట్రావతరణ తరుణమున గోదావరికి గొప్ప వెల్లువలు హెచ్చె. వరద సంగతి యోచించినపిదప నదితగ్గినయనంతరము గలుగుమేలుంగూర్చ(

జింతింపవలసియుండు. కావున రాష్ట్రావతరణమునంగలుగు నభ్యుదయ మునుదలంపందగు.ఇట్టి ఘట్టమె మఱియొకటి జరిగె. ఢిల్లీశాసనసభలో మహోదాత్తముగ జరిగినచర్చ వినాయకచవితినాఁడు ముగిసినది. గణేశ చతుర్థినాఁడే తిలక్ స్వతంత్రభారతభావమున కంకురార్పణమొనర్చె. అయ్యనఘునికోర్కె జయించె. ఆంధ్రులవాంఛ ఫలించె. హర్షధ్వానముల మధ్యమున నాంధ్రరాష్ట్రము నవతరింపఁజేయుచున్నాగము. ఇది సౌఖ్య సుభిక్షమ్ముల కాలవాలము కావలయునని యెల్లరు దైవప్రార్థనచేయు చున్నారు. ఇది తెలుఁగులకేకాక యావద్భారతదేశమునకు నూత్న బలమును చేకూర్చునదిగ రాణింపవలయునని కోరుచున్నారము. నిత్య కళ్యాణము పచ్చతోరణముతో నాంధ్రదేశమలరుఁగాత''యని కట్టూ నిజాభిప్రాయంబు వ్యక్తమొనర్చె. అంతం బ్రకాశము— 39

మ. అమితక్రోధమహార్వకీలలు నిజా — త్మాబ్ధిందగఁ రోచిరు
ద్గమవక్త్రాబ్జమునెత్తి పల్కెఁ గడకీ — ధర్మం బిటుల్వర్తిలెఁ
శ్రమకెంతోసహియించి యింతవఱకే - సాధించినఁ శాంతి సం
భ్రమసౌజన్యసముద్భవాభ్యుదయ మా — పైనొందఁగ ర్తవ్యమౌ. 40

ఆ.వె. సకల దిక్కు లలర - సామ్రాజ్య మేలిన
యాంధ్రజాతి తృప్తి — నందె దీన
సూర్యుఁ డస్తమింపఁ — జుక్కల వెలుతురే
గతియటంచు నెంచు - కరణియయ్యె. 41

ఉ. రాజులులేకకాదు కవి — రాజులకీయకకాదు భాషపై
మోజులులేకకాదు వెలి — బూజు తొలంగకకాని నేఁటికిం
గైజరు బూని రాణియయి - గద్దియనెక్కెను దెస్గుదల్లి యే
రోజున కేదిప్రాప్తమొ ని - రూఢిగ నేరు వచింపలేరుగా. 42

వ. వంశపారంపర్య రాజ్యాధికారమంతరింపం బ్రజారాజ్య మిట్లేర్పడె. ఎన్నికల నిర్వహణము ప్రభుత్వమునకు బృహత్తర కార్యభారముగ భావింపందగినను నిరక్షరాస్యుల రాజకీయ పరిజ్ఞానశోభితులుగఁ జేసినది తత్ప్రచారప్రభావమే. ఏతత్పద్ధతిఁ బ్రభుతాస్వరూప స్వభావ నిర్ణయాధి కారము జనహస్తగతమైయుంట ప్రజాస్వామ్యవ్యవస్థమౌలికలక్షణములలో ముఖ్యాతిముఖ్యమైనదనుట సిద్ధవాదాంశము సర్వతంత్రస్వతంత్ర ప్రజా

స్వామిక వ్యవస్థాఖండదివ్యజ్యోత్యఖండ భరతఖండగర్భాలయమునం గొండెక్కకుండనుండం బ్రయత్నించుట ప్రతిభారతీయుని ప్రథమధర్మము-న క్తందివమాన క్తి శక్తివంచనలేకుండం గృషిసల్పి యాంధ్రమాతృ మహార్ణమిప్పటికి సరజముకాకున్నం గొంతతీర్చుకొనంగలిగితిమి. 43

మ. తలయుందోఁకయులేనిరాష్ట్రమిదిసం - తాపంబొసంతోషమో
కలుగంగల్గిన దేమిసేయఁదగు ని - క్కంబిద్ది లక్ష్యంబుకా
దలుకంబూనక శాంతిమార్గమున గ - మ్యస్థానసంసిద్ధికై
చలుపంబూనుఁడు సర్వసంపత్సములు వి - శ్వాసంబె దైవాజ్ఞగా. 44

ఉ. అక్కఱ యున్నయంతవఱ - కాదృతిఁ జూవుద రద్దితీరెనా
ప్రక్కకుఁ ద్రిప్పుకొంద్రు తలఁ - బిక్కయొ పల్కకొ క్రిందఁజూచుచుం
జిక్కియుఁ జిక్కనట్టుల వ - చింత్రిదిలోకవిచిత్రధర్మమై
చిక్కులువెట్టు సత్యరస - సిద్ధికి మార్గము మృగ్యమౌఁగదా. 45

తే. గ్రహణశశివలె మనభూమి - కలదు సర్వ
మొందయత్నించి కడకిటు - లందు టున్న
సింహమునుగొట్టఁ బరుగిడి - చిన్న జింకఁ
గొట్టి నట్టుల యాత్మకు - గోచరించె. 46

కం. అటి యిది యాఱుటెటు లి
ట్లోటయడఁగి యాత్మగౌర - వోన్నతి తొలఁగం
దేజుడిగి కోటియాంధ్రులు
నైజాము నవాబుక్రింద - నవయుచునుండన్. 47

వ. ప్రాంతీయాభివృద్ధికిఁ దద్భాషలంబరిపాలన జరుగు టత్యవసరమను మహోద్యమము నొంప్రథమముగఁ బ్రారంభించినది మనమే. దాని ఫలితము ముందుగ నోఢ్రులుసింధీవారనుభవించిరనుట నగ్నసత్యము-ఆంధ్రరాష్ట్ర మాలస్యముగలభించుటంజేసి గంజాము కోరాపుట్టిజిల్లాల నుత్కళలీనమొనర్చిరి. బళ్ళారి తాలూకాలోని బళ్లారి రూపగుడి ఫిర్కాలాంధ్రదేశమునకుంజెందవలయు-ఇఁక నాదాయవ్యయముల గమనింప. 48

ఉ. అప్పుడులేని యప్పు లివు - దప్పెటుపుట్టి త్రివిక్రమక్రియం
జప్పునవింతయయ్యె జన - సాధ్యమదీనిభరింప నేఁటికి

యప్పును నొప్పుకొన్న బలి - యట్టులడంగును నాంధ్రమాత యీ
యప్పులముంచుటన్న నిఁక - నప్పులముంచుటగాక యన్యమే. 49

వ. స్వరాజ్య స్వరాష్ట్రము లల్పమోయనల్పమో రక్తహస్తములతో వచ్చెంగాని రిక్తహస్తములతోరాలేదు. భారతస్వాతంత్ర్యసమర మర్వది వత్సరములు జరుగ రాష్ట్రరణమునల్పదివర్షములుజరిగె. దమననీతిని దెల్లదొరలవలె నల్లదొరలును గొంతవఱకుఁ బాటించిరి. ఆంధ్రపౌరుష సాహసత్యాగాదులు వితథీకృతములగునాయనుశంకవొడమె. ఎడారిలో జీవనదిని వెదకుటయగునా యనుసంశయముదయించె భూగర్భశాస్త్రజ్ఞుఁడు మృత్తికాపరిశోధనంబున నటులభింపఁగల ఖనిజసంపదనూహించి నట్లు ప్రతిపక్షవాగ్వైఖరింబట్టియే మనమందఁగలమేళ్ళుగీళ్ళు దలపోయ వచ్చుఁగదా. నాగరికతాన్వితజాతుల కృత్యములందత్యంత కపటస్వార్థతృష్ణ యంతర్వాణిగఁ బ్రవహించు. ఆటవికపార్వతేయాదులం దమాయికతాదులగ్గలముగ గోచరించు. ఏదేశమందే నెడనెడ నౌచిత్యచింతనాశూన్యజనకృత్యంబు లందందతలయెత్తు. అందుంబ్రజాప్రభుత్వపాలనమన గుఱ్ఱము నడిగి కళ్ళెమువేయుట. ఎద్దునడిగిగంతకట్టుట. కానఁ బరస్పర సహకార వినిమయము తప్పదనియెఱింగి పాలకపాలితులుదేశాభ్యుదయమార్గమున దృష్టినిగేంద్రీకరించిన నుభయతారకపరిణతిం బయడఁగలరనుటనిక్కము. 50

తే. అస్మదంధ్రప్రపంచక - శ్యాణనాట
కమున కిది నాందియౌట నీ - క్ష్మాస్థలంబు
ప్రజలసహకారబల మను - భాగ్య గరిమ
మూఁడుపూలాఱుకాయలై - ముద మొసంగు. 51

వ. అనంబ్రధాని మహర్షిసాంబమూర్తి హితవచోమృతమ్ముఁ గ్రోలఁబాంఛింప నతండీమహోత్సవమున కుంగారణభూతుండగు శ్రీరాముల స్మరించుట ప్రథమకర్తవ్యమనిభావించి యతనిందలంచి యిట్లను— 52

శా. దానంబీఁదగుఁగోట్లు వాని మరలం - దైవాజ్ఞఁ బొందందగుం
బ్రాణంబీ మఱిపొందఁగాఁగలఁడె యె - వ్వాఁడే నిజంబెంచి యుం
బ్రాణంబిచ్చి తెలుంగురాష్ట్రమిది నం - పాదించి మాకిచ్చితె
ద్దాన న్నీఋణమీఁగు రామ జనవం - ద్యత్యాగకల్పద్రుమా. 53

చ. కనఁబడుదీవమాయికుఁడు – గా హృదయంబది వజ్రమౌటచే
సునిశితదీక్షకున్నిలిచి – శుభ్రయశస్కుఁడవై ధరాస్థలిం
దనువుఁ దొఱంగియుం బరమ – ధార్మికశక్తిని రాష్ట్రదాతవై
తనరితి నిన్నుఁగన్న తలి – దండ్రులు ధన్యు లుదారశేఖరా. 54

చ. కుదిరినదీక్ష లోకమున – కుం గుణపాఠము నేర్పుతే తపో
నిధి దివిషుండె రాష్ట్రమిది – నీవు సజీవుఁడవై వెలుంగఁగా
నొదవిన నాంధ్రమాతకు – మహోజ్జ్వలసేవ లొనర్పకుండునే
బ్రముక నిబిడ్డ బాటెఁడను – పల్కున కీవె నిదర్శనంబురా. 55

ఉ. ఏక్రియనేని మద్రపురి – నిండని నిండుగ దీక్షఁబూనినన్
వీఁకఁ బ్రకాశ మేమరక – వెన్నున కాచుచునుండిన న్వృథా
నేకపథప్రయత్న మిది – యిగ్గతి నొప్పె శివాజ్ఞ లేమిచే
నేకులబుట్టఁ బెట్టునొకొ – యేమఁగు నెంతకుశాగ్రబుద్ధియున్. 56

తే. గుప్తదానం బొనర్చిన – గుణిమణి కొక
నిధి లభించిన చందాన – నిశ్చలమతి
యనుకొనని గొప్ప సద్యశ – మలరె నీకు
రమ్యగుణధామ పొట్టిశ్రీ – రామనామ. 57

తే. సునిశితవిమర్శనాసక్తి – సురుచియుక్తి
సత్పథవిహారమునఁ బ్రజల్ – సౌఖ్య మంద
రాష్ట్రమెల్ల సుభిక్షమై – రాణ మీఱ
నందుకొనవయ్య రత్నాల – హారతులను. 58

వ. భారతస్వాతంత్ర్యసంగ్రామయోధాగ్రణి దేశభక్తశిఖామణి యాంధ్ర రాజకీయద్యుమణి యగు ప్రకాశము ముఖ్యామాత్యస్థానమలంకరించుట త్రిలింగదేశ మహాభాగ్యము. వయోజ్ఞానవృద్ధుండగు నాతండన్వర్థాభిధానుండై తావెలుఁగుచు మాతృభూమింబ్రకాశింపంజేయునని విశ్వసింతు. ఆంధ్రకేసరీ. 59

శా. ఏజన్మార్జితపుణ్యమో కలిగె నీ – కీస్థాన మేతన్మహా
రాజత్వంబది సార్థకంబుగ బుధ – వ్రాతస్తుతుల్పొందుమా

ప్రాజాపత్య మెటుండఁగాఁదగుఁ బ్రజా - రాజ్యంబునంచెంచుచుం
దేజస్స్ఫూర్తి జనైకశాంతియుత సం - దేశంబులందిచ్చుచున్. 60

వ. ఉత్తరయురిమితప్పిన రాజుపాడిదప్పిన చెదలునకు ఱెక్కలువచ్చినఁ గష్టమే ఇఁకనీచెప్పినట్టు. 61

చ. ఇదియొకమెట్టు దీనిపయి - నింకొకమెట్టువెలుంగు దానికై
కదలనిదీక్షమై మనసు - కంకణధారణసేసి నిల్వఁగా
నదనిది లేదుతృప్తి కిసు - మంతయుఁదావు మహాంధ్రభూసుఖా
స్పదమెదనెంచఁ గంకణవి - సర్జనకుం దఱిగాదు ధీమణీ! 62

వ. జనయిత్రీస్థాన శోభితము కేంద్రము. పుత్రికాస్థాన ప్రకాశితములు రాష్ట్రములు. తల్లిమనసువెన్న. బిడ్డమనసుఱాయి యనెడి లోకోక్తిం బాటించి ప్రజాలోపములందిద్ది శ్రేయోమార్గమునకుం ద్రిప్పవలసిన బాధ్యత మాతృదేవతపైనుండుఁగదా. 63

ఆ.వె. కేంద్రమెపుడు మనల - సాంద్రానురక్తిమైఁ
గాంచుచున్న మేలు - గలుగు టరుదె
పరగ నింద్రధనుసు - పడమట వేసినఁ
గుండ పోఁత వాన - కురియ కున్నె. 64

ఉ. న్యాయమెఱింగి యగ్రజన - నాయకు లాదరమేదురంబుగా
శ్రేయము ధ్యేయమంచుఁ బరి - శీలన రాష్ట్రమహోదయార్థులై
సాయముసేయరే నెటుల - సాగు కరీంద్రమునిచ్చి యంకుశం
బీయకతోలుటెట్టు తగు - నే విధికే నటువంటి చెయ్దముల్. 65

తే. అల యతిస్థానమందలి - యక్షరంబు
హల్లుతో నచ్చుతో మైత్రి - నలరినట్లు
మతమతాంతర సఖ్యంబు - మనకువలయు
సుఖద మానంద మదిగదా - శ్రుతిహితంబు. 66

వ సాంఘికవాఙ్మయరాజకీయాదుల సనాతనధర్మాయశ్శకటముందదను రాగాతిశయ దృఢరజ్జుబద్ధము గావించి బలప్రదర్శన సమయమునం గలి యుగభీముఁడగు కోడెరామమూర్తివలెంద్రదజ్జువు నడుమునకుంగట్టుకొని

కేవల పూర్వాచారపరాయణులు సాగిపోనీక వెన్కకులాగుచుండఁ బ్రావృ
ట్కాల కంధరఖండాచ్ఛాదితాబ్జకిరణవ్రజమువలె నధునాతన సంస్కారా
సక్తుల సత్క్రియాప్రభలు సందుచేసికొని యెడనెడ సందందలరుచునే
యున్నవి. సూర్యచంద్రులవలె నీరెండును లోకమునకు జ్ఞానజ్యోతులఁ
బ్రసాదించునవియే. తద్ద్వయంబయ్యాయిసమయంబుల నాచరణయోగ్యం
బులుగఁ గనంబడు. కానఁ బ్రాఁతక్రొత్తల మేలికలయిక కలుగుచున్న
తరుణమిదియని విద్వత్కవీంద్రులు వాకొంద్రు. ప్రపంచమెల్ల ప్రగతి
పథంబునఁ బయనించుచున్నయిత్తరుణమున ననేక సహస్రవర్షముల
నాఁటి యాచారములవైపునకే ప్రజలంద్రిప్పఁజూచుట వ్యర్థసముత్థానమే
గాక హాస్యాస్పదమగునేమో. 67

చ. ఘనజయమందె నీప్రకృతిఁ – గల్గుప్రధానపదార్థశాస్త్రచ
ర్చన నరుఁ డంతదేశముల – సంగతిహెచ్చఁ బురోగతిన్సదా
మననముసేయు మానవుఁడు – మందమతిన్మతికాళ్ళు వెన్కయుం
గనఁబడెనంచు గుబ్బును – గళ్ళెము తోఁకకువేసి తోలునే. 68

తే. ప్రాచ్య పాశ్చాత్య భావాల – ప్రథనమందు
ద్విముఖమగుచుండె విద్యార్థి – విమల బుద్ధి
యేఱుపాఱుచు నొకకొండ – యెదురుపడఁగఁ
గొట్టుకొని రెండుపాయలై – నట్టు లిపుడు. 69

వ. పుష్పలిహము సర్వసుమమరందాస్వాదనలీలం గ్రాలినట్టు విద్యార్థి
సమస్తగ్రంథస్థసూక్తులు హృదయగతము కావించుకొనుచుఁ బ్రాక్పశ్చిమ
వాఙ్మయామృత పానమున సమన్వయ మార్గమున నవచైతన్యమును
సృష్టించుకొనుట వివేకంబునకుంజిహ్నంబగు. అతండు భావిపౌరుండుగాన
నాతండే సుస్థిరదేశోన్మేషహర్మ్యరాజమునకు మూలస్తంభము—పాలకుఁడు
షాడ్గుణ్యచతురుఁడుగ నధికృతు లుపధాశుద్ధులుగ నున్నదేశము వసంత
కుసుమవనమువలె నవనవవికాసమున నలరారు. 70

చ. అమలమనస్కుఁడై క్రియ జ – నాభ్యుదయంబుగనొప్ప నేత స
క్రమమగుపద్ధతు ల్చదువు – వ్రాఁతలు చేఁతలు తెల్వితేటలుం
గ్రమముగఁ జూచి తూచినటు – గా నధికారమొసంగుచేయురుం
బ్రమిదనుబట్టి వత్తియను – పల్కు గ్రహించి మెలంగ మేలగుజా. 71

తే. తెలివిగలవాని కుంచి యే - తెలివిలేని
హీనునకుఁ బెత్తనంబిడు - క్షేమి చేష్ట
పంజరమునఁ జిల్కంబెట్టఁ - పాఁడిగాని
కాకి నుంచుట యుపహాస్య - కారణంబు. 72

వ. అది యట్లుండె నిఁకనొక ముఖ్యవిశేషంబు నుగ్గడింతు. అఖిలభారత జాతీయమహాసభపై నాంధ్రకేసరి యలిగితొలఁగియుండ నేతత్సమయంబున నతండ యిప్పదవికర్హుండని యాతనియలుక దీర్చి కాంగ్రెసునఁ జేర్చి దేశకాలపాత్రతల గమనించి ముఖ్యసచివస్థానంబున నిల్పి ననల్ప కృషి సల్పి సంతసము గూర్చిన యుపముఖ్యమంత్రి సంజీవరెడ్డి యిత్తరుణమున నమోఘప్రశంసాపాత్రుఁడు—ఆయన ధీశక్తి రాజకీయచాతుర్యము దూరదృష్టి యనన్యసామాన్యము. 73

ఉ. నైజసమస్యలన్నలుగు - నాయకుఁ డద్దినిజంబు జూలియస్
సీజరు జీవితంబుఁ బరి - శీలనసేయఁ బ్రభుత్వమర్థమౌ
జాతియు నన్నజాతి పిర - జాతియుఁ గాదది యంపశయ్య యు
త్తేజితధీమహత్త్వధృతిఁ - ద్రిప్పఁగనౌ ఘనరాజ్య చక్రముల్. 74

కం నమ్మినటులె కనఁబడవలె
నమ్మందగ దేరి నెపుడు - నరహరినైనం
గుమ్ముదురు సమయ మబ్బిన
నమ్మమ్మా పతులస్థితుల - నలవియె తెలుపన్. 75

ఆ.వె. ఆదరించువేళ - నందఱుఁ జుట్టలే
యాదరింపలేని - యట్టి వేళ
నరులు హరులు గిరులు - నైయడ్డుపడుచుంద్రు
నిబ్బరంబదెట్టు - నిలిచియుండు. 76

కం. వడివడిఁ బ్రణిధులవలనం
గడిదేశపుఁ బ్రజలకున్న - కష్టములెల్లం
దడవి తడిడాయఁ దడయక
యొడయఁడు దగఁదీర్చి తాను - నొందు శుభంబుల్. 77

ఉ. క్రూరునడంచి మంచికయి - కోమలహృత్కమలంబు విప్పి త
త్సారదయామరందమున - జంగమజీవులఁ దన్పుచుం గళా
వీరుల నొక్కకంటఁ గని - పెట్టుచు భారతభూమి నాకమా
త్రీరుగ నేలఁగాఁదగు సు - ధీప్రమదంబుగ సర్వపాలకుల్. 78

ఉ. కూరిన స్వార్థతృష్ణఁ గటఁ - గ్రూరత పత్రిలువాని నెవ్వరుం
జేరరసంగరా దొకఁడ - ఓకనుస వానికిఁ దగ్గవారలే
వారక ఘోరకృత్య సతి - బంధురభక్తి భజింతు రెట్లసం
గ్రూరతరోగ్రఘాతములఁ - గొల్వవె నల్వునఁ గాలభైరవుల్. 79

వ. నవగ్రహములం బ్రతిగ్రహముచుట్టు కొన్నియుపగ్రహములు తిరుగుచున్నట్లు నాయకులచుట్టుఁ గొంతమందియుపనాయకులు తిరుగుచుంద్రు. అభిప్రాయభేదమావిర్భవించిన విషవలయముపన్నుచుంద్రు. అహితుండికుండు విషధరముంబుట్టంబెట్టుకొని శీర్షమున మోయు. కాని తద్గుణంబెఱుంగుంగానఁ గోఱలంబెరికి యెంతయాహారమ్మిడిన నదియడంగియుండునో యంతియయిచ్చుచుఁ దనజీవనాధారముగ నుపయోగించుకొనునేగాని జీవహానికరముగఁ జేసికొనండు. కపటియైన క్షుద్రకంటకప్రభుత్యోద్యోగి యెడం బాలకుండట్లు మెలంగవలయు. ఒక్కొక్కప్పుడు విరుద్ధ మనస్తత్వములుగలవారుంగలయుదురు. అదియొక నానాజాతిసమితి. దాని ప్రయోజనము తాత్కాలికము; పరిమితము. అదితీఱుదనుక యట్టిట్టనక యనంతరమాపరిధిందాఁటి స్వేచ్ఛావర్తనంబునఁ బరిభ్రమించుచుంద్రు. ఇది లోకముపోకడ. నియమబద్ధులనుక్షణంబాత్మపరీక్షసేసికొంద్రు. అదివారి మేలిమెఱుఁగుల మెట్టుదారి. పాలకపాలితులిర్వురునరులే కాని వ్యావహారికశక్తిభేదంబునఁ దారతమ్యంబనుల్లంఘనీయంబు; సహజోపపన్నంబు. జనతంగేవలసర్వవిధసమత యసంభవంబు. 80

కం. పసగలవిమర్శమైఁ గన
నసమాంబకు కంటఁగాలె - నసమాంబకుఁడ
య్యసమానతసృష్టింగల
దొసఁగైనం దానిఁదొలఁగ - ద్రోయందరమే. 81

ఉ. అక్షయసౌఖ్యసంభరిత - మై నుతినొందెడి పాలనక్రియా
దక్షతఁజూపలేక పెడ - దారులనుండి మరల్పలేక ధ
ర్మక్షతి దుష్టశిక్షణ ప - రాక్రమహీనతనొప్పి సాధుసం
రక్షణలేని రాజ్యమది - రాజ్యమె దుర్జనభోజ్యమౌఁగదా. 82

వ. క్రూరచోరుల తత్క్షణమశిక్షింప కుపేక్షసేసిన శూలవణి జ్యాయ మేర్పడు. దానఁబాలకునకతికిల్బిషము భరింపరానిదుర్యశముగలుగు. 83

కం. కూడనిపని సల్పెడు కడు
మూఢుని శిక్షించు విషయ - మునఁ దగవరియే
వాఁడని వీఁడని చూచుట
కీడునకేగాక మేలు - కీలెఱుఁగుటయా. 84

వ. పాలకపాలితాన్యోన్యానురాగమవసరము. ఏలిక యెట్టియిక్కట్టులందే విసువక ప్రజలంగాచుటపరమధర్మము. కార్యభారము కాపురుషులపైఁ బెట్టఁదగదు. మహాకృత్యంబెద్దియు నొక్కరొక్కంబుచేతన సాధ్యంబగుననుకొనుటయజ్ఞానంబు. వలంతులుపలువురేకమైనంగాని యయ్యది నెఱవేరదు. కాన నట్టివారియెడఁ గఠినతఁజూపరాదు. ప్రణిధినానావేషధారిగ బహుభాషావేత్తగ విశ్వాసపాత్రుఁడుగ నుండవలయు. అసత్యవాదిని ఖిశినుని గనిపెట్టియుంటలగ్గు. దేశముసస్యశ్యామలముగనుంటకై తగినయేర్పాట్లొనర్పఁ గర్షకులు హర్షింతురు. చోరులరూపుమాపుటత్యవసరము. దేశవిదేశ వ్యాపార సమృద్ధికి వలయుమార్గంబులెల్ల ననవరతమన్వేషించుట శ్రేయోదాయకము. సాధువులఁగంటికి ఱెప్పవోలెంగాపాడుచు యోగ్యునకు సంపూర్ణముగ సహకరింపవలయు. దండభీతిలేనిదేశము ధర్మబద్ధముగ నుండదు. చట్టమునకెల్లరులోఁగవలయు. రవి వార్ధినీరంబులఁగరంబుల గ్రహించి వర్షరూపంబునఁదిరిగి ప్రసాదించునట్లేలిక ప్రజలనుండి కరమ్ములార్జించి మరల వారికొఱక వ్యయమొనర్పందగు. రాజకీయపారావారమున నెప్పుడేతరంగముపొంగునో యేది క్రుంగునో యెవ్వఁడెఱుంగు 85

ఆ.వె. సాగుచున్నబండి - సాగదే మొండియౌ
బెత్తనంబు వేప - విత్తనంబు
అద్ది యెఱిఁగి జనకుఁ - డంటియంటనియట్టి
యుండి ధర్మువునకు - నుసురు వోసె. 86

ఆ.వె. వాడి యున్న చెట్టు - ఫలవృక్ష మైనట్టు
లంతొ యింతొ నేఁటి - కమరెనిట్టు
వర్ణరూప భావ - పరమ రంజితమైన
కైత యట్లు లాంధ్రి – ఘనతగాంచు. 87

కం. త్రిభువన విఖ్యాత తపః
ప్రభ వెల్గిన'' వృద్ధులాడ - రా ''శ్రద్ధావాఞ్
లభతే జ్ఞానమ్మని త
చ్ఛుభకర వాక్యార్థ సిద్ధి - శోభిలు నిచటఞ్. 88

కం. సమయస్ఫూర్తివచోరమ
సమయస్ఫూర్తిప్రభావ – సమధికధృతిమై
రమణీయరాష్ట్రరమణీ
కమనీయకళావిభూతి - ఘనత వెలుఁగుతఞ్. 89

వ. అనె. "అనేక శతాబ్దములనుండి హిందూ బౌద్ధ సంస్కృతుల జీర్ణించు కొన్న సుదీర్ఘ సుప్రసిద్ధ చరిత్ర సంశోభితమైన యాంధ్రజాతి జగత్తునకు శిరోరత్నముగఁ బ్రకాశింపవలయు. త్రిలింగ దేశవాసులు సంఘికార్థికా సమత్వ శూన్య సమాజ నిర్మాణమున స్వాతంత్ర్యోన్నత్య దశల సుప్ర తిష్ఠము చేయఁగలరని విశ్వసింతు. భారత స్వారాజ్య సంగ్రామరంగమున నాంధ్రు లత్యంత మహత్తరమైన పాత్రను నిర్వహించిరి. కష్ట నష్టాను భవమున మహా త్యాగశీల నిరతి నితర రాష్ట్రములఁకుం దీసిపోరు. ఈ నూతన రాష్ట్ర మెదుర్కొనవలసిన క్లిష్టసమస్య లెన్నియేని కలవు. కాన నిత్తఱి వివేకవంతమైన నాయకత్వ మత్యవసరము. స్వరాజ్యము సిద్ధిం చిన పిదపం దక్కిన భారతమునందుంబలె మన సంఘమునంగూడ దురాశాపాపశక్తులు నర్తన విజృంభించె. కులమత ద్వేషదూషిత భావంబు లడంగకుండె. ఆత్మదురభిమానమునఁ బడవీ వ్యామోహ పిశాచగ్రస్తు లైన వారి నేత్రములకుఁ బొరగ్రమ్మ వారి హృదయము పాషాణ సదృ శమై భావములు దోషదూషితములగుట నిక్కము. స్వాతంత్ర్య ప్రియత్వ మునకుఁ బరులపట్ల ప్రేమ చూపుట ప్రధాన లక్షణము. నేతలు స్వార్థ త్యాగంబును బ్రజాభ్యుదయాభివృద్ధి సాధనానక్తిం బ్రదర్శించుట లగ్గు. అగ్నిపరీక్షకు నిలువవలయు. ప్రభుత్వ మనునది కేవల ప్రజలకొఱకై గాక

తానుగూడఁ దదాజ్ఞా బద్ధుఁడుగ మెలంగవలయునను విషయమును విధాన నిర్ణేతలు పరిపాలకులు ముఖ్యముగ గమనింపందగు. ఈ నవ శకారంభమునుండి యాంధ్ర ద్రావిడ కర్ణాటక మలయాళ ప్రజలు పరస్పర సుహృద్భావముతోఁ జరింతురని యాశించుచున్నవాఁడ. ప్రాఁత వాసనలు సులువుగఁ బోవు. వర్తమానములో గత చరిత్ర చాలవఱకు మిళితమైయుండు మన లక్ష్యములు మహోన్నత శిఖరముల వంటివి. మెల్లఁగాఁ బ్రాకిపోవలయు. క్షణక్షణము శరవేగమున మాఱిపోవుచున్న పరిణామ శీలమైన ప్రపంచములో రాజకీయముగఁ జతికిలఁబడియుండఁ జాలము. ప్రజాస్వామిక వ్యవస్థ వ్యక్తిగత ప్రయోజనముల కొఱకుఁగాక ప్రజా ప్రయోజన సాధన కొక యుత్తమోపకరణము. దానిని మనము సక్రమముగ నుపయోగించుకొనిన గమ్యస్థానముఁ జేరఁగల" మని రాధాకృష్ణ పండితుఁ డుగ్గడింప నుపముఖ్యమంత్రి సంజీవరెడ్డి యుత్తిష్ఠుండై.

సీ. ఆంగ్లాంధ్రభాషల – నతులయగు స్వరాజ్య
పత్రిక నడిపిన – భవ్యుఁ డెవఁడు
దక్షిణదేశానఁ – దనన్యాయవాదవృ
త్తిని దొల్త విడిచిన – ధీరుఁడెవడు
పార్థసారథికాల్పఁ – బడఁగ నలఘునాళి
కకురముఁ జూపిన – ఘనుఁడెవండు
భ్రమయని రాజాజి – పల్కిన లవణ స
త్యాగ్రహంబును జిక్కఁ – జరిపె నెవడు

తే. పారతంత్ర్యనిర్మూలన – భార మూని
యెన్నొ పర్యాయములు కార – కేగెనెవ్వఁ
డవల రాజేంద్రు మన్నన – లందె నెవ్వఁ
డట్టి మనయాంధ్రకేసరి – నభినుతింతు. 91

వ. ఇంటికవ్వ కొలతకుఁదవ్వ యవసరమనినట్లు మనకిత్తఱి నాంధ్ర
కేసరి పరిపాలనమత్యవసరము— 92

మ. త్రుటిలో నేదెటుమాఱునో తెలియలేఁ - డీలోకమందెవ్వఁడుం
బటుదీక్షం గృషిసల్పినం జయముసం – ప్రాప్తించునే దైవపుం

ఘటనమ్మన్నగనెన్న నేరితరమా౯ - గాలానుగుణ్యంబుగా
ఘటయంత్రస్థితిఁ గ్రిందుమీఁదగుట ని - క్కంబెంతవాఁడేమహీశా. 93

ఆ.వె. గాంధి టోపి పెట్టి - ఖద్దరు గట్టిన
దేశ ముద్ధరించు - ధీరుఁ డగునె
మనుజునకును మనసు – మంచిది కాకున్న
వేష భాష లన్ని - వృథయ సుమ్ము. 94

వ. రాష్ట్రావతరణసమయమున రాములసంస్మరణప్రథమకర్తవ్యము. 95

తే. తనదు జీవిత నౌకకు – ధర్మమూర్తి
గాంధి నడతయె చుక్కానుఁ - గాన నాతఁ
డాత్మగురుబోధ పాటించి - యనుదినంబు
సూత్రయజ్ఞంబు మానఁడా – సుజనవరుఁడు. 96

తే. ఎవరు నటియింపఁ జాలని – యట్టి పాత్ర
తా నటింప లభించిన - తత్ఫలంబు
మన మనుభవించుటంజేసి - మఱవ కెపుడుఁ
దలఁపఁదగు నాతనిని రాష్ట్ర - దాత యనుచు. 97

వ. ప్రాయోపవేశదీక్ష పాశుపతమునకంటె నతినిశితమైనదని ఋజువు చేసిన మహనీయుఁడు శ్రీరాములు. పేదకుటుంబమునఁబుట్టి పెద్దలకుఁ బెద్దలైనమహామహులలో గణనీయుఁ డమ్మహానుభావుఁడు. 98

చ. నది జనియించుతావునఁ గ - నంగడుఁ జిన్నది మీఁద రానురా
నది దగవృద్ధియై యొకమ - హానదియౌనటు బీదవాఁడఁగా
మొదట జనించి సత్క్రియలఁ - బుణ్యతముండయి గొప్పవాఁడుగాఁ
బొదలు నరుండెవండయినఁ – బుట్టువుతోడనె పూజ్యుఁడౌనొకో. 99

ఉ. బిడ్డలఁగన్నయమ్మ మఱి – బిచ్చము పెట్టినయమ్మ రిత్తనో
దడ్డవుఁ బల్కులేల ప్రజ – లార్తిని జిక్కినవేళ సాయముం
దొడ్డగఁజేసినట్టి ఘను – తోరపుఁబుణ్యము వ్యర్థమౌనొకో
చెడ్డయొ మంచియో యెవఁడు - చేసిన కర్మఫలంబు వానిదే. 100

కం. వినువక హూణులు గాంధిం
గనిఁ జెలిమిఁడ నతని సత్య – ఘనత నడలెనే

పసచెడెనె యశము వాసెనె
మసిపాతంగట్టి విలువ - మాయునె మణికిన్. 101

తే. చాటుమాటున నెపుడెట్లు - చాటనేమి
వాసి తఱుఁగదె ఘనునకు - వసుధయందు
గొప్పవాఁ డెప్పుడే నిల - గొప్పవాఁడె
యెన్నిదివ్వెలు వెలిఁగిన - నినుని సమమ. 102

కం. దెసదెసలఁ దద్జ్ఞు లౌసన
పసగలపని సేయు మంచి - వారల నడతం
దొసఁగుల నెంచుచు విసువని
కసుమాలపుఁ బ్రదుకు - కీర్తి కారణమగునే. 103

సీ. బాల్యమున మూఁడునాలుగు - వత్సరములు
నీరిడఁ గృతజ్ఞతందెల్ప - నారికేడము
జీవితాంతము తీయని - జీవనమిడు
నరునకున్నదె యానీతి - నవ్యజగతి. 104

ఉ. కాలవిలంబనం బతుల - ఘర్షణహేతువుగానఁ గామిత
శ్రీలభియింపఁ జక్రమిడి - శీఘ్రమ యైక్యతఁగూర్పఁజెల్లు మీ
మేలుగ్రహించి యాంధ్రతతి - మిక్కిలిమైత్రిమెలంగు సర్వమి
త్రాళి మహాత్ముఁడుంద్రిదివ - మందు ముదంబునుబొందు నంచిటుల్.

తే. నేర్పుమై నెంతయడిగిన - నదురవోవు
వానికాళ్ళకు మ్రొక్కిన - ఖాతిఁ దనరె
నెన్ని వర్షాలు ముగిసిన - నింత మొలకఁ
గనని కర్షకుకరణి నీ - క్ష్మాకృశించె. 106

తే. శకటచక్రంబువలె నేండ్లు - జరుగుటఁ గని
మంచిమాటలఁ బ్రార్థింప - మంత్రములకుఁ
జింతకాయలు రాలక - చింతిలు తఱి
రాము లేతెంచె నాంధ్రాళి - రాములగుచు. 107

వ. అతఁడు కించిత్సద్యఃఫలానక్తుఁడు గాఁడు. వ్యవహారదక్షత కార్య
శూరతగల వివేకి. నిర్ధార్యుఁడు. స్థితప్రజ్ఞుఁడు. శాంతికాముఁడు. ధీరో

దాత్తుడు. భారత స్వాతంత్ర్య సంగ్రామ మహారథి. సామ్యస్వామ్య సిద్ధాంతబద్ధుఁడు. ప్రజ్ఞోపజ్ఞా ప్రతిజ్ఞలుగల సుజ్ఞాని. కర్మవీరుఁడు. నిస్స్వార్థ ప్రజాసేవకుఁడు పరమత సహనశీలి. పాలకుల వాలకపుఁ గీలకముల నాకళించుకొన్న మేరుధీరుఁడు. అమహాత్యాగి తన ప్రాణములు తృణప్రాయముగఁ జూపుటంజేసియె యాంధ్రమాత యట్టి పుత్రరత్నమును గోల్పోయె. విధిబలీయము ఒక మహావ్యక్తి కాలవశమునఁ దేజోవిహీనుఁడుగఁ గనంబడిన మాత్రమున నతని సహజశక్తి పూర్తిగ నశింపదు. 108

ఉ. దేవుదయావిదూరుఁడగు - ధీరుని హీనుఁడనంగఁ జెల్లునే
యావిధి నేకచక్రపుర - మం దల భీముఁడు బిచ్చమెత్తినం
గేవల భిక్షుకుండె రణ - కేళిజయంబులఁ గీర్తిఁగాంచఁడే
దీవనలందఁడే బుధుల - దివ్యతరంబుగ భోగమందఁడే. 109

కం. గోత్రాభ్యుదయకరమ్మని
ధాత్రీజనులెల్ల మెచ్చఁ - దగఁ జల్పిన తత్
పాత్రోచితదానమ్మును
క్షేత్రాంచితబీజ మెంతొ - కీర్తిఫలదమౌ. 110

వ. మానవుఁడు సంఘజీవి. క్రూరమృగములవలె నేకాంతవాసాసక్తుఁడు గాఁడు. కాన సంఘ శ్రేయస్సె యాత్మశ్రేయస్సనుకొంట యుత్తమ లక్షణము. ఆరోగ్యజీవనమునకు రవిరశ్మి ముఖ్యావసరమైన తెఱంగున రాష్ట్రరమారమణీయోన్మేషమునకుం గేంద్రసహకార మత్యంత వాంఛనీయము. పరిపాలన విషయమున ధర్మసంస్థాపనార్థము దుష్టశిక్షణ శిష్ట రక్షణ యవశ్య కర్తవ్యమని కృష్ణుఁడు గడించిన రాజకీయోపదేశము భారతదేశము మఱచిపోదు. ఆంధ్రభాషకు నాంధ్రుల కృషికి నద్వితీయముగ సహకరించిన మెకంజీషూల్ట్జీ బ్రౌను కాటన్ దొర లీ యుత్సవ సమయమున మనకత్యంత స్మరణీయులు. 111

చ. తెనుఁగును నేర్చిదానఁగల - దివ్యమనోహర శబ్దవైఖరిఁ
మననమొనర్చి పండితుల - మాన్యులఁ బోషణచేసి రేపవల్
ధనమువ్యయించి దీక్షమెయిఁ - దానొక యాంధ్రనిఘంటుకారుఁడై
ఘనయశమందినట్టి గుణ - గణ్యుని బ్రౌనుదొరన్నుతించెదఁ. 112

ఉ. ఏటికి జాగుసేత యని - యేలికయాజ్ఞనుఁబొంది పాటునం
బాటవమొప్పఁదానెతగు - పద్ధతి బోధయొనర్చి కృష్ణకుం
గూటికి గుడ్డకు న్మిగుల - గూర్చెడి సేతువు గట్టినట్టి యా
కాటను కృత్య సత్ఫల మ - ఖండముగాన స్తుతింతు నిత్తటిన్. 113

ఆ.వె. పాముఁ జాడఁ జూచి - భయపడు పురుషుండు
కోరి దాని నెట్టు - కొట్టఁగలఁడు
దుష్టుఁ గాంచి జంకు - దొర యెట్లు లాతని
నొంపఁగలఁడు మేలు - పెంపఁగలఁడు. 114

వ. మెత్తని చోటనే గుద్దలివాడి. ఐనను సమయము తప్పినఁ గాళ్ళు సమయము వచ్చిన రాళ్ళనునది యాంధ్రజాతికి లేదు. 115

తే. తొత్తువలెఁజేసి తినఁదగు - దొరవిధాన
ననెడి సూక్తిని బాటించు - టాంధ్రమతము
సదయ హృదయుల కియ్యది - స్థానమగుట
నఖిలషితసిద్ధి మనకగు - నని తలంతు. 116

ఉ. లాతివిలాతులెల్ల నవ - లక్షణశోభిత రాష్ట్రలక్ష్మి వి
ఖ్యాతికి సంతసిల్లి యతి - గౌరవదృష్టి సమైక్యసఖ్యతా
నీతిఁ జరింప నాంధ్రధర - ణీ పరిపాలన సొగసంచు నా
చేతమనుం గనంగలదు - శ్రీఘమ విశ్వము నవ్యదృశ్యమున్.117

వ. ఆంధ్రుఁడు విశ్వాసపాత్రుఁ డనుటకు నిజజనకుని బంధించి రాయల కప్పగించిన నాగమనాయకుని జీవితమే ప్రబలసాక్ష్యము. సమ్రాట్టుగాని కవి సమ్రాట్టుగాని సత్ప్రవర్తన శూన్యుండు పూజ్యుండు గాడు. త్రిలింగ దేశవాసుల ధైర్య స్థైర్యము లిప్పటికిని సమూలముగ నశింపలేదనుటకు వీరపాండ్య కట్టబ్రహ్మన యల్లూరి సీతారామరాజుల చరిత్రలే యాశ్చర్య జనకములైన దృష్టాంతములు. ఇది యాంధ్ర సామర్థ్య పరీక్షాసమయము.

ఆ.వె. కొండద్రవ్వి యెలుక - కూనఁ బట్టిన యట్లు
శ్రమకుఁ దగ్గఫలము - సరిగ లేమి
నున్నదన్న|నరుల - కులుకెక్కువౌనని
మనసునందు బాధ - మసలుచుండె, 119

వ. కుహనాచాతుర్య ధుర్యకృత వ్యూహభేదన సమైక్యతాకృషి శూన్య మగుటంజేసి మే మీయసంతృప్తికర విధానమునకుం దాత్కాలికముగ నొడంబడిక తప్పినదిగాదు. బళ్లారి విషయమున న్యాయనిర్వహణార్థము తేతలి కామిరెడ్డి కఠోర నిరశన దీక్షంబూనుట విశ్వవిదితము. ఈ నూతన రాష్ట్రోదయ విధానముపట్ల మిగుల యసంతృప్తిం బ్రకటించుచు మున్నాతం డెఱుకపఱచిన తెఱంగున నాత్మపునీతీకరణకొఱకు స్వామి సీతారాము వినయాశ్రమమున నేఁడు నిరాహారవ్రత మూనెనని యిప్పుడతీవవక్కాణ మందె. ఇట్టి క్లిష్టపరిస్థితుల నధిగమించి దైవానుగ్రహమున నచిరమ గమ్య స్థానముఁ జేరఁగలమని విశ్వసించుచున్నాఁడనని తనవా వాదును విర మింప నెహ్రూ సంతసించి యాంధ్రకేసరి ప్రభుత్వంబుం గోరలేదు. అయ్యు దియ యతనిం గోరె. ఇప్పుడాంధ్రాశయశతంబు లానాయకరత్నము మీఁదఁ గేంద్రీకృతములై యున్నదనుట నిక్కము. అతండెన్నో దోషంబు లొనర్చినట్లు వాకొనువారుం గలరు. కాని కాంగ్రెసు దృక్కోణమునం దిలకించిన నతం డేనేర మొనర్పలేదని దృఢముగఁ జెప్పందగు. కేవల సద్భావమ్ముమై నాంధ్రాభ్యుదయము కొఱకు శ్రమించి తత్ఫలముకొఱకె తన సర్వస్వము ధారవోసిన దిట్ట. అట్టివాఁ డిట్టి పదవిని జేపట్టుట తెల్గుల యదృష్టము. అయనను నేను విన్‌స్టన్ చర్చిలుతోఁ బోల్పగలను. ప్రకా శము పూర్ణ పురుషుఁడు. ఆంధ్రకేసరి యను బిరుదమున కర్హుఁడు. అచంచల దేశభక్తియుత సాహసోపేత యోధాగ్రేసరుఁడు అతనియాధ్వ ర్యవమునఁ దెనుఁగు నాయకు లందఱు. 120

శా. ఔచిత్యంబుతలంచి కార్యగతులం – దౌన్నత్యధర్మక్రియా
ప్రాచుర్యోజ్జ్వల నూత్నమార్గగతులై – రాష్ట్రేందిరారాధనా
రోచిష్ణు ప్రతిభా శుభాస్పదులుగా – రూఢిం బ్రవర్తించుచో
ప్రాచీనాంధ్రకళావిభూతి యిఁక సం – ప్రాప్తించునంచెంచెదన్. 121

వ. అనం దాపీ ధర్మారావు నిజాభిప్రాయ మిట్లు ప్రకటించె 122

తే. ఇది భగీరథయత్నాన – నొదవె నివుడు
దీని యభివృద్ధికిఁ గఠోర – దీక్షవలయు
నట్టి కృత్యంబులకు వెను – కంజనిడరు
తెలివితేటలుఁ గలవారు – తెలుఁగువారు. 123

కం. కలవాఁ డొక్కఁడె ఘనుఁడని
తలఁచెడి దినముల విశిష్ట - ధర్మపథంబుల్
తలకెక్కునె ధృతిదక్కునె
జలజాసనుఁడేని దానిఁ - జక్కపఱచునే. 124

కం. మణిగలదని నరుఁ డెవ్వఁడు
ఫణితోడం జెలిమిసేయఁ - బాల్పడు నట్లే
ధనమున్నదంచు నెవ్వఁడు
గుణహీనునిజేరుఁ జేటు - కొనితెచ్చుకొనన్. 125

కం. తినుటకె సంతానంబును
గనుటకె మానవుని జనుపు - గలిగిన దనినన్
మనుజునకుం జంతువునకు
ననుకొనఁ దగినంత భేద - మగపడఁ గలదే. 126

శా. ధర్మగ్లాని సహింపరానిదని ని - ర్ధారింపరే సజ్జనుల్
ధర్మంబే గద సర్వకర్మముల కా - ధారంబు తద్దృష్టిమై
నైర్మల్యోజ్జ్వలధీవిశాలులు కళా - నందుల్ఘనుల్నిర్మముల్
ధర్మైకవ్రతు లేలలేదె నృపు లే - తత్కాశ్యపీఖండమున్. 127

కం. ఎయ్యది మీ కభివాంఛిత
మయ్యది యొనరింతుఁ దెల్పు - డని కోరి ప్రజం
జయ్యనఁ దత్కృత్యంబులు
నెయ్యముమైఁ దీర్చునతఁడె - నేత యనఁ దగున్. 128

ఉ. పూచిన తంగెడుంబలె న - పూర్వ వికాస విలాసయుక్తయై
తోఁచుఁ దెనుంగుఁ దల్లి దయ - తోఁ బ్రజఁగాచు నిజాజ్ఞకింతయుం
గీచినగీటుదాఁటక సు - ఖించెడి బిడ్డల నాత్మమెచ్చుఁ దా
నోచిన నోము సత్ఫలము - నుం గను దీవన లిచ్చు నిచ్చలున్. 129

వ. వినాయకత నెట్టి లోపములున్న వానిని సమూలముగ రూపుమాపఁ గల వ్యాపారదక్షత యాంధ్రజాతికున్నది. ఎవరెట్టి యీర్ష్యాదృష్టిమైఁ జూచిన ననంతమైన యాశ్చర్యకరమైన సహజసంపద తెలుఁగుగడ్డ

కున్నది. ఆంధ్రపరిపాలన ప్రజోపయోగకర కృత్యములకు మరల్పఁగల ధీశక్తి త్యాగౌదార్యములు ప్రజలకున్నవి. 130

తే. అన్నమో రామచంద్ర య – న్నట్టి వాక్కు
లెక్కడే వినఁబడకుండ – నిక్కమైన
జాగరూకత వహియించి – సత్వరగతి
నందఁగల రాంధ్రు లావిశా – లాంధ్ర నింక. 131

తే. ఏది యున్నను లేకున్న – నీ త్రిలింగ
దేశవాసుల కుత్సాహ – దీప్తి దనరు
కార్యశూరత ధీరత – గలిగియుంటఁ
బ్రజలె రాష్ట్రంబునకు వజ్ర – వర్మమనియె. 132

వ. "తమిళనాడు మైసూరొరిస్సా మధ్య రాష్ట్రములనున్న లక్షలకొలంది తెలుంగు లాంధ్రరాష్ట్రమునఁజేర నిరీక్షించుచుండిరి. జనసంఖ్యలో నత్యధికులైన యాంధ్రుల యభిప్రాయమునకు విరుద్ధముగ బళ్లారితోఁ గూడిన యేడుతాలూకాలను మైసూరిలో లీనమొనర్చుటకు దుఃఖించుచు నాల్గువేలమంది నల్లజెండాల ధరించి వ్యతిరేక నినదము లొనర్చుచు బళ్లారిలో నుత్సవముచేసిన సంగతి మనకుం దెలియు. ఆయవ్యయము లంచనావేయ మన రాష్ట్రము లోటుగనున్నట్లు తేలినది. ఇమ్మానమున గోదావరి యానకట్టల మరమ్మతు పూర్తిచేఁతకు వలయు కోటి రూప్యముల నుమ్మడిరాష్ట్రప్రభుత్వము భరింపవలయు. 133

తే. భగ్నజీవుల సంతృప్తి – పఱచుటొప్పు
నుగ్రవాదులతో మైత్రి – యొప్ప దెపుడు
గ్రుడ్డిలో మెల్లగా నిది – గోచరించె
దీని యభివృద్ధి కొఱకిఁక – దీక్షవలయు. 134

వ. పినాకినీ కృష్ణా గోదావరీ వంశధారా నాగావళీ ప్రభృతి జీవనదు లిందుం బ్రవహించుచున్నను నీళ్ళులేక తెలుఁగు పొలములు బీటలువాఱుచుండఁ బ్రజలు తిండిలేక యల్లాడుచుండిరి. పరిశ్రమాభివృద్ధిమై క్షేత్ర లక్ష్మిని బ్రత్యక్షము చేసికొనందగు. అపార ఖనిజసంపదగల రత్నగర్భ యాంధ్రభూమి. అవిభక్త మద్రాసు రాష్ట్రమున లభించు ఖనిజసంపదలో నూటికిఁ దొంబది తొమ్మిది వంతులు తెలుఁగునేలదే. భారత స్వాతంత్ర్య

సంగ్రామమును సందొక యంతర్వాహినిగం ద్రిలింగ దేశోద్యమ ముద్భవించి విజృంభించి రాష్ట్రఫలము సాధించినది. ఉన్నలోభికంటె లేని త్యాగి మేలన్నట్లున్నది కేంద్రవర్తనము. 135

తే. చెప్పరాని మహాసేవ – చేసి చేసి
చేతులను గడ్డికొంటిమి – చెన్నపురిని
దైవమును నమ్మి యకలంక – ధర్మ మహిమ
భాగ్యనగరము వైళమ – పడయవలయు." 136

వ. అని గోపాలరెడ్డి యనె. అంత "సంయోగపదార్థమునుండి వేరు చేయఁబడిన మూలద్రవ్యమున కాదిన్నిజసహజస్థితి రాజిలునప్పటికంటె రాసాయనికశక్తి యధికముగ నుండునని తచ్ఛాస్త్రజ్ఞు లుగ్గడింత్రు. ఆ త్తెలుంగుగం గ్రొత్తగా నావిర్భవించిన యాంధ్రరాష్ట్ర జనులకు భారత ప్రజలు వాంఛించుచున్నంత శీఘ్రతరాభివృద్ధి నొందదగిన బలోత్సాహ శక్తిసామర్థ్యములు సంప్రాప్తింపగలవని నిశ్వసించుచున్నాఁడ. దేశభక్తి ప్రపూర్ణులతో సుదీర్ఘజీవనదీ ద్వయముతో వ్యావసాయిక నిపుణులగు కర్షకోత్తములతో వివిధ విద్యావిశారదులగు మహా మేధావులతోఁ దెలుఁగు నాడలరు. సంగీత సాహిత్య దైవారాధనాదులతోఁ బ్రజలు జీవితము నానందమయముగఁ జేసికొంద్రు. భగవంతుడు మేలుచేసిన నాంధ్రు లఖిలులకు మార్గదర్శకులు కాఁగల" రని రాజాజీ పలికె. అనంతరము.

తే. అణుగణ మజాండ మైనయ – ట్లఖిల జనులు
కలసి వసియింప దేశమన్ – ఖ్యాతిగలిగె
నైకమత్యముతోఁ బ్రజ – లందఱున్న
నిత్యశుభములు పొందుట – నిశ్చయంబు. 138

కం. ధ్యేయం బిహపర సుఖమని
కాయమపాయంబ యనుచుఁ – గని నేతసదా
న్యాయము నారాధించిన
నాయకమణిహారమందు – నాయక మతఁడౌ. 139

వ. ప్రకృతింబలెఁ జరిత్రయుం గసిదీర్చుకొంటయకాక కరుణించుటయుం గలదు. ఆంధ్రులు భాషాప్రయుక్త రాష్ట్రవిభజనాందోళన కంకురార్పణ మొనర్చి నల్వది వత్సరములు వేచియుంట విధివైపరీత్య మనకతప్పదు.

కాని హూణ పరిపాలనా కాలములో రాష్ట్రావకాశము౦ బోగొట్టుకొన్న తెలుగులకు స్వతంత్ర భారతమునం బ్రథమ భాషారాష్ట్రముం బడయం గలిగితిమన్న గౌరవము గర్వము దక్కినది. ఈ సందర్భమున నొక మహనీయ వ్యక్తి తన యమూల్య ప్రాణములఁ బోగొట్టుకొంటయే గాక యాంధ్రు లగ్నిపరీక్షలకుం గుఱికావలసి వచ్చినది. సమష్టి ప్రజాభీష్టమున నొక మహావీరుని బలిదానమున నావరించిన పరిస్థితికి నైతికమైన యొత్తిడి కాగఁజాలక వాయిదావేయుటకు వీలులేని స్థితిలో రాష్ట్రనిర్మాణమునకు నాయకులు సమ్మతించిరి. కానింగ్ మరణానంతరమే కేథలిక్కులకు జయము చేకూరినట్లు రాము లాత్మార్పణ మొనర్చిన పిదపనే రాష్ట్రము సిద్ధించినది. మాంటుఫర్డ్ సమయమునఁ డ్రైలింగుల పరిపాలనా దక్షత విశ్వవిఖ్యాత మయ్యెనని యీశ్వరదత్తు సందేశమంపె. ఈ ప్రారంభో త్సవ సమయమున నిట నిట్లు జరుగుచుండ ఢిల్లీలో మహాత్ముని సమాధి యొద్ద న్యాయమూర్తి జగన్నాథరావు, కె. యల్. రావు దంపతులు నీశ్వరదత్తు దంపతులును బ్రార్థనలు జరిపిరి. ప్రకాశము ముఖ్యామాత్యుఁ డుగ సంజీవరెడ్డి యుపముఖ్య సచివుఁడుగఁ గడప కోటిరెడ్డి తెన్నేటి విశ్వనాథము సంజీవయ్య మంత్రులుగఁ జందూలాల్ త్రివేది రాష్ట్ర పాలకుఁడుగ నాంధ్రరాష్ట్ర మేర్పడె. 140

తే. మనము మద్రాసుఁ బొందెడి – మార్గ మింక
లేదని యెఱింగి కొందఱు – బాధపడుచుఁ
దెలుఁగువారల కటమేలు – కలుగ దనుచుఁ
గ్రోధమూర్ఛితమతులయి – కుంది రపుడు. 141

తే. దిక్కుదెలియని దినముల - దేశమునకు
మనముచేసిన మేలెల్ల – మఱచిపోయి
తుదకు నీరీతిగానున్న - తోఁకఁ గోసి
సున్నమును బెట్టిరయ్యయో – యన్న లనిరి. 142

వ. అది గని జ్యోతిషికులు. 143

ఉ. అంతట నాంధ్రశబ్దమున - కారయఁ గృత్తిక మేషరాశియౌ
టెంతయునెంచి యింకఫల – మెట్టిదొ చూడఁదలంచి చక్రముల్

సంతసమొప్పవేసి గ్రహ – సంతతి రాసులలో లిఖించి సు
స్వాంతముతోడ రాష్ట్రఫల - భావము లిట్టుల తెల్పి రత్తఱిఁ.144

తే. జన్మమున శని ద్వాదశ - స్థానమందు
నర్కుఁడుంట బాలారిష్ట - మనెడియోగ
మగుట నిడుమలు వర్షత్ర - యంబువఱకు
నుండవచ్చని చెప్పి రు – ద్దండ బుధులు. 145

తే. ఐన నినజుఁడు తద్రాశి - యందునుంట
నొసఁగు సంపూర్ణమైన యా - యుస్సు ననుచుఁ
గాళిదాస కేరళివాణి – గానఁ గలుగు
కష్టములు మెల్లమెల్లఁగాఁ - దొలఁగిపోవు. 146

తే. సరిగ భాగ్యాధిపతియైన – చంద్రజుండు
లగ్నమందుంటయు వ్యయంబు - ల కతఁడాధి
పత్యమువహించుటంజేసి – వ్యయమె యధిక
మనుచుఁ బల్కిరి దైవజ్ఞు - లాత్మ నరసి. 147

తే. అరయ రాజ్యాధిపతి చంద్రుఁ – డైన నతని
కష్టమాధిపతిగ గురుఁ - డమరి యుంట
నెఱిఁగి తప్పించుకొనునేర్ప - దెంతయున్నఁ
దగవు లెచ్చుగఁ గల్గుట – తథ్య మనిరి. 148

తే. భాగ్యగతశశికి గురుసం - బంధముంట
సౌఖ్యహానికరంబంట - సత్య మల ధ
నాధిపతియైన కుజునకు - నష్టమాధి
పతి కవియగుటఁ దక్కువ – పైఁడిగలుగు. 149

వ. అని వక్కాణించిరి. తద్రాజధానీ నగరమున గాంధ్యాహ్వాయప్రఖ్యాత
ప్రముఖ నగరోద్యాన మొక్కండు విరాజిలు. 150

# శిలావిగ్రహ ప్రతిష్ఠ

తే. ఎందఱెందఱొ వాహ్యాళి - కేగుదెంచి
యచటి దృశ్యములకు మహా - హ్లాదమందఁ
గ్రమఫల భూజలతలతోఁ - గ్రాలు వనము
నవనవవికాసభాసుర - నందసమన. 151

కం. అవన మండజ పాంథ జ
నావనసుఖదంబు తనుపు - హోఘర్మాంభో
ధావన మారుత సుఖ సం
భావన సుమశోభితంబు - బహురమ్యంబౌ. 152

వ. అందంబుచిందు లతాగారంబు లందందుఁ గనులవిందగు. 153

చ. పికశుకశారికానికర - భేదితపాదపపాత సత్ఫల
ప్రకర వికీర్ణ భూతల వి - భాగచయంబుల బాలబాలికల్
ప్రకటితలీలఁ గాంచుచు న - పారముదంబున నేరికొంద్రు వా
రకుటిలచిత్తులౌట మన - సారఁగమెక్కి సుఖింతురవ్వనిన్. 154

వ. అందొక్క కమలాకరంబు గలదు. ఆ సరోవరవరవర్ణిని. 155

మ. చరితార్థవ్రతయచ్ఛవారికరుణా - సంపూర్ణ భూజాళి దు
ర్గరమాశోభిత సత్యదృక్సుకవివా - గ్వ్యాపార కల్లోల భా
సురవీణాధ్వనియుక్త పుష్పమణితే - జోఘూష నూత్నప్రభా
వరశైవాలవిచిత్రనేత్రయన నొ - ప్పందోఁచుఁ బద్మాక్షియై. 156

మ. జనతాహ్లాదకరైకవర్ణయుత పు - ష్ప ప్రాభవోపేతమై
ఘనశైవాలమణీవితానవృతమై - గంభీరముద్రాంక స
జ్జన హృత్పద్మము భాతి నిర్మలపయ - స్పంశోభితంబై మహా
వనలక్ష్మి ముకురంబునాఁదనరె న - ప్పద్మాకరం బచ్చొటన్. 157

వ. సుగంధి కుసుమ సౌరభ సహిత సమీర సంచార సౌభాగ్యానంద భరిత చలిత తరువరంబు లేణాంక శిలాకలితలలితాలవాలములతోఁ దనరఁ జక్రోడ నిశిత దంష్ట్రా దళిత ఫలచ్యుత మధుర రసక్షిప్త ప్రదేశ పరికీర్ణమక్షికా నికరఝుంకారంబులు వికసితనవశత పత్రోపరి పరిభ్రామ్య

ద్భంఖర ప్రకర ఝుంకారంబు లుల్లసిల్ల నుల్లాసజనకంబుగ నొప్పు – పాంథు లవ్వనచతుష్కోణములంగల వనస్పతుల స్నిగ్ధచ్ఛాయల శయనించి సేదదేఱి యథేచ్ఛం జనుచుంద్రు. 158

తే. అతి మనోహరమైన యు – ద్యానసీమఁ
గలితచక్రోడకృతరంధ్ర – ఫలజలముల
నారికెడమొప్పెఁ గాసార – తీరమందు
సలిలధారల యాంత్రిక – స్తంభమనఁగ. 159

తే. వనమునంగల పచ్చిక – బయలు మీఁద
సంచరించు మయూరముల్ – సంతసమున
నింద్రచాపంబునే నవ – హేళనంబు
సేయు పురివిప్పి నాట్యము – సేయుచుండు. 160

తే. అందమున దీనికిన్సాటి – యైన పక్షి
జగతిలేదని కాఁబోలు – సంబరమునఁ
దనకువాహనముగఁజేసి – కొనియెన్కందుఁ
డనితలంతురు బుధవర్యు – లాత్మలందు. 161

వ. ఆమలకామ్లికాశోకకింశుక క్రముకభల్లాతక హేమదుగ్ధక హేమపుష్పికా యూథికా శేఫాలికా గోనందినీ గోశ్రేణీ నింబ నీపజాత జ్యోతిష్మతీ ద్రాక్షాప్లక్ష హిజ్జల విచికల పాటలా సప్తలా రక్తఫలా నమష్టిలా రసాలసాల నారికేళ కదళీ బదరీ శిరీష వకుళ వటకుటజ ఖర్జూర ఖర్జూరీ రాజభూజ రాజాదన మల్లికా మాధవీమధూక కపిత్థ కాంచనోదుంబర జంబూ జంబీర మాతులుం గలవం గలుంగ నాగరంగ నాగపున్నాగతాల తక్కోల తమాల హింతా లాది తరులతావితాన పరిశోభితంబును మంజుల నికుంజ పుంజ రంజితంబును వివిధస్థల జలవిహంగకుల స్వైరవిహార కిలకిలారావ మనోహర సన్నివేశ సంకాశంబును నగు నయ్యారామసీమ నమరజీవి విగ్రహ ప్రతిష్ఠా కార్యకలాపంబు లాంధ్రపాలకవర్గం బత్యుత్సాహంబున నిర్వర్తించుచుండ స్థానీయ ఘుష్టవార్త తెల్గునాటం బ్రాకఁ దదావిష్కరణ మహోత్సవ కోహరి సాహరి ప్రజలేతేర శశిశిలా వినిర్మిత వితర్దికాతల సుప్రతిష్ఠిత తత్ప్రతిమ నాంధ్రముఖ్యమంత్రి ప్రకాశ మావిష్కృత

మొనర్చి కృతజ్ఞతా సూచకాంజలి బద్ధుఁడై యమరజీవి శ్రీరాములకు జోహారనె. ఔటుగుండ్లు మ్రోగె. ప్రజలు ప్రశాంతముగ నుర్వీతలోప విష్టులైయుండఁ ద్రివేది తద్విగ్రహ నికటంబున నిల్చి. 162

తే. విఫలదౌత్యంబు నన్మహా - వేదనపడి
యసువు లొసఁగిన పరమ పు - ణ్యాత్మ నీకుఁ
జంద్రునకు నూలుపోగను - సామెత గనె
యర్పణ మొనర్తుఁ దావుల - నలరు దండ. 163

వ. అని త్రిలింగదేశీయు లెంత కృతజ్ఞులని దేవతలు పితృదేవతలు వియత్తలమునుండి వేడ్కమై వీక్షించుచుండ నుత్తంభిత శిలాప్రతిమను బృహత్తర కుసుమ మాలాలంకృతం బొనర్చి చిత్తంబున బత్తిరేకెత్త నంతస్మిత కమనీయ కపోలుండై లలిత ఫలిత ధర్మలోలుండై నమస్కృతి యొనర్చి యిట్లను. ఆంధ్రకాశ్యపీజనత ప్రత్యేకరాష్ట్ర మెట్లొదవునా యని.

కం. తలచెడితఱి దరిగానక
తలచెడి ప్రాయోపవేశ - ధర్మం బొకడే
ఫలదంబని జనచాతక
జలదంబని పూని సద్య - శశ్శ్రీకొంటే. 165

వ. రుక్మకారకుఁడు కనకంబును నికషోపల ఘట్టనంబునఁ బరీక్షించు నట్లు భగవంతుఁడు నీ మనస్సును బ్రాయోపవేశ దీక్షం బరీక్షించె. ఆంధ్రరాజకీయ ప్రపంచమున నీకుఁ బ్రత్యేక శాశ్వతస్థానమలరు. 166

తే. మాటలెన్నెన్నొ చెప్పిన - మాత్ర ఘనుఁడె
చేఁతలంబట్టి నరునకుఁ - జెందు ఘనత
గాంధి శిష్యులు వేనవే - ల్గలరు పుణ్య
పురుష నీ వొక్కఁడవె గురుం - బొలితయ్య. 167

తే. మట్టమధ్యాహ్నమున సూర్య - మండలంబు
నిప్పుచెఱగెడివేళ ని - ర్నిద్రశక్తి
గాంధిసూక్తులు గఱపుచుఁ - గఠినదీక్ష
గొడుగు చెప్పులు లేకయే - నడచితివట. 168

తే. అనఘ నీత్యాగశీలత - కబ్బురపడి
థరథరంబుల నీపేరు - తలఁచికొంద్రు

నిత్యకళ్యాణ మొసఁగిన – నీ చరిత్ర
భావి సంతతి కమిత సం - భావ్య మగును. 169

వ. ఇంద్రధనుస్సునకు స్థలనిర్ణయము లేనట్లు చంచల మనస్కులకు మాట నిలుకడ యుండదు. కట్టునది ఖద్దరు కాంక్ష కనకాద్రిమీద. మెడలో రుద్రాక్షలు మదిలో మదిరాక్షులు - అట్టివారు నీ యెట్టయెదుట నిలుచుటకే నర్హులు కారు. 170

తే. త్వన్మరణ సూచకంబుగఁ – దద్దినమున
సంజ క్రొంజీఁకటొ కయింత - పుంజుకొనఁగఁ
గనఁగ మిఱుమిట్లు గొల్పెడి – కాంతితోడ
రాలెనట చుక్క జగము ది – గ్భ్రాంతినొంద. 171

తే. పుణ్యమూర్తి నీవొక మహా – పురుషుఁడవని
పల్కుటకు నట్టి దృశ్యమే – ప్రబలసాక్షి
యరయ ముంజేతి కడెమున - కద్దమేల
నీ మహాత్యాగ ఫలితమే - నిత్యసాక్షి. 172

వ. శిల్పికృతదోషంబు శాశ్వత బహిర్గతంబు. భిషక్కృత ప్రమాదంబు తత్క్షణ సమాధిగర్భనిక్షిప్తంబు. ఆచార్యకృతదోషం బజ్ఞాతంబు. పాలక కృతదోషంబు ప్రతిక్షణ పరివ్యాప్తంబు. ఇంతయెఱింగి యేమనువర్తింప నుంటిమి. ఆంగ్లసార్వభౌమ మణిమకుటస్థగితాంధ్ర మాతృగర్భజనిత మహోజ్జ్వలాద్వితీయ రత్నరాజమగు కోహినూర్వజ్రమువలె నీకీర్తి యగ్రస్థానమున ననంతముగ వెలుంగు. 173

తే నిన్ను శ్లాఘించుటే గాదు – నీదుతల్లి
దండ్రులనుగూడ నిత్తఱిఁ - దలఁపఁదగును
ఏలనా బ్రహ్మదేవుని – సృష్టిని గన
బీజమును బట్టియేగదా – భూజముండు. 174

వ. మహాత్ముఁడు దా సృజించిన సత్యాగ్రహ మహాస్త్రముఁ దనపై నర్ధ భాగము మాత్రమ ప్రయోగించుకొనె. తచ్ఛాత్రరత్నమవైన నీవు తదస్త్ర రాజము నీపైనీవు పూర్ణముగఁ బ్రయోగించుకొని గురునిమించిన శిష్యుఁడ వైతివి. బాపూజీ యొక్కస్వరాజ్యమునకై పాటుపడ నీవు

స్వరాజ్య స్వరాష్ట్ర ప్రాప్తికిం దీవ్రతరతపస్యారూపమున శ్రమించి నీ సేవను ద్విగుణీకృతమొనర్చు టతిముదావహము. హరిజన సేవాస్విన్నుఁడవు. సునథగమనమే నీ ధనము. అన్యులకది దుస్సాధము. ప్రజా శ్రేయస్కాముఁడవగుట సర్వజనానురంజకత నీలోవెలయు. 175

తే. మాతృదేశాభిమానులై - మఱవరాని
త్యాగము లొనర్చి సత్కీర్తి - నందినట్టి
యక్షయోత్సాహ పూరితు - లైనయాంధ్రు
లభ్యుదయ మందుటకు సంశ - యంబులేదు. 176

వ. అన సంజీవరెడ్డి రాష్ట్రపాలక వాక్కులు నగ్నసత్యములని రాముల నభినందించుచుఁ దత్ప్రతిమం గని. 177

మ. ఉపదౌత్యవ్యవహర్తలప్పు విఫలో - ద్యోగవ్యథాచిత్తులై
త్రపమున్గన్నిజరాష్ట్రసిద్ధికి మహో - ధర్మైకదీక్షాక్రియం
గృపమైఁ బ్రాణము లిచ్చి తెచ్చిన యశో - గీతాధ్వనుల్ది క్తతిన్
వ్యాపించె న్మరిపించె నాకమును ది - వ్యత్వంబు నీకబ్బగన్. 178

కం. సుధదేర నరుగు గరుడుని
విధమున దీక్షించి దాన - వీరత్వధృతిం
బుధభువనమంది రాష్ట్రపుఁ
గదనంబున జయము మాకుఁ - గలిగించితివే. 179

మ. హరిదంతద్విపదంతకాంతినిభ దీ - వ్యత్కీర్తి కాంతాయుతా
పురుషార్థంబున బుద్ధినిల్పి వ్రత సం - పూర్తిన్మహాత్యాగివై
సురసామ్రాజ్య మహైకభోగివయి సం - స్తుత్యార్హతంబొందితా
నరలోకస్తుతిపాత్రుఁడౌట యరుదే - నాళీకహృద్భాసుఁడై. 180

ఆ.వె. ఇంత బ్రదుకు బ్రదికి - యింటి వెన్కన చచ్చి
నట్టు లిదియ చాలు - నంట తగదు
కాన జైత్రయాత్ర - కలదింక నొకకొంత
దాని మఱవఁ దగదు - ధర్మ విదులు. 181

వ. ఎక్కడ నుంటివే గొంగడియన్న వేసిన చోటనేయుంటి నన్నట్లుంట జడలక్షణము. నరుఁడు నిత్యసత్యాన్వేషణ తత్పరుఁడు. 182

ఉ. మానవుఁడందుకొన్న యన – మానవివేకపు శక్తిపిడి యె
ద్దీనినదన్న నింకఁ దడ – వేటికిఁ గట్టుఁడు గాటనంట యే
జ్ఞానికి సమ్మతంబది ప్ర – శాంతికి భంగకరంబు నేతల
ద్దాని గ్రహించి ధర్మవు సు – ధామధురంబుగఁ బల్కితీర్పనో. 183

వ. రాజకీయ వాతావరణము కలుషితమైన యిత్తరుణమున గేంద్రాగ్ర నాయకవర్గము యుక్తాయుక్త విచక్షణాన క్తిశక్తి సమబుద్ధి నీ బృహజ్జటిల సమస్యం బృథక్పరిశీలనచేసి పరాక్రాంతాస్మద్ధరాతలంబు మాకుంజేకూర్చి యనౌచిత్య కళంక పంకము నిశ్శంకముగం దలగించుకొంట సముచిత ధర్మవు. కేంద్రరాష్ట్రములకుం బోరాని పొత్తుగలదనుట విశ్వజనైక వేద్యము. మా పరిపాలనకు నిర్బాధకమైన సునథము సుప్రతిష్ఠము సేఁత వాంఛనీయము. 184

ఉ. వాడిన చేనికింజడి శు – భంబిడుభంగి నవీన దోహద
ప్రౌఢిమ నాంధ్రదేశమిఁక – రాష్ట్రములందలమానికంబుగా
గాఢతరైకలీల వెలుఁ – గన్వలె శీఘ్రపురోభివృద్ధితో
నాఁడుగదా మనంబున జ – నంబు స్తుతించునుగేంద్రనేతలఁ. 185

వ. గొదకొనుకోర్కిమై నర్థించుచుండం గీటున బుచ్చి మమ్మిట్టాలి గొనుటనుచితంబు. మీసౌముఖ్యము మాకుం బ్రాముఖ్యము. నవచైతన్య రూపము దృగ్గోచరము కాఁదగిన నిట్టికాలమున రాజకీయము వికృత రూపము ధరింపరాదు. ధర్మార్థసంగతంబైన యేతద్వాంఛితం బత్యంతా దరణీయంబు. ఆశ్వాసవచనంబుల నరవాయిగొనక తప్పుగ్రుంకంజూచుట వగవుట్టించుటగాని యన్యంబుగాదు. అధిష్ఠాతవగుటఁ బనివూని యోహా టింపక కార్యసిద్ధికి దారితీసి యన్యనాయకుల నంచోదనంబు సేయుమని ప్రధానికి నాఁడ మనవిచేసికొంటి మనఁ బ్రజలు హర్షించిరి. 186

శా. ఊరూరన్సభలుల్లసిల్లెఁ బ్రజ న – వ్యోత్సాహసంపత్కళా
పారావారతరంగడోలికల శుం – భద్రీతినూగెం బురా
ధీరత్వంబున నాంధ్రమాత వెలిఁగెం – దివ్యాసనాసీనయై
కారుణ్యామృతవృష్టిఁ దన్పెసుతులం – గందోయి దీవించుచుఁ.187

ఉ. పోయిన యాంధ్రగౌరవము – పొందుట యెట్టని నిచ్చలిచ్చ వా
పోయిన దేశభక్తు లెదఁ – బొందిరి సంతసమించుకంత శో

ఖాయుతమౌచు రాష్ట్రమిఁక - ఖాసిలుసెంచల భక్తకోటి దే
వాయతనంబులస్వైరద - యామయు నీశ్వరుఁ గొల్చిరెంతయుఁన్.188

తే. నలుదెసలఁ జిక్కియున్నట్టి - నాదుబిడ్డ
లెప్పుడొక గొడ్గుక్రిందికి - నేగుదెంతు
రంచుఁ దహతహపడుచుండె - నాత్మసతత
మఖిల సద్గుణసముపేత - యాంధ్రమాత. 189

ఆ.వె. మొనసి బోడితలను - మోకాలి ముడివెట్టఁ
గుంచమునన మంచుఁ - గొలిచి చూప
నేల నింగిఁ బట్టి - తాళమ్ము వేయంగ
జాణలనిరి తెలుఁగు - జగతి జనులు. 190

ఉ. ఐక్యతలేని దోషమున - నక్కట నిక్కమెటింగితెల్ప మా
ణిక్యమువంటి చెన్నపురి - నీకులభింపకపోయె నాంధ్రుఁడా
తౌక్యము లాలనంబు జరిసె - లక్షణముల్గద యవ్వినేర్వఁగా
శక్యముగామి నీకది య - సాధ్యమయై వెతగల్గఁజేసెడిన్. 191

ఉ. రక్తముధారవోసి యిటు - రాష్ట్రముఁ దెచ్చితి వింకభక్తితో
శక్తినిధారవోసి జయ - సాధనలీలఁ బురోభివృద్ధితో
యుక్తులనారబోసి విభ - వోజ్జ్వలకీర్తిసుమాళిదిక్తతిన్
రక్తిగఁ జిమ్మిలోకమవు - రాయననిచ్చలు వర్తిలందగున్. 192

తే. మగధమొదలుగఁ గన్యాకు - మారివఱకు
నీప్రతాపాత పత్రంపు - నీడ నిలిచె
నేఁడు పరులాక్రమించిరి - నీ స్థలంబు
నది యెటు లభించునని కుందె - నాంధ్రమాత. 193

వ. ఇట్లాంధ్ర ప్రముఖసమయోచిత సంభాషణముల శిలావిగ్రహప్రతి
ష్ఠోత్సవము జరిగె. అనంతరము కతిపయ దివసంబులకు శాశ్వతరాజధానీ
చర్చ ప్రారంభమయ్యె. 194

# రాజధానీ చర్చ

సీ. వేదవేదాంత స - ద్విద్యా వివేకాత్త
గుణమణీ గణరామ - కోనసీమ
నటనటీగాయక - నానాకళోపాస
నానవ్య సుఖధామ - కోనసీమ
యాగయోగవిరాగ - భోగరాగత్యాగ
మానితజనధామ - కోనసీమ
చాళుక్యరాజ్యరా - జస్థానపోషిత
కోవిద కవిసీమ - కోనసీమ

తే. నారికేళామ్రపూగపు - న్నాగలికుచ
పణసకదళీకపిత్థకాం - చనశిరీష
మల్లికాదిలతాభూజ - మహితజాత
కుసుమఫలభరితారామ - కోనసీమ. 195

తే. అప్ప్రదేశంబునందుంట - నద్వితీయ
సహజనౌకాశ్రయంబుంట - జలతృణపశు
సస్యకాష్ఠాది వృద్ధిమైఁ - జక్కనుంటఁ
దగు విశాఖయ యనిరి కొం - దఱు ముదాన. 196

తే. జలధితీరావనికి నట్టి - నడుమ నుంటఁ
గృష్ణయొడ్డుననుంటఁ బు - రీలలామ
విజయవాడయె తగునని - వేడ్కఁ గొంద
ఱనిరి తలకొక మాటగా - ననిరి పిదప. 197

వ. నానావిధ సౌఖ్యసంభరితమై స్వచ్ఛాంధ్ర నాగరికత కాలవాలమైన గర్తపురీ విజయవాడ ప్రాంతమునకు రాజధానిం దరలించినం గొంతకాలంబున కానగర ద్వయమ్మేకమ్మై యొక మహానగర రాజమ్మై రాజిల్లఁగల దనియు నప్ప్రాంతంబు చెన్నపురికి విశాఖకు హైదరాబాదునకు సమాన దూరమునందుంట సర్వవిధ వ్యాపార ప్రయాణాదుల కత్యంతానుకూల

మనియుం గొందఱనిరి. అంత రాజధాని కర్నూలినుండి మార్పవలయు నను సంకల్ప మిప్పటికిలేదని ముఖ్యసచివోప ముఖ్యసచివు లుగ్గడించిరి. కాని కర్నూలినుండి మార్చినచో హైదరాబాదునకేగాని మఱి యేనగరమునకుం గాదని సంజీవరెడ్డి యుద్ఘాటింప. 198

చ. అరయఁ బ్రజాసమస్యయిది - యచ్చపుఁ బక్షసమస్యకాదు సు
స్థిరమగు రాజధానిని న - శించుచుఁ బుట్టుచునుండు పక్షముల్
సరగున నెన్నఁగాఁ దగవు - శాంతత నర్హతఁ జూడనొప్పుఁ దొం
దరపడ లాభమింతగల - దా పరువెత్తినఁ బ్రొద్దుగ్రుంకునా. 199

వ. అని ప్రకాశమున మోటూరి సత్యనారాయణ పట్టాభి రామారావు శాశ్వత రాజధానిగా నుండఁదగిన సంపూర్ణార్హతలు కర్నూలికి లేవు. హైదరాబాదు రాజధానీనగరముగ 'విశాలాంధ్ర' యవతరించుట బహువిధ శ్రేయోదాయకమని నిజాభిప్రాయమ్ములఁ బ్రకటింప వర్షత్రయమ్ము వఱకీ సమస్యం జర్చింపకుంట లగ్గని కాళేశ్వరరావనె. అంతం ద్రిలింగ దేశోన్నత న్యాయస్థానస్థాపనకుం బాలకు లతిశీఘ్రమ తగు చర్యలు తీసికొనిరి. తాత్కాలిక శాసనసభాధ్యక్షుఁడుగ నడింపల్లి నరసింహారావు నుపసభాధ్యక్షుఁడుగఁ బసల సూర్యచంద్రరావు నెన్నుకొనిరి. 200

కం. నిష్కాపట్య బలంబున
శుష్కోక్తుల విడిచి దేశ - శోభాదీక్షా
విష్కరణమెలఁగ నేతకు
దుష్కరకార్యం బొకండు - దోఁప దొకప్డుఁ. 201

# తొలి శాసనసభ

వ. సురద్వేషి పరుషభాషి రోషి దోషియగు వృత్రాసురు జయించి నిజ విజయ సూచకమ్ముగ నాచార్య గరుడ గంధర్వ కిన్నర కింపురుష సిద్ధ విద్యాధర దివ్యర్షి బ్రహ్మర్షి రాజర్ష్యమరబృంద సమేతుండై చింతామణీ భద్రసింహాసనాసీనుండై యొడ్డోలగంబున్న దేవేంద్రుని సుధర్మతెఱంగున, నిరంతర సర్వచరాచర జగత్సృష్టికర్తయగు సురజ్యేష్ఠునకు వాహనము

త్రైన తమ కొలము సాములు సత్యలోక నూతన వార్త లుగ్గడించుట కేర్పఱచిన రాజహంసల సదస్సువలె, సింహగడమును స్వాధీన మొనర్చు కొని రాజగడమున రత్నపంచాస్య పీఠ మధిష్ఠించిన ఛత్రపతి శివాజీ మహారాజురాజసభ ఖ్యాతి, నెందఱులోఁగిన మఱెందఱుడాగిన నింకెందఱు మూఁగిన వేవెందఱువీఁగిన సతీసుతులతోఁ బార్వతేయాటవికకతిపయాను చరులతో భీకరక్రూరమృగాకీర్ణాటవులసంచరించుచునాహారనిద్రాశూన్యుఁడై ఢిల్లీచక్రవర్తితో నహోరాత్రములనేకవర్షములు నిర్విరామఘోరసంగ్రా మంబొనర్చి ఘనవిజయపరంపరలనంది తత్సార్వభౌమానురాగ శ్లాఘా పాత్రుఁడై స్వేచ్ఛాస్వాతంత్ర్యములస్థిరపఱచుకొని నిజనగరరాజభవనంబు నంగొలువుదీరియున్న రాణాప్రతాపసింహుని దర్బారురీతి, రణరంగముల వీరవిహారమొనర్చి గజపతులనోడించి విజయస్థంభములఁబ్రతిష్ఠించి యద్వి తీయయశోరమనార్జించి వచ్చి యనంతరకార్యక్రమాలోచనా నిమగ్న మానసుండై సచివసామంతదండనాథకవి పండితశిల్పి గాయనగాయనీ మణులతోఁ ద్రిభువనజేగీయమానచరితుండై యనల్పశిల్ప కళాకమనీయ కలాపపరిశోభిత నవ్యదివ్యభవనరాజమ్మున నంగరక్షక వందిమాగధ వైతాళికాది భృత్యపదస్థులం దందత్యంతావధానచిత్తులై మెలంగుచుండఁ బేరోలగంబున్న యాంధ్రరాడ్రత్నంబగు రాయలభువన విజయమువోలెఁ ద్రివర్ణజాతీయపతాక గగనవీథిం ధగధగ మెఱయుచుండ గవర్నరుత్రివేది ప్రధానామాత్యుఁడు ప్రకాశ ముపముఖ్యమంత్రి సంజీవరెడ్డి తాత్కాలిక శాసనసభాధ్యక్షుఁడు నడిమిపల్లి నరసింహారావు, విద్యాశాఖాసచివుఁడు పట్టాభిరామారావు కడపకోటిరెడ్డి సంజీవయ్య తెన్నేటివిశ్వనాథ ప్రభృ తులు వితర్దికాతలంబునఁ జిత్రశిల్పకళా కమనీయోన్నతోచితాసనంబు లలంకరించియుండ శాసనసభాసభ్యులు వారలకెట్టియెదుటసముచిత పీఠం బుల సుఖాసీనులై యుండ నితరజనంబు'గ్యాలరి' నిండియుండ భారతీయ సంప్రదాయబద్ధముగ శ్రద్ధమైఁ బ్రార్థనాదులుఁజరిగె. అత్తఱి— 202

తే. ఆంధ్రశాసనసభ యిట్టు - లమరె నంచుఁ
గుతుకమున రవి తగ్గించు — కొనియెఁ దైష్ణ్య
మాశలఁ బ్రసన్నతాగుణ — మతిశయించె
మందమారుత మతిముద — మంద వీచె. 203

చ. చిలుకలు పల్కుచుం దివిని - శ్రేణులుగట్టిచరించె వృక్షముల్
జలజలరాల్చెఁ బూలు జన - సంఘముఖాబ్జములెల్లవిచ్చె ని
ర్మలజలశోభితంబులయి - నిండుముదంబునఁ బాఱె వాహినుల్
తళతళలాడె నత్తెలుఁగుఁ - దల్లికిరీటము నూత్నకాంతితో. 204

తే. పొంగి పొరలెడి తోషత - రంగ తతుల
భర్త కివ్వార్త సెప్ప సం - బరముతోడ
గౌతమీసహ్యజాదులు - కదలిపోవు
చున్నవన నూత్నగతులతో - నొప్పె నదులు. 205

వ. తత్సమజ్యం బహువిధార్హ పీఠంబులసుఖాసీనులై యున్న సదస్యుల తెల్లనిమల్లెపొరవంటి మేలిమెఱుఁగులసన్ననిదుస్తులు వాయుయంత్రపవనాహతి హంసలనులి యీఁకలవలె రెపరెపలాడుచుండె. 206

ఆ.వె. ఎడమ భుజము పైకిఁ - గుడిచేతి క్రిందుగా
నంద మొల్కు సాలు - వమరఁ దాల్చి
గాంధిటోపి పెట్టి - కనులజోడు ధరించి
ముదముతోడ నొప్పె - ముఖ్యమంత్రి. 207

వ. లతాంతలతాశుకపికశారికా మయూరహంసాది చిత్రాన్విత శ్వేతపీత హరితనీలారుణవర్ణపరిశోభితదర్శనీయమగు కలంకారీయద్దకపుఖాదీవస్త్రాలంకృతమైన మేజాబల్లపై సితసికతా పరిపూరితంబై మోజుపడఁదగిన సన్ననిచిన్నిగాజుకూజాలో గ్రుచ్చిన సుగంధయుక్తములైన యగరువత్తులు ఘ్రాణతర్పణముగ వెలుఁగుచుండ ముఖ్యమంత్రి యాంధ్రశాసనసభాప్రాంగణమున నమరజీవి శ్రీరాముల చిత్రపటావిష్కరణమొనర్చి పూలమాలవైచె. సచివబృందము పుష్పవర్షము కురిపించె. అంత. 208

శా. జ్ఞానజ్యోతిగ వెల్గు నీశ్వరుని ర - క్షాదక్షుఁ బ్రార్థించి క
ళ్యాణప్రాభవవైభవాన్వితముగా - నాంధ్రోర్వివాంఛించి పీ
ఠానీకంబునకంజలించి భవిత - వ్యంబాత్మభావించి య
త్యానందంబున నాంధ్రకేసరి హృదా - హ్లాదంబుగా నిట్లనుజా. 209

వ. ఆంధ్రరాష్ట్ర నవ్యభవ్య సౌధరాజ నిర్మాణమునకుఁ బ్రధాన శిల్పి శ్రీరాములు. అయ్యమరజీవి మహాత్యాగఫలితమే యీసదస్సిట్లేర్పడుటకుఁ

గారణమని సభ్యమహాశయులందఱు స్ప్రుహయందుంచుకొంట పరమ ధర్మము. బాపూజీరూప యాదర్శదివ్యజ్యోతికిం బ్రతిబింబమూర్తియగు నప్పాట్టివంశపయఃపయోధిరాకాశశాంకునకు మనమత్యంత యోగ్యులమైన యనుచరులమని సత్యాహింసల నారాధించి ఋజువుసేసికొంట మన కర్తవ్యము. ఆత్మశక్తిపై మధ్యమలోకవాసుల విశ్వాసంబును బునరుద్ధరించినజ్ఞాని మహాత్ముఁడు. ప్రజానీకమున నాత్మశక్తి నద్వితీయముగఁ బ్రేరేపించి సత్యాహింసలద్వారమున నొకమహాదేశమును దాస్యమునుండి స్వాతంత్ర్యమునకు నడిపించి యఖండభూమండలంబునెల్ల సంభ్రమాశ్చర్యముల ముంచియెత్తిన శాంతిసమరవీరుఁడు గాంధీజీ. ఇప్ప్రపంచమున నిట్టికృత్యంబింతకు ముందెవ్వరు నొనర్పలేదు. అనన్య సాధ్యమైనరీతిగా గాంధేయసిద్ధాంతము ననుసరించినవాఁడొక్క శ్రీరాములే. దానికి జీవిత మర్పించినవాఁడు శ్రీరాములే. ఇట్టిత్యాగముచేసిన కర్మవీరులు ప్రపంచ చరిత్రలో మఱియెవ్వరు మాత్రమకలరు. వారే మాస్వామీ జితేంద్ర దాసులు. శ్రీరాములాంధ్రజాతికి గర్వకారణము. 210

తే. పాపపంకిలమైన ప్ర - పంచమందు
స్వచ్ఛసద్గుణి దొఱకుట - చాలయరుదు
సద్గుణియకాక ప్రజలకై - సాహసమునఁ
బ్రాణమర్పించె రాములు - పరమ ఘనుడు. 211

వ. గాంధీజీ కత్యంత ప్రియాంతేవాసియైన రాములు పరార్థరతుఁడుగాని, పరార్థరతుఁడుగాఁడు. ధీరహితుఁడుగాని ధీ రహితుఁడుగాఁడు. ధారాధర తుల్యుఁడుగాని ధారాధరతుల్యుఁడుగాఁడు. ప్రజాహితదృష్టిగలవాఁడుగాని ప్రజాహితదృష్టిగలవాఁడుగాఁడు. భూరిధార్మికుఁడుగాని భూరిధార్మికుఁడు గాఁడు. కరణభ్రాంతుఁడేగాని కరణభ్రాంతుఁడుగాడు. క్షమాకాంక్షిగాని క్షమాకాంక్షిగాఁడు. వర్ధమానార్థిగాని వర్ధమానార్థిగాఁడు. సత్యాహితాత్ముఁడుగాని సత్యాహితాత్ముఁడుగాఁడు. వినీతిగాని వినీతిగాఁడు. రాజశేఖరారాధనపరుఁడేగాని రాజశేఖరారాధనపరుఁడుగాఁడు. అట్టి యాంధ్ర రాష్ట్రనిర్మాతకు జోహారులు— 212

సా. అచ్చపు సద్గుణంబుల మ - హాత్మునకుం దులయైన మానవుణ్
మచ్చునకైనఁ జూపఁగల - మా యన భూములోకంబె నాఁ దగుణ్

మచ్చయొకింతలేని జన – మాన్యుని రాముఁ గృతజ్ఞతాస్తుతిఁ
మెచ్చి ఋణంబుఁ దీర్చికొన – మేలగు నాంధ్రులకంచు నెంచెదఁ. 213

వ. గణపతి తొలిపూజకెట్లర్హుఁడో రాష్ట్రదాతరాములు మన తొలిపూజ కట్లర్హుఁడు. 214

తే. అంతలోఁ బొంగుటయు మఱి – యంతలోన
క్రుంగుటయు లేని పరమ ని – స్సంగుఁడతఁడు
ఆత్మపరులకు నుపకృతి – యందె యంట
దోషమెఱుఁగని నిత్యసం - తోషి యతఁడు. 215

తే. అబ్ధితోఁ బోల్తుమనఁ బడ – బాగ్ని యుండె
నుడుపతిం బోల్తుమన మచ్చ - యుండె నొకటి
కనకగిరిఁ బోల్పఁ గఠినత – గ్రాలుచుండెఁ
గాన నతనికతండె ని – క్కముగ సాటి. 216

వ. తొలుదొల్త నాయకులు ప్రజలు రాములగొప్పఁదన మాకళించుకొనఁ జాలరైరనుమాట యథార్థము. 217

ఆ.వె. ఉన్న యంత కాల – ముల్లిపొట్టుగఁ జూచి
పరముఁ జేరి నంతఁ – బ్రస్తుతించు
నున్న లిక్క యద్ది – యూడినఁ గొడవలి
యేమి జనత మాట – కేమి ఘనత. 218

వ. ఎప్పుడెప్పుడు పెండ్లియగునాయని మానవుఁడు చంకలుగొట్టుకొనును గాని యైన పిదప బాధ్యతల భారము నంగలుగుతిప్పు లప్పరమేశ్వరున కెఱుకయని యతండెఱుంగఁడు. అట్లు – 219

చ. కలిగెను రాష్ట్రమున్న మన – కష్టములన్ని ఫలించినట్లు యి
ల్లలికినయంత పండువగు – నా ప్రజయెన్నిక సార్థకంబుగా
నలరిననాఁడు సంతసము – నందఁగఁజెల్లు జగంబుమెచ్చు ని
శ్చలమతి గమ్యమందుకొను – సత్వరచర్యలఁ బూనుటొప్పగుఁ. 220

వ. లెమ్ము. గమ్యముచేరువఱకు నిర్నిద్రశక్తింగార్యదక్షతఁజూపుమనిఁ కఠోరోపనిషత్తు చెప్పుచున్నది. సాహితీసరోవరమును సమగ్రముగ

నీఁదిన పరమహంసయగు భోజునికల్పతరువు చాణక్యుని యర్థశాస్త్రము కామందకుని నీతిశాస్త్రము శుక్రనీతిసారము సోమదేవ సూరినీతివాక్యామృతము. పంచతంత్రాదుల నామూలాగ్రముగఁ బరిశోధించి జీర్ణించుకొంట నేతలకవశ్యకర్తవ్యము. అంతియకాక నెహ్రూపటేలంబేద్కరాది మహామేధావులచే రచింపఁబడిన నూతనభారత రాజ్యాంగశాస్త్ర మహాగాహమునకుఁదెచ్చుకొని యాచరణమునఁబెట్టుకొంట యనుల్లంఘనీయమైన విధి. 221

చ. ఘనకధికారముస్న్నపుడె - మానక దండిగఁ బిండుకొంటయే
ఘనమని స్వార్థదృష్టిపెరు — గం జరియించుట పాపహేతువౌఁ
దనకవకాశమీయఁగ న - ధర్మవుఁగోరికకోర కైక తీ
రెనెయది రెంటికింజెడిన — రేవడియై యపకీర్తి నొందదే. 222

ఉ. పాపమువండుచుంట ధర — భారము మోయఁగలేక శేషుఁడే
నోవఁగఁజాల దేవ నను — నోమఁగ నేపథకంబువేసెదో
దాపకచెప్పవయ్య యని — దైవమువేఁడినవేళ నెవ్వరేఁ
బాపఁగఁ జాలరాపదలు - ప్రాజ్ఞులవాక్కిది వేదబుక్కొకా. 223

వ. అట్టిగుట సమరజీవివంటి యాదర్శపురుషుల సూక్తిముక్తావళుల హృదయకోశమ్మునం బదిలపఱచుకొని ప్రగతిన్సాధించుటకుఁ గనత్కనక కంకణధారులమై వర్తించుట మన ప్రథమకర్తవ్యమనె. 224

తే. దివ్యదీధితి కన్గవఁ — దేజరిల్ల
నాత్మఁ బరమాత్మబోధ పె - ల్లాలకించి
పలుకుపలుకునఁ బూఁదేనె — లొలుకుచుండఁ
బలికె నమ్ముఖ్యమంత్రి సం — బరముతోడ. 225

వ. అంతందొలిశాసనసభా ప్రారంభోత్సవోక్తుల నలరింపఁ ద్రివేది వేదిక నిల్చి— 226

ఉ. అంబరకేశు పావన ప — దాబ్జములన్మదిలో భజించి పీ
తాంబరుఁగొల్చి రాష్ట్రరమ — నందఁగదీక్షవహించి ప్రాణదా
నాంబువుధారవోసి విజ — యంబిటులందినయట్టి పొట్టివం
శాంబుధిపూర్ణచంద్రునకు — నంజలిచేసెద నాత్మశుద్ధితో. 227

వ. అమ్మహనీయునిత్యాగమహిమ నీతోలిఖానసనభను ప్రారంభించు మహాభాగ్యము నాకుంగలిగినది. సహోదర విభక్తనూత్న కుటుంబంబుం బలెఁ గ్రొత్తగనేర్పడిన మనరాష్ట్ర సర్వవిధాభ్యుదయ సాధనసంపత్తి కనవరత మనంతైక్యతావ్రతమునఁ గష్టింపవలసిన గురుతరబాధ్యత యెల్లరపైనున్నది. స్వరాజ్యస్వరాష్ట్రసంపాదనమున మనమొకవిధముగ ధన్యులము. "స్వరాజ్యమనుపదమతి పవిత్రమైనది. ఏతత్పద సంపూర్ణార్థ మాత్మనిగ్రహాన్విత స్వపరిపాలనముగాని విశృంఖలత్వముకాదు. హృదయ శూన్య ప్రభువునకుబదులు ప్రజాక్షేమాభిలాషికాని వేఱొక మందబుద్ధిని నెత్తికెక్కించుకొంట మదభీష్టముకాదు. మృత్యుభయపీడితజాతి స్వరాజ్య మును సంపాదించుకొనఁజాలదు. ఒకవేళ కాలకర్మవశమున సంపా దించుకొన్నను నిలఁబెట్టుకొనఁజాలదు. రాజ్యరాష్ట్ర ప్రాప్త్యనంతరము ప్రజల నవచైతన్యకళావిలాసులుగ నొనర్పవలయు. ఇయ్యది గారఁడీని బుట్టక్రింది మామిడిమొక్కవలె హఠాత్తుగ జన్మింపదు. మహావటవృక్షము వలె నద్ధిక్రమముగ ననంతముగవృద్ధియగు. రక్తప్లావిత విప్లవశక్తిమై నిట్టిదసాధ్యము. ఘట్టకుటికా ప్రభాతన్యాయమున నహింసాసిద్ధాంతము నకుఁ దలయొగ్గినప్పుడే శాంతిస్థాపనజరుగు" నని మహాత్ముండన్న ఖండ శర్కరంబోనివాక్కులు చిరస్మరణీయములు. 228

ఉ. వ్యాజములేక మాతృధర - బంధముఁ బాపఁగ శ్వేతజాతితో
నాజియొనర్చి గెల్చిన మ - హాత్ముఁడువేసిన బీజరాజముం
భూజమొనర్పఁ గంకణముఁ - బూనిన నింకనిశన్మహౌషధీ
రాజమువోలె రాజిలును - రాష్ట్రమనంతరమా విలాసమై. 229

ఉ. భారమునాక సర్వవిధ - బాధ్యతలంగమనించి లోకవుం
దీరు గ్రహించి యీతెలుఁగు - దేశపుఁ గష్టసుఖాలెఱుంగ సం
చారమొనర్చి యభ్యుదయ - చర్యల సౌఖ్యముగూర్చి సర్వసం
భారసమేత యాంధ్రి యను - భాగ్యము మాతకు నేత కూర్పనౌ. 230

శా. సత్కార్యంబునఁ గూడఁబెట్టు తృణమే - సత్యంబుశ్లాఘార్హమౌ
నుత్కోచార్జితవిత్తసంభరితు నా - ర్యుల్మెచ్చి కీర్తింతురే
హృత్కోశంబున నీతిరత్నతతి నెం - తేనిల్పి లోకత్రయీ
సత్కారాద్భుతపాత్రుఁడై మనుటచే - జన్మంబు ధన్యంబగుఁ. 231

వ. ఈ యాంధ్రదేశము సర్వసస్యములకు సకల సంపదలకుఁ బుట్టి నిల్లు. అంతియకాక విశ్వేశ్వరునకు శశిని విష్ణునకు లక్ష్మీ కౌస్తుభముల దేవేంద్రునకైరావతోచ్చైశ్శ్రవముల నిఖిలనిర్జరులకమృతము నొసంగిన ఘనవదాన్యశిరోమణియగు రత్నాకరుఁ డీరాష్ట్రమునకుందొలిదెస నిలిచి విదేశ వ్యాపారాదుల కనేకవిధముల సహకరించుట ముదావహము ఔపనిషదాఖండ జ్ఞానముసమేరుశిఖరముల నందుకొన్న భారతదేశ మేనాఁటినుండియో మేధాసంపత్తివలనఁబశ్చిమఖండములకుసుపరిచితము. తత్త్వశాస్త్రదివ్యజ్యోతుల ఖండఖండాంతరముల వెలిఁగించి విశ్వవిఖ్యాతి సందిన మహనీయుఁడు స్వామి వివేకానందుఁడు. అట్టియాత్మజ్ఞానము మన మెన్నఁడు మఱవరాదు. ప్రపంచపురోగమనమును గమనించి మనయగ్రశ్రేణినాయకులేతన్మాతృభూమ్యనుకూలముగ స్మృతిసృజించిరి. రాజ్యాంగ మనఁ బ్రభుత్వయంత్రాంగ గమన సూత్రనిర్వచన పత్రము మాత్రమే కాదు. జాతిపురోగమనానుకూల జీవన విధానమును దీర్చిదిద్దుసాధనము. అట్టిరాజ్యాంగరచన ననుభవజ్ఞుఁడు కార్యనిర్వహణ పటిష్ఠుఁడునగు పటేలు ప్రముఖపాత్రవహించి కృతకృత్యుఁడయ్యె. అయిన నమలుపఱచనిచట్టమక్కఱకురానిచుట్టము. జీవయాత్రకుఁ బనికిరానిపట్టము. 232

అ.వె. పండితుండుగాని - పామరుఁడేఁగాని
కట్టుబడుటలెస్స - చట్టమునకుఁ
గాక యద్ది మనకుఁ - గాదని మెలఁగుట
కొఱవితోడఁ దలను - గోకికొనుట. 233

ఉ. వెన్నెలరాత్రులట్లు సిరి – వెల్గుదినంబుల గీము నూత్నమౌ
వన్నెలమీఱ శ్రీతొలఁగ – వాకొననేమిఁక నంధకారసం
ఛన్ననిశంబలెం ధృతి వె - సన్నశియింపఁ గళావిహీనమౌ
నిన్నిగ్రహించి రాష్ట్రమ - నెంతయు వృద్ధియొనర్చుటొప్పదే.234

కం. అందఱు ముందున కరిగెడి
చందమునం గార్యతతుల – సాధించిన మా
డెందము వొందును నమితా
నందమనెం గాంధి యదియ – నాకము మనకుఁ. 235

ప. భూదానయజ్ఞమున వినోబా ధర్మరాజ్య స్థాపనఁగోరుచుంట మన కెల్లరకుందెల్లము. భాషాప్రయుక్తముగ విభక్తములయ్యు నవిభక్తకుటుంబము వలె భారతీయులెల్లరు సంచరించుట సర్వోత్తమధర్మము. శుద్ధసర్వోదయ సిద్ధాంతబద్ధులమై మెలంగుట యిహ పరసౌఖ్యసాధనమని యతండు బోధించు. సర్వోదయశబ్దస్వీకృతికిం గారణముగలదు. రస్కిను వ్రాసిన "అన్ టు దిస్ లాస్ట్" ను పుస్తకరాజమ్ముం బోలెన్ని గాంధీజీకిఁ బసదనముగ నొసంగె. తద్గ్రంథము బాపూజీ హృదయరాజ్యమును బాలించి యతని జీవితమున నూతన పరివర్తనము గలిగించె. అంత నింతంతనరానినంత నమున సర్వోదయమను పేరితో నప్పొత్తము భూర్జరీకరించె. ఆ సర్వో దయశబ్దమే నేఁడు మనము గ్రహించి తత్సూత్రాచరణప్రాప్తి కనవరత మనేక రూపంబుల శ్రమింప స్థిరసంకల్పముమైనున్నారము. ప్రత్యక్ష పరోక్షముల మహాకవులకృషి ఫలించుననుట కిదియొక ముఖ్య తార్కా ణము. దీనింబట్టి యుత్తమగ్రంథశక్తి మన మూహింపవచ్చు. భారతీయ భక్తాగ్రగణ్యుల ఋషీశ్వరుల తోరో, టాల్‌స్టాయి ప్రభృతి పాశ్చాత్య మేధావుల రచనల భగవద్గీతాదుల విజ్ఞానమును జీర్ణించుకొంట రాజకీయ మున నాత్మశక్తి నైహికపాశవికశక్తులం బ్రతిఘటింపంగల సత్యాగ్రహ పద్ధతి సూక్ష్మదృష్టితో మహాత్ముఁడు కనిపెట్టె. 236

కం. అపకృతిసేసినఁ బాపం
బుపకృతి యొనరింపఁ బుణ్య – మొదవును జగతిం
ద్రవలేనినరుఁడు పరులకు
నపకృతి యొనరించి నరక – మందుంగుందుఁజా. 237

కం. విపులాగ్రంథములన్నియు
విపులంబుగఁదెల్పు సర్వ – విషయము లిందే
నిపుణముగ నిమిడియుండుట
నుపకృతి నొనరించి మర్త్యుఁ – డొందున్ముక్తిన్. 238

కం. సీమము నారాధించుచుఁ
గామంబును హద్దుదాఁటఁ – గానీక సదా
సోమరితనమునకుంగడు
క్షామముఁగలిగింప లేదు – క్షామము ప్రజకున్. 239

వ. అయిన నందతొక్కరీతిగనుంట యసంభవముగాన నిఱుపేదలకు సహకరించుట పుణ్యంబని. 240

కం. భూదాన యజ్ఞ దీక్షం
బేదలకున్నాయపడఁగ – వెడలి వినోబా
మోదమునఁ గొంతమేరకు
మీదలకుందోడుపడియెఁ – బ్రేమాస్పదుఁడై. 241

వ. ఈభూదానయజ్ఞదేవతకు ముఖ్యస్థానమగు శివరామపల్లెను శ్లాఘించి తానొనర్చిన కృత్యంబును సమీక్షించి– 242

తే. అది యసంతృప్తిఁ గలిగింప – నాఁగ కాతఁ
డైదులక్షల యెకరాల – నందఁ దలఁచి
యొకప్రణాళిక యాత్మలో – నుండ వెడలె
వరుస భూస్వాముల నడిగి – పడయువాంఛ. 243

వ. పాదచారియైతిరుగుచు నిర్వది యేడులక్షల యఱువదిరెండువేల యెకరములు సేకరించె. 244

తే. సొంతపొలములు లేనివా – రింతకిచట
నైదుకోట్ల ప్రజల్లల – రంచుఁ దెలిసి
యన్నియెకరాలు సాధించి – యందఱ కిడఁ
గంకణము గట్టుకొన్నాఁడు – ఘనుఁడతండు. 245

వ. అట్టి సత్పురుషుల సద్గుణంబులు చిరస్మరణీయంబులు సదాచారణ యోగ్యంబులనుచు. 246

చ. కలితజనావనాభరిత – కార్యకలాప సురూపదీపితా
చలబలశక్తియుక్తి జయ – సాధనగర్భితనవ్యదృష్టితో
నలరఁగఁజేసె సూక్తికుసు – మాన్వితనిర్మలధర్మయుక్తమై
మలయజశీతలంబయిన – మంజుల వాక్కులఁ దత్సదస్యులజ. 247

వ. సజ్జనస్తోత్రపాత్రుండైన శ్రీరాములకింతటి త్యాగబుద్ధి సహజముగ నేర్పడెనా పరప్రేరణమునఁ గలిగెనా యని శ్రోతలయం దొక్కండు పృచ్ఛింపఁ బ్రకాశ మిట్లను. అది దైవ ప్రేరణంబున నాత్మ ప్రబోధంబున

నాతనికి సహజసిద్ధంబుగఁ గలిగిన బుద్ధియ యని యనుకొనుట కొక్క
సన్నివేశము వివరింతు. రాములు విక్రమసింహపురి కరిగిన దేవత చెంచు
రాఘవయ్య వేశ్మమ్మునందవసించు. అది యాయన యాత్మకు స్వగృహం
బుగఁ దోఁచు. తద్గృహంబునందెల్ల రాతనిం దేవుఁడుగఁ దిలకింత్రు. రాఘ
వయ్య పుత్రికాపుత్రు లతనిం జిన్ననాయనా యని పిల్తురు. ఆ బిడ్డలపై
నాతనికి వాత్సల్యము మెండు. ఆ మరణ నిరాహారదీక్షకుం గృతనిశ్చయుం
డైన తత్క్షణమ యెరికిం జెప్పక వారి గీముసకేగి పిల్లల నెల్లర దగ్గఱఁ
గూర్చుండబెట్టుకొని సల్లాపముల నుల్లాసము గలిగించి ముద్దాడి పండ్లు
కొని తినుఁడని యందఱకుం దబ్బిడి తిరిగి చెన్నపురిం జేరె. శ్రీరాములు
స్వర్గస్థుఁడైన పిదప నా బాలబాలిక లాతని ఛాయాచిత్రపటముం దగ్గఱి
పటమై పోయితివా? పినతండ్రీ! మాకిఁకఁ గనబడవా? పూలు ఫలము
లీయవా? చిఱునవ్వులతో నెత్తుకొనవా? మమ్ము లాలింపవా? మా ముద్దు
ముచ్చటలు చూడవా? మేమిఁక నెవరిని జిన్ననాయనా యని పిలుతుమని
చిన్నారి చేతులెత్తి నమస్కరించుచుఁ గన్నీరు గార్చుచు బోరున నేడ్తురట.
ఐన నిట్టి దొకరు ప్రోత్సహింప మదికిం బట్టునా? పట్టిన గట్టిగ నిల్చునా?
సూర్యచంద్రు లెవరు ప్రేపం బ్రకాశింత్రు? ఎవరు పెరరేపం బవనుఁడు
వీచు? ఘనుఁ డెవ్వరు ప్రేరేపింపం జీవనదాత యగు?' అచ్చ గాంధేయ
మార్గగామియగు శ్రీరాముల స్థితియు నంతియ. 248

తే. మారణాస్త్రాల హస్తాలు – బారచాచి
క్రూరదంష్ట్రోగ్ర జిహ్వతో – నోరుతెఱచి
మనుజ మంజుల మాంసాలు – మరగితిరుగు
నపర దిగ్వాతశాంతి త – దాత్మకాంతి. 249

వ. నాపుడు సంజీవరెడ్డి సభాసదుల నవలోకించి యిదియొక సముచితో
త్సాహజనకమగు సుదినము. సర్వసృష్టి కాధారభూతుండై ప్రత్యక్ష
దైవంబు నాఁదగు జగచ్చక్షువు నిజకటాక్షవీక్షణములఁ బ్రసరించుచు
దాక్షిణ్యగతిం జరించుచున్న పుణ్యాహమిది. క్రొంగ్రొత్త పైరుపచ్చలు
రత్నగర్భకు రమణీయ రవణంబులై హావణిల్లుచున్న సమయమిది. వీ
తత్ప్రథమ శాసనసభా మహోత్సవ వార్త విని యాంధ్రలోక మానంద
కందళిత హృదయారవిందమగుచున్న కాలమిది. 250

చ. ఎలమి లయోగ్రవారి కెదు - రెక్కొడి శ్రీహరి మత్స్యమూర్తినాఁ
దెలదొర దౌష్ట్యకృత్య జల - ధిం ధృతిమై నెదురీదె గాంధి త
త్ఫలమె స్వరాజ్య మట్టె బలి - దానమొనర్చిన రాముత్యాగమే
కలుగఁగఁజేసె రాష్ట్రమని - గణ్యుల కిర్వురకేను మ్రొక్కెదన్.

ఉ. చింతిలకమ్మ నీ చరణ - సేవలుసేయఁగ దీక్షఁబూని నీ
సంతతి నిల్చియున్నది ప్ర - శాంత సమైక్యత తేజరిల్ల రా
ణింతువు రాణివై ఘనమ - నీఘను నీచరిత్ర సర్వది
గ్దంతుల దంతసీసల ము - దంబున ఘంటముతో లిఖింపఁగన్. 252

శా. ఎన్నోయేండ్లు గతించెఁ దల్లి భవదీ - యేచ్ఛానుసారంబుగా
మన్నీలాత్మజులేలి నేఁటికిటు సం - భావింపఁ బ్రాప్తించె నీ
పున్నెంబెన్నఁగ శక్యమా సుగతులం - బోధించి దీవింపుమా
పిన్నల్పెద్దలు నీకటాక్షమునకై - వీక్షింతు రశ్రాంతమున్. 253

తే. కన్నకడుపాట మామీఁదఁ - గరుణఁ జూపు
మాంధ్రమాతరో నినుఁగొల్తు - మనవరతము
పాలుపొంగిన రీతి మా - భాగ్యతతుల
వృద్ధిగావించి బిడ్డల - వేడ్కఁ గనుము. 254

ఉ. వైరి తుపాకిగుండునకు - వక్షమొసంగిన యాంధ్రకేసరీ
ధీరత సీవచోసరణి - దేశము తేజరిలన్ముదంబగుం
భారతభూమి దాస్యమును - బాప శ్రమించినవాఁడవౌట నె
వ్వారు వచింత్రు నీయనుభ - వంబును లోకహితైకదృష్టితో. 255

శా. ఇల్లున్వాకిలినాక దేహసుఖమిం - తే నెంచకర్థార్జనం
బెల్లన్లోకహితైక దృష్టినిడి దే - శైకాభివృద్ధి క్రియా
నల్లాపంబుల సంచరించుచొగి ధీ - శక్తిన్మహామంత్రియై
యుల్లాసంబునుగూర్చు నాంధ్రహరి ధ - న్యుండంచుఁ గీర్తించెదన్.

వ. ఇఁక నమరజీవి శ్రీరాముల సత్సంకల్ప హృదయదార్ఢ్య దేశసేవా త్యాగశీలాదులంగూర్చి శంకింపవలసిన పనిలేదు. విక్రమసింహపురి శ్రీ రంగనాథస్వామి సద్మంబున నెల్లలేని యిల్లింబడలుపడుచున్నతటి నాయకులు కొందఱమ్మహనీయుని హేళనచేసిరఁట. సత్యదూరముకాదు.

అత్తటి మండలాధిపతిగనున్న మలయప్పన్ రాముల గురూజీయని సంబో ధించుచు సంపూర్ణ సహాయ్య మొనర్చుటంజేసి హరిజన దేవాలయ ప్రవే శము నిరాటంకముగ జరిగె. శ్రీరాముల శరీరము సహజముగఁ బుష్టి గలిగి యారోగ్యవంతముగ నొప్పె. ముఖవర్చస్సునకుఁ జిఱునవ్వు మేలి మెఱుఁగుంగూర్చు. మాటలు కఠినములైనను సత్యములు. మనసెన్న వెన్న. అభిమానము దేహముపైఁగాదు దేశముపై. ఇట్టివానిని స్వార్థపరు లర్థము చేసికొనలేకపోవుట దురదృష్టము. భాషాప్రయుక్తముగ భారత దేశ విభజన యత్న మమ్మహావదాన్య శిరోమణి దీక్షాఫలితమే ఢిల్లీ బహిరంగసభ గాంధేయ సూత్రాచరణంబున లక్ష్యము సాధించిన త్యాగ మూర్తి యని రేణుకారే ప్రశంసించె. అమరజీవికి జోహారు లర్పించుచు నా ధీరోదాత్తు త్యాగనిరతి దేశభక్తి యనన్య సామాన్యములు కాన నాతని నెల్లకాలము స్మరింతురని పట్టాభి శ్లాఘించె. అహింసా క్షయతూణీ రమునంగల బ్రహ్మాస్త్రమును దనపైఁ బ్రయోగించుకొని యాంధ్రుల కారాధ్య పురుషుఁడయ్యె. ఈమార్గము విప్లవమునకుఁ బునాది. అప్పునాది దృఢతరమగుట కెందఱివో వజ్రసన్నిభ శల్యము లవసరములయ్యె. ఇట్టి పూర్ణాహుతికిఁ బ్రభుతయలసతయే హేతువని యాఘట్టమును వర్ణించుచుఁ గొందఱనిరి. అది యట్లుండె ఇపుడీ క్రొత్తకాఁపురము సక్రమముగ జరుపు కొని గమ్యస్థానముఁ జేరుటకు మనమేకధర్మసూత్ర బద్ధులమై చరింప వలసిన యవసర మున్నదనుట సర్వజనవిదితమగు పరమసత్యము. 257

కం ఏతఱినేఁబ్రతి మానవుఁ
డేతరిగాకుండ సత్య - మే జయమంచున్
నీతికి నిలిచిననాఁడే
జాతికి విఖ్యాత విజయ - సంపద గలుగున్. 258

కం. మన యను శబ్దము మనలో
ఘనతరముగ నాటుకొన్నఁ - గలుగు సుఖంబుల్
వినయమున నొకరిమనమొక
రనయముగ్రహియించి మెలఁగు - టత్యవసరమౌ. 259

ఆ.వె. ఎప్పు డెప్పు డంచు - నెదురుచూచిన రాష్ట్ర
ఫలము దక్కె దీని - ఫలిత మింకఁ

బొందఁ గలుగు భాగ్య - మందఱ హక్కని
కలసి మెలఁగ మనకుఁ - గలుగు విలువ. 260

కం ధ్యేయము కాదిది యయపా
ధేయము నయవినయధైర్య - ధీయుక్తులమై
శ్రేయము గమ్యమదిజయో
పాయంబున బడయవలయు - బహు శాంతముతో. 261

తే పరులకుఁ బరంబు పేర్చెప్పి - భయపడునటు
చేయుచుం దాను గలనైనఁ - జేయరాని
పనులుచేసెడి భోగలం - పటుని పల్కు
విశ్వసించినఁ దప్పదు - వెత కుడువక. 262

కం ఘన సర్పపుఁ గాటునకుం
గని పెట్టిరి మందు వృశ్చి - కపుఁ గాటునకుం
గనుగొనిరిమందు నెందును
మనుజుని కాటునకులేదు - మందీ ధరలో. 263

కం. పరులకు నపకృతిసేసెడి
దురితాత్ముఁడు కడకుఁ గష్ట - తోయధి మున్గుణ్.
జరితలదితెలుపు నిరతము
చెఱపకురా చెడెదవంచుఁ - జెప్పరె పెద్దల్. 264

వ. అధిపత్య మవినీతిపరుల హస్తగతము కానీక దేశోపద్రవమురానీక కనుగలిగి కాపాడుకొనవలసిన బాధ్యత ప్రజల కెంతేఁగలదు. తిననేర్చిన రోగము లేదు, మాటాడనేర్చిన పోట్లాడలేదన్న సామెత పరమసత్యము. అది లోపించినప్పుడే హర్షింపదగని ఘర్షణ. క్షణికోద్రేకం బేరికిం బనికి రాదు. 265

ఆ.వె. ముందు చెప్ప వినక - మూర్ఖతఁ జూపుచోఁ
గష్ట మొదవు సుఖము - గలుగఁబోదు
దూర దృష్టిలేని - దోషమంచు నెఱింగి
తడిసి గుడిసెఁ గట్టఁ - దలఁతు రెవుడు. 266

తే. ఓర్పు నేర్పులు గలవారు – తీర్పు సెప్పఁ
ద్రాసునం జూచినట్టుల - తనరుచుండు
నట్టివారి హితోక్తుల - నాలకించి
ప్రజలు నేతలు మెలఁగుట – భద్ర మనఁగ. 267

వ. కోరాపుట్టిజిల్లా నాంధ్రదేశమునం దైక్యమొనర్చుట పరమధర్మమని సోదాహరణముగ వాదించుచు మీరు గట్టిపట్టు పట్టలేదాయని సదస్యులం దొక్కండు ప్రశ్నింప “నిప్పటి రాష్ట్రము కేవల మమ్మడి మద్రాసు రాష్ట్రమునంగల యాంధ్రదేశమునకుం బరిమిత మగుట మనలక్ష్యమగు ‘విశాలాంధ్ర’కుం గడుంగడు దవ్వగుచున్నారము. సైమన్ సమాగమ సమయంబున మన మతనికి నీలధ్వజంబులం జూపుటంజేసి యమిత రోష కషాయిత నేత్రుండై మనపైఁ గసిదీర్చుకొన నతం డానాఁటి యేలికల కొనర్చిన దుర్బోధవలన వారు రాష్ట్రము మనకీక యోఢ్రుల కిచ్చిరి. హూణు లుత్కళ రాష్ట్రము నదరాబదరాగా నిర్మించుచు విశాఖమండలస్థమై యేజన్సీప్రాంత మనంబడు తెలుఁగునేల నుత్కళ లీనమొనర్చి రాష్ట్రద్వయ సంఘర్షణకు నాఁడ విషబీజమునాట నన్యోన్య హింసాకాండ ప్రజ్వరిల్ల నున్నతఱి శాంతికాముల కరుణాపూరిత వాగ్వర్షంబుల నది చల్లారె. స్వాతంత్ర్య సముపార్జనమున కాంధ్రులు చూపిన ధైర్యసాహసౌదార్య త్యాగములకుఁ గృతజ్ఞత లేకపోగా పన్నివిధముల నపకారము జరుగు చుంట యాశ్చర్యజనకము. రవి యస్తమింపని మహాసామ్రాజ్యముతో నహోరాత్రములు నిర్విరామముగఁ ద్రిశరత్కాలంబు సాయుధసంగ్రామం బొనర్చి యాంగ్లేయుల గజగజలాడించిన యాంధ్రవీరరత్న మొక్క యల్లూరి సీతారామరాజే. భారతమున నింకెవ్వండును లేఁడు. ఏజన్సీ ప్రాంతవాసులగు కోండులు, సవరలు, పొరజాలు, గదబలు, కొండ దొరలు, గొండియాలు, భోత్రాలు, కోయలు తెలుఁగు మాతృభాషగఁ గల వారే. వారికొఱకే యల్లూరి తన యుసురుఁ ధారవోసె. అట్టి మననేల మనకు లభింపకపోవుట చాల సిగ్గుచేటు. అన్యాయము. ఏతత్ప్రధాన ఫలప్రాప్త్యర్థ జిజ్ఞాసాయత్త చిత్తులమై మఱియొకసారి కేంద్రముతోఁ బోరాడవలసిన యవసరమెంతేనున్నది. 268

సీ. అజి షుహాస్త్రశస్త్రషుల – కాహుతియైనది తెల్గువాఁడు నీ
రాజనభాజనుండగుచు - రంజిలువాఁడొరుఁ డేమిచిత్ర మో
బీజము నాటువాఁడొకఁడు - ప్రేముడిఁ బండ్లను మెక్కువాఁడొకం
డీ జగమిట్టులున్నయది - యీశ్వరలీల లనూహ్యముల్గదా. 269

తే. చెన్నపురిఁ గోరి రాములు - చేరె స్వర్గ
మది లభించెడి మార్గమె – ట్లని తలంతు
నద్ది యట్టుండ నిద్దెస - కరిగి నంత
దీని సంగతి యేరీతిఁ - దేలఁగలదొ. 270

వ. అని యివ్విధంబున. 271

కం. వినయ ప్రియవచనంబుల
మనమలరఁగఁజేయ మంత్రి – మండలియెంతే
ఘనముగఁ గీర్తించెను ద
ఙ్జననాయకు రెడ్డివర్యు - స్వాంతమునందుఙా. 272

కం. ఎలరేదొర వెలుఁగు తటిఙా
నులివెన్నెల గాయుభాతి - నొడివెడివేళం
గలసఖ్యుల ముఖములనొక
కళ దొణికినలాడె హృదయ - కంజము విచ్చెఙా. 273

వ. అంత సంజీవయ. 274

కం. రోనమున కెంత నీల్గినఁ
గానింతయు ఫలములేక – కాలము గడచెఙా
మోసంబెఱుఁగక యితరులు
వేసిన పురి విప్పలేక - వెతపడవలసెఙా. 275

తే. జరిగిపోయిన దనుకొన్నఁ - దిరిగి రాదు
నడుములు బిగించి గమ్యముఁ – బడయుపొంకె
నాంధ్రకేసరి యుపదేశ - మాలకించి
నడచుటెంతేని లెస్సని – నాకుఁ దోఁచు. 276

వ. చుక్కలు దోఁచువఱకు మిణుగురులు, చంద్రుఁడు గనంబడువఱకు చుక్కలు, సూర్యోదయమువఱకుఁ జందురుఁడు నాయంత గొప్పవాఁడు

లేఁడనుకొన్నట్లు తనకంటె నధికుఁడు ప్రత్యక్షమగుపడుకు దానఘనుం డనుకొంట మూనవ స్వభావము. పరబ్రవణ శస్త్రచికిత్సలం బెక్కొనర్చితిం గాని యస్మద్వ్రణ చికిత్సా సమయంబున ననుభవించిన బాధ యెన్నం డెఱుంగనని యొకానొక వెజ్జువక్కనట్లు యీ దేశమునందయుండి నెత్తిన రెట్టవేసిన కాకినింబోలెం గొందఱు కొందఱ హైన్యమన్యు దృష్టిం గను చుండ మహాత్ముని మదిరంత బాధకలిగి యుండదు పరదేశములఁ దాన హీన భావంబునం జూడంబడ భరింపరాని వెతపడి సత్యజ్ఞానము గలిగి మానవతా వాదిగ మాఱి యస్పృశ్యతాభూతము బాఱద్రోల నడుము గట్టి యుండవచ్చు. 277

తే. ఇంటబయట సమైక్యతా - దృష్టిదనర
నేకరీతిగ సౌఖ్యము - లెసఁగ మెసఁగ
వేడ్కదీయని గుటకలు - వేసికొనుచుఁ
గాలమునుబుచ్చు మనుజులు - గలరె జగతి. 278

తే. క్రొత్తత్రోవలు ద్రొక్కంగఁ - గోరుఁగాక
మూలధర్మంబులకుఁ జేటు - మూడఁగూడ
దంటు ద్రొక్కుటకని కొమ్మ - లడఁచుఁగాక
మొదలునకు దెబ్బతగులుట - ముప్పుసుమ్ము. 279

చ. బలపడ వక్రభావము ల - పారముగాఁ బ్రజలెల్లరేలొకో
కులమునుబట్టి గౌరవముఁ - గూర్తురుగాని గుణంబు లెక్కగాఁ
దలఁపరు దానభారత మ - ధః పతనంబగుచుంట తెల్లమౌఁ
గలియుగ మిద్దిగాదు కనఁ - గల్లయుగంబుగఁదోఁచు చూచినన్. 280

మ. కలుముల్లేములఁ బాడిపంటలను భా - గస్వాములై పొల్చు వా
రలమేల్పాడక యైకమత్య మతిదూ - రంబైన యేనాఁటి వా
రలో పోషించిన యంటుదోష మనివా - ర్యంబైన శోభింతుమే
తలపైఁ దాండవమాడరే మనకిఁకం - దౌర్భాగ్యపుం దేవతల్. 281

వ. వాక్సమావేశ సంచార ధనార్జన భోగానుభవ వృత్తి స్వాతంత్ర్యముల గుర్తించిన ప్రజా ప్రభుత్వ మిది. రాజకీయలాభము లందుటలోఁ బౌరులందరు సమానులు. ఆత్మపారిశుధ్యము, ఖద్దరు వస్త్రధారణ, హరిజనోద్ధరణ మను మహాత్ముని వాణి భారతీయుల హృదయాంతరాళము

లనినదించినం బ్రయోజనంబు శూన్యంబు. అస్పృశ్యులనెడి ఘోరశాప తాపంబునం గుములుచున్న కులమునకు హరిజనులన్న యుత్కృష్టాహ్వాయమిడి యమృతహస్తములతో దీవించిన యుగపురుషుఁడు మహాత్ముఁడు. ఆచారవ్యవహారములు నియమనిబంధనలు వేషభాషలు కాలానుకూలముగ మాఱుచుండు. వేదోపనిషత్కాలముల హరిజన వ్యవస్థలేదు. ఇది పవిత్ర హిందూమతమునకుఁ గళంకము. అంటరానితనమును గెంటవలెనన్న నరబలి తప్పిపోయిన క్షుద్రదేవతవలె నెర జాఱిపోయిన సింగంబు తెఱంగున నిప్పటికిం గన్నెఱ్ఱచేయువారు గలరు. న్యాయస్థానమున ముద్దాయివలె నిఁక వారు తలవంచక తప్పదు. ఉప్పునకుం బప్పునకుం గొఱగాని యూహలనర్థకములు. 282

ఆ.వె తెలుఁగు దేశమందుఁ – దెగలెన్ని యున్నను
గలసి మెలఁగు చున్నఁ – గలుగు ఘనత
తల్లి సేవలోన – తనయులందఱుఁగూడి
పాలుగొన్న మంచి – మేలు గలుగు. 283

కం. అందిక పొందికలేమి న
నందితులై ద్యుతి తొలంగి – నానావ్యథలం
బొందిన యాంధ్రులకిఁకనిది
నందనవనమై యశేష – నందంబిడుతన్. 284

క్షం. శరధితరంగములంబలె
సరిక్రొత్తగఁ బ్రకృతిలీల – సంభవమొందున్
శరవేగంబుగ నురికెడి
పరిణామము లాఁపవశమ – పరమేష్ఠికినే. 285

వ. యంత్రాభివృద్ధి కావిరియంత్రము జ్ఞానాభివృద్ధికి ముద్రణయంత్రము సహకరించినట్లు ప్రజారాజకీయ చైతన్యమున కఖిల భారత జాతీయ మహాసభ దోహదమొసంగెననుట కితర శ్రోతలతో నిర్ణీతాసనములు నిండుటయే దండిసాక్ష్యము. మన మాతృభూమి స్వైరవిహారము సల్పుచున్న యాంగ్లాధికార మృగరాజును సువర్ణ శృంఖముల బంధించి నిజ నివాసమున కంపిన మహనీయుఁడగు మహాత్ముడు మనకారాధ్యుఁడు. అనంతరము రాష్ట్రదాతయైన రాములు పూజనీయుఁడు. 286

మ. యమబాధల్పడియేని గొందఱెటులో - యాచేత నీచేత లో
కమునెల్లం గబళింప విత్తమును లా - గంజూతురేగాని స
త్క్రమమార్గంబును ద్రొక్క రిట్టిగతి రో - క్కంబున్నచో గౌరవం
బమరం దక్కినవేలయం చదియ స - త్యంబౌన యోచింపఁగన్.

వ. రెండు లక్షలుగాదు రెండు కోట్లైన సంపాదింపవచ్చుంగాని మంచి యను రెండక్షరములు సంపాదించుట కష్టాతికష్టము ఒకరిమేలు నీవు కోరిన నీమేలు దేవుఁడు కోరు డాంబికంబుమై నెంతకే సాహసించి పురో గమించువారు కొందఱు, ప్రశాంతముగ దైవాజ్ఞకొఱకు నిరీక్షించుచు నసమర్థులవలెం గనఁబడువారు కొందఱు. దీనిం గమింపవలసిన యవ సరముగాని యవకాశముగాని సామాన్య ప్రజల కుండదు. నిరంతర కృషిమై నరుఁడు మహాపురుషుఁడు మహర్షి కాఁగలఁడు. నిర్వ్యక్రపరాక్రమ శాలికంటె దీర్ఘ శాంతుఁడే శ్రేష్ఠుఁడండ్రు. కాని యన్నియంశము లొక్క చోటఁ గూడియుంట సృష్టింగనఁబాలము. 288

తే. కొన్ని తావుల ధనమెంత - కూడియున్న
దక్కదట బిడ్డలకదేమొ - చక్కఁదనము
పూరిగుడిసెపై జిబిలిక - పూలవోలెఁ
బేదకొంపలఁ జక్కని - పిల్లలుంద్రు. 289

వ. ఎవరికేనానకుహద్దుంట ముద్దు. అద్ది లేనినాఁడు పెద్దరద్ది. ఒకనాఁటి ప్రజకుఁ గడుపునిండినఁ గైలాసము. కుడుమిచ్చినఁ బండువు. ఈనాఁటి మానవకోటికాశబలిపదాస్య పరీక్షానమయ త్రివిక్రమ క్రమమున, హరి హిరణ్యగర్భ సామర్థ్య పరీక్షానమయ శివలింగాకారంబు తెలుంగున నాద్యంతరహితంబుగఁ గనవట్టు. వ్యక్తిగతాభ్యుదయాన్వేషణముకాక సామాజికాభివృద్ధింగూడఁ బరికించుట యుత్తమోత్తమ లక్షణము. 290

తే. మిత్తిగొంగ మహామౌని - చిత్తసంగ
గిరిజ హృత్పద్మభంగ ని - క్షేదరంగ
శీర్షధృతగంగ శాశ్వత - శివతరంగ
యనయదానవభంగ ద - యాంతరంగ. 291

తే. కర్తగా భర్తగా హర్త - గాగఁ దనరి
ప్రకృతిలోఁ దానుదనలోన - ప్రకృతివెలయ

విశ్వదేవాలయంబున - వెలయుచున్న
విశ్వనాథుఁ దలంతునే - విమల భక్తి. 292

వ. అని వేఁడుకొని యంతర్బాహ్య వికారంబులకుఁ బైకుబుసీక కృతసంధా
ప్రాప్త స్వర్లోకుండగు రాముల నుతించి యిటను. రాష్ట్రమియ్యది యత
ర్కితోపనతముగాదు. కష్టార్జితము. విశిష్టఘనత్యాగవిజయము. కొండంత
శుండాలము కేసరి కలంగనఁబడంజుచ్చునంట్రడు. కాన నిత్తఱి మనకు
వలయునది యాకృతిగాదు; మనోబలము. 293

తే. కొన్ని వందలవర్షము - ల్చన్న పిదప
నాంధ్రులాంధ్రులఁ బాలించు - నట్టితరుణ
మొదవె నిదియొకపర్వమ - హోత్సవముగ
నెంచి రాష్ట్రాభివృద్ధి సా - ధించు టొప్పు. 294

తే అణుగణ మజాండమైనయ - ట్లఖిల జనులు
కలసి వసియింప దేశమున్ - ఖ్యాతి గలిగె
నైక్యతా సూత్రబద్ధులై - యలర జనులు
నిత్య కళ్యాణ నిలయులై - నెగడఁ గలరు. 295

ఉ. ఒక్కనినుండి వేఱొకని - నోర్పునఁ గాచెదమంచు వీదలం
జక్కగదువ్వి, రొక్కమొగి - శాంతముతో ధనవంతుదగ్గఱా
మిక్కిలిలాగి నేర్పెఱిఁగి - మించెడి నత్కళ రాజకీయమం
చొక్కవచస్సు జహ్వారనె - యున్నయథార్థము స్వానుభూతితో. 296

వ. దానంజేసి సర్వజనాభ్యుదయదృష్టిం గృషిసల్పుట రాజకీయ
ధర్మము. రాజ్యసభ రాజకీయ మత సాంఘికాదుల కతీతముగ వర్తింప
వలయునని నవభారత స్మృతికర్తలగు నెహ్రూ పటే లంబేత్కారాదుల
యభిప్రాయము. అది నిష్కళంకముగ నాచరణరూపము ధరించుట
వాంఛనీయము. జనం జట్టమొక్కటే సర్వవిధముల సంపూర్ణముగఁ
జక్కజేయఁజాలదు. సత్యాన్వేషణదృష్టి ప్రజానీకమున నభివృద్ధిచెంది
నీతి నయ వినయములు స్థిరపడినంగాని దానికి జీవకళ కలుగదు. కాన
నీ సభ మానవ ధర్మాధర్మముల మున్ముందు ముచ్చటించుకొంట సము
చితమే. మనుజుఁడు సత్యధర్మముల మంటఁగలిపినఁ బాలకుఁడేగాదు పర
మేశ్వరుఁడుగూడ నేమిచేయలేఁడేమో. 297

తే. అనుభవజ్ఞులు వలదన్న - యట్టి పనుల
నజ్ఞుఁడొనరించి సంతస - మందలేఁడు
కర్తరిం దారువులు చెక్కి - కట్టి నట్టి
యింటివలె నష్టదశనొందు - టే నిజంబు. 298

వ. ఎంతబలవంతుఁడే జ్వరపీడితుండైన హీనసత్త్వుఁడగుంగదా! ఎంత సుభిక్షదేశమే దుష్టశక్తులు విజృంభించినఁ బతితోన్ముఖమై బాధాకరముగఁ బరిణమింపక తప్పదు. పద్యబోధనమున వ్యాకృతి వివరణము రసాస్వాదనశక్తిని గుంటువడఁజేయున ట్టభిప్రాయభేదజనితాంతఃకలహము స్వరాష్ట్ర సముద్ధరణశక్తిని వక్రగతి కీడ్చు. దాన భద్రతనశించు. స్వార్థమడంచి పరమార్థము పెంచి మాతృరసావికాసమునకు దీక్షించిన.

మ. భవబంధంబులు ద్రెంచుకొన్న భగవ - ద్భక్తాగ్రగణ్యుండునా
నవనాంతంబున దైవదత్తపరభా - స్వత్కర్తనా నొప్పఁగా
శివకారుణ్య కటాక్షవీక్షణ రమా - శ్రేయఃప్రభాభాసమై
నవచైతన్య కళావిలాసముల గ - ణ్యంబౌను రాష్ట్రంబిఁకన్. 300

వ. అనం గోటిరెడ్డి యందుకొని సూర్యుఁడు లేనిచో సృష్టిలేనట్లు ప్రొపెల్లరు దిరుగనిచో విమానగమనములేనట్లాహారము లేనిచో మానవ జీవితము లేదు. 301

తే. అన్నిటికిముందు ప్రాణి యా - హారమునకె
వెదకికొనుచుంట విశదము - విశ్వమందు
నన్నమె ప్రధానమగుట మ - హాత్ములాత్మ
నెఱిఁగి నాటికి రైతె వె - న్నెముక యనిరి. 302

చ. అఱకొఱతిండిఁ గండలెటు - లబ్బు నిఁకబ్బురమైన యుబ్బు ని
బ్బరముగ నెట్లుగల్గు హృది - భారము తీరుటయెట్లు కాన సం
బరముగ సర్వసస్యముల - పారముగా ఫలియించు పద్ధతుల్
ధరణికిఁ గూర్చినం దెలుఁగు - ధాన్యపురాసులు మింటినంటవే. 303

తే. అభ్యుదయకర్షకాళిశ్లేష్మముం - దంజవేసి
శాస్త్రవేత్తల సహకార - సత్త్వగరిమఁ
బంట లభివృద్ధి గావించి - మంటినుండి
మణులు పెకలించి సెట్టి నం - బరమువలయు. 304

తే. ఆనకట్టలు కట్టించి - యాపగాజ
లాలు క్రొంగ్రొత్త పొలముల - కోలి నొసఁగి
క్షేత్రలక్ష్మికిఁ బచ్చని - చీరలిచ్చి
కర్షకులమేలు చూచుట - హర్షదంబు 305

చ. ఎలుకలఁ బందికొక్కుల ని - టేల సృజింతివయ్య పెక్కు పై
రుల పలుధాన్యరాసులను - రోజు హతంబొనరించుచుండె మా
కలఁతను మాన్పవా కరుణఁ - గానవ వానిప్రయోజనంబెదో
తెలియఁగ శేము నష్టములు - దెల్పితి దైవమ యాలకింపుమా. 306

వ. అని దేవుని నిత్యము ప్రార్థింతు. 307

ఆ.వె. నిసుగుఁ గనిన యంత - ప్రసవవేదనయెల్ల
మఱచిపోవు నట్టి - మాతవోలెఁ
బండియున్న నిండు - పైరుఁ జూచిన రైతు
శ్రమను మఱచి చాల - సంతసించు. 308

తే. హీనపోషణ మనుజుని - దీనుఁజేయుఁ
గానఁ బంటల నభివృద్ధి - పఱచుటొప్పు
సస్యరక్షణ పథకము - ల్సరిగ జరుగ
ధాన్యమందిరమై యాంధ్ర - ధరణి మెఱయు. 309

వ. అర్వదియాఱు కూరలావుచంటనున్నవన్నట్టష్టైశ్వర్య దేవతలకు హాలమ నిలయము. మంటిలోమానెఁ డింటిలోఁ బుట్టెఁడన్న సామెత సార్థకమగుట సంతసము. 310

కం. ఆపాటు పాటు దప్పిన
సాపాటున కెంతొలోటు - సాజము జనతా
కోపాటోపకరంబది
కాపాడుకొనంగ లెస్స - గా కృషినెప్డున్. 311

తే. ఒరులకున్నదియని యేడ్వ - నొక్కకన్ను
దనకు లేదని యేడ్వఁగాఁ - దక్కినకను
బోయెనని వృద్ధులంద్రది - బుద్ధి నెంచి
కృషిని నమ్ముట శుభదము - కీర్తి కరము. 312

వ. ఒడలువంచి పనియొనర్పఁ గడలులేసి సిరులబ్బు. 313

ఆ.వె. అఖిలమానవతతి – కన్యోన్యసహకార
బుద్ధిశూన్యమైన – వృద్ధిలేదు
చేయిచేయి కలిపి - చేసినకృషి కెంతొ
బలముచిక్కు గొప్ప - ఫలము దక్కు. 314

వ. గ్రామదేవతనుండి దక్షిణభారతమును దృఢతరదీక్ష రక్షించిన కార్యదక్షుఁడు సర్. ఆర్థర్ కాటన్ మనకుఁ జిరస్మరణీయుఁడు. అట్టి వారలే యిహపరసుఖంబులఁ జూఱఁగొనఁగలరు. 315

చ. జనహితకృత్యముల్సలిపి - సజ్జను లార్జనచేసి పుణ్యముల్
తనువులువీడి నాకమున – ధన్యత మాన్యత దేవగాయకా
గ్రణిఘనగానముల్వినుచుఁ – గ్రమసువాద్యములొప్ప నప్సరో
గణకృత నృత్యముంగనుచుఁ - గాలముఁ బుత్తురు సంతసంబునన్.

వ. ఇట్టి సమయంబునఁ గృతజ్ఞతం దెలుప సమరజీవికి జోహారు లొనర్చుట ముఖ్యధర్మము. 317

తే. సుగుణరత్నాకరుఁడు యశ – శ్శోభితుండు
దండిమగటిమిఁ దనరును – ద్దండదేశ
భక్తుఁడలరాష్ట్రదాత శు - భప్రదాత
లక్ష్యసాధనసిద్ధి త – ల్లలితబుద్ధి. 318

ఉ. జాతికి ఖ్యాతిగూర్పఁగల – జన్మమె జన్మము లోకమాన్య మీ
రీతిగ నీతికిన్నిలిచి - రేవగలాత్మఁ దపించి రాష్ట్రపుం
దాతగఁ బేరుగాంచితివి – ధన్యుఁడవైతివి రామనామ నీ
చేఁతకు నివ్వెఱంబొరయుఁ – జేతమగాధవిచారదృష్టితో. 319

వ. నావుడు తెన్నేటి యిట్లను. ప్రభుత్వమొక నైతిక సంస్థ. రాజ్యమున నాహారశూన్యతంగాని యౌషధము లేమింగాని యొక వ్యక్తియే మరణింప కుండునట్లు రాజు శ్రద్ధతీసికొంట ముఖ్యమని యాపస్తంబుఁడు లిఖించిన విషయము గమనార్హము. భారతమునం బ్రజాసత్తాకగణరాజ్యములు మున్ను గలవని వైదికబౌద్ధ గ్రంథములేగాక గ్రీక్ రచనలును దెలుపు చున్నవి. అత్యంత ప్రాచీనయుగమునఁ గులములు న్యూనతాధిక్యతలు లేవని యందఱైశ్వర్యవంతులుగనుంట యద్దానికొక కారణమని విష్ణు

వాయుపురాణములు ఘోషించుచున్నవి. నడుమవచ్చిన యీ యస్పృశ్యతా జాడ్యముం బోఁగొట్టినంగాని దేశమారోగ్యస్థితియందుండదు. అట్లుకాదేని నూత్నయుగమున వెన్నువిఱుచుచున్న నవనాగరికతకు దెబ్బతగులు. 320

కం. శ్రేయోహానికి మూల ము
పాయవిహీనంబు గానఁ - బావన మతితో
న్యాయంబున నస్పృశ్యతఁ
బాయం భారతము వృద్ధిఁ - బడయుఁ జరగఁ జ. 321

తే. సమతఁ గోరు మహిళల వ - చస్సు వినఁగ
నదియు నొక న్యాయముగ మన - మదికిఁ దోఁచు
స్త్రీలు పురుషులు సములని - చెప్పుట కిఁక
నర్ధనారీశ్వరుండె య - త్యంతసాక్షి. 322

వ. అనవుడు. 323

కం. వేదికమీఁదఁ గనఁబడు ని
వేదిక మనసారఁదెల్పు - వేదన జనతా
మోదముగ మోదముగ శుభ
నాదముగా ఫలిత మిచ్చు - నా యిఁకనిచటఁ జ. 324

వ. అని యొకండు ప్రశ్నింప మనమెల్లరము దానికిఁ బ్రయత్నింప వలయు. పిదప సర్వము దైవాధీనము. 325

తే. చెప్పనేటికి జీవుల - జీవితంబు
నవరస విలాస భాసుర - నాటకంబు
చూపఱకుఁ గానరాకుండ - సూత్రధారి
మాయతెఱఁడాగి నడపు న - మ స్త నటన. 326

తే. పంచభూతములం దేది - మించి యడర
సృష్టి సర్వము క్షణములో - భ్రష్టమగును
హద్దుమీరక వర్తింప - నమరు సుఖము
ప్రకృతి శక్తుల నడఁప నె - వ్వరికి వశము. 327

సీ. పాపము పండినం బవన - వర్షమహోగ్రవికార సృష్టిచే
రూపముఁ బాపు కోపమున - రూఢిగ దైవ మనంతశక్తిచేఁ

బాపఁగరాని శిక్షయని - భావనసేయుఁడు మానవుండు త
చ్ఛాపము సత్ప్రవర్తన వ - శంబునఁ దక్క శమింపదెన్నఁడుఁ౯.

చ. వినయ మదృశ్యమయ్యె నవి - వేకము గౌరవనీయమయ్యెఁ బా
వనమగు దైవభక్తి యతి - భారముగా నెదనెంచనయ్యె స
ద్గుణములు శక్తిహీనముల – చందముగాఁ గననయ్యె నెట్టులీ
జనభువనంబు శాంతిశుభ – సత్యపథంబును ద్రొక్కనేర్చునో. 329

వ. అని సజ్జనులు చింతింతురు. బాహ్యాంతర్భాగవికాసమే మానవతా పరిపూర్ణత యని తత్వజ్ఞులంద్రు. నేతలు జాతీయ సమైక్యతా భావఫలములఁ బ్రజలకు వివరించి సంక్షేమ కార్యక్రమోన్ముఖులుగ నొనర్చి వికేంద్రీకృత ప్రజాస్వామ్య వ్యవస్థా ప్రాథమిక ప్రయోజనాళిం బ్రబోధింపవలయు. ఆశకు దాసుఁడైనవాఁడు లోకమునకెల్ల దాసుఁడు గావలయు. ఆశ యెవనికిఁ దాసియగునో వానికి లోకులు దాసులగుదురు. లోపమొనర్చి జగమెఱుంగునేమోయని మీగడ మ్రింగిన మార్జాలమువలె గళధ్వని మార్చినఁ బ్రయోజనములేదు. అట్టి క్రియం బ్రదర్శించుట కుతూహలమును హాలాహలము సేయుట. 330

మ. కలకాలంబిటు కష్టవారిధుల ము - న్గన్నేఁటికే నిట్టుగాఁ
గలిగెఁ౯ రాష్ట్రము రాముత్యాగమహిమం–గాంక్షింప నక్కేంద్రపుం
బలమెంతేలభియింప నిత్యజలసం – పత్తిఁ౯ లతారీతిగాఁ
బొలుపొందంగలరింక నాంధ్రులు స్వరా–డ్భోగాత్తముద్భాసులై. 331

కం. స్థిరజీవన లక్ష్యవ్రత
భరితనిరత భాగ్యసౌఖ్య – బంధురరీతిఁ౯
వరకీర్తిలతావర్ధన
పరులై ప్రజలుంట మంచి - పద్ధతి యనఁగఁ౯. 332

వ. ఆత్మపరీక్షలకుం గుఱిసేసినం దల్లి నోటినుండి వెలువడిన జోలపాటంబోలె శ్రోతలకమ్మాట లానందంబు గలిగించె. అంతం బట్టాభి రామారావు. 333

తే. పల్లెపల్లెల వెలసిన - బళ్ళు గుళ్ళు
జ్ఞానమును భక్తి నభివృద్ధి – పఱపవలయు

సకల జనతతి దేవుని - సంతతి యని
మతవిరోధములను రూపు - మాపవలయు. 334

వ. అన్యభయరహితంబైన విద్యాధనంబే ధనంబు. విద్వద్వరేణ్యుతో విద్యావిహీనుండు సాటియగునా? రాజహంసము లీడుచుండు మానస సరోవరమునకుం బొట్టిబాతులు పోఁగలవా? కావున మహాత్ములు మహాత్ములే యధములధములేయండ్రు బుధులు ఎవరెట్లాడిన నూకయూకే నూకనూకే. 335

చ. తెలివి యొకింతలేని యొక - దేబెను సత్కవిరాజుఁజేయ ని
శ్చలతరదీక్ష రేవగలు - సాధనచేసి యొకింతయేని స
త్ఫలమును బొందఁజాలఁ డిది - తథ్యము సృష్టిఁగనంగ మాటలం
జిలుకకు నేర్పవచ్చుఁ గృషి - చేసినఁ గాకికి నేర్పఁజాలునే. 336

వ. అట్లని యూరకుంట యనుచితము. సార్వజనీన నిర్బంధోచిత ప్రాథమిక విద్యా శాసన మవసరము. మనకు రాష్ట్రము వచ్చినను మాండలిక పరిపాలనాధికార పట్టి మొక్కనికే లేమింజేసి తత్స్థానంబు లన్ని యన్యుల కీయవలసి వచ్చెనని పట్టాభి విచారపడెఁగదా. ఆ లోటును మనము వేగఁదీర్చి కొంత యాత్మగౌరవమును గాపాడుకొనుట. 337

కం. విద్యుత్స్రష్ట్ర్యభివృద్ధిని
సద్యఃఫలసాధనముల - సాధింప భువీ
హృద్యంబగు రాష్ట్రం బన
వద్యసుఖానందలీల - వర్ధిలుఁ గాతఁ. 338

వ. అన సభ ముగిసె. అంతంగతిపయ దినంబులకు రాముల జయంత్యుత్సవ సందర్భమునం ద్యాగరాయనగరమున. 339

తే. చెలువుగుల్కు శ్రీరాముల - చిత్రపటము
పూలపల్లకిలోఁబెట్టి - పూలమాల
వేసి యుత్సవ మొనరించు - వేళఁ బ్రజలు
సచ్చరితుఁడంచు హారతు - లిచ్చిరెలమి. 340

ఇయ్యది శ్రీమదాంధ్ర మహాభ్యుదయ ద్వితీయ భాగమున
ఏకాదశ ప్రకరణము సమాప్తము.

# తెలంగాణా స్థితిగతులు

వ అంతనొక్కనాఁడు సంజీవరెడ్డి యాంధ్రకేసరిం గని విశాలాంధ్ర దేశమునకు హైదరా బాదు రాజధానీ నగరముగ నేర్పడువఱకు మనము చెప్పకొట్టరాదు. ఇవ్విషయ సమస్యను శీఘ్రముగం బరిష్కరిం పక కేంద్రము తూష్ణీంభావము వహించుట కేమి హేతువు. ఆంధ్రులంద ఱొక్కటే యను ప్రధాన సూత్రమునకుం గట్టుబడకుంటకుం గారణమేమి? ఇది యెవరి లోటనఁ బ్రకాశ మిట్టను. 1

తే. అడిగితివి మంచి ప్రశ్న ని – ట్లాదరమునఁ
గ్రొత్త సంసారమిది లోట్లు – కొన్నియుంట
సహజమనుమాట నిక్కమీ – జగతి నేది
పుట్టువుందొట్టి పూర్ణతఁ – బొందఁబోదు. 2

వ. ఇచ్చటి చరిత్ర సర్వంబు నెహ్రూ యెఱుంగు. కాని యతండు వైళమ తగిన చర్య తీసికొనఁ జాలకుండె. ఇందాదినుండి మన దృక్పథమునఁ గాని భారతీయాగ్రనాయకుల చర్యలంగాని లోపం బణుమాత్రంబే శూన్యంబు. తత్సంశయ విచ్ఛేదనార్థంబు తచ్చరిత్ర ముఖ్యాంశముల నుద్ఘాటింతు. మున్ను నిజాము రాజ్యమున రాజాజ్ఞలేనిదె బహిరంగ సభలు జరుపరాదను చండశాసన మొండుండె. కాన రాజకీయ సదస్సులు తత్ప్ర దేశమునకు బహిఃప్రదేశమున జరుపుకొనవలసిన దుర్గతి యుంటంజేసి ప్రథమ మహాసభ కాకినాడలో ద్వితీయ మహా సమజ్య బొంబాయిలో జరుగం దృతీయ సభ చారిత్రిక నగరంబగు పూనాలోఁ గేల్కర్ మహా శయుని యాధ్వర్యపమున* నిర్వర్తింపఁబడ నందు సుభాషచంద్రబోసు పాల్గొని నిజాము గద్దె తద్దయుం దద్దరిల్ల నిజవాఙ్ముఖ సింహగర్జనం బొనర్చె. దాని సారాంశ మేమన యాపద్భారతంబున హైదరాబాదుం గూర్చి తీవ్రతరాందోళన జరుగుచున్నది. ప్రజాస్వామ్యపరిపాలన హైంద వమునందెల్ల నెలకొల్పుటయ భారత జాతీయ మహాసభాధ్యేయము. శ్వేత

* 1928 లో.

జాతి పాలిత ప్రాంతంబునందుంబలె సంస్థానంబులందును నిరంకుశపాలన ముంటం దానిం బ్రతిఘటింపం దదధీశుల సింహపీఠచ్యుతులంజేయఁ బ్రజ లఖంగ సంగర రంగంబున కుఱుకందగు. వ్యక్తి పత్రికా సమావేశ స్వాతంత్ర్యంబు ప్రసాదించునదియ హక్కుల ప్రకటన మనంబడు. అయ్యది యిందన్క జరుగమి సంస్థాన ప్రజానీకమునకు సానుభూతిం దెల్పుటయతక్క యెట్టి సహకారముం గాంగ్రెసు చేయలేదంట నగ్న సత్యము. దానికిం గారణ మది హూణులతో నిరంతర ఘోర రణ మగ్నమై యుంటయ బ్రిటీషిండియానుండి సంస్థానముల వేఱుసేఁత కృత్రిమ రాజకీయ వ్యూహమని నొక్కివక్కాణింతు. యావద్భారతదేశ మేకైక ప్రజాస్వామ్య పరిపాలనమున నుంటయె వాంఛనీయము. దానికిఁ దృఢతరయత్న మగ్నమానసుల మగుచుంటిమని సంస్థాన ప్రజల కతం డానాఁడభయ మొసంగెననె. ఇప్పు డాంధ్రనాయకుల దృష్టి తెలంగాణా వైపునకు మరలినది గాన దాని పరిస్థితి యాదినుండి నేఁటివఱ కెట్లున్నదన. 3

ఉ. ప్రాఁతపథంబులెన్నొ బహు – భంగులఁ దోఁచు మతైకదృష్టియా
పాతరలాడు దుర్జనుల – బాధలుమెండు తలంప న్యాయమా
పూఁతపసిండి శ్రేయమెటు – మ్రొగ్గునొ దేవుఁడెఱుంగఁగు కళా
జ్యోతులు స్వల్పతైలములు – చోద్యము తజ్జన జీవితంబిలన్. 4

ఉ. కాకులఁగొట్టి గ్రద్దలకుఁ – గాపురుషుండిల వేయునట్టుగా
భీకరలీల నన్యులను – భీతిలఁజేసి గడించినట్టి యా
రూకలు కొన్ని పెద్దలకు – రూఢిగ నందఁగఁ జేయువారలున్
వాకొననేల యుండిరట – వారల చర్యలు చిత్రమౌఁగదా. 5

కం. ఎనుబది యెనిమిది శాతము
జనులట హిందువులు వారి – సౌజన్యంబున్
ఘనముగ నెంచక నైజా
మనయము మతదృష్టితోడ – నవలోకించున్. 6

ఆ.వె. చీలదీసి ప్రజలఁ – బాలించు పద్ధతి
నాంగ్ల పతులనుండి – యతఁడు నేర్చి

వారి యండ దండ – వర్థిల్లు చుండు న
వాఁబు పూర్వజన్మ – భాగ్య మనఁగ. 7

ఉ. తొంబదియైదుశాత మఁటఁ – దోతురు తెల్గులు కాని యుర్దులో
నంబరమందుచుం జదువు – సాగఁగఁ జేయుప్రభుత్వ మచ్చటన్
శంబలమేమి చెప్ప నతి – సాహసలీల యసంగఁ జెల్లదే
యంబరపుష్ప మింక నట – నాంధ్రపుష్పై పెరిమన్ వెలార్చుటల్. 8

చ. కరుణకుఁ దావుమృగ్య మొగిఁ – గాంచఁగఁ బౌరుల హక్కులన్నియున్
సరిగనశించిపోయెను ని – జాము నిరంకుశపాలనంబునం
దరయఁ బ్రజాళి లోకవిష – యంబున జ్ఞానముతక్కువౌటచే
ధరణిధవుండు చెప్పినదె – ధర్మముగాఁ దలయొగ్గునచ్చటన్. 9

తే. ఆంగ్ల పరిపాలనంబున – నాది హూణు
లెంతగౌణముగాఁ దెన్గు – నెంచినారొ
యంతకంటెఁ దక్కువదృష్టి – నాంధ్రభాషఁ
జూడఁగలిగె నవాబది – చోద్యమరయ. 10

కం. ఏగతిఁ బరికించిన ద
ద్భాగంబునఁ దెనుఁగడంగెఁ – బ్రజలన్నిఁకన్
సాగెటుఁగరు తగురీతిని
నాగరికత పెరుఁగలేదు – నవనవ గతులన్. 11

ఆ.వె. తెలుఁగు భాష యెంత – దీనదశంబడెఁ
గలదె మంచి రోజు – తెలుఁగునకని
తల్లి బాస మీఁదఁ – దగినంత ప్రేమను
జూపు వారు పలుప – నోప రైరి 12

ఆ.వె. రాజు దలఁచుకొన్న – రైతుల గతియేమి
యన్న వాక్కు నిక్క – మయ్యె నకట
యున్నమాట యన్న – నులుకెక్కువౌనని
యూరకుండి రచట – నున్న ప్రజలు. 13

కం. నూటికి నైదుగు రేనట
నాటవికులరీతి నక్ష – రాస్యులు లేరే

నాఁటికి నున్నత విద్యలఁ
బాటుపడి జయంబు వారు - పడయుంగలరో. 14

కం. పాలన శాఖలు గలవవి
యేలిక పలుకునకు లొంగి - యేలుచునుండుం
గాలగతి యెటుల మాఱునొ
ఫాలాక్షుం డెఱుఁగుఁగాని - పరులెఱుఁగుదురా. 15

తే. ఆనకట్టలు కట్టించి - యతిరయమున
మంచిపంటలు పండింప - మార్గ మున్న
జరుగలేదట్టికృషి యట - శ్రద్ధతోడ
నెన్నికల హక్కు మందున - కేనిలేదు. 16

తే. సర్వవిధముల బంధించు - శాసనంబు
లడ్డు గోడలుగాఁ గట్టి - నట్టు లుంటఁ
బ్రజల చైతన్యమును వృద్ధి - పఱచునట్టి
రాజకీయము తెలియఁగా - రాని దచట. 17

వ. నవాబుల రాజకీయార్థిక సాంఘిక భావదాస్యంబును బ్రజలు రాను రాను సహింపఁజాలక పోయిరి. జమీందారుల పద్ధతికి వ్యతిరేకముగ నాంధ్రులు సాగించుచున్న ప్రజోద్యమమును గని వారట్టి కృత్యంబున కుద్యమించిరి. మాడపాటి హనుమంతరావు నాయకత్వమునఁ బాఠశాలలు గ్రంథాలయములు పత్రికలు స్థాపింప దచ్చర్యలకు దొరతన మనేక విఘ్నములు గలిగించె. 18

చ. కులధరలెల్లఁ గ్రుంగిన న - కుంఠిత దీక్షను మానమంచు వే
బలమును బుంజుకొంచు బహు - భంగుల సంఘపురోభివృద్ధికై
నిలిచిరి పౌరవర్యు లతి - నీతి వినిర్మల కార్యకర్తలై
విలయమునే నెదిర్చి నర - విం జయమందఁగ మోదమొందఁగన్.

కం. చైనాగోడను గట్టెం
గానీ తొలిదిక్కునుండి - గాఢతరముగా
మానక వీచెడి గాలిని
దానట మాన్పన్ నవాబు - తరమా బలిమిన్. 20

తే. ఆంధ్రజాతీయ చైతన్య - మద్భుతముగ
వృద్ధిపొందెను బెద్దల - శ్రద్ధచేత
నాంధ్రజనసంఘ మొండు ముం - దడుగు వేసి
వెట్టిచాకిరి మాన్పించెఁ - బట్టు పట్టి. 21

వ. నవాబు ముస్లిముగుటఁ దస్మతస్థులకెల్లం బాలకజాతి యని నామకరణం బొనర్ప మతదురహంకారంబు హెచ్చె. ఇత్తెహాదుల్ ముసల్మీను సంస్థ నొకదాని స్థాపించి యవనుల ప్రత్యేకమైన హక్కులకుఁ బ్రమాదము వాటిల్లుచున్నదని యుద్రేకము గలిగించి ప్రజోద్యమము నెదుర్కొనంజేసె. ఆర్యసమాజ మచటి హిందువుల దుస్థితి నాకళించుకొని వారల కైక్యత ఘటింపఁజేసి మతతత్త్వమును బురికొల్పె. తెలంగాణా కాంగ్రెసును నవాబు నిషేధింప నది సత్యాగ్రహముచేసె. ద్వితీయ ప్రపంచ సంగ్రామ వ్యాజమ్మునఁ బ్రభుత్వ మధ్యాదేశాస్త్రములం బ్రయోగించె. ఆస్థాన రక్షణార్థము వేలకొలంది 'రజాకార్లు' సిద్ధపడిరి. వారొనరించిన ఘోరకృత్యములు వర్ణింప వశముగాదు. 22

చ. ఎఱిఁగి యెఱుంగనట్టు నటి - యించెఁ బ్రభుత్వము పక్షపాతపుం
దురిత మహాంధకారమునఁ - దోఁగి సహించెను హింసలన్నియుం
గరుణ యొకింతలేని జన - కంటకు పాలన మేలుగూర్చునా
హరహర యేదిదారి యని - హైందవు లత్తఱి నంగలార్పఁగన్. 23

ఉ. ఆలరు లగ్గిపిడ్గులయి - హైందవులన్వెస వేఁటలాడుచో
జాలిగఁ జూచి తత్ప్రభుత - సత్వర చర్యలఁ బూనదేల యీ
పాలన నిల్చునా పరుల - ప్రాణము దీయుటకే మతంబొకో
శీలములేని మానవుని - ఛీ యనరే పరమార్థకోవిదుల్. 24

తే అందఱము భారతీయుల - మనెడి మాట
మఱచి మారణ హోమ క - ర్మంబు రేఁగ
నపుడు జరిగిన క్రూరకృ - త్యములఁ దలఁపఁ
గడుపు చెఱువౌను బొమ్మరా - కాసికేని. 25

వ. భారతము సంపూర్ణ స్వాతంత్ర్యముం బడసినంత మీ సంస్థానంబు భారతపాకిస్థానంబులం దెద్దానింజేరుటకేని ప్రజాభిప్రాయముం దీసికొమ్మని మౌంటుబాటెన్ నవాబునకుంజెప్ప నతండద్దాని కంగీకరింపక భారత

మునఁ గలియుమన సమ్మతింపక పిదపం దన సైన్యాధిపతియగు సర్ వాల్టర్ మాన్టన్, సర్ సుల్తాన్ అహమడ్ ప్రభృతుల నంప సంస్థానము పూర్వమున్నయట్లయుంట కుభయపక్షములవా రంగీకరించి లిఖించు కొన్న పత్రమును ఖాశిం రజ్వీ ప్రేరణమున నవాబొప్పుకొనక పాకి స్థానమున లీనమగుటకు యత్నింప నది నైజామునకే కీడని యించుక యాగ్రహించి రాజప్రతినిధి యతని కిట్లనియె. 26

ఉ. ఎంత యధర్మమార్గమున - కీవరుదెంచినఁ దక్కదింక నా
వంతయు లాభ మిద్ది పరి - హాసముగాఁ బరికింతువేమొ నీ
స్వాంతము ఖడ్గమొక్కటియె - సర్వము దీర్చునటంచు నెంచు నీ
పంతము సర్వదా దమన - పద్ధతి కొగ్గెడుఁ దగ్గు మిత్రుఁడా. 27

తే. పెద్దదేశము భారత - పృథ్వియనఁగ
దాని గర్భంబునందుండి - తలఁతె యిట్టు
లెంత రొదసేసి యెగిరిన - నెన్నఁ డేని
తీక్ష్ణతుండము దంతికి - దీటగునొకొ. 28

ఉ. భారతమన్నఁ జుల్కనగ - భావనసేయకు మస్త్రశస్త్రసం
భారమునందు నయ్యది య - పారము భారము నీకెకాదు నీ
వారెవరేని వచ్చినను - ఖండన పొందితిఁ జూపి గెల్చి యే
తీరును తీఱు నీ దురద - తెల్పితిమున్నుగ మేలుగాంచుమా. 29

తే. ఉక్కు తునకలు భారత - యోధులెల్ల
తొలి ప్రపంచ రణంబునఁ - దోఁచె వారి
సాహసోపేత కృత్యముల్ - శౌర్యధైర్య
మహిమ లవ్వానినెన్నఁడు - మఱచిపోము. 30

చ. చెలిమియె గొప్పదంచు నినుఁ - జెంతకుఁ బిల్చి వచించుచుంటి నా
పలుకులునమ్ము వారుపెఱ - వారలె యందఱు భారతీయులే
కులమత భేదముల్మఱచి - కూరిమి నొందొరులుండ మెండుగా
బలమొనఁగూడు మీకు నిర - పాయముగా మనుచుండ్రు నిచ్చలుఁడా.

తే. ఎంతొ నీమేలుగోరి నే - నింతవఱకు
బహువిధంబులఁ జెప్పిన - పల్కు లన్ని

కఱపులఱపుల మెఱపులన్ - కరణిలెక్క
సేయకుండిసఁ దీఱని - చేటుగలుగు. 32

ఉ. ఒద్దిక సంధిచేసికొను - టొప్పను గ్రోధము కీడుతెచ్చు నీ
కిద్ది సుధీంద్రులాడినది - వృద్ధుల సుద్దులు వెన్నముద్దలం
చద్దివినంగఁ దద్ద శుభ - మంచు నిజంబుగ రెండు పక్షముల్
పెద్దగ నొద్దె వృద్ధియయి - పేరిమిఁ గూరిమిఁ గూర్చు మీకిఁకన్. 33

తే. అలప టేలస సామాన్యుఁ - డనుకొనకుము
వజ్రసంకల్పుఁ డనఘుఁడ - పారబలుఁడు
శౌర్య సాహసయుతుఁడయ్యు - శాంతిపరుఁడు
జగమెఱుంగుఁ దన్మనోధృతి - జగమెఱుంగు. 34

వ. అని హెచ్చరింప ఖాశింరజ్వీ పటేలు సన్నిధి కేగి "హైదరాబాదు స్వతంత్ర ప్రతిపత్తి నెట్టిస్థితిం గోల్పోవదు. ప్రజాభిప్రాయ సేకరణ జరుగవలయునన్న ఖడ్గమే ప్రత్యుత్తరమీఁగల" దని పల్కె. 35

తే. ఇట్టు ఖాశిమురజ్వీ ని - జేచ్చఁ దెలుప
శివునిపూజకు గేతకిఁ - జెల్ల నట్టు
లప్పటేలున కమ్మాట - యొప్పకున్కి
శిరము పంకించి యతనితోఁ - జెప్పె నిట్టు. 36

ఉ. పెత్తనమున్నదంచుఁ బ్రజఁ - బ్రేషుడిఁ జూడక పక్షపాతపుం
జిత్తముతోడ మొత్తె నది - శ్రేయము గూర్పకచేటు గూర్పదే
కత్తులబోనువంటిది జ - గంబున రాచఱికంబు సాగెనా
మెత్తనిబండి కానియెడ - మిత్తికి నొత్తెడి సత్తి యారయన్. 37

కం. అని పలికిన వినకాతఁడు
కనలుచు నిలుసేరి యెద్ది - కార్యంబనుచుం
దనవారలతో వెన మం
తనములు సాగించుచుండెఁ - దామస మెసఁగన్. 38

వ. ఇన్ని భేదాభిప్రాయములతో హైదరాబాదున్నట్లుయుంట కంగీకృతి జరిగె. పిదప సర్దారు పటేలు విషయపరిశీలనార్థము మౌంటుబాటెన్ సన్నిధి కరుగ నాతండు. 39

ఉ. అమ్మెయిఁ దానవాబునకు - నాదృతిఁ దెల్పిన పల్కులన్నియుఁ
నెమ్మదిగా పఠించు తఱి - నిక్కము చల్లఁగ మెల్లమెల్లగాఁ
దెమ్మెర వీచినట్టు పువుఁ - దేనియ నాలుక కద్దినట్టుగాఁ
గమ్మనివీణె మీటినటు - గా ముదమిచ్చెఁ బటేలు బుద్ధికిఁ. 40

వ. కమ్మని తెమ్మెరకు జుమ్మసలేచి తేఁదమ్మిపై[వాలు తుమ్మెదవలెం బటేలు దృక్కు మౌంటుబాటెన్ ముఖముపై[వాల. 41

తే. భావి గమనించి లోకసా - భాగ్యమెంచి
చెప్పితివి చిన్నబిడ్డకుఁ - జెప్పినట్టు
చెవికిఁ జేదయ్యె నీవేమి - చేయనేర్తు
వమలమృదుశీల నిత్యద - యాలవాల. 42

వ. అని నిజనివాసమ్మున కేగి. 43

ఉ. ఎందఱు చెప్పినఁ వినక - యేమయిపోయెను గౌరవేశ్వరుం
డందల మెక్కెనా ? పరుల - కందని స్థానము పొందఁగల్గెనా ?
యెందుల కంతపంత మది - యెన్నఁడు మేలొనఁగూర్పదన్నఁ దాఁ
గొందలమందఁడింత యెటు - గూడును సంధి ననాబుతోనిఁకఁ.44

కం. ఇల బలము కలిమిఁ జలమునఁ
దలబిరుసుఁదనమ్ము హెచ్చె - దాని మరల్పం
జలజభవాదులతరమా
ప్రళయము సృష్టింపకున్న - ఫలమా పరమా. 45

కం. వినఁజాలను గనఁజాలను
ఘనులగు హిందువులఁబట్టి - కాఱియపెట్టం
దినమొకయుగముగఁ గడపెడి
జనకష్టము దీర్పకున్న - సైన్యం బేలా ? 46

వ. హైదరాబాదు భారత హృదయము వంటిది. పాకిస్థాన్ ప్రచ్ఛన్న హస్తము దానిపైఁబడఁ దత్పాలనము మొగల్ చక్రవర్తుల పరిపాలనము పునరావృతమైనట్లున్నది. వ్యసనఘూర్ణమానమానసుండనగు నాకిప్పు డేది కర్తవ్యము. అనునయాలాపంబులం బ్రజల బాధఁ బాప నెవ్వండోపు. ఏతజ్జటిల సమస్యా పరిష్కార మార్గాన్వేషణార్థినై ప్రమగ్నుచున్నవాఁడ.

ఈయంతర్గత సంక్షోభము హృదయమును శతశకలము లొనర్చుచున్నది. నిద్రాణ మైన భారతశక్తి యిఁక మేల్కొనక తప్పదని గాఢాలోచనా తత్పరుండై యుండెనట నవాబు 47

ఉ. పూని రణంబునం జయము - పొంది సమస్తమునేలనెంచెనో
మాసక రేవగల్దురభి - మానపశంబున మందుగుండు సా
మాను రహస్యమార్గముల - మచ్చర మెచ్చఁగ దెచ్చుకొంచు నే
మేని యొనర్ప సిద్ధపడె - నెంతటి ధైర్యము చెప్పశక్యమే. 48

వ. అతండు సైన్యమును నల్వదిరెండువేలకుఁ బెంప సద్దాని కిబ్బడి ముబ్బడిగా రజాకారులు పెరిఁగిరి. ఇట శతవిధముల హిందువుల హింసింపం బ్రోత్సహించుచు భారతదేశము తనపై ఖడ్గము ఝళిపించుచున్నదని యంతర్జాతీయ భద్రతా సమితికి నవాబు విన్నవించుకొని న్యాయము చేకూర్పుమని వేఁడుకొనె. 49

తే. ఆడినది యాటగా మఱి - పాడినయది
పాటగా సాగె నిందన్క - నేటికిప్పు
డొకరితోఁ బొత్తువలదని - యోర్పులేమి
భరతదేశంబుపై నీర్ష్య - పెంచుకొనియె. 50

తే. దేవుఁడే తలఁచుకొనఁగ - దెబ్బల కిఁకఁ
గొఱత లేదన్న రీతిగా - ధరణి ధవుఁడె
హింసలను బ్రేవ నడ్డెవ - రింక నచట
దిక్కుదెసలేక హిందుపుల్ - దీనులైరి. 51

తే. దేశదుర్గతి కెందఱో - దిగులు పడఁగ
నెద్దిదొఱకున యని కొంద - రేగుచుండ్రు
కొందఱిలుకాలుచుంగుంద - నందు దొఱక
వానములు దూసికొనిపోవు - వారుగలరు. 52

వ. ఖాశింరజ్వీ నిజానుచరులతో స్వైరవిహారము సల్పుచుండ హిందువులు ప్రాణాలఱచేతం బెట్టుకొని దినగండము నూరేండ్లాయుస్సుగఁ బ్రదుకుచుండిరి నవాబు భారతప్రభుత్వ ప్రతినిధియగు మున్షీకేమాత్రమే నవకాశమీయకుండుటయకాక భారతసైన్యము నటనుండి కొంపోవలయు

నని యుఁ దన రక్షకదళమునకు సందుగుండు సామగ్రి యధికముగ నొసంగవలయుననియు గట్టిగ వాంఛించుచు భారతదేశపు నాణెములఁ దన సంస్థానమునం జెలామణి కాకుండు నట్లాజ్ఞాపింప దానికి భారతము తిరస్కృతిం దెలిపె. అంత పటేలు ప్రధానిచెంత కరిగి నవాబునుగూర్చి యిట్లను. 53

చ. అనుచితకృత్యముల్సలిపి - హానికరంబుగ వర్తిలంగ నీ
మనమెటులొప్పెనంచు జన - మాన్యులు పల్కిన నాలకింప కి
ద్దినముల ఘోరహత్య లతి - తీవ్రతరంబుగ రేఁగఁజేసె నె
ట్లణఁగును రద్ది యద్ది సచి - వాగ్రణి యూరక చూచుచుండినన్.54

ఉ. ఇప్పటికేని నీవు గ్రహి - యించితె నావచియించు వాక్కునం
దెప్పలుదేలుబావవరి - ధిన్ హృదయైకమహావిచారముం
జెప్పఁగజాల సప్తుజల - జీవితబాధలు నీవెఱుంగవే
తప్పదు వానితో రణము - తాలిమి కూర్పదు శాంతియచ్చటన్. 55

వ. అనె. ఒకచేత ఖురాను వేఱొకచేత కత్తి ధరించి విరోధి మీఁదికి లంఘింపుఁడు. భారతమున ముస్లిముల యాధిక్యత ఋజువగునంతవఱకు ఖడ్గమును దింపకుఁడని ఖాశింరజ్వీ తన మతస్థుల రెచ్చగొట్టుచుండ హైదరాబాదు ముఖ్యమంత్రియగు లాయక్ అలీ కతని చర్యలం దెలిపి యితర సంస్థానములవలె హైదరాబాదు భారతమునఁ జేరుట ధర్మ మని సర్దారు నొక్కి వక్కాణించె. మౌంటుబాటెన్ నవాబును ఢిల్లీకివచ్చి మాటాడుమన నతండు నిరాకరించె. చౌర్యగృహదహన మహిళామాన భంగ హింసాదులు విజృంభించె. 56

తే. కేంద్రసచివులు గొందఱు - కీ లెఱుఁగక
కదనమున నేరికేకీడు - కలుగఁ గలదొ
యనుచు నొక్కింత శాంతిమై - నణఁగి యుండ
నెఱిఁగె సర్దారు వారల - యింగితంబు. 57

వ. దేశమునం దెల్లయెడల మతకలహములు రేఁగునని ఢిల్లీ బొంబాయి యహమదాబాదు పట్టణములపై శతఘ్నుల వర్షము కురిపించెదమని నవాబు బెదరించినను బటేలు లక్ష్యపెట్టక మేజర్ జనరల్ జె. యన్. చౌదరిని బిల్చి. 58

శా. చండాశుప్రతిమానశౌర్యరసభా - స్వాతంత్ర్య సంయుక్తి మే
ముండ న్సుంతసహాబు లెక్కగొనఁడా - యస్తుద్రేకమునంగాన ను
ద్దండక్రోధదవాగ్ని రేపి వెలుచం - దత్సేనలనా మొండగా
జెండం దండితనంబుఁ జూపి విజయ - శ్రీతోడ వేంచేయుమా. 59

తే. నీవు వచ్చెడిదాక నే - నిదురబోను
ప్రజల బాధలఁ దీర్చుడే - ప్రతినగాన
నాజ్ఞ నిచ్చితి నీవింక - నరుగు మనఁగ
నైదుపదిచేసి వినయాన - నరిగె నతఁడు. 60

వ. జిన్నా మరణించిన మఱుదినమే చౌదరి నాయకత్వమున లెఫ్టినెంటు జనరల్ మహారాజ్ శ్రీ రాజేంద్ర సింగుజీ పర్యవేక్షణమున హైదరాబాదు రాష్ట్రమున భారతసైన్యము దిగె. 61

తే. భరత సైన్యము వచ్చిన - వార్త వినఁగఁ
బ్రాణములు లేచి వచ్చెను - బ్రజల కపుడు
మండు టెండల మలమల - మాడి మాడి
మఱ్ఱినీడన చేరిన - మనుజు మాడ్కి. 62

సీ. దేవతలంపినారు మన - దీనదశం దొలఁగింపనంచు నం
భావనచేసి రవ్వ్రజ ల - పారకృపారసవాహినీశులం
గేవలభక్తిఁ బూల శివ - కేశవులన్ వెసనర్చచేసి ర
ప్పావనమూర్తు లాపదలఁ - బాపఁగలారని చిత్తశుద్ధితో. 63

తే. ప్రథమదివసానఁ గించిత్తు - రణము జరిగె
రెండవదినాన దిగజాఱి - ఖండనమిఁక
నరయ మున్నాళ్ళముచ్చట - యయ్యె నంత
భంగపడి భారతమునకు - లొంగిరరులు. 64

చ. అదనిదియంచు ఘోరవిల - యంబు సృజించుచుఁ దాండవించుచున్
వదరుచు దోచుకొంచు బహు - భంగుల స్త్రీలఁ బరాభవించుచున్
మదమున హింసచేసిన య - మానుషకృత్యులు దుండగీంద్రటన్
మొదటి తుపాకిగుండెపుడు - మ్రోగెనొ పాఱిరి నాల్గుదిక్కులన్. 65

వ. నరిహద్దులంగల వంతెనల భేదింప నల్గొండ కరుదెంచుచున్న యాంగ్ల దళాధికారియగు మోరును భారత ప్రుతన బంధించె. నిజాము నిజశ్రీ రక్షణకోరి భారతమునకు లొంగె. సైనికపరిపాలకుఁడుగ చౌదరి యధికారమును స్వీకరించిన మఱుదివసముననె ఖాసింరజ్వీని చిక్కిన రజాకార్లను జెఱనుంచి యక్రమముగ వర్తించిన కమ్యూనిస్టులపైఁ గఠినచర్య తీసికొనె. దౌర్జన్యముతోఁ గొందఱు భూస్వాముల భూమిని లక్షలకొలఁది యెకరముల స్వాధీనము చేసికొని పంచుకొనుటచే శాసన విరుద్ధ మగునట్టి కృత్యముల నణఁచుటకుంగూడ సైనిక చర్య జరిగె. శ్రీ ఎల్లోడి ముఖ్యమంత్రిగ నుండి ప్రజాప్రభుత్వ మేర్పఱచె. నేఁటి భాషారాష్ట్ర విభజన దృష్టిమైఁ దెలుఁగునాడెల్ల నేకదేశముగ రూపొందవలయునని యాంధ్ర రాష్ట్రము వాంఛించుచు నాంధ్రకేసరి పాలనమున వర్ధిల్లుచుండె ఇట్లు. 66

తే. నాల్గువందల మూఁడు ది - నాలు జరుగఁ
గొన్ని హేతువు లత్తఱిఁ - గూడు కొనఁగ
నల ప్రకాశము దిగిపోవ - నప్పదవికి
దొడ్డ గుణశాలి గోపాల - రెడ్డి వచ్చె. 67

చ. ఇలఁగల సర్వదేశముల - కింపొనగూర్చెడి భారతంబునం
గలమన తెల్గునేల శ్రుతి - కాలమునుండి ప్రసిద్ధికెక్కె న
త్ఫలము లభింప నందఱము - బాధ్యతవర్తిలఁ దగ్గ లగ్గగుం
గులమత భేదముల్మఱచి - కూరిమిరండనె నేకదీక్షకుఙా. 68

వ. లోక మొక మహారణ్యము. ఇందు ముండ్ల చెట్లును పండ్ల చెట్లునుం గలవు. ఓర్పు నేర్పుల ముందడుగు వేయుటయే కార్యసాధకుని లక్షణము

తే. భారతీయుఁడనంట నం - భావ్య మగును
గాని పిమ్మట మన పూర్వ - ఘనత నెంచి
యెచటనున్నను ద్రైలింగు - లేకజాతి
యనెడి మాటను మఱవరా - దనియె నతఁడు. 70

# ఆంధ్రప్రదేశ ప్రయత్నము

తే. హైదరాబాదు రాష్ట్రము - నాంధ్రదేశ
మందు లీనమొనర్పంగ - మనము కేంద్ర
మునకుఁ బోసి తెలంగాణ - మునకుఁ బంపి
పత్రముల నంపి రాంధ్రులు - పరమనిష్ఠ. 71

ఉ. ఖిన్నరుచిర్హి లోకమని - పెద్దలు పల్కు పరీతి సత్తతిం
గ్రన్నన రెంట వాదములు - గాఢముగాఁ జెలరేఁగె దిస్సుఁగా
మన్ననతో జవాబు లిడ - మంతనముల్లలితో హెచ్చె నింతకుం
గొన్ని దినాలకిద్ది యొన - గూడునటంచొగిఁ గొంపటెంచఁగన్. 72

ఉ. కొందఱు స్వార్థదృష్టి నిది - కూడదు రెండుగ నున్న నేంద్రమే
పొందఁగఁజేయు సాయమును - బోటిన యట్టులు రెండు రాష్ట్రముల్
కందెన యున్న బండియటు - క్రమగతిం దగసాగి పోవు సం
క్రందను లోకమట్లలరుఁ - గావున రెండుగఁ జీల్చుఁడీ యనన్. 73

కం. పలువు రదికూడ దనుచుం
గలకాలము కలసియుంట - కార్యంబనుచున్
వలచిరి సంఘబలంబును
దలఁచిరి రాఁబోవు మేలు - దాని ఫలమునన్. 74

తే. ఆంధ్రచక్రంబు నడచు మ - హోద్ధృతముగఁ
జింత చచ్చినఁ జావలే - దింత వరకు
సోదరుల మంచు నాత్మలో - నెంత వలఁచి
కలసిమెలఁగిన మనకెంతొ - కలదు సుఖము. 75

తే. విల్లు పట్టిన వారెల్ల - వేఁటకాండ్రె
తెలుఁగునేల సమైక్యత - కలుగకున్కిఁ
గాఱ్ఱొగులు గ్రమ్ముచున్నట్లు - కానిపింపఁ
గీళ్ళు సడలిన బొమ్మయై - కీడు తెచ్చు. 76

వ. ముంగార్ల బడి జోరుగాఁబడిన బంగారుపంట పండునన్నట్లు ముందుగఁ దెలుఁగుజాతి సర్వము సంఘీభవించిన నసూహ్యాభ్యుదయ మందుట తథ్యమని వారత్రిక జ్ఞానధనులు దలంచిరి. 77

తే. అప్పుడు భావే పరించిన - యున్నచోట్ల
నాంధ్రరాష్ట్రాన భూదాన - యజ్ఞమునకు
పూర్ణఫలసిద్ధి కలుగుట - పుణ్య మంచు
భారతాధ్యక్షుఁడెంచె సం - భావ్య మంచు. 78

వ. భూదాన యజ్ఞమునకు గణపతి పూజచేసినవాఁ డాంధ్రుఁడు. అదె ట్లనం గమ్యూనిస్టు చర్యలకుం బ్రముఖ కేంద్రముగఁ బ్రసిద్ధికెక్కిన నల్గొండ మండలంబునఁ బోచంపల్లియను కుగ్రాం బొండుండె. ఒకనాఁటి ప్రాతఃకాలమున వినోబా యయ్యూరి కరిగి ప్రజల స్థితిగతు లెఱుంగఁ దొల్త హరిజనవాటికం బ్రవేశించి యొక చిన్న కుటీరమున నడుగిడి నాలుగు దినముల పసిపాపను జాప పైఁ బరుండఁబెట్టి తానేలపైఁ గూర్చున్న మాతృమూర్తినింగని యాతండును భూమిపై నాశీనుండై యా బిడ్డ నెత్తుకొని ముద్దాడె. ఆ తల్లి యాశిశువు నదృష్టమునకు మురిసి యాయన పాదములకు సాంష్టాగ నమస్కారముచేయ నతండు దీవించి యా పురిటి పాప నామె చేతికిచ్చి వెలికిరా హరిజనాదులు పల్వురుచేరి తమ దుఃఖ గాథల వినిపింప మీ కష్టములు దీరు మార్గము చెప్పఁగలరా యని ప్రశ్నింపఁ బండించుకొంటకు భూమి యిచ్చినఁ దీరునన నెంతభూమి కావలయునన నెనుబది యెకరము లనిరి. వినోబా జనుల నవలోకించి యిందు భూస్వాము లెవరేని కలరా యని పృచ్ఛింప నున్నారనఁ బ్రభుత్వ మీఁజాలని పక్షమున గ్రామస్థులే యప్పని చేయఁగూడదా యన వి. ఆర్. రెడ్డి నాకున్న పొలములో నూఱెకరములు దానముగ నిచ్చుచున్నాఁ డనన హరిజను లెల్లరు కరతాళ ధ్వనులతో నానంద బాష్పములు రాల్చిరి. నాఁటినుండి వినోబా భూదాన యజ్ఞము జయప్రదముగ జరుపుచుండె. ఇది యిట్లుండ హృదయనాథకుంజ్రూ కేవలము మాధవన్‌పణిక్కర్ సభ్యులుగ నొరిస్సా గవర్నరు ఫజల్ అలీ యధ్యక్షుఁడుగ రాష్ట్రపున ర్నిర్మాణ సంఘ మేర్పడ నది బళ్ళారిహోస్పేట సిరిగుప్ప తాలూకాలు తుంగభద్రా జల ప్రయోజనములు సంపూర్ణముగఁ బొంద ననువుగ నాంధ్ర రాష్ట్రమునఁ జేర్పవలయునని సలహా నొసంగె. 79

తే. అప్పు డవ్వార్త బళ్ళారి - యాంధ్రులు విని
పట్టరాని ముదంబునఁ - బట్టణమున

బాణసంచాలు కాల్చిరి - బహువిధముల
జయజయధ్వానములతోడ - సభలు జరిగె. 80

తే. వారి యానంద చర్యయ - వారితమని
వారి మేలును మనసార - గోరుదుమని
హృదయపూర్వక స్వాగత - మిత్తుమంచు
బలికె సంజీవరెడ్డి య - య్యారి కపుడు. 81

వ. ఇది యిట్లుండ 'తెలంగాణా' విలీనీకరణ విషయమున గేంద్రము జంపొనర్చుటల గమనించి. 82

తే. 'అలవిశాలాంధ్ర'కీ బడి - నట్టి గడుపు
హెచ్చుకావున దగ్గించు - టెంతొ శుభము
కృప గనుట లెస్సయని వెన - గేంద్రమునకు
దెలిపె సంజీవరెడ్డి ని - శ్చల యశస్వి. 83

వ. ఏకభాష యేకసంస్కృతి యేకచరిత యేకభూభాగ మేకాచార వ్యవహారములు గలిగి యాంధ్రజాతి ప్రస్ఫుటమైన ప్రత్యేకజాతిగ రూపొందియుంట విశ్వవిదితము. ఒకానొకవేళ తప్ప సమస్తాంధ్రజాతి యేక కుటుంబముగ జీవించుటంజేసి యాంధ్రమహాకావ్యము లిరుప్రాంతముల నావిర్భవించె. సర్వతోముఖాభివృద్ధి చెందవలయునన్న దెలుగులందఱు ప్రాంతీయ భేదములు పాటింప కేకోన్ముఖులుగ గృషినల్పుట లెస్సయను నినాదము మ్రోగె. 84

తే. అరయ బళ్ళారి రాకకు - నాంధ్రు లపుడు
మోద మందిరి యాలీని - వేదిక గని
వరుస బస్తరు బాందాలు - బరముపురము
పరుల కేగుటకుం జాల - బాధపడిరి. 85

తే. నూటయేబదియేడుల - నుండియుండె
దెలగి బళ్ళారిరాయల - సీమ నాంధ్ర
మండలంబగు కోలారు - మండలమ్ము
నాంధ్రమున జేర్పకుండుట - న్యాయమనిరి. 86

వ. ఆంధ్రరాష్ట్రమునకు మున్ను జరిగిన హాని తొలఁగుటయతప్ప నూతనముగ లభించిన లాభంబెద్దియుఁలేదని మిశ్రాసనం గనులుమూసికొని యాలీనివేదిక నామోదింపవలసినదే యని కృపలాని నొక్కి వక్కాణించె.

తే ఇట్టు సరిహద్దు తగవులఁ - బట్టుపట్టి
పెంచుకొనుచుంట నీర్ష్యలు - వృద్ధియగుట
నపుడమాత్యులలో భేద - మంకురింప
జరిగెఁ దర్జన భర్జన - శాంత గతుల. 88

వ. మారాష్ట్రస్వరూపముం గేంద్రము నిర్ణయించువఱకు మా సరిహద్దులు ప్రస్ఫుటముగఁ దెలియవుగాన నందన్న నవ్విషయము నాఁపందగునని సంజీవరెడ్డియనం జెల్లాచెదరైన తెలుఁగు ప్రజల యేకీకరణకే విశాలాంధ్రం గోరుచుంటిమి గాని హైదరాబాదువంటి మనోహర నగరము కొఱకు కాదని గోపాలరెడ్డి యుగ్గడించె. అంత నాగార్జునసాగర శంకుస్థాపన సమయము సమీపించె. 89

## నాగార్జునసాగర శంకుస్థాపన

కం. ఎవ్వాని పేర సాగర
మివ్విధమునఁ గట్టనుండి - రెంతొ యెలమితో
నవ్వాని చరిత సత్యము
నివ్వటిలం దెలియఁ దగదె - నిర్మల మతితో. 90

కం. నరసుల గుణములు దెలియక
విరసముగా మాటలాడ - విని నమ్ముదురే
విరిదాచఁ దావిదాగునె
పరికింపరె తత్త్వవిదులు - పరమార్థంబుల్. 91

తే. కాళిదాసుని జీవిత - గాథ లట్లు
కట్టుకథలెన్నొ యతనికిఁ - గలవు గాని
పాలు త్రచ్చఁగ మీగడ - వచ్చి నట్లు
చర్చసేయంగ నిక్కంబు - చక్క వెలుఁగు. 92

ఉ. నిర్జిత దుర్గుణుండు నప - నీత మనస్కుఁడు పూర్వశాస్త్రవై
ద్రోర్జిత దర్శనగ్రథన - యుక్తి మహోజ్జ్వలుఁ డుగ్రవాది నా
గార్జుననాముఁ డొప్పెఁ బర - మాద్భుత నూత్న కళావిలాసుఁడై
దుర్జయ సాహితీరసవి - ధూతపరార్జిత కీర్తికాంతుఁడై. 93

శా. త్రచ్చెం జ్ఞానపయోధి శత్రుభిగప - త్రచ్చేపదీక్షాక్రియన్
విచ్ఛిన్నార్థ మహాంధకారము చనం - భీనాత్మహంకారముల్
ద్రవ్వెం బ్రాక్తనశాస్త్ర సేతువుల న - వ్యక్తుల హారంబులన్
గ్రుచ్చెన్ యోగ్యుల కంఠసీమనలరన్ - రోచిష్ణు వైజిష్ణువై. 94

వ. త్రిలింగదేశ విజ్ఞాన కళాసుక్షేత్రముల ననంత కృషిసల్పి రత్నాల పంటలఁ బండించి జగజ్జన జిజ్ఞాసా లలిత కళాపిపాసలను దీర్చిన దినంబులవి. అనాఁ డాంధ్రదేశ మకుట మాణిక్యముగ వెలిఁగినవాఁడు నాగార్జునుడు. 95

కం. సాగర గంభీర దయా
సాగర విజ్ఞానశాస్త్ర - సాగర బోధా
సాగర గుణగణజిత భవ
సాగర యని ప్రస్తుతింత్రు - సజ్జను లతనిన్. 96

ఉ. స్థావరజంగమాత్మక వి - శాల జగస్థితిఁ బెక్కుభంగులం
భావుకదృష్టిఁ జూచి యల - బౌద్ధపథమ్మును సూత్రసృష్టి సం
భావనచేసి సూక్తిసుధఁ - బంచిన శిష్యులభిక్షువంచుఁ ద
త్సేవకుమెచ్చి సజ్జనులు - సిద్ధుఁడు రెండవబుద్ధుఁ డంద్రుగా. 97

వ. ప్రతివాది భయంకరుఁడు. బౌద్ధమత శుభంకరుఁడు. మహాయాన ప్రచారదీక్షా బద్ధకంకణుఁడు. బౌద్ధవిశ్వవిద్యాలయ స్థాపకుఁడు; పాలకుఁడు.

తే. అమ్మహాయానమును దూఱు - నట్టి ప్రటకు
నిశితమౌనుత్తరంబీయ - నిశ్చయించి
ద్వైతలోఁ గాక భాష్యసం - గ్రథనమందుఁ
గ్రొత్తదారులు ద్రొక్కిన - కోవిదుండు. 99

వ. నైయాయిక వైశేషికసాంఖ్య సర్వాస్తివాద నిర్గ్రంథుల వాద ఖండనార్థంబ యతం డనేక గ్రంథములు విరచించె. 100

తే. సర్వసంగపరిత్యాగి - సత్యయోగి
విశ్వవిఖ్యాత చరితుఁడు - వేదవిదుఁడు
కార్యకారణవాది ప్ర - జ్ఞావినోది
తరమె వర్ణింప నాతని - ధాత కేని. 101

కం. జ్ఞాని శిఖామణి గుణి య
జ్ఞానతమోద్యుమణి శాంత - సౌజన్య రమా
మాని కళావిపణి జయ
శ్రీనిర్మలవాణి వానిఁ - జెప్పన్వశమే? 102

వ. అట్టి నాగార్జునుఁడు గౌతమీపుత్ర శాతకర్ణి పాలనమున శ్రీపర్వత మున వసించె. కంచింగల తారాదేవి దయచేతనో నలంద వెలసిన చండికాదేవి కరుణవలననో యాతండు సిద్ధి పొందియుండవచ్చునని కొంద అంద్రు. త్రిలింగదేశమునుండి వేయి వెలుఁగులు వెదజల్లిన విజ్ఞానభాస్క రుఁడీ యాచార్యుఁడు. అతండు నలందా విశ్వవిద్యాలయమున నవీన ప్రజ్ఞాపారమితి సిద్ధాంతమును బ్రచారముచేసిన ధీరుఁడు. అతండె నాగలోకమునుండి "శతసాహస్రిక"ను దెచ్చెనంద్రు. ఆంధ్రవిజ్ఞాన కళాప్రభాఖండజ్యోతి యతని ప్రతిభారీతి. 103

కం అది సాతవాహనులతటి
యది యాంధ్రుల శిల్పకళల - కారతిపట్టం
బదిలముగ జ్ఞానతేజము
చదరంగము లాడినట్టి - సమయంబదియే. 104

వ. జిజ్ఞాసితవ్యుఁడు మాధ్యమకవాదస్థాపనాచార్యుఁడు నగునాగార్జు నుఁడు సర్వశాస్త్రపారంగతుఁడు. ధర్మమునకుందక్క దేనికిం దలయొగ్గని ధీరుఁడు. రాజునకు సైతము హితోపదేశముచేసి రాజనీతిని ఘంటాపథ ముగఁ జాటిన మేటరి. అతని ప్రధానశిష్యుఁ డార్యదేవుఁడు. 105

తే. అరయ నాతని నాస్తికుఁ - డంద్రు గాని
యతనివాదము పరికింప - ననఁదగ దటు
కర్మమునకు ఫలంబది - కలుగునంట
నాస్తికుఁడుగాన నాస్తికుఁ - డనుట యెట్లు? 106

వ. అట్టి నాగార్జు నాహ్వాయమున కృష్ణానదీ తీరమ్మున నెత్తగు గుట్టపైఁ బెద్ద పెద్ద పొదలనడుమఁ జిన్నచిన్న కొండల మధ్యమున మనోహర ప్రదేశమున సేతువు నిర్మింపం ద్రవ్వ స్తూపశిథిలములు విహారములు మంటపములు శిథిలరాజప్రాసాదములు బయటఁబడె. కావలయునని పగులఁగొట్టిన సుందరశిల్పశకలములఁ గనుంగొన హృదయము ద్రవించు. మున్నిచ్చోట సుశితోరాటకుఁ జక్కిలిగింత పెట్టిన మహాశిల్పి సెలవధకుఁడని చరిత్రజ్ఞు లుద్ఘోషించిరి. అంత నిర్ణీత సమయమ్మునఁ గర్నూలినుండి ప్రత్యేక ధూమశకటమ్మున నెహ్రూరా నానకట్టు నిర్మాణ స్థలమువఱకు ప్రజలు బారులుతీరి నిలఁబడి హర్షధ్వను లొనర్చిరి. ప్రధాన శమధుఁడు గోపాలరెడ్డి నెహ్రూపండితునకు స్వాగతము పలికి మంత్రులఁ బరిచయమొనర్చి సేతుపునకు శంకుస్థాపన చేయ నభ్యర్థించె. మంగళ తూర్యధ్వనులు కర్ణపేయముగ వినఁబడుచుండఁ బండితోత్తములు వేదో క్తముగ నాశీర్వదించుచుండఁ బ్రధాని విద్యుద్యంత్రపు బొత్తాము నొక్క *నాంధ్రాంగ్ల హిందీ భాషల నెహ్రూపేరు చెక్కఁబడిన పునాది రాయి క్రిందికి దిగె. అపుడె సారంగముకొఱ కొక ఱాతికొండ ప్రేల్చఁబడె. ప్రజాకోటి జయజయధ్వానముల నడుమ నొక నూతన బృహత్తర పథక మున కసంఖ్యాక కర్షకజనాశా సౌధమునకు శంకుస్థాపనచేసి "కాషా యాంబరధారి మహాతత్త్వవేత్త తేజోనిధి నాగార్జునాచార్యుఁడు స్వర్గము నుండి యాశీర్వదించుచుఁ దనపేరితో వెలయుచున్న యీ పేదలపాలిటి పెన్నిధినిం దలంచి సంతసించుచున్నాఁడు. దేశదేశాంతరవాసుల కిది యాత్రాస్థలము కాఁగలదని విశ్వసించుచున్నాఁడ. ఒకప్పుడు విశ్వవిఖ్యాత విశ్వవిద్యాలయముగ వెలసిన యీ నాగార్జున పర్వతమునఁ విరాజిల్లిన మహావిద్వాంసు లీ మహత్తర కార్యమునదృశ్యులై యాశీర్వదింతురని నమ్ముచున్నాఁడ. 107

కం. నాగార్జున సాగర మిది
నాగార్జును దివ్యతపము – నవయుగ ఫలమై
బాగుగఁ బ్రాప్తించెను నా
యోగీంద్రులు బుధులు మెత్తు – రుజ్జ్వల మతులై. 108

---

* పునాది రాయి 8½ అడుగుల పొడవు 2½ అడుగుల వెడల్పు గలది.

ఉ. సేతువుగట్టఁ దజ్జలము - క్షేత్రరమాభ్యుదయైకకుల్యలం
దాతతరీతిఁబాఱ నక - లాంధ్రమహోదయమై వెలుంగు నీ
చేఁతకు నేతలెల్ల రతి - శీఘ్రమ కృత్యమొనర్చి దేశవి
ఖ్యాతికిఁ బాత్రులై తెలుఁగు - గడ్డ సువర్ణము సేయుటొప్పనేఁ. 109

వ. అత్తఱి నేతత్సాగరనిర్మాణమ్మును స్థిరపఱచిన ప్రపంచ ప్రఖ్యాత వాస్తుశాస్త్రజ్ఞుడు పద్మవిభూషణ్ అయోధ్యానాథుఁ డాంధ్రుల కృతజ్ఞతకుం బాత్రుఁడయ్యె. 110

కం. తప్పం గఱవిటు సస్యము
లొప్పం గృషిసేఁత కెంతొ - యోర్వ నెకరముల్
ముప్పది నాలుగు లక్షలు
తప్పక సాగగునటంచుఁ - దలఁచిరి తెలుఁగుల్. 111

వ. పొట్టకిచ్చిన బట్టకిచ్చిన భూదేవియేగదా. కావుననే దుక్కియున్న దిక్కున్నదనిరి పెద్దలు. సముద్రము చంకలోఁ బెట్టుకొని చెలమకుఁ జేయి చాచినట్లున్నది యింతవఱకు మన బ్రదుకు. 112

తే. పాడిపంటలు సరిలేక - బాధపడుచు
మనమె తిండికి మలమల - మాడుచుండఁ
గొనరి మనధాన్య మితరులు - కోరుటన్న
నలదిగంబరు వస్త్రమ్ము - నడిగినట్లు. 113

వ. ఇఁక. 114

కం. నాగార్జు నాహ్వయంబున
బాగుగఁ 'ప్రాజెక్టు' కట్టి - బహుజలవృద్ధిఁ
సాగగుఁ దెలుఁగుం బొలములు
శ్రీగలుగ స్వదేశధాన్య - చింతలు వాయఁ. 115

వ. ఎంత యానకట్టలు గట్టినం గృషిసల్పక ఫలము దక్కదు. నట్టింట నుండ నాభాగ్యమన్న నుట్టిమీఁదనుండి యూడిపడునా? నీటికొలంది తామర విత్తముకొలంది విందుగదా? కావున న్యాయార్జిత విత్తము సదా వాంఛనీయము. వండనికూడు వడకనిబట్ట వచ్చునప్పుడు సోమరితనము హెచ్చు. సుఖము మరగినయమ్మ మగని నమ్ముకొని తిన్నదట. అది

యూహించియు వినోబా తన జన్మమున నలుసులకు భూదాన మీయరా దనె నూత్నసాధన సహకారంబున నానావిధ ఖనిజసంపదను సమగ్రముగ గ్రహించి ప్రజోపయోగ సంస్థలకు వినియోగించి రత్నగర్భాఖ్య విశ్వంభర కన్వర్థ నామధేయంబని లోకము సకుఁజాట నేతలు దీక్షించిరి. క్షేత్రలక్ష్మ్యారాధన విద్యుద్విద్యావ్యాప్తి స్త్రీజనాభ్యుదయ గ్రామపునర్నిర్మాణ నిరుద్యోగసమస్యా నిర్మూలన పారిశ్రామికాభివృద్ధులకుఁ గృషి నల్పుచుండిరి. దాన. 116

తే. పట్టు ముప్పదిమేడు లి - ప్పనులకన్నఁ
బవలురే లెప్పవెట్టక – పనులు నల్ప
మూఁడు వత్సరముల కెన్న - ముగిసె నెన్నొ
యాంధ్రసామర్థ్యమున కుదా - హరణమనఁగ. 117

వ. కాకినాడ విశాఖాది నౌకాశ్రయముల నవీనపద్ధతుల సముద్ధరించి నిరంతర విదేశ వ్యాపారసౌఖ్యముల స్థిరతరమొనర్పఁ బాలకులు ప్రయత్నించుచుండిరి. 118

తే. బహుళ యాంత్రిక బలజల - పాతజనిత
చంచలాశక్తికిం దోడు - సౌరశక్తి
విద్యుదుత్పాదకంబుగ – వెలసెనేని
పట్టపగలుగ నిశలు గ - న్పట్టుననిరి. 119

తే. తెప్పకొట్టక పనినల్ప - రేవగళ్ళు
నవ్వుచున్నాట్యమాడుచు – నవ్యగతుల
వచ్చు వయ్యారి సాగర – వనిత మమత
క్షేత్రలక్ష్మికిఁ జక్కిలి – గింత వెట్టు. 120

వ. అంచుం దలంచిరి. అంతనొక్కనాఁడు శమధులగోష్ఠి రాష్ట్రాభ్యుదయ పథకములఁ జర్చించుచున్నతఱి 'జనాభా' యభివృద్ధినరికట్టం జింతించుచు నొక్కమంత్రి 121

కం. ఖాళిన్షగ నుండఁగనే
ఛ్ఛాలింతగ మాఱినట్లు – శుభకరవృద్ధిం

గాలించుచు నుండఁగనే
నోలిం జనసంఖ్య పెరుఁగు - యోచింపుడెదన్. 122

వ. పంటకు మానవుల కడుపుఁ బంటకుఁ గమఠశశగతులకున్నంత వ్యత్యాసమున్న దేశము దెబ్బదినునంట నిక్కము. చాలకాలమునుండి యీ సమస్య లోకమును బాధించుచుంట సర్వదేశవిదితము. 123

తే. ఎన్ని*మాల్తూజియన్ నూట - యేఁబదేండ్ల
క్రితమె జనసంఖ్య పెరిఁగిన - రీతిఁ బంట
పెరుఁగకుంటఁ దప్పదు హాని - విశ్వవిదులు
దీని గమనింపఁ దగునని - తెలిపియుండె. 124

తే. అమెరికా దాని గ్రహియించి - యపుడె తగిన
చర్యలందీసికొని వేగ - జయము నందెఁ
దగినయవకాశములులేమి - దాని మనము
చేయఁజాలమి మనకెంతొ - చేటు గలిగె. 125

తే. ఊరక నిర్లక్ష్యముగఁ జూచు - చుందుమేని
తిండియగుదురు మిత్తికిఁ - దిండిలేమి
జనులదితొలంగ విజ్ఞాన - శాస్త్రవేత్త
ల సహకారబలంబుంట - లగ్గు మనకు. 126

తే. మహిత నిగ్రహశక్తిమై - మానవుండు
దాని సాధించు ననుట వృ - ధా వచస్సు
కానఁ గృత్రిమమార్గాన - ఘనవిజయము
పొందవలయును శుభముల - నొందవలయు. 127

వ. అని నొక్కి వక్కాణింప వేఱొక్క సచివుండు "సామాన్య మర్త్యులకు హ్రాషిక నిగ్రహశక్తి గగనకుసుమమంట నిక్కంబు. ఇఁక నివ్విషయంబున విపశ్చిచ్ఛిరోమణుల తాత్పర్యమే" మన నతం డిట్లను. 128

తే. ధనము పాత్రత నెఱిఁగిన - దానమునకు
నఖిలశాత్రవవిజిగీష - యశము కొఱక

* జీవితకాలము 1766 నుండి 1834.

హాస్యసదిత్యుల మసఁదగు - యౌవనంబు
పరిమితంబగు సంతతి - ప్రాప్తికొఱకు. 129

మ. ఒకనాఁ డెక్కుడు సంతతిం బడయుటెం - తో పుణ్యమంచాడి వే
లోకమార్గంబున నేఁడు పల్కఁబడువే - దో యంచుఁ దర్కింతురే
ప్రకటించుం బ్రజసంఖ్య హెచ్చ నిషేధముల్ - ప్రాప్తించునంచేల్బడుల్
సుకమాసించి భవిష్యమెంచి జనులూ - సూక్తుల్విసన్మేలగుఁజా. 130

తే. ప్రాదళంబులు పసచెడి - రాలిపోవఁ
గ్రొంజిగురువట్టి వృక్షముల్ - రంజిలు క్రియఁ
దొంటి యాచారములు కొన్ని - తొలఁగి చనఁగఁ
బ్రజల నవయుగ ధర్మముల్ - పొడుకొనును. 131

ఉ. అన్నివిధాల నభ్యుదయ - మందెడి దేశము లెవ్వి దేవిధుల్
క్రన్నన నిర్వహించెడినొ - కామకనిచ్ఛ గ్రహించి నాయకుల్
దిన్నఁగఁ దద్గతుల్ మనకుఁ - దెల్పుచునుండిరి వారి వాక్యముల్
మన్నన సేయుటే మనకు-మార్గము దుర్గము శాంతి రక్షకుఁజా.132

తే. దేశకాల పాత్రాదుల - తీరెఱుఁగుచు
మనుజు లటుజీవితంబును - మలఁచికొంట
యఖిల శుభములకును మూల - మంత్రము సరసు
లేటికెదురీది దరిఁజేర - నెవరితరము. 133

చ. ఎఱుఁగమె యాకుచేలుఁ డవు - డిర్వదియేడ్వురు బిడ్డలాఁకటఁజా
సొరుగుచు నేడ్చుచుండ సతి - శోకము హెచ్చఁగ్రుశించి పంపఁగా
నరగునఁ గృష్ణుఁజేర నిడెఁ - జాలఁగ శ్రీ లతఁడట్టులీనిచోఁ
బరమదరిద్రుఁ డాతఁడెటు - పాయుఁ దదీయగృహస్థకష్టముల్.134

తే. కామతీవ్రత దిగఁద్రావి - గార్హపత్య
పారమార్థిక దృష్టిమైఁ - బరగ గేస్తు
వడయు మితహిత సత్ప్రజఁ - బడయుసౌఖ్య
మాయురారోగ్య భోగభా - గ్యములు వడయు. 135

తే. ఎంత తక్కువ సామగ్రి - చెంత నున్న
నంత సౌఖ్యము రైలు ప్ర - యాణమందు

రెంత తక్కువ సంతతి - యింట నున్న
నంత సుఖదము సంసార - యాత్ర యంద్రు 136

తే. ఎన్నొ బాధ్యత లున్నవి - కన్నతల్లి
దండ్రులకు వాని నెరవేర్పఁ - దలఁప రేని
సంతతికి సౌఖ్యమునుగూర్పఁ - జాలనట్టి
పితరులై కష్టతతితోడ - వెతఁబడుదురు. 137

తే. తల్లిదండ్రుల పోషణ - తనయుల కెటొ
సుతుల యభివృద్ధికిం గృషి - పితరుల కటు
తప్పుకొనిరేని విధ్యుక్త - ధర్మములకు
నాత్మ సంసార శోభకు - హాని కలుగు. 138

కం. ఈధరఁ గలదేశములం
బేదప్రజానీకమున్న - విషయము మనదే
భేదములతోడఁ గుమిలిన
వాదములేగాక పరమ - భాగ్య మొదవునా. 139

తే. శాస్త్రవిజ్ఞానసాధన - సముదయమునఁ
బ్రకృతి శక్తుల లోఁగొని - వరలు నరుఁడు
మించి సంసార బాధ్యతల్ - పెంచికొంట
తనకుమించిన బరువెత్తు - కొనుటసుమ్ము. 140

చ. ఎఱుఁగ స్థిరంబుగాదు సిరి - యిర్వురు మువ్వురు బిడ్డలుంటయే
మురిపము పేదవారలకు - ముఖ్యముగా మఱి సంఖ్య హెచ్చినం
దిరిపము దీర్ఘదృష్టికది - తీరనిశాస్తి యటంచు మానవుల్
స్థిరతరబుద్ధి నీ భరత - దేశపు భాగ్యముఁ గోరుటొప్పగుజా. 141

వ. అంచువారు మనయూహ కనుకూలముగ నిజాభిప్రాయముల సూచించుచున్నారన నింకొక యమాత్యుండు "ప్రకృతిం బరికింప నల్ప సంతానంబె యుత్తమ చిహ్నముగ గోచరించు. ఎట్లన— 142

తే. గొప్పవారలకుం గడుఁ - గొలఁది మంది
బిడ్డలుంటయె కాంతుము - పృథివి మీఁదఁ

విచ్చి మొక్కల చందాన - హెచ్చు పూలు
పూయఁగలదె గులాబెట్టి - పోషణమున. 143

తే. అరయఁగా నొక్క నరజాతి - యందె కాక
కనఁగఁ దిర్యక్కులందును - గానఁబడును
సింహమున కొక్కచో గ్రామ - సింహమునకుఁ
బెక్కు పిల్లలు పుట్టుట - నిక్క మనియె. 144

వ. ఇట్లు వివిధవిషయ పరిశీలనమ్ములఁ బ్రణాళికాబద్ధమ్ముగఁ గృత్యమ్ములు నిర్వర్తించుచు విశాలాంధ్రావతరణమునకు బహుజనామోదముం బొంది యిరుపక్ష ప్రధానునాయకు లేకగ్రీవముగ నఖిలషించుటంజేసి వైశమ యాంధ్రప్రదేశోదయోత్సవము జరిపింప నిశ్చయించి కేంద్రము ప్రకటింప. 145

మధ్యాక్కర. ఆవార్త వీనుల సోక - నాహ్లాదముప్పొంగెఁ బ్రజల
యావదాంధ్రులకిది గొప్ప - యజ్ఞఫలంబని యెంచి
దేవుఁడు నేఁటికిఁ గరుణ - దీవించె నని మ్రొక్కిరపుడు
పావన భావనల్ జనతఁ - బరుగులెత్తెను మేలువడయ. 146

వ. అఁకొన్న సింహమున కేనుఁగు దొఱకినట్లు నష్టపడిన సొమ్ము నట్టింటికి వచ్చినట్లు సంతసించిరాంధ్రులు. 147

మధ్యాక్కర. ఎన్నొయేండ్లెడబాసియున్న - యిర్వురు సోదరులెంతొ
మన్నన నొకచోట దైవ - మహిమమైఁ గలసిన మాడ్కి
నన్నన్న హైదరాబాదు - నందింక వారును మనము
క్రన్ననఁ గలసికోఁగలము - కనపది ఘనతపఃఫలము. 148

కం. ముప్పది లక్షలు తెలియఁగ
నిప్పుడు పాండ్యాననాంధ్రు - లేయుంద్రట యీ
చొప్పున గణియించినచో
గొప్పగుమనసంఖ్య జగతిఁ - గూర్చు ముదమ్ముల్. 149

వ. అని వారాంధ్రాభిమానమును వెలార్చిరి. మఱియు. 150

తే. అన్యమతపాలనంబున - నణఁగి మణఁగి
కాలమెట్టులో కష్టాలఁ - గడపి కడపి

హాయిగా నొంటిమిట్ట మ - హాంధ్రసీమఁ
గలియుచున్నది భాగ్యంపుఁ – గళలు మీఱ. 151

సీ. పావన నదులతోఁ – బసిడి పంటలతోడఁ
దేజరిల్లును మన - తెనుఁగుఁదల్లి
హూణుల కృత్రిమ - మూఁతగా వేఱైన
హైదరాబాదుతో – నన్ని యరసి
యాతెలంగాణా మ -- హాభ్యుదయార్థియై
తల్లియొడిం జొచ్చె – నుల్ల మలర
నిఁక సహోదరులంద - ఱేకమై మనసార
మాతృదేవతపైని - మమత సూపి

తే. అభ్యుదయ మార్గములనెల్ల - నందుకొనుచు
నష్టకష్టములకు నోర్చి - యతిశయమున
నాంధ్రభూమిని నందనో – ద్యాన మట్లు
చేయఁగలరని మది విశ్వ – సింపవచ్చు. 152

వ. తెలంగాణేలాతలమును శాలిమంజరీ మంజులమొనర్చిన మంజీరానదీమ తల్లియు, త్రిలింగదేశమును నందనవనముగఁ జేయఁగల నాగార్జున సాగరమును బరిశ్రమలకుఁ బ్రాణాధారమైన సింగరేణి బొగ్గుగనులును బ్రశంసార్హములు. 153

సీ. సాగర నిర్మాణ – సత్కార్య పరుఁడయి
శతవిధంబులఁ గృషి – సలిపె నెవఁడు
సరిహద్దు నిర్ణయ – సందర్భముల దూర
దృష్టిమై మెలఁగిన - ధీరుఁ డెవ్వఁ
డైక్యతతో విశా - లాంధ్ర యేర్పడుటకుఁ
జాల శ్రమించిన - సదయుఁ డెవ్వఁ
డిరుపక్షములు తన్నె – యేరి కోరికొనఁగ
ముఖ్యమంత్రి పదానఁ - బొలిచె నెవఁడు

తే. బాల్యముందొట్టి భారతాం - బాపదాల
దీక్షమై సేవచేసిన – దక్షుఁ డెవ్వఁ

డతుల సాహస యుతుఁడయి - యలరె నెవ్వఁ
డట్టి సంజీవరెడ్డి స్తు - త్యర్హుఁ డిపుడు. 154

వ. ఆసియాజ్యోతి నెహ్రూ, ఆంధ్రుల కాశాజ్యోతి సంజీవరెడ్డి 155

తే. అతఁడు రైతు కుటుంబము - నందుఁ బుట్టి
తల్లిదండ్రుల యాజ్ఞల - దాఁటకుండఁ
గ్రీడలఁజ రాజకీయపుఁ - గ్రీడలందు
నందెవేసినచేయిగా - నందె యశము. 156

తే. వ్యూహరచనా సమర్థుఁ డ - పూర్వ మార్గ
గామియౌ గాంధి నమ్మిన - కారుణికుఁడు
కష్టసుఖముల నెఱిఁగిన - ఘన మనస్వి
వినుత సద్బుద్ధి యారెడ్డి - వేల్పుగిడ్డి. 157

వ. ఆ దేశభక్తుని కుటుంబమునే రాజకీయకుటుంబ మనంజెల్లు ఆతని జనకుఁడును మాతులుఁడును స్వాతంత్ర్యోద్యమరణరంగమున వీరవిహారము సల్పిన ధీరవర్యులు. సంజీవరెడ్డి రాజకీయ జీవితము ఝంఝామారుత సన్నిభము. దాని తీవ్రతకుఁ బ్రతిపక్షులు తూలిపోవుదురు. రాజకీయ రథమును నవీన పథమునఁ ద్రిప్పఁగల మేధాశక్తి సంపన్నుఁడు. పరిపాలనా చతురంగమునఁ బావుల నతిచతురిమతో నడుపఁగల ధీశాలి. విశాలాంధ్రోదయమున కాలస్యము జరుగునేమోయని. 158

కం. కటకటపడి యాతండపు
డటునిటు యోచించి మంచి - నాత్మఁ దలఁచుచుం
బటిమ సరగ సాధించెను
జటిల సమస్యలను బనులు - సంతోషింపఁజ. 159

వ. తనకంగబలార్థ బలాదులున్న నాంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి పదవిని బ్రకాశమున కిప్పించి వృద్ధగౌరవము చూపిన జ్ఞాని. గోపాలరెడ్డి ముఖ్య సచివుఁడుగ వచ్చుట కడ్డుపడని సహనశీలి. ప్రజాహితైషి. మిత భాషి. నిత్య సంతోషి. గాంధీ బోధనముల నందుకొని సత్యాగ్రహ మొనర్చి యనేక కారాగార వాసక్లేశము లనుభవించిన సాహసి. మద్యనిషేధ మంత్రిగనుండి చట్టమును గట్టుదిట్టముగ జరిపించిన కార్యశూరుఁడని త్రైలింగులు సంతోష సాగరమున నోలలాడుచుండ. 160

# శరదృతు వర్ణన

ఉ. తిన్నఁగ నొడ్డుఁజేరి రతి - ధీరులు తెల్గులు వారి యుత్సవం
బెన్నఁగ రాజునౌట నది - యేఁ దిలకింపఁగ జెల్లునంచిఁకన్
వెన్నెల కాంతిహెచ్చఁ గడు - వేడుకఁదోఁచును జంద్రుఁడంచొగిన్
వన్నెలఁ జిన్నెలం జిలుక - వచ్చె శరత్తు జగత్తు మెచ్చఁగన్. 161

శా. అంతందోఁచె శరల్లతాంగి శరసూ - నానూనహాస ప్రభా
నంతశ్యామల సస్యపట్టవసనా - వ్యాజాబ్జ భూషానిశా
కాంతాహ్లాదకరాత్మ దేహరుచిది - గ్దీప్తిచ్ఛటావర్ధకా
శ్రాంతప్రాణి వినోదసౌఖ్యదయశో - రమ్యోజ్జ్వలాకారయై. 162

మ. అలకల్వాగలతాంతనూతన రజో - వ్యాప్తిన్ సుఖోద్వర్తనో
జ్జ్వలదేహద్యుతి నొండొరుం బిలిచి సం - భాషించుచుం డెందమిం
పలరన్ స్వర్నది పున్కలందనిసి తో - నందందుద్యోవీధులన్
వెలిజిల్గులుల్సరలారఁబెట్టిరన నొ - ప్పెం బీచుమబ్బుల్దివిన్. 163

కం. అలకాపురమునఁ గల తమ
యలకాఁపురపు వసవితతి - నత్తటి విడి యే
మలఁకనొ యిలఁగల యమృతపుఁ
గొలకులకై లేచె హంస - కోటులు దివికిన్. 164

ఆ. మానసౌకసతతి - మఱిక్రౌంచ సుషిరాన
వచ్చె నగ కొలనను - నింతికి నిడ
కాలమనెడి విశ్వ - కర్మ కమ్మచ్చునఁ
దీయుచున్న వెండి - తీవ యనఁగ. 165

తే. సైకతశ్రోణి వాహినీ - సరసిజాక్షి
గర్భవతి చందమున మంద - గమన యయ్యె
నిదుర మేల్కాన్న నిజభర్త - పదము సోకఁ
బుడమిపులకించె ననఁ బెల్లు - పూచె తెల్లు. 166

తే. అమృతము మలిన సంగతి - నాది నుంట
దానిఁ బ్రీతిగఁ గనదయ్యెఁ - బ్రాణికోటి

వ. అట్లు శరత్సమయంబు జగజ్జనుల కత్యంత సంతోషదాయకంబుగ నుండ నాంధ్రప్రదేశావతరణ మహోత్సవ దివసంబుం గేంద్రంబు నిర్ణయింప మున్నుగ వృద్ధజనాశీర్వాదాభిలాషియై సంజీవరెడ్డి ప్రకాశముం దర్శించి యనుభవజ్ఞాన సంపన్నుండైన యతనివలన రాజనీతి విశేషాంశముల వినంగోర నాంధ్రకేసరి యప్పుణ్యామాత్యున కిట్లను. 181

శా. ప్రజ్ఞాశాలివి గాన స్థానమిది సం - ప్రాప్తించె నీనాటి నీ
సుజ్ఞానంబధికార నిర్వహణ స - చ్ఛోభంగడున్ వ్యాప్తమై
యజ్ఞానాంధరవిప్రభాపటలమై - యాసేతు శీతాచల
ప్రాజ్ఞుల్మెచ్చఁగ రాజకీయకళతో - రాజిల్లు మాంధ్రావనిన్. 182

చ. పదవులశాశ్వతంబు లవి - పాసినఁ జేసిన మంచిచెడ్డలే
పదుగురు చెప్పికొంద్రది య - పారము లోకముమూయ మూతయై
ట్లొదవును గాన ముందుగతు - లోర్చుననెంత్రు మహాత్ములార్ద్రులై
యెదనిదియెంచి మంచి గడి - యించుటలెస్స యమాత్యశేఖరా. 183

శా. ఏయుద్దేశముతో మహాత్ముఁడపుడా - యీసంస్థలన్ నిల్పెనో
యాయుద్దేశముతో మెలంగి ఫలమ - త్యంతంబు సాధించుచే
శ్రేయంబంచుఁ దలంపుమా ప్రజలసం - క్షేమమ్ము భావింపుమా
భూయశ్శ్రీభరతాంబ యింకవెలుఁగున్ - భూలోకనాకంబుగా. 184

కం. జీవులయెడ దయ చూపుము
కావుము శరణార్థి నమిత - కారుణ్యమునం
గేవల వృద్ధుల జ్ఞానుల
దీవనలంబొందు మఖిల - దివ్యులు మెచ్చన్. 185

కం. అధికార వికేంద్రీకర
ణధిషణ నొనరింపఁ దగును - నానాక్రియలన్
మదిలఘ్వలఘువిభేదము
వదలి విధిందలఁచి సహన - భావము పెరుఁగన్. 186

తే. గ్రామరాజ్యమెగా రామ - రాజ్యమనఁగ
రామరాజ్యమెగా ప్రజా - రాజ్య మనఁగఁ

గాన నూరె పునాదిగా - గ్రాలవలయు
రహి రహించు పంచాయతి - రాజ్యమునకు. 187

కం. వేల్ముల వేల్పులఁ దన్పుచుఁ
గల్మికిఁ దగుయాగికల్మిఁ - గమనీయుండై
తాల్మిగలవ్యక్తి నృపుడుకృప
మేల్మించఁగ ఖ్యాతి నొందు - మిత్రులు మెచ్చన్. 188

కం. అందఱినిం బ్రేమింపుము
కొందఱినే నమ్ము మాత్మ - గురువర్యులకుం
గుందొనగూర్పకు పెద్దల
సందేశము లాలకించి - సన్నుతి గనుమా. 189

తే. సాధుజంతువులం గూర - జంతువులటు
దుర్జనులు సజ్జనుల దోరు - దురు యధేచ్ఛ
దాని నరికట్టఁ గలశక్తి - తనరునేని
నదియ సక్రమపాలన - మనఁగఁ జెల్లు. 190

ఉ. ఊసరవెల్లిభాతి సమ - యోచితరీతి ననేక వేషముల్
వేసి యమాయిక ప్రజల - వేమఱు మోసముచేసి ధర్మవుం
బాసి జనాధినేతయయి - భాగ్యము నందిన నందవచ్చుఁ గా
నీ సకలాంధ్రదేశము గ - ణింపదె తచ్చరితంగళంకముల్. 191

ఉ. పాలకు లీప్రజం బ్రజగఁ - బాలనసేతకు నొగ్గలగ్గు భూ
పాలకు లెందఱో మును గృ - పామతినేలి యశంబునొందరే
శీలములేని నాయకుని - చెంతన జేయని వెన్క ఛీయనం
జాలు ప్రజాసమూహమిది - శాంతముమై గమనింపఁగాదగున్. 192

తే. సమ్యగనుభూతిగల తప - శ్శాలియే దు
రాశకగ్గలమైన దు - ర్యశము నొందుఁ
జెవికిఁ జేదైన మాటలు - చెప్పితి నని
బాధపడఁబోకు మిది సత్య - భాషణంబు. 193

చ. శ్రుతిహిత ధర్మసూత్ర పరి - శోధన చేయక స్వేచ్ఛవాగ్ఝరీ
చతురతఁజూపి స్వార్థమణి - సౌధశిరోగృహసీమఁ జేరఁగా

నితరులమెట్లు సేసికొని - యెక్కుడివానికె దక్కుసౌఖ్య మీ
గతి కలికాలపద్ధతులు - కన్నడు విన్నడు నిత్యసత్యమై. 194

ఉ. కాలము మాఱదెందుఁ గలి - కాలముననన్మతి మాఱు నిర్దయా
లోలత మంచివానిఁగని - లోకము వెన్కకు లాగఁజూచు నా
జాలముపొంతపోక నిజ - సత్యపథంబును వీడకున్నచో
మేలొనఁగూర్చుకోఁగలవు - మిత్రులు మెచ్చఁగ సజ్జనుండవై. 195

ఉ. మంచినిగూడఁగొట్టుకొను - మార్గము గానక కొంతమంది యీ
యందల మెక్కలే రయిన - నాత్మకళాకమనీయ కాంతితో
నుంపరు సత్యధర్మపరు - లొక్కొకచోటఁ బరోపకార సం
బంధదయార్ద్రచిత్తు లతి - పావనమూర్తు లుదాత్తకీర్తితో. 196

వ. యోగి యైహికాముష్మిక భేదగ్రాహియైనట్లు హంస క్షీరనీరముల వేఱుచేసినట్లు పాలకుఁడు ధర్మాధర్మముల విమర్శించి తద్భేదంబెఱుంగం దగు. 197

శా. నిత్యాకర్షణ మానసామృతరసా - నీతప్రభాబుద్ధినై
శిత్యస్తుత్య గుణాగుణప్రకరవాః - క్షీరప్రభేదాంకసా
హిత్యాజ్ఞానసభాసమానకరుణా - హింసావ్రతైకక్రియా
సత్యైక్యామలదివ్య దృక్పరమహం - సప్రాభవంబెన్ననౌ. 198

(ద్వక్షి)

వ. మ్రొక్కుకొని చెల్లింపకుంటకంటె మ్రొక్కుకొనకుంట మంచిదండ్రు. కానముందుగ సంపూర్ణవాగ్దానముల చేయరాదు. నెరవేర్పంజాలని వాగ్దానంబు లథారాదుర్దినమ్ములవోలె నిష్ప్రయోజనమ్ములు. 199

ఆ.వె. మ్రొక్కువానిఁ జూచి - మొత్తుచు నుండును
దన్నువానిఁ జూచి - తాఱు చుండు
లోకమునకు నీతి - లోటింత గలదని
చెప్పఁ గలమ దానిఁ - ద్రిప్పఁ గలమ. 200

తే. ప్రకృతిశక్తిని బరిమార్ప - వశముగాదు
దుష్టచిత్తునితో మైత్రి - శిష్టుఁడేని

భ్రష్టుఁడగుచుండు పరిసర - ప్రాంతమెల్ల
యంత్రపుంబోగఁ గలుషిత - మైనరీతి. 201

వ. జ్ఞానిచెంత మూర్ఖుఁ డెంతకాలము మెలఁగినను మహనీయుని గొప్పఁ
దనము గ్రహింపం జాలఁడు. 202

తే. రూపరసభాసురంబయి - రూఢికెక్కి
పద్మసద్మంబుగాఁ గ్రాలు - పద్మమహిమ
నెచటనోయున్న తుమ్మెద - యెఱుఁగుఁగాని
కప్ప యెఱుఁగునె యాటఁ గల - కాలమున్న. 203

శా. నిత్యంబాత్మ పరీక్ష సజ్జనుఁడు ని - ర్నిద్రక్రియాశీలుఁ డౌ
న్నత్యంబందు దయార్ద్రచిత్తుఁడయి య - న్యాయంబు భేదించుచుఁ
సత్యారాధనసేయు దుర్జనుఁడు స్వే - చ్ఛంగ్రూరకర్ముండగుఁ
దైత్యాంశోద్భవ మర్త్యమూర్తికి దయా - దాక్షిణ్యముల్గల్గునే. 204

ఉ సాధకబాధకంబు లతి - శాంతమతిం బరికించి యెంచి స
ద్బోధల నాలకించి యెటు - వోయిన మేలగునో గ్రహించి ని
త్యాదరణీయ సత్యమున - కై బహుళంగుల నిల్పి యాప్రజా
బాధలఁ బాపి పుణ్యమును - భవ్యయశంబును బొందనొప్పగుఁ.

తే ఎంతధర్మముగా నేల - నేలుచున్న
వెక్కిరించెడి వానికి - లెక్కలేదు
గాంధి దూషించువానికి - ఘనుడె పరుఁడు
లీల గుడిమ్రింగు వానికి - లింగ మెంత. 206

వ చెఱువునకు నీటియాశ నీటికిఁ జెఱువాశ యన్నట్లు రాష్ట్రకేంద్ర
ములు మెలంగవలయు. గాలిని మూటగట్టిన గయ్యాళినోరు గట్టలేఁడన్నట్లు
వదరుఁబోతులనోరు కట్టవశముగాదు. 207

తే. అదుపులోఁ బెట్టినను స్త్రీవార స్త్రీ - స్త్రీలవ నెఱింగి
కలఁతలనుబెట్టఁ స్త్రీ జూతురు - కరుణ స్త్రీమాలి
కాలకల్పితమని బుధుల్ - గఱపి రద్ది
నీకు యోచింపఁ బనిలే ద - నింద్యచరిత. 208

వ. చేటెఱుంగనిచేడె మగనికిఁ బెండ్లిచేసినదన్న ట్లమాయికులుగొందఱు నాయకుఁడుగ నటించుచున్న యసమర్థునిసైతము గద్దెనెక్కింతురు. కంచె మంచిదికాదే నందఱుదాఁటుదురన్నట్లు పరిపాలనదృఢతర శాసనబద్ధము కాదేని ప్రజలడ్డదిడ్డముగ సంచరింత్రు. దానింగమనింపక లోకాభ్యుదయముగోరుట కీటువిడిచి గోడపెట్టుట. ఇఁక దానింజక్కఁజేయవలయు నన్నం గొండంద్రవ్వియెలుకఁబట్టుట. కావుననే కీడెంచి మేలెంచవలయు ననిరి పెద్దలు. అశోకుని రాజ్యమునఁ బసవైననేమి యన్నలోకోక్తిని స్పృహకుఁదెచ్చుకొంట యుత్తమము. 209

తే. పనియుఁ బాటయులేమి ని - ష్ప్రగిది కొంత
కాలమును బుచ్చవచ్చును - కాంక్ష దీన
నూరబిచ్చము గుడినిద్ర - తేర బ్రదుకు
హాయియని చేరుదురు కొంద - అది నిజంబు. 210

వ. అవకాశంబుచిక్కదే సణఁగిమణఁగియుండి చిక్కెనా కొదమసింగమై లంఘించుట కొందఱిమతంబు. భాస్కరకిరణంబులు సర్వరోగబీజాపహారణములని యెవ్వండే మాధ్యాహ్నిక గ్రీష్మాతపంబునఁ బెద్దకాలంబు నిల్వ న్వాంఛించునా? ఇంత యెఱింగి యెద్దులు బండి యేకమైనఁ గొండమీఁదికిఁ గొనిపోవునన్నట్లు ప్రజలునాయకు లేకాభిప్రాయమునఁజరించిన నున్నత స్థితి నందుకొనవచ్చు. కాదేని మతిలేనియమ్మకు గతిలేనిమగఁడు దొఱికి నట్లు— 211

ఆ.వె. రాజకీయ మన్న - రక్కెస పొదయని
యెఱుఁగఁ జాల దింత - యేని జనత
యాకు చాటునఁ గల - యలరది యెట్లులు
తేనెటీఁగ కాటు - తెలియఁ గలదు 212

వ. ప్రజలకు నాయకులకుఁ బొత్తుకుదురక యీర్ష్యజనించుట విశాఖ వర్షము వ్యాధులకు హర్షమన్నట్లుండుసన "సృష్ట్యాదినుండి యందఱ నేకరీతి ధర్మబద్ధులంజేయ నేరికిశక్యముకాలేదుగదా. స్వభావోదురతిక్రమః అన్నసూక్తి యక్షరసత్యమగుట మఱిమాకది యెట్లుసాధ్య"మని నంజీవ రెడ్డియన "యత్నేకృతేయదినసిధ్యతి కోఽత్రదోషః" అని ప్రజల విరాడ్రూపముగ నారాధించిన రాయల రాజనీతి స్పృహణీయము 213

సీ. పాయని దేశభక్తిఁ బరి - పాలనచేసిన పుణ్యమూర్తి య
న్యాయధరాజఖండన వి - హార వివేకకుఠారధారి తా
శ్రేయము రాట్ప్రజాళికగు - రీతిగ స్వానుభవంబుఁ దెల్పుటన్
రాయలరాజనీతి కడు - రమ్యము గమ్యము పాలనక్రియన్. 214

తే. క్రూర చోరాదులను బట్టి - గూఢచారు
లెపుడు చరియించుటేగాక - యేలికలును
మాఱువేషంబుతోఁ బ్రజా - మతముఁ దనర
రేలఁదిరుగుదురట పురి - మేలు కోరి. 215

వ. సంస్కృతాంధ్రభాషావిశారదులై యస్వోక్షకీపండనీత్యాది రాజ్యపరిపాలనాతంత్రకుశలురై మనుయాజ్ఞవల్క్యనారదాపస్తంబ బాహుదంత బృహస్పతి శుక్ర పరాశరవ్యాస భరద్వాజవైశంపాయన ఘోటముఖ పిశున కౌణపదంత వాతవ్యాధి కాత్యాయన చారాయణ కింజల్క కౌటిల్య బౌద్ధాయన నీలకంఠ కామందకాది రాజకీయవేత్తల గ్రంథసారము గ్రహించి సామ్రాజ్య నిర్వహణానంత శక్తియుక్తులైన రాజనీతిచతురులే మున్ను మహామంత్రి స్థానమలంకరించెడివారు. కాన నేఁడు భారతీయ శిక్షాస్మృతుల సమాతులామూలాగ్రముగనరయందగు. 216

తే. దొంగలకుఁ దల్పుదీసి య - ద్దారను లేపు
కుమతులుందురు వారల - క్రూర బుద్ధి
తెలిసి వారికిఁ దగుశాస్తి - సలుపకున్న
జరుగ దిల పాలనంబిఁక - సక్రమముగ. 217

వ. జ్వాలనాచలము జ్వాలాబిలద్వారమ్మున 'లావా' నెల్లరపైఁజిమ్మునట్టు శఠులు నిజక్రోధదవానలకీలల సాధ్వవతంసములమీఁదంగూడఁ బ్రసరింపజేయుదురు. గూండాల దౌర్జన్యచర్యలు సమూలముగ నాశన మొనర్పనిచో దేశమున సుఖశుభ శాంతిభద్రతలు సుస్థిరముగ నుండఁజాలవు. క్రూరచోరహంతకాధముల నుపేక్షసేయరాదు. 218

తే. శిష్టులను గావ దుష్టుల - శిక్ష దనర
ధర్మసంస్థాపనముసేయఁ - దగినవేళ
యుగయుగంబునఁ బుట్టుచు - నుందునంచు
ననఁడె కృష్ణుఁడు పార్థుతో - నని యొనర్ప. 219

కం. దుష్టుల శిక్షింపనిచో
శిష్టజనుల్ బ్రదుక గలరె - శిక్షాస్మృతులన్
సృష్టించిన ఋషితుల్యులు
స్రష్టనిభజ్ఞానులనుట - సత్యముగాదే. 220

తే. అలయజాతశత్రుఁడు భీష్ము - సడిగి నట్టి
యెఱిఁగి యీరీతి నడిగితి - వేల రెడ్డి
వినయపీఠస్థునకు లోటు - ఘనతఁ గలదె
వెలయు మిటమీఁద నాశీర్వి - వృద్ధితోడ. 221

వ. అని మఱియు నిట్లను. ఎంత పరిపాలనభారమున్నం దైవారాధన మానరాదు. జనకాంబరీషాది రాజయోగుల లక్షణమది. అదియ పరమునకుఁ బరమధనము. కైవల్యకవాటభేదనపాటవంబది. ఇఁకనే నీశ్వరధ్యానమునందె మనస్సు నిలుప నిశ్చయించుకొంటి. కడకాత్మజ్ఞానంబె శరణ్యమని నమ్మితి. చివఱకు నీకు నయ్యదియ ధ్యేయంబని తలంతు. కావున మున్నేఁదత్త్వవిదులవలన విన్నతెఱంగు నీకు వినుతు. 222

కం. నరుఁడే మోక్షార్హుం డని
గురువర్యులు వల్కుచుంద్రు - కోవిదతతిచే
నరయిక పొరయక సత్పథ
చరుఁడెట్లగు నరుఁడు ముక్తి - సాధించు నెటుల్. 223

చ. వెడగుఁదనంబునన్నరుఁడు - వేయియధర్మములాచరించుచున్
విడిముడి ప్రోగుసేసి పృథి - విం జెడు పేరుగడించు నీటిపై
బుడగ సమానమీతనువు - పోవుతఱిన్మఱిగడ్డిపోచయేఁ
దడయక వెంటరాదు ధన - దాహము మోహమదింత యేలొకో.

శా. ఈ దేహంబెటుగల్గు గట్టకడకి ద్దే- హౌ నటంచెంచఁడీ
వేదాంతంబది యేరికోయనుకొనున్ - విశ్వజ్ఞబోధామృత
స్వాదూక్తుల్చెవిఁబెట్టఁ డింతకు దురా - శాప్రేయసీలోలుడై
మీఁదంగ్రిందపడుం దలంపఁడు జగ - న్మిథ్యామహావాదమున్.

శా. భ్రాంతుల్వార్థితరంగ సన్నిభములై - వర్ధిల్లుచున్ నంచలత్
స్వాంతుంగా నొనరించు మర్త్యు గెలువన్ - శక్యంబ తజ్జాలమున్

శాంతానంతజితేంద్రియత్వమహిమన్ - సాధించు వేదాంతి ని
శ్చింతస్వీడఁగఁజెల్లు భౌతికపుఁగిం - చిత్కాల భోగ్యంబులన్. 226

వ. మోక్షసౌధ ప్రథమసోపానము చిత్తశుద్ధి. జితేంద్రియత్వము సుధాభాండము. శాంతము భేద్యదుర్గము. స్వీయేంద్రియజేతయ వీరుఁడుధీరుఁడు. అపాకృత పురాకృత కర్మనిర్మలునకు బాహ్యాడంబరములు నిష్ప్రయోజనములు. 227

శా. మాయానాటక మీజగత్తనుచు నా - త్మజ్ఞానసంపన్నుఁడై
న్యాయాన్యాయ విచారసారవచన - వ్యాపారపారీణుఁడై
ధ్యేయంబాపరమాత్మతేజమని స - ద్విద్యావివేకోల్ల స
చ్ఛ్రేయశ్రీ సతతైకనిష్ఠపరుఁడై - సిద్ధుండు మర్త్యుండగున్. 228

ఉ. నీరమునందు నుప్పువలె - నిర్మలుఁడౌ పరమాత్మలీనమౌ
ధీరుఁడె దివ్యయోగి జన - దేశికుఁడై వెలుఁగొందనర్హుఁడా
పూరుషుఁడే సమాధిఁ బరి - పూర్ణుఁడు స్వామిపదైకభాసి త
చ్చారుచరిత్ర శిష్యతతి - సంతతమున్ వినుచుండ్రు భక్తిమై. 229

శా. అంటంగోసి విమోహవల్లి ధృతిలో - కాష్ఠోదదుఃఖంబులన్
దంటుంజిక్కక యంటియంటకొగి నం - తశ్శత్రువర్గంబుతో
నంటుంగెంటి ప్రశాంతచిత్తుఁడయి ప్రా - ణాయామసిద్ధ్యర్థియై
యంటుంగుండలి నిత్యమాత్మగత వి - ద్యానందముం బొందఁగన్.

ఆ.వె. మనుజు మనసు దేవ - మందిరమైనచో
స్వర్గ ముండు వాని - పదములకడ
నాశ విడువ నరగ - నందును మోక్షంబు
సర్వ ధర్మ శాస్త్ర - సార మిదియె. 231

తే. అంచుఁ జిఱునవ్వు చిందవ - దించి తన్ను
వేడ్కతోఁ గను నవ్వాని - వెన్ను చఱచి
కువలయఖ్యాతి నీకుఁ జే - కూరుఁగాత
అనుచు దీవించిపంపె న - త్యాదరమున. 232

వ. ఆ శరత్కాలంబున భాగ్యనగరశోభ వర్ణనాతీతము. 233

# హైదరాబాదు వర్ణన

మ. విలసచ్ఛిల్పరమాప్రపూర్ణగ్రహరా - డ్విఖ్యాతరత్నప్రభా
కలితంబై యమరావతీసదృశసా - ఖ్యశ్రీలఁ జెన్నొంది భా
గ్యలతావాలమునాగ భాగ్యనగరం - బంచద్యశోరాశియై
యలరున్ సత్కళలన్మహాంధ్రధరణీ - హారస్ఫురన్మేరువై. 234

కం. చెదలంటని చదలంటెడు
పదిలములగు సౌధపాళి - బహు విధ రత్నా
స్పదసురపుర హర్మ్యాభం
గదనమునకుఁ బిల్చు మణుల - కాంతి నెసంగున్. 235

కం. వలివెలుఁగురాల రాజిలు
నిలయంబులు నిశల మెఱయు - నీరజవైరిం
దలదన్ను కాంతి తతులన్
వలిగుబ్బలి గండశిలల - పంక్తులనంగన్. 236

తే. గంగలోఁ దెల్లకలువలు - కనఁబడినటు
స్ఫటికసౌధాలఁ దారలు - ప్రతిఫలించు
నవ్య కౌశేయమును దాల్చి - నగర లక్ష్మి
రేల ముత్యాల దండలఁ - గ్రాలు ననఁగ. 237

సీ. కలదులేదనుమాట - కౌనులందునెకాని
యాస్త్యుపాస్తులకెప్పు - డతుకబోదు
వచ్చిరావనుపల్కు - పాలపండ్లకెకాని
లలితకళలకెందు - నలరదెప్పుడు
పద్మాకరాదులఁ - బంకశంకలెకాని
బుధకృతినొక్కండు - పొసఁగదెందు
ఘనపక్షపాతంబు - గుణమునందేకాని
యలపాడిపట్టులఁ - గలుగబోదు

తే. క్రౌర్యరసమెన్న వన్యమృ - గంబులందె
కాని నరసహృదబ్జాలఁ - గానఁ బడదు

అరయ మధుపానమళికుల - మందెకాని
యాత్మబలమున్న నరజాతి — యందులేదు. 238

తే. శాంతహృద్భాసి సాలారు - జంగుపేర
విశ్వవిశ్రుత సుమహిత - విబుధ వినుత
దేశదేశాంతరానీత - దీధితి యుత
సరసవస్తుప్రదర్శన - శాల వెలయు. 239

మ. వరవస్త్రాస్తరణాంబకాసనధనుః - ప్రాగ్భారరాట్ఛిఙ్గశి
ల్పరమాశోభితవిగ్రహోత్తమకళా — ప్రాముఖ్యవాద్యావళీ
నరహల్యాండజభూజచిత్రపటనా - నాజంతురూపాదులుం
ధరణీకీర్తియుతైక వస్తువితతుల్ — దచ్ఛాలరాజిల్లెడిన్. 240

శా. గచ్చొందం బురలక్ష్మి దర్శనమనం - గా సాగరంబొప్ప మే
ల్మచ్చున్నైచ్చినవల్లు లుల్లసిలి యు - ల్లాసంబుఁ జేకూర్పఁగా
నచ్చంపుంజిగి నేత్రపర్వమగు స - స్యశ్యామలక్షేత్రముల్
పచ్చల్నిచ్చలు పండునేలలని సం - భావింత్రు వైమానికుల్. 241

చ. పసగలవేణు లాత్మధృతి — వాయక నిచ్చలు వచ్చికొల్చినన్
రసికతమీఱ వార్ధియెది - రమ్యతరంబుగఁ జేరవచ్చినన్
ముసిముసినవ్వుతోఁ దనదు - ముచ్చటదీరునటంచుఁబల్కు నా
ముసియనునొక్కయేరు జన - మోదముగాఁ బ్రవహించు నచ్చటన్.

తే. పచ్చి దర్భాసనంబులు — పఱచినట్లు
బాహ్యతలమునఁ బచ్చిక - బయలు లొప్పుఁ
బండశుండాలమండిత - శాలలీలఁ
గొండలలరారు నందందు - గండశిలల. 243

తే. కవలవలె బుట్టి యభివృద్ధి - గాంచుచున్న
జీవి కరుణాద్రి శిఖరాలు — శ్రీకరాలు
మర్త్య రక్షణశిబిరాలు - మణి సరాలు
జంట నగరాలు మాతృభూ - సతి వరాలు. 244

మ. ధృతిమై జాంగలసస్యపాలికలు గీ - టింబాడ నధ్వన్యులున్
శ్రుతికింపన్విను చంద్రు నొక్కడెన న - చ్చోనొండుపార్శ్వాన సం

స్తుతిపాత్రంబుగఁ దేనెతుట్టెలటు గు – త్తుల్సాంద్రమై వ్రేలఁగా
నతిరమ్యంబగుకాయమానముల ద్రా – క్షారామముల్వొల్చెడిన్. 245

తే. స్తంభసోపానశోభితో – త్క్రమణహారి
చెలువుగులుకు సనాతన – శిల్పకళకుఁ
గాఁపురంబు మహోన్నత – గోపురంబు
జనవినోదకరము పేరు – చార్మినారు. 246

వ. ధూమధ్వజునకు ధూళిధ్వజుఁడు తోడైనతెఱంగున హూణప్రభుత్వమునకుఁ దుష్కప్రభుత తోడుగాగ మున్ను. 247

మ. ఘనమౌనస్ఫురిఁ బూర్వనిర్మలత తో – ల్గన్వెల్గుశోభింప స్వే
చ్ఛనశింపం ధృతిదూలుచున్ యవనబా – షావాసనాయుక్తయై
జనమూహింపఁగరాని మార్పులకు ని – చ్చల్లోంగుచుం గ్రుంగుచుం
దనసౌందర్యముడింప డీల్పడియె నాం – ధ్రశ్రీ విధిందూఱుచున్.

తే. కాని యిఁకఁ దెన్గుదొరలె యీ – క్ష్మాతలంబు
నేలఁగలరని తనకెంతొ – మేలదియని
యాంధ్రభాషామతల్లి య – త్యంతశోభ
నందెఁ దనవారిఁ గనుచు మి – న్నందెనపుడు. 249

ఉ. వేలకొలందిదివ్వె లతి – వేలరుచుల్విరజిమ్మ నాణెము
త్యాలతెఱంగు చుక్కలటు – లబ్బువిధంబుగ భానుభాతి శో
భాలలితంబులై నగర న – పర్వమొనర్పఁ బ్రజాళి కేళి వా
హ్యాళిగ సంచరించుఁ దొలి – యామమునన్నిశి రాట్పథంబులన్.

తే. కార్లు త్రొక్కుడుబండ్లు రి – క్షాలు వాహ
శకటముల వృషభద్వయ – శకటతతులు
నొక్కగోదబండ్లిరుదెసఁ – బెక్కు తిరుగఁ
గ్రిక్కిరిసి జనతతి సంచ – రించు సతము. 251

కం. అంటిన తనువులవలె రస
మంటుకొన న్నూత్నగతుల – నలరారుచుఁ బూ
వింటిదొర వింటినెక్కిడ
బంటులు తిరుగుదురు లలిత – సౌజన్యముతో. 252

తే. గృహగతారామ రామా వి - కీర్యమాణ
గంధమాల్యానులేపన - కలిత లలిత
శైత్యసౌరభ్యమాంద్య ప్ర - శస్తితోడఁ
బవనుఁడటువీచు సంధ్యలఁ - బ్రమద మెసఁగ. 253

సీ. అపరంజి పెన్నిగి - నవఘళింపఁగ జాలు
మేనికాంతులు మిఱు - మిట్లుగొల్ప
రేపు మాపును మార్ప - రెపరెపలాడెడి
పసిఁడి జిల్గుమెఱుంగు - బయలు ప్రాక
మణిమయ మంజీర - నినద యుగ్గమనంబు
కలహంస గతులను - వెలితిపఱుపఁ
దలవాకిటుమెలంగు - తఱిఁ బల్కు నునుబల్కుఁ
దలవాకిటుమెలంగు - పొలతి యలర

తే. సహజ సౌందర్య సమధిక - సౌకుమార్య
సమర సామోద సౌరభ - సహిత సతత
తరళ సరళ దృగ్గోచులఁ - దళుకు లొల్క
దివిజ లిటువచ్చిరన పణ్య - యువతు లుంద్రు. 254

తే. నేర్పుమైఁ జిల్కకుం బల్కు - నేర్పుకతనఁ
బరులు వచ్చిన సంతోష - పడుచు శుకము
ప్రీతిమైఁ జూచి యక్కరో - పీఁటవేయు
మనఁగఁ జనుదెంచి యతిథిఁ బె - ల్లాదరింత్రు.

శా. లోలాక్షుల్లలిఁ జంద్రశాలికల వ్యా - లోలా[illegible]లసంజ్ఞ వీ
ణాలాలిత్యనినాదసమ్మిళిత - కంఠ శ్రావ్య[illegible]రాగప్రయో
గాలాపంబునఁ బాడుచుంద్రు వలభి[illegible] - వ్యానంగి వల్లీలతాం
తాలోలాళి సుశబ్దముల్ శ్రుతి[illegible]త - వ్యాపారముంగూర్పఁగఁ. 256

వ. అంత మహాత్రిలింగదేశ[illegible]దయోత్సవము సమీపింప. 257

తే. అంధ్ర సామ్రాజ[illegible]
తిరిగి యుద్ధ[illegible] భాస్కరుఁ - డస్తమించి
[illegible]యుంచునని యాత్మ - తృప్తిఁ దెలుపఁ

ఖండివంటల వాసనల్ – పెరుఁగ నిండ్లఁ
బిల్లలొనరించు నల్లరుల్ - పెరిఁగెఁ దోన. 258

ఉ. అంగడివీధులెల్ల హృద – యంగమమై కనుపట్టె నాత్మయు
ప్పొంగె జనాళి కర్ణులకుఁ - బూర్ణముగా లభియించెవాంఛ సా
రంగము తేనెనానునటు – రాష్ట్రఫలాసవమానె సజ్జనం
బింగవచింపనేల పుర - మే యమరావతివోలె నొప్పఁగఁ. 259

తే. విశ్వపతియైన దేవుని – పెండ్లికరయ
నందఱును బెద్దలైనట్టు - లమ్మహోత్స
వమ్ము తమదని పౌరులు - నమ్ముకతన
బంధుమిత్రులతో నిండెఁ – బ్రతిగృహంబు. 260

## ఆంధ్రప్రదేశావతరణ మహోత్సవము

తేజఃపుంజము

వ. అంత నాంధ్రప్రదేశావతరణ మహోత్సవ దివసంబునఁ బ్రాతరా
రంభమున. 261

సీ. ప్రాగ్దిశాంగన నిండు - పాలిండ్లపై నప్డు
పూసిన గంధవుఁ - బూఁత యనఁగ
ప్రాచీదిశాసతీ - ద్వారంబునందోఁచు
కళ్ళలను నునుతెలి - వలువ యనఁగ
తొలిదెస జవరాలి - తోరపునగలోని
కమనీయవజ్రాల - కాంతి యనఁగ
పూర్వదిగ్భామిని - పొలుపారఁ దిలకించి
కుతుకాన నవ్విన - ద్యుతి యనంగ

తే. తెలివెలుఁగుదోచె, నక్కాంత – దిద్దుకొన్న
దీధితులఁజిమ్ము కాశ్మీర – తిలక మనఁగ
లోకజాలము తనటిగి - లో వెలుంగ
బుధులు బుక్తతి సద్ధ్యమీఁ - బ్రొద్దు పొడిచె.

తే. పగటివేళలఁ బరికించి – ఫలితమెంచి
మధుకరమ్మను చోరుఁడు – మధుధనమున
కబ్జకేతనమున సంజ – యంద చొచ్చి
యినుఁడు చనుదెంచు సూచన – యెఱిఁగి పాఱె. 263

ఉ. పెంపున నంధకారమను – భీకర దైత్యుజయించి ప్రీతిమై
సొంపునఁ బద్మినీసతికి – సూటిగఁ జక్కిలిగింతవెట్టి తా
నింపుదలిర్ప లోకము న – హీనముదంబున వెల్గఁజేయుచుం
గెంపులరాశివోలెఁ బరి – కింప సహస్కరుఁడొప్పె నత్తఱిఁ. 264

తే. పాలసంద్రము చిలికెడి – వేళ నద్రి
కమఠకర్కశకాయసం – ఘర్షణమునఁ
ద్రచ్చువారలు భీతిల – రాలినట్టి
గొప్ప నిప్పుల రాశినా – నొప్పె నినుఁడు. 265

తే. మహిమ మందేహదైత్యుల – మదమడంప
నదనిది యటంచుఁ గ్రోధాన – వదలినంత
జ్వాలలంగక్కు శ్రీవిష్ణు – చక్రమనఁగఁ
దోఁచెఁ దోయజమిత్రుండు – దూరువుదెస. 266

తే. జగతిఁ బ్రకృతియన్ విజ్ఞాన – శాస్త్రవేత్త
ఘనపదార్థము వేడి ని – క్కముగనుబుకు
నని ప్రయోగానఁ దెగఁగాల్చి – నట్టి యొక్క
యినుపగోళంబునా నపు – డినుఁడు దనరె. 267

తే. చెలఁగి లోకంబులకు హాని – చేయు త్రిపుర
దైత్యులనడంపఁ బోయెడి – తరుణ మందు
హరుఁడు దెఱచిన నిజదక్షి – ణాంబకమన
బాలభానుండు తొలిదెసఁ – బరగె నపుడు. 268

వ. శబ్దశక్తి త్రివిధంబైన యట్టితేజః పుంజము మూర్తిత్రయాత్మకమని
త్రయీరసామృతముం గ్రోలిన సుమనస్సులు స్తుతింతురు. 269

తే. ఆదికాలమునుండి మ – హర్షి చయము
వేదఋక్కుల రూపాన – వేఁడుకొనిన

యట్టి శ్రీ సూర్యభగవాను – నమలమతులు
తగనుతింతురు ప్రత్యక్ష – దైవమనుచు. 270

తే. విశ్వచైతన్యకరుఁడైన – వినుతవర్తి
విశ్వదేవాత్మకుండైన – విమలకీర్తి
విశ్వసమవర్తి యారోగ్య – విహితశక్తి
భంజితసమస్త భక్తార్తి – భానుమూర్తి. 271

తే. తాను గ్రహరాజుగాన నౌ – దార్య మహిమ
వసువులందిచ్చి శశికి శు – భంబుఁ గూర్చి
చేసె రేరాజుగావానిఁ – జెన్ను మీఱ
దాతలగుణంబు లిట్టిగా – తనరుచుండు. 272

తే. రాత్రి నిజశక్తి ముదమున – రాజిలంగ
నంధకారమ్ము నొకకొంత – యణఁచి జగతిఁ
దేజమునఁ దామె దిక్కైన – దీప తతులు
చంద్రుఁడుదయింప రిక్కల – చాయఁ దోఁచె. 273

మ. అకలంకస్థితి భారతంబున విశా – లాంధ్రప్రదేశంబు నేఁ
డొకవేడ్కంజనియించు దానిఁగన నే – త్రోత్సాహమౌఁగాన వా
రకవీక్షింతు వలాహకంబులిటఁజే – రంజేయదేవాయు వీ
సకలంబుఁ శుభమౌతయంచు రవి భా – స్వన్మూర్తియైతోఁపఁగన్.

వ. ప్రభుత్వ కార్యాలయ విద్యాలయాదుల జాతీయ పతాకోన్నమనోత్స
వము ప్రాతఃకాలమున నిర్వర్తింపఁబడ దోడ్తో ద్రాక్షాబదరీకదళీ నారంగ
ఖర్జూరాది ఫలజాలంబులు ఖండశర్కరాపూపాది బహువిధ మధురపదా
ర్థంబులు తదధికారులు బాలబాలికలకుఁ బంచిపెట్టిరి. దేవాలయములఁ
గైస్తవ ప్రార్థనామందిరముల మసీదుల భక్తులు దేశశ్రేయోఽభిలాషులై
దైవధ్యాన నిమగ్న మానసులైరి. ద్వ్యశ్వవాహ శకటశ్రేణి నిక్షిప్త పరీ
మళమిళిత నానావిధ పుష్పహారభూషిత గాంధీ నెహ్రూ రాజేంద్రప్రసా
దజాద్వ పేట్లాల్ బహద్దర్సోసమరజీవి శ్రీరామాద్యనేకమహానాయకఘన
చిత్ర పటాంచిత చలద్యంత్ర పాంచాలికా సహిత భరతమాతృ శిలాప్రతిమా
న్వీత వివిధవర్ణాల్పానల్పచపలాదీపచ్ఛటాపటల భాసమానోన్నత తాళ
సన్నిభ ప్రభలతో విశాలాయశ్శకటోపరితల వినిర్మిత వితర్దికాస్థల్యా

స్తరణోపవిష్టతత్తద్విద్యా విశారదాపాదిత మృదంగవాయులీన వేణువీణా ద్యనేక వాద్యధ్వన్యనుకూల వాతావరణ సమేత హృద్యానవద్య చక్షుస్సా నృత్యగీతములతో రుంజదండియ యురుమకిన్నెరడోలు గౌరుమౌరితుడు ముచుయ్యంకిపటహాది వాద్యములతో బాణా, ఛడీ సింగోటీ పతాఖడ్గాది సాధన సంపత్తి యుత వ్యాయామ కళాప్రవీణ ప్రదర్శిత చిత్రాతిచిత్ర కృత్యములతో సమరజీవి జీవిత కథాకథనలోల ప్రసిద్ధ యక్షగాన దళ ముతో విచిత్రవేషధారులతోఁ బ్రాచీన జానపద గీతాగానానందకరము లగు చెక్క భజనలతోఁ గోలాటములతో వామకరమ్మున దివిదారికొమ్ము ధరించి దక్షిణహస్తమ్మున జేగంటమ్రోగించుచు భగవన్నామ సంకీర్త నము చేయుచున్న దాసరులతో వియద్వాణీగాన సుధారస బిందుసందోహ సేచనముతో జాతిసమైక్యతా సూచక సూక్తిముక్తావళీ పరిశోభిత త్రివర్ణ తోరణములతో జాతీయపతాకాలంకృత హస్తులైన విద్యార్థులతో వివిధ మంగళవాద్య రవంబులతో బాణవిద్యా వినోదములతో నాంధ్రమాతకు రాష్ట్రదాతరామునకు ఘనభోంతరాళములు ప్రతిధ్వనింప సత్యుత్సాహ జనకముగ జేజేలు వల్కుచు విజయ శంఖారావము పూరించుచుఁ బౌర బృంద మమందానంద కందళిత హృదయారవిందముతో మెఱవడి యొనర్చె. 275

తే. విజయదశమీ దినంబున - వేడ్కఁ జెన్న
పురి గృహంబుల శుభముగఁ - బొలుచునట్టు
లాంధ్రరాజ్యమాదేవి క - ల్యాణమగుట
ననఁటికంబాలు కంబాల - నలరె వీట. 276

తే. దేవలోకము భూమికి - దిగినయట్లు
రంగురంగుల కాంతులు - రాజిలంగ
వింతవింతగఁ జిత్రము - ల్వెలుఁగుచుండఁ
జలదచల దీపికాశ్రేణు - లలరె నిండ్ల. 277

తే. నిబ్బరంబుగఁ జిలుకలు - నిలిచినట్లు
ద్వారసీమలఁ బచ్చని - తోరణములు
మూఁడు రంగుల జెండాలు - పొలుపుగుల్కఁ
బ్రతిగృహము చూడఁ గన్నుల - పండు వయ్యె. 278

కం. జ్యోతిని వెలిఁగించి ధృతిం
జాతీయపతాక కెఱఁగి - సఖులకు ఫలముల్
ప్రీతిగ నొసఁగుచునుండుట
నాతఁడెఁ బ్రతియింటఁ బెండ్లి - యట్టులె యుండెన్. 279

తే. అచ్చపుంగోర్కెఁ బరికింప - వచ్చు ప్రజల
వాహనోత్థరజోవ్రజ - మూహకంద
కబ్ధిజలముల నింకింప - నమితకుతుక
మొప్ప జనదానధారల - నుదధి నిండె. 280

సీ. బహుపుణ్య సంస్కార - భాగ్యవశమ్మునఁ
ప్రాప్తించె రాష్ట్రమన్ - రహి రహింపఁ
దద్ధ్వైశ్యదర్శనో - త్సాహ సమాగత
బంధుమిత్రాదులఁ - బరమ కరుణ
శాల్యోదనాపూప - శాకోపదంశాజ్య
దధిశర్కరాక్షీర - తతులఁ దన్పి
కర్పూర తాంబూల - కదళికా ఖర్జూర
ద్రాక్షాదులందృప్తి - దనర నొసఁగి

తే. భరతచరితా వినోదైక - భాషణములఁ
గొంతకాలమ్ము గడపి వి - శ్రాంతి నిచ్చి
యుత్సవవిశేషములఁ గొన్ని - యుగ్గడించి
యతిథి సత్కారసుకృతాత్మ - లైరి ప్రజలు. 281

ఉ. మేళ్ళడు దైవసేవయని - మిక్కిలి శ్రద్ధగ సంజ బాలికల్
ప్రోళ్ళఁ శివుళ్ళు పుట్టునటు - పూరితభక్తిరసైకగేయముల్
రాళ్ళు గరంగ శ్రావ్యపద - రంజితమంజులలీలఁ బాడి రా
గుళ్ళ వెలుంగుదేవతలు - కూరిమి నిద్దరఁ బ్రోవకుందురే. 282

వ. పరివృతసతతహరితలతాంత లలితలతావితాన సహితానంతాజనమేత పురోపకంఠ చతుర్దిశా గిరివ్రజములు స్తంభములుగ వినిర్మలాంతరిక్షము వితానముగ నక్షత్రములు చిత్రవిచిత్ర మౌక్తిక రచనలుగ నల్పానల్పానేకవర్ణ మహోజ్జ్వల విద్యుద్దీపికా శ్రేణులు మణిగణ దివ్యదీప్తులుగఁ యాతాయాత శుకశ్రేణులు మాణిక్యకీలిత తోరణములుగఁ దద్బ్రహ్మన్న

గర కళావేదికార్హ ముగ భగవన్నిర్మితాతివిశాల కాయమానమోయన నప్ప్రదేశమొప్పె. ప్రధానవీధుల వీధిభాగవత నాటక నాటికాదులు ప్రదర్శింపఁబడుచుండె. 283

కం తొలిసంజ నళినముంబలెఁ
బలుగడిగిన ముత్యమట్లు - పొలిచిన నగర
స్థలముల వేడుకలెసఁగఁగఁ
గలియుగ వైకుంఠమనఁగఁ – గ్రాలెఁ బ్రోలిఁ. 284

సీ. అపరంజి నునుదళ్కు - నవఘళించెడి మేని
జిగిదైవదత్తమౌ – నగయగాగ
నెఱిసోగకన్గవ - నెలఱామదిఁగరఁచు
కళలూరు చిన్నివె – న్నెలలుగాయ
శ్రుతిహిత ధ్వనులతోఁ - బ్రతిపదమలరార
నన్యోన్యభాషణ – మమృత మొలుక
నయ్యాయి దృశ్యము - లరసి వర్ణించెడి
విధము వివేకంబు - వెల్లడింప

తే. మాతృభాషా విశేష స - మ్మానదృష్టి
లలిత గంభీరతందగఁ - దెలుఁగుతల్లి
రత్నసింహాసనం బెక్కి - రాజిలుతఱి
రమణు లరుదెంచి రపరశా - రద లనంగ. 285

శా. ఏమే నెచ్చెలి రావటే సభకు నీ – కేమీధవుండన్నిటఁ
సామర్థ్యంబును జూపుటన్మదముహె – చ్చన్నాగు దీవన్న నీ
కేమే మెత్తని భర్తచెప్పినటులెం – తేఁజేయునంచివ్విధిం
భామారత్నము లొండొరుల్సరసవా – గ్వైచిత్రి వేంచేయఁగఁ.286

తే. లౌకిక జ్ఞానపూర్ణ వి - లాసలీల
గంధ గంధర్వ గజరాజ - గామినులన
నాటపాటలు నేర్చిన – నాటవెలఁది
తరుణు లేతెంచి రందాల - తారలనఁగ. 287

వ. అత్తఱి నాంధ్రప్రదేశ ప్రారంభోత్సవ సమజ్యా సూచకముగ నైదుసార్లు శతఘ్నులు ప్రేలె. మహిళా మణీమండలమున కొక నిర్దిష్ట

ప్రదేశమేర్పడ, జాతీయపతాకా చిహ్నాలంకృతాసంఖ్యాక స్త్రీ పురుష స్వచ్ఛందసేవక నికరమ్మమ్మహా బహిరంగ సభ ప్రశాంతముగ నిర్వహింపఁబడ సర్వదిక్సమాగత ప్రజాచక్రమును సక్రమైకపది కెప్పటి కప్పుడు త్రిప్పుచుండె. వేదికనుండి యనుక్షణము కార్యక్రమము నివేదింపఁబడుచుండె 288

కం. ఎనిమిది దెసలం దవ్వుగ
జనముంట న్వినుటకనువు - గాఁ దత్కర్తల్
కనుచూపు మేర నిల్పిరి
ధ్వనివర్ధక యంత్రతతులు - బంధురమతులై. 289

కం. నరసాగర మనఁదగు త
ద్వరసభ జనతాతరంగ - తతి యాఁగదు త
ద్గురుతరవైభవ మంబర
చరనయనా నందజనక - శక్తి వెలింగెన్. 290

కం. కించిదోగ్భగముకాదు స
మంచిత గతి శాశ్వతైక్య - తానందయశో
దంచిత ఘోషం బిదియనఁ
బంచమహా వాద్యఫణితి - బహుముద మొసఁగెన్. 291

మ. కమనీయాకృతులైన తైర్థికవరుల్ - గంగోదకస్నాతులై
యమలానందము చిందులాడ భగవ - ద్ధ్యానంబు గావించి తో
రమణీయాంధ్రమహోత్సవంబుఁ బలుకం - బ్రహ్మాష్టహంసావళుల్
స్సుమనస్సంపదఁ జూడవచ్చెనన నం - శోభించె నేత్రచ్ఛటల్. 292

తే. కట్టమోటించుకొనుచు స - ల్లడలఁ గనుచు
నక్కడక్కడ నాఁగుచు - నలపు దీర్చు
కొనుచు ముదుసళ్ళు ప్రక్కప్ర - క్కన నడచుచుఁ
దత్సభకు వచ్చిరెంతొ యు - త్సాహ మొదవ. 293

సీ. మేడలమీఁదనుండి యని - మేషులవోలె సతీసుతాదులం
గూడి గృహస్థులాదృతిని - గోవిదుఁడాతఁడెగా ప్రధాని పె
న్వేడుకఁ బార్శ్వసీమఁగల - విజ్ఞులె మంత్రులు చూడుఁడన్న నా
జాడనచూచి తజ్జనము - సంతసమంది స్తుతించె వారలన్. 294



నీ ల ము  స ం జీ వ రె డ్డి
(నాఁటి ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రి - నేఁటి భారత రాష్ట్రపతి)

తే॥ రాజకీయ మహావ్యూహ - రచనయందు
నపర చాణక్యుఁడనఁ జెల్లు - నట్టి ఘనుఁడు
దొడ్డ గొనముల వేలుపు - గిడ్డి యనఁగ
స్థిర యశంబును బొందె సం - జీవరెడ్డి.



రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్

తే॥ శాంతి సంగ్రామ యోధుఁడు - జన హితుండు
మహిత చరితుఁడు గాంధేయ - మార్గగామి
తత్త్వవేత్త దయామతి - ధర్మవాది
పరమ పుణ్యుఁడు తొలిరాష్ట్ర - పతి యితండె.

ఆ.వె. దవ్వు నందు నుండ - దర్శన భాగ్యంబు
కలుగదంచు మదిని - గలఁత చెంది
కోటకొమ్మలెక్కి - కూర్చున్న విధముగాఁ
గొమ్మలెక్కి జనత - కూరుచుండె. 295

వ. నెహ్రూ వేదికనికటంబున కేతెంచుతఱి నేకవర్ణ వస్త్రాలంకృతులై బాలబాలిక లిరుపార్శ్వముల బారుఁదీరి స్వాగతగీతము లాలపించిరి. వినువీధినుండి వేల్పులు కల్పవల్ల్యుత్ఫుల్ల కుసుమాదులఁ జల్లుచున్నారో యనం దోరణములు పుష్పవర్షముఁ గురిపించె. 296

మ. నవధాన్యంబులు సల్లినట్లు తను వ - ర్ణచ్ఛాయలొప్పారఁగా
నవమోదంబున సర్వజాతు లతి ధ - న్యత్వంబునం దత్సభన్
సువిశాలస్థలిఁ జేర నేతలలరన్ - శోభావిభూతిస్థితిన్
రవిదోఁపం గమలంబులట్లు ముఖముల్ - గ్రాలెంగళాలీలలన్. 297

మధ్యాక్కర. భారతమందార సార - బంధురభావవిహార
భూరికారుణ్య విచార - బుధజనసంస్తుత్యధీర
వారిధి గంభీరవీర - బహుజనపాలన భార
ఘోరహింసాకృత్యదూర - కువలయకీర్తి విస్తార. 298

వ. ప్రధాని నెహ్రూజీ సుస్వాగతమని యాంధ్రప్రదేశ ముఖ్యమంత్రి సంజీవరెడ్డి పలికె. 299

తే. ఈ విశాలాంధ్రరాష్ట్ర మి - ట్లీయఁ గీర్తి
చెల్వుగవరించె ననఁగ సం - జీవరెడ్డి
కడు ముదంబొప్పఁగఁ బ్రధాని - కంఠసీమఁ
బొలుపుగా వైచె మల్లికా - పుష్పమాల. 300

వ. జవహరులాలు తదుత్సవ ప్రారంభ వచనంబు లుగ్గడింప భారతాధ్యక్షుఁ డంపిన శుభసందేశ మొక్క యమాత్యుండు సభకిట్లు వినిపించె.

మ. వరపుణ్యంబున నగ్రనాయకత సం - ప్రాప్తింప విధ్యుక్తధ
ర్మరతిన్వర్తిలఁజెల్లు మానవుఁడు ధీ - రత్వ క్రియాలోలుఁడై
సరసత్త్వస్థితి సర్వవేళలఁ బ్రజా - సంక్షేమకార్యక్రమా
దరముంబూవుట నాయకోత్తమమహా - ధర్మంబు విశ్వంబునన్. 302

తే. ప్రజల సొమ్మిది యంటినఁ - బాప మనెడి
నీతిఁ బాటించి యున్నత - నేత లెపుడు
దేని కెంత విధించిరో - దాని కంతె
పథకనిధులను వినియోగ - పఱచు టొప్పు. 303

మ. ధనవంతుఁడొక ధర్మకర్తనని స - త్యజ్ఞానకీర్తిక్రియా
ధనమాసించుటలెన్స పేద నిజ స - త్కర్త్రైకదీక్షారతిం
ధనమార్జించుటలెన్స యొండొరులు ప్రే - ద్యస్నేహసంబంధులై
మనుటెంతే శుభ మద్ది దేశరమకు - న్మాణిక్య దీపాళియౌ. 304

చ. అనయ మనేకయాపదల - నబ్ధిజలప్లవమాననౌకనాఁ
దనరుచునుండు జీవితము - దాని రహస్య మెఱింగి యీశ్వరుఁ
మననముసేయుటొప్పు నది - మంగళదంబయి యొడ్డుఁజేర్చు స
జ్జనుఁడిదినమ్మి దివ్యపథ - సాధననెన్నఁడు మానఁడాత్మలో. 305

తే. ఆత్మ బలిదానమున విశా - లాంధ్రరాష్ట్ర
మమరఁజేసిన త్యాగి య - య్యమరజీవి
యతని లోకోపకారమ - త్యద్భుతమని
యట్టి పుణ్యాత్మునకుఁ దొల్త - నంజలింతు. 306

వ. మేఘచ్యుత జలబిందు ప్రాణపవనములకు రుచివర్ణవాసనలు లేనట్లు మహాత్మునకు నమరజీవికి జాతిమత శాఖాభేద ప్రవర్తనములు లేమింజేసి యిర్వురు పూజనీయులే కర్మవీరులకు భగవత్సహకారము లభించుననుట కిద్దఱి విజయము లుదాహరణములే. 307

అ.వె. వలువ కతన రాదు - విలువ మానవునకు
వర్తనమున వచ్చుఁ - గీర్తి సతము
దాని నెఱిఁగి నరుఁడు ధర్మానువర్తియై
తనరఁ దగిన ఘనత - దానఁ గలుగు. 308

తే. క్షుత్పిపాసల వ్యాధుల - శోకతతుల
మనుచునుండెడి సామాన్య - మానవుండు
ప్రతిఫలాపేక్ష లేకున్న - బ్రదుకఁ గలఁడె
కాని హద్దులు దాఁటిన - ఘనత నున్న. 309

వ. శిక్షార్హుల శిక్షించుచు హింసాకళంక పంకశంకలంబోనాడి యన్వీక్షకీత్రయీవార్తాదండనీత్యాదిరాజవిద్యావిశారద సహకారసమేతుండై సర్వవ్యవహారంబులు నిర్వర్తించుట యుత్తమపాలకుని లక్షణము. దుష్టశిష్టనిగ్రహ ప్రతిపాలనాదులు సమగ్రముగ జరుగని పాలనము సరియగు పాలనము గాదు. దాన దేశమల్లకల్లోలమై గతులుదప్పు. అది యెనలేని ముప్పు. 310

ఆ.వె. బ్రదికి బ్రతుకనిచ్చు – భావంబు భారత
జాతి కాదినుండి – జన్మసిద్ధ
మట్టుగాన నున్న – యన్ని దేశంబులు
స్నేహ దృష్టి మెలఁగు - శివము వెలుఁగు. 311

వ. తుహినాద్రితుల్యవృద్ధివలతుమేని దివమంత యున్నతవదాన్యతఁ బ్రదర్శింపవలయు. సూర్యుఁడు దాఁబ్రకాశించుచు లోకమును బ్రకాశింపఁ జేయుభంగి నుత్తముఁడు దాసన్మార్గమున వర్తించుచు నితరుల వర్తింపం జేయు. ఎవఁడు జీవించియున్నందున మహాపురుషులు జీవించుటకు వీలుండునో వానిదే సరియైన జీవితము. తదన్యుఁడు మృతజీవుఁడు. 312

తే. పెత్తనము చేతఁ జిక్కిన - పెద్దలెల్ల
రిహపరంబుల ధన్యత – కిద్దినాంది
యనక నున్నయ శూన్యమై - నట్లు స్వార్థ
పరత వర్తింప దేశము – బాగుపడున. 313

శా. శరవేగంబుగ మాఱుచున్న విపుడా – చారంబు లేతత్ప్రల
స్థిరతత్వస్థితిఁ దెల్ప శక్యమగునే – శీఘ్రంబ ప్రాపంచికో
ద్ధరణప్రక్రియ నీ ప్రయోగముల శ్ర – ద్ధన్నాగగాఁజేయుచే
గురుబోధామృతసారమంచు ఘనులు – ద్ఘోషింతు రిప్పట్టునన్. 314

తే. పాలకులు పాలితులు ధృతిఁ – బాటుపడిన
ధర్మదేవత నాల్గుపా – దముల నడవఁ
దెలుఁగుమాగాణమున కెంతొ – వెలుఁగుతోవచ్చి
మబ్బుదొలఁగిన భాస్కరు – మాడ్కిఁ దనరు. 315

వ. భోజనపానీయాదుల గర్భగతరోగజీవుల జఠర పైత్యనరసమ్ములు నాశనము చేయునట్లు సర్వమతాచారములం బ్రవేశించిన మూఢవిశ్వాస ముల నాత్మజ్ఞాన సంపన్నులగు మహామహుల బోధనములు నిర్మూలిం చినంగాని సత్యధర్మములు ప్రకాశింపవు. ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రీ!

చ. ద్యుమణివెలుంగుచోఁ దమము - దోఁచునె జ్ఞానమునాశ్రయింపుమా
శ్రమపడి సర్వజీవులకు - సంతతసౌఖ్యముఁ గూర్పనెంచుమా
సుమహితరీతి దేశమతి - శోభఁజెలంగెడి దారిద్రొక్కి నీ
వమలినబుద్ధివై విజయ - మందుము పొందుము కీర్తిసంపదల్. 317

ఉ. పూనికకార్య సత్ఫలము - పుణ్యవశంబునదక్కె నింక సు
జ్ఞానముమై గమింప జన - సంఘసుఖంబున కడ్డుగల్గనే
శ్రీనిధివై యశేషజన - జీవసదంబయి ఏల నిత్య క
ళ్యాణము పచ్చతోరణము - నై పలసిల్లుత రాష్ట్రమెల్లెడన్. 318

వ. అని యధ్యక్షుని సందేశము విసిరించిన పిదప. 319

సీ. పడవడక్కులేక - బడికేగ దృఢదీక్ష
గంగసీదిన ధైర్య - శృంగి యెవఁడు
మువ్వన్నె జెండాను - ముదితవేషము దాల్చి
గంటకంబముపైని - గట్టె నెవ్వఁ
డత్యున్నతాధికా - రాస్పతుఁడయ్యును
గీమైనలేని ని - ష్కాము యెవఁడు
కంటికాగకయున్నఁ - గడుబలవంతులేఁ
జూపని తెగువను - జూపె నెవఁడు
తే. నవశరత్తులుకారలో - నవసె నెవఁడు
కర్మయోగిగఁ గాలంబుఁ - గడపె నెవఁడు
నిత్య నిర్మలనిష్ఠమై - నిలిచె నెవ్వఁ
డట్టిశాస్త్రి శుభాకాంక్ష - లంపె నిట్లు. 320

వ. అత్యల్పప్రజల యత్యల్పత్యాగముతో నత్యల్పకాలమున నత్యధిక జనానీకమున కత్యధికసౌఖ్యము చేకూర్చుటయే ప్రజాపరిపాలన ముఖ్యోద్దే శము. అది నిత్యస్పృహణీయము. హారహీరపటీరగిరివర క్షీరసాగర కహ్లార యశశ్శరీరుండగు నమరజీవి శ్రీరాముల కంజలించి. 321

తే. అష్టమీ దిన చంద్రుని - యట్టులున్న
యాంధ్రరాష్ట్రముఁ బూర్ణ శ - శాంకుఁ జేయ
ఘనకృషియొనర్చి సిద్ధసం - కల్పుఁడైన
యనఘు సంజీవరెడ్డి నే - నభినుతింతు. 322

వ. భారత స్వాతంత్ర్యోత్సవ దినమున గీచిన భారతీయ చిత్రపటమాంత రంగిక వ్యవహార చిహ్నముగ మరల నొకమారు గీయవలసి వచ్చినది. భాషారాష్ట్ర విభజనమున నుడేటఁ జర్మను భావతతులు తలలెత్తినచో ననూహ్యవిఘాతములు జనించుంగాన సంపదలకు మాఱాపదలు గల్గు. స్వాతంత్ర్య భూజాధారయుత భాషాప్రయుక్త రాష్ట్రలతలు వర్ధిల్లుటకు విషయ పరిజ్ఞాన మత్యవసరము. ప్రాంతీయ దురభిమానము పొడసూప కుండునట్లు జాగరూకత వహించుట నూతనరాష్ట్రముల ప్రధానవిధియని లాల్ బహదరు నిజమనోభిప్రాయము వెల్లడించె. అంత రైతురంగావాఙ్ముఖ మొసంగం జనుదెంచుచుండ. 323

కం రంగా సద్గుణజలధిత
రంగా నరసౌఖ్యదాంత – రంగా ఘనస
త్సంగా జనసేవాంబుజ
భృంగా యని మిత్రులితని - నెంతురు మదిలో. 324

ఉ. కర్షకకార్మికాదుల క - ఖండసుఖాస్పదనవ్యరీతులఁ
హర్షముఁగూర్ప నేర్పున మ - హాద్భుతసేవలొనర్చినట్టి దు
ర్ధర్షయశోవిశాలుఁడు సుధా - మధురోక్తినమోఘభావనం
గర్షణ శక్తియుక్తుఁడు జ - గామగఁడీతఁడె రంగనాయకుల్. 325

వ. అని ప్రేక్షకు లనుకొనుచుండ నాచార్యరంగా సభాభిముఖుండై యిట్లను. 326

ఉ. దక్కెఁదపఃఫలంబు వసు - ధాస్థలి నాంధ్రులకీర్తికాంత నేఁ
డెక్కెను మేరుపర్వత మ - హీనముదంబున దిగ్విదిక్కులం
బొక్కెఁ దెనుంగుతేజ మతి - పుణ్యవచోమృతమాని యింక మా
చక్కని తెల్గుతల్లికిఁ బ్ర - శాంత సుఖంబొనగూర్తు మాదృతిఁ.327

వ. రాబర్టు ఓవన్ సామ్యవాద సిద్ధాంతమునకు మూలపురుషుఁడైనట్లు స్వాతంత్ర్య సమరమున మన యహింసాసిద్ధాంతమునకు బాపూజీ మూలపురుషుడు. గోవులకు గోపాలుని మురళీరవళివలె మనకాచార్య స్థానీయుఁడైన మహాత్ముని మనోహర మధురమంజుల స్వాతంత్ర్య వాంఛారింఛోళీ ప్రదీపిత ప్రబోధామృత మానందమును గలుగంజేసి నేఁటికీ స్థితి ప్రాప్తింపంజేసిన యమ్మహనీయుని నామ మిత్తఱి స్మరణీయము. 328

కం. జననాయకవరులారా
జనులకు నశ్రాంతశాంతి – సాధింపఁ దగుం
జనసౌఖ్యమె మనసౌఖ్యము
మనలో మనకెన్నియున్న – మఱతుము వానిన్. 329

వ. అచిరకాలంబున నాంధ్రమాత యానందముతో. 330

కం. ఊఁగును శ్రీలం డోలలఁ
దూగును దివితోడఁ బ్రజలు – తోడ్పడ సరిగన్
వాగులు వంకలు పొలముల
సాగునకు న్మేలొనర్ప – సరగ విరివిగన్. 331

వ. ఇహపరంబుల సాధించుటకు సత్ప్రవర్తనమునకంటె మించినది లేదని బుద్ధభగవానుఁ డాచార్య నాగార్జునుఁడు నొడివిన పలుకులు పుల కండపుం బలుకులని నా దృఢవిశ్వాసము. కావున మనము సత్ప్రవర్తనమున శుభమును సుఖమును శోధించి సాధింపవలయు. 332

తే. సరగనాగార్జునాహ్వయ – సాగరంబు
వచ్చుఁ బచ్చలపతకంబు – లిచ్చు నిలకు
ఘనముగాఁ బాడిపంటల – మనుట నెల్ల
దీనజనకల్పవల్లి మా – తెలుఁగుతల్లి. 333

కం. శ్రమజీవికి సాగరమొక
ప్రమదమొసఁగ విధులనెల్లఁ – బాటింపఁగఁ ద
ద్రమణీయమైన కుల్యలు
హిమగిరి సెలయేరులట్లు – లిఁకఁ బ్రవహించున్. 334

వ. దివ్యస్వప్నము ఫలించినది. ఇదియొక రసవత్సన్నివేశము. సామ రస్య సమాలోచనా సహితాధునాతన వ్యావసాయిక సాంకేతికపద్ధతుల నవలంబించుచో నిఁక మన కుజ్జ్వల భవిష్యత్తున్నదన సంజీవయ్య యిట్లను. కారణాంతరముల వేఱుచేయఁబడి మున్నత్యంత ప్రఖ్యాతినందిన రాజ్యద్వయ సోదరీమణుల నిజాంబుజ హస్తద్వయమ్మునం గౌఁగిలించు కొని యాంధ్రమాత యానందించుచున్న శుభసమయమిది. ఓరుగల్లు గోలకొండ యను నారాజ్య ద్వయవిశేషంబుల నొక్కసారి జ్ఞప్తికిం దెచ్చు కొని సంతసింపవలసిన తరుణ మిది. భాషావిషయిక రాష్ట్రావతరణావ సరమున నా రాజ్యాధిపతు లాంధ్రభాషకుఁ జేసిన సేవ ప్రశంసనీయ మని వారు మార్గదర్శకులని వారి చరిత్ర శ్లాఘాపాత్రమని నివేదింపఁ దగిన కాలమిది. 335

కం. అజ్ఞానమె నరకంబని
సుజ్ఞానమె స్వర్గమనుచు - సూరులనరొకో
ప్రజ్ఞాశాలురు సత్కవు
లజ్ఞానముఁ బాపఁ గైత - లందిచ్చిరిగా. 336

వ. లలితకళలం గవిత్వ మగ్రగణ్యముగాన రాజాధిరాజులు కవిసార్వ భౌముల గౌరవించి పోషించి మహాకావ్యములు వ్రాయించిరనుట జగ ద్విదితము. చిత్రకారుఁడు కుంచెతో బొమ్మవేసి బాహ్య నేత్రములకుం జూపినఁ గవి పదములతోఁ జిత్రపటమును సృజించి మనోనేత్రములకుఁ జూపఁగలడు. సాహిత్యము సముద్రము. శాస్త్రాదులు నదులు. కవి స్రష్ట. శాస్త్రకారుఁడు ద్రష్ట. ఈ విషయము గ్రహించియ యోరుగంటిం బరిపా లించిన కాకతీయులు గొందఱు 337

కం. క్రమగుణాలంకృతులై
నమ్రజనామోదచర్య – నందతనయులై
స్సామ్రాజ్యము సత్కవితా
సామ్రాజ్యము నేలి యశము – సాధించిరిగా. 338

వ. వారు వీరశైవులు. వారి కులదేవత కాకతి. దానం గాకతీయు లనం ధగిరి. 339

ఉ. నిత్య శివార్చనాపరులు - నిర్మల చిత్తులు శక్తియుక్తు లా
దిత్యపరాక్రమాన్వితులు - దీనజనావను లార్యవర్య సం
స్తుత్యులు సత్కళావిదులు - శోభనమూర్తులు నిత్యసత్య వా
గ్భృత్యు లుదారమానను ల - హీనయశస్వులు తన్నరేశ్వరుల్. 340

వ. ఆంధ్రజాతి సర్వతోముఖవికాసమున కమోఘాద్వితీయకృషినల్పిన యా కాకతీయులకు మూలపురుషుఁడు బేతరాజు. పోలరాజు కాలమున నోరుగంటికిఁ జేరువంగల కొండలం బద్మాక్షీ సిద్ధేశ్వరాలయములు, స్వయంభూ కేశవాలయములు నిర్మింపంబడె. అనుమకొండను వీడి యోరుగంటిని ముఖ్యపట్టణముగఁ జేసికొన్న రుద్రదేవుఁడు పాలించు సమయమున నుత్తమ శైవగ్రంథములు వెలువడె. అద్భుత శిల్పకళాఖండమైన సహస్రస్తంభ దేవాలయ మత్తఱి నేర్పడె. పలనాటియుద్ధ మపుడ జరిగె. రుద్రదేవుఁడొక సంస్కృత మహాకవి. ఇతండె నీతిసారమను గ్రంథము విరచించె. 341

ఆ.వె. వినుతభోజువోలె - విక్రమాదిత్యుని
కరణి రాయలట్టు - ఘనమనమున
లలిత కళల నెల్ల - లాలించి పోషించి
రపుడు కాకతీయు - లద్భుతముగ. 342

వ. గణపతిదేవుని యనంతరము రుద్రమదేవి రాజ్యాధిపత్యము వహించె పిదపం బ్రతాపరుద్రుఁడు రాజై ప్రతాపమార్తాండమను పొత్తమును రచించె. అతని సైన్యసంఖ్య నవలక్ష. విద్యానాథుఁడు ప్రతాపరుద్రీయమను నలంకారశాస్త్రము వ్రాసి ప్రతాపరుద్రున కంకితమిచ్చె. అక్కాలమున బందరు మోటుపల్లి రేవులు సుప్రసిద్ధములు. సముద్రవ్యాపార మత్యధికముగ జరిగె. అపుడ మల్లికార్జున పండితుని శివతత్త్వసారము సోమనాథుని బసవపురాణ పండితారాధ్య చరిత్రలు జన్మించె. అనాఁటి నాట్యాచార్యుఁడగు జాయప్ప నృత్యరత్నావళియను గొప్పగ్రంథమును వ్రాసి యాంధ్రదేశమున కందిచ్చె. ఇఁక— 343

తే. గోలకొండ నవాబులు - మేలుగూర్చి
రాంధ్రభాషకు సద్దాన - నలరిరి ప్రజ

మనము పాలించు నీనేల - తెనుఁగునేల
మనము పాలించు ప్రజలెల్లఁ - దెనుఁగులనుచు. 344

తే. శ్రద్ధమైఁ దెన్గుబాసను - జక్కనేర్చి
కావ్యరసమాని మురిసిన - ఘనులు వారు
రాజు చల్లని చూపుల - రాజిలంగఁ
గువలయము నవ్యశోభలఁ - గులుకుటరుదె. 345

వ. కూలీకుతుబ్‌షా మొదలు చివఱి నవాబువఱ కాంధ్రభాష నవధాన ముతో నభ్యసించిన బుధులువారు. హిందువుల ముస్లిముల సమానముగ నాదరించిరి. ప్రభుత్వోద్యోగ ప్రదానమున నెట్టి పాక్షికదృష్టిని బ్రసరింపఁ జేయలేదు. అంధ్ర విద్వత్కవులఁ బోషించి యనేక కావ్యములు వ్రాయించి కృతిపతులై కవితారసికతం జాటిరి. ఇబ్రహీం కుతుబ్‌షా యగ్రజునకు భయపడి ప్రాణభీతిమై నళియ రామరాయల నాశ్రయించి యతఁడిచ్చిన జాగీరునుబొంది సుఖంబుండి భట్టుమూర్తి ప్రభృత్యాంధ్రకవుల పరిచయ భాగ్యముఁ గలుగఁజేసికొని గొప్ప పండితుఁ డయ్యె. అతండు గోల్కొండకు నవాబై యాంధ్రకవులఁ బోషింప వారతని నిభరాముఁడని పేర్కొని తద్దానధర్మముల శ్లాఘించిరి. అద్దంకి గంగాధర కవి యతని యాస్థాన ముననుండి తపతీ సంవరణోపాఖ్యానము రచించి వాని కంకితమిచ్చె. నిరంకుశోపాఖ్యానమును, సుగ్రీవ విజయమును విరచించిన కందుకూరి రుద్రకవియు నతని యాస్థాన కవియే. ఇతని కాలమున కామినేని మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్ర, పద్మపురాణ, శివధర్మోత్తరఖండముల వ్రాసి యశశ్శ్రీనందె. మనమిఁక నాంధ్ర విద్వత్కవీంద్రులఁ బోషించి యాంధ్రభాషాయోష కమూల్యాభరణములు చేకూర్పవలయునని మనవి చేయుచున్నాఁడనన ముఖ్యవ్యావహారికుఁడు సంజీవరెడ్డి. 346

మ. అమితానందము లోనిముడ్చుకొని య - ర్థారూఢహాసద్యుతుల్
కొమరొప్పం దిలకించి యిట్లను యశః - కోశంబు నిండార ని
ట్టిమరేజ రాష్ట్రము దీనివృద్ధి నిరతం - బాసించి సాధించి త
ద్రమణీయంబగు దృశ్యముంగనుచు ము - ద్రాజ్యంబుఁ బాలించెదన్.
వ. అమల గుణసముపేతా యద్భుత త్యాగనిరతా, యాంధ్రమాతా. 348

కం. బిసినీచ్ఛదనయనలు నలు
దెసలఁ హారతులుపట్టఁ - దెలుఁగుందల్లీ
యసమాన వికాసంబునఁ
బసమీఱన్వెలుఁగు వెలుఁగుప - బాటన్మాటఁ. 349

తే. ఒనర మంజరు లంబురు - హోత్పలములు
సౌరభమునల్లు మలయజ - చంపకములు
కవులు పంపిరి క్రొంగ్రొత్త - కానుకలుగఁ
దేఁటగీతల నీకీర్తి - తేటపడఁగ. 350

వ. అమరవీరాగ్రణుల యమోఘత్యాగమ్ముమై నఖండాద్వితీయజ్యోతిగ వెలుఁగుచున్న యాంధ్రప్రదేశము రాష్ట్రముల పట్టికయందుంబలె సర్వ విషయంబుల నగ్రస్థాన మాక్రమించుట కర్హతపొంద మనమందరము యత్నింపవలయు. భాషారాష్ట్ర నిర్మాణ దీపావళ్యుత్సవమున మూఁడేండ్ల నాఁడే త్రైలింగులు ప్రమిదెలను వెలిఁగించి ప్రారంభోత్సవ మొనర్చిరి. అనాఁడు ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ కర్నూలిలో వెలిఁగించిన దివ్య దీపమే యీనాఁడు సర్వభారతంబున నఖండజ్యోతిగఁ బ్రకాశించుచున్నది. ముచికుందపురి యని భాగ్యనగరమని ప్రాచీనకాలమునఁ బిలువఁబడిన యీ హైదరాబాదు దేశమునకు నడిబొడ్డుననుండి యాంధ్రప్రదేశమునకు రాజధానీ నగరమగుట ముదావహము. కొంతకాల మెడబాసియున్న తెలంగాణా సోదర సోదరీమణులను వారి వాకిటనే కలసికొనుచున్నారము. ఈపుణ్య పునస్సమాగమమునకుఁ బూర్ణాహుతియైన పుణ్యపురుషుఁ డమరజీవి శ్రీరాములు సర్వదా పూజనీయుఁడు. యావద్భారతదేశ మీ సంకల్పసిద్ధునకుం గుసుమాంజలి ఘటించు ఘడియయిది. ఎట్టి మహా వాహినియేఁ జిన్న సెలయేరులనుండియెపుట్టు. ఈ మహోదాత్త విప్లవాత్మక భాషారాష్ట్ర నిర్మాణముకూడ నయ్యమరజీవి యాత్మార్పణమునుండియ యావిర్భవించినది. ఆ స్థిరసంకల్పుఁడు తలపెట్టిన భావన కేవలము స్వరాష్ట్రపు సరిహద్దులకే సంకుచితముకాక దేశస్వరూపమునే మార్చి క్రొత్త చైతన్యముం జేకూర్చుచున్నది. స్వరాజ్యమునకు నిర్మాత బాపూజీ. భాషారాష్ట్ర నిర్మాత యమరజీవి. ఓ శ్రీరామా. 351

తే. గరుడహతినుండి యొక పన్న - గమును బ్రోవ
వరదయాశాలి జీమూత - వాహనుండు

ప్రాణమీ సిద్ధపడియును – బ్రదికెఁ గాని
రామ లేదామె నీజీవ – రక్షణంబు. 352

కం. దివినుండికనెదె రామా
నవభారత నందనమున – నవ్యసుమము నీ
నవనఫలంబని బహుసుఖ
భవనంబని రాష్ట్రమను – బలికెడి జనముల్. 353

వ. రాముల రాజకీయ గురువగు మహాత్ముని వర్ణింప నేరితరము. 354

మ. ఒక నూఱ్లోఁగున నాంగ్లరాజ్యరమఁదా – నుఱ్ఱూతలూగించి వా
రక వారాన్నిధులెల్ల దాఁటిచన ధై – ర్యస్థైర్యముల్పూనెఁ గొం
కక గాంధీజి యహింస యస్త్రముగ సం – గ్రామంబు చాటించి వే
ఱొకరెవ్వారలు చేసిరిట్టిపని స – ర్వోర్విన్మనశ్శక్తిమై. 355

ఆ.వె. అండ చూచుకొనుచుఁ – గొండ ప్రాకుచునున్న
దండి మగలఁ గూర్చి – తడవ నేల
యాత్మ శక్తి వలన – నద్వితీయుండుగా
వన్నె కెక్కి నట్టి – వాఁడు గాంధి. 356

ఉ. అతనికీర్తితోడఁ దుల – యౌటకు శీతనగంబు దానిపై
నాతత దివ్యమూర్తియగు – నా వృషభేశ్వరు వానిపై శివుం
బూతచరిత్రుఁడైన శివు – పూజ్యశిరంబునఁ జంద్రుఁ గంగ వి
ఖ్యాతిగ నిష్ప్రసన్నమము – గామికి నచ్చెరువందె లోకముల్. 357

కం. గీతా పారాయణమునఁ
జేతన్పున ధర్మదీక్షఁ – జేకొని యతఁడా
గీతామృతసారమ్మును
శ్రోతలకుం బంచిపెట్టె – శ్రుతిహిత లీలన్. 358

కం. దూఱినఁ బగఱందూఱినఁ
గారుణికతఁ జూపు గాంధి – ఘనుఁడనఁ జెల్లున్
భారతభాగ్యవిధాతగఁ
బేరొందె మహాత్ముఁ డఖిల – పృథ్వీజనతన్. 359

వ. నిరంకుశ పాలనమునుండి ప్రజలకు సరగున విముక్తి గలిగించి పరిపాలనా దక్షతం జూపి సమైక్య జాత్యభివృద్ధికిఁ దోడ్పడిన సర్దారు వల్లభభాయి పటేలునకుఁ గృతజ్ఞతాంజలి ఘటింపఁ దగిన తరుణ మిది.

కం. పదుకోటి యాంధ్రులకు నిది
పదుకోటి యనేక వర్ష - ముల ఘోరతపం
బిక్కరణి ఫలించుట నిఁక
టపక్కల జయభేరి దివ్య - దీప్తుల మ్రోగఁగన్. 361

కం. ఆనందమున సురలటు
లానంద కళావిభూతి - నంపద మవనిన్
జ్ఞానేందిర వెలుఁగందె ద
యాస్రమగుణ ప్రసక్తి - ననవరతంబున్. 362

వ. పల్లెపల్లెఁ బ్రగతి రథమ్ము రాజపథమ్మున సాగిపోవుట మన్మనో రథమ్ము. జాతీయవికాసమునకు లలితకళల పునరుద్ధరణ మత్యవసరము. జాతియాత్మ రాజకీయవాదుల ద్వారంబునంగాక దాని కళలవలననే యత్యధికముగ వ్యక్తీకృతమగునని మన ప్రధాని యేనాఁడో ప్రబోధించె. ఈవదాన్య శిఖామణి ధీరశిరోమణి దేశప్రధాని యగుట మన యదృష్టము

తే. అఖిల నేతల కాచార్యుఁ - డౌ మహాత్ము
నడుగుజాడల వర్తించి - నట్టి సుగుణి
హాస పరిహాస భాస వి - లాస కలిత
కార్య కుశలత గలిగిన - ఘనుఁ డితండు. 364

తే. పటిమతోఁ బాటు ప్రతిభయుఁ - బరగు కతన
నరసి భారతరాజకీ - యంబునందుఁ
దనకు వారసుఁడుగ గాంధి - తలఁచె నెవని
నట్టి నెహ్రూ ప్రధాని మా - టాడు ననఁగ. 365

# నెహ్రూ మహోపన్యాసము

వ. నెహ్రూ సూర్యదర్శనంబున సభాపద్మిని వికాసవిలాసలీలం బ్రదర్శించు చున్నదోయన సభ్యజనముఖంబున నూతన చైతన్యము తొణికిసలాడె.

తే. బలిని గాదని తద్రాజ్య - భాగ్యలక్ష్మి
సంబ్రమునకు నప్పగించు ను - పేంద్రుకరణి
వచ్చిన ప్రధానినింగని - ముచ్చటపడి
మెచ్చుకొనిరి ప్రేక్షకు లని - మేషలట్లు. 367

చ. తెలినులిఖాదియుం గనుల - తిన్ననిజోడును గాంధిటోపియుజా
వెలతెలియంగరాని తన - పేరవెలింగెడి చిన్నకోటునుం
గళలును దావులుం జిలుకు - కమ్రసుమంబును రాజదండముజా
వెలయఁగవచ్చి నిల్చె నతి - వేలముదంబున వేదికాగిరిజా. 368

తే. నేత యాతండు వేదిక - నిలిచినంత
దివ్య దీధితి దివిజల - ధిక్కరించు
యంత్రపాంచాలికాశ్రేణి - యతి సుగంధ
కుసుమవర్షము కురిపింపఁ - గూర్మి నతఁడు. 369

శా. ఐదంతస్తులమండపస్థుఁడయి పు - ష్పాలంకృతుండై హ్రాదా
హ్లాదశ్రీల నమస్కరించి సభ క - త్యంతాదృతిన్నేఁడు మీ
మోదంబెచ్చ మహాంధ్రరాష్ట్రమిది నం - పూర్ణంబుగా నేర్పడెజా
వేదాశీస్సుల వృద్ధిపొందుఁడికఁ ను - ర్విజా సద్యశశ్శ్రీలతో. 370

వ. అని స్వతంత్రభారతమాతకు జయజయధ్వనులుగావించి స్వాతంత్ర్య సౌధమునకు వజ్రమయ సోపానపంక్తులంగూర్చిన మహామహులకు జోహారొనరించి గాంధీజీని దలంచి. 371

సీ. అత్యుగ్రగ్రీష్మాత - పాగ్నికిఁ దపియించి
  వీటలనోర్చాపు - పృథ్వికరణి
సామ్రాజ్యవాంఛా పి - శాచంబు నరరక్త
  పానేచ్ఛవక్త్ర గ - హ్వరముఁ దెఱవ

మంత్రరుద్ధముసేసి - మాంత్రికుఁడౌ గాంధి
శాంత్యహింసాదులన్ - సత్ఫలముల
సత్యదీపంబున - సాహసధూపాన
దీక్షావిభూతి ను - ద్రేకమణచి

తే. సయభయంబుసి దానిస్థా - నమున కనిపి
సకలభారతమున కెంతొ - సౌఖ్యమిచ్చె
మాన్యుఁడు మహాత్ముఁడౌట న - మ్మహిత నేత
కంజలిఘటింతుఁ దత్సూక్తు - లాదరింతు. 372

ఉ. మెల్లగఁ దాపుసేసికొని - మేన మెలంగెడి రోగజీవులం
దెల్లకణాలు చంపునటు - దేశము దుర్గతిఁ బాప బాపుజీ
నల్లలితార్థసంస్థలె వె - సంగడుశక్తిఁ దనర్చుఁగాన మీ
రెల్లరు గాంధిజీపథము - కామకద్రొక్కుఁడు మేరువెక్కుఁడా. 373

వ. చారిత్రికదృష్టిం బరికింప సర్వసర్వంసహా చక్రమున నోంప్రథమముగ నహింసావ్రతము నాచరణ రూపమున బహుళ ప్రచార మొనర్చినయశస్వి శాక్యర్షి యని యాత్మకుందోఁచు. 374

చ. అతని దయావిలోకన సు - ధాంశుజ నిర్మల సాంద్రచంద్రికా
తతి హత రాజహంసపయిఁ - దల్లిని వెన్కొను మేఁకపిల్లపై
నతిభయదోరగంబుపయి - నద్భుతలీలలఁ బర్వి యావయిజ్ఞ
క్షితిఁగల ప్రాణికోటుపయిఁ - దెల్విగ వెల్గె జగద్ధితంబుగజ్ఞ. 375

మ. అరిషడ్వర్గ విజేత సర్వసహ న - త్యానంద సంధాత దు
ర్భరహింసాంధ దివాకరుండు కరుణా - పాథోధి విద్యుత్కళా
పరమాత్మేక్షణ కాంతివృత్తయుత దీ - వ్యచ్చిర్షుఁ డుద్యత్సుధీ
వరమౌనీశ్వర కల్పభాసురుఁడు స - ర్వజ్ఞుండు సామాన్యుఁడే 376
(శివుఁడు + బుద్ధుఁడు) (ద్వ్యర్థి)

వ. అట్టి ధర్మరాజును నిచ్చస్పృహకుఁదెచ్చు ధర్మచక్రశోభితము వీర విజయ ప్రతీక మనపతాక. అహింసావ్రతమున సుగతుని యడుగుజాడల వర్తించినవ్యక్తి నబర్మతీమహర్షి. సత్యాగ్రహ సమరసాగరమున మహా మత్స్యమూర్తింబలె స్వైరవిహారము సల్పిన సారతరమేరుధీరుఁడు మహా

త్ముఁడు. సర్వమతసూత్ర సమన్వయకేంద్రము గాంధీజీ హృదయ మంది
రము. ఇట్టి శుభసమయమ్మున నట్టి మహాత్ముని స్మరించుట ప్రతి భారతీ
యుని ప్రథమ ధర్మము. 377

ఉ వాదవిభేదభావము ల - వారిగ దానవ సార్వభౌమ మ
ర్యాదకుభంగమేర్పడ ని - రంతర చర్యల సత్యదేవతా
రాధనసేసి హింసలఁ బ - రాత్పరు ఁమ్మి సహించి మీఁదఁ బ్ర
హ్లాదమహాత్ముఁ డుజ్జ్వలజ - యాన్వితుఁడై పరమార్థమందఁడే. 378
(ప్రహ్లాదుఁడు + గాంధి) (ద్వ్యర్థి)

చ నరసతలేమి రాత్రిపున - శాంతినెదిర్చి యరణ్యరోదనం
బరయుచు వైరివైరిక జ - యంబునుగూర్చి స్వారాజ్యసంపదం
బొరసెఁ బరేశుశక్తిఁ దగఁ - బొంది మహాత్ముఁడు ధర్మరాజు సు
స్థిరతరకీర్తి దీధితుల - దిక్తతి వెల్గుట నిత్య సత్యమౌ. 379
(ధర్మజుఁడు + గాంధి) (ద్వ్యర్థి)

వ. "వసుధైవకుటుంబక"మ్మను సత్యోత్తమ ధర్మస్థాపన మంతర్జాతీయ
విజ్ఞానవేత్తల ముఖ్యకర్తవ్యము. క్రీస్తుశకమునకుఁ ద్రిసహస్రవర్షములు
పూర్వమె మెసపొటోమియా రాజగు నురుకాజినా 'దుర్బలస్యబలం రాజా'
యన్న సూక్తి సార్థకము సేసె. మన మహాత్మునింబలెం బెక్కు సంస్క
రణ లొనర్చి నిత్యాచరణ రూపమున సాధించె. నిర్మలదృష్టి దుర్మార్గ
ములం దీవ్రతరముగ నడంచి ప్రజలకు స్వేచ్ఛనిచ్చె. ఏకపత్నీవ్రత
ముత్తమ గృహస్థధర్మమునకుం బరాకాష్ఠయనె. బాబిలోనియా మహా
రాజగు హమూరబీ రచించిన న్యాయస్మృతి గాంధీజీ సిద్ధాంతతతికి సన్ని
హిత సంబంధముతో నలరారుచుంట విద్వజ్జనవిదితము. 'అర్థికబలముగల
మానవుఁడే సంపూర్ణమానవుఁడుగాఁడు. సదభ్యాసనిష్ణాతుఁడే సంపూర్ణ
మానవుఁడంట బుధసమ్మతము. అహోర్యాన్నత్యము లోయ లోతు నెఱుం
గుటకు భారమితి సహకరించునట్లు సత్కార్య దుష్కార్యములకుఁ దెలివి
యుపయోగపడు. మనోరథంబునకుఁ గేంద్రీకరణవికేంద్రీకరణ ద్వయంబు
చిత్రంబులైన చక్రంబులేగాని వానిని సక్రమమార్గంబున నడపుకొంట ధీర
లక్షణము. అస్తమించుచున్న సూర్యబింబము మాధ్యాహ్నికాదిత్య బింబ
మునకంటె బృహద్రూపమునం గోచరించు నట్లొక్కొక్కప్పు డేకమాన
వుఁడే స్థానముంబట్టి ఘనుఁడుగఁ గనంబడు. కాని యతని సహజస్థితి

నాకళించుకొనుటకు సూక్ష్మజ్ఞాన మత్యవసరము. ఉష్ణపవన మధికో ష్ణము నాకర్షించుకొనంగలిగినట్లు మహామేధావి యసంఖ్యాక విషయ ముల గ్రహింపఁగలుగు రవిరశ్మింగాచఖండము మిలమిల మెఱసిన నది రత్నముగాదు. స్వచ్ఛజలము ప్రకృతినలభ్యనమైనయట్లు పరిపూర్ణమాన వుఁడు ప్రపంచమున లభించుటరుదు. ఐనను స్వాభావికోదకముల వర్షనీరము నిర్మలమనందగినట్లు లీయుగమున మహాత్ముఁడే యచ్ఛశీలుఁడు. రక్త బలముగలవ్యక్తికి రోగాణురక్షణశక్తి సహజముగనుండు చందంబున దైవబలముగల నరునకుఁ గష్టసహనసత్త్వము ప్రకృతిసిద్ధముగ నేర్పడు. "నాస్తిమేఘసమంతోయం నాస్తిచాత్మ సమం బల"మ్మనె చాణక్యుఁడు. గాంధీజీ యాత్మబలమేగాక దైవబలముగల మహావ్యక్తి. 380

మ. ఒకనాఁడిద్ధర నిట్టి దివ్యగుణ తే - జోద్భాసి జన్మించెనా
యకలంకంబగు తత్పదాబ్జముల ము - ద్రాలంకృతంబై మహా
సుకృతంబీస్థిర వొందెనా ప్రజలు త - త్స్వాక్తుల్వినన్నోచిరా
సకలం బద్భుతమంచు భావిజనముల్ - సందేహముం బొందరే. 381

వ. అని యొక్కయాంగ్లేయుండు మహాత్ముని బ్రశంసించె. పర్జన్య గర్భా జనిత వైడూర్యంబులంబలె గాంధీజీ ప్రబోధనమునఁ బెక్కురు దేశభక్తులై ప్రకాశించిరి. ఎవ్వండే నొక్కండెగ్గాడ గాంధీజీ ఘనత తగ్గదు. 382

చ. ఘనుఁగని యోర్వలేక బుధ - కంటకవృత్తి నిమగ్నుఁడౌచు గో
స్తనగతసూక్ష్మరంధ్రముల - చాయ నగోచరదోషముల్మహా
ఘనముగఁ జూపి యుత్తముని - క్రమచరిత్రకు మచ్చఁగూర్ప నెం
చినఖలు బుద్ధిహీనత హ - సింపరె తద్జ్ఞులగాధ దృష్టులై. 383

ఆ వె. సత్యపథనిబద్ధ - శాంత్యహింసాత్మక
జీవనంబు లోక - పావనంబు
ఉన్నదానిలోన - యుపకృతి యొనరించు
కాఁపురంబు ధర్మ - గోపురంబు. 384

ఆ.వె. పశువుగడ్డిమేసి - పాలనిచ్చుచునుండఁ
బాలుగ్రోలి విసము - పాముసంగు
సహజగుణము మాన్ప - శక్యముగాదెంత
పాలుపడిన నెంత - భ్రాంతిపడిన. 385

చ. కుచ్చుల నాగమట్లెవఁడు – కోవిద కోటికి గోచరించునో
మెచ్చరు దచ్చరిత్ర నని – మేషులు నమ్మరు మిత్రశత్రులే
మిచ్చిన వాని బుద్ధిగొనక – యుంచుక మాఱడు దుర్వ్యశంబొగిన్
హెచ్చును జచ్చినంజగతి – నెన్నడు మాయవు తత్కళంకముల్.

ఆ.వె. మతము లెన్ని యున్న – మనుజ జాతి యొకండె
యలలెఁకెన్ని యున్న – జలధి యొక టె
జీవు లెన్ని యున్న – జీవాత్మ యొక్కటే
తెలిసి ధర్మదృష్టి – మెలఁగవలయు. 387

తే. జీవకారుణ్యపుణ్య స – జ్జీవితంబు
గాంధి బోధించె నదినిత్య – గమ్యమనుచుఁ
గులమతద్వేషములనెల్లఁ – గూలఁద్రోసి
ముందడుగువేయుటెంతయు – ముదముఁగూర్చు. 388

తే. మార్గదర్శి హితుండైన – మనకు మేలు
గల్గు నహితుండు ప్రాప్తింపఁ – గలుగు కీడు
కృష్ణసారథ్యమునఁగాక – యెవరికేని
శల్య సారథ్యమున నెట్టు – జయము గల్గు. 389

మ. బహువర్షోగ్రతపోపలబ్ధమిది యీ – పర్వంబఖర్వంబు మీ
సహనంబద్భుతమై వెలుంగవలె భా – స్వద్రాజకీయాన ని
స్స్పృహరాఁజెల్ల దమోఘవృద్ధిగలుగన్ – సౌఖ్యక్రియాలోలురై
విహరింపందగు ధర్మమార్గమున భా – విన్నిచ్చ భావించుమన్. 390

వ. అధునాతన మానవ నాగరికతా పోషణమునకు రసాయనశాస్త్ర మత్యంత దోహదకరమైన విధంబున బహుముఖ దేశాభ్యుదయమునకు సర్వజన సమైక్యత సతత ప్రోత్సాహకరమగు. సామరస్య పూర్వక వాతావరణ మధ్యమున సమస్త సమస్యలు సరిగ సరగఁ బరిష్కృతము లగు. సామాన్య మానవదృష్టికిం బరిపాలన నిర్వాహణము లేగులాబిపూలు తఱచుగఁ బఱచిన రాజమార్గ స్వైరవిహారము. కాని జ్ఞానదృష్టిం బరికింప నదిపటుతర పద్మవ్యూహ భేదనము. శిలాకంటకావృత సంకట పథ గమనము. క్రూరాక్రూర ప్రాణివర్గాకీర్ణ దుర్గమారణ్యమార్గ సంచా

రము. అయ్యది కాశ్మీర రత్నకంబళాస్తరణ శోభితహాటక శృంగార శృంగాటకముగాదు. అంకెకు వచ్చిరాని ఘోటకము. విషమఘట్టముల ముండ్ల కిరీటము. దీనిం గమనించి పాలకపాలితు లన్యోన్యానురాగంబున నవ్యాజ సహకారంబున దేశపురోభివృద్ధికిం దోడ్పడుట లగ్గు. అనురాగ శూన్యానుబంధం బసంభవంబు. 391

ఉ. ఐక్యత శూన్యదోషమున – హాసజనించి కలంచు నాఁపఁగా
శక్యముగామదానిఁ గను – శాంతిపథానఁ బరిష్కరింప మా
ణిక్యముగావెలుంగు నది – నీతినిధుల్గమనింత్రు మీమహా
వాక్యము సిద్ధిపొందినది – వైళమ యభ్యుదయంబు నొందుఁడా. 392

కం. పట్టాభి యెన్నిసార్లో
గట్టిగ మాటాడెఁ గాని – కాలము కర్మం
బిట్టిగతిఁ గలసిరామిం
బట్టెను నిన్నాళ్ళు పట్టు – పట్టెజ్ఞ రాముల్. 393

మ. బలిదానంబునఁ దెచ్చె రాములని సం - భావించి తన్నామముం
గలకాలమ్ము స్మరించి వానిఋణమీఁ - గంజూచు టత్యుత్తమం
బిలపై నెందఱు పుట్టిగిట్టి రిటు స - త్కృత్యంబతుల్యంబహో
చలుపంజాలిరె తచ్ఛిలాప్రతిమ పూ - జ్యస్థానమందుంచుఁడీ. 394

తే. లక్ష్య సాధన సిద్ధాంత – లక్షణములె
ప్రత్యణువునందుఁ దనువునఁ – బరగుకతన
నున్నత త్యాగకీర్తి ర – మోజ్జ్వలగతి
మేరుశిఖరమ్ము నెక్కిన – ధీరుఁ డతఁడు. 395

చ. అరయఁగఁ బోతుగడ్డయని - యాంధ్రికిఁ గీర్తిలభించె మున్నె మీ
చరిత మనంత మద్భుతము - శాంతముతో మిసుమీర యేలుకోఁ
దరుణమువచ్చె నైక్యత స - దా సుఖలీలకు జీవగఱ్ఱ యీ
పరమ రహస్యముందెలిసి - పాలకపాలితులుంట లెస్సయా. 396

వ. ప్రత్యేక లక్షణ కలిత సప్తస్వరస్థాన బహువిధనాదయుత తంత్రు లుపెక్కున్న స్వధర్మ నిర్వహణమున నన్నియుంగలసి ప్రముఖ వైణిక నఖరేఖల కనువుగ మెలఁగినపుడ వీణాగానమున నానందరస ప్రవా

హము వెల్లివిరియునట్లు లోకకుటుంబమున నొక గ్రామమున నొక రాష్ట్ర
మున నొక దేశమునఁ బ్రజలు త్తమ నాయకాగ్రణి శాసనానుకూలముగ
వర్తించుచు విధ్యుక్తధర్మముల నిర్వర్తించుచున్నప్పుడె తత్ఫలితములగు
శాంతిసుఖములఁ బడయఁగలరు. 'జననీజన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ'
యనిగదా బుధోక్తి. 397

కం. తలినెలిఁగి మీరు వీరులు
గురుతర బాధ్యతలనెంచి — కొనుచుఁ జరింపన్
సురలు వరమిడిన వడువున
పరసుఖముల వరలఁ గలరు — వసుధ వసురమన్. 398

శా. నిస్సీమోగ్రవిచిత్రతాండవకళా — నిర్నిద్రదారిద్ర్యమున్
దుస్సాధ్యంబిఁకఁ బాఱఁద్రోలు టనుకుం — డుస్వీడి సోత్సాహులై
నిస్సారాంధనికృష్ట జీవితపథా — నీ తవ్యధాలోలురా
ఖిస్సాశూన్యజనాళిఁ గావఁగదరే — ప్రీతిన్సుధాదృక్కులన్. 399

తే. పేద నొకకంటఁ దగఁగని — పెట్టుటొప్పు
శ్రీగలారల సంగతిఁ — జెప్పనేల
వ్యాధిగలవానికే మందు — వలయుఁగాని
యౌషధముతోడనేమి నీ — రామయునకు. 400

తే. కాలినను సిద్ధి జీతము — కాఱఁబోదు
కాన మనకేమి యనునధి — కారులున్నఁ
గార్యగతి సాగకుంట న — కాలమునకు
దేశమెఖ్ఖంగి శ్రీలతోఁ — దేజరిల్లు. 401

మ. జననీసన్నిభమాత్మభూమియను వి - శ్వాసంబువోనాడి స
జ్జనసూక్త్యర్థములం గ్రహింపక మహా - శాశాపసంతప్తుఁడై
తనరాష్ట్రేందిరసౌఖ్యమున్ మఱచి స్వా - ర్థప్రక్రియాలోలుఁడౌ
రణజంబూకనిభాధికారిఁ బ్రజలే - రాజే మదిన్నమ్మునే. 402

చ. నరులిటు క్షుత్తృడాశల న - నారతపీడితచిత్తులై సుధా
సురుచిర సత్యధర్మ పరి - శోభిత వృత్తులుగారు సూక్తులన్

పరఁగ గణింపలేరయిన - సజ్జనసంఘ మమోఘనిష్ఠమై
నిరతము న్యాయమార్గమున - నిల్చును గెల్చును నాకలోకమున్.

ఉ. నానమనస్థ్లు స్వార్థమెడ – వారక పెంచక రాష్ట్రదేశముల్
నానువిభేదమాత్రమని – నమ్మిద్వయంబునమైక్యతంగనం
గానుట కేంద్రశాసనమ – గిత్తునటుం దలయొగ్గి వర్తిలన్
శ్రీమదఖండభారతమ – శేషమహాభ్యుదయైకభాసమౌ. 404

వ. 'జీవన్ భద్రాణిపశ్యతి' యనిగదా సుజనసూక్తి. యంత్రతతికింధనములు నరశరీరముల కాహారములు శక్తి ప్రాప్తించుంగాన మానవునకుఁ బౌష్టికాహారము ముఖ్యాతిముఖ్యము. అట్టి బహువిధాహార ధాన్యోత్పత్తి కీప్రదేశము ప్రధానస్థానము. ఆంధ్రదేశమన్నపూర్ణాదేవి మందస్మితానందకందళితహృదయారవిందయై వసించు సుందరమందిరము. ఆంధ్రమోహినియందాలవాహిని. ఉత్తర దక్షిణ నాగరికతా ధూమశకటసంచారమున కనాది దైవనిర్మితాసామాన్యవారధి. గభీరహృదయనీరధి. జ్ఞానరథసారథి. ధర్మదేవతా విహారవీథి. ఆరాధితోపాధి. అధర్మనిరోధి. పరమనిష్ఠావరిధి. దేశసేవాసేవధి. శరణాగతత్రాణశరధిశరధి. వేదవేది. లలితకళాహ్లాది. విద్యావినోది. నవరసాపాది యీ త్రిలింగ కాశ్యపీఖండము. 405

ఉ. తొల్లనికంటుతోఁ దొడరి - దొడ్డదొరల్జగజెట్టులెందఱే
నల్గినఁ బుల్గులల్గులకు - నందినయట్టుయి తెల్గుబావుటా
వెల్గులు నల్గడల్వ్రాలఁగ్గి - వేయికతల్వెలయించునాఁ డిటం
గల్గిన కల్మిబల్మి హరి - కాంక్షమెయింగను వేయికన్నులన్. 406

మ. బలశక్త్యన్వితధీయుతాఖిలయువ - వ్రాతంబె దీక్షారతిం
దలఁగంబోక మెలంగఁ జెల్లు జవన - త్త్వస్ఫూర్తి హీనస్థితిం
జెలఁగన్మానవుఁడెట్టు ముందడుగు వాం - ఛించున్నదీశయ్యలం
గల సామాన్యజలంబు శీఘ్రగతినా - కాంక్షించునే యెన్నఁడే. 407

కం. బలహీనవర్గములఁ గని
తొలుదొల్తన తృప్తిపఱచి - తోబలవంతుల్
ఫలితము వడయుట లెస్సని
పలికె మహాత్ముండు దానిఁ – బాటింపఁ దగున్. 408

ఆ.వె. అదిఁ దనివిసనఁగ – నల్పసంఖ్యాకులు
పరులు తృప్తిపొంద – పలయుఁ బిదపఁ
బిన్న దిన్న వెనుక – పెద్దలు తినుచుంట
నరయఁ గలరు జగతి – నసుభవమున. 409

ఆ.వె. పోరివలన నెవఁడు – పొందు లాభంబును
సంధివలన శుభము – లందఁ గలుగుఁ
గాన సఖ్య మొకడె – కడుసౌఖ్యమునుగూర్చుఁ
గుటిల రాజనీతి – కూడ దెపుడు. 410

కం. సుమనోనురాగసంపద
విమలాత్ముల కెప్పుడొదవు - విషహృదయుల క
య్యమవసజాబిలియగు నది
గమనించి మెలంగ జనువు - కడుధన్యంబౌ. 411

సీ. బీజాక్షరములతో – బిగిసియున్న పదాలు
బాలగ్రహాదులఁ - బాపఁ ద్రోలు
శాంత్య హింసలతోడ - సాగిన సమరంబు
పరపాలనంబును - బాపఁ ద్రోలుఁ
గష్టార్జితముమీఁదఁ - గాంక్షయుంచిన యిల్లుఁ
పరమదారిద్ర్యంబుఁ - బాపఁద్రోలు
నిటలాక్షుపదపద్మ - నిత్య నిర్మలనిష్ఠ
పాపసంఘంబులఁ - బాపఁద్రోలు

తే. సర్వసంగపరిత్యాగ – సాధుమహిమ
బంధకారణశతములఁ – బాపఁద్రోలు
నిట్టి ధర్మములందున్న – గుట్టు దెలిసి
నరుఁడు వర్తింప సౌఖ్యసం – భరితుఁ డగును. 412

వ. గగనలక్ష్మికిఁ జంద్రకళ, పర్జన్యాధిదేవత కింద్రధనుస్సు, మేఘమునకు మెఱుపు, ప్రాక్కకుపంగనా శిరోమణి కరుణోదయము, హిమగిరికి గౌరీశంకర శిఖరము, వసంతునకు సుగంధ సుమసంతతి, పికమునకు మృదుమధుర కంఠధ్వని, శుకమునకుఁ గెంపులుచెక్కినముక్కు, మయూ

రమునకు సమంచిత పంచవర్ణ పరిశోభిత పింఛము, గరుడునకు గళ గతజితరజత శ్వేతవర్ణము, హంసకు ముద్దులొల్కు నడక, శుండాలమునకుఁ దుండము, సింహమునకు శౌర్యరససూచకసాంద్రతర కేసర చయము, వృషభరాజమునకు సమున్నత మూపురము, దేవాలయమునకు శిల్పకళాకలాప గోపురము, గోమాతకు క్షమాసహిత సాధుత్వము, తురంగమునకు శరవేగ గమనము, కురంగమునకు నయనద్వయము, చక్రోడమునకుఁ బూచిన తెల్లువంటి కుచ్చుతోఁక, పౌరులకు జాతీయ దృక్పథము, పాలకునకు న్యాయపాలన, మధికారికి విధినిర్వహణము, విద్యార్థికి వినయము, గురువునకు సుజ్ఞానము, వనితకుఁ బాతివ్రత్యము, మహాత్మునకు భూతదయ, యింటికిల్లాలు, కవికి విశ్వజనీన సత్యధర్మ ప్రకటనము, కావ్యకాంతామణికి రసరంజిత మంజుల వాగ్విలాస మబ్జమున కాకర్షణ పత్రములు, చందనమునకు సుగంధము, సరోవరమునకు బిసరుహము, వృక్షమునకు ఫలజాలము, లతకు లతాంతము, సువర్ణమునకుఁ జెడని ఛాయ, కాంచనమునకు సౌరభము, ప్రాడ్వివాకునకు నిష్పాక్షిక దృష్టి, మాంత్రికునకు మంత్రదంశము, యోగికి సచ్ఛీలము, దేశభక్తునకుఁ బ్రజాసేవ యందము. కావున భారత జాతీయతా సౌధమున కంతస్తులపై నంతస్తులు కట్టవలసిన బాధ్యత మనపైనున్నది. దేశపురోభివృద్ధికై శ్వాసక్రియవలె నిర్విరామముగఁ గృషియొనర్పం బ్రతిజ్ఞం బూనవలెను నిత్యాత్మపరీక్షయే మనల రక్షింపఁగలదు. జీవితాత్యుత్కృష్ట ఫలితము త్యాగముననె లభించుననుటకు నిర్జితహరిదంత కరిదంతకాంతిచ్ఛటాయశోవిశాలుండగు సమరజీవి శ్రీరాముల జీవితమే ప్రబల నిదర్శనము. 413

తే. కృషికలోకము తద్రాజ - కీయకృషికి
నిచ్చు నీరాజనం బాత్మ - మెచ్చు నతని
కేదొచేసినవారెల్ల - రీడగుదురె
తులయె మణికొక్క గంపెఁడు - గులకఱాళ్లు. 414

తే. ప్రజలకు శుభంబు గూర్చెడి - పాలనంబు
శాసన భయంబు లేకున్న - సాగ దెప్పు
డరయననమర్థునకు రాజ్య - మప్పగింత
షండునకుఁ బెండ్లిచేసిన - చందమెగద. 415

తే. మానవుని తెల్వి యొకయింత - మహితమార్గ
గామియైనట్టి దశనుండి - కలిగెఁ జరిత
యూహకందని యజ్ఞాత - యుగమునందు
నేదియెట్లుండెనో చెప్ప - నెవరితరము. 416

తే. ఏదియో కొంత యూహింతు - మింతెగాని
తప్ప కిదినత్య మనియెట్లు - చెప్పఁగలము
కాలగర్భానఁ గరఁగిన - ఘనచరిత్ర
యక్షరాకృతితోడఁ బ్ర - త్యక్షమగునె. 417

కం. ఒకపరి యొకదేశం బిం
కొకసారి మఱొక్కవిషయ - ముజ్జ్వల వృద్ధిం
జకచకలాడుట యెఱుఁగమె
సకలోర్వీ చరిత చెప్పఁ - జాలు నిజంబుజ. 418

వ. భూలోకస్వర్గ మనందగిన సౌందర్య రమారమణీ రమణీయనృత్య సంశోభిత ప్రాంతములుగల ప్రదేశమేదైన నిలాతలమునం గలదాయన నట్టిది భారతదేశమే — ఇహపర సౌఖ్యసాధనకెట మానవునిబుద్ధి పరిపూర్ణముగ వికసించినదన భారతదేశమునందే యని జగత్ప్రఖ్యాత పండిత ప్రకాండుండగు మాక్సు ముల్ల రుద్ఘాటించె. అలెగ్జాండరు పర్షియా మీఁదికి జైత్రయాత్ర సాగించినప్పుడు నానావిధ ఖడ్గాద్యాయుధములు హిందూదేశమునుండి తెప్పించుకొనెనని ఫిరదౌసి వ్రాసిన షానామా యను గ్రంథము చాటుచుండె. చెంగావిదసిలీలు, రవసెల్లాలు, పట్టుపటములు, ఢక్కామజ్లినులు, బందరు కలంకారీలు, మృగయాపురి లుంగీలు ఖండఖండాంతరముల కంపుటంజేసి మన మాతృభూమి వస్త్రపరిశ్రమలో నందెవేసినచేయియై విశ్వవిఖ్యాతి గన్నదనుట నగ్నసత్యము. కళా నాగరికతా సమన్వయ సమ్మేళన స్వరూపమే సంస్కృతి. అట్టి యుదాత్త సంస్కృతి మన మాతృభూతలమున నతిప్రాచీనకాలమునుండి దివ్యజ్యోతి వలె వెలుఁగుచున్న దనుటకు మొహంజొదారా హరప్పాలు ప్రబల దృష్టాంతములు. ఆదరణశూన్య గౌరవ మర్థరహితముగాన నిరుత్సాహజనకము కాకుంట కౌత్సాహిక కళాకారులంగూడఁ బ్రోత్సహించు టుచితధర్మము. సామాన్య కార్మికునకుసైత మపూర్వాత్మ గౌరవమును బ్రసాదించినది

ప్రజాస్వామ్యమే. దాని రక్షణకొఱ కాయుధబలమునకుంగాక యమూల్యమైన నైతికబలమునకే ప్రాధాన్య మీయందగు. అంతర్జాతీయ సానుభూతి మనకెంతేనిఁగలదు. ప్రజారాజ్యమునఁ బాలకుఁడు గద్దుగట్టిన స్వార్థము కొఱకుఁ బ్రజల కపకృతి నొనర్చుట నమ్మించి యెవని హస్తమునుండి యమోఘాస్త్రమును లాగికొనెనో యాయస్త్రమునే యాతనిపైఁ బ్రయోగించుట. రాజకీయములయెడ మహామేధావులకు జుగుప్సగలిగి వానికొక టోహారొనర్చుటకు హేతువు నీతిరహితావకాశవాదుల దుశ్చర్యలే. 419

ఉ. పొంచికలంచి లోఁగొనఁగఁ - బూనిన వైరుల గుండెగాలమై
మించఁగఁజెల్లుగాన మన - మేదిని రక్షణదీక్షముఖ్యమం
చెంచి తదీయయత్నము ల - హీనబలోద్ధతినొంచ సైన్యముం
బెంచఁగనౌ నజాతరిపుఁ - బేరికినేఁ గనఁజాల మిథ్యవిన్. 420

కం. సమతాగుణ సంశోభిత
విమలమతుల్ సర్వశాస్త్ర - విషయ వివేకుల్
క్రమబద్ధ జీవితార్థులు
ప్రమదమ్మునఁ బల్కు పల్కుఁ - బాటింపఁదగున్. 421

తే. హృదయనైర్మల్యవచనము - లే గణించుఁ
జిచ్చుగొట్టిన లోకము - మెచ్చుకొనదు
కానఁ గపటపుఁ జేష్టల - కడక మాని
ధర్మదీక్షకు నిల్చుటే - ధన్యతమము. 422

తే. ఎత్తుపై నెత్తువేయుచు - నింటికంటె
గుడిపదిలమంచుఁ జేరెడి - కుమతులుండ్రు
మాట లోకకోటి చెప్పిన - మాత్ర ఘనుఁడె
చెప్పినది చేయువాఁడెపో - శ్రేష్ఠుఁ డరయ. 423

తే. త్యాగపురుషుల జీవిత - భాగములనె
రాగసహితంబుగా నను - రాగ మొప్పఁ
బాడుకొందురు సజ్జను - ల్పరమభక్తి
నన్యులకు స్థాన మీరన్న - నబ్బురంబె. 424

మ. ప్రజలే రాజులు రాజులే ప్రజలుగా - రాజ్యాంగ సూత్రంబు స
ద్వ్యాజనిర్మాణ మమోఘశీఘ్రఫలద - భ్రాజైక విశ్వాసభా

గ్ధ్వజ మగ్రశాంతమునిల్పఁ గల్పలతయై - భాసిల్లు నీభారతం
బజదామోదర శంకరాద్యఖిలదే - వాశీఃప్రభావంబునన్. 425

ఆ వె. కదురు కవ్వ మెపుడుఁ - గామక తిరిగినఁ
గఱవులేదు బ్రదుకు - బరువుగాదు
కనఁగ వినఁగ నెద్ది - కష్టార్జితమునకు
సాటి రాదు తిండి - లోటు లేదు. 426

వ. ప్రజాసంక్షేమ కార్యక్రమములు నిర్విఘ్నముగ సాగుచుండ మాన వతాదృక్పథాధారముగ సంస్కృతి రూపొందుటలగ్గు. మానవమానసికా కాశమెడనెడ నసంతృప్తి మేఘచ్ఛన్నమగుట సహజము శారీరిక నైతిక బుద్ధిబలమహిమ సంతృప్తిని సాధింప యత్నించుటుత్తమలక్షణము. దేశ కాలపరిస్థితులంబట్టి ప్రభుత్వచర్యలు మాఱకతప్పవు. సునిశితపరిశీలన సత్యాంశ సేకరణ, నిష్పాక్షికదృష్టి, యాత్మవిశ్వాసము, ధర్మదీక్ష, విధి నిర్వహణదక్షత, నాయకునకున్న విశిష్ట ప్రతిష్ఠలభించు; ప్రజాపతి ప్రజా పతియట్లు కర్మధర్మనిర్ణయమునం బ్రవర్తింపంపగు. గాంధేయాదర్శము లకు నేతలుపునరంకితము కావలయు. చోదకుఁడు సమర్థుఁడైన బండి బాటన సరిగసాగు. చుక్కానుధరించిన వానిబుద్ధి సక్రమముగఁ బని సేయనిచోఁ బడవమొత్తము దెబ్బదినును. ముముక్షువులకు జితేంద్రియ త్వమువలె దేశభక్తులకు నిస్స్వార్థప్రజాసేవ ప్రధానము. కపోతరాజగు చిత్రగ్రీవునివంటి యుత్తమగుణాలంకృతుఁడే పాలకపదార్హుఁడు. కష్టము లనుభవించుటకు సంపూర్ణముగ సిద్ధపడినవాఁడే దుర్మార్గమును బ్రతిఘ టింపఁగలఁడు. కొందఱు దేవునిమీఁదిభక్తితోఁగాక నైవేద్యముమీఁదిభక్తితోఁ జోఱబడుదురు. అది ప్రజలు గ్రహించిన గ్రహింపకున్న భగవంతుఁడు గ్రహింపఁగలఁడు. పవనములధికపీడన ప్రదేశములనుండి యల్పపీడన ప్రదేశములకు వీచునట్లు బలవంతులు బలహీనులమీఁదికి దండయాత్రలు సాగింత్రు. అమయకర సూక్ష్మాంగజీవి వితతి దేహమునంజొఱనీని రక్షక కవచమగు చర్మముభాతి సైనికవ్యవస్థ శాత్రవతతి మాతృదేశమునం జొఱనీక రక్షించుంగాన నద్దాని పోషణమత్యవసరము. ఉన్నతో ద్యోగమొసంగుతఱి వ్యక్తిశక్తి సామర్థ్యశీలములు గణింపందగుంగాని కులమును గుటుంబమును బ్రధానముగఁ జూడరాదని శుక్రనీతిసారము

ఘోషించుచున్నది. ప్రజారాజ్యమునకు వాక్స్వాతంత్ర్యమాయువుపట్టనుట నిర్వివాదాంశము. స్వచ్ఛందముగఁ గ్రమశిక్షణ సువ్యవస్థితమగుట వరిణామ సూచకము. పరిపూర్ణ ప్రాణప్రతిష్ఠాపటిష్ఠ శుభప్రభాయుత ప్రజాస్వామ్య వ్యవస్థ సతతయువతానవతా శోభితమగుంగాత! 427

ఉ. లేమికిబొమ్మగట్టి లవ – లేశము చింతయెఱుంగనీక యీ
భూమి సువర్ణఖండమయి – పుణ్యనదీజల సస్యపూర్ణమై
కామితవస్తుసంపదల – గణ్యయశోరమకాలవాలమై
శ్రీమహిమన్ ద్వితీయసుర – సీమవలె న్వెలుగొందుఁగావుతన్. 428

వ. అని స్ఫటికస్పష్టతా ప్రకటిత నిజవైదుష్యపరిగుంభిత గంభీర మహావాఙ్ముఖవాణీ వీణారవమ్మున సదస్యకోటిన్మంత్రముగ్ధులంజేయ నాశ్చర్యానందకందళిత హృదయారవిందసూచక సమజ్యానిర్గత జయజయధ్వానమ్ములు దివస్పృథువులం బ్రతిధ్వనించె. 429

శా. కాలాంభోగమనానుకూల రసదృ – క్కళ్యాణ సంస్కార హృ
ల్లోల ద్బంధురభావసంభరిత సు – శ్లోకుండు రాజ్యేందిరా
కేళీలోలుఁడు శ్రావ్యహృచ్ఛలనవా – క్క్రీడాకళాశీలుఁడై
కేళీకీలుఁడుగా విరాజిలె సుధీ – కీర్త్యుక్తులే పారఁగన్. 430

తే. విషయపరిశీలనాత్మక – విమలదృష్టి
లలితవాఙ్ముఖ మతఁడువె – లార్చుచుండ
దివ్యుఁ డెవ్వఁడొ వచ్చి సం – దేశ మిచ్చు
కరణిఁ గాన్పించెఁ దద్దృశ్య – గరిమ యిలకు. 431

కం. కమనీయ వాఙ్ముఖమ్మున
రమణీయంబైన యాంధ్ర – రాష్ట్రము నీయన్
సుమనోహర్షం బెసఁగెన్
సుమనోవర్షంబు కురిసె – సుమనోజ్ఞంబై. 432

కం. భారతవిజయ ధనంజయు
సారస్వతరసపునీతు – సజ్జన వినుతున్

గారుణ్యామృతభరితుఁ
రా రాజత్త్యాగమహిమ – రంజితచరితుఁ. 433

వ. నెహ్రూనుగూర్చి సంజీవరెడ్డి యిట్లను. 434

కం. మితహితవాక్య చమత్కృతి
సతతము నీపాలిసొమ్ము – సచివోత్తంసా
గతచరితానుభవోత్థిత
ధృతిసహితసునీతి నీది – ధీరవరేణ్యా! 435

ఉ. ఈస్పృశవాక్యవిస్ఫురణ – మేరికిశక్యము నీకుదక్క నా
ప్లావవినోదవీచి కల – నందఱ నల్లలనాడఁజేసి తీ
వాదము రాజకీయమున – వర్ధిలి సర్వజనైకవేద్యమై
వేదములట్లునిల్చి పృథి – వీం ద్రిదశాలయమట్టు చేయుతఁ. 436

కం. అరయ వివేకానందుఁడు
పరగెనుగద రామకృష్ణు – వారసుగా నీ
చరితముఁ గన గాంధికి నినె
వరచర్యన్వారసనుచు – వాకొందురిలఁ. 437

తే. ఇంత శ్రమ రాష్ట్రమును బొంది - యేల మేము
చేయకుందుము కృషి దాని - శ్రేయమునకు
మోదమున వేయిరూకల - గేదెను గొని
పలువుఁగొనఁ బ్రాలుమాలెడి – పంద గలఁడె. 438

వ. రవిరశ్మినుష్ణోగ్రతనెటనగ్గలమగు నటవర్షపాతముగూడ నధికముగ నుండు నట్లెక్కడ తీవ్రతరమైన సత్కృషియుండునో యచ్చట సత్ఫలిత ముండక తప్పదు. 439

తే. భౌతికానంతశక్తుల – పటిమ యాంత్రి
కముగ జలవిద్యుదాదుల – కలిమి పెరుఁగ
నేడు లక్షల గ్రామంబు – లేక రీతి
మెఱవు దివ్వెల వెలుఁగులో – మెఱయుఁగాత! 440

వ. అని సంజీవరెడ్డి తన శుభాకాంక్షం దెలుప— 441

చ. మెఱసెను సర్వదిక్కు లని - మేషుల దృక్కులు పిక్కటిల్లఁగా
పరిసెను గల్పమాదిదివి - విశ్రుత భూజలతా వితానముల్
కురిసెను దావులొల్క సుర - కోటుల హర్షము పూలవర్షమై
మొరసెను దేవదుందుభులు - ముఖ్యమునీంద్రులు సంతసింపఁగా.

తే. అసురజీవిరాముల మహా - త్యాగమహిమ
నీవిశాలాంధ్రదేశ మి - ట్లేర్పడంగ
నింటు చందురు పొడుపున - నీరధివలె
నమిత సంతోషమపుడందె - నాంధ్రమాత. 443

వ. సభ ముగిసె. అంత— 444

# పూర్ణచంద్రవర్ణన

కం. అందని గగనతలంబున
నందమ్ముగఁ దారలలరె - నల ప్రకృతిసతీ
సుందర కబరీ భరమును
బొందిన ముత్యాలనగల - పోలిక మిగులన్.  445

ఆ.వె. దాన వీరుఁ డట్లు - తన ప్రాణదానంబు
చేయఁ జేరి నట్టి - శ్రీయటంచు
నమర వీరు లెల్ల - రాకాశమున నుండి
చూడవచ్చి నట్లు - చుక్క లమరె. 446

తే. చల్లచల్లని వెలుఁగులు - చల్లుకొనుచుఁ
దీమమబ్బుల తెఱలదో - బూచులాడి
ధుందచందాలతో నుద - యాద్రిశిఖరిఁ
గ్రాలజాబిల్లి ముదమందెఁ - బాలవెల్లి. 447

తే. చంద్రుపై క్షీరవారిధి – చాలప్రీతిఁ
దనకుఁ బుట్టిన సుధ గొప్పఁ – దనము నెంచి
యుగ్గుబాలుగ నదివోయ - నిగ్గుదేలి
యున్నతస్థితి శశి పొందె – నుడుపతియయి. 448

తే. ఆకసంబను ఘనకమ - లాకరమునఁ
దెల్లకలువలవలెఁ జుక్క – లుల్లసిల్ల
నందు నీదుచునున్న రా - యంచవోలెఁ
జందురుఁడు దోఁచెఁ గన్నుల – విందుగాగ. 449

శా. నిత్యక్షుద్రుదజభాసుర ప్రజ హితా - నీతామృతాచ్ఛౌషధ
ప్రత్యాసత్తిఁగళాధృతింగుముదసం – బంధప్రభఁ శీతదృక్
కృత్యాకృత్యవిచార సత్పథగతిం - ప్రీత్యంశరాత్రౌషధీ
సత్యేశక్రియధీరసంస్తుతిమతిం - జైవాతృకుండొప్పెఁడిఁ. 450
(ద్వ్యర్థి)

ఉ. చండతరాంశుకీలలకుఁ - జాలతపించి పరేశువేఁడఁగాఁ
బండినమర్త్యలోకవుఁ ద – పఃఫలమోయనఁ జందమామతా
నిండుకళావిలాసమున - నింగినిదోఁప నపూర్వశోభతో
వెండి మొలాము చేసినటు - వెల్గె జగంబతి బంధురంబుగా. 451

కం. పదునాఱు కళలతో రస
హృదయుల కానందమిడుచు - నెల్ల జగంబుఁ
సదయతఁ గనుచుం గరముల
మృదుల ఫణితి నిమురుచుండె – నిండుం డెలమిఁ. 452

తే. బుధుల కమృతంబు నొసఁగుచుఁ – బుణ్యతముఁడు
షోడశకళాప్రపూర్ణుఁడై – శుభ్రకిరణుఁ
డఖిలలోకంబులకు రసా – హ్లాద మెసఁగ
నక్షరయశస్వియై వెల్గె - నాకసమున. 453

వ. సువర్ణమునకు సుగంధము మలయమారుతమునకు మాధుర్యము
కర్పూరమునకు మృదుత్వము సంపెంగకు సౌందర్యము పూర్ణజ్యో

త్స్నకు నిత్యస్థిరత్వమున్న నింకెంత సంతోషజనకముగనుండునో గదా
యంచుఁ బ్రజలు నిజనివాసంబుల కరిగిరి. 454

కం. ఏతాదృగ్లక్షణ భా
జ్స్నైతృకథాకథననిష్ఠ - నిష్ణాతుఁడ సం
ప్రీతిగ ప్రాసితి జ్ఞాన
జ్యోతిగ వెల్గొందు శివు మ - హోజ్జ్వల కరుణన్. 455

ఉ. ఇన్నెఱకల్పముం బ్రజల - కిచ్చితి నిందలి మంచి చెడ్డలన్
వన్నెలఁ జిన్నెలందెలిసి - వాకొన వారికె చెల్లు దైవమీ
తెన్నున నడ్పెనాకలము - దివ్యరసాస్పదమైన నాతపం
బెన్నుఫలించెనంచుఁ బర - మేశునకే సతతంబు మ్రొక్కెదన్. 456

ఉ. వేదములెంతకాల మిల - వెల్గునొ యిక్కథలంతదన్క ని
మ్మేదిని నిల్చుఁగాక యని - మేషులు గేయములన్ లిఖించి ప్రా
సాదముమీఁద వీణియలు - చక్కఁగ మీటుచుఁ బాడుచో దివం
బాదృతి హర్షబాష్పకలి - తాంబకయై జిగిమీఱుఁ గావుతన్. 457

కం. వాసిగలదేవునకుఁ గై
లాసనివాసునకు భక్త - లాలసరక్షా
భాసునకుఁ గరుణ సుజనుల
గాసులు దొలఁగించి కాచు - కాశీశునకున్. 458

కం. గంగా గౌరీ వాదము
శృంగారరసోల్బణంబు - చెవిసోకఁ దపో
భంగంబని యెంచక భ్రూ
భంగంబును జూపనట్టి - పరమ శివునకున్. 459

కం. విశ్వైశ్వర్య ప్రదునకు
విశ్వాసజనార్తిహరణ - విశ్రుతమతికిన్
విశ్వంభరునకు హరునకు
విశ్వవిలాసునకు వినుత - విశ్వేశునకున్. 460

వ. ద్వితీయ భాగమంకితమిచ్చి యమ్మహాదేవుని మహిమ మనంబునం
దలంచి. 461

తే. ఒకఁడు తొలిపూజలకు నర్హుఁ - డొకఁడు కనఁగ
నఖిల సురసైన్యములకు న - ధ్యక్షుఁ డౌర
యెట్టిపట్టులు పుట్టిరి - యీశనీకు
ననుచు సాష్టాంగవందన - మాచరింతు. 462

కం. పరిపంధికంధి మథనా
పరకైలాసాద్రిసదన - భంజితమదనా
కరుణరసాంచితవదనా
సురగిరికోదండకదన - సూరినుతగుణా. 463

కం. గిరిజామనోజ్ఞ భాస్కర
నరసురనుత దివ్యచరణ - నాగాభరణా
పురహరభవహర శంకర
కరుణజ లోకాళి సతము - కావుము దేవా. 464

కం. నిగమసతీస్తుతి పాత్రా
నగరాజతనూజ సహిత - నవనీతమతీ
ఖగరాడ్వాహన సఖివర
జగదేకశరణ్య సర్వ - సద్గుణగణ్యా. 465

కం. అపవర్గద కరుణాకర
జపయజ్ఞ ఫలప్రదాత - సజ్జన వినుతా
రిపుభీకర శశిశేఖర
విపులానదభ్రక్తపాల - విమలసుశీలా. 466

కం. ఓంకారరూప భక్తశు
భంకరలోకేశ నిత్య - భాస్వన్మూర్తీ
పంకజ భవనుతి పాత్రా
సంకల్ప వికల్ప విజయ - సాధనలోలా. 467

# గద్యము

ఇది శ్రీమద్గౌరీ శంకర వరప్రసాద లబ్ధ సహజ చతుర్విధ కవితా
కళావిలాస సాహితీ రస వికాస సంస్కృతాంధ్రాది బహుభాషా
గభీరమనోహరభావ బంధుర ఘనోల్లాసభాస బండ్ల పిచ్చమ్మా
పిచ్చయాహ్వాయ పౌత్ర యాదమ్మా వేంకటసుబ్బయార్య
జ్యేష్ఠ పుత్ర యస్నపూర్ణా సావిత్రీ కళత్ర సుహృజ్జన
విధేయ సుబ్రహ్మణ్య నామధేయ ప్రణీతాంధ్ర
మహాభ్యుదయ మహాకావ్యమున ద్వితీయ
భాగమున ద్వాదశ ప్రకరణము
సర్వము సంపూర్ణము.

## ఈ తద్రచనకొఱకు పఠించిన గ్రంథపత్రికా లేఖాది సూచిక




1. గాంధీ స్వీయచరిత్ర
2. నెహ్రూ స్వీయచరిత్ర
3. పటేలు జీవిత చరిత్ర
4. భారత దర్శనము — నెహ్రూ - అనువాదము బి. యస్. మూర్తి
5. ఆత్మకథ — రాజేంద్రప్రసాద్ - అనువాదము "భాగ్యేశ్వరి"
6. బోసుచరిత్ర — ఆకురాతి చలమయ్య, యుఱ్ఱమిల్లి నరసింహారావు
7. అల్లూరి సీతారామరాజు చరిత్ర — యుఱ్ఱమిల్లి నరసింహారావు
8. టంగుటూరి ప్రకాశము జీవితము — గంటి సుబ్రహ్మణ్య శర్మ
9. తిలక్ మహాశయుని జీవితము — మానికొండ సత్యనారాయణ శాస్త్రి
10. లాల్‌బహదూర్ శాస్త్రి — తుర్లపాటి కుటుంబరావు
11. గడచిన రోజులు — డా॥ తిరుమలరావు
12. కాంగ్రెసు చరిత్ర — డా॥ పట్టాభి సీతారామయ్య
13. Transfer of power in India—V. P. Menon
14. విజ్ఞాన సర్వస్వము — తెలుగు భాషాసమితి - చరిత్ర భాగము
15. Nehru Political Biography—Michael Brecher
16. India wins Freedom—Azad
17. Jawaharlal Nehru—Frank Morase
18. వీరతెలంగాణా — రావి నారాయణరెడ్డి
19. India since 1526—V.D. Mahajan
20. Elementary principles of Economics—Jathar and Beri
21. విగ్రహ వ్యావర్తని — డా॥ జి. వి. కృష్ణరావు
22. Letters from Dr. P. Rangaiah Gupta
23. ఆంధ్రప్రభ
24. కృష్ణాపత్రిక
25. ఆంధ్రపత్రిక
26. శ్రీరాముల జీవితాంశములు — డా॥ పి. రంగయ్య గుప్త
27. ఆంధ్రుల చరిత్రము — చిలుకూరి వీరభద్రరావు
28. జగత్కథ — బోడిరాజు రామారావు, M. A., వజ్ఝ సుబ్బారావు B. A. (Hons)
26. డాక్టర్ పట్టాభి చరిత్ర
30. ఆచార్య రంగా — జాస్తి వేంకటనరసయ్య, ధూపాళ వేంకటసుబ్రహ్మణ్యము
31. డాక్టర్ రాధాకృష్ణన్ — యస్. టి. పి. వి. రామకృష్ణమాచార్యులు, M. A.

# ఏతత్కృతికర్త రచనలు

| | | |
|---|---|---|
| 1. | ప్రహ్లాద | నాటకము |
| 2. | కుమార విజయము | ,, |
| 3. | బుద్ధావతారము | ,, |
| 4. | తులసీదాసు | ,, |
| 5. | వేమన (1500 పద్యములు) | పద్యకావ్యము |
| 6. | కళాశ్రీ (ప్రథమ భాగము) | ,, |
| 7. | కన్యకాపరమేశ్వరీ చరిత్ర | ,, |
| 8. | గెలీలియో చరిత్ర | ,, |
| 9. | బుద్ధచరిత్ర | బుఱ్ఱకథ |
| 10. | పరిత ప్త సుయోధనుఁడు, అశ్వత్థామ | ఏకపాత్రాభినయములు |
| 11. | మయసభ, మహారథి కర్ణుడు | ,, |

## అచ్చులో నున్నవి

| | | |
|---|---|---|
| 12. | న్యూటన్ | పద్యకావ్యము |
| 13. | మైకేల్ ఫెరడే | ,, |
| 14. | కళాశ్రీ - ద్వితీయ, తృతీయ భాగములు | ,, |
| 15. | రుక్మిణీ కళ్యాణము | నాటకము |
| 16. | వేదవతి | బంధప్రబంధము |
| 17. | రామాయణము | ,, |
| 18. | దురాక్రమణ | బుఱ్ఱకథ |
| 19. | జగదీశ చంద్రబోసు | పద్యకావ్యము |
| 20. | శ్రీ కాళహస్తీశ్వర మహాత్మ్యము | నాటిక |

ప్రతులకు: గ్రంథకర్త, వేటపాలెము, చీరాల తాలూకా, ప్రకాశంజిల్లా. P.C. 523187